

అనుకర్త :

దార్శనిక్, కళాప్రపూర్ణ" వేదవేదాంగ పారంగత్, దర్శనతత్త్వవేత్త

**శ్రీ పండిత గోపదేవ్ శాస్త్రి**

**(1886 - 1996)**

ఓ౩మ్

# సత్యార్థ ప్రకాశము

## మహర్షి దయానంద సరస్వతి విరచితము

వేదాది వివిధ సచ్ఛాస్త్ర ప్రమాణ సమన్వితము
(శిక్షా-ధర్మ-రాజనీతి-మతమతాంతర విషయక విశ్వకోశము)

అనుకర్త

"కళాప్రపూర్ణ", వేదవేదాంగ పారంగత్, దర్శన తత్త్వవేత్త,

**శ్రీ పండిత గోపదేవ్ శాస్త్రి**

ప్రథమ ముద్రణము : 6000 ప్రతులు (ట్రస్టుద్వారా)
ద్వితీయ ముద్రణము : 4000 ప్రతులు
తృతీయ ముద్రణము : 4000 ప్రతులు
చతుర్థ ముద్రణము : 6000 ప్రతులు (Paper Back)
దయానందాబ్దము : 178
శకాబ్దము : 1923
సం॥ : విజయదశమి 2001
విక్రమాబ్దము : 2058
సృష్టి సంవత్సరము : 1, 97, 29, 49, 100, 102
మూల్యము : **ప్రచారార్థము ప్రత్యేక తగ్గింపు ధర రూ. 45/-**
**(సాధారణ బౌండ్) (Paper Back)**

**ప్రాప్తి స్థానములు :**

1. అంబా-రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, నెం. 5, "మాశెట్టి బిల్డింగ్, 3-3-736 to 740, కంచరిబజార్, జనరల్‌బజార్, సికింద్రాబాద్ - 500 003. ఫోన్ : 632 0200
2. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313, (తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా)
3. వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 500 001.
4. ఆర్. కృష్ణమూర్తి బుక్ సెల్లర్స్, ఆర్యసమాజ మందిరము, సీతాఫలమండి, సికింద్రాబాద్-6



*ఆఫ్‌సెట్ ముద్రణ : కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్, హైదరాబాద్.*

*మహర్షి దయానంద సరస్వతి వర్ణ చిత్రం : ఆర్య సాహిత్య ప్రచార ట్రస్టు వారి సౌజన్యముతో*

*పండిత గోపదేవ్ గారి వర్ణ చిత్రం : ఆర్యన్ ఆర్ట్ స్టూడియో, హైదరాబాద్ వారి సౌజన్యముతో*

ఓ౩మ్

# అంబా - రామార్య సత్యార్థప్రకాశ ట్రస్టు

సికింద్రాబాద్ - ఆంధ్రప్రదేశ్

# ట్రస్టు స్థాపకుల రచనలు - అనువాదములు

1. సత్యార్థప్రకాశము
2. వేదతత్త్వ ప్రకాశము (ఋగ్వేదాది భాష్య భూమిక)
3. నిరుక్తము
4. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము - 1
5. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము - 2
6. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము - 3
7. శ్రీమద్భగవద్గీత
8. శ్రీ స్వామి దయానంద సరస్వతి జీవిత చరిత్ర
9. అర్థధర్మ మీమాంస
10. డా. పం. గోపదేవ్ ఆత్మచరిత్ర
11. గురువు విరజానంద జీవిత చరిత్ర
12. ఈశావాస్యోపనిషత్తు
13. కేనోపనిషత్తు
14. కఠోపనిషత్తు
15. ప్రశ్నోపనిషత్తు
16. ముండకోపనిషత్తు
17. మాండూక్యోపనిషత్తు
18. తైత్తిరీయోపనిషత్తు
19. ఐతరేయోపనిషత్తు
20. శ్వేతాశ్వతరోపనిషత్తు
21. ఛాందోగ్యోపనిషత్తు
22. బృహదారణ్యకోపనిషత్తు
23. న్యాయదర్శనము
24. వైశేషికదర్శనము
25. సాంఖ్యదర్శనము
26. యోగదర్శనము
27. వేదాంతదర్శనము (వ్యాసకృత బ్రహ్మ సూత్రములు)
28. ఆస్తికవాదము
29. ఆర్యాభివినయము
30. ఆర్యగృహిణి
31. సంస్కారవిధి
32. ఈశావాస్యోపన్యాసములు
33. పూజ
34. వైదిక దినచర్య
35. వైదికవినతి (స్వాధ్యాయమంజరి) 1
36. వైదికవినతి (స్వాధ్యాయమంజరి) 2
37. ఏసుక్రీస్తు రహస్యజీవనము
38. వ్యవహార భానువు
39. బ్రాహ్మణగోవు (గవిసూక్తము)
40. మాతృభూమి స్వరాజ్యము (పృథ్వీసూక్తము)
41. పురాణ విష్ణువులెవరు?
42. ఆర్యసమాజమననేమి?
43. ఈశ్వరుడు ప్రత్యక్షసిద్ధమా?
44. అపశూద్రాధి కరణము
45. వైదిక త్రైతవాదము
46. ఈశ్వర స్వరూపము
47. వైదిక వర్ణవ్యవస్థ
48. వేదమే యీశ్వరీయము (బైబిలు-ఖురానులు కావు
49. హేతువాది దయానంద
50. శంకరపీఠాధిపతులు - అంటరానివారు
51. అహం - నేను
52. మనము హిందువులమా?
53. శ్రీరామనవమి - సీతాకళ్యాణము
54. గోకరుణానిధి
55. జాతీయత
56. వేదాంతి ధ్వాంత నివారణము
57. భాగవత ఖండనము
58. దర్శనములు
59. లక్ష్మీసూక్తము
60. ఓ3మ్‌స్మర
61. ఆర్యసమాజ నియమములు - ఉపనియమములు
62. ఆర్యావర్తవాణి

# విషయసూచిక

## ద్వాదశ సముల్లాసము

## త్రయోదశ సముల్లాసము



## చతుర్దశ సముల్లాసము




## ప్రకాశకీయము

గురువర్యులు స్వ. పండిత గోపదేవ్ శాస్త్రి గారిచే 6-2-1989న సికింద్రాబాద్ నందు స్థాపింపబడిన ఈ అంబా-రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు ఇప్పటికే 14,000 సత్యార్థప్రకాశములు ముద్రించి మీకందించినది. మొదట ముద్రించిన పుస్తకము రూ. 50-00ధరలో లభింపచేసినను గురుదేవుల శత జయంత్యుత్సవమున 30-00లకే విక్రయించి మూడు గంటల వ్యవధిలో 500 ప్రతులు అమ్మి చరిత్ర సృష్టించినది. ఆ రోజు లభించిన ధరకే పుస్తకములను యివ్వమని చాలామంది వత్తిడి చేసిరి. అట్టి ప్రజాభిప్రాయనికి విలువనిస్తూ పుస్తక ధరను టోకున 30-00లకే విక్రయించవలెనని నిర్ణయించినది మా ట్రస్టు. ఆ విధముగా మొదట ముద్రించిన వాటిలోని మిగితా పుస్తకాలన్నియు తగ్గింపు ధరకే అమ్మబడినవి.

పైన లభించిన అనుభవముతో ద్వితీయ - తృతీయ ముద్రణలో 8000 ప్రతులు తగ్గింపు ధరకు అందజేయబడినవి. దాతలు సహృదయముతో సబ్సిడీ యిచ్చుటకు విరాళములు అందజేసిరి. వారి తోడ్పాటుతో మా కృషి సఫలమైనది. 8000 ప్రతులు కేవలం మూడు - నాలుగుసంవత్సరములలో అమ్మబడినవి.

ఇది నాల్గవ ముద్రణ. ఇప్పటికి గత 6 సంవత్సరాల నుండి తక్కువ ధరకు సత్యార్థప్రకాశాన్ని అందిస్తున్న మా ట్రస్టు అన్ని ధరలు విపరీతముగా పెరుగటవలన అంత తక్కువ ధరకు యిచ్చుటకు వీలుపడదని, పుస్తకాన్ని పేపర్‌బ్యాక్ పద్ధతిన కనీస పెంపుతో అందరికి అందివ్వవలెనని, తిరిగి సబ్సిడీతో 45-00 ధరకే విక్రయించవలెనని నిర్ణయము తీసుకొన్నది. ఆ నిర్ణయ ఫలితమే ఇప్పటి క్రొత్త రూపముతో యీ సత్యార్థ ప్రకాశము

మాకు అన్నివిధములుగా సహకరించిన దాతలకు కృతజ్ఞతలు తెలియజేయుచుంటిమి.

భవదీయులు

**నోముల స్వామిదాస్**
అధ్యక్షులు

**గుండాల రామారావు**
కోశాధ్యక్షులు

**మాశెట్టి శ్రీనివాస్ ఆర్య**
కార్యదర్శి

## సత్యార్థ ప్రకాశము సబ్సిడీ ధరకు లభింపచేయుటకు వీలు కల్పించిన దాతలు

| | |
|---|---|
| మా విన్నపమును మన్నించి, స్వ. పండిత గోపదేవ్ గారిపై అత్యంత శ్రద్ధా భక్తిగల ఆర్యసమాజము సీతాఫలమండి వారి విరాళము | రూ. 25,000=00 |
| "పండిత గోపదేవ్‌పురస్కార్"తో మేము సన్మానించి అందచేసిన రూ. 5000లతో బాటు వారివద్దనుండి రూ. 5000 కలిపి తిరిగి పంపి, గురుదేవుల పట్ల వారికి గల అచంచలభక్తిశ్రద్ధలు చాటుకున్న మా ట్రస్టీ విద్వాన్ శ్రీ పం. వంకం సుబ్బన్న (ప్రొద్దుటూరు) గారి విరాళము | రూ. 10,000=00 |
| శ్రీమతి యల్. సావిత్రిదేవి, ఎమ్.ఏ. (తెలుగు లెక్చరర్ - విజయవాడ) గారి విరాళము | రూ. 2,116=00 |
| శ్రీ మలిపెద్ది భావనాఋషి, సికింద్రాబాద్ గారి విరాళము | రూ. 1,116=00 |
| శ్రీ ఉప్పలయాదగిరి, హైదరాబాద్ (మా ట్రస్టీ) గారి విరాళము | రూ. 1,116=00 |
| శ్రీమతి పార్వతమ్మ - శ్రీ పి. నర్సింహులు (ముదిగుబ్బ) గార్ల విరాళము | రూ. 1,116=00 |
| శ్రీ ముముక్షుముని డా॥ కోడూరి సుబ్బారావు గారి విరాళము | రూ. 1,000=00 |
| శ్రీ మాడిశెట్టి మల్లేషం (కొత్తగూడెం) గారి విరాళము | రూ. 1,000=00 |
| శ్రీ వి.యస్. గుప్త (కొత్తగూడెం) గారి విరాళము | రూ. 1,000=00 |
| శ్రీ వల్లాల పంచాక్షరయ్య (కొత్తగూడెం) గారి విరాళము | రూ. 500=00 |
| డా॥ శ్రీ చౌకి వెంకటరాజయ్య (రామారెడ్డి) గారి విరాళము | రూ. 500=00 |

మా కృషికి తమవంతు సహాయసహకారాలందించిన దాతలందరికి
హృదయపూర్వక కృతజ్ఞతలు

మీ

**అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు**

ఓ౩మ్

# మొదటిమాట

వేదసిద్ధాంతములన్నియు బుద్ధిపూర్వకములు. శాశ్వత సత్యములను, ప్రాచీన మహర్షులు మునులు నెల్లరు నట్లే యంగీకరించి యున్నారు. వేదము లీశ్వరీయములు. కావున నందు భ్రమ ప్రమాదములకు దావులేదు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు. మహర్షి దయానందుడు నట్లే యంగీకరించి యున్నాడు. అందువలననే యతడు తన మంతవ్యములలో నిట్లు నుడివి యున్నాడు-" త్రికాలములందును నెల్లరకు నొక్కటిగా నంగీకరింప దగినదియే నేను నా మంతవ్యముగా నంగీకరించుచున్నాను. నవీనముగా గల్పించు నది యేమియులేదు. క్రొత్త మతమును స్థాపించుటనభిప్రాయమును నాకు లేదు," ఇప్పుడు వేదాది సత్య శాస్త్రములు, బ్రహ్మ మొదలు జైమిని వఱకు గల మహర్షులు నేయీశ్వరాది పదార్థములనంగీకరించి యుండిరో వానినే నేను నంగీకరించుచు సర్వమహాశయుల యెదుట బ్రకాశితములు చేయుచున్నాను."

దీనింబట్టి మహర్షి దయానందస్వామి వైదిక ధర్మమును సత్యము, సార్వభౌమికమునని యంగీకరించుచున్నట్లు స్పష్టమగుచున్నది.

అందువలననే దయానంద మహర్షి తన సమస్త గ్రంథములందును వేదసిద్ధాంతములనే ప్రమాణసహితముగ యుక్తియుక్తముగ బ్రతిపాదించి యున్నాడు.

దయానంద మహర్షి కొలది కాలములోనే యెన్నియో గ్రంథములను వ్రాపియున్నాడు. ఆ గ్రంథములన్నింటియందును "సత్యార్థ ప్రకాశము" సర్వోత్కృష్టకృతి యనబడుచున్నది. అది సార్వజనికము-జగద్విఖ్యాతము ననుటలో సందియము లేదు.

దయానందమహర్షి సత్యార్థ ప్రకాశమును సత్యధర్మమును బ్రకటింప జేయుటకే వ్రాపియున్నాడు. అందువలననే యీ గ్రంథమునకు "సత్యార్థప్రకాశము" అని యన్వర్థనామమును బెట్టియున్నాడు. మహర్షి యీ గ్రంథమును క్రీ.శ. 1874 సంవత్సరమున వ్రాసినట్లు తెలియుచున్నది. మహర్షి కాశీలో సత్యమైన వేదధర్మమును బ్రచారము చేయుటకు క్రీ.శ 1874 మే నెలలో వచ్చినపుడు రాజా జయకృష్ణదాస్ (మురాదాబాద్ నివాసి - కాశీలో తత్కాలీన డెప్యూటీ కలెక్టర్) "స్వామీ! మీ యుపదేశములు విననోచుకొనని వారు కూడ దెలిసికొనుటకు వీలుగా మీ బోధనములన్నియు గ్రంథస్థము చేసిన మానవలోకమున కెంతో యుపకారము గలుగున"ని ప్రార్థింపగా మహర్షి యీ గ్రంథమును మూడు నాలుగు మాసములలో రచియించినట్లు తెలియుచున్నది.

ఈ గ్రంథము రెండు భాగములలో నున్నది. మొదటి పది సముల్లాసములు పూర్వార్ధము, మిగిలిన నాలుగు సముల్లాసములు నుత్తరార్ధము. పుస్తకమంతయు బదునాలుగు సముల్లాసములుగా విభజింపబడి యున్నది.

పూర్వార్ధపు బదిసముల్లాసములందును వైదిక ధర్మమునకు సంబంధించిన ముఖ్యాతిముఖ్య సత్య సిద్ధాంతముల వ్యాఖ్యానము చేయబడినది. ఉత్తరార్ధపు నాలుగు సముల్లాసములందు, పౌరాణిక, చార్వాక, బౌద్ధ, జైన, క్రైస్తవ, మహమ్మదీయ మత సిద్ధాంతముల ఖండన మండనములు వ్రాయబడినవి.

ఈ మహోత్కృష్ట గ్రంథరాజము మహర్షి దయానందునిచే వ్రాయబడి యొకశతాబ్దము గడచినది. ఆర్య జగత్తంతయు బ్రస్తుతము 'సత్యార్థ ప్రకాశ' జన్మశతాబ్దిని జరుపుకొనుచున్నది. ఇది యెంతయు గౌరవనీయ విషయము. శాశ్వత సిద్ధాంతములతో విలసిల్లు నీ గ్రంథము చిరస్థాయి యగును. మహర్షి యీ గ్రంథమునకు భూమిక వ్రాయుచు నందు "సత్యములైన యర్థములను బ్రకాశింపజేయుటకే నేనీ గ్రంథమును వ్రాసితిని. సత్యమును సత్యముగాను, మిథ్యను మిథ్యగాను బ్రతిపాదించుటయే సత్యార్థమును

ప్రకటితము చేయుటయని యెంచుచున్నాను." అని తన హార్దిక భావమును వెల్లడించియున్నాడు.

మహర్షి గ్రంథారంభమున బ్రార్థన చేయుచు 'సత్యం వదిష్యామి' సత్యమును జెప్పెదనని ప్రార్థించి - ప్రారంభించి, యంతమున 'సత్యమవాదిషమ్' 'నేను సత్యమునే చెప్పితినని ముగించియున్నాడు. స్వామి యీ గ్రంథములో దాను బ్రతిపాదించిన సిద్ధాన్తములన్నింటిని వేదాది శాస్త్రముల బ్రమాణములతోను, యుక్తులతోను సిద్ధపఱచియున్నాడు. మహర్షి పరమేశ్వరుని యనన్యభక్తుడు. కావున బరమేశ్వరునే యంతస్సాక్షిగా నంగీకరించి ప్రపంచములో నేరికి భయపడక లోకుల నిగ్రహానుగ్రహములను లెక్క సేయక నిర్భయుడై సత్యమును సత్యముగాను, నసత్యము నసత్యముగాను దన గ్రంథమున బ్రతిపాదించియున్నాడు. ఇంతటి మహోపకారము మానవాళికి జేసిన మహానుభావుని - మహర్షిని మఱి యొకరిని గాంచము. మహర్షి మానవుల కత్యంతోపకారకము లగు రత్నముల నెన్నింటినో వేదజ్ఞాన రూప సముద్రము నుండి యుద్ధరించి 'సత్యార్థ ప్రకాశమున' నొక్కట బ్రోగుచేసి యెల్లరకు బ్రసాదించి యున్నాడు. మహర్షి యప్రతిమ ప్రతిభను గొనియాడుట మానవ మాత్రునకు సులభము కాదు. లోకములోని మత మతాంతరముల ప్రబోధకులలో నొక్కరును మహర్షి ప్రతిపాదిత సిద్ధాంతములను నన్యథా సిద్ధపఱప సమర్థులు కారైరి. ఒక్క శతాబ్దము గడచినది. కాని, సత్యమును గాదన నెవరికి శక్యము?

సత్యార్థ ప్రకాశము వేదాదిశాస్త్ర ప్రమాణ విభూషితము. అవిద్యాంధకార నాశకము. జ్ఞాన ప్రకాశకము. అసత్యములు, భ్రాంతి జనకములునగు మతమతాంతర మూలోన్మూలకము. సదసద్వివేచకము. ధర్మము పేరిట వ్యాపకములై యున్న యధర్మముల వినాశకము. సృష్టికర్తయగు పరమేశ్వరుని సత్యస్వరూప బోధకము. పరమేశ్వరుని స్థానము నాక్రమించిన చిల్లరదేవతల యస్తిత్వ నివారకము. అవతారాది గురుడంబములకు బ్రభంజకము. ఆర్షానార్షగ్రంథ విభజన పూర్వక సత్యజ్ఞానదీపకము, భూతప్రేత శాకినీ డాకినీ మున్నగువాని భయములను దొలగించు మహామంత్రము. మానవులలోగల యుచ్చనీచ భేదభావములను దొలగించి 'అజ్యేష్ఠాసః అకనిష్ఠాసః' అనుబుజ్మంత్రముతో నెల్లరును సమానులే యని బోధించు సదుపదేశకము. వర్ణాశ్రమ వ్యవస్థలోగల వైశిష్ట్యమును బ్రదర్శించునది. స్వర్గనరకములు మోక్షము మున్నగు వానిలోగల భ్రాంతులను దొలగించి సత్యమును బ్రకాశింపజేయునది. జీవబ్రహ్మల సత్యస్వరూప ప్రతిపాదకము. స్వాతంత్ర్య మూల మంత్ర ప్రదర్శకము, స్వదేశమునందు, స్వదేశభావమందు, స్వసంస్కృతి యందు బ్రేమను శ్రద్ధానక్తుల నుద్భవింపజేయునది. పాలక పాలితుల లక్షణ కర్తవ్యములను దెలిపి సురాజ్యమును సంస్థాపింపజేయునది. సృష్టిస్థితిలయముల విషయములందుగల యసత్యములగు మాన్యతలను దూరమొనర్చి వాని యథార్థతను గ్రహింపజేయునది. భారతీయ పరతంత్రతకు గారణములగు విద్వేషము, పరస్పర భేదభావము మున్నగువానిని నశింపజేయునది. ఆర్యజాతిని భిన్నభిన్నముజేయుటకు దోడ్పడిన యస్పృశ్యతాది దోషనివారకము, భక్ష్యాభక్ష్యములను గుఱించిన శాస్త్రీయవ్యవస్థను బోధించి మద్య మాంసాది దుష్టపదార్థముల సేవనమునుండి తప్పించి మానవులనుద్ధరించునది. గోవు మున్నగు పశుసంపదను బోషించుటవలన గలుగు లాభములను వివరించునది. ఇట్టి యమూల్యములు నవినశ్వరములు నగు సిద్ధాంతములతో గూడిన గ్రంథమును దేశమున జరుపబడు సత్యార్థప్రకాశము శతాబ్ది మహోత్సవ సందర్భమున దెలుగున ననువదించి తెలుగు పాఠకలోకమున కందించి వారి జీవనము నుజ్జ్వలముజేయు సంకల్పము క్రీ.శ.1978 సం. దీపావళినాడు కలిగినది. దాని పరిణామమే నా యీ యనువాదము.

దయానంద మహర్షి రచితమగు నీ యమూల్య గ్రంథమును జదివి యెందఱో తమజీవితములను సఫలముజేసికొని యున్నారు. ఈయత్యుత్తమ గ్రంథమును (౧౮) పదునెనిమిది పర్యాయములు చదివి యత్యంత కుశాగ్ర బుద్ధియైన స్వ. గురుదత్త విద్యార్థి (ఎమ్.ఎ) "ఎన్నిపర్యాయములు చదివిన నన్ని క్రొత్త

విషయము లీపుస్తకమున బోధపడుచునే యున్నవి. ఈ గ్రంథసాగరమున నెన్ని పర్యాయములు మునిగిన నన్ని నూత్నములగు నమూల్య రత్నములు లభించుచున్నవి". అని నుడివియున్నాడు. తనయందు నిరూఢమైన నాస్తిక్యమును వదలి యాస్తికుడైనాడు. అనేక దుర్వ్యసన గ్రస్తుడైన మున్షీరామ్‌జీ యీ గ్రంథరాజమును జదివి మహాత్మ మున్షీరామ్-అటుపై శ్రద్ధానందస్వామియై, ధర్మవేదికపై స్వాత్మను బలిచేసి యున్నాడు. ఈ సత్యార్థ ప్రకాశమును స్వాధ్యాయము చేసి రామప్రసాద్ బిస్మిల్ దేశ స్వాతంత్ర్యము కొఱకై ప్రాణముల నర్పించినాడు. ఈ గ్రంథము శ్రవణ మాత్రముననే దేశభక్త భగత్‌సింగ్ నవ్వుచు నురికంబము నెక్కి ప్రాణములను బలిచేసినాడు. ఈ గ్రంథము నొక్క పర్యాయమైనను ధ్యానపూర్వకముగ జదివిన వాని జీవనము ధన్యమగును. అతని యవిద్యాంధకారము దూరమై యతనియందు జ్ఞానోదయమగును. ఈ గ్రంథము నందలి సుశిక్షణములను గ్రహించినవాడెవడును జీవనమున బరివర్తనమును బొందని వాడుండడు.

అనువాదమున నక్కడక్కడ విషయము స్పష్టముచేయుటకు గాను మూలమున లేని వాక్యములు ఇట్టి () బ్రాకెట్టులలో నాచే వ్రాయబడినవిగా బాఠకులు గుర్తింతురుగాక. ఇట్లే శీర్షికలుకూడ జేర్పబడినవి.

తెలుగు పాఠకలోక మీ గ్రంథమును జదివి, వేదధర్మమును యథార్థముగ దెలిసికొన గలదని విశ్వసించుచున్నాడ. అనువాదమున భ్రమప్రమాదములున్న స్నేహభావముతో మా దృష్టికి దెచ్చిన ముందు రాబోవు సంస్కరణములలో దిద్దుకొన యత్నింతుము. కండ్లలో గొలది సంవత్సరములుగా నేర్పడుచున్న నేత్రశిలావరోధము కారణముగ గొంత యవరోధము కలిగినను బరమేశ్వరుని కృపవలన నెట్లో యీ కార్యమును గొనవఱకు సాగింప గలిగినందుకు బరమేశ్వరునకు ధన్యవాదములు.

బుధవిధేయుడు,

గోపదేవ్

ప్రారంభము.1-10-1978 సమాప్తి 8-1-1979.

----

# విరజానందస్వామి సంక్షిప్త చరిత్ర

క్రీ.శ. 1778 సంవత్సరమున (వి.శ.1834) పంచనదమను పేరుగాంచిన పంజాబులో కర్తారపురము సమీపమున గంగాపుర్ గ్రామమున దండీస్వామి విరజానందుడు జన్మించెను. అతని తండ్రి భారద్వాజస గోత్రుడైన సారస్వత బ్రాహ్మణుడగు నారాయణదత్తుడు.

విరజానందస్వామి పూర్వనామము తెలియదు. జనులందఱు విరజానందుడనియు, అంధుడగుటచే స్వామి ప్రజ్ఞాచక్షువనియు, సూరదాసుస్వామి యనియు, ధృతరాష్ట్రుడనియు పిలుచుచుండెడివారు. మధురా నివాసులు తఱచుగా దండీజీ యనెడివారు. మశూచివ్యాధి వలన నైదేండ్ల ప్రాయముననే దృష్టి పోయెను. ఎనిమిదేండ్ల వయస్సుననే తండ్రి దగ్గఱ వ్యాకరణము చదువనారంభించెను. పాఠశాలకు వెళ్లలేదు. కొలది దినముల తరువాత నాతని తల్లి దండ్రులు దివంగతులైరి. కొన్నినాళ్లు తనయన్నదగ్గఱ కాలము గడపి యన్నగారి కఠోర వ్యవహారముల సహింపలేక యీశ్వరునే నమ్ముకొని ఋషీకేశమునకు బయనమయ్యెను.

మార్గమున నెన్నియో కష్టముల నెదుర్కొని యెట్టకేలకు ఋషీకేశమును జేరెను. అప్పటికే యత నికి నుపనయనము చేయబడిగాయత్రీ మంత్రోపదేశము చేయబడెను. అందుచే నతడు గంటల కొలది గాయత్రీ జపము చేయదొడగెను. ఒక్కొక్కనాడు జపించుచుండగనే యర్ధరాత్రి యయ్యెడిది. తక్కిన సమయము నిద్రించి తిరిగి ప్రాతఃకాలముననే లేచి కాలకృత్యములు దీర్చి గంగాజలమున నిలబడి గాయత్రీ జపము చేయుచుండెడివాడు. ఏదో గొప్ప వరప్రాప్తి కొఱకట్లు కఠిన తపస్సు చేయుచున్నాడని యితరులు చెప్పుకొనెడివారు.

ఆ రోజులలో ఋషీకేశము ఘోరారణ్యముగా నుండెడిది. క్రూరమృగములు సంచరించుచోట నొక పర్ణ కుటీరము నిర్మింపజేసికొని యప్పుడప్పుడు క్రూరమృగము లాకుటీరమును భంగపఱచినను మరల పునర్నిర్మించుకొని యందే యుండి నిర్భయుడై కందమూలాదుల భుజించుచు జీవనము గడపుచు తన లక్ష్యమును విడువడయ్యెను. ఒకనాటి రాత్రి కొన్నిమాటలు వినబడగా లేచి చుట్టుపట్టువెదక నేమియు తటస్థపడలేదు. అందుచే దానిని దేవవాణిగా గ్రహించి ఋషీకేశమును విడిచి కనఖల్ చేరుకొనెను.

కనఖల్ చేరిన యనంతరమొక గొప్ప బైరాగియైన సంన్యాసి లభించెను. అతని పేరు పూర్ణాశ్రముడు. ఆదర్శత్యాగము పూర్ణపాండిత్యముగల యాతని దగ్గఱ ప్రజ్ఞాచక్షువు సంన్యాస దీక్ష తీసికొనెను. విరజానంద స్వామి యని పిలువబడెను. విరజానందుడు రచించిన 'శబ్దబోధ' అను గ్రంథమున 'గౌరీశంకర శిష్యుడను' అని వ్రాసికొనుటచే మఱియొక గురువుండెనని తెలియుచున్నది. పూర్ణాశ్రముని దగ్గఱ చాల చదివెను. ఆతడు నేత్ర హీనుడు గదా యెట్లు చదివెనను సందేహము సహజముగా గలుగును. కాని యాతని స్మరణశక్తి, ధారణాశక్తి, మననశీలత మొదలగునవి యత్యద్భుతములు. ఎవ్వనికైనను నేత్రేంద్రియము లేనివానికి నితరేంద్రియ శక్తి యధికమగుట లోకమున చూతుము. నిదర్శనము విరజానందుడే. విరజానందుడు తాను వినిన దానిని బాగుగా మననము చేసి యితరులకు బోధించెడివాడు. ఈ పద్ధతి యాతనిని గొప్ప యధ్యాపకునిగా జేసెను. కనఖల్‌లో కౌముదిని నర్థసహితముగా పఠించి కంఠస్థము చేసికొని యింకను జదువదలచి కాశీకి పయనమయ్యెను.

గంగాతీరమున బయనించి కాశీకి జేరి యచ్చటి వ్యాకరణ పండితులతో జర్చలు జరిపి విద్యాధర పండితుని దగ్గఱ విద్య నభ్యసించెను. తాను జదువుచునే యితరులకు బోధించు పద్ధతిని జూచి చిన్నలు పెద్దలు నాతని బోధనా పద్ధతి కచ్చెరువంది యాతని చెంత నధ్యయన మొనర్పసాగిరి. కొన్నాళ్ళ కతడు

వేదాంత చర్చ ప్రారంభింపగా నాతని ప్రతిభకు, పాండిత్యమునకు నచ్చటివారు ముగ్ధులైరి. విరజానందుడు కాశీ విడిచి గయ వెళ్లదలచి పయనమయ్యెను. దారిలో గొందఱు బందిపోటు దొంగలు చుట్టుముట్టగా నాతడు కేకలు పెట్టెను. ఆకేకలు విని గ్వాలియర్ సర్దారు సహాయుడు కాగా దొంగలు పాఱిపోయిరి. ఆ సర్దారు వెంటనున్న పండితుడు విరజానందుని పాండిత్యమును గ్రహించి సర్దారుకు దెలుప నాతడు మిక్కిలి సంతుష్టుడై విరజానందుని తన యొద్దనే యుంచుకొనెను. కొన్ని దినములు తరువాత గయకు వెళ్లి యధ్య యనము సాగించి యట నుండి కలకత్తా చేరెను. అచ్చట గంగాప్రవాహము దూరమగుటచే గడియాఘాట్ రేవు దగ్గఱకు వెళ్ళెను. తన దగ్గఱకు వచ్చిన శిష్యులకు కౌముదీ చంద్రికా వ్యాకరణముల నధ్యాపనము చేసెను. ఒకనాడు గంగలో నిలబడి విష్ణుస్తోత్రము చేయుచుండ అల్వర్ నరేశుడు విరజానందుని యుచ్చారణమునకు బ్రసన్నుడై యల్వర్ రమ్మనగా నాదగ్గఱ నధ్యయనము చేసిన వత్తునన దానికి రాజంగీకరించుటచే సోరో వదలి అల్వర్ వెళ్లెను. అల్వర్ రాజైన వినయసింహుడు సంస్కృతాభిలాషియై పండితులను బోషించుటచే అల్వర్ కూడ కాశివలె పండిత స్థానమయ్యెను.

దండీజీ రోగగ్రస్తుడై అంగదరామ్ అను శిష్యుని సేవవలన స్వస్థుడయ్యెను. తరువాత నచ్చట నుండి బయలుదేరి యచ్చటచ్చట తిరిగి చివరకు మధురచేరి యచ్చట పాఠశాల పెట్టెను. రాజుల సాయమున శిష్యులకు నిశ్శుల్కముగా శిక్షణ నిచ్చుచుండెను. మధురలో ప్రజల కోరికపై కృష్ణశాస్త్రితో శాస్త్రార్థము జరుపదలప కృష్ణశాస్త్రి యోడిపోవునని తెలిసి యాతని శిష్యులను బంపి యల్లరిచేసి శాస్త్రి గెలిచెనని గోలచేసిరి. అంతియకాక ధనమును బంపి కాశీ పండితులచేత శాస్త్రి పక్షము బలపఱచునట్లు 'అజాద్యుక్తి' అనునది షష్ఠీతత్పురుషమా? సప్తమీ తత్పురుషమా? అను విషయమున షష్ఠీతత్పురుషమని దండీజీ శిష్యులు, సప్తమీ తత్పురుషమని కృష్ణశాస్త్రి పక్షము వారును వాదించి తమ పక్షము నెగ్గవలెనని శాస్త్రి పక్షము వారు, కాగితము తెప్పింప దానిని జూచిన దండీజీ కాశీపండితుల దౌర్భాగ్యమునకు చింతిల్లి సవాలు చేయుచు కాగితము వ్రాసి పంపగా కాశీపండితులు ముందుగా కృష్ణశాస్త్రి తరపున వివశులమై వ్రాసితిమని యొప్పుకొనిరి.

దండీజీస్వామి నేత్ర విహీనుడైనను శిష్యుడైన వనమాలిచే అష్టాధ్యాయి, మహాభాష్యము ఆవృత్తి చేయించుచు దానును కంఠస్థము చేసెను. దండీజీ జ్ఞాన దృష్టితో భట్టోజీ దీక్షితులు వ్రాసిన గ్రంథములు కౌముది మొదలైనవి పఠనీయములుకావని నిర్ణయించెను. అష్టాధ్యాయి, మహాభాష్యముల గుణముల గ్రహించి దానినే ప్రచారము చేయుచు వైదిక సాహిత్యము యొక్క యుత్కృష్టతను దశదిశల బ్రకాశింప జేసెను. దండీస్వామి యొక్క మహత్కార్యమువలననే శ్రీమద్దయానంద సరస్వతి, శ్రద్ధానందస్వామి, పండిత గురుదత్త విద్యార్థి, పంజాబ్ కేసరి లాలాలజపతిరాయ్, పండిత లేఖరామ్, భాయీపరమానంద వంటి మహాపురుషులు తయారైరి.

ఋషిప్రణీతము లార్షములనియు, నితర విద్వాంసులచే రచింపబడిన కౌముది, శేఖర ప్రభృతి గ్రంథము లనార్షములనియు నపఠనీయములనియు బాహాటముగా బ్రచారము చేసిరి. ఆర్షానార్ష గ్రంథ వివేచనము చేయుటకు దండీజీ చూపిన యార్ష గ్రంథలక్షణము - గ్రంథారంభమున ఓమ్, లేక అథ యను శబ్దములుండుననియ, అటులలేని గ్రంథమనార్షమనియు నిర్ధారించెను. మఱియు ననార్ష గ్రంథములలో సాంప్రదాయక విద్వేషము, అనేక దేవతా వర్ణనము, దేవతా దూషణము, ప్రసిద్ధాచార్యునిచే వ్రాయబడకుండుటయు గానవచ్చును. భారతదేశ పతనమునకు గారణము మానవరచిత గ్రంథ పఠనమనియే విరజానందుని విశ్వాసము. అందుచేతనే సామాజిక, ధార్మిక జీవనము చెడిపోయినదని తలంచి శాస్త్రాధారముగా మౌలిక సంస్కరణము కావలయునని జనుల భావములలో బరివర్తనము గలిగింప యత్నించుచు దోషపూర్ణ గ్రంథముల ఖండించెను. పండితులతో శాస్త్రార్థము జరిపి యనార్ష

గ్రంథములకు బదులుగా నార్ష గ్రంథములు చదివి చదివింపుడని ప్రోత్సహించెడివాడు. ప్రభుత్వాధికారులను సత్యగ్రంథ పఠన పాఠనములకు సహకరింపుడని కోరగా వారు తమ యశక్తత వెల్లడించెడివారు. పాడ్యమినాడు చదువుట కూడదనియు, రామాయణములో నున్నదనియు, నొక పండితుడన రామాయణములో లేదని నిరూపించి పాడ్యమినాడు చదువుటలో దోషలేదని వివరించెను. విరజానందస్వామి పాణిని వ్రాసిన యష్టాధ్యాయికి సగభాగమునకు టీక వ్రాసెను. వ్యాకరణ సంబంధి శేఖరమును ఖండించుచు 'వాక్యమీమాంస' వ్రాసెను. మనుష్య రచిత గ్రంథములలో ననేకానర్థములు కలిగించు విషయము లుండుట చేతను, ఋషిప్రణీత గ్రంథ ప్రచారము బొత్తిగా లేకుండ జేయుటచేతను వానియందున్న యేహ్యభావముతో దాను రచించిన గ్రంథములను గూడ నశింపజేయవలయునను భావన కలిగెను. అందుచేత శిష్యులతో నారెండు పుస్తకములు జలములందు బాఱవేయుడనగా శిష్యులు ఆపుస్తక ములందున్న ప్రీతితో దమ దగ్గఱనే యుంచుకొని ప్రవాహమున బాఱవేసితిమని చెప్పిరి.

స్వామి విరజానందుని వంటి త్యాగియు, నిఃస్పృహుడునైనట్టి వాడితరుడు లేడు. ఇట్టి మహానుభావునకు సముచిత సత్కారము చేయలేదు. దండీజీ యొక్క యద్వితీయ శిష్యుడు మహర్షి దయానంద సరస్వతి మాత్రము గురువు నభిప్రాయముల ప్రచారము చేయుటకు నెన్నో సంకటముల నెదుర్కొని తుదకు ప్రాణార్పణము గావించెను. ఆ మహనీయుని కృషి ఫలితముగానే దండీజీ జీవిత చరితము పాఠకులకు లభ్యమయ్యెను. దండీజీ గొప్పవారని తెలిసి యెవరైనను జూడవచ్చినచో మొగమిచ్చకము లేక తిరస్కరించి ద్వారము బంధింప జేసెడివాడు. అధ్యయనము చేయువారికి, శాస్త్రార్థము చేయువారికి మాత్రమే యాశ్రమమున బ్రవేశముండెడిది. దండీజీ విద్యార్థులకు కేవలము అక్షరజ్ఞానము కలిగించుటయేకాక వారి జీవిత మాదర్శ వంతముగా జేసెడివాడు. భారతదేశములో వ్యాపించి యున్న మతమతాంతరములను, మూఢవిశ్వాసములను శాశ్వతముగ నష్టభ్రష్టము కావింపవలయునని శిష్యులకు బోధించెడివాడు. దయానంద సరస్వతికి దప్ప యితర శిష్యుల కెవ్వరికి గ్రంథరచన కనుమతి నీలేదు.. శిష్యులనుండి శుల్కమును దీసికొనకుండుటయేగాక వారిచే సపర్యలు కూడ స్వీకరించెడివాడు కాదు. అయోగ్యుల మిథ్యాభిమానమును, అనుచిత సమ్మానమును సహింపనట్లు తానును మర్యాదల లోభమునకు దూరముగా నుండెడివాడు. టీకల వలన మూలగ్రంథముల విషయమునకు చేటు వాటిల్లుననియు నానావిధ సంప్రదాయములకు టీకలు భాష్యములే కారణమని వానిని జలమగ్నము చేయుమనెడివాడు. జయపురాధీశుడైన రాజారామసింహుని ద్వారా సంస్కృత శిక్షణ, శాస్త్రములు, మర్యాదలు, ఆర్యుల వర్ణాశ్రమ ధర్మ నిర్వహణము జరుగునని దండీజీ యాశపడెను. కాని వాని మంత్రుల కాస్థాన పండితులు వ్యతిరేకులగుటచే దండీజీ యాశ నిరాశయగుటచే మిక్కిలి వ్యథచెందెను. ఇట్టి స్థితిలో విరజానందుని యసీమవిద్వత్తును విన్న దయానందుడు దండీజీని సమీపించగా దండీజీ దయానందుని మేధాశక్తిని బరీక్షించి మిక్కిలి ప్రసన్నుడై మనుష్యకృత గ్రంథజ్ఞానమును మఱచిపొమ్మని యాదేశించి, పాణినీయ వ్యాకరణమును చదివించి అష్టాధ్యాయికి వ్యాఖ్యానమైన మహాభాష్యమును పఠింపజేసెను. వారిద్దఱకు జరిగెడు వివాదము ద్వారా దయానందుని తార్కిక శక్తిని గుర్తించి యితడు భవిష్యత్తులో సాటిలేని పండితుడై శాస్త్రార్థమున నజేయుడగునని నిశ్చయించెను. ఆర్షగ్రంథ పఠనము ద్వారా యీశ్వరీయ వేద బోధను బొంది యద్వితీయ ప్రతిభాశాలియని ప్రసిద్ధివడసిన దయానందుడు అధ్యయనము పూర్తిచేసి గురుదక్షిణ నీకోరగా దండీస్వామి 'దయానందా! జీవించినంత కాలము భారతదేశమున నార్ష గ్రంథప్రచారము చేయుచు, వైదిక ధర్మ విస్తరణ కొఱకు ప్రాణములనైన నిత్తునని ప్రతిజ్ఞ చేయుము'ని దక్షిణ కోరెను. దయానందుడు సరే (వల్లె) యనెను. దానితో దండీజీ మనమున నున్న చింత తొలగిపోయెను. ఇన్ని విధముల వైదిక విజ్ఞానమును వెదజల్లిన భారతభాస్కరుడు విరజానందస్వామి క్రీ.శ.1868లో దివంగతులైరి.

ఓమ్

# స్వామి దయానంద సరస్వతి - ఆత్మ చరిత్ర

(స్వయం లిఖితము - కథితము)

నేను - స్వామి దయానంద సరస్వతి - సంక్షేపముగా నా జన్మ చరిత్రను వ్రాయుచున్నాను.

"మీరు బ్రాహ్మణులని మేమెట్లు తెలిసి కొనవలయును" అని మమ్ము పలువు రడుగుచున్నారు. "మీరు మీ యిష్ట మిత్రుల నుండి కాని సోదరబంధువులనుండికాని పత్రమును దెప్పించుడు. లేక యెవరి గుర్తులైన జెప్పుడు." అని యిట్లు నన్నడుగుచున్నారు. కావున నేను నావృత్తాంతమును జెప్పుచున్నాను. గుజరాతు దేశమునం దితర దేశముల కంటె మోహ మెక్కుడుగా నున్నది. నేను నాయిష్టమిత్రులయు, బంధువులయు గుర్తులు మీకు దెలిపినను, లేక పత్ర వ్యవహారము చేసినను నాకు మిక్కిలి యుపాధి కలుగును. నే నేయుపాధులనుండి విడివడి వచ్చితినో యా యుపాధులే నన్ను వెంటాడును. ఈ కారణము వలననే బంధువులనుండి కాని, మిత్రులనుండి కాని పత్రాదులను దెప్పించుటకు నేను యత్నింపను. ప్రథమ దినమునుండియు నే నితరులకు నా తండ్రి నామముకాని, నా వంశ స్థానము కాని చెప్పుటకు స్వీకరింపలేదు. దీనికి గారణము నాకర్తవ్యము నన్ను నిందుల కంగీకరింపనీయదయ్యె. నా బంధువులలో నెవరేని నా యీ చరిత్రతో బరిచితులైన వారు నన్ను దప్పక యన్వేషింప బ్రయత్నింతురు. ఇట్టి వారు ముగ్గురు నలుగురు నన్ను వెదకి కనుగొనిన పక్షమున వారివెంట దప్పక పోవలసిన స్థితి యేర్పడును. అనగా గృహస్థుడను గావలసిన స్థితి యేర్పడును. మరల నొకమాటు తప్పక ధనాదులను జేతబట్ట వలసి వచ్చును. వృద్ధుల సేవా శుశ్రూషలు కూడ జేయుట నాకు యోగ్యమని తోచవచ్చును. దేని కొఱకు నేను నా జీవనము నర్పించి యుంటినో, యేది నాకు యథార్థోద్దేశ్యమో, దేని కొఱకు స్వజీవనమును బలిదానము చేయుటకు గొంచెమైనను జింతింపలేదో, దేని కొఱకు నా జీవనమున కొకింత మూల్యము కట్టలేదో, మఱియు నెందు కొఱకు నా సర్వస్వము నర్పించుట నా మంతవ్యముగా నెంచితినో యంతయు దాఱుమాఱగును. అనగా దేశము నుద్ధరించుట, ధర్మప్రచారము చేయుట మున్నగు కార్యములు విడువవలసివచ్చును. నా యీ దేశము పూర్వమువలె నంధకారమున బడియుండవలసి వచ్చును.

విక్రమ, సంవత్, ౧౮౮౧ లో దక్షిణ గుజరాతు ప్రాంతమున 'కాఠియవాడ్' లోని 'మజోకఠా' దేశమున 'మౌర్వీ రాజ్యమున' 'ఔదీచ్య' బ్రాహ్మణుని యింట నేను జన్మించితిని. ఔదీచ్య బ్రాహ్మణులు సామవేదులయినను నేను మాత్రము మిక్కిలి కష్టముతో శుక్ల యజుర్వేదమును జదివితిని. (వి. సం. ౧౮౮౬) నేను నా యైదవయేట దేవనాగరి యక్షరములను నేర్చుకొన నారంభించితిని. కులరీతి ననుసరించి నా తల్లిదండ్రులు నాకు శిక్షణమునొసంగు చుండెడివారు. ధర్మశాస్త్రాదులకు సంబంధించిన శ్లోకములు, సూత్రములు నాచే గంతస్థము చేయించు చుండెడివారు.

(వి.సం.౧౮౮౯) నా యెనిమిదవ యేట నాకు యజ్ఞోపవీత సంస్కారము చేసి, గాయత్రీ మంత్రము, సంధ్య, వానికి సంబంధించిన క్రియలు నేర్పిరి. యజుర్వేద సంహిత ప్రారంభించి మొదట దానిలోని రుద్రాధ్యాయము నాచే జదివింప జేసిరి. ఆ సంవత్సరముననే నా కొక చెల్లెలు జన్మించినది. నా వంశము శైవమతమునకు సంబంధించినది. నాకు నాశైవమత శిక్షణముగూడ నిచ్చుచుండిరి. నా తండ్రి మొదలగువారు పార్థివ పూజనము-అనగా మట్టితో లింగమును జేసి పూజించు మనియు నాకు జెప్పుచుండెడివారు. కాని నాతల్లి - "వీడు ప్రాతః కాలముననే భోజనము చేయును గావున పూజ యితనిచే నెన్నడు జరుపబడ జాలదు" అని చెప్పుచుండెడిది. కాని తండ్రి మాత్రము "ఇది కులరీతి కావున బూజ

తప్పక చేయవలయును, అని పట్టుపట్టుచుండెడివారు. అట్లే కొంచెము కొంచెముగా వ్యాకరణాది విష యములు, వేదాధ్యయనము పాఠము మాత్రము నాకు జెప్పుచుండెడివారు. నా తండ్రిగారు తన వెంట నన్నప్పుడప్పుడు గుడికి దీసికొని వెళ్ళుచుండెడివారు. ఇంతే గాక శివుని యుపాసన యన్నింటి కంటె శ్రేష్ఠ మనియు జెప్పుచుండెడివారు. ఎవరితోనైనా గలియుటకు వెళ్ళినపుడును నన్ను వెంట గొనిపోయెడివారు. ఇట్లు నేను పదునాల్గవ యేట ప్రవేశించితిని. అప్పటికి యజుర్వేద సంహిత సంపూర్ణముగా గంఠస్థము చేసి తిని. అన్నివేదములలోను గొంత కొంత పాఠము పూర్తి యయ్యెను. శబ్దరూపావళి మున్నగు చిన్న చిన్న వ్యాకరణ గ్రంథములు కూడ బూర్తి యయ్యెను.

(వి. సం.౧౮౯౫) ఎక్కడెక్కడ శివపురాణాది పురాణగాథ జరుగుచుండెడిదో యటనట నా తండ్రిగారు నన్ను దగ్గఱ గూర్చుండ బెట్టుకొని వినిపించు చుండెడివారు. మా యింట భిక్షా జీవిక లేదు. జమీందారీ తోను ధనము నిచ్చి పుచ్చుకొను వ్యవహారముతో వ్యవస్థ చేయుచు జీవికా కార్యముల నన్నిటిని నడపుచుండెడివారు. నా తండ్రిగారు, నా తల్లి యెంత వల దనుచున్నను వినక నాచే బార్థివ పూజనము ప్రారంభింపజేసిరి.

నా తండ్రి యా సంవత్సరమునందే 'శివరాత్రి వ్రతము చేయు' మని నాకు జెప్పిరి. కాని నే నందుకు సిద్ధపడలేదు. అయినను శివరాత్రి దినమున నా తండ్రిగారు త్రయోదశినాడు పగటి వేళ కథా మాహాత్మ్యమును వినిపించి, శివరాత్రి వ్రతమును జేయుటకు నాచే నిశ్చయము చేయించిరి. ఆ కథ నాకెంతో ప్రీతి కరముగా దోచినది. అందువలననే నే నుపవాసమునకు దృఢ నిశ్చయము చేసికొంటిని. కాని నా తల్లిగారు మాత్రము 'ఇత డీవ్రతమును జేయలేడు. కావున నితనిచే నీవ్రతమును జేయింపవల' దని వారించినను వినక నాతండ్రిగారు నాచే వ్రతమారంభింప జేసిరి.

మా నగరమునకు వెలుపల నొకపెద్ద శివాలయ మున్నది. శివరాత్రి కారణముగా జాలమంది రాత్రి సమయమున శివాలయమునకు వెళ్ళుచుండెడివారు. అక్కడ బూజారులు చేయుచుండెడివారు. చతుర్దశి రోజున సాయంకాలము కాగానే మా బస్తీలోని పెద్ద పెద్ద ధనవంతులు తమ పుత్రులతో బాటు మందిరమున జాగరణము చేయుటకు వెళ్ళిరి. నేనుగూడ నక్కడకు నా తండ్రితో బాటు వెళ్ళితిని. మొదటి జామున బూజారులు పూజచేసి నిద్ర పోయిరి. రెండవ జాము పూజకూడ బూర్తి యయ్యెను. పండ్రెండు గంటలకు దరువాత జనులక్కడక్కడ గూర్చుండి కునికిపాట్లు పడుచు గ్రమముగా నెల్లరు నిద్రపోయిరి. నిద్రపోయిన శివరాత్రి ఫలము లభింప దని నేను విని యుంటిని. అందువలన గన్నులపై నీళ్ళు చల్లుకొనుచు మెలకువతో నుంటిని. కాని నా తండ్రి మొదలగువారు కూడ నిద్ర పోయిరి. ఇంతలో నొక చమత్కారము జరిగెను. గుడిలోని కన్నమునుండి యొక యెలుక బయటికి వచ్చి శివలింగమునకు నలువైపుల దిరుగ జొచ్చెను. ఇంతే కాక లింగముపై నుంచిన యక్షతాదులమీద నెక్కి వానిని దిన నారంభించెను. నేను మెలకువతో నుండుట వలన నీ లీల యంతయు జూచుచుంటిని. ఆ సమయమున నా చిత్తములో ననేక విధములైన యాలోచనలు కలిగెను. ప్రశ్నమీద ప్రశ్న యుదయింప దొడగెను. అప్పుడు మనస్సునం దొక శంకయు కలిగెను. "ఎవని కథ నేను విని యుంటినో యా మహాదేవు డితడేనా? లేక యిత డన్యుడా?" ఏలయన నతడు మనుష్యునివలె నుండు నొకదేవత. అత డెద్దు మీద నెక్కి తిరుగుచుండును. చేతిలో త్రిశూలము నుంచుకొనును. అతడు తినును త్రాగును. డమరు వాయించును. వరముల నిచ్చును. శాపముల బెట్టును. కైలాసమున కతడధిపతి. ఇట్లు మహాదేవునికథ విని యుంటిని. అందువలన నా యెలుక లీల చూచి నా బాల బుద్ధికి " పాశు పతాస్త్రముతో గొప్ప గొప్ప ప్రచండదైత్యులను సంహరించు శివునిలో నిర్బలమైన యీ యెలుకను దూరముగా బాఱద్రోలు శక్తి

లేదా!" యని తోచెను. ఇట్లే నానా విధ తర్కములు మనమున నుదయించెను. అప్పుడు తండ్రిని లేపి " యీ దేవుడు మీరు చెప్పిన కథలోని మహాదేవుడేనా లేక మఱియొకడా? " యని యడిగితిని. అప్పుడు తండ్రిగా రెందుల కిట్లడుగుచున్నావనగా నేనిట్లంటిని. "కథలోని మహాదేవుడు చేతనుడు. అతడు తనపైని నెలుక నేల యెక్క నిచ్చును? ఈ దేవుని మీద నెలుక తిరుగుచున్నది" అప్పుడు తండ్రిగారిట్లనిరి. " మహాదేవుడు కైలాసముపై నుండును. అతని మూర్తిని జేసి, యందతని నాహ్వానించి పూజ చేయుచుందురు. ఇప్పుడు కలియుగమున నా శివుని సాక్షాత్కారము కాదు. కావున బాషాణాదులతో మూర్తులు చేసి యందు మహాదేవుని భావించి పూజచేయుట వలన గైలాసముననున్న మహాదేవుడు ప్రసన్నుడగును."

ఇట్లు విని ' ఇందులో నేదో గడబిడ యున్న' దని నాకు దోచెను. ఆకలి బాధకూడ నెక్కువగా నుండెను. నేనింటికి వెళ్లుదునా' యని తండ్రి నడుగగా వారు ' సిపాయిని వెంటబెట్టుకొని వెళ్లు. భోజనము మాత్రము చేయకు' మని యాదేశించిరి.

నే నింటికి వెళ్లి 'నాకు మిక్కిలి యాకలి యగుచున్నది.' అని తల్లితో ననగా నామె 'ఉపవాసము చేయజాలవని నేను మొదటనే చెప్పలేదా! నీవే మొండి పట్టు పట్టి నామాట వినవైతివి' అని మందలించి తినుటకు మిఠాయి పెట్టి 'ఇక నిప్పుడు తండ్రిగారి దగ్గఱకు వెళ్లకు, వారితో నేమియు జెప్పకు దెబ్బలు తగులును' అని మందలించెను. మిఠాయి తిని నిద్రపోయి మఱునా డెనిమిది గంటలకు నిద్రనుండి లేచితిని. నా తండ్రిగారు ప్రాతఃకాలమున రాత్రి నేను జేసిన యుపవాస భంగ విషయమును దెలిసికొని మిక్కిలి క్రోధితుడై నీవు చాల చెడ్డపని చేసితివి యనిరి. అందుకు నేను 'గుడిలో నున్న శివుడు మీరు చెప్పిన కథలోని శివుడు కాదు గదా? ఇతని నేనెందుకు బూజింపవలయును' అని బదులు చెప్పి, మనస్సున శ్రద్ధలేనందున బైకి మాత్రము తండ్రి గారితో నాకు జదువుట కవకాశము లేదు, నేను జదువుకొన వలయును' అని యంటిని. ఇంతలో మా తల్లిగారు మాచిననాయనగారు కల్పించు కొని తండ్రిగారి కోపమును శాంతింపజేసిరి. మరల నిఘంటువు నిరుక్తము పూర్వమీమాంసాది శాస్త్రములను జదువగోరి వానిని జదువ నారంభించితిని. కర్మకాండవిషయమును గూడ జదువ సాగితిని.

నా తరువాత నొకచెల్లెలు, నటుపై నొకతమ్ముడు, వాని తరువాత నొక చెల్లెలు పుట్టిరి. ఆ చెల్లియ తరువాత నింకొక తమ్ముడును బుట్టెను. ఇట్లు నాకిరువురు చెల్లెండ్రు, నిరువురు తమ్ములు నేర్పడిరి.

(వి.సం.౧౮౯౬) నేను బదునాఱేండ్ల వాడ నయితిని. నాతరువాత బుట్టిన చెల్లెలు పదునాలుగేండ్ల దైనది. ఆమె కప్పుడు కలరావ్యాధి తగిలెను. ఆరాత్రి యొక యింటిలో సాంఘిక సంబంధమైన నృత్యమేదో జరుగుచుండగా నొక సేవకుడు వచ్చి చెల్లియకు 'కలరా' తగిలిన దని చెప్పగా విని మేమందఱము నింటికి వెళ్లితిమి. తండ్రిగారు వైద్యులను బిలిపించిరి. ఎన్నియో యత్నములు చేసిరి. కాని లాభము లేకపోయినది. నాలుగు గంటలలో నామె చనిపోయినది. నే నామె మంచము ప్రక్కన నున్న గోడ కానుకొని నిలుచుండి యుంటిని. నేను జన్మించిన దాది యంతవఱకు మరణించుచుండగా నెవరిని జూడలేదు. ఇదియే మొదటి మృత్యుదర్శనము. అందువలన నా హృదయముపై వజ్ర పాతమైనట్లయినది. ఎల్లరు నేడువసాగిరి. నాకేడుపు మాత్రము రాలేదు; కాని నామనస్సునం దేదోభయము కలిగినది. ఈలోకమున నేమియులే దనిపించినది. ఇట్లే నేను నొకనాడు చనిపోవుదును. కావున నీమృత్యువునుండి తప్పుకొనుటకు ముక్తిని బొందుట కేదేని యుపాయము చూడవలయును. ఇట్టి యాలోచనలు మనస్సున రాదొడగెను. కాని నేనెవరితో నేమియు జెప్పలేదు.

అందఱు నేడ్చుచుండిరి. కాని, నాగుండెలలో భయము ప్రవేశించిన కారణమున నా కంటినుండి

యొక్క యశ్రుబిందువైన బయటికి రాదయ్యెను. తండ్రిగారు నన్ను 'పాషాణహృదయుడ వనెను. నన్నెంత గానో ప్రేమించు తల్లికూడ నట్లే యనెను. నన్ను నిద్ర పొమ్మనిరి. కాని నాకు నిద్ర రాలేదు. అట్టి యశాంతిలో నిద్ర యెక్కడనుండి వచ్చును ? నిద్రకొఱకు యత్నించినను మాటిమాటికి ద్రుల్లిపడుచుంటిని. మనస్సున నానావిధ తరంగము లుప్పతిల్లు చుండెను. మా దేశరీతి ననుసరించి నా చెల్లెలిని గూర్చి యేడ్వవలసిన సమయములు నాలుగైదు జరిగిపోయెను. కాని నాకు నేడ్పు రాలేదు. అందుకు నన్ను జాలమంది తిరస్కార దృష్టితో జూచిరి.

మా కుటుంబము వారందఱు నేడ్చుచుండ నేను మూర్తివలె మౌనము వహించి యొకచో వేఱుగా నిలబడియుంటిని. ఆసమయమున లోకమున నెందఱి జీవనములో స్మరణకు వచ్చెను. లోకముయొక్క యనిత్యత బోధపడ సాగెను. అంతయు నిరర్థకముగా దోచెను. నానావిధ సంకల్ప వికల్పములు మిక్కిలి శోకముతో నుత్పన్నమయ్యెను. లోకమున నీ నిర్దయమృత్యువునుండి యెవడును దప్పుకొనజాలడని తోచెను. నిశ్చయముగా నొకదినమున నేను నీ మృత్యువు నెదుర్కొనవలసిన సమయము వచ్చును. అప్పుడు మృత్యుదుఃఖమును నివారించుటకు మందునెక్కడ వెదక గలను. ముక్తిని బొందుట కప్పు డెవరి మీద నిబ్బరపడి యుందును? అందుల కేయుపాయముచితమగును! అనియాలోచించితిని.

సారాంశ మేమన నాసమయముననే మృత్యుసమయమున గలుగు దుఃఖములనుండి తప్పింప ననువగు కారణమైన మోక్షమును హస్తగతము చేసికొని తీఱవలయునని నిశ్చయము చేసికొంటిని. చివర కీసంసారము నుండి నా మనస్సొక్కమాటుగా విడిపోయినది. ఉత్తమాలోచనలు చేయసమకట్టెను.

(వి.సం.౧౮౦౦) అప్పటికి నేను బందొమ్మిదేండ్ల ప్రాయమువాడ నైతిని. నన్నత్యంతము ప్రేమించునట్టియు, మిక్కిలి ధర్మాత్ముడును విద్వాంసుడు నగు నాపినతండ్రిని విషూచిక-కలరా యాక్రమించెను. నా పినతండ్రి మరణించుచు నన్ను దగ్గఱకు బిలిచికొనెను. జనులు వారి వంక జూడగానే వారి కన్నుల నుండి యశ్రువులు ప్రవహింప దొడగెను. నాకు నెంతో యేడ్పు వచ్చెను. ఏడ్చియేడ్చి నాకన్నులు వాచిపోయెను. ఇంతకు బూర్వమెన్నడు నేనింతగా నేడ్చి యెఱుగను. నేనుగూడ నొకనాడు పినతండ్రివలె మరణించువాడనే యని నాకు దోచెను.

వారి మృత్యువు వలన నాలో నత్యంత వైరాగ్య మేర్పడెను. ఈసంసారమున నేమియు లేదని నిశ్చయ మయ్యెను. కాని నే నీ విషయమును నా తల్లిదండ్రులకు దెలియకుండ గుప్తముగా నుంచితిని. మిత్రులను విద్వాంసులను బండితులను నమరుడనగుటకు నేదైన నుపాయము తెలుపుడని మాటిమాటికి నడుగ దొడగితిని. వారు యోగాభ్యాసము చేయవలయునని చెప్పిరి. అప్పుడు గృహత్యాగము చేసి యెక్కడికేని వెళ్లవలయునని నా మనస్సున సంకల్పము కలిగెను. మిత్రులతో గృహాశ్రమమున బ్రవేశించుటకు నామన స్సంగీకరించుట లేదని చెప్పితిని.

దేనికొఱకు జీవింపవలెనో, దేనియందు మనస్సు లగ్నము చేయవలయునో యట్టి పదార్థ మొక్కటియు నీ యపార సంసారమున లేదని నాకు నిశ్చితాభిప్రాయము కలిగెను. ఆ మిత్రు లీ విషయమును నా తల్లిదండ్రులకు దెలిపిరి. నాకు వెంటనే వివాహము చేయుట యుచితమని నాతల్లిదండ్రులనుకొనిరి. వారు నా కిరువదవ యేట వివాహము చేయనున్నారని నాకు దెలిసినపుడు నాకిప్పుడే వివాహము చేయకుండునట్లు తల్లిదండ్రులకు బోధింపు డని మిత్రులకు జెప్పితిని. వారెట్లో యొక సంవత్సరము వివాహమాపిరి.

(వి.సం.౧౮౦౧)ఇంతలో నా కిరువది యేండ్లు నిండినవి. వ్యాకరణము, జ్యోతిషము, వైద్యశాస్త్రము మున్నగు గ్రంథములు చదువుటకు నన్ను గాశీ పంపుడని తండ్రిగారి నడిగితిని. తల్లిదండ్రులు

నితరకుటుంబ బంధువులు " మేము నిన్నెన్నడు కాశీకి బంపము. చదువదలచిన నిక్కడనే చదువుము. రానున్న మాసమున నీ వివాహము జరుగనున్నది. పిల్లనిచ్చువారును నిన్ను గాశీకి బంప నంగీకరించుట లేదు. నిన్నింకను జదివించి మాకు జేయవలసిన దేమున్నది? చదివినది చాలు" అని చెప్పిరి. దీనితోబాటు తల్లిగారు 'నాకు బాగుగదెలియును. ఎక్కువ చదివిన వారు పెండ్లిచేసికొనుట యనుచితమని యెంచెదరు. నీవు కాశీకి వెళ్లిన వివాహమునకు విఘ్నము కలుగును!' అనియు జెప్పెను. 'నేను జదువుకొని తిరిగి వచ్చిన మీదట వివాహము జరుగుట యుచిత' మని మా తండ్రి మున్నగు వారితో జెప్పితిని. అంతట నా తల్లిగారు నాకు మిక్కిలి వ్యతిరేకముగా 'నిన్నెక్కడకు బంపము. ఇప్పుడే వివాహము చేయుదుము' అని యనదొడగెను. ఇక నేను వారి యెదుట నుండుట మంచిది కాదనుకొంటిని. ఎక్కువ మాటలాడిన కొలది మఱింత వ్యవహారము చెడుట జూచి మౌనము వహించితిని. ఇంటియందు నామనస్సు లగ్నము గాకుండుట జూచి నాన్నగారు జమీందారి కార్యములను జూడుమని నాకు జెప్పిరి. కాని దానిని నేనంగీకరింపనైతి.

మూడు క్రోసుల దూరమున మాకు భూములుండెను. అక్కడి గ్రామములో నొక మంచి పండితు డుండెను. తల్లిదండ్రుల యాజ్ఞను బొంది యాపండితుని దగ్గఱ జదువ నారంభించితిని. అక్కడివారితో గూడ గృహాశ్రమ స్వీకారము నాకిష్టము లేదని చెప్పితిని. అది దెలిసి తల్లి దండ్రులు నన్ను బిలిపించుకొని వివాహమునకు దగిన సన్నాహములు చేయసాగిరి. అప్పటికి నాకిరువది యొక్క యేండ్లు నిండెను.

నా మనస్సునందు మాత్రము గృహము విడిచి వెళ్లవలయునని యుండెను. కాని యెవ్వరు నాకు సమ్మతి నొసంగరైరి. ఎల్లరు వివాహము చేసి కొనుటకే సలహా నీసాగిరి. వివాహము చేసికొనక తప్పదనియు వీరు వివాహము చేయక విడువరనియు నాకు నిశ్చయముగా దోచెను.

ఇక నాకు విద్యోపార్జనకుగూడ నాజ్ఞ లభింపదనియు, నేను బ్రహ్మచారిగా నున్న దల్లిదండ్రులు ప్రసన్నులు గారనియు నర్థమైనది. జన్మమంతయు నీ వివాహ బంధనమున బడకుండు నుపాయమును జూడవలయునని బాగుగ విచారించి మనస్సున నిశ్చయించుకొంటిని. కాని యీ నిశ్చయము నెవ్వరికిని దెలియకుండ మనస్సుననే యుంచుకొంటిని.

వి. సం. ౧౯౦౩ న నొకనాడు మెదలకుండ నెవరికి దెలియకుండ బహిర్దేశమునకు వెళ్లునెపముతో నొకధోవతిని దీసికొని సాయం సంధ్యాసమయమున గృహము వదలి పాఱిపోయితిని. ఒక సిపాయి ద్వారా యొక మిత్రుని యింటికి వెళ్లుచున్నట్లు వార్తను బంపి నా దారిన నేను వెడలి పోయితిని.

(వి. సం. ౧౯౦౩) న నాలుగు క్రోసుల దూరమున నున్న గ్రామము జేరి యట నారాత్రి గడపి మఱునాటి రాత్రి యింకను నొకజాము సమయమున్నదనగా లేచి యా గ్రామము విడిచి పదునైదు క్రోసుల దూరము వెళ్లితిని. పోయిపోయి యొక గ్రామ సమీపమున నున్న హనుమంతుని మందిరమున జేరితిని. ప్రసిద్ధ గ్రామములు, ప్రసిద్ధ మార్గములు, పరిచితులున్న గ్రామములు విడిచి నడువ జొచ్చితిని. మూడవ దినమున నొక రాజపురుషుని (పోలీసు) ద్వారా 'ఫలానావారి కుమారుడు పాఱిపోయినాడట. అతనిని వెదకుటకు నిక్కడకుగూడ మనుష్యులు - నౌకరులు వచ్చి యుండిరి' అను వార్త వింటిని.

నా దగ్గఱ గొలదిరూప్యములు, నుంగరము మొదలగు భూషణము లుండెను. అవి యన్నియు దారిలో నెవరో వంచకులు నానుండి కాజేసిరి. నీదగ్గఱ నున్నవన్నియు దానము చేసినపుడే నీవు వైరాగ్యము గలవాడవగుదువని బోధించి వానిని దీసికొనిరి. వారి మాటలు నమ్మి యన్నియు నిచ్చివేసితిని. ఆ వృత్తాంత మిది. దారిలో నొక బైరాగి యొక మూర్తిని దగ్గఱ బెట్టుకొని "చేతికి నుంగరము ధరించి వైరాగ్యసిద్ధి యెట్లుకలుగునను కొంటివి" అని నన్ను దెప్పి నా చేతనున్న మూడంగుళీయకములు తన

మూర్తికి సమర్పింప జేసెను.

తదుపరి 'సాయలే' నగరమున నున్న లాలాభక్తుని స్థానమున బెక్కురు సాధువు లున్నట్లు తెలిసికొని యట జేరితిని. అట నొక బ్రహ్మచారి కలిసెను. "నీవు నైష్ఠిక బ్రహ్మచారి వగుము" అని చెప్పి యతడు నాకు బ్రహ్మచర్యదీక్ష యొసంగెను. 'శుద్ధచైతన్య బ్రహ్మచారి' యని నాకు నామకరణము చేసెను. కాషాయవస్త్రములు కూడ ధరియింప జేసెను. చేతికొక యెండిన సొరకాయ బుఱ్ఱ నిచ్చి వారి మండలిలో జేర్చుకొనెను. నేను వారితో నక్కడనే యుండి యోగమును సాధింప నారంభించితిని. ఒకనాటి రాత్రి యొకవృక్షము క్రింద కూర్చుండి యుండగా పైన నేవో పక్షులు 'ఘూం ఘూం' అని ధ్వని జేయగా విని భూతములని భయపడి మఠమున బ్రవేశించితిని.

అటనుండి బయలుదేరి అహమదాబాద్‌కు సమీపమున నున్న కోఠకాంగడా యను రాజ్యమున జేరితిని. అక్కడ బలువురు బైరాగు లుండిరి. ఎటనుండియో వచ్చిన యొక రాణి కూడ వారి వాగురలలో జిక్కుకొనడి యుండెను. వారు నావేషము జూచి నన్ను బరిహసింప సాగిరి. ఇంతే కాదు వారు నన్ను దమ గుంపులో జేర్చుకొన యత్నించిరి. కాని నేను వారినుండి తప్పించుకొని పాఱిపోయితిని. పట్టుధోవతులు వారికి బాఱవేసి, కేవలము నాదగ్గఱ మిగిలియున్న మూడు రూప్యములతో సాదావస్త్రములను గొని వానిని ధరించి బ్రహ్మచారి నామముతో బ్రసిద్ధుడనైతిని. అక్కడ మూడు మాసము లుంటిని.

సిద్ధపురమున గార్తికమేలా (ఉత్సవము) జరుగునని వింటిని. అక్కడ నెవరేని యోగి దొరకుననియు, నతడు ముక్తి మార్గము చెప్పునని యెంచి కోఠకాంగడానుండి సిద్ధపురమునకు బయలుదేరితిని. మార్గమున నాకు నా గ్రామ సమీపవాసియగు నొక బైరాగి పరిచితుడు లభించెను. అతడు నన్ను నీ వెటనుండి వచ్చితివి? నీవెక్కడకు బోదలచితి వని యడిగెను. అంతట నేనతనితో 'నే నింటినుండి వచ్చుచున్నాను. దేశ భ్రమణము చేయవలయునని వచ్చితి'నని చెప్పితిని. అతడు కాషాయ వస్త్రములేల ధరించితివనియు నింటిని వదలి వేసితివా యనియు నడుగగా నౌనని తెలిపితిని. సిద్ధపురమున జరుగు 'మేలా'కు వెళ్లుచున్నాననియు జెప్పితిని.

నేనటనుండి బయలుదేరి సిద్ధపురము చేరి నీలకంఠ మహాదేవుని మందిరమున నివాసమేర్పఱచు కొంటిని. అక్కడ నొకదండీ స్వామి, యనేకులు బ్రహ్మచారులు నివసించియుండిరి. వారితో సత్సంగము చేసి యామేలాకు వచ్చిన మహాత్ములతోను, బండితులతోను గలిసి వారితో సాంగత్యము చేసితిని. కోఠకాంగడానుండి వచ్చు సమయమున నాతో గలిసిన బైరాగి నాతండ్రిగారికి లేఖ వ్రాసెను. నీకుమారుడు కాషాయవస్త్రములను ధరించి సిద్ధపురములో జరుగునట్టి కార్తిక మేలాకు వెళ్లినాడనియు నందు దెలిపినాడు.

నావార్త తెలిసికొని నలుగురు సిపాయిలను వెంట బెట్టుకొని నా తండ్రిగారు సిద్ధపురము చేరి, నేనున్న తావును దెలిసికొని మందిరమునకు వచ్చి, పండితుల మధ్యనున్న నన్ను జూచి "నీవు మా కులమును గలంకితము జేయ నుద్యవించితివిరా" అని కోపముతో బలికెను. తండ్రిగారిని జూడగానే నాగుండె కొట్టుకొన మొదలు పెట్టెను. నన్ను కొట్టుదురని భయపడుచు లేచి వారి పాదము లంటి నమస్కరించి మీరు కోపింపకుడని ప్రార్థించితిని. 'కొండొకని మాటలు విని మోసపోయి వచ్చితిని. చాల కష్టములకు లోబడితిని. ఇక నింటికి రావలయుననియే యనుకొను చుంటిని. ఇంతలో మీరు రానే వచ్చితిరి. ఇక నేను మీతో నింటికి వత్తును.' అనియు జెప్పితిని.

అయినను గోపముతో నాపై నున్న కాషాయ వస్త్రములను జించి పాఱవేసి నాదగ్గఱనున్న తూంబాను గూడ నొకవంక విసరివైచెను. నవీన శ్వేతవస్త్రములను ధరింపజేసి నన్నటనుండి తీసికొని వెళ్లుచు బరుష వాక్యములతో గోపించి 'నీవు నీతల్లిని హత్య చేయదలచితివా!' అనెను. నేను వెంటనే 'కాదు

తండ్రీ నేను నీతో వచ్చుచున్నాను గదా' యంటిని. అయినను నావెంట నిద్దఱు సేవకులను నియమించి 'క్షణమాత్రము కూడ వీనిని వదలి యుండవల' దని యాజ్ఞాపించిరి. రాత్రియందును గావలియుండుడనిరి.

కాని నేను మాత్రమెట్లో తప్పించుకొని పోవలయుననియే యాలోచించు చుంటిని. రాత్రి నేను నిద్రించునపు డొక సిపాయి నాతలదగ్గఱ గూర్చుండి మెలకువతో జూచు చుండెడివాడు. నేను నతనిని వంచించి యెప్పుడో పాఱిపోవలయుననియే చూచుచుంటిని. కావున నేను సిపాయి నిద్రపోవుచున్నాడో లేదో తెలిసి కొనుటకు మెలకువతోనే యుంటిని. సిపాయి మాత్రము నేను నిద్రించుచున్నానని భావించెడివాడు. అతని నట్లు నమ్మించుటకు గుఱ్ఱుపెట్టుచు నిద్రపోయినట్లు నటింపసాగితిని.

మూడవ రోజు రాత్రియందు మూడు గంటల వేళ సిపాయి కూర్చుండియే నిద్రపోవసాగెను. ఆ సమయముననే లఘుశంకా నెపముతో లేచి పాఱిపోయి యఱక్రోసు దూరమున నొకతోటలో బ్రవేశించి యట నొకవృక్షము నెక్కి దాని ద్వారా ప్రక్కనే యున్న మందిర శిఖరముపై కెక్కి చెంబు దగ్గఱ నుంచు కొని దాగి కూర్చుంటిని. నాలుగు గంటల సమయమున మాసిపాయిలలో నొక డాతోటకు వచ్చి తోటమాలిని నన్నుగూర్చి యడుగు మాటలను వింటిని. అప్పుడు నేనింకను గనపడకుండ దాగితిని. వారు వెదకి వెళ్లిపోయిరి. నేనామందిర శిఖరము మీదనే దినమంతయు నుంటిని.

అంధకార మంతట వ్యాపించియుండ రాత్రి యేడు గంటల సమయమున మందిర శిఖరమునుండి దిగి రోడ్డు మార్గమువదలి, యొకని నడిగి తెలిసికొని యొక క్రోసుదూరమున నున్న గ్రామము నొకదానిని జేరితిని. ఆరాత్రి యట గడపి మఱునాడు ప్రాతఃకాలమున నటనుండి బయలుదేరితిని. నా గ్రామవాసులను గాని నాయింటివారిని గాని యంతిమదర్శనము చేసి కొనిన సమయమదియని చెప్పిన నసత్యముకాదు. దీని తరువాత బ్రయాగలో నొక పర్యాయము మా గ్రామవాసులు కొందఱు కనిపించిరి. కాని వారిని సరిగా గుర్తింపనైతిని. తరువాత నేటివఱకు నెవరు గనిపింపలేదు.

అహమదాబాదు చూచుకొనుచు బడోదా నగరమునకు వచ్చి యటనుంటిని. అక్కడ చేతన మఠమందు గల బ్రహ్మానందాది బ్రహ్మచారుల తోను సంన్యాసులతోను వేదాంత విషయమును గూర్చి సంభాషించితిని.అట 'నేను బ్రహ్మను' అనగా జీవబ్రహ్మ లొక్కటియే యని నాచే బ్రహ్మానందాదు లంగీకరింపజేసిరి. మొదట వేదాంతము చదువునప్పుడు కూడ గొంత నిశ్చయమట్లు జరిగియే యుండెను. ఇక్కడ నీ మఠమందు జరిగిన చర్చవలనగూడ 'నేను బ్రహ్మ' నను విషయము నిశ్చయమయ్యెను.

అక్కడ బడోదాలోనే యొక బనారసీబాయీ బైరాగీ స్థానముండెను. అటకు వెళ్ళి యాస్థానమున నున్న సచ్చిదానంద పరమహంసను దర్శించి, వారితో ననేక విధముల శాస్త్రచర్చల జరిపితిని. తదుపరి ప్రస్తుతము చాణోదకన్యాలీలో బెద్దబెద్ద సంన్యాసులు బ్రహ్మచారులు బ్రాహ్మణ విద్వాంసులు నున్నట్లు విని యటకు వెళ్ళితిని. అక్కడ దీక్షితునితోను చిదాశ్రమాది స్వాములతోను బ్రహ్మచారులతోను పండితులతోను నానావిధ సంభాషణములు పరస్పరము జరిగినవి. ఒక పరమానంద పరమహంస దగ్గఱ వేదాంతసారము, ఆర్యహరి మీడేతోటకము, వేదాంతపరిభాష మున్నగు ప్రకరణ గ్రంథములను గొంది మాసములలో జదివితిని.

తదుపరి బ్రహ్మచర్యాశ్రమమున నుండుటచే నప్పుడప్పుడు వంట చేసికొన వలసిన పరిస్థితి యేర్పడు చుండెడిది. దాని వలన జదువుటలో బాధ కలుగు చుండెడిది. అందువలన సంన్యాసము తీసికొన వలయునని యెంచితిని. అటనున్న వారిలో నొకడు చిదాశ్రమస్వామి విద్వాంసుడు. వారికి నొక దక్షిణాది పండితుని ద్వారా యిట్లు చెప్పించితిని. "స్వామీ మీరీ బ్రహ్మచారికి సంన్యాస దీక్ష ప్రసాదింపుడు. ఇతడు

తన బ్రహ్మచారి నామము ప్రసిద్ధమగుట నిచ్చగింప కున్నాడు. కారణ మేమన నితనికి గృహభయ మింకను బోలేదు. తన బంధువులచే బట్టుబడుదునేమో యని భయపడుచున్నాడు."

అప్పుడాస్వామి యిట్లనెను. 'ఇతడింకను జిన్నవాడు. కావున నితనికి సంన్యాస దీక్ష నేనీయను.' తదుపరి రెండు మాసములు గడచిన మీదట దక్షిణ దిశనుండి యొక దండీ స్వామియు నొక బ్రహ్మచారియు వచ్చి చాణోదకన్యాలీ కొక క్రోసు దూరమున నరణ్యమున నున్న గృహమున నివసించిరి. అదివిని నేను మఱియొక దాక్షిణాత్య వేదాంత పండితుడు గలిసి యటకు వెళ్ళితిమి. సంస్కృతమున వారితో సంభాషించితిమి. అప్పుడు వారు విద్వాంసులనియు శృంగేరి మఠము నుండి యిటకు వచ్చిరనియు నటనుండి ద్వారికకు వెళ్లుచున్నట్లు తెలిసినది. ఆ సంన్యాసిపేరు 'పరమానంద సరస్వతి' యనియు దెలిసినది.

అ సంన్యాసితో వేదాంతిద్వారా యిట్లు చెప్పించితిని. "స్వామీ యీ బ్రహ్మచారి విద్యాభిలాషి, చదువగోరు చున్నాడు. ఎట్టి యవగుణములు నితనియందు లేవు. ఈ విషయమును నేను బాగుగ నెఱుగుదును. మీరు సంన్యాసదీక్ష నిండు. విద్యాభ్యాసము నిర్విఘ్నముగా జరుపు కొన నెంచి యితడు సంన్యాసదీక్షను గోరుచున్నాడు మఱియొండు ప్రయోజనము లేదు" ఆమాటలు విని సంన్యాసి యిట్లనెను. "గుజరాతీ సంన్యాసి దొరకిన వారినుండి తీసికొనుట మంచిది. మేము మహారాష్ట్రీయులము" అంతట నా వేదాంతి "స్వామీ దక్షిణీ సంన్యాసులు గౌడులకు సంన్యాసము నిత్తురు. ఈ బ్రహ్మచారి ద్రవిడుడే కదా! ఇందు విచారింప బనియేమున్నది" అని పలుకగా నా స్వామి యంగీకరించెను. అందువలన నా స్థానమందే మూడవ దినమున స్వామి సంన్యాస దీక్ష నిచ్చి దండధారణము చేయించి 'దయానంద సరస్వతి' యని నామకరణము చేసిరి. కాని నేను స్వామి యెదుటనే దండవిసర్జన చేసితిని. కారణమేమన దండమునకు నిత్యము చేయవలసిన క్రియాకలాపము చాల యున్నది. అందువలన బఠనపాఠనములలో జాలవిఘ్నములు కలుగును.

తదుపరి వారు ద్వారిక వంకకు సాగిపోయిరి. నేను మాత్రము కొన్ని దినము లట చాణో దకన్యాలీలోనే యుండి, వ్యాసాశ్రమమున నొక యోగానందస్వామి నామక సంన్యాసి యున్నాడనియు నతడు యోగాభ్యాసమున దక్షుడనియు వింటిని. వారి దగ్గఱ యోగాభ్యాసక్రియను నేర్చుకొని యొక 'కృష్ణస్వామి' నామక వ్యక్తి ఛినౌర్ నగరమునకు వెలుపల నివసించు చుండెనని వారిని గూర్చి విని వారి దగ్గఱ వ్యాకరణము జదువవలయునని యెంచి వారికడకు వెళ్లితిని. కొంత వ్యాకరణము నభ్యసించి మరల చాణోదకన్యాలీ తిరిగివచ్చి యటనే నివసించితిని. అక్కడనే యిరువురు యోగులు లభించిరి. ఒకరు జ్వాలానందపురి మఱియొకరు శివానందగిరి. వారితో యోగాభ్యాస విషయమున గొంత వార్తాలాపము జరిగినది. "నీవు అహమదాబాద్ రమ్ము. అట మేము నదికి పైభాగమున దూధేశ్వర మందిరమున నుందుము. నీవటకు వచ్చిన నీకు యోగాభ్యాసరీతిని బోధింతుము" అనిరి.

వారు అహమదాబాదుకు వెళ్ళిరి. ఒకమాసమునకు తదుపరి నేనుగూడ అహమదాబాద్ వెళ్ళి వారిని గలిసికొంటిని. వారినుండి యోగాభ్యాసరీతిని నేర్చుకొని, ఆబూరాజ పర్వతమున యోగులున్నారని విని యటకు వెళ్ళి, అర్బుదాభవానీ మున్నగు స్థానములందు భవానీగిరి మున్నగు యోగులను దర్శించి, కొంత యోగాభ్యాసరీతిని వారినుండి నేర్చుకొని, వి.సంవత్ ౧౯౧౧వ సంవత్సరాంతమున హరిద్వారమున కుంభమేలాకు వెళ్లి పలువురు సాధువులను, సంన్యాసులను గలిసికొంటిని. మేలా జరిగినంతకాలము చండీ పర్వతపు టరణ్యములో యోగాభ్యాసము చేయుచు నుంటిని. మేలా సమాప్తమైన తరువాత ఋషీకేశము నకు వెళ్ళి యట నున్న సంన్యాసులను, యోగులను గలిసి యోగరీతిని నేర్చుకొనుచు సత్సంగము చేయుచుంటిని.

తదుపరి కొంతకాల మొంటరిగానే ఋషీకేశమున నుంటిని. ఇంతలో నొక బ్రహ్మచారి, యిరువురు పర్వత సాధువులు వచ్చి నాతో గలిసిరి. తరువాత మేమందఱము కలిసి టిహరీ ప్రదేశమునకు వెళ్ళితిమి. ఈ స్థానము విద్యావృద్ధికారణముగా సాధువులతోను రాజపండితులతోను నిండినదై ప్రసిద్ధమై యుండెను. అక్కడి పండితులలో నొక పండితుడొక దినమున దనయింటికి భోజనమునకు నన్నాహ్వానించెను. నిశ్చితసమయమున నొక వ్యక్తి నన్ను దీసికొని వెళ్ళుటకు వచ్చెను. అతని వెంట నేను, నాతో వచ్చిన బ్రహ్మచారు లిరువురు బండితుని యింటికి బోయితిమి.

అక్కడ నొక పండితుడు మాంసమును గోయుచు వండుచు నుండగా జూచిన నాకెంతో ఘృణ కలిగినది. ఇంక గొంచెము ముందుకు వెళ్ళగానట నింకను గొందఱు పండితులు కాల్చిన జంతువుల తలలమీద నెముకల మీద నంటియున్న మాంసమును గోయుచుండ జూచుట తటస్థించెను.ఎముకలప్రోగు లొకవంక పడియుండెను. ఇంతలో గృహస్వామి మిక్కిలి ప్రసన్నతతో మాకడకు వచ్చి 'లోపలికి రండు' అని యాహ్వానించెను. నేనతనితో మీరు మీపని చేసికొనుడు. మాకొఱకు మీరేమియు శ్రమపడనక్కఱ లేదని చెప్పి వెంటనే వెనుకకు దిరిగి మాస్థానమునకు జేరుకొంటిమి.

కొంతతడవున కామాంసభక్షి పండితుడు నాదగ్గఱకు వచ్చి 'అయ్యా దయచేయండి మీకొఱకే యీ మాంసాది పదార్థములతో నుత్తమ భోజనము చేయబడినది' యని చెప్పగావిని ఇది యంతయు మీరు వ్యర్థముగా జేసినారు. మీరు మాంసభక్షకులుగా నున్నారు. మాకివి తిన యోగ్యపదార్థములు కావు. ఫలాదులు మాత్రమే మా భోజనమునకు దగినవి. మాంసము చూచిన మాత్రముననే నాకు రోగము వచ్చును. ఇక దినుట యెట్లు సంభవము! మీ నిమంత్రణము నంగీకరించినందున మీ యాతిథ్యము గ్రహింపక తప్పదేని యేవైన గొన్నిపండ్లనిటకే పంపుడు. వాని దిందును. అని స్పష్టముగాజెప్పితిని. ఆ పండితుడు నామాటలు విని లజ్జితుడై తిరిగి వెళ్ళెను.

తరువాత గొన్నిదినములు నేనట టిహరీలో నుంటిని. ఆపండితునితోనే యట దొరకు కొన్ని గ్రంథముల వృత్తాంతము తెలిసికొంటిని. అటగొన్ని తంత్ర గ్రంథములున్నట్లు తెలిసినది. వానిని నేనంతకు బూర్వము చూచి యుండలేదు. అందువలన నా గ్రంథముల నాపండితు నిమ్మని యడిగితిని.

అతడు నాకు గొన్ని గొప్ప గొప్ప గ్రంథముల నిచ్చెను. వానిని జూడగా వానిలో మిక్కిలి భ్రష్టాచారములకు సంబంధించిన విషయములెన్నో యున్నవి.

తల్లి, కూతురు, చెల్లెలు, మాల, మాదిగ, చండాలిని యను విచక్షత లేకుండ వారితో వ్యభిచరించుట, వారిని నగ్నలను జేసి పూజించుట, మద్యము, మాంసము, మత్స్యములుతినుట, ముద్రలు, బ్రాహ్మణులు మొదలు చండాలుర వఱకు నొకచో గుమికూడి భుజించుట, పైన జెప్పిన స్త్రీలతో మైథున మొనర్చుట మున్నగు భ్రష్టాచారము లెన్నో యా గ్రంథములందు జూచుట సంభవించెను. మద్యము, మాంసము, మత్స్యములు, ముద్రలు, మైథునము నను పంచమకారము లనుభవించుట వలననే ముక్తి లభించుననియు నందు వ్రాయబడి యున్నది. ఇవి చూచి చిత్తమున నెంతయో ఖేదము, కలిగెను. ఈ గ్రంథములను రచించిన వారెంత నష్టబుద్ధులో యూహింపజాలక పోయితిని.

తదనంతర మటనుండి బయలుదేరి శ్రీనగరము వెళ్ళితిని. అక్కడ నేను గేదారఘట్టమున నొకమందిరమున నివాసమేర్పఱచుకొంటిని. అటనున్న పండితులతో వార్తాలాపములు చేయునపుడు వాదవివాదములు జరుగుచుండెడివి. వారి నాతంత్రగ్రంథముల సాహాయ్యముతోనే యోడించితిని. ఇక్కడ 'గంగాగిరి' యనుపేరుగల యొకసాధువును జూచుట సంభవించెను. అతడు సమీపపర్వతముపైనున్న యరణ్యములో నుండువాడు. అటనుండి క్రిందికి వచ్చెడివాడు కాడు. మంచిపండితుడు. అతనితో

మైత్రికూడ నేర్పడినది.

అతనిని గలిసినప్పుడతనితో యోగవిద్య యితరములగు నుత్తమ, విషయములపై వార్తాలాపము జరుగుచుండెడిది. ప్రతిదినము జరుగు తర్కవితర్కముల మూలమున మేమిరువురము కలిసి యుండ వచ్చునని సిద్ధమైనది. అతని సాంగత్యము మంచిదిగా దోచి రెండుమాసములు కాలమతనితో గలిసి యుంటిని. తరువాత గ్రీష్మఋతువు ప్రారంభమున నాతో నున్న బ్రహ్మచారులతో గలిసి కేదారఘట్టమును వదలి యన్యస్థానమునకు బోయితిని.రుద్రప్రయాగ మున్నగు స్థానములను జూచుకొనుచు నగస్త్యుని సమాధినామక స్థానమున జేరితిని. అటనుండి యుత్తరదిశగా బయనించి పర్వతముమీద శివపురి యని ప్రసిద్ధిగాంచిన స్థానమునకు వెళ్ళితిని. అక్కడ శరదృతువు నాలుగు మాసములు గడపితిని.

నావెంటనున్న బ్రహ్మచారిని, నిరువురు పర్వత సాధువులను విడిచి యొంటరిగా గేదార ఘట్టమునకు దిరిగి వచ్చితిని. అటనుండి గుప్త కాశీవెళ్ళితిని. అక్కడ గొలది సమయమే యుండి గౌరీకుండము, భీమగుహస్థానములను జూచి త్రియుగీనారాయణ మందిరము జేరితిని. కాని కొలది దినములలోనే మరల నాకు ప్రియకరమైన కేదార ఘట్టమునకు దిరిగి వచ్చితిని. అక్కడ బూజారి బ్రాహ్మణులతోను, గేదారఘట్ట మందిరమున నుండు జంగమ పండాలతో గలిసి కొంతకాల ముంటిని. ఇంతలో నాతో నిదివఱకున్న బ్రహ్మచారి, సాధువులు కూడ నటకు వచ్చిరి.

అక్కడ నున్న పండితులయు, బ్రాహ్మణులయు గర్తవ్యములను దత్తచిత్తుడనై చూచుచుండెడి వాడను. వానిలో స్మరింపదగినవాని నప్పుడు స్మరించుచుంటిని. అక్కడి వృత్తాంతములతో నాకు బరిచయము కలిగిన మీదట సమీపముననున్న పర్వతములపై భ్రమణము చేయగోరిక గలిగెను. ఆస్థల ములు హిమాచ్ఛాదితములై యుండెడివి. ఆస్థలములలో నుండు మహాత్ములను దర్శించు కోరికతో ప్రేరితుడనైతిని. వారి వృత్తము లప్పుడప్పుడు వినుచుండెడివాడను.

ఆయా స్థలములలో నుండు మహాత్ములు లోకులు చెప్పువృత్తముల కనుగుణముగా నున్నారో లేదో యెన్నికష్టముల కోర్చి యైనను దెలిసికొనవలసినదే యని దృఢనిశ్చయము చేసికొంటిని. కాని యాపర్వతీయ యాత్ర యతిభయంకరము, కష్టదాయకమును. అందునను శరదృతువు. కావున నాపర్వతముల స్థితిగతులు మహాత్ముల మాహాత్మ్యములు మున్నగు విషయములను గూర్చి మిక్కిలిగా దెలిసికొనగోరి యెందఱనో యెన్నియో విధముల నడిగి చూచితిని. కాని యడిగిన తావులలో నెల్లరు చెప్పువానిలో సత్యము తక్కువగా గనిపించినది. ఏమేమో యతిశయోక్తులు పలుకసాగిరి. ఇరువది దినములు వ్యర్థముగా నిటునటు బర్యటించి యెటనుండి వెళ్లితినో యటకే మరల దిరిగి వచ్చితిని. నావెంట నున్నవారు రెండు మూడు దినములు నాతో దిరిగి మిక్కిలి చలిని సహింపజాలక నన్నొంటరిగా విడిచి వెళ్లిపోయిరి.

తదుపరి తుంగనాథ శిఖరము నెక్కితిని. అట నొక మందిరము పూజారులతోను, మూర్తులతోను నిండి యుండుట జూచితిని. నే నటనుండి యాదినముననే తిరిగి వచ్చితిని. దిగి వచ్చునపుడు మార్గమున నాకు రెండు మార్గములు కనిపించెను. ఒకటి పశ్చిమమునకు, మఱియొకటి నైరృతి దిశకు వెళ్లునట్లు తోచెను. నేనపుడరణ్యము వైపునకు బోవు మార్గమున నడువ నారంభించితిని. కొంతదూరము వెళ్లిన తదుపరి మిక్కిలి దుర్గమమయిన దట్టమైన యడవి యెదురయ్యెను. అక్కడ బర్వతముకూడ వికటముగా నుండెను. జల ప్రవాహములు శుష్కములై యుండెను. దారి కూడ ముందు గనిపింప దయ్యె.

ఇట్లు దారి గానక క్రిందికి దిగవలయునా పైకి వెళ్ళవలయునా యని యాలోచించితిని. పర్వత శిఖర మత్యున్నతమై యుండెను. మార్గము దుర్గమమై యగమ్యముగా నుండెను. కావున బైకి నెక్కుట

యసంభవముగా దోచినది. అందువలన నేదో యొకవిధమున నెండిపోయిన చెట్ల కొమ్మలను బొదలను బట్టుకొని యెట్లో తంటాలు పడియొక సెలయేరు పైతటమునకు జేరుకొంటిని. అక్కడ నొక గండశిలపైకి నెక్కి నలువైపుల దృష్టి సారించి చూచితిని. అగమ్య పర్వతపు గుట్టలు, నడవులు దక్క మనుష్య సంచార యోగ్యస్థల మేదియు దృష్టిగోచరము కాదయ్యె.

సూర్యుడస్తమించు వేళయు సమీపించెను. శూన్య నిర్జనారణ్యమున జలము కాని, తిను బండారములు కాని యేవియు లేని యీ ప్రదేశమున నా దశ యేమగును. అని మనస్సున జింత వొడమెను.దాని పరిణామ మేమన నా వికటారణ్యమునుండి బయటబడ బ్రయత్నించుటలో ముండ్ల చెట్లలో జిక్కుకొని నా వస్త్రములన్నియు జిరిగిపోయినవి. శరీరమున నెన్నియో గాయము లేర్పడెను. కాళ్లుకూడ నడవ నసమర్థములయ్యెను. అతికష్టముతో నానా దుఃఖములు సహించి, సంకటములకు లోనై యామార్గమును బూర్తి చేసి యంతమున బర్వతమునకు గ్రిందిభాగమున జేరితిని. అక్కడ జనులు నడచు నొకమార్గము లభించెను. అప్పటికి రాత్రియయ్యెను. అంధకారము నలువైపుల వ్యాపించెను. అందువలన మార్గము ననుమానముతో నన్వేషించుచు నడువవలసి వచ్చెను. నే నాప్రసిద్ధమార్గమును విడిచి యిటునటు పోకుండ నుండుటకు నెంతో ధ్యాన ముంచవలసి వచ్చెను. చివరకు గొన్ని పర్ణ కుటీరముల సమీపస్థానమునకు జేరితిని. అక్కడివారి నడుగగా నీ మార్గము 'ఊఖీ' మఠమునకు బోవునని తెలిపిరి. అది విని యటువైపే నడచి యామఠమున జేరి రాత్రి యట గడపితిని.

బాగుగ విశ్రాంతిని బొందిన పిమ్మట బ్రాతఃకాలమున నటనుండి బయలుదేరి గుప్తకాశీ వచ్చితిని. అట నుండియే నే నుత్తరదిశకు వెళ్లియుంటిని కాని యీ యాత్రాభిలాష నన్ను మరల ఊఖీ మఠమును జేర్చెను. అటనున్న పర్వత కందరములలో నుండువారి స్థితిగతులను దెలిసి కొనవలయునను నా కాంక్షయే నన్నటకు గొంపోయెను. అందువలన నటజేరి, ఊఖీమఠము నీమాటు సావధానముగ జూచు నవకాశము కలిగినది. ఆడంబరయుక్తులైన పాషండులతో మఠము నిండి యుండెను.

ఈ మఠపు బెద్దమహంతు నన్ను దన శిష్యుడుగా జేసికొన సంకల్పించెను. అతడు తన మనోగతభావమును దృఢపఱచు కొనుటకు నా కెన్నియో ప్రలోభనములు కలిగించెను. 'మా గద్దీకి నిన్ను స్వామింజేయుదును. లక్షలాది సంపత్తి నీ యధీనము చేయుదును.' అని యేమేమో యాశలు కలిగింప యత్నించెను. నేను నిస్పృహతో ' నాకు ధనముమీద నాశయున్న నీ యీధన సంపదలకంటె నెక్కువయైన పైతృక సంపత్తి నేల విడిచి వత్తును.' అని సమాధానము చెప్పితిని. మఱియు నేయుద్దేశము కొఱకు నేనిల్లు విడిచి వచ్చితినో, సాంసారిక విషయసుఖములకు విముఖుడనైతినో, దాని కొఱకు నీవు యత్నించు చున్నట్లు కాని, దాని జ్ఞానము నీకున్నట్లు కాని కనిపింపదు. అట్టియెడ నేను నీదగ్గఱ నుండుట యెట్లు సంభవించును! అనియు నంటిని.

ఇది విని మహంతు నన్నిట్లడిగెను. "నీవు దెలియగోరు నుద్దేశమేమి? నీ వింతగా బరిశ్రమ చేయుచున్నదది యేమి?" నే నిట్లు సమాధానము చెప్పితిని. 'నేను సత్యమైన యోగవిద్యను, మోక్షము నభిలషించుచున్నాను. ఆమోక్ష మాత్మపవిత్రత, సత్యము, న్యాయాచరణము లేక లభింపదు. ఈ ప్రయోజనము సిద్ధింప నంతవఱకు నా దేశవాసులకు నేనుపకారము చేయుచుందును, ఇది మానవుని కర్తవ్యము.'

అది విని మహంతు " ఇది చాల మంచి విషయము. కొన్నాళ్ళు నీవు మా మఠములోనే యుండుము" అనెను. నేనందులకేమియు సమాధానము చెప్పలేదు. కారణమేమన నిక్కడ నాయుద్దేశమేమియు బూర్తికాదని బాగుగ దెలిసికొని యుంటిని. కావున మఱునాడే యటనుండి

జోశీమఠమునకు బయనమైతిని.

అక్కడ సంన్యాసాశ్రమములో జతుర్థశ్రేణికి జెందిన నిజమైన సాధువులు దాక్షిణాత్యులు, మహారాష్ట్రులు, నితర సంన్యాసులు నుండిరి. వారితో గొంతకాల మటనుంటిని. పలువురు యోగులు, మహంతులు, సంన్యాసులు సాధువులు మున్నగువారిని జూచు నవకాశము గలిగెను. వారితో సంలాప మొనర్చుటవలన యోగవిద్యకు సంబంధించిన బహువిషయములు నాకు దెలిసెను.

అటనుండి వేఱై నేను బదరీనారాయణమునకు మరల వెళ్ళితిని. అప్పుడామందిరమునకు ముఖ్య మహంతుగా, విద్వాంసుడైన 'రావల్ జీ' యుండెను. నేను వారి దగ్గఱ జాలదినముల వఱకు నుంటిని. మా యిరువురలో వేదముల విషయమునను, దర్శన విషయముల పైనను వాదవివాదము లెక్కువగా జరిగెను. అప్పుడు నేను " ఇప్పుడెవ్వరైనను మంచి విద్వాంసుడు సత్యమైన యోగియు నున్నారా!' అని వారి నడిగి తిని. ఈ పరిస్థితులలో నిట్టి యోగి యెవడును లేడు. అని నాతో ననుట కతడు చాల బాధపడెను. కాని యతడు అట్టియోగు లీమందిరమును దర్శించుటకు దఱచుగా వచ్చుచుందురు.అని చెప్పెను. అది విని 'సమస్త దేశములందును విశేషముగ బర్వతప్రాంతములందును నట్టి యోగులను మహాపురుషులను నన్వేషింపవలయును' అని నేను నిశ్చయించుకొంటిని.

ఒకదినము ప్రాతఃసూర్యోదయ మగుచుండ నా యాత్ర మరల సాగించితిని. పర్వతచర్యలలో భ్రమించుచు 'అలఖనందా' నదీ తటమున జేరితిని. ఆ నదిని దాటవలయునను గోరిక నామనస్సున నించుకంతయు లేకుండెను. ఏలయన నా నదికి రెండవవైపున 'మాంస' నామక గ్రామమును బెద్ద దానిని జూచి యుంటిని. అందువలన నింకను నా పర్వతము యొక్కయుపత్యకయందే గతియుంచి నదీ ప్రవాహమువెంట నరణ్యమార్గమున బోసాగితిని. పర్వతశిఖరములు, గుట్టలు, మార్గములు నన్నియు హిమవస్త్రాచ్ఛాదితములై యుండెను. ఘనహిమము వానిపై బడియుండెను. అందువలన 'అలఖనందా' నదీ స్రోతస్సు వఱకు జేరుటకు నేను మిక్కిలి కష్టములను సహింపవలసి వచ్చెను.

నే నక్కడ జేరినపుడు నన్ను సర్వధా యపరిచితునిగా నష్టజీవునిగా నెఱిగితిని. నాకు నలువైపుల నున్న పర్వత శిఖరములు తలలెత్తి నిలుచుండి యున్నవి. ముందుకు సాగుటకు మార్గము కనిపింపదు. కొంచెము సమయమునకు దరువాత మార్గమసలే కనబడకుండ బోయినది. ఆ మార్గమెక్కడ నున్నదో కూడ దెలియకుండ బోయినది. అప్పుడేమి చేయవలయును. అను చింతలో బడిపోయితిని.

చివరకు మార్గము నన్వేషించుటకై నదిని దాటుటకు నిశ్చయించితిని. నేను ధరించిన వస్త్రములు చాల సన్ననివి. ఎక్కువకూడ లేవు. చలి మిక్కిలిగా నుండెను. కొన్ని నిమిషములకు దరువాతనే చలి విపరీతమై సహింప శక్యము కాని దయ్యెను. ఆకలి దప్పికలు కూడ నన్ను మిక్కిలిగా బాధింపదొడగెను. నేనొక హిమఖండము దిని దానిని శాంతిపఱపనెంచితిని. కాని కొంచెమైనను శాంతికాని సంతుష్టికాని లభింపలేదు. అప్పుడే నేను నదిలో దిగి దాట మొదలిడితిని.

కొన్ని స్థానములలో నది గంభీరముగా లోతుగా నుండెను. కొన్ని చో... నీరు తక్కువగా నుండెను. కాని యర్ధగజముకంటె దక్కువలో తెక్కడను లేదు. వెడల్పు మాత్రమై దుగజములో నాలుగు గజములో యుండెను. నదియంతయు జిన్నచిన్న హిమఖండములతో దీక్ష్ణమైన కోణములు గలవానితో నిండి యుండెను. అవి నాపాదములను మిక్కిలిగా గాయపఱచెను. పాదములనుండి రక్తము కాఱజొచ్చెను. చలి వలన బాదములు తిమ్మిరెక్కి శూన్యము లయ్యెను. అందువలన గొంత తడవు వఱకు బెద్దగాయములు కూడ నాకు దెలియలేదు.

ఇక్కడ నున్న యతిశీతత వలన నాశరీరమున నచేతనత వ్యాపించుచున్నట్లైనది. ఇట్టి యచేత

నావస్థలో నా హిమముపై బడిపోవు స్థితియు నేర్పడినది. ఆస్థితిలో నేనక్కడ బడిపోయిన మరల లేచుట యసంభవమని నిశ్చయించితిని. అందువలన బ్రబల బ్రయత్నమొనర్చి చచ్చిచెడి నది రెండవయొడ్డున కెట్లో చేరితిని.

ఒడ్డున జేరిన కొంతసేపటివఱకు నాస్థితి జీవితునివలె గాక మృతుని వలె నుండెను. అయినను నేను నాశరీరము పైభాగము నగ్నముగానే యుంచితిని. నా దగ్గఱనున్న వస్త్రములన్నియు మోకాలి క్రింది భాగ మున పాదములపై జుట్టి యుంచితిని. నేను మిక్కిలి యసమర్థుడనై యటనుండి ముందు కొక్కయడుగైన వేయజాలని స్థితిలో నిలబడ వలసి వచ్చినది. ఇక్కడ నుండి ముందుకు నడుచుట కైదైన సాహాయ్యము లభించిన బాగుండు నని ప్రతీక్షింప సాగితిని. కాని యట సాహాయ్య మెటనుండి లభింప గలదు!

సాహాయ్యము నపేక్షించు చున్నానే కాని సర్వథా వివశుడనై యుంటిని. అక్కడ నెట్టి సాహాయ్యము లభించుట కవకాశము లేదని నాకు దెలియును. చివరకొకసారి నాలుగు వైపుల దృష్టి సారించితిని. నాకెదు రుగా నిరువురు పర్వతీయులు వచ్చుచుండుట జూచితిని. వారు నాసమీపమునకు వచ్చి కాశ-స్తంభముతో బ్రణామ మొనర్చి నన్ను వారి గృహమునకు రావలసినదిగా నడిగిరి. ' రండు మీకు దినుటకు నేమైన నీ గల' మనియు జెప్పిరి.

వారు నాకష్టములను, వృత్తాంతమును విని ' మేము నిన్ను 'సిద్ధపత్' నామక తీర్థస్థలమున జేర్చెద మనియు జెప్పిరి. కాని నేనిదియంతయు వారికి జెప్పుట మంచిదిగా దోపలేదు. అందువలన నేను వారి మాటల నంగీకరింపక "సజ్జనులార! నాకు జాల విచారముగా నున్నది. మీరు నాయెడ జూపిన దయను నేను స్వీకరింపజాలకున్నాను. ఏలయన నాలో గదలుటకు గూడ గొంచెమైనను శక్తి లేదు"అంటిని. అయి నను వారు నన్నెంతో బలవంతపెట్టి తమవెంట రమ్మని యెంతగానో పట్టుబట్టిరి. నేను మాత్రము కదలక మెదలక సాహసింపజాలక పోయితిని. నేనిక్కడనుండి కదల బ్రయత్నించుటకు మాఱు చచ్చి పోవుట నాకు శ్రేయస్కర మనిపించు చున్నదని వారితో నంటిని. ఈ మాటలు చెప్పి వారి వచనముల వంక ధ్యాన ముంచనైతిని. వారి మాటలు మరల నేను వినలేదు.

' నేనిక్కడనుండి తిరిగి వెళ్ళి నాపాఠమును స్థిరపఱచుకొనిన నెంత బాగుండును' అనునాలోచనము మనస్సున రాదొడగెను. ఇంతలో వారు వెళ్ళిపోయిరి. కొన్ని నిమిషములలోనే వారాపర్వతములలో గనపడకుండ బోయిరి. అక్కడ గొంత తడవైన పిదప నాకు గొంత శాంతి లభింపగా ముందుకు నడచితిని. అట్లు పోయి ప్రసిద్ధ యాత్రాస్థలమైన 'వసుధార'కు వెళ్లి యట గొంత విశ్రాంతి తీసికొని, మంగ్రామ - మానాగ్రామ సమీపప్రదేశములను జూచుకొనుచు నా సాయంకాలముననకే బదరీనారాయణ చేరుకొంటిని.

దినమంతయు నేను గనబడనందున నాందోళన పడుచున్న రావుల్ జీ, వారి సహచరులు విస్మ యము వెల్లడించుచు " నేడు దినమంతయు నెక్కడ నుంటిరి" అని ప్రశ్నించిరి. అప్పుడు జరిగిన దంతయు గ్రమబద్ధముగా వారికి నేను వినిపించితి. ఆరాత్రి కొంచెమాహారము తీసికొని, దానివలన మరల నాలో శక్తి తిరిగి వచ్చుచున్నట్లు తోచగా నిద్రించితిని. మఱుదినమున త్వరగానే లేచి ముందుకు సాగి పోవు టకు రావుల్ జీనుండి యాజ్ఞ తీసికొంటిని. యాత్రనుండి తిరిగివచ్చుచు, రామపురము వైపు వెళ్ళుచు సాయంకాలమునకు నొకయోగియింటికి జేరితిని. అతడు మిక్కిలి తపస్వి. ఆరాత్రి యతని యింటనే గడపితిని. అతడు జీవించియున్న ఋషి. సాధువులలో నుచ్చకోటికి జెందిన ఋషిగా గౌరవింపబడు చుండెడివాడు, ధార్మికవిషయములపై జాలకాలమువఱకు మాయిరువురి మధ్య వార్తాలాపము జరిగెను.

నా సంకల్పమును బూర్వముకంటె నధికముగా దృఢము చేసికొని మఱుదినము ప్రాతఃకాలము

నిద్రనుండి లేవగానే ముందుకు యాత్రసాగించితిని. ఎన్నియో యడవుల మధ్య పర్వతములను దాటుచు 'చిల్కా ఖాటీ'(పర్వతపంక్తి) నుండి దిగి నేను జివరకు రామపురము చేరుకొంటిని. రామపురమున ప్రసిద్ధుడైన 'రామగిరి' స్థానమున నివాస మేర్పఱచుకొంటిని. ఈ 'రామగిరి' పవిత్రాచరణము-ఆధ్యాత్మిక జీవనము కారణముగ నతి ప్రసిద్ధుడై యుండెను. నేనతనిని విచిత్ర ప్రకృతిగల వ్యక్తిగా గుర్తించితిని. అతడు రాత్రులందు నిద్రపోడు. రాత్రంతయు నుచ్చస్వరముతో మాటలాడుచు గడపుచుండెడివాడు.

అతడు ప్రకటముగా దనతోనే తాను మాటలాడుచున్నట్లు తెలియుచుండెడిది. తఱచుగా నతడు నుచ్చస్వరముతో నఱచుచుండగా వింటిమి. మఱియు ననేక పర్యాయము లేడ్చుచు, గేకలు పెట్టగా గూడ వింటిమి. వాస్తవమేమో దెలియగోరి లేచిచూడ, నతని గదిలో నెవ్వరు నుండెడివారు కారు. ఇట్టి వార్తవలన నే నత్యంతము విస్మితుడనైతిని.

నేనతని శిష్యకోటి నడుగగా బాపము వారేమి చెప్పగలరు! 'వారి ప్రకృతియే యట్టిది' యనెడివారు. ఇందలి రహస్యమేమో యెవరును జెప్పజాలక పోయిరి.

చివరకు నేనాసాధువుతో నేకాంతమున ననేక పర్యాయములు చర్చింపగా నది యేమో నాకు దెలిసినది. అతడాచరించునది పూర్ణయోగ విద్యకు ఫలము కాదు. ఆతని యోగ విద్యలో న్యూనత యెంతో యున్నది. అతడాచరించునది నేను గోరినది కాదు. నే నెఱుగగోరిన యోగవిద్య యది కానేకాదు. అతనికి యోగమున గొంచెము ప్రవేశమున్నదే కాని యతడు పూర్ణయోగి కాడు.

అటనుండి బయలుదేరి నేను కాశీపురము వెళ్లితిని. అక్కడనుండి ద్రోణసాగరము వెళ్లి యట శరదృతువంతయు గడపితిని.

హిమాలయము వెళ్లి దేహత్యాగము చేయవలయునను నిచ్ఛకలిగెను. కాని, మరల జ్ఞానప్రాప్తి కలిగిన మీదట దేహత్యాగము చేయుట యయుక్తమని మనస్సున దోచెను. అందువలన నటనుండి బయలుదేరి మురాదాబాద్ మీదుగా సంబల్ చేరుకొంటిని. అక్కడ నుండి గఢముక్తేశ్వరము మీదుగా మరల గంగాతట ప్రాంతమును జేరితిని.

ఆ సమయమున నాదగ్గఱ నితరధార్మిక గ్రంథములతోబాటు, శివసంధ్యా, హఠప్రదీపిక, యోగబీజము, కేశరాణి సంగీత(?). అను గ్రంథములుండెడివి. యాత్రలో దఱచు నేనాపుస్తకములనే చదువుచుండెడివాడ. వానిలో ననేకపుస్తకముల విషయము నాడీచక్రమునకు సంబంధించి యుండెడిది. వానిలో నీవిషయమునుగూర్చి మిక్కిలి దీర్ఘమైన వివరణముండెను. మనుజుడు చదివి చదివి యలసి పోయెడివాడు. నేను మాత్రము వానిని నాబుద్ధిలో బూర్ణముగా నెన్నడు జేర్పలేక పోయితిని. ఇంతేకాక వానిని దెలిసికొని స్మరించుటయు నాకు శక్యము కాదయ్యె. అందువలన నివి సత్యమో కాదో యనియు నాకు సందేహము కలిగెను. ఆ సందేహము నన్ను విడువలేదు. దానిని దీర్చుకొన బ్రయత్నముకూడ జేయుచునేయుంటిని. సందేహము దూరము కాలేదు. దూర మొనర్చుటకు దగిన యవసరము లభింపలేదు.

ఒకదినమున నొక శవము నదిలో గొట్టుకొని పోవుచు గనబడెను. ఉపర్యుక్త పుస్తకముల విషయమున నామనస్సులో బహుకాలముగా నిల్లుగట్టుకొనియున్న సందేహములను దూరము జేసికొని పుస్తకములలో వ్రాసిన విషయములను సత్యాసత్యమును నిర్ణయించుకొననిది యవసరమని యాశవపరీక్ష జేయ నిశ్చయించుకొంటిని. అందువలన నాసమీపమున నున్న పుస్తకముల నొకచోనుంచి వస్త్రములను బైకెగబట్టి నది యందు బ్రవేశించి శవమును బయటికి దీసికొని వచ్చి తీరమున నుంచితిని.

నేను పదునైన చాకు నొకదానిని దీసికొని యాశవమును, వీలునుబట్టి యథారీతిని

గోయనారంభించితిని. హృదయమును దానినుండి వెలికిదీసి ధ్యానముతో బరీక్షించితిని. పుస్తకలిఖిత వర్ణనములు దానితో బోల్చిచూచితిని. ఇట్లే శిరస్సు కంఠమునకు సంబంధించిన యంగములను గోసి చూచితిని. ఇట్లన్నియు జూచి పుస్తకములకు వాస్తవమునకు సంబంధమేమియు గనిపింపనందున నాపుస్త కములన్నియు జించి గంగలో బాఱవైచితిని. నాటినుండియే, వేదములు, ఉపనిషత్తులు, పాతంజలయోగ శాస్త్రము, సాంఖ్యశాస్త్రము తప్ప జ్ఞానవిజ్ఞాన విషయములపై వ్రాయబడిన పుస్తకములు, యోగవిద్యమీద వ్రాయబడినవియు మిథ్యలనియు నశుద్ధము లనియు గ్రమముగా నిశ్చయించితిని.

ఇట్లే కొన్నిదినములు గంగాతీర ప్రాంతమున దిరుగుచు ఫర్రూఖాబాదు చేరితిని. శృంగీరామ పురమునుండి ఛావనీకి బూర్వదిశయందు గల రోడ్డున కాన్పూరు వెళ్ళవలసి యుండెను. అప్పటికి వి.సం.౧౯౦౨ సమాప్త మయినది.

వి.సం.౧౯౦౩వ సంవత్సరమున మొదటి యైదు మాసములలో కాన్పూరు ప్రయాగల మధ్యలో నున్న యనేక ప్రసిద్ధ స్థానములను జూచితిని. భాద్రపద మాసపు బ్రారంభమున మిర్జాపురము చేరితిని. అక్కడ వింధ్యాచల అశోలజీ మందిరమున నొకమాసము కంటె నెక్కువ దినములు నివాసము చేసితిని. ఆశ్వయుజ మాసారంభమున గాశీ చేరితిని. అక్కడ వరుణా, గంగా నదుల సంగమము సమీపమున నున్న యొక గుహలో నుంటిని. ఆ గుహ యప్పుడు భవానంద సరస్వతి యధికారమున నుండెను. అక్కడ కాకారామ్, రాజారామ్ మొదలగు శాస్త్రులతో నాకు బరిచయము కలిగెను. కాని యట గేవలము పన్రెండు దినములే యుంటిని. అనంతరము నేను దేని యన్వేషణమున నుంటినో దాని కొఱకు ముందుకు వెళ్ళ నారంభించితిని. వి.సం.౧౯౦౩ ఆశ్వయుజ శుద్ధ విదియనాడు చండాల్ గఢమున నున్న దుర్గాకుండ మందిరమును జేరితిని. అక్కడ పది దినములు గడపి వరియన్నము తినుట బొత్తిగా మానివేసితిని. కేవలము పాలు త్రాగి జీవన నిర్వాహము చేసి కొనుచు రాత్రింబవళ్ళు యోగవిద్య నభ్యసించుటలోను, సాధన చేయుటలోను దత్పరుడనై యుంటిని. దుర్భాగ్యవశమున నట నాకు భంగు త్రాగు నలవాటు కలిగెను. అనేక పర్యాయములు దాని ప్రభావమువలన సర్వథా యేమియు దెలియక పడియుండెడివాడను.

ఒకదినమున మందిరము నుండి బయలుదేరి చండాల్ గఢ్ సమీపమున నున్న యొక గ్రామమునకు వెళ్ళుచుండగా నొక ప్రాత సహచరుడు కలిసెను. ఆ గ్రామమునకు రెండవవైపున గొంచెము దూరములో నున్న యొకశివాలయమునకు వెళ్ళి యట నారాత్రి గడపితిని. ఆ రాత్రి సమయమున భంగువలన గలిగిన మాదకత వలననే నచేతనుడనై పడియున్నపుడు నిద్రలో నొక స్వప్నమును గాంచితిని. అది యిట్లుండెను. నాస్వప్నములో నేను మహాదేవుని నతని పత్నియైన పార్వతిని జూచితిని.వారు పరస్పరము మాట్లాడుకొను చుండిరి. వారి వార్తాలాపమునకు విషయము నేనే యైయుంటిని. అనగా నన్ను గూర్చియే వారిట్లు మాట్లాడు కొనుచుండిరి. పార్వతి మహాదేవునితో " ఈ దయానంద సరస్వతికి వివాహమైన నుత్తమముగా నుండును" అని యనెను. కాని, మహాదేవుడామె చెప్పిన దానికి భిన్నాభిప్రాయమును బ్రకటించు చుండెను. మఱియు వారి సంకేతము భంగునకు సంబంధించినదిగా నుండెను." నేను నిద్రనుండి మేలుకొంటిని. స్వప్నవిషయము నాలోచింపదొడగితిని. అప్పుడు నాకెంతో దుఃఖము క్లేశమును గలిగెను. ఆ సమయమున గుంభ వృష్టి కురియు చుండెను. మందిర ముఖ్య ద్వారమున కెదురుగానున్న వరండాలో నేను విశ్రమించి యుంటిని. అక్కడ వృషభదేవతకు సంబంధించిన విశాలమైన నందిమూర్తి యుండెను. నా వస్త్రములను బుస్తకములను దాని వీపు మీద బెట్టి దానికి వెనుకవైపున గూర్చుండి నా నిజవిషయము నాలోచించుటలో నిమగ్నుడనై యుంటిని.

ఆ నందిమూర్తి లోపలి భాగముపై నా దృష్టిపడగా నందొక మనుష్యుడు దాగి యుండినట్లు నాకు

ుతమయ్యెను. నేను నాచేతి నతని వైపునకు జూపగా నతడెంతో భయభీతుడయ్యెను. అతడు దానినుండి యటికి దూకి గ్రామము వైపునకు బాఱిపోయెను. అతడు పోయిన తరువాత నేనామూర్తి లోపల ూర్చుండి మిగిలినరాత్రి నిద్ర పోవుచు గడపితిని.

ప్రాతఃకాలమున నొక వృద్ధ స్త్రీ యటకు వచ్చి, నే నామూర్తి లోపల గూర్చుండి యున్నపుడే యామె దానిని బూజించెను. కొంతతడవైన పిదప నామె కొంత బెల్లము పెరుగు తీసికొని తిరిగి వచ్చి నన్ను ూజించి భ్రాంతి వశమున నన్ను దేవతగా నెంచి "మీరు దీనిని గ్రహించుడు. ఇందులో గొంచెమైనను మీరు నుడని " ప్రార్థించెను. నేను క్షుధార్తుడనై యుండుటచేత దాని నంతటిని దినివేసితిని. పెరుగు మిక్కిలి ల్లిగా నుండుట వలన భంగు మాదకతను దూరము చేయుటలో నిదానమైనది. అందువలన మాదకత ొలగిపోయెను. నాకెంతో సుఖము కలిగినది.

వి.సం.౧౯౧౪ చైత్రమాసమున నటనుండి నర్మదానది పుట్టిన పర్వతముల వైపుకు బయ ంచితిని. దారిలో నెవరిని నొక్కమారైనను మార్గమును గూర్చి యడుగనైతిని. దక్షిణ దిశకు యాత్ర ేయుచు వెళ్ళితిని. శీఘ్రముగానే నే నొక పాడుపడిన నిర్జన ప్రదేశమున జేరితిని. దానికి నలువైపుల ుక్కిలి దట్టమైన యరణ్యము వ్యాపించి యుండెను.

ఆ యరణ్యమున గొంత దూరమున గ్రమము లేకుండ వ్యాపించి యున్న కొన్ని పొదల మధ్య స్థానములలో మలినములై పాడువడి యున్న గుడిసె లుండెను. అక్కడక్కడ వేఱువేఱుగా గొన్ని గుడి సెలు దృష్టి గోచర మయ్యెను. అందులో నొక గుడిసె దగ్గఱ నేను గొంచెము పాలు ద్రావి ముందుకు ాగిపోయితిని. కాని యాస్థానమున కొక క్రోసుదూరము వెళ్ళి మరల నట్టి స్థానముననే చేరితిని. అక్కడ ప్రసిద్ధ మార్గమేదియు గనబడలేదు. చిన్న చిన్న మార్గము లెన్నో యిటునటు వ్యాపించి యుండెను. అవి యెక్కడికి బోవునో నాకు దెలియదు. కాని వానిలో నేదో యొక మార్గము నెన్నుకొని యావైపునకు ెళ్ళవలయు ననుకొనుట కంటె గత్యంతరము లేదు. అట్లొక మార్గమున గొంత దూరము వెళ్ళగా శీఘ్రముగానే నేనొక నిర్జనారణ్యమున బ్రవేశించితిని.

ఆ యరణ్యమున రేగుచెట్లెక్కువగా నుండెను. గడ్డి యెత్తుగా బెరిగి యొత్తుగా నుండుటచే మార్గము దృష్టిగోచరము కాకుండెను. ఇంతలో నక్కడ నొక యెలుగు బంటి యెదురయ్యెను. ఆ జంతువు మిక్కిలి వేగముతో వచ్చి పెద్దగా నఱచి తన వెనుక కాళ్ళమీద నిలబడి నన్ను దినుటకు నోరు తెఱచి నా వైపునకు బరుగిడెను. కొన్ని క్షణములు నేను నిష్క్రియుడనై స్తబ్ధునివలె నిలిచి యుంటిని. తదు పరి నెమ్మదిగా నా చేతిలో నున్న దండమును బైకెత్తితిని. దానితో నది భయపడి వెనుకకు దిరిగి పాఱి పోయెను. ఉఱుమువలె భయంకరముగ నున్న దాని యఱపు విని కొందఱు గ్రామవాసులు చేతులతో గఱ్ఱలు పట్టుకొని వేటకుక్కలతో బాటు నేనున్న చోటికి బరుగిడి వచ్చిరి. తరువాత వారు నన్ను దమ వెంట రమ్మని యెంతగానో బలవంత పెట్టిరి.

"ఈయరణ్యమున గొంచెము దూరమైనను ముందుకు వెళ్ళుదురేని యనేక సంకటముల నెదు ర్కొన వలసిన వారగుదురు. ఈ పర్వతము నందును, నీ యరణ్యము నందును భయంకరములైన క్రూర హింసక జంతువు లెన్నో యున్నవి. ఎలుగుబంట్లు, నేనుగులు మున్నగునవి మీకెదురగును" అని వారు నాతో నెంతగానో చెప్పిరి. నేను వారితో " మీరు నా యోగక్షేమములను గూర్చి భయపడ వలదు. నేను సురక్షితుడనై యున్నాను" అని వారికి జెప్పితిని. నేనేవిధముగ నైనను నర్మదానది యుద్గమ స్థానమును జూచితీఱవలయునని మనస్సులో నిర్ణయించుకొంటిని. అందువలన నే సంకటమును, నే భయమును, నా సంకల్పమునుండి నన్ను దొలగింప జాలవు. వారు చెప్పిన భయంకర విషయములు వినియు, నేనెటు

వంటి భయమునకు గుఱి కాకుండుటయు, నా సంకల్పమున దృఢముగా నుండుటయు జూచి నా చేతి కొక దండము నిచ్చిరి. అది నాయొద్ద నున్నదానికంటె బెద్దది. దానితో నేను రక్షించుకొనవలయునని వార భిప్రాయపడిరి. కాని నేనాదండము నటనే పాఱవైచితిని.

ఆరోజు నేను జీకటి పడువఱకు యాత్రచేయుచునే యుంటిని. గంటలకొలది పయనించినను మానవ నివాస స్థానపు జిహ్నము లేవియు నాకు లభింపవయ్యె. ఏ దిశలో నెంత దూరము చూచినను గ్రామ మెక్కడను గనిపించదు. ఒక్కగుడిసె యైనను దృష్టిగోచరము కాలేదు. ఎక్కడను నొక్క మనుష్యుడును గనిపింపలేదు. నామార్గమున నెక్కడ జూచినను జెట్లు, పొదలు తప్ప మఱియొండేదియు లేదు. చాల వృక్ష ములు విఱిగి పడియుండెను. మదపుటేనుగులు వానిని వ్రేళ్లతో బడగొట్టినట్లు కనబడుచుండెను.

దీని కెదురుగా ముందు వికటమై విశాలమై, దట్టమైన యరణ్యము నాకు గనిపించెను. అందు బ్రవే శించుట మిక్కిలి కఠినము. ముండ్లచెట్లు రేగుచెట్లు నెంతయో దగ్గఱ దగ్గఱగా గుమికూడి యుండెను వాని మధ్యగా వెళ్లుట దుస్తరమే కాదు, అసంభవము కూడ. మొదట వానిలో దూఱిపోవుట యసంభవ మని తోచెను. కాని బోర్లగా బండుకొని, పొట్టతో మోకాళ్ళతో చేతులతో బందాడుచు సర్పమువలె నా వృక్షము లలో దూఱిపోయి యెట్లో యతికష్టము మీద విజయము సాధించితిని. ఈ దిగ్విజయమును సాధించు టకు నేను నా వస్త్రములను బలిచేయవలసి వచ్చెను. ముండ్లలో జిక్కువడి వస్త్రము లన్నియు జిరిగి పీలికలు పీలికలయ్యెను. ఇంతేకాదు, నా శరీర మాంసముకూడ వనదేవతలకు నైవేద్యము చేయవలసి వచ్చినదనిన నతిశయోక్తి కాదు. ఇట్లు గాయములయిన శరీరాంగములతో సగము చచ్చియెట్లో బైట బడితిని.

అప్పటికి నలువైపుల నంధకారము వ్యాపింపనారంభించెను. చీకటి తప్ప మఱియొండు గోచరము కాదయ్యె. మార్గము లేకున్నను, గనబడకున్నను నేను ముందుకు బోవలయునను విచారమును విడువ నైతిని. ఏదోయొక మార్గమెక్కడనో దొరకక పోవునా యను నాశలోనుంటిని.

చివరకు నేనొక భయానక స్థానమున జేరితిని. అట నలువైపుల బెద్ద పెద్ద గండ శిలలు పర్వత శిఖ రములు తప్ప మఱియొకటి లేదు. ఓషధులు వనస్పతులు దట్టముగా నలముకొని యుండెను. కాని యట మనుష్యావాస చిహ్నములు సంకేతములు లభింప నారంభించెను.

వెంటనే కొన్నిగుడిసెలు, కుటీరములు సమీపమున గనవయ్యెను. వానికి జొట్టుపట్ల బిడుకల గుట్టలు కనిపించెను. వాని సమీపమున స్వచ్ఛజలము ప్రవహించుచున్న చిన్ననదియు నొకటి గనవచ్చెను. గుడిసెలలో నుండి ఖండిత కుటీరముల మధ్యనుండియు మినుకు మినుకు మను దీపపుగాంతులు కొన్ని కాన వచ్చుచుండెను. అవి దారిని బోవు పథికులను స్వాగతము చేయుచున్నవా యనిపించెను.

నేనక్కడ నొక విశాల వృక్షముక్రింద నున్న యొక గుడిసెకు సమీపమున రాత్రి నయింపదలచితిని. నదిలో గాయపడిన నా హస్తపాదములను, దండమును గడిగి సంధ్యోపాసన చేయు నిమిత్త మొకచో గూర్చుండ బోవుచున్నంతలో నొక యడవి జంతువు గర్జనము నాచెవిని బడెను. అది యొక 'టమ్ టమ్' యొక్క పెద్దయఱపై యుండెను.

కొన్ని క్షణముల తరువాత నొక జనసమూహము వచ్చుచు గనబడెను. ఆ సమూహమున స్త్రీలు, పురుషులు, పిల్లలు కూడ నుండిరి. వారి వెనుక నావులు, గొఱ్ఱెలు కూడ జాల యుండెను. వారొక గుడిసె నుండి బయలుదేరిరి. వారేదో యొకధార్మికోత్సవమున బాల్గొనవచ్చిరని తోచెను. ఆ యుత్సవ మా రాత్రి జరిగి యుండనోపు ననియు నూహించితిని.

వారు నావంకకు జూచి, నేనాస్థానమునకు గ్రొత్తవాడనని యెంచి పెక్కురు నాచుట్టు గుమికూడిరి.

చివర కొక వృద్ధుడు ముందుకు వచ్చి నాతో నిట్లనెను. "మీరెక్కడనుండి వచ్చితిరి." 'నేను గాశీనుండి వచ్చితిని. ఇప్పుడు నేను నర్మదానదీ స్రోతస్సును గను గొనుటకు వెళ్ళుచున్నాను,' అని చెప్పగా విని వెళ్ళి పోయిరి. నేను సంధ్యోపాసనలో నిమగ్నుడ నైతిని.

వారు వెళ్లిన తదుపరి వారి యధ్యక్షుడిరువురు పర్వతీయ పురుషులను వెంట నిడుకొని నా దగ్గఱకు వచ్చి యొక ప్రక్కన గూర్చుండెను.

అతడు వచ్చివెళ్ళినవారి ప్రతినిధిగా నా కడకు వచ్చి నన్ను వారి గుడిసెలకు నాహ్వానించెను. కాని నేను బూర్వము వలెనే వారి నిమంత్రణము నంగీకరింప నైతిని. కారణమేమన వారు మూర్తి పూజకులు. అప్పుడతడు తన వెంట వచ్చిన యిద్దఱిని సమీపమున నగ్ని ప్రజ్వలింప జేయుటకాదేశ మిచ్చి రాత్రి యంతయు నారక్షణము కొఱకు వారి నట నియోగించి వెళ్ళెను.

అతడు వెళ్లుచు నా భోజన విషయమై ప్రశ్నింపగా 'నేను భోజనము చేయను. పాలతో నిర్వాహము చేయుచున్నాన'నగా నతడు నా తుంబానడిగి తీసికొని వెళ్ళి దానినిండ బాలను నింపి పంపెను. అందు గొన్ని పాలు త్రాగి పడుకొంటిని. పరిశ్రమము కారణముగా గాఢనిద్రలో రాత్రియంతయు గడచి పోయి నది. తెల్లవారి సూర్యోదయమైన తదుపరి గాని నిద్రనుండి మేలుకొన జాలకపోయితిని. తదుపరి కాలకృత్య ములు తీర్చుకొని సంధ్యోపాసన చేసికొని మరల బయనమునకు సిద్ధమైతిని.

ఇట్లే మూడు సంవత్సరముల కాలము నర్మదాతట ప్రదేశములలో దిరుగాడుచు గాలము నయించి తిని. పలువురు మహాత్ములతో సత్సంగము చేసితిని. చివరకు నర్మదాస్రోతస్సునుండి తిరిగి విద్యాభ్యాసము కొఱకు మధుర చేరుకొంటిని.

(వి.సం.౧౯౧౭-౧౮) సంవత్సరములలో నొక సంన్యాసి సత్పురుషుడు గురువుగా లభించెను.

అతడు పేరునకు 'విరజానందస్వామి. వారు మొదట 'అల్వరు'లో నుండిరి. వారి వయస్సు నాడె నుబది యొక్క (౮౧) సంవత్సరములు. వారికి వేదములందును, నార్షగ్రంథములందును మిక్కిలి రుచి యుండెడిది. నేత్రవిహీనులై యుండిరి. వారి యుదరమున నెల్లపుడు నుదరశూల యుండెడిది. ఆధునిక వ్యాకరణ గ్రంథములైన కౌముదీ, శేఖరము మున్నగు గ్రంథములనిన వారికి మిక్కిలి యశ్రద్ధ. భాగవతాది పురాణ గ్రంథములను వారు మిక్కిలిగా దిరస్కరించెడివారు. సమస్తములగు నార్ష గ్రంథములపై వారికి మిక్కిలి భక్తి యుండెడిది. వారితో బరిచయము కలిగిన మీదట మూడు సంవత్సరములలో వ్యాకరణ శాస్త్రము పూర్తిగా జదువవచ్చునని తెలిసి, వారి దగ్గఱ వ్యాకరణము జదువ నారంభించితిని.

మధురలో 'అమరలాల్' నామముగల భద్ర పురుషుడొకడుండెను. వారు నాకు మధురలో విద్యాధ్య యన కాలమున జేసిన యుపకారమును నేనెన్నడు మఱవను. పుస్తకములు, భోజనవసతులు నన్నియు నత్యుత్తమ రీతితో నతడు నాకు గల్గించెను. స్వయముగా నతడెటకైన భోజనమునకు వెళ్ళవలసి వచ్చిన నింటియందు ముందు నాకు భోజనము సిద్ధము చేయించి నేను భుజించిన తదుపరియే యతడు భోజనమునకు వెళ్ళుచుండెడివాడు. అతడిట్లు చాల యుదారచరితుడై యుండెను. నేను మధురలో వి.సం.౧౯౧౯వఱకు నుంటిని. (వి.సం.౧౯౨౦-౨౧.) విద్యాధ్యయనము సమాప్తమైన పిమ్మటను రెండు సంవత్సరములు మధురలోనే యుంటిని. అప్పుడు పత్రముల మూలమునను, స్వయముగా వారిని దర్శించియు శంకా సమాధానములు చేసికొనుచుండెడివాడను. అటనుండి గ్వాలియర్ వెళ్లితిని. వైష్ణవమతమును గొంచెము ఖండన చేయనారంభించితిని. అక్కడను దొరకిన పుస్తకములను జదివి విచా రించు చుండెడివాడ. అటనుండియు స్వామికి బత్రములు వ్రాయుచుంటిని. గ్వాలియర్‌లో మాధవ-అనుత్తమాచార్యుడను పేరుగల యొక పండితుడుండెను. అతడు లేఖకుని రూపమున వాదములను

వినుటకు వచ్చి కూర్చుండెడివాడు. ఏదేని యొక దినమున నెటనేని యొకయశుద్ధ శబ్దము నాముఖము నుండి వెలువడిన వెంటనే యతడు పట్టుకొని యడుగుచుండెడివాడు. అనేక పర్యాయము లతనిని 'నీవెవ రవని యడిగితిని' అతడు 'నేనొక సాధారణ కర్ణ లిపికరుడన' ని చెప్పుచుండెడివాడు. వినివిని పరిచితు డనైతి ననియు జెప్పెడివాడు.

ఒకదినమున వైష్ణవులు పెట్టుకొను నిలువుబొట్టుమీద వార్తాలాపము జరుగుచుండెను. అప్పుడు ఒక నిలువురేఖ పెట్టుకొనిన వైకుంఠము దొరకిన ముఖమంతయు రేఖలతో నింపిన వైకుంఠము కంటె నెక్కుడు స్థానము దొరకవచ్చుగదా అంటిని. ఆ మాటలు విని యతనికి మిక్కిలి కోపము వచ్చెను. అతడు లేచి వెడలిపోయెను. అప్పుడు నేనతనిని గూర్చి విచారింపగా నతడు 'అనుత్తమాచార్యుడు' అని తెలి సెను.

గ్వాలియర్ నుండి నేను కరౌలీ వెళ్ళితిని. అట నొక కబీరు పంథి లభించెను. అతడు 'ఏకవీర్' అను పదమునకు 'ఈ కబీర్' అనియనువాదము చేసెను. నాదగ్గఱ 'ఏకవీరోపనిషత్తు' ఉన్నదని చెప్పెను. నేనట నుండి జయపురమునకు వెళ్లితిని. అట హరిశ్చంద్రుడను నామముగల యొక విద్వాంసుడుండెను. అక్కడ నేను వైష్ణవ మతమును ఖండించి శైవమతమును స్థాపించితిని. జయపురనరేశు డగుమహారాజా రాయ సింహుడు వైష్ణవమతమును విడిచి శైవమతమును గ్రహించెను. అందువలన శైవమత మెంతో విస్తార మయ్యెను. నేను నాచేతులతో వేలాది రుద్రాక్షమాలలు జనుల కిచ్చితిని. అక్కడ శైవమత మెంతగా వర్ధిల్లి నదన గుఱ్ఱములయు నేనుగులయు మెడలలోగూడ రుద్రాక్షమాలలు ధరియింపజేయ సాగిరి.

జయపురమునుండి నేను బుష్కరమునకు, నటనుండి 'అజమీర్'కు వెళ్ళితిని. అజమీర్‌లో శైవమత ఖండనము కూడ ప్రారంభించితిని. ఆ సమయమున జయపుర మహారాజు జాట్ మహా దయునితో గలిసికొన వా రాగ్రా వెళ్ళనుండిరి. బృందావనములో రంగాచార్యుడను పేరుగల యొక పండితుడుండెను. అతనితో శాస్త్రార్థము జరుపవలయునని యెంచి, రాజా రామసింహుడు నన్ను బిలువ నంపెను. నేను జయపురము వెళ్లితిని. అప్పుడు శైవమతమునుగూడ ఖండనము చేయుచున్నానని తెలిసి కొని యతడప్రసన్నుడయ్యెను. నేను జయపురమునుండి వెళ్లితిని. మరల మథురకు వచ్చి స్వామి దగ్గఱ శంకలకు సమాధానములను బొందితిని. అటనుండి హరిద్వారము వెళ్లితిని. 'పాఖండమర్దనము' అనియొక జండా గుడ్డమీద వ్రాయించి యాజండాను నాకుటీరముపై నెత్తించి యుంచితిని. అక్కడ వాద వివాదము లెక్కువగా జరిగినవి. మరల నామనస్సున "సమస్త సంసారముతో ననగా నెల్లరతో విరోధము పెట్టుకొని నేమిప్రయోజనము. గృహస్థులవలె నీపుస్తక సామగ్రిని వెంటబెట్టుకొని తిరుగుటవలన నేమి ప్రయో జనము" అను నాలోచన రాదొడగెను. అందువలన సర్వత్యాగముచేసి కేవలము కౌపీనము మాత్రము ధరించి మౌనవ్రతము బూనితిని.

నాటినుండియు శరీరముపై భస్మధారణము చేయ నారంభించితిని. తదుపరి (వి.సం.౧౯౩౦) బొంబాయి వచ్చువఱకు భస్మధారణము జేయుచునే యుంటిని. రైలుబండి మీద కూర్చుండ నారంభించి నప్పటినుండి మరల వస్త్రధారణము జేయనారంభించితిని. హరిద్వారమున నేనారంభించిన మౌనధారణ వ్రత మెక్కువకాలము నడవలేదు. కారణమేమన నన్ను జాలమంది కవ్వించెడివారు! ఒక దినమున నాకుటీ రము దగ్గఱకు వచ్చి యొక మనుష్యుడు "నిగమ కల్పతరో ర్గలితం ఫలమ్" అనగా భాగవతము కంటె వేదములు తక్కువ అని యేమో యనసాగెను. అది నేను సహింపజాలక మౌనవ్రతము వదలి మరల భాగవతఖండనము జేయనారంభించితిని.

(వి.సం.౧౯౨౫) ఇంకొక మాటు 'ఈశ్వరుని కృపవలన నాకు గలిగిన జ్ఞానమును మనుష్యుల

కందఱకు బంచవలయును' అని సంకల్పించి 'ఫర్రుఖాబాద్' వచ్చితిని. అటనుండి రామగఢ్ వెళ్ళితిని. అట వివాదములు ప్రారంభించితిని. అక్కడ ముగ్గురు నల్గురు శాస్త్రిలొకే మాటు మాటలాడదొడగిన నేను దానిని గోలాహల మనెడివాడను. అందువలన నప్పటినుండి జనులు కోలాహలస్వామి యన నారంభించిరి. అక్కడ జక్రాంకితులు పదిమంది యొకసారి నన్ను గొట్టవచ్చిరి. కాని వారి వలన గలుగు పెద్ద సంకటమునుండి తప్పుకొంటిని.

ఫర్రుఖాబాద్ నుండి కాన్‌పూర్ వచ్చితిని. అటనుండి ప్రయాగ వెళ్ళితిని. ప్రయాగలోను జనులు నన్ను గొట్టవచ్చిరి. మాధవ ప్రసాద్ నామక భద్ర పురుషు డొకడు నన్ను వారిబారినుండి తప్పించెను. ఈ మాధవప్రసా దొక గృహస్థుడు. క్రైస్తవ మతము స్వీకరింప నుండెను. అతడు పండితులకందఱకు విజ్ఞాపనము పంపెను. అదియేమియన "మూడు మాసముల సమయములో 'నార్యధర్మము' నందు నాకు సంతుష్టిని గలిగింపుడు. లేకున్న నేను 'గ్రైస్తవ మతమును' స్వీకరింప నున్నాను. నేనతని కార్యధర్మమున సంతుష్టిని గలిగించితిని. అతడు క్రిష్టియన్‌గా మాఱలేదు.

(వి.సం.౧౯౨౬) ప్రయాగనుండి నే నాగ్రాకు వచ్చితిని. అక్కడ రామనగర రాజు చెప్పిన మీదట కాశీస్థల పండితులతో శాస్త్రార్థము జేయుటకు సిద్ధపడితిని. 'ప్రతిమా' శబ్దము వేదములం దున్నదాలేదా? అను విషయము మీద శాస్త్రార్థము జరిగెను. ప్రతిమా శబ్దము వేదమున నున్నది. కాని, యది 'కొలత' యను నర్థమున నున్నదని నేను సిద్ధపఱచితిని. ఈ శాస్త్రార్థ మితరస్థలములలో ముద్రింపబడి ప్రసిద్ధికి వచ్చెను. దాని నందఱు జదివి, చూచిరి. 'ఇతిహాస' శబ్దము వలన బ్రాహ్మణ గ్రంథములే గ్రహింపవలయు ననియు నట వివాదము నడచెను.

(వి.సం.౧౯౨౯) గతవర్షము భాద్రపదమున నేను గాశీలో నుంటిని. అప్పటికి నాలుగు పర్యాయములు కాశీ వెళ్ళియుంటిని. కాశీ వెళ్లినప్పుడెల్ల 'ఎవరికైన వేదములందు మూర్తిపూజావిధి లభించిన తెచ్చి నాకు జూపుడు' అని విజ్ఞాపనము చేయించుచుంటిని. కాని నేటివఱకును నెవ్వరు నొక్క వచనమునుగూడ జూపజాలకపోయిరి. ఇట్లుత్తరభారతపుటెల్ల ప్రాంతములలోను నేను భ్రమణము చేసితిని. ఇప్పుడు రెండువత్సరములనుండి కలకత్తా, లఖనఊ-లక్నో, ప్రయాగ, కాన్పూర్, జబల్‌పూర్ స్థానములలో నేను బహుజనులకు ధర్మోపదేశము చేసితిని.

ఫర్రుఖాబాద్, కాశీ మున్నగు స్థానములలో నార్ష విద్యను నేర్పుటకు నాలుగు పాఠశాలలు స్థాపించితిని.

(వి.సం.౧౯౩౧) బొంబాయినుండి 'అలహాబాద్' అటనుండి రాజకోటకు వెళ్లి కొన్నిదినములు ధర్మోపదేశము చేసితిని. ఇప్పుడు మీ పూనా నగరమునకు వచ్చితిని. వచ్చియుట రెండుమాసములనుండి యున్నాను. ఇప్పుడు నావయస్సు ౪౯-౫౦ మధ్యలో నున్నది. ఇది నా పూర్వచరిత్ర.

ఆర్యధర్మ మున్నతి నొందవలయు ననిన నావంటి ధర్మోపదేశకులీదేశమున జాలమంది యుత్పన్నము కావలయును. ఒకవ్యక్తివలన నీకార్యము సిద్ధింపజాలదు. అయినను నాబుద్ధి, సామర్థ్యము ననుసరించి యీకార్యము సాగింతునని సంకల్పించి యున్నాను. 'ఆర్యసమాజము' అంతట స్థాపింపబడవలయును. మూర్తి పూజ మున్నగు దుష్టాచారములు లోకమున నెక్కడ నుండరాదు. వేదశాస్త్రి ముల సత్యార్థము ప్రకాశము కావలయును. దానికి ననుకూలమైన యాచరణము వర్ధిల్ల వలయును. దేశమున నున్నతి కలుగవలయును. ఈశ్వరుని నేనిదియే ప్రార్థించుచున్నాను. మీయందఱి సాహాయ్యమువలన నంతఃకరణపూర్వకముగా నేను జేయు నీ ప్రార్థన సఫలమగునని నాకు బూర్ణమైన యాశయున్నది.

లోకమున కుపకారము జేయుటకు జేసిన నానిశ్చయమును మరణ పర్యంతమును విడువక చేయుచునే యుందును. మరల జన్మాంతరమునను జేయుదును.

ఓ౩మ్

# ఆర్యసమాజ నియమములు

1. సమస్త సత్యవిద్యలకును, విద్యవలన నెఱుంగదగు సర్వ పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.

2. ఈశ్వరుడు - సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వవ్యాపకుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.

3. వేదము సత్యవిద్యల గ్రంథము. దీనిని చదువుట - చదివించుట, వినుట - వినుపించుట, ఆర్యుల కందఱికి పరమధర్మము.

4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును, నెల్లప్పుడు సిద్ధముగా నుండవలెను.

5. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.

6. ప్రపంచమునకు నుపకారము చేయుట, యీ సమాజము యొక్క ముఖ్యోద్దేశము. అనగా శారీరకోన్నతికి, ఆత్మికోన్నతికి, సామాజికోన్నతికి పాటుపడవలెను.

7. అందఱితో ప్రేమపూర్వకముగ, ధర్మానుసారముగ, యథాయోగ్యముగ వ్యవహరింపవలెను.

8. అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింప జేయవలెను.

9. ప్రతివ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తి నొందక, యందఱి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంపవలెను.

10. సర్వహిత కరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై, వ్యక్తి హిత కరములగు నియమములందు స్వతంత్రులగుట యందఱికి తగును.

ఓమ్

సచ్చిదానందేశ్వరాయ నమోనమః

# భూమిక

నే నీసత్యార్థ ప్రకాశమను గ్రంథమును వ్రాసినపుడును, నంతకు బూర్వమును సంస్కృత భాషణము చేయుటకును, బఠన పాఠనములందును సంస్కృతమునే మాట్లాడుటకు నుపయోగించు చుండెడివాడను. మఱియు నాజన్మ భూమికి సంబంధించిన భాష గుజరాతి యగుటవలన నాకీయార్యభాషకు సంబంధించిన విశేష జ్ఞానము లేకుండెను. అందువలన నీ భాష యశుద్ధముగా వ్రాయబడినది. ఇప్పుడీ భాషలో మాట్లాడుటకును, వ్రాయుటకును గొంత యభ్యాసమైనది. కావున నీ గ్రంథమును భాషా వ్యాకరణానుసారముగా శుద్ధముచేసి రెండవమారు ముద్రింపజేసితిమి. అక్కడక్కడ శబ్దములలోను, వాక్యములలోను, రచనలోను గొంత భేదము చేయుట యుచితమని యెంచి యట్లు చేసితిమి. అటులజేయక భాషాపరిపాటిని మార్చుట కష్టమయ్యెను. కాని యర్థభేదమెచ్చటను జేయబడలేదు. పై పెచ్చు విశేషము వ్రాయబడినది. ప్రథమ ముద్రణమందు గొన్ని చోట్ల బొరపాట్లు జరిగి యుండెను. ఇప్పుడు వానిని సరిచేసి బాగుగ ముద్రణము చేయబడినది.

ఈ గ్రంథమునందు బదునాలుగు సముల్లాసములున్నవి. అనగా బదునాలుగు భాగములలో నిది రచియింపబడినది. ఇందు మొదటి పది సముల్లాసములు పూర్వార్ధము. మిగిలిన నాలుగు సముల్లాసములు నుత్తరార్ధముగా విభజింపబడినవి. చివరి రెండు సముల్లాసములు, స్వసిద్ధాంతములు కొండొక కారణముచేత బ్రథమమున ముద్రింపజాలక పోయితిమి. ఈ సంస్కరణమున నవియు ముద్రింపబడినవి.

(౧) ప్రథమ సముల్లాసమందీశ్వరుని 'ఓం'కారాది నామముల వ్యాఖ్య.

(౨) ద్వితీయ సముల్లాసమున సంతానముల శిక్షణము.

(౩) తృతీయ సముల్లాసమున బ్రహ్మచర్యము, పఠన పాఠనవ్యవస్థ,సత్యాసత్య గ్రంథముల నామములు, పఠన పాఠన రీతి.

(౪) చతుర్థ సముల్లాసమున వివాహ గృహాశ్రమముల వ్యవహారములు.

(౫) పంచమ సముల్లాసమున వానప్రస్థ, సంన్యాసాశ్రమముల విధులు.

(౬) ఆఱవ సముల్లాసమున రాజధర్మము.

(౭) సప్తమ సముల్లాసమున వేదేశ్వర విషయము.

(౮) అష్టమ సముల్లాసమున జగత్తునకు సంబంధించిన యుత్పత్తి స్థితి ప్రలయములు.

(౯) నవమ సముల్లాసమునందు విద్య, యవిద్యలయు, బంధ మోక్షములయు వ్యాఖ్యానము.

(౧౦) దశమ సముల్లాసమం దాచారానాచారములయు, భక్ష్యాభక్ష్యములయు విషయము.

(౧౧) ఏకాదశ సముల్లాసమం దార్యావర్తమున గల మతమతాంతరముల ఖండన మండన విషయములు.

(౧౨) ద్వాదశ సముల్లాసమందు చార్వాకులయు, బౌద్ధులయు, జైనులయు మతముల విషయము.

(౧౩) త్రయోదశ సముల్లాసమందు క్రైస్తవ మతవిషయము.

(౧౪) చతుర్దశ సముల్లాసమునందు మహమ్మదీయ మత విషయములు వ్రాయబడినవి.

ఈ పదునాలుగు సముల్లాసముల తదుపరి యార్యుల సనాతన వేద విహిత మతమును గూర్చి విశేషముగ వ్యాఖ్య వ్రాయబడినది. దానిని నేనున్నది యున్నట్లంగీకరించు చున్నాను. నే నీగ్రంథమును రచించుటలో ప్రయోజనము సత్యములైన యర్థములను ప్రకాశపఱచుటయే. సత్యమును సత్యముగను, మిథ్యను మిథ్యగను ప్రతిపాదించుట సత్యార్థమును ప్రకాశము చేయుటయని యెంచితిని. సత్యస్థానమున నసత్యమును, అసత్యస్థానమున సత్యమును ప్రకాశము చేయుట సత్యమని చెప్పబడదు. ఏ పదార్థ మెట్టిదో దాని నట్లే చెప్పుట, వ్రాయుట యంగీకరించుటయు సత్యమనబడును. పక్షపాతియగు మనుష్యుడు తన యసత్యమునుగూడ సత్యమనియు నితర విరోధి మతములవారి సత్యమునుగూడ నసత్యమనియు సిద్ధపఱచుటకు ప్రవృత్తుడగును. కావున నతడు సత్యమతమును బొందజాలడు. కావున విద్వాంసులైన యాప్తుల ముఖ్యకర్తవ్యమేమన దమ యుపదేశముల మూలమునను, లేఖల మూలమునను మనుష్యులందఱ యెదుట సత్యాసత్యముల స్వరూపమును సమర్పించుటయే. తదుపరి వారు స్వయముగా దమ హితాహితములను దెలిసికొని సత్యార్థమును గ్రహించి మిథ్యార్థమును వదలి యెల్లపుడు నానందమున నుందురు. మనుష్యుని యాత్మ సత్యాసత్యముల నెఱుగునదియై యున్నది. అయినను దనప్రయోజన సిద్ధికొఱకు పట్టుదలతోను, దురాగ్రహముతోను, నవిద్యాది దోషముల వలనను సత్యమును వదలి, యసత్యము వంకకు మరలుచుండును. కాని యీగ్రంథమున నట్టి ప్రవృత్తికి దావులేదు. ఒకరి మనస్సునకు గష్టము కలిగించుటగాని, యొకరికి హానికలిగించుటకాని యీ గ్రంథమునకు దాత్పర్యముకాదు. దేనివలన మనుష్యజాతికి నున్నతి, యుపకారము కలుగునో, సత్యాసత్యములను మనుష్యులు తెలిసికొని సత్యమును గ్రహించి యసత్యమును పరిత్యజింతురో యదియే దీని ముఖ్యోద్దేశము. ఏలయన, సత్యోపదేశమును మించి మఱియొండు కారణ మేదియు మనుష్యజాతి యున్నతికి లేదు. ఈ గ్రంథమున నట నట దిద్దుటలోను, ముద్రణలోను, బొరపాట్లుండిన, వానిని దెలిపిన మీదటగాని, మఱియొకరు తెలిపిన మీదటగాని యవి సత్యములగు విధమున మార్పు చేయబడును. ఎవరేని పక్షపాత బుద్ధితో విపరీతములైన శంకలు చేసినను, ఖండన మండనము చేసినను వానిపై ధ్యానముంచబడదు. ఎవడేని మనుష్యమాత్రునకు హితమునుగోరి యేదైన దెలిపిన దాని సత్యమును దెలిసిన మీదట నతని మతము గ్రహింపబడును. ప్రస్తుతకాలమున ప్రతిమతమునందును బలువురు విద్వాంసులున్నారు. అయినను వారు పక్షపాతమును వదలి సర్వ తంత్ర సిద్ధాంతములను, ననగా నేయే విషయము లెల్లరకు ననుకూలములో, యన్నింటిలో సత్యములో వానిని గ్రహించుటయు, నేది పరస్పర విరుద్ధమో దానిని వదలి, పరస్పర ప్రేమతో వర్తించి, వర్తింపజేసిన లోకమునకు బూర్ణహితము కలుగును. ఏలయనగా విద్వాంసులలోగల విరోధము వలననే యవిద్వాంసులలోగల విరోధమెక్కువయై యనేక విధములగు దుఃఖముల వృద్ధియు, సుఖములహానియు గలుగును. స్వార్థపరులైన మనుష్యులకు ప్రియమైన యీ హానియే మనుష్యులనందఱను దుఃఖసాగరమున ముంచివేసినది. వీరిలో నెవడేని యొకడు సార్వజనిక హితమును లక్ష్యము నందుంచుకొని ప్రవృత్తుడయిన స్వార్థపరులు కొందఱతనితో విరోధించుటలో దత్పరులై యనేక విధములైన విఘ్నములను గలిగింతురు. "సత్యమేవ జయతే నానృతమ్, సత్యేన పంథా వితతో దేవయానః"

(ముండక, ఉ.౩-౧-౬) "సర్వదా సత్యమునకు విజయమును నసత్యమునకు బరాజయమును గలుగును.

సత్యమే విద్వాంసులకు విస్తృత మార్గమై యున్నది." అను నీ దృఢ నిశ్చయము నవలంబించిన వారు పరోపకారము చేయుటలో నుదాసీనులై యెన్నడును సత్యార్థమును బ్రకటించుటకు వెనుకాడరు.

"యత్తదగ్రే విషమివ పరిణామేఽ మృతోపమమ్" భ.గీత. ౧౮. ౩౭.

'విద్యలు, ధర్మప్రాప్తికి సంబంధించిన కర్మములు నాచరించుట, మొదట విషతుల్యములై తదుపరి పరిణామమున నమృత తుల్యములగును', ఇది గీతావాక్యాభిప్రాయము. వాస్తవమున నిది యొక దృఢనిశ్చయము. ఇట్టి విషయములను మనస్సునందుంచుకొనియే నే నీగ్రంథమును రచించితిని. పాఠకగణము, శ్రోతలును బ్రేమతో నీ గ్రంథమును బ్రథమమున జదివి గ్రంథమునగల సత్యా సత్యములను నెఱిగి తదుపరి తమయిష్టము వచ్చినట్లు చేయుదురుగాక !

అన్ని మతములందు గల సత్యవిషయములను, నన్నింటియందు నవిరుద్ధములగు వానిని స్వీకరించి, మతమతాంతరములందుగల మిథ్యావిషయములను ఖండనము చేయుటకు నీ గ్రంథమున నభిప్రాయముంచబడినది. ఈ గ్రంథరచనలో మఱియొక యభిప్రాయము కూడనున్నది. అది యెద్దియన మతమతాంతరములలో గుప్తముగాను బ్రకటముగాను నున్న చెడ్డ విషయములను బ్రకటపఱచి విద్వాంసులు, నవిద్వాంసులునైన మనుష్యులందఱముందు నుంచుటచే నెల్లరు నెల్లరతో విచారించి పరస్పరము ప్రేమతో సత్యమతము ననుసరింతురనుట. నే నార్యావర్తమున బుట్టి యిక్కడనే వసించువాడను. అయినను నీ దేశపు మతమతాంతరముల యసత్యవిషయములను బక్షపాతము వదలి యథాతథముగా నున్నది యున్నట్లు ప్రకాశముచేయుచున్నట్లుగా నితర దేశస్థులతోను, మతోన్న తులతోను వ్యవహరింతును. స్వదేశవాసులతో మనుష్యోన్నతి కొఱకెట్లు వర్తింతునో యట్లే విదేశీయులతోను వర్తింతును. సజ్జను లెల్లరు నట్లే వర్తింప దగుదురు. ఏల యనగా నేను గూడ నేదో యొక దేశమునెడ బక్షపాతినైనయెడల, నేడెట్లు స్వమతము విషయమున స్తుతి, మండనములు, ప్రచారము చేయుచున్నారో, పరమతము నెట్లు నిందించుచున్నారో, హానికలిగించి దాని ప్రచారము నడ్డగించు చున్నారో యట్లే నేను జేసిన వాడనగుదును. కాని యివి యన్నియు మానవతకు వ్యతిరేకములు. ఏల యన బలముగల పశు వితరజంతువులకు దుఃఖములు కలిగించును. అప్పుడపుడు చంపివేయునుగూడ. మనుష్యశరీరమును బొందియు, నట్టి కర్మములే చేయుదురేని, వారు మనుష్య స్వభావ యుక్తులు కారు. పశుతుల్యులగుదురు. బలవంతుడై నిర్బలులను రక్షించువాడే మనుష్యుడు. 'స్వార్థవశుడై పరహాని మాత్రమే చేయుచుండువాడు పశువులకు బెద్దన్నవంటివాడని తెలిసికొనవలయును.

ఆర్యావర్తీయుల విషయమున విశేషించి పదునొకండవ సముల్లాసము వఱకు వ్రాసితిని. ఈ సముల్లాసములందు బ్రకాశిత సత్యమతము వేదోక్త మగుట వలన నాకు నన్నివిధముల మంతవ్యము - స్వీకార్యము. నవీన పురాణములందు, దంత్రగ్రంథములందు వ్రాయబడిన విషయములను నేను దేనిని ఖండించి యున్నానో యవి యన్నియు వదలి పెట్టదగినవి.

పండ్రెండవ సముల్లాసమున చారవాక మతమును గొంత వ్రాసితిని. ఆ మతము నేడు క్షీణదశలోనున్నది. చారవాకు లనీశ్వర వాద విషయమున బౌద్ధజైన మతముల వారితో నెక్కుడు సంబంధము కలిగియున్నారు. ఈ మతమితర మతములన్నింటికంటె నెక్కుడు నాస్తికమతము. దీని చేష్టల నరికట్టుట యావశ్యకము. లేకున్న లోకమున నెక్కువ యనర్థములుప్పతిల్లును.

చారవాకమతముతోబాటు బౌద్ధజైన మతములనుగూర్చియు సంక్షేపముగా బండ్రెండవ

సముల్లాసమున వ్రాయబడినది. బౌద్ధ జైన మతములు చారవాకముతో గొన్ని విషయములం దేకీభవించును. కొన్నింటియందు గొంత విరోధము నున్నది. జైనులు కూడ నెక్కువ యంశములలో జార వాకులతోను బౌద్ధులతోను మైత్రికలిగియుందురు. కొలది విషయములలో భేదము కూడ నున్నది. అందువలననే జైనులశాఖ వేఱుగా నెంచబడుచున్నది. ఆ భేదము పంద్రెండవ సముల్లాసమున వ్రాసితిమి. చదివి తెలిసికొనవచ్చును. బౌద్ధజైన చారవాక మతములలోగల భేదము, వారి మత విషయములు, నటనే వ్రాయబడినవి.

వీనిలో బౌద్ధుల దీపవంశాది ప్రాచీన గ్రంథములలో బౌద్ధమత సంగ్రహము, సర్వదర్శన సంగ్రహమున జూపబడినది. దాని నుండియే యిందు వ్రాయబడినది. నిమ్నలిఖిత పుస్తకములు జైనుల సిద్ధాంతములకు సంబంధించినవి. వానిలో :-

(౪) నాలుగు మూల సూత్రములు ౧ ఆవశ్యక సూత్రములు, (౨) విశేషావశ్యక సూత్రములు, (౩) దశవైకాలిక సూత్రములు, (౪) పాక్షిక సూత్రములు.

(౧౧) పదునొకండు అంగములు :- (౧) ఆచారాంగ సూత్రము (౨) సుగడాంగ సూత్రము. (౩) థాణాంగ సూత్రము. (౪) సమవాయాంగ సూత్రము (౫) భగవతీ సూత్రము (౬) జ్ఞాతాధర్మకథా సూత్రము. (౭) ఉపాసకదశా సూత్రము. (౮) అంతగడదశా సూత్రము. (౯) అనుత్తరోవవాయీ సూత్రము. (౧౦) విపాక సూత్రము. (౧౧) ప్రశ్నవ్యాకరణ సూత్రము.

(౧౨) ద్వాదశోపాంగములు :-౧.ఉపవాయీ సూత్రము. ౨. రావప్సేనీ సూత్రము, ౩. జీవాభిగమ సూత్రము ౪. పన్నగణా సూత్రము. ౫. జంబుద్వీపపన్నతీ సూత్రము. ౬. చందపన్నతీ సూత్రము. ౭. సూరపన్నతీ సూత్రము. ౮. నిరియావలీ సూత్రము. ౯. కప్పియాసూత్రము. ౧౦. కపబడేసయా సూత్రము. ౧౧. పూప్పియా సూత్రము. ౧౨. పుప్పచూలియా సూత్రము.

(౫) ఐదు కల్ప సూత్రములు. ౧. ఉత్తరాధ్యయన సూత్రము. ౨. నిశీథ సూత్రము. ౩. కల్ప సూత్రము, ౪. వ్యవహార సూత్రము ౫. జీతకల్ప సూత్రము.

(౬) ఆఱుభేదములు :- ౧. మహానిశీథ బృహద్వాచనా సూత్రము. ౨. మహానిశీథలఘువాచనా సూత్రము ౩. మధ్యమవాచనా సూత్రము ౪. పిండనిరుక్తి సూత్రము. ౫. ఔఘనిరుక్తి సూత్రము. ౬. పర్యూషణా సూత్రము.

(౧౦) దశ పయన్న సూత్రములు ౧ చతుస్సరణ సూత్రము. ౨. పంచఖాణ సూత్రము ౩. తదులవైయాలిక సూత్రము. ౪. భక్తిపరిజ్ఞాన సూత్రము. ౫.మహాప్రత్యాఖ్యాన సూత్రము ౬. చందావిజయ సూత్రము. ౭. గణీవిజయ సూత్రము. ౮. మరణసమాధి సూత్రము. ౯. దేవేంద్ర స్తవన సూత్రము ౧౦. సంసార సూత్రము. అట్లే నందీ సూత్రము, యోగోద్ధార సూత్రము ప్రామాణికము అందురు.

(౫) పంచాగములు. ౧. పూర్వ సర్వ గ్రంథములటీక, ౨ నిరుక్తి. ౩ చరణీ, ౪. భాష్యము. ఈ నాలుగవయవములు సర్వమూలములు కలిసి యైదు పంచాంగములనబడును. వీనిలో ఢూండియు లవయవముల నంగీకరింపరు. మఱియు నివి కాక జైనులంగీకరించు గ్రంథములనేకము లున్నవి. పంద్రెండవ సముల్లాసమున వీరిమతము మీద విశేష విచారము జూడుడు.

జైనమత గ్రంథములలో లక్షలకొలది పునరుక్త దోషములున్నవి. వీరి గ్రంథము అన్యమతస్థుల హస్తములందు గనబడినను, నచ్చువేయబడి యున్నను, నాగ్రంథములు తమకు బ్రమాణములు కావని చెప్పుటయు వారి స్వభావము. వారి యీవిషయము మిథ్యయే. ఏలయన నొక గ్రంథము నొకవ్యక్తి యంగీకరించినను నంగీకరింపకున్నను, నా గ్రంథము జైనమతమునకు వెలుపలి దెట్లు కాగలదు? జైనులంగీకరింపని గ్రంథమొక్కటియు లేదు. కావున నెవడేగ్రంథము నంగీకరించునో యా గ్రంథస్థ విషయముల ఖండన మండనము లతని కొఱకే యని యెంచబడును. కాని, యాగ్రంథము నెఱిగిన వారంగీకరించువారు నెందఱో యున్నను సభలో నంగీకరింపని వారుగా మాఱిపోవుదురు. అందువలననే వారు తమ గ్రంథములను దాచి యుంచెదరు. ఇతర మతస్థులను జూడనీయరు, వినిపింపరు, చదివింపరు. కావున నా గ్రంథములలో నెన్నియో యసంభవ విషయములు నిండియున్నవి. జైనులలో నెవ్వరును వానికి సమాధానము చెప్పజాలరు. అసత్య విషయమును వదలుటయే సమాధానము.

పదమూడవ సముల్లాసమున గ్రైస్తవుల మతమును గూర్చివ్రాయబడినది. వీరు బైబిల్‌ను దమ ధర్మపుస్తకముగా నంగీకరింతురు. వీరికి సంబంధించిన విషయముల నాసముల్లాసమునందే చూడుడు.

పదునాల్గవ సముల్లాసమున మహమ్మదీయుల మత విషయము వ్రాయబడినది. వీరు తమ మతమునకు మూలపుస్తకము 'కురాన్' అని యంగీకరింతురు. వీరివిషయము విశేషముగా జూడదలచినవారా సముల్లాసముననే చూడుడు. దానికి దదుపరి వైదిక మతవిషయమును వ్రాసితిమి.

ఎవరేని యీ గ్రంథకర్త యొక్క తాత్పర్యమునకు విరుద్ధమైన మనస్సుతో నీగ్రంథమును జూచిన నతనికి గొంచెముకూడ నభిప్రాయము బోధపడదు. కారణమేమన వాక్యార్థము తెలియవలెననిన నాలుగు కారణములుండును. ఆకాంక్ష, యోగ్యత, ఆసత్తి, తాత్పర్యము. ఈ నాలుగు విషయములను ధ్యానమునందుంచుకొని గ్రంథమును జదువు వానికి గ్రంథాభిప్రాయము తగినట్లు బోధపడును.

ఆకాంక్ష:- ఒకానొక విషయముమీద వక్తయొక్కయు, వాక్యములోని పదములయు బరస్పరాకాంక్ష యుండును.

యోగ్యత:- దేనితో నేది యగునో యది యోగ్యత యగును. ఉదా:- జలముతో దడుపుట - అదియే యోగ్యత.

ఆసత్తి :- ఏపదముతో నే పదమునకు సంబంధముండునో యాపదమును దానికి సమీపమున వ్రాయుటయో, చెప్పుటయో యాసత్తి యనబడును.

తాత్పర్యము:- వక్త యెందుకొఱకు శబ్దములను బ్రయోగించునో దానితో నాశబ్దమును యుక్తముచేయుట.

మనుష్యులలో బెక్కురు మొండి పట్టుదల గలవారుగా నుందురు. వారు వక్త అభిప్రాయమునకు విరుద్ధముగా గల్పన చేయుచుందురు. ఇట్టివారు మతవాదులలో నెక్కువగా నుందురు. మత దురాగ్రహము వలన వారి బుద్ధి యంధకారమున జిక్కుబడి నష్టమగును. కావున నేను బురాణములు, జైనుల గ్రంథములు, బైబిల్, కురాన్, మొదలగు గ్రంథములను బ్రథమముననే చెడు దృష్టితో జూడక వానిలోని గుణములను గ్రహించి, దోషములను మాత్రమెట్లు వదలితినో యట్లే యితరులు మానవుల యున్నతి కొఱకు బ్రయత్నము చేయవలయును.

ఈ మతములోని కొలది దోషములనే ప్రకాశితము చేసితిని. వానినిజూచి మనుష్యులు సత్యాసత్యములను నిర్ణయింప గలుగుదురు. సత్యమును గ్రహించుటకు నసత్యమును ద్యజించుటకు సమర్థులగుదురు. మనుష్యజాతిని వంచించి, విరుద్ధ బుద్ధిని గలిగించి, పరస్పర శత్రుత్వమును నుద్భవింపజేసి, కలహముల నేర్పఱచి నాశమొనర్చుట విద్వాంసుల స్వభావమునకు విరుద్ధము.

ఆ విద్వాంసు లీ గ్రంథమును జూచి సరిగా విచారింపజాలరు. కాని బుద్ధిమంతులు వారి యోగ్యతకు దగినట్లుగా నభిప్రాయమును గ్రహింపక పోరు. కావున నా పరిశ్రమ వ్యర్థము కాక సఫల మగుననియే యెంచుచున్నాను. అందువలననే నా యభిప్రాయములను సర్వసజ్జనుల యెదుట నుంచుచున్నాను. దీనిని స్వయముగా జూచి యితరులకు జూపించి నా పరిశ్రమమును సఫలము చేయుదురు గాక. ఇట్లే పక్షపాతము చేయక సత్యార్థమును బ్రకటించుట నాకును సర్వ మహాశయులకును ముఖ్యకర్తవ్యమై యున్నది.

సర్వాత్మయు, సర్వాంతర్యామియు, సచ్చిదానందుడునగు బరమాత్మ తన కృపతో నీ యాశయమును విస్తృతమొనర్చి చిరస్థాయి చేయునుగాక.

'అలమతివిస్తరేణ బుద్ధిమద్వరశిరోమణిషు' బుద్ధిమంతులలో శ్రేష్ఠులైన వారి కింతకంటె నెక్కువ వ్రాయ నావశ్యకత లేదు.

ఇ తి భూ మి క.

స్థానము :- మహారాణాజీ – ఉదయపురము. భాద్రపద శుక్లపక్షము ౧౯౩౯ సంవత్.

दयानन्दसरस्वती

(స్వామీ) దయానంద సరస్వతీ.

ఓమ్

# సత్యార్థ ప్రకాశము

## ప్రథమ సముల్లాసము

(ఈశ్వరనామముల వ్యాఖ్యానము.)

ఓమ్ శన్నో మిత్రః శం వరుణః శన్నో భవత్వర్యమా
శన్న ఇన్ద్రో బృహస్పతిః శన్నో విష్ణు రురుక్రమః
(ఋ ౧-౯-౦-౯ యజు. ౩౬-౯)

నమో బ్రహ్మణే నమస్తే వాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి,
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి
తన్మామవతు తద్వక్తారమవతు అవతు మామవతు వక్తారమ్.
ఓమ్ శాన్తిశ్శాన్తిశ్శాన్తిః. తై. ఆ. ౭. ౧.

('ఓమ్' పద వ్యాఖ్య.)

అర్థము :- (ఓమ్) ఈ ఓంకార శబ్దము పరమేశ్వరుని సర్వోత్తమ నామము. ఏలయన నిందలి అ, ఉ, మ్ అను మూడక్షరములు కలిసి యొక 'ఓమ్' సముదాయమైనది. ఈ యొక్క నామమువలన బరమేశ్వరుని యనేక నామములు గ్రహింపబడుచున్నవి. ఎట్లన :- అకారమువలన విరాట్టు, అగ్ని, విశ్వుడు మున్నగు నామములకును, ఉకారమువలన హిరణ్యగర్భుడు, వాయువు, తైజసుడు మున్నగు వానికిని, మకారమువలన ఈశ్వరుడు , ఆదిత్యుడు, ప్రాజ్ఞుడు మున్నగు నామములకును 'ఓమ్' నామము వాచకము గ్రాహకము నగుచున్నది. దాని కిట్లే వేదాది సత్య శాస్త్రములందు స్పష్టవ్యాఖ్యానము చేయబడినది. కావున బ్రకరణానుకూలముగ నీ నామములన్నియు బరమేశ్వరునివే.

(నానార్థక శబ్దముల కర్థ నిర్ణయ హేతువు)

ప్రశ్న:- పరమేశ్వరుని కంటె భిన్నములగు నర్థములకు వాచకములైన విరాట్టు మున్నగు నామములేల లేవు? బ్రహ్మాండము, పృథివ్యాది భూతములు, ఇంద్రాది దేవతలు, వైద్యక శాస్త్రమునందలి సొంటి మున్నగు నోషధులు ననువానికి నీ నామములున్నవా? లేవా?

ఉత్తరము:- ఉన్నవి. కాని పరమాత్మునకు నున్నవి.

ప్రశ్న:- ఈ నామములవలన దేవతలను మాత్రము గ్రహింతురా? లేదా?

ఉత్తరము:- మీరట్లు (దేవతలనే) గ్రహించుటకు బ్రమాణమేమి?

ప్రశ్నః- దేవతలెల్లరు ప్రసిద్ధులు, వారుత్తములు కూడ. కావున నే నా దేవతలను గ్రహింతును.

ఉత్తరముః- పరమేశ్వరు డప్రసిద్ధుడా? అతనికంటె నెవడైన నుత్తముడు కూడ నున్నాడా? మఱియు బరమేశ్వరునకు గూడ నీ నామముల నేల యంగీకరింపవు? పరమేశ్వరు డప్రసిద్ధుడు కానపుడు, అతనికి దుల్యుడు మఱియొక డెవడును లేనపుడు, నతనికంటె నుత్తము డింకొక డెవడుండును? కావున మీరు చెప్పునది సత్యము కాదు. ఏలయన మీ యీ కథనము నందు బహుదోషములు కూడ గలుగును. అది యెట్లన :- "ఉపస్థితం పరిత్యజ్యానుపస్థితం యాచత ఇతి బాధితన్యాయః" (సమీపమున నున్నదానిని విడిచి దూరమున నున్నదానిని గోరుచున్నాడు, అను నిది బాధిత న్యాయము.) ఒక వ్యక్తి మఱియొకని కొఱకు భోజన పదార్థములను (సమీపమున) నుంచి 'మీరు భోజనము చేయు' డనెను. అంతట నా వ్యక్తి, (సమీపమున) ఉంచిన భోజన పదార్థములను విడిచి, యప్రాప్త -సమీపమున లేని భోజనము కొఱకు నిటునటు దిరుగ జొచ్చినచో నతనిని బుద్ధిమంతునిగా నెఱుగరాదు. ఏలయన నత డుపస్థితము సమీపమున నుంచిన (భోజన) పదార్థమును విడిచి యనుపస్థిత - అప్రాప్త పదార్థమును బొందుటకు శ్రమించుచున్నాడు. కావున నా పురుషుడు బుద్ధిమంతుడు కాడు. మీరు చెప్పినదియు నట్లే యైనది. ఏలయన, ఆ విరాట్టు మున్నగు నామములకు బ్రసిద్ధములు, బ్రమాణ సిద్ధములునగు బరమేశ్వరుడు, బ్రహ్మాండము మున్నగు నుపస్థితములగు నర్థములను బరిత్యజించి, యసంభవములు, ననుపస్థితములగు దేవతాదులను గ్రహించుటకు శ్రమించు చున్నారు. ఇందులకొక ప్రమాణము కాని యుక్తికాని కనిపింపదు.

(ప్రకరణ మర్థజ్ఞానమునకు సహాయకము.)

"ఎక్కడ దేని ప్రకరణమో యక్కడ దానిని గ్రహించుట యుచితము. ఎట్లన :- ఒక డొక వ్యక్తితో ననెను. "హేభృత్య! త్వం సైంధవమానయ", ఓసేవక! నీవు సైంధవమును దెమ్ము; అప్పుడా సేవకునకు సమయము, ప్రకరణము (సందర్భము)ను గూర్చి యాలోచించుట యావశ్యకము. ఏలయన, సైంధవ మను నామము రెండు వస్తువులను దెలుపును. ఒకటి గుఱ్ఱము. రెండవది లవణము - ఉప్పు. కావున దనస్వామికి నది గమన సమయమైనచో గుఱ్ఱమును, భోజన సమయమైనచో లవణమును దెచ్చుట సేవకునకు నుచితము. (అట్లు చేయక) సేవకుడు భోజన సమయమున గుఱ్ఱమును, గమన సమయమున నుప్పును దెచ్చినచో నతని స్వామి నతనియెడ గోపించి 'నీవు బుద్ధి లేనివాడవు. గమన సమయమున నుప్పును, భోజన సమయమున గుఱ్ఱమును దెచ్చిన నేమి ప్రయోజనము! నీవు ప్రకరణము - సమయము నెఱుగవు. ఎఱిగియున్నచో నే సమయమున దేనిని దీసికొని రావలయునో దానినే దెచ్చి యుందువు. నీవు ప్రకరణము - సమయమును గూర్చి యాలోచింపవలసి యుండగా నట్లు చేయవైతివి. కావున నీవు మూర్ఖుడవు. నా దగ్గఱ నుండి వెడలి పొమ్ము, అనును. దీనింబట్టి సిద్ధించిన దేమన :- "ఎక్కడ దేనిని గ్రహించుట యుచితమో యచట దానినే గ్రహింపవలయును" అని యందురేని, అట్లే మేము, మీరు, నెల్లరును నంగీకరింపవలయును. అట్లే చేయవలయును.

[మంత్రార్థము]

'ఓం ఖం బ్రహ్మ' (౧) యజు. అ. ౪౦. మం. ౧౭. చూడుడు;

వేదము లందిట్టి ప్రకరణములలో బరమేశ్వరునకు 'ఓమ్, మున్నగు ౨౧ నామము లున్నవి. "ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత (౨) ఛాందోగ్య - ఉ. - ౧.౧

"ఓమిత్యే దక్షరమిదం సర్వం తస్యోప వ్యాఖ్యానమ్" (౩)

మాం. ఉ. ౧.

"సర్వే వేదా యత్ పదమామనన్తి, తపాంసి సర్వాణి చ యద్ వదన్తి, యదిచ్ఛన్తో
బ్రహ్మచర్యం చరన్తి, తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్" (౪)

కఠోపనిషత్. వల్లీ ౨ – ౧౫.

"ప్రశాసితారం సర్వేషామణీయాంసమణోరపి,
రుక్మాభం స్వప్న ధీగమ్యం విద్యాత్తం పురుషం పరమ్" (౫)
"ఏతమగ్నిం వదన్త్యేకే మనుమన్యే ప్రజాపతిమ్,
ఇన్ద్రమేకే పరే ప్రాణమపరే బ్రహ్మ శాశ్వతమ్" (౬)మను. అ. ౧౨. శ్లో. ౧౨౨.౧౨౩
"స బ్రహ్మా స విష్ణుః స రుద్ర స్స శివ స్సోఽక్షర స్స పరమః స్వరాట్
స ఇన్ద్ర స్స కాలాగ్ని స్స చన్ద్రమాః" (౭). కైవల్యోపనిషత్. ౧—౮.
"ఇన్ద్రం మిత్రం వరుణమగ్ని మాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్
ఏకం సద్ విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః" (౮)

ఋ. మం. ౧. సూ. ౧౬౪. మం. ౪౬.

"భూరసి భూమిరస్యదితిరసి విశ్వధాయా విశ్వస్య భువనస్య ధర్ త్రీః
పృథివీం యచ్ఛ పృథివీం దృగ్ంహ పృథివీం మా హిగ్ంసీః (౯)

యజు. అ౧౩. మం ౧౮.

"ఇన్ద్రో మహ్నా రోదసీ పప్రథచ్ఛవ ఇన్ద్రః సూర్యమరోచయత్,
ఇన్ద్రే హ విశ్వా భువనాని యేమిర ఇన్ద్రే స్వానాస ఇన్దవః" (౧౦)

సామ. ప్రపా. ౬. త్రిక. ౮. మం. ౨.

"ప్రాణాయ నమో యస్య సర్వమిదం వశే!
యో భూతః సర్వ స్యేశ్వరో యస్మిన్త్సర్వం ప్రతిష్ఠితమ్ ॥" (౧౧)
అథర్వ కాం. ౧౧.౪.౧. (అథర్వ. కాం ౧౧. ప్రపా. ౨౪. అ౨)

అర్థము:– ఇక్కడ నీ ప్రమాణములను వ్రాయుటలో నభిప్రాయమదియే. ఇట్టి ప్రమాణములలో ఓంకారాది నామమువలన బరమాత్మయే గ్రహింపబడును.

అట్లే, లోకమున దరిద్రుడు మున్నగు వారికి ధనపతి (కుబేరుడు) మున్నగు నామములుండునట్లు పరమేశ్వరుని యే నామముకూడ ననర్థకము కాదు. దీనివలన (పరమేశ్వరుని నామములు) గొన్నియెడల

గౌణికములు (గుణములను దెలుపునవి) మఱికొన్ని చోట్ల గార్మికములు (కర్మలను దెలుపునవి) ఇంక గొన్ని యెడల స్వాభావికములు (స్వభావమును దెలుపునవి) నైన యర్థములకు వాచకములు. (ఇట్లు) 'ఓ౩మ్' ఆదినామములు సార్థకములు. అది యెట్లన :-

(ఓం ఖం):- 'అవతీత్యోమ్' రక్షించుటవలన 'ఓమ్' 'ఆకాశమివ వ్యాపకత్వాత్ ఖమ్' ఆకాశము వలె వ్యాపకుడగుటచే 'ఖమ్'; 'సర్వేభ్యో బృహత్వాత్ బ్రహ్మ, అన్నింటికంటె బెద్దవాడగుటచే 'బ్రహ్మ' అని యీశ్వరునకు నామములు. (౧)

(ఓమిత్యే . . . . ) - 'ఓ౩మ్' ఎవనినామమో, మఱియు నెవడెన్నడు నశింపడో యతని నుపాసించుటయే యుచితము; అన్యుని గాదు. (౨)

(ఓమిత్యేత . . . . ) వేదాది సర్వశాస్త్రములందును 'ఓ౩మ్' పరమేశ్వరుని నిజనామ మనియు, బ్రధాననామ మనియు జెప్పబడినది. ఇతరములన్నియు గౌణిక నామములు - గుణబోధకములు. (౩)

(సర్వే వేదా. . . . ) సర్వవేదములు, సమస్త ధర్మానుష్ఠానరూప తపశ్చరణము నెవనిని గూర్చి చెప్పుచున్నవో, మఱియు నెవనిని గౌరవించుచున్నవో, యింకను నెవనిని బొందగోరి బ్రహ్మచర్యాశ్రమమును బాలించుచున్నారో యతని నామము 'ఓ౩మ్' అనియే చెప్పవలయును. (౪)

('ప్రశాసితారం' - ). ఎవడందఱకు శిక్షకుడో, సూక్ష్మముకంటె సూక్ష్ముడో, స్వప్రకాశ స్వరూపుడో, సమాధిస్థ బుద్ధితో నెఱుగదగిన వాడో యతడే పరమపురుషుడని తెలిసికొనవలయును. (౫)

(ఏతమ . . . . ) మఱియు, స్వప్రకాశకుడగుటచే 'అగ్ని'; విజ్ఞాన స్వరూపుడగుటచే 'మనువు', అందఱను బాలించుటచే 'ప్రజాపతి', పరమైశ్వర్యవంతుడగుటచే 'ఇంద్రుడు', ఎల్లరి జీవనమూల మగుటచే 'ప్రాణము', నిరంతర వ్యాపకుడగుటచే 'బ్రహ్మ' అనియు బరమేశ్వరునకు నామములు. (౬)

(స బ్రహ్మా, స విష్ణుః . . . ) సర్వ జగత్తును నిర్మించుటచే 'బ్రహ్మ', అంతట వ్యాపకుడై యుండుటచే 'విష్ణువు', దుష్టులను దండించి యేడ్పించుటచే 'రుద్రుడు', మంగళమయుడై యెల్లరకు శుభముల నొనర్చు వాడగుటచే 'శివుడు' అనియు జెప్పబడును.

"యః సర్వమశ్నుతే న క్షరతి వినశ్యతి తదక్షరమ్". (౧).

'యః స్వయం రాజతే స స్వరాట్' (౨)

"యోఽగ్నిరివ కాలః కలయితా ప్రళయకర్తా స కాలాగ్నిరీశ్వరః " (౩)

(అక్షర) ఎవడంతట వ్యాప్తుడై యవినాశియో, (స్వరాట్) స్వయముగ బ్రకాశస్వరూపుడై (కాలాగ్ని) ప్రళయమున (అగ్ని సమానుడై) నెల్లరకు గాలుడు, మఱియు గాలమునకును గాలు డగుచున్నాడు. కావున బరమేశ్వరునకు 'కాలాగ్ని' అని నామము. (౭).

(ఇంద్రం మిత్రం . . . ) ఒక్కటియు, నద్వితీయము, సత్యము నగు నే వస్తువు కలదో, యింద్రుడు మున్నగు నామములన్నియు దానివే. 'ద్యుషు శుద్ధేషు భవో దివ్యః; 'శోభనాని పర్ణాని పాలనాని పూర్ణాని కర్మాణి వా యస్య స సుపర్ణః'; 'యో గుర్వాత్మా స గరుత్మాన్';' యో మాతరిశ్వా వాయురివ బలవాన్ స మాతరిశ్వా', ప్రకృత్యాది దివ్య పదార్థములందు వ్యాప్తుడు 'దివ్యుడు' ఉత్తమ పాలనము, పూర్ణకర్మలు గలవాడు 'సుపర్ణుడు', ఎవనియాత్మ - స్వరూపము గొప్పదియో యతడు 'గరుత్మంతుడు',

వాయువువలె ననంత బలవంతుడు 'మాతరిశ్వుడు'; కావున బరమాత్మునకు దివ్యుడు, సుపర్ణుడు, గరుత్మంతుడు, మాతరిశ్వుడు నను నామములున్నవి. మిగిలిన నామముల కర్థములు ముందు వ్రాయుదుము. (౮)

('భూమిరసి' – ) 'భవన్తి భూతాని యస్యాం సా భూమిః' ఈశ్వరుని యందు సర్వభూతములు, ప్రాణులు నుండును. కావున నతనికి 'భూమి' యని పేరు. మిగిలిన నామముల కర్థములు ముందు వ్రాయుదుము. (౯).

(ఇన్ద్రో మహ్నా. . . . ) ఈ మంత్రము నందలి 'ఇన్ద్రుడు' అను నామము పరమేశ్వరునిదే. కావున నీ ప్రమాణము వ్రాయబడినది. (౧౦).

(ప్రాణాయ.) ప్రాణవశమున సర్వశరీరము, నింద్రియములు నుండునట్లు, పరమేశ్వరుని వశమున సమస్త జగత్తు నుండును. కావున బరమేశ్వరుని నామము 'ప్రాణము'. (౧౧)

ఇట్టి ప్రమాణముల యర్థములను సరిగా నెఱుగుటవలన నీ నామముల ద్వారమున బరమేశ్వరుడే గ్రహింపబడును. ఏలయన, 'ఓ౩మ్' 'అగ్ని' మున్నగు నామముల ముఖ్యార్థము వలన బరమేశ్వరుని గ్రహణమే జరుగును. వ్యాకరణము, నిరుక్తము, బ్రాహ్మణములు, సూత్రాదులు, ఋషి–మునుల వ్యాఖ్యానములవలన (నీ నామములచే) బరమేశ్వరుడు గ్రహింపబడుట చూడబడుచున్నది. కావున నట్లే గ్రహించుట యెల్లరకు యోగ్యము – తగును.

(అగ్ని, వాయువు మున్నగు నామార్థముల నియామక హేతువు.)

కాని; 'ఓ౩మ్' అను నిది పరమాత్మునకు మాత్రమే నామము. 'అగ్ని' మున్నగు నామముల వలన బరమేశ్వరుని గ్రహించుటలో బ్రకరణము, విశేషణములు నియమకారకములు – నియమించును. దీనివలన నేమి సిద్ధించినదన :– ఎక్కడెక్కడ స్తుతి, ప్రార్థన, ఉపాసన (మున్నగు ప్రకరణములు), సర్వజ్ఞుడు, వ్యాపకుడు, శుద్ధుడు, సనాతనుడు, సృష్టికర్త మొదలగు విశేషణములు వ్రాయబడి యుండునో యట నట నీ (అగ్ని ఆది) నామముల వలన బరమేశ్వరుడే గ్రహింపబడును.

ఇక నెక్కడెక్కడ నిట్టి ప్రకరణములుండునో –

"తతో విరాడజాయత విరాజో అధి పూరుషః"।। యజుః ౩౧ ।। ౫ ।। (౧)

"శ్రోత్రాద్వాయుశ్చ ప్రాణశ్చ ముఖాదగ్ని రజాయత" యజు. ౩౧.౧౨. (౨)

"తేన దేవా అయజన్త." యజు.౩౧–౯. (౩)

"పశ్చాద్భూమిమథో పురః" యజు. ౩౧.౫. (౪)

"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః

ఆకాశాద్వాయుః వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ,పృథివ్యా ఓషధయః,

ఓషధిభ్యోఽన్నమ్, అన్నాద్రేతః, రేతసః పురుషః, స వా ఏష

పురుషోఽన్నరసమయః" ఇది తైత్తిరీయ. ఉపనిషద్వచనము.

(తై. ఆరణ్యకము (౮.౨) (౫)

ఇట్టి ప్రమాణములందు విరాట్టు, పురుషుడు, దేవుడు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి మున్నగు నామములు లౌకిక పదార్థములకే చెందినవగును. ఏలయన :- ఎక్కడెక్కడ నుత్పత్తి, స్థితి, ప్రళయము, నల్పజ్ఞ, జడ, దృశ్యాది విశేషణములును వ్రాయబడి యుండునో యటనట బరమేశ్వరుని గ్రహణము జరుగదు. అతడుత్పత్తి మున్నగు వ్యవహారములకు వేఱుగనుండును. పై మంత్రములందుత్పత్తి మున్నగు వ్యవహారములున్నవి. కావుననే యిట 'విరాట్' మున్నగు నామముల వలన బరమేశ్వరుడు గ్రహింపబడక సాంసారిక - ప్రాకృతిక పదార్థములు గ్రహింపబడును. కాని, యెక్కడెక్కడ సర్వజ్ఞాది విశేషణము లుండునో యక్కడే పరమాత్మయు, నెట నెట నిచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, సుఖ దుఃఖములు,మఱియు నల్పజ్ఞాది విశేషణములు నుండునో యట నట జీవుడు గ్రహింపబడును. ఇట్లే యంతట నెఱుగవలయును. కారణమేమన బరమేశ్వరునకు జన్మ మరణము లెన్నడు నుండవు. కావున విరాడాది నామముల వలన జన్మాది విశేషణములుండుటచే జగత్తున గల జడములను జీవాది పదార్థములను గ్రహించుట యుచితము. పరమేశ్వరుని గ్రహించుట తగదు.

ఇక విరాడాది నామముల వలన నెట్లు పరమేశ్వరుని గ్రహింపబడునో యా ప్రకారము నిమ్నలిఖిత ప్రమాణముల వలన నెఱుగుడు.

('ఓమ్' నకు విస్తృత వ్యాఖ్య)

ఓంకారార్థము:- 'వి' ఉపసర్గ పూర్వక 'రాజృదీప్తౌ' అను ధాతువునకు 'క్విప్' ప్రత్యయము చేర్చిన 'విరాట్' శబ్దము సిద్ధమగును. 'యో వివిధం నామ చరాచరం జగద్ రాజయతి ప్రకాశయతి స విరాట్' వివిధము - బహుప్రకారమగు జగత్తును బ్రకాశితము చేయువాడు కావున 'విరాట్' నామము వలన బరమేశ్వరుడు గ్రహింపబడును.

'అంచు - గతి పూజనయోః' అగ, అగి గత్యర్థక ధాతువులు. వీనివలన 'అగ్ని' శబ్దము సిద్ధమగును. గతేస్త్రయోఽర్థాః, జ్ఞానం గమనం ప్రాప్తిశ్చేతి, పూజనం నామ సత్కారః.' యోఽంచతి, అచ్యతే, అగతి, అంగతి ఏతి వా సోఽయ మగ్నిః' జ్ఞానస్వరూపుడు, సర్వజ్ఞుడు, తెలిసికొనుటకు, బొందుటకును యోగ్యుడు కావున బరమేశ్వరుని నామము 'అగ్ని'.

'విశ - ప్రవేశనే' ధాతువువలన విశ్వశబ్దము సిద్ధమగును. "విశన్తి ప్రవిష్టాని (భవన్తి) సర్వాణ్యాకాశాదీని భూతాని యస్మిన్, యో వాఽకాశాదిషు సర్వేషు భూతేషు ప్రవిష్టః స విశ్వ ఈశ్వరః." ఆకాశాది సర్వభూతములు నెవనియందు బ్రవేశించియున్నవో లేక యెవడు వీనియందు వ్యాప్తుడై ప్రవేశించి యున్నాడో యా పరమేశ్వరుని నామము 'విశ్వుడు'. ఇట్టి నామములు (ఓమ్ లోని) అకార మాత్ర వలన గ్రహింపబడును.

'జ్యోతిర్ వై హిరణ్యమ్'; (శత. ౬.౭.౧.౨) 'తేజో వై హిరణ్యమ్' తై.బ్రా.౮, ౧, ౯, ౧ 'ఇత్యైతరేయ శతపథ బ్రాహ్మణే'. 'యోహిరణ్యానాం సూర్యాదీనాం తేజసాం గర్భ ఉత్పత్తినిమిత్త మధికరణం స హిరణ్య గర్భః'. ఎవనియందు దేజోవంతములగు సూర్యుడు మున్నగులోకము లుత్పన్నములై యెవని యాధారమున నుండునో లేక యెవడు సూర్యాది తేజః స్వరూప పదార్థముల యుత్పత్తికి నిమిత్త కారణమో యా పరమేశ్వరునకు 'హిరణ్య గర్భుడు' అని నామము. ఇందుకు యజుర్వేద మంత్రము ప్రమాణము.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే, భూతస్య జాతః పతిరేక ఆసీత్। స దాధార

పృథివీం ద్యాముతేమాం, కస్మై దేవాయ హవిషా విధేమ ।। యజు. ।। –౧౩–౪

ఇట్టి స్థలములందు హిరణ్యగర్భుడను పదము వలన బరమేశ్వరుడే గ్రహింపబడును.

'వా – గతి గంధనయోః' ఈ ధాతువు వలన 'వాయు' శబ్దము సిద్ధించును. 'గంధనమ్ – హింసనమ్' 'యో వాతి చరాచరం జగద్ధరతి (జీవయతి ప్రలయతి) బలినాం బలిష్ఠః స వాయుః' చరాచరజగత్తు యొక్క ధారణ జీవన ప్రలయముల నొనర్చువాడు, సర్వ బలవంతులకంటె బలవంతుడును గావున నా యీశ్వరునకు 'వాయువు' అని పేరు.

'తిజ – నిశానే' ఈ ధాతువు వలన 'తేజః' అను పదము, దానికి బరమున 'తద్ధిత అణ్' ప్రత్యయము (స్వార్థమున) చేర్చిన 'తైజసః' – తైజసుడు అను శబ్దము సిద్ధించును. తాను స్వయం ప్రకాశుడై, సూర్యాదులను దేజస్సుగల లోకములుగా బ్రకాశింపజేయువాడు కావున, నీశ్వరునకు 'తైజసుడు' అను నామము కలుగుచున్నది. ఇట్టి నామార్థములు ఉకార మాత్రవలన గ్రహింపబడును.

'ఈశ – ఐశ్వర్యే' అను నీ ధాతువు వలన ఈశ్వర శబ్దము సిద్ధమగును. 'య ఈష్టే సర్వైశ్వర్యవాన్ వర్తతే స ఈశ్వరః ' ఎవనికి సత్య విచార శీలము, జ్ఞానము, ననంతమగు నైశ్వర్యము నున్నవో యా పరమేశ్వరునకు 'ఈశ్వరుడ'ని నామము.

'దో – అవఖండనే' ఈ ధాతువునకు నఞ్ అవ్యయము ఉపపదముగా జేర్చిన 'అదితి' పదము, దీనికి బరమున 'తద్ధిత' (ణ్య ప్రత్యయము) చేర్చిన 'ఆదిత్య' శబ్దము సిద్ధించును. 'న విద్యతే వినాశో యస్య సోఽయ మదితిః; 'అదితిరేవ ఆదిత్య' ఎవని కెన్నడు నాశములేదో యా యీశ్వరునకు 'ఆదిత్యుడ'ని సంజ్ఞ – నామము.

'జ్ఞా – అవబోధనే' ప్రపూర్వముగల యీ ధాతువు వలన 'ప్రజ్ఞ' శబ్దము సిద్ధమగును. 'యః ప్రకృష్టతయా చరాచరస్య జగతో వ్యవహారం జానాతి స ప్రజ్ఞః ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః. భ్రాంతిరహిత జ్ఞానము కలవాడై చరము అచరము నగు సర్వజగత్తు యొక్క వ్యవహారములను యథావత్ ఉన్నవి యున్నట్లు తెలిసికొను నీశ్వరునకు 'ప్రాజ్ఞుడ'ని నామము. ఇట్టి నామార్థములు 'మ'కార మాత్ర వలన గృహీతము లగును. ఒక్కొక్క మాత్ర మూడు మూడర్థము లిట వ్యాఖ్యానింప బడినట్లే యితర నామార్థములును 'ఓం'కారము వలన దెలియ బడుచున్నవి.

(మంత్రమునగల మిత్ర ఆది నామముల వ్యాఖ్య.)

"శంనో మిత్రః శం" ఈ మంత్రమున గల మిత్రుడు మున్నగు నామములు కూడ బరమేశ్వరునివే. ఏలయన స్తుతి ప్రార్థనోపాసనలు శ్రేష్ఠుని గూర్చియే చేయబడును. గుణ కర్మ స్వభావము లందును సత్యవ్యవహారము లందును నందఱికంటె నధికుడైనవాడు శ్రేష్ఠుడగును. అట్టి శ్రేష్ఠులైన వారిలో నెల్లరలోను నధిక శ్రేష్ఠుడైన వానిని బరమేశ్వరుడందురు. అతనికి సమానుడు భూత భవిష్యద్వర్తమానముల లేడు. తుల్యుడు సమానుడే లేనపు డధికు డెట్లుండగలడు? పరమేశ్వరునకు సత్యము, న్యాయము, దయ, సర్వసామర్థ్యము, సర్వజ్ఞత్వము మున్నగు ననంత గుణములున్నట్లితరమగు నేజడ పదార్థమునకు గాని, జీవునకు గాని లేవు. సత్యమైన పదార్థముయొక్క గుణ కర్మ స్వభావములును సత్యములే యగును.

కావున నీశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలు చేయుట మనుజులకు దగును. అతనికంటె భిన్నుడైన

వానిని గూర్చి చేయుట తగదు. ఏలయన బ్రహ్మ, విష్ణువు, మహాదేవుడు నను నామములు గల పూర్వజులైన మహాశయులు విద్వాంసులు, దైత్యదానవులు మున్నగు నికృష్ట మానవులు, నితరులైన సాధారణ మనుష్యులును బరమేశ్వరునందే విశ్వాసమునుంచి, యతనిని గూర్చియే స్తుతి, ప్రార్థన, ఉపాసనలు చేసిరి. అతని కంటె భిన్నుని గూర్చి చేయరైరి. అట్లు చేయుటయే మనకందఱకు నుచితము. దీనిని గూర్చి విశేష విచారణము ముక్తి, ఉపాసన విషయమున జేయబడును.

(ఇట మిత్రాది నామములు ఈశ్వర వాచకములే)

ప్రశ్న:- మిత్రాది నామములవలన సఖుడు - స్నేహితుడు, ఇంద్రాది దేవతలు ననువారికి జెందిన ప్రసిద్ధ వ్యవహారము చూడబడుట వలన నా నామములచే వారినే గ్రహింపవలయును.

ఉత్తరము:- ఇట ( ఈ మంత్రమున) వారిని గ్రహించుట తగదు. ఏలయన నొక మనుష్యు డొకరికి మిత్రుడైన మఱియొకనికి శత్రువు, నింకొకని యెడ నుదాసీనుడు నగుట చూచుచున్నాము. కావున (నిట) మనుష్యార్థమున సఖుడు మున్నగు వారిని గ్రహింపవలను పడదు. కాని పరమేశ్వరుడు సమస్త జగత్తునకు నిశ్చిత మిత్రుడు. అతడెవరికిని శత్రువు కాడు. ఎవరి యెడలను నుదాసీనుడును గాడు. అతని కంటె భిన్నుడైన యే జీవుడు నెన్నడు నీ విధముగ వర్తింపజాలడు. కావున నిట బరమాత్మనే గ్రహింపవలయును. కాని, గౌణార్థమున మిత్రాది శబ్దముల వలన సుహృదాది మనుష్యులను గ్రహింపవచ్చును.

'ఞి మిదా - స్నేహనే' ఈ ధాతువునకు బరమున 'క్త్ర' ప్రత్యయము ఔణాదికము చేర్చిన 'మిత్ర' శబ్దము సిద్ధమగును. "మేద్యతి స్నిహ్యతి స్నిహ్యతే వా స మిత్రః" అందఱను బ్రేమించి, యందఱిచే బ్రేమింపబడుటకు యోగ్యుడగుట వలన నా పరమేశ్వరునకు 'మిత్రుడ'ని నామము.

'వృఞ్ - వరణే, వర -ఈప్సాయామ్' అను నీ ధాతువులకు బరమున ఉణాది 'ఉనన్' ప్రత్యయము చేర్చుట వలన 'వరుణ' శబ్దము సిద్ధమగును. "యః సర్వాన్ శిష్టాన్ ముముక్షూన్ ధర్మాత్మనో వృణోతి, అథవా యః శిష్టైర్ముముక్షుభిర్ ధర్మాత్మభిర్ వ్రియతే వర్యతే వా స వరుణః పరమేశ్వరః" సర్వాన్ శిష్టాన్= ఆత్మ యోగులను విద్వాంసులను, ముక్తిని గోరు ముక్తులను, ధర్మాత్ములను స్వీకరించువాడును, లేక శిష్టులు, ముముక్షువులు, ముక్తులు, ధర్మాత్ములు నైనవారిచే గ్రహింపబడువాడును నగు నీశ్వరునకు 'వరుణుడ'ని నామము. 'అథవా వరుణో - నామ వరః శ్రేష్ఠః' పరమేశ్వరు డందఱకంటె శ్రేష్ఠుడు; కావున నతని నామము వరుణుడు.

'ఋ -గతిప్రాపణయోః; ఈ ధాతువునకు బరమున 'యత్' ప్రత్యయము జేర్చిన 'అర్య' శబ్దము సిద్ధమగును. 'అర్య' పూర్వక 'మాఙ్-మానే' అను నీ ధాతువునకు బరమున 'కనిన్' ప్రత్యయము చేర్చిన 'అర్యమా' శబ్దము సిద్ధమగును. 'యోఽర్యాన్ స్వామినో న్యాయాధీశాన్ మిమీతే మాన్యాన్ కరోతిసోఽర్యమా'. సత్యన్యాయ మొనర్చువాడును, మానవులకు మాన్యుడును, బాపపుణ్యముల నొనర్చువారికి బాపపుణ్యముల ఫలములను సరిగా, సత్యముగా నియమ కర్తయు నగుటచే బరమేశ్వరునకు 'అర్యముడ'ని పేరు.

'ఇది - పరమైశ్వర్యే' ఈ ధాతువునకు బరమున 'రన్' ప్రత్యయము జేర్చినందున 'ఇంద్ర' శబ్ద మేర్పడును. 'య ఇన్దతి పరమైశ్వర్యవాన్ భవతి స ఇన్ద్రః పరమేశ్వరః' అఖిలైశ్వర్య యుక్తుడగుటవలన బరమేశ్వరునకు 'ఇంద్రుడ'ని నామము.

'బృహత్' శబ్దము పూర్వమునగల 'పా-రక్షణే' అను నీ ధాతువునకు బరమున 'డతి' ప్రత్యయమును జేర్చి, 'బృహత్' లోని తకారమును లోపింపజేసి, 'సుడాగమ' మైనందున 'బృహస్పతి' శబ్దము సిద్ధమగును. 'యో బృహతామ్ ఆకాశాదీనాం పతిః స్వామీ పాలయితా స బృహస్పతిః' గొప్పవారికంటె గొప్పవాడును, గొప్పవి యగు నాకాశాది బ్రహ్మాండములకు స్వామియు నగుటవలన నా పరమేశ్వరునకు 'బృహస్పతి' యని పేరు.

"విష్ల్ - వ్యాప్తౌ" ఈ ధాతువునకు 'ను' ప్రత్యయము జేర్చిన "విష్ణు" శబ్ద మేర్పడును. "వేవేష్టి వ్యాప్నోతి చరాచరం జగత్ స విష్ణుః" చరము, నచరమునగు జగత్తున వ్యాపకుడగుటవలన బరమాత్మునకు "విష్ణువు" అని నామము.

"ఉరుర్ మహాన్ క్రమః పరాక్రమో యస్య స ఉరుక్రమః," అనంత పరాక్రమ యుక్తుడగుట వలన బరమాత్మునకు "ఉరుక్రముడు" అని నామము. పరమేశ్వరుడు ఉరుక్రమః = మహాపరాక్రమ యుక్తుడు. మిత్రః = ఎల్లరకు మిత్రుడు నవిరోధియు; శమ్ = సుఖకారకుడు, అతడు వరుణః = సర్వోత్తముడు, అతడు, శమ్ = సుఖస్వరూపుడు, అతడు, అర్యమా = న్యాయాధీశుడు, శమ్ = సుఖప్రచారకుడు; అతడు, ఇంద్రః = ఇంద్రుడు - సకలైశ్వర్యవంతుడు, శమ్ = సకలైశ్వర్య దాయకుడు, అతడు, బృహస్పతిః = సర్వాధిష్ఠాత; విద్యాప్రదుడు, విష్ణుః = అన్నింటియందు వ్యాపకుడు నైన యా పరమేశ్వరుడు, నః = మాకు, శం భవతు = కల్యాణకారకుడగు గాక!

"వాయో! తే బ్రహ్మణే నమోఽస్తు". బృహ, బృహి = వృద్ధౌ, ఈ ధాతువు వలన బ్రహ్మ శబ్దము సిద్ధమైనది. అందఱపై నన్నింటిపైన విరాజమానుడు, నన్నింటికంటె బెద్దయు, ననంత బలయుక్తుడునగు బరమాత్ముడునైన యా బ్రహ్మమునకు మేము నమస్కరించుచున్నాము. ఓ పరమేశ్వర! "త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" = నీవే యంతర్యామి రూపమున ప్రత్యక్ష బ్రహ్మవు. "త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి" = నేను నిన్నే ప్రత్యక్ష బ్రహ్మమని చెప్పుదును. ఏలయన నీ వంతట వ్యాప్తుడవై యున్నావు. "ఋతం వదిష్యామి" = వేదమున గల యథార్థములగు నీ యాజ్ఞలను నెల్లరకు నుపదేశింతును, ఆచరింతును గూడ. "సత్యం వదిష్యామి" = సత్యము చెప్పుదును, సత్యము నంగీకరింతును, సత్యమునే యాచరింతును, "తన్మామవతు" = కావున మీరు నన్ను రక్షింపుడు. "తద్వక్తారమవతు" = కావున నాప్తుడను, సత్యవక్తను నగు నన్ను రక్షింపుడు. అందువలన మీ యాజ్ఞ యందు నా బుద్ధి స్థిరమై విరుద్ధ మెన్నడు గాకుండునుగాక! ఏలయన మీ యాజ్ఞయే ధర్మము; దానికి విరుద్ధమైనది యధర్మమై యున్నది.

"అవతు మామ్ అవతు వక్తారమ్" రెండవ పర్యాయ మీవాక్య మధికార్థము కొఱకు బఠింపబడినది. అది యెట్లనః "కశ్చిత్ కంచిత్ ప్రతి వదతి త్వం గ్రామం గచ్ఛ గచ్ఛ" ఒక డొకని నుద్దేశించి నీవు గ్రామమునకు వెళ్ళు, వెళ్ళు. అని పలికిన వాక్యము నందలి 'వెళ్ళు' అను క్రియను రెండు పర్యాయము లుచ్చరించుటవలన నీవు త్వరగా గ్రామమునకు వెళ్ళుమని సిద్ధమగును. అట్లే యిక్కడ మీరు నన్నవశ్యము తప్పక రక్షింతురుగాక! అనగా ధర్మమునందు సునిశ్చిత ప్రీతియు, నధర్మమునెడ నెల్లపుడు ఘృణయు నేను కలిగియుండునట్లు నాపై గృపజూపుడు. మీ మహోపకారము నెన్నడు మఱవకుందును.

(త్రివిధ తాప నివారణము)

(ఓ౩మ్ శాంతిః శాంతిః శాంతిః ) ఇందు ముమ్మాఱు శాంతిని బఠించుటలో బ్రయోజనమిది. ఈ

ప్రపంచము (సంసారము) న వివిధ తాపములు - ముప్విధములగు దుఃఖము లున్నవి. అందొకటి 'ఆధ్యాత్మికము' ఆత్మా - శరీరమునందలి యవిద్య, రాగద్వేషములు, మూర్ఖత, జ్వరము పీడ - బాధ మున్నగునవి. రెండవది 'ఆధిభౌతికము'. శత్రువు. వ్యాఘ్రము, సర్పము మున్నగు వాని నుండి కలుగు బాధ. మూడవది 'ఆధిదైవికము'. అతివృష్టి, యతి శీతము, నత్యుష్ణత యను వీని వలన మనస్సు, ఇంద్రియముల యశాంతి వలనను గలుగు బాధ. (ఓ పరమేశ్వర!) ఈ ముప్విధములగు క్లేశములనుండి మీరు మమ్ము దూరముచేసి, కల్యాణ కారకములగు గర్మములందు నెల్లప్పుడు బ్రవృత్తి గల వారినిగ జేయుదురు గాక! ఏలయన మీరే కల్యాణ స్వరూపులు; సర్వసంసారము (ప్రపంచము)నకు గల్యాణమొనర్చు వారు. ధార్మికులగు ముముక్షువులకు గల్యాణ మొడగూర్చు వారును. కావున మీరు స్వయముగ దయతో నెల్ల జీవుల హృదయమునందు బ్రకాశితులగుదురుగాక! అందువలన జీవులెల్లరు ధర్మము నాచరించి, యధర్మమును విడిచి పరమానందమును బొందుదురు. దుఃఖముల నుండి దూరముగ నుందురు.

(ఈశ్వరుని యితర నామముల వ్యాఖ్య)

(సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ-యజు. ౭.౪౨.) ఈ యజుర్వేద వచనము వలన, 'జగత్' - ప్రాణులు, చేతనములు - జంగమములు - చలించునవి, తిరుగాడునవియు. తస్థుషః - అప్రాణులు - స్థావర జడములు - పృథివ్యాదులు. వీని కన్నిటికి నాత్మయగుట వలన, స్వప్రకాశ రూపుడై సర్వమును బ్రకాశింపజేయుట వలనను బరమేశ్వరునకు 'సూర్యుడ'ను నామము.

'అత - సాతత్యగమనే' ఈ ధాతువు వలన 'ఆత్మా' శబ్దము సిద్ధించును. 'యోఽతతి వ్యాప్నోతి స ఆత్మా' సర్వజీవులు మొదలైన జగత్తునందు (చరాచరము) నిరంతరముగ వ్యాపించియుండువాడు 'ఆత్మ'. 'పరశ్చాసా వాత్మా చ, య ఆత్మభ్యో జీవేభ్యః సూక్ష్మేభ్యః పరోఽతిసూక్ష్మః స పరమాత్మా' సర్వజీవాదుల కంటె నుత్కృష్టుడు, జీవులు, ప్రకృతి, యాకాశము నునువాని కన్నింటి కంటెను నతి సూక్ష్ముడు, సర్వజీవులలో నంతర్యామి యగు నాత్మ యగుట వలనను నీశ్వరునకు 'పరమాత్మ' యని నామము.

సామర్థ్యముగల వానికి 'ఈశ్వరుడ'ని నామము. 'యః ఈశ్వరేషు సమర్థేషు పరమః శ్రేష్ఠః స పరమేశ్వరః' ఈశ్వరులకు (నీశ్వరుడు) అనగా సమర్థులలో సమర్థుడు. తనకు దుల్యుడైనవాడు మఱియొకడు లేనివాడు నగుటచే నీశ్వరునకు 'పరమేశ్వరుడ'ని నామము.

'షుఞ్ - అభిషవే', 'షూఙ్ - ప్రాణి గర్భ విమోచనే'. అను నీ ధాతువుల వలన 'సవితా' శబ్దము సిద్ధమగును. 'అభిషవః ప్రాణిగర్భ విమోచనం చోత్పాదనమ్' 'యశ్చరాచరం జగత్ సునోతి సూతే వోత్పాదయతి స సవితా పరమేశ్వరః' సర్వ జగత్తు నుత్పన్నము చేయును. కావున బరమేశ్వరునకు 'సవితా' యని పేరు.

"దివు - క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద మదస్వప్న కాంతి గతిషు" అను నీ ధాతువు వలన దేవ శబ్దము సిద్ధమగును. క్రీడా = శుద్ధమగు జగత్తును గ్రీడింప జేయువాడు. విజిగీషా = ధార్మికులను జయింప జేయగోరువాడు, వ్యవహార = చేష్టల కన్నింటికి సాధనములను, నుపసాధనములను నొసంగువాడు, ద్యుతి = స్వయం ప్రకాశ రూపుడై సమస్తమును బ్రకాశింప జేయువాడు, స్తుతి = ప్రశంసింప దగినవాడు, మోద = స్వయముగ నానంద స్వరూపుడై యితరుల కానందము నొసంగువాడు, మద = మదముతో నున్మత్తులైన వారిని దండించువాడు, స్వప్న = ఎల్లరి శయనార్థము రాత్రిని, బ్రళయమును

జేయువాడు, కాంతి = కామింపదగినవాడు, గతి = జ్ఞాన స్వరూపుడు – కావున నా పరమేశ్వరునకు 'దేవుడ'ని నామము.

'అథవా యో దీవ్యతి క్రీడతి స దేవః'. పరమేశ్వరుడు తన స్వరూపమున నానందముతో స్వయముగా గ్రీడించును, లేక యెవరి సాహాయ్యము లేకయే యాటవలె సహజ స్వభావముతో సమస్త జగత్తును నిర్మించును, లేక సర్వ క్రీడలకు నాధారము. (యో) విజిగీషతే స దేవః. ఎల్లరను జయించువాడు, స్వయముగ నజేయుడు. అనగా నతని నెవడును జయింపజాలడు. (యో) వ్యవహారయతి స దేవః; న్యాయాన్యాయ రూప వ్యవహారముల నెఱుగువాడు, ఉపదేశించు వాడును. యశ్చరాచరం జగత్ ద్యోతయతి (స దేవః). సమస్త (చరాచరాత్మక) జగత్తును బ్రకాశింపజేయువాడు. 'యస్తూయతే స దేవః = సర్వ మానవుల స్తుతికి యోగ్యుడై నిందకు యోగ్యుడు కానివాడు. యో మోదయతి స దేవః = స్వయముగ నానంద స్వరూపుడై యితరుల నానందింప జేయువాడు. అతనికి దుఃఖము లేశమాత్రమును గలుగదు. యో మాద్యతి స దేవః = ఎల్లప్పుడు హర్షితుడై, శోక రహితుడై యితరులను హర్షింపజేయుచు వారిని దుఃఖముల నుండి వేఱుగా నుంచువాడు పరమేశ్వరుడు. యః స్వాపయతి స దేవః = ప్రళయ సమయమున నవ్యక్త(ప్రకృతి)మున సర్వజీవులను శయనింప జేయువాడు. యః కామయతే కామ్యతే వా స దేవః = అతని కామములన్నియు సత్యములు; శిష్టులెల్లరు నతనిని బొందగోరుదురు. అట్లే, యో గచ్ఛతి గమ్యతే వా స దేవః = సమస్తమున వ్యాప్తుడై యెల్లరకు దెలియదగిన వాడగుట వలన నా పరమేశ్వరునకు 'దేవుడు' అని నామము.

'కుబి–ఆచ్ఛాదనే; ఈ ధాతువు వలన కుబేర శబ్దము సిద్ధించును. 'యః సర్వం కుమ్బతి స్వవ్యాప్త్యాచ్ఛాదయతి స కుబేరో జగదీశ్వరః' = తన వ్యాప్తితో సమస్తమును గప్పియుండువాడు కావున పరమేశ్వరునకు 'కుబేరుడ'ని నామము.

'పృథు–విస్తారే, ఈ ధాతువువలన 'పృథివీ' శబ్దము సిద్ధమగును. 'యః పర్థతి సర్వం జగత్ విస్తృణాతి పృథివీ' సమస్త విస్తృత జగత్తును విస్తరింపజేయువాడు కావున బరమేశ్వరునకు నామము 'పృథివి'.

'జల–ఘాతనే' ఈ ధాతువు వలన "జల" శబ్దము సిద్ధమగును. "జలతి ఘాతయతి దుష్టాన్, సంఘాతయతి అవ్యక్త పరమాణ్వాదీన్ తద్ బ్రహ్మ జలమ్" = దుష్టులను దండించువాడును, అవ్యక్త – పరమాణువుల పరస్పర సంయోగ వియోగముల నొనర్చువాడును నగుటచే బ్రహ్మమునకు "జలమ"ని నామము.

("యద్వా యజ్జనయతి లాతి సకలం జగత్ తద్ బ్రహ్మ జలమ్" సమస్తమునకు జనకుడు, సమస్త సుఖముల నిచ్చువాడు నగుటచే బరమేశ్వరునకు "జలమ"ని పేరు.)

"కాశృ – దీప్తౌ" (ఆఙ్ పూర్వకమగు) నీ ధాతువు వలన "ఆకాశ" శబ్దము సిద్ధమగుచున్నది. "యః సర్వతః సర్వం జగత్ ప్రకాశయతి స ఆకాశః" అన్ని వైపుల నుండి జగత్తును బ్రకాశింపజేయు వాడగుటంజేసి పరమాత్మునకు "ఆకాశము" అని పేరు.

**"అద భక్షణే" ఈ ధాతువు వలన "అన్న" శబ్ద మేర్పడును.**

**'అద్యతేఽత్తి చ భూతాని తస్మాదన్నం తదుచ్యతే**

**'అహమన్న మహమన్న మహమన్నమ్'**

'అహమన్నాదోఽహమన్నాదోఽహమన్నాదః'

తై. ఉ. బ్రహ్మానందవల్లీ౨, భృగు.వ. ౧౦

'అత్తా చరాచర గ్రహణాత్ ఇది వ్యాసమునికృత శారీరక సూత్రము ౧.౨.౯.

"సమస్తము తనలో నుంచుకొనుటకు, సర్వమును గ్రహించుటకును యోగ్యుడు, చరాచర జగత్తును గ్రహించువాడును నగుటవలన నీశ్వరునకు అన్నము, అన్నాదుడు, అత్త - యని నామములు. (పై వాక్యములలో అన్నమ్, అన్నాదః) అను పదములు ముమ్మారు పఠించుట యాదరార్థమని తెలిసికొనవలయును. మేడిపండునందు పురుగులు పుట్టి యందే యుండి, నశించునట్లు పరమేశ్వరుని యందు జగత్తు వ్యవస్థయు నున్నది.

."వస - నివాసే" అను ధాతువు వలన 'వసు' శబ్దము సిద్ధమగుచున్నది. 'వసన్తి భూతాని యస్మిన్ అథవా యః సర్వేషు వసతి స వసురీశ్వరః' ఆకాశాది సర్వ భూతములు నతని యందు వసించును. అతడన్నిటి యందును వసించుచున్నాడు కావున బరమేశ్వరునకు "వసువు" అని పేరు.

"రుదిర్ - అశ్రు విమోచనే" ఈ ధాతువునకు బరమున "ణిచ్" 'రక్' ప్రత్యయములు చేర్చిన "రుద్ర" శబ్దమేర్పడును. యో రోదయత్యన్యాయ కారిణో జనాన్ స రుద్రః" దుష్కర్మల నొనర్చు వారి నేడ్పించు వాడు కావున బరమేశ్వరునకు "రుద్రుడు" అని పేరు.

'యన్మనసా ధ్యాయతి తద్వాచా వదతి, యద్ వాచా వదతి తత్ కర్మణా కరోతి, యత్ కర్మణా కరోతి తదభిసంపద్యతే' ఇది యజుర్వేదపు బ్రాహ్మణ వచనము (శత-౧౪-౭-౨-౭). జీవుడు మనస్సుతో ధ్యానించు దానిని వాణితో జెప్పును. వాణితో జెప్పిన దానిని గర్మగా నాచరించును. చేసిన దానిని బొందును. దీనివలన జీవుడెట్టి కర్మల నాచరించునో యట్టి ఫలములనే బొందునని సిద్ధమగుచున్నది. దుష్కర్మల నాచరించు జీవుడు, ఈశ్వరుని న్యాయరూప వ్యవస్థవలన దుఃఖ రూప ఫలమును బొందినప్పు డేడ్చును. ఇట్లే యీశ్వరుడు జీవుల నేడ్పించును. కావున బరమేశ్వరునకు "రుద్రుడు" అని పేరు.

'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః

తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః' – మను. ౧.౧౦

జలమునకు, జీవులకు నామము 'నారా' అవి అయనము - నివాస స్థానము కావున, సర్వ జీవులందును వ్యాపకుడైన పరమేశ్వరునకు 'నారాయణుడు' అని పేరు.

'చది-ఆహ్లాదే' అను నీ ధాతువు వలన 'చన్ద్ర' శబ్దము సిద్ధమగును. 'యశ్చన్దతి చందయతి వా స చంద్రః' ఆనంద స్వరూపుడై యెల్లరకు నానందము కలిగించువాడు. కావున బరమేశ్వరునకు 'చంద్రుడు' అని పేరు.

'మగి-గత్యర్థకః' ధాతువు. దానికి 'మఙ్గేరలచ్' ఉణాది ౫-౭౦ అను సూత్రము ననుసరించి 'అలచ్' ప్రత్యయము చేర్చుటవలన 'మంగల' శబ్దమేర్పడును. 'యో మంగతి మంగయతి వా స మంగలః' స్వయముగా మంగళ స్వరూపుడై సమస్త జీవుల మంగళమునకు గారణమగుటచే బరమేశ్వరునకు 'మంగళుడు' అని పేరు.

'బుధ - అవగమనే' ధాతువు వలన "బుధ" శబ్ద మేర్పడును. "యో బుధ్యతే బోధయతి వా స

బుధః." స్వయముగ బోధ స్వరూపుడై యెల్ల జీవుల బోధకు గారణ మగుటవలన బరమేశ్వరునకు 'బుధుడు' అని పేరు. "బృహస్పతి" శబ్దమున కర్థము పూర్వమే చెప్పబడినది.

' ఈ శుచిర్ – పూతీ భావే' ఈ ధాతువు వలన 'శుక్ర' శబ్దము సిద్ధమగును. 'యః శుచ్యతి శోచయతి వా స శుక్రః" అత్యంత పవిత్రుడైన యతని సాంగత్యము వలన జీవుడు పవిత్రు డగును, కావున నీశ్వరునకు 'శుక్రుడు' అని పేరు.

'చర – గతి భక్షణయోః' అను నీ ధాతువునకు బూర్వము 'శనైస్' ఉప పదముగా జేర్చుటవలన 'శనైశ్చరః' శబ్దము సిద్ధించును. "యః శనై శ్చరతి స శనై శ్చరః" అన్నింటి యందును సహజముగా బ్రాప్తుడైన ధైర్యవంతుడు, కావున బరమేశ్వరునకు 'శనైశ్చరుడు' అని నామము.

'రహ – త్యాగే' ఈ ధాతువు వలన 'రాహు' శబ్దము సిద్ధమగుచున్నది. 'యో రహతి పరిత్యజతి దుష్టాన్, రాహయతి త్యాజయతి (వా) స రాహు రీశ్వరః'. ఏకాంత స్వరూపుడైన యెవని స్వరూపమున నితరపదార్థములు సంయుక్తములు కావో యట్టివాడును, దుష్టులను విడుచువాడును, నన్యులను విడిపింపజేయు వాడును గావున బరమేశ్వరునకు 'రాహువు' అని పేరు.

'కిత – నివాసే, రోగాపనయనే చ'. ఈ ధాతువు వలన 'కేతు' శబ్దము సిద్ధమగును. 'యః కేతయతి చికిత్సతి వా స కేతురీశ్వరః'. సమస్త జగత్తునకు నివాస స్థానము, సర్వరోగ రహితుడు, ముముక్షువులను ముక్తి సమయమున (జరా మరణాది) సర్వరోగముల నుండి విడిపింపజేయువాడును గాబట్టి పరమేశ్వరునకు 'కేతువు' అని పేరు.

'యజ – దేవపూజా సంగతికరణ దానేషు'. ఈ ధాతువు వలన యజ్ఞ శబ్దము సిద్ధించును. 'యజ్ఞో వై విష్ణుః (శత. ౧౩. ౧. ౮. ౮.) ఇది బ్రాహ్మణగ్రంథ వచనము. 'యో యజతి విద్వద్భిరిజ్యతే వా స యజ్ఞః' సర్వజగత్ పదార్థములను సంయుక్తము చేయువాడు, నెల్ల విద్వాంసులకు బూజ్యుడు, బ్రహ్మ ప్రభృతి సర్వర్షులకు, మునులకు నెల్లప్పుడు పూజ్యుడు. మఱియు నతడు సర్వ వ్యాపకుడు గావున బరమాత్మునకు 'యజ్ఞము – యజ్ఞుడు' అని పేరు.

'హు – దానాऽऽదనయోః' ఆదానే చేత్యేకే. ఈ ధాతువు వలన 'హోతా' అను శబ్దము సిద్ధమగును. 'యో జుహోతి స హోతా'. జీవుల కీదగిన పదార్థముల నిచ్చువాడు, గ్రహింపదగినవానిని గ్రహించువాడు, కావున బరమేశ్వరునకు 'హోత' అని నామము.

'బన్ధ – బన్ధనే' ఈ ధాతువు వలన 'బంధు' శబ్దము సిద్ధమగును. 'యః స్వస్మిన్ చరాచరం జగత్ బధ్నాతి, బంధువత్ ధర్మాత్మనాం సుఖాయ సహాయో వా వర్తతే స బంధుః'. తనలో సర్వలోక లోకాంతరములను నియమములతో బంధించియున్నాడు. అందువలననే యవి తమ పరిధుల నుల్లంఘింప జాలకున్నవి. సహోదరునివలె మఱియు సహాయకుడై యున్నాడు. సోదరుడు సోదరులకు సహాయకారి యగునట్లు పరమేశ్వరుడు పృథివ్యాది లోకముల ధారణ రక్షణములు చేయుచు సుఖముల నొసంగుటచే 'బంధు' నామముగలవాడగుచున్నాడు.

'పా – రక్షణే' ఈ ధాతువు వలన 'పితా' శబ్దము సిద్ధమైనది. 'యః పాతి సర్వాన్ స పితా' ఎల్లరకు రక్షకుడు. తండ్రి తన సంతానముపై దయాళువై వారి యున్నతిని గోరునట్లు పరమేశ్వరుడు జీవుల యున్నతిని గోరును; కావున నతనికి పిత' అని నామము.

'యః పితౄణాం పితా స పితామహః, పితలకు బిత- తండ్రులకును దండ్రి కావున బరమేశ్వరునకు 'పితామహుడు' అని పేరు.

'యః పితామహానాం పితా స ప్రపితామహః' పితామహులకు – తండ్రుల తండ్రులకు బిత-తండ్రి యగుట వలన బరమేశ్వరునకు 'ప్రపితామహుడు' అని పేరు.

'మాఙ్-మానే శబ్దే చ' ఈ ధాతువు వలన 'మాతా' శబ్ద మేర్పడును, 'యో మిమీతే మానయతి సర్వాఞ్ జీవాన్ స మాతా.' పూర్ణదయా యుక్త మాత తన సంతానపు సుఖమును, నున్నతిని గోరుచున్నట్లు పరమేశ్వరుడును సర్వజీవుల వృద్ధిని గోరును; కావున నతనికి 'మాత' యని నామము.

'చర-గతి భక్షణయోః' ఆఙ్ పూర్వకమగు నీధాతువు వలన 'ఆచార్య' శబ్దము సిద్ధమగును. 'య ఆచారం గ్రాహయతి సర్వా విద్యా బోధయతి స ఆచార్య ఈశ్వరః' సత్య-ఆచారమును గ్రహింపజేయు వాడు, సర్వ విద్యల ప్రాప్తికి హేతువునై సర్వ విద్యలను బ్రాప్తింపజేయువాడు నగుటచే బరమేశ్వరుని నామము 'ఆచార్యుడు'.

'గౄ-శబ్దే' ఈ ధాతువువలన 'గురు' శబ్ద మేర్పడినది. 'యో ధర్మ్యాన్ శబ్దాన్ గృణా త్యుపదిశతి స గురుః,

'స (ఏష) పూర్వేషా మపి గురుః కాలేనానవచ్ఛేదాత్. యో.ద. ౧. ౨౬

సత్య ధర్మ ప్రతిపాదకములగు వేదముల నుపదేశించువాడై, సృష్టికి బ్రారంభమున – అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు నను ఋషులకు, బ్రహ్మాది గురువులకును గురువై యెన్నడు నాశనము చెందనివాడు కావున బరమేశ్వరునకు 'గురువు' అని నామము.

'అజ – గతి క్షేపణయోః;' 'జనీ-ప్రాదుర్భావే' అను ధాతువుల వలన 'అజ' శబ్దమేర్పడినది. 'యోఽజతి సృష్టింప్రతి సర్వాన్ ప్రకృత్యాదీన్ ప్రక్షిపతి, జనయతి, కదాచి న్నజాయతే సోఽజః'. ప్రకృతి యొక్క సర్వావయవములయిన యాకాశాది భూతముల పరమాణువులను దగినట్లు కలుపుచు, శరీరములతో జీవులకు సంబంధము కల్పించి జన్మల నొసంగుచు స్వయముగ నెన్నడు జన్మింపని వాడు కావున బరమేశ్వరునకు 'అజుడు' అని నామము.

'బృహ, బృహి వృద్ధౌ' ఈ ధాతువు వలన 'బ్రహ్మ' శబ్దము సిద్ధించును. 'యోఽఖిలం జగన్నిర్మాణేన బర్హతి (బృంహతి) వర్ధయతి స బ్రహ్మ'. సంపూర్ణ జగత్తును రచించి వృద్ధిజేయువాడు, కావున బరమేశ్వరునకు 'బ్రహ్మ' అని పేరు.

'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ'. (తై.ఉ.బ్రహ్మా.వ.౧) ఇది తైత్తిరీయోపనిషత్తు – వచనము.

'సన్తీతి సన్తః, తేషు సత్సు సాధు తత్సత్యమ్'.

'యజ్జానాతి చరాచరం జగత్ తజ్ జ్ఞానమ్'.

'న విద్యతేఽన్తోఽవధిర్ మర్యాదా యస్య తదనన్తమ్'.

'సర్వేభ్యో బృహత్వాత్ బ్రహ్మ'.

ఉన్న పదార్థమును 'సత్' అందురు. వానిలో (సత్పదార్థములలో) సాధువగుటచే బరమేశ్వరుని

నామము 'సత్యము'. 'చరాచర జగత్తు నెఱుగువాడు కావున బరమేశ్వరుని నామము 'జ్ఞానము'. అన్తము-అవధి, మర్యాద, అనగా నింత పొడవు, నింత వెడల్పు, చిన్నది, పెద్దది యను కొలత – పరిమాణములేని వాడు; కావున నా పరమేశ్వరుని నామము 'అనంతుడు' అందఱికంటె నన్నింటికంటె బెద్దయగుటచే బరమేశ్వరునకు 'బ్రహ్మము' అని పేరు.

'డుదాఞ్ దానే' ఆఙ్ పూర్వకముగు నీ ధాతువు వలన 'ఆది' పదము, నఞ్ పూర్వక 'అనాది' శబ్దము సిద్ధించును. 'యస్మాత్ పూర్వం నాస్తి, పరంచాస్తి స ఆది రిత్యుచ్యతే.' 'న విద్యతే ఆదిః కారణం యస్య సోఽనాదిరీశ్వరః.' దేనికి బూర్వమున నేదియు లేక పరమున (నేదేని) యున్న దానిని 'ఆది' యందురు. ఆది = కారణము, ఏదియు లేనివాడు కావున బరమేశ్వరుని నామము 'అనాది'.

'టునది-సమృద్ధౌ' ఆఙ్ పూర్వకముగు నీ ధాతువు వలన 'ఆనంద' శబ్ద మేర్పడుచున్నది. 'ఆనందంతి సర్వే ముక్తా యస్మిన్, యద్ వా యః సర్వాన్ జీవానానందయతి స 'ఆనందః'. ఆనంద స్వరూపుడైన యతనిలో ముక్త జీవులెల్లరు నానందము బొందుదురు. మఱియు నతడు ధర్మాత్ములగు జీవుల నానంద యుక్తులను జేయును. కావున బరమేశ్వరునకు 'ఆనందము' నామము.

'అస-భువి' ఈ ధాతువువలన 'సత్' శబ్దము సిద్ధమగును. 'యదస్తి త్రిషు లోకేషు న బాధ్యతే తత్ సత్ బ్రహ్మ'. ఎల్లపుడు నుండి భూతభవిష్యద్వర్తమాన కాలములందు బాధితముకాని పరమాత్మను 'సత్' అందురు.

'చితీ-సంజ్ఞానే' ఈ ధాతువు వలన 'చిత్' శబ్దము సిద్ధించును. 'యశ్చేతతి చేతయతి సంజ్ఞాపయతి సర్వాన్ సజ్జనాన్ యోగిన స్తచ్చిత్ పరంబ్రహ్మ' చేతన స్వరూపుడైన సర్వ జీవులకు జైతన్యము కలిగించువాడు, సత్యా సత్యముల నెఱింగించువాడును, కావున బరమేశ్వర నామము చిత్తు'. ఈ మూడు శబ్దములు విశేషణము లైనందున బరమేశ్వరుని 'సచ్చిదానంద' స్వరూపుడందురు.

యో నిత్యధ్రువోఽచలోఽవినాశీ స నిత్యః.' నిశ్చలుడు, నవినాశి యగుటవలన నీశ్వరుడు 'నిత్య' శబ్దవాచ్యుడు.

'శున్ధ - శుద్ధౌ' అను ధాతువువలన 'శుద్ధ' శబ్దము సిద్ధమగును. 'యః శున్ధతి సర్వాన్ శోధయతి వా స శుద్ధ ఈశ్వరః' స్వయముగ బవిత్రుడై, సర్వాశుద్ధుల నుండి వేఱై యెల్లరను శుద్ధము సేయువాడు కావున బరమేశ్వరుడు 'శుద్ధుడు'.

'బుధ అవగమనే' ఈ ధాతువునకు 'క్త' ప్రత్యయము చేర్చుటవలన 'బుద్ధ' శబ్దమగును. 'యో బుద్ధవాన్ సదైవ జ్ఞాతాఽస్తి స బుద్ధో జగదీశ్వరః'. ఎల్లప్పుడు నెల్లర నెఱుగువాడు కావున నీశ్వరునకు 'బుద్ధు'డని నామము.

'ముచ్ఌ-మోచనే' ఈ ధాతువువలన 'ముక్త' శబ్దమగును. 'యో ముంచతి మోచయతి వా ముముక్షూన్ స ముక్తో జగదీశ్వరః'. ఎల్లపుడు నశుద్ధుల నుండి వేఱై ముముక్షువుల నందఱను గ్లేశముల నుండి విడిపించువాడు కావున బరమాత్మ 'ముక్తుడు'. 'అత ఏవ నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావో జగదీశ్వరః'. ఈ కారణము వలననే పరమేశ్వరుని స్వభావము నిత్య శుద్ధ బుద్ధ ముక్తమై యున్నది.

'నిర్, ఆఙ్ పూర్వక డుకృఞ్-కరణే' అను నీ ధాతువు వలన 'నిరాకార' శబ్దము సిద్ధమగును. 'నిర్గత ఆకారాత్ స నిరాకారః' ఏ యాకారము లేనివాడై యెన్నడు శరీరధారణము చేయనివాడు కావున

బరమేశ్వరునకు 'నిరాకారుడు' అని నామము.

'అఞ్జూ-వ్యక్తి మ్లక్షణ కాంతి గతిషు' ఈ ధాతువు వలన 'అంజన' శబ్దము, 'నిర్' ఉపసర్గ చేర్చుట వలన 'నిరంజన' శబ్దము సిద్ధమగును. 'అంజనం వ్యక్తిర్ మ్లక్షణం కుకామనాభిర్ ఇంద్రియైః ప్రాప్తిశ్చేత్యస్మాద్ యో నిర్గతః పృథగ్ భూతః స నిరంజనః'. వ్యక్తి - ఆకారము, మ్లేచ్ఛాచారము, దుష్టకామనలు, నింద్రియముల విషయ మార్గము, నను వీని నుండి వేఱుగా నుండును. కావున బరమేశ్వరుని నామము 'నిరంజనుడు'.

'గణ - సంఖ్యానే' ధాతువు వలన 'గణ' శబ్దము సిద్ధమగును. ఈ గణ పదమునకు దరువాత 'ఈశ' 'పతి' శబ్దములనుంచిన 'గణేశ' 'గణపతి' శబ్దములు సిద్ధించును. 'యే ప్రకృత్యాదయో జడా జీవాశ్చ గణ్యన్తే సంఖ్యాయన్తే తేషా మీశః స్వామీ పతిః పాలకో వా'. ప్రకృత్యాది జడములు, జీవులునను ప్రఖ్యాత పదార్థములకు స్వామి, పాలకుడు కావున నీశ్వరునకు 'గణేశుడు' 'గణపతి' అని పేర్లు.

'యో విశ్వమీష్టే స విశ్వేశ్వరః.' సంసారము - విశ్వమున కధిష్ఠాత కావున బరమేశ్వరుని నామము 'విశ్వేశ్వరుడు.'

'యః కూటేఽనేకవిధవ్యవహారే స్వస్వరూపేణ తిష్ఠతి స కూటస్థః పరమేశ్వరః.' సర్వ వ్యాపారము లందు వ్యాప్తుడై, సర్వవ్యవహారములకు నాధారమై యుండియు నే వ్యవహారము నందును దనస్వరూపమును విడువడు కావున బరమేశ్వరునకు 'కూటస్థుడు' అని పేరు.

'దేవ' శబ్దమునకు వ్రాసిన యర్థములన్నియు 'దేవి' శబ్దమునకు నున్నవి. పరమేశ్వరుని నామములు మూడు లింగములందు నున్నవి. 'బ్రహ్మ, చితిరీశ్వరశ్చేతి'. బ్రహ్మము, చితి, ఈశ్వరుడు. ఈశ్వరునకు విశేషణమైనపుడు 'దేవుడు', చితి శబ్దమునకు విశేషణమైనపుడు 'దేవి' అగును కావున నీశ్వరనామము 'దేవి'.

'శక్ ఌ-శక్తౌ' ఈ ధాతువు వలన 'శక్తి' శబ్దమేర్పడును. 'యః సర్వం జగత్ కర్తుం శక్నోతి స శక్తిః' సర్వజగత్తును నిర్మింప సమర్థుడు కావున బరమేశ్వరుని నామము 'శక్తి'.

'శ్రిఞ్ - సేవాయాం' ఈ ధాతువు వలన 'శ్రీ' శబ్దమగును. 'యః శ్రీయతే సేవ్యతే సర్వేణ జగతా విద్వద్భిర్ యోగిభిశ్చ స శ్రీరీశ్వరః'. సమస్త జగత్తుచే, విద్వాంసులచే, యోగిజనులచే సేవింపబడువాడు కావున బరమాత్మకు 'శ్రీ' యని పేరు.

'లక్ష - దర్శనాంకనయోః' ఈ ధాతువు వలన 'లక్ష్మి' శబ్దము సిద్ధించును. 'యో లక్షయతి పశ్యతి, అంకతే చిహ్నయతి చరాచరం జగత్, అథవా వేదైరాప్తైర్ యోగిభిశ్చ యో లక్ష్యతే స లక్ష్మీః సర్వ ప్రియేశ్వరః'. సర్వ జగత్తును జూచువాడు, చిహ్నితము - దృశ్యముగ జేయువాడు; శరీరమునకు నేత్రనాసికలు, వృక్షమునకు బత్ర పుష్పములు, ఫల మూలములు, భూజలములకు కృష్ణరక్తశ్వేత వర్ణములు కలిగించువాడు, మృత్తిక, పాషాణము, సూర్యచంద్రాది చిహ్నముల నొనర్చువాడు; అట్లే యెల్లరను జూచువాడు; సర్వశోభలకు శోభయైనవాడు; వేదాది శాస్త్రములకు, ధార్మిక విద్వాంసులకు యోగులకు లక్ష్యము - చూడదగినవాడు కావున బరమేశ్వరునకు "లక్ష్మి" యని పేరు.

'సృ-గతౌ' ఈ ధాతువువలన 'సరస్' దానితో 'మతుప్' 'జీప్' ప్రత్యయములు చేర్చిన 'సరస్వతీ' శబ్దమగును. 'సరో వివిధం జ్ఞానం విద్యతే యస్యాం చితౌ సా 'సరస్వతీ'. వివిధ విజ్ఞానమనగా శబ్దము, అర్థము, వాని సంబంధము తెలిసి సరిగా బ్రయోగించు జ్ఞానముకలవాడు కావున బరమేశ్వరునకు 'సరస్వతి' అని పేరు.

'సర్వాః శక్తయో విద్యన్తే యస్మిన్ స సర్వశక్తిమానీశ్వరః' తన కార్యము చేయుటకు నితరుల సహాయతను గోరక తన సామర్థ్యము చేతనే తన కార్యములనన్నింటిని బూర్తిచేయును. కావున బరమేశ్వరునకు 'సర్వశక్తిమంతుడ'ని పేరు.

'ణీఞ్ – ప్రాపణే' ఈ ధాతువువలన 'న్యాయ' శబ్దము సిద్ధమగును. 'ప్రమాణైరర్థపరీక్షణమ్ న్యాయః' ఇది న్యాయ సూత్రములకు వాత్స్యాయన ముని వ్రాసిన భాష్యవాక్యము. 'పక్షపాత రాహిత్యాచరణం న్యాయః' ప్రత్యక్షాది ప్రమాణముల పరీక్షవలన సత్యమని సిద్ధమగునది. అట్లే పక్షపాత రహిత ధర్మరూప మగు నాచరణము 'న్యాయ' మనబడును. 'న్యాయం కర్తుం శీలం యస్య స న్యాయకారీశ్వరః'. న్యాయ మనగా బక్షపాతరహిత ధర్మాచరణమే స్వభావము కలవాడు కావున నీశ్వరునకు 'న్యాయకారి' అని పేరు.

'దయ–దాన గతి రక్షణ హింసా దానేషు' ఈ ధాతువు వలన 'దయా శబ్దము సిద్ధమగును. 'దయతే దదాతి జానాతి గచ్ఛతి రక్షతి హినస్తి యయా సా దయా, బహ్వీ దయా విద్యతే యస్య స దయాలుః, పరమేశ్వరః. అభయదాత, సత్యములగు సర్వ విద్యలజ్ఞాత, సర్వసజ్జన రక్షకుడు, దుష్టులకు యథా యోగ్యముగ దండదాత, కావున బరమేశ్వరునకు 'దయాలువు' అని పేరు.

'ద్వయోర్భావః, ద్వాభ్యామితం సా ద్వితా, ద్వీతం వా, సైవ తదేవ వా ద్వైతమ్, న విద్యతే ద్వైతం ద్వితీయేశ్వర భావో యస్మిన్ తద్ 'అద్వైతమ్' అర్థాత్ సజాతీయ, విజాతీయ స్వగతభేద శూన్యం బ్రహ్మ. రెంటియునికి, లేక రెంటితో యుక్తమై యుండుట అను ద్విత–ద్వీత లేక ద్వైత రహితము, (అద్వైతము). మనుష్యుడు సజాతీయ విజాతీయ స్వగత భేదములు కలవాడు. ఎట్లనః– మనుష్యునకు దనజాతికి జెందిన మనుష్యుడు మఱియొకడున్నాడు. భిన్నజాతికి జెందిన వృక్షపాషాణాదులు నున్నవి. మనుష్యునకు దన శరీరములోనే కన్ను ముక్కు చెవులు మున్నగు నవయవములు భిన్నముగా నున్నవి. కావున మనుష్యుడు సజాతీయ విజాతీయ స్వగత భేదములు కలవాడగుచున్నాడు. అట్లీశ్వరునకు దనజాతికి జెందిన యీశ్వరుడు మఱియొకడు కాని, తనకంటె భిన్నజాతికి జెందిన మఱియొక యీశ్వరుడు కాని, తన స్వరూపములోనే వేఱొండు తత్త్వములు కాని లేనివాడు; కావున నట్టి యీశ్వరునకు (అద్వైతము) అని పేరు.

'గుణ్యంతే యే తే గుణా వా యైర్ గుణయన్తి తే గుణాః; యో గుణేభ్యో నిర్గతః స నిర్గుణ ఈశ్వరః' సత్త్వరజస్తమస్సులు, రూపరస స్పర్శ గంధాదులు అన్నియు జడగుణములు. అవిద్య, అల్పజ్ఞత, రాగద్వేషములు, మఱియు అవిద్య, అస్మిత మున్నగు క్లేశములు జీవగుణములు. ఇట్టి జడ, జీవగుణములు శబ్ద స్పర్శ రూపాదులు లేనివాడు కావున నీశ్వరుడు 'నిర్గుణుడు'. ఈశ్వరునందు రూపరసాది గుణములు లేవనుటకు 'అశబ్ద మస్పర్శ మరూపమవ్యయమ్, కఠ. ఉ. ౩.౧౫ అను నిట్టి యుపనిషద్ వాక్యములే ప్రమాణము.

'యో గుణైః సహ వర్తతే స సగుణః.' సర్వజ్ఞత, సర్వసుఖములు, పవిత్రత, యనంత బలము మున్నగు గుణయుక్తుడు కావున నీశ్వరునకు 'సగుణుడు' అని పేరు.

పృథివి గంధాది గుణములతో గూడి 'సగుణము', (తనలో) ఇచ్ఛాది గుణములు లేనందున 'నిర్గుణము' నైనట్లు జగత్తునకు, జీవునకు సంబంధించిన గుణములు లేనందున నీశ్వరుడు 'నిర్గుణుడు' సర్వజ్ఞత్వాది గుణసహితుడగుటచే 'సగుణుడు' నని పిలువబడును. అనగా నీ విశ్వమందు సగుణత, నిర్గుణత యను నీ రెండు ధర్మములు లేని పదార్థ మొక్కటియు లేదు. చేతన గుణములు లేనందున జడము నిర్గుణమై, తన గుణములతో గూడి సగుణమగునట్లు, జడగుణములు తనలో లేనందున జీవుడు

నిర్గుణుడై తన యిచ్ఛాది గుణములతో గూడి సగుణు డగుచున్నాడు. ఇట్లే పరమేశ్వర విషయమునను నెఱుంగవలయును.

'అంతర్యన్తుం నియన్తుం శీలం యస్య సోఽయ మన్తర్యామీ' సమస్త - ప్రాణి, అప్రాణి రూపమగు జగత్తునందంతట వ్యాపకుడై సర్వమును నియమించువాడు కావున నీశ్వరునకు 'అంతర్యామి' యని నామము.

'యో ధర్మే రాజతే స ధర్మరాజః' ధర్మమునందే ప్రకాశమానుడై యధర్మ రహితుడై ధర్మమునే ప్రకాశింపజేయును కావున బరమేశ్వరునకు 'ధర్మరాజు' అని పేరు.

'యము - ఉపరమే' ఈ ధాతువు వలన 'యమ' శబ్దము సిద్ధమగుచున్నది. 'యః సర్వాన్ ప్రాణినో నియచ్ఛతి స యమః' సర్వప్రాణుల కర్మలకు ఫలముల నొసంగు వ్యవస్థ నొనర్చుచు సర్వ - అన్యాయముల నుండి వేఱుగా నుండువాడు కావున బరమాత్మునకు 'యముడ'ని పేరు.

'భజ-సేవాయామ్' ఈ ధాతువు వలన 'భగ' శబ్దము, దానికి 'మతుప్' ప్రత్యయము చేర్చుట వలన 'భగవంతుడు' 'భగవాన్' శబ్దము సిద్ధమగును. 'భగః సకలైశ్వర్యం సేవనం వా విద్యతే యస్య స భగవాన్.' సమగ్రమగు నైశ్వర్యముతో గూడి, సేవింపయోగ్యుడు కావున నీశ్వరుని నామము 'భగవంతుడు'.

'మన-మానే' అను ధాతువు వలన 'మను' శబ్దము సిద్ధించును. 'యో మన్యతే స మనుః.' మనువు - విజ్ఞాన శీలుడు, అంగీకరింపయోగ్యుడు నగుటచే నీశ్వరునకు 'మనువు' అని పేరు.

'పౄ - పాలన పూరణయోః.' ఈ ధాతువు వలన 'పురుష శబ్దము సిద్ధమైనది. 'యః స్వవ్యాప్త్యా చరాచరం జగత్ పృణాతి పూరయతి వా స పురుషః - తన వ్యాప్తిలో జరాచరాత్మకమగు సంపూర్ణ జగత్తునందు బూర్ణుడైయున్నాడు; కావున నీశ్వరునకు 'పురుషుడు' అని నామము.

'డు భృ ఞ్ - భరణ పోషణయోః' 'విశ్వ' పూర్వక మగు నీ ధాతువు వలన 'విశ్వంభర' శబ్దము సిద్ధమగును. 'యో విశ్వం బిభర్తి ధరతి పుష్ణాతి వా స విశ్వంభరో జగదీశ్వరః' - జగత్తును ధరించి పోషించు వాడు కావున బరమేశ్వరునకు'విశ్వంభరుడు' అని నామము.

'కల - సంఖ్యానే'. ఈ ధాతువు వలన 'కాల' శబ్దమైనది. 'కలయతి సంఖ్యాతి సర్వాన్ పదార్థాన్ స కాలః' - జగత్తునగల పదార్థములను, జీవులను లెక్కించును గావున నీశ్వరునకు 'కాలము' అని పేరు.

'శిష్ఌ - విశేషణే.' ఈ ధాతువు వలన 'శేష' శబ్దము సిద్ధించును. 'యః శిష్యతే స శేషః.' ఉత్పత్తి ప్రళయముల నుండి శేషుడు - మిగిలియుండువాడు; కావున నీశ్వరుడు 'శేష'డనబడును.

'ఆప్ఌ - వ్యాప్తౌ'. ఈ ధాతువు నుండి 'ఆప్త' శబ్దము సిద్ధమగును. 'యః సర్వాన్ ధర్మాత్మన ఆప్నోతి వా సర్వ ధర్మాత్మభి రాప్యతే ఛలాది రహితః స ఆప్తః'. సత్యోపదేశకుడు, సకల విద్యాయుక్తుడు, సర్వధర్మాత్ములను బొందినవాడు, లేక సర్వ ధర్మాత్ములచే బొందదగినవాడు, ఛలకపటాదులు లేనివాడు; కావున బరమాత్మునకు 'ఆప్తుడు' అని నామము.

'డుకృఞ్ - కరణే.' 'శమ్ పూర్వకమగు నీ ధాతువు వలన 'శంకర' శబ్దము సిద్ధమగును. 'యః శం కల్యాణం సుఖం కరోతి స శంకరః'. కల్యాణము - సుఖమును గలిగించువాడు; కావున నీశ్వరునకు 'శంకరుడు' అని పేరు.

'మహత్' పూర్వక దేవ శబ్దము వలన 'మహాదేవ' శబ్దము సిద్ధించును. 'యో మహతాం దేవః స మహాదేవః' గొప్ప దేవులకు దేవుడు – అనగా విద్వాంసులకు విద్వాంసుడు, సూర్యాది పదార్థముల ప్రకాశకుడు నగుటచే బరమాత్మునకు 'మహాదేవుడు' అని నామము.

'ప్రీఞ్ – తర్పణే కాంతౌ చ '. ఈ ధాతువు వలన 'ప్రియ' శబ్దము సిద్ధించును. 'యః పృణాతి ప్రీయతే వా స ప్రియః.' సర్వధర్మాత్ములను, ముముక్షువులను, శిష్టులను బ్రసన్నులను జేయువాడు, అందఱచే గామింపదగిన వాడు నగుటచే నీశ్వరునకు 'ప్రియుడు' అని నామము.

'భూ – సత్తాయామ్'. 'స్వయం' పూర్వకమగు నీ ధాతువు వలన 'స్వయంభూ' శబ్దము సిద్ధించును. 'యః స్వయం భవతి స స్వయంభూరీశ్వరః' తనకు దానుగా నున్నవాడై, యెవని నుండియు బుట్టినవాడు కానందున బరమాత్మునకు 'స్వయంభువు' అని నామము.

'కు–శబ్దే'. ఈ ధాతువు వలన కవి శబ్దము సిద్ధించును. 'యః కౌతి శబ్దయతి సర్వా విద్యాః స కవిరీశ్వరః'. వేదము మూలమున సర్వ విద్యలనుపదేశించువాడు, (వాని) నెఱుగువాడును గావున నీశ్వరునకు 'కవి' యని పేరు.

'శివు' – కల్యాణే.' ధాతువు వలన 'శివ' శబ్దము సిద్ధించును. 'బహులమేతన్నిదర్శనమ్' (ధాతుపాఠ. ౧౦.౩౩౬.) అను నీ ధాతుపాఠ సూత్రము వలన 'శివు' ధాతువుగా నంగీకరింపబడినది. కల్యాణ స్వరూపుడై, కల్యాణమొనర్చువాడు కావున నీశ్వరుడు 'శివుడ'న బడును.

ఈ నూఱు నామములు పరమేశ్వరునివి వ్రాయబడినవి. (పునరుక్త నామములను విడిచి లెక్కించిన 108 నామము లగును. కావున నిట నూఱు పద ముపలక్షణార్థమని యెంచవలయును.) కాని, యివి కాక పరమేశ్వరున కసంఖ్య నామములున్నవి. ఏలయన బరమేశ్వరుని గుణ కర్మ స్వభావము లనంతము లయినట్లుగా నతని నామములు ననంతములు. వానిలో నొక్కొక్క గుణకర్మ స్వభావమున కొక్కొక్క నామమున్నది. దీనింబట్టి నేను వ్రాసిన నామములు సముద్రమున బిందువువలె నని యెంచవలయును. ఏలయన వేదాది శాస్త్రములందు బరమేశ్వరుని గుణ కర్మ స్వభావము లసంఖ్యముగా వ్యాఖ్యాతములై యున్నవి. ఆ వేద శాస్త్రములను జదువుట వలన జదివించుట వలనను బోధ పడగలవు. వేదాది శాస్త్రములను జదువు వారికే యన్య పదార్థముల జ్ఞానమును బూర్ణముగా గలుగును.

(మంగళాచరణ విషయము)

ప్రశ్నః–అన్య గ్రంథకర్తలు (తమ గ్రంథములందు) ఆది, మధ్య – అంతములందు మంగళాచరణము చేయునట్లు మీరేమియు వ్రాయలేదు, చేయలేదు. (ఏల?)

ఉత్తరముః– అట్లు చేయుట మాకు దగదు. ఏలయన – ఆది – మధ్య – అంతములందు మంగళము చేయువాని గ్రంథమున ఆది–మధ్య– అంతముల మధ్యలో నతడు వ్రాసిన దంతయు నమంగళమే యగును. కావున "మంగలాచరణం శిష్టాచారాత్ ఫలదర్శనాచ్ఛ్రుతితశ్చేతి" (సాం.౫.౧) ఇది సాంఖ్య శాస్త్ర వచనము. దీని యభిప్రాయమిదిః– ఈశ్వరుని న్యాయ పక్షపాతరహిత, సత్యమైన యాజ్ఞను నున్నది యున్నట్లంతట సదాచరణ మొనర్చుటయే మంగళాచరణ మనబడుచున్నది. గ్రంథము నారంభించినది మొదలు సమాప్తి వఱకు సత్యాచరణ మొనర్చుటయే 'మంగళాచరణము'. అంతేకాని యక్కడక్కడ మంగళము, నితర స్థలముల నమంగళము గ్రంథమున వ్రాయుట కాదు. మహాశయులగు మహర్షుల లేఖను జూడుడు.

'యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి'
ఇది తైత్తిరీయ – ఉపనిషద్వచనము. తై.శి.వ. ౧౧

ఓ సంతానములారా! అనవద్యము – అనిందనీయము – ధర్మయుక్తములగు కర్మములె మీకు జేయదగినవి. అధర్మయుక్తములు కావు.

(నవీన మంగళాచరణ ఖండనము)

కావున నాధునికములగు గ్రంథములందు 'శ్రీగణేశాయ నమః' 'సీతారామాభ్యాం నమః' 'శ్రీగురుచరణారవిందాభ్యాం నమః, రాధాకృష్ణాభ్యాం నమః'. 'హనుమతే నమః' 'దుర్గాయై నమః'. 'వటుకాయ నమః, భైరవాయ నమః'. శివాయ నమః'. 'సరస్వత్యై నమః' 'నారాయణాయ నమః'. ఇట్టి లేఖలు చూచుచున్నాము. వేదశాస్త్రముల కివి విరుద్ధములు; కావున బుద్ధిమంతులు వీనిని మిథ్యగా నెఱుగుదురు. ఏలయన వేదములందు, ఋషుల గ్రంథములందు నెక్కడను నిట్టి మంగళాచరణము చూచుటకు లభింపదు. మఱియు, నార్ష గ్రంథములందు 'ఓ౩మ్' 'అథ' శబ్దములు కనబడుచున్నవి. చూడుడు:-

'అథ శబ్దాను శాసనమ్' అథేత్యయం శబ్దోఽధికారార్థః ప్రయుజ్యతే. ఇది వ్యాకరణ మహాభాష్య వచనము. 'అథాతో ధర్మజిజ్ఞాసా' 'అథేత్యా నంతర్యే – వేదాధ్యయనానంతరమ్' ఇది పూర్వమీమాంసా సూత్రము. 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' అథేతి ధర్మ కథనానంతరం ధర్మ లక్షణం విశేషేణ వ్యాఖ్యాస్యామః' ఇది వైశేషిక దర్శనము. 'అథ యోగానుశాసనమ్' అథేత్యయమధికారార్థః – ఇది యోగశాస్త్రము. 'అథ త్రివిధ దుఃఖాత్యన్త నివృత్తి రత్యంత పురుషార్థః' సాంసారిక విషయ భోగానంతరం, త్రివిధ దుఃఖాత్యన్త నివృత్త్యర్థః ప్రయత్నః కర్తవ్యః' ఇది సాంఖ్య శాస్త్రము. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' ఇది వేదాంత శాస్త్రము. 'ఓమిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత' ఇది ఛాందోగ్యోపనిషద్వచనము. 'ఓమిత్యేతదక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్' ఇది మాండూక్యోపనిషత్తు ప్రారంభ వచనము.

ఇట్లే యితర ఋషులయు, మునులయు గ్రంథములందు "ఓ౩మ్" "అథ" శబ్దములు వ్రాయబడి యున్నవి. అట్లే, "అగ్ని, ఇట్, అగ్ని, యే త్రిషప్తాః పరియన్తి" ఇట్టి శబ్దములు నాలుగు వేదముల యారంభములందున్నవి. "శ్రీ గణేశాయ నమః" ఇట్టి శబ్దము లెక్కడను లేవు. మఱియు వైదికులు వేదారంభమున "హరిః ఓమ్" అని వ్రాయుచున్నారు, చదువుచున్నారు. వేదాది శాస్త్రములందు "హరి" శబ్దమాదిలో నెక్కడను లేదు. కావున "ఓ౩మ్" "అథ" శబ్దములే గ్రంథాదియందు వ్రాయవలయును.

ఇది యీశ్వర విషయమున కించిన్మాత్రము వ్రాయబడినది. దీని తరువాత శిక్షా విషయము వ్రాయబడును.

## శ్రీమద్దయానంద సరస్వతీ స్వామి కృత
## సుభాషా విభూషితమైన సత్యార్థ ప్రకాశమున
## ఈశ్వరనామ విషయమున ప్రథమ సముల్లాసము

## సంపూర్ణము.

# ద్వితీయ సముల్లాసము

శిక్షను గూర్చి చెప్పెదము.
(భాగ్యవంతమగు సంతానము)

"మాతృమాన్ పితృమానాచార్యవాన్ పురుషో వేద"
(శత. ౧౪.౬.౧౦.౨) ఇది శతపథ బ్రాహ్మణ వచనము.

వాస్తవమున ఒకటి – మాత, రెండు – తండ్రి, మూడు – ఆచార్యుడు నను ముగ్గురు నుత్తమ శిక్షకు లైనపుడు మనుష్యుడు జ్ఞానవంతుడగును. మాతా – పితలు ధార్మికులు విద్వాంసులైన కులము ధన్యము. వారి సంతానము మిక్కిలి భాగ్యవంతము. మాత వలన సంతానములకెంత యుపదేశము నుపకారము లభించునో యంత యెవరినుండి లభింపదు. మాత సంతానములపై నుంచునంత ప్రేమ, వారికి జేయగోరునంత హితము నన్యులెవ్వరు జేయరు. కావున 'మాతృమాన్ – అర్థాత్ ప్రశస్తా ధార్మికీ మాతా విద్యతే యస్య స మాతృమాన్'. గర్భాధానము మొదలు విద్య పూర్తి కానంత వఱకు (సంతానమునకు) సుశీలతను నుపదేశించు తల్లి ధన్యురాలు.

(గర్భాధానమునకు బూర్వోత్తరకర్తవ్యములు)

మాతా పితలకిది మిక్కిలి యుచితము:– గర్భాధాన సమయమునను, నంతకు ముందు వెనుక సమయములందును మాదక ద్రవ్యములను, మద్యమును, దుర్గంధ యుక్తములు, రూక్షములు, బుద్ధి నాశకములు నగు పదార్థములను సేవింపరాదు. శాంతి, యారోగ్యము, బలము, బుద్ధి, పరాక్రమము, సుశీలతవలన సభ్యతను గలుగజేయు – పాలు, నేయి, మిష్టాన్నపానములు మున్నగు శ్రేష్ఠపదార్థములను సేవింపవలయును. అందువలన రజస్సు, వీర్యము దోషరహితములై యత్యుత్తమగుణ యుక్తములగును.

(ఉత్తమ సంతానప్రాప్తి విధి)

ఋతుగమన విధి:– రజోదర్శనమైన యైదవ దినము మొదలు పదునాఱవ దినము వఱకు ఋతుదాన సమయము. ఆ దినములలో మొదటి నాలుగు దినములు త్యాజ్యములు. మిగిలిన పండ్రెండు దినములలోను – ఏకాదశి, త్రయోదశి వదలి మిగిలిన పది రాత్రులలో గర్భాధానము చేయుట యుత్తమము. రజో దర్శన దినముతోబాటు (16) పదునాఱవ రాత్రికి దదుపరి సమాగమము చేయరాదు. మరల పూర్వోక్తమగు ఋతుదాన సమయము రానంత వఱకును, గర్భస్థితి యేర్పడిన తరువాత నొక సంవత్సరము వఱకును (దంపతులు) సంయుక్తులు కారాదు. స్త్రీ పురుషుల శరీరములందు నారోగ్యముండి, పరస్పర ప్రసన్నత గలిగి, యెట్టి దుఃఖము లేనపుడు (సమాగమము చేయవలయును).

చరక, శుశ్రుతములందు భోజనాచ్ఛాదన విధానము, మనుస్మృతి యందు స్త్రీ – పురుషుల ప్రసన్నతా రీతిని గూర్చియు వ్రాయబడి యున్నది. గర్భాధానము పిమ్మట స్త్రీ మిక్కిలి జాగరూకతతో భోజనాచ్ఛాదనముల నొనర్పవలయును. ఆ పైన నొక్క సంవత్సరము వఱకు స్త్రీ, పురుషునితో సంగమము చేయరాదు. బుద్ధి, బలము, రూపము, నారోగ్యము, పరాక్రమము, శాంతి మున్నగు గుణములను గలిగించు ద్రవ్యములను మాత్రమే స్త్రీ సేవించుచుండవలయును. సంతానము కలుగునంత వఱకు స్త్రీ యీ విధిని బాటింపవలయును.

(జనన కాలమున తదుపరి కర్తవ్యములు)

శిశువు జన్మించినపుడు మంచి సుగంధయుక్త జలముతో శిశువునకు స్నానము, నాడీ ఛేదనము చేసి,

సుగంధయుక్త ఘృతాదులతో, హోమము చేయవలయును. స్త్రీకి గూడ యథాయోగ్యముగ - తగినట్లు స్నాన భోజనాదుల వ్యవస్థ జేయవలయును. అందువలన దల్లియు శిశువు యొక్క శరీరములు క్రమముగా నారోగ్యము గలిగి బలపడగలవు. తల్లికాని, దాదికాని తమ పాలలో నుత్తమ గుణములు గలిగించు నుత్తమ పదార్థములను సేవింపవలయును.

బిడ్డను గన్న తల్లి పాల నాఱు దినముల వఱకు శిశువునకు ద్రావింపవలయును. తదుపరి దాది పాలు ద్రావింపవలయును. శిశువు తల్లి దండ్రు లా దాదికి భోజనార్థముత్తమ పదార్థముల నొసంగుచుండ వలయును. దరిద్రులైన వారు దాదిని బోషింపజాలని పక్షమున, బుద్ధిని, నారోగ్యమును, బరాక్రమమును గలిగించు నోషధిని జలముతో శుద్ధముచేసి కాచి వడపోసి, యావుపాలలోగాని, మేకపాలలోగాని కలిపి, యా పాలలో సమాన పరిమాణమున నీరు గలిపి శిశువునకు ద్రావింపవలయును.

శిశువు జన్మించిన తరువాత దల్లిని, శిశువును శుద్ధవాయువుగల స్థానమునకు మార్చి యట నుంచ వలయును. అట సుగంధయుక్త దర్శనీయ పదార్థములనుంచవలయును. శుద్ధవాయువుగల ప్రదేశ మున భ్రమణము చేయించుట యుచితము. ఆవుపాలు, మేకపాలు, దాదిపాలు లభించని తావులందుచిత వ్యవస్థ చేసికొనవలయును. ఏలయనః- ప్రసూతా స్త్రీ శరీరాంశముతో శిశువు శరీరమేర్పడును. కావున స్త్రీ ప్రసవ సమయమున నిర్బలయగును. అందుచేత బ్రసూతా స్త్రీ పాలు ద్రావింపరాదు. పాలు స్రవింపకుండునట్లు స్తనచ్ఛిద్రములపై నోషధి లేపనము జేయవలయును. అందువలన రెండవ మాసములోనే స్త్రీ యువతి కాగలదు. అంతవఱకు బురుషుడు బ్రహ్మచర్యమవలంబించి వీర్య నిగ్రహ మొనర్పవలయును. ఏ స్త్రీ పురుషులు ఈవిధముగా చేయుదురో వారికి నుత్తమ సంతానము, దీర్ఘాయువు, బలము, పరాక్రమవృద్ధి కలుగుచునే యుండును. అందువలన సమస్త సంతానము ఉత్తమ బలపరాక్రమయుక్తము, దీర్ఘాయువు గలిగి ధార్మికమగును. స్త్రీ యోనిసంకోచము, శోధనము, పురుషుడు వీర్యస్తంభనము చేయవలయును. అందు వలన మరల కలుగు సంతానమంతయు నుత్తమమై నడగును.

(ఐదు సంవత్సరముల వఱకు దల్లి శిక్షణ)

తల్లి బాల బాలికలకు నుత్తమ శిక్షణ మొసంగవలయును. అందువలన సంతానము సభ్యతగలదియై తమ యే యవయవములోను గుచేష్ట లొనరింపకుండునట్లు చూడవలయును. పిల్లలు మాటలాడ దొడగినపుడు తల్లి వారి జిహ్వకోమలమై స్పష్టముగా నుచ్చారణము చేయదగిన ట్లుపాయమొనర్ప వలయును. 'ప' దీని యుత్పత్తి స్థానము ఓష్ఠము, ప్రయత్నము స్పృష్టము. కావున రెండు పెదవులు కలిపి పలుకవలయును. ఇట్లే యాయా వర్ణముల స్థాన ప్రయత్నములు తెలిసికొని వానిని స్పష్టముగ నుచ్చరించునట్లు, హ్రస్వ దీర్ఘ ప్లుతములు పలుకునట్లు దల్లి యత్నింపవలయును. స్వరము మధురముగ, గంభీరముగ, సుందరముగ నుండునట్లును, నక్షరములు మాత్రలు, (పదములు) వాక్యములు, సంధి, యవసానము నన్నియు భిన్నభిన్నముగా దెలియునట్లుచ్చరింపవలయును.

సంతానము కొంచెము మాటలాడ, దెలిసికొన నారంభించినపుడు వారి వాణి సుందరముగా నుండునట్లును, జిన్నలు, పెద్దలు, మాన్యులు, తల్లి దండ్రులు, రాజు, విద్వాంసుడు మున్నగు వారితో భాషించు విధము, వర్తించు విధము, వారి దగ్గఱ కూర్చుండు విధానము మున్నగు విషయములు వారికి దల్లి నేర్పవలయును. అందువలన నెక్కడను వారయోగ్యముగ వ్యవహరింపక, యంతట బ్రతిష్ఠను బొందెదరు. సంతానము జితేంద్రియత, విద్యా ప్రేమ, సత్సంగమున రుచి కలిగి యుండునట్లు యత్నింపవలయును. వ్యర్థచేష్టలు, రోదనము, హాస్యము, కలహము, హర్ష - శోకములు, కొండొక పదార్థమున లోలుపత, యీర్ష్యా -ద్వేషములు మున్నగునవి చేయకుండునట్లును జూడవలయును. ఉపస్థేంద్రియమును స్పృశించుట,

మర్దనము చేయుటవలన వీర్యక్షీణత, నపుంసకత యేర్పడును. చేతిలో దుర్గంధము కలుగును. కావున దానిని స్పృశింపరాదు. సంతాన మెల్లపుడు సత్యము చెప్పుట, శౌర్య ధైర్యములు కలిగి ప్రసన్నవదనుడై యుండునట్లు తల్లి యత్నింపవలయును.

బాల బాలిక లైదువత్సరముల వారైనపుడు (తల్లి దండ్రులు) వారిచే దేవనాగరీ - అక్షరముల నభ్య సింప జేయవలయును. అన్యదేశీయ భాషల యక్షరములను నేర్పవలయును. తదుపరి మంచి శిక్షణ, విద్య, ధర్మము, పరమేశ్వరుడు, తల్లి దండ్రులు, ఆచార్యుడు, విద్వాంసులు, అతిథులు, రాజా-ప్రజలు, కుటుం బము, బంధువులు, తోబుట్టువులు, భృత్యులు మున్నగు వారియెడ బ్రవర్తించు విధము నేర్పవలయును. ఈ విషయములకు సంబంధించిన మంత్రములను, శ్లోకములను, సూత్రములను, గద్య పద్యములను నర్థ సహితముగ గంతస్థము చేయింపవలయును. అందువలన సంతాన మేధూర్తుని దురుపదేశము చేతను వంచింపబడదు. విద్యకు ధర్మమునకు విరుద్ధముగ భ్రాంతి జాలమున బడవేయు వ్యవహారములను గుఱిం చియు నుపదేశింపవలయును. అందువలన భూతప్రేతాది మిథ్యా విషయములందు విశ్వాసము కలుగదు.

(భూత ప్రేత శబ్దార్థములు)

"గురోః ప్రేతస్య శిష్యస్తు పితృమేధం సమాచరన్
ప్రేతహారైః సమం తత్ర దశరాత్రేణ శుధ్యతి." మను. ౫.౬౫.

అర్థముః- గురువు మరణించినపుడు 'ప్రేతనామముగల మృతక శరీరమును దహనము చేయు శిష్యుడు, ప్రేతహారులతో - మృతక శరీరము నెత్తికొనిపోవు వారితోబాటు పదవ దినమున శుద్ధుడగును. (ఇట గ్రంథకర్త మృతక శరీరమును 'ప్రేత' యందురనుటకు బ్రమాణముగా నీ మనుశ్లోకము నుదాహరించినాడు. శుద్ధి విషయమును దెలుపుటకు గాదు.)

ఆ శరీరము దహనము చేయబడిన తదుపరి దానిని 'భూతము' అందురు. అనగా నొకానొక పేరుగల పురుషుడుండెనని భావము. పుట్టిన వారెల్లరు గొంతకాలముండి తదుపరి యుండరు. వారు 'భూతస్థ' లగుదురు. కావున వారికి 'భూతములు' అని నామ మేర్పడును. ఇట్లు బ్రహ్మ మొదలు నేటి వఱకుగల విద్వాంసుల సిద్ధాంతము. కాని, శంక, కుసంగము, కుసంస్కారములు గలవారికి భయము, శంకారూప భూతప్రేతములు, శాకిని, డాకిని, మున్నగు ననేక భ్రమములు దుఃఖములు కలిగించును.

(ఉన్మాదాదిరోగములు భూత ప్రేతాదులు)

కొండొక ప్రాణి మరణించినపు డా ప్రాణికి సంబంధించిన జీవుడు పాపపుణ్యవశుడై పరమేశ్వరుని వ్యవస్థ వలన సుఖదుఃఖరూపమున ఫలముల ననుభవించుటకు జన్మాంతర ధారణము జేయును. అవినాశియగు పరమేశ్వరుని యీ వ్యవస్థ నెవడైన నాశము చేయగలడా? అజ్ఞానులు వైద్యక శాస్త్రమును, బదార్థ విద్యను జదువక, వినక విచారింపక సన్నిపాతాది శారీరక రోగములకు, ఉన్మాదము - పిచ్చి మున్నగు మానస రోగములకు భూతములు, ప్రేతములు నని నామములు పెట్టుచున్నారు. ఆ రోగములకు నౌషధ సేవనము నుచిత పథ్యపానములు సేయక, ధూర్తులు, పాషండులు, ననాచారులు, స్వార్థపరులునగు వారికి వశులై పాకీపని చేయువారు (భంగీ) మాలమాదిగలు, శూద్రులు, మ్లేచ్ఛులు మున్నగు వారు విశ్వసించి, నానావిధములగు వంచనలకు లోనై యుచ్ఛిష్ట భోజనము చేయుచు, మిథ్యా మంత్ర తంత్రములకు వశులై దారాలు, తాయెత్తులు కట్టించుకొని తిరుగుచుందురు. ధనమును నాశము చేసికొనుచుందురు. సంతానమునకు దుర్దశ కలిగించి రోగములను బెంపుచేసికొని దుఃఖముల పాలగుదురు.

(భూత ప్రేతనివారక - తంత్రములు)

డబ్బు మూట గట్టుటలో మెలకువ గలిగి కన్నులుండియు జూడ జాలని మూర్ఖులు (తమలో

నెవరికేని యేదేని వ్యాధి సంక్రమించినపుడు) దుర్బుద్ధులు, పాపులు, స్వార్థపరులు నగు వంచకుల దరిజేరి, 'అయ్యా! ఈ పిల్లవానికి - పిల్లకు - వ్యక్తికి యేమైనదో చూడు బాబూ!' అని యర్థింతురు. అంతట నా ధూర్తులిట్లు చెప్పుదురు. "ఇతని శరీరమున భూతమో, ప్రేతమో, భైరవుడో, శీతలాదేవియో మఱియెవరో ప్రవేశించినారు. మీ రేదో యుపాయము చేయనంత వఱకు నిది తొలగదు - వీరు వదలరు. ప్రాణము తీయుదురు. కావున మీరు తగినంత కట్నము, సామాను నిచ్చిన మేము మంత్ర జపములు పురశ్చరణము చేసి వీని దొలగింతుము." అందురు. అప్పు డా గ్రుడ్డివారు, "అయ్యా! మా సర్వస్వము బోయినను సరియే; కాని యితనిని బాగుచేయుడు" అందురు. అప్పు డా ధూర్తుల యభీష్టము సిద్ధించును.

వా రా మూర్ఖులతో నిట్లందురు. "మంచిది; ఇంత సామాను, నింత దక్షిణ తెండు. దేవతకు నుప హారము, గ్రహదానము చేయవలయును". ఇట్లు చెప్పి యారోగి యెదుట డోలు, తప్పెటలు, తాళాలు, మద్దెలలు వాయింపసాగుదురు. ఆ ధూర్తులలో నొక పాషండు డున్మత్తుడై చిందులు వేయుచు 'నే నితని ప్రాణములే తీసికొందును' అనును. అప్పు డా యంధులానీచ పాషండుని పాదములపై బడి 'నీకు గావలసి నది తీసికొనుము, ఇతని ప్రాణములు మాత్రము విడిచిపెట్టు'మని వాపోవుదురు. అపుడా ధూర్తుడు, 'నేను హనుమంతుడను- మంచి మిఠాయి తెండు; తైలము, సింధూరము, మణుగుంబావు రొట్టెలు, ఎఱ్ఱ లంగోట తెండు - లేదా నేను భైరవుడను. ఐదు సీసాల సారాయి తెండు. ఇరువది కోడి పెట్టలు, నైదు మేకలు, మిఠాయి, క్రొత్త వస్త్రములు తెండు'. అని యేమేమో వాగును. 'నీకు గావలసినది తీసికొనుము' అని మూర్ఖులు పలుకగా నా ధూర్తుడు పిచ్చివానివలె నెగురును, గంతులు వేయును. కాని, యప్పుడెవడైన నొక బుద్ధిమంతుడు ధూర్తుని నాలుగు చెప్పుదెబ్బలుకొట్టి, చెంపలు వాయించి, బడితెపూజ చేసినచో నతనిపై నున్న హనుమంతుడో, భైరవుడో, దేవియో వెంటనే ప్రసన్నతను బొంది పాఱిపోవును. కారణ మేమన :- మూర్ఖుల నుండి ధనము హరించుటకు ధూర్తులాడిన యాటయే తప్ప మఱియొండు కాదు గదా!

(గ్రహశాంతి)

ఆ మూర్ఖులు, కొండొక గ్రహగ్రస్తుడై గ్రహరూపుడైన జ్యోతిర్విదాభాసుని చెంతకేగి 'అయ్యా ఇతని కేమైనది?' అని యడిగిన నా జ్యోతిషుడిట్లనును. 'ఇతని మీద సూర్యాది క్రూర గ్రహములు వచ్చి యున్నవి. వానికి శాంతి, పూజా పాఠము చేయించిన నితనికి సుఖము కలుగును. లేకున్న మిక్కిలి పీడితుడై మరణించినను నాశ్చర్యము లేదు.'

ఉత్తరము:- 'జ్యోతిష మహారాజా.' ఈ భూమివలె సూర్యాది లోకములు కూడ జడములేకదా! అవి తాపము, ప్రకాశాదుల నిచ్చుటకు భిన్నముగా నేమియు జేయలేవు కదా! అవి చేతనములా? క్రోధముతో దుఃఖమును, శాంతముతో సుఖమును నవి యెట్లొసంగగలవు? అని ప్రశ్నింప వలయును.

ప్రశ్న:- ఈ లోకమున రాజులు ప్రజలు సుఖదుఃఖములను బొందుచున్నారుగదా! అవి గ్రహఫలములు కావా?

ఉత్తరము: - కావు; అవి యన్నియు బాపపుణ్యముల ఫలములు.

ప్రశ్న:- జ్యోతి శ్శాస్త్ర మబద్ధమా?

ఉత్తరము:- కాదు. అందు - అంక, బీజ, రేఖాగణిత విద్యలున్నవి. అవి యన్నియు సత్యములే. కాని, ఫలములకు సంబంధించిన లీల లన్నియు నబద్ధములు.

(జన్మపత్రము - జాతకము)

ప్రశ్న:- జన్మపత్రము కూడ నిష్ఫలమేనా?

ఉత్తరము:- అవును. నిష్ఫలమే; అది జన్మపత్రము కాదు. దానికి శోకపత్రమని పేరు పెట్టుట

యుచితము. ఏలయన సంతానము కలిగినపు డెల్లరు నానందింతురు. కాని యా యానందము జన్మ పత్రము సిద్ధమై గ్రహఫలములు విననంతవఱకే యుండును.

సంతానము కలిగినపుడు తల్లి దండ్రులతో 'పిల్లవానికి జన్మపత్రము వ్రాయించుడు' అని పురోహితుడనిన, నా తల్లి దండ్రులతనితో 'అయ్యా మీరు మిక్కిలి మంచి జన్మపత్రము వ్రాయుదురుగాక!' అందురు. అంతట నా పురోహితుడు వారు ధనాఢ్యులయినచో నెఱుపు, పసుపు రంగుల గీతలతో జిత్ర విచిత్రముగా జాతకమును సిద్ధము చేయును; యజమానులు దరిద్రులగుదురేని జాతకమును సాధారణముగ సిద్ధముచేసి వారికి వినిపింప దెచ్చును. అప్పు డా తల్లిదండ్రులు జ్యోతిషుని యెదుట గూర్చుండి, 'అయ్యా! పిల్లవాని జన్మపత్రము బాగున్నది గదా!' యని ప్రశ్నింతురు. అంతట నా జ్యోతిషుడు "ఉన్నది వినిపింతును వినుడు. జన్మ గ్రహములు చాల బాగుగనే యున్నవి. మిత్ర గ్రహములు కూడా బాగుగనే యున్నవి. వాని ఫలము మీ పుత్రుడు ధనాఢ్యుడు యశస్వియు నగును. సభలో వెళ్ళి కూర్చుండినపు డితని తేజ మెల్లరిపై బడును. శరీరమున నారోగ్యము కలిగి రాజ్యమాన్యుడగును" తల్లి దండ్రులిట్టి విషయములు విని 'వహ్వా! వహ్వా! అయ్యగారూ! మీరు చాల మంచివారు' అందురు.

కాని, యీ ప్రశంస వలన దనప్రయోజనము సిద్ధింపదని యెంచినపుడు జ్యోతిషుడిట్లనును. 'ఈ గ్రహములన్నియు బాగుగనే యున్నవి. కాని, కొన్ని క్రూర గ్రహములు కూడ నున్నవి. ఆ గ్రహముల యోగము వలన నీ పిల్లవానికి నెనిమిది సంవత్సరములకు మృత్యుయోగ మొకటి యున్నది' అనును. ఇది విని తల్లి దండ్రులు పుత్రోత్పత్తివలన గలిగిన యానందమును విడిచి దుఃఖసాగరమున మునిగి, జ్యోతిషునితో 'అయ్యా! ఇప్పుడు మే మేమి చేయవలయును' అని యడుగుదురు. అప్పుడతడు 'ఉపాయము చేయుడు' అనును. అది యెద్దియన నతడిట్లు ప్రస్తావించును:- 'ఈ దానములు చేయుడు. ఈ మంత్రమును జపింపజేయుడు. నిత్యము బ్రాహ్మణుల భుజింపజేయుడు. అట్లు చేసిన గ్రహముల విఘ్నము తొలగవచ్చును? నిశ్చయముగా జెప్పక తొలగవచ్చునని సందేహముగా జెప్పుటలో నభిప్రాయము లేకపోలేదు. పిల్లవాడు మరణించిన 'మే మేమి చేయగలము. పరమేశ్వరుని పైన నెవ్వరును లేరుగదా! మేము మాత్రము చాల ప్రయత్నించితిమి. మీరును మాచే యత్నము చేయించితిరి. అతని కర్మములట్లే యున్నవి.' చావక బ్రతికినచో 'చూడుడు మా మంత్ర దేవతను, బ్రాహ్మణులలో నెంత శక్తి యున్నదో చూచితిరా! మీ బాలకుని బ్రతికింప గలిగితిమి గదా!' అందురు.

ఈ విషయమున నిట్లు చేయవలయును. వీరి జప పాఠాదుల వలన ఫలము కలుగనపు డా ధూర్త జ్యోతిషుల నుండి తామిచ్చిన దానికి రెండు మూడు రెట్లు ధనము వసూలు చేయవలయును. పిల్లవాడు బ్రతికినను వారి నుండి యట్లే వసూలు చేయవలయును. ఏలయన, 'ఇతని కర్మములను బరమేశ్వరుని నియమమును దప్పించుట కెవరి వశము?' అని జ్యోతిషులు చెప్పుదురుగదా! కావున గృహస్థులు కూడ నిట్లు చెప్పవలయును. 'ఇతడు తన కర్మల వలనను బరమేశ్వరుని నియమముల వలనను బ్రతికినాడు. మీ జపాదుల వలన గాదు'.

ఇక మూడవది :- కొందఱు గురువులు మున్నగు వారుకూడ బుణ్యదానములు చేయించి వానిని దామే గ్రహింతురు. వారికి గూడ జ్యోతిషులకు జెప్పిన సమాధానమే చెప్పవలయును.

(శీతలా మంత్ర తంత్రాదులు)

ఇక మిగిలియున్నవి శీతల, మంత్రములు, తంత్రములు, యంత్రములు. ఇవియును దంతులే. ఒక విధములగు మోసములే. ఒకడిట్లనును. 'నేను మంత్రము పెట్టి దారము కాని, యంత్రము కాని చేసి యిచ్చిన మన దేవతలుగాని, పీరులు - పెద్దలు కాని యా మంత్ర యంత్రముల ప్రతాప ప్రభావముల

వలన నతని కేవిఘ్నములు గలిగింపరు'. అతనికిట్లు సమాధానము చెప్పవలయును. "మీరు మృత్యున నుండియు బరమేశ్వరుని నియమము నుండియు, గర్మ ఫలముల నుండియు దప్పింపగలరా? నీ వెన్ని మంత్ర తంత్రములు చేసినను నెందఱో పిల్లలు చచ్చిపోవుచున్నారు. మీ యింటిలో గూడ జచ్చుచున్నారు గదా! మీరు మరణము నుండి తప్పించుకొనగలరా?" అప్పు డతడేమియు జెప్పజాలడు. అప్పుడా ధూర్తుడిట దన పప్పులుడకవని గుర్తించును.

దీనింబట్టి యిట్టి మిథ్యా వ్యవహారములను విడిచి, ధార్మికు లెల్లరు దేశమున కుపకారము చేయువారు, నిష్కాపట్యముతో నెల్లరకు విద్య నభ్యసింపజేయు నుత్తమ విద్వాంసులకు ప్రత్యుపకారము చేయవలయును. వారు జగత్తున కుపకారము చేయునట్లు మీరును నాయుపకారము నెన్నడు విడువరాదు. రసాయన – మారణ – మోహన – ఉచ్చాటన – వశీకరణాది లీలలు చెప్పి, చేయువారిని మహాదోషులుగా నెంచవలయును. ఇట్టి మిథ్యా విషయములను గూర్చి బాల్యావస్థయందే తమ సంతానమున కుపదేశింప వలయును. అందువలన దమ సంతానము భ్రమజాలమునబడి దుఃఖముల పాలుకాకుండును.

(వీర్యరక్షణ లాభము)

వీర్యమును రక్షించుట వలన నానందము, నాశము చేసిన దుఃఖప్రాప్తియు గలుగునని తల్లిదండ్రులు తమ సంతానమునకు దెలుపవలయును. ఎవని శరీరమున వీర్యము సురక్షితముగా నుండునో యతనికి నారోగ్యము, బుద్ధి, బలము, పరాక్రమము వృద్ధియై మిక్కిలి సుఖము ప్రాప్తించును. వీర్యమును రక్షించు రీతి ఇదియే. "విషయముల కథ, విషయలోలుర సాంగత్యము, విషయముల ధ్యానము, స్త్రీ దర్శనము, స్త్రీతో నేకాంత సేవనము, సంభాషణము, స్పర్శము మున్నగు కర్మముల నుండి బ్రహ్మచారులు వేఱుగా నుండి యుత్తమ శిక్షణమును బూర్ణ విద్యను బొందవలయును. శరీరమున వీర్యము లేనివాడు, నపుంసకుడు, మిక్కిలి కులక్షణుడు నగును. ప్రమేహరోగము కలవాడు దుర్బలుడు, నిస్తేజస్కుడు, నిర్బుద్ధియై యుత్సాహము, సాహసము, ధైర్యము, బలము మున్నగు గుణములు లేనివాడై నశించును. మీరీ ప్రథమ వయస్సున సుశిక్షణము, విద్యా గ్రహణము వీర్యరక్షణము చేయుటలో దప్పు చేసిన మరల నీ జన్మమున మీకీ యమూల్యమగు సమయము లభింప జాలదు. మేము గృహకార్యములను నిర్వర్తించుచు జీవించు సమయముననే మీరు విద్యను గ్రహించి శరీర బలమును బెంపుచేసి కొనవలయును" అని సంతానమునకు బోధింపవలయును, ఇట్లే తల్లిదండ్రులు తమ సంతానమునకు నితర శిక్షణముల నొసంగ వలయును. అందువలననే ఉపర్యుక్త వాక్యమున 'మాతృమాన్, పితృమాన్' శబ్దములు, చేర్పబడినవి. జన్మము మొదలైదు సంవత్సరముల వఱకు బిల్లలకు దల్లి, యాఱవయేట నుండి యెనిమిదేండ్ల వఱకు దండ్రి శిక్షణము నొసంగ వలయును. తొమ్మిదవయేట ప్రారంభముననే ద్విజులు తమ సంతానముల కుపనయనము చేసి, పూర్ణ విద్వాంసుడు, పూర్ణ విదుషి శిక్షణమును, విద్యాదానము చేయు నాచార్యకులమునకు వారిని బంపవలయును. బాలురను బాలుర గురుకులమునకు, బాలికలను బాలికల గురుకులమునకు బంపవలయును. శూద్రాది వర్ణములవారు తమ సంతానమున కుపనయనము సేయకయే విద్యాభ్యాసము కొఱకు గురుకులములకు బంపవలయును.

(సంతాన పాలనము)

సంతానమును జదివించుటలో లాలనము చేయరాదు. అట్టివారి సంతానమే విద్వాంసులు, సభ్యులు, సుశిక్షితులు నగుదురు. ఆవశ్యకమైన దాడనము జేయవలయును. ఈ విషయమున వ్యాకరణ మహాభాష్యమున ప్రమాణ మిట్లున్నది.

"సామృతైః పాణిభిర్ ఘ్నన్తి గురవో న విషోక్షితైః
లాలనాశ్రయిణో దోషా స్తాడనాశ్రయిణో గుణాః"

అర్థముః- తల్లి దండ్రులు, నాచార్యుడు తమ సంతానమును, శిష్యులను దండించినచో వారు తమ సంతానమునకు, శిష్యులకు దమ చేతులతో నమృత పానము చేయించిన ట్లెంచవలయును. సంతానమునుగాని, శిష్యులను గాని లాలించువారు తమ సంతానమునకు శిష్యులకు విషము ద్రావించి నష్ట భ్రష్టులను జేసినవారగుదురు. ఏలయన లాలనము వలన సంతానము, శిష్యులు దోషయుక్తులును, దాడనము వలన గుణయుక్తులు నగుదురు. సంతానము, శిష్యులు కూడ దాడనము వలన బ్రసన్నులు, లాలనము వలన నప్రసన్నులునై యెల్లపు డుండవలయును. కాని, తల్లి దండ్రులు, నధ్యాపకులు నీర్ష్యా ద్వేషములతో దండింపరాదు. పైకి భయమును జూపుచు లోపల గృపాదృష్టి నుంచవలయును.

(చౌర్యత్యాగము, సత్యాచరణ గ్రహణము)

ఇతర శిక్షణములతో బాటు చౌర్యము, జారత్వము, నాలస్య ప్రమాదములు, మత్తుపదార్థములు, మిథ్యాభాషణము, హింస, క్రౌర్యము, నీర్ష్యాద్వేష మోహములు మున్నగు దోషములు విడుచుటకును, సత్యాచరణమును గ్రహించుటకును, దల్లిదండ్రులు తమ సంతానమునకు శిక్షణము నొసంగవలయును. ఏలయన నొకడొకని యెదుట చౌర్యజారత్వ మిథ్యాభాషణాదు లొక్కసారి చేసినను నతనికి నాతని యెదుట మృత్యు పర్యంతము బ్రతిష్ఠ కలుగజాలదు. చేసిన ప్రతిజ్ఞను మిథ్య యొనర్చువానికి గలుగునంత హాని మఱి యెవ్వరికిని గలుగదు. కావున నెవనితో నెట్టి ప్రతిజ్ఞ చేసిన దాని నాతని విషయమున నట్లే పూర్తిగా నెఱవేర్పవలయును. అనగా నొకడొకనితో 'నేను నీతో గొండొక నిశ్చిత సమయమున గలియుదును. లేక నీకొక వస్తువును ఫలానా సమయమున నిత్తును' అని చెప్పి ప్రతిజ్ఞ చేసిన దాని నట్లే నిర్వర్తింపవలయును. ఇట్లు చేయని పక్షమున నతని నెవ్వరు విశ్వసింపరు. కావున నెల్లరు నెల్లపుడు సత్యము చెప్పుచు సత్యప్రతిజ్ఞాయుక్తులు కావలయును.

(అభిమానాదులవలన హాని)

ఎవరికిని నభిమానము తగదు. 'అభిమానః శ్రియం హన్తి' ఇది విదురుని నీతి వచనము. అభిమానము - అహంకారము సమస్త శోభను, లక్ష్మిని నాశనము చేయును. కావున నహంకారము తగదు.

ఛలము - కపటము, కృతఘ్నత యను వీని వలన దనహృదయమే దుఃఖితమగును. అట్టియెడ నితరుల విషయమున జెప్పవలసిన దేముండును? లోపల నొకటి యుంచుకొని బయటకు మఱియొకటి కనబఱచుచు నితరులను భ్రమింపజేసి, వారి హానిని లెక్కచేయక స్వప్రయోజనమును సిద్ధింపజేసికొనుట ఛలము- కపట మనబడును. ఒకరు తనకు జేసిన యుపకారము నంగీకరింపకుండుట కృతఘ్నత యనబడును.

(సామాన్య వ్యవహార శిక్ష)

క్రోధాది దోషములు, కటువచనములు విడిచి శాంత, మధుర వచనములు పలుకవలయును. ఎక్కువ బకవాదము చేయరాదు. ఎక్కువ తక్కువ కాక తగినట్లు మాటలాడ వలయును. పెద్దలను గౌరవింప వలయును. వారు వచ్చినపుడు వారియెదుట నిలబడి వారి నున్నతాసనమున నాసీనులను జేయవలయును. వారికి మొదట 'నమస్తే' చేయవలయును. వారి యెదుట తామున్నతాసనముపై గూర్చుండరాదు. సభలలో దనయోగ్యతకు దగిన స్థానమున గూర్చుండుట యుచితము. అప్పుడు తనను నెవ్వరు లేపుట కవకాశ ముండదు. ఎవ్వరితోను గలహింపరాదు. సంపన్నుడై గుణ గ్రహణము దోషత్యాగము జేయవలయును. సజ్జన సాంగత్యము, దుష్టుల త్యాగము, తన తల్లి దండ్రులకు

నాచార్యులకు దను మనోధనములతోను, నుత్తమ పదార్థములతోను బ్రీతి పూర్వకముగ సేవ నొనర్పవలయును.

'యాన్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని నో ఇతరాణి' (తై. ఉ. శిక్షావల్లీ. ౧౧) ఇది తైత్తిరీయోపనిషద్వచనము. దీని యభిప్రాయమిదిః- తల్లి దండ్రులు నాచార్యుడు తమ సంతానమునకు శిష్యులకు నెల్లపుడు సత్యము నుపదేశింపవలయును.

'మే మొనర్చు ధర్మయుక్త కర్మములనే గ్రహించి, మా దుష్టకర్మములను ద్యజింపుడు' అనియు వారికి జెప్పవలయును. సత్యములని తెలిసినవాని నన్నిటిని బ్రకటించి ప్రచారము చేయవలయును. పాషండుడు, దురాచారియైన మనుష్యుని విశ్వసింపరాదు. తల్లి దండ్రులు, నాచార్యుడు నేయే యుత్తమ కర్మముల నొనర్ప నాజ్ఞాపింతురో వానిని యథేష్టముగా బాలింపవలయును. తల్లిదండ్రులు, ధర్మము, విద్య, సదాచరణము నను విషయములకు సంబంధించిన శ్లోకములు, నిఘంటువు, నిరుక్తము, అష్టాధ్యాయి, యన్య సూత్రములు, వేద మంత్రములు కంఠస్థము చేయించి మరల వాని యర్థములు విద్యార్థులకు దెలుపవలయును. ప్రథమ సముల్లాసమున వ్యాఖ్యానము చేసినట్లు పరమేశ్వరు నంగీకరించి యతని నుపాసింపవలయును.

ఆరోగ్యము, విద్య, బలము ప్రాప్తించు విధమున భోజన, ఛాదన వ్యవహారములను (తల్లి దండ్రులు) దాము చేసి పిల్లలచే జేయింపవలయును. అనగా నాకలి కంటె గొంచెము తక్కువ తినవలయును. మద్య మాంసాదులను సేవింపరాదు. తెలియని లోతైన నీటిలో బ్రవేశింపరాదు. జల జంతువుల వలన గాని, యేదేని పదార్థము వలన గాని దుఃఖము కలుగవచ్చును. ఈత రాకున్న మునిగిపోవుట సంభవించును. 'నావిజ్ఞాతే జలాశయే' (మ.౪.౧౨౮). ఇది మనువచనము. అవిజ్ఞాత జలాశయమున బ్రవేశించి స్నానాదులు చేయరాదు.

దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్ర పూతం జలం పిబేత్;
సత్యపూతాం వదేద్వాచం మనః పూతం సమాచరేత్ ।। మను । ౬-౪౬ ।।

'క్రింది వైపు దృష్టినుంచి నిమ్నోన్నత స్థానములను జూచి నడవ వలయును. వస్త్రములో వడపోసి నీరు త్రాగవలయును, సత్యపూత వచనము పలుకవలయును. మనస్సులో నాలోచించి చేయవలయును!

(తల్లి దండ్రులు శత్రువులు)

"మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః ।
న శోభతే సభామధ్యే హంస మధ్యే బకో యథా ।। (చాణక్య శతకమ్ – ౯)

తన సంతానమునకు విద్య నేర్పని తల్లి దండ్రులు సంతానమునకు బూర్ణ శత్రువులు. చదువు నేర్పని సంతానము హంసల మధ్యనున్న కొంగవలె, సభలో విద్వాంసులచే దిరస్కృతులగుదురు. కుశోభితులగుదురు. తమ సంతానములకు దను మనోధనములతో విద్య, ధర్మము, సభ్యత నేర్చి, వారి నుత్తమ శిక్షాయుక్తులను జేయుటయే తల్లి దండ్రులకు గర్తవ్యకర్మము, పరమ ధర్మము, కీర్తికారకము. బాల శిక్షను గూర్చి కొంచెముగా వ్రాయబడినది. బుద్ధిమంతులు దీని నుండియే యెక్కువ తెలిసికొందురు.

శ్రీమద్దయానంద సరస్వతీ స్వామి కృతము
సుభాషిత విభూషితమునగు సత్యార్థ ప్రకాశమున
బాలశిక్షా విషయమున ద్వితీయ సముల్లాసము
సమాప్తము

# తృతీయ సముల్లాసము

అధ్యయనాధ్యాపనవిధిని వ్యాఖ్యానించెదము.
(తల్లి దండ్రులు, ఆచార్యుడు - వారి ముఖ్య కర్తవ్యము)

ఇప్పుడు మూడవ సముల్లాసమున బఠన పాఠనవిధిని వ్రాయుచున్నాము. సంతానమునకు నుత్తమ విద్య, శిక్షణము, గుణ కర్మములు, నుత్తమ స్వభావము నను నాభూషణములను ధరింపజేయుట తల్లి దండ్రులయు, నాచార్యులయు సంబంధులయు గర్తవ్యము. బంగారము, వెండి, మాణిక్యము, ముత్యము, పగడము మొదలగు రత్నములతో గూడిన యాభూషణముల నలంకరించుటచే మనుష్యునియాత్మ సుభూషిత మెన్నడును గాజాలదు. ఏలయన నాభూషణములు ధరించిన గేవలము దేహాభిమానము, విషయాసక్తి, చోరభయము, మృత్యువుకూడ సంభవము. ఆభూషణధారణ కారణముగ దుష్టుల చేతులలో బాలబాలికలకు మృత్యువు సంభవించుట లోకమున జూచుచునే యున్నాము.

"విద్యావిలాస మనసో ధృతశీలశిక్షాః సత్యవ్రతా రహిత మానమలాపహారాః,
సంసారదుఃఖదలనేన సుభూషితా యే, ధన్యా నరా విహిత కర్మ పరోపకారాః.

(అర్థము) - విద్యావిలాసమందు దత్పర మనస్సుగలవారు, సుందర శీలస్వభావయుక్తులు, సత్య భాషణాది నియమ పాలనయుక్తులు, నభిమానము నపవిత్రత లేనివారు, నితరుల మాలిన్యమును దూరము చేయువారు, సత్యోపదేశము, విద్యాదానము ననువాని మూలమున సాంసారికుల దుఃఖములను దూరమొన ర్చుటచే సుభూషితులు, వేదవిహిత కర్మముల వలన బరులకు నుపకారము చేయుటలో దత్పరులైన స్త్రీ పురుషులు ధన్యులు.

పిల్లి లెనిమిదేండ్ల వారు కాగానే బాలురను, బాలికలను బాలబాలికల గురుకులములకు బంపవల యును. అధ్యాపకులు స్త్రీకాని, పురుషుడుకాని దుష్టాచారులైనచో వారి వలన శిక్షణము నిప్పింపరాదు. పూర్ణ విద్వాంసులు, ధార్మికులు నైనవారే చదివించుటకును, శిక్షణము నొసంగుటకును దగినవారు. ద్విజులు తమ యింటియందే బాలురకు, యథాయోగ్యముగ బాలికలకును యజ్ఞోపవీత సంస్కారము చేసి పూర్వము చెప్పినట్లు బాలబాలికలను బాల బాలికల గురుకుల-ఆచార్య కులములకు బంపవలయును.

(గురుకులము)

విద్య నభ్యసించు స్థాన మేకాంతదేశమున నుండవలయును. బాల బాలికల పాఠశాల లొకదానికి మఱియొకటి రెండు క్రోసుల దూరమున నుండవలయును. బాలుర పాఠశాలలో నధ్యాపకులు, భృత్యులు, ననుచరులు, బురుషులును; బాలికల పాఠశాలయందు స్త్రీలు మాత్రమే యుండవలయును. బాలుర పాఠశాలలో నైదేండ్ల బాలికగాని, బాలికల పాఠశాలలో నైదేండ్ల బాలుడుకాని యెన్నడు బోకుండ జూడవలయును. బాల బాలికలు బ్రహ్మచర్యమున నున్నంత కాలము వారు పరస్పరము దర్శనము, స్పర్శనము, నేకాంత సేవనము, భాషణము, విషయకథ, పరస్పరక్రీడ, విషయధ్యానము, సంగమము నను నీ యెనిమిది విధముల మైథునములకు దూరముగ నుండవలయును. అధ్యాపకులు వారి నీ విషయముల నుండి కాపాడుచుండవలయును. అందువలన నుత్తమ విద్య, యుత్తమ శిక్షణము, సత్స్వభావము వారికల వడును. శరీరము లాత్మబలయుక్తములు కాగా వారానందమును వర్ధిల్ల జేసికొందురు.

పాఠశాలలు గ్రామమునకు లేక నగరమునకు నొక యోజనము - నాలుగు క్రోసుల దూరమున

నుండవలయును. (విద్యార్థులకు) ఎల్లరకు వస్త్ర అన్న-పాన -ఆసనాదులు సమానముగ నొసంగ వలయును. రాజ కుమారుడుకాని, దరిద్ర సంతానము కాని విద్యార్థులందఱు సమానులు. ఎల్లరు తపస్వులు కావలయును. తల్లి దండ్రులు తమ సంతానమును కాని, సంతానము తల్లిదండ్రులను గాని యెన్నడు గలిసికొనరాదు. పరస్పర ముత్తర ప్రత్యుత్తరములు వ్రాసికొనరాదు. అందువలన సాంసారిక దుఃఖములకు దూరులై కేవలము విద్య నభ్యసించుటలో మనస్సును లగ్నము చేయుదురు. విద్యార్థులు భ్రమణమున కేగినపు డధ్యాపకులు వెంటనుండవలయును. అందువలన నెట్టి కుచేష్టలు చేయజాలరు. ఆలస్య ప్రమాదములకు లోనుగారు.

"కన్యానాం సంప్రదానం చ కుమారాణాం చ రక్షణమ్" మను. ౭.౧౫౨.

'దీని యభిప్రాయమిదిః- ఐదవ లేక యెనిమిదవ యేట నుండి యెవరును దమ బాలబాలికలను నింట నుంచక తప్పక పాఠశాలలకు బంపునట్లు రాజనియమముకాని, జాతి నియమముకాని యుండవలయును. పిల్లల నట్లు పంపనివారు దండనీయులు కావలయును.

(గాయత్రీ మంత్రోపదేశము)

బాలకులకు యజ్ఞోపవీత సంస్కారము మొదట నింటియందును రెండవసారి పాఠశాలలో నాచార్య కులమున జరుగవలయును. తల్లి దండ్రులు నధ్యాపకుడు తమ బాలబాలికలకు నర్థసహితముగా గాయత్రీ మంత్రము నుపదేశింపవలయును. ఆ మంత్రమిది.

**ఓం భూర్భువః స్వః తత్సవితుర్ వరేణ్యమ్**

**భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్"** యజు ౩౬-౩.

ఈ మంత్రమున మొదట నున్న 'ఓ౩మ్'న కర్థము ప్రథమ సముల్లాసమున వ్రాయబడినది. అట జూచి తెలిసికొనవలయును. ఇప్పుడు మూడు మహావ్యాహృతులకు సంక్షేపముగ నర్థము వ్రాయు చున్నాము.

'భూరితి వై ప్రాణః' యః ప్రాణయతి చరాచరం జగత్ స భూః స్వయం భూరీశ్వరః. ఏది సర్వజగత్తునకు జీవనాధారమై, ప్రాణము కంటెను ప్రియమై, స్వయంభువై యున్నదో యా ప్రాణమునకు వాచకమైన 'భూః' పరమేశ్వరునకు నామము.

'భువరిత్యపానః.' యః సర్వం దుఃఖమపానయతి సోఽపానః. ఎవడు సర్వదుఃఖరహితుడై యెవని సంగతి వలన జీవుడు సర్వదుఃఖముల నుండి విడివడునో యా పరమేశ్వరునకు నామము 'భువః'.

'స్వరితి వ్యానః.' యో వివిధం జగత్ వ్యానయతి వ్యాప్నోతి స వ్యానః. నానావిధ జగత్తున వ్యాపకుడై యన్నింటిని ధారణము చేయువాడు కావున పరమేశ్వరునకు 'స్వః' అని పేరు. ఈ మూడు వచనములు తైత్తిరీయారణ్యమునకు జెందినవి. (౭.౫)

సవితుః - యః సునోత్యుత్పాదయతి సర్వం జగత్ స సవితా. తస్య - సర్వజగదుత్పాదకుడు, సర్వైశ్వర్యదాత, దేవస్య - (యో దీవ్యతి దీవ్యతే వా స దేవః) సర్వసుఖదాత, యెల్లరిచే గామింపబడువాడునైన పరమేశ్వరుని, వరేణ్యమ్ - వర్తుమర్హమ్ - స్వీకరింపయోగ్యము, నతి శ్రేష్ఠమునగు, భర్గః - శుద్ధస్వరూపమ్ - శుద్ధ స్వరూపము, పవిత్రముచేయు చేతన బ్రహ్మ స్వరూపమునగు, తత్ - ఆ పరమాత్ముని స్వరూపమును, ధీమహి - ధరేమహి - ధారణచేయుదుము. ఏ ప్రయోజనము కొఱకు? యః జగదీశ్వరః -ఆ జగదీశ్వరుడు, నః - అస్మాకమ్ - మన, ధియః - బుద్ధీః - బుద్ధులను, ప్రచోదయాత్ - ప్రేరయేత్ - ప్రేరణ చేయుగాక! చెడ్డ కర్మల నుండి విడిపించి సత్కర్మలలో బ్రవృత్తులనొనర్చుగాక!

హే పరమేశ్వర! హే సచ్చిదానందానంత స్వరూప! హే నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వభావ! హే కృపానిధే! హే న్యాయకారిన్! హే అజ! నిరంజన! నిరాకార! హే సర్వాన్తర్యామిన్! హే సర్వాధార! సర్వజగత్పితః! సకల జగదుత్పాదక! హే అనాదే! విశ్వంభర! సర్వవ్యాపిన్! హే కరుణామృత వారిధే! సవితుర్ దేవస్య తవ యదోం భూర్భువస్స్వర్ వరేణ్యం భర్గోఽస్తి తద్వయం ధీమహి దధీమహి ధరేమహి ధ్యాయేమ వా. కస్మై ప్రయోజనాయేత్యత్రాహ - హే భగవన్ యః సవితా దేవః పరమేశ్వరో భవానస్మాకం ధియః ప్రచోదయాత్, స ఏవాస్మాకం పూజ్య ఉపాసనీయ ఇష్టదేవో భవతు. నాతోఽన్యం భవత్తుల్యం భవతోఽధికం చ కంచిత్ కదాచిత్ మన్యామహే.

ఓ మానవులార! సర్వ సమర్థులలో సమర్థుడు సచ్చిదానందానంత స్వరూపుడు, నిత్యశుద్ధుడు, నిత్యబుద్ధుడు, నిత్యముక్తుడుగా నుండుటయే స్వభావముగ గలవాడు, కృపాసాగరుడు, న్యాయకారి, జన్మమరణాది క్లేశరహితుడు, నిరాకారుడు, నెల్ల ఘటఘటముల నెఱుగువాడు, సర్వభర్త, పిత, ఉత్పాదకుడు, (అనాది), అన్నాదులతో విశ్వమును బోషించువాడు, సకలైశ్వర్య యుక్తుడు, జగన్నిర్మాత, శుద్ధ స్వరూపుడు, పొందగోరదగినవాడునైన పరమేశ్వరుని శుద్ధచేతన స్వరూపమును మనము ధరింతుముగాక! (ప్రయోజన మేమన):- ఆ పరమేశ్వరుడు మన యాత్మలకు బుద్ధులకు నంతర్యామి స్వరూపుడై మనలను దుష్టాచారము, నధర్మయుక్త మార్గము నుండి తప్పించి శ్రేష్ఠాచార, సత్యమార్గము లందు నడపుగాక! అతనిని విడిచి యితరమగు నేవస్తువును మనము ధ్యానింప కుందుముగాక! ఏలయన, నతనికి దుల్యుడుకాని, యధికుడుగాని యెవడును లేడు. అతడే మన తండ్రి. రాజు, న్యాయాధీశుడు, సర్వసుఖముల నిచ్చువాడును.

(స్నాన - ఆచమనాదులు)

ఇట్లు గాయత్రీ మంత్రము నుపదేశించి, సంధ్యోపాసనకు సంబంధించిన స్నానము, నాచమనము బ్రాణాయామము మున్నగు క్రియలు నేర్పవలయును. శరీర బాహ్యావయవములకు శుద్ధి, యారోగ్యము కలుగుటకు గాను బ్రథమమున స్నాన మాచరింపవలయును. ఇందు బ్రమాణముః-

"అద్భిర్ గాత్రాణి శుధ్యన్తి, మనః సత్యేన శుధ్యతి,
విద్యా తపోభ్యాం భూతాత్మా, బుద్ధిర్ జ్ఞానేన శుధ్యతి." మను. ५.१०९

'జలము వలన శరీర బాహ్యావయవములు, సత్యాచరణము వలన మనస్సు, విద్య వలన తపస్సు-సర్వవిధ కష్టములను సహించి ధర్మమునే యనుష్ఠించుట వలన జీవాత్మయు, జ్ఞానము-పృథివి మొదలు పరమేశ్వర పర్యంత పదార్థముల వివేకము వలన బుద్ధి, దృఢనిశ్చయము కలిగి యన్నియు బవిత్రము లగును.' కావున స్నానము భోజనమునకు బూర్వమే చేయవలయును.

రెండవది ప్రాణాయామము. ఇందు బ్రమాణము -

"ప్రాణాయామాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః." యోగ. సూ २.२८.

మనుష్యుడు ప్రాణాయామము చేయునపుడు ప్రతిక్షణము నుత్తరోత్తర కాలమున (కాలము గడచిన కొలది) నతనిలోని నశుద్ధి నశించి, జ్ఞాన ప్రకాశము కలుగజొచ్చును. ముక్తి లభించునంత వఱకు నతని యాత్మ జ్ఞానము వృద్ధి చెందుచుండును.

దహ్యన్తే ధ్మాయ మానానాం ధాతూనాం హి యథా మలాః
తథేన్ద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్య నిగ్రహాత్. మను అ ३.७१.

అగ్నిలో గాల్చినందున సువర్ణాది ధాతువుల మలములు నష్టమైనట్లు ప్రాణాయామము వలన మనస్సు, నింద్రియములు ననువాని దోషములు నశించి నిర్మలము లగును.

(ప్రాణాయామ విధి)

"ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య." యోగ. ౧.౩౪.

వాంతియైనపుడన్న జలాదులు మిక్కిలి వేగముతో బయటికి వచ్చునట్లు ప్రాణమును – (ఊపిరి తిత్తులలోని గాలిని) వేగముతో బయటికి వదలి వెలుపలనే దానిని యథాశక్తి యుంచవలయును. ప్రాణమును బయటికి దీయదలచినపుడు మూలేంద్రియమును బైకిలాగి యుంచవలయును. అట్లు లాగి యుంచినంతసేపు ప్రాణము బయట నుండును. ప్రాణమును వెలుపల నధిక సమయ ముంచుట కిదియే పద్ధతి. ఇట్లు బయట నిలిపిన గాలిని (గాభరా కలిగినపుడు) నిక బయట నిరోధించుట కష్టమని తోచినపుడు నెమ్మది నెమ్మదిగా గాలిని లోపలకు దీసికొని (ఊపిరితిత్తులునింపి) మరల నట్లే చేయుచు బోవలయును. ఇచ్ఛ, సామర్థ్యముల కనుగుణముగా గొన్ని నిమిషములు చేయవచ్చును. ఆ సమయమున మనస్సు నందు 'ఓమ్'ను జపించుచుండవలయును. అట్లు చేయుటవలన నాత్మ, మనస్సు పవిత్రములై స్థిరతను బొందును.

(ప్రాణాయామము చతుర్విధములు.) అందు నొకటి బాహ్య విషయకము:– (వాయువును) బయటికి దీసి బయట నిలుపుట. రెండవది 'ఆభ్యంతరము' – ప్రాణమును లోపలకు దీసికొని యెంతతడ వచట నుంచగలుగుదురో యంత సమయమట నిలుపుట. మూడవది – 'స్తంభవృత్తి.' లోపలి వెలుపలి వాయువు నెక్కడిదాని నక్కడనే యథాశక్తి నిలుపుట. ఇక నాల్గవది 'బాహ్యాభ్యంతరాక్షేపి'. లోపల నుండి గాలి వెలుపలకు రాదొడగిన దానికి విరుద్ధముగా దానిని వెలుపలకు రాకుండ జేయుటకు వెలుపలి వాయువును లోపలకు దీసికొన యత్నింపవలయును. అట్లు వెలుపల నుండి గాలి లోపలకు రానున్నపుడు దానిని రాకుండ జేయుటకు లోపలి గాలిని వెలుపలకు దీసికొన యత్నింపవలయును. ఇట్లు లోపలి గాలిని లోపలే యుండునట్లు వెలుపలి గాలితోను, వెలుపలి దానిని లోనికి బోకుండునట్లు లోపలి గాలితోను నెట్టుచు నుండవలయును. ఇట్లు పరస్పర విరుద్ధక్రియ చేయుచు బోగా లోపలి వెలుపలి ప్రాణములగతి యాగిపోయి ప్రాణము వశమగును. మనస్సు, నింద్రియములును స్వాధీనములగును. బలము, పురుషార్థము పెరిగి, బుద్ధి తీవ్రము, సూక్ష్మరూపము నగును. అప్పుడది మిక్కిలి కఠినము సూక్ష్మమునగు విషయమునుగూడ శీఘ్రముగ గ్రహించును. దీనివలన మనుష్యుని శరీరమున వీర్యము వృద్ధింబొంది స్థిరత, బలము, పరాక్రమము, జితేంద్రియత యేర్పడును. సర్వశాస్త్రములను గొంది కాలములోనే తెలిసికొని యుపస్థితము చేసికొనును. స్త్రీ కూడ నిట్లే యోగాభ్యాసము చేయవలయును.

(విద్యార్థుల కిట్లు ప్రాణాయామ విధిని నేర్పి) భోజన – ఛాదనములు, కూర్చుండుట, నిల్చుండుట, మాటలాడుట, తిరుగుట, చిన్నలతోను, బెద్దలతోను వ్యవహరించు విధముల నుపదేశింపవలయును.

(సంధ్య – బ్రహ్మయజ్ఞములు)

సంధ్యోపాసనను బ్రహ్మయజ్ఞ మనియు నందురు. అఱచేతిలో గొంచెము నీరుపోసికొని యాజలమును నఱచేతి మధ్యభాగమున బెదవుల నానించి త్రాగుట 'ఆచమన' మనబడును. ఆ జలము కంఠము క్రిందనుండు హృదయము వఱకు బోగలిగినంతయే యుండవలయును. అంతకు నెక్కువ తక్కువ లుండరాదు. ఆచమనమువలన గంఠము నందుండు కఫము, పిత్తము కొంచెము తొలగును.

మార్జనము:– (ఎడమ యఱచేతిలో గొంచెము నీరుంచుకొని) కుడిచేతి, మధ్యమ, అనామిక వ్రేళ్లకొనలతో నేత్రాది – అంగములపై జలము చల్లుకొనవలయును. అందువలన నలసట దూరమగును. అలసట లేనపుడును, జలము లభింపనపుడును మార్జనము చేయకున్నను దొందరలేదు. మరల

సమంత్రక ప్రాణాయామము, మనసా పరిక్రమము, ఉపస్థానము విద్యార్థులకు నేర్పవలయును. తదుపరి పరమేశ్వరుని స్తుతి, ప్రార్థన, ఉపాసనలు నేర్పవలయును. ఆపైన 'అఘమర్షణము' పాపము చేయనెన్నడు గోరనైన గోరరాదు. ఈ సంధ్యోపాసన యేకాంతదేశమున నేకాగ్రచిత్తముతో జేయవలయును.

"అపాం సమీపే నియతో నైత్యకం విధిమాస్థితః
సావిత్రీమప్యధీయీత గత్వారణ్యం సమాహితః" (మను. ౨-౧౦౪)

అర్థః- అరణ్యమున - నేకాంత దేశమునకు వెళ్లి, సావధానుడై, జలము సమీపమున నియతుడై నిత్యకర్మము నాచరించుచు సావిత్రీ - గాయత్రీ మంత్రము నుచ్చరించుచు నర్థజ్ఞానముతో బాటు దాని ననుసరించి తాను ప్రవర్తింపవలయును.

(దేవయజ్ఞము)

రెండవది దేవయజ్ఞముః- ఇయ్యది యగ్నిహోత్రము, విద్వాంసుల సంగతి, వారి సేవ వలన నగును. సంధ్యాగ్నిహోత్రములు సాయం ప్రాతః కాలములందు రెండు వేళలందే చేయవలయును. రాత్రి దినము కలియు సంధివేళలు రెండే. ఇతరములు కావు. తక్కువలో దక్కువ యొక్క గంట ధ్యానము తప్పక చేయవలయును. సమాధిస్థులై యోగులు పరమాత్మను ధ్యానించునట్లు సంధ్యోపాసన గూడ జేయవలయును.


యజ్ఞకుండము

అట్లే (ప్రాతః) సూర్యోదయమునకు దదుపరి, (సాయం) సూర్యాస్తమయము నకు ముందే యగ్నిహోత్రము చేయదగిన సమయము. అందులకు నేదేని ధాతువు (ఇనుము, ఇత్తడి, రాగి)తోగాని, మట్టితోగాని పైన ౧౨ లేక ౧౬ అంగుళముల చతురస్రము, నంతేలోతు, క్రింద 3 లేక ౪ అంగుళములు పరిమాణమున జదరముండునట్లు చిత్రమున నున్నట్లు వేది-యజ్ఞకుండము సిద్ధము చేసికొనవలయును. పైన నెంత వెడల్పుండునో క్రింద దానికి నాలుగవ వంతు వెడల్పుండవలయును. దానియందు జందనము, పలాశము, నామ్రము మున్నగు శ్రేష్ఠమైన కాష్ఠఖండనములు వేదిపరిమాణమునకు దగిన కొలతలో సిద్ధము చేసి యుంచవలయును. ఆ సమిధలలో - పుల్లలలో నగ్నినుంచి దానిపైన మరల సమిధల నుంచవలయును.


(౨) ప్రోక్షణీ పాత్ర


(3) ప్రణీతా పాత్ర


(౪) ఆజ్యస్థాలి


(౫) చిన్న గరిటె

ఇయ్యవి యగ్నిహోత్రము చేయుటకు నుపయోగించు పాత్రలు. కొయ్యతోగాని ధాతువులతో గాని సిద్ధము చేసికొనవలయును. ప్రోక్షణి ప్రణీతాపాత్రలలో జలము, ఘృతపాత్రమున నేయి యుంచవల యును. ప్రణీతాపాత్రము జలముంచుటకు, ప్రోక్షణీ పాత్రతో జలము తీసికొని చేతులు కడుగుకొనుట సుగమము. నేతిని జక్కగా సిద్ధము చేసికొని యీ క్రింది మంత్రములతో హోమము చేయవలయును.

'ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా. ఓం భువర్వాయవేఽపానాయస్వాహా.
ఓం స్వరాదిత్యాయ వ్యానాయ స్వాహా. ఓం భూర్భువ స్స్వరగ్ని
వాయ్వాదిత్యేభ్యః ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా.'

ఇట్టి అగ్నిహోత్ర మంత్రముల నొక్కొక్క దానిని జదివి యొక్కొక్క యాహుతి నీవలయును. ఎక్కువ యాహుతుల నీదలచినచో

"విశ్వాని దేవ సవితర్ దురితాని పరాసువ! యద్భద్రం తన్న ఆసువ."
అను నీ మంత్రముతోను బూర్వోక్త గాయత్రీ మంత్రముతోను నాహుతుల నీవలయును.

'ఓమ్', 'భూః' 'ప్రాణ' ఆది నామములు పరమేశ్వరునివే. వీని యర్థములు పూర్వమే చెప్పియున్నాము. స్వాహా శబ్దమున కర్థము -- ఆత్మలో నెట్లు జ్ఞానము కలిగిన జిహ్వతో నట్లే చెప్పవలయును; విపరీతముగా జెప్పరాదు. (ఇదియే స్వాహా పదార్థము). పరమేశ్వరుడు సర్వప్రాణుల సుఖము కొఱకు నీ సమస్త జగత్ పదార్థములను రచించినట్లు మనుష్యులు పరోపకారము జేయవలయును.

(హోమ లాభములు)

ప్రశ్నః- హోమము వలన నేమి యుపకారము కలుగును?

ఉత్తరముః- దుర్గంధముతో గూడిన వాయు-జలముల వలన రోగములు, వానివలన బ్రాణులకు దుఃఖము; సుగంధిత వాయు-జలములవలన సుఖప్రాప్తియు గలుగునని యెల్లరు నెఱుగుదురు.

ప్రశ్నః- గంధము తీసి యెవరికైన బూయుటవలనను, నేతిని దినిపించుటవలనను మిక్కిలి యుపకారము కలుగును. వానిని నగ్నిలో వేసి వ్యర్థముగ నాశము చేయుట బుద్ధిమంతుల పనిగాదు.

ఉత్తరముః- నీవు పదార్థవిద్య నెఱిగి యుండువేని యెన్నడు నిట్టి మాటలాడవు. ఏలయన లోకమున నేద్రవ్యమునకు నభావము కలుగదు. చూడు. హోమము జరిగిన స్థలమునకు దూరమున నున్నవ్యక్తి నాసికతో సుగంధము గ్రహించును. అట్లే దుర్గంధము కూడ. ఈ చెప్పినదాని వలననే యగ్నిలో వేసిన పదార్థము సూక్ష్మమై వాయుమూలమున వ్యాపించి దూర దేశమునకు వెళ్లి యటనున్న దుర్గంధమును దొలగించునని తెలిసికొనుము.

ప్రశ్నః- అటులయిన, కుంకుమపువ్వు, కస్తూరి, సుగంధిత పుష్పములు, నత్తరు మున్నగు వస్తువులు గృహమున నుంచిన వాయువు సుగంధితమై సుఖకారక మగును గదా!

ఉత్తరముః- ఆ సుగంధమునకు గృహముననున్న వాయువును వెలుపలకు బంపి, శుద్ధవాయువును గృహమున బ్రవేశింప జేయగల శక్తి లేదు. ఏలయన నందు భేదకశక్తి లేదు. అగ్నికి మాత్రమే యట్టి సామర్థ్యమున్నది. అగ్ని గృహవాయువును, దుర్గంధయుక్త పదార్థములను చిన్నభిన్నముచేసి, విడగొట్టి - వానిని దేలికజేసి బయటకు బంపి, వెలుపలి పవిత్ర వాయువును గృహమున బ్రవేశింపజేయును.

ప్రశ్నః- మంత్రములు చదివి హోమము చేయుటేల?

ఉత్తరముః- హోమము చేయుట వలన గలుగు లాభములను దెలుపునర్థము లా మంత్రము లందున్నవి. మంత్రములను బ్రతిదినము పఠించుట వలన నవి కంఠస్థములగును. ఇట్లు వేదముల పఠన పాఠనములు, వాని రక్షణముకూడ జరుగును.

ప్రశ్నః- ఈ హోమము చేయకున్న బాపము కలుగునా?

ఉత్తరముః- అవును, కలుగును, ఏలయన, మనుష్యుని శరీరము నుండి యెంత దుర్గంధము వెడలునో యంతగా నది వాయువును జలమును జెడగొట్టి రోగోత్పత్తికి హేతువగును. ఇట్లు మనుష్యుడితర ప్రాణులకు నెంత దుఃఖము కలిగించునో యంత పాపమతనికి గలుగును. కావున నా పాప నివారణము కొఱకు దననుండి యెంత దుర్గంధ మేర్పడినదో యంతకాని, యంతకెక్కుడుకాని సుగంధము వాయుజలములందు వ్యాపింపజేయవలయును. మఱియు నెవరికైన బదార్థములను భుజింపజేసిన నా వ్యక్తికే కొంత సుఖము కలుగును. ఒక వ్యక్తి యెంత ఘృతము సుగంధ పదార్థములు భుజించునో యంతటి పదార్థములతో హోమము చేసిన లక్షలాది మనుష్యుల కుపకారము కలుగును. కాని, మనుష్యుడు ఘృతాది పదార్థములు భుజింపకున్న నతని శరీర బలము కాని యాత్మబలముకాని వృద్ధి చెందజాలదు. కావున

నుత్తమ పదార్థములను దినవలయును, తినిపించవలయును, త్రాగవలయును, త్రాగింపవలయును, కాని యంతకంటె నధికముగా హెూమము చేయుట యుచితము. కావున హెూమము తప్పక చేయవలయును.

ప్రశ్న:- ప్రతి మనుష్యుడు నెన్ని యాహుతుల నీవలయును? ఒక్కొక్క యాహుతి పరిమాణ మెంత?

ఉత్తరము:- ప్రతివ్యక్తి పదునాఱాహుతు లీవలయును. ఘృతాదుల యాహుతి పరిమాణ మాఱుమాషలు (అఱుతులము) కనీస పరిమాణము. అంతకంటె నెక్కుడైన మిక్కిలి మంచిది. కావుననే యార్యవర శిరోమణులయిన మహాశయులు, మహర్షులు, ఋషులు, రాజులు, మహారాజులు నెక్కువగా హెూమములు చేసెడివారు, చేయించెడివారు. హెూమము చేయు ప్రచారమున్నంత వఱకు నార్యావర్త దేశము రోగరహితమై సుఖపూరితమై యుండెడిది. ఇప్పుడును బ్రచారము జరిగిన నట్లే కాగలదు.

ఒకటి బ్రహ్మయజ్ఞము –చదువుట, చదివించుట, సంధ్యోపాసన – ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనలు చేయుట; రెండవది – దేవయజ్ఞము – అగ్నిహెూత్రము మొదలుకొని యశ్వమేధ పర్యంత యజ్ఞములు, మఱియు విద్వాంసుల సంగతి, సేవచేయుట. కాని, ఈ రెండు యజ్ఞములలో బ్రహ్మచర్యమునందు బ్రహ్మయజ్ఞము, అగ్నిహెూత్రము మాత్రమే చేయవలయును.

(ఉపనయనాధికారము)

'బ్రాహ్మణస్త్రయాణాం వర్ణానాముపనయనం కర్తుమర్హతి.
రాజన్యో ద్వయస్య. వైశ్యో వైశ్యస్యైవేతి. శూద్రమపి
కులగుణ సంపన్నం మంత్రవర్జ మనుపనీత మధ్యాపయేదిత్యేకే.'
సుశ్రుత – సూత్రస్థానపు రెండవ యధ్యాయ వచనము.

అర్థము:- బ్రాహ్మణుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యవర్ణముల వారికి, క్షత్రియుడు క్షత్రియ, వైశ్యవర్ణముల వారికి, వైశ్యుడు (తన) వైశ్యవర్ణపు వ్యక్తికి యజ్ఞోపవీత సంస్కారము చేయించి చదువు చెప్పవచ్చును. కులీనుడు, శుభలక్షణ యుక్తుడునగు శూద్రునకు మంత్రసంహితను విడిచి సర్వశాస్త్రములు చదివింపవలయును. శూద్రుడు చదువవచ్చును. కాని, యతని కుపనయనము చేయరాదు. ఇది యనేకాచార్యుల మతము.

(బ్రహ్మచర్య కాలము)

బాలబాలిక లైదవయేట నుండి కాని, యెనిమిదవ యేట నుండికాని బాలబాలికల పాఠశాలలకు వెళ్లవలయును. నిమ్నలిఖిత నియమపూర్వకముగ నధ్యయన మారంభింపవలయును.

"షట్త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్
తదర్ధికం పాదికం వా గ్రహణాంతిక మేవ వా." మను ౩ – ౧.

అర్థము:- ఎనిమిదవ వర్షము మొదలు (౩౬) ముప్పదియాఱవ వర్షము వఱకు – అనగా నొక్కొక్క వేదము సాంగోపాంగముగ జదువుటకు (౧౨) పండ్రెండు వర్షములు, మొదటి యెనిమిది వర్షములు గలిసి నలువదినాలుగు (౪౪) వర్షములు లేక పదునెనిమిది సంవత్సరముల బ్రహ్మచర్యమగు నెడల, (౧౮ + ౮ =౨౬) ఇరువదియాఱు వర్షములు లేక తొమ్మిది సంవత్సరములు బ్రహ్మచర్యము – లేక విద్యసమాప్తము కానంతవఱకు బ్రహ్మచర్యము పాలింపవలయును.

(త్రివిధ బ్రహ్మచర్యము)

"పురుషో వావ యజ్ఞః తస్య యాని చతుర్వింశతిర్వర్షాణి తత్ప్రాతః
సవనం చతుర్వింశత్యక్షరా గాయత్రీ గాయత్రం ప్రాతః సవనం

తదస్య వసవో౽న్వాయత్తాః ప్రాణా వావ వసవ ఏతే హీదం సర్వం
వాసయన్తి." (౧)
"తం చేదేతస్మిన్ వయసి కించిదుపతపేత్ స బ్రూయాత్ ప్రాణా వసవ
ఇదం మే ప్రాతః సవనమ్ మాధ్యం దినం సవన మనుసంతనుతేతి
మాహం ప్రాణానాం వసూనాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత
ఏత్యగదో హ భవతి." (౨)
"అథ యాని చతుశ్చత్వారింశద్వర్షాణి తన్మాధ్యం దినం సవనం చతుశ్చ
త్వారింశ దక్షరా త్రిష్టుప్, త్రైష్టుభం మాధ్యందినం సవనం తదస్య
రుద్రా అన్వాయత్తాః, ప్రాణా వావ రుద్రా ఏతే హీదం సర్వం
రోదయన్తి (౩)
తం చేదేతస్మిన్ వయసి కించిదుపతపేత్ స బ్రూయాత్ ప్రాణా రుద్రా
ఇదం మే మాధ్యం దినం సవనం తృతీయ సవనమనుసంతనుతేతి
మాహం ప్రాణానాం రుద్రాణాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత
ఏత్యగదో హ భవతి (౪)
అథ యాన్యష్టాచత్వారింశద్ వర్షాణి తత్ తృతీయ సవన మష్టా
చత్వారింశ దక్షరా జగతీ జాగతం తృతీయ సవనం తదస్యాదిత్యా
అన్వాయత్తాః ప్రాణా వావాదిత్యా ఏతే హీదం సర్వమాదదతే. (౫)
తం చేదేతస్మిన్ వయసి కించిదుపతపేత్ స బ్రూయాత్ ప్రాణా ఆదిత్యా
ఇదం మే తృతీయ సవనమాయురనుసంతనుతేతి మాహం ప్రాణానా
మాదిత్యానాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదో హైవ
భవతి. (ఛాం ఉ. ౩-౧౬.) (౬)

బ్రహ్మచర్యము మువ్విధములు, కనిష్ఠము :- పురుషుడు అన్నరసమయమగు దేహమనెడి పురమున శయనించు జీవుడు - యజ్ఞము - అనగా మిక్కిలి శుభగుణయుక్తుడు, సత్కర్తవ్యుడును. ఇతడు (౨౪) ఇరువది నాలుగేండ్ల వఱకు జితేంద్రియుడై బ్రహ్మచారిగా నుండి, వేదాది విద్యలను, సుశిక్షణమును దప్పక గ్రహింపవలయును. తదుపరి వివాహము చేసికొనినను లంపటుడు కారాదు. అప్పుడతని శరీరమునగల ప్రాణములు బలవంతములై సర్వసుగుణముల నతనిలో వసింపజేయగలవి యగును. (౧).

ఈ ప్రథమ వయస్సున నా బ్రహ్మచారిని విద్యాభ్యాస సంతప్తుని జేయవలయును; మఱియు నాచార్యుడట్లే యుపదేశింపవలయును. బ్రహ్మచారి "నేను బ్రథమావస్థయందు సరిగా బ్రహ్మచర్యముతో నుందునేని నా శరీరము, ఆత్మ యారోగ్యము బలపడి, నా ప్రాణములు శుభగుణములు వసింపజేయునవి యగును. ఓ మానవులారా! మీరును నిట్లు సుఖములను విస్తరింపజేయుడు. అందువలన నేను బ్రహ్మచర్యమును లోపింపజేసికొనను. ఇరువదినాలుగు (౨౪) వర్షముల యనంతరమున గృహాశ్రమమున బ్రవేశింతును. అప్పుడు రోగరహితుడనుగా నుందునను మాట ప్రసిద్ధమే. నా యాయువుకూడ (౭౦-౮౦) డెబ్బది యెనుబది యేండ్లవఱకు నుండును" అని నిశ్చయించుకొనవలయును. (౨)

మధ్యమ బ్రహ్మచర్యము:- మనుష్యుడు (౪౪) నలువది నాలుగేండ్ల వఱకు బ్రహ్మచారిగా నుండి వేదాభ్యాసము చేసిన నతని ప్రాణములు, నింద్రియములు, నంతఃకరణము, నాత్మబలయుక్తములై దుష్టుల నెల్లర నేడ్పింపగలవియై శ్రేష్ఠులను బాలింప గలవియగును. (౩)

మీరు చెప్పునట్లు నేనీ ప్రథమ వయస్సునందు గొంచెము తపశ్చర్యము నొనర్తునేని, రుద్రరూప ప్రాణములతో గూడిన నామధ్యమ బ్రహ్మచర్యము సిద్ధింపగలదు. 'ఓ బ్రహ్మచారులార! మీరీ బ్రహ్మచర్యమును బెంపుజేయుడు. నే నీ బ్రహ్మచర్యమును లోపింపజేయక యజ్ఞస్వరూపుడనగుదును. అటుపై నాచార్యకులమున నుండి రోగరహితుడ నగుదును. బ్రహ్మచారినగు నేనెట్లు మంచిపని చేయుదునో యట్లే మీరును జేయుడు. (౪)

ఉత్తమ బ్రహ్మచర్యముః- ఇయ్యది మూడవవిధ బ్రహ్మచర్యము. (౪౮) నలువది యెనిమిదేండ్లు బ్రహ్మచర్యము పాటింపవలయును. జగతీఛందస్సున ౪౮ అక్షరములున్నట్లు ౪౮ ఏండ్లు బ్రహ్మచర్యము పాటించిన వాని ప్రాణము లనుకూలములై సకల విద్యలను గ్రహించును. (౫)

తల్లి దండ్రులు నాచార్యుడు తమ సంతానమును బ్రథమ వయస్సునందు దపస్వులనుజేసి యుపదేశించినచో నాసంతానము తమకు దామే యఖండిత బ్రహ్మచర్యమును సేవించి మూడవదియగు నుత్తమ బ్రహ్మచర్యమును బాలించినవారై పూర్ణమైన - నాలుగువందల సంవత్సరముల వఱకు నాయు వును బెంచుకొనును. అట్లే మీరును బెంపుచేసికొనుడు. ఏలయన మనుష్యుడీ బ్రహ్మచర్యమును బొంది, లోపము జేయకున్న నతడు సర్వవిధ రోగములకు దూరుడై ధర్మార్థకామమోక్షములను బొందగలడు . (౬)

(శరీరావస్థలు ౪)

చతస్రోఽవస్థా శరీరస్య వృద్ధిర్ యౌవనం సంపూర్ణతా కించిత్ పరి
హాణిశ్చేతి. ఆషోడశాత్ వృద్ధిః ఆ పంచవింశతేర్ యౌవనమ్. ఆ చత్వా
రింశతః సంపూర్ణతా. తతః కించిత్ పరిహాణిశ్చేతి."
"పంచవింశే తతో వర్షే పుమాన్ నారీ తు షోడశే
సమత్వాగతవీర్యౌ తౌ జానీయాత్ కుశలో భిషక్."

ఇది సుశ్రుత సూత్రస్థానపు వచనము ౩౫, ౨౫

అర్థముః- ఈ శరీరమునకు నాలుగవస్థలు. అందొకటి - వృద్ధిః- ౧౬వ యేటి నుండి ౨౫వ వర్షము వఱకు గల సమయము. అన్ని ధాతువులు శరీరమున వృద్ధిబొందును.

రెండవది - యౌవనావస్థః- ఇది ౨౫వ వర్షాంతము నుండి ౨౬వ వర్షాది యందు బ్రారంభమగును. మూడవ యవస్థ :- సంపూర్ణత :- ౨౫వ వర్షము మొదలు నలువది (౪౦) యేండ్లు వచ్చువఱకుగల సమయము. ఇందు ధాతువులన్నియు బుష్టిని జేకూర్చుకొనును.

నాలుగవది కించిత్ పరిహాణిః- శరీరమునగల ధాతువులన్నియు సాంగోపాంగముగ బుష్టినిజెంది పూర్ణతను బొందును. ఆ పైన వృద్ధిబొందు ధాతువు శరీరమున నుండదు. స్వప్నప్రస్వేదాదుల మూలమున బయటికి బోవును. కావున వివాహ మాడదలచువారికి నలువది (౪౦)యవ సంవత్సర ముత్తమ సమయము. ౪౮వ యేట వివాహమాడుట యుత్తమోత్తమ మగును.

(స్త్రీ పురుషుల వివాహ కాలము)

ప్రశ్నః- ఈ బ్రహ్మచర్య నియమము స్త్రీ పురుషులకు నిరువురకు సమానమా?

ఉత్తరముః- కాదు. పురుషుడు ౨౫ వర్షములు బ్రహ్మచర్యము చేసిన స్త్రీ - కన్య - ౧౬ వర్షములు, పురుషుడు ౩౦ వర్షములు బ్రహ్మచర్యమున్న స్త్రీ - కన్య -౧౭ వర్షములు, పురుషుడు ౩౬ వర్షములున్న స్త్రీ ౧౮ వర్షములు, పురుషుడు ౪౦ వర్షములున్న స్త్రీ ౨౦ వర్షములు, పురుషుడు ౪౪ వర్షములున్న - స్త్రీ ౨౨ వర్షములు, పురుషుడు ౪౮ వర్షములు బ్రహ్మచర్యము పాలించిన స్త్రీ ౨౪ సంవత్సరములు పాటించి పరస్పరము వివాహమాడుట తగును. ఈ నియమము వివాహము చేసికొనదలచినవారు పాటింపదగినది.

వివాహము చేసికొనదలపని వారు మరణ పర్యంతము బ్రహ్మచర్యము పాటింపవచ్చును. కాని, పూర్ణవిద్యా వంతులు., జితేంద్రియులు, నిర్దోషులు, యోగులునైన స్త్రీ పురుషులే యట్లు చేయగలరు. కామ వేగమును వశపఱచుకొని – నిగ్రహించి, యింద్రియములను వశమున నుంచుకొనుట మిక్కిలి కఠినము.

(పఠన పాఠనములు చేయువారి నియమములు)

"ఋతం చ స్వాధ్యాయప్రవచనే చ. సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ.
తపశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ. దమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ.
శమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ. అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ.
అగ్నిహోత్రం చ స్వాధ్యాయ ప్రవచనే చ. అతిథయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ.
మానుషం చ స్వాధ్యాయ ప్రవచనే చ. ప్రజా చ స్వాధ్యాయ ప్రవచనే చ.
ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ. ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనె చ .
తైత్తిరీయోపనిషత్ – శిక్షా.వ.అ౯."

ఇయ్యవి చదువు వారియు, జదివించు వారియు నియమములు. (ఋతం) యథార్థాచరణముతో జదువవలయును, జదివింపవలయును. (సత్యం చ) సత్యాచారముతో సత్యవిద్యలను జదివి, చదివింప వలయును. (తపశ్చ) తపస్వియై – ధర్మానుష్ఠానమొనర్చుచు వేదాది శాస్త్రములను జదువవలయును, జదివింపవలయును. (దమః) బాహ్యేంద్రియములను దుష్టాచరణము నుండి సర్వవిధ దోషముల నుండి తొలగించి చదువుచు, జదివించుచు నుండవలయును. (అగ్నయః) ఆహవనీయాది – అగ్నులను, విద్యుత్తు మున్నగు నగ్నులను దెలిసికొని చదువుచు జదివించుచు బోవవలయును. (అగ్నిహోత్రం) అగ్నిహోత్రము జేయుచు బఠన పాఠనముల నొనర్పవలయును. (అతిథయః) అతిథులను సేవించుచు జదివి చదివింపవలయును. (మానుషం) మనుజులకు సంబంధించిన వ్యవహారములను యథాయోగ్యముగ నిర్వర్తించుచు జదువవలయును, జదివింపవలయును. (ప్రజా) సంతానపాలనము, రాజ్యపాలనము చేయుచు బఠన పాఠనములు జరుపవలయును. (ప్రజన) వీర్యమును రక్షించుచు, వృద్ధిజేయుచు బఠన పాఠనములు జరుపవలయును. (ప్రజాతిః) తన సంతానమును, శిష్యులను బాలించుచు బఠన పాఠనములు జరుపుచుండవలయును.

(యమనియమ పాలన)

**యమాన్ సేవేత సతతం న నియమాన్ కేవలాన్ బుధః ।**
**యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్ ।।** మను. ౪–౨౦౪
**యమములైదు:–**

**'తత్రాహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః ।।'** యోగసూత్ర – ౨ – ౩౦

అహింసా = వైరత్యాగము, సత్యమ్ = సత్యము నంగీకరించుట, సత్యము పలుకుట, సత్యకర్మలే చేయుట, అస్తేయమ్ = మనోవాక్కాయములతో జౌర్యము చేయకుండుట, బ్రహ్మచర్యమ్ = ఉపస్థేంద్రియ సంయమము, అ పరిగ్రహః = అత్యంతలోలుపత, స్వత్వాభిమానము రెండును లేకుండుట యను నీ యైదు యమముల నెల్లపుడు బాలింపవలయును. నియమములు :–

**శౌచసంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః** యోగ సూత్ర ౨–౩౨.

శౌచమ్ = స్నానాదులతో బవిత్రత, సంతోషః = చేయవలసినంత పురుషార్థమొనర్చి, హానిలాభములలో హర్ష శోకములను బొందకుండుట సంతోషము. ప్రసన్నుడై నిరుద్యముడై యుండుట

సంతోషము కాదు. (తపః) కష్టములు సహించియు ధర్మయుక్త కార్యములను జేయుట, స్వాధ్యాయః = చదువుట, చదివించుట, ఈశ్వర ప్రణిధానమ్ = భక్తివిశేషముతో నీశ్వరునకు నాత్మ నర్పించుట, ఇవి యైదు నియమములు.

అర్థము :- (యమాన్ - శ్లోకము) యమములను విడిచి కేవలనియమములను సేవింపరాదు. రెండింటిని సేవింపవలయును, యమములను విడిచి నియమములను మాత్రము పాటించువాడున్నతి పొందక పోగా నధోగతిని బొందును. లోకమున బతితుడై యుండును.

కామాత్మతా న ప్రశస్తా న చై వేహాస్త్యకామతా
కామ్యో హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః ।। మను ౨ - ౨ ।।

అర్థము :- మిక్కిలి కామాతురత, యత్యంతనిష్కామత యెవనికిని శ్రేష్ఠములు కావు. ఏలయన గోరికయే లేకున్న వేదజ్ఞానము, వేదవిహిత యజ్ఞాద్యుత్తమ కర్మలయనుష్ఠానము నెవనిచేతను సంపాదింపబడదు. కావున :-

(బ్రాహ్మణ శరీర నిర్మాణము)

స్వాధ్యాయేన జపైర్ హోమై స్త్రైవిద్యే నేజ్యయా సుతైః ।
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః ।। మను - ౨-౨౮ ।।

అర్థము :- స్వాధ్యాయేన = సకల విద్యా పఠనపాఠనములచే, వ్రతైః = బ్రహ్మచర్య, సత్యభాషణాది నియమముల బాలించుటచే, హోమైః = అగ్నిహోత్రాది హోమములను జేయుటచేతను, అసత్యమును ద్యజించి సత్య విద్యలను దానము చేయుటచేతను, త్రైవిద్యేన = వేదమునందలి జ్ఞాన కర్మ ఉపాసనలకు సంబంధించిన విద్యను గ్రహించుటచేతను, ఇజ్యయా = (దర్శ పూర్ణమాసాది) పక్షేష్టి మున్నగు వాని నాచరించుటచేతను, సుతైః = సంతానము నుత్పన్నమొనర్చుటచేతను, మహాయజ్ఞైః = బ్రహ్మ, దేవ, పితృ వైశ్వదేవ, అతిథిసేవ లనెడు పంచ మహాయజ్ఞములు, యజ్ఞైః = అగ్నిష్టోమాదులు, శిల్ప విద్యా విజ్ఞానాది రూప యజ్ఞములు చేయుటచేతను నీ శరీరము, బ్రాహ్మీ = వేదములకు, పరమేశ్వర భక్తికి నాధారరూపమగు బ్రాహ్మణ శరీరము, క్రియతే = చేయబడును. ఇన్ని సాధనములు లేక బ్రాహ్మణ శరీరము నిర్మింపబడదు.

"ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు
సంయమే యత్నమాతిష్ఠేత్ విద్వాన్ యన్తేవ వాజినామ్ ।। మను. అ ౨.౮౮.

అర్థము :- సారథి గుఱ్ఱములను నియమించునట్లు విద్వాంసుడు మనస్సును, ఆత్మను, దుష్టకర్మల వైపున కాకర్షించు విషయములందు బ్రవర్తించు నింద్రియములను నిగ్రహించుటకు సర్వప్రయత్నముల నొనర్పవలయును. ఏలయన :-

ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయమ్
సన్నియమ్య తు తాన్యేవ తతః సిద్ధిం నియచ్ఛతి ।। మను ౨ - ౯౩ ।।

అర్థము :- జీవుడింద్రియములకు వశుడై నిశ్చితముగ గొప్ప గొప్ప దోషములకు లోనగును. ఇంద్రియములను వశపఱచుకొనినప్పుడు సిద్ధిని బొందును.

వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛన్తి కర్హిచిత్ ।। మను. ౨.౯౭.

అర్థము :- దుష్టాచారి, అజితేంద్రియుడునగు పురుషునకు వేదములు, త్యాగము, యజ్ఞము, నియమములు, తపస్సు, అన్యసుకర్మములు నెన్నడు సిద్ధింపవు.

వేదోపకరణేచైవ స్వాధ్యాయే చైవ నైత్యకే
నానురోధోఽస్త్యనధ్యాయే హోమమంత్రేషు చైవ హి ।। ౧ ।।
నైత్యకే నాస్త్యనధ్యాయో బ్రహ్మసత్రం హి తత్ స్మృతమ్ ।
బ్రహ్మాహుతిహుతం పుణ్యమనధ్యాయవషట్ కృతమ్. మను. అ ౨ - ౧౦౫ - ౧౦౬

అర్థము :- వేదమును జదువుటలోను, జదివించుటలోను, సంధ్యోపాసనాది పంచమహా యజ్ఞములు చేయుటలోను, హోమ మంత్రములందును ననధ్యాయ ముండదు (ఆటవిడుపు లేదు.) (౧)

కారణమేమన నిత్య కర్మములం దనధ్యాయము (ఆటవిడుపు) ఉండదు. శ్వాసప్రశ్వాసము లెల్లపుడు నడచును. అవి బంధింపబడవు. అట్లే నిత్యకర్మములు ప్రతిదినము చేయవలయును. ఏ దినమునను విడువరాదు. అనధ్యాయ దినమునను జేయబడిన యగ్నిహోత్రాద్యుత్తమ కర్మము పుణ్యరూపమే యగును. అబద్ధమాడుట యెల్లపుడు పాపము. సత్యము చెప్పుట యెల్లపుడు బుణ్యమై నట్లు చెడు కర్మముల నాచరించుట కెల్లపుడు ననధ్యాయము. పుణ్యకర్మముల నాచరించుట యెల్లపుడు స్వాధ్యాయమే యగును. (౨)

అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవిన :
చత్వారి తస్య వర్ధన్తే ఆయుర్విద్యా యశోబలమ్. మను ౨.౧౨౧.

ఎల్లప్పుడు నమ్రుడు, సుశీలుడునై విద్వాంసులకు వృద్ధులకు సేవజేయువానికి నాయువు, విద్య కీర్తి, బలము నను నాలుగు నెల్లపుడు బెరుగును. అట్లు చేయనివాని కా నాలుగును వర్ధిల్లవు.

అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోఽనుశాసనమ్
వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా ।। (౧)
యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగ్గుప్తే చ సర్వదా
స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ ।। (౨) మను. ౨.౧౫౯-౧౬౦

అర్థము:- వైర బుద్ధిని విడిచి, విద్యార్థులు, విద్వాంసులు సర్వమానవ కల్యాణ మార్గము నుపదేశించుచుండవలయును. ఉపదేష్ట యెల్లపుడు మధురమై సుశీలతతో గూడిన వాణిని బ్రయోగింపవలయును. ధర్మోన్నతిని గోరు వాడెల్లపుడు సత్యమాచరించుచు సత్యమునే యుపదేశింపవలయును.(౧)

వాణిని మనస్సును నెల్లపుడు శుద్ధముగాను సురక్షితముగా నుంచుకొను వ్యక్తియే సమస్త వేదాంత - సర్వవేదముల సిద్ధాంతరూప - ఫలమును బొందును (౨).

(సమ్మానేచ్ఛాత్యాగము)

సమ్మానాద్ బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాదివ
అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా ।। మను ౨.౧౬౨

ప్రతిష్ఠను విషతుల్యముగా నెంచి దానికెల్లపుడు భయపడు వ్యక్తి బ్రాహ్మణుడు సమగ్ర వేదమును బరమేశ్వరుని నెఱుగును. అతడే యమృతమునువలె నవమానమునా కాంక్షించును.

అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజః శనైః
గురౌ వసన్ సంచినుయాద్ బ్రహ్మాధిగమికం తపః. మను. ౨.౧౬౪

ఈ విధముగనే యుపవీతుడైన ద్విజ బ్రహ్మచారి కుమారుడు, బ్రహ్మచారిణి కన్యయు నెమ్మది నెమ్మదిగా వేదార్థమునకు సంబంధించిన జ్ఞానమనెడి యుత్తమ తపస్సును బెంపుచేసికొనుచుండవలయును.

యోఽనధీత్య ద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమమ్
స జీవన్నేవ శూద్రత్వమాశు గచ్ఛతి సాన్వయః || మను.౨.౧౬౮

వేదమును జదువక యితర విషయముల శ్రమించు (ద్విజుడు) పుత్రపౌత్ర సహితుడై శూద్రత్వమును శీఘ్రముగ బొందును.

(బ్రహ్మచారి కర్తవ్యములు)

వర్జయేన్మధుమాంసం చ, గంధం మాల్యం రసాన్ స్త్రియః
శుక్తాని యాని సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్. (౧)
అభ్యంగమంజనం చాక్ష్ణోరుపానచ్ఛత్రధారణమ్.
కామం క్రోధం చ లోభం చ నర్తనం గీతవాదనమ్. (౨)
ద్యూతం చ జనవాదం చపరివాదం తథాఽనృతమ్
స్త్రీణాం చ ప్రేక్షణాలంభముపఘాతం పరస్య చ. (౩)
ఏకః శయీత సర్వత్ర న రేతః స్కందయేత్ క్వచిత్
కామాద్ధి స్కందయన్ రేతో హినస్తి వ్రతమాత్మనః || (౪) మను. ౨.౧౭౭—౧౮౦

అర్థము :– బ్రహ్మచారి, బ్రహ్మచారిణి యిరువురు మద్యమును, మాంసమును, గంధమును, మాలలను, రసమును, స్త్రీపురుషుల సంగమమును, బులుపు వస్తువులన్నింటిని, ప్రాణి హింసనమును, (౧)

అంగ మర్దనము, నిమిత్తములేక యుపస్థేంద్రియస్పర్శము, కంటిలో నంజనము, చెప్పులు ఛత్రము ధరించుట, కామము, క్రోధము, లోభము, మోహము, భయము, శోకము, ఈర్ష్యాద్వేషములు, నృత్యము గానము, వాద్య వాదనములు, (౨)

ద్యూతము, జనవాదము, నింద, మిథ్యాభాషణము, స్త్రీ దర్శనము, ఆశ్రయము, పరులకు హాని చేయుట మున్నగు కుకర్మలు విడువవలయును. (౩)

అంతట నొంటరిగా బడుకొనవలయును. వీర్యము నెన్నడును స్ఖలనము చేయరాదు. కోరి వీర్య స్ఖలనము చేసికొనిన, నతడు తన బ్రహ్మచర్య వ్రతమును నాశము చేసికొని నట్లెంచవలయును. (౪)

(శిష్యున కాచార్యోపదేశము)

వేదమనూచ్యాచార్యోఽన్తేవాసినమనుశాస్తి – సత్యం వద, ధర్మం చర.
స్వాధ్యాయాన్మా ప్రమదః. ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం
మా వ్యవచ్ఛేత్సీః. సత్యాన్న ప్రమదితవ్యమ్. ధర్మాన్న ప్రమదితవ్యం. కుశ
లాన్న ప్రమదితవ్యమ్. భూత్యై న ప్రమదితవ్యమ్. స్వాధ్యాయ ప్రవచనాభ్యాం
న ప్రమదితవ్యమ్ (౧) ||
దేవపితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యం. మాతృదేవో భవ. పితృదేవో భవ.
ఆచార్యదేవో భవ. అతిథిదేవో భవ. యాన్యనవద్యాని కర్మాణి తాని
సేవితవ్యాని నో ఇతరాణి. యాన్యస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని
నో ఇతరాణి || ౨.
యే కే చాస్మచ్ఛ్రేయాంసో బ్రాహ్మణా స్తేషాం త్వయాఽసనేన ప్రశ్వసితవ్యమ్.
శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయా దేయమ్. శ్రియాదేయమ్. హ్రియా దేయమ్.
భియాదేయమ్. సంవిదా దేయమ్. అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్త
విచికిత్సా వా స్యాత్. (౩)

యే తత్ర బ్రాహ్మణాః సమదర్శినో యుక్తా అయుక్తా అలూక్షా ధర్మకామాః
స్యుర్యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః. ఏష ఆదేశ ఏష ఉపదేశ
ఏషా వేదోపనిషత్. ఏతదనుశాసనమ్. ఏవముపాసితవ్యమ్. ఏవముచైతదు
పాస్యమ్ (౪) తైత్తిరీయ. శిక్షావల్లీ ౧౧

ఆచార్యులు తమ శిష్యులకు శిష్యురాండ్రకు నిట్లుపదేశింపవలయును. నీ వెప్పుడు సత్యము జెప్పుము. ధర్మాచరణ మొనర్పుము. ప్రమాదము వదలి చదివి చదివింపుము. పూర్ణబ్రహ్మచర్యములో సమస్త విద్యలను గ్రహింపుము. ఆచార్యునకు బ్రియధనము నర్పించి వివాహము చేసికొని సంతానము గనుము. ప్రమాదము వలన సత్యము నెన్నడు విడువకు. ప్రమాదము వలన ధర్మమును దృజింపకు. అట్లే యారోగ్యమును జతురతను విడువకు. ప్రమాదముతో నుత్తమైశ్వర్యమును వృద్ధిజేయుట మానకు. ప్రమాదమువలన జదువుట చదివించుట మానవలదు (౧).

దేవ - విద్వాంసులకు, దల్లిదండ్రులు మున్నగు వారికి సేవజేయుటలో బ్రమాదమొనర్పకు. విద్వాంసులను సత్కరించునట్లు తల్లిదండ్రులను, నాచార్యుని, నతిథులను నెల్లపుడు సేవింపుము. అనిందితములు ధర్మయుక్తములు నగు గర్మములను సత్యభాషణాదులను జేయుచుండుము. వానికి భిన్నములైన మిథ్యాభాషణాదుల నొనర్పకు. మా సుచరితలను - ధర్మయుక్త కర్మములను గ్రహింపుము; మా పాపాచరణముల నెన్నడు గ్రహింపకు, చేయకుము. (౨)

ఎవరు మాలో నుత్తమ విద్వాంసులు, ధర్మాత్ములు నున్నారో వారి సమీపమున గూర్చుండి, వారినే విశ్వసింపుము. శ్రద్ధతో , నశ్రద్ధతో, శోభతో, లజ్జతో, భయముతో, బ్రతిజ్ఞతోను నీవలయును. ఎప్పుడైనను నీకు గర్మ విషయమునగాని, శీల విషయమునగాని, యట్లే యుపాసన జ్ఞాన విషయమునగాని సందేహము కలిగినపుడు. (౩)

సమదర్శులు, బక్షపాత రహితులు, యోగులు, నయోగులు, నార్ద్రచిత్తులు, ధర్మాభిలాషులు, ధర్మాత్ములునైనవారు వర్తించిన మార్గమున నీవును వర్తింపుము. - ఇదియే యాదేశము - ఆజ్ఞ. ఇదియే వేదోపనిషత్తు. ఇదియే శిక్షణమును. ఇట్లే నడచుకొనుచు నీవు నీ యాచరణమును దిద్దుకొనుము. (౪)

అకామస్య క్రియా కాచిత్ దృశ్యతే నేహ కర్హిచిత్
యద్యద్ధి కురుతే కించిత్ తత్తత్ కామస్య చేష్టితమ్. మను. ౨-౪

'నిష్కాముడైన పురుషుడు తన నేత్రములను గూడ మూయుటకాని తెఱచుటకాని సంభవముకాదు' అని మనుష్యులు నిశ్చయింపవలయును. కావున మనుజులు చేయు జేష్టలన్నియు గామ్యకోరికలులేక కలుగవని సిద్ధమగుచున్నది.

(ఆచార మహత్త్వము)

ఆచారః ప్రథమో ధర్మః శ్రుత్యుక్తః స్మార్త ఏవ చ
తస్మాదస్మిన్ సదా యుక్తో నిత్యం స్యాదాత్మవాన్ ద్విజః. మను. ౧.౧౦౮.

వేదము వేదానుకూలములైన స్మృతులలో జెప్పబడిన ధర్మ కర్మముల నాచరించుటయే చెప్పుటకు, శ్రవణ శ్రావణములకు, బఠన పాఠనములకు ఫలము. కావున నెల్లపుడు ధర్మాచారమున దత్పరులై యుండవలయును.

ఆచారాద్ విచ్యుతో విప్రో న వేదఫలమశ్నుతే,
ఆచారేణ తు సంయుక్తః సంపూర్ణఫలభాగ్ భవేత్. మను. ౧, ౧౦౯

ధర్మాచరణ రహితుడైన వ్యక్తి వేదప్రతిపాదిత ధర్మజన్య సుఖరూప ఫలమును బొందజాలడు. విద్య

నభ్యసించి ధర్మము నాచరించువాడే సంపూర్ణ సుఖము నందగలడు.

యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః
న సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః. మను, ౨-౧౧

వేదములను, నాప్తపురుషులచే రచింపబడిన వేదానుకూల శాస్త్రములు నవమానించువాడు నాస్తికుడు. అతనిని జాతి, పంక్తి, దేశముల నుండి వెడలనంపవలయును.

(ధర్మలక్షణాదులు)

శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియ మాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్. మను ౨-౧౨

(౧) శ్రుతి = వేదము (౨) స్మృతి = వేదానుకూలముగ నాప్తులచే వ్రాయబడిన మనుస్మృత్యాది గ్రంథములు, (౩) సదాచారము = సత్పురుషుల యాచరణము – సనాతన – అనగా వేదమున బరమేశ్వర ప్రతిపాదిత కర్మము, (౪) మఱియు దనయాత్మకు బ్రియము ననగా నాత్మయభిలషించు సత్యభాషణాదులు నను నీ నాలుగు ధర్మమునకు లక్షణములు. వీనింబట్టి ధర్మము, నధర్మమును నిశ్చయింప వలయును. పక్షపాత రహితము, న్యాయము, సత్యగ్రహణము, సర్వథా యసత్యత్యాగము నను నాచారమునకే 'ధర్మము' అని నామము. దీనికి విపరీతముగ బక్షపాత సహితము, నన్యాయము, సత్యము విడుచుట, యసత్య పరిగ్రహణముగల కర్మ మధర్మమనబడును.

(ధర్మమున వేద ప్రమాణము)

అర్థ కామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే
ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః. మను ౨, ౧౩

అర్థము :- సువర్ణము మున్నగు ధాతువులు, రత్నములు, కామము = స్త్రీ సేవనము నను వానియందాసక్తి లేనివానికి ధర్మజ్ఞానము కలుగును. ధర్మము తెలిసికొనదలచువారు వేదము మూలమున ధర్మమును నిశ్చయింపవలయును. వేదమును విడిచిన ధర్మాధర్మముల నిర్ణయము సరిగా గలుగజాలదు.

ఇట్లు శిష్యులకు నాచార్యు డుపదేశింపవలయును. విశేషించి రాజులకు, వైశ్యులకు నుత్తమ శూద్రులకు విద్యాభ్యాసము చేయింపవలయును. బ్రాహ్మణులు మాత్రము విద్య నభ్యసించి క్షత్రియాదులు చదువకున్న విద్య, ధర్మము, రాజ్యము, ధనము మొదలగునవి వృద్ధిబొందజాలవు. ఏలయన బ్రాహ్మణుడు కేవలము పఠన పాఠనములు చేసి, క్షత్రియాదుల నుండి జీవికను బొంది, జీవనము చేయగలడు. జీవనము కొఱకు బ్రాహ్మణుడు పరాధీనుడై, క్షత్రియాదుల నాజ్ఞాపింపజాలక యుచితరీతిని బరీక్షించి దండింపజాల నపుడు బ్రాహ్మణాది వర్ణములన్నియు బాషండమున జిక్కువడును.

క్షత్రియాదులు కూడ విద్వాంసులయినపుడు బ్రాహ్మణులు కూడ నెక్కుడు విద్య నభ్యసించి ధర్మ పథమున నడచుకొందురు. చదువుకొన్న క్షత్రియాదుల యెదుట బాషండత, యసత్యవ్యవహారము జేయజాలడు. క్షత్రియాదులు కూడ నవిద్వాంసులైనచో వారును దమ యిచ్చవచ్చినట్లు చేసి, యితరులచే నట్లే చేయింతురు. కావున బ్రాహ్మణుడు కూడ దన కల్యాణమును గోరు నెడల క్షత్రియాదులచేత గూడ వేదాది సత్యశాస్త్రముల నధికముగా నభ్యసింప జేయవలయును. ఏలయన క్షత్రియాదులే విద్య, ధర్మము, రాజ్యము, లక్ష్మియను వానినన్నిటిని వృద్ధిపఱచువారు. వారెన్నడు భిక్షావృత్తి నవలంబింపరు. కావున వారు విద్యా వ్యవహారమున బక్షపాతులు కాజాలరు. అన్ని వర్ణములందును విద్యాసుశిక్షణము లున్నపుడు పాషండ రూపమగు నధర్మయుక్త మిథ్యావ్యవహారముకూడ నడవజాలదు.

ఇందువలన నేమిసిద్ధమగుచున్నది? క్షత్రియాదులను నియమములందు నడపువారు బ్రాహ్మణులు

సన్న్యాసులు; అట్లే యా బ్రాహ్మణులను సన్న్యాసులను నియమములందుంచువారు క్షత్రియాదులు నగుదురు. కావున సర్వవర్ణముల స్త్రీ పురుషులందును, విద్య, ధర్మముల ప్రచారము తప్పక జరుగవలయును.

(సత్యా సత్యముల పంచవిధ పరీక్ష)

పఠన పాఠనములు బాగుగ బరీక్షించి జరుపుట మిక్కిలి యుచితము. పరీక్ష యైదు విధములు.

ఒకటి :- ఈశ్వరుని గుణ కర్మ స్వభావములకు వేదములకు ననుకూలమైనది యంతయు సత్యమనియు; నందులకు విరుద్ధమైనది యసత్యమనియు దెలిసికొనవలయును.

రెండవది :- సృష్టిక్రమమున కనుకూలమైనది సత్యము. దానికి విరుద్ధ మసత్యము. ఉదా:- తల్లి దండ్రుల సంయోగము లేకయే పుత్రుడు జన్మించెనని యెవరైన జెప్పిన నది సృష్టిక్రమమునకు విరుద్ధము కావున సర్వథా యసత్యము.

మూడవది :- ఆప్తుడు – ధార్మిక విద్వాంసుడు, సత్యవాది, నిష్కపటియైన వారి సాంగత్యమునకు, నుపదేశములకు ననుకూలమైనది గ్రాహ్యము. విరుద్ధమైనది యగ్రాహ్యము.

నాలుగవది :- తన యాత్మయొక్క పవిత్రతకు విద్యకు ననుకూలము ననగా దనకు సుఖ మిష్టము, దుఃఖమయిష్టము నైనట్లుగా నితరుల కందఱకు నట్లే యగునని యెంచుట. అనగా దానెవరికైన సుఖము కలిగించిన నతడు ప్రసన్నుడగును, దుఃఖము కలిగించిన నతడప్రసన్నుడగునని గుర్తించుట.

ఐదవది :- ఎనిమిది ప్రమాణములు – ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము.

(ప్రమాణ లక్షణములు)

ప్రమాణములలో మొదటిది ప్రత్యక్షము. వీని లక్షణాదులలో వ్రాయబడు సూత్రములు న్యాయ శాస్త్ర ప్రథమ ద్వితీయాధ్యాయములకు జెందినవి.

"ఇంద్రియార్థసన్నికర్షోత్పన్నం జ్ఞానమవ్యపదేశ్య మవ్యభిచారి
వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్." న్యాయ. అ. ౧, ఆ ౧, సూ, ౪.

(శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము)

చెవి, చర్మము, నేత్రము, నాలుక, నాసిక యను నీ యైదింద్రియములలో గ్రమముగా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధమునను విషయముల – పదార్థములతో నవ్యవహిత – ఆవరణరహిత సంబంధము కలుగును. అట్టి యింద్రియములతో – అర్థసంయుక్తములగు నింద్రియములతో మనస్సునకు, నా మనస్సుతో నాత్మకు సంయోగము కలిగినపు డుత్పన్న జ్ఞానము (ఇది ఘటము, ఇది పటము – అను జ్ఞానము) ప్రత్యక్షము – ప్రత్యక్షజ్ఞానమందురు. అవ్యపదేశ్యము – అనగా సంజ్ఞ, సంజ్ఞికగల సంబంధము(సాంకేతిక సంబంధము) వలన గలుగు జ్ఞానము ప్రత్యక్షజ్ఞానము కాదు. కాకూడదు. ఉదాహరణము :- ఒకడొకనితో 'జలమును దెమ్ము' అనెను. అతడు జలము తెచ్చి 'ఇది జలము' అనెను. ఇక్కడ 'జలము' అను మూడక్షరముల సంజ్ఞ – (నామము – వ్యపదేశము)ను దెచ్చినవాడు కాని, తెమ్మనిన వాడుకాని చూడలేదు. కాని 'జలము' అని యే వస్తువునకు బేరో యావస్తువు (నీరు) ప్రత్యక్షమగును. (చూడగలరు.) శబ్దము వలన నుత్పన్న జ్ఞానము శబ్ద ప్రమాణమునకు విషయము. అది ప్రత్యక్ష జ్ఞానము కాదు.

అవ్యభిచారి :- ఒకడు రాత్రియందు స్తంభమును జూచి పురుషుడని నిశ్చయించెను. ఆ స్తంభమునే పగలు జూచినపుడు రాత్రి కలిగిన పురుషుడను జ్ఞానము నశించి, స్తంభజ్ఞానము కలిగెను. ఇట్టి వినాశి జ్ఞానము

వ్యభిచారి యనబడును.

వ్యవసాయాత్మకము :- ఒకడు దూరమున నుండి నదీ సమీపమున నుండు నిసుక తిన్నెలను జూచి, 'అక్కడ వస్త్రములెండుచున్నవి. 'జలమా లేక యింకేమైన నగునా?' 'ఆ నిలుచున్నది దేవదత్తుడా లేక యజ్ఞదత్తుడా' అనును. (ఇది సంశయాత్మక జ్ఞానము) నిశ్చయ జ్ఞానము కలుగనంతవఱకు నది ప్రత్యక్షము కాదు. కాబట్టి యవ్యపదేశ్యము, నవ్యభిచారి, నిశ్చయాత్మకమునగు జ్ఞానమే 'ప్రత్యక్ష' జ్ఞానమందురు.

(ప్రత్యక్ష లక్షణము పై విశేషము)

ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన మవ్యపదేశ్య మవ్యభిచారి
వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్. న్యాయ. అ ౧. ఆ.౧.సూ౪.

నేత్రాదులు ఇంద్రియములు. రూపరసాదులు, తద్వ్యక్తములు నర్థములు. సన్నికర్షము - సంయోగాది సంబంధము. వ్యపదేశము - సంజ్ఞ - నామము. వ్యపదేశ్యము సంజ్ఞ వలన కలిగిన జ్ఞానము. అవ్యపదేశ్యమది కానిది. సంజ్ఞ వలన గలిగిన జ్ఞానము కానిది. వ్యభిచారి - నశించునది. అది కాని దవ్యభిచారి. వ్యవసాయాత్మకము - నిశ్చయజ్ఞానము.

ఇక సూత్రార్థము :- చెవి, త్వక్కు, నేత్రము, జిహ్వ, నాసిక యను నీ యింద్రియములతో గ్రమముగా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము నను నర్థములకు సంబంధము కలిగి, యా యింద్రియములతో మనస్సుకు, నా మనస్సుతో నాత్మకును సంబంధము కలిగినపుడు 'ఇది ఘటము, ఇది పటము' అను నిట్టి జ్ఞానములు కలుగును. ఆ జ్ఞానమును బ్రత్యక్ష జ్ఞానమందురు, కాని యీ జ్ఞానము - అవ్యపదేశ్యము, అవ్యభిచారి, వ్యవసాయాత్మకము నైయుండవలయును.

అవ్యపదేశ్యము - వ్యపదేశ్యము కానిది . వ్యపదేశ్యమన, వస్తునామము విన్నప్పుడు కలుగు జ్ఞానము. ఎట్లన :- జలము ఫలము ఘటము మున్నగునవి నామములు. ఈ శబ్దములు చెవికి సోకినపుడు వానిచే దెలియబడు వస్తువులు శబ్దార్థకములకుగల సాంకేతిక సంబంధము వలన దెలియబడును. ఈ జ్ఞానము వ్యపదేశ్యము - శాబ్దజ్ఞాన మనబడును. ప్రత్యక్షజ్ఞానము కాదు. ప్రత్యక్ష జ్ఞానమున వస్తువుతో నింద్రియమునకు సంయోగ సంబంధము కలుగును. కావున నట వస్తువు ప్రత్యక్షమగును. వస్తునామము కాదు. కావున నింద్రియార్థ సంయోగమువలన గలుగు జ్ఞానమే ప్రత్యక్షమగును. ముందొక జ్ఞానము కలిగి తదుపరి యాజ్ఞానము సరికాదని తొలగింపబడి మఱియొక జ్ఞానము కలిగిననది వ్యభిచారి జ్ఞానమగును. ప్రత్యక్ష మట్లు కారాదు. ఇదియా, యదియా యని ప్రత్యక్షము సందిగ్ధము కారాదు. ఇంద్రియార్థ సన్నికర్షము వలన గలుగు జ్ఞానము ప్రత్యక్ష జ్ఞానమనబడును. జ్ఞానము ప్రమాణము కాదు. ఈ జ్ఞానము దేనివలన గలుగుచున్నదో యది ప్రత్యక్ష ప్రమాణము. ఇట నింద్రియముల వలన నుపర్యుక్త జ్ఞానము కలుగును. కావున నింద్రియములు ప్రమాణము - ప్రత్యక్ష ప్రమాణము.

సూత్రము ప్రత్యక్ష ప్రమాణ లక్షణము బోధింప నుల్లేఖింప బడినది. కాని ప్రత్యక్ష జ్ఞానమునకు లక్షణము చెప్పినది. కాబట్టి యిట్టి ప్రత్యక్ష జ్ఞానము దేనివలన కలుగునో యది ప్రత్యక్ష ప్రమాణమని తెలసికొనవలయును. అందులకు సూత్రమున 'యతః' అను పదము చేర్చుకొనవలయును.

రెండవది అనుమానము :-

"అథ తత్పూర్వకం త్రివిధ మనుమానమ్,
పూర్వవచ్ఛేషవత్ సామాన్యతో దృష్టం చ" న్యా, ౧, ౧, ౫.

ప్రత్యక్ష పూర్వకము - అనగా నొక ద్రవ్యముయొక్క యేదో యొక భాగముకాని, యా ద్రవ్యము సంపూర్ణముగ కాని, యేదో యొక కాలమున నేదేని యొక దేశమున బ్రత్యక్షమై యుండి, పిదప దూరము

నుండి యా ద్రవ్యము యొక్క సహచారి - యేకదేశము - భాగము ప్రత్యక్షమగుట వలన నదృష్టము - కనపడని యవయవి - ద్రవ్యము యొక్క జ్ఞానము కలిగిన 'అనుమాన' జ్ఞానము (అనుమితి) అందురు. ఉదాహరణము :- పుత్రుని జూచుట వలన - ప్రత్యక్షము వలన దండ్రి జ్ఞానము, పర్వతమున బొగ ప్రత్యక్షము వలన నగ్ని జ్ఞానము, లోకమున సుఖదుఃఖముల జూచినపుడు - అనుభవము వలన పూర్వజన్మ జ్ఞానము కలుగును. (అట్టి జ్ఞానము దేనివలన గలుగునో యదియే లింగము - అనుమాన ప్రమాణ మనబడును.)

ఆ యనుమాన ప్రమాణము ముప్విధములు. ౧ ఒకటి పూర్వవదనుమానము :- (పూర్వము = కారణము. పూర్వవద్ - కారణవదనుమానము. అనగా గారణ ప్రత్యక్షము వలన గార్యజ్ఞానము కలుగును.) ఉదాహరణము :- మేఘములను జూచుటవలన వర్షము కలుగునను జ్ఞానము కలుగుట, వివాహము జూచుటవలన ( ఆ వివాహితులకు) సంతానోత్పత్తి కలుగునని యూహించు జ్ఞానము. చదువుచున్న విద్యార్థులను జూచుటవలన నా విద్యార్థులకావిద్య రాగలదని నిశ్చయించు జ్ఞానము - పూర్వవదనుమితి - అనుమాన జ్ఞానము.

శేషవదనుమానము :- శేషము = కార్యము. కార్యప్రత్యక్షము వలన కలుగు కారణ జ్ఞానము శేషవదను మానబడును. ఉదాహరణము :- ఎక్కువ యగుచున్న నదీ ప్రవాహమును జూచుటవలన నదికి నెగువ భాగమున వర్షము కురిసి యుండునని యూహించుట, పుత్రుని జూచుట వలన గలుగు తండ్రి జ్ఞానము - అనగా నితని కొక తండ్రి యుండునను జ్ఞానము, సృష్టిని జూచుట వలన నీ సృష్టి రూపకార్యమునకు ననాది - కారణము (ఉపాదాన కారణము - ప్రకృతి) కలదనియు, నట్లే యీ సృష్టికొక కర్త యీశ్వరుడు (చేతన నిమిత్త కారణము) కలడని జ్ఞానము కలుగును. మనుజులకు గలుగు సుఖదుఃఖములను జూచుటవలన వారంతకు బూర్వము చేసిన పుణ్య పాపముల జ్ఞానము కలుగును. ఈ జ్ఞానము లన్నియు శేషవదనుమాన ప్రమాణము వలననే కలుగును.

మూడవది - సామాన్యతో దృష్టానుమానము :- (సామాన్యము = సాధర్మ్యము - సమాన ధర్మము. దాని ప్రత్యక్షము వలన గలుగు జ్ఞానము సామాన్యతో దృష్టానుమానబడును.) ఏ రెండు వస్తువులలో నొకదాని వలనరెండవ దాని జ్ఞానము కలుగునో యా రెండు వస్తువులు నొకదానికి మఱియొకటి కార్యము కాని కారణము కాని కాక పోయినను వానిలో గల సామాన్యము - సాధర్మ్యము వలన జ్ఞానము కలుగును. అది సామాన్యతో దృష్టానుమాన జ్ఞానమగును. ఉదా:- ఎవడును నడవక - గమనక్రియ చేయక, యొక స్థలము నుండి మఱియొక స్థలమునకు బోజాలడు. అట్లే మఱియొకడును గమనము చేయక నడువక యెన్నడు స్థానాంతరమునకు - మఱియొక స్థలమునకు బోజాలడు. (స్థానాంతర స్థితి రూప సామాన్యము వలన గమనక్రియా జ్ఞానము కలుగును.)

అనుమాన శబ్దార్థము (అను - అర్థాత్ ప్రత్యక్షస్య పశ్చాత్ మీయతే - జ్ఞాయతే యేన తదను మానమ్) (అను = తరువాత ప్రత్యక్షము తరువాత దేని మూలమున నూహించి విషయము దెలిసికొన బడునో యది యనుమాన ప్రమాణము.) ప్రత్యక్షమునకు దదుపరి యుత్పన్నమగునది. ఉదా :- ధూమ మును ప్రత్యక్షముగా జూడకున్న నదృష్టము - కనబడని యగ్ని జ్ఞానము కలుగదు. (ఇట ముందు ధూమము ప్రత్యక్షమగును. తదుపరి కనబడని యగ్ని జ్ఞానము కలుగును. ధూమ మనుమాన ప్రమాణము. అట నగ్ని యున్నదను జ్ఞానమనుమితి = అనుమాన ప్రమాణము వలన కలిగిన జ్ఞానము.)

మూడవది ఉపమానము :-

'ప్రసిద్ధసాధర్మ్యాత్ సాధ్య సాధన ముపమానమ్" న్యా - ౧.౧.౬

ప్రసిద్ధమగు సాధర్మ్య ప్రత్యక్షము వలన సిద్ధపఱుప దగిన సాధ్యము యొక్క జ్ఞానమును సిద్ధముచేయు సాధనముపమాన మనబడును. (ఉపమీయతే యేన తదుపమానమ్) దేనితో నుపమింపబడునో యది యుపమాన మనబడును. ఒకడు తన భృత్యునితో 'నీవు విష్ణుమిత్రుని బిలుచుకొని రమ్మ' అని యనగా నతడు 'నేనతని జూడలేదు' అనగా నా యజమానుడు ' ఈ దేవదత్తు డున్నట్లే విష్ణుమిత్రు డుండును'. లేక 'ఈ గోవున్నట్లే గవయముండును' అని చెప్పగా నతడక్కడకు వెళ్లి దేవదత్తుని వంటి వ్యక్తిని జూచి యితడే విష్ణుమిత్రుడని నిశ్చయించి యతనిని దీసికొని వచ్చును. లేక యరణ్యమునకు వెళ్లి యావునకు దుల్యమైన పశువును జూచి యదియే గవయమని నిశ్చయించును. (ఇట బ్రసిద్ధము గోవు. సాధింపదగినది గవయము. గోవునకు గవయమునకు గల సమానత గవయ జ్ఞానమును గలిగించుటకు సాధనమగును. గోవు – ఉపమానము, గవయము ఉపమేయము. ఈ రెంటిలోగల సాదృశ్యము – సాధర్మ్యము, ఉపమాన ప్రమాణము. ఇందు గవయము ప్రత్యక్షమైనను సాదృశ్యము గవయమను పదమునకు గవయమునకు గల సంబంధమును దెలుపును. గోవు గవయము వంటిదని యా రెండు జంతువులలో గల సాదృశ్యము తెలియనంత వఱకు గవయమెదుట నున్నను నేదో జంతువు తన యెదుట నున్నదని తెలియునే కాని యిది గవయమని తెలియదు. అనగా నిది గవయ పదవాచ్యమని తెలియదు, గవయ పదమునకు గవయమునకు గల సంబంధము తెలియదు. అది యిప్పుడు సాదృశ్య జ్ఞానము వలన దెలిసినది. సాదృశ్య జ్ఞానము వలన దెలిసిన సంజ్ఞా సంజ్ఞి సంబంధ జ్ఞానమే యుపమితి – ఉపమాన జ్ఞానము.)

నాలుగవది శబ్దప్రమాణము :–

ఆప్తోపదేశః శబ్దః. న్యాయ. ౧.౧.౭.

(ఆప్తుని యుపదేశము శబ్దప్రమాణము. ఉపదేశమిట వాక్యము.)

ఆప్తుడు – పూర్ణ విద్వాంసుడు, ధర్మాత్ముడు, పరోపకార ప్రియుడు, సత్యవాది, పురుషార్థి, జితేంద్రియుడు నగును. అతడు (తనలో) తాను దెలిసికొనిన దానిని, దాను సుఖపడిన దానిని నితరులకు జెప్పవలయునను గోరికతో బ్రేరితుడై మనుష్యుల కల్యాణార్థ ముపదేశించును. పృథివి మొదలు పరమేశ్వరుని వఱకుగల పదార్థముల జ్ఞానము సంపాదించి, యతడుపదేష్ట యగును. ఇట్టి పురుషుడు (జగత్తున పూర్ణుడు.) ఆ పూర్ణాప్తుడు నైనవాడు పరమేశ్వరుడే – అతడే యాప్తుడైన యుపదేష్ట. అతని యుపదేశమే వేదములు. వానినే శబ్దప్రమాణమందురు. (వానివలన గలిగిన జ్ఞానమే శాబ్దజ్ఞానము.)

ఐదవది ఐతిహ్యము :–

న చతుష్ట్వ మైతిహ్యార్థాపత్తి సంభవాభావ ప్రామాణ్యాత్. న్యా. ౨.౨.౧.

(ప్రమాణములు నాలుగే కాదు. ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము నని మఱి నాలుగు ప్రమాణములున్నవి. అని సూత్రాభిప్రాయము)

(ఇతి హ ఆస) ఇట్లుండెను. అతడిట్లు చేసెను. అని తెలుపునది యితిహాసము – ఐతిహ్యమనబడును. అనగా గొండొకని జీవన చరిత్ర మైతిహ్య ప్రమాణము.

ఆఱవది అర్థాపత్తి :–

"అర్థాదాపద్యతే సా అర్థాపత్తిః." కేనచిదుచ్యతే 'సత్సు ఘనేషు వృష్టిః సతి కారణే కార్యం భవతీతి'. కిమత్ర ప్రసజ్యతే – అసత్సు ఘనేషు వృష్టి రసతి కారణే కార్యం న భవతీతి. 'మేఘములున్న వర్షము కురియును. కారణమున్న గార్యమేర్పడును, అని యొకడనిన మేఘములేకున్న వర్షము కురియదు; కారణము లేకున్న గార్యమేర్పడదు' అని చెప్పకయే తెలియును. (ఇదియే – అర్థాపత్తి. ఒక వాక్యార్థము

వలన మఱియొక జ్ఞానము కలుగును. అందుకు వేఱు వాక్యము ప్రయోగింప నావశ్యకము లేదని భావము.)

ఏడవది :- సంభవము :-

"సంభవతి యస్మిన్ స సంభవః" (ఏదియున్న నేదికలుగునో యది సంభవము. అవినాభావియగు నొకదాని సత్తాగ్రహణము వలన మఱియొక దాని సత్తాగ్రహణము సంభవ మనబడును.)

(తల్లి తండ్రులు లేకయే సంతానము కలిగినది. కొండొకడు చనిపోయిన వానిని బ్రతికించెను. పర్వతమునెత్తెను. సముద్రమున రాళ్ళను దేల్చెను. చంద్రుని దునకలు చేసెను. పరమేశ్వరు డవతరించెను. మనుష్యుని కొమ్ములను జూచెను. గొడ్రాలి పుత్రికా పుత్రులకు వివాహమైనది; అని యెవడేని చెప్పిన నవి యసంభవములు. ఇవి యన్నియు సృష్టిక్రమమునకు విరుద్ధములు. సృష్టిక్రమమునకు ననుకూలమైనది సంభవము. ఒకని దగ్గఱ నొక్క రూప్యముండిన నతనిదగ్గఱ నర్ధరూప్యము, పావల యుండుట సంభవము. ఒకని దగ్గఱ గుంచెడు నూకలున్నవని యనిన నడ్డెడు నూకలుండుట సంభవము.)

ఎనిమిదవది – అభావము :-

న భవతి యస్మిన్ సోఽభావః :- లేనిది యభావ మనబడును. ఒకడొకనితో "నేనుగును దీసికొనిరమ్మ"నెను. అతడక్కడ నేనుగు నభావము – లేకుండుటను జూచి, యున్నచోటు నుండి యేనుగును దెచ్చెను.

ఇవి యెనిమిది ప్రమాణములు. వీనిలో శబ్ద ప్రమాణమున, ఐతిహ్యమును, అనుమాన ప్రమాణమున – అర్థాపత్తి, సంభవ, అభావములను లెక్కించినచో (ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్దములు) నాలుగే మిగులును.

(పదార్థతత్త్వజ్ఞానమువలన మోక్షప్రాప్తి)

ధర్మవిశేష ప్రసూతాద్ ద్రవ్యగుణకర్మ సామాన్య విశేష సమవాయానాం
పదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసమ్. వైశేషిక – ౧ – ౧ – ౪.

మనుష్యుడు ధర్మమును యథాయోగ్యముగ – విధి పూర్వకముగ ననుష్ఠించి నందున బవిత్రుడై పదార్థముల సాధర్మ్య వైధర్మ్య జ్ఞానమువలన వాని తత్త్వజ్ఞానము – స్వరూపమును, దెలిసికొని నందున నిఃశ్రేయసం –ముక్తిని బొందును.

(పదార్థముల సాధర్మ్యము – సమానధర్మము, వైధర్మ్యము – విరుద్ధ ధర్మము తెలిసికొనినగాని వాని స్వరూప జ్ఞానము కలుగదు.

ద్రవ్యములు, గుణములు, కర్మలు, సామాన్యములు, విశేషములు, సమవాయము, అనునివి పదార్థములు. అందు బృథివ్యాదులు ద్రవ్యములు. రూపరసాదులు గుణములు. ఉత్క్షేపణాదులు క్రియలు. ద్రవ్యత్వాదులు సామాన్యములు. సమవాయము సంబంధము విశేషములు – పరమాణు గతములు. వీనిలో గల సాధర్మ్య వైధర్మ్యముల వలన వీని స్వరూపము నెఱిగినగాని మోక్షము సిద్ధింపదని సూత్రాభిప్రాయము.

సాధర్మ్యము – తుల్యధర్మము. పృథివి జడము, జలము జడము. జడత యీ రెండింటిలోని తుల్యధర్మము. పృథివి కఠోరము. జలము కోమలము. కఠినత కోమలత యనునివి యీ రెంటిలోని విరుద్ధ ధర్మములు – వైధర్మ్యము. ఇట్లు ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య విశేష, సమవాయము లనెడు పదార్థముల తత్త్వ – స్వరూప జ్ఞానము వలన మోక్షము లభించును.)

ద్రవ్యములు :-

**పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి. వై.౧–౧.౫**

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు - అను నీ తొమ్మిది ద్రవ్యములు.

అందు ద్రవ్యలక్షణములు :-

క్రియాగుణవత్ సమవాయి కారణమితి ద్రవ్యలక్షణమ్. వై ౧-౧-౧౫.

'క్రియాశ్చ గుణాశ్చ విద్యన్తే యస్మిన్ తద్ క్రియాగుణవత్' క్రియలు, గుణములు కాని, కేవల గుణములు కాని దేనియందుండునో యది ద్రవ్యమనబడును. ద్రవ్యములలో పృథివి, జలము, అగ్ని, వాయువు, మనస్సు, ఆత్మ - అనునాఱు ద్రవ్యములలోను గుణములు క్రియలు నుండును. ఆకాశము, కాలము, దిశ - అను మూడు ద్రవ్యములు క్రియలు లేనివై గుణములు కలిగి యుండును.

'సమవేతుం శీలం యస్య తత్ సమవాయి. ప్రాగ్వృత్తిత్వం కారణమ్ (కారణత్వమ్,) సమవాయి చ తత్ కారణమ్ చ = సమవాయి కారణమ్, లక్ష్యతే యేన తత్ లక్షణమ్, తన కారణములలో విడదీయ వీలుకాని సమవాయ సంబంధముతో గలిసి యుండు స్వభావము గలది 'సమవాయి' యనబడును. కార్యమునకు బూర్వము తప్పక యుండునది కారణము. ఇట్లు కార్యమునకు బూర్వమున దప్పకయుండి కార్యమున సమవాయ సంబంధముతో గలిసియుండు స్వభావముగలది సమవాయి కారణము. అది ద్రవ్యమే యగును కాని మఱియొండు గుణాదులు గావు. కావున ద్రవ్యమునకు లక్షణము సమవాయి కారణము.

(ఉదా:- పటమునకు సమవాయి కారణము తంతువులు. ఘటమునకు సమవాయి కారణము మృత్తిక. ఘట పటములలో నుండు గుణములకు, గ్రియలకు సమవాయి కారణములు ఘటపటములు. ఇట సమవాయి కారణములైన తంతువులు, మృత్తిక, ఘట పటములు నన్నియు ద్రవ్యములే. ఇట్టులన్నింటికి సమవాయి కారణము ద్రవ్యమే యగుటవలన ద్రవ్యమునకు సమవాయి కారణము - లక్షణము చెప్పబడినది.)

దేని వలన లక్ష్యము తెలియబడునో యది లక్షణము. కంటితో రూపము తెలియబడును కావున దానిని 'లక్షణ' మందురు.

(వాస్తవమున :- సాస్నాదిమత్త్వము (గంగడోలు, కుచ్చుతోక, కొమ్ములు మున్నగునవి కలిగియుండుట) గోవునకు లక్షణము. ఆ లక్షణముచే గోవు తెలియబడును. కావున గోవు లక్ష్యము. ఇట్లే 'కంబుగ్రీవాది మత్త్వము' ఘటమునకు లక్షణము. ఘటము లక్ష్యము.)

ద్రవ్యములు వాని లక్షణములు:-

రూపరసగంధ స్పర్శవతీ పృథివీ. వై.౨.౧.౧.

రూపము, రసము, గంధము, స్పర్శము అను గుణములు కలది పృథివి. అందు రూప, రస, స్పర్శములు క్రమముగా నగ్ని జల వాయువుల సంయోగము వలన పృథివి యందున్నవి. (కావున సమవాయ సంబంధమున గంధగుణము కలది పృథివియని లక్షణము తేలుచున్నది.) (సమవాయ సంబంధేన గంధవత్త్వం పృథివ్యా లక్షణమ్.)

వ్యవస్థితః పృథివ్యాం గంధః. వై.౨.౨.౨.

పృథివియందు గంధ గుణము స్వాభావికము. అట్లే జలమున రసము, అగ్నియందు రూపము, వాయువునందు స్పర్శము స్వాభావిక గుణములు. ఆకాశమున శబ్దము స్వాభావిక గుణము.

రూపరస స్పర్శవత్య ఆపోద్రవాః స్నిగ్ధాః. వై.౨.౧.౨.

రూపరస స్పర్శములు కలిగి, ద్రవీభూతకోమల ద్రవ్యము జలము. కాని, వీనిలో రసము

జలమునకు స్వాభావిక గుణము, రూప స్పర్శము అగ్ని వాయువుల సంయోగము వలన జలమున గనిపించును.

**అప్సు శీతతా. వై.౨.౨.౫**

జలమునందు శీతలతగూడ స్వాభావిక గుణము.

**తేజో రూప స్పర్శవత్. వై.౨.౧.౩.**

రూపము, స్పర్శము కలది తేజస్సు - అగ్ని. రూపమగ్నికి స్వాభావిక గుణము. స్పర్శము వాయుయోగమువలన నగ్నియందున్నది.

**స్పర్శవాన్ వాయుః. వై.౨.౧.౪**

స్పర్శగుణము కలది వాయువు. ఇందు నుష్ణత, శీతత, యగ్ని, జలముల యోగమున నేర్పడును.

**త ఆకాశే న విద్యంతే. వై.౨.౧.౫.**

రూప, రస, గంధ, స్పర్శము లాకాశమున నుండవు. శబ్దమే యాకాశ గుణము.

**నిష్క్రమణం ప్రవేశన మిత్యాకాశస్య లింగమ్. వై.౨.౧.౨౦.**

ప్రవేశ నిష్క్రమణము లాకాశమునకు లింగము.

**కార్యాంతరాప్రాదుర్భావాచ్చ శబ్దః స్పర్శవతామగుణః॥వై. ౨.౧.౨౫.**

ఆకాశముకంటె భిన్నమైన పృథివి మున్నగు స్పర్శగుణములు గల ద్రవ్యములలో బ్రకటము కానందున శబ్ద మాకాశగుణమే. పృథివ్యాదుల గుణము కాదు.

**అపరస్మి న్నపరం యుగపచ్చిరం క్షిప్రమితి కాలలింగాని. వై.౨.౨.౬.**

అపరము, పరము. యుగపత్తు - ఒకేమాటు, చిరము - విలంబము - ఆలస్యము, క్షిప్రము - శీఘ్రము నమనిట్టి ప్రయోగములు దేనియందు కలుగునో యది కాలము.

**నిత్యేష్వభావా దనిత్యేషు భావాత్ కారణే కాలాఖ్యేతి. వై.౨-౨.౯**

నిత్య పదార్థములలో నుండక యనిత్యము లందుండుట వలన గారణము నందే కాలసంజ్ఞ.

**ఇత ఇదమితి యతః తద్ దిశ్యం లింగమ్. వై-౨-౨.౧౦**

ఇటనుండి యిది పూర్వము, దక్షిణము, పశ్చిమము, ఉత్తరము, పైన, క్రింద యను వ్యవహారము దేనివలన గలుగునో యది 'దిశ' యనబడును.

**ఆదిత్య సంయోగాద్ భూతపూర్వాత్ భవిష్యతో భూతాచ్చ ప్రాచీ. వై.౨-౨.౧౪**

ఏవైపున బ్రథమమున నాదిత్యుని సంయోగమైనదో యిక ముందునగునో యావైపునకు బూర్వదిశ - తూర్పు అని పేరు. సూర్యుడస్తమించు దిశ పశ్చిమము - పడమర. పూర్వాభిముఖుడైయున్న పురుషుని కుడిచేతి వైపు దక్షిణము, నెడమ చేతివైపు ఉత్తరము ననబడును.

**ఏతేన దిగంతరాలాని వ్యాఖ్యాతాని. వై.౨-౨-౧౬**

పూర్వదక్షిణల మధ్యదిశ 'ఆగ్నేయము', దక్షిణపశ్చిమ దిశల మధ్య దిశ 'నైరృతి', పశ్చిమోత్త రముల మధ్యదిశ 'వాయవ్యము', ఉత్తరపూర్వదిశల మధ్యదిశ ఈశాన్యము ననబడును.

ఆత్మలక్షణముః

**ఇచ్ఛాద్వేష ప్రయత్న సుఖ దుఃఖ జ్ఞానా న్యాత్మనో లిఙ్గమితి. న్యా ౧-౧-౧౦.**

ఇచ్ఛ = రాగము, ద్వేషము = వైరము, ప్రయత్నము = పురుషార్థము, సుఖము, దుఃఖము,జ్ఞానము - తెలిసికొనుట యను నీ యాఱు గుణములు కలది జీవాత్మ యందురు.

ప్రాణాపాన నిమే షోన్మేష జీవన మనోగతీంద్రియాంతర్ వికారాః సుఖ
దుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నాశ్చాత్మనో లింగాని. వై ౩-౨-౪.

ప్రాణము = లోపల నుండి వాయువును బయటకు వదలుట - నిఃశ్వాసము, అపానము = వెలుపల నుండి వాయువును లోనికి దీసికొనుట - ఉచ్ఛ్వాసము, నిమేషము = కంటిఱెప్పలు మూయుట, ఉన్మేషము = కంటి ఱెప్పలు పైకెత్తుట, జీవనము = ప్రాణదారణము, మనః = మనము - విచారము - జ్ఞానము, గతి = ఇష్టము వచ్చినట్లు తిరుగుట, ఇంద్రియములు = ఇంద్రియములను విషయములందు నడపి వాని నెఱుగుట, అన్తర్వికారము = ఆకలి, దప్పిక, జ్వరపీడ మున్నగువాని వలన వికారములు కలుగుట, సుఖము, దుఃఖము, ఇచ్ఛాద్వేషములు, ప్రయత్నము నను నివి యన్నియు నాత్మ గుణములే - ఆత్మకు లింగములు.

యుగపజ్ జ్ఞానానుత్పత్తిర్ మనసో లింగమ్. న్యా ౧-౧-౧౬.

దేని వలన నొకేక్షణమున రెండు పదార్థముల జ్ఞానము కలుగదో దానినే 'మనస్సు' అందురు.

ఇంతవఱకు ద్రవ్యముల స్వరూపము - లక్షణములు చెప్పబడినవి. ఇక గుణములు చెప్పబడును.

రూపరసగంధస్పర్శాః సంఖ్యాః పరిమాణాని పృథక్త్వం సంయోగవిభాగౌ
పరత్వాపరత్వే బుద్ధయః సుఖదుఃఖేచ్ఛాద్వేషౌ ప్రయత్నాశ్చ గుణాః. వై ౧-౧-౬

రూపము, రసము, గంధము, స్పర్శము, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, గురుత్వము, ద్రవత్వము, స్నేహము, సంస్కారము, ధర్మము, అధర్మము, శబ్దము, అను (౨౪) గుణములనబడును.

గుణలక్షణము :-

ద్రవ్యాశ్ర య్యగుణవాన్ సంయోగ విభాగే ష్వకారణ మనపేక్ష ఇతి గుణ లక్షణమ్. వై ౧-౨-౧౬.

తాను ద్రవ్యము నాశ్రయించి, మఱియొక గుణమునకు దానాశ్రయయు కాక, సంయోగ విభాగములకు గారణముకాక, అనపేక్ష - ఒకటి మఱియొక దాని నపేక్షింపనిది 'గుణము' అనబడును.

శ్రోత్రోపలబ్ధి ర్బుద్ధి నిర్గ్రాహ్యః ప్రయోగేణాభిజ్వలిత ఆకాశదేశః శబ్దః.
మహాభాష్యము. అ ౧-౧-౧

శ్రోత్రముచే బ్రాప్తమై, బుద్ధితో గ్రహింపయోగ్యమై ప్రయోగము వలన బ్రకాశితమై యాకాశదేశమున నుండునది 'శబ్దమ'నబడును.

నేత్రముచే గ్రహింపబడునది రూపము. జిహ్వతో స్వాద్వమ్లాద్యనేక విధముల గ్రహింపబడునది రసము. నాసికచే గ్రహింపబడునది గంధము. త్వగింద్రియముచే గ్రహింపబడునది స్పర్శము. ఒకటి, రెండు, అని దేనివలన గణనము జరుగునో యది సంఖ్య. దేని వలన బరువు, తేలికలు తెలియునో యది పరిమాణము. ఒకదాని నుండి మఱియొకటి వేఱగుట పృథక్త్వము. ఒకదానితో మఱియొకదానికి గలుగు కలయిక సంయోగము. కలిసియున్నవి యనేకములుగా వేఱగుట విభాగము. దీనికంటె నిది పరమున నున్నది కావున పరము. సమీపమున నున్నది - అపరము. మంచి చెడుగుల జ్ఞానము కలిగించునది బుద్ధి. ఆనందము పేరు సుఖము. కష్టమునకు నామము దుఃఖము. ఇచ్ఛ = రాగము, ద్వేషము = వైరము, విరోధము. ప్రయత్నము = నానావిధ పురుషార్థము, గురుత్వము = బరువు, ద్రవత్వము = కరుగుట, (స్యందనము.) స్నేహము = ప్రీతి - జిగురు, సంస్కారము = మఱియొకదాని సంబంధము వలన వాసన యేర్పడుట, ధర్మము = న్యాయాచరణము, కఠినత్వాది, అధర్మము = అన్యాయాచరణము, కఠినతకు విరుద్ధమైన కోమలత, ఇవి ౨౪ గుణములు.

**ఉత్క్షేపణమవక్షేపణమాకుంచనం ప్రసారణం గమనమితి కర్మాణి. వై ౧—౧—౭.**

ఉత్క్షేపణమ్ = పైకిజేష్టచేయుట, అవక్షేపణమ్ = క్రిందకు జేష్టచేయుట, ఆకుంచనమ్ = సంకోచించుట, ప్రసారణమ్ = చాచుట, గమనమ్ = వచ్చుట, వెళ్లుట, తిరుగుట మున్నగునవి. ఇవి కర్మములు.

కర్మలక్షణములు :-

**ఏక ద్రవ్యమగుణం సంయోగవిభాగేష్వనపేక్ష కారణమ్ ఇతి కర్మలక్షణమ్. వై ౧—౧—౧౭.**

ఏకం ద్రవ్య మాశ్రయః ఆధారో యస్య తదేకద్రవ్యమ్. న విద్యతే గుణో యస్య యస్మిన్ వా తదగుణం. సంయోగేషు, విభాగేషు, చాపేక్షారహితం, కారణం తత్ కర్మలక్షణమ్. అథవా యత్ క్రియతే తత్ కర్మ, లక్ష్యతే యేన తల్లక్షణమ్, కర్మణోలక్షణమ్ కర్మలక్షణమ్.

ఒక ద్రవ్యము నాశ్రయించియుండి, గుణములు లేనిదై సంయోగ విభాగములను గలిగించుటలో నపేక్షారహిత కారణము – క్రియ – 'కర్మ' మనబడును.

**ద్రవ్య గుణకర్మణాం ద్రవ్యం కారణం సామాన్యమ్.వై. ౧—౨—౧౮.**

ద్రవ్యము – కార్యద్రవ్యములకు, గుణములకు, కర్మములకు సమవాయి కారణము ద్రవ్యము. కావున ద్రవ్యగుణకర్మములకు మూటికి ద్రవ్యము సామాన్యము.

**ద్రవ్యాణాం ద్రవ్యం కార్యం సామాన్యమ్. వై. ౧—౧.౨౩**

ద్రవ్యమువలన ద్రవ్యములు పుట్టును. (మృత్తిక వలన ఘటము, తంతువుల వలన పటము) కావున ద్రవ్యము వలన కార్య ద్రవ్యములు కలుగుట సామాన్య ధర్మము.

**ద్రవ్యత్వం, గుణత్వం కర్మత్వం చ సామాన్యాని విశేషాశ్చ. వై ౧.౨.౫**

ద్రవ్యములలో ద్రవ్యత్వము, గుణములలో గుణత్వము, కర్మలలో గర్మత్వము నుండును. ద్రవ్యత్వము, గుణత్వము, కర్మత్వము నను వీనికి సామాన్యములు, విశేషములు నని నామములు. ద్రవ్య గుణకర్మలలో నుండు 'సత్తా' అను సామాన్యము నపేక్షించి యీ ద్రవ్యత్వాదులు విశేషములనబడును.

**సామాన్యం,విశేష ఇతి బుద్ధ్యపేక్షమ్. వై —౧—౨—౩.**

సామాన్యము, విశేషము నునువి బుద్ధినపేక్షించి – బుద్ధిని బట్టి సిద్ధించును. మనుష్యులలో మనుష్యత్వమను సామాన్యము పశుత్వాదుల కంటె విశేషము. స్త్రీత్వ, పురుషత్వములలో బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ, శూద్రత్వాదులు కూడ విశేషములే. ఇట్లే యంతట నెఱుగవలయును.

(అనేక పదార్థములలో నుండు సమానధర్మము సామాన్య మనబడును. సత్తా, ద్రవ్యత్వము, గుణత్వము, కర్మత్వము, పృథివ్యాదులలో నుండు పృథివీత్వాదులు, అట్లే కర్మములలోని ఉత్క్షేపణ త్వాదులు అన్నియు సామాన్యము లనబడును. వీనిలో 'సత్తా' మాత్రము సామాన్యమే యనబడును. విశేష మనబడదు. మిగిలిన ద్రవ్యత్వాదులు సామాన్యము, విశేషము నను రెండు నామములతో జెప్పబడును. ఇట్లు ద్రవ్యత్వము గుణత్వము నను నీ సామాన్యములకు – సామాన్యము, విశేషము నని రెండు నామము లేర్పడుటకు గారణము బుద్ధియే. ఈ బుద్ధి – అనువృత్త బుద్ధి, వ్యావృత్త బుద్ధి యని రెండు విధములు.

ద్రవ్యము లున్నవి, గుణములున్నవి, కర్మము లున్నవి యని ద్రవ్యగుణకర్మములను మూడింటియందును ఉన్నది, ఉన్నది, ఉన్నది – అను నొకేవిధమగు బుద్ధి కలుగుచున్నది. దీనినే యనువృత్తబుద్ధి యందురు. ద్రవ్యగుణ కర్మములలోనే యిది ద్రవ్యముకాదు గుణము, ఇది గుణము కాదు కర్మము, ఇది కర్మముకాదు ద్రవ్యము, అని యొకదాని కింకొకటి భిన్నమని బుద్ధి కలుగును. ఈ బుద్ధి వ్యావృత్త బుద్ధి యనబడును. అనువృత్త బుద్ధిని బట్టి తెలియు సత్తా – ఉనికి యధికదేశమున నుండును.

వ్యావృత్త బుద్ధిని బట్టి తెలియు ద్రవ్యత్వ గుణత్వ కర్మత్వాదులు 'ఉనికి' — 'సత్తా' సామాన్యము కంటె దక్కువదేశమున నుండును. కావున ద్రవ్యత్వాదులు సత్తా సామాన్యము కంటె విశేషములు, విశేష సామాన్యము లనబడును. అని తెలియనగును. దీనింబట్టి మనుష్యత్వము సామాన్యము. స్త్రీత్వపురుషత్వములు విశేషములు. మనుష్యులలో వ్యవహరింపబడు బ్రాహ్మణత్వాదులు న్యాయవైశేషికాదులలో జెప్పబడిన సామాన్య విశేష జాతులలో జేరవు. అని వివేకము)

సమవాయ లక్షణము :–

ఇహేదమితి యతః కార్యకారణయోః స సమవాయః. వై ౭–౨–౨౬.

కార్యకారణ విషయమున ఇహ = ఈ తంత్వాది కారణములందు, ఇదమ్ = ఈ పటము మున్నగు కార్యము, ఇతి = అని, యతః = దేనివలన కలుగునో, సః సమవాయః = అదియే సమవాయము. విడి విడిగా సిద్ధింపని కార్యకారణములు, అవయవి – అవయవములు, క్రియ = క్రియావంతములు, గుణ – గుణులు, జాతి – వ్యక్తులు, అను వీనిలో బరస్పరము కలిసి యుండునట్లు చేయు సంబంధము నిత్యసంబంధము. ఆ సంబంధమే సమవాయ సంబంధ మనబడును. ఒక ద్రవ్యమునకు మఱియొక ద్రవ్యమునకు గలుగు సంబంధము సంయోగ మనబడును. అది యనిత్యము – నిత్యము కాదు.

ద్రవ్యగుణయోః సజాతీయారంభకత్వం సాధర్మ్యమ్. (వై–౧–౧.౯)

ద్రవ్యములు, గుణములు తమ జాతీయకములగు కార్యముల నుత్పన్నము చేయుట ద్రవ్య గుణములకు సాధర్మ్యము – సమాన ధర్మము. ఉదా:– పృథివిలో జడత్వ ధర్మము, ఘటాదుల నుత్పన్నము చేయు ధర్మము నున్నది. అట్లే, జలమునందు జడత్వము, స్వసమానజాతీయములగు హిమకరకాదుల నుత్పన్నముచేయు ధర్మమున్నది. ఇట్లు పృథివి, జలము నను నీ రెండు ద్రవ్యములలో స్వసదృశధర్మములు గల కార్యముల నుత్పన్నము చేయుటలో సామ్యమున్నది.

(ఇట్లే గుణములు – కారణగుణములు, కార్యమునందు సజాతీయ గుణాంతరములను గలిగించును. కారణములందున్న తెలుపురంగు కార్యమునందు దనజాతికి జెందిన తెలుపురంగునే కలిగించును.)

ఇట్లు ద్రవ్యములు గుణములు స్వసమాన జాతీయములగు ద్రవ్యములను గుణములను గలిగించుటలో సామ్యము కలిగియుండునని భావము.

(అర్థాత్ ద్రవ్యగుణయోర్ విజాతీయారంభకత్వం వైధర్మ్యమ్)

(దీనింబట్టి విదితమైన దేమన – ద్రవ్యములు, గుణములు పరస్పరము విరుద్ధ ధర్మములను, గార్యములను నారంభించుట వైధర్మ్యమనబడును. ఉదాహరణము:– పృథివి కఠినత్వ, శుష్కత్వ, గంధవత్త్వములు జలధర్మములకంటె విరుద్ధము మఱియు జలముయొక్క ద్రవత్వ, కోమలత్వ, రసత్వగుణ యుక్తత పృథివీ ద్రవ్యముల కంటె విరుద్ధములని తెలిసికొనునది)

కార్యకారణ సంబంధము :–

కారణభావాత్ కార్యభావః. వై ४–౧–३

కారణమున్నపుడే కార్యము కలుగును.

న తు కార్యాభావాత్ కారణాభావః. వై ౧–౨–౨

కార్యాభావమున గారణాభావము కలుగదు. (కుండ లేనంత మాత్రమున మట్టి లేకుండబోదు.)

కారణాభావాత్ కార్యాభావః. వై ౧–౨–౧

కారణము లేకున్న కార్య మెన్నడు నేర్పడదు.

**కారణగుణ పూర్వకః కార్యగుణో దృష్టః. వై ౨-౧. ౨౪.**

(ఉపాదాన) కారణమున నెట్టి గుణము లుండునో కార్యమున నట్టి గుణములే యుండును.

పరిమాణము రెండు విధములు :-

**అణుమహదితి తస్మిన్ విశేషభావాత్ విశేషాభావాచ్చ. వై ౭-౧-౧౧**

అణుః = సూక్ష్మము, మహత్ = పెద్దది - త్రసరేణువు లిక్ష కంటె చిన్నది - ద్వ్యణుకము కంటె బెద్దది. అట్లే పర్వతము భూమికంటె చిన్నది - చెట్టు చేమలకంటె బెద్దది.

**సత్తా:- సదితి యతో ద్రవ్యగుణకర్మసు సా సత్తా. వై ౧-౨-౭**

సద్ ద్రవ్యమ్, సన్ గుణః,సత్ కర్మ అని వర్తమానకాలవాచకమగు 'సత్' అనుపదము ద్రవ్యగుణ కర్మము లను మూడింటియందును నన్వయించును. ఇట్టి యనువృత్తి బుద్ధిని గలిగించునదియే 'సత్తా' సామాన్య మనబడును.

**భావోఽనువృత్తే రేవ హేతుత్వాత్ సామాన్యమేవ. వై ౧-౨-౪**

అన్నింటితో ననువర్తించుటచేత సత్తారూపభావము సామాన్యమే - మహాసామాన్య మనబడును. ఈ క్రమము భావరూప ద్రవ్యములకు జెందినది.

(అభావభేదములు)

అభావ మైదు విధములు :-

**౧ క్రియాగుణవ్యపదేశాభావాత్ ప్రాగసత్. వై ౯-౧.౧**

ఉత్పత్తికి బూర్వము కార్యద్రవ్యము లేదు. క్రియాగుణముల వ్యపదేశము లేనందున - ఘటమున్నది, ఘటము నలుపు - అను క్రియను, గుణమును బోధించు వ్యవహారము లేనందున ఘట ముత్పత్తికి బూర్వము లేదని భావము. ఇదియే ప్రాగభావము.

**౨ సదసత్. వై ౯-౧-౨**

ఉండి లేకుండునది - పుట్టి నశించునది. ఘటము పుట్టినశించిన ప్రధ్వంసాభావ మనబడును.

**౩ సచ్చాసత్. వై ౯-౧-౪.**

ఉండి లేనిది. 'అగౌరశ్వోఽనశ్వో గౌః' ఈ గుఱ్ఱము గోవు కాదు. గోవు గుఱ్ఱము కాదు. అనగా గుఱ్ఱమున గోవుయొక్కయు, గోవున గుఱ్ఱముయొక్క యభావ మున్నది. గోవున గోవుయొక్క, గుఱ్ఱమున గుఱ్ఱముయొక్క భావమున్నదని భావము. ఇదియే యన్యోన్యాభావము.

**౪ యచ్చాన్యదస దతస్త దసత్. వై.౯-౧-౫.**

పూర్వము వర్ణించిన మూడభావములకు భిన్నమైన యభావ మత్యం తాభావమనబడును. నరశృంగము = మానవుని కొమ్ము, ఖపుష్పము = ఆకాశ పుష్పము, వంధ్యాపుత్రుడు = గొడ్రాలి బిడ్డడు, ఇవి యత్యంతాభావములు.

**౫ నాస్తి ఘటో గేహ ఇతి సతో ఘటస్య గేహసంసర్గ ప్రతిషేధః. వై-౯-౧.౧౦**

ఇంటిలో ఘటము లేదు. అనగా మఱియొక చోట నున్నదని భావము. అన్యత్ర నున్న ఘటమునకు గృహముతో సంబంధము లేదు. దీనినే సంసర్గాభావమందురు. ఇట్లభావము లైదు.

**ఇంద్రియదోషాత్ సంస్కారదోషాచ్చావిద్యా. వై. ౯-౨-౧౦**

ఇంద్రియదోషముల వలనను, సంస్కార దోషముల వలనను 'అవిద్య' కలుగును.

తద్దుష్టం జ్ఞానమ్. వై. ౯—౨—౧౧.

అది దుష్టజ్ఞానము, విపరీతజ్ఞానము, 'అవిద్య' అనబడును.

అదుష్టం విద్యా. వై.౯—౨—౧౨.

అదుష్టము = యథార్థజ్ఞానము విద్య యనబడును.

పృథివ్యాదిరూపరసగంధస్పర్శా ద్రవ్యానిత్యత్వాదనిత్యాశ్చ. వై. ౭—౧.౨

ఏతేన నిత్యేషు నిత్యత్వముక్తమ్. వై ౪—౧—౩

కార్యపృథివియందుండు రూపరసాదిగుణములు కార్యద్రవ్యము లగుటవలన వాని గుణములు ననిత్యములే. కారణరూపపృథివ్యాది నిత్యద్రవ్యములందుండు గంధాది గుణములు వానికాధారములు, నిత్యము లగుటవలన వాని గుణములు కూడ నిత్యములే యగును.

సదకారణవన్నిత్యమ్. వై ౪—౧—౧

ఒక వస్తు వునికి గలదై కారణము లేనిదైన నది నిత్యమనబడును. దీనింబట్టి, 'సత్ కారణ వదనిత్యమ్, ఉండి కారణముగలదైన ననిత్యమగును.

అస్యేదం కార్యం కారణం సంయోగి విరోధి సమవాయి చేతి లైంగికమ్. వై.౯—౨—౧.

దీని కిది కార్యము, దీని కిది కారణమను నిట్టి సమవాయి, సంయోగి, ఏకార్థసమవాయి, విరోధి యను లింగ – లింగి సంబంధము వలన నాలుగు విధముల జ్ఞానము కలుగును. సమవాయి – ఆకాశము పరిమాణము కలది. సంయోగి.– శరీరము చర్మసంయోగము కలది. ఆకాశమునకు బరిమాణముతోను, శరీరమునకు త్వక్కుతోను నిత్యసంబంధమున్నది. ఏకార్థ సమవాయి – ఒక యర్థమున రెండు సమవాయ సంబంధముతో నుండుట. రూపము, స్పర్శము నను రెండు నొక కార్యద్రవ్యము నందు సంబంధముతో నుండి యా ద్రవ్యమును దెలుపుటకు లింగములగును. విరోధి :– కురిసిన వర్షము కురియనున్న వర్షమునకు విరోధిలింగము.

(అవిద్యమానవృష్టికి మరుదభ్రసంయోగము విరోధిలింగము)

**వ్యాప్తి :– నియతధర్మ సాహిత్య ముభయోరేకతరస్య వా వ్యాప్తిః నిజశక్త్యుద్భవ మిత్యాచార్యాః.**

**ఆధేయశక్తియోగ ఇతి పంచశిఖః. సాంఖ్య అ ౫—౨౯—౩౧—౩౨**

సాధ్యము (సాధింపదగినది), సాధనము = దేనిద్వారమున సాధ్యము సిద్ధించునో యది, యా సాధ్యసాధనముల రెంటియొక్కయు లేక సాధనము యొక్క నిశ్చిత ధర్మమునకు సాహచర్యముండునో యదియే వ్యాప్తి. ఉదా:– ధూమాగ్నుల సాహచర్యము.

అట్లే వ్యాప్యధూమము తన శక్తితో నుత్పన్నమగును. అనగా నగ్ని సంబంధము లేనితావున ధూమముండును. ధూమము పుట్టి స్థలాంతరమునకు బోయినపు డా ధూమముతో నగ్నికి సంబంధముండదు. అప్పుడది తన శక్తితో నుండును. అట్టి ధూమసాహచర్య మగ్నితో వ్యాప్తియనబడును. అనగా నగ్నియొక్క ఛేదన భేదన సామర్థ్యమువలన జలాది పదార్థములు ధూమరూపమున ప్రకటమగును.

మహత్తత్త్వము మున్నగు ప్రాకృతిక పదార్థములందు ప్రకృతి వ్యాపకమై యుండును. మహత్తత్త్వము బుద్ధియందు వ్యాప్యత యుండును. ప్రకృతి వ్యాపకతకు, బుద్ధివ్యాప్యతకు నుండు సంబంధమే వ్యాప్తి యనబడును. ఉదా :– ఆధేయరూపశక్తికి, ఆధారరూపశక్తిమద్ వస్తువునకు గల సంబంధము వ్యాప్తి.

ఇట్టి శాస్త్రముల ప్రమాణాదులతో బరీక్షించి చదువవలయును, చదివింపవలయును. లేకున్న విద్యార్థులకు సత్యబోధ యెన్నడును గలుగజాలదు. ఏయే గ్రంథములను జదివింపవలయునో వానిని బైన జెప్పిన విధమున బరీక్షించి సత్యగ్రంథములని తేలినవానిని జదివింపవలయును. ఈ పరీక్షలకు

విరుద్ధమైన వానిని జదువరాదు, చదివింపరాదు. 'లక్షణప్రమాణాభ్యామ్ వస్తుసిద్ధిః' లక్షణ ప్రమాణములతో వస్తువు సిద్ధించును. ఎట్లన పృథివికి గంధత్వము లక్షణము. అది ప్రత్యక్ష ప్రమాణము వలన సిద్ధించును. ప్రత్యక్షాది ప్రమాణముల వలన సత్యాఽసత్యపదార్థముల నిర్ణయము జరుగును. ఈ ప్రమాణములు లేకున్న గలుగజాలదు.

(పఠన పాఠనవిధి)

పఠనపాఠన విధిని వ్రాయుచున్నాము :-

మొదట పాణిని మునికృతమగు సూత్రముననున్న 'శిక్షా' యనెడి గ్రంథమును జదివింప వలయును. అందు నక్షరముల స్థానములు, ప్రయత్నములు, కరణములు తెలియనగును. ఉదా:- 'ప' అక్షరమునకు స్థానము పెదవులు, ప్రయత్నము స్పృష్టము. జిహ్వ యొనర్చుక్రియ (క్రియాయుక్త జిహ్వ) కరణ మనబడును. ఇట్లే యోగ్యతకు దగినట్లు తల్లిదండ్రులు, నాచార్యుడు నన్నియక్షరముల యుచ్చారణమును నేర్పవలయును.

వ్యాకరణము :-

తదుపరి వ్యాకరణము :- మొదట అష్టాధ్యాయిలో గల సూత్రములు 'వృద్ధిరాదైచ్' మొదలగు వానిని వల్లింపజేయవలయును. తరువాత సూత్రములలోని పదములను విడదీయుట - 'వృద్ధిః ఆత్ ఐచ్ లేక ఆదైచ్' నేర్పవలయును. ఆపైన 'ఆచ్చ + ఐచ్చ = ఆదైచ్' అని సమస్త పదముల విగ్రహము నేర్పవలయును. తరువాత 'ఆదైచాం వృద్ధిసంజ్ఞా క్రియతే' 'ఆత్ = ఆ, ఐచ్ = ఐ, ఔ, అను నీయక్షరములకు వృద్ధిసంజ్ఞ = వృద్ధియని పేరు. 'తః పరో యస్మాత్ స తపరః తాదపి పరః తపరః. 'త్' కారము దేనికి బరమున నుండునో యదియు, 'త్' కారమునకు బరమున నుండునదియు 'తపర' మని చెప్పబడును. పై సూత్రము నందలి పదములలో 'ఆ' కారమునకు బరమున 'త్'కారమున్నది. అందువలన 'ఆత్' తపర మనబడును. అట్లే 'త్' కారమునకు బరమున 'ఐచ్' ఉన్నది. కాబట్టి 'ఐచ్' అనునది కూడ తపర మనబడును. ఇట్లు 'ఆత్' 'ఐచ్' అను నీ రెండు 'తపర'ము లగుటవలన 'ఆ' 'ఐ' 'ఔ' అను దీర్ఘాక్షరములకే 'వృద్ధి' నామ ముండును. కాని వీనిప్లుతములకు గాని హ్రస్వములకుగాని వృద్ధి సంజ్ఞ - నామము కలుగకుండుటయే ప్రయోజనము.

ఉదాహరణము :- 'భాగః' - ఈ పద విషయమున 'భజ్' ధాతువునకు బరమున 'ఘఞ్' ప్రత్యయము జేర్చిన 'ఘఞ్' లోని 'ఘ్-ఞ్' అను నీ రెండక్షరములకు 'ఇత్' సంజ్ఞ కలిగి యవి లోపించును. అప్పుడు 'భజ్ - అ' అని యేర్పడును. అప్పుడు 'జ్' కారమునకు బూర్వమున 'భ్' కారమునకు తరువాతను నున్న (భ్+అ+జ్+అ) అకారమునకు వృద్ధి సంజ్ఞగల 'ఆ'కార మగును. అనగా 'అ' కారము తొలగి దానిస్థానమున 'ఆ'కారము వచ్చును. అప్పుడు భ్+ఆ+జ్+అ, అగును. ఇందలి 'జ్' కారమునకు 'గ్' కారమగును. భ్+ఆ+గ్+అ = కలిసి 'భాగ' అగును. విభక్తిచేరి 'భాగః' శబ్దమేర్పడును.

'అధ్యాయః' ఇట - అధిపూర్వక 'ఇఙ్' ధాతువులోని 'ఇ' కారమునకు 'ఘఞ్' ప్రత్యయము పరమున నుండగా 'ఐ' వృద్ధిచేసి, దానికి 'ఆయ్'కాగా, నన్నియు గలిసి 'అధ్యాయః' పదమేర్పడును.

'నాయకః' - 'నీఞ్' ధాతువులోని 'ఈ' కారము స్థానమున 'ఘఞ్' ప్రత్యయము పరమున నున్నపుడు, 'ఐ' 'వృద్ధి' దానికి 'ఆయ్' అయి యన్నియు గలిసిన 'నాయక' శబ్దమగును.

'స్తావకః' 'స్తు' ధాతువునకు బరమున 'ణ్వుల్' ప్రత్యయముచేసి, హ్రస్వ 'ఉ'కారస్థానమున 'ఔ' వృద్ధి, దానికి 'ఆవ్' ఆదేశము చేసి, అకారము కలిపిన స్తావకః పదమేర్పడును.

'కారకః' :- 'కృఞ్' ధాతువునకు బరమున 'ణ్వుల్' ప్రత్యయము, 'ణ్, ల్' వీనికి ఇత్‌సంజ్ఞ;

లోపము; మిగిలిన 'వు' స్థానమున 'అక' ఆదేశము, 'ఋ' కారస్థానమున 'ఆర్' వృద్ధియై 'కారకః' శబ్దము సిద్ధించును.

ఈ శబ్దముల సిద్ధము సేయుటలో నేయే సూత్రములు ప్రయోగమున ముందో వెనుకనో వచ్చినపుడు వాని కార్యము లన్నియు నేర్పవలయును. పిల్లలకు బలకమీద శబ్దము సిద్ధముచేయు రూపములను, 'భజ+ఘఞ్+సు' ఇట్లు చూపి మొదట అకార లోపము, తదుపరి 'ఘ్,' లోపము 'ఞ్' కారలోపము, చేసి, భజ్+అ+సు' అయినట్లు చూపవలయును. మరల అకారమునకు 'ఆ' వృద్ధి, జ్ స్థానమున గ్ చేసి 'భాగ్+అ+సు' అయినట్లు చూపవలయును. ఇప్పుడు అకారము కలిసి భాగ+సు అయినది. ఇప్పుడు ఉకారమునకు ఇత్‌సంజ్ఞ, 'స్' స్థానమున 'రు' అయి, రులోని ఉకారమునకు ఇత్‌సంజ్ఞయై యది లోపింపగా 'భాగర్' అయినది. ఇపుడు రేఫస్థానమున (ః) విసర్గయై 'భాగః' అను రూపము సిద్ధించును. ఇది నేర్పునపుడు ఏ సూత్రమువలన నేకార్యము జరుగునో యా సూత్రమును జదివి, చదివించి, వ్రాయించి, కార్యము చేయించుచుండ వలయును. ఇట్లు చదివించుటవలన నతిశీఘ్రముగా దృఢమైన బోధ కలుగును.

ఒక పర్యాయ మిట్లు 'అష్టాధ్యాయి' చదివించి 'ధాతుపాఠము' అర్థసహితముగా, బది లకారముల రూపములు, ప్రక్రియా సహితముగ సూత్రములకు జెందిన ఉత్సర్గ -సామాన్య సూత్రములు - 'కర్మణ్యణ్' కర్మ ఉపపదముగా నున్నపుడు ధాతుమాత్రమునకు 'అణ్' ప్రత్యయమగును. ఉదా:- కుంభకారః. అని నేర్పి తదుపరి అపవాద సూత్రము - 'ఆతోఽనుపసర్గే కః' ఉపసర్గభిన్న కర్మ యుపపదమైనపు డాకారాంతధాతువునకు 'క' ప్రత్యయమగును. అనగా నెక్కువ వ్యాపకమగు కర్మ యుపపదమైనపుడు 'అణ్' ప్రత్యయము ప్రాప్తమగును. దానికంటె విశేషము - అల్పవిషయకమగు నా పూర్వసూత్ర విషయమందే ఆకారాంతధాతువును 'క' ప్రత్యయము గ్రహించినది. ఉత్సర్గసూత్ర విషయమున నపవాదసూత్రమునకు ప్రవృత్తి కలుగునట్లు, అపవాదసూత్ర విషయమున ఉత్సర్గసూత్రము నకు ప్రవృత్తి కలుగదు. చక్రవర్తి రాజ్యమున మాండలిక రాజులకు, జమీందారులకు ప్రవృత్తి కలుగును కాని, మాండలిక రాజుల, జమీందారుల రాజ్యమున జక్రవర్తికి ప్రవృత్తి కలుగదుకదా? అట్లే వ్యాకరణమున ఉత్సర్గ - అపవాద సూత్రముల ప్రవృత్తియని గ్రహించునది. ఈ విధముగా పాణినిమహర్షి సహస్రశ్లోకముల మధ్య యఖిల శబ్దార్థ సంబంధముల విద్యను బ్రతిపాదించియున్నాడు. ధాతుపాఠము చదివిన తరువాత ఉణాదిగణమును జదివించి సర్వసుబంత పదముల విషయము బోధింపవలయును. తదుపరి రెండవమాఱు శంకా - సమాధానము, వార్తికములు, కారిక, పరిభాషా, ఘటనాపూర్వకముగ 'అష్టాధ్యాయి' ద్వితీయావృత్తి చదివింపవలయును. అనంతరము మహాభాష్యము చదివింపవలయును. బుద్ధిమంతుడు, పురుషార్థి, నిష్కపటి, విద్యావృద్ధిని గోరువాడు చదివి, చదివించిన నొకటిన్నఱ సంవత్సరములో 'అష్టాధ్యాయి', తదుపరి యొకటిన్నఱ సంవత్సరములో మహాభాష్యము చదివి, వ్యాకరణమున సంపూర్ణయోగ్యతను సంపాదించి, లౌకిక వైదిక శబ్దముల బోధను వ్యాకరణమువలన బొందవచ్చును. అటుపైన నితర శాస్త్రములను సులభముగా జదివి చదివింపవచ్చును. వ్యాకరణశాస్త్రమున నెంత పరిశ్రమము చేయవలయునో యితర శాస్త్రములందంత పరిశ్రమము చేయవలసిన యావశ్యక ముండదు.

(అనార్ష గ్రంథ పఠన హాని)

ఇట్లార్షగ్రంథములను జదువుటవలన మూడు సంవత్సరములలో నెంత బోధ కలుగునో యంత జ్ఞానము కుగ్రంథములు, సారస్వతచంద్రిక, కౌముది, మనోరమ మున్నగు గ్రంథములను నేబది సంవత్సరములు చదివినను గలుగదు. మహాశయులైన మహర్షులు సులభముగా- సహజముగా గొప్ప

విషయములను దమ గ్రంథములలో బ్రకటించియున్నారు. క్షుద్రాశయములుగల మనుష్యులు కల్పించిన గ్రంథములలో నంతటి విషయము లెట్లుండగలవు? మహర్షుల యాశయము వీలైనంతవఱకు దేలికగాను గొలదికాలములో గ్రహింప గలిగినదిగాను నుండును. క్షుద్రాశయము గల వారి యాశయము వీలైనంత వఱకు గఠినరచనము జేయుటయై యుండును. వారి పుస్తకములను నెంతో పరిశ్రమము చేసి చదివినను గలుగు లాభము స్వల్పము. ఆ ఫలము పర్వతమును బ్రద్దలుచేసి యెలుకను బట్టినట్లుండును. ఆర్ష గ్రంథములను జదువుట యొకసారి సముద్రమున మునిగి యమూల్య రత్నములను బొందినట్లగును.

వ్యాకరణమును జదివి యాస్కముని కృత నిఘంటు నిరుక్తములను నాఱుమాసములలో గాని యెనిమిది మాసములలో గాని చదివి, చదివింపవలయును. నాస్తికకృతములగు 'అమరకోశము' మున్నగు నితర గ్రంథములను జదువుటలో ననేక సంవత్సరములు వ్యర్థము చేయరాదు.

తదుపరి పింగలాచార్యరచిత ఛందోగ్రంథమును జదువవలయును. దానివలన వైదిక లౌకిక ఛందస్సుల జ్ఞానము కలుగును. నవీనరచన, శ్లోకములను వ్రాయురీతియు దానివలన బాగుగ నేర్చుకొనవచ్చును. ఈ గ్రంథమును, శ్లోకరచనము, ప్రస్తారము నాలుగు మాసములలో జదివి, చదివింప గలుగుదురు. అల్పబుద్ధులచే రచియింపబడిన వృత్తరత్నాకరాది గ్రంథములను జదువుటలో ననేక వర్షములు వ్యర్థము చేయరాదు.

(పఠనీయ గ్రంథములు)

తదనంతరము మనుస్మృతి, వాల్మీకిరామాయణము, మహాభారతములోని ఉద్యోగపర్వాంతర్గత విదురనీతి మున్నగు మంచిమంచి ప్రకరణములు దుష్టవ్యసనములను దూరముచేసి సభ్యతను, నుత్తమతను, గలిగింపజేయు భాగములు - చదివింపవలయును. విద్యార్థికి గావ్యరీతితో ననగా - పదచ్ఛేదము, పదార్థోక్తి, అన్వయము, విశేష్య విశేషణభావము, భావార్థములను నధ్యాపకులు తెలుపుచుండ, విద్యార్థులు తెలిసికొనుచు జదువవలయును. వీని నొక్క సంవత్సరములో జదువవలయును.

(దర్శనములు - ఉపనిషత్తులు)

తదుపరి పూర్వమీమాంస, వైశేషికము, న్యాయము, యోగము, సాంఖ్యము, వేదాంతము నను దర్శనములను వీలైనంతవఱకు ఋషికృతములగు వ్యాఖ్యలతో గాని, లేక యుత్తమ విద్వాంసులచే వ్రాయబడిన సరళ వ్యాఖ్యానములతో గాని చదివి చదివింపవలయును.. కాని వేదాంత సూత్రములను జదివించుటకు బూర్వము 'ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యకములు, నను దశోపనిషత్తులను జదివించి, యాఱుశాస్త్రముల భాష్యవృత్తి సహిత సూత్రములను రెండు సంవత్సరముల లోపల జదివింపవలయును, చదువవలయును.

(బ్రాహ్మణ - వేదగ్రంథములు)

తదుపరి యాఱుసంవత్సరములలోపల ఐతరేయ, శతపథ, సామ, గోపథ నామక బ్రాహ్మణ గ్రంథములతోబాటు నాలుగు వేదములను సర్వ శబ్ద - అర్థ, సంబంధముల నెఱిగి క్రియాసహితముగ జదువవలయును.

ఇందుబ్రమాణము :-

స్థాణురయం భారహారః కిలాభూదధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్,
యోఽర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞానవిధూతపాప్మా. నిరుక్త ౧-౧౮

ఎవడు వేదమును స్వరముతో బాఠమాత్రము పఠించి యర్థము నెఱుగడో యతడు వృక్షము శాఖను, ఫలపుష్పములను మోయునట్లు, పశువు ధాన్యాదులను మోయునట్లును, బరువు మోయువాడగును.

వేదమును జదివి యర్థము నెఱిగినవాడు సంపూర్ణానందమును బొంది, జ్ఞానముతో బాపములను విడిచి పవిత్రమగు ధర్మాచరణప్రతాపమువలన దేహమును విడిచినమీద సర్వానందమును బొందును.

ఉత త్వః పశ్యన్న దదర్శ వాచముత త్వః శృణ్వన్న శృణోత్యేనామ్,
ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః. ఋ౧౦-౭౧-౪

అవిద్వాంసుడు వినుచుండియు వినడు. చూచుచుండియు జూడడు. మాటలాడుచు మాటలాడడు. అనగా నవిద్వాంసు లీ విద్యావాణీరహస్యమును దెలిసికొనజాలరు. కాని శబ్దార్థ సంబంధముల నెఱిగిన విద్వాంసుని కొఱకు సుందర వస్త్రములను ధరించి యాభూషణముల నలంకరించుకొని పతినభిలషించు భార్య తన భర్త యెదుట తన శరీరమును స్వరూపమును బ్రకటించునట్లు విద్య తన స్వరూపమును బ్రదర్శించును. అవిద్వాంసులకట్లు చేయదు.

ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః; యస్తన్న
వేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే. ఋ. ౧-౧౬౪-౩౯.

వ్యాపకుడు, నాశరహితుడు, సర్వోత్కృష్టుడునగు పరమేశ్వరునందు సర్వ విద్వాంసులు, పృథివి, సూర్యుడు మున్నగు లోకములు నున్నవి. సర్వ వేదముల తాత్పర్యము ముఖ్యముగా నా పరమేశ్వరుని బోధించుటయే యగును. అట్టి పరబ్రహ్మము నెఱుగనివాడు ఋగ్వేదాది శాస్త్రముల వలన నేమి సుఖము పొందగలడు? ఏమియు బొందజాలడు. వేదములను జదివి ధర్మాత్ముడు, యోగియునై ముక్తిరూప పరమానందమును బొందును. కావున బఠన పాఠనము లర్థజ్ఞాన సహితములుగా నుండవలయును.

(ఉపవేదములు)

ఇట్లు వేదములన్నియు, జదివి, ఆయుర్వేదము - చరక శుశ్రుతములు, ఋషి - మునిప్రణీత వైద్యక శాస్త్రములు నర్థక్రియా సహితముగ నేర్వవలయును. అందు శస్త్ర చికిత్స - ఛేదనభేదనములు, లేపన చికిత్స, నిదానము, ఔషధము, పథ్యము, శరీరము, దేశము, కాలము, వస్తువులు వాని గుణజ్ఞానపూర్వకముగ నాలుగు సంవత్సరములలో జదివి, చదివింపవలయును. అనంతరము ధనుర్వేదమును జదువవలయును. ఇది రెండు విధములు. ఒకటి - రాజపురుషులకు సంబంధించినది. రెండు - ప్రజలకు సంబంధించినది. రాజకార్యమున సర్వసేనాధ్యక్షుడై, శస్త్రాస్త్రవిద్య నానావిధములయిన వ్యూహముల నభ్యసించుట, నేటి భాషలో సైనిక శిక్షణము శత్రువులతో యుద్ధము చేయునపుడు చేయవలసిన క్రియాకలాపము లన్నియు నేర్చుకొనవలయును. ప్రజలను బోషించుట, వారిని వృద్ధిజేయుట, నేర్చుకొని న్యాయపూర్వకముగా సర్వప్రజలను సుఖముగా నుంచవలయును. దుష్టులను దండించు విధము, సజ్జనులను బాలించు ప్రకారము నన్నివిధముల నేర్వవలయును. ఈ రాజవిద్యను రెండు రెండు సంవత్సరములలో నేర్చుకొని గాంధర్వ విద్యను నేర్వవలయును. దీనిని గాంధర్వ వేద మందురు. ఇందు గానవిద్య, రాగరాగిణులు, స్వరము, సమయము, తాల, గ్రామ, తాన, వాదిత్ర, నృత్య, గీత - ఆదిభేదములను బాగుగ నేర్చుకొనవలయును. కాని ముఖ్యముగా సామగానము, వాదిత్రవాదన పూర్వకముగ నేర్చుకొనవలయును. నారద సంహిత మున్నగు నార్షగ్రంథములను జదువవలయును. కాని, వేశ్యలయు విషయాసక్తి కారకులగు బైరాగులయు గర్దభస్వరములవలె వ్యర్థాలాపముల నెన్నడు జేయరాదు. శిల్ప విద్య యనబడు నర్థవేదమును పదార్థ గుణవిజ్ఞానము, క్రియాకౌశలము, నానావిధ పదార్థ నిర్మాణము, పృథివి మొదలాకాశము వఱకు గల పదార్థ విద్యను నున్నదున్నట్లు నేర్చుకొనవలయును.

ఐశ్వర్యమును వృద్ధిచేయు నావిద్యను నేర్చుకొని రెండుసంవత్సరములు జ్యోతిషశాస్త్రము నేర్వవలయును. బీజగణితము, అంకగణితము భూగోల ఖగోలములకు, భూగర్భమునకు సంబంధించిన

విద్యలుగల సూర్య సిద్ధాంతము మున్నగు గ్రంథములను నేర్వవలయును. తదుపరి సర్వవిధములగు హస్త క్రియలు, యంత్రకళలు మున్నగునవి నేర్వవలయును. కాని, గ్రహములు, నక్షత్రములు, జన్మపత్రిక, రాశి, ముహూర్తము మున్నగు ఫలవిధాయక గ్రంథములను గల్పితములు మిథ్యలునని యెంచి వానిని జదువరాదు.

ఇట్లు చదువువారు, చదివించువారు ప్రయత్నింపవలయును. అందువలన నిరువది, యిరువది యొక్క సంవత్సరములలో సమస్త విద్యను నుత్తమ శిక్షణమును బొంది మనుష్యులు కృతకృత్యులై యెల్లపుడు నానందమున నుందురు. ఎన్ని విద్య లిట్లిరువది సంవత్సరములలో నేర్తురో మఱియొక విధమున నన్ని విద్యలు శతవర్షములలోను నేర్వజాలరు. ఋషులు, గొప్ప విద్వాంసులు, సర్వశాస్త్రవిదులు, ధర్మాత్ములు కావున వారిచే రచింపబడిన గ్రంథములనే చదువవలయును. ఋషులు కానివా రల్పశాస్త్రములు చదివియుందురు. వారి యాత్మలు పక్షపాతముతో గూడియుండును. కావున వారు వ్రాసిన గ్రంథములు కూడ నట్లే యుండును.

(దర్శనముల ప్రామాణిక భాష్యములు)

ఋగ్యజుః సామాథర్వవేదములు నాలుగు నీశ్వర కృతములు, ఐతరేయ, శతపథ, సామ, గోపథ బ్రాహ్మణములు, శిక్షా, కల్ప, వ్యాకరణ, నిఘంటు, నిరుక్త, ఛందోజ్యోతిషములను నాఱువేదాంగములు, మీమాంసాది షడ్శాస్త్రములు - వేద - ఉపాంగములు, ఆయుర్వేదము, ధనుర్వేదము, గంధర్వవేదము, అర్థవేదము నను నాలుగుపవేదములు, ఇవి యన్నియు ఋషిమునికృత గ్రంథములు. వీనిలో వేదములకు విరుద్ధములైన విషయములు విడువవలయును. ఏలయన :- వేదము లీశ్వరకృతములు. కావున నవి నిర్భ్రాంతములై స్వతఃప్రమాణములగును. వేదములకు వేదములే ప్రమాణములు. బ్రాహ్మణాది సర్వగ్రంథములు పరతః ప్రమాణములు. వీని ప్రామాణ్యము వేదాధీనమై యుండును. వేదముల విశేష వ్యాఖ్య ఋగ్వేదాది భాష్యభూమికలో జూచునది. ఇందును ముందు వ్రాయుదుము.

(త్యాజ్యగ్రంథములు)

పరిత్యజింపదగిన గ్రంథముల పరిగణనము సంక్షేపముగ వ్రాయబడును. నిమ్నలిఖిత గ్రంథములు చాల కల్పిత గ్రంథములని తెలిసికొనవలయును.

వ్యాకరణమున - కాతంత్రము, సారస్వతము, చంద్రిక, ముగ్ధబోధ, కౌముది, శేఖరము, మనోరమ మున్నగునవి. కోశములలో - అమరకోశాదులు; ఛందోగ్రంథములలో - వృత్తరత్నాకరాదులు; శిక్షలో - 'అథశిక్షాం ప్రవక్ష్యామి పాణినీయం మతంయథా' ఇత్యాది; జ్యోతిషమున - శీఘ్రబోధ, ముహూర్త చింతామణి మున్నగునవి; కావ్యములలో - నాయికాభేద, కువలయానందము, రఘువంశ, మాఘ, కిరాతార్జునీయాదులు, మీమాంసలో - ధర్మసింధు, వ్రతార్కము, మున్నగునవి; వైశేషికమున - తర్క సంగ్రహాదులు, న్యాయమున - జాగదీశిమున్నగునవి; యోగమున - హఠప్రదీపికాది, సాంఖ్యమున - సాంఖ్య, తత్త్వకౌముద్యాది; వేదాంతమున - యోగవాసిష్ఠము, పంచదశ్యాది; వైద్యకమున - శార్ఙ్గధరాది; స్మృతులలో - (ప్రక్షిప్తములు విడిచి) మనుస్మృతితక్క మిగిలిన స్మృతులన్నియు; సర్వతంత్ర గ్రంథములు, సర్వపురాణములు, ఉపపురాణములు, తులసీదాస కృతభాషారామాయణము, రుక్మిణీ మంగళాదులు, సర్వభాషా గ్రంథము లన్నియు గపోలకల్పితములు, మిథ్యాగ్రంథములే.

ప్రశ్న:- ఈ గ్రంథములన్నిటిలోను గొంచెమైనను సత్యము లేదా;

ఉత్తరము:- కొంచెము సత్యమున్నది. కాని దానితో బాలెక్కువ యసత్యముకూడ నున్నది. కావున 'విషసంపృక్తాన్నవత్ త్యాజ్యాః' విషము కలిసిన యుత్తమాన్నమువలె విడిచిపెట్టదగినవి.

ప్రశ్నః– మీరు పురాణేతిహాసముల నంగీకరింపరా?

ఉత్తరముః– అంగీకరింతుము. కాని సత్యము నంగీకరింతుము. మిథ్యనంగీకరింపము.

ప్రశ్నః– ఏది సత్యము? ఏది మిథ్య?

ఉత్తరముః– 'బ్రాహ్మణా నీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథానారాశంసీరితి' ఇది గృహ్యసూత్ర వచనము. (ఆశ్వ. గృహ్య ౩-౩-౧) పూర్వము వ్రాసిన ఐతరేయ శతపథాది బ్రాహ్మణములకు నితిహాసము, పురాణము, కల్పము, గాథా, నారాశంసి అను నైదు నామములున్నవి. శ్రీమద్భాగవతాదులకు బురాణమను నామము లేదు.

ప్రశ్నః– త్యాజ్య గ్రంథములలో నున్న సత్యము నేల గ్రహింపరు?

ఉత్తరముః– వానిలో నున్న సత్యము వేదాది సత్యశాస్త్రములదియే. అందలి యసత్యము వారి యింటిది. వేదాది సత్యశాస్త్రములను స్వీకరించుటలో సర్వము సత్యమే గ్రహింపబడును. ఎవరేని యీ మిథ్యా గ్రంథముల నుండి సత్యము గ్రహింపదలచిన మిథ్యయు వారి కంఠమునకు జుట్టుకొనును. కావున 'అసత్యమిశ్రం సత్యం దూరతస్త్యాజ్యమితి.' అసత్యముతో గూడిన గ్రంథస్థ సత్యమునుగూడ విషయుక్తమగు నన్నమునువలె విడిచి పెట్టవలయును.

ప్రశ్నః– మీ మతమేమి?

ఉత్తరముః– వేదము. వేదమున నేదేది చేయుటకును, నేదేది విడుచుటకును జెప్పబడియున్నదో వానినట్లే చేయవలయుననియు, విడిచి పెట్టవలయుననియు మేమంగీకరింతుము. వేదము మాకు మాన్యము. కావున మా మతము వేదము. అట్లే యంగీకరించి యెల్లరు విశేషముగా నార్యులైకమత్యము గలిగి యుండవలయును.

(షడ్దర్శనముల యవిరోధము)

ప్రశ్నః– ఇతర గ్రంథములలో సత్యాసత్యములు పరస్పర విరోధము లున్నట్లుగా నితర శాస్త్రములలోను నున్నవి. ఎట్లన సృష్టివిషయమున షడ్దర్శనములందు విరోధము కనిపించుచున్నది. మీమాంస కర్మమును, వైశేషికము కాలమును, న్యాయము పరమాణువులను, యోగము పురుషార్థమును, సాంఖ్యము ప్రకృతిని, వేదాంతము బ్రహ్మను సృష్టియుత్పత్తికి గారణములుగా నంగీకరించుచున్నవి. ఇది విరోధము కాదా?

ఉత్తరముః– సాంఖ్యవేదాన్తములను విడిచి మిగిలిన నాలుగు శాస్త్రములందును సృష్ట్యుత్పత్తిని గూర్చి ప్రసిద్ధముగా వ్రాయలేదు. వానిలో విరోధమును లేదు. ఏలయన నీకు విరోధము నవిరోధము ననునేమో తెలియదు. విరోధ మేస్థలమున నుండును? ఒక విషయమునందా? లేక భిన్న భిన్న విషయములందా? అని నేనడుగుచున్నాను.

ప్రశ్నః– ఒక విషయమున ననేకులకు సంబంధించిన పరస్పర విరుద్ధకథనమును విరోధ మందురు. ఇక్కడగూడ సృష్టియనునది యొక్క విషయమే.

ఉత్తరముః– విద్యయొకటియా? రెండా? ఒక్కటి. ఒక్కటి యైనచో వ్యాకరణము, వైద్యకము, జ్యోతిషము మున్నగు భిన్నభిన్న విషయములెందుల కున్నవి? ఒక విద్యయం దావిద్యకు సంబంధించిన యవయవముల ప్రతిపాదన మొకదానికంటె మఱియొకటి భిన్నభిన్నముగా జేయబడును. అట్లే సృష్టి విద్యకు సంబంధించిన భిన్నములైన యాఱవయవముల ప్రతిపాదన మా శాస్త్రములలో జేసినందున వానిలో నెట్టి విరోధమును లేదు. ఘటమును జేయుటకు గర్మయు, సమయము, మట్టి, విచారము – ఆలోచన, సంయోగ విభాగములు మున్నగువానికి సంబంధించిన పురుషార్థము, ప్రకృతిగుణములు,

కుమ్మరి కారణమైనట్లు సృష్టికి గారణమైన కర్మ కారణమును గూర్చిన వ్యాఖ్య మీమాంస యందును, సమయము యొక్క వ్యాఖ్య వైశేషికమున, ఉపాదానకారణ వ్యాఖ్య న్యాయమున, బురుషార్థముయొక్క వ్యాఖ్య యోగమునందును, తత్త్వములను గ్రమముగా బరిగణించుటకు సంబంధించిన వ్యాఖ్య సాంఖ్యమునందును, నిమిత్త కారణమైన పరమేశ్వరుని వ్యాఖ్య వేదాన్త శాస్త్రమునందును నున్నవి. అందువలన వీనిలో విరోధము కొంచెమును లేదు. వైద్యకశాస్త్రమున నిదాన చికిత్స ఓషధిదానము, పథ్యప్రకరణములు భిన్నభిన్నముగా చెప్పబడినవి. కాని అన్నిటి యొక్క సిద్ధాన్తము రోగనివృత్తి యైనట్లు సృష్టికి ఆఱు కారణములు. వానిలో ఒక్కొక్క కారణము వ్యాఖ్య ఒక్కొక్క శాస్త్రకారులు చేసియున్నారు. కావున వీనిలో విరోధము కొంచెమును లేదు. దీనికి సంబంధించిన విశేషవ్యాఖ్య సృష్టిప్రకరణమున జేసెదము.

(పఠనపాఠనముల విఘ్నరూపకర్మము)

పఠనపాఠనములలో గలుగు విఘ్నములను విడువవలయును. కుసంగము – అనగా దుష్టులయిన విషయాసక్తజనుల సాంగత్యము, దుష్టవ్యసనములు – మద్యాదిసేవనము, వేశ్యాగమనాది, బాల్యావస్థలో వివాహము – అనగా నిరువదియైదు వర్షముల యాయువు రాకముందు బురుషుడు, పదునాఱవ వర్షమునకు బూర్వము స్త్రీయు వివాహమాడుట, పూర్ణ బ్రహ్మచర్యము పాలింపకుండుట, రాజు, తల్లిదండ్రులు, విద్వాంసులు నగువారియందును, వేదాది శాస్త్రముల ప్రచారమునందును బ్రేమలేకుండుట, అతిభోజనము, నతిజాగరణము చేయుట, పఠనపాఠనములందు, బరీక్షలనిచ్చుటలోను, గ్రహించుటలోను, నాలస్యముగాని, కపటముగాని చేయుట, విద్యవలన గలుగు లాభము సర్వోత్తమమని తెలిసికొనకుండుట; బ్రహ్మచర్యమువలన బలము, బుద్ధి, పరాక్రమము, నారోగ్యము, రాజ్యధనము వృద్ధిబొందునని యంగీకరింపకుండుట, యీశ్వరధ్యానము విడిచి యితరములగు పాషాణాది జడమూర్తులను దర్శించుట-పూజించుటలో వ్యర్థముగా గాలముగడపుట, తల్లిదండ్రులు, నతిథి, యాచార్యుడు, విద్వాంసులు నను వారిని సత్యమయిన మూర్తులుగా నెంచి సేవాసత్సంగములు చేయకుండుట యను నివియన్నియు బఠనపాఠనమునకు విఘ్నమును గలిగించును.

వర్ణాశ్రమ ధర్మములను వదలి యూర్ధ్వపుండ్రము, త్రిపుండ్రము నితర తిలకములు కంఠమున మాలాధారణము, ఏకాదశి, త్రయోదశ్యాది వ్రతాచరణము, కాశ్యాది తీర్థయాత్రలు, రామ, కృష్ణ, నారాయణ, శివ, భగవతీ, గణేశాది నామస్మరణము వలన బాపములు దూరములగునను విశ్వాసము, పాషండుల యుపదేశము వలన విద్యనభ్యసించుటలో నశ్రద్ధ చేయుట, విద్య, ధర్మము, యోగము, పరమేశ్వరోపాసనలు, లేకయే మిథ్యాబోధకములైన పురాణనామక భాగవతాది కథల వలన ముక్తి కలుగునని యంగీకరించుట, లోభముతో ధనాదులందు బ్రవృత్తి కలిగి విద్యయందు బ్రీతి లేకుండుట, యిటునటు వ్యర్థముగా దిరుగాడుట మొదలయిన మిథ్యావ్యవహారములందు జిక్కుపడి బ్రహ్మచర్యము, విద్యవలన గలుగు లాభము నుండి వంచితులై రోగులు, మూర్ఖులునై యుందురు.

నేటి సంప్రదాయకులు, స్వార్థపరులైన బ్రాహ్మణాదు లితరులను విద్యాసత్సంగముల నుండి దూరముచేసి తమ వలలో జిక్కించుకొని వారి తను మనోధనములను నష్టపఱచుచుందురు. క్షత్రియాది వర్ణములవారు చదువుకొని విద్వాంసులయిన యెడల్ల తమ పాషండజాలము నుండి విడివడి తమ కపటమును దెలిసికొని తమ్ము నవమానింతురని యెంచెదరు. ఇంత వఱకు జెప్పినవన్నియు విఘ్నములుగా నెంచి రాజు, ప్రజలు వానిని దూరముగా ఉంచి, పిల్లలను జదివించి విద్వాంసులను జేయుటకు దనుమనోధనములతో బ్రయత్నింపవలయును.

(స్త్రీ శూద్రులకు వేదాధికారము)

ప్రశ్నః- స్త్రీలు, శూద్రులు వేదములు చదువవచ్చునా? వారు చదివిన మేమేమి చేయవలయును? వారు చదువవలయుననుటలో బ్రమాణమును లేదు. పైపెచ్చు 'స్త్రీ శూద్రౌ నాధీయాతామితి శ్రుతేః' స్త్రీ శూద్రులు వేదములు చదువరాదని నిషేధము కూడ నున్నది కదా?

ఉత్తరముః- స్త్రీలు, బురుషులు, నెల్లరు - మనుష్యమాత్రులెల్లరు - వేదములు చదువుటకు నధికారమున్నది. నీవేట్లో పడు. ఈ శ్రుతి నీ కపోల కల్పితము. ఇది యేప్రామాణిక గ్రంథమునకు జెందినదియు గాదు. మనుష్యులెల్లరు వేదాది శాస్త్రములు చదువుటకును, వినుటకును నధికారము కలిగియున్నారని చెప్పు ప్రమాణము యజుర్వేదమున నిరువదియాఱవ యధ్యాయమున రెండవ మంత్రము చూడుము.

**ఓమ్ యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః, బ్రహ్మరాజన్యాభ్యాగ్ ం**
**శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ || యజు. ౨౬.౨.**

అర్థముః- పరమేశ్వరుడనుచున్నాడు - యథా = ఎట్లు నేను, జనేభ్యః = సర్వమానవుల కొఱకు, ఇమామ్ = ఈ, కల్యాణీమ్ = సంసారమునకు ముక్తికి జెందిన సుఖములనిచ్చు, వాచమ్ = ఋగ్వేదాది చతుర్వేద రూపవాణిని, ఆవదాని = ఉపదేశించుచున్నానో యట్లే మీరును చేయుడు.

ఇట నెవరేని జనశబ్దము ద్విజులను గ్రహింపజేయును. కారణమేమన స్మృత్యాది గ్రంథములలో బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకే వేదాధ్యయ నాధికారము వ్రాయబడియున్నది. స్త్రీ శూద్రాది వర్ణముల వారికి లేదు. అని యందురేని వారికి సమాధానము చూడు. పరమేశ్వరుడు స్వయముగా మంత్రమున నిట్లు చెప్పుచున్నాడు. బ్రహ్మరాజన్యాభ్యామ్ = బ్రాహ్మణ, క్షత్రియుల కొఱకు, అర్యాయ = వైశ్యునికొఱకు, శూద్రాయ = శూద్రుని కొఱకు, స్వాయ = తన భృత్యునికొఱకు, స్త్రీలకొఱకు, అరణాయ చ = అతిశూద్రుల కొఱకు నేను వేదములను బ్రకటించి యున్నాను. ఇట్లు మంత్రమున బరమేశ్వరు డుపదేశించినట్లు ప్రమాణమున్నది. కావున మనుష్యులెల్లరు వేదములను జదివి చదివించి, విని వినిపించి, విజ్ఞానమును బెంపుచేసికొని మంచి విషయములను గ్రహించి, చెడు విషయములను వదలి దుఃఖముల నుండి విడివడి యానందమును బొందవలయును. ఇప్పుడు చెప్పు. నీమాటల నంగీకరింపవలయునా? పరమేశ్వరుని యుపదేశము నంగీకరింపవలయునా? పరమేశ్వరుని వచనము తప్పక యంగీకరింపదగినది. ఇంత తెలిసిన మీదట కూడ నెవడేని దీని నంగీకరింపని యెడల నతడు నాస్తికుడనిపించుకొనును. ఏలయన 'నాస్తికో వేదనిందకః' వేదములను నిందించి, వాని నంగీకరింపనివాడు నాస్తికుడనబడును. పరమేశ్వరుడు శూద్రులకు మేలు చేయగోరడా? ఈశ్వరుడు పక్షపాతియా? వేదములను జదువుటకు వినుటకు శూద్రులను నిషేధించి, ద్విజులు మాత్ర మర్హులని యేల విధించును? శూద్రాదులు చదువను జదివించుటకును నర్హులుకారని పరమేశ్వరు డభిప్రాయపడిన వారి శరీరములందు వాక్కు, శ్రోత్రము నను నింద్రియముల నేల రచించును? పరమేశ్వరుడు పృథివ్యాది పంచభూతములను , సూర్యచంద్రులన్ను నన్నాది పదార్థములను నెల్లరికొఱకు రచించినట్లే వేదములను గూడ నెల్లరికొఱకు బ్రకటించెను. ఎటనేని నిషేధమున్నచో నది చదివించినను గొంచెముకూడ జదువురాని వ్యక్తికి సంబంధించినదిగా నెంచి యట్టి నిర్బుద్ధి మూర్ఖవ్యక్తి శూద్రు డనబడునని యభిప్రాయపడవలయును. అట్టివాని పఠనపాఠనములు వ్యర్థములు.

స్త్రీలు చదువరాదని నిషేధించుట నీ మూర్ఖత, స్వార్థత, నిర్బుద్ధితల ప్రభావము. కన్యల చదువు విషయమున వేదమున బ్రమాణము చూడుము.

బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్. అథర్వ-౩-౫-౧౧-౧౮

బాలురు బ్రహ్మచర్యమును సేవించి పూర్ణవిద్యను సుశిక్షణమును బొంది తమకు ననుకూలలు, ప్రియలు, సదృశలునగు విదుషీయువతులను వివాహమాడునట్లు , కన్యా = కుమారి, బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్య సేవనముతో, వేదాది శాస్త్రములను జదివి, పూర్ణ విద్యను, నుత్తమ శిక్షణమును బొంది యువతియై, పూర్ణయువావస్థలో దనకు సదృశుడు, ప్రియుడు, విద్వాంసుడు, పూర్ణయువావస్థతో గూడినవాడునైన, యువానమ్ = యువకుని, విందతే = పొందును. కావున స్త్రీలు బ్రహ్మచర్యమును విద్యాగ్రహణమును దప్పక చేయవలయును.

ప్రశ్న :- స్త్రీలు కూడ వేదములు చదువవలయునా?

ఉత్తరము:- తప్పక చదువవలయును. చూడు. శ్రౌతసూత్రాదులలో నేమియున్నదో:- 'ఇమం మంత్రం పత్నీ పఠేత్' స్త్రీ యజ్ఞమున నీ మంత్రమును జదువవలయును. స్త్రీలు వేదాది శాస్త్రములను జదువకున్న యజ్ఞమున స్వరసహితముగ మంత్రముల నెట్లుచ్చరింపగలరు? సంస్కృతము నెట్లు భాషింపగలరు? భారతవర్షపు స్త్రీలలో భూషణరూపయగు గార్గి వేదాది శాస్త్రములను జదివి పూర్ణ విదుషియై యుండెను. ఈ విషయము శతపథ బ్రాహ్మణమున (శత. ౧౪-౬-౬) స్పష్టముగ వ్రాయబడి యున్నది.

భళిరే - పురుషుడు విద్వాంసుడు, స్త్రీ యవిదుషి, స్త్రీ విదుషి పురుషు డవిద్వాంసుడు నైన నింటిలో బ్రతిదినము దేవాసుర సంగ్రామము జరుగును గదా? ఇక సుఖమెక్కడ? స్త్రీలు చదువని పక్షమున కన్యాపాఠశాలలో నధ్యాపిక లెట్లుకాగలరు? అట్లే రాజకార్యములు, న్యాయాధీశత్వాదులును, గృహాశ్రమ కార్యములు, స్త్రీ పురుషులు పరస్పరము ప్రసన్నులనుజేయుట, గృహకార్యములన్నియు స్త్రీల యధీనమున నుండుట మున్నగు కార్యములు విద్యలేకున్న బాగుగ నెన్నడు జరుగనేరవు.

చూడు- ఆర్యావర్తపు రాచస్త్రీలు ధనుర్వేదమును - యుద్ధ విద్యను, బాగుగ నేర్చి యుండెడివారు. అటుల నేర్చి యుండకున్న గైకేయి మున్నగు స్త్రీలు దశరథాది పురుషులతో బాటు యుద్ధరంగమున కెట్లు వెళ్లగలిగెడివారు? యుద్ధమెట్లు చేయగలిగెడివారు? కావున బ్రాహ్మణి సర్వవిద్యలను, క్షత్రియ యన్ని విద్యలతోబాటు యుద్ధవిద్యను, రాజవిద్యను, వైశ్యస్త్రీ వ్యవహార విద్యను, శూద్ర స్త్రీ పాకాది సేవావిద్యయు దప్పక జదువవలయును.

పురుషుడు కనీసము వ్యాకరణము, ధర్మము, తన వ్యవహారమునకు సంబంధించిన విద్యను జదువవలసియున్నట్లు స్త్రీ కూడ వ్యాకరణము, ధర్మము వైద్యకవిద్య, గణిత శిల్పవిద్యలు కనీసము తప్పక చదువవలయును. ఈ మాత్రమైన జదువకున్న సత్యాసత్య నిర్ణయము, పతి కనుకూలముగ వర్తించుట, యోగ్యసంతానమును గనుట, వారిని బాలించి పోషించుట, సుశిక్షితులను జేసి వర్ధిల్లజేయుట, గృహ కార్యములను దనయిచ్చవచ్చినట్లు చేయుట, చేయించుట, వైద్యక విద్యాసహాయముతో నౌషధమువలె నన్నపానములను సిద్ధముచేయుట - చేయించుట, స్త్రీలు చేయలేరుకదా!

శిల్పవిద్య నేర్వక గృహనిర్మాణము చేయించుట, వస్త్రాభూషణాదులను నిర్మించుట, నిర్మింప జేయుట, గణితవిద్య నేర్వక యాయవ్యయమునకు సంబంధించిన లెక్కలను దెలిసికొనుట, తెలుపుట స్త్రీలెట్లు చేయగలరు? వేదాది సర్వశాస్త్రముల నభ్యసింపక ధర్మము నెట్లాచరింపగలరు? అధర్మము నుండి దూరముగా నెట్లుండగలరు? కావున దమ సంతానములకు బ్రహ్మచర్యము, నుత్తమశిక్షణము, విద్య వలన శరీరాత్మలను బెంపుజేసికొను నేర్పుగల తల్లిదండ్రులే ధన్యవాదార్హులు, కృతకృత్యులు నగుదురు. అందు వలన శిక్షితులైన సంతానము, తల్లిదండ్రులు, పతి, యత్తమామలు, రాజు ప్రజ, యిరుగు పొరుగువారు నిష్ట

మిత్రులు, సంతానాదులు నను నెల్లరతో యోగ్యతకు దగినట్లు ధర్మముగా వర్తింపగలుగుదురు.

(విద్య అక్షయకోశము)

విద్యయనెడి కోశ మక్షయమైనది. దీని నెంత వ్యయముచేసిన నంతగా వర్ధిల్లును. ఇతర కోశము లన్నియు వ్యయము చేసినకొలది తఱిగిపోవును. అన్నదమ్ములును బంచుకొందురు. విద్యాకోశమును జోరులుకాని, దాయభాగము పంచుకొనువారు కాని యెవరును బంచుకొనరు. ఈ కోశమును రక్షించువారు వృద్ధిచేయువారును రాజు ప్రజలే యగుదురు.

కన్యానాం సంప్రదానం చ కుమారాణాం చ రక్షణమ్. మ. ౭-౧౫౨.

బాలబాలికల నెల్లరను బూర్వము వర్ణించిన ట్లుచిత సమయము వఱకు బ్రహ్మచర్యమున నుంచి శిక్షితులను జేయుట రాజునకు, శాసకులకు దగును. అది వారి కర్తవ్యము, రాజశాసనము నంగీరింపని తల్లి దండ్రులను దండింపవలయును. రాజాజ్ఞ ననుసరించి యెనిమిదేండ్ల పైన బాలబాలిక లింటియందుండ రాదు. ఆచార్యకులములోనే యుండవలయును. సమావర్తన సంస్కారము జరుగక ముందెవ్వరు వివాహము చేసికొనరాదు.

(విద్యాదానము సర్వశ్రేష్ఠము)

సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే, వార్యన్నగో మహీవా స
స్తిల కాంచన సర్పిషామ్. మను. ౪-౨౩౩

లోకమున దానము చేయబడు జలము, అన్నము, గోవులు, భూమి, వస్త్రములు, నువ్వులు, సువర్ణము, ఘృతము మున్నగు వానిలో వేద విద్యాదాన మతిశ్రేష్ఠము. కావున దను మనోధనములతో విద్యను వృద్ధిచేయుటలో జేయగలిగిన ప్రయత్నమంతయు జేయవలయును. యథాయోగ్యముగ బ్రహ్మచర్యపాలనము, విద్యాభ్యాసము, వేదోక్త ధర్మప్రచారము జరుగు దేశము భాగ్యవంతమైన దేశమగును.

బ్రహ్మచర్యాశ్రమశిక్ష సంక్షేపముగ వ్రాయబడినది. నాల్గవ సముల్లాసమున సమావర్తన గృహాశ్రమముల శిక్ష వ్రాయబడును.

## శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృత సుభాషావిభూషిత సత్యార్థ ప్రకాశమున శిక్షావిషయక తృతీయసముల్లాసము సంపూర్ణము.

# చతుర్థ సముల్లాసము

## సమావర్తన వివాహ గృహాశ్రమవిధులు
## (గృహస్థమున కధికారి)

**వేదానధీత్య వేదౌ వా వేదం వా పి యథాక్రమమ్,**
**అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావిశేత్.** మ. ౩—౨.

విధి ననుసరించి బ్రహ్మచర్యమున నాచార్యున కనుకూలముగ వర్తించి, నాలుగు వేదములు కాని, మూడింటినిగాని, రెండింటిని గాని, లేక యొక్కటిని గాని సాంగోపాంగముగ జదివి బ్రహ్మచర్యము ఖండితముకాని స్త్రీ పురుషులు గృహస్థాశ్రమమున బ్రవేశింపవలయును.

**తం ప్రతీతం స్వధర్మేణ బ్రహ్మదాయాహరం పితుః,**
**స్రగ్విణం తల్ప ఆసీనమర్హయేత్ ప్రథమం గవా.** మ—౩—౩.

విధి ననుసరించి శిష్యుడు తన ధర్మముతో గూడినవాడై, యాచార్య ధర్మయుక్తుడగు తండ్రినుండి కాని, యాచార్యుని నుండికాని విద్యారూపదాయ భాగమును గ్రహించి పుష్పమాలను ధరించుచు దనమంచము మీద గూర్చుండియున్న యాచార్యుని బ్రథమమున గోదానముతో సత్కరింపవలయును. అట్లే లక్షణ యుక్తుడగు విద్యార్థిని గూడ గన్యాజనకుడు గోదానముతో సత్కరింపవలయును.

**గురుణానుమతః స్నాత్వా సమావృత్తో యథావిధి,**
**ఉద్వహేత, ద్విజో భార్యాం, సవర్ణాం లక్షణాన్వితామ్.** మను. ౩—౪.

గురువుయొక్క యాజ్ఞతో స్నానమొనర్చి గురుకులము నుండి యనుక్రమ పూర్వకముగ వచ్చి బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు తన వర్ణమునకు దగిన సుందరియు, లక్షణయుక్తయునగు కన్యను వివాహమాడవలయును.

**అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః,**
**సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే.** మను. ౩—౫.

తల్లి కులములో నారుతరములకును, దండ్రి (కులమునకు) గోత్రమునకు సంబంధములేని కన్యను వివాహమాడుట యుచితము.

దీని ప్రయోజనమేమన – "పరోక్షప్రియా ఇవ హి దేవాః ప్రత్యక్షద్విషః" శత. ౧౪–౬–౧౧–౨.

పరోక్ష (కనబడని) పదార్థమున నెట్టి ప్రీతి యుండునో, ప్రత్యక్షత్య పదార్థమున నట్టి ప్రీతి యుండ దనుట నిశ్చిత విషయము. కొండొకడు పటికబెల్లము గుణములు విని, దానిని దిననంతకాల మాతని మనస్సు బెల్లమునందే లగ్నమై యుండును. కనబడని (పరోక్ష) వస్తువు ప్రశస్తిని వినినపుడు దానిని సంపాదించుటకు మిక్కిలి కోరిక కలుగును. అట్లే దూరస్థయు, తన గోత్రమునకు, దల్లి కులమునకు సంబంధములేని కన్యతో వరునకు వివాహము జరుగవలయును. (అందువలన వధూవరులలో బ్రీతి కలుగును.)

(నికట వివాహదోషములు, దూరవివాహగుణములు)

(౧) మొదటిది:– బాలబాలికలు బాల్యావస్థయందు సమీపమున నున్నవారు పరస్పరము కలిసి యాడుకొనుట, కలహించుట, యొకరి నొకరు ప్రేమించుట సహజము. ఒండొరుల గుణదోషములను, స్వభావమును జిన్నతనమున జేయు విపరీతాచరణములను దెలిసికొందురు. ఒకరి నొకరు నగ్నముగా జూచుటయు దటస్థించును. అట్టివారికి బరస్పరము వివాహము జరిగిన వారిలో నెన్నడు బ్రేమ కలుగ జాలదు.

(౨) రెండవది:- నీటిలో నీరు కలిసిన విలక్షణగుణ మేర్పడ నట్లొకేగోత్రమున బితృకులమున గాని, మాతృకులమునగాని వివాహము జరిగినందున ధాతువులలో మార్పు కలుగదు. కావున నున్నతి కలుగదు.

(౩) మూడవది:- పాలలో జక్కెర, శొంఠి మున్నగు నోషధులు కలిసినందున బాలుత్తమ గుణదాయక మగునట్లు మాతృపితృకులములకు సంబంధములేని భిన్నగోత్రముల స్త్రీపురుషుల వివాహము జరిగిన మిక్కిలి యుత్తమమగును.

(౪) నాల్గవది:- రోగి తనదేశమును వదలి దూరదేశమున కేగి వాయుజలములను, నన్నపానములను మార్పుచేసికొని రోగరహితుడగునట్లు దూరదేశస్థుల వివాహము మిక్కిలి గుణదాయకమగును.

(౫) ఐదవది:- సమీప సంబంధమువలన నొకరికొకరు సమీపమున నుందురు. కావున బరస్పర సుఖ:దుఃఖముల నెఱుగుట, పరస్పర విరోధ మేర్పడుటయు సంభవము. దూరదేశమున నుండువారి కట్లు జరుగదు. దూరస్థుల వివాహము వలన బ్రేమసూత్రము దూరదేశమునందును వ్యాపించును. సమీప వివాహమున నట్లు జరుగదు.

(౬) ఆఱవది:- దూరసంబంధము వలన దూరదేశమున నుండు మనుష్యులతోను, బదార్థముల తోను సంబంధము సులభముగా గలుగును. నికట సంబంధమువలన నట్టి లాభము కలుగదు. 'దుహితా దుర్హితా, దూరే హితా భవతి' నిరుక్త వచనము. దుహితా అనగా గన్య. కన్యకు దూరదేశస్థ వ్యక్తితో వివాహము చేసినందున హితము కలుగును. కావుననే కన్యను 'దుహిత' యని యందురు. దూరమున నుండి హితము చేయునది యని 'దుహిత' పదమున కర్థము. సమీప సంబంధమున నట్టి హితము కలుగదు.

(౭) ఏడవలాభము:- సమీప వివాహమువలన గన్యయొక్క తల్లి దండ్రులకులమున దారిద్ర్యము కలుగుటయు సంభవము. కన్య తన పుట్టినింటికి వెళ్లినపు డామె కేదో యిచ్చి పంపవలసినస్థితి తల్లిదండ్రులకు గలుగును. సమీపమున నుండుట వలన బుట్టిన యింటికి బహుపర్యాయములు రాకపోకలు జరుగుట సులభము.

(౮) ఎనిమిదవది:- సమీప సంబంధమువలన బరస్పరము తమ తమ పితృకులము నుండి సాహాయ్యము లభించునను గర్వము కలుగును. దంపతులలో నేకొంచెము వైమనస్యము కలిగినను స్త్రీ తన పితృకులమున కేగుటకు సిద్ధపడును. ఇట్లు పరస్పరనింద, కలహములు నేర్పడును. ఏలయన స్త్రీ స్వభావము క్షణములో దీక్ష్ణము, క్షణములో మృదువు-కోమలము నగును. ఇట్టి కారణముల వలన బితృగోత్రమునను, మాతృకులమున నాఱుతరముల వఱకును సంబంధము - వివాహము చేసికొనుట మంచిదికాదు.

(వివాహసంబంధమునకు దగనికులము)

మహాంత్యపి సమృద్ధాని గోఽజావి ధనధాన్యతః,
స్త్రీసంబంధే దశైతాని కులాని పరివర్జయేత్. మను. ౩—౬

ధనధాన్యములతోను, నావులు, మేకలు, గొఱ్ఱెలు, గజాశ్వములు, రాజ్యలక్ష్మి మున్నగు వానితో నెంత సంపన్నములై యున్నను వివాహ సంబంధ విషయమున నీక్రింది పదికులములను విడిచి పెట్టవలయును.

హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసమ్,
క్షయ్యామయావ్యపస్మారి శ్విత్రికుష్ఠికులాని చ. మను. ౩—౭

సత్క్రియాహీనము, సత్పురుషరహితము, వేదాధ్యయనమునకు విముఖము, శరీరమున బెద్ద రోమము లుండునట్టియు, మొల్లలు - మూలవ్యాధి గలిగినట్టియు, క్షయ, ఉబ్బసము, నజీర్ణము, మూర్ఛ

శ్వేతకుష్ఠము, గలితకుష్ఠము నను వ్యాధులు గల కులములందు బుట్టిన కన్యతో గాని, వరునితో గాని వివాహము జరుగుట మంచిదికాదు. ఈ దుర్గుణములు, రోగములు వివాహము చేసికొనువారి కులములందు ప్రవేశించును. కావున నుత్తమ కులపు యువతీయువకులు పరస్పరము వివాహమాడుట యుచితము.

నోద్వహేత్ కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీమ్
నాలోమికాం నాతిలోమాం న వాచాటాం న పింగలామ్. మను. ౩-౮

పీతవర్ణము, నధికాంగములుగల కన్యను, బురుషుని కంటె లావు పొడవులు గల కన్యను, నధికబలము కలదానిని, రోగగ్రస్తను, నతిలోమవతిని, నత్యంత లోమరహితను, వ్యర్థాలాపవతిని, పిల్లి కన్నులు గలదానిని వివాహమాడరాదు.

నర్క్షవృక్షనదీనామ్నీం నాంత్యపర్వతనామికామ్,
న పక్ష్యహి ప్రేష్యనామ్నీం న చ భీషణనామికామ్. మను. ౩.౯

అశ్వినీ, భరణీ, రోహిణీదేవి, రేవతీబాయి మున్నగు నక్షత్రముల నామముగలవారిని, తులశమ్మ, బంతిపువ్వమ్మ, చంపాదేవి, మల్లిక మొదలైన చెట్ల పేర్లవారిని, గంగ, యమున, గోదావరి మున్నగు నదీ నామము లున్నవారిని, చాండాలి నామవతిని, పార్వతి, శైలజ యను పర్వతముల పేర్లుకలవారిని, కోకిల, మేన, చిలకమ్మ యను పక్షుల పేర్లు, నాగమ్మ, భుజంగి యను నిట్టి సర్పనామములు, మాధవదాసి, మీరాదాసి మున్నగు ప్రేష్యనామములు, చండికా, కాళీ యను భయంకర నామములు గల కన్యలను వివాహమాడరాదు. ఈ నామములు నిందితములు. ఇతర పదార్థములకు జెందినవియునై యున్నవి.

అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీమ్
తనులోమ కేశదశనాం మృద్వంగీముద్వహేత్ స్త్రియమ్. మను. ౩-౧౦

వంకర టింకరలేని సుందరములయిన యవయవములు గలిగి, యశోద, సుఖద యనునిట్టి మంచిపేరుగలదియై హంసగామిని, గజగమనయై సూక్ష్మరోమములు, దీర్ఘకేశములు, దాడిమగింజలవంటి దంతములు, కోమలాంగములు కలిగిన స్త్రీని వివాహమాడవలయును.

(వివాహవయస్సు)

ప్రశ్నః- వివాహమునకు మంచిసమయము, విధము నెయ్యది?

ఉత్తరముః- పదునాఱవ సంవత్సరము మొదలుగ నిరువదియైదవ సంవత్సరము వఱకు గన్యయు, (౨౫) ఇరువదియైదవ సంవత్సరము నుండి (౪౮) నలువది యెనిమిదవ సంవత్సరము వఱకు బురుషుడును వివాహమాడుటకు నుత్తమ సమయము. ఇందు (౧౬) పదునాఱు, (౨౫) ఇరువదియైదు సంవత్సరముల వయస్సువారి వివాహము నికృష్టము. (౧౮-౨౦) వర్షములు స్త్రీలకు (౩౦-౩౫-౪౦) సంవత్సరములు పురుషులకు వచ్చిన పిదప జరుగు వివాహము మధ్యమము. (౨౪) సంవత్సరములు స్త్రీకి, (౪౮) సంవత్సరములు పురుషునకు వచ్చినపుడు చేసికొను వివాహ ముత్తమము నసబడును.

ఏ దేశమున నిట్టి శ్రేష్ఠవివాహ విధులు, నుత్తమ బ్రహ్మచర్యము, విద్యాభ్యాసము నుండునో యాదేశము సుఖవంతమగును. ఇట్టి బ్రహ్మచర్యము, విద్యాగ్రహణము నుండవో, బాల్యావస్థయందే యయోగ్యుల వివాహము జరుగునో యాదేశము దుఃఖములందు మునిగిపోవును. బ్రహ్మచర్యము, విద్యాగ్రహణ పూర్వక వివాహముల సంస్కారము వలన నితర సర్వవిషయములు సంస్కరింపబడును. అవి చెడిన నన్నియు జెడును.

ప్రశ్నః- అష్టవర్షా భవేద్ గౌరీ నవవర్షా చ రోహిణీ,
దశవర్షా భవేత్ కన్యా తత ఊర్ధ్వం రజస్వలా.

మాతాచైవ పితా తస్యా జ్యేష్ఠో భ్రాతా తథైవ చ,
త్రయస్తే నరకం యాన్తి దృష్ట్వా కన్యాం రజస్వలామ్. పారా. ౭-౬.౮.

వీనికి నర్థముః- బాలికకు నెనిమిదవయేట గౌరి, తొమ్మిదవయేట రోహిణీ, దశమవర్షమున గన్య, యాపైన రజస్వల నామము లేర్పడును.

దశమవర్షము వఱకు వివాహము చేయక, పిదప రజస్వలయని పిలువబడు బాలికను జూచు తల్లిదండ్రులు పెద్దన్నయు నరకమున బడుదురు.

ఉత్తరముః- బ్రహ్మోవాచ - బ్రహ్మపలికెను.

ఏకక్షణా భవేద్ గౌరీ ద్వీక్షణేయం తు రోహిణీ,
త్రిక్షణా సా భవేత్ కన్యా హ్యత ఊర్ధ్వం రజస్వలా (౧)
మాతా పితా తథా భ్రాతా మాతులా భగినీ స్వకా,
సర్వే తే నరకం యాన్తి దృష్ట్వా కన్యాం రజస్వలామ్. (౨)

ఇది సద్యోనిర్మిత బ్రహ్మపురాణవచనము, పరమాణువు మార్పు చెందు సమయమునకు క్షణమని పేరు. బాలిక జన్మించిన ప్రథమక్షణమున గౌరి, రెండవక్షణమున రోహిణి, మూడవక్షణమున గన్య యనబడును. నాలుగవక్షణమున రజస్వల నామకయగును.

ఆ రజస్వల నామక బాలికను జూచిన తల్లిదండ్రులు, నన్న, మామ, యక్క యందఱు నరకమున బడుదురు.

ప్రశ్నః- ఈ శ్లోకములు ప్రమాణములు కావు.

ఉత్తరముః- ఎందుకు బ్రమాణములు కావు? బ్రహ్మపురాణశ్లోకములు ప్రమాణములు కానిపక్షమున నీవు చెప్పిన శ్లోకములును బ్రమాణములు కాజాలవు.

ప్రశ్నః- వహ్వా! పరాశరకాశీనాథుల శ్లోకములు ప్రమాణములు కావా?

ఉత్తరముః- వహ్వారే! బ్రహ్మశ్లోకములను నీవు ప్రమాణముగా నంగీకరింపవా? పరాశర, కాశీనాథుల కంటె బ్రహ్మ గొప్పవాడు కాడా? నీవు బ్రహ్మశ్లోకముల నంగీకరింపకున్న మేము పరాశర, కాశీనాథుల శ్లోకముల ప్రామాణ్యము నంగీకరింపము.

ప్రశ్నః- మీ శ్లోకములు చెప్పునది యసంభవము. కావున బ్రమాణములు కావు. ఏలయన సహస్రక్షణములు జన్మసమయముననే గడచిపోవును. వివాహ మెట్లు జరుగగలదు? మఱియు, నప్పుడు వివాహము చేయుటలో ఫలమును లేదు.

ఉత్తరముః- మా శ్లోకము లసంభవములైన నీ శ్లోకములు నసంభవములే. ఏలయన, నెనిమిది తొమ్మిది, పదియేండ్ల వయస్సులో బెండ్లిచేయుటయు నిష్ఫలమే యగును. ఏలయన బదునాఱేండ్లకు బైన స్త్రీకి, నిరువది నాలుగేండ్ల పైన బురుషునకు వివాహము చేసిన నప్పటికి స్త్రీ గర్భాశయము పెరిగి శరీరము బలయుక్తము నగును. పురుషుని వీర్యము పరిపక్వమై శరీరము పుష్టమగును. అందువలన వారికి నుత్తమ సంతానము గలుగును.

ఎనిమిదేండ్ల పిల్లకు సంతానోత్పత్తి కలుగుట యసంభవమైనట్లే గౌరి, రోహిణి మున్నగు నామములు పెట్టుట యసంగతమే. బాలిక గౌరవర్ణముకలది కాక నలుపువర్ణము కలదైన నామెకు గౌరి నామము పెట్టుట వ్యర్థము కాదా? గౌరి మహాదేవుని భార్య. రోహిణి బలదేవుని పత్ని. వారిని బౌరాణికులైన మీరు మాతృభావముతో జూతురు. ప్రతి బాలికను గౌరి, రోహిణి యను భావముతో జూచు మీరు వారిని వివాహ మాడుట సంభవము, ధర్మయుక్తము నెట్లు కాగలదు? కావున మీ మా శ్లోకములు రెండును మిథ్యలే.

'బ్రహ్మోవాచ' బ్రహ్మ చెప్పెనన్న నెపముతో నేను శ్లోకములు వ్రాసినట్లే పరాశరాది నామములతో నవియు నెవరో వ్రాసియున్నారు. కావున నిట్టి మిథ్యాశ్లోకముల ప్రామాణ్యము వదలి వేదప్రమాణము నంగీకరించి యన్నివ్యవహారములు చేయుడు - చూడు. మను వేమనుచున్నాడో!

(౬) "త్రీణి వర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీ సతీ,
ఊర్ధ్వం తు కాలాదేతస్మాద్ విందేత సదృశం పతిమ్. మను. ౯-౯౦

కన్య రజస్వలయైన పిదప మూడు సంవత్సరముల వఱకు భర్తను వెదకి తనకు తుల్యుడైన పతిని బొందవలయును. ప్రతిమాసము రజోదర్శనమై ముప్పదియాఱుమార్లు రజస్వల యైనపిదప వివాహమాడుట యోగ్యము. అంతకుముందు గాదు.

(౭) కామమామరణాత్ తిష్ఠేత్ గృహే కన్యర్తుమత్యపి,
నచైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్. మను. ౯.౮౯.

బాలబాలికలు మరణపర్యంత మవివాహితులుగా నుండనిండు. ప్రమాదము లేదు. కాని, పరస్పర విరుద్ధ గుణకర్మస్వభావములు గలవారికి వివాహమెన్నడు జేయరాదు. దీనింబట్టి పూర్వోక్తసమయమునకు ముందు జరుగు వివాహములు, నసదృశవివాహములు యోగ్యములు గావని సిద్ధమగుచున్నది.

ప్రశ్నః- వివాహము తల్లిదండ్రుల యధీనమున జరుగవలయునా? యువతీ-యువకుల యధీనమున జరుగవలయునా?

ఉత్తరముః- యువతీ యువకుల యధీనమున జరుగవలయును. అదియే యుత్తమము. తల్లిదండ్రులు వివాహము చేయదలచినను బాల-బాలికల ప్రసన్నతలేక చేయరాదు. వివాహితులు పరస్పరము ప్రసన్నులై వివాహమాడిన వారిలో విరోధము మిక్కిలి తక్కువగా గలుగును. ఉత్తమ సంతానము గూడ గలుగును. అప్రసన్నుల వివాహమువలన నిత్యము క్లేశములు కలుగుచుండును. వివాహమున ముఖ్యప్రయోజనము వధూవరులకు సంబంధించినదేకాని తల్లి దండ్రులది కాదు. ఏలయన దంపతులలో ప్రసన్నత యున్నవారే సుఖపడుదురు. వారిలో విరోధమున్న వారికే దుఃఖము కలుగును.

(౮) సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ,
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్. మను. ౩-౬౦

ఏ వంశమున స్త్రీ వలన పురుషుడు, పురుషుని వలన స్త్రీ ప్రసన్నులై యుందురో యాకులమునందే యానందము, లక్ష్మి, కీర్తియు నివాసముండును. విరోధము, కలహములున్న దుఃఖము, దరిద్రత, నిందయు నుండును.

కావున నార్యావర్తమున పరంపరగా వచ్చుచున్న స్వయంవర వివాహ పద్ధతియే యుత్తమము. స్త్రీ పురుషులు వివాహము చేసికొనదలచినపుడు విద్య, వినయము, శీలము, రూపము, నాయువు, బలము, కులము, శరీర పరిమాణాదులు తగినట్లుగ నుండవలయును.

(యువవివాహమున ప్రమాణము)

(౯) యువా సువాసాః పరివీత ఆగాత్ స ఉ శ్రేయాన్ భవతి జాయమానః
తం ధీరాసః కవయ ఉన్నయన్తి స్వాధ్యో మనసా దేవయన్తః. ఋ ౩-౮-౪

ఎవడు, పరివీతః = అన్నివైపులనుండి, యజ్ఞోపవీతము ధరియించి, బ్రహ్మచర్యము సేవించి, యుత్తమ విద్యా, శిక్షణములతో యుక్తుడై, సువాసాః = సుందరవస్త్రములు ధరించినవాడై, బ్రహ్మచర్య యుక్తుడై, యువా = పూర్ణ యౌవనవంతుడై విద్యాగ్రహణముచేసి గృహాశ్రమమునకు, ఆగాత్ = వచ్చునో, స ఉ = అతడే రెండవ విద్యాజన్మమున, జాయమానః = ప్రసిద్ధుడై, శ్రేయాన్ = అతిశయశోభాయుక్తుడు,

మంగళకారియు, భవతి = అగుచున్నాడు, స్వాధ్య ః = బాగుగధ్యానయుక్తులు, మనసా = విజ్ఞానముతో, దేవయన్తః = విద్యావృద్ధిని గోరువారు, ధీరాసః = ధైర్యయుక్తులు, కవయః = విద్వాంసులు, తమ్ = అతనిని, ఉన్నయన్తి = ఉన్నతశీలుంజేసి ప్రతిష్ఠితుం జేయుదురు. మఱియు బ్రహ్మచర్యధారణమొనర్చి విద్యను, నుత్తమశిక్షణమును గ్రహింపకయే బాల్యావస్థయందే వివాహము చేసికొను స్త్రీ పురుషులు నష్టభ్రష్టులై విద్వాంసుల మధ్య ప్రతిష్ఠగలవారు కాజాలరు.

ఆ ధేనవో, ధునయన్తామశిశ్వీః సబర్దుఘాః శశయా అప్రదుగ్ధాః,

నవ్యానవ్యా యువతయో భవన్తీ ర్మహద్దేవానామసురత్వమేకమ్. ఋ ౩-౫౫.౧౬

అప్రదుగ్ధాః = పాలు పిండని, ధేనవః = గోవులతో సమానలై, అశిశ్వీః = బాల్యావస్థారహితలై, సబర్దుఘాః = సర్వోత్తమ వ్యవహారములను బూర్ణముచేయగలిగి, నవ్యానవ్యాః = నవీనశిక్ష, నవీనయవస్థలలో బూర్ణతను గలిగి, భవన్తీః = వర్తించు, యువతయః = పూర్ణయువావస్థలోనున్న స్త్రీలు, దేవానాం = బ్రహ్మచర్యసునియమములతో బూర్ణవిద్వాంసులలో, ఏకమ్ = అద్వితీయమైన, మహత్ = గొప్ప, అసురత్వమ్ = ప్రజ్ఞాశాస్త్ర శిక్షతో గూడినవారై, ప్రజ్ఞలో రమించుటలోగల భావార్థమును బొందినవారై, తరుణవయస్సులోనున్న పతులంబొంది, ఆధునయంతామ్ = గర్భధారణము జేయవలయును. ఎన్నడు బొరపడికూడ బాల్యావస్థయందు మనస్సుతోగూడ బురుషుని ధ్యానింపరాదు. కారణమేమన, నీ కర్మమే యిహపరలోక సుఖములకు సాధనము. బాల్య వివాహము వలన బురుషునికంటె స్త్రీకి నెక్కువనాశము సంభవించును.

పూర్వీరహం శరదః శశ్రమాణా దోషా వస్తోరుషసో జరయన్తీః

మినాతి శ్రియం జరిమా తనూనా మప్యూ ను పత్నీర్ వృషణో జగమ్యుః. ఋ ౧-౧౭౯-౧

నుః=శీఘ్రముగ, శశ్రమాణాః=శ్రమచేయువారు, వృషణః=వీర్యసేచనసమర్థులు, పూర్ణయువావస్థతో గూడిన పురుషులు, పత్నీః=యువావస్థయందుండి, హృదయమునకు బ్రియలగు స్త్రీలను, జగమ్యుః = పొంది, నూఱు సంవత్సరములు నంతకంటె నెక్కుడగు పూర్ణాయువుగలవారై సుఖము ననుభవింతురు. పుత్రపౌత్రాదులతో వర్ధిల్లుదురు. అట్లే స్త్రీపురుషులెల్లరు వర్తింపవలయును. పూర్వీః=పూర్వపు, శరదః=శరదృతువులను, జరయన్తీః=వృద్ధావస్థను బొందింపజేయు, ఉషసః=ప్రాతఃకాల సమయములను, దోషాః= రాత్రులు, వస్తోః= దినములు, తనూనామ్=శరీరముల, శ్రియమ్=శోభను, జరిమా=అతిశయ వృద్ధాప్యము, బలమును, శోభను, మినాతి=దూరముచేయును. అట్లే, అహమ్= నేను, (స్త్రీ లేక పురుషుడు) ఉ=బాగుగ, అపి=నిశ్చయించి బ్రహ్మచర్యముతో విద్యను, శిక్షణమును, శరీరబలమును, నాత్మబలమును యువావస్థను బొందియే వివాహము చేసికొందును. దీనికి విరుద్ధముగా వర్తించుట వేద విరుద్ధమగుటవలన సుఖదాయక వివాహ మెన్నడును గాదు.

ఈ విధముగ ఋషులు, మునులు రాజులు మహారాజులు నైనయార్యులు బ్రహ్మచర్యముతో విద్య నభ్యసించియే స్వయంవర వివాహములు జరుపుచుండినంత కాలము నీదేశమున నున్నతి కలుగుచుం డెడిది. బ్రహ్మచర్యముతో విద్యనభ్యసింపక బాల్యావస్థయందే పరాధీన - తల్లిదండ్రుల యధీనమున వివాహములు జరుగనారంభించినప్పటి నుండియు గ్రమముగ నార్యావర్త దేశమునకు హాని కలుగుచు వచ్చినది. కావున నీ దుష్టకార్యమును విడిచి సజ్జనులు పూర్వము చెప్పినట్లు స్వయంవర వివాహములు జరుప వలయును. వివాహము వర్ణానుక్రమముగ జరుపవలయును. వర్ణవ్యవస్థ గుణకర్మ స్వభావము ననుసరించి యుండవలయును.

(వర్ణవ్యవస్థ)

ప్రశ్నః- తల్లిదండ్రులు బ్రాహ్మణి బ్రాహ్మణుడునైన వారి సంతానము బ్రాహ్మణు లగుదురుకాని, యన్యవర్ణస్థులైన తల్లిదండ్రులకు గలిగిన సంతానము బ్రాహ్మణు లెన్నడైన నగుదురా?

ఉత్తరముః- అగుదురు. పూర్వము పెక్కురైరి. ఇప్పుడు నగుచున్నారు. ముందును నగుదురు. ఎట్లన ః- ఛాందోగ్యోపనిషత్తునందు నజ్ఞాత కులజుడైన జాబాలఋషి (౪.౪.౨.౫.) మహాభారతమున క్షత్రియ వర్ణుడైన విశ్వామిత్రుడు. (మ.భా. అను ౩-౧౨) చాండాలకులజుడైన మాతంగ ఋషి (మ.భా. అను. ౩-౧౯) వీరందఱు బ్రాహ్మణులై యుండిరి. ఇప్పుడును నుత్తమ విద్యా స్వభావములు గలవాడే బ్రాహ్మణ శబ్దమునకు యోగ్యుడు. మూర్ఖుడు శూద్రశబ్దమునకు దగినవాడు నగుచున్నాడు. ముందును నట్లే యగును.

ప్రశ్నః- భేష్, రజోవీర్యముల వలన నేర్పడిన శరీరము మాఱి రెండవ వర్ణమునకు యోగ్యమెట్లు కాగలదు?

ఉత్తరముః- రజోవీర్యములవలన బ్రాహ్మణ శరీరము కలుగదు. శరీరము మాత్రము కలుగును; కాని,

(౧౦) స్వాధ్యాయేన జపైర్ హోమై స్త్రైవిద్యేనేజ్యయా సుతైః,

మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయంక్రియతే తనుః. మను. ౨.౨౮

దీని యర్థము పూర్వము వ్రాయబడినది. ఇటను సంక్షేపముగా జెప్పుచున్నాము. స్వాధ్యాయేన = పఠనపాఠనములవలన, జపైః=విచారణచేయుట చేతను, జేయించుటచేతను, హోమైః=నానావిధములగు హోమానుష్ఠానము వలనను, త్రైవిద్యేన=సంపూర్ణ వేదములను శబ్దార్థ సంబంధస్వరోచ్చారణ సహితముగ జదువుట, చదివించుటవలనను, ఇజ్యయా=పౌర్ణమాసేష్టి మున్నగునవి పూర్వోక్త విధిపూర్వకముగ జేయుటవలనను, సుతైః=ధర్మముతో సంతానోత్పత్తి చేయుటచేతను, మహాయజ్ఞైః= పూర్వము చెప్పిన బ్రహ్మ, దేవ, పితృ, వైశ్వదేవ, అతిథియజ్ఞములు చేయుటచేతను, యజ్ఞైశ్చ = అగ్నిష్టోమాదియజ్ఞములు, విద్వాంసుల సాంగత్యము, సేవ, సత్యభాషణము, పరోపకారాదిసత్కర్మములాచరించుటవలనను, మఱియు శిల్ప విద్యాదులను జదివి, దుష్టాచారములను వదలి శ్రేష్ఠాచారములందు వర్తించుటవలనను, ఇయం తనుః= ఈ శరీరము, బ్రాహ్మీ=బ్రాహ్మణునకు సంబంధించినదిగా, క్రియతే = చేయబడును. నీ వీశ్లోకము నంగీకరింపవా?

ప్రశ్నః- అంగీకరింతును.

ఉత్తరముః- అంగీకరింతువేని రజోవీర్యములవలన వర్ణవ్యవస్థ కలుగునని యేల యంగీకరించు చున్నావు?

ప్రశ్నః- నేనొక్కడనే యంగీకరించుటలేదు. ఎందఱో పరంపరగా నిట్లే యంగీకరించుచున్నారు గదా? మీరు పరంపరను గూడ ఖండింతురా?

ఉత్తరముః- లేదు. కాని నీ విపరీతబుద్ధి నంగీకరింపక ఖండనము చేయుచున్నాము.

ప్రశ్నః- మాది విపరీతము, మీరు చెప్పునది విపరీతము కాదనుటకు బ్రమాణమేమి?

ఉత్తరముః- ఇదియే ప్రమాణము. మీరైదాఱు తరముల నుండి వచ్చుదానిని సనాతనపరంపర యనుచున్నారు. మేము సృష్ట్యారంభము నుండి నేటి వఱకు వచ్చు వేద పరంపర నంగీకరించుచున్నాము. లోకమున దండ్రి శ్రేష్ఠుడైన బుత్రుడు దుష్టుడు, తండ్రి దుష్టుడైన బుత్రుడు శ్రేష్ఠుడు, కొందఱి విషయమున బితాపుత్రులిరువురును శ్రేష్ఠులు లేక పితాపుత్రులిరువురు దుష్టులు నగుట చూచుచున్నాము. కావున మీరు భ్రమలో బడుచున్నారు. చూడు మహారాజా మను వేమనుచున్నాడో.

(౧౧) యేనాస్య పితరో యాతా యేన యాతాః పితామహాః,
తేన యాయాత్ సతాం మార్గం తేన గచ్ఛన్ న రిష్యతే. మను. ౪—౧౭౮

ఏ మార్గమున దల్లిదండ్రులు తాతముత్తాతలు నడచిరో యా మార్గమున సంతానము నడువవలయును. కాని సతాం=సత్పురుషులైన తాత ముత్తాతలు నడచిన మార్గమున నడువవలయును. తండ్రి, తాత దుష్టులైనయెడల వారి మార్గమున నెన్నడు నడువరాదు. ఏలయన నుత్తములు ధర్మాత్ములు నైనవారి మార్గమున నడచినచో దుఃఖమెన్నడును గలుగదు. దీని నంగీకరింతువా లేదా?

ప్రశ్నః— అవునవును; అంగీకరింతును.

ఉత్తరముః— చూడు; ఇంతేకాదు పరమేశ్వరుడు వేదముల మూలమున బ్రకటించిన మార్గమే సనాతనము. దానికి విరుద్ధమైనది సనాతన మెన్నడుకాదు. ఇట్లే యెల్లరు నంగీకరింపవలయునా? లేదా? అవశ్యమంగీకరింపవలయును. అట్లంగీకరింపనివాని కిట్లు చెప్పుము — తండ్రి దరిద్రుడై యతని పుత్రుడొకడు ధనాఢ్యుడైన యెడల దండ్రికి గల దారిద్ర్యము నభిమానించి ధనమును బాఱవేయ వలయునా? ఒకని తండ్రి యంధుడైన నతని పుత్రుడు తన కన్నులు పొగొట్టుకొనవలయునా? ఒకని తండ్రి కుకర్మియైన నతని పుత్రుడు కూడ గుకర్మి కావలసినదేనా? కాగూడదు. అట్లెన్నడు గాగూడదు. మనుజులు చేయు కర్మములలో నుత్తమ కర్మములను మాత్రమే యాచరింపవలయును. దుష్టకర్మములను ద్యజింపవలయును. ఇట్లు చేయుట యెల్లరకు దప్పనిసరి.

(జన్మగత వర్ణవ్యవస్థలో దోషములు)

ఎవడేని రజోవీర్యముల యోగమువలన వర్ణవ్యవస్థ నంగీకరించి, గుణకర్మముల యోగమును నంగీక రింపనిచో వాని నిట్లు ప్రశ్నింపవలయును. ఎవడేని యొకవ్యక్తి తన యుత్తమ వర్ణమును వదలి నీచుడైన యంత్యజుడుగానో, క్రిస్టియన్‌గానో, మహమ్మదీయుడుగానో మాఱిపోయినపుడు వానిని బ్రాహ్మణుడుగా నేల యంగీకరింపవు? దీనికి సమాధానముగా 'నతడు బ్రాహ్మణకర్మములను విడిచిపెట్టినాడు. (ఇతర నీచ కర్మముల నొనర్చుచున్నాడు) కావున నతడు బ్రాహ్మణుడు కాడు.' అనియే కదా చెప్పుదువు. దీనింబట్టి యేమి సిద్ధమగుచున్నది? బ్రాహ్మణాదుల యుత్తమ కర్మముల నాచరించువాడు బ్రాహ్మణుడు అనియే కదా! మఱియు నీచుల మధ్య బుట్టి యుత్తమ వర్ణుల గుణకర్మ స్వభావముల నలవఱచుకొనిన వానిని నుత్తమ వర్ణమునందును, నుత్తముల మధ్య బుట్టి నీచకర్మముల నొనర్చిన నతనిని నీచవర్ణమునందును దప్పక లెక్కింపవలయును.

(౧౨) ప్రశ్న — బ్రాహ్మణోఽస్య ముఖమాసీద్, బాహూ రాజన్యః కృతః,
ఊరూ తదస్య యద్ వైశ్యః, పద్భ్యాం శూద్రో అజాయత ॥యజు ౩౧—౧౧

దీనియర్థమిదిః— బ్రాహ్మణుడు ఈశ్వరుని ముఖమునుండి, క్షత్రియుడు బాహువులనుండి, వైశ్యుడూరువుల నుండి శూద్రుడు పాదముల నుండియు బుట్టినాడు. కావున ముఖము బాహ్వాదులు కాని, బాహ్వాదులు ముఖముకాని కాజాలనట్లు బ్రాహ్మణుడు క్షత్రియుడుగాని, క్షత్రియాదులు బ్రాహ్మణుడుగాని కాజాలరు.

ఉత్తరముః— ఈ మంత్రమునకు నీవు చేసిన యర్థము సరికాదు. కారణమేమన, నీ మంత్రమున బురుషుని—నిరాకారవ్యాపక పరమాత్ముని—యనువృత్తి కలుగుచున్నది. పరమాత్ముడు నిరాకారుడు; కావున నతనికి ముఖాద్యంగము లుండనేరవు. ముఖాద్యంగములుగల పురుషుడు వ్యాపకుడు కాజాలడు. వ్యాపకుడు కానివాడు సర్వశక్తిమంతుడు, జగత్కర్త, ధర్త, ప్రళయకర్త కాడు. జీవుల పుణ్యాపాపముల వ్యవస్థాపకుడు, సర్వజ్ఞుడు మృత్యురహితుడు మున్నగు విశేషణములు కలవాడును గాడు.

కావున నీ మంత్రార్థమిదిః- అస్య= పూర్ణవ్యాపకుడైన పరమాత్మని సృష్టిలో నందఱిలో ముఖ్యుడు, ముఖసదృశుడు బ్రాహ్మణుడు, బాహూ=("బాహూర్ వై బలమ్." శతపథ బ్రాహ్మణము) బలము వీర్యము నను వానికి బాహువులని పేరు. బలవీర్యము లెక్కువకలవాడు రాజన్యుడు (క్షత్రియుడు). ఊరూ=తొడలు (కటిభాగమునకు క్రింద మోకాళ్లకు పైన నుండు భాగము) ఊరువుల బలముతో నన్ని దేశములకు రాకపోకలుచేసి పదార్థములను సేకరించువాడు వైశ్యుడు, పాదము= క్రింది యవయవము = దానితో సమానుడై మూర్ఖతాది గుణములు కలవాడు శూద్రుడు.

శతపథాది బ్రాహ్మణ గ్రంథములందును నీ మంత్రమున కీయర్థమే చెప్పబడినది ఎట్లనః-

'యస్మాదేతే ముఖ్యాస్తస్మాన్ముఖతో హ్యసృజ్యన్త'. తై.సం.౭.౧.౧-౪

ముఖ్యులు కావున ముఖము నుండి పుట్టిరని యభిప్రాయము, కావున నట్లు చెప్పుట సంగతము. శరీరావయవములలో ముఖము శ్రేష్ఠము. అట్లే పూర్ణవిద్యతో, నుత్తమ గుణకర్మ స్వభావములతో గూడిన వాడగుటవలన మనుష్యజాతిలో నుత్తముడు బ్రాహ్మణుడని చెప్పబడును.

పరమేశ్వరుడు నిరాకారుడగుట వలన ముఖాద్యంగములే లేనపుడు ముఖాదుల నుండి యుత్పన్న మగుట యసంభవము. వంధ్యాపుత్రుని వివాహ మెట్లసంభవమో యిదియు నట్లే యసంభవము. ముఖాద్యంగముల నుండి బ్రాహ్మణాదు లుత్పన్నులయిన నుపాదాన కారణమునకు సమానముగ బ్రాహ్మణాదుల యాకృతి యుండియుండెడిది. ముఖము యొక్క యాకృతి గుండ్ర ముగా నుండునట్లు బ్రాహ్మణ శరీరాకృతియు గుండ్రముగా ముఖాకృతివలె నుండవలయును. క్షత్రియుల శరీరము బాహుసదృశము, వైశ్యుల శరీర మూరువుల సదృశము, శూద్రశరీరము పాదసదృశమునై యుండ వలయును. కాని యట్లు లేవు.

మఱియు, ముఖాద్యంగముల నుండి పుట్టినవారికి బ్రాహ్మణాది సంజ్ఞలుండిన నుండనిండు. కాని మీకాసంజ్ఞ లుండరాదు. ఏలయన నెల్లరు గర్భాశయము నుండి పుట్టుచున్నారు. అట్లే మీరుకూడ. మీరు ముఖాద్యంగముల నుండి పుట్టక గర్భాశయము నుండి పుట్టి బ్రాహ్మణాది నామముల యభిమానమేల కలిగియున్నారు?అని యెవరేని ప్రశ్నించిన (నేమి చెప్పగలరు?), (ఏమియు జెప్పజాలరు.) కావున నీవు చెప్పిన యర్థము సరికాదు. మేము చెప్పిన యర్థమే సత్యమైనది.

(వర్ణపరివర్తనమున ప్రమాణము)

(౧౩) శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణ శ్చైతి శూద్రతామ్,
క్షత్రియాజ్జాతమేవం తు విద్యాద్ వైశ్యాత్తథైవ చ. మ ౧౦.౬౫

శూద్రకులమున బుట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యవర్ణములకు సమాన గుణకర్మ స్వభావములు కలవాడైన నతడు బ్రాహ్మణుడో, క్షత్రియుడో, వైశ్యుడో యగును. అట్లే బ్రాహ్మణాది వర్ణములలో బుట్టిన వారి గుణకర్మ స్వభావములు శూద్రుని సమానములైన వారు శూద్రులగుదురు. అట్లే క్షత్రియ, వైశ్య కులములందు బుట్టినవారు, బ్రాహ్మణ, శూద్రసమానగుణ కర్మస్వభావులు కలవారగుదురేని వారు బ్రాహ్మణులు, లేక శూద్రులు నగుదురు. అనగా నాలుగు వర్ణములందును స్త్రీ పురుషు లేయేవర్ణమునకు దగిన గుణకర్మస్వభావములు కలవారగుదురో వారాయావర్ణములందు గణింపబడవలయునని భావము.

(౧౪) ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం పూర్వం
వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ. ఆపస్తంబ. ౨-౫.౧౧.౧౦

(౧౫) అధర్మచర్యయా పూర్వో వర్ణో జఘన్యం జఘన్యం
వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ. ఆపస్తంబ. ౨-౫-౧౧.౧౧

ధర్మాచరణము వలన నికృష్ట వర్ణుడు తనకంటె నుత్తమోత్తమ వర్ణమును బొందును. ఏ వర్ణమునకు

దగినవాడో, యతడావర్ణమునందే లెక్కింపబడవలయును. (౧)

అట్లే యధర్మాచరణమువలన నుత్తమవర్ణుడు తనకంటె నీచమైన వర్ణమును బొందును. ఆవర్ణమునందే లెక్కింపబడును. (౨)

పురుషు డేయేవర్ణమునకు యోగ్యుడగుచున్నాడో యట్లే స్త్రీల వర్ణ విషయమునను నట్టి వ్యవస్థయే యుండునని తెలిసికొనవలయును. దీనివలన దేలినదేమి? యనః- ఇట్లు జరిగినందున నన్నివర్ణములవారు దమతమ వర్ణములకు దగిన గుణకర్మస్వభావముగలవారై శుద్ధముగా నుందురు. అనగా - బ్రాహ్మణకులమున నెవడును క్షత్రియ, వైశ్య, శూద్ర సదృశుడుండడు. క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు కూడ శుద్ధముగా నుండును. వర్ణ సంకరత యుండదు. అందువలన నేవర్ణమునకు నిందకాని, యయోగ్యతకాని కలుగదు.

ప్రశ్నః- ఒకానొక వ్యక్తికి నొకేపుత్రుడో లేక పుత్రికయో యుండి వారన్యవర్ణమున బ్రవేశించినచో వారి తల్లిదండ్రుల కెవరు సేవ చేయుదురు? మఱియు వంశచ్ఛేదనము కలుగును. ఇందుల కేమివ్యవస్థ యుండవలయును?

ఉత్తరముః- ఇందువలన వంశచ్ఛేదనము కాని, సేవాభంగము కాని యేమియుగలుగదు. అట్టి వారికి వారి సంతానమునకు బదులు వారు వారిస్వవర్ణమునకు దగిన యితరుల సంతానము ఇచ్చి విద్యాసభకాని, రాజసభ కాని వ్యవస్థ చేయగలదు. అందువలన నెట్టియవ్యవస్థయు నేర్పడదు.

గుణకర్మముల వలన జేయు నీవర్ణవ్యవస్థ కన్యలకు బదునాఱవ యేటను, బాలురకు నిరువదియైదవ యేటను (వారి విద్యా) పరీక్ష సమయమున నియతము చేయవలయును. ఈ క్రమము ననుసరించియే బ్రాహ్మణవర్ణ పురుషునితో బ్రాహ్మణికి, క్షత్రియ వర్ణునితో క్షత్రియకు, వైశ్య వర్ణునితో వైశ్యకు, శూద్ర వర్ణు నితో శూద్రకు వివాహ మొనర్పవలయును. అప్పుడే తమతమ వర్ణముల కర్మములు, పరస్పర ప్రీతియు యోగ్యతకు దగినట్లుండును.

(వర్ణముల గుణకర్మములు)

నాలుగు వర్ణముల కర్తవ్యకర్మములు, గుణములుః-

(౧౬) అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా,
దానం ప్రతిగ్రహశ్చైవ బ్రాహ్మణానా మకల్పయత్. మను ౧-౮౮

(౧౭) శమో దమస్తపః శౌచమ్ క్షాంతిరార్జవమేవ చ,
జ్ఞానం, విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. భ.గీత. ౧౮-౪౨

చదువుట, చదివించుట, యజ్ఞముచేయుట, చేయించుట, దానమిచ్చుట, గ్రహించుట అను నీ యాఱు కర్మములు బ్రాహ్మణునివి. కాని, 'పరిగ్రహః ప్రత్యవరః' (మను. ౧౦.౧౦౯) ప్రతి గ్రహము = దానము గ్రహించుట నీచకర్మము.(౧)

శమః =మనస్సుతో దుష్టకర్మ మొనర్చుట నెన్నడు గోరరాదు. దమః= నేత్రాది బాహ్యేంద్రియముల నన్యాయాచరణము నుండి మరల్చి, ధర్మమునందు లగ్నముచేయుట, తపః = బ్రహ్మచర్యములో జితేంద్రియుడై ధర్మానుష్ఠానమొనర్చుట. ఇక శౌచముః-

(౧౮) అద్భిర్ గాత్రాణి శుధ్యన్తి మనః సత్యేన శుధ్యతి,
విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధిర్ జ్ఞానేన శుధ్యతి. మను, ౫-౧౦౯

జలముతో శరీర బాహ్యాంగములు, సత్యాచరణమువలన మనస్సు, విద్య, ధర్మానుష్ఠానముల వలన జీవాత్మ, జ్ఞానముతో బుద్ధియు బవిత్రములగును. లోపలి రాగద్వేషాదు లనబడు దోషములు, వెలుపలి మాలిన్యములు దూరమొనర్చి శుద్ధముగా నుండవలయును. సత్యాసత్యములను విడివిడిగా దెలిసికొని

సత్యమును గ్రహించి యసత్యమును త్యజించిన నిశ్చయముగ మనుజుడు పవిత్రుడగును. క్షాంతి = నిందా స్తుతులు, సుఖదుఃఖములు, శీతోష్ణములు సమానముగా భావించుట, క్షుధాతృషలు – ఆకలి దప్పికలు, మానము నవమానము, హర్షశోకములు మున్నగువానిని విడిచి ధర్మమునందు దృఢనిశ్చయము గలిగి యుండుట, ఆర్జవమ్ = కోమలత, నిరభిమానము, సరలత – సరల స్వభావము కలిగియుండుట కుటిలత మున్నగు దోషములను విడుచుట; జ్ఞానమ్ = వేదాది సర్వశాస్త్రములను సాంగోపాంగముగ నభ్యసించుటకు, నభ్యసింపజేయుటకు వలయు సామర్థ్యము, వివేకము, సత్యమును నిర్ణయించుట – ఏ వస్తువెట్టిదో – యనగా జడమును జడమనియు, చేతనమును జేతనమనియు నెఱుగుట – విశ్వసించుట; విజ్ఞానమ్ = పృథివి మొదలు పరమేశ్వరుని వఱకుగల పదార్థములను విశేషరూపమున నెఱిగి వానిని యోగ్యతకు దగినట్లుపయోగించుట; ఆస్తిక్యమ్ = వేదములను, నీశ్వరుని, ముక్తిని, బూర్వపరజన్మముల నంగీకరించుట, ధర్మమును, విద్యను, సత్సంగతిని, దల్లిదండ్రులాచార్యుడతిథులు మున్నగువారిని సేవించుటను విడువ కుండుట, వారి నెన్నడు నిందింపకుండుట యను నీ పదునైదు కర్మములు, గుణములు బ్రాహ్మణ వర్ణస్థుడైన మనుజునిలో దప్పక యుండవలయును.

(క్షత్రియ గుణములు)

(౧౯) ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయనమేవ చ,
విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః మ. ౧-౮౯

(౨౦) శౌర్యం తేజో ధృతిర్ దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. భ.గీత–౧౮.౪౩

ప్రజానాం రక్షణమ్= న్యాయముతో బ్రజలను బాలించుట, పక్షపాతము లేకుండ శ్రేష్ఠులను సత్కరించుట, దుష్టులను దిరస్కరించుట, యన్ని విధముల నెల్లరను బాలించుట, దానమ్= విద్యా - ధర్మములందు బ్రవృత్తి సుపాత్రుల సేవలో ధనాది పదార్థములను ఖర్చుపెట్టుట, ఇజ్యా= అగ్ని హోత్రాది యజ్ఞకర్మముల నొనర్చుట, అధ్యయనమ్= వేదాదిశాస్త్రముల నభ్యసించుట, విషయేష్వప్రసక్తిః = శబ్దాది విషయములందాసక్తిని విడిచి జితేంద్రియుడై యుండి యెల్లపుడు శరీరముతో బలము కలిగియుండుట.

శౌర్యమ్= వందలకొలది వేలకొలది యోధులతో యుద్ధరంగమున నొంటరిగా యుద్ధము చేయుటకు భయపడకుండుట, తేజః = ఎల్లప్పుడు తేజస్వియై దీనతను దరిజేరనీయక ప్రగల్భముతో దృఢముగా నుండుట, ధృతిః= ధైర్యవంతుడగుట, దాక్ష్యమ్= రాజు, ప్రజలు నిరువురకు సంబంధించిన వ్యవహారములందును, సర్వశాస్త్రములందును నతిచతురుడుగా నుండుట, యుద్ధేచాప్యపలాయనమ్ = యుద్ధమునందును దృఢముగా నిఃశంకముగా నుండి, యుద్ధము నుండి వెనుకాడకుండుట – పాఱిపోకుండుట తాను జావక తప్పక విజయము కలుగునట్లు యుద్ధముచేయుట, యొకప్పుడు వెనుకాడుట వలనను, శత్రువులను వంచించుట వలనను విజయము కలుగునెడల నట్లే చేయుట, దానమ్ = ఇచ్చు స్వభావము కలిగియుండుట, ఈశ్వరభావః= పక్షపాతము చేయక యోగ్యతకు దగినట్లు వర్తించుట, యాలోచించుట, ప్రతిజ్ఞను బూర్తిచేయుట, దాని నెన్నడు భంగము చేయకుండుట యను నీ పదునొకండు క్షత్రియుని గుణకర్మములు.

(వైశ్యగుణకర్మములు)

(౨౧) పశూనాం రక్షణం దానమిజ్యాధ్యయనమేవ చ,
వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషిమేవ చ. మ.౧.౯౦

పశూనాం రక్షణం = గోవు మున్నగు పశువులను బాలించుట – వృద్ధిచేయుట, దానమ్ = విద్యను,

ధర్మమును వృద్ధిచేయుటకు ధనాదుల వ్యయము చేయుట, ఇజ్యా = అగ్నిహోత్రాది యజ్ఞకర్మములను జేయుట నొనర్చుట, కుసీదమ్ = ఒక వందకు నాలుగు, ఆఱు, ఎనిమిది, పండ్రెండు, పదునాఱు, ఇరువది యణాలకంటె నెక్కుడు వడ్డీ తీసికొనకుండుట, యియ్యకుండుట, యొక్క రూప్యమిచ్చిన వానినుండి నూఱుసంవత్సరములైనను రెండు రూప్యములకంటె నెక్కువ తీసికొనకుండుట, కృషి = వ్యవసాయము చేయుట యను నీ యాఱును వైశ్యుని గుణకర్మములు.

(శూద్రుని గుణకర్మములు)

(౨౨) ఏకమేవ హి శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్,
ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా. మ.౧.౯౧

నింద, యీర్ష్య, యభిమానము మున్నగు దోషములను వదలి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు దగినట్లు సేవచేయుట శూద్రునకు దగిన పని. దానితోనే తన జీవన నిర్వాహ మొనర్చుకొనుట. ఇవియే శూద్ర గుణకర్మములు.

సంక్షేపముగా వర్ణముల గుణకర్మములు వ్రాయబడినవి. ఏ పురుషునిలో నేయేవర్ణముల గుణకర్మములుండునో యావర్ణముల యధికారమతని కియ్యవలయును. ఇట్టి వ్యవస్థను బాటించుటవలన మనుష్యులెల్లరు నున్నతశీలురగుదురు. ఉత్తమ వర్ణములవారు తమ సంతానము మూర్ఖత్వాది గుణములు కలవారైన శూద్రులు కావలసివచ్చునని భయపడుదురు. సంతానము కూడ బూర్వము చెప్పబడినట్లు సద్వర్తనము కలవారు, విద్యాయుక్తులు కానినాడు తాము శూద్రులము కావలసినవార మగుదుమని భయపడుదురు. నీచవర్ణస్థులకు నుత్తమ వర్ణస్థులగుటకు నుత్సాహము కలుగును.

విద్యాధర్మములను బ్రచారము చేయుటకు బ్రాహ్మణుల కధికార మొసంగవలయును. వారు పూర్ణ విద్వాంసులు, ధార్మికులు నగుటచే నాకార్యమును యోగ్యతకు దగినట్లు చేయుదురు. క్షత్రియులకు రాజ్యాధికారమిచ్చిన నెన్నడు రాజ్యమునకు హానికాని, విఘ్నములుకాని కలుగవు. పశుపాలనాదుల యధికారము వైశ్యులకుండుట తగును. వారీపనిని బాగుగ జేయగలుగుదురు. శూద్రుడు విద్యావిహీనుడు, విజ్ఞానరహితుడు కావున నతనికి సేవాకార్యము నిచ్చుట యుచితము. అతడు శరీరమునకు సంబంధించిన కార్యములన్నియు జేయగలడు. ఇట్లా యావర్ణములవారిని వారి యధికారమునకు దగిన కార్యములలో బ్రవృత్తులను జేయుట రాజు మున్నగు సభ్యుల కార్యము.

(వివాహ లక్షణములు)

(౨౩) బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాఽసురః,
గాంధర్వో రాక్షస శ్చైవ పైశాచ శ్చాష్టమోఽ ధమః. మను—౩.౨౧

వివాహ మెనిమిది విధములుః— (౧) బ్రాహ్మము (౨) దైవము (౩) ఆర్షము (౪) ప్రాజాపత్యము (౫) ఆసురము (౬) గాంధర్వము (౭) రాక్షసము (౮) పైశాచము.

(౧) ఈ వివాహముల వ్యవస్థ యిదిః— వధూవరు లిరువురు యథారీతిని బ్రహ్మచర్యము పూర్ణవిద్య నభ్యసించి ధార్మికులు సుశీలురుగా నుండవలయును. అట్టివారి ప్రసన్నతా పూర్వకమగు పరస్పర వివాహము 'బ్రాహ్మ' మనబడును.

(౨) విస్తృతయజ్ఞమును ఋత్విక్కులు చేయుచుండ నల్లునకు నలంకారయుక్తయగు కన్య నొసంగి చేయు వివాహము దైవము.

(౩) వరుని నుండి కొంచెము తీసికొని కన్యనిచ్చి చేయువివాహ మార్ష మనబడును.

(౪) వధూవరుల వివాహము ధర్మవృద్ధికొఱకు జరుగుట ప్రాజాపత్యమగును.

(౫) వరునకు గన్యకు నేదో కొంతయిచ్చి వివాహము చేయుట యాసుర మనబడును.

(౬) నియమము, సమయనిర్ణయము లేక యేదోయొక కారణము వలన యువతీ యువకు లిరువురు నిచ్ఛాపూర్వకముగ బరస్పర సంయోగ మొనర్చుట గాంధర్వ మనబడును.

(౭) యుద్ధముచేసి బలాత్కారముగ గన్యను లాగుకొని పోవుటయో, కపటముతో గన్యను గ్రహించుటయో 'రాక్షస' మనబడును.

(౮) శయనించియో, లేక మద్యాదులను సేవించి యున్మత్తయో యైయున్న కన్యతో బలాత్కారముగ సంభోగముచేయుట 'పైశాచ' మనబడును.

ఈ వివాహములలో బ్రాహ్మ వివాహము సర్వోత్కృష్టమైనది. దైవము, ప్రాజాపత్యము, మధ్యమములు. ఆర్షము, ఆసురము, గాంధర్వము, నికృష్టములు. రాక్షసమధమము. ఇక పైశాచము మహాభ్రష్టము. కావున గన్య, వరుడు నిరువురు వివాహమునకు బూర్వ మేకాంతమున గలిసికొనకుండుట మంచిదని నిశ్చయింపవలయును. ఏలయన యువావస్థయందు స్త్రీ పురుషు లేకాంతమున గలియుట దూషణ కారకము. కాని, యువతీ యువకుల వివాహ సమయము సమీపించినపు డనగా వారి బ్రహ్మచర్యాశ్రమము విద్యాభ్యాసము పూర్తియగుటకు నాలుమాసములు కాని, యొక సంవత్సరముగాని ముందుగా నాయువతీ యువకుల ప్రతిబింబములు - ఫోటోగ్రాఫులకు ప్రతికృతులు తీయించి, కన్యలను జదివించు నధ్యాపికల దగ్గఱకు గుమారుల ప్రతికృతులు, కుమారుల యధ్యాపకులకు గన్యల ప్రతికృతులు పంపవలయును.

ఎవరి రూపములు కలియునో వారికి సంబంధించిన యితిహాసము - జన్మించినది మొదలు నాటివఱకు జన్మచరిత్రకు సంబంధించిన పుస్తకమున్నచో దాని నధ్యాపకులు తెప్పించి చూడవలయును. ఆ యిరువురి గుణకర్మ స్వభావములు సదృశములైన నెవరితో నెవరికి వివాహము జరుగుట యోగ్యమని యెంచెదరో వారి కిరువురికి సంబంధించిన ప్రతిబింబములు నితిహాసము నందజేయవలయును. వానిని జూచి వారి యభిప్రాయములను దమకు దెలియజేయుడని కోరవలయును.

అట్లు యువతీయువకులు పరస్పరము వివాహము చేసికొనుటకు దమ నిశ్చయము దెలిపిన మీదట నా యిరువురికి సమావర్తన మొకేసమయమున జేయవలయును. ఆ యువతీ యువకు లిరువురు నధ్యాపకుల యెదుట వివాహము చేసికొనగోరుదురేని యటనే వివాహము చేయవలయును. లేకున్న గన్యయొక్క తల్లిదండ్రుల యింటిలో వివాహము జరుగుట యోగ్యము. ఆ యధ్యాపకుల యెదుటగాని, కన్యయొక్క తల్లిదండ్రులు మున్నగు భద్రపురుషుల యెదుటగాని యాయువతీయువకులచే బరస్పరము సంభాషణము శాస్త్రార్థము చేయించవలయును. ఏదేని గుప్తవ్యవహారము ప్రశ్నించిన నదియు వ్రాసి సభలో నొకరిచేతి కొకరిచ్చి శంకాసమాధానములు చేసికొనవలయును.

ఇరువురిలోను వివాహము చేసికొనుటకు దృఢప్రేమ కలిగిన మీదట వారికి నన్నపానాదుల విషయమున నుత్తమ ప్రబంధము చేయవలయును. అందువలన వారి శరీరములు బ్రహ్మచర్యమున విద్యాధ్యయనరూప తపశ్చర్యాది శ్రమములవలన దుర్బలములయి యుండును. కావున నవి శుద్ధపక్షపు చంద్రకళలవలె వృద్ధిపొంది కొలది దినములలోనే పుష్టిని సంపాదించుకొనును.

తరువాత గన్య రజస్వలయై యేదినమున శుద్ధిపొందునో యాదినమున వేదిని - మండపమును రచించి యనేక సుగంధి ద్రవ్యములతోను ఘృతాదులతోను హోమముచేసి విద్వాంసులైన పురుషులను స్త్రీలను యోగ్యతకు దగినట్లు సత్కరించవలయును. తదుపరి ఋతుదానము చేయుటకు యోగ్యమని యెంచినదినమున "సంస్కారవిధి" పుస్తకస్థవిధి ననుసరించి సర్వకర్మములుచేసి మధ్యరాత్రిలోగాని పదిగంటల వేళలోగాని ప్రసన్నతతో నందఱ యెదుట బాణిగ్రహణ పూర్వకముగా వివాహ విధిని బూర్తిచేసి

యేకాంత సేవనము చేయవలయును.

పురుషుడు వీర్యస్థాపనమును స్త్రీ వీర్యాకర్షణమును విధిననుసరించి యిరువురు జేయవలయును. వీలైనంతవఱకు బ్రహ్మచర్యమునకు సంబంధించి వీర్యమును వ్యర్థముగా బోనీయరాదు. ఏలయన నా వీర్యమువలన రజస్సువలన నుద్భవించు శరీరమపూర్వము, నుత్తమము నైనసంతానమగును. వీర్యము గర్భాశయమున బ్రవేశించు సమయమున స్త్రీ పురుషు లిరువురు స్థిరముగా నుండి, నాసిక కెదురుగా నాసిక, నేత్రముల కెదురుగా నేత్రముల ననగా శరీరములు తిన్నగానుంచి మిక్కిలి ప్రసన్నచిత్తులై యుండవలయును. ప్రక్కకు బడిపోరాదు. పురుషుడు తన శరీరమును శిథిలము చేయవలయును. స్త్రీ వీర్యప్రాప్తి సమయమున నపానవాయువును బైకి లాగవలయును. యోనిని బైకి సంకోచముచేసి, వీర్యమును బైకి నాకర్షించి గర్భాశయమున స్థితమొనర్పవలయును. తదుపరి యిరువురు శుద్ధజలముతో స్నానము చేయవలయును.

విదుషియైన స్త్రీకి నాసమయముననే గర్భస్థితి యేర్పడుటకు సంబంధించిన జ్ఞానము కలుగును. కాని దీని నిశ్చయ మొకమాసము తరువాత రజస్వల కానందున నెల్లరకు దెలియును. శుంఠి, కుంకుమ పువ్వు, అశ్వగంధి పెన్నేరుగడ్డ, చిన్నయేలకులు, పటికబెల్లము వేసి కాచి ముందుగానే చల్లార్చి యుంచిన పాలు రుచికిదగిన ట్లిరువురు ద్రాగి వేఱువేఱుగా దమ శయ్యలపై బరుండవలయును. గర్భాధానక్రియ జరిపినపుడెల్ల యీ విధినే యనుసరింపవలయును.

మాసాంతమునకు రజస్వల కాకపోవుటవలన గర్భమేర్పడినట్లు నిశ్చయమగును. అప్పటినుండి యొక సంవత్సరము వఱకు స్త్రీ పురుషులు సమాగమము చేయరాదు. అందువలన సంతాన ముత్తమ మగును. మరల రెండవ సంతానముకూడ నట్లే యుత్తమమగును. మధ్యలో సమాగమము జరిగిన వీర్యము వ్యర్థమగును. స్త్రీ పురుషుల యాయువు తగ్గిపోవును. నానావిధ రోగములును గలుగును. కాని, దంపతులు ప్రేమతో భాషణాది వ్యవహారములు తప్పక చేయుచుండవలయును.

(గర్భకాల కర్తవ్యములు)

పురుషుడు వీర్యమును స్వప్నమునందును నష్టపఱపక కాపాడుకొనవలయును. స్త్రీ గర్భమును రక్షించుకొనదగిన విధమున భోజనఛాదనములు జరుపవలయును. గర్భముననున్న శిశువు శరీర మత్యుత్త మమై రూపము, లావణ్యము, పుష్టి, బలము, పరాక్రమము కలిగి పదియవమాసమున జన్మము కలుగునట్లు ప్రయత్నింపవలయును. నాల్గవ మాసము నుండి గర్భమును విశేషముగాను, నెనిమిదవ మాసమునుండి మిక్కిలి విశేషముగాను రక్షింపవలయును. గర్భవతియైన స్త్రీ రేచక, రూక్ష, దాహక ద్రవ్యములను, బుద్ధిని బలమును నశింపజేయు పదార్థములను భోజనాదులందు సేవింపరాదు. నేయి, పాలు, నుత్తమ తండు లములు, గోధుమలు, పెసలు, మినుములు మున్నగు పదార్థములను నన్నపానము లందుపయోగింపవల యును. దేశకాలములను యుక్తిపూర్వకముగ నుపయోగింపవలయును. గర్భసమయమున నాల్గవమాస మున "పుంసవనము" నెనిమిదవ మాసమున "సీమంతోన్నయనము"నను రెండు సంస్కారములు విధి పూర్వకముగ జరుపవలయును. సంతానము కలిగినపుడు స్త్రీ యొక్కయు సంతానము యొక్కయు శరీరములను మిక్కిలి సావధానముతో రక్షింపవలయును. సొంటిపాకముకాని "సౌభాగ్యశుంఠిపాకము"గాని ముందుగానే సిద్ధముచేసి యుంచుకొనవలయును. సుగంధయుక్తమైన గోరువెచ్చని జలముతో స్త్రీ స్నానము చేయవలయును. శిశువునకు స్నానము చేయించవలయును.* తరువాత శిశువు యొక్క

* దయానంద మహర్షిచే వ్రాయబడిన షోడశసంస్కారములు అను పుస్తకమున నాడీచ్ఛేదనము తరువాత శిశువునకు స్నానము చేయింపవలయునని యున్నది.

నాభిమూలమున నొకమృదువైన దారముతో బంధించి నాలుగంగుళములు వదలి పైన నాడీచ్ఛేదనము చేయవలయును. శరీరమునుండి యొక్క రక్తపు బొట్టుకూడ బయటికి రాకుండునట్లు బంధింప వలయును.

తరువాత నాస్థానమును శుద్ధముచేసి దానిద్వారమునకు సమీపమున సుగంధాదియుక్తఘృతాదులతో హోమము చేయవలయును. సంతానము యొక్క చెవిలో దండ్రి 'వేదోఽసీతి' – నీ నామము వేదమని వినిపించి నేతితో దేనెను గలిపి బంగారపు శలాకను దానిలోముంచి శిశువు నాలుకపై 'ఓమ్' అక్షరమును వ్రాసి యాతేనె కలిపిన నేతి నాశలాకతోనే కొంచెము శిశువుచే నాకింపజేయవలయును. తదుపరి శిశువును దల్లికీయ వలయును. శిశువు పాలు త్రాగదలచిన దల్లిపాలు త్రాగింపవలయును. తల్లి స్తనములో బాలు లేకున్న మఱియొక స్త్రీని జక్కగా బరీక్షించి యామెచే బాలను ద్రాగింపజేయవలయును. తదుపరి మఱియొక స్థానమునగాని, గదియందుగాని వాయువు శుద్ధముగ నున్నచోటగాని శిశువును దల్లి నుంచవలయును. అచట బ్రతిదినము ప్రాతః సాయంకాలములందు సుగంధిత ఘృతాది పదార్థములతో హోమము చేయుచుండవలయును. ఆఱు దినముల వఱకు శిశువునకు దల్లి పాలను ద్రావింప వలయును. తల్లియు దన శరీర పుష్టికొఱకు నానావిధములయిన యుత్తమ భోజన పదార్థములను సేవింపవలయును. యోని సంకోచాదుల నొనర్పవలయును. ఆఱవ దినమున బ్రసూత స్త్రీ గది వెలుప లకు రావచ్చును. సంతానమునకు బాలు ద్రావింప దాది నుంచవలయును. ఆమెకుగూడ మంచి యన్నపానములను నేర్పఱపవలయును. ఆమె సంతానమునకు బాలనిచ్చుచుండవలయును; పాలనమును జేయవలయును. కాని తల్లి సంతానముపై బూర్ణదృష్టి నుంచవలయును. ఆమె పాలు కారకుండునట్లు స్తనాగ్రములమీద లేపనము చేయవలయును. అట్లే భోజనాది వ్యవహారములను దగినట్లుంచుకొనవలయును. తరువాత నామకరణాది సంస్కారములు "సంస్కారవిధి" పద్ధతి ననుసరించి యాయాకాలములందు జరుపుచుండవలయును. స్త్రీ మరల రజస్వలయై శుద్ధయైన తరువాత బూర్వోక్త ప్రకారమున ఋతుదానము చేయవలయును.

**(౨౪) ఋతుకాలాభిగామీ స్యాత్ స్వదారనిరతః సదా, ।। మను. 3–౪౫ ।**
**బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్. ।। మను. ౩–౫౦ ।**

తన స్త్రీతోనే ప్రసన్నుడై ఋతుగామియగు గృహస్థుడుకూడ బ్రహ్మచారి సదృశుడే యగును.

**(౨౫) సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ,**
**యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్. మను–౩–౬౦**

ఏ కులములో భార్యవలన భర్త, భర్త వలన భార్యయు బాగుగ బ్రసన్నులై యుందురో యా కులము సర్వసౌభాగ్యములకు, నైశ్వర్యములకు నిలయమగును. కలహములు జరుగు కులమునందు దౌర్భాగ్యము, దారిద్ర్యము స్థిరపడును.

**(౨౬) యది హి స్త్రీ న రోచేత పుమాంసన్న ప్రమోదయేత్,**
**అప్రమోదాత్ పునః పుంసః ప్రజనం న ప్రవర్తతే. మను–౩–౬౧**

స్త్రీ పతిని బ్రేమించి, యతనిని బ్రసన్నుని జేయని పక్షమున నప్రసన్న పతికి గామ ముత్పన్నము కాదు.

**(౨౭) స్త్రియాం తు రోచమానాయాం సర్వం తద్రోచతే కులమ్,**
**తస్యాం త్వరోచమానాయాం సర్వమేవ న రోచతే. మను–౩–౬౨**

స్త్రీ ప్రసన్నయైన కులమంతయు బ్రసన్నమగును. ఆమె యప్రసన్నయైన గులమున నెల్లరు

న(ప్రసన్నులై దుఃఖము ననుభవింతురు.

(నారీ సత్కారము)

**(౨౮) పితృభిర్భ్రాతృభిశ్చైతా పతిభిర్దేవరై స్తథా,**

**పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః ॥ మను-౩-౫౫॥**

తండ్రి సోదరులు భర్త మఱదులు స్త్రీలను భూషణాదులతో సత్కరించి ప్రసన్నలను జేయవలయును. మిక్కిలి శ్రేయస్సు కోరువారిట్లే యెల్లప్పుడు జేయవలయును.

**(౨౯) యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,**

**యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఽఫలాః క్రియాః. మను ౩-౫౬**

స్త్రీలకు సత్కారము జరుగు గృహమునందు బురుషులు విద్యాయుక్తులై దేవనామము కలవారై యానందముతో గ్రీడింతురు. స్త్రీ సత్కారము జరుగని గృహమునందు గ్రియలన్నియు నిష్ఫలము లగును.

**(౩౦) శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్,**

**న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా. మను ౩-౫౭**

స్త్రీ లేకులమునందు లేక యేయింటి యందు శోకాతురలై దుఃఖముననుభవింతురో యాకులము నాయిల్లు శీఘ్రముగా నష్టభ్రష్టమగును. ఎక్కడ నానందముతో నుత్సాహవతులై ప్రసన్నతతో స్త్రీ లుందురో యాకుల మెల్లపుడు వృద్ధినొందును.

**(౩౧) తస్మాదేతాః సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః,**

**భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ. మను ౩-౫౯**

ఐశ్వర్యమును గోరు పురుషులకు స్త్రీలను నుత్సవ, సత్కార సమయములందు వస్త్రాభూషణ భోజనాదులతో నెల్లపుడు సత్కరించుట యుచితము.

'పూజ' శబ్దమున కర్థము సత్కారము. రాత్రిందినములలో బ్రథమమున నొకరితో నొకరు కలిసినపుడు, విడిపోవునపుడును బ్రీతిపూర్వకముగ నొండొరులు 'నమస్తే' చెప్పి సత్కరించుకొనవలయును. ఈ విషయము నెన్నడు మఱవరాదు.

(గృహిణి కర్తవ్యములు)

**(౩౨) సదా ప్రహృష్టయా భావ్యం గృహకార్యేషు దక్షయా,**

**సుసంస్కృతోపస్కరయా వ్యయే చాముక్తహస్తయా. మను ౫-౧౫౦**

స్త్రీ లెల్లప్పుడు మిక్కిలి ప్రసన్నతతో గృహకృత్యములను నెఱవేర్చుటలో దక్షతను జూపింపవలయును. గృహమును శుద్ధముగా నుంచుటలో నేమఱరాదు. శరీరమునకు నాత్మకు నెట్టి యస్వస్థయు గలుగకుండు నట్లౌషధరూపమున భోజనపదార్థములను బక్వము చేయవలయును. గృహ నిర్వహణములో నగు ఖర్చులను వ్రాసియుంచి పతిమున్నగు వారికి వినిపింపవలయును. గృహమున బనిచేయు దాసదాసీలతో దగినట్లు పని తీసికొనవలయును. గృహకార్య మేదియు జెడకుండునట్లు చూడవలయును. ఇవి యన్నియు గృహిణి కృత్యములు.

(ప్రాప్తవ్య పదార్థములు)

స్త్రియో రత్నాన్యథో విద్యా సత్యం శౌచం సుభాషితమ్,

వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వతః. మను ౨-౨౪౦

ఉత్తమ స్త్రీ నానా విధరత్నములు, విద్య, సత్యము, పవిత్రత, శ్రేష్ఠ భాషణము, నానావిధశిల్ప విద్యలు,

హస్తకళలు సర్వదేశముల నుండి సర్వమానవుల నుండియు గ్రహింపదగినవి.

(లోకమున వ్యవహరించురీతి)

**(౩౩) సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయా న్నబ్రూయాత్ సత్యమప్రియమ్,**
**ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మః సనాతనః. మను ౪-౧౩౮**

ఎల్లపుడు ప్రియమైన సత్యము నితరులకు హితము కలిగించునది చెప్పవలయును. అప్రియ సత్యము చెప్పరాదు. మెల్లకంటి వానిని మెల్లకంటి వాడనరాదు. ఇతరులను ప్రసన్నులను జేయుటకు నసత్యమాడరాదు.

**(౩౪) భద్రం భద్రమితి బ్రూయాద్ భద్రమిత్యేవ వా వదేత్,**
**శుష్కవైరం వివాదం చ న కుర్యాత్ కేనచిత్ సహ. మ ౪-౧౩౯**

ఎల్లపుడు నితరులకు హితము కలిగించు భద్రమునే చెప్పవలయును. శుష్కవైరము - నేరము చేయనివానితో విరోధముకాని, వివాదముకాని పెట్టుకొనరాదు. ఇతరునకు హితము కలిగించు వచన మతడు చెడుగా అంగీకరించినను జెప్పకయుండరాదు.

**(౩౫) పురుషా బహవో రాజన్ సతతం ప్రియవాదినః,**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః. ఉద్యోగపర్వ విదురనీతి ౩౭.౧౫**

ఓ ధృతరాష్ట్ర! ఈ లోకమున నితరులను ప్రసన్నులను జేయుటకు ప్రియముల జెప్పి ప్రశంసించువారు పెక్కురుందురు. కాని, వినుట కప్రియమై కల్యాణకారకమగు వచనమును జెప్పువారు వినువారు నరుదుగా నుందురు.

సత్పురుషు లితరుల దోషములను వారియెదుటనే చెప్పి తన దోషములను వినుటకు సిద్ధముగా నుందురు. పరుల గుణములను వారిపరోక్షమున జెప్పుదురు. దుష్టులట్లుకాక యెదుట గుణములు చెప్పి పరోక్షమున వారిని నిందింతురు. మనుష్యుడు తన దోషములను నితరుల నుండి వినుటకును. వానిని జెప్పువాడు చెప్పుటకును సమయము లభింపనంతవఱకు తన దోషములను వదలి గుణములను గ్రహింపజాలడు.

ఎన్నడు నెవరిని నిందింపరాదు. 'గుణేషుదోషారోపణమసూయా, దోషేషు గుణారోపణమప్యసూయా' 'గుణేషు గుణారోపణం దోషేషు దోషారోపణం చ స్తుతిః'. గుణములందు దోషములను, దోషములందు గుణములను లగ్నముచేయుట నింద; గుణములను గుణములుగా దోషములను దోషములుగా జెప్పుట స్తుతి - ప్రశంస యనబడును. మిథ్యాభాషణమే నింద. సత్యభాషణమే స్తుతి.

**(౩౬) బుద్ధివృద్ధికరాణ్యాశు ధన్యాని చ హితాని చ,**
**నిత్యం శాస్త్రాణ్యవేక్షేత నియమాంశ్చైవ వైదికాన్. (౧)**

**(౩౭) యథా యథా హి పురుషః శాస్త్రం సమధిగచ్ఛతి,**
**తథా తథా విజానాతి విజ్ఞానం చాస్య రోచతే. (౨) మను. ౪-౧౯, ౨౦.**

బుద్ధిని, ధనమును, హితమును వృద్ధినొందించు శాస్త్రములను, వేదములను ప్రతిదినము విని, వినిపింపవలయును. బ్రహ్మచర్యమున జదివినవానిని స్త్రీలు పురుషులు నిత్యము జదువవలయును. విచారింపవలయును.(౧)

మనుష్యుడు శాస్త్రములను జదివినకొలది విద్య, విజ్ఞానము వర్ధిల్లును. వానియందు రుచియు వృద్ధి బొందును. (౨)

(దైనిక పంచమహాయజ్ఞములు)

(౩౮) ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం చ సర్వదా,
నృయజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి న హాపయేత్ . (౧)

(౩౯) అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞశ్చ తర్పణమ్,
హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్. (౨)

(౪౦) స్వాధ్యాయేనార్చయే దర్షీన్ హోమైర్దేవాన్ యథావిధి,
పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్ భూతాని బలికర్మణా (౩)

మనుః—౪—౨౧, ౩—౭౦, ౩—౮౧

(౧) ఋషియజ్ఞముః- వేదాది శాస్త్రములను జదువుట, చదివించుట, సంధ్యోపాసన, యోగాభ్యాసము.

(౨) దేవయజ్ఞముః- విద్వాంసుల సాంగత్యము, వారిసేవ, పవిత్రత, దివ్యగుణముల నలవఱచుకొనుట, దాతృత్వము, విద్యాభివృద్ధి నొనర్చుట, యగ్నిహోత్రము చేయుట. ఈ రెండు యజ్ఞములు ప్రాతః సాయం రెండు సమయములందు జేయవలయును. వీనిని గుఱించి బ్రహ్మచర్యమున వ్రాయ బడినది.

(సంధ్యాగ్ని హోత్రముల సమయము)

(౪౧) సాయం సాయం గృహపతిర్ నో అగ్నిః ప్రాతః ప్రాతః సౌమనసస్య దాతా (౧)

(౪౨) ప్రాతః ప్రాతర్ గృహపతిర్నో అగ్నిః సాయంసాయం సౌమనసస్య దాతా (౨)

అ.కాం. ౧౯. అను. ౭ మం. ౩, ౪

(౪౩) తస్మాదహోరాత్రస్య సంయోగే బ్రాహ్మణః సంధ్యాముపాసీత
ఉద్యన్త మస్తం యాన్త మాదిత్యమభిధ్యాయన్ (౩)

షడ్ వింశబ్రాహ్మణ ౪—౫—తై—ఆ—౨—౨

(౪౪) న తిష్ఠతి తు యః పూర్వాం నోపాస్తే యస్తు పశ్చిమామ్,
న సాధుభిర్ బహిష్కార్యః సర్వస్మాద్ ద్విజకర్మణః. మను ౨—౧౦౩

సాయంకాలమున జేయు హోమము వలన - హుతద్రవ్యమువలన శుద్ధమైన వాయువు ప్రాతఃకాలము వఱకు సుఖకరమగును. (౧)

ప్రాతఃకాలమున నగ్నియందు హోమము చేయబడిన ద్రవ్యమువలన శుద్ధమైన వాయువు సాయంకాలము వఱకు బలమును నారోగ్యమును వృద్ధిని బొందించును. (౨)

కావున దినరాత్రుల సంధిసమయములందు సూర్యోదయ సూర్యాస్తమయ సమయములందు సంధ్యాగ్ని హోత్రములు తప్పక చేయవలయును. (౩)

సాయం ప్రాతః కాలములందు నిత్యము నీరెండు యజ్ఞములు చేయనివానిని సజ్జనులు సర్వద్విజ కర్మములనుండి బహిష్కరింపవలయును. అనగా నతనిని శూద్రునివలె నెంచవలయును. (౪)

ప్రశ్నః- త్రికాలసంధ్య ఏల చేయరాదు?

ఉత్తరముః- మూడు సమయములందు సంధికలుగదు. ప్రకాశము నంధకారము నను వీని సంధి రెండువేళల సాయంప్రాతః కాలములందే జరుగును. వీనినంగీకరింపక మధ్యాహ్నమున మూడవ సంధి నంగీకరించునెడల మధ్యరాత్రిలో నొకసంధి యంగీకరించి యపుడును బరమేశ్వరుని ధ్యాన మేలచేయరు? అదియు నంగీకరించిన ప్రతియామమున కొకసంధి నేల యంగీకరింపరాదు? అదియు నంగీకరించిన

ఘడియఘడియకు క్షణక్షణమునకు సంధి నంగీకరింపవలసి వచ్చును. అంగీకరింతుమనిన నది సాధ్యమైన విషయము కాదు. ప్రతిక్షణము సంధ్యోపాసన చేయుట యెవరికి సాధ్యము కాగలదు? మధ్యాహ్న సంధ్యను ధ్రువపఱచు శాస్త్రప్రమాణమును లేదు. కావున సాయంప్రాతః రెండువేళల సంధ్యోపాసన, యగ్నిహోత్రము చేయుటయే సముచితము. మూడు కాలముల గాదు. మూడు కాలములు భూతభవిష్యద్వర్తమానభేదముతో నున్నవి కాని యవి సంధ్యోపాసన భేదముతో నంగీకరించినవి కావు.

పితృయజ్ఞము మూడవది. ఇందు దేవ = విద్వాంసులు, ఋషులు = పఠనపాఠనముల నొనర్చువారు, పితరులు – తల్లిదండ్రులు మున్నగు వృద్ధులు, జ్ఞానులు, పరమయోగులు బూజింపబడుదురు. ఇట్టివారిని సేవించుటయే, వీరికి సేవచేయుటయే పితృయజ్ఞ మనబడును.

ఈ పితృయజ్ఞము రెండు విధములు. ఒకటి శ్రాద్ధము. రెండవది తర్పణము. సత్యమునకు "శ్రత్" అని నామము. 'శ్రత్ సత్యం దధాతి యయా క్రియయా సా శ్రద్ధా' శ్రద్ధయా యత్ క్రియతే తచ్ఛ్రాద్ధమ్, సత్యమును గ్రహింపజేయు క్రియయే శ్రద్ధ యనబడును. శ్రద్ధతో జేయబడిన కర్మము శ్రాద్ధ మనబడును.

**తృప్యన్తి తర్పయంతి యేన పితౄన్ తత్తర్పణమ్.**

జీవించియున్న మాతాపితలు మున్నగు వారేయే కర్మముల వలన ప్రసన్నులగుదురో యా క్రియలకు తర్పణమని పేరు. కావున నీతర్పణము జీవితులకు జేయు క్రియయే కాని మృతులకు జేయునది కాదు.

దేవతర్పణముః–

**ఓం బ్రహ్మాదయో దేవాస్తృప్యన్తామ్.**

బ్రహ్మాది దేవపత్న్యస్తృప్యన్తామ్.

బ్రహ్మాది దేవసుతాస్తృప్యన్తామ్.

బ్రహ్మాదిదేవగణాస్తృప్యన్తామ్. ఇతిదేవ తర్పణమ్ గృహ్య. ౩.౪.

'విద్వాంసో హి దేవాః' ఇది శతపథ బ్రాహ్మణవచనము ౩.౭.౩.౧౦ విద్వాంసులకు దేవతలని పేరు. సాంగోపాంగముగ నాలుగు వేదముల నెఱుగు వారిని 'బ్రహ్మ' యందురు. వారికంటె దక్కువ చదివిన వారినిగూడ దేవత లందురు. వారే విద్వాంసులని భావము. 'బ్రహ్మ'తో సమానముగ విదుషియైన స్త్రీని బ్రహ్మాణి – దేవి యందురు. వారికి సమానులైన పుత్రులు, శిష్యులు వారికి సదృశులగు గణములు ననగా సేవకులు నున్న వారికిని సేవ చేయవలయును. ఈ సేవనుగూడ శ్రాద్ధము, తర్పణము నందురు.

ఋషితర్పణముః–

**ఓమ్ మరీచ్యాదయ ఋషయస్తృప్యన్తామ్.**

**మరీచ్యాద్యృషిపత్న్యస్తృప్యన్తామ్**

**మరీచ్యాద్యృషిసుతాస్తృప్యన్తామ్.**

**మరీచ్యాద్యృషిగణాస్తృప్యన్తామ్. ఇతి ఋషితర్పణమ్.**

బ్రహ్మకు బ్రపౌత్రుడైన మరీచివలె విద్వాంసుడై చదివింపవలయును. వారివలె విద్యాయుక్తలైన స్త్రీలు కన్యలకు విద్యగఱప వలయును. వారికి సమానులైన పుత్రులు శిష్యులు, నట్లే వారికి సమానులైన సేవకులున్న యెడల వారికిని సేవాసత్కారము లొనర్చుట ఋషితర్పణ మనబడును.

పితృతర్పణముః–

**ఓం సోమసదః పితరస్తృప్యన్తామ్. అగ్నిష్వాత్తాః పితరస్తృప్యన్తామ్. బర్హిషదః పితరస్తృప్యన్తామ్. సోమపాః పితరస్తృప్యన్తామ్. హవిర్భుజః పితరస్తృప్యన్తామ్. ఆజ్యపాః పితరస్తృప్యన్తామ్. సుకాలినః పితరస్తృప్యన్తామ్.**

యమాదిభ్యో నమః యమాదీంస్తర్పయామి. పిత్రే స్వధా నమః. పితరం తర్పయామి. పితామహాయ స్వధా నమః పితామహం తర్పయామి. ప్రపితామహాయ స్వధా నమః. ప్రపితామహం తర్పయామి. మాత్రే స్వధా నమో మాతరం తర్పయామి. పితామహ్యై స్వధా నమః. పితామహీం తర్పయామి. ప్రపితామహ్యై స్వధా నమః. ప్రపితామహీం తర్పయామి. స్వపత్న్యై స్వధా నమః. స్వపత్నీం తర్పయామి. సంబంధిభ్యః స్వధా నమః. సంబంధినస్తర్పయామి. సగోత్రేభ్యః స్వధా నమః. సగోత్రాం స్తర్పయామి.

ఇతి పితృతర్పణమ్.

'యే సోమే జగదీశ్వరే పదార్థవిద్యాయాం చ సీదన్తి తే సోమసదః' పరమాత్మయందును, బదార్థ విద్యయందును నిపుణులు సోమసదులు. 'యై రగ్నేర్ విద్యుతో విద్యా గృహీతా తే అగ్నిష్వాత్తాః' అగ్ని, విద్యుత్తు మున్నగు పదార్థముల నెఱుగువా రగ్నిష్వాత్తులు.

'యే బర్హిషి ఉత్తమే వ్యవహారే సీదన్తి తే బర్హిషదః'. విద్యాబుద్ధి యుక్తములగు నుత్తమ వ్యవహారము లందు స్థితులైనవారు బర్హిషదులు. 'యే సోమమైశ్వర్యమోషధీరసం వా పాన్తి పిబన్తి వా తే సోమపాః'. ఐశ్వర్యరక్షకులు, మహౌషధిరసమును బానముచేసి, రోగరహితులైనవారు, నితరుల యైశ్వర్యమును రక్షించు వారు, నౌషధములనిచ్చి యితరుల రోగముల నశింపజేయువారు సోమపులు. 'యే హవిర్ హోతుమత్తు మర్హం భుంజతే భోజయన్తి వా తే హవిర్భుజః'. మాదకములు, హింసాకారకములు నగు పదార్థములు వదలి భుజించువారు హవిర్భుజులు. 'య ఆజ్యం జ్ఞాతుం ప్రాప్తుం వా యోగ్యం రక్షన్తి వా పిబంతి త ఆజ్యపాః'. జ్ఞేయ పదార్థ రక్షకులు, ఘృతదుగ్ధాదులను సేవించువారు నాజ్యపులు. శోభనః కాలో విద్యతే యేషాం తే సుకాలినః'. మంచిధర్మము నాచరించుటకు సుఖరూపకాలము గలవారు సుకాలులు. 'యే దుష్టాన్ యచ్ఛంతి నిగృహ్ణంతి తే యమా న్యాయాధీశాః'. దుష్టులను దండించి, శిష్టులను బాలించు న్యాయకారులు 'యములు'.

'యః పాతి స పితా'. సంతానమును నన్నసత్కారములతో రక్షించువాడు, జనకుడు - పిత - తండ్రి. 'పితుః పితా పితామహః. పితామహస్య పితా ప్రపితామహః' పితకు బిత పితామహుడు. పితామహు నకు దండ్రి ప్రపితామహుడు. యా 'మానయతి సా మాతా' అన్ని సత్కారములతో సంతానమునకు మాన్యత నిచ్చునది మాత - తల్లి. 'యా పితుర్మాతా సా పితామహీ' తండ్రిని గన్నతల్లి పితామహి - నాయనమ్మ. 'పితామహస్య మాతా ప్రపితామహీ'. పితామహుని తల్లి - ప్రపితామహి - తాతమ్మ.

తన స్త్రీ, తోబుట్టువు, సంబంధి = వియ్యంకుడు, తన గోత్రమునకు సంబంధించిన యితరభద్ర పురుషులు, వృద్ధులు నున్నచో వారినందఱను మిక్కిలి శ్రద్ధతో నుత్తమములగు నన్నవస్త్రముల నొసంగి, సుందరములైన యాసనాదులు గల్పించి బాగుగ దృప్తులను జేయవలయును. ఏయే కర్మములవలన వారి యాత్మలు తృప్తిబొందునో, శరీరములు స్వస్థములగునో యాకర్మములతో బ్రీతిపూర్వకముగ వారికి సేవ జేయుట శ్రాద్ధము, తర్పణము ననబడును.

నాల్గవది వైశ్వదేవము:-

భోజన పదార్థములన్నియు సిద్ధమైనపుడు వానిలో బులుపు, కారము, ఉప్పు కలిసిన పదార్థములను వదలి ఘృతమిష్టాది పదార్థములు కలిసిన యన్నముతో బొయ్యిలోని యగ్నిని వేఱుగా నొకచోనుంచి నిమ్నలిఖిత మంత్రములతో నాహుతుల నీవలయును, మఱియు భాగములు చేయవలయును.

(౪౫) వైశ్వదేవస్య సిద్ధస్య గృహ్యేఽగ్నౌ విధిపూర్వకమ్,

అభ్యః కుర్యాద్దేవతాభ్యో బ్రాహ్మణో హోమమన్వహమ్. మ ౩-౮౪

భోజనార్థము పాకశాలలో సిద్ధమైన పదార్థమును దీసికొని యాపాకాగ్నియందే దివ్యగుణముల

కొఱకు నిమ్నలిఖిత మంత్రములతో విధిపూర్వకముగ నాహుతుల నొసంగవలయును.

హోమ మంత్రములు:-

ఓమ్ అగ్నయే స్వాహా. సోమాయ స్వాహా. అగ్నీషోమాభ్యాం స్వాహా.
విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా. ధన్వంతరయే స్వాహా.
కుహ్వై స్వాహా. అనుమత్యై స్వాహా. ప్రజాపతయే స్వాహా.
సహ ద్యావాపృథివీభ్యాం స్వాహా. స్విష్టకృతే స్వాహా.

ఈ మంత్రములలో నొక్కొక్కదానితో నొక్కొకయాహుతి ప్రజ్వలితమగు నగ్నియందు వేయవలయును. తరువాత నొక పళ్ళెములోగాని, భూమిమీదగాని యాకును నుంచి పూర్వదిశాది క్రమముతో నిమ్నమంత్రములతో నన్న భాగములను నుంచవలయును.

ఓమ్ సానుగాయేంద్రాయ నమః. సానుగాయ యమాయ నమః.
సానుగాయ వరుణాయ నమః. సానుగాయ సోమాయ నమః. మరుద్భ్యో
నమః. అద్భ్యో నమః. వనస్పతిభ్యో నమః. శ్రియై నమః. భద్రకాల్యై
నమః. బ్రహ్మపతయే నమః. వాస్తుపతయే నమః. విశ్వేభ్యో దేవేభ్యో
నమః. దివాచరేభ్యో భూతేభ్యో నమః. నక్తంచారిభ్యో భూతేభ్యో నమః.
సర్వాత్మ భూతయే నమః. పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః.

ఈ భాగములను నతిథికిగాని, యగ్నికిగాని యర్పింపవలయును. తదుపరి లవణాన్నము - అన్నము, పప్పు, శాకము రొట్టెను దీసికొని భూమిమీద నాఱుభాగముల నుంచవలయును. ఇందు ప్రమాణము.

శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్,
వాయసానాం కృమీణాం చ శనకైర్ నిర్వపేద్ భువి. మను. ౩, ౯౨

ఇట్లు శ్వభ్యో నమః, పతితేభ్యో నమః, శ్వపగ్భ్యో నమః, పాపరోగిభ్యో నమః, కృమిభ్యో నమః, అను నీ వాక్యములతో భూమిపై నన్నభాగముల నుంచి తదుపరి కొండొక దుఃఖిత బుభుక్షిత ప్రాణికిగాని, కుక్క, పాపి, చాండాలుడు, పాపరోగి, కాకి, పురుగులు, చీమలు మున్నగు వానిలో నెవరికైనను బెట్టవలయును. ఇది మనుస్మృత్యాదుల విధి. హవనము చేసినందున బాకశాలలోగల వాయువు శుద్ధమగును. తెలియకయో చూడకయో జరిగిన జీవహింసకు ప్రత్యుపకారము చేయుటయను ప్రయోజనము సిద్ధించును.

ఐదవది:- అతిథి యజ్ఞము - సేవ. తిథి నిశ్చితములేని వ్యక్తి యతిథి యనబడును. ధార్మికుడు, సత్యోపదేశకుడు నెల్లరకు నుపకారము చేయుట కొఱకు దేశమునందంతట దిరుగువాడు, పూర్ణవిద్వాంసుడు, పరమయోగి, సంన్యాసియునైన వ్యక్తి యకస్మాత్తుగ నొక గృహస్థునికడకు వచ్చిన నతనికి ప్రథమమున నర్ఘ్యపాద్యాచమనములు చేయుటకు దగినట్లు మూడు పాత్రలతో జలము నొసంగవలయును. తదుపరి యుత్తమాసనమున సత్కారపూర్వకముగ గూర్చుండజేసి యుత్తమ పదార్థములను భుజించుటకు, ద్రాగుటకు శుద్ధజలమును నొసంగి సేవ యొనర్చి ప్రసన్నుం జేయవలయును. అనంతరము సత్సంగముచేసి జ్ఞానవిజ్ఞానములకు సంబంధించిన ప్రశ్నములడిగి తెలిసికొనవలయును. ధర్మార్థ కామ మోక్షములను గలుగజేయు నుపదేశములను శ్రవణము చేయవలయును. వారి సదుపదేశముల ననుసరించి తన ప్రవర్తనమును మార్చుకొనవలయును. సమయమును బురస్కరించుకొని గృహస్థులు, రాజు మున్నగు వారు కూడ నతిథులవలె సత్కరింపదగుదురు. కాని,

(౪౬) పాషండినో వికర్మస్థాన్ బైడాల వ్రతికాన్ శఠాన్,
హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్. మను. ౪—౩౦

పాషండినః = వేదమును నిందించువారు, వేదమునకు విరుద్ధమైన యాచరణముగలవారు, వికర్మస్థాః = మిథ్యాభాషణాది వేదవిరుద్ధ కర్మముల నొనర్చువారు, బైడాలవృత్తికాన్ = పిల్లి పొంచియుండి కదలక మెదలక చూచుచు నెలుకలు మున్నగువాని మీదబడి వానిని జంపి తనపొట్ట నింపుకొనును. అట్లు పిల్లివలె వర్తించువారు బిడాలవృత్తివారు,శఠాన్ = హఠముతో, దురాగ్రహముతో, నభిమానముతో వర్తించువారు – (తనకు దెలియదు. మఱియొకరు చెప్పిన వినడు. అట్టివాడు శఠుడు.) హైతుకాన్ = కుతార్కికులు – వ్యర్థముగ వాగువారు, ఉదా:– నేటి వేదాంతులు "మేము బ్రహ్మలము, జగత్తు మిథ్య వేదాది శాస్త్రములు ఈశ్వరుడు నన్నియు గల్పితములు" అని యేమేమో గప్పాలు గొట్టువారు, బకవృత్తీన్‌చ = కొంగ యొంటికాలిమీద నిలబడి దగ్గఱకు వచ్చిన చేపలను బొట్టన బెట్టుకొనును. అట్లే నేటి బైరాగులు మున్నగు హఠులు, దురాగ్రహులు నైనవారి నెన్నడు మాటలతోనైన సత్కరింపరాదు. ఏలయన వీరిని సత్కరించి నచో వీరు వృద్ధిపొంది లోకులను నధర్మయుక్తుల నొనర్చెదరు. తాము స్వయముగా నవనతిని గలిగించు కార్యములు చేయుటయేగాక యనుచరులను గూడ నవిద్య యనెడి మహాసాగరమున ముంచెదరు.

(పంచమహాయజ్ఞముల ఫలము)

ఈ యైదు మహాయజ్ఞములకు ఫలమిది. బ్రహ్మయజ్ఞము వలన విద్య, శిక్షణము, ధర్మము, సభ్యత మున్నగు శుభగుణములు వృద్ధియగును. అగ్నిహోత్రము వలన వాయువు, వృష్టిజలము శుద్ధమై వర్షము మూలమున ప్రపంచమునకు సుఖము ప్రాప్తించును. అనగా శుద్ధవాయువును శ్వాసించుటచేతను, దాని స్పర్శమువలనను, శుద్ధములయిన యన్నపానముల వలనను నారోగ్యవృద్ధి కలిగి బలపరాక్రమములు పెంపయి ధర్మార్థ కామమోక్షముల యనుష్ఠానము పూర్ణమగును. కావున దీనిని దేవయజ్ఞమందురు.

పితృయజ్ఞము వలన – తల్లి దండ్రులు, జ్ఞానులు, మహాత్ములునైనవారికి సేవజేయునపు డాతని జ్ఞానము వృద్ధియగును. అందువలన సత్యాసత్యములను నిర్ణయించి సత్యమును గ్రహించి యసత్యమును విడిచి సుఖి యగును. రెండవది – కృతజ్ఞత సిద్ధించుట. అనగా దల్లిదండ్రులును, నాచార్యుడు సంతానము నకు శిష్యులకు జేసిన సేవకు బదులు తీర్చుట యుచితమే యగును.

బలివైశ్వదేవమునకు ఫలము పూర్వము చెప్పినదియే. అతిథియజ్ఞ ఫలము – లోకమున నుత్తమాతిథులు లేనంతవఱకు నున్నతియు గలుగదు. ఉత్తములైన యతిథులు దేశమున దిరుగుటవలనను సత్యోపదేశములు చేయుటవలనను బాషండత వృద్ధికానేరదు. మనుష్యులందఱిలోను నొకే ధర్మము స్థిరమగును. అతిథులు లేకున్న సందేహనివృత్తి కలుగదు. సందేహనివృత్తి కానియెడల దృఢనిశ్చయము కలుగదు. దృఢనిశ్చయము లేనినాడు సుఖమెక్కడిది?

(గృహస్థుల సామాన్య కర్తవ్యములు)

(౪౭) బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచింతయేత్,
కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవ చ. మను. ౪—౯౨

రాత్రి నాల్గవజామునందు – నాలుగు గడియల రాత్రియుండగా లేచి కాలకృత్యముల నొనర్చి, ధర్మార్థములను, శరీరసంబంధమగు రోగనిదానములను గూర్చి విచారించి పరమేశ్వరుని ధ్యానము చేయవల యును. ఎన్నడును నధర్మము నాచరింపగూడదు.

(౪౮) నాధర్మశ్చరితో లోకే సద్యః ఫలతి గౌరివ,
శనైరావర్తమానస్తు కర్తుర్మూలాని కృంతతి. మను. ౪—౧౭౨

చేయబడిన యధర్మ మెప్పటికిని నిష్ఫలముకాదు. కాని యధర్మమును జేసినప్పుడే దానిఫలము గలుగదు. కాబట్టి యజ్ఞాను లధర్మమునకు భయపడరు. అయిన నా యధర్మాచరణము మెల్లమెల్లగా నీ సుఖమూలములనే కోసివేయునని నిశ్చయముగా నెఱుంగుము.

**(౯౯) అధర్మేణైధతే తావత్తతో భద్రాణి పశ్యతి,**

**తతః సపత్నాన్ జయతి సమూలస్తు వినశ్యతి.** మను ౪-౧౭౪

అధర్మాత్ముడు ధర్మమర్యాదను వదలి (చెఱువుకట్ట తెగి నీరు నాలుగు వైపుల వ్యాపించునట్లు) మిథ్యాభాషణము, కపటము, పాషండము - రక్షించు వేదముల ఖండనము, విశ్వాసఘాతము మొదలగు కర్మములచే నితరుల పదార్థముల నపహరించుచు మొదట వృద్ధిని - ధనము మున్నగు నైశ్వర్యముతో, నన్నము, పానము, వస్త్రము, నాభూషము, యానము, మానము, ప్రతిష్ఠలను బొందును. అన్యాయముచేత శత్రువులనుగూడ జయించును. కాని తరువాత నధర్మి మొదలునఱికిన వృక్షమువలె శీఘ్రముగ నష్టభ్రష్టుడగును.

**(౧౦౦) సత్యధర్మార్యవృత్తేషు శౌచే చైవారమేత్ సదా,**

**శిష్యాంశ్చ శిష్యాద్ధర్మేణ వాగ్బాహూదరసంయతః.** మను ౪-౧౭౫

విద్వాంసుడు వేదోక్తసత్యధర్మము నాచరించుచు సత్యమును గ్రహించి పక్షపాతరహితుడై యసత్యమును బరిత్యజించి న్యాయరూపములగు వేదోక్త ధర్మాదుల నాచరించువానివలె ధర్మముతో శిష్యులకు శిక్షణము నీయవలయును.

**ఋత్విక్పురోహితాచార్యై ర్మాతులాతిథిసంశ్రితైః,**

**బాలవృద్ధాతురై ర్వైద్యైర్ జ్ఞాతిసంబంధిబాంధవైః. (౧)**

**మాతాపితృభ్యాం యామీభి ర్భ్రాత్రా పుత్రేణ భార్యయా,**

**దుహిత్రా దాసవర్గేణ వివాదం న సమాచరేత్. (౨)** మను. ౪-౧౭౯. ౧౮౦

(ఋత్విక్) యజ్ఞము చేయువాడు, (పురోహితః) సర్వదాయుత్తమ ప్రవర్తనము నేర్పువాడు, (ఆచార్యః) విద్యను నేర్పువాడు, (మాతులః) మేనమామ, (అతిథిః) రాకపోకలకు నిశ్చయమైన తిథిలేనివాడు, (సంశ్రితః) తన యాశ్రితుడు, (బాలః) బాలకుడు, (వృద్ధః) ముసలివాడు, (ఆతురః) పీడితుడు, (వైద్యః) ఆయుర్వేదము దెలిసినవాడు, (జ్ఞాతిః) స్వగోత్రుడు లేక స్వవర్ణస్థుడు, (సంబంధి) మామ, (బాంధవః) మిత్రుడు (౧)

(మాతా) తల్లి, (పితా) తండ్రి, (యామీ) అక్క, చెల్లెలు, (భ్రాతా) అన్న, తమ్ముడు, (భార్యా) భార్య, (దుహితా) పుత్రి, (దాసవర్గః) సేవకు లనువీరితో వివాదము - విరోధము చేయరాదు.

(దానమునకు నయోగ్యులు)

**(౧౦౧) అతపా స్త్వనధీయానః ప్రతిగ్రహరుచిర్ద్విజః,**

**అంభస్యశ్మప్లవేనేవ సహ తేనైవ మజ్జతి.** మను ౪-౧౯౦

(అతపాః) బ్రహ్మచర్య సత్యభాషణాది తపస్సు చేయనివాడొకడు, (అనధీయానః) చదువనివాడు రెండవవాడు, (ప్రతిగ్రహరుచిః) ధర్మార్థము మిక్కిలిగ నితరులనుండి పుచ్చుకొనువాడు మూడవవాడు, నీ ముగ్గురు ఱాతినావతో సముద్రమును దరించువానివలె దమ దుష్టకర్మములతో బాటు దుఃఖసాగరమున మునుగుదురు. తాము మునుగుటయేకాక తమతో దాతలను గూడ ముంచెదరు.

**(౧౦౨) త్రిష్వప్యేతేషు దత్తం హి విధినా ప్యార్జితం ధనమ్,**

**దాతుర్భవత్యనర్థాయ పరత్రాదాతురేవ చ.** మను ౪-౧౯౩

ధర్మముచే బ్రాప్తించిన ధనమును బైజెప్పిన ముగ్గురికి నిచ్చు దాతకు వినాశ మీ జన్మమందును, దానము పుచ్చుకొన్నవారికి వినాశము పరజన్మమందును గలుగును.

(౫౩) యథా ప్లవే నౌపలేన విమజ్జత్యుదకే తరన్,
తథా నిమజ్జతోఽధస్తా దజ్ఞౌ దాతృ ప్రతీచ్ఛకౌ. మను ౪-౧౯౪

ఱాతినావపై గూర్చుండి నీటియందు బోవువాడెట్లు మునుగునో యట్లే యజ్ఞానియగు దాతయు, గ్రహీతయు నిరువురును నధోగతిని దుఃఖమును బొందుదురు.

(పాషండుల లక్షణములు)

(౫౪) ధర్మధ్వజీ సదా లుబ్ధ శ్ఛద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రః సర్వాభిసంధకః. (౧)

(౫౫) అధోదృష్టి ర్నైష్కృతికః స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. (౨) మను ౪-౧౯౫, ౧౯౬

(ధర్మధ్వజీ) ధర్మమేమియు జేయక ధర్మముపేర లోకులను దోచుకొనువాడు, (సదాలుబ్ధః) ఎల్లపుడు లోభముతో గూడినవాడు, (ఛద్మికః) కపటి, (లోకదంభకః) సంసారుల యెదుట దన గొప్ప తనమును జాటువాడు, (హింస్రః) ప్రాణిఘాతకుడు, నితరులను ద్వేషించువాడు, (సర్వాభిసంధకః) అందఱితో - మంచివారితోను, జెడ్డవారితోను, గలిసియుండువాడును నగువ్యక్తిని బైడాలవ్రతికుడు - అనగా బిల్లివలె ధూర్తుడు, నీచుడు నని యెఱుగుము.

(అధోదృష్టిః) కీర్తికొఱకు గ్రిందిచూపుకలవాడు, (నైష్కృతికః) ఈర్ష్యాళువు - ఎవడేని కొంచెమపరాధము చేసినను దానికి మాఱుగ వాని ప్రాణముగూడ దీయుటకు దత్పరుడగువాడు, (స్వార్థసాధనతత్పరః) కపటముచేతగాని, యధర్మముచేతగాని, విశ్వాసఘాతముచేగాని, మఱిదేనిచేగాని, తన ప్రయోజనమును సాధించుకొనుటయందు జతురుడు, (శఠః) తనమాట యబద్ధమయినను సరే తన హఠమును మాత్రము వదలనివాడు, (మిథ్యావినీతః) లోపల గపటము నుంచుకొని బైకి శీలమును, సంతోషమును, సాధుత్వమును జూపువాడు నగు వ్యక్తిని బకవ్రతుడు - అనగా కొంగవలె నీచుడని యెఱుగుము. ఇటువంటి లక్షణములు గలవారు పాషండులు. వారిని విశ్వసింపరాదు, సేవింపనుగూడదు.

(ధర్మసంచయవిధము దానిఫలము)

(౫౬) ధర్మం శనైః సంచినుయాత్ వల్మీకమివ పుత్తికాః,
పరలోక సహాయార్థం సర్వభూతాన్యపీడయన్. (౧)

(౫౭) నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః,
న పుత్రదారం న జ్ఞాతి ర్ధర్మ స్తిష్ఠతి కేవలః. (౨)

(౫౮) ఏకః ప్రజాయతే జన్తు రేక ఏవ ప్రలీయతే,
ఏకోఽనుభుంక్తే సుకృతమేక ఏవ చ దుష్కృతమ్. (౩)

(౫౯) ఏకః పాపాని కురుతే ఫలమ్ భుంక్తే మహాజనః,
భోక్తారో విప్రముచ్యన్తే కర్తా దోషేణ లిప్యతే. (౪)

(౬౦) మృతః శరీరముత్సృజ్య కాష్ఠలోష్ఠసమం క్షితౌ,
విముఖా బాంధవా యాన్తి ధర్మస్తమనుగచ్ఛతి. (౫) మను. ౪.౨౩౮-౨౪౧
విదురనీతి ౩౩.౪౩

చెదలు పుట్టను బెట్టినట్లు స్త్రీ పురుషు లేప్రాణికిని బీడ గలిగింపక పరజన్మమునందు సుఖము

పొందుటకు నెమ్మది నెమ్మదిగా ధర్మసంచయము చేయవలయును. (౧)

తల్లి, దండ్రి, పుత్రుడు, భార్య, జ్ఞాతులు నెవరును బర జన్మమున సాహాయ్యము చేయరు. ధర్మమొక్కటియే సహాయకమగును. (౨)

చూడుడు! జీవు డొంటరిగా బుట్టుకను బొందుచున్నాడు. ఒంటరిగా మరణమును బొందు చున్నాడు. ఒంటరిగనే ధర్మఫలమగు సుఖమును నధర్మఫలమగు దుఃఖమును ననుభవించు చున్నాడు. (౩)

కుటుంబమం దొకపురుషుడు పాపముచేసి పదార్థమును దెచ్చును. దానిని మహాజనులు కుటుంబములోని వారందఱు ననుభవింతురు. అట్లనుభవించువారు దోషభాగులుకారు. కాని యా యధర్మము నొనర్చినవాడే దోషభాగి యగుననియు దెలిసికొనుడు. (౪)

ఎవరి చుట్టమైనను మరణించిన వానిని మంటిముద్దవలె భూమిమీద వదలి బంధువర్గము వెనుకకు దిరిగి వెడలిపోవును. వానితో నెవరునుబోరు. కాని యొక్క ధర్మముమాత్రము వానిని వెంబడించును. (౫)

(ధర్మాచరణమువలన ముక్తిప్రాప్తి)

**(౬౧) తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః,**
**ధర్మేణ హి సహాయేన తమస్తరతి దుస్తరమ్. మను ౪-౨౪౨**

కావున బరలోకము - పరజన్మ సుఖము కొఱకును, జన్మసాహాయ్యము కొఱకును మెల్లమెల్లగా నిత్యము ధర్మమును సంపాదించు చుండవలయును. ఏలయనగా జీవుడు ధర్మసాహాయ్యముచేతనే దుస్తరమగు గొప్ప దుఃఖసాగరమును దాటగలుగును.

**(౬౨) ధర్మప్రధానం పురుషం తపసా హతకిల్బిషమ్,**
**పరలోకం నయత్యాశు భాస్వంతం ఖశరీరిణమ్. మను ౪-౨౪౩**

ఎవడు ధర్మమునే ప్రధానముగా నెంచుచున్నాడో, యెవని ధర్మానుష్ఠానముచేత జేసినపాపము లన్నియు నశించినవో, యతనిని ధర్మమే శీఘ్రముగా బ్రకాశ స్వరూపుడును, నాకాశము శరీరము వంటిదిగా గలవాడును, బరలోకమును - పరమదర్శనీయుడగు నాపరమాత్మను బొందించును.

(సదాచార ఫలము)

**(౬౩) దృఢకారీ మృదుర్దాంతః క్రూరాచారై రసంవసన్,**
**అహింస్రో దమదానాభ్యాం జయేత్ స్వర్గం తథావ్రతః. మను ౪-౨౪౬**

దృఢకారియు, గోమలస్వభావుడును, జితేంద్రియుడును, హింసకుల నుండియు, గ్రూరుల నుండియు, దుష్టాచారుల నుండియు దూరముగా నుండు వాడును నగు ధర్మాత్ముడు మనస్సును జయించుటచేతను, విద్యాదులను దానము చేయుటవలనను సుఖము బొందును.

**(౬౪) వాచ్యర్థా నియతాః సర్వే వాఙ్మూలా వాగ్వినిఃసృతాః,**
**తాం స్తు యః స్తేనయేద్వాచం న సర్వస్తేయకృన్నరః. మను. ౪-౨౫౬**

ఏవాణియందు సకలార్థములు-వ్యవహారములు నిశ్చితము లగుచున్నవో యావాణియే వానికి మూలము. వాణిచేతనే సమస్త వ్యవహారములు నెఱవేఱుచున్నవి. ఆ వాణిని దొంగిలించువాడు - అసత్య మాడువాడు చౌర్యాది సమస్త పాపములను జేయువాడగును. ఈ విషయమును గూడ ధ్యానమునందుంచుకొనవలయును.

**(౬౫) ఆచారాల్లభతే హ్యాయు రాచారా దీప్సితాః ప్రజాః,**
**ఆచారాద్ధనమక్షయ్య మాచారో హన్త్యలక్షణమ్. మను ౪-౧౫౬**

కావున మిథ్యాభాషణాదులను, నధర్మమును వదలి బ్రహ్మచర్య జితేంద్రియత్వాది ధర్మాచరణము

వలన బూర్ణాయువును, ధర్మాచారముచే నుత్తమ సంతానమును, నక్షయధనమును బొందును. ధర్మాచరణము నందు వర్తించి దుష్టలక్షణములను బోగొట్టుకొన్నవారి యాచరణమే సంతత మనుసరణీయము. ఏలయనగా:-

(దురాచార ఫలము)

**(౬౬) దురాచారో హి పురుషో లోకే భవతి నిందితః,**
**దుఃఖభాగీ చ సతతం వ్యాధితోఽల్పాయురేవ చ. మను. ౪-౧౫౭**

దుష్టాచారియగు పురుషుడు ప్రపంచమున సజ్జనులనడుమ నిందను బొంది దుఃఖభాగియు, నిరంతర వ్యాధియుక్తుడు నయి యల్పాయువునుగూడ ననుభవించును. కాబట్టి యీ క్రిందజెప్పబోవు ప్రయత్నము చేయవలయును.

**(౬౭) యద్యత్ పరవశం కర్మ తత్తద్యత్నేన వర్జయేత్,**
**యద్యదాత్మవశం తు స్యాత్తత్ సేవేత యత్నతః. మను ౪-౧౫౯**

ఏయే కర్మములు పరాధీనములో వానిని బ్రయత్నముచే వదలి, యేయే కర్మములు స్వాధీనములో వానిని బ్రయత్నముచే సేవింపవలయును.

**(౬౮) సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్,**
**ఏతద్విద్యాత్ సమాసేన లక్షణం సుఖదుఃఖయోః. మను ౪-౧౬౦**

పరాధీనమయినదంతయు దుఃఖము, స్వాధీనమయినదంతయు సుఖము. ఇదియే సంక్షేపముగ సుఖదుఃఖముల లక్షణమని తెలిసికొనవలయును. పరస్పరాధీనమై యున్న యా యా కార్యము లధీనముననే చేయవలయును. స్త్రీ పురుషుల వ్యవహారము పరస్పరాధీనమై యుండవలయును. అనగా స్త్రీకి బురుషుడు, పురుషునకు స్త్రీ యొకరికొకరు ప్రియము నాచరించుచు ననుకూలముగా నుండవలయును. వ్యభిచారము కాని విరోధము కాని చేయరాదు. పురుషుని యాజ్ఞానుకూలముగ గృహకార్యములు స్త్రీ యధీనముననను, వెలుపలి కార్యములు పురుషుని యధీనముననను నుండవలయును. దుష్టవ్యసనములలో జిక్కుకొనక యుండున ట్లొకరినొక రడ్డగింపవలయును. వివాహము కాగానే స్త్రీకి బురుషుడు, బురుషునకు స్త్రీయు నమ్ముడు పోయినట్లు నిశ్చయముగా నెఱుగవలయును.

స్త్రీ పురుషుల హావభావములు, నఖశిఖాగ్రపర్యంతముగల వీర్యాదులన్నియు బరస్పరాధీనములయి పోవుచున్నవి. స్త్రీగాని, పురుషుడుగాని యప్రసన్నతతో నేవ్యవహారమును జేయగూడదు. అందునను మిక్కిలి యప్రియకారకములగు వ్యభిచారమును, వేశ్యాగమనము, పరపురుషగమనము వదలి, సతీపతు లొకరితో నొకరెల్లపుడు బ్రసన్నులై యుండవలయును. బ్రాహ్మణులైరేని పురుషుడు మగబిడ్డలను, సుశిక్షితురాలగు స్త్రీ యాడుబిడ్డలను జదివింపవలయును. వివిధోపదేశములచేతను, వక్తృత్వము చేతను వారిని విద్వాంసులుగా జేయవలయును. స్త్రీకి దేవుడు - సత్కారార్హుడు - పతి, పురుషునకు దేవి - సత్కారార్హురాలు భార్య. గురుకులమందుండు వఱకు శిష్యు లధ్యాపకులను దమ తల్లిదండ్రులుగ నెంచ వలయును. అధ్యాపకులు శిష్యులను దమ సంతాన సమానముగ నెంచవలయును.

(పండిత లక్షణములు)

చదువు జెప్పు నధ్యాపకుడు నధ్యాపిక యెట్లుండవలయును?

**(౬౯) ఆత్మజ్ఞానం సమారంభ స్తితిక్షా ధర్మనిత్యతా,**
**యమర్థా నాపకర్షన్తి స వై పండిత ఉచ్యతే. (౧)**

(౨౦) నిషేవతే ప్రశస్తాని నిందితాని న సేవతే,
అనాస్తికః శ్రద్దధాన ఏతత్ పండితలక్షణమ్. (౨)
(౨౧) క్షిప్రం విజానాతి చిరం శృణోతి విజ్ఞాయ చార్థం భజతే న కామాత్,
నాసంపృష్టో హ్యుపయుంక్తే పరార్థే తత్ ప్రజ్ఞానం ప్రథమం పండితస్య. (౩)
(౨౨) నాప్రాప్య మభివాంఛన్తి నష్టం నేచ్ఛన్తి శోచితుమ్,
ఆపత్సు చ న ముహ్యన్తి నరాః పండితబుద్ధయః (౪)
(౨౩) ప్రవృత్తవాక్ చిత్రకథ ఊహవాన్ ప్రతిభానవాన్,
ఆశుగ్రంథస్య వక్తా చ యః స పండిత ఉచ్యతే. (౫)
(౨౪) శ్రుతం ప్రజ్ఞానుగం యస్య ప్రజ్ఞా చైవ శ్రుతానుగా,
అసంభిన్నార్యమర్యాదః పండితాఖ్యాం లభేత సః (౬)
ఇవి యన్నియు మహాభారత ఉద్యోగపర్వ విదుర ప్రజాగర.
(అధ్యా – ౩౩, శ్లో ౨౦, ౨౧, ౨౨, ౨౫, ౩౩, ౩౪)

ఆత్మజ్ఞానము కలవాడు, నిష్కర్మత, యాలస్యములేక పనుల నారంభించువాడు, సుఖదుఃఖములు, హానిలాభములు, మానాపమానములు, నిందాస్తుతులు మున్నగు వానిని బొంది హర్షశోకములకు లోనుగాని వాడు, ధర్మమునందే నిత్యము నిశ్చితముగా నుండువాడు, నుత్తమోత్తమ పదార్థములు, విషయ వస్తువులచే నాకర్షింపబడని మనస్సుగలవాడు పండితుడనబడును. (౧)

ఎల్లపుడు ధర్మయుక్త కర్మములను సేవించుట, యధర్మ కర్మములను విడుచుట, యీశ్వరుని, వేదమును సత్యాచారమును నిందింపకుండుట, యీశ్వరాదులలో మిక్కిలి శ్రద్ధాళువగుట పండితుని కర్తవ్యాకర్తవ్య కర్మములు. (౨)

కఠిన విషయములను గూడ శీఘ్రముగ నెఱుగగలుగుట, బహుకాలము వఱకు శాస్త్రములను జదివి, విని, విచారించి తెలిసినదానిని బరోపకారము కొఱకు వినియోగించుట, తన స్వార్థముకొఱ కేపనిని జేయ కుండుట, యడుగనపుడును, ననువుగాని సమయముననను నితరుల విషయమున సమ్మతి నీయకుండుట, యనునివియే పండితున కుండవలసిన ప్రథమ ప్రజ్ఞానములు. (౩)

ప్రాప్తియోగ్యములు కానివాని నెన్నడు కోరనివాడు, నశించిన పదార్థములను గూర్చి శోకింపనివాడు, నాపత్కాలమున మోహము నందనివాడు వ్యాకులుడు కానివాడునైన బుద్ధిమంతుడు పండితుడన బడును.(౪)

అన్ని విద్యలందును, ప్రశ్నోత్తరముల నొనర్చుటలోను నిపుణమైన వాక్కుగలవాడు, విచిత్రము లగు శాస్త్రముల ప్రకరణములను జెప్పగలవాడు, యోగ్యతకు దగిన తర్కము స్మరణశక్తియు గలవాడు, గ్రంథముల యథార్థములగు నర్థములను శీఘ్రముగ జెప్పగలవాడును బండితు డనబడును. (౫)

వినిన సత్యములైన యర్థముల కనుకూలమగు ప్రజ్ఞయు, ప్రజ్ఞననుసరించు శ్రవణము గలిగి యెన్నడు నార్యుల – శ్రేష్ఠధార్మిక పురుషుల మర్యాదను భంగముచేయనివాడు పండిత నామము పొందవలయును. (౬)

ఇట్టి స్త్రీ–పురుషులు చదువు చెప్పువారుండు దేశమున స్థానమున విద్య, ధర్మము, నుత్తమాచారము వృద్ధిపొంది ప్రతిదినము నానందము వర్ధిల్లుచుండును.

(మూఢ లక్షణములు)
(చదువు చెప్పుట కయోగ్యులు-మూర్ఖులు)

(౩౫) అశ్రుతశ్చ సమున్నద్ధో దరిద్రశ్చ మహామనాః,
అర్థాంశ్చాకర్మణా ప్రేప్సుః మూఢ ఇత్యుచ్యతే బుధైః. (౧)

(౩౬)అనాహూతః ప్రవిశతి హ్యపృష్టో బహు భాషతే,
అవిశ్వస్తే విశ్వసితి మూఢచేతా నరాధమః. (౨) భా. ఉ. అ.౩౩.౩౫, ౪౧

ఏశాస్త్రమును జదువనివాడు విననివాడు మిక్కిలి గర్వముగలవాడు, దరిద్రుడై గొప్ప గొప్ప కోరిక లను గోరువాడు, కర్మములు చేయకయే యర్థప్రాప్తి నభిలషించువాడు నగువ్యక్తిని బుద్ధిమంతులు మూఢు డందురు. (౧)

పిలువబడకయే సభయందు, కొండొకనియింటిలోను బ్రవేశించి యున్నతాసనమున గూర్చుండ గోరువాడు, నడుగకయే సభలో నధికముగ వాగువాడు, నయోగ్య వస్తువును బురుషుని విశ్వసించువాడు మూఢుడు-మనుష్యులందఱిలో నీచమనుష్యు డనబడును. (౨)

ఇట్టి వారధ్యాపకులు, నుపదేశకులు, గురువులు, మాననీయులు నగుదేశమున నవిద్య, యధర్మము, నసభ్యత, కలహములు, విరోధము, పరస్పరభేదభావము నెక్కుడై దుఃఖములే వృద్ధిపొందును.

(విద్యార్థుల సప్తదోషములు)

ఇక విద్యార్థుల లక్షణములుః-

(౩౭) ఆలస్యం మదమోహౌ చ చాపల్యం గోష్ఠిరేవ చ,
స్తబ్ధతా చాభిమానిత్వం తథాఽత్యాగిత్వమేవ చ.
ఏతే వై సప్త దోషాః స్యుః సదా విద్యార్థినాం మతాః. (౧)

(౩౮) సుఖార్థినః కుతో విద్యా కుతో విద్యార్థినః సుఖమ్,
సుఖార్థీ వా త్యజేద్విద్యాం విద్యార్థీ వా త్యజేత్సుఖమ్. (౨)
మ.భా. విదుర ప్రజాగర. అ-౪౦.౫, ౬.

ఆలస్యమ్ = బుద్ధి శరీరములందు జడత, సోమరితనము, మత్తత, మోహః = కొండొక వస్తువునందు దగుల్కొనుట, చపలత, యిక్కడివి యక్కడివియునగు వ్యర్థకథలను జెప్పుచు వినుట, చదువుచు, జది వించుచు నాగిపోవుట, యభిమానియు, నత్యాగియునగుట యను నీ యేడు దోషములు విద్యార్థులం దుండును.(౧)

ఇట్టివారికి విద్య యెన్నడురాదు. సుఖము ననుభవింపగోరువారికి విద్య యెక్కడ? విద్య నేర్చువానికి సుఖమెక్కడ? విషయసుఖము నర్థించువాడు విద్యను, విద్యార్థి విషయసుఖమును విడువవలయును. (౨)

(౩౯) సత్యే రతానాం సతతం దాన్తానామూర్ధ్వరేతసామ్,
బ్రహ్మచర్యం దహేద్ రాజన్ సర్వపాపాన్యుపాసితమ్. (మ.భా.అను.ప.౩౫-౩౭)

సత్యాచారమున బ్రవృత్తులు, జితేంద్రియులు, నూర్ధ్వరేతస్కులు - వీర్యమునధః స్ఖలనము జేయని వారే సత్యమైన బ్రహ్మచారులు. వారే విద్వాంసులగుదురు. ఉపాసిత బ్రహ్మచర్యము సర్వపాపము లను దహించును.

కావున నధ్యాపకులు, విద్యార్థులు శుభలక్షణయుక్తులై యుండవలయును. విద్యార్థులు సత్యమును జెప్పువారు, సత్యము నంగీకరించువారు, సత్యము నాచరించువారు, సభ్యత, జితేంద్రియత, సుశీలత మున్నగు శుభలక్షణయుక్తులు, శరీరాత్మల బలమును బూర్ణముగ వృద్ధినొనర్చుకొని సమగ్ర వేదాది

శాస్త్రములందు విద్వాంసులగున ట్లధ్యాపకులు ప్రయత్నింపవలయును. ఎల్లపుడు వారికుచేష్టలను విడిపించుటయందును విద్యను నేర్పుటయందును యత్నించుచుండవలయును. విద్యార్థులును నెల్లపుడు జితేంద్రియులు, శాంతులునై యధ్యాపకులయందు ప్రేమగలిగి, విచారశీలురు పరిశ్రములునై పూర్ణవిద్య, పూర్ణాయువు, పరిపూర్ణ ధర్మము, పురుషార్థమొనర్చుట తమకలవడునట్లు ప్రయత్నింపవలయును. ఇవి యన్నియు బ్రాహ్మణవర్ణస్థుల కార్యములు.

క్షత్రియుల కర్తవ్యము రాజధర్మమున జెప్పెదము.

వైశ్యులయినవారు బ్రహ్మచర్యాదుల మూలమున వేదవిద్య నభ్యసించి వివాహము చేసికొనవలయును. నానాదేశపుభాషలు, నానావిధ వ్యాపార రీతులు, పదార్థముల మూల్యమెఱింగి క్రయవిక్రయము లొనర్చుట, ద్వీపాంతరములకు రాకపోకలు జరుపవలయును. లాభముకొఱకు గార్యముల నారంభించుట, పశుపాలన మొనర్చుట, దక్షతతో వ్యవసాయము నున్నతము చేయుట, చేయించుట, ధనమును వృద్ధిచేసి విద్యాధర్మముల యున్నతికై వ్యయము చేయవలయును. సత్యవాది, నిష్కపటియునై సత్యముతో సర్వ వ్యవహారములను – వ్యాపారములను జేయుచు, నేవస్తువు నాశమునొంద కుండునట్లు సర్వ పదార్థ ములను రక్షింపవలయును.

శూద్రుడు సేవలందు జతురుడు, పాకవిద్యలో నిపుణుడునై మిక్కిలి ప్రేమతో ద్విజులసేవ చేయవలయును. వారినుండి తన జీవికను బొందవలయును. శూద్రులయన్నపానములకు వస్త్రములకు, స్థానమునకు, వివాహాదులకు నగువ్యయ మంతయు ద్విజులు భరింపవలయును. లేదా మాసమున కింతయని వారికి ధనమొసంగవలయును.

నాలుగు వర్ణములవారు బరస్పర ప్రేమతో నుపకారము, సజ్జనత్వ సుఖదుఃఖములు హాని లాభములు ననువానియందు నైకమత్యముతో నుండి రాజునకు బ్రజలకు సంబంధించిన యున్నతియందు దనుమనో ధనముల నర్పించి పనిచేయవలయును.

స్త్రీ పురుషులు చిరకాలము పరస్పరము దూరముగా నుండరాదు. ఏలయన

**(౮౦) పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనమ్,**

**స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీ సందూషణాని షట్. మను ౯—౧౩**

మద్యము, భంగు మున్నగు మాదకద్రవ్యములను ద్రావుట, దుష్ట పురుషుల సాంగత్యము, పతి వియోగము, పాషండులను దర్శించు నెపముతో నొంటరిగా నిటునటు దిరుగుట, యితరుల గృహమున శయనించుట, నివసించుట, యను నీ యాఱును స్త్రీని దూషితను జేయుదుర్గుణములు. పురుషులకును నివి దుర్గుణములే. వారును వీని వలన దూషితులగుదురు.

పతిపత్నుల వియోగము రెండు విధములగును. మొదటిదిః– కార్యాంతరములను సాధించుటకు దేశాంతరమునకు వెళ్ళినందున గలుగును. రెండవదిః– మృత్యువు వలన గలుగును. విదేశములకు యాత్రార్థము వెళ్ళునపుడు పురుషుడు స్త్రీని వెంటదీసికొనిపోయిన మొదటి వియోగము గలుగదు. స్త్రీ పురుషులధిక సమయము వియుక్తులై యుండరాదు.

(బహువివాహములు)

ప్రశ్నః– స్త్రీ పురుషులు బహువివాహములు చేసికొనుట యోగ్యమా? కాదా?

ఉత్తరముః– ఒకే సమయమున బహువివాహములు చేసికొనుట యుచితముకాదు.

ప్రశ్నః– సమయాంతరమున బహువివాహములు జరుగవచ్చునా?

ఉత్తరముః– అవును. జరుగవచ్చును. ఎట్లనః–

(౭౧) యా స్త్రీ అక్షత యోనిః స్యాత్ గతప్రత్యాగతాపి వా,
పౌనర్భవేన భర్త్రా సా పునః సంస్కారమర్హతి. మ ౯-౧౭౬

స్త్రీ పురుషులకు పాణిగ్రహణ సంస్కారమాత్రము జరిగి, భార్యాభర్తలలో సంయోగము జరుగని పక్షమున - అనగా స్త్రీ యక్షతయోనిగాను, పురుష డక్షత వీర్యుడుగాను నుండిపోయిన నట్టి స్త్రీ పురుషులకు పునర్వివాహము జరుగవలయును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణములందు నక్షతయోని స్త్రీకి, నక్షత వీర్య పురుషునకు పునర్వివాహము జరుగవలయును.

ప్రశ్నః- పునర్వివాహమున దోషమేమి?

ఉత్తరముః- మొదటిది - వివాహిత స్త్రీ పురుషులలో ప్రేమ తగ్గిపోవును. కారణమేమన నిష్టము వచ్చినపుడు స్త్రీ పురుషుని, పురుషుడు స్త్రీని వదలి మఱియొకరితో సంబంధమేర్పఱచుకొందురు.

రెండవది - స్త్రీ పురుషులలో స్త్రీ లేక పురుషుడు మరణించిన మీదట రెండవ వివాహము చేసికొనగోరునెడల ప్రథమ స్త్రీయొక్క పూర్వపతికి సంబంధించినవారు వాని పదార్థములను గొంపోవుదురు. మఱియు వారి కుటుంబము వారికి వారితో గలహము గలుగును.

మూడవది - చాల భద్రకులముల నామములు చిహ్నములు కూడ నుండవు. ఆ కులపు పదార్థములును ఛిన్నభిన్నములగును.

నాలుగవది - పతివ్రతము స్త్రీవ్రతము ననుధర్మము నశించును. ఇట్టి దోషముల వలన ద్విజులలో పునర్వివాహముకాని, యనేక వివాహములు గాని యెన్నడు జరుగరాదు.

ప్రశ్నః- వంశచ్ఛేదనమైనపుడును నతనికులము నష్టమగును. మఱియు స్త్రీ పురుషులు వ్యభిచారాది (దుష్ట) కర్మములొనర్చి గర్భపాతనాది దుష్టకర్మములు చేయుదురు. కావున పునర్వివాహము జరుగుటయే మంచిదికాదా?

ఉత్తరముః- కాదు; కాదు; కారణమేమన స్త్రీ పురుషులు బ్రహ్మచర్యమున స్థిరులైయున్న నెట్టి యుపద్రవము జరుగదు. ఇక వంశపరంపరను సాగించుటకు స్వజాతికి జెందిన పిల్లవానిని దత్తు చేసికొనిన వంశపరంపర నడవవచ్చును. వ్యభిచారము జరుగదు. బ్రహ్మచర్యము పాలింపజాలనివారు నియోగముతో సంతానోత్పత్తి చేసికొనవచ్చును.

ప్రశ్నః- పునర్వివాహమునకును, నియోగమునకును భేదమేమి?

ఉత్తరముః- మొదటిది - వివాహము చేసికొనిన కన్య పితృగృహము వదలి పతి గృహమున జేరును. తదుపరి తండ్రితో విశేష సంబంధ ముండదు. విధవాస్త్రీ వివాహిత పతిగృహముననే యుండును.

రెండవది - ఆ వివాహిత స్త్రీయొక్క సంతాన మావివాహిత పతికి దాయభాగి యగును. విధవా స్త్రీకి గలిగిన సంతానము - బాలురు వీర్యదాతకు పుత్రులనబడరు. అతని గోత్రముండదు. మఱియు నతని సొత్తునకు నాపిల్ల లధికారులు కారు. వారు చనిపోయిన పతికి పుత్రులగుదురు. అతని గోత్రమే యుండును. అతని పదార్థములకే దాయభాగులై యతని యింటియందే యుందురు.

మూడవది - వివాహిత స్త్రీపురుష లొకరికొకరు సేవ, పాలనము చేయుట తప్పనిసరి యగును. నియుక్త స్త్రీ పురుషులకు నేమియు సంబంధముండదు.

నాలుగవది - వివాహిత స్త్రీపురుషుల సంబంధము మరణపర్యంత ముండును. నియుక్త స్త్రీపురుషుల సంబంధము కార్యమునకు దరువాత విడిపోవును.

ఐదవది - వివాహిత స్త్రీ పురుషులు గృహకార్యములను నిర్వహించుటలో పరస్పరము తోడుగా యత్నము చేయుదురు. నియుక్త స్త్రీ పురుషులు తమతమ యింటి కార్యములను నెవరికి వారు చేసికొందురు.

ప్రశ్నః- వివాహ, నియోగ నియమములు సమానములా? భిన్నములా?

ఉత్తరముః- కొంత భేదమున్నది. ఇంతకు బూర్వము చెప్పినవి కాక విశేషములివిః-

వివాహిత స్త్రీపురుషులు (ఒకపతి-ఒకస్త్రీ) కలిసి పదిమంది సంతానమును గనవచ్చును. నియుక్త స్త్రీ పురుష లిద్దఱు లేక నలుగురికంటె నధిక సంతానోత్పత్తి చేయరాదు. ప్రథమమున గుమారీకుమారులకు వివాహము జరిగి స్త్రీగాని పురుషుడుగాని మరణమునొందిన వారిరువురకు (విధవా-విధురులకు) నియోగమగును. కుమారీ కుమారులకు నియోగము కాదు. (కుమారీ-విధురులకు కాని, విధవా కుమారులకు గాని నియోగము జరుగరాదని భావము) వివాహిత స్త్రీపురుష లెల్లపుడు గలిసియుందురు. నియుక్త స్త్రీపురుష లట్లు వ్యవహరింపరాదు. ఋతుదాన సమయము విడిచి వారొకచో నుండరాదు. స్త్రీ తన కొఱకు నియోగము చేసిన రెండవ గర్భమేర్పడిన దినమునుండి స్త్రీపురుష సంబంధము విడిపోవును. పురుషుడు తన కొఱకు నియోగము చేసినను రెండవగర్భ మేర్పడిన నాటినుండి సంబంధము విడిపోవును. కాని యా నియుక్త స్త్రీ రెండు మూడు సంవత్సరముల వఱకు నా బాలురను (సంతానమును) బాలనచేసి నియుక్త పురుషున కప్పగింపవలయును. ఇట్టు లొకవిధవాస్త్రీ తనకొఱకు నిద్దఱిని, నొక్కొక్కరికి నిద్దఱు చొప్పున నలుగు రన్యనియుక్త పురుషుల కొఱకు, సంతానమును గనవచ్చును. ఒక విధురుడుకూడ నిద్దఱిని తనకొఱకు, నొక్కొక్కరికి నిద్దఱు చొప్పున నలుగు రన్యవిధవలకొఱకు బుత్రుల (సంతానము)నుత్పత్తిచేయవచ్చును. ఇట్లే కలిసి దశసంతానోత్పత్తికి వేదమున నాజ్ఞయున్నది.

(౮౨) ఇమాం త్వమింద్రమీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు,
దశాస్యాం పుత్రా నాధేహి పతిమేకాదశం కృధి. (ఋ.మం.౧౦.సూ.౮౫. మం.౪౫)

హేమీఢ్వఇంద్ర = వీర్యసేచనమున సమర్థుడవు నైశ్వర్యయుక్తుడవు నగునోపురుష! నీవీ వివాహిత స్త్రీని లేక యీ విధవాస్త్రీలను శ్రేష్ఠపుత్రవతులు, సౌభాగ్యవతులు నగునట్లు చేయుము. ఈ వివాహిత స్త్రీయందు దశపుత్రుల నుత్పన్నము చేయుము. పదునొకండవదిగా స్త్రీని నంగీకరించుము. ఓస్త్రీ! నీవు కూడ వివాహిత పురుషునివలన లేక నియుక్త పురుషులవలన దశసంతానము నుత్పన్నము చేయుము. పతిని పదునొకండవ వానినిగా దెలిసికొనుము. ఈ వేదాజ్ఞవలన బ్రాహ్మణ క్షత్రియ వర్ణస్థులైన స్త్రీ పురుషులు దశదశ సంతానములకంటె నధికసంతానము నుత్పన్నము చేయరాదు. ఏలయన నధిక సంతానము నుత్పన్నమొనర్చుటవలన సంతానము నిర్బలము, నిర్బుద్ధి, యల్పాయువు కలవారగుదురు. స్త్రీ పురుషులు కూడ నిర్బలులు, నల్పాయుష్కులు, రోగులునై వృద్ధావస్థయందు బహుదుఃఖముల పాలగుదురు.

ప్రశ్నః- ఈ నియోగ విషయము వ్యభిచారమువలె గనబడుచున్నది.

ఉత్తరముః- వివాహితులు కానివారి సమాగమము వ్యభిచారమైనట్లు, నియుక్తులు కానివారి కలయిక వ్యభిచార మనబడును. నియమముతో వివాహము జరిగిన వ్యభిచార మనబడదు. ఒకని కన్యకు మఱి యొకని కుమారునితో శాస్త్రోక్త విధిపూర్వకముగ వివాహము జరిగిన మీదట వారి సమాగమమునందు వ్యభిచారముకాని పాపముకాని సిగ్గుకాని కలుగనట్లు, వేదశాస్త్రోక్తనియోగమునందు వ్యభిచారము-పాపము గాని, లజ్జగాని యంగీకరింపరాదు.

ప్రశ్నః- బాగుగానే యున్నది; కాని యిది వేశ్యాసదృశ కర్మముగా గనబడుచున్నది.

ఉత్తరముః- కాదు. ఏలయన వేశ్యాసమాగమమున గొండొక నిశ్చితపురుషునకు సంబంధించి నియమమేమియు లేదు. నియోగమునందు వివాహమునకు సమానముగ నియమము లున్నవి. మఱి యొకనికి గన్య నిచ్చుటలోగాని వివాహపూర్వకముగ మఱియొకనితో సమాగమము జరుపుటలోగాని లజ్జ

యుండనట్లు నియోగమునందు లజ్జ యుండరాదు. వ్యభిచారులగు స్త్రీ పురుషులు వివాహము జరిగిన మీదటను గుకర్మములనుండి తప్పుకొందురా?

ప్రశ్నః- మాకు నియోగ విషయమున బాపము బోధపడుచున్నది.

ఉత్తరముః-నియోగ విషయమున బాపము నంగీకరింతువేని వివాహమున బాపమేల యంగీకరింపవు? వాస్తవమున నియోగము నడ్డగించుటలో బాపమున్నది. కారణమేమనగా నీశ్వరుని సృష్టిక్రమమున కనుకూలముగ స్త్రీ పురుషుల స్వాభావిక వ్యవహార మాగజాలదు. వైరాగ్యవంతులు, పూర్ణవిద్వాంసులు, యోగులునైన వారిని విడిచి మిగిలినవారిలో స్వాభావిక వ్యవహారము జరుగుచునే యుండును. గర్భపాతన రూప భ్రూణ హత్యను, విధవాస్త్రీ, మృతస్త్రీకపురుషుల మహాసంతాపమును బాపముగా లెక్కింపవా? ఏలయనగా వారు యువావస్థలో నున్నంతవఱకు వారిమనస్సులలో సంతానోత్పత్తి, విషయవాంఛ కలిగినపుడు రాజవ్యవహారమో, లేక, జాతివ్యవహారమో యాటంకమగుటవలన గుప్తముగా గుకర్మములు చేయకమానరు. ఈ వ్యభిచారము కుకర్మములు జరుగకుండునట్లు చేయుటకు నిదియొక్కటియే శ్రేష్ఠమయిన యుపాయము. జితేంద్రియులుగా నుండగలుగువారు వివాహముకాని నియోగముకాని చేయకుండుట సరియే. కాని యట్లుండజాలనివారు వివాహమునో యాపత్కాలమున నియోగమో తప్పక చేయవలయును. ఇందువలన వ్యభిచారము తక్కువగును. ప్రేమతో నుత్తమ సంతానము కలిగి మనుష్యుల వృద్ధిజరుగుట సంభవము. గర్భహత్య యన్నివిధముల నిలిచిపోవును. నీచపురుషులతో నుత్తమ స్త్రీల సంబంధము, వేశ్యాదినీచస్త్రీలతో నుత్తమపురుషుల వ్యభిచారరూప కుకర్మము నుత్తమ కులమునకు గళంకము వంశోచ్ఛేదము, స్త్రీ పురుషుల సంతాపము, గర్భహత్యాది కుకర్మములు వివాహనియోగముల వలన దొలగిపోవును. కావున నియోగము చేయవలయును.

ప్రశ్నః- నియోగమున నేమేమి జరుగవలయును?

ఉత్తరముః- వివాహము ప్రసిద్ధముగా జరుగునట్లు నియోగము ప్రసిద్ధముగా జరుగవలయును. వివాహమున భద్రపురుషుల యనుమతి వధూవరుల ప్రసన్నత యుండునట్లు నియోగమునను నుండవలయును. స్త్రీపురుషుల నియోగము జరుగునపుడు తన కుటుంబమునగల స్త్రీపురుషుల యెదుట "మేమిరువురము సంతానోత్పత్తికొఱకు నియోగమును బాటింతుము. నియోగ నియమము పూర్తియయిన తదుపరి మేము సంయోగము జేయము. దానికి విపరీతముగా జేయుదుమేని పాపుల మగుదుము. జాతి లేక రాజదండనమునకు బాత్రులమగుదుము. మాసమున కొకసారి గర్భాధాన కార్యము చేయుదుము. గర్భము నిలిచిన మీదట నొక సంవత్సరము వఱకు విడిగానుందుము" అని ప్రకటనము చేయవలయును.

ప్రశ్నః- నియోగము తమవర్ణములో జరుగవలయునా? లేక యన్యవర్ణములలోగూడ జరుగవచ్చునా?

ఉత్తరముః- తన వర్ణమునందును, దనకంటె నుత్తమ వర్ణస్థ పురుషునితోను జరుగవచ్చును. వైశ్యస్త్రీ వైశ్య క్షత్రియ బ్రాహ్మణులతోను, క్షత్రియ స్త్రీ, క్షత్రియ బ్రాహ్మణులతోను, బ్రాహ్మణి బ్రాహ్మణుని తోను నియోగము చేయవచ్చును. వీర్యము సమవర్ణమునకుగాని, యుత్తమ వర్ణమునకుగాని చెందినదిగాను నుండవలయునని తాత్పర్యము. తనకంటె నీచవర్ణమునకు సంబంధించినది కారాదని భావము. ధర్మముతో ననగా వేదోక్తరీతితో వివాహమువలనగాని, నియోగమువలన గాని సంతానోత్పత్తి చేయుటయే స్త్రీ పురుష సృష్టియొక్క ప్రయోజనము.

ప్రశ్నః-పురుషునకు నియోగము చేయవలసిన యావశ్యకమేమి?

అతడు రెండవ వివాహము చేసికొనవచ్చును గదా!

ఉత్తరము:- ద్విజులలో స్త్రీ పురుషులకు నొకేమాటు వివాహము జరుగవలయుననియు రెండవ మాఱు జరుగరాదనియు వేదాది శాస్త్రములందు వ్రాయబడియున్నదని మేము పూర్వమే వ్రాసియున్నాము. కుమారీ కుమారులకే వివాహము జరుగుట న్యాయమనియు, విధవా స్త్రీతో గుమార పురుషునకును గుమారీ స్త్రీతో మృతస్త్రీకపురుషునకు వివాహమగుట యన్యాయము నధర్మమునై యున్నవి. విధవాస్త్రీతో గుమార పురుషుడు వివాహమాడుట కిష్టపడనట్లు వివాహిత స్త్రీతో సమాగమము చేసియున్న పురుషుని వివాహమాడుటకు గుమారికూడ నంగీకరింపదు. వివాహము చేసికొన్న పురుషుని గన్యగాని, విధవాస్త్రీని గుమారుడుగాని గ్రహింప నంగీకరింపనప్పుడే స్త్రీ పురుషులకు నియోగము చేయునావశ్యకత యేర్పడును. ఎట్టివారి కట్టివారితో సంబంధము కలుగుటయే ధర్మము.

ప్రశ్న:- వివాహమున వేదాది శాస్త్రములు ప్రమాణమున్నట్లు నియోగమున బ్రమాణమున్నదా లేదా?

ఉత్తరము:- ఈ విషయమున ననేక ప్రమాణము లున్నవి.

**కుహ స్విద్దోషా కుహ వస్తోరశ్వినా కుహాభిపిత్వం కరతః కుహోషతుః,**
**కో వాం శయుత్రా విధవేవ దేవరం మర్యం న యోషా కృణుతే సధస్థ ఆ ॥౧॥**

**ఋ.మం.౧౦ సూ ౪౦-మం.౨**

**ఉదీర్ష్వ నార్యభి జీవలోకం గతాసుమేతముప శేష ఏహి,**
**హస్తగ్రాభస్య దిధిషోస్తవేదం పత్యుర్జనిత్వమభి సం బభూథ (౨) (ఋ.మం.౧౦ సూ.౧౮.మం ౮)**

హే అశ్వినా = ఓ స్త్రీ పురుషులార! ఎట్లు, దేవరం విధవేవ = విధవ, దేవరుని, యోషామర్యంన = వివాహితస్త్రీ తనపతిని, సధస్థే = సమానస్థాన శయ్యయందు నొకచో గలిసి సంతానమును, ఆకృణుతే = సర్వవిధముల నుత్పన్నముచేయునో యట్లే మీరిరువురు స్త్రీ పురుషులు, కుహస్విద్దోషా = రాత్రియందెక్కడ మఱియు, కుహవస్తః = దినమందెక్కడ వసించితిరి? కుహాభిపిత్వమ్ కరతః = ఎక్కడ పదార్థములను బొందితిరి? కుహోషతుః = ఏసమయమున నెక్కడ వసించితిరి? కోవాంశయుత్రా = మీ శయనస్థానమెక్కడనున్నది? అట్లే మీరెవ రేదేశమున నుండువారు? దీనివలన దేశవిదేశములందు స్త్రీపురుషులు కలిసియే యుండిరనియు వివాహితపతివలె నియుక్తపతిని గ్రహించి విధవాస్త్రీకూడ సంతానోత్పత్తి చేయవచ్చుననియు సిద్ధమయినది.

ప్రశ్న:- ఒకనికి దమ్ముడు లేకున్న విధవ యెవనితో నియోగము చేయవలయును? (దేవరుడనగా భర్తతమ్ముడు)

ఉత్తరము:- దేవరునితో జేయవలయును. కాని దేవరశబ్దమునకు మీరేయర్థమును దెలిసికొనుచున్నారో యది కాదు. నిరుక్తమున నేమున్నదో చూడుడు.

**దేవరః కస్మాద్ ద్వితీయో వర ఉచ్యతే (నిరుక్త.అ.౩.ఖం.౧౫)**

విధవకు రెండవపతి యైనవాడు దేవరు డనబడును. (పతికి) తమ్ముడు కాని, యన్నకాని, తన వర్ణస్థుడుకాని, తనవర్ణముకంటె నుత్తమవర్ణస్థుడుకాని, వీరిలో నెవరితో నియోగము జరుగునో యతడు దేవరుడగును.

హేనారి = ఓ విధవా! నీవు, ఏతం గతాసుం = ఈ మరణించిన పతియాశను వదలి, శేషే = ఇతర పురుషుల నుండి, అభిజీవలోకమ్ = బ్రతికియున్న రెండవపతిని, ఉపైహి = పొందుము. మఱియు ఉదీర్ష్వ = ఈవిషయమును నాలోచించి నిశ్చయించుము, హస్తగ్రాభస్యదిధిషోః = విధవవగు నిన్ను మరల పాణిగ్రహణము చేయు నేనియుక్తపతితో నియోగము కలుగునో, ఇదంజనిత్వమ్ = అతనివలన గలిగిన

యీ సంతానము ( ఆ నియుక్త) పత్యుః = పతిదే యగును. మఱియు నీవు నీకొఱకు నియోగము చేయుదువేని యపుడు కలుగు సంతానము, తవ = నీది యగును. అభిసంబభూథ = ఇట్టి నిశ్చయముతో నీవు, నియుక్త పురుషుడును నీనియమమును బాలింపవలయును. (౨)

అదేవృఘ్న్య పతిఘ్నీ హైధి శివా పశుభ్యః సుయమా సువర్చాః,
ప్రజావతీ వీరసూర్దేవృకామా స్యోనేమమగ్నిం గార్హపత్యం సపర్య (౩)

అథర్వ॥ కాం ౧౪. అను ౨ మం ౧౮.

హేఅపతిఘ్ని అదేవృఘ్ని! = పతికి దేవరునకు దుఃఖము కలిగింపని యోస్త్రీ! నీవు, ఇహ = ఈ గృహాశ్రమమున, పశుభ్యః = పశువులకొఱకు, శివా = కల్యాణము నొనరించుదానవు, సుయమా = బాగుగా ధర్మనియమముల వర్తించుదానవు, సువర్చాః = రూపవతివి, విద్యాయుక్తవు, ప్రజావతీ = ఉత్తములగు పుత్రపౌత్రాదులతో గూడినదానవు, వీరసూః = శూరులు వీరులునైన పుత్రులను గనుదానవు, స్యోనా = పతికి దేవరునకు సుఖము నిచ్చుదానవునై, ఏధి = వర్ధిల్లుము, ఇమమ్ = ఈ, గార్హపత్యమ్ = గృహస్థ సంబంధమైన, అగ్నిమ్ = అగ్నిహోత్రమును, సపర్య = సేవింపుము.

తామనేన విధానేన నిజో విందేత దేవరః । (మను. ౯. ౬౯)

అక్షతయోని స్త్రీ విధవయైన భర్తయొక్క తమ్ముడుకూడ నామెను వివాహమాడవచ్చును.

ప్రశ్నః– ఒక స్త్రీగాని పురుషుడుగాని యెన్ని నియోగములను జేయవచ్చును? వివాహిత నియుక్తపతుల కేనామముండును?

(౮౩) సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః,
తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః. (ఋ.మం.౧౦ సూ ౮౫. మం. ४०)

హేస్త్రీ = ఓ స్త్రీ! యెవడు, తే = నీకు, ప్రథమః = మొదటివాడైన వివాహిత, పతిః = భర్త, నిన్ను, వివిదే = పొందునో, అతనిపేరు, సోమః = సుకుమారతాది గుణయుక్తుడగుటచే, సోముడు, ఎవడు నియోగమువలన, వివిదే = పొందునో యా రెండవ వానికి, గంధర్వః = పూర్వమొక స్త్రీతో సంభోగముచేసి యుండుటవలన గంధర్వుడని నామము. తృతీయః ఉత్తరః = ఇద్దఱితరువాత మూడవపతియగువాడు, అగ్నిః = అత్యుష్ణతాయుక్తుడగుట వలన నగ్నినామకుడగును, తే = నీయొక్క, తురీయః = నాల్గవ వానినుండి పదునొకండవవాని వఱకు నియోగముతో బతులగువారు, మనుష్యజాః = మనుష్యు లనబడుదురు.

ఇమాం త్వమింద్ర – అను నీమంత్రమున పదునొకండవ పురుషుని వఱకు స్త్రీ నియోగము చేయ గలుగునట్లు పురుషుడుకూడ బదునొకండవ స్త్రీ వఱకు నియోగము చేయగలుగునని చెప్పబడినది.

ప్రశ్నః– ఏకాదశ శబ్దమువలన బదిమందిపుత్రులు పదునొకండవవాడు పతియని యెందుకు లెక్కింపరాదు?

ఉత్తరముః– అట్లర్థము చెప్పిన 'విధవేవ దేవరమ్' 'దేవరః కస్మాత్ ద్వితీయో వర ఉచ్యతే' 'అదే వృఘ్ని', 'గంధర్వో వివిద ఉత్తరః' ఇట్టి వేదప్రమాణములవలన విరుద్ధార్థమగును. కారణమేమన నీవు చెప్పిన యర్థమువలన రెండవపతి కూడ బ్రాప్తింపడు. మూడవ నాలుగవ వారిని గూర్చి చెప్పవలసినదేమున్నది?

(నియోగమాపద్ధర్మము)

దేవరాద్ వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్ నియుక్తయా,
ప్రజేప్సి తాధిగన్తవ్యా సంతానస్య పరిక్షయే (౧)

**జ్యేష్ఠో యవీయసో భార్యాం యవీయాన్ వాగ్రజస్త్రియమ్,**
**పతితౌ భవతో గత్వా నియుక్తావప్యనాపది. (౨)**
**ఔరసః క్షేత్రజశ్చైవ. (౩) మను. ౯—౫౭, ౫౮, ౧౬౭**
ఇవి యన్నియు మనువు వ్రాసినాడు.

'సపిండ' అనగా భర్తయొక్క వంశమున నాఱుతరములలో భర్తకు దమ్ముడో, యన్నయో యగు వానితోగాని, స్వవర్ణస్థుడో, యుత్తమవర్ణస్థుడో యైన పురుషునితోగాని విధవాస్త్రీ నియోగము జరుగవలయును. కాని మృతస్త్రీకపురుషుడు (విధురుడు) విధవయైన స్త్రీయు సంతానోత్పత్తిని గోరినచో నియోగము జరుగుట యుచితము. లేక సంతానక్షయము సర్వథా జరిగిన నియోగము జరుగవలయును. (౧)

ఆపత్‌కాలమున – సంతానము కావలయుననుకోరిక లేనపుడును, నన్నభార్యతో దమ్మునకు దమ్ముని భార్యతో నన్నకు నియోగము మూలమున సంతానము కలిగిన పిమ్మటను నియుక్తులై వారిరువురు సమాగమము చేసిన బతితులగుదురు. కారణమేమన నొక నియోగమున రెండవగర్భ మేర్పడు నంతవఱకే నియోగమున కవధి నిర్ణయింపబడినది. కావున నవధి దాటి సమాగమము చేయరాదు. (౨)

(ఇట 'అనాపది' శబ్దాభిప్రాయము – సంతానమున్నపుడు సోదరు లొండొరుల భార్యలతో నియోగము చేయుట తగదు. చేసిన బతితు లగుదురని భావము. సంతానము సర్వథా కలుగని యాపత్సమయమున నియోగము చేయవచ్చును. కాని యప్పుడును స్త్రీకి సంతానేచ్ఛ లేనపుడు నియోగము తగదని వివేకము.)

ఇరువురి కొఱకును నియోగము జరిగినయెడల నాలుగవ గర్భము వఱకు నవధి యుండును. అనగా బూర్వోక్తరీతి ననుసరించి పది సంతానము కలుగువఱకు నియోగము జరుగవచ్చును. అటుపై విషయాసక్తి యగును. అందువలన బతితు లగుదురు. వివాహస్త్రీ పురుషులుకూడ బదిమంది సంతానము గలిగిన మీదట సమాగమము చేసిన గాముకులు నిందితులు నగుదురు. ఏలయనగా వివాహముకాని నియోగముకాని సంతానముకొఱకే కాని పశువులవలె గామక్రీడకు గాదు.

ప్రశ్న:- నియోగము (స్త్రీపురుషులలో) నొకరిమరణమునకు దరువాతనే జరుగునా? లేక భర్త బ్రతికి యుండగా గూడ జరుగవచ్చునా?

ఉత్తరము:- జీవించియుండగాను జరుగును.

**అన్యమిచ్ఛస్వ సుభగే పతిం మత్ (ఋ. ౧౦—౧౦—౧౦)**

భర్త సంతానము నుత్పన్నము చేయుటలో నసమర్థుడైనపు డతడు తనభార్య నాజ్ఞాపింపవలయును. ఇందులకు బ్రమాణము: హేసుభగే! = ఓ సౌభాగ్యవతీ! నీవు, మత్ = నాకంటె, అన్యం = ఇతరుని బతిగా, ఇచ్ఛస్వ = వరించుము. ఏలయనగా నిప్పుడు నావలన సంతానోత్పత్తి నాసింపకు. (నాలో నట్టిసామర్థ్యము లేదు) అని తన స్త్రీని మఱియొకనితో నియోగము చేసి సంతానము కనుము అని యాదేశింపవలయును. కాని యా స్త్రీ తన వివాహ పతికి సేవజేయుట మానరాదు. అట్లే స్త్రీ కూడ రోగగ్రస్తయై రోగనిమిత్తక దోషములవలన సంతానోత్పత్తికి నసమర్థయైనపుడు తాను, దన పతినిట్లాజ్ఞాపింపవలయును. "స్వామీ" మీరు నానుండి సంతానోత్పత్తి కలుగునని కోరిక వదలి మఱియొక విధవాస్త్రీతో నియోగము వలన సంతానమును బొందుడు.

ఇందుకు నైతిహాసిక ప్రమాణము లున్నవి. పాండురాజు – భార్యలు కుంతి, మాద్రియను వారిట్లే పతియాజ్ఞతో సంతానము బడసిరి. చిత్రాంగద విచిత్రవీర్యులు మరణించిన తదుపరి వారి భార్యలైన అంబిక అంబాలిక యనువారితో వ్యాసుడు నియోగము జరిపి యంబికయందు ధృతరాష్ట్రుని, నంబాలిక

యందు పాండురాజును గలిగించి యున్నాడు. అట్లే దాసితో నియోగముచేసి విదురు నుత్పత్తికి గారణమైనాడు.

ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యోఽష్టౌ నరః సమాః,
విద్యార్థం షడ్ యశోఽర్థం వా కామార్థం త్రీంస్తు వత్సరాన్ (౧)
వంధ్యాఽష్టమేఽధి వేద్యాబ్దే దశమే తు మృత ప్రజా,
ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ. (౨) (మను. ౯-౭౬-౮౧)

వివాహితపతి ధర్మకార్యార్థము పరదేశము వెళ్ళినపు డెనిమిదేండ్లు, విద్యాకీర్తుల కొఱకు వెళ్లిన నాఱేండ్లు, ధనాదుల కొఱకు వెళ్లిన మూడేండ్లు స్త్రీ ప్రతీక్షించి యప్పటికి రాకున్న నియోగముతో సంతానోత్పత్తి చేసికొనవలయును. వివాహితపతి వచ్చినపుడు నియుక్తపతిని వదలవలయును. (౧)

అట్లే పురుషునకును నియమమున్నది. స్త్రీ వంధ్యయైన (వివాహమైన యెనిమిదేండ్ల వఱకు స్త్రీ గర్భవతి కానపుడు) ఎనిమిదవయేటను, స్త్రీకి సంతానము కలిగి యెల్లరు మరణించిన బదియవయేటను, సంతానము కలిగి ప్రతిసంతానము నాడుబిడ్డయేయై మగసంతానము కలుగని పక్షమునను బదునొకండవ సంవత్సరమువఱకును, స్త్రీ పరుషము లాడునదైన వెంటనే యామెను వదలి మఱియొకస్త్రీతో నియోగము చేసి సంతానము కనవలయును.

అట్లే పురుషు డత్యంత దుఃఖదాయకుడైనచో స్త్రీ యతనిని విడిచి యితర పురుషునితో నియోగ మొనర్చి సంతానముగని తనసంతానమును వివాహపతికి దాయభాగిగా జేయవలయును.

ఇట్టి ప్రమాణములతో, యుక్తులతోను స్వయంవర వివాహము చేసికొనియో లేక నియోగము మూలముననో తమతమ కులముల నున్నతొపఱచుకొనవలయును. ఔరసపుత్రులు - వివాహిత పతివలన గలిగిన పుత్రులు తండ్రి పదార్థములకు స్వాములగుదురు. అట్లే క్షేత్రజులు - నియోగజనిత పుత్రులు కూడ మృతపితకు దాయభాగు లగుదురు.

(రజోవీర్యము లమూల్యములు)

స్త్రీపురుషులు రజోవీర్యము లనునవి యమూల్యములను విషయము నెల్లపుడు ధ్యానమున నుంచుకొనవలయును. ఎవరేని యీ యమూల్య పదార్థమును బురుషుడు పరస్త్రీగమనము, వేశ్యాసంగమమును చేసియు వ్యర్థము చేయుదురేని వారు మహామూర్ఖులు. ఏలయనగా కృషీవలుడు కాని, తోటమాలిగాని మూర్ఖుడైనను గ్రమముగా దన పొలమునందు, వాటికయందు విత్తనములను నాటునుగాని యితర స్థలముల వానిని వ్యర్థము చేయడు. మూర్ఖులయ్యు సాధారణములైన విత్తనములనే వ్యర్థము చేయనపుడు, సర్వోత్తమ మగు మానవశరీరరూప వృక్షబీజమును గుక్షేత్రమున విత్తి వ్యర్థము చేయువాడు మహామూర్ఖుడగును. కారణ మేమన నాబీజఫల మతనికి లభింపదుకదా.

ఆత్మా వై జాయతే పుత్రః, ఇది బ్రాహ్మణ గ్రంథ వచనము. శత-౪-౯,-౪-౨౬
అంగాదంగాత్ సంభవసి హృదయాదధిజాయసే,
ఆత్మాసి పుత్ర మా మృథా స జీవ శరదః శతమ్. (సామవేద బ్రాహ్మణ వచనము-౧.౫.౧౭)

ఓ పుత్ర! నీవు అంగాంగముల నుండి యేర్పడు వీర్యమునుండియు, హృదయమునుండియు నుత్పన్నమగుచున్నావు. కావున నీవు నాయాత్మవు. నాకంటె ముందు జావకుండ నూఱేండ్లు బ్రతుకుము.

ఏ వీర్యమువలన మహాత్ములయు, మహాశయులయు శరీరము లుత్పన్నములగునో యట్టి వీర్యమును వేశ్యాది దుష్టక్షేత్రములందు వ్యర్థము చేయుట, దుష్టబీజమును సత్ క్షేత్రములందు విత్తుట మహా పాపకార్యమగును.

(వివాహావశ్యకత)

ప్రశ్నః- వివాహ మెందుకు జేసికొనవలయును? వివాహమువలన స్త్రీపురుషులు బంధమునకు లోనై సంకుచితులై దుఃఖముల ననుభవింప వలసినవారగుదురు. ప్రేమ యున్నంతవఱకు స్త్రీ పురుషులు కలిసియుండి, యది లేనపుడు విడిపోయిన నేమి?

ఉత్తరముః- ఇది పశుపక్ష్యాదుల వ్యవహారమగును. కాని మనుష్యుల వ్యవహారము కాదు. మనుష్యులలో వివాహనియమము లేకున్న గృహస్థాశ్రమమునకు సంబంధించిన యుత్తమవ్యవహారములన్నియు నష్టభ్రష్టములగును. ఒకరు మఱియొకరికి సేవజేయరు. వ్యభిచార మెక్కుడై యెల్లరు నిర్బలులు నల్పాయుష్కులునై శీఘ్రముగా మరణింతురు. ఒకరు మఱియొకరికి భయపడరు. లజ్జ యనునదియు నుండదు. వృద్ధావస్థయందు సేవజేయువారుండరు. ఎవడు నేపదార్థములకు స్వామిగాడు. దాయభాగియు గాజాలడు. ఎవనికిని నేపదార్థముపైనను దీర్ఘకాలమువఱకు స్వత్వము-స్వామిత్వము నేదియు నుండదు. ఇట్టి దోషములను దూరమొనర్చుటకు వివాహమెంతయు నావశ్యక మగుచున్నది.

ప్రశ్నః- ఒక వివాహ ముండినపు డొకపురుషున కొకస్త్రీ, యొక స్త్రీకి నొకపురుషుడు నను నియమ మేర్పడును. అప్పుడు స్త్రీ గర్భవతియో లేక దీర్ఘరుగ్ణయో యగు ననుకొనుడు – లేక పురుషుడు దీర్ఘరోగి యగును. ఇద్దఱు యువావస్థలో నున్నపుడు వారు సంయమము కాపాడజాలనినా డేమిచేయవలయును?

ఉత్తరముః- దీనికి సమాధానము నియోగ సమయమున జెప్పియే యున్నాము. స్త్రీ గర్భవతియై పురుషుడొక్కవర్షకాలము బ్రహ్మచర్యములో నుండవలసి వచ్చినపుడు, పురుషుడు దీర్ఘరోగియైనపుడు స్త్రీ బ్రహ్మచర్యము నిర్వహింపజాలని పక్షమున నెవరితోనైన నియోగము చేసి సంతానము కనవచ్చును. అంతేకాని వేశ్యాగమనముగాని వ్యభిచారముగాని చేయరాదు.

(గృహస్థుల యితరకర్తవ్యములు)

వీలైనంతవఱకు, జేతనైనంతవఱకు దనకు నప్రాప్త వస్తువు నభిలషించుట, లబ్ధవస్తువును రక్షించుట, రక్షితవస్తువును వృద్ధిచేయుట, వృద్ధిపఱచిన ధనమును దేశోపకార కార్యములందు వ్యయింపవలయును. పూర్వోక్తరీతి దనతన వర్ణాశ్రమములకు సంబంధించిన వ్యవహారములను మిక్కిలి యుత్సాహముతో నెఱవేర్చుచు బ్రయత్నించి యన్నివిధముల నెల్లప్పుడు పరమార్థము సాధింపవలయును. స్త్రీ తన తల్లిదండ్రులకు,, నత్తమామలకు మిక్కిలి శుశ్రూష చేయవలయును. మిత్రులతో, నిరుగుపొరుగువారితో, రాజు, ప్రజలు, వైద్యుడు, విద్వాంసుడు, సత్పురుషులు నైనవారితో బ్రీతితో వ్యవహరింపవలయును. దుష్టులు నధార్మికులు నగువారి నుపేక్షింపవలయును. ద్రోహము వదలి వారిని సంస్కరింప యత్నింపవలయును. చేతనైనంతవఱకు బ్రేమతో దమ సంతానములను విద్వాంసు లను సుశిక్షితులను జేయుటకు ధనాదిపదార్థములను వెచ్చించి పూర్ణ విద్యాయుక్తులను, సుశిక్షాయుక్తు లను జేయవలయును. ధర్మానుష్ఠానమొనర్చి మోక్షమునుగూడ సాధింపవలయును. మోక్షప్రాప్తివలన బరమానందము ననుభవింపవచ్చును.

పతితోఽపి ద్విజః శ్రేష్ఠో న చ శూద్రో జితేంద్రియః,
నిర్దుగ్ధా చాపి గౌః పూజ్యా న చ దుగ్ధవతీ ఖరీ. (౧)
అశ్వాలంభం గవాలంభం సంన్యాసం పలపైత్రికమ్,
దేవరాచ్చ సుతోత్పత్తిం కలౌ పంచ వివర్జయేత్. (౨)
నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ,
పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే. (౩)

ఇవి కపోలకల్పితపారాశరీగ్రంథములోనివి (౪-౩౫)

దుష్టకర్మముల నొనర్చు ద్విజుడు శ్రేష్ఠుడనియు శ్రేష్ఠకర్మములొనర్చు జితేంద్రియుడైన శూద్రుడు నీచుడుగ నంగీకరించిన నింతకంటె నెక్కుడు పక్షపాతమేముండును? ఇంతకంటె నధికమగు నన్యాయము నధర్మము మఱియొక టేదియుండును? పాలనిచ్చినను నీయకున్నను గోవు గోపాలకునకు బాలనీయ మైనట్లు, గాడిద చాకలి, కుమ్మరి మున్నగువారికి బాలనీయము కాదా? ఈదృష్టాంతముకూడ విషమము - సరియైనదికాదు. కారణమేమన - ద్విజుడు, శూద్రుడు నిరువురు మనుష్యులు. ఒకే జాతికి జెందినవారు. గోవు, గాడిద యొకజాతికి జెందినవి కావు. ఏదో యొకవిధముగ గోగర్దభములు పశుజాతికి జెందినవిగా నెంచి దృష్టాంతములో నేకదేశము దార్ష్టాంతమున దొరకినను దీనియాశయ మయుక్తమగుటవలన నీశ్లోకములు విద్వాంసుల కెన్నడు మాననీయములు కావు. (౧)

అశ్వాలంభః = గుఱ్ఱమునుజంపి, గవాలంభః = గోవునుజంపి హోమము చేయుటయే వేదవిరుద్ధమై యుండ - వేదవిహితమే కానపుడు దానిని గలికాలములో నిషేధించుట వేదవిరుద్ధ మేలకాదు? కలియుగమునందే యీ నీచకర్మమునకు నిషేధమంగీకరించినచో ద్వాపరాదియుగములందు విధినంగీకరింప వలసి వచ్చును. అప్పుడు శ్రేష్ఠయుగమని యెంచబడు కృతయుగమున నీదుష్టకార్యమెట్లనుష్ఠేయ మగును? ఇది సర్వథా యసంభవము. వేదాది శాస్త్రములందు సంన్యాసమునకు విధి యుండగా దానినిపుడు నిషేధించుట నిర్మూలము. మాంసనిషేధమున్న నది యెల్లప్పటికి నుండును. దేవరునివలన బుత్రోత్పత్తి వేదమున నుండగా నీశ్లోకకర్త యిట్లేల మొఱుగుచున్నాడు? (౨)

నష్టే = భర్త దేశదేశాంతరములకు బోయినపు డింటనున్న స్త్రీ నియోగము చేసికొనిన, నాసమయముననే వివాహితపతి తిరిగివచ్చినపుడాస్త్రీ యెవరికి స్త్రీ కావలయును? వివాహిత పతికే యగునందు రేని మేమంగీకరింతుము. కాని, యిట్టి వ్యవస్థ పారాశరియందు వ్రాయబడలేదు కదా? స్త్రీకి నాపత్కాలము నందు, దీర్ఘరోగియైనపుడు, కలహించినపుడు నేమికావలయును? ఇట్టి యాపత్కాలము లనేకము లున్నవిగదా! కావున నిట్టిశ్లోకముల నంగీకరింపరాదు. (౩)

(వేదవిరుద్ధవచనము లగ్రాహ్యములు)

ప్రశ్నః- ఏమండి! మీరు పరాశరముని వచనములు గూడ నంగీకరింపరా?

ఉత్తరముః- అది యెవరివచనమైన గానిండు. వేదవిరుద్ధ మగుట వలన నంగీకరింపము. మఱియు నిది పరాశర వచనమును గాదు. ఏలయనగా - బ్రహ్మోవాచ, వశిష్ఠ ఉవాచ. శివఉవాచ. విష్ణురువాచ. దేవ్యువాచ. ఇట్టి వాక్యములన్నియు శ్రేష్ఠుల నామములతో గూడియున్నవి. సర్వమాన్యనామములతో గ్రంథములను వ్రాసిన నెల్లరు నంగీకరింతురు. అందువలన వారి జీవిక పుష్కలముగా జరిగిపోవును. పెద్దలపేర్లతో వ్రాయుటలో నిదియే ప్రయోజనము. అందులకే యనర్థ గాథాయుక్త గ్రంథములను వ్రాయుదురు.కొన్ని ప్రక్షిప్తశ్లోకములు వదలిపెట్టిన మిగిలిన మనుస్మృతి యొక్కటియే వేదానుకూలమైన స్మృతి. మిగిలిన స్మృతులు వేదానుకూలములు కావు. అట్లే యితర - కల్పిత గ్రంథములను గూర్చి తెలిసికొనుడు.

(గృహాశ్రమ శ్రేష్ఠత)

ప్రశ్నః- గృహాశ్రమ మన్నిటికంటె జిన్నదా? పెద్దదా?

ఉత్తరముః- తమతమ కర్తవ్యకర్మములలో నన్నియు గొప్పవియే. కాని,

**యథా నదీనదాః సర్వే సాగరే యాన్తి సంస్థితిమ్,**
**తథైవాశ్రమిణః సర్వే గృహస్థే యాన్తి సంస్థితిమ్. (౧)**
**యథా వాయుం సమాశ్రిత్య వర్తన్తే సర్వజంతవః,**
**తథా గృహస్థమాశ్రిత్య వర్తన్తే సర్వఆశ్రమాః. (౨)**

యస్మాత్ త్రయోప్యాశ్రమిణో దానేనాన్నేన చాన్వహమ్,
గృహస్థేనైవ ధార్యన్తే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ. (౩)
స సంధార్యః ప్రయత్నేన స్వర్గమక్షయమిచ్ఛతా,
సుఖం చేహేచ్ఛతా నిత్యం యోఽధార్యో దుర్బలేంద్రియైః. (౪) (మను. ౬-౯౦,౩.౭౭-౭౯)

నదులు, పెద్దపెద్ద నదములు నన్నియు సముద్రమును జేరనంత వఱకు భ్రమించుచుండును. అట్లే యన్నియాశ్రమముల వారందఱు గృహస్థుని బొందియే స్థిరపడుదురు. (౧)

వాయువు నాశ్రయించుటవలననే సర్వజీవుల యునికి సిద్ధమగునట్లు గృహస్థాశ్రమమువలననే యన్ని యాశ్రమములు స్థిరము లగుచున్నవి. ఈ యాశ్రమము లేనినా డితరాశ్రమముల యేవ్యవహారమును సిద్ధింపదు. (౨)

బ్రహ్మచారులు, వానప్రస్థులు, సంన్యాసులు నను నీ మూడాశ్రమములను నన్నాదుల నొసంగి గృహస్థుడే పోషించుచున్నాడు. కావున గృహస్థాశ్రమము శ్రేష్ఠము. సర్వవ్యవహారములందును ధురంధర మనబడును. (౩)

కావున మోక్ష సాంసారిక సుఖముల నభిలషించువాడు ప్రయత్నముతో గృహాశ్రమమును ధరింప వలయును. దుర్బలేంద్రియులు, భీరువులు, నిర్బలులు నైనపురుషులు గృహాశ్రమమును వహింప నయోగ్యులు. దానిని బాగుగ నిర్వహింపవలయును.

కావున లోకవ్యవహారముల కన్నింటికి గృహాశ్రమమే యాధారము. గృహాశ్రమము లేనినాడు సంతానోత్పత్తి యుండదు. కావున బ్రహ్మచర్య, వానప్రస్థ, సంన్యాసాశ్రమము లెటనుండి యేర్పడును? గృహాశ్రమమును నిందించువాడు నిందనీయుడు. దానిని బ్రశంసించువాడే ప్రశంసనీయుడు. కాని స్త్రీ పురుషు లిరువురు బరస్పరము ప్రసన్నులు, విద్వాంసులు, పురుషార్థపరులు సర్వవ్యవహారజ్ఞాతలు నైనపుడే గృహాశ్రమమున సుఖము కలుగును. కావున గృహాశ్రమ సుఖమునకు ముఖ్యకారణము బ్రహ్మచర్యము పూర్వము చెప్పబడిన స్వయంవర వివాహములనియే దెలియవలయును.

సంక్షేపముగ సమావర్తనము, వివాహము, గృహాశ్రమమునకు సంబంధించిన విషయము లిట నుపదేశింపబడినవి. ముందు వానప్రస్థ సంన్యాస విషయములను గూర్చి వ్రాయబడును.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి విరచితము
సుభాషా విభూషితము నగు
సత్యార్థప్రకాశమున సమావర్తన
వివాహ గృహాశ్రమ విషయమున
చతుర్థ సముల్లాసము సంపూర్ణము.

# పంచమ సముల్లాసము

వానప్రస్థ, సంన్యాసవిధిని జెప్పెదము.

(వానప్రస్థకాలము)

బ్రహ్మచర్యాశ్రమం సమాప్య గృహీ భవేత్,
గృహీ భూత్వా వనీ భవేత్, వనీ భూత్వా ప్రవ్రజేత్. శత-కాం-౧౪

బ్రహ్మచర్యాశ్రమము సమాప్తము చేసి గృహస్థుడై వానప్రస్థుడు, వానప్రస్థుడై సంన్యాసియు కావల యును. ఇది క్రమపూర్వకమైన యాశ్రమ విధానము. దీని ననుసరించుట మనుష్యులకు నుచితము.

ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్ స్నాతకో ద్విజః,
వనే వసేత్తు నియతో యథావద్ విజితేంద్రియః (౧)
గృహస్థస్తు యదా పశ్యేద్ వలీపలితమాత్మనః,
అపత్యస్యైవ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్. (౨)
సంత్యజ్య గ్రామ్యమాహారం సర్వం చైవ పరిచ్ఛదమ్,
పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్ సహైవ వా. (౩)
అగ్నిహోత్రం సమాదాయ గృహ్యం చాగ్నిపరిచ్ఛదమ్,
గ్రామాదరణ్యం నిఃసృత్య నివసేన్నియతేంద్రియః. (౪)
మున్యన్నైర్ వివిధైర్ మేధ్యైః శాకమూలఫలేన వా
ఏతానేవ మహాయజ్ఞాన్ నిర్వపేద్ విధిపూర్వకమ్. (౫) (మను. ౬.౧-౫)

అర్థముః- ఇట్లు స్నాతకుడు - బ్రహ్మచర్యపూర్వకముగ గృహాశ్రమకర్తయైన ద్విజుడు - బ్రాహ్మ ణుడు, క్షత్రియుడు, వైశ్యుడు గృహాశ్రమముననుండి నిశ్చితాత్ముడై యథాయోగ్యముగ నింద్రియములను జయించి వనమున వసింపవలయును. (౧)

గృహస్థుడు తన తలవెంద్రుకలు తెల్లబడి చర్మము ముడుతలుపడి కుమారునకు గుమారుడు కలుగగానే వనమందు వసింపవలయును. (౨)

గ్రామసంబంధమగు సమస్తాహారములను, వస్త్రాదులను, సమస్తోత్తమోత్తమ పదార్థములను వదలి భార్యను బుత్రునియొద్ద బెట్టికాని, వెంటదీసికొని గాని వనమందు వసింపవలయును. (౩)

సాంగోపాంగముగ నగ్నిహోత్రమును దీసికొని గ్రామమును వదలి దృఢేంద్రియుడై యరణ్యము నకు వెళ్ళి యట వసింపవలయును. (౪)

నానావిధములగు చామలు మొదలగు నన్నములు, సుందరశాకములు, మూలములు, ఫలములు, పుష్పములు, కందములు మొదలగు వానితో బూర్వోక్త పంచమహాయజ్ఞములను జేయవలయును. దాని తోనే యతిథిసేవ చేసి తానుగూడ నిర్వాహము చేసికొనవలయును. (౫)

(వానప్రస్థ కర్తవ్యములు)

స్వాధ్యాయే నిత్యయుక్తః స్యాద్ దాంతో మైత్రః సమాహితః,
దాతా నిత్యమనాదాతా సర్వభూతానుకంపకః. (మను. ౬.౮) (౧)
అప్రయత్నః సుఖార్థేషు బ్రహ్మచారీ ధరాశయః,
శరణేష్వమమశ్చైవ వృక్షమూలనికేతనః. (మను. ౬-౨౬) (౨)

స్వాధ్యాయము పఠనపాఠనములలో నిత్యయుక్తుడు, జితాత్ముడు, నెల్లరకు మిత్రుడు, నింద్రియ దమనశీలుడు, విద్యాదులను దానమొనర్చువాడు, నెల్లరిమీద దయకలవాడునై యెవనినుండియు నేపదార్థ మును దీసికొనరాదు. ఇట్లే యెల్లప్పుడు వర్తింపవలయును. (౧)

శరీర సుఖము కొఱకు మిక్కిలి ప్రయత్నము చేయరాదు. బ్రహ్మచారియై యుండవలయును. తనస్త్రీ వెంటనున్నను, నామెతో విషయచేష్టలేమియు జేయరాదు. భూమిపై బరుండవలయును. తన యాశ్రితుల యెడలను స్వకీయ పదార్థములందును మమత నుంచరాదు. వృక్షమూలమున వసింపవలయును. (౨)

తపః శ్రద్ధే యే హ్యుపవసంత్యరణ్యే శాంతా
విద్వాంసో భైక్షచర్యాం చరంతః,
సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి
యత్రాఽమృతః స పురుషో హ్యవ్యయాత్మా. (ముండక. ఖం.౨.మం.౧౧)

శాంతులును, విద్వాంసులు నగువారు వనమందు దపస్సును-ధర్మానుష్ఠానమున, సత్యమందు శ్రద్ధయుగలిగి భిక్షాచరణ మొనర్చుచు నరణ్యమందు వసింతురు. నాశరహితుడును, బూర్ణపురుషుడును, హానిలాభరహితుడునగు పరమాత్మను నిర్మలురై ప్రాణద్వారమున బొంది యానందింతురు.

అభ్యాదధామి సమిధమగ్నే వ్రతపతే త్వయి,
వ్రతం, చ శ్రద్ధాం చోపైమీంధే త్వా దీక్షితోఽఅహమ్. (యజు. అ౨౦మం.౨౪)

నేనగ్నియందు హోమముచేసి దీక్షితుడనై వ్రతమును సత్యాచరణమును, శ్రద్ధను బొందుదునుగాక! ఇట్లు కోరి వానప్రస్థుడై నానావిధ తపశ్చర్య, సత్సంగము, యోగాభ్యాసము, సువిచారములచే జ్ఞానమును బవిత్రతను బొందవలయును. ఇది వానప్రస్థున కుచితము. తరువాత సంన్యాసము గ్రహింపనిచ్చ వొడమినపుడు, తన స్త్రీని బుత్రునియొద్దకు బంపి సంన్యాసమును గ్రహింపవలయును. ఇది సంక్షేపముగ వానప్రస్థవిధి.

(సంన్యాసవిధి)

వనేషు చ విహృత్యైవం తృతీయం భాగమాయుషః,
చతుర్థమాయుషో భాగం త్యక్త్వా సంగాన్ పరివ్రజేత్. (మను ౬–33)

ఈరీతిని వనమం దాయువులో మూడవభాగపర్యంతము ననగా నేబది నుండి డెబ్బదియై దవయేట వఱకు వానప్రస్థుడుగా నుండి యాయుస్సులో నాల్గవ భాగమందు సంగములను వదలి (పరివ్రాట్) సంన్యాసి కావలయును.

ప్రశ్నః– గృహస్థ వానప్రస్థాశ్రమములను బాలింపక సంన్యాసాశ్రమమును స్వీకరించువారికి బాపము కలుగునా? లేదా?

ఉత్తరముః– కలుగును; కలుగదు కూడ.

ప్రశ్నః– ఈ రెండు విధములగు సమాధాన మేల చెప్పుచున్నారు?

ఉత్తరముః– రెండు విధములగు సమాధానము కాదు. ఏలయనగా బాల్యావస్థయందు విరక్తుడై పిమ్మట విషయములందు దగులుకొనువాడు మహాపాపియు, దగులుకొననివాడు మహాపుణ్యాత్ముడు - సత్పురుషుడు నగును.

యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేద్
వనాద్వా గృహాద్వా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్. జాబాలోపనిషత్తు . ఖం ౪

(ఇవి బ్రాహ్మణ గ్రంథవచనములు)

వైరాగ్యము కలిగిన దినమందే (బ్రహ్మచర్యమునుండిగాని) యింటినుండిగాని, వనమునుండిగాని, సంన్యాసము గ్రహింపవలయును. మొదట సంన్యాసక్రమపక్షము (మను ౬-౩౩) చెప్పబడినది. ఇక నిందు వికల్పమనగా వానప్రస్థమును జేయకయే గృహస్థాశ్రమమునుండియే సంన్యాసమును గ్రహించుట. (ఇది రెండవపక్షము) పూర్ణ విద్వాంసుడు, విషయ భోగేచ్ఛవదలిన జితేంద్రియుడు, పరోపకారకాంక్షాయుక్తుడు నైన పురుషుడు బ్రహ్మచర్యాశ్రమమునుండియే సంన్యాసమును దీసికొనుట. (ఇది మూడవ పక్షము) వేదమునందును-యతయః బ్రాహ్మణస్య విజానతః (యజు ౪౦.౭) మున్నగు పదములవలన సంన్యాసమునకు విధానము కలదు. కాని

నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః,
నాశాంతమానసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్. కఠ. వల్లీ. ౨. మం. ౨౪

దురాచారమునుండి వేఱుగా నుండనివాడు, శాంతిరహితుడు, యోగికానివాడు, మనస్సు శాంతము కానివాడు, సంన్యాసము గ్రహించియు బ్రజ్ఞానమువలనను బరమాత్మను బొందజాలడు. కాబట్టిః-

యచ్ఛేద్ వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేద్, జ్ఞాన, ఆత్మని,
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్ తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని. కఠ. వల్లీ ౩. మం.౧౩

బుద్ధిమంతుడగు సంన్యాసి వాక్కును, మనస్సును, నధర్మమునుండి మరలింపవలయును. వానిని జ్ఞానమునందును, నాత్మయందును చేర్పవలయును. ఆ జ్ఞానస్వాత్మలను బరమాత్మయందు జేర్పవలయును. ఆ విజ్ఞానమును శాంతస్వరూపమగు నాత్మయందు స్థిరపఱపవలయును.

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన
తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్. ముండక. ఖం ౨ మం. ౧౨

లౌకిక భోగములన్నియు గర్మములచే సంచితము లయినవని కనుగొని బ్రాహ్మణుడు, సంన్యాసి వైరాగ్యమును బొందవలయును. (అకృత) చేయబడని యా పరమాత్మ (కృత) కేవల కర్మముచే బ్రాప్తము కాదు. కాబట్టి యర్పించుట కెద్దియేని చేతబుచ్చుకొని వేదవిదుడయి పరమేశ్వరుని గుర్తెఱిగిన వారి యొద్దకు విజ్ఞానముకొఱకు బోవలయును. పోయి సమస్త సందేహములను నివృత్తి చేసికొనవలయును. క్రింద జెప్పబోవువారి సాంగత్యము మాత్రము సదా వర్జింపవలయును.

అవిద్యాయామంతరే వర్తమానాః స్వయం ధీరాః పండితమ్మన్యమానాః,
జంఘన్యమానాః పరియంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః. (౧)
అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః,
యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్ తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే. (ముం.౨-౮-౯) (౨)

తా మవిద్యలో గ్రీడించుచు దమకు దామే ధీరులమనియు, బండితులమనియు నెంచు మూఢులు నీచగతిని బొందుదురు. వారు గ్రుడ్డివానిచే నడుపబడిన గ్రుడ్డివారు దుర్దశనువలె దుఃఖమును బొందుదురు. (౧)

అనేక విధముల నవిద్యయందు రమించు బాలబుద్ధులు తమ్ముదాము కృతార్థులమని యెంచుదురు. కేవలము కర్మకాండులగువారు రాగముచే మోహితులై దాని నెఱుగలేరు, ఎఱిగింపజాలరు. వారాతురులై జన్మమరణ రూప దుఃఖముల బడుదురు. (౨) కావున :

**వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్వాః,**
**తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాః పరిముచ్యంతి సర్వే.** ముండ. ౩.ఖ ౨ మం ౬

వేదాంతము - పరమేశ్వర ప్రతిపాదకములగు వేదమంత్రముల యర్థజ్ఞానమందు నాచారమందు బాగుగ నిశ్చయింపబడిన సంన్యాసయోగముచే సంన్యాసులు శుద్ధాంతఃకరణు లగుదురు. వారు పరమేశ్వరుని యందు ముక్తిసుఖమును బొందుదురు. భోగమునకు దరువాత ముక్తియందు సుఖపు టవధి పూర్తికాగానే యక్కడనుండి విడి సంసారమునకు వత్తురు. ముక్తిలేకున్న దుఃఖమునకు వినాశము కలుగజాలదు. ఏల యనగా :-

**న వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతిరస్తి,**
**అశరీరం వావ సంతం న ప్రియా ప్రియే స్పృశతః.** ఛాందో ౮-౧౨-౧

దేహధారి సుఖదుఃఖ ప్రాప్తినుండి వేఱుగా నుండజాలడు. శరీర రహితుడగు జీవాత్మ ముక్తియందు సర్వవ్యాపకుండగు పరమేశ్వరునితో శుద్ధుడై యుండును. అప్పుడు వానికి సాంసారిక సుఖదుఃఖములు కలుగవు. కాబట్టిః-

**లోకైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ పుత్రైషణాయా శ్చోత్థాయాథ భైక్షచర్యం చరంతి.**
శత, కాం, ౧౪-౬-౪-౧

లోకమునందు బ్రతిష్ఠ లేక లాభము, ధనమువలన గలుగు భోగము లేక మానము, పుత్రాదుల మోహము నను వానినుండి వేఱయి సంన్యాసులు భిక్షుకులయి రాత్రిందినము మోక్షసాధనములందు దత్పరులగుదురు.

**ప్రాజాపత్యాం నిరూప్యేష్టిం తస్యాం సర్వవేదసం హుత్వా బ్రాహ్మణః ప్రవ్రజేత్.**
**యజుర్వేదబ్రాహ్మణే ।** న్యాయ. సూ ౪-౧-౬౧-౬౨ (౧)

**ప్రాజాపత్యాం నిరూప్యేష్టిం సర్వవేదసదక్షిణామ్,**
**ఆత్మన్యగ్నీన్ సమారోప్య బ్రాహ్మణః ప్రవ్రజేత్ గృహాత్.** మను ౬.౩౮ (౨)
**యో దత్వా సర్వభూతేభ్యః ప్రవ్రజత్యభయం గృహాత్,**
**తస్య తేజోమయా లోకా భవంతి బ్రహ్మవాదినః.** మను. ౬-౩౯ (౩)

ప్రజాపతి - పరమేశ్వరుని ప్రాప్తికొఱకు, ఇష్టి-యజ్ఞమొనర్చి దానియందు యజ్ఞోపవీతము, శిఖ మున్నగు చిహ్నములను వదలి యాహవనీయాది పంచాగ్నులను, ప్రాణాపానవ్యానోదానసమానములను పంచప్రాణములందు నారోపించి బ్రాహ్మణుడు - బ్రహ్మవిదు డింటినుండి వెడలి సంన్యాసి కావలయును. (౧,౨)

సమస్త భూత - ప్రాణిమాత్రమున కభయదాన మొసంగి యింటినుండి వెడలి సంన్యాసి యగును. ఆ బ్రహ్మవాదికి ననగా, బరమేశ్వర ప్రకాశితమగు వేదోక్త ధర్మాదులను, విద్యల నుపదేశించు సంన్యాసికి, బ్రకాశమయమగు లోకము -మోక్షానంద స్వరూపమగునది ప్రాప్తించును. (౩)

(సంన్యాసి విశేష ధర్మములు)

ప్రశ్నః- సంన్యాసుల ధర్మములేవి?

ఉత్తరముః- పక్షపాతరహితమైన న్యాయాచరణము, సత్యగ్రహణము, నసత్యపరిత్యాగము, వేదోక్తమగు నీశ్వరాజ్ఞాపాలనము, పరోపకారము, సత్యభాషణము మున్నగు లక్షణము లన్నియాశ్రమముల వారికి ననగా మనుష్యమాత్రులకు సమానములే. కాని, సంన్యాసులకు విశేషధర్మము లెవ్వియనగాః-

దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్,
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్. మను ౬.౪౬

సంన్యాసి మార్గమున నడచునపు డిటునటు చూడక క్రింద భూమిమీద దృష్టినుంచి నడవవల యును. ఎల్లపుడు వస్త్రముతో వడపోసిన నీటిని త్రాగవలయును. నిరంతరము సత్యమునే చెప్పవల యును. ఎల్లప్పుడు మనస్సుతో నాలోచించి సత్యమును గ్రహించి, యసత్యమును విడువవలయును.

క్రుధ్యంతం న ప్రతిక్రుధ్యే దాకృష్టః కుశలం వదేత్
సప్తద్వారావకీర్ణాం చ న వాచమనృతాం వదేత్. మను ౬-౪౮

ఉపదేశ సమయమునగాని, సంవాద సమయమునందుగాని యెవడేని కోపించినను, నిందించినను సంన్యాసి యతనిని గోపింపకుండుట యుచితము. మఱియు నెల్లపుడు నతని కల్యాణముకొఱకే యుపదేశింపవలయును. ఒక ముఖమునందు, రెండు నాసికలందును, రెండు కన్నులలోను, రెండు చెవులలోను వ్యాపించియుండు వాణితో నేకారణముచేతను నెన్నడు నబద్ధ మాడరాదు.

అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరామిషః,
ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరే దిహ. మ-౬-౪౯

తన యాత్మయందును బరమాత్మయందును స్థిరుడై యపేక్షలు లేనివాడై, మద్యమాంసాదులను వర్జించి, యాత్మసాహాయ్యముతో సుఖార్థియై యీలోకమున ధర్మమును, విద్యను వృద్ధిబొందించు నిమిత్త ముపదేశించుటకు సంన్యాసి తిరుగుచుండవలయును.

క్లృప్త కేశ నఖ శ్మశ్రుః పాత్రీ దండీ కుసుంభవాన్,
విచరేన్నియతో నిత్యం సర్వభూతాన్యపీడయన్. మ-౬-౫౨

కేశములు, గోళ్లు, గడ్డము, మీసములు గొరిగించుకొనవలయును. పాత్ర, దండము, కుసుమపుష్పపు రంగుతో రంగువేయబడిన వస్త్రములు ధరించి, నిశ్చితాత్ముడై యేభూతములను హింసింపక సంన్యాసి యంతట దిరుగవలయును.

ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేణ చ,
అహింసయా చ భూతానా మమృతత్వాయ కల్పతే. మ ౬-౬౦

ఇంద్రియముల నధర్మాచరణమునుండి యడ్డగించి, రాగద్వేషములు వదలి, ప్రాణులయెడ నిర్వైర ముతో వర్తించి సంన్యాసి మోక్షము కొఱకు సామర్థ్యమును బెంచుకొనవలయును.

దూషితోఽపి చరేద్ధర్మం యత్ర తత్రాశ్రమే రతః,
సమః సర్వేషు భూతేషు న లింగం ధర్మకారణమ్. మ. ౬-౬౬

లోకమున నొకడు తనను దూషించినను భూషించినను సంన్యాసి యేదోయొక యాశ్రమమున వర్తించుచు సర్వప్రాణులయెడ బక్షపాతరహితుడై స్వయముగా ధర్మాత్ముడై, యితరులను ధర్మాచరణ పరులను జేయుచు దిరుగవలయును. దండ కమండలములు, కాషాయ వస్త్రములు మున్నగు చిహ్నములు ధరించుట ధర్మమునకు గారణము కాదని తన మనస్సున నిశ్చయించుకొనవలయును. మనుష్యాది సర్వ ప్రాణు లకు సత్యోపదేశము చేయుచు, విద్యాదానము నొనర్చుచు నున్నతి చేయుటయే సంన్యాసి ముఖ్య ధర్మము.

ఫలం కతకవృక్షస్య యద్యప్యంబుప్రసాదకమ్,
న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి. మను. ౬-౬౭

చిల్లగింజ నఱుగదీసి మురికినీటిలో గలిపిన నీటిని శుద్ధము చేయును. కాని, యట్లుచేయక చిల్ల

గింజ పేరు చెప్పినంతమాత్రమున జలము శుద్ధముకాదు.

ప్రాణాయామా బ్రాహ్మణస్య త్రయోఽపి విధివత్ కృతాః,
వ్యాహృతిప్రణవైర్యుక్తా విజ్ఞేయం పరమం తపః ॥ మ. ౬—౭౦

కావున బ్రాహ్మణుడు – బ్రహ్మవిదుడైన సంన్యాసి, ఓంకారపూర్వక సప్త వ్యాహృతులతో విధిపూర్వకముగ బ్రాణాయామములు చేయవలయును. మూటికి దక్కువెన్నడు జేయరాదు. సంన్యాసి కిదియే పరమ తపస్సు.

దహ్యన్తే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః,
తథేన్ద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్య నిగ్రహాత్. మ—౬—౭౧

అగ్నిలో దపింపజేసినందున ధాతువుల మలములు నష్టమైనట్లు ప్రాణనిగ్రహమువలన మనస్సు మున్నగు నింద్రియముల దోషములు భస్మీభూతములగును.

ప్రాణాయామైర్ దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషమ్,
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్. మను ౬—౭౨

కావున సంన్యాసులు ప్రతిదినము బ్రాణాయామములవలన నంతఃకరణము నింద్రియములనువాని దోషములు, ధారణలవలన బాపములు, ప్రత్యాహారమువలన సంగదోషములు, ధ్యానమువలన ననీశ్వరగుణములు – హర్షశోకాదులు, నవిద్యాది జీవ దోషములు, భస్మము చేసికొనవలయును – నశింప జేసికొనవలయును.

ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయా మకృతాత్మభిః,
ధ్యానయోగేన సంపశ్యద్ గతిమస్యాన్తరాత్మనః. మ ౬—౭౩

అయోగులకు, నవిద్వాంసులకు దుఃఖగమ్యమగు చిన్న పెద్దపదార్థములలో నన్నిటిలోగల పరమాత్మవ్యాప్తిని, సంన్యాసి ధ్యానయోగమువలన దెలిసికొని, తనకాత్మయై నన్నింటిలో నంతర్యామియైన పరమాత్ముని గతిని గుర్తింపవలయును.

అహింసయేంద్రియాసంగైర్ వైదికైశ్చైవ కర్మభిః,
తపసశ్చరణైశ్చోగ్రై స్సాధయంతీహ తత్పదమ్. మ ౬—౭౫

సర్వప్రాణులయెడ నిర్వైరము, నింద్రియ విషయముల త్యాగము, వేదోక్తకర్మములు, నత్యుత్తమతపశ్చరణము నను వానివలన సంన్యాసులు లోకమున మోక్షపదమును సంపాదింపగలరు. ఇతరులచేతను సంపాదింపజేయగలరు. ఇతరులట్లు చేయలేరు.

యదా భావేన భవతి సర్వభావేషు నిఃస్పృహః,
తదా సుఖమవాప్నోతి ప్రేత్య చేహ చ శాశ్వతమ్. మ ౬—౮౦

సంన్యాసి సర్వపదార్థములందు నిఃస్పృహుడై – కాంక్షారహితుడై యాంతరికములు బాహ్యములగు సర్వవ్యవహారములందును భావముతో బవిత్రుడైనపు డీదేహమందును మరణించిన మీదటను నిరంతర సుఖము ననుభవించును.

చతుర్భిరపి చైవైతైర్ నిత్యమాశ్రమిభిర్ ద్విజైః,
దశలక్షణకో ధర్మః సేవితవ్యః ప్రయత్నతః. మ ౬—౯౧

కావున బ్రహ్మచారి గృహస్థుడు వానప్రస్థుడు సంన్యాసి, యెల్లరు బ్రయత్నముతో నిమ్నలిఖిత దశలక్షణక ధర్మమును సేవింపవలయును.

ధృతిః క్షమాదమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః,
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్. మ ౬-౯౨

మొదటి లక్షణముః- ధృతిః - ఎల్లప్పుడు ధైర్యముతో నుండుట, రెండవదిః- క్షమా - నిందాస్తుతులు, మానాపమానములు, హానిలాభములు మున్నగు దుఃఖద్వంద్వములలో సహనశీలుడై యుండుట. మూడవదిః- దమః - మనస్సు నెల్లప్పుడు ధర్మమున బ్రవృత్త మొనర్చి యధర్మము నుండి తొలగించుట. నాల్గవదిః- అస్తేయమ్ - చౌర్యమును విడుచుట. ఆజ్ఞ లేక, ఛలకపటములతో, విశ్వాసఘాతముతో, కొండొకవ్యవహారముతో, వేదవిరుద్ధమగు నుపదేశముతో బరార్థమును గ్రహించుట చౌర్యము, దానిని విడిచిపెట్టుట. ఐదవదిః- శౌచము - రాగద్వేషములు, పక్షపాతము విడిచి లోపలి పవిత్రతను, జలమృత్తికాదుల మార్జనముతో వెలుపలి పవిత్రతను గాపాడుకొనుట, ఆఱవదిః- ఇంద్రియనిగ్రహము - ఇంద్రియములను నధర్మాచరణమువంక బోనీక ధర్మాచరణమునందు వినియోగించుట. ఏడవదిః- ధీః - మాదక ద్రవ్యములను, బుద్ధినాశకములగు నితర పదార్థములను, దుష్టులసాంగత్యమును, నాలస్యప్రమాదాది దోషములను విడిచి, శ్రేష్ఠపదార్థములను సేవించుట, సజ్జనసాంగత్యము చేయుట, యోగాభ్యాసముచే బుద్ధిని బెంచుట. ఎనిమిదవదిః- విద్యా - పృథివి మొదలు పరమేశ్వరుని వఱకుగల పదార్థముల యథార్థజ్ఞానము సంపాదించుట, వానివలన యోగ్యతకు దగినట్లుపయోగము బొందుట, ఇది విద్య. ఇందులకు విపరీత మవిద్య యగును. తొమ్మిదవదిః- సత్యమ్ - ఆత్మయందున్నట్లు మనస్సున, మనస్సుననున్నట్లు వాణియందు, వాణియందున్నట్లు కర్మమందును వర్తించుట, పదార్థమున్నది యున్నట్లుగ తెలిసికొనుట, యట్లే చెప్పుట, యాచరించుట. పదియవ లక్షణముః- అక్రోధము - క్రోధాది దోషములను విడిచి శాంత్యాది గుణములను ధరించుట. ఇవి యన్నియు ధర్మలక్షణములు. ఈ దశలక్షణములుగల పక్షపాతరహిత న్యాయాచరణరూప ధర్మము నెల్లయాశ్రమ వాసులు నాచరింపవలయును. ఈ వేదోక్త ధర్మమునే తానాచరించుచు నితరులకు బోధించి, వారిచే నాచరింపజేయుట సంన్యాసికి ముఖ్య ధర్మము.

అనేన విధినా సర్వాంస్త్యక్త్వా సంగాన్ శనైః శనైః,
సర్వద్వంద్వవినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే. మ ౬-౮౧

ఇట్లే నెమ్మదిగా సర్వసంగ దోషములను విడిచి, హర్షశోకాది సర్వద్వంద్వములనుండి ముక్తుడై, సంన్యాసి బ్రహ్మమునందే యవస్థితుడగును. సంన్యాసులకు ముఖ్యకర్మ మిదియే. గృహస్థాద్యాశ్రమముల వారికి సర్వవ్యవహారముల సత్యనిశ్చయమును దెలిపి, యధర్మ వ్యవహారముల నుండి విడిపించి, సర్వసంశయములను ఛేదించి, సత్యధర్మయుక్త వ్యవహారములందు బ్రవృత్తులను జేయవలయును.

(సంన్యాస గ్రహణాధికారము)

ప్రశ్నః- సంన్యాసగ్రహణ మొనర్చుట బ్రాహ్మణుల ధర్మమేనా? క్షత్రియాదులకు గూడ నున్నదా?

ఉత్తరముః- బ్రాహ్మణునకే యధికారమున్నది. ఏలయన సర్వవర్ణములందును బూర్ణవిద్వాంసుడు ధార్మికుడు, పరోపకార ప్రియుడు నైన మనుష్యునకే బ్రాహ్మణుడని నామము. పూర్ణవిద్యను సంపాదింపక, ధర్మమున బరమేశ్వరునందు నిష్ఠలేక, వైరాగ్యములేక, సంన్యాసము గ్రహించినవారివలన లోకమునకు విశేషోపకారము కలుగదు. అందువలననే బ్రాహ్మణునకే సంన్యాసగ్రహణాధికారమున్నది. ఇతరులకు లేదు. అని లోకశ్రుతియు నున్నది. ఈ విషయమున మనువు ప్రమాణముకూడ గలదు.

ఏషవోఽభిహితో ధర్మో బ్రాహ్మణస్య చతుర్విధః,
పుణ్యోఽక్షయఫలః ప్రేత్య రాజధర్మం నిబోధత. మను ౬-౯౭

ఓ ఋషులారా! బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాసాశ్రమ స్వీకారము బ్రాహ్మణధర్మము. ఇక్కడ వర్తమానమున బుణ్యరూపఫలము, శరీరమువదలిన మీదట ముక్తిరూపమగు నక్షయానందము నొసంగునది సంన్యాసధర్మము. అటుపై రాజులధర్మము నావలన వినుడు. అని మనువు ఋషులతో ననుచున్నాడు. దీనినిబట్టి సంన్యాసమును గ్రహించు నధికారము ముఖ్యముగా బ్రాహ్మణునకే కలదని సిద్ధమగుచున్నది. క్షత్రియాదులకు బ్రహ్మచర్యాద్యాశ్రమములు గ్రహింప నధికారమున్నది.

(సంన్యాస గ్రహణావశ్యకత)

ప్రశ్నః- సంన్యాసము గ్రహింపవలసిన యావశ్యకత యేమి?

ఉత్తరముః- శరీరమున శిరస్సున కావశ్యకత యున్నట్లుగా నాశ్రమములలో సంన్యాసాశ్రమమునకు నావశ్యకత యున్నది. ఏలయన నిదిలేకున్న విద్య, ధర్మము వర్ధిల్లజాలవు. ఇతరాశ్రమములకు, విద్యా గ్రహణము, గృహకృత్యములు, తపశ్చర్య మున్నగువానితో సంబంధముండుట వలన నవకాశము చాలతక్కువ లభించును. పక్షపాతము వదలి వర్తించుట యితరాశ్రమములకు దుష్కరము. సంన్యాసి సర్వతోముక్తుడై జగత్తున కుపకారము చేయున ట్లితరాశ్రమవాసులు చేయజాలరు. సంన్యాసికి సత్యవిద్యవలన బదార్థ విజ్ఞానము నున్నతముచేయుట కెంతసమయము లభించునో యంతటి యవకాశ మితరాశ్రమవాసులకు లభింపదు. కాని, బ్రహ్మచర్యమునుండియే సంన్యాసియై జగత్తునకు సత్యశిక్షణము నొసంగుచు నెంతటి యున్నతి జేయగలుగునో యంతటియున్నతిని గ్రమముగా గృహస్థాద్యాశ్రమముల ననుభవించి సంన్యాసి యైనవాడు చేయజాలడు.

ప్రశ్నః- సంన్యాసమును గ్రహించుట యీశ్వరుని యభిప్రాయమునకు విరుద్ధము. ఏలయన మనుష్యుల సంఖ్యను బెంచుట యీశ్వరుని యభిప్రాయము. గృహాశ్రమమును గ్రహింపనపుడు సంతానము కలుగదు. సంన్యాసాశ్రమము ముఖ్యమైనపు డెల్లరు దానినే స్వీకరించినచో మనుష్యుల మూలచ్ఛేదనము జరుగును.

ఉత్తరముః- మంచిది. వివాహము చేసికొనినను బలువురకు సంతానము కలుగదు. కొందఱికి సంతానము కలిగి నష్టమగును. అప్పుడు వారును నీశ్వరుని యభిప్రాయమునకు భిన్నముగా - విరుద్ధముగా నడచినవారగుదురు కదా?

**యత్నే కృతే యది న సిధ్యతి కోऽత్ర దోషః. పంచతంత్ర. మిత్రభేద ౪. ౨౧౩**

యత్నము చేసినమీదట సిద్ధింపకున్న వారిదోష మేమున్నది? దోషము లేదు. అని యందువేని మేము నిన్నడుగుచున్నాము. గృహాశ్రమము వలన బహుసంతానము కలిగి పరస్పర విరుద్ధాచరణము వలన గలహించి మరణించిన నెంతటి గొప్పహాని కలుగును? జ్ఞానవిరోధమువలననే కదా కలహము లెక్కువగును? అట్టియెడ సంన్యాసి యొక్కడు వేదధర్మము నుపదేశించుటవలన జనులలో బ్రీతి నుత్పన్నము చేయును. అందువలన లక్షలాది మనుష్యులను రక్షించును. వేలకొలది గృహస్థులకు సమానులైన మనుష్యులను బెంపుచేయును. ఇంతేకాక యెల్లరు మనుష్యులు సంన్యాసమును గ్రహింపజాలరు. ఎల్లరిని విషయాసక్తి యెన్నడును విడువదు. సంన్యాసుల యుపదేశమువలన ధార్మికులగు మనుష్యులెల్లరు సంన్యాసులకు బుత్రతుల్యులని యెఱుంగుము.

ప్రశ్నః- సంన్యాసులు మాకు జేయవలసిన కర్తవ్యము లేవియు లేవు. అన్నవస్త్రములను గ్రహించి యానందమున నుండుట మాపని. ఈ యవిద్యారూప సంసారముతో మా తలల నేల నొప్పింప జేసికొనవలయును? తమ్ము దాము బ్రహ్మలమని సంతుష్టులమై యుందుము. ఎవరేని వచ్చి యడిగిన వారికిగూడ నీవు బ్రహ్మవు, నీకు బాపపుణ్యము లంటవు. శీతోష్ణములు శరీరమునకు, నాకలిదప్పికలు ప్రాణమునకు,

సుఖదుఃఖములు మనస్సునకు సంబంధించిన ధర్మములు. జగత్తు మిథ్య. జగద్వ్యవహారము అన్నియు గల్పితములు - అబద్ధములు. కావున వీనిలో జిక్కుకొనుట బుద్ధిమంతుల పనికాదు. పాపపుణ్యము లేవైన గలిగిన నవి దేహేంద్రియములకు సంబంధించినవే, ఆత్మవి కావు. అని యిట్లుపదేశింతుము. కాని మీరు కొంత విలక్షణ ధర్మమును జెప్పినారు. "ఇప్పుడు మేమెవరు చెప్పినది సత్యము? ఎవరు చెప్పినది యసత్య మని" యంగీకరింపవలయును?

ఉత్తరముః- సంన్యాసికి మంచికర్మములుకూడ గర్తవ్యములు కావా? వైదికైశ్చైవ కర్మభిః. మ ౬.౭౫. వైదిక కర్మములు - ధర్మయుక్త సత్యకర్మములు సంన్యాసులకు గూడ నవశ్యకర్తవ్యము అని మనువు వ్రాసి యున్నాడు కదా? భోజనభాజనాది కర్మములు వారు విడువగలరా? ఈ కర్మములు విడువజాలరేని యుత్తమకర్మములు విడిచి పతితులు, పాపభాగులు కారా? గృహస్థులనుండి యన్నవస్త్రములు గ్రహింతురు గదా! వారికి బ్రత్యుపకారము చేయకున్న మహాపాపులు కారా? కంటితో జూచుట, చెవితో వినుట జరుగనినాడు వానియునికి వ్యర్థమగును. అట్లే సంన్యాసులు సత్యోపదేశములు చేయక, వేదాది సత్యశాస్త్ర ములను విచారించి ప్రచారము చేయక యున్ననాడు వారియునికి జగత్తునకు వ్యర్థభారము కాదా?

అవిద్యారూప సంసారమున దలను నొప్పించుకొనుట యేల? అను నిట్టి విషయములు వ్రాయు వారు, చెప్పువారు, నుపదేశించువారే మిథ్యారూపులు, పాపమును వృద్ధిచేయువారునునై యున్నారు.

(సంసారము మిథ్యకాదు)

శరీరాదులచే జేయు కర్మములన్నియు నాత్మకు సంబంధించినవే. వానిఫలముల ననుభవించు నదియు నాత్మయే. జీవుని బ్రహ్మగా జెప్పువారవిద్యానిద్రలో మునిగియున్నారు. ఏలయనగా జీవు డల్పుడు - అల్పజ్ఞుడు. బ్రహ్మము సర్వజ్ఞము, సర్వవ్యాపకము, నిత్యశుద్ధ, బుద్ధ ముక్తస్వభావ యుక్తమై యున్నది. జీవుడొకప్పుడు బద్ధుడు, మఱియొకప్పుడు ముక్తుడు నగుచున్నాడు. బ్రహ్మము సర్వవ్యాపకము, సర్వజ్ఞము నగుటచే బ్రహ్మమునకు భ్రమకాని, యవిద్యకాని యెన్నడు గలుగదు. జీవున కొకప్పు డవిద్య, మఱియొకప్పుడు విద్యయు గలుగును. బ్రహ్మమునకు జన్మమరణరూప దుఃఖము లెన్నడు గలుగవు. జీవున కవి కలుగును. కావున వారి యాయుపదేశము మిథ్య.

ప్రశ్నః- సంన్యాసి సర్వకర్మవినాశి. అగ్నిని మఱియు ధాతువులను స్పృశింపడు. ఈ విషయము సత్యమా? కాదా?

ఉత్తరముః- కాదు. 'సమ్యఙ్ నిత్యమాస్తే యస్మిన్ యద్వా సమ్యఙ్ న్యస్యంతి దుఃఖాని కర్మాణి యేన స సంన్యాసః, స ప్రశస్తో విద్యతే యస్య స సంన్యాసీ.' బ్రహ్మమునందు, నతని యాజ్ఞలయందు నిత్యము స్థితమగుట సంన్యాసము. దేనివలన దుష్టకర్మముల త్యాగము చేయబడునో యాయుత్తమ స్వభావ మెవనిలో నుండునో వాడు సంన్యాసి యనబడును. ఇందు సుకర్మముల కర్తయు దుష్కర్మముల నాశకుడు నైన వాడు సంన్యాసి యనబడును.

ప్రశ్నః- అధ్యాపనమును నుపదేశమును గృహస్థులు చేయుదురు కదా? సంన్యాసి వలన బ్రయోజన మేమి?

ఉత్తరముః- సత్యోపదేశమును సర్వాశ్రమవాసులు చేయవలయును, వినవలయును. కాని సంన్యాసి కెంత యవకాశము నిష్పక్షపాతత యుండునో యంత గృహస్థుల కుండదు. బ్రాహ్మణులయినవారు పురు షులు పురుషులకు, స్త్రీలు స్త్రీలకు సత్యోపదేశము చేయవలయును. చదివింపవలయును. ఇదియే వారి కర్తవ్యము. సంన్యాసికి భ్రమణము చేయుట కెంత యవకాశము లభించునో గృహస్థ బ్రాహ్మణాదులకు నంత యవకాశ మెన్నడును లభింపదు. బ్రాహ్మణాదులు వేదవిరుద్ధముగా నాచరించిన వారిని నియమించు

వాడు సంన్యాసియే యగును. కావున సంన్యాసియుండుట యుచితమే.

ప్రశ్న:- ఏకరాత్రిం వసేద్గ్రామే - నారద పరివ్రాజకోపనిషద్ ౪-౧౪ ఇత్యాది వచనముచే సంన్యాసి యొకచోట యొకరాత్రి మాత్రమే యుండవలయును. అధికముగా నివాసము చేయగూడదు కదా?

ఉత్తరము:- ఇది కొలది యంశములందు బాగుగనే యున్నది. ఏలయనగా నొకచోటనే యుండుటచే జగత్తునకుపకార మధికముగా గలుగజాలదు. స్థాన విశేషమున నభిమానమును గలుగును. రాగద్వేషములును నధికములగును. కాని యొకచోట నుండినందున విశేషోపకారము నుండిన నుండవచ్చును. జనక మహారాజునొద్ద నాలుగు మాసముల వఱకు పంచశిఖాదులును, సంవత్సరముల కొలది యితర సంన్యాసులును నివసించుచుండిరి. ఒకచోట నుండరాదను విషయము నేటి పాషండులయిన సంప్రదాయకులు కల్పించిరి. ఏలయనగా సంన్యాసి యొకచోట నధికముగా నుండిన తమపాషండత ఖండితమై వృద్ధినొందదు.

ప్రశ్న:- **యతీనాం కాంచనం దద్యాద్ తాంబూలం బ్రహ్మచారిణామ్,**
**చోరాణామభయం దద్యాత్ స నరో నరకం వ్రజేత్.** లఘుపరాశర ౧-౫౧

సంన్యాసులకు సువర్ణదానము చేసిన దాత నరకమును బొందునని యిందుగలదు గదా? ఈ యభిప్రాయము సత్యమా?

ఉత్తరము:- ఈ విషయముకూడ వర్ణాశ్రమ విరోధులైన సంప్రదాయకులు స్వార్థసింధువులునైన పౌరాణికులు కల్పించినదే. ఏలయనగా సంన్యాసులకు ధనమబ్బునేని వారు వీరి పాషండమును విశేషముగా ఖండనము చేయుదురు. అందువలన వారికి హాని కలుగును. సంన్యాసులు వారి యధీనములో నుండరు. మఱియు భిక్షాది వ్యవహారములు వారి యధీనముననున్నచో సంన్యాసులు భయపడుచుందురు. ఇక మూర్ఖులు స్వార్థపరులు నైనవారికి దానము చేయుట మంచిదని యెంచునప్పుడు విద్వాంసులు, పరోపకారులు నైన సంన్యాసులకు దానమిచ్చుటలో దోషముండజాలదు. చూడుడు:-

**వివిధాని చ రత్నాని వివిక్తేషూపపాదయేత్. (మను. ౧౧-౬)**

నానా ప్రకారములగు రత్న సువర్ణాది ధనములు వివిక్తులకు - సంన్యాసుల కీయ వలయును. కావున నీశ్లోకమనర్థకము. ఏలయనగా సంన్యాసికి సువర్ణ దానము చేయుటచే యజమానుడు నరకమునకు బోయినచో వెండి, ముత్యములు, వజ్రములు మున్నగునవి యిచ్చిన స్వర్గమునకు బోవును.

ప్రశ్న:- ఈ పండితుడు దీనిపాఠము చెప్పునప్పుడు మఱచిపోయెను. ఇది యిట్లున్నది. యతిహస్తే ధనం దద్యాత్ - అనగా సంన్యాసి హస్తమున ధనము నుంచువాడు నరకమునకు బోవును.

ఉత్తరము:- ఈ వచనముకూడ నవిద్వాంసుని కపోలకల్పనయే. ఏలయన, హస్తమున ధనము నుంచిన దాత నరకమునకు బోవునేని పాదములపై నుంచినను, లేక మూటగట్టి యిచ్చినను స్వర్గమునకు బోవును. కావున నిట్టి కల్పన యంగీకరింపదగినది కాదు. సంన్యాసి తన యోగక్షేమముల కంటె నధికముగా ధనముంచుకొనిన జోరాదుల వలన బీడితుడు, మోహితుడు నగుననుట నిజము. కాని విద్వాంసుడైనవాడయుక్త వ్యవహారము నెన్నడు జేయడు. మోహమునను జిక్కుకొనడు. ఏలయనగా నతడు మొదట గృహాశ్రమమున లేక బ్రహ్మచర్యమున నన్నియు భోగించి చూచియుండును. బ్రహ్మచర్యము నుండి సంన్యాసి యగువ్యక్తి పూర్ణవైరాగ్యము కలుగుటవలన నెన్నడును జిక్కువడడు.

ప్రశ్న:- శ్రాద్ధమున సంన్యాసి వచ్చినను, నతనికి భోజనము పెట్టినను బితరులు పాఱిపోవుదురు. అతడు నరకమున బడును అని జనులు చెప్పుదురు. (ఇది నిజమేనా?)

ఉత్తరముః- చనిపోయిన పితరులు వచ్చుటయు, జేసిన శ్రాద్ధము చనిపోయిన పితరులకు జేరుటయు నసంభవము. వేదమునకు, యుక్తికి విరుద్ధమగుటవలన నిది మిథ్యయే. పితరులు వచ్చుటయే లేనపుడు పాఱిపోవు వారెవరు? తన పాపపుణ్యముల ననుసరించి యీశ్వరుని వ్యవస్థ వలన మరణించిన పిదప జీవుడు జన్మమును బొందును. అతడెట్లు రాగలుగును? కావున నీ విషయ ముదరపోషకులైన పౌరాణికులయు బైరాగులయు మిథ్యాకల్పనయే.

సంన్యాసి వెళ్ళినచోట మృతకశ్రాద్ధము చేయుట వేదశాస్త్రములకు విరుద్ధమగుటవలన పాషండము మాత్రము పాఱిపోవుననుట సరియైనమాట.

(బ్రహ్మచర్యము నుండియే సంన్యాసము తీసికొన నధికారి.)

ప్రశ్నః- బ్రహ్మచర్యము నుండియే సంన్యాసమును దీసికొనిన వానికి నిర్వాహము కఠినమగును. కామము నడ్డగించుటయు మిక్కిలి కఠినము. కావున గృహాశ్రమ వానప్రస్థాశ్రమములను నిర్వర్తించి వృద్ధుడైనప్పుడు సంన్యాసము గ్రహించుట మంచిది.

ఉత్తరముః- నిర్వహింపలేనివా డింద్రియములను వశమున నుంచుకొననివాడు బ్రహ్మచర్యమునుండి సంన్యాసమును గ్రహింపరాదు కాని యడ్డగింపగలవాడు సంన్యాస మేల గ్రహింపరాదు? విషయ దోషములను, వీర్య సంరక్షణములో గల గుణములను నెఱిగినవాడు విషయాసక్తు డెన్నడును గాడు. అతని వీర్యము విచారాగ్నికి నింధనమువలెనై యందే వ్యయమగును. వైద్యుని, యౌషధులయు నావశ్యకత రోగికొఱకైనట్లు నీరోగికి గాదు. అట్లే యెవరి విద్యాబుద్ధులు లోకమున కుపకారము చేయుటయే ప్రయోజనముగా గలవి యగునో యట్టి స్త్రీ పురుషులు వివాహము చేసికొనరాదు. పంచశిఖాదిపురుషులు, గార్గిప్రభృతి స్త్రీలు నట్లే వివాహము చేసికొనలేదు. కావున నధికారులు సంన్యాసులగుట యుచితము. అనధికారులు సంన్యాసము గ్రహించిన దాము మునుగుదురు, ఇతరులను ముంచెదరు. చక్రవర్తి యగురాజు (సమ్రాట్) అయినట్లు సంన్యాసి (పరివ్రాట్) అగుచున్నాడు. కావున రాజు తన దేశమునందో లేక తనకు సంబంధించిన వారియందో సత్కారమును బొందును. సంన్యాసి సర్వత్ర పూజితుడగును.

విద్వత్త్వంచ నృపత్వం చ నైవ తుల్యం కదాచన,
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే. (చాణక్యనీతిశాస్త్ర, శ్లో. ౩)

విద్వాంసునితో రాజెన్నటికిని సమానుడు కాజాలడు. ఏలయనగా రాజు తన రాజ్యమందే మన్నన సత్కారములను బొందును. విద్వాంసుడు సర్వత్ర గౌరవమును బ్రతిష్ఠను బొందును.

కాబట్టి విద్యను జదువుట, సుశిక్షను బొందుట, బలవంతుడగుట యను నీ మొదలగు వానికొఱకే బ్రహ్మచర్యమ్ము, అన్ని విధములగు నుత్తమ వ్యవహారములను సిద్ధము చేసికొనుటకు గృహస్థమ్ము, ఆలోచనమును, ధ్యానమును, విజ్ఞానమును వృద్ధిపఱచుకొనుటకు దపశ్చర్యచేయుటకును వానప్రస్థమ్ము, వేదాది సత్యశాస్త్రముల ప్రచారము, ధర్మవ్యవహార గ్రహణము, దుష్టవ్యవహార త్యాగము, సత్యోపదేశము నందఱి సందేహములు తీర్చుట మొదలగు వానికొఱకు సంన్యాసాశ్రమము నైయున్నవి. కాని యీ సంన్యాసమునకు ముఖ్యధర్మమైన సత్యోపదేశాదులు చేయనివాడు పతితుడును, నరకగామియు నగును. కాబట్టి సత్యోపదేశము, శంకాసమాధానము, వేదాది సత్యశాస్త్రముల యధ్యాపనము, వేదోక్త ధర్మవృద్ధియును, బ్రయత్నముచే జేసి లోకోన్నతిని గలిగించుట సంన్యాసుల కుచితము.

ప్రశ్నః- సంన్యాసులకంటె నితరులైన సాధువులు, బైరాగులు, భస్మధారులు మున్నగువారుగూడ సంన్యాసాశ్రమమందు లెక్కింపబడుదురా? లేదా?

ఉత్తరముః- లేదు. వారిలో సంన్యాస లక్షణములలో నొక్కటియు లేదు. వారు వేదవిరుద్ధ మార్గ

మున బ్రవృత్తులై వేదముకంటె దమ సంప్రదాయముల నాచార్యుల వచనములను నమ్ముదురు. తమ మతమునే ప్రశంసింతురు. మిథ్యా ప్రపంచమున జిక్కుకొని తమ స్వార్థము కొఱకు నితరులను దమతమ మతములలో జిక్కువడునట్లు చేయుదురు. కావున వీరిని సంన్యాసాశ్రమమున గణింపరాదు. కాని వీరు స్వార్థాశ్రమవాసులు. ఇందు గొంచెమును సందేహము లేదు.

తాము స్వయముగ ధర్మమందు నడచుచు సర్వలోకమును నడపించుచు దామును సమస్త లోకమును నీజన్మయందును, రాబోవు జన్మమందును స్వర్గమును – సుఖమును, ననుభవించుచు ననుభవింప జేయువారే ధర్మాత్ములు, సంన్యాసులు, మహాత్ములు నగుచున్నారు. సంక్షేపముగ నీ సంన్యాసాశ్రమవిధి వ్రాయబడినది. ఇకముందు రాజప్రజాధర్మ విషయము వ్రాయబడును.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును
సుభాషా విభూషితము నగు
సత్యార్థప్రకాశమున వానప్రస్థ,
సన్న్యాసాశ్రమ విషయముగల
పంచమ సముల్లాసము సంపూర్ణము.

# షష్ఠ సముల్లాసము

రాజధర్మములను జెప్పెదము.

(క్షత్రియకర్తవ్యము - సర్వులను రక్షించుట)

రాజధర్మాన్ ప్రవక్ష్యామి యథావృత్తో భవేన్నృపః,
సంభవశ్చ యథా తస్య సిద్ధిశ్చ పరమా యథా॥ (మను. ౭-౧)

మనుమహారాజు ఋషులతో జెప్పుచున్నాడుః-

నాలుగు వర్ణములయు, నాలుగాశ్రమములయు వ్యవహారములను జెప్పిన పిమ్మట రాజధర్మములను జెప్పెదము. రాజెట్టివాడు కావలయును? ఇతడెట్లగుట సంభవమో, యీతనికి బరమసిద్ధి యెట్లు ప్రాప్తించునో దాని నన్నివిధముల జెప్పెదము.

బ్రాహ్మం ప్రాప్తేన సంస్కారం క్షత్రియేణ యథావిధి,
సర్వస్యాస్య యథా న్యాయం కర్తవ్యం పరిరక్షణమ్॥ (మను. ౭-౨)

పరమ విద్వాంసుడు బ్రాహ్మణు డగునట్లే విద్వాంసుడును, సుశిక్షితుడును నయి క్షత్రియుడు సమస్త రాజ్యరక్షణమును న్యాయముగా - యథారీతిని జేయవలయును.

రాజ్యపరిపాలన క్రమముః-

(మూడు సభలు)

**(౧) త్రీణి రాజానా విదథే పురూణి, పరి విశ్వాని భూషథః సదాంసి.**

**(ఋ. మం, ౩. సూ. ౩౮. మం. ౬)**

ఈశ్వరు డుపదేశించుచున్నాడుః- రాజానా = రాజు, ప్రజాసంబంధి పురుషులు గలిసి, విదథే = సుఖప్రాప్తికారకమును, విజ్ఞానవృద్ధికారకమునగు రాజునకు బ్రజకు సంబంధించిన వ్యవహారమునందు, త్రీణిసదాంసి = మూడుసభలను - విద్యార్యసభ, ధర్మార్యసభ, రాజార్యసభలను నియమించి, పురూణి = నానావిధములైన , విశ్వాని = సమగ్రప్రజకు సంబంధించిన మనుష్యాది ప్రాణులను, పరిభూషథః = అన్నివైపులనుండి - విద్య, స్వాతంత్ర్యము, ధర్మము, సుశిక్షణము, ధనము మున్నగు వానిచే నలంకరింపవలయును.

**(౨) తం సభా చ సమితిశ్చ సేనా చ. (అథర్వ. కాం ౧౫-౯-౨)**

తమ్ = ఆ రాజధర్మమును, సభా చ = మూడుసభలును, సమితిశ్చ = సంగ్రామాదుల వ్యవస్థయు, సేనా చ = సేనయు గలిసి పాలింపవలయును.

**(౩) సభ్యసభాం మే పాహి యే చ సభ్యాః సభాసదః. (అథర్వ. కాం ౧౯-౫౫-౬)**

సభాసదులకు రాజునకు నివి యోగ్యములు. రాజు సభాసదుల కందఱకు నాజ్ఞ నీయవలయును. హేసభ్య = సభకు యోగ్యుడవగు నోముఖ్య సభాసదుడా! నీవు, మే = నా, సభామ్ = సభయొక్క ధర్మయుక్త వ్యవస్థను, పాహి = పాలించుము. మఱియు, యే చ = ఎవరు, సభ్యాః = సభకు యోగ్యులగు, సభాసదః = సభాసదులున్నారో వారు కూడ సభావ్యవస్థను బాలింపవలయును. దీని యభిప్రాయమిది ః- ఒక్కనికే స్వతంత్ర రాజ్యాధికారము నీయరాదు. కాని సభాపతియగు రాజాధీనమునందు సభయు, సభాధీనమందు రాజును, రాజును సభయు బ్రజల యధీనమందును, బ్రజలు రాజసభకు నధీనమందు నుండవలయును.

అట్లుచేయక పోయిరేని :-

**(౪) రాష్ట్రమేవ విశ్యాహంతి తస్మాద్రాష్ట్రీ విశం ఘాతుకః,**
**విశమేవ రాష్ట్రాయాద్యాం కరోతి తస్మాద్రాష్ట్రీ**
**విశమత్తి న పుష్టం పశుం మన్యత ఇతి ॥ (శత. కాం. ౧౩-౨-౩)**

రాజవర్గము ప్రజలకు లోబడక స్వతంత్రముగా - స్వాధీనముగా నుండెనేని, రాష్ట్రమేవ విశ్యాహంతి = రాజ్యమున ప్రవేశించి ప్రజలను నాశనము చేయును. కాబట్టి రాజొక్కడే స్వాధీనుడు, నున్మత్తుడు నయ్యెనేని, రాష్ట్రీ విశం ఘాతుకః = ప్రజలకు నాశకుడగుచున్నాడు. అనగా, విశమేవ రాష్ట్రాయాద్యాం కరోతి = ఆరాజు ప్రజలను దినివేయును - మిక్కిలి పీడించును. కాబట్టి రాజ్యమున నెవనినో యొకనిని స్వాధీనుని జేయరాదు. 'న పుష్టం పశుం మన్యతే' - సింహముకాని, మాంసాహారియైన జంతువుకాని హృష్టపుష్ట పశువును జంపి తినివేయునట్లు, రాష్ట్రీ విశమత్తి = స్వతంత్రరాజు ప్రజలను నాశము చేయును. అనగా నెవనిని దనకంటె నధికుని గానీయడు. శ్రీమంతుని దోచుకొనియు, నన్యాయముతో దండుగ తీసికొని తన ప్రయోజనమును బూర్తిచేసికొనును. కావున -

**(౫) ఇంద్రో జయాతి న పరా జయాతా అధిరాజో రాజసు రాజయాతై,**
**చర్కృత్య ఈడ్యో వంద్యశ్చోపసద్యో నమస్యో భవేహ ॥ (అథర్వ. కాం ౬-౯౮-౧)**

ఓ మనుష్యులారా! ఎవడు, ఇహ = ఈ మనుష్య సముదాయమున, ఇంద్రః = పరమైశ్వర్యకర్తయై శత్రువులను, జయాతి = జయింపగలుగునో, న పరాజయాతై = శత్రువులచే బరాజితుడు కాడో, రాజసు = రాజులలో, అధిరాజః = సర్వోపరి విరాజమానుడును, రాజయాతై = ప్రకాశమానుడునగునో, చర్కృత్యః = సభాపతియగుట కత్యంతయోగ్యుడును, ఈడ్యః = ప్రశంసనీయ గుణకర్మస్వభావయుక్తుడును, వంద్యః = సత్కారణీయుడును, చోపసద్యః = సమీపించుటకును, శరణుచొచ్చుటకును యోగ్యుడును, నమస్యః = అందఱకు మాననీయుడును, భవ = అగునో, యతనినే సభాపతిగా - రాజుగా జేసికొనవలయును.

**(౬) ఇమం దేవా అసపత్నగ్ం సువధ్వం మహతే క్షత్రాయ, మహతే**
**జ్యైష్ఠ్యాయ మహతే జానరాజ్యాయేంద్రస్యేంద్రియాయ. (యజు. ౯-౪౦)**

హేదేవాః = విద్వాంసులగు రాజప్రజాజనులారా! మీరు, ఇమమ్ = ఇట్టి వానిని, మహతే క్షత్రాయ = గొప్పచక్రవర్తి రాజ్యము కొఱకు, మహతే జ్యైష్ఠ్యాయ = అందఱకంటె గొప్పవాడగుటకొఱకును, మహతే జానరాజ్యాయ = గొప్పగొప్ప విద్వాంసులతో గూడిన రాజ్యమును బాలించుట కొఱకును, మఱియు, ఇంద్రస్య ఇంద్రియాయ = పరమైశ్వర్యవంతమగు రాజ్యమును, ధనమును బాలించుటకొఱకు, అసపత్నగ్ం సువధ్వ = సర్వత్ర పక్షపాతరహితుడును, పూర్ణవిద్యావినయవంతుడును, నందఱకు మిత్రుడును నగు సభాపతి - రాజును సమ్మతిపూర్వకముగా సర్వాధీశునిగా నెంచి సమస్త భూగోళమును శత్రురహితముగా జేయుడు.

(సేన శస్త్రాస్త్రయుక్తముగా నుండవలయును.)

**(౭) స్థిరా వః సంత్వాయుధా పరాణుదే వీళూ ఉత ప్రతిష్కభే,**
**యుష్మాక మస్తు తవిషీ పనీయసీ, మా మర్త్యస్య మాయినః. (ఋ. ౧-౩౯-౨)**

ఈశ్వరుడుపదేశించుచున్నాడు. ఓ రాజపురుషులార! వః = మీ, ఆయుధాః = ఆగ్నేయాద్యస్త్రములు, శతఘ్నీ = తోపులు - ఫిరంగులు, తుపాకులు, ధనుర్బాణములు, ఖడ్గములు మున్నగు శస్త్రములు, శత్రువులను, పరాణుదే = పరాజితులను జేయుటకు, ఉతప్రతిష్కభే = అడ్డగించుటకు, వీళూ = ప్రశంసితములు, మఱియు, స్థిరాః = దృఢములునై, సన్తు = ఉండవలయును, యుష్మాకమ్ = మఱియు మీ,

తవిషీ = సేన, పనీయసీ అస్తు = ప్రశంసనీయముగ నుండవలయును. అందువలన నెల్లపుడు మీరు విజయము బొందగలరు. కాని, మా మర్త్యస్య మాయినః = నిందితము నన్యాయరూపము నగుకార్యము చేయువారికి బూర్వవస్తువు లుండకూడదు. అనగా మనుష్యుడు ధార్మికుడుగా నుండు నంతవఱకే రాజ్యము వర్ధిల్లు చుండును. దుష్టాచారులయినపుడు నష్టభ్రష్టమగును.

(సభాధికారములు - సభాసదులు)

మహావిద్వాంసులను విద్యాసభాధికారులుగను, ధార్మిక విద్వాంసులను ధర్మసభాధికారులుగను, ప్రశంసనీయధార్మిక పురుషులను రాజసభాసదస్యులుగను జేయవలయును. వారి యందఱిలో సర్వోత్తమ గుణకర్మస్వభావయుక్తుడగు మహాపురుషుని రాజసభకు బతిగా నెంచి, యన్నివిధముల నున్నతి నొనర్ప వలయును. పై మూడు సభలయొక్క సమ్మతితో నుత్తమరాజనీతి నియమముల నేర్పఱపవలయును. ఆ నియమముల కధీనులై యెల్లరు వర్తింపవలయును. ఎల్లరకు హితకారకములగు పనులలో సమ్మతి - ఐకమత్య ముండవలయును. ఎల్లరకు హితమొనర్చుటలో బరతంత్రులై వ్యక్తిగత ధర్మయుక్త కార్యము లందు స్వతంత్రులుగా నుండవలయును.

(సభాపతి గుణములు)

ఇంద్రానిల యమార్కాణా మగ్నేశ్చ వరుణస్య చ,
చంద్రవిత్తేశయోశ్చైవ మాత్రా నిర్ హృత్య శాశ్వతీః. (౧)
తపత్యాదిత్యవచ్చైష చక్షూంషి చ మనాంసి చ,
న చైనం భువి శక్నోతి కశ్చిదప్యభివీక్షితుమ్. (౨)
సోఽగ్నిర్ భవతి వాయుశ్చ సోఽర్కః సోమః స ధర్మరాట్,
స కుబేరః స వరుణః స మహేన్ద్రః ప్రభావతః. (౩) (మను. ౭-౪, ౬, ౭)

సభాపతియైన రాజేంద్రుడు = విద్యుత్తువలె శీఘ్రముగ నైశ్వర్యకర్తయు, వాయుసమానముగ నెల్లరకు ప్రాణమువలె ప్రియుడై హృదయగతవిషయము నెఱుంగువాడును, యమః = పక్షపాత రహితుడైన న్యాయాధీశునివలె వర్తించువాడును, సూర్యునకు సమానముగ న్యాయమును, ధర్మమును, విద్యను ప్రకాశింపజేయువాడును, నంధకారము ననగా నవిద్యను, నన్యాయమును నిరోధించువాడును, నగ్నివలె దుష్టులను భస్మము చేయువాడును, వరుణుడు = బంధించువానివలె దుష్టుల ననేక విధముల బంధించువాడును, చంద్రునివలె శ్రేష్ఠపురుషుల నానందింపజేయువాడును, ధనాధ్యక్షుడు = కుబేరునివలె గోశములను నింపువాడును సభాపతి - రాజు కావలయును. (౧)

సూర్యునివలె ప్రతాపవంతుడును, నెల్లరి బాహ్యాభ్యం తరమనస్సులను దన తేజస్సుతో దపింప జేయువాడును, బృథివిలో నెవనిచేతను, దీక్ష్ణదృష్టితో జూడబడ శక్యము కానివాడును, సభాపతి కావలయును. (౨)

ఎవడు తన ప్రభావముచే నగ్ని, వాయు, సూర్య, సోములవలె ధర్మ ప్రకాశకుడు, ధనవర్ధకుడు, దుష్టులను బంధించువాడు, మిక్కిలి యైశ్వర్యవంతుడు నగునో యతడే సభాపతి, సభేశుడు (రాజు) కావలయును. (౩)

(సత్యమైనరాజు - దండము)

నిజమైన రాజెవడు? --

(౮) స రాజా పురుషో దండః స నేతా శాసితా చ సః,
చతుర్ణా మాశ్రమాణాం చ ధర్మస్య ప్రతిభూః స్మృతః. (౧)

దండః శాస్తి ప్రజాః సర్వా దండ ఏవాభిరక్షతి,
దండః సుప్తేషు జాగర్తి దండం ధర్మం విదుర్బుధాః. (౨)
సమీక్ష్య స ధృతః సమ్యక్ సర్వా రంజయతి ప్రజాః,
అసమీక్ష్య ప్రణీతస్తు వినాశయతి సర్వతః. (౩)
దుష్యేయుః సర్వవర్ణాశ్చ భిద్యేరన్ సర్వసేతవః,
సర్వలోకప్రకోపశ్చ భవేద్దండస్య విభ్రమాత్. (౪)
యత్ర శ్యామో లోహితాక్షో దండశ్చరతి పాపహా,
ప్రజాస్తత్ర న ముహ్యన్తి నేతా చేత్ సాధు పశ్యతి. (౫)
తస్యాహుః సంప్రణేతారం రాజానం సత్యవాదినం,
సమీక్ష్య కారిణం ప్రాజ్ఞం ధర్మకామార్థకోవిదమ్. (౬)
తం రాజా ప్రణయన్ సమ్యక్ త్రివర్గేణాభివర్ధతే,
కామాత్మా విషమః క్షుద్రో దండేనైవ నిహన్యతే. (౭)
దండో హి సుమహత్తేజో దుర్ధరశ్చాకృతాత్మభిః,
ధర్మాద్ విచలితం హంతి నృపమేవ సబాంధవమ్. (౮)
సోఽసహాయేన మూఢేన లుబ్ధేనాకృతబుద్ధినా,
న శక్యో న్యాయతో నేతుం సక్తేన విషయేషు చ. (౯)
శుచినా సత్యసంధేన యథా శాస్త్రానుసారిణా,
ప్రణేతుం శక్యతే దండః సుసహాయేన ధీమతా. (౧౦)

మను అ ౭-౧౭, ౧౮, ౧౯-౨౮, ౩౦,౩౧.

దండమే పురుషుడు, రాజు. అదియే న్యాయప్రచారకర్త, యెల్లరిని శాసించునది. అదియే నాలుగాశ్రమములయు, నాలుగు వర్ణములయు,ధర్మములకు ప్రతిభువు – పూచీపడునది. (౧)

అదియే ప్రజలను శాసించునది. ఎల్ల ప్రజలను రక్షించునది. నిద్రపోవు ప్రజాస్థమనుష్యులలో మెలకువతో నుండునది. కావున బుద్ధిమంతులు దండమునే ధర్మమందురు. (౨)

బాగుగ విచారించి ధారణముచేయబడు దండము ప్రజలనెల్లర నానందింప జేయును. విచారింపకయే దండము ప్రయోగించిన నది యన్నివిధముల రాజును నశింపజేయును. (౩)

దండము లేకున్న వర్ణములన్నియు దూషితములగును. మర్యాదలన్నియు ఛిన్నభిన్నములగును. దండము యథారీతిని లేకున్న నెల్లరు గుపితు లగుదురు. (౪)

కృష్ణవర్ణము, రక్తనేత్రములు కలిగి భయంకరుడైన పురుషునివలె బాపనాశకమగు దండము ప్రవర్తించుతావున బ్రజలు మోహితులు కాక యానందితు లగుదురు. కాని దండమును నడపువాడు పక్షపాతరహితుడైన విద్వాంసుడై యుండవలయును. (౫)

సత్యవాదియు, విచారించి చేయువాడు, బుద్ధిమంతుడు, ధర్మార్థకామమోక్షములను సిద్ధమొనర్చుటలో బండితుడగు రాజే దండమును బ్రవర్తింప జేయదగినవాడని విద్వాంసులందురు. (౬)

దండమును బాగుగ నడుపు రాజు ధర్మార్థ కామముల సిద్ధిని బెంపుజేయును. విషయలంపటుడు, వక్రుడు, నీర్ష్యాలువు, క్షుద్రుడు, నీచబుద్ధిగలవాడు న్యాయాధీశుడైన రాజగు నెడల నతడు దండముతోనే చంపబడును. (౭)

దండము మిక్కిలి తేజోమయము. దాని నవిద్వాంసుడు, నధర్మాత్ముడు నైనవాడు ధారణము

చేయజాలడు. అప్పుడాదండము ధర్మరహితమై యన్యాయసహితముగా రాజునే నాశనమొనర్చును. (౮)

ఆప్త పురుషుల సాహాయ్యము లేనివాడు, విద్యా, సుశిక్షారహితుడు, విషయాసక్తుడు, మూఢుడు నైనవాడు న్యాయముతో దండము నడప నెన్నడు సమర్థుడు కాడు. (౯)

పవిత్రాత్ముయు, సదాచారుడు, సత్పురుషుల సాంగత్యము కలవాడు, యథారీతిని నీతిశాస్త్రమున కనుకూలముగ నడుచుకొనువాడు, శ్రేష్ఠపురుషుల సాహాయ్యము కలవాడు, బుద్ధిమంతుడు నైనవాడే న్యాయరూపమగు దండమును నడుప సమర్థుడగును. (౧౦)

(రాజు - పరిషత్తు - పరిషత్తుయోగ్యత)

సేనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వమేవ చ,
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవిదర్హతి. (౧)
దశావరావాపరిషద్ యం ధర్మం పరికల్పయేత్,
త్ర్యవరావాపి వృత్తస్థా తం ధర్మం న విచాలయేత్. (౨)
త్రైవిద్యో హైతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః,
త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్ స్యాద్దశావరా. (౩)
ఋగ్వేదవిద్యజుర్విచ్చ సామవేదవిదేవ చ,
త్ర్యవరా పరిషజ్జ్ఞేయా ధర్మసంశయనిర్ణయే. (౪)

(వేదజ్ఞసంన్యాసి కథనము ప్రమాణము)

ఏకోఽపి వేదవిద్ధర్మం యం వ్యవస్యేద్ ద్విజోత్తమః,
స విజ్ఞేయః పరో ధర్మో నాజ్ఞానాముదితోఽయుతైః. (౫)
అవ్రతానామమంత్రాణాం జాతిమాత్రోపజీవినామ్,
సహస్రశః సమేతానాం పరిషత్వం న విద్యతే. (౬)
యం వదన్తి తమోభూతా మూర్ఖా ధర్మమతద్విదః,
తత్పాపం శతధా భూత్వా తద్వక్తౄ ననుగచ్ఛతి. (౭) మను. ౧౨. ౧౦౦, ౧౧౦-౧౧౫.

సర్వసేనల మీదను, సేనాధిపతుల మీదను రాజ్యాధికారము, దండదానవ్యవస్థకు సంబంధించిన సర్వకార్యముల యాధిపత్యము, సందఱపై వర్తించు సర్వాధీశుని రాజ్యాధికారము నను నీ నాలుగధికారములందు సంపూర్ణ వేదశాస్త్రములందు బరిపూర్ణ విద్వాంసుడు, ధర్మాత్ముడు, జితేంద్రియుడు, సుశీలుడు నైనవానిని జనులుంచవలయును. అనగా ముఖ్యసేనాపతి, ముఖ్యరాజ్యాధికారి, ముఖ్యన్యాయాధీశుడు, ప్రధానుడు - రాజు నను నీనలువు రధికారులు సర్వవిద్యలందును - బూర్ణవిద్వాంసులై యుండవలయును. (౧)

తక్కువలో దక్కువ పదిమంది విద్వాంసులతో గాని, లేక యింకను దక్కువయైన మువ్వురు విద్వాంసులతోగాని యేర్పడిన సభ చేసిన ధర్మమును - వ్యవస్థను నెవ్వరు నుల్లంఘింపరాదు. (౨)

ఈ సభయందు నాలుగు వేదములను జదివినవారు, హైతుకుడు - కారణ - అకారణములజ్ఞాత, న్యాయశాస్త్రము, నిరుక్తము, నర్థశాస్త్రము, ధర్మశాస్త్రము మున్నగు వానిని దెలిసిన వారును సభాసదులుగా నుండవలయును. వారు బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులుగా నుండవచ్చును. వీరందఱితో నేర్పడిన యీసభలో బదిమంది విద్వాంసులకు దక్కువ యుండరాదు. (౩)

ఋగ్యజుస్సామవేదముల నెఱిగిన ముగ్గురు విద్వాంసులు సభాసదులు గాగల సభ చేయువ్యవస్థ నెవ్వరును నుల్లంఘింపరాదు. (౪)

చతుర్వేదవిదుడు, ద్విజులలో నుత్తముడు నైన యొక్కసంన్యాసియే చేయుధర్మవ్యవస్థ శ్రేష్ఠధర్మమగును. ఏలయన వేలకొలది, లక్షలకొలది, కోట్ల కొలది మూర్ఖులు కలిసి చేయువ్యవస్థ యెట్టి దైనను నంగీకరింప దగినది కాదు. (౫)

బ్రహ్మచర్య – సత్యభాషణాది వ్రతరహితులు, వేదవిద్యారహితులు, విచారరహితులు జన్మమాత్ర మున శూద్రులవలె నుండువారు వేలకొలది జనులు కలిసినను నది సభ యనబడదు. (౬)

అవిద్యాయుక్తులైన మూర్ఖులు, వేదముల నెఱుగని మనుష్యులు చెప్పుధర్మమును నెవ్వరు నెన్నడు నంగీకరింపరాదు. ఏలయనగా మూర్ఖులు చెప్పిన ధర్మము ననుసరించువారివెంట వందలాది పాపములు తగుల్కొనును. (౭)

కావున విద్యాసభ, ధర్మసభ, రాజసభ యను నీ మూడు సభలలోను మూర్ఖుల నెన్నడు జేర్చుకొనరాదు. ఎల్లపుడు నాసభలలో విద్వాంసులు, ధార్మికులునైన పురుషులను సదస్యులుగా స్థాపింపవలయును. మఱియు నెల్లరు నిట్లుండవలయును. (౮)

(రాజు సభాసదులు జితేంద్రియులు)

త్రైవిద్యేభ్య స్త్రయీం విద్యాం దండనీతిం చ శాశ్వతీమ్,
ఆన్వీక్షికీం చాత్మవిద్యాం వార్తారంభాం శ్చ లోకతః. (౧)
ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశమ్,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః. (౨)

(దశకామజ – అష్టక్రోధజ దుర్గుణములు)

దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ,
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్. (౩)
కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,
వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు. (౪)
మృగయాక్షో దివాస్వప్నః పరీవాదః స్త్రియో మదః,
తౌర్యత్రికం వృథాఽట్యా చ కామజో దశకో గణః. (౫)
పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణమ్,
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః. (౬)
ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః,
తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ. (౭)
పానమక్షాః స్త్రియశ్చైవ మృగయా చ యథాక్రమమ్,
ఏతత్ కష్టతమం విద్యాచ్చతుష్కం కామజే గణే. (౮)
దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే,
క్రోధజేఽపి గణే విద్యాత్ కష్టమేతత్ త్రికం సదా. (౯)
సప్తకస్యాస్య వర్గస్య సర్వత్రైవానుషంగిణః,
పూర్వం పూర్వం గురుతరం విద్యాద్ వ్యసనమాత్మవాన్. (౧౦)
వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే,
వ్యసన్యధోఽధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీ మృతః. (౧౧) (మను. ౭.౪౩–౫౩)

నాలుగు వేదములందలి కర్మోపాసనాజ్ఞానవిద్యలను దెలిసినవారినుండి యీమూడు విద్యలను,

సనాతనదండనీతిని, న్యాయవిద్యను, నాత్మవిద్యను - అనగా బరమాత్మగుణకర్మ స్వభావములు నున్న దున్నట్లు తెలిసికొనగల బ్రహ్మవిద్యను, లోకవార్తల యారంభమును (జనులతో వ్యవహరించుట) నేర్చు కొనినవాడు సభాసదుడు కాని, సభాపతికాని కాగలడు. ఇట్టివారే రాజు రాజసభాసదులు కాగలుగుదురని భావము. (౧)

సభాసదులందఱును, సభాపతియు నింద్రియములను జయించి తమ వశమందుంచుకొని సర్వదా ధర్మమందే వర్తిల్లుచు నధర్మమునుండి తొలగి యుండవలయును. కాబట్టి రేయింబవలు నియత సమయములందు యోగాభ్యాసము జేయుచుండవలయును. ఏలయనగా జితేంద్రియుడయి తన యింద్రియములను (మనః ప్రాణశరీరరూప) ప్రజలను జయింపడేని వెలుపలి ప్రజలను దనవశమందు బెట్టుకొనుట కెన్నటికిని సమర్థుడు కాజాలడు. (౨)

మనుష్యుడు దృఢోత్సాహియై కామమువలన గలుగు పదిదుష్టవ్యసనములను, క్రోధమువలన గలుగు నెనిమిది దుష్టవ్యసనములను బ్రయత్నముతో విడువవలయును, విడిపింపవలయును. వానిలో జిక్కు వడిన మనుష్యుడు వానినుండి విడివడుట కఠినము. (౩)

ఏలయనగా గామమువలన నుత్పన్నములగు దుర్వ్యసనములందు, జిక్కువడు రాజు అర్థము - రాజ్యధనాదులు, ధర్మము లేనివాడగును. క్రోధము నుండి యుత్పన్నములగు నెనిమిది దుర్వ్యసనముల యందు జిక్కువడెనేని శరీరమునుగూడ బోగొట్టుకొనును. (౪)

కామమునుండి యుత్పన్నములగు వ్యసనములు పది :- వేటాడుట, పాచికలాడుట, జూదమాడుట, మొదలగునవి; పగలునిద్రించుట, కామకథ, యితరులను నిందించుట, స్త్రీలతో నతిసంగమము, మాదకద్రవ్యసేవనము - మద్యము, నల్లమందు, భంగు, గంజాయి మొదలగునవి సేవించుట; పాడుట, వాయించుట, నాట్యమాడుట, నాట్యమాడించుట; వీనిని వినుట, చూచుట, వృథాగా నిక్కడ నక్కడ దిరుగుట - యీ పదియు గామోత్పన్నములగు వ్యసనములు. (౫)

క్రోధమునుండి యుత్పన్నములగు వ్యసనములు :- పైశున్యము (చాడీలు చెప్పుట) ఆలోచన లేక బలాత్కారముగ బరస్త్రీతో జెడుపని యొనర్చుట, ద్రోహముంచుట, యీర్ష్య (ఇతరుల బాగును జూచి మండిపడుట) అసూయ, (దోషములందు గుణములను గుణములందు దోషములను నారోపించుట) అర్థదూషణము (అధర్మయుక్తమగు చెడుపనులయందు ధనాదులను వ్యయపఱచుట) కఠినపు మాటలాడుట, నిరపరాధులయెడ బరుషవచనములు పలుకుట, వారిని విశేషముగా దండించుట యను నీ యెనిమిది వ్యసనములుక్రోధముచే నుత్పన్నము లగుచున్నవి. (౬)

ఈ కామజ క్రోధజ వ్యసనములకు మూలమయి, మనుష్యులను సమస్తదుర్గుణములలో జిక్కువడజేయునది లోభమని విద్వాంసులందఱు నెఱుంగుదురు. కాబట్టి లోభమును బ్రయత్నముచే వదలవలయును. (౭)

కామసంబంధమగు వ్యసనములందు మాదకద్రవ్యములను సేవించుట, పాచికలు మొదలయిన వానితో జూదమాడుట, విశేషస్త్రీసంగమము, వేటాడుట యను నీనాలుగు మహాదుష్టవ్యసనములు. (౮)

క్రోధసంబంధమగు వానియందు నిరపరాధులను దండించుట, పరుషవచనములాడుట, ధనాదుల నన్యాయమునందు వెచ్చించుట, యీ మూడును మహాదుఃఖదాయక దోషములు. (౯)

కామజక్రోధజములను నీ రెండు దోషములనుండి యీయేడు దుర్వ్యసనములును గణింప బడినవి. వీనియందు బూర్వపూర్వమనగా వ్యర్థవ్యయమున కంటె గఠోరవచనము, గఠోరవచనము కంటె నన్యాయముగ దండించుట, దానికంటె వేటాడుట, దానికంటె నతిస్త్రీసంగమము, దానికంటె జూదము,

దానికంటె మద్యాది సేవనము నెక్కువ దుష్టవ్యసనములు. (౧౦)

దుష్టవ్యసనములందు దగులువడుటకంటె జచ్చుట మేలు. ఏలయనగా దురాచారియగు పురుషుడు బ్రతికినకొలది పాపములే యొనరించి నీచగతిని - నధికదుఃఖమును బొందును. ఏవ్యసనమందును జిక్కువడని వాడు మృతినొందినను సుఖమునే యనుభవించును. కాబట్టి మద్యపానాది దుష్టవ్యసనములయందు నెన్నడును జిక్కువడక వానినుండి తొలగి ధర్మయుక్త గుణకర్మస్వభావములతో సర్వదా వర్తిల్లుట మనుష్యులందఱకును ముఖ్యముగా రాజునకు నుచితము.

(రాజసభాసదులు మంత్రులు నుండవలసిన విధము)

మౌలాన్ శాస్త్రవిదః శూరాన్ లబ్ధలక్ష్యాన్ కులోద్గతాన్,
సచివాన్ సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్. (౧)
అపి యత్సుకరం కర్మ తదప్యేకేన దుష్కరమ్,
విశేషతోఽసహాయేన కిన్ను రాజ్యం మహోదయమ్. (౨)
తైః సార్థం చింతయేన్నిత్యం సామాన్యం సంధివిగ్రహమ్,
స్థానం సముదయం గుప్తిం లబ్ధప్రశమనాని చ. (౩)
తేషాం స్వం స్వమభిప్రాయ ముపలభ్య పృథక్ పృథక్,
సమస్తానాం చ కార్యేషు విదధ్యాద్ధిత మాత్మనః (౪)
అన్యానపి ప్రకుర్వీత శుచీన్ ప్రాజ్ఞా నవస్థితాన్,
సమ్యగర్థసమాహర్తౄ నమాత్యాన్ సుపరీక్షితాన్. (౫)
నివర్తేతాస్య యావద్భి రితి కర్తవ్యతా నృభిః,
తావతోఽ తంద్రితాన్ దక్షాన్ ప్రకుర్వీత విచక్షణాన్. (౬)
తేషామర్థే నియుంజీత శూరాన్ దక్షాన్ కులోద్గతాన్,
శుచీనాకరకర్మాంతే భీరూ నంతర్నివేశనే. (౭)

(దూతనియుక్తి)

దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్రవిశారదమ్,
ఇంగితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతమ్. (౮)
అనురక్తః శుచి ర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్,
వపుష్మాన్ వీతభీ ర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే. (౯) మను. ౭-౫౪-౫౭; ౬౦-౬౪

స్వరాజ్యమునందును, స్వదేశమునందు నుత్పన్నమైనవారు, వేదశాస్త్రవేత్తలు, శూరవీరులు, వ్యర్థాలోచనలు చేయనివారు, కులీనులు నైన వారి నేడుగురను గాని, యెనమండుగురనుగాని మంత్రులుగా నియమించుకొనవలయును. (౧)

తగిన సహాయములేక సులభకార్యమునుగూడ నొక్కడే చేయుట కఠినము. అట్టియెడ గొప్ప రాజ్యకార్యము లొక్కరిచే నెట్లు కాగలవు? కావున నొక్కనినే రాజును జేయుటకాని, యొక్కని బుద్ధిమీదనే నిర్భరమగుటకాని యుక్తము కాదు. (౨)

రాజు ప్రతిదినము నాయారాజ్యకార్యములందు గుశలులు, విద్వాంసులు నగుమంత్రులతోగూడి సంధిః = ఎవరితో సంధిజేయవలయునో, విగ్రహః = ఎవరితో విరోధము పెట్టుకొనవలయునో, స్థానమ్ = స్థితిసమయమును గుర్తించి తనస్థానమున నూరక యుండవలయునో, యెవనియెడ దటస్థముగా నుండి తన రాజ్యమును రక్షించుకొనవలయునో, సముదయమ్ = అభివృద్ధికలిగినపు డెవరిమీద దండెత్త

వలయునో, గుప్తిమ్ = మూలసైన్యమును, గోశమును నెట్లు రక్షించుకొనవలయునో, లబ్ధప్రశమనాని = వశమైనదేశమున శాంతిని స్థాపించి నిరుపద్రవముగ నెట్లు చేసికొనవలయునో యను నీయాఱు విషయములనుగూర్చి బాగుగా విచారింపవలయును. (౩)

ఆ యా సభాసదుల నుండి వేఱువేఱుగా వారి యభిప్రాయములను దెలిసికొని బహుపక్షాను సారముగ దనకును నితరులకును హితకరములగు వానిని జేయబూనవలయును. (౪)

పవిత్రాత్ములు, బుద్ధిమంతులు, దృఢచిత్తులు, పదార్థములను సంగ్రహించుటలో నతిచతురులు, సుపరీక్షితులు నైనవారిని గూడ మంత్రులుగా నియమించుకొనవచ్చును. (౫)

సోమరులుకానివారు, బలవంతులు, మిక్కిలి చతురులు నగు ప్రధాన పురుషులను నధికారులుగా గార్యసిద్ధి కావశ్యకమైనంతమందిని నియమింపవలయును. (౬)

వారి యధీనమందుండు శూరవీరులును, బలాఢ్యులకులమందు బుట్టిన వారును, బవిత్రులునగు భృత్యులను గొప్ప గొప్ప కార్యములందును, భయపడు పిఱికివారిని లోపలి కార్యములందు నుంచవల యును. (౭)

ప్రశంసనీయ వంశమందు బుట్టి చతురుడు, పవిత్రుడు, హావభావ చేష్టలచే లోపలి హృదయమును ముందురాబోవు వానిని గూడ దెలిసికొనువాడు, సర్వశాస్త్రవిశారదుడు నగు నొకదూతను గూడ రాజు తన కొలఁకు నుంచుకొనవలయును. (౮)

రాజ్యకార్యములందత్యంతోత్సాహము కలవాడు, నిష్కపటి, పవిత్రాత్ముడు, చతురుడు, మఱపు లేనివాడు, దేశకాలముల గుర్తించి వర్తించువాడు, సుందర రూపయుక్తుడు, నిర్భయుడు, గొప్పవక్తయు నగువాడే రాజునకు దూతయగుటకు బ్రశస్తుడు. (౯)

(రాజు, మంత్రి, దూత – వారి యధికారములు)

ఎవని కెవనికి నేయే యధికారము లుండవలయును?

అమాత్యే దండ ఆయత్తో దండే వైనయికీ క్రియా,
నృపతౌ కోశరాష్ట్రే చ దూతే సంధివిపర్యయౌ. (౧)
దూత ఏవ హి సంధత్తే భినత్త్యేవ చ సంహతాన్,
దూతస్తత్ కురుతే కర్మ భిద్యంతే యేన వా న వా. (౨)
బుద్ధ్వా చ సర్వం తత్త్వేన పరరాజచికీర్షితమ్,
తథా ప్రయత్న మాతిష్ఠేత్ యథాత్మానం న పీడయేత్. (౩)

(దుర్గభేదములు – వాని యుపయోగము)

ధనుర్ దుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్షమేవ వా,
నృదుర్గం గిరిదుర్గం వా సమాశ్రిత్య వసేత్పురమ్. (౪)
ఏకః శతం యోధయతి ప్రాకారస్థో ధనుర్ధరః,
శతం దశ సహస్రాణి తస్మాద్దుర్గం విధీయతే. (౫)
తత్ స్యాదాయుధసంపన్నం ధనధాన్యేన వాహనైః,
బ్రాహ్మణైః శిల్పిభిర్ యన్త్రైర్ యవసేనోదకేన చ. (౬)
తస్య మధ్యే సుపర్యాప్తం కారయేద్ గృహమాత్మనః,
గుప్తం సర్వర్తుకం శుభ్రం జలవృక్షసమన్వితమ్. (౭)

తదధ్యాస్యోద్వహేద్ భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్,
కులే మహతి సంభూతాం హృద్యాం రూపగుణాన్వితామ్. (౮)
పురోహితం ప్రకుర్వీత వృణుయాదేవ చర్త్విజం,
తేఽస్య గృహ్యాణి కర్మాణి కుర్యుర్ వైతాని కాని చ. (౯)

మను ౭–౬౫, ౬౬, ౬౭, ౭౦, ౭౭ –౭౮

మంత్రికి దండాధికార మొసంగవలయును. ఆదండమున వినయముండవలయును. దండమున నన్యాయము జరుగరాదు. రాజాధీనమున గోశము, రాజకార్యము నుండవలయును. సభాధీనమున సమస్త కార్యములు నుండవలయును. ఇతరులతో మైత్రికాని, విరోధముకాని చేయునధికారము దూతకొసంగవలయును. (౧)

విరోధులలో సంధిని, గలిసియున్న దుష్టులలో విరోధమును గలిగింపగలవాడు దూత. కావున శత్రువుల మధ్య భేదభావము కలిగి వారు వేఱగునట్లు దూత వర్తింపవలయును. (౨)

సభాపతి, సభాసదులు, దూతయు దమకు విరోధులైన రాజుల రాజ్యవ్యవహారములను యథార్థముగ నెఱిగి వారివలన దమకు బాధ కలుగకుండునట్లు యత్నింపవలయును. (౩)

కావున సుందరములైన యరణ్యములు, ధనధాన్యములుగల దేశమునందు, ధనుర్ దుర్గమ్ = దనుర్ధారులైన పురుషులతో నితరులకు ప్రవేశింపనలవిగానట్టియు, మహీదుర్గం =మట్టితో నిర్మించినట్టియు, అబ్ దుర్గం = జలముతో జుట్టబడినట్టియు, వార్క్షమ్ = నలువైపుల వనములతో నిండినట్టియు, నృదుర్గమ్ = అన్నివైపుల సేనానివేశము గలదియు, గిరిదుర్గం = చుట్టుపర్వతములు గలిగినట్టియు గోటనేర్పఱచుకొని, దానిమధ్య నగరమును నిర్మించుకొనవలయును. (౪)

నగరమునకు జుట్టు ప్రాకారము నేర్పఱపవలయును. ఏలయన ప్రాకారముననున్న యొక్కవీరుడు ధనుర్ధారియై బయటనున్న నూఱుమంది శస్త్రధారులతోను, గోటలోనున్న వందమంది వెలుపలనున్న పదివేలమందితోను యుద్ధమొనర్పగలరు. కావున దుర్గనిర్మాణము మిక్కిలియావశ్యకము. (౫)

ఆదుర్గము శస్త్రాస్త్రములతోను, ధనధాన్యములతోను, వాహనములతోను, నుపదేశించుటకు, జదివించుటకు నర్హులగు బ్రాహ్మణులతోను, శిల్పిహస్తకళల నేర్చినవారితోను, యవస – గడ్డి జలము మున్నగు వానితోను నిండి పరిపూర్ణమై యుండవలయును. (౬)

ఆ దుర్గములోపల జలము, వృక్షములు, పుష్పఫలాదులన్నియు సురక్షితములై యుండవలయును. అన్ని ఋతువులందును సుఖకారకముగా నుండునట్టియు, సర్వరాజకార్య నిర్వహణమునకు దగినంత వైశాల్యము కలిగినట్టియు, దెల్లని భవనమొకటి రాజు తనకొఱ కేర్పఱచుకొనవలయును. (౭)

బ్రహ్మచర్యముతో విద్యనభ్యసించి, యింతవఱకు రాజకార్యముల నిర్వహించి యటుపై సౌందర్యరూప గుణయుక్తయు, హృదయంగమయు నుత్తమకులజాతయు, సుందరలక్షణయుక్తయు నగు నొక్కక్షత్రియ కన్యను దనకు సదృశయు, విద్యాదిగుణ కర్మస్వభావములు గలదియు నగుదానిని వివాహమాడవలయును. ఇతర స్త్రీలను నగమ్యలగా నెంచి యెన్నడు వారి వంకజూడరాదు. (౮)

పురోహితుని, ఋత్విజుని వరింపవలయును. వారగ్నిహోత్రమును బక్షేష్టి మున్నగు క్రతువులను రాజగృహమున జేయుదురు. రాజెల్లపుడు రాజకార్యముల నిమగ్నుడై యుండవలయును. రాజు రాత్రింబవళ్ళు రాజకార్యములందు నిమగ్నుడై యుండుటయే యతనికి సంధ్యోపాసనాదులు. రాజకార్యమొక్కటియు నెన్నడు జెడకుండ జూడవలయును. (౯)

(వివిధ - అధ్యక్షనియుక్తి)

సాంవత్సరిక మాప్తైశ్చ రాష్ట్రాదాహారయేద్బలిమ్,
స్యాచ్చామ్నాయపరో లోకే వర్తేత పితృవన్నృషు. (౧)
అధ్యక్షాన్ వివిధాన్ కుర్యాత్ తత్ర తత్ర విపశ్చితః,
తేఽస్య సర్వాణ్యవేక్షేరన్ నృణాం కార్యాణి కుర్వతామ్. (౨)
ఆవృత్తానాం గురుకులాద్విప్రాణాం పూజకో భవేత్,
నృపాణామక్షయోహ్యేష నిధిర్ బ్రాహ్మో విధీయతే. (౩)

(సంగ్రామ నియమములు)

సమోత్త మాధమైర్ రాజా త్వాహూతః పాలయన్ ప్రజాః,
న నివర్తేత సంగ్రామాత్ క్షాత్రం ధర్మమనుస్మరన్. (౪)
ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసంతో మహీక్షితః,
యుధ్యమానాః పరం శక్త్యా స్వర్గం యాన్త్యపరాఙ్ముఖాః (౫)
న చ హన్యాత్ స్థలారూఢం న క్లీబం న కృతాంజలిమ్,
న ముక్తకేశం నాసీనం న తవాస్మీతి వాదినమ్. (౬)
న సుప్తం న విసన్నాహం న నగ్నం న నిరాయుధమ్,
నాయుధ్యమానం పశ్యన్తం న పరేణ సమాగతమ్. (౭)
నాయుధవ్యసనం ప్రాప్తం నార్తం నాతిపరిక్షతమ్,
న భీతం న పరావృత్తం సతాం ధర్మమనుస్మరన్. (౮)
యస్తు భీతః పరావృత్తః సంగ్రామే హన్యతే పరైః,
భర్తుర్ యద్ దుష్కృతం కించిత్ తత్సర్వం ప్రతిపద్యతే. (౯)
యచ్చాస్య సుకృతం కించి దముత్రార్థముపార్జితమ్,
భర్తా తత్సర్వమాదత్తే పరావృత్తహతస్య తు. (౧౦)
రథాశ్వం హస్తినం ఛత్రం ధనం ధాన్యం పశూన్ స్త్రియః,
సర్వద్రవ్యాణి కుప్యం చ యో యజ్జయతి తస్య తత్. (౧౧)
రాజ్ఞశ్చ దద్యురుద్ధార మిత్యేషా వైదికీ శ్రుతిః,
రాజ్ఞా చ సర్వయోధేభ్యో దాతవ్యమపృథగ్ జితమ్. (౧౨)

మను. ౭-౮౦-౮౨, ౮౭.౮౯, ౯౧-౯౭

సంవత్సరపుబన్నును నాప్తపురుషుల మూలమున గ్రహింపనగును. సభాపతి = రాజు మొదలగు పురుషులు కూడ వేదానుకూలముగ నడచుచు ప్రజలయెడ దండ్రివలె వర్తింపవలయును. (౧)

ఆ యా రాజకార్యములందు వివిధరూపులగు నధ్యక్షులను నియమింపవలయును. వీ రా యాకార్యములందు నియుక్తులైన రాజపురుషులు తమ కర్తవ్యములను సరిగా నెఱవేర్చుచున్నారో లేదో చూచుచు సక్రమముగా నిర్వర్తించువారిని సత్కరించుచు, విరుద్ధముగా వర్తించువారిని న్యాయరీతి ననుసరించి దండించుచుండవలయును. ఇదియే వారి కర్తవ్యము. (౨)

ఎల్లపుడు వేదప్రచారము జరుగుట రాజుల కక్షయకోశము. దానిని రక్షించుటకు నెవరేని బ్రహ్మచర్య మును యథారీతిని బాలించి వేదాది శాస్త్రముల నధ్యయనముచేసి గురుకులము నుండి వచ్చిన వారిని, వారి గురువులను, రాజు, సభయు యోగ్యతకు దగినట్లు సత్కరింపవలయును. అందువలన రాజ్యమున

విద్యాభివృద్ధి గలిగి రాజ్యమత్యున్నతిని బొందును. (౩)

ఎన్నడేని ప్రజలను బాలించురాజును, నతనికంటె హీనుడుగాని సముడుగాని, యుత్తముడుగాని యుద్ధమున కాహ్వానించిన క్షత్రియధర్మమును స్మరించి యుద్ధము చేయుట కెన్నడు వెనుదీయరాదు. తనకు విజయము కలుగునట్లు మిక్కిలి నేర్పుతో యుద్ధము చేయవలయును. (౪)

యుద్ధమునం దొండొరులను జంపవలయునను కోరికతో దమశక్తికొలది యుద్ధమొనర్చుచు వెన్నుజూపని రాజులే సుఖమును బొందుదురు. కాబట్టి యెన్నడు విముఖుడు కారాదు. కాని, యెప్పుడేని శత్రువును జయించుటకు దాగవలసి వచ్చిన యట్లు చేయవచ్చును. ఏలయనగా శత్రువును జయించుట కట్లుచేయుట దోషముకాదు. సింహము కోపముతో నెదుర్కొని శస్త్రాగ్నియందు భస్మమగునట్లు రాజు మూర్ఖతవలన జెడరాదు. (౫)

యుద్ధసమయమున యుద్ధముతో సంబంధములేక యటనట నిలబడిన వారిని, నపుంసకుని జేతులు జోడించువానిని, దల విరియబోసికొనిన వానిని గూర్చుండినవానిని, శరణుజొచ్చినవానిని, (౬)

నిద్రపోవువానిని , మూర్ఛనొందిన వానిని, నగ్నుని, నాయుధములేనివానిని, యుద్ధమును జూచువానిని, శత్రువు వెంట నూరక వచ్చినవానిని, (౭)

ఆయుధప్రహారముతో దెబ్బతిని బాధపడువానిని, దుఃఖితుని, మిక్కిలిగా గాయపడినవానిని, భయపడిన వానిని, దిరిగిపోవువానిని, సత్పురుషుల ధర్మమును స్మరించుచు యోధులెన్నడు జంపరాదు. కాని, వారిని బట్టుకొని కారాగారమున నుంచి తగిన రీతిని వారికి భోజనాదుల నొసంగవలయును. గాయపడిన వారికినౌషధాదులనిప్పింపవలయును. వారిని దుఃఖింపజేయరాదు. పరిహసింపరాదు. వారిచే దగిన పనులను జేయింపవలయును. స్త్రీలు, బిడ్డలు, వృద్ధులు, నాతురులు, దుఃఖితులు నగువారిపైన శస్త్రమును బ్రయోగింపరాదు. ఇందు విశేషధ్యాన ముంచవలయును. వారిబిడ్డలను దనసంతానమువలె జూడవలయును. స్త్రీలనుగూడ బాలింపవలయును. వారిని దమ యక్కచెల్లెండ్ర వలెను, గుమార్తెలవలెను జూచుకొనవలయును. విషయాసక్త దృష్టితో వారి నెన్నడు దిలకింపరాదు. రాజ్యము కుదుటబడినపుడు మరల యుద్ధమునకు దండెత్తుదురను శంకలేని వారిని వారి దేశమునకో యిండ్లకో పంపవలయును. ముందు విఘ్నము కలిగింతురని తోచినవారిని నెల్లపుడు కారాగారమునందే యుంచవలయును. (౮)

భయపడి పాఱిపోయిన భృత్యుడు శత్రువులచే జంపబడినట్లయిన వాడు తన స్వామియొక్క దుష్కృతమును బొంది - దండనీయుడగును. (పాపియగును.) (౯)

ఇక నాభృత్యుడు పరలోకము కొఱకు సంపాదించుకొనిన సుకృత మీలోకమునను బరమునను సుఖము కలిగించు నతని ప్రతిష్ఠయు నతని స్వామిని జేరును. యుద్ధమునుండి పాఱిపోవువాడు చంపబడె నేని యతని కేమియు సుఖము కలుగదు. వానిపుణ్య ఫలమంతయు నష్టమగును. యథారీతిని యుద్ధమొన ర్చుటచే నతనికి బ్రతిష్ఠ కలుగును. (౧౦)

రథములు, గుఱ్ఱములు, నేనుగులు, ఛత్రములు, ధనధాన్యములు, బశువులు, స్త్రీలు, నితర నానావిధ వస్తుజాతము, నేయి, నూనె మున్నగు వానిని జయించిన సైనికులకు సేనాధ్యక్షులకు నీయవలయును. ఈ వ్యవస్థ నెన్నడు భంగపఱపరాదు. (౧౧)

సైనికులుగూడ తాము జయించిన పదార్థములలో బదునాఱవభాగము రాజునకు జెల్లింపవల యును. రాజు గూడ నందఱు గలిసి సంపాదించిన ధనములో బదునాఱవభాగమును సైనికులకీయవల యును. యుద్ధమునందెవడేని చనిపోయినచో నతని స్త్రీకిని, సంతానమునకును వానిభాగము నీయవలయును. వానికుమారులు సమర్థులయినపుడు వారికి దగిన యధికారముల నొసంగవలయును.

తన రాజ్యవృద్ధిని, ప్రతిష్ఠను, విజయమును గోరువాడెవ్వడు నీమర్యాద నుల్లంఘింపడు. (౧౨)

(పురుషార్థములు)

అలబ్ధం చైవ లిప్సేత లబ్ధం రక్షేత్ప్రయత్నతః,
రక్షితం వర్ధయేచ్చైవ వృద్ధం పాత్రేషు నిఃక్షిపేత్. (౧)
ఏతచ్చతుర్విధం విద్యాత్ పురుషార్థప్రయోజనమ్,
అస్య నిత్యమనుష్ఠానం సమ్యక్కుర్యాదతంద్రితః. (౨)
అలబ్ధమిచ్ఛేద్దండేన లబ్ధం రక్షేదవేక్షయా ,
రక్షితం వర్ధయేద్వృద్ధ్యా వృద్ధం దానేన నిఃక్షిపేత్. (౩) మను. ౭.౯౯—౧౦౧

రాజును, రాజసభయు, దమకు లేనిదానిని బొందుటకు నిచ్చగింప వలయును. కలిగినదానిని ప్రయత్నముచే రక్షింపవలయును. రక్షించిన దానిని వృద్ధిపఱపవలయును. వృద్ధిపఱచిన ధనమును వేదవిద్యయందును, ధర్మప్రచారమునందును, విద్యార్థులను, వేదమార్గోపదేశకులను, నసమర్థులగు ననాథులను బాలించుటకు నుపయోగింపవలయును. (౧)

ఈ నాలుగు విధముల పురుషార్థముల ప్రయోజనముల నెఱుగవలయును. సోమరితనమును విడిచి బాగుగా నిత్య మాచరింపవలయును. (౨)

అప్రాప్తమగుదానిని దండముచే బొందుట కిచ్ఛగింపవలయును. నిత్యము జూచుచు ప్రాప్తించిన దానిని రక్షింపవలయును. రక్షించిన దానిని వడ్డి మొదలగువానిచే వృద్ధిపఱప వలయును. వృద్ధిపఱచిన ధనమును బూర్వోక్తమార్గమందు నిత్యము ఖర్చుచేయవలయును. (౩)

(రాజు మాయాచారి కాగూడదు)

అమాయయైవ వర్తేత న కథంచన మాయయా,
బుధ్యేతారిప్రయుక్తాం చ మాయాం నిత్యం స్వసంవృతః. (౧)
నాస్య ఛిద్రం పరో విద్యాచ్ఛిద్రం విద్యాత్పరస్య తు,
గూహేత్కూర్మ ఇవాంగాని రక్షేద్వివరమాత్మనః. (౨)
బకవచ్చింతయేదర్థాన్ సింహవచ్చ పరాక్రమేత్,
వృకవచ్చావలుంపేత శశవచ్చ వినిష్పతేత్. (౩) మను ౭.౧౦౪—౧౦౬

ఎన్నడును నెవ్వరితోడను గపటముతో వర్తింపగూడదు. ఎల్లరతోను నిష్కపటముగా వర్తింపవల యును. నిత్యము దన్ను రక్షించుకొనుచు శత్రువుచేయు గపటమును దెలిసి నివృత్తి చేసికొనవలయును. (౧)

ఏ శత్రువు తన ఛిద్రమును – నిర్బలతను నెఱుగజాలకుండునట్లు చేసి తాను శత్రుఛిద్రములను గనిపెట్టుచుండవలయును. తాబేలు తన యంగములను గుప్తముగా నుంచునట్లు శత్రువులు ప్రవేశింపగల ఛిద్రములను గుప్తముగ నుంచవలయును. (౨)

కొంగధ్యానావస్థితమయి యుండి చేపలను బట్టుటకు వేచి చూచునట్లుగా నర్థసంగ్రహమును గూర్చి విచారించుచుండవలయును. ద్రవ్యాది పదార్థములను, బలమును వృద్ధిపఱచుకొని శత్రువును జయించు టకు సింహమువలె బరాక్రమింపవలయును. చిఱుతపులివలె బొంచియుండి శత్రువులను బట్టవలయును. తోడేలువలె జంపవలయును. సమీపించిన బలముగల శత్రువునుండి కుందేటివలె దూరముగ బరుగెత్తు కొనిపోయి పిమ్మట వానిని గపటముతో బట్టవలయును. (౩)

(దొంగలను వశపఱచుకొనవలయును)

ఏవం విజయమానస్య యేఽస్య స్యుః పరిపంథినః,
తానానయేద్వశం సర్వాన్ సామాదిభి రుపక్రమైః. (౧)
యది తే తు న తిష్ఠేయు రుపాయైః ప్రథమైస్త్రిభిః,
దండేనైవ ప్రసహ్యైతాంశ్ఛనకై ర్వశమానయేత్. (౨)
యథోద్ధరతి నిర్దాతా కక్షం ధాన్యం చ రక్షతి,
తథా రక్షేన్నృపో రాష్ట్రం హన్యాచ్చ పరిపంథినః. (౩) మను. ౭-౧౦౭, ౧౦౮, ౧౧౦

ఇట్లు విజయమునొందు సభాపతి రాజ్యమందు బరిపంథి - బందిపోటు దొంగలుండిరేని వారిని (సామ) సామములతో (దాన) కొంచెమేదేని యొసంగి వారిని వశపఱచుకొనవలయును. లేక భేద - వారిలో వైరమును బుట్టించి వశపఱచుకొనవలయును. (౧)

ఈ మూడుపాయములతో వశము కారేని యతికఠినదండనముచే బలాత్కారముగ్గానైన వశపఱచు కొనవలయును. (౨)

ధాన్యమును సేకరించువాడు పొట్టును - తాలు, తప్ప వేఱుచేసి ధాన్యమును రక్షించునట్లు - అనగా విఱుగకుండ గాపాడునట్లు రాజు బందిపోటు దొంగలను జంపి రాజ్యమును రక్షింపవలయును. (౩)

(ప్రజను బీడింపరాదు.)

మోహాద్రాజా స్వరాష్ట్రం యః కర్షయత్యనవేక్షయా,
సోఽచిరాద్భ్రశ్యతే రాజ్యాజ్జీవితాచ్చ సబాంధవః. (౧)
శరీరకర్షణాత్ప్రాణాః క్షీయంతే ప్రాణినాం యథా,
తథా రాజ్ఞామపి ప్రాణాః క్షీయంతే రాష్ట్రకర్షణాత్. (౨) మను ౭-౧౧౧-౧౧౨

మోహముచేతను నవిచారముచేతను రాజ్యమును దుర్బలపఱచు రాజు తాను బంధువులతోబాటు జీవితమునుండియు, రాజ్యమునుండియు భ్రష్టుడగును. (౧)

శరీరములను గృశింపజేయుటవలన బ్రాణుల ప్రాణము క్షీణమయినట్లు ప్రజలను దుర్బలులను జేయుటవలన రాజుల ప్రాణములు బలాదులు బంధుసహితముగ నశించును. (౨)

(శాసన పద్ధతి)

రాష్ట్రస్య సంగ్రహే నిత్యం విధానమిదమాచరేత్,
సుసంగ్రహీతరాష్ట్రో హి పార్థివః సుఖమేధతే. (౧)
ద్వయోస్త్రయాణాం పంచానాం మధ్యే గుల్మమధిష్ఠితమ్,
తథా గ్రామశతానాం చ కుర్యాద్రాష్ట్రస్య సంగ్రహమ్. (౨)
గ్రామస్యాధిపతిం కుర్యాద్దశగ్రామపతిం తథా,
వింశతీశం శతేశం చ సహస్రపతిమేవ చ. (౩)
గ్రామదోషాన్ సముత్పన్నాన్ గ్రామికః శనకైః స్వయమ్,
శంసేద్గ్రామదశేశాయ దశేశో వింశతీశినమ్. (౪)
వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్,
శంసేద్గ్రామశతేశస్తు సహస్రపతయే స్వయమ్. (౫)
తేషాం గ్రామ్యాణి కార్యాణి పృథక్కార్యాణి చైవ హి,
రాజ్ఞోఽన్యః సచివః స్నిగ్ధస్తాని పశ్యేదతంద్రితః. (౬)

నగరే నగరే చైకం కుర్యాత్సర్వార్థచింతకమ్,
ఉచ్చైః స్థానం ఘోరరూపం నక్షత్రాణామివ గ్రహమ్. (౭) మను. ౭.౧౦౩—౧౦౭; ౧౨౦, ౧౨౧

కాబట్టి రాజును రాజసభయు రాజకార్యము ఫలించుటకు దగిన ప్రయత్నము చేయవలయును. దానివలన రాజకార్యములు యథారీతిని సిద్ధించును. రాజు రాజ్యపాలనమునందు నన్నివిధముల దత్పరుడై యుండును. అతనికి సుఖమెల్లపుడు వర్ధిల్లును. (౧)

కాబట్టి రెండు, మూడు, నయిదు లేక నూఱు గ్రామములనడుమ నొక్కొక్క రాజస్థానముంచవల యును. అందు యోగ్యత ననుసరించి పనిచేయు భృత్యులు మున్నగు రాజపురుషుల నుంచి సర్వరాజ్య కార్యములను బూర్తిచేయవలయును. (౨)

ఒక్కొక్క గ్రామమందు నొక్కొక్క ప్రధాన పురుషు నుంచవలయును. పదిగ్రామములమీద మఱియొక్కని, నిరువది గ్రామముల మీద మూడవవానిని, నూఱుగ్రామములమీద నాల్గవవానిని, వేయి గ్రామములమీద నయిదవ వానిని నియమింపవలయును. అనగా నిప్పుడున్న ట్లొక్కొక్క గ్రామమం దొక్కొక్క పట్వారిని, (కరణమును) నట్టిపది గ్రామములమీద నొకతాణాను, రెండు తాణాలపైన నొక పెద్ద తాణాను, నయిదు తాణాల మీద నొక తహశీలును, బదితహశీలులపైన నొక జిల్లాను నియమింపవలయును. ఇప్పటివారు నిదేరీతి మన్వాది ధర్మశాస్త్రముల నుండి గ్రహించియున్నారు. (౩)

ఈరీతిని దగిన యేర్పాటు చేసి యాజ్ఞాపించవలయును. ప్రతి గ్రామాధిపతియు నిత్యము దనగ్రామములో నుత్పన్నములగు దోషములను గుప్తరీతిని దశగ్రామాధిపతికిని, నాతడు తన పది గ్రామముల వర్తమానము నిరువది గ్రామముల యధిపతికి దెలుపవలయును. (౪)

ఇరువది గ్రామముల యధిపతి తన గ్రామములలో జరుగువానిని శతగ్రామాధిపతికిని, నతడు తన నూఱు గ్రామముల సంగతిని వేయి గ్రామముల యధిపతికిని, నతడు తన వేయి గ్రామముల విశేషమును బదివేల గ్రామముల యధిపతికిని, నతడు తన పదివేల గ్రామముల వృత్తాంతమును లక్ష గ్రామాధిపతికిని, నతడు తన వార్తలను రాజసభకును బ్రతిదినము దెలుపవలయును. ఆరాజసభవారందఱు మహారాజసభకు – సార్వభౌమచక్రవర్తికి మహారాజసభకు సమస్తభూగోళ వర్తమానమును దెలుపవలయును. (౫)

ప్రతి పదివేల గ్రామములకు నిరువురు సభాపతు లుండవలయును. వారిలో నొకడు రాజసభ యందు, రెండవసభాపతి సమస్త న్యాయాధీశాది రాజపురుషుల కార్యములను సర్వదా సోమరితనము విడిచి తిరిగి చూచుచుండవలయును. (౬)

గొప్పగొప్ప నగరములందు నక్షత్రముల మధ్య జంద్రుని (గ్రహము) వలె సుందరమును, నుచ్చమును, విశాలము నగు విచారణ సభామందిరముండవలయును. అందు – విద్యచే నన్నిటి నన్ని విధముల బరీక్షించినవారు, గూర్చుండి విచారణము చేయవలయును. రాజును బ్రజలును మున్నతి బొందు విధానములను, విద్యను సర్వదా ప్రకాశపఱచుచుండవలయును. (౭)

స తా ననుపరిక్రామే త్సర్వానేవ సదా స్వయమ్,
తేషాం వృత్తం పరిణయే త్సమ్యగ్రాష్ట్రేషు తచ్చరైః. (౧)
రాజ్ఞో హి రక్షాధికృతాః పరస్వాదాయినః శఠాః,
భృత్యా భవంతి ప్రాయేణ తేభ్యో రక్షేదిమాః ప్రజాః. (౨)
యే కార్యికేభ్యోఽర్థమేవ గృహ్ణీయుః పాపచేతసః,
తేషాం సర్వస్వమాదాయ రాజా కుర్యాత్ప్రవాసనమ్. (౩) మను. ౭.౧౨౨ – ౧౨౪

నిత్యము సంచరించు సభాపతియధీనమందు దూతల నుంచవలయును. సర్వరాజ్యము

యొక్కయు, ప్రజల యొక్కయు గుణదోషములను భిన్న భిన్న జాతులకు సంబంధించిన రాజపురుషుల ద్వారా గుప్తరీతిని దెలిసికొని యపరాధులను దండించవలయును. గుణవంతులను నెల్లప్పుడు సమ్మానింపవలయును. (౧)

ప్రజలను రక్షించు నధికారమును రాజు, ధార్మికులు, విద్వాంసులు, గులీనులు నగువారి కీయవలయును. శఠులను, బరపదార్థముల హరించు బందిపోటు దొంగలను గూడ వారికి భృత్యులనుగా నుంచి దుష్టకర్మముల నుండి వారిని రక్షించుటకు రాజునకు భృత్యులుగాజేసి యారక్షించుట విద్వాంసుల స్వాధీనముచేసి వారిద్వారా ప్రజలను దగురీతిని రక్షింపవలయును. (౨)

అన్యాయముగా వాది ప్రతివాదుల నుండి గుప్తముగా ధనము బుచ్చుకొని పక్షపాతముచేయు నుద్యోగుల సర్వస్వమును హరించి తగినట్లు దండించి, మరల వాడు రాజాలని దేశమందు వాని నుంచవలయును. వానిని శిక్షింపనిచో నతనిని జూచి తక్కిన రాజభృత్యులును దుష్టకర్మములను జేయుదురు. వాడు దండింపబడెనేని దక్కినవారును నట్టి చెడుపనులనుండి తొలగి యుందురు. ఆ రాజపురుషుల యోగక్షేమములు బాగుగా జరుగునట్లును, వారు బాగుగా ధనాఢ్యులగునట్లును, తగినంత ధనమో, భూమియో రాజ్యమునుండి వారికి మాసికముగానో, వార్షికముగానో లేక యొకేమాటుగానో లభింపవలయును. వృద్ధులైనవారికి సగము లభింపవలయును. ఆవృద్ధులు బ్రతికియుండు వఱకు వారి జీవనము జరుగునట్లు ధ్యానముంచవలయును. కాని వారి సంతానములకు వారిగుణముల ననుసరించి సత్కారముగాని, యుద్యోగముగాని తప్పక యీయవలయును. ఇదియుగాక యావృద్ధులు గతించిన దాదివారి బాలురు సమర్థులగు వఱకు వారికిని, వారి భార్యలు బ్రతికియుండెనేని వారికిని, నిర్వాహార్థము దగినంత ధనమీయవలయును. ఆ స్త్రీలును బాలురును దుశ్చరిత్రులైన నేమియు నీయనక్కఱ యుండదు. ఇట్టినీతిని రాజు యథావిధి నడుపవలయును. (౩)

(పన్నులు గ్రహించువిధానము)

యథా ఫలేన యుజ్యేత రాజా కర్తా చ కర్మణామ్,
తథాఽవేక్ష్య నృపో రాష్ట్రే కల్పయేత్సతతం కరాన్. (౧)
యథాల్పాల్పమదన్త్యాద్యం వార్యోకోవత్సషట్పదాః,
తథాల్పాల్పో గ్రహీతవ్యో రాష్ట్రాద్రాజ్ఞాబ్దికః కరః. (౨)
నోచ్ఛింద్యాదాత్మనో మూలం పరేషాం చాతితృష్ణయా,
ఉచ్ఛిన్దన్హ్యాత్మనో మూలమాత్మానం తాంశ్చ పీడయేత్. (౩)
తీక్ష్ణశ్చైవ మృదుశ్చ స్యాత్కార్యం వీక్ష్య మహీపతిః,
తీక్ష్ణశ్చైవ మృదుశ్చైవ రాజా భవతి సమ్మతః. (౪) మను. ౭.౧౨౮, ౧౨౯, ౧౩౯, ౧౪౦

రాజును, గార్యకర్తలగు రాజపురుషులును, జనులును సుఖరూపఫలముతో గూడియుండునట్లు విచారించి రాజు, రాజసభవారును రాజ్యమునందు బన్ను విధింపవలయును. (౧)

భోగ్యపదార్థమును జెలగయు, దూడయు, దుమ్మెదయు, గొంచెము కొంచెముగా గ్రహించునట్లు రాజును బ్రజలనుండి వార్షికపుబన్నును గొంచెము గొంచెముగా గ్రహింపవలయును. (౨)

మిక్కిలి లోభముచే దనయొక్కయు, నితరులయొక్కయు, సుఖమూలమును నష్టమెన్నటికిని జేయగూడదు. సుఖమూలమును ఛేదించు వ్యవహారము తనకు, నితరులకు బీడనే కలిగించును. (౩)

కార్యము ననుసరించి తీక్ష్ణుడు, గోమలుడు నగునట్టి మహీపతి దుష్టులకు దీక్ష్ణుడు, శ్రేష్ఠులకు గోమలుడు నయి యతిమాననీయుడగును. (౪)

ఏవం సర్వం విధాయేదమితి కర్తవ్యమాత్మనః,
యుక్తశ్చైవాప్రమత్తశ్చ పరిరక్షేదిమాః ప్రజాః. (౫)
విక్రోశంత్యో యస్య రాష్ట్రాద్ ధ్రియంతే దస్యుభిః ప్రజాః,
సంపశ్యతః సభృత్యస్య మృతః స న తు జీవతి. (౬)
క్షత్రియస్య పరో ధర్మః ప్రజానామేవ పాలనమ్,
నిర్దిష్టఫలభోక్తా హి రాజా ధర్మేణ యుజ్యతే. (౭) మను. ౭.౧౪౨—౧౪౪.

ఈ రీతిని రాజ్యపుటేర్పాటుల నన్నిటిని జేసి సర్వదా వానియందు దత్పరుడై ప్రమాదరహితుడై నిరంతరము దన ప్రజలను బాలింపవలయును. (౫)

భృత్యసహితుడై యేరాజు చూచుచుండగా నేడ్చుచున్న ప్రజల పదార్థములను, ప్రాణములను దొంగ లపహరింతురో, యారాజు తన భృత్యామాత్యసహితముగ బ్రతికియుండియు జచ్చినవాడే యని తెలియవలయును. ఆరాజు మహాదుఃఖమును బొందును. (౬)

కాబట్టి రాజులకు బ్రజలను బాలించుటయే పరమధర్మము. మనుస్మృతి యేడవయధ్యాయమందు వ్రాయబడియుండునట్లును, సభ నియమించినట్లును బన్ను పుచ్చుకొని యనుభవించురాజు ధర్మాత్ముడై సుఖము బొందును. దీనికి విపరీతముగ నొనర్చు రాజు దుఃఖమునే పొందును. (౭)

(రాజుదినచర్య)

ఉత్థాయ పశ్చిమే యామే కృతశౌచః సమాహితః,
హుతాగ్నిర్బ్రాహ్మణాంశ్చార్చ్య ప్రవిశేత్స శుభాం సభామ్. (౧)
తత్ర స్థితాః ప్రజాః సర్వాః ప్రతినన్ద్య విసర్జయేత్,
విసృజ్య చ ప్రజాః సర్వా మంత్రయేత్సహ మంత్రిభిః. (౨)
గిరిపృష్ఠం సమారుహ్య ప్రాసాదం వా రహో గతః,
అరణ్యే నిఃశలాకే వా మంత్రయేదవిభావితః. (౩)
యస్య మంత్రం న జానంతి సమాగమ్య పృథగ్జనాః,
స కృత్స్నాం పృథివీం భుంక్తే కోశహీనోఽపి పార్థివః. (౪) మను. ౭.౧౪౫—౧౪౮

రా జంతిమయామమున లేచి శౌచాదులనుండి నివృత్తుడై సావధానముతో బరమేశ్వరధ్యానము, నగ్నిహోత్రము, ధార్మికవిద్వాంసుల సత్కారముజేసి. భోజనమొనర్చి సౌధాంతరముననున్న సభయందు బ్రవేశింపవలయును. (౧)

అక్కడ నిలబడి యుపస్థితులైన ప్రజాజనులను గౌరవింపవలయును. వారిని వదలి ముఖ్య మంత్రితో రాజ్యవ్యవస్థనుగూర్చి విచారింపవలయును. (౨)

తదుపరి మంత్రితో గలిసి భ్రమణమున కేగవలయును. పర్వతశిఖరమందుగాని, యేకాంతగృహ మునగాని, యరణ్యమునగాని, యొక పుల్లయైన లేనిచోట – నిర్జనప్రదేశమున జేరి యట గూర్చుండి మంత్రితో విరుద్ధభావనను వదలి విచారణము జేయవలయును. (౩)

రాజు తన గూఢమైన యాలోచనము లితరజను లెఱుగకుండునట్లు గంభీరములు, శుద్ధములు, పరోపకారార్థములు నైనవాని నెల్లపుడు గుప్తములుగా నుంచవలయును. అట్టిరాజు బలహీనుడయ్యు బృథివీ రాజ్యము నంతటిని నేలుసమర్థుడగును. కావున సభాసదుల యనుమతిలేక రాజు తన మనస్సుతో నేయొక్క కార్యమును జేయరాదు . (౪)

(సంధివిగ్రహాద్యుపాయములు)

ఆసనం చైవ యానం చ సంధి విగ్రహమేవ చ,
కార్యం వీక్ష్య ప్రయుంజీత ద్వైధం సంశ్రయమేవ చ. (౧)
సంధిం తు ద్వివిధం విద్యాద్ రాజా విగ్రహమేవ చ,
ఉభే యానాసనే చైవ ద్వివిధం సంశ్రయః స్మృతః. (౨)
సమానయానకర్మా చ విపరీతస్తథైవ చ,
తథా త్వాయతిసంయుక్తః సంధిర్ జ్ఞేయో ద్విలక్షణః. (౩)
స్వయం కృతశ్చ కార్యార్థ మకాలే కాల ఏవ వా,
మిత్రస్య చైవాపకృతే ద్వివిధో విగ్రహః స్మృతః. (౪)
ఏకాకినశ్చాత్యయికే కార్యే ప్రాప్తే యదృచ్ఛయా,
సంహతస్య చ మిత్రేణ ద్వివిధం యానముచ్యతే. (౫)
క్షీణస్య చైవ క్రమశో దైవాత్ పూర్వకృతేన వా,
మిత్రస్య చానురోధేన ద్వివిధం స్మృతమాసనమ్. (౬)
బలస్య స్వామినశ్చైవ స్థితిః కార్యార్థసిద్ధయే,
ద్వివిధం కీర్త్యతే ద్వైధం షాడ్గుణ్యగుణవేదిభిః. (౭)
అర్థసంపాదనార్థం చ పీడ్యమానః స శత్రుభిః,
సాధుషు వ్యపదేశార్థం ద్వివిధః సంశ్రయః స్మృతః. (౮)
యదావగచ్ఛేదాయత్యా మాధిక్యం ధ్రువమాత్మనః,
తదా త్వేచాల్పికాం పీడాం తదా సంధిం సమాశ్రయేత్. (౯)
యదా ప్రహృష్టా మన్యేత సర్వాస్తు ప్రకృతీర్ భృశమ్,
అత్యుచ్ఛ్రితంతథాత్మానం తదా కుర్వీత విగ్రహమ్. (౧౦)
యదా మన్యేత భావేన హృష్టం పుష్టం బలం స్వకమ్,
పరస్య విపరీతం చ తదా యాయాద్రిపుం ప్రతి. (౧౧)
యదా తు స్యాత్ పరిక్షీణో వాహనేన బలేన చ,
తదాసీత ప్రయత్నేన శనైః సాంత్వయన్నరీన్. (౧౨)
మన్యేతారిం యదా రాజా సర్వథా బలవత్తరమ్,
తదా ద్విధా బలం కృత్వా సాధయేత్ కార్యమాత్మనః. (౧౩)
యదా పరబలానాం తు గమనీయతమో భవేత్,
తదా తు సంశ్రయేత్ క్షిప్రం ధార్మికం బలినమ్ నృపమ్. (౧౪)
నిగ్రహం ప్రకృతీనాం చ కుర్యాద్యోఽరిబలస్య చ,
ఉపసేవేత తం నిత్యం సర్వయత్నైర్ గురుం యథా. (౧౫)
యది తత్రాపి సంపశ్యేద్ దోషం సంశ్రయకారితమ్,
సుయుద్ధమేవ తత్రాపి నిర్విశంకః సమాచరేత్. (౧౬) మను. ౭.౧౬౧—౧౭౬

రాజాధిరాజపురుషులకందఱకు నీవిషయము లక్ష్యమున నుంచుకొనదగినది:-

ఆసనము = స్థిరత, యానము = శత్రువుతో బోరాడవెళ్ళుట, సంధి = శత్రువులతో గలయిక - మైత్రిచేయుట, విగ్రహ = దుష్టశత్రువులతో యుద్ధమొనర్చుట, ద్వైధం = సేనను రెండు భాగములు చేసి

జయమును బొందుట, సంశ్రయః = తాను నిర్బలుడైనపుడు బలవంతుడైన మఱియొకరాజు నాశ్రయించుట, ఈ యాఱు విధములగు కర్మములు యోగ్యత ననుసరించి కార్యమును విచారించి యందు నుపయుక్తములు చేయవలయును. (౧)

సంధి విగ్రహాదులన్నియు రెండు విధములుగా నుండును. వానిని రాజు బాగుగ నెఱుగవలయును. (౨)

సంధిః- శత్రువులతో మైత్రిచేయుట, లేక యందులకు విపరీతముగ నడుచుకొనుట యని రెండు విధములు. కాని వర్తమానమునందును, భవిష్యత్తునందును జేయదగిన కార్యములను విడువక చేయుచునే యుండవలయును. (౩)

విగ్రహము :- కార్యసిద్ధికొఱకు నుచితా నుచిత సమయములందు స్వయముగా విరోధము చేయుట, మిత్రున కపకారముచేయు శత్రువుతో విరోధముచేయుట యని రెండు విధములు. (౪)

యానముః- ఆకస్మికముగా నొకకార్యము సంభవించినపుడు తానొంటరిగాగాని, మిత్రునితో గలిసికాని శత్రువు వైపునకు వెళ్ళుట. ఇది రెండు విధములైన గమనముగా జెప్పబడును. (౫)

ఆసనముః- ఏదోయొక విధమున దాను దుర్బలుడైనపుడును మిత్రుడడ్డగించినపుడును దన స్థానముననే యుండుట. ఇది రెండు విధములైన యాసనముగా జెప్పబడును. (౬)

ద్వైధముః- కార్యసిద్ధికొఱకు సేనాపతులను సేనను రెండుగా విభజించి జయమును బొందుట రెండు విధముల ద్వైధమనబడును. (౭)

సంశ్రయముః- కొండొక కార్యసిద్ధికొఱకు నొకానొక బలవంతుడైన రాజునో కొండొక మహాత్మునో శరణుజొచ్చుట. అందువలన శత్రుబాధ నుండి తప్పుకొనవచ్చును. రెండు విధముల నాశ్రయము గ్రహించుట సంశ్రయమనబడును. (౮)

ఇప్పుడు యుద్ధముచేసిన గొంచెము బాధ కలుగు ననియు, దరువాత జేసిన దనకు వృద్ధికలుగు విజయము తప్పక కలుగుననియు దెలిసినప్పుడు శత్రువుతో సంధిచేసికొని ధైర్యము వహించుట మంచిది. (౯)

తన యెల్లప్రజలు, సేన, మిక్కిలి ప్రసన్నులై యున్నతశీలురు శ్రేష్ఠులై యున్నపుడును దానుగూడ నట్లే యున్నతస్థితియందున్నట్లు తెలిసికొనినపుడు శత్రువుతో యుద్ధము చేయవలయును. (౧౦)

తనబలము - సేన హృష్టపుష్టమై ప్రసన్నభావముతోనుండి, శత్రుబలము తనబలము కంటె విపరీత స్థితిలో నున్నట్లు తెలిసికొనినపుడు శత్రువుతో యుద్ధము చేయుటకు దాడిచేయవలయును. (౧౧)

సేనాబలము వాహనములు క్షీణస్థితిలో నున్నపుడు నెమ్మదినెమ్మదిగా బ్రయత్నించి శత్రువును శాంతపఱచుచు దనస్థానమునందే యుండవలయును. (౧౨)

శత్రువు మిక్కిలి బలవంతుడుగా నున్నట్లు రాజు తెలిసికొనినపుడు తన సేనను ద్విగుణము చేసియో, రెండు విధములుగా విభజించియో తన కార్యమును సిద్ధము చేసికొనవలయును. (౧౩)

బలవంతులైన శత్రువులు తనపై దండయాత్ర చేయనున్నారని తెలిసినపుడు వెంటనే బలవంతుడు ధనవంతుడునైన రాజు నాశ్రయింపవలయును. (౧౪)

తన ప్రజలు, సేనయు శత్రువుల బలమును నిగ్రహించి యడ్డగించినపుడు సర్వవిధముల వారికి దగిన సేవ గురువునకువలె నిత్యము సేయవలయును. (౧౫)

తానాశ్రయించిన వ్యక్తికార్యములలో దోషములు గాంచినపు డక్కడను నిఃశంకముగా వారితోగూడ బాగుగ యుద్ధము చేయవలయును. (౧౬)

రాజు ధార్మికుడైనపు డాతనితో విరోధ మెన్నడు జేయరాదు. ఆతనితో నెల్లపుడు మైత్రి చేయ వలయును. రాజు దుష్టుడు, ప్రబలుడైనపుడు వానిని జయించుటకే పూర్వోక్తములగు నుపాయములను బ్రయోగింపవలయును.

(మిత్రోదాసీన శత్రువుల నెట్లు చూడవలయును?)

సర్వోపాయై స్తథా కుర్యాన్నీతిజ్ఞః పృథివీపతిః,
యథా స్యాభ్యధికా న స్యుర్ మిత్రోదాసీనశత్రవః. (౧)
ఆయతిం సర్వకార్యాణాం తదాత్వం చ విచారయేత్,
అతీతానాం చ సర్వేషాం గుణదోషౌ చ తత్త్వతః (౨)
ఆయత్యాం గుణదోషజ్ఞ స్తదాత్వే క్షిప్రనిశ్చయః,
అతీతే కార్య శేషజ్ఞః శత్రుభిర్ నాభిభూయతే. (౩)
యథైనం నాభిసందధ్యుర్ మిత్రోదాసీన శత్రవః,
తథా సర్వం సంవిదధ్యాదేష సామాసికో నయః. (౪) మను. ౭.౧౭౭-౧౮౦

నీతి నెఱిగిన రాజు తనకు మిత్రులు, నుదాసీనులు – మధ్యస్థులు, శత్రువులు దనకంటె నధికులు కాకుండునట్లు సర్వోపాయములతో వర్తింపవలయును. (౧)

సర్వకార్యముల విషయమునను వర్తమానమున జేయవలసిన కర్తవ్యమును, భవిష్యత్తున జేయవల సినదియు, భూతకాలమున జేయబడిన దానిగూర్చియు వానియన్నింటి గుణదోషములను యథార్థతతో విచారింపవలయును. (౨)

తదుపరి దోషములను నివారించుటకును గుణములను స్థిరపఱచుటకును యత్నింపవలయును. భవిష్యత్తులలో జేయబోవు కార్యములలోగల గుణదోషములను గుర్తించువాడును, వర్తమానకార్యములలో శీఘ్రముగ నిశ్చయించువాడును, పూర్వమొనర్చిన కార్యములలో శేషకర్తవ్యముల నెఱుగువాడునైన రాజు శత్రువులచే నెన్నడును బరాజితుడు కాడు. (౩)

రాజపురుషులు, విశేషముగ సభాపతియగు రాజును దమకు మిత్రులు, నుదాసీనులు, శత్రువులు నైనవారు తమ వశమందుండునట్లు సర్వవిధముల యత్నింపవలయును. మిత్రాదులు తమ్ము వశపఱచు కొనువిధమున మోహమున నెన్నడు జిక్కుపడరాదు. ఇదియే సంక్షిప్తరాజనీతి. (౪)

(దాడివెడలుటకు బూర్వకర్తవ్యములు)

కృత్వా విధానం మూలేతు యాత్రికం చ యథావిధి,
ఉపగృహ్యాస్పదం చైవ చారాన్ సమ్యగ్ విధాయ చ. (౧)
సంశోధ్య త్రివిధం మార్గం షడ్విధం చ బలం స్వకమ్,
సాంపరాయికకల్పేన యాయా దరిపురం శనైః. (౨)
శత్రుసేవిని మిత్రే చ గూఢే యుక్తతరో భవేత్,
గతప్రత్యాగతే చైవ స హి కష్టతరో రిపుః. (౩)

(వ్యూహరచన)

దండవ్యూహేన తన్మార్గం, యాయాత్తు శకటేన వా,
వరాహ మకరాభ్యాం వా సూచ్యా వా గరుడేన వా. (౪)
యతశ్చ భయమాశంకేత్తతో విస్తారయేద్ బలమ్,
పద్మేన చైవ వ్యూహేన, వివిశేత సదా స్వయమ్. (౫)

సేనాపతిబలాధ్యక్షౌ సర్వదిక్షు నివేశయేత్,
యతశ్చ భయమాశంకేత్ ప్రాచీం తాం కల్పయేద్దిశమ్. (౬)
గుల్మాంశ్చ స్థాపయేదాప్తాన్ కృతసంజ్ఞాన్ సమంతతః,
స్థానే యుద్ధే చ కుశలాన్ అభీరూనవికారిణః, (౭)
సంహతాన్ యోధయేదల్పాన్ కామం విస్తారయేద్ బహూన్,
సూచ్యా వజ్రేణ చైవైతాన్ వ్యూహేన వ్యూహ్య యోధయేత్. (౮)
స్యందనాశ్వైః సమే యుధ్యేదనూపే నౌ ద్విపైస్తథా,
వృక్షగుల్మావృతే చాపై, రసిచర్మాయుధైః స్థలే. (౯)
ప్రహర్షయేద్బలం వ్యూహ్య తాంశ్చ సమ్యక్ పరీక్షయేత్,
చేష్టాశ్చైవ విజానీయాదరీన్ యోధయతామపి. (౧౦)
ఉపరుధ్యారిమాసీత రాష్ట్రం చాస్యోపపీడయేత్,
దూషయేచ్చాస్య సతతం యవసాన్నోదకేంధనమ్. (౧౧)
భింద్యాచ్చైవ తడాగాని ప్రాకారపరిఖాస్తథా,
సమవస్కందయేచ్చైనం రాత్రౌ విత్రాసయేత్తథా. (౧౨)
ప్రమాణాని చ కుర్వీత తేషాం ధర్మ్యాన్ యథోదితాన్,
రత్నైశ్చ పూజయేదేనం ప్రధానపురుషైః సహ. (౧౩)
ఆదానమప్రియకరం దానం చ ప్రియకారకమ్,
అభీప్సితానామర్థానాం కాలే యుక్తం ప్రశస్యతే. (౧౪)

మను. ౭.౧౮౪-౮౭, ౧౮౯-౧౯౬, ౨౦౩, ౨౦౪.

రాజు శత్రువులపై యుద్ధమునకు బోవునపుడు తన రాజ్యరక్షణమునకు దగిన యేర్పాటు చేసి యాత్రకు దగిన సమస్త సామగ్రిని సిద్ధము చేసికొని, సమస్త సేనలను, వాహనములను, యానములను, శస్త్రాస్త్రాదులను, సంపూర్ణముగ దీసికొని యన్నివైపులనుండి సమాచారములను దెలుపుటకు గుప్తముగా దూతలను నియమించి యుద్ధమునకు బోవలయును. (౧)

మార్గములు ముప్విధములు. ఒకటి స్థలము (భూమి) రెండవది జలము - నదీసముద్రములు, మూడవది యాకాశము. ఈమార్గములను శుద్ధము చేసికొని, భూమిమీద రథ గజతురంగముల మీదను, నీటియందు నావల మీదను, నాకాశమున విమానాదియానముల పైనను బోవలయును. రథగజతురగ పదాతులు నస్త్రశస్త్రములు నన్నపానములు మొదలగు పదార్థములను వెంటదీసికొని పూర్ణబలముతో గూడుకొని, యేదేని యొకకారణమును బ్రసిద్ధపఱచి శత్రువుల నగర సమీపమునకు నెమ్మదిగా జేరవలయును. (౨)

లోలోపల శత్రువులతో గలిసియుండి, పైకి దనతో మిత్రతను జేయుచు, గుప్తరీతిని శత్రువునకు దనగుట్టును దెలుపు వ్యక్తియొక్క రాకపోకల విషయమునందును, నతనితో సంభాషించుటయందును, మిక్కిలి సావధానముతో నుండవలయును. ఏలయన లోపల శత్రుత్వము వహించి పైకిమిత్రుడై యుండువానిని గొప్పశత్రువుగా నెంచవలయును. (౩)

రాజపురుషుల కెల్లరకు యుద్ధవిద్య నేర్పవలయును. రాజు స్వయముగ యుద్ధవిద్యను నేర్చి యితర ప్రజలకును నేర్పవలయును. ముందుగా శిక్షితులైన యోధులే బాగుగ యుద్ధము చేయగలరు, చేయింపగలరు. వారిని శిక్షించునపుడు వ్యూహములనుగూడ నేర్పవలయును. దండవ్యూహము -

దండమువలె సేనను నడుపవలయును. శకటవ్యూహము - బండివలె సేన నుంచవలయును. వరాహవ్యూహము - పందులొకదానివెంట నొకటి పరుగెత్తుచు నావశ్యకమైనపు డొకచో జేరునట్లు సేనను నడుపుట, మకరవ్యూహము - మొసలి నీటిలో నడుచునట్లు సేనను నడుపుట. సూచీవ్యూహము - సూది యగ్రభాగము సన్నగానుండి వెనుకభాగము లావుగా నుండునట్లు సేనను గూడ నట్లు నిలబెట్టి యుద్ధముచేయుట వారికి నేర్పవలయును. గరుడవ్యూహము - గరుడపక్షి పైన గ్రిందనాక్రమణ మొనర్చునట్లు సేన శత్రుసేన నాక్రమించునట్లు చేయుట. ఇట్టి శిక్షణము సైనికులకు నితరులకు నేర్పవలయును. (౪)

భయము కలుగువైపునకు సేనను వ్యాపింపజేయవలయును. సేనాపతులందఱ నన్నిదిశలందును నిలబెట్టి పద్మాకారమున సేన నన్ని వైపుల నుంచి మధ్యలో దానుండవలయును. (౫)

ఆజ్ఞల నొసంగుచు సేనతోబాటు యుద్ధముచేయుచు, జేయించుచు, నుండువీరులైన సేనాపతులను సేనాధ్యక్షులను నెనిమిది దిక్కులందు నుంచవలయును. యుద్ధము జరుగువైపునకే సమస్త సేన ముఖముండవలయును. కాని రెండవ వైపునను గట్టి ప్రబంధముండవలయును. అట్లు చేయకున్న వెనుకనుండియో ప్రక్కలనుండియో శత్రు వాక్రమణము చేయుట సంభవమగును. (౬)

దృఢమైన స్తంభములకు సమానులై యుద్ధవిద్యయందు సుశిక్షితులు, ధార్మికులు, స్థిరముగా నుండుటలోను యుద్ధమొనర్చుటలోను జతురులై భయములేక మనమున నితర విచారములు లేకుండ నుండువారిని సేనకు నలువైపుల నుంచవలయును. (౭)

కొలదిమంది యెక్కువ మందితో యుద్ధము చేయవలసి వచ్చినచో నెల్లరు గలిసి యుద్ధము చేయవలయును. అవసరమైనప్పుడు వారినే యంతట వ్యాపింపజేయవలయును. నగరదుర్గమందుగాని, శత్రుసేనయందుగాని, ప్రవేశించి యుద్ధము జేయవలసివచ్చిన సూచీవ్యూహముతోనో లేక వజ్రవ్యూహముతోనో ప్రవేశించి ఖడ్గధారతో నిరువైపుల ఖండించునట్లు యుద్ధము చేయుచు లోనికి జొచ్చుకొని పోవలయును. అట్లే యనేకవిధములైన వ్యూహములతో సేన నేర్పఱచి యుద్ధమొనర్పవలయును. ఎదురుగా ఫిరంగులు తుపాకులు ప్రయోగింపబడుచున్నపుడు సర్పవ్యూహము బన్ని సైనికులు నేలమీద బరుండి సర్పమువలె జరుగుచు ముందుకు పోవలయును. అట్లుపోయి ఫిరంగులను సమీపించినపుడు వానిని నష్టపఱపవలయును. లేదా వానిని (శతఘ్నులను) వశపఱచుకొని వానిముఖము శత్రువుల వైపుకు మరల్చి వానితోను దుపాకులతోను శత్రువులను జంపవలయును. లేదా వృద్ధపురుషులను గుఱ్ఱములపై నెక్కించి ఫిరంగుల కెదురుగా బరుగెత్తింపజేసి చంపవలయును. మధ్యమధ్యలో మంచి యశ్వారోహకులుండి యొకేమాటు దాడిసలిపి శత్రుసేనను ఛిన్నభిన్నము చేయవలయును. సైనికులను బట్టుకొనవలయును. లేక పాఱఁగొట్టవలయును. (౮)

సమతలభూమిమీద యుద్ధము చేయవలసి వచ్చినపుడు రథములను గుఱ్ఱములను బదాతులనుపయోగింపవలయును. సముద్రముపై నౌకలను, గొలది జలమున్న తావులందు నేనుగులను, వృక్షములలో బొదలలో ధనుర్బాణములను, నిసుక నేలలందు ఖడ్గములను, డాలును నుపయోగించి యుద్ధమొనర్పవలయును. (౯)

యుద్ధము జరుగు సమయమున యోధుల నుత్సాహవంతులుగా, సంతోషముగలవారుగ జేయవలయును. యుద్ధము నిలిచియున్నపుడు వక్తృత్వము మూలమున సైనికుల శౌర్యము, నుత్సాహము బెంపు చేయవలయును. అన్నపానములతో నస్త్రశస్త్రములతో నావశ్యకమగు నౌషధులతో సైనికుల చిత్తము ప్రసన్నము చేయవలయును. వ్యూహరచనముచేయక యుద్ధము చేయరాదు, చేయింపరాదు. యుద్ధము

చేయుచున్న సేనయొక్క చేష్టలను గమనించుచుండవలయును. సరిగా యుద్ధము చేయుచున్నదో కపటముగా వర్తించుచున్నదో దెలిసికొనవలయును. (౧౦)

ఉచితమని తోచినసమయమున శత్రుసేనను జుట్టుముట్టి యుంచవలయును. శత్రురాజ్యమును బీడింపవలయును.వారియన్న జలములు, గడ్డి, వంటసరుకు నష్టముచేసి కాని దూషితములు చేసికాని బాధ కలిగింపవలయును. (౧౧)

శత్రువుల చెఱువులను, నగర ప్రాకారమును నగడ్తను ఛిన్నభిన్నముచేసి నష్టపఱపవలయును. రాత్రియందు వారికి భయము కలుగజేసి జయించుటకు దగినయుపాయ మొనర్పవలయును. (౧౨)

శత్రువుల జయించి వారిచే ప్రమాణములు చేయింపవలయును. వ్రాయించుకొనవలయును. ఉచితమని యెంచినచో శత్రురాజవంశస్థుని, ధార్మికుని రాజుగా నియమింపవలయును. తమ యాజ్ఞల కనుకూలముగ, ధర్మయుక్తరాజనీతి కనుకూలముగ నడుచుకొనుచు న్యాయముతో ప్రజలను బాలించున ట్లారాజుచే వ్రాయించుకొనవలయును. మరల నుపద్రవము చేయకుండునట్లు తనదగ్గఱ దగిన పురుషుల నుంచుకొనున ట్లుపదేశింపవలయును. ఓడిపోయిన వారిని జయించినవారు ముఖ్యులైన వ్యక్తులతో గలిసి రత్నాదులతో సత్కరింపవలయును. అతని యోగక్షేమములు నిర్వహింపబడకుండునట్లు చేయరాదు. శత్రువును గారాగారమున బంధించి యుంచవలసివచ్చినను నట నతనికి దగిన సత్కారము జరుగునట్లు చూడవలయును. అందువలన పరాజయ శోకమును వదలి ప్రసన్నుడై యుండును. (౧౩)

లోకమున నితరుల నుండి పదార్థములను గ్రహించుట యనీతియు, నితరులకిచ్చుట ప్రీతికి గారణము నగును. విశేషించి సమయమునకు దగిన క్రియ నొనర్పవలయును. పరాజిత వ్యక్తులు కోరిన వస్తువుల నిచ్చుట మిక్కిలి యుత్తమము. ఎన్నడు నతనిని జీకాకు పఱపరాదు. ఎత్తిపొడుపు మాటల ననరాదు. పరిహసింపరాదు. 'మేము నిన్ను జయించితిమి' అనియు నతని యెదుట బలుకరాదు. పైపెచ్చు 'మీరు మాకు సోదరులు' అని యిట్టి మాటలతో వారికి సమ్మానము, ప్రతిష్ఠను గలిగింపవలయును. (౧౪)

(మిత్రులు)

**హిరణ్యభూమిసంప్రాప్త్యా పార్థివో న తథైధతే,**
**యథా మిత్రం ధ్రువం లబ్ధ్వా కృశమప్యాయతి క్షమమ్. (౧)**
**ధర్మజ్ఞం చ కృతజ్ఞం చ తుష్టప్రకృతిమేవ చ,**
**అనురక్తం స్థిరారంభం లఘుమిత్రం ప్రశస్యతే. (౨)**
**ప్రాజ్ఞం కులీనం శూరం చ దక్షం దాతార మేవ చ,**
**కృతజ్ఞం ధృతిమంతం చ కష్టమాహు రరిం బుధాః. (౩)**
**ఆర్యతాపురుషజ్ఞానం శౌర్యం కరుణవేదితా,**
**స్థౌలలక్ష్యం చ సతతముదాసీనగుణోదయః. (౪)** మను. ౭.౨౦౮–౨౧౧

మిత్రుని లక్షణములు:- నిశ్చల ప్రేమయుక్తుడు, రానున్న విషయముల నాలోచించువాడు , కార్యసిద్ధి నొనర్చువాడు, సమర్థుడు నైనమిత్రుడు దుర్బలుడైనను నట్టివానిని బొంది రాజు వృద్ధిబొందునట్లు సువర్ణము, భూమి మున్నగువాని ప్రాప్తివలన వృద్ధిబొందజాలడు. (౧)

ధర్మము నెఱుగువాడు, కృతజ్ఞుడు - చేసిన యుపకారమును మఱవని వాడు, ప్రసన్నస్వభావము కలవాడు, ననురక్తుడు, స్థిరారంభుడు - ప్రారంభించిన కార్యమును విడువనివాడు, నతడు చిన్నవాడైనను సరియే యట్టి మిత్రుని బొంది ప్రశంసితుడగును. (౨)

బుద్ధిమంతుడు, కులీనుడు, శూరుడు, వీరుడు, చతురదాత, తనకు జేసినదానిని గుర్తించువాడు,

ధైర్యవంతుడు నగుపురుషుని శత్రువుగా జేసికొనరాదు. అట్టివానిని శత్రువుగా జేసికొనినవాడు దుఃఖముల పాలగును. ఈ విషయమును నెల్లపుడు ధ్రువముగా గుర్తుంచుకొనవలయును. (౩)

ఉదాసీనలక్షణము:- ప్రశంసితగుణయుక్తత, సుజనదుర్జనులను గుర్తించు యోగ్యత, శూరవీరత, కరుణయు గలిగి స్థూలలక్ష్యముపై పైవిషయములను నిరంతరము వినిపించువాడు, నుదాసీను డనబడును. (౪)

**ఏవం సర్వమిదం రాజా సహ సంమంత్ర్య మంత్రిభిః,**
**వ్యాయామ్యాప్లుత్య మధ్యాహ్నే భోక్తు మంతఃపురం విశేత్. మను. ౭.౨౧౬**

పూర్వముచెప్పినట్లు ప్రాతఃకాలమున దెల్లవారుజామున లేచి శౌచాదులొనర్చి, సంధ్యోపాసనాదులు చేసి, యగ్నిహోత్రము చేసియో చేయించియో, మంత్రులతో విచారించి, సభలో ప్రవేశించి, భృత్యులతో సేనాధ్యక్షులతో గలిసి వారిని సంతోషింపజేయవలయును. తదుపరి నానావిధ వ్యూహశిక్షణము - వ్యాయామాదులు చేసి, చేయించి, గుఱ్ఱముల, గజముల, పశువుల శాలలను దిలకించి శస్త్రాస్త్రములు, కోశము, వైద్యాలయములు, ధనాగారములు, చూచి - యన్నింటిపై నిత్యము దృష్టి నుంచవలయును. వానిలో దోషములున్న వానిని దూరము చేయించి, వ్యాయామశాలకు వెళ్ళి యట వ్యాయామము చేయవలయును. తదుపరి మధ్యాహ్నసమయమున భోజనము కొఱకు నంతఃపురమున బత్ని మున్నగు స్త్రీలుండు స్థలమున ప్రవేశింపవలయును. బుద్ధిబలపరాక్రమవర్ధకము, రోగవినాశకము, నానావిధాన్నపాన వ్యంజనాదులతో గూడినదియు, సుగంధిత మిష్టాదిపదార్థ యుక్తము సుపరీక్షితము నగు భోజన మొనర్పవలయును. అందువలన నెల్లపుడు సుఖముగా నుండవచ్చును. ఇట్లు సర్వరాజ్యముల కార్యముల నభివృద్ధి పఱుపవలయును.

**పంచాశద్ భాగ ఆదేయో రాజ్ఞా పశుహిరణ్యయోః,**
**ధాన్యానామష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవ వా. మను. ౭.౧౩౦**

వ్యాపారముచేయువారు, శిల్పులు నునువారినుండి, రజతసువర్ణాదుల వ్యాపారము వలన వారికి వచ్చిన లాభమునుండి ఏబది (౫౦)యవభాగము, బియ్యము మున్నగు ధాన్యములనుండి యాఱవభాగము కాని, యెనిమిదవ భాగముకాని, పన్నెండవ భాగముకాని తీసికొనవలయును. (రాజు) వారి దగ్గఱనుండి ధనమును దీసికొనిన, గృషీవలురు మున్నగు వారన్నపానములు లేనివారై దుఃఖపడకుండునట్లు వారినుండి పన్ను తీసికొనవలయును.

ప్రజలు ధనాఢ్యులు, నారోగ్యవంతులు, నన్నపానాదులతో సంపన్నులుగా నున్నయెడల రాజునకు మిక్కిలి యున్నతి కలుగును. రాజు ప్రజలకు దనసంతానమునకువలె సుఖము చేకూర్పవలయును. ప్రజలు రాజును, రాజపురుషులను దమతండ్రివలె జూచుకొనవలయును. కృషీవలురు మున్నగు పారిశ్రామికులును రాజులకు రాజులనుట నిక్కువము. రాజు వారలకు రక్షకుడు మాత్రమే. ప్రజలు లేకున్న రాజెవరికి? రాజు లేకున్న బ్రజ యెవరిదని చెప్పబడును? వీరిరువురు దమతమ పనులలో స్వతంత్రులు ఇరువురకు సంబంధించి కలిసియుండు కార్యములలో నిరువురు బరతంత్రులై యుండవలయును. ప్రజల సాధారణసమ్మతికి విరుద్ధముగా రాజుగాని రాజపురుషులుగాని యుండరాదు. రాజునాజ్ఞకు విరుద్ధముగా బ్రజలు కాని రాజపురుషులుకాని నడుచుకొనరాదు. ఇది రాజ్యముయొక్క రాజకీయ కార్యములను (పాలిటిక్స్) గూర్చి సంక్షేపముగ జెప్పబడినది. ఇంతకుమించి విశేషముగా దెలిసికొనగోరువారు నాలుగువేదములు, మనుస్మృతి, శుక్రనీతి,మహాభారతాది గ్రంథములను జూచి నిశ్చయించుకొనవలయును.

(వివాదస్థానములు)

ప్రజలకుజేయు న్యాయమునకు సంబంధించిన వ్యవహారము మనుస్మృతిలోని యష్టమ, నవమా

ధ్యాయములను జూచి యందలి రీతిననుసరించి చేయవలయును. ఇక్కడను గొన్ని విషయములు సంక్షేపముగా వ్రాయుచున్నాము.

ప్రత్యహం దేశదృష్టైశ్చ శాస్త్రదృష్టైశ్చ హేతుభిః,
అష్టాదశసు మార్గేషు విబద్ధాని పృథక్ పృథక్. (౧)
తేషామాద్యమృణాదానం నిక్షేపోఽస్వామివిక్రయః,
సంభూయ చ సముత్థానం దత్తస్యానపకర్మ చ. (౨)
వేతనస్యైవ చాదానం, సంవిదశ్చ వ్యతిక్రమః,
క్రయవిక్రయానుశయో వివాదః స్వామిపాలయోః. (౩)
సీమా వివాదధర్మశ్చ, పారుష్యే దండవాచికే,
స్తేయం చ సాహసం చైవ, స్త్రీసంగ్రహణమేవ చ. (౪)
స్త్రీపుంధర్మో విభాగశ్చ, ద్యూతమాహ్వయ ఏవ చ,
పదాన్యష్టాదశైతాని, వ్యవహారస్థితావిహ. (౫)
ఏషు స్థానేషు భూయిష్ఠం వివాదం చరతాం నృణామ్,
ధర్మం శాశ్వతమాశ్రిత్య, కుర్యాత్ కార్యవినిర్ణయమ్. (౬)
ధర్మో విద్ధస్త్వధర్మేణ, సభాం యత్రోపతిష్ఠతే,
శల్యం చాస్య న కృంతంతి, విద్ధాస్తత్ర సభాసదః. (౭)
సభాం వా న ప్రవేష్టవ్యం, వక్తవ్యం వా సమంజసమ్,
అబ్రువన్ విబ్రువన్ వాపి, నరో భవతి కిల్బిషీ. (౮)
యత్ర ధర్మోహ్యధర్మేణ, సత్యం యత్రానృతేన చ,
హన్యతే ప్రేక్షమాణానాం, హతా స్తత్ర సభాసదః. (౯)
ధర్మ ఏవ హతో హన్తి, ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హన్తవ్యో, మానో ధర్మో హతోఽవధీత్. (౧౦)
వృషో హి భగవాన్ ధర్మ, స్తస్య యః కురుతేహ్యలమ్,
వృషలం తం విదుర్ దేవా, స్తస్మాద్ధర్మం న లోపయేత్. (౧౧)
ఏక ఏవ సుహృద్ధర్మో, నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం, సర్వమన్యద్ధి గచ్ఛతి. (౧౨)
పాదోఽధర్మస్య కర్తారం, పాదః సాక్షిణమృచ్ఛతి,
పాదః సభాసదః సర్వాన్, పాదో రాజానమృచ్ఛతి. (౧౩)
రాజా భవత్యనేనాస్తు, ముచ్యంతే చ సభాసదః,
ఏనో గచ్ఛతి కర్తారం, నిందార్హో యత్ర నింద్యతే. (౧౪) మను. ౮.౩-౮. ౧౨-౧౯

సభ-రాజు, రాజపురుషులు నెల్లరు, దేశాచారమునకు సంబంధించి నట్టియు శాస్త్రవ్యవహారమునకు సంబంధించినట్టియు హేతువులతో నిమ్నలిఖితముగా పదునెనిమిది వివాదాస్పదమార్గములందు వివాద యుక్త కర్మములందు నిర్ణయములను నిత్యము చేయుచుండవలయును. శాస్త్రములందు లభింపని నియమముల యావశ్యకత నెఱింగి తగిన య్లుత్తమోత్తమ నియమముల నేర్పఱుపవలయును. వానివలన రాజు యొక్కయు ప్రజల యొక్కయు నున్నతి జరుగవలయును. (౧)

(అష్టాదశమార్గములు)

వానిలో మొదటిది (౧) ఋణాదానము - అప్పుతీసికొనుట, రెండవది (౨) నిక్షేపము. ధరావతు - - ఒకడొక పదార్థము మఱియొకనిదగ్గఱ నుంచిన మీదట నడిగినపుడు దానినీయకుండుట, మూడవది (౩) అస్వామివిక్రయము - అన్యునిపదార్థము నన్యుడమ్ముట, నాల్గవది (౪) సంభూయచసముత్థానమ్ = కొందఱుకలిసి మఱియొకనిపై నత్యాచార మొనర్చుట, ఐదవది (౫) దత్తస్యానపకర్మ చ = ఇచ్చిన పదార్థమును మరల నీయకుండుట (౨)

ఆఱవది (౬) వేతనస్యైవచాదానమ్ = ఒకని జీతమునుండి కొంత తీసికొనుట - జీతము తగ్గించి యిచ్చుట, లేక యియ్యకుండుట, ఏడవది (౭) సంవిదశ్చవ్యతిక్రమః = ప్రతిజ్ఞకు విరుద్ధముగా వర్తించుట, ఎనిమిదవది (౮) క్రయవిక్రయానుశయః = ఇచ్చిపుచ్చుకొనుటకు సంబంధించిన కలహము, తొమ్మిదవది (౯) వివాదస్వామిపాలయోః = పశువు యజమానునకు బాలించువానికి మధ్యగల వివాదము. (౩)

పదియవది (౧౦) సీమావివాదము, పదునొకండవది (౧౧) కఠోర దండన, పండ్రెండవది (౧౨) కటుశబ్దముల నుపయోగించుట, పదమూడవది (౧౩) చౌర్యము - బందిపోటు, దొంగతనము, పదునాల్గవది (౧౪) బలాత్కారముగ నొకపనిచేయుట, పదునైదవది (౧౫) స్త్రీ పురుషుల వ్యభిచారము. (౪)

పదునాఱవది (౧౬) స్త్రీపురుషుల ధర్మవ్యతిక్రమణము, పదునేడవది (౧౭) విభాగము అనగా దాయభాగమందు వివాదము కలుగుట (౧౮) జూదము-జడపదార్థములను, చేతనములను బందెమొడ్డి జూదమాడుట-ఈ పదునెనిమిది విధములైనవి పరస్పర వివాదస్థానములు. (౫).

ఈ వ్యవహారములందు నెక్కువ వివదించు పురుషులకు సంబంధించిన న్యాయము సనాతన ధర్మము నాశ్రయించి చేయవలయును. ఎవని యెడలను బక్షపాతము చేయరాదు. (౬)

ఏసభయందు ధర్మమధర్మముచే గాయపడి యుపస్థితమగునో, యేసభవారు బాణమువంటి ధర్మపుగలంకమును దొలగింపరో, మఱియు నధర్మమును భేదింపరో, ధార్మికుని సమ్మానించి యధార్మికుని దండింపరో యాసభలోనున్న వారందఱు గాయపడినవారుగా నెంచబడుదురు. (౭)

ధార్మికుడు సభలో బ్రవేశింపకుండుట యుచితము. ఒకవేళ బ్రవేశించిన సత్యమే చెప్పవలయును. సభలో నన్యాయము జరుగుచుండగా జూచి మౌనము వహించినను, సత్యన్యాయమునకు విరుద్ధముగా బలికినను నతడు మహాపాపి యగును. (౮)

ఏ సభలో నధర్మముచే ధర్మము, నసత్యముచే సత్యము సభాసదులందఱు జూచుచుండగా జంప బడునో యాసభలో నున్నవారందఱు మృతులతో సమానులగుదురు. వారిలో నొక్కడును జీవితుడై యున్నట్లెంచరాదు. (౯)

చంపబడిన ధర్మము చంపినవానిని జంపును. రక్షింపబడిన ధర్మము రక్షించినవారిని రక్షించును. కావున ధర్మము నెన్నడు జంపరాదు. చంపబడిన ధర్మము మనల జంపకుండునట్లు ధర్మమును రక్షింపవల యునని భావము. (౧౦)

ధర్మము సర్వైశ్వర్యముల నొసంగును. సుఖములను వర్షింపజేయును. అట్టి ధర్మమును లోపింప చేయువానిని విద్వాంసులు వృషలు డందురు. నీచశూద్రునిగా నెంచెదరు. కావున ధర్మమును లోపింప జేయుట యెవనికిని దగదు. (౧౧)

ఈ లోకమున ధర్మమొక్కటియే సుహృత్‌మిత్రము. మృత్యువు తరువాత నది వెంటవచ్చును. ఇతర పదార్థములు, సహచరులు శరీర నాశముతోబాటు నశింతురు. ఎల్లసాంగత్యము విడిపోవును. కాని ధర్మసాహచర్య మెన్నడు విడిపోదు. (౧౨)

రాజసభయందు బక్షపాతముతో నన్యాయము జరిగినపు, డటన్యాయధర్మము నాలుగు విభాగము లగును. అందొక భాగము కర్తకు, రెండవ భాగము సాక్షికి, మూడవ భాగము సభాసదులకు, నాల్గవ భాగము యధర్మ సభకు – సభాపతియైన రాజునకు బ్రాప్తమగును. (౧౩)

ఏ సభయందు నింద్యునకు నింద, స్తుత్యునకు స్తుతి, దండ్యునకు దండనము, మాన్యునకు మానము లభించునో యటరాజు, సభాసదులు నెల్లరు బాపరహితు లగుదురు. పవిత్రులు నగుదురు. పాపము దానిని జేయుకర్తకే లభించును. (౧౪)

(సాక్షులు)

ఇక సాక్షుల నెట్లు చేసికొనవలయుననః–

ఆప్తాః సర్వేషు వర్ణేషు, కార్యాః కార్యేషు సాక్షిణః,
సర్వధర్మవిదోఽలుబ్ధా విపరీతాంస్తు వర్జయేత్. (౧)
స్త్రీణాం సాక్ష్యం స్త్రియః కుర్యుర్, ద్విజానాం సదృశా ద్విజాః,
శూద్రాశ్చ సన్తః శూద్రాణా, మన్త్యానామన్త్యయోనయః. (౨)
సాహసేషు చ సర్వేషు స్తేయసంగ్రహణేషు చ,
వాగ్దండయోశ్చ పారుష్యే న పరీక్షేత సాక్షిణః (౩)
బహుత్వం పరిగృహ్ణీయాత్ సాక్షి ద్వైధే నరాధిపః,
సమేషు తు గుణోత్కృష్టాన్ గుణిద్వైధే ద్విజోత్తమాన్. (౪)
సమక్షదర్శనాత్ సాక్ష్యం శ్రవణాచ్చైవ సిధ్యతి,
తత్ర సత్యం బ్రువన్ సాక్షీ ధర్మార్థాభ్యాం న హీయతే. (౫)
సాక్షీ దృష్టశ్రుతాదన్యద్, విబ్రువన్నార్యసంసది,
అవాఙ్ నరకమభ్యేతి, ప్రేత్య స్వర్గాచ్చ హీయతే. (౬)
స్వభావేనైవ యద్ బ్రూయు స్తద్ గ్రాహ్యం వ్యావహారికమ్,
అతో యదన్యద్ విబ్రూయుర్, ధర్మార్థం తదపార్థకమ్. (౭)
సభాన్తః సాక్షిణః ప్రాప్తానర్థిప్రత్యర్థిసన్నిధౌ,
ప్రాడ్వివాకోఽనుయుంజీత విధినా ఽనేన సాంత్వయన్. (౮)
యద్ ద్వయోరనయోర్ వేత్థ, కార్యేఽస్మిన్ చేష్టితం మిథః,
తద్ బ్రూత సర్వం సత్యేన, యుష్మాకం హ్యత్ర సాక్షితా. (౯)
సత్యం సాక్ష్యే బ్రువన్ సాక్షీ లోకానాప్నోతి పుష్కలాన్,
ఇహ చానుత్తమాం కీర్తిం, వాగేషా బ్రహ్మపూజితా. (౧౦)
సత్యేన పూయతే సాక్షీ, ధర్మః సత్యేన వర్ధతే,
తస్మాత్ సత్యం హి వక్తవ్యం, సర్వ వర్ణేషు సాక్షిభిః. (౧౧)
ఆత్మైవహ్యాత్మనః సాక్షీ గతిరాత్మా తథాత్మనః,
మావమంస్థాః స్వమాత్మానం నృణాం సాక్షిణముత్తమమ్. (౧౨)
యస్య విద్వాన్ హి వదతః క్షేత్రజ్ఞో నాభిశంకతే,
తస్మాన్న దేవాః శ్రేయాంసం లోకేఽన్యం పురుషం విదుః. (౧౩)

ఏకో౽హమస్మీత్యాత్మానం యత్ త్వం కల్యాణమన్యసే,
నిత్యం స్థితస్తే హృద్యేష పుణ్యాపాపే క్షితా మునిః (౧౪)

మను.౮.౬౩, ౬౮, ౭౨-౭౫, ౭౮-౮౧, ౮౩, ౮౪, ౯౬, ౯౧

అన్ని వర్ణములందును ధార్మికులు, విద్వాంసులు, నిష్కపటులు, సర్వధర్మముల నెఱుగువారు, లోభరహితులు, సత్యవాదులు నగువారినే న్యాయవ్యవస్థయందు సాక్షులుగా నెన్నుకొనవలయును. దీనికి విపరీతముగ నుండు వారిని సాక్షులుగా గ్రహింపరాదు. (౧)

స్త్రీలకు స్త్రీలు, ద్విజులకు ద్విజులు, శూద్రులకు శూద్రులు, నంత్యజులకు నంత్యజులు సాక్షులుగా నుండవలయును. (౨)

బలాత్కారకర్మములైన దొంగతనము, వ్యభిచారము, కఠోరవచనములు పలుకుట, కొట్టుట యను నిట్టి వ్యవహారములందు సాక్షిని విచారింప నక్కఱలేదు. సాక్షి యావశ్యకమనియు నెంచరాదు. ఈ యపరాధములన్నియు గుప్తముగా జరుగును. (౩)

రెండు పక్షములందు సాక్షులుండినచో బహుసంఖ్యననుసరించియు, నిరుపక్షముల సమానసంఖ్యలో సాక్షులున్న నుత్తమ పురుషుల సాక్ష్యము ననుసరించియు, నిరుతెగల సాక్షులు, నుత్తములైన పక్షమున ద్విజోత్తములు, మహర్షులు, ఋషులు నగువారి సాక్ష్యము ననుసరించి న్యాయము చేయవలయును. (౪)

సాక్ష్యము రెండు విధములుగానుండును. సాక్షాత్తుగ జూచినసాక్ష్యము చూడక వినినసాక్ష్యము. ప్రశ్నించినపుడు సభలో సత్యమును జెప్పిన సాక్షులు దండ్యులుకాని, ధర్మహీనులుగాని కారు. అసత్యమును జెప్పిన సాక్షులను యథాయోగ్యముగ దండింపవలయును. (౫)

రాజసభయందుగాని యుత్తమపురుషుల సభలోగాని సాక్షియైనవాడు తాను జూచినదానికి, వినినదానికి విరుద్ధముగా జెప్పినచో నతనినాలుక నుత్తరింపవలయును. అతడు మరణించిన తదుపరికూడ సుఖమును బొందజాలడు. (౬)

సాక్షి స్వాభావికముగ జెప్పుమాటలను నమ్మవలయునేకాని, వ్యవహారమునకు వ్యతిరిక్తముగ నేర్పబడి చెప్పినమాటలను నమ్మరాదు. అట్టి మాటలను న్యాయాధీశుడు వ్యర్థమని తెలిసికొనవయును. (౭)

సభలో వాదిప్రతివాదుల యెదుట సాక్షులు ప్రవేశించినపుడు న్యాయాధీశుడు, ప్రాడ్వివాకులు - వకీళ్ళు సాక్షులతో సాంత్వనపూర్వకముగా నిట్లు చెప్పవలయును. (౮)

ఓసాక్షులార! ఈ వ్యవహారమున నిరువురివిషయములను మీకు దెలిసినవానిని నిజము చెప్పుడు. మీరీవ్యవహారమున సాక్షులైయున్నారు. (౯)

సత్యము జెప్పుసాక్షి పరలోకమున నుత్తమజన్మమును బొందును. ఉత్తమలోకాంతరమున జన్మమునందియట సుఖించును. ఇహపరమున గీర్తింబొందుదురు. సత్కారమునకు, దిరస్కారమునకు వాణియే కారణమని వేదములందు వ్రాయబడియున్నది. సత్యవక్త గౌరవింపబడును. అసత్యమును చెప్పువాడు నిందితుడగును. (౧౦)

సాక్ష్యము చెప్పువాడు సత్యమును జెప్పినచో దానితో బవిత్రుడగును. సత్యమువలన ధర్మము వర్ధిల్లును. కావున నన్నివర్ణములవారు సత్యమునే చెప్పుట యోగ్యము. (౧౧)

ఆత్మకు సాక్షి యాత్మయే, గతియు నాత్మయే. ఇది తెలిసి మనుష్యుల కందఱకు నుత్తమసాక్షియగు నీయాత్మ నవమాన పఱపకు. నీయాత్మయందును, మనస్సునందును, వాణియందు నుండునదియే సత్యము. దీనికి విపరీత మసత్యము. (౧౨)

సాక్ష్యముచెప్పు పురుషునాత్మ - విద్వాన్ క్షేత్రజ్ఞుడు - శరీరమును గుర్తెఱుగునది, లోపల శంకింప కున్న నతనికంటె భిన్నుడైనవాని నుత్తమపురుషుడుగా విద్వాంసులెంచరు. (౧౩)

కల్యాణము నభిలషించు నోపురుషుడా! నీవొంటిగా నున్నావని నీయాత్మయందు దెలిసి యసత్య మాడరాదు. నీహృదయమందు నంతర్యామి రూపమున నీలోను బుణ్యాపాపములను జూచుముని - పరమేశ్వరుడు మఱియొకడున్నాడు. అతనికి భయపడుచు నెల్లపుడు సత్యమునే చెప్పుము. (౧౪)

లోభాన్మోహాద్భయాన్మైత్రాత్కామాత్క్రోధాత్తథైవ చ,
అజ్ఞానాద్బాలభావాచ్చ, సాక్ష్యం వితథముచ్యతే. (౧)
ఏషామన్యతమే స్థానే, యః సాక్ష్యమనృతం వదేత్,
తస్య దండవిశేషాంస్తు ప్రవక్ష్యామ్యనుపూర్వశః. (౨)
లోభాత్సహస్రం దండ్యస్తు మోహాత్పూర్వం తు సాహసమ్,
భయాద్ద్వౌ మధ్యమౌ దండ్యౌ మైత్రాత్పూర్వం చతుర్గుణమ్. (౩)
కామాద్దశ గుణం పూర్వం క్రోధాత్తుత్రిగుణం పరమ్,
అజ్ఞానాద్ద్వేశతే పూర్ణే, బాలిశ్యాచ్ఛతమేవ తు. (౪)
ఉపస్థముదరం జిహ్వా హస్తౌ పాదౌ చ పంచమమ్,
చక్షుర్నాసా చ కర్ణౌ చ ధనం దేహస్తథైవ చ. (౫)
అనుబంధం పరిజ్ఞాయ దేశకాలౌ చ తత్త్వతః,
సారాపరాధౌ చాలోక్య, దండం దండ్యేషు పాతయేత్. (౬)
అధర్మ దండనం లోకే యశోఘ్నం కీర్తి నాశనమ్,
అస్వర్గ్యం చ పరత్రాపి తస్మాత్తత్పరివర్జయేత్. (౭)
అదండ్యాన్దండయన్ రాజా, దండ్యాంశ్చైవాప్యదండయన్,
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి. (౮)
వాగ్దండం ప్రథమం కుర్యాద్ధిగ్దండం తదనంతరమ్,
తృతీయం ధనదండం తు వధదండమతః పరమ్. (౯)

మను. ౮.౧౧౮—౧౨౧; ౧౨౫—౧౨౯

లోభము, మోహము, స్నేహము, కామము, క్రోధము, నజ్ఞానము పసితనములచేత నిచ్చిన సాక్ష్యములు ప్రమాణార్హములు కావు. వానిని మిథ్యలుగా నెంచవలయును. (౧)

వీనిలో నేస్థానమందైనను సాక్షి యబద్ధమాడెనేని వాని నీక్రింద జెప్పబోవురీతి ననేకవిధముల దండింపవలయును. (౨)

లోభముచే నబద్ధపుసాక్ష్య మిచ్చెనేని, వానినుండి పదునేను రూపాయల పది అణాలను, మోహముతో నట్టి సాక్ష్యమిచ్చెనేని మూడురూపాయల రెండణాలను, భయముచే నట్టి సాక్ష్యమిచ్చెనేని యాఱురూపాయల పావులాయు, స్నేహముచే నిచ్చెనేని పండ్రెండు రూపాయలునఱయు, దండుగ బుచ్చుకొనవలయును. (౩)

కామముచే నబద్ధపు సాక్ష్యమిచ్చిన వానికిరువదియైదు రూపాయలును, గ్రోధముచే నిచ్చిన వానినుండి నలుబదియాఱురూపాయల పదునాలుగణాలును, నజ్ఞానముచే నిచ్చెనేని యాఱురూపాయలను, పసితనముచే నట్టి సాక్ష్యమిచ్చెనేని వానినుండి యొకరూపాయ తొమ్మిదియణాలును, దండుగ విధింపవలయును. (౪)

దండించుటకు నుపస్థేంద్రియము, కడుపు, నాలుక, చేతులు, కాళ్ళు , కన్నులు, ముక్కు, చెవులు, ధనము, దేహము నీపదియును స్థానములు. అనగా వీనియందే శిక్షింపవలయును. (౫)

వ్రాయబడిన, వ్రాయబోవు దండనములకంటె నెక్కువ తక్కువగూడ విధింపవచ్చును. ఎట్లనగా లోభముచే దప్పుసాక్ష్య మిచ్చువానికి బదునేను రూపాయల పదియణాలు దండుగ వ్రాయబడియున్నది. కాని యత్యంత నిర్ధనుడయ్యేనేని వానినుండి తక్కువగును, ధనాఢ్యు డయ్యేనేని రెండింతలు మూడింతలు నాలుగింతల వఱకునుగూడ విధింపవచ్చును. దేశమును, గాలమును నపరాధము చేసినవాని పరిస్థితినిబట్టి దండింపవలయును. (౬)

ఏలయన నీలోకమున నధర్మముతో జేయుదండనము పూర్వప్రతిష్ఠను, వర్తమాన భవిష్యత్తు లలోను, బరజన్మమునందును గలుగబోవు కీర్తిని గూడ నశింపజేయును. పరజన్మమునను దుఃఖదాయక మగును. కాబట్టి యధర్మపూర్వకముగా నెన్నడును దండింపగూడదు. (౭)

దండనీయులను దండింపక విడిచిపెట్టువాడును, నదండనీయులను దండించురాజు బ్రతికియుండు నపుడు గొప్ప నిందను, జచ్చిన పిమ్మట మహాదుఃఖమును బొందును. కాబట్టి యపరాధము చేసినవానినే దండింపవలయును. అనపరాధి నెన్నటికిని దండింపగూడదు. (౮)

దండనము నాల్గువిధములుః- మొదటిది వాగ్దండనము - నిందించుట, రెండవది ధిగ్దండనము - నీవేల యిట్టి పని చేసితివని ధిక్కరించుట, మూడవది ధనదండనము - జరిమానా, నాల్గవది వధదండనము - కొరడాతో గాని బెత్తముతోగాని కొట్టుట లేదా శిరచ్ఛేదనము చేయుట. (౯)

యేన యేన యథాంగేన స్తేనో నృషు విచేష్టతే,
తత్తదేవ హరేత్తస్య ప్రత్యాదేశాయ పార్థివః. (౧)
పితాచార్యః సుహృన్మాతా భార్యా పుత్రః పురోహితః,
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి యః స్వధర్మే న తిష్ఠతి. (౨)
కార్షాపణం భవేద్దండ్యో యత్రాన్యః ప్రాకృతో జనః,
తత్ర రాజా భవేద్దండ్యః సహస్రమితి ధారణా. (౩)
అష్టాపాద్యం తు శూద్రస్య స్తేయే భవతి కిల్బిషమ్,
షోడశైవ తు వైశ్యస్య ద్వాత్రింశత్ క్షత్రియస్య చ. (౪)
బ్రాహ్మణస్య చతుఃషష్టిః పూర్ణం వాఽపి శతం భవేత్,
ద్విగుణా వా చతుఃషష్టి స్తద్దోషగుణవిద్ధి సః. (౫)
ఐంద్రం స్థానమభిప్రేప్సుర్యశశ్చాక్షయమవ్యయమ్,
నోపేక్షేత క్షణమపి రాజా సాహసికం నరమ్. (౬)
వాగ్దుష్టాత్తస్కరాచ్చైవ దండేనైవ చ హింసతః,
సాహసస్య నరః కర్తా విజ్ఞేయః పాపకృత్తమః. (౭)
సాహసే వర్తమానం తు యో మర్షయతి పార్థివః,
స వినాశం వ్రజ త్యాశు విద్వేషం చాధిగచ్ఛతి. (౮)
న మిత్రకారణాద్రాజా విపులాద్వా ధనాగమాత్,
సముత్సృజేత్సాహసికాన్ సర్వభూతభయావహాన్. (౯)
గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్,
ఆతతాయినమాయాంతం హన్యాదేవాఽవిచారయన్. (౧౦)

నాతతాయివధే దోషో హంతుర్భవతి కశ్చన,
ప్రకాశం వాఽప్రకాశం వా మన్యుస్తన్మన్యుమృచ్ఛతి. (౧౧)
యస్య స్తేనః పురే నాస్తి నాన్యస్త్రీగో న దుష్టవాక్,
న సాహసికదండఘ్నౌ స రాజా శక్రలోకభాక్. (౧౨)

మను. ౮.౩౩౪—౩౩౮; ౩౪౪—౩౪౭; ౩౫౦, ౩౫౧; ౩౮౬

దొంగ యేయేయంగముచే నెట్లు మనుష్యులయందు విరుద్ధ చేష్టను జేయునో యాయాయంగ మును (మనుష్యులందఱకు శిక్ష నేర్పుటకు) రాజు ఛేదింపవలయును. (౧)

స్వధర్మమాచరింపనివాడు తండ్రియైనను, నాచార్యుడైనను, మిత్రుడైనను, స్త్రీయైనను, బుత్రుడైనను, బురోహితుడైనను రాజునకు దండ్యుడు. అనగా రాజు న్యాయాసనమందు గూర్చుండి న్యాయము చేయునపు డెవరికిని బక్షపాతము చేయక యథోచితముగ దండింపవలయును. (౨)

ఏయపరాధ మొనర్చిన సాధారణ మనుష్యున కొకకాని (కాసు) దండుగ విధింపబడునో యాయపరాధమే యొనర్చిన రాజునకు వేయి కాసుల దండుగ విధింపబడవలయును. అనగా సాధారణ మనుష్యునికంటె రాజునకు వేయిరెట్లును, మంత్రికి నెనిమిదివందల రెట్లును, నతనికంటె దక్కువగు వానికి నేడువందల రెట్లును నతనికంటె గ్రిందివానికి నాఱువందల రెట్లును దండుగ విధింపబడవలయును. ఈరీతి నుత్తరోత్తరము – అల్పాత్యల్పుడగు భృత్యునకు – నెనిమిది రెట్లకంటె దక్కువగా శిక్షకలుగగూడదు. (అనగా బ్రజలకంటె నుద్యోగుల కెక్కువ శిక్ష విధింపబడవలయును.) అటుల లేకుండిన నుద్యోగులు ప్రజలను నాశనము చేయుదురు. సింహ మధికదండనముచేతను, మేక యల్పదండనము చేతను వశమగును. కాబట్టి రాజు మొదలుకొని కట్టకడపటి భృత్యునివఱకు నుండు నుద్యోగులకు నపరాధమందు సామాన్య ప్రజలకంటె నధికశిక్ష విధింపవలయును. (౩)

అట్లే కొంతవివేకముగల శూద్రుడు దొంగిలించినచో నెనిమిది రెట్లును వైశ్యునకు బదియాఱు రెట్లును, క్షత్రియునకు ముప్పది రెండు రెట్లును. (౪)

బ్రాహ్మణునకు నఱువదినాలుగు రెట్లుకాని, నూఱురెట్లుకాని, నూటయిరువదెనిమిది రెట్లుకాని, శిక్ష కలుగవలయును. అనగా జ్ఞానమును, బ్రతిష్ఠయు నెవనికెంత యధికముగా నుండునో వానికి దండనము నట్లే యధికముగా విధింపబడవలయును. (౫)

రాజ్యాధికారులును, ధర్మమును నైశ్వర్యమును నిచ్ఛగించు రాజును బలాత్కారముగ దోచుకొను బందిపోటు మొదలగు దొంగలను శిక్షించుటయందు నొక్కక్షణమేని యాలస్య మొనర్పగూడదు. (౬)

దుష్టవచనములను జెప్పువానికంటె దొంగతనము జేయువానికంటె, దండముచే హింసించువాని కంటె, సాహసించి బలాత్కారపు బనులు చేయువాడు మహాపాపి – దుష్టుడునని తెలియవలయును. (౭)

ఏరాజు (దుష్టకార్యమందు) సాహసించి వర్తించు పురుషుని దండింపక సహనముతో నుండునో యతడు శీఘ్రమే వినాశమును బొందును. రాజ్యమందు ద్వేషమును బుట్టును. (౮)

సమస్త ప్రాణులకు దుఃఖమిచ్చు సాహసిక పురుషుడు తనమిత్రుడైనను, ధనవంతుడైనను లక్ష్యముచేయక అతనిని బంధింపకయు ఛేదింపకయు నెన్నటికిని విడువకూడదు. (౯)

ధర్మమును వదలి యధర్మమునందు వర్తించుచు నపరాధముచేయని యితరులను జంపువానిని దనగురువైనను, బుత్రుడైనను, దండ్రియైనను, బ్రాహ్మణుడైనను మఱి యనేక శాస్త్రముల వినినవాడైనను విచారింపక చంపివేయవలయును. చంపినపిమ్మట విచారింపవలయును. (౧౦)

దుష్టపురుషులను బ్రకటముగా జంపినను రహస్యముగా జంపినను జంపినవానికి బాపము కలుగదు.

ఏలయనగా గ్రోధిని గ్రోధముతో జంపుట, క్రోధముతో గ్రోధమునకు యుద్ధమని తెలియవలయును. (౧౧)

ఏ రాజు రాజ్యమందు దొంగలుగాని, పరస్త్రీగాములుగాని, దుష్టవచనములను జెప్పువారుకాని, సాహసికులుగాని, బందిపోటు దొంగలుకాని, రాజాజ్ఞను భంగపఱచువారుకాని లేరో యారాజు మిక్కిలి శ్రేష్ఠుడు. (౧౨)

(వ్యభిచారులకు దండనము)

భర్తారం లంఘయేద్యా స్త్రీ స్వజ్ఞాతిగుణదర్పితా,
తాం శ్వభిః ఖాదయేద్రాజా సంస్థానే బహుసంస్థితే. (౧)
పుమాంసం దాహయేత్ పాపం శయనే తప్తఆయసే,
అభ్యాదధ్యుశ్చ కాష్ఠాని తత్ర దహ్యేత పాపకృత్. (౨) మను. ౮.౩౭౧.౩౭౨

ఏ స్త్రీ తనజాతి, గుణముల గర్వముచే బతిని వదలి వ్యభిచరించునో దాని ననేక స్త్రీపురుషుల యెదుట బ్రతికియుండగా గుక్కలచే గఱపించి రాజు చంపివేయవలయును. (౧)

అదేరీతిని దనస్త్రీని వదలి పరస్త్రీగమనముగాని, వేశ్యాగమనముగాని చేసిన పాపులను నెఱ్ఱగా గాల్చిన యినుపమంచములమీద బరుండబెట్టి యనేక పురుషులయెదుట భస్మము చేయవలయును. (౨)

(కాముకులైన రాజు, న్యాయాధీశులకు దండనము)

ప్రశ్న:- రాజుగాని, రాణిగాని లేక న్యాయాధీశుడుగాని, వానిభార్యగాని వ్యభిచారాది పాపము లొనర్చిరేని వారి నెవరు దండింపవలయును?

ఉత్తరము:- సభ దండింపవలయును. వారిని బ్రజలకంటె నధికముగా దండింపవలయును.

ప్రశ్న:- రాజు మొదలగువారు సభవలన శిక్ష నేల గ్రహింతురు?

ఉత్తరము:- రాజుకూడ నొకపుణ్యాత్ముడు, భాగ్యశాలియు నైన మనుష్యుడు. అతనిని దండింపకున్నను నతడు శిక్షను గ్రహింపకున్నను నితరులు దండనము నేల యంగీకరింతురు? సర్వప్రజలు, ప్రధానియు, రాజ్యాధికారులు, సభ ధర్మముతో దండింపగోరుదురేని యొంటరిరాజేమి చేయగలడు? ఇట్టి వ్యవస్థ లేకున్న రాజు, ప్రధాని, సమర్థులైన పురుషులందఱును నన్యాయమున మునిగి న్యాయమును, ధర్మమును, ముంచి ప్రజల నెల్లరను నాశముచేసి తామును నష్టమగుదురు. న్యాయయుక్తమగు దండమునకే రాజనియు ధర్మమనియు బేరు. దానిని నష్టపఱచువానికంటె నీచపురుషుడు మఱెవ్వడుండును? అను నీ శ్లోకార్థమును స్మరింపవలయును.

ప్రశ్న:- ఈ కఠినదండనము చేయుట యుచితము కాదు. ఏలయనగా మనుష్య దేయంగమును నిర్మించువాడుకాని, మరణించినవానిని బ్రతికించువాడుకాని కాడు. కావున నిట్టి దండనము చేయరాదు.

ఉత్తరము:-దీనిని గఠినదండనముగా నెంచువారు రాజనీతి నెఱుగరు. ఒకని నిట్లు దండించుట వలన నెల్లరు దుష్టకర్మములకు దూరముగా నుందురు. చెడ్డపనులు వదలి ధర్మమార్గమున నుందురు. నిజమడిగిన నావగింజంతయు నీదండన మెల్లరిభాగమునకు రానిది. సుగమమైన దండనము కలిగెనేని దుష్టకార్యములు విశేషముగా వృద్ధిచెందును. మీరు సుగమదండనమని యెంచునది కోటిరెట్లధికమగుటవలన గోటిరెట్లు కఠినమగును. ఏలయన ననేకులు దుష్టకార్యము లొనర్చినపుడు కొంచెము కొంచెముగా దండించినను నది యెక్కువగును. అనగా నొకనికొక మణుగు దండనమును, మఱియొకనికి బావుదండనము నిచ్చితిమేని రెండును గలిసి యొకమణుగుంబావు దండనమగును. (దీనిని వారిరువురకు సమభాగము చేసితిమేని) ప్రతి వానికిని నిరువదియైదుశేర్ల దండనమగును. ఇట్టి సుగమదండనమును దుష్టు లేమిలెక్కచేయుదురు?

ఒకని కొంక మణుగు దండనము వేయిమందికి బావుశేరుచొప్పున దండనము చేసిన నందఱిదికలిసి యాఱుంబావు మణుగుల దండనము మనుష్యజాతికి గలిగినందున నిదియే యధికము, కఠినమైన దండన మగును. ఆ యొక్క మణుగు దండనము తక్కువయు సుగమమును నగును.

దీర్ఘాధ్వని యథాదేశం యథాకాలం తరో భవేత్,
నదీతీరేషు తద్విద్యాత్సముద్రే నాస్తి లక్షణమ్. (౧)
అహన్యహన్యవేక్షేత కర్మాన్తాన్ వాహనాని చ,
ఆయవ్యయౌ చ నియతావాకరాన్ కోశమేవ చ. (౨)
ఏవం సర్వానిమాన్రాజా వ్యవహారాన్సమాపయన్,
వ్యపోహ్య కిల్బిషం సర్వం ప్రాప్నోతి పరమాం గతిమ్. (౩) మను. ౮.౪౦౬, ౪౧౯, ౪౨౦

మిక్కిలి నిడుదయగు మార్గమందు, సముద్రరేవులందును, నదులయందు, నదములయందును నాయా ప్రదేశముల వైశాల్యమునుబట్టి పన్ను విధింపవలయును. మహాసముద్రములయందు బన్ను నియమింప వలనుపడదు. కాబట్టి యనుకూలత చూచి రాజునకును సముద్రమున బెద్దపెద్ద నౌకలను నడుపు వారికిని లాభము కలుగువిధమున బన్నులవ్యవస్థ జేయవలయును. పూర్వమీదేశస్థులు నావలు నడుపుచుండలేదనుమాట సర్వదా యబద్ధమని యెంచవలయును. దేశదేశాంతరములందును, ద్వీప ద్వీపాంతరములందును నావలపై బోయివచ్చు తన ప్రజలకు దుఃఖమేమాత్రమును గలుగకుండునట్లు రాజు రక్షింపవలయును. (౧)

రాజు ప్రతిదినమును దనకార్యములు ముగించిన పిమ్మట నేనుగులు గుఱ్ఱములు మొదలగు వాహనములను, నాయవ్యయములను, రత్నాదుల యాకరములను గోశమును బరీక్షింపవలయును. (౨)

రాజీప్రకారము సమస్తవ్యవహారములను యథారీతిన ముగించి, ముగింపచేయుటచే సమస్తపాపముల నుండి విముక్తుడయి పరమగతియను మోక్షానందమును బొందును. (౩)

ప్రశ్నః- సంస్కృతవిద్యయందు రాజనీతి సంపూర్ణముగ నున్నదా? అసంపూర్ణముగనా?

ఉత్తరముః- పూర్తిగ నున్నది. భూగోళమందు నడుచుచున్న నడువబోవు రాజనీతియంతయు సంస్కృతవిద్యనుండియే గ్రహింపబడినది. ప్రత్యక్షముగా వ్రాయబడని విషయములకొఱకు -

ప్రత్యహం లోకదృష్టైశ్చ శాస్త్రదృష్టైశ్చ హేతుభిః (మను. ౮-౩)

రాజునకును బ్రజలకును సుఖకారకములనియు, ధర్మయుక్తములనియు నెంచబడు నాయానియ మములను బూర్ణవిద్వాంసులుగల రాజసభ నియమింపవలయును.

(బాలవృద్ధవివాహములు)

చేతనయినంతవఱకు బాల్యావస్థయందు వివాహములు జరుగనీయకూడదు. యువావస్థయందు వధూవరుల ప్రసన్నతలేక వివాహములు చేయించుటకాని చేయుటకాని జరుగనీయరాదు.శరీరమునందును నాత్మయందును బూర్ణబల మెల్లప్పుడు నుండునట్లు వ్యభిచారమును బహువివాహమును నాపవలయును. ఏలయనగా గేవల మాత్మబలమును విద్యాజ్ఞానములను వృద్ధిచేసి శరీరబలమును వృద్ధిపఱపరేని బలవంతు డగు పురుషుడొక్కడే వందలకొలది విద్వాంసులను జయింపగలుగును. ఇదికాక కేవల శరీరబలమునే వృద్ధి పఱచుకొని యాత్మబలము నభివృద్ధిచేయరేని యుత్తమరాజ్యపాలనావ్యవస్థ విద్యలేక యెన్నడును గలుగజాలదు. వ్యవస్థ లేకుండునేని యందఱును దమలో దాము విరోధించి కలహించుచు, జగడమాడుచు నష్టులు, భ్రష్టులు నయిపోవుదురు. కావున సర్వదా శరీర బలమును నాత్మబలమును వృద్ధిపఱచుకొను చుండవలయును. వ్యభిచారము, నతివిషయాసక్తి యను వీనివలె బలమును బుద్ధిని నాశనముచేయు

వ్యవహారములు మఱేవియు లేవు. విశేషించి క్షత్రియులు దృఢాంగులుగ బలయుక్తులుగ నుండవల యును. వారే విషయాసక్తు లయిరేని రాజధర్మము నశించును.

**యథా రాజా తథా ప్రజాః (చాణక్య.నీ.ద. ౧౩-౮)**

రాజు వలెనే ప్రజలు నగుదురు. అనుదాని ధ్యానమందుంచుకొని రాజును నధికారులు నెన్నడును దుష్టాచారముల నాచరింపక నిరంతరము ధర్మన్యాయములందే వర్తించి యందఱి సంస్కారణమునకు దృష్టాంతమై యుండవలయును.

సంక్షేపముగ రాజధర్మ మిచ్చట వర్ణింపబడినది. విశేషించి వేదమునందును, మనుస్మృతి సప్త మాష్టమ, నవమాధ్యాయముల యందును, శుక్రనీతి, విదురప్రజాగరము, మహాభారతమునందలి శాంతి పర్వపు రాజధర్మము, నాపద్ధర్మము మొదలగు వానియందును గల పూర్ణరాజనీతి వహించి మాండలిక ులును, సార్వభౌములును, జక్రవర్తులును నగుదురుగాక.

వయం ప్రజాపతేః ప్రజా అభూమ. (యజు.అ.౧౮ మం ౨౯) ఇది యజుర్వేదవచనము. మనము ప్రజాపతి - పరమేశ్వరుని ప్రజలము. పరమాత్మ మనరాజు. మనమతని కింకరులము - భృత్యులవంటి వారమని తెలియవలయును.

అతడు తన యపారకృపచే నతని సృష్టియందు మనలను రాజ్యాధికారులుగ జేయునుగాక! మనచేతులద్వారా యతని సత్యన్యాయములను బ్రవర్తింపజేయునుగాక!

ముందీశ్వర వేదవిషయములు వ్రాయబడును.

## శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును సుభాషా విభూషితమునగు సత్యార్థప్రకాశమున రాజధర్మ విషయముగల షష్ఠ సముల్లాసము సంపూర్ణము.

# సప్తమ సముల్లాసము

## ఈశ్వర వేద విషయము

(ఈశ్వర వర్ణనము)

ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః,
యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే. (౧)

ఋ.మం.౧.సూ.౧౬౪మం.౩౯

ఈశావాస్యమిదగ్ం సర్వం యత్ కించ జగత్యాం జగత్,
తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విద్ధనమ్. (౨) యజు.౪౦—మం ౧.
అహం భువం వసునః పూర్వ్యస్పతిరహం ధనాని సంజయామి శశ్వతః,
మాం హవన్తే పితరం న జంతవోఽహందాశుషే వి భజామి భోజనమ్. (౩)

ఋ—మం.౧౦—౪౮—౧.

అహమిన్ద్రో న పరాజిగ్య ఇద్ధనం న మృత్యవేఽవతస్థే కదాచన,
సోమమిన్మామున్వన్తో యాచతావసు న మే పూరవః సఖ్యే రిషాథన. (౪) ఋ,మం.౧౦—౪౮—౫
అహం దా గృణతే పూర్వ్యం వస్వహం బ్రహ్మకృణవం మహ్యం వర్ధనమ్,
అహం భువం యజమానస్య చోదితాఽయజ్వనః సాక్షి విశ్వస్మిన్ భరే. (౫)

ఋ.మం.౧౦—౪౯—౧.

(ఋచోఽక్షరే) ఈ మంత్రార్థమును బ్రహ్మచర్యాశ్రమశిక్షావిషయమున వ్రాసియున్నాము. ఎవడు సర్వదివ్యగుణ కర్మస్వభావవిద్యాయుక్తుడో, యెవనియందు పృథివీసూర్యాదిలోకములున్నవో, యెవడాకాశమువలె వ్యాపకుడో, సర్వదేవతలకు దేవుడునైన పరమేశ్వరుడున్నాడో యతని నెఱుగక, యంగీకరింపక, యతనిధ్యానము చేయక యుండువారు నాస్తికులు, మందమతులునై యెల్లపుడు దుఃఖసాగరమున మునిగియే యుందురు. కావున నతనినే యెఱిగి యెల్లరు నెల్లపుడు సుఖులగుదురు. (౧)

ప్రశ్నః— వేదమునం దీశ్వరులనేకు లున్నారను విషయమును మీరంగీకరింతురా లేదా?

ఉత్తరముః— అంగీకరింపము. ఏలయనగా నాలుగువేదములందు నెక్కడ నట్లు వ్రాయబడి యుండలేదు. అనేకేశ్వరులు సిద్ధించుటకు దగిన లేఖ లేకపోగా నీశ్వరుడొక్కడే యని వ్రాయబడియున్నది.

(33 దేవతలు)

ప్రశ్నః— వేదములం దనేకదేవతలు వర్ణింపబడినవికదా! దాని యభిప్రాయమేమి?

ఉత్తరముః— దేవత – దివ్యగుణములతో యుక్తమై యున్నకారణమున దేవత యనబడును. ఉదాహరణముః— పృథివి కాని, యీపృథివియను దేవత యీశ్వరుడనికాని, యుపాసనీయమనికాని యంగీకరింపలేదు. చూడుడు. ఈ మంత్రమునందే యెవనియందు సర్వదేవతలు నున్నవో యతడే యెఱుగుటకును, నుపాసించుటకును యోగ్యుడైన "ఈశ్వరుడ"ని వ్రాయబడియున్నది. 'దేవత' శబ్దమువలన నీశ్వరుని గ్రహించుట వారిప్రమాదము. – పొరపాటు. పరమేశ్వరుడు దేవతలకు దేవుడగుట వలన 'మహాదేవు' డనబడుచున్నాడు. అతడే సర్వజగదుత్పత్తి స్థితిప్రళయకర్త, న్యాయాధీశుడు, నధిష్ఠాతయు నైయున్నాడు.

'త్రయస్త్రింశత్ త్రిశతా' అను నిట్టి వేదమునందుగల ప్రమాణమునకు శతపథ బ్రాహ్మణమున వ్యాఖ్యానము చేయబడినదిః—

దేవతలు ముప్పదిమూడు:- పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, నక్షత్రము అను నివియన్నియు సృష్టికి నివాసస్థానము లగుటచే నీయెనిమిది (౮) అష్టవసువులు - వసుదేవత లనబడును. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, నాగము, కూర్మము, కృకలము, దేవదత్తము, ధనంజయము, జీవాత్మయను నీపదునొకండు (౧౧) రుద్రదేవతలు. ఇవి యన్నియు శరీరమును వదలిపోవునపుడు రోదనము కలిగించును - ఏడ్పించును. కావున నివి రుద్రదేవత లనబడును.

సంవత్సరమునగల పండ్రెండు మాసములు నాదిత్యదేవతలు (౧౨) ఈదేవత లెల్లరి యాయువును గ్రహించును గావున ద్వాదశాదిత్యు లనబడును. పరమైశ్వర్యహేతువైన విద్యుత్తింద్రు డనబడును. యజ్ఞమునకు ప్రజాపతి యనిపేరు. దీనివలన వాయువు, వృష్టిజలము, నోషధులు శుద్ధములగును. విద్వాంసుల సత్కారము జరుగును. నానావిధశిల్ప విద్యలవలన ప్రజాపాలనము జరుగును. కావున యజ్ఞమునకు ప్రజాపతి యనిపేరు.

ఈ ముప్పదిమూడు - ౮ వసువులు, ౧౧రుద్రులు, ౧౨ ఆదిత్యులు, ఇంద్రుడు, యజ్ఞము - (33 పదార్థములు) పూర్వోక్తదివ్య గుణముల యోగముచే దేవత లనబడును. వీనికిస్వామియు, నన్నింటికంటె గొప్పవాడు నగుటచే బరమాత్మ ముప్పదినాలుగవ యుపాస్య దేవత యని శతపథపు బదునాలుగవ కాండమున స్పష్టముగా నున్నది. ఈశాస్త్రములను జూచినచో వేదములం దనేకేశ్వరు లున్నారని యంగీకరింపవలసిన భ్రమలో నేలపడుదురు? (౧)

ఓ మానవా! ఈ సంసారమున - బ్రహ్మాండమున నేకొంచెము జగత్తు కలదో దానియందం తటను వ్యాప్తుడై, దానిని నియమించువాడే ఈశ్వరు డనబడుచున్నాడు. వానికి భయపడి నీవన్యాయముతో నెవని ధనమును గాంక్షింపకుము. అట్టి యన్యాయమును వదలి న్యాయాచరణరూప ధర్మమువలన నీయాత్మతో నానందము ననుభవింపుము. (౨)

ఈశ్వరుడందఱకు నుపదేశించుచున్నాడు:-

ఓమనుష్యులార! ఈశ్వరుడనగు నేనన్నింటికంటె ముందుగ నున్న వాడనై సర్వజగత్తునకు బతినై యున్నాను. నేను సనాతన జగత్కారణము. సర్వధనములను జయించువాడను, నిచ్చువాడనై యున్నాను. సంతానము తండ్రిని బిలుచునట్లు జీవులెల్లరు నన్నే పిలువవలయును. నేనెల్లరకు సుఖము నిచ్చువాడను. జగత్తును బాలించుటకు నానాప్రకారములగు భోజనములను విభజింతును. (3)

నేను బరమైశ్వర్యవంతుడను. సూర్యునివలె జగత్తును బ్రకాశింపజేయువాడను. ఎన్నడు బరాజయమునుగాని, మృత్యువునుగాని పొందను. ఈజగద్రూపధనమును నిర్మించువాడను నేనే. ఈజగత్తు నుత్పన్నము చేయువానినిగా నన్నే గుర్తింపుము. ఓజీవులార! ఐశ్వర్య ప్రాప్తికొఱకు యత్నించుచు మీరు విజ్ఞానాది ధనముకొఱకు నన్నే యాచింపుడు. మీరు నామిత్రత నుండి యెన్నడు వేఱు కావలదు. (౪)

ఓ మనుష్యులార! సత్యభాషణరూపస్తుతి నొనర్చు మనుజునకు నేను సనాతన విజ్ఞానాది ధనమును నొసంగుదును. నేను బ్రహ్మ-వేదమును బ్రకాశింపజేయువాడను. ఆవేదము నన్ను యథార్థముగ బోధించును. దానిమూలమున నెల్లరిజ్ఞానమును నేను బెంపు చేయుదును. నేను సత్పురుషులకు బ్రేరకుడను. యజ్ఞకర్తకు ఫలదాతను. ఈవిశ్వమునగల సర్వకార్యములను నిర్మించువాడను నేనే. ధారణచేయువాడను నేనే. కావున మీరు నన్ను వదలి నాస్థానమున మఱియొకనిని బూజింపకుడు, విశ్వసింపకుడు, గుర్తింపకుడు. (౫)

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్,
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ. యజు. ౧౩-౪

ఓమనుష్యులార! ఎవడు సృష్టికి బూర్వము తేజస్వంతములగు సూర్యాదిలోకముల యుత్పత్తి స్థానము - ఆధారమును, నుత్పన్నమైన దానికి, గానున్నదానికి స్వామియై యుండెనో, యున్నాడో, యుండునో యతడు పృథివి మొదలు సూర్యలోకమువఱకుగల సృష్టి నొనర్చి ధారణము చేయుచున్నాడు. ఆ సుఖస్వరూపుడగు పరమేశ్వరునకు మేము భక్తినొనరించునట్లు మీరును జేయుడు. (౬)

(ఈశ్వరసిద్ధి - ప్రమాణములు)

ప్రశ్నః- మీరీశ్వరు డీశ్వరుడని చెప్పుచున్నారు. కాని యాయీశ్వరుని సిద్ధి యెట్లు చేయుదురు?

ఉత్తరముః- ప్రత్యక్షాది సర్వప్రమాణములచేతను.

ప్రశ్నః- ఈశ్వరుని విషయమున ప్రత్యక్షాది ప్రమాణములు ఘటింపజాలవు.

ఉత్తరముః- ఇంద్రియార్థసన్నికర్షోత్పన్నం జ్ఞానమవ్యపదేశ్య మవ్యభిచారి వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్. ఇది గౌతమమహర్షికృత న్యాయదర్శన సూత్రము. (౧-౧-౪)

శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, మనస్సు ననువానికి గ్రమముగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, సుఖదుఃఖములు, సత్యాసత్యవిషయములు ననువానితో సంబంధము కలుగుటవలన నుత్పన్నమగు జ్ఞానము ప్రత్యక్షమందురు. కాని యది భ్రమాత్మకము కారాదు. నిర్భ్రమమై యుండవలయును.

ఎట్లనగా నింద్రియములతోను, మనస్సుతోను గుణములు ప్రత్యక్షమగును, గుణి ప్రత్యక్షము కాదు. త్వక్కు మున్నగు నాలుగింద్రియములతో స్పర్శరూపరసగంధముల జ్ఞానము గలుగుటవలన గుణియైన పృథివియొక్క ప్రత్యక్ష మాత్మయుక్తమనస్సుతో జేయబడుచున్నది. అట్లే యీ ప్రత్యక్షమగు సృష్టియందు రచనాదిక్రియ జ్ఞానాదిగుణములు ప్రత్యక్షమగుటవలన బరమేశ్వరుని ప్రత్యక్షముకూడ గలుగుచున్నది.

మఱియును, నాత్మ మనస్సును, మనస్సింద్రియములను కొండొక విషయమున లగ్న మొనర్చినపుడును, జౌర్యము మున్నగు చెడుకర్మములు గాని, పరోపకారము మొదలగు మంచిపనులుగాని చేయ ప్రారంభించిన క్షణముననె జీవుని యిచ్ఛాజ్ఞానాదిగుణము లాయిచ్ఛిత విషయమున లగ్నములగును. ఆక్షణముననే యాత్మలోపల జెడు కర్మములు చేయుటలో భయశంకాదులు, సుకర్మల నాచరించునపుడు నిర్భయనిఃశంకతాదులు కలుగును. అవి జీవాత్మునకు స్వయముగా గలుగునవి కావు. పరమాత్ముని వలన గలుగును. (ఇదియు నొకవిధమగు పరమాత్ముని ప్రత్యక్షమే యని భావము.)

ఇంకను జీవాత్ముడు శుద్ధుడై పరమాత్ముని విచారింప దత్పరుడై నపుడతనికి జీవాత్మపరమాత్మలు రెండును బ్రత్యక్షమగును. ఇట్లు పరమేశ్వరుని జ్ఞానము కలుగుటలో సందేహమేమి? ఏలయన గార్యమును జూచినపుడు కారణ మనుమానమువలన సిద్ధించును.

(ఈశ్వరవ్యాపకత)

ప్రశ్నః- ఈశ్వరుడు వ్యాపకుడా? కొండొక దేశవిశేషమున నుండునా?

ఉత్తరముః- వ్యాపకుడు. ఏలయనగా నేకదేశమున నుండువాడగు నెడల సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వనియంత, సర్వస్రష్ట, సర్వాధారుడు, ప్రళయకర్తయు గాజాలడు. అప్రాప్తదేశమున గర్తయొక్క క్రియ జరుగనేరదు.

ప్రశ్నః- ఈశ్వరుడు దయాళువు, న్యాయకారియు నగునా? కాదా?

ఉత్తరము:- అగును.

ప్రశ్న:- ఈ రెండు గుణములు బరస్పరము విరుద్ధములుగదా! న్యాయము చేసిన దయయు, దయజూపిన న్యాయమును బోవును. కారణమేమన, కర్మముల ననుసరించి యెక్కువతక్కువలు కాకుండ సుఖదుఃఖములను గలుగజేయుట న్యాయమనబడును. అపరాధము చేసినవానిని దండింపక విడిచిపుచ్చుట దయయనబడును.

(న్యాయము - దయ)

ఉత్తరము:- న్యాయము, దయ యను నీరెండింటియందు నామమాత్రమే భేదమున్నది. కారణమేమన న్యాయమువలన సిద్ధించు ప్రయోజనమే దయవలనను సిద్ధించును. మనుష్యుడపరాధము చేయక దుఃఖములపాలు గాకుండునట్లు చేయుటయే దండన ప్రయోజనము. పరులదుఃఖములను విడిపింప జేయుటయే దయ యనబడును. దయకు న్యాయమునకు నీవు చేసిన యర్థము సరికాదు. ఎవడెట్లెంత చెడుగు చేయునో వానికంత యట్లే దండనముచేయుట న్యాయమనబడును.

అపరాధిని దండింపకున్న న్యాయము నశించును. అపరాధియైన బందిపోటుదొంగ నొక్కని విడిచిపుచ్చుట వేలాది ధర్మాత్ములగు పురుషులకు దుఃఖము కలిగించుట యగును. ఒకనిని దండింపక విడిచి పెట్టినందున వేలకొలది మనుష్యులకు దుఃఖము కలిగినపుడదిదయ యెట్లగును? ఆ బందిపోటు దొంగను గారాగారమున బంధించియుంచి, యతడు పాపములు చేయకుండునట్లు చేయుట యతనిపై దయజూపుట యగును. అతనిని జంపినందున వేలకొలది మనుష్యులయెడ దయజూపుట యగును. (అంతేకాని దండింపక యపరాధిని విడిచి పెట్టుట దయకాదు.)

ప్రశ్న:- అటులయిన దయ, న్యాయము నని రెండు శబ్దములేల? ఆ రెండింటియర్థము లొక్కటియేకదా! అందువలన రెండు శబ్దము లుండుట వ్యర్థమగును. ఒకే శబ్దముండుట మంచిది. దీనింబట్టి దయ, న్యాయముల ప్రయోజన మొక్కటి కాదని సిద్ధమగుట లేదా?

ఉత్తరము:- ఒకయర్థమున కనేకనామము లొకనామమున కనేక యర్థములు నుండవా?

ప్రశ్న:- ఉండును.

ఉత్తరము:- ఉండినచో మరల నీకీశంక యేలకలిగినది?

ప్రశ్న:- లోకమున నట్లే వినుచుండుటవలన.

ఉత్తరము:- లోకమున సత్యాసత్యములు రెండును వినవచ్చుచుండును. కాని, దానిని విచారించి నిశ్చయించుట తనపని. చూడుము. సర్వజీవుల ప్రయోజనము సిద్ధించుటకొఱకు జగత్తున నన్నిపదార్థములను సృష్టించి పరమేశ్వరుడు వానిని దానము చేసియున్నాడు. ఇది యీశ్వరుని పూర్ణదయ. ఇంతకంటె భిన్నమైనది రెండవ గొప్ప దయ యేమున్నది? ఇక న్యాయఫలము ప్రత్యక్షముగా గనబడుచున్నది. సుఖదుఃఖముల వ్యవస్థ న్యూనాధికఫలములను బ్రకటించుచునే యున్నది. ఇక యీ రెండింటిలో నున్న భేదమింతే. మనస్సున నెల్లరకు సుఖము కలుగవలయునని కోరుట దుఃఖములు తొలగవలయునని కోరి యందులకు బ్రయత్నించుట దయ యనబడును. బాహ్యచేష్టలు - బంధనఛేదనాదులు యథారీతిని జరిపించుట న్యాయమనబడును. ఎల్లరను బాపములనుండియు, దుఃఖముల నుండియు దూరముగా నుంచుటయే దయాన్యాయముల రెండింటి ప్రయోజనము.

(ఈశ్వరుడు నిరాకారుడా? సాకారుడా?)

ప్రశ్న:- ఈశ్వరుడు సాకారుడా? నిరాకారుడా?

ఉత్తరము:- నిరాకారుడు. ఏలయన సాకారుడయ్యెనేని వ్యాపకుడు కాజాలడు. వ్యాపకుడు కానియెడల సర్వజ్ఞత్వాదు లతనియందు ఘటింపవు, పరిమిత వస్తువునందు గుణకర్మస్వభావములును బరిమితములుగానే యుండును. అట్లే శీతోష్ణములు, నాకలిదప్పికలు, రోగదోషములు, ఛేదన భేదనములు మున్నగువానినుండిపరిమిత వస్తువు వేఱుకాజాలదు. దీనినిబట్టి యీశ్వరుడు నిరాకారుడనియే నిశ్చితమగుచున్నది. ఈశ్వరుడు సాకారుడగు

నెడల నతని కన్ను, ముక్కు, చెవులు, మున్నగునవి నిర్మించువాడు మఱియొక డుండవలసివచ్చును. సంయోగమువలన నేర్పడువానిని సంయుక్తముచేయు నిరాకారచేతన మొకటి యుండకతప్పదు.

ఈ విషయమున నెవడేని యీశ్వరుడు స్వేచ్ఛతో దనశరీరమును దానే నిర్మించుకొనెను. అని యనినచో నప్పుడును శరీరము నేర్పఱచుకొనుటకు ముందు నీశ్వరుడు నిరాకారుడనియే సిద్ధమగును. కావున బరమేశ్వరుడు శరీరము నెన్నడు ధరింపడు. కాని, నిరాకారుడగుట వలన జగత్తుసంతతిని సూక్ష్మకారణములనుండి స్థూలాకారమునకు దెచ్చును.

(సర్వశక్తిమంతుడు)

ప్రశ్నః- ఈశ్వరుడు సర్వశక్తిమంతుడా? కాదా?

ఉత్తరముః- సర్వశక్తిమంతుడే కాని సర్వశక్తిమంతుడను పదమునకర్థము నీవనుకొనునది కాదు. ఈశ్వ రుడు తన కార్యమునందు ననగా జగదుత్పత్తి స్థితిప్రళయములను జేయుటయందును, జీవుల పాపపుణ్య ములకు దగిన వ్యవస్థ నొసయ్చుటయందును, గొంచెముకూడ నెవని సహాయతను దీసికొనడు. ఇదియే యతని సర్వశక్తిమత్త్వము. అతడు తన యనంత సామర్థ్యముతోనే తన కార్యములను బూర్ణముగ నెఱవేర్చు కొనును.

ప్రశ్నః- ఈశ్వరుడు కోరినదెల్ల జేయును అనియే మేమంగీకరించుచున్నాము. కారణమతనిపై నింకొకడు లేడు గదా?

ఉత్తరముః- ఆయనయేమి కోరును! అన్నియు కోరుచు అన్నియుజేయును. చేయగలడు అని మీరందురేని మేము మిమ్మడుగుచున్నాము. సమాధానము చెప్పుడు. పరమేశ్వరుడు తనను జంపుకొనగలుగునా? ఈశ్వరులన నేకులను సృష్టింపగలడా? స్వయముగా ననిద్వాంసుడై చౌర్యము, వ్యభిచారము మున్నగు పాపకర్మల నొనర్పగలడా? వానివలన దుఃఖములను బొందగలడా? ఇవియన్నియు నీశ్వరుని గుణకర్మస్వభావములకు విరుద్ధము లందురేని యతడన్నియు జేయగలడు అని మీరు చెప్పునది యీశ్వరు నందు వర్తింపదు. కావున సర్వశక్తిమంతుడను శబ్దమునకు మేము చెప్పిన యర్థమే సరియైనది. మీరు చెప్పినదికాదు.

ప్రశ్నః- పరమేశ్వరు డనాదియా? సాదియా?

ఉత్తరముః- అనాది. దేని కొకకారణము సమయము నుండవో యది యనాది యనబడును. ఇట్టి యర్థము లన్నియు ప్రథమసముల్లాసమున వివరింపబడినవి. అట జూడుడు.

ప్రశ్నః- పరమేశ్వరు డేమికోరును?

ఉత్తరముః- అందఱిమేలును గోరును. ఎల్లరికొఱకు సుఖమును గోరును. కాని తాను స్వతంత్రించి యెవనిని బాపము చేయకున్న బరాధీనుని జేయడు.

(ఈశ్వరస్తుతి ప్రార్థనాదులు)

ప్రశ్నః- పరమేశ్వరుని స్తుతిప్రార్థనోపాసనలు చేయవలయునా?

ఉత్తః- చేయవలయును.

ప్రశ్నః- స్తుత్యాదుల నొనర్చినందున నీశ్వరుడు తననిశ్చయమును వదలి స్తుతి ప్రార్థనాదుల నొనర్చువారి పాపములను దొలగించునా?

ఉత్తః- తొలగింపడు.

ప్రశ్నః- అట్లులైన స్తుతి ప్రార్థనాదుల జేయనేల?

ఉత్తః- వానిం జేయుటవలన గలుగుఫలము వేఱు.

ప్రశ్నః- అదియేమి?

ఉత్తరముః- స్తుతివలన నీశ్వరునందు బ్రీతి కలుగును. అతని గుణకర్మస్వభావముల వలన దనగుణ కర్మ స్వభావములను జక్కచేసికొనుట ప్రయోజనము. ప్రార్థనవలన నిరభిమానిత, యుత్సాహము, సాహాయ్యము లభించుట జరుగును. ఉపాసనవలన నీశ్వరునితో మేళనము, నతనిసాక్షాత్కారము కలుగుట, యనుప్రయోజనములు సిద్ధించును.

(సగుణనిర్గుణస్తుతులు)

ప్రశ్నః- సగుణనిర్గుణస్తుతుల స్పష్టముగా దెలుపుడు?

ఉత్తః- ఈశ్వరస్తుతిః-

**స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరగ్ం శుద్ధమపాపవిద్ధమ్,**
**కవిర్ మనీషీ పరిభూః స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్**
**వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః.** (యజు. ४०-८)

ఆ పరమాత్మ డన్నింటియందును వ్యాపకుడు, శీఘ్రకారి, యనంత బలవంతుడు, శుద్ధుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వోపరివిరాజమానుడు, సనాతనుడు, స్వయంసిద్ధుడు నైయున్నాడు. పరమేశ్వరుడు సనాతనులు, ననాదులు, జీవరూపులు నగు తన ప్రజకు దన సనాతన విద్యతో యథారీతిని వేదముద్వారా యర్థములబోధను గలిగించుచున్నాడు - అనునిది సగుణస్తుతి. ఏయే గుణములతో గూడియున్నట్లు పరమేశ్వరునిస్తుతి చేయబడునో యది సగుణస్తుతి యనిభావము. మఱియు అకాయం - అతడెన్నడు శరీరధారణము చేయడు - జన్మింపడు. అతనిలో ఛిద్రము కలుగదు. నాడి మున్నగువాని బంధనమున బడడు. పాపాచరణ మెన్నడు జేయడు. అతనిలో క్లేశములు, దుఃఖము, అజ్ఞానము నెన్నడు గలుగవు - అనునిట్టి గుణములు, రాగద్వేషాదులు లేనివాడుగా నెంచి పరమేశ్వరుని స్తుతిచేయుట నిర్గుణ స్తుతి యగును. ఈస్తుతివలన దన గుణకర్మస్వభావములను బరమేశ్వరుని గుణకర్మస్వభావములవలె జేసికొనవలయును. అదియెట్లనః- అతడు న్యాయకారి కావున దానుగూడ న్యాయకారి కావలయును. కేవలము భట్టువలె బరమేశ్వరుని గుణకీర్తనము చేయుచు దనచరిత్రను బాగుచేసికొననివాని స్తుతి వ్యర్థమగును.

(ప్రార్థన)

**యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే,**
**తయా మామద్య మేధయాఽగ్నే మేధావినం కురు స్వాహా.** (యజు. అ ३२-మం.१४)

ఓఅగ్నే! ప్రకాశస్వరూపుడవగు పరమాత్మా నీకృపచే విద్వాంసులును, జ్ఞానులును, యోగులు నేమేధ (బుద్ధి) నుపాసించుచున్నారో మమ్మును నట్టి మేధావంతులుగ - విద్వాంసులుగ నిపుడే చేయుము.

**తేజోఽసి తేజో మయి ధేహి వీర్యమసి వీర్యం మయి ధేహి బలమసి బలం**
**మయి ధేహి ఓజోఽస్యోజో మయి ధేహి మన్యురసి మన్యుం మయి ధేహి**
**సహోఽసి సహో మయి ధేహి.** (యజు. అ १९-మం ९)

నీవు ప్రకాశస్వరూపుడవు. దయచేసి నాయందును బ్రకాశమును నింపుము. నీవనంతపరాక్రమయుక్తుడవు. నీకృపాకటాక్షముచే నాయందును బూర్ణపరాక్రమ ముంచుము. నీవనంత బలయుక్తుడవు. నాయందును బలము జేర్చుము. నీవనంత సామర్థ్యయుక్తుడవు. నాకును బూర్ణసామర్థ్యమును బ్రసాదింపుము. నీవు దుష్టకార్యములయందును, దుష్టులమీదను క్రోధకారివి నన్నును నట్లే కావింపుము. నీవు నిందాస్తుతులయందును, నీకపరాధులయెడలను సహనము కలవాడవు. నేనును నీకృపచే నట్లే యగుదును గాక!

**యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి,**
**దూరం గమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు.** (యజు. అ ३४-మం १)

ఓదయానిధీ! నీకృపచేత నామనస్సు జాగ్రదవస్థలో గడుదవ్వు ప్రసరించుచు దివ్యగుణయుక్తమై యుండును. నిద్రించునపు డానామనస్సు సుషుప్తిని బొందును. స్వప్నమందు దూరముగ బోయినట్లు వ్యవహరించుచు బ్రకాశకములకు బ్రకాశకమై యున్నది. అట్టి నామనస్సు శివసంకల్పము - తన కొఱకు నితరుల కొఱకును గల్యాణమును సంకల్పించునది యగునుగాక! అనగా నెవరికివి నెన్నడును హాని

చేయుట కిచ్చగింపకుండునుగాక!

యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః,

యదపూర్వం యక్షమంతః ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు. (౨)

ఓ సర్వాంతర్యామీ! కర్మమొనర్చు ధర్మయుక్తులగు విద్వాంసులు యజ్ఞమునందును, యుద్ధాదుల యందును దేనిమూలమున బనిచేయుచున్నారో, యేది యపూర్వసామర్థ్యముతో గూడి పూజనీయమై ప్రజలలోపల నుండునో, యట్టి నామనస్సు ధర్మము చేయునిచ్ఛతో గూడి యధర్మమును సర్వథా వదలి పెట్టునుగాక!

యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతిరంతరమృతం ప్రజాసు.,

యస్మాన్న ఋతే కించన కర్మ క్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు. (౩)

ఏది యుత్కృష్టజ్ఞానమో, యేది యితరులకు జైతన్యము నిచ్చు నిశ్చయాత్మకవృత్తియో, యేది ప్రజలయందు బ్రకాశయుక్తముగను, నాశరహితముగను నుండునో యేదిలేక యెవ్వడు నేకార్యమును జేయజాలడో యా నామనస్సు శుద్ధగుణములను గోరి దుష్టగుణములనుండి దూరముగా నుండునుగాక!

యేనేదం భూతం భువనం భవిష్యత్పరిగృహీతమమృతేన సర్వమ్,

యేన యజ్ఞస్తాయతే సప్తహోతా తన్మే మనః శివసంకల్పమస్తు. (౪)

ఓజగదీశ్వరా! యోగులందఱును దేనిమూలమున నీభూతభవిష్యద్వర్తమానవ్యవహారముల నన్నిటిని దెలియుచున్నారో, యేది నాశరహితమై జీవాత్మను బరమాత్మతో గూర్చి యన్ని విధముల ద్రికాలజ్ఞునిగ జేయుచున్నదో, దేనియందు జ్ఞానము, క్రియయు నున్నవో, దేనియందు బంచజ్ఞానేంద్రియములును, బుద్ధియు, నాత్మయు గూడియుండునో, యోగరూపయజ్ఞము దేనితో వృద్ధిచేయుదురో యట్టి నామనస్సు యోగవిజ్ఞానయుక్తమై యవిద్యాది క్లేశములనుండి దూరముగ నుండుగాక!

యస్మిన్నృచః సామ యజూగ్ంషి యస్మిన్ప్రతిష్ఠితా రథనాభావివారాః,

యస్మింశ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానాం తన్మే మనః, శివసంకల్పమస్తు. (౫)

ఓపరమ విద్వాంసుడవగు పరమేశ్వరా! చక్ర మధ్యమందు నడ్డనాకులు కూడియుండునట్లు నీకృప వలన నామనస్సునందు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, నథర్వణవేదమును బ్రతిష్ఠితములగునో, దేనియందు సర్వజ్ఞుడును, సర్వవ్యాపకుడును, బ్రజలకు సాక్షియు నగు చిత్తచైతన్యుడు విదితుడగునో యానామన స్సవిద్యను బోగొట్టుకొని సదా విద్యాప్రియమగునుగాక!

సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్నేనీయతేఽభీశుభిర్వాజిన ఇవ,

హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివసంకల్పమస్తు. (౬)

ఓసర్వనియంతవగు నీశ్వరా! గుఱ్ఱములను బగ్గములచేత సారథి త్రిప్పునట్లేది మనుష్యుల నటునిటు మిక్కిలి త్రిప్పుచున్నదో యేది హృదయమందుండి గతి, యత్యంతవేగములు గల్గియుండునో యా నామనస్సు సమస్తేంద్రియములను నధర్మాచరణమునుండి నిరోధించి ధర్మపథమందు సర్వదా నడపించునట్లు కృపచేయుము.

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్,

యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ. (యజు. అ ౪౦—మం ౧౬)

సుఖము నిచ్చువాడవై స్వప్రకాశస్వరూపుడవై సర్వజ్ఞుడవగు నోపరమాత్మా! నీవు మమ్ములను శ్రేష్ఠమార్గమునందు నడపించి సంపూర్ణ ప్రజ్ఞానము నందజేయుము. కుటిలపాపాచరణరూపమగు మార్గమునుండి మమ్ము దూరముచేయుము. మేము నమ్రతాపూర్వకముగ నిన్ను మిక్కిలి స్తుతించుచున్నారము. మమ్ము బవిత్రులను జేయుము.

మా నో మహాంతముత మా నో అర్భకం మా న ఉక్షంతముత మా న ఉక్షితమ్,
మా నో వధీః పితరం మోతమాతరం మా నః ప్రియాస్తన్వో రుద్రరీరిషః.

(యజు. అ ౧౬ మం.౧౫)

ఓరుద్రా! దుఃఖరూపమగు పాపఫలములిచ్చి దుష్టుల నేడ్పించు పరమేశ్వరా! నీవు మాయందలి చిన్నలను, పెద్దలను, గర్భములను, దలిదండ్రులను, ప్రియులను, బంధువర్గములను, శరీరములను జంపుటకు మమ్ములను బ్రేరేపింపకుము. నీదండమునకు బాత్రులము గాకుండునట్టి మార్గమందు మమ్ములను నడపుము.

అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ,
మృత్యోర్మాఽమృతం గమయేతి. (శతపథ.బ్రా. ౧౪—౩—౧—౩౦)

ఓపరమగురూ! పరమాత్మా! నీవు మమ్ములను నసన్మార్గమునుండి వేఱుచేసి సన్మార్గమున జేర్చుము. అవిద్యాంధకారము నుండి తొలగించి విద్యారూపసూర్యుని బొందజేయుము. మృత్యురోగము నుండి వేఱుచేసి మోక్షానందామృతమును గూర్చుము. అనగా నేయే దోషములనుండియు, దుర్గుణముల నుండియు బరమాత్మను, దనను వేఱుగానెంచి పరమేశ్వరుని ప్రార్థన చేయబడునో యది విధినిషేధ పూర్వక మగుటవలన బ్రార్థన సగుణము, నిర్గుణము ననబడును. ఎవడు దేనినిగూర్చి ప్రార్థించునో వాడట్లే వర్తింపవలయును. సర్వోత్తమ బుద్ధికొఱకు బరమేశ్వరుని బ్రార్థించువాడు, దానికొఱకు దనశక్తి కొలది బ్రయత్నింపవలయును. అనగా దాను బురుషార్థము చేసి ప్రార్థింపవలయును. “ఓ పరమేశ్వరా! నీవు నాశత్రువులను నాశనము చేయుము. నన్నందఱకంటె గొప్పవానిగ జేయుము. నాకే ప్రతిష్ఠ కలుగవలయును. నాయధీనములో నెల్లరు నుండవలయును”. అనునిట్టి ప్రార్థనల నెన్నడు జేయరాదు. పరమేశ్వరుడు వానిని స్వీకరింపడు. ఏలయనగా నిద్దఱు శత్రువులు దమశత్రు నాశనము కావలయునని ప్రార్థించిరేని, పరమేశ్వరు డాయిద్దఱిని నాశనము చేయవలయునా? కొంద ఱీవిషయమం దెవనిప్రేమ యధికమో యతని ప్రార్థన సఫలమగు నందురేని, యెవని ప్రేమ న్యూనమో యతని శత్రునాశనమును న్యూనము కావలసివచ్చును. కావున నిట్లు మూర్ఖముగ బ్రార్థించుచు నొక్కనాడు ఓపరమేశ్వరా! మాకు రొట్టెలను జేసిపెట్టుము. నాయింటిని శుభ్రము చేయుము. నాబట్టలుదుకుము, నా పొలమును సాగుచేయుము. అని కూడ బ్రార్థింపగలరు. ఈరీతిగ బరమేశ్వరునిపై భారము వైచి సోమరులై కూర్చుండువారు మహామూర్ఖులు. ఏలయనగా బరమేశ్వరుడు పురుషార్థము చేయుట కాజ్ఞాపించి యున్నాడు. ఎవడు దాని నుల్లంఘించునో యతడెన్నడును సుఖము బొందడు.

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః. (యజు. అ ౪౦—మం. ౨)

పరమేశ్వరు డాజ్ఞాపించుచున్నాడుః— మనుష్యుడు నూఱేండ్ల పర్యంతము —బ్రదికియుండునంత కాలము గర్మములచేయుచు బ్రతుకుట కిచ్ఛగింపవలయును. కాని యెన్నడును సోమరిగా నుండగూడదు.

చూడుడు! సృష్టియందు బ్రాణులును, నప్రాణులును నన్నియును దమతమ కర్మములను, యత్నములను జేయుచునే యుండును. చీమలు మొదలగునవి సర్వదా ప్రయత్నము చేయుచునే యున్నవి. పృథివి మొదలగునవి సర్వదా తిరుగుచునే యున్నవి. వృక్షములు మొదలగునవి పెరుగుచు విఱుగుచునున్నవి. ఈదృష్టాంతములను మనుష్యులందఱు గ్రహించుట యోగ్యము. ప్రయత్నము జేయునట్టి పురుషున కితరుడు సాహాయ్యము చేయునట్లే, ధర్మముతో బురుషార్థ మొనర్చువానికి నీశ్వరుడును సాహాయ్యము చేయును. పనిచేయునట్టి పురుషునే భృత్యునిగా నుంచుకొందుము. సోమరిని గాదు. చూడగోరువానికిని, గన్నులు గలవానికిని జూపుదుమే కాని గ్రుడ్డివానికి జూపము. ఇదియునుగాక పరోపకార

మొనర్చు ప్రార్థనయందు బరమేశ్వరుడు సహాయకు డగుచున్నాడు, కాని హానికారక కర్మములయందు గాదు. బెల్లము తియ్యగా నున్నదని మాటలు మాత్రము చెప్పువానికి బెల్లముకాని, దానిరుచికాని యెన్న డును గలుగదు. ఎవడు ప్రయత్నము చేయునో వానికి శీఘ్రముగానో, విలంబముగానో బెల్లము దొరకనే దొరకును.

(ఉపాసన)

సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్,
న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే ।
(మైత్రాయణ్యుపనిషత్తు ౬-౯-౯)

ఇది యుపనిషద్వచనము :- ఎవనికి సమాధియోగమువలన నవిద్యాది మలములు నష్టమయినవో, యెవడాత్మస్థుడై పరమాత్మయందు జిత్తముజేర్చియున్నాడో, యతనికి బరమాత్మయోగముచే నేసుఖము కలుగుచున్నదో యది వాణితో జెప్పుట కలవికానిది. ఏలయనగా నాయానందమును జీవాత్మ తనయంతః కరణముతో గ్రహించును.

ఉపాసనాశబ్దమునకు నర్థము సమీపస్థుడగుట. అష్టాంగయోగముచే బరమాత్మకు జేరువగుటకును, నాపరమాత్మను సర్వవ్యాపి, సర్వాంతర్యామి రూపముచే బ్రత్యక్షము చేసికొనుటకును నావశ్యకమగు కార్యములనన్నియు జేయవలయును. అనగా:-

తత్రాహింసా సత్యాస్తేయబ్రహ్మచర్యాఽపరిగ్రహాయమాః. (యో.సా.సూ. ౩౦)

ఉపాసన నారంభింపగోరువా డెవరియందును వైరముంచగూడదు. అందఱియందును, నిరంతరము బ్రీతి నుంచవలయును. సత్యమును జెప్పవలయును. అబద్ధ మెన్నడును జెప్పరాదు. దొంగిలింపగూడదు. సత్యవ్యవహారమే చేయవలయును. జితేంద్రియుడై యుండవలయును. లంపటుడు కాగూడదు. నిరభి మాని కావలయును. అభిమాన మెన్నడును గూడదు. ఈయయిదు విధముల యమము లుపాసనాయోగ మునకు బ్రథమాంగము.

శౌచసంతోషతపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః. (యో.సా.సూ. ౩౨)

రాగద్వేషములను వదలి లోపలను, జలాదులచే వెలుపలను - బవిత్రుడుగా నుండవలయును. ధర్మముచే బురుషార్థమొనర్చుటవలన గలుగు లాభముచే సంతోషమును, హానిచే దుఃఖమును బొందక సర్వదా ప్రసన్నుడై యాలస్యమును వదలి పురుషార్థ మొనర్పవలయును. ఎల్లప్పుడు సుఖదుఃఖములను సహించుచు ధర్మమునే యనుష్ఠింపవలయును. అధర్మము ననుష్ఠింపరాదు. ఎల్లప్పుడు సత్యశాస్త్రములను జదువుచు జదివించుచు సత్పురుషుల సాంగత్యము చేయవలయును. 'ఓ౩మ్' అను పరమాత్ముని నామార్థ మును విచారింపవలయును. ప్రతిదినము జపము చేయవలయును. తనయాత్మను బరమేశ్వరుని యాజ్ఞా నుకూలముగా సమర్పింపలయును. ఈయయిదు నియమములును గలిసి యుపాసనాయోగమున రెండవయంగ మనబడును. దీనికి బిమ్మట నాఱంగములను యోగశాస్త్ర మందుగాని, ఋగ్వేదాది భాష్య భూమికయందుగాని చూడవలయును. (ఋగ్వేదాదిభాష్యభూమికలో నుపాసనావిషయమందు దానివర్ణన మున్నది.)

ఉపాసన చేయవలసినపు డేకాంతమగు పరిశుద్ధ ప్రదేశమున జేరి యాసనబద్ధుడై ప్రాణాయామము జేసి బాహ్యవిషయములనుండి యింద్రియములను మరల్చి మనస్సును నాభిప్రదేశమందుగాని, శిఖాస్థాన మందుగాని, వెన్నెముక-బ్రహ్మదండియందుగాని, స్థిరపఱచి స్వాత్మపరమాత్మల వివేచనము చేయుచు బరమాత్మయందు మగ్నుడై సంయమి కావలయును.

(ఉపాసనాభేదములు)

ఈసాధనములను జేసినపు డతని యాత్మయు, నంతఃకరణమును బవిత్రములయి సత్యపూర్ణము లగును. ప్రతిదినము జ్ఞానమును విజ్ఞానమును వర్థిల్లజేసి ముక్తివఱకు జేర్చును. ఎనిమిదిజాములలో నొక్కగడియ యేని యిట్లు ధ్యానించెనేని యత డెల్లప్పుడు నున్నతినే పొందును.

సర్వజ్ఞత్వాది గుణములతో బరమేశ్వరుని నుపాసించుట సగుణోపాసన. రాగము, ద్వేషము, రూపము, రసము, గంధము, స్పర్శము మున్నగు గుణముల నుండి వేఱని యెంచి యతిసూక్ష్మమగు నాత్మ లోపలను వెలుపలను వ్యాపించియుండు పరమేశ్వరునియందు దృఢముగా స్థితుడగుట నిర్గుణోపాసన యనబడును.

దీనికి ఫలముః- చలిచే బాధింపబడు పురుషు డగ్నిని సమీపించుట వలన జలి దూరమగునట్లు పరమేశ్వరుని సమీపించుటచే సమస్త దోషములును, దుఃఖములును బోయి పరమేశ్వరుని గుణకర్మస్వభావములవలె జీవాత్మగుణకర్మస్వభావములును బవిత్రములగును. కాబట్టి పరమేశ్వరుని స్తుతిప్రార్థనోపాసనల నవశ్యము చేయవలయును. దీనికి దక్కిన ఫలము లటుండగా బర్వతమంతటి దుఃఖము ప్రాప్తించి నను భయపడక సహింప గలుగును. ఆధ్యాత్మిక బలము వర్థిల్లును. ఇదియేమి సాధారణమా? ఇదిగాక పరమేశ్వరుని స్తుతిప్రార్థనోపాసనలు చేయనివాడు మహామూర్ఖుడును, గృతఘ్నుడు నగును. ఏలయనగా నేపరమాత్మ యీజగత్తున సమస్త పదార్థములను జీవుల సుఖము కొఱకు బ్రసాదించి యున్నాడో యతని గుణములను మఱచుటయు నాయీశ్వరునే నమ్మకుండుటయు, గృతఘ్నతయు, మూర్ఖతయు నగును.

(అవయవరహితేశ్వరు డెట్లు పనిచేయును?)

ప్రశ్నః- ఈశ్వరునకు శ్రోత్రనేత్రాదీంద్రియములు లేకున్న నతడింద్రియములపని నెట్లు చేయును?

ఉత్తరముః- అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః,
న వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా, తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్.

శ్వేతా. ఉ-౩-౧౯

పరమేశ్వరునకు జేతులు లేవు, కాని తన శక్తిరూపమగు హస్తములతో నన్నింటిని రచింపగలడు, గ్రహింపగలడు. పాదములు లేవు, కాని వ్యాపకుడగుటచే నెల్లరకంటె వేగవంతుడు. నేత్రములులేవు, కాని సర్వము నున్నది యున్నట్లు చూచును. చెవులు లేవు, కాని యెల్లరి మాటలను వినును. అతని కంతఃకరణము లేదు, కాని సర్వజగత్తు నెఱుగగలడు. అతని నవధిలో నెవ్వరు నెఱుగగలవారు లేరు. సనాతనుడు, సర్వశ్రేష్ఠుడు, నెల్లపదార్థములందు బూర్ణుడగుటచే బురుషు డనబడును. ఇంద్రియములతోను, నంతఃకరణముతోను జేయదగినపనులను దన సామర్థ్యముచేతనే చేయును.

(ఈశ్వరుడు నిష్క్రియుడు నిర్గుణుడు కాదు.)

ప్రశ్నః- పలువు రతనిని నిర్గుణుడు నిష్క్రియుడు నందురు.

ఉత్తః- న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే,
పరాస్య శక్తిర్ వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ. (శ్వేతా-ఉ-౬.౮)

పరమాత్మునివలన దద్రూపకార్య మేర్పడదు. (మట్టినుండి కుండయేర్పడినట్లు, పరమేశ్వరుని నుండి యెట్టికార్యము - చేతన కార్యము కలుగదు.) పరమేశ్వరునకు గరణము - సాధకతమము మఱియొకటి యపేక్షితము కాదు. (కుమ్మరికి దండమావశ్యకమైనట్లు) ఈశ్వరునకు దుల్యుడైన (మఱియొక యీశ్వరుడు) వాడుకాని యధికుడుకాని లేడు. అతనిలో సర్వోత్తమశక్తి, యనంతజ్ఞానము, ననంతబలము,

ననంతక్రియయు నున్నవి. అదియు స్వాభావికము. అనగా నతనిలో సహజశక్తి యున్నట్లు వినుచున్నాము. పరమేశ్వరుడు నిష్క్రియుడైనచో జగదుత్పత్తిస్థితి ప్రళయములు చేయజాలడు. కావున నతడు విభువు. అయినను జేతనుడగుటచే నతనియందు గ్రియయు నున్నది. (ప్రకృతియందు గ్రియలు గలిగించి క్రియావంతుడగుచున్నాడని భావము).

ప్రశ్నః- పరమేశ్వరుడు క్రియ యొనర్చునపు డాక్రియ యంతముగలదై యుండునా? లేదా?

ఉత్తః- ఎంతదేశ - కాలములలో గ్రియనొనర్చుట యుచితమని పరమేశ్వరు డెంచునో యంతదేశ - కాలములలో గ్రియ నొనర్చును. ఎక్కువకాని, తక్కువకాని చేయడు. అతడు విద్వాంసుడుకదా!

(ఈశ్వరస్వరూపము)

ప్రశ్నః- పరమేశ్వరుడు తనయంతము నెఱుగునా? లేదా?

ఉత్తః- పరమేశ్వరుడు పూర్ణజ్ఞాని. ఏది యెట్లున్న నదియట్లే తెలిసికొనుట జ్ఞానమగును. పరమేశ్వరు డనంతుడు. అతని ననంతుడనియెఱుగుటయే జ్ఞానమగును. దానికి విపరీతముగా నెఱుగుట యజ్ఞానము. అనంతమును సాంతముగాను, సాంతమును ననంతముగాను నెఱుగుట భ్రమయనబడును. 'యథార్థ దర్శనం జ్ఞానమ్' ఏపదార్థ మెట్టిగుణకర్మస్వభావములు కలిగియున్న దానినట్లే తెలిసికొనుట జ్ఞానము, విజ్ఞానము ననబడును. తద్విపరీత మజ్ఞానమగును. కావున --

**క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః. యోగ. సమాధి-౨౪.**

అవిద్యాది క్లేశములు, శుభాశుభములు, క్లిష్టాక్లిష్టములు, మిశ్రఫలదాయకములు నగు కర్మములు, నాకర్మములవల్ల గలుగువాసనలు లేనివాడు, సర్వజీవులకంటె విశిష్టుడునైనవాడు నీశ్వరుడనబడును.

ప్రశ్నః- ఈశ్వరాసిద్ధేః (౧) సాంఖ్య ౧-౯౨.
ప్రమాణాభావాన్న తత్సిద్ధిః (౨) సాం. ౫-౧౦
సంబంధాభావాన్నానుమానమ్. ॥ (౩) సాం. ౫-౧౧.

ఈశ్వరునిసిద్ధియందు బ్రత్యక్షప్రమాణము ఘటింపదు. ప్రత్యక్ష ప్రమాణముతో నీశ్వరుడు సిద్ధింపడని భావము. (౧)

ఈశ్వరునిసిద్ధిలో బ్రత్యక్షము ప్రమాణము కానందున ననుమానాది ప్రమాణములుకూడ నీశ్వర సిద్ధికి దోడ్పడవు. (౨)

వ్యాప్తిసంబంధము లేనందున ననుమానముకూడ (ఈశ్వరసిద్ధిలో) బ్రమాణము కాదు. ప్రత్యక్షానుమానములు పనికిరానందున శబ్దప్రమాణాదులు ఘటింపవు. అందువలన నీశ్వరునిసిద్ధి కలుగదు. (౩)

ఉత్తరముః- ఇక్కడ నీశ్వరసిద్ధియందు బ్రత్యక్షప్రమాణము లేదు. మఱియు నీశ్వరుడు జగత్తునకుపాదానకారణము కాదు. (పై సూత్రముల యభిప్రాయ మిట - ఈశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణముచే సిద్ధింపగలడా లేడా? యనునది కాదు. ఉపాదానకారణమా? కాదా? అనునదియు గాదని భావము.)

పురుషునికంటె విలక్షణుడు. సర్వత్ర బూర్ణుడగుట వలన బరమాత్ముడు పురుష డనబడుచున్నాడు. శరీరమున శయనించుటవలన జీవుడు పురుషుడన బడుచున్నాడు. కారణమేమన నీ ప్రకరణమునసే చెప్పబడినది.

**ప్రధానశక్తియోగాచ్చేత్ సంగాపత్తిః. (౧) సాం. ౫-౮**

**సత్తామాత్రాచ్చేత్ సర్వైశ్వర్యమ్. (౨) సాం. ౫-౯**

**శ్రుతిరపి ప్రధానకార్యత్వస్య. (౩) సాం. ౫-౧౨.**

పురుషునకు బ్రధానశక్తితో యోగమున్నయెడల (ప్రకృతి యీశ్వరుడు కలిసి ప్రపంచమున కుపా

దానకారణ మగునని చెప్పిన) పురుషునందు సంగాపత్తి కలుగును. అనగా ప్రకృతి సూక్ష్మరూపమునుండి స్థూలమై కార్యరూపమున బరిణమించినట్లుగా నీశ్వరుడును సూక్ష్మమునుండి స్థూలుడై కార్యరూపమున బరిణమించువాడు కావలసివచ్చును. అనగా స్థూలుడు కావలసివచ్చును. కావున నీశ్వరుడు జగత్తున కుపాదానకారణము కాదు. నిమిత్తకారణమే. (౧)

చేతనమువలన (ఈశ్వరుని సత్తావలన) జగదుత్పత్తియైనయెడల బరమేశ్వరుడు సర్వైశ్వర్య యుక్తుడైనట్లు జగత్తుకూడ సర్వైశ్వర్య యుక్తము కావలయును. కాని జగత్తట్లు లేదు. కావున బరమేశ్వరుడు జగత్తునకు నుపాదానకారణము (సత్తావలనగూడ) కాదు. నిమిత్తకారణమే. (౨)

ఉపనిషత్తుకూడ బ్రధానమే-ప్రకృతియే జగత్తున కుపాదానకారణమని చెప్పుచున్నది. (౩)

అదియెట్లనః-

**అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం స్వరూపాః. శ్వే-ఉ-౪-౫.**

జన్మరహితమగు సత్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియే స్వరూపాకారముతో ప్రజారూపమగుచున్నది. అనగా బ్రకృతిపరిణామినీ - మార్పుచెందు స్వభావము కలది. కావున నవస్థాంతరమును బొందుచున్నది. పురుషు డపరిణామి యగుటవలన నవస్థాంతరమును బొంది యెన్నడు మఱియొక రూపమును బొందడు. ఎల్లప్పుడు కూటస్థుడు-నిర్వికారుడై యుండును. కావున గపిలాచార్యుని ననీశ్వరవాది యని చెప్పువాడే యనీశ్వరవాది యగును గాని కపిలాచార్యుడెన్నడును గాడు.

అట్లే మీమాంసకుడు 'ధర్మము-ధర్మి' అను పదములవలన, వైశేషికుడు 'ఈశ్వర' పదమువలన, 'ఆత్మా' శబ్దమువలన న్యాయకర్త, వీరెల్లరు ననీశ్వరవాదులు కారు. సేశ్వరవాదులే. కారణమేమనః- సర్వజ్ఞత్వాది ధర్మయుక్తు డగుటవలనను, 'అతతి సర్వత్ర వ్యాప్నోతీతి ఆత్మా' సర్వత్ర వ్యాపకుడు, సర్వజ్ఞత్వాది ధర్మయుక్తుడు, సర్వజీవులకు నాత్మయు నగువానినే, మీమాంస, వైశేషికము, న్యాయము నీశ్వరునిగ నంగీకరించుచున్నవి.

ప్రశ్నః- ఈశ్వరు డవతరించునా! లేదా?

ఉత్తః- లేదు. అవతరింపడు. కారణమేమన 'అజ ఏకపాత్' 'స పర్యగాచ్ఛుక్రమకాయమ్' అను నిట్టి యజుర్వేదవచనములవలన బరమేశ్వరుడు జన్మింపడు, అవతరింపడనియు సిద్ధమగుచున్నది.

ప్రశ్నః- యదా యదా హి ధర్మస్య గ్లానిర్ భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్. (భ.గీ. ౪-౭)

'ఎప్పుడెప్పుడు ధర్మమునకు లోపము కలుగునో యప్పుడప్పుడు నేను శరీరధారణము చేయుదును'ని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు కదా?

ఉత్తః- ఇయ్యది వేదవిరుద్ధమగుటవలన బ్రమాణము కాదు. శ్రీకృష్ణుడు ధర్మాత్ము డగుటవలన ధర్మమును రక్షింపగోరుచుండెను. కావున 'నేను యుగయుగమున జన్మించి శ్రేష్ఠుల రక్షణము, దుష్టుల నాశము చేయుదును' అని కృష్ణుడు చెప్పిన జెప్పవచ్చును. అందు దోషమేమియు లేదు. ఏలయన 'పరోపకారాయ సతాం విభూతయః' సత్పురుషుల తనుమనోధనములు పరోపకారముకొఱకే యుపయోగింపబడును. అంతమాత్రమున శ్రీకృష్ణు డీశ్వరుడు కాజాలడు గదా!

ప్రశ్నః- అటులయిన లోకమున నిరువదినాలు గీశ్వరావతారము లైనట్లేల యంగీకరించుచున్నారు?

ఉత్తరముః- వేదార్థముల నెఱుగకుండుటవలనను, సాంప్రదాయకులు భ్రమింపజేయుటవలనను, స్వయముగా విద్వాంసులు కాకపోవుటచేతను, నిట్టి యప్రామాణిక విషయముల నమ్ముచున్నారు.

ప్రశ్నః- ఈశ్వరు డవతరింపకున్న గంసరావణాదులగు దుష్టుల నాశమెట్లు కాగలదు?

ఉత్తరము:- జన్మించినవాడు తప్పక మృతినొందును. ఇది మొదటి సమాధానము. ఈశ్వరుడు శరీరమును ధారణము చేయకయే సృష్టిస్థితి ప్రళయములు చేయగలడు. అట్టివానికి గంసరావణాదులను నాశముచేయుట యసాధ్యమా? వారు కీటకములతో సమానులు. ఈశ్వరుడు సర్వవ్యాపకుడగుటచే గంస మర్మచ్ఛేదన మొనర్చి వారిని నాశము చేయగలడు. ఈయనంతగుణకర్మ స్వభావయుక్తుడగు పరమేశ్వరు డొకక్షుద్రప్రాణిని జంపుటకు జన్మమరణ యుక్తుడగునని చెప్పువాని మూర్ఖతను దేనితో బోల్చవల యునో తెలియకున్నది.

భక్తజనుల నుద్ధరించుట కీశ్వరుడు జన్మించుననుటయు సత్యము కాదు. భక్తులీశ్వరుని యాజ్ఞాను కూలముగ నడుచుకొందురు. వారిని రక్షించుటకు నుద్ధరించుటకు, బూర్ణసామర్థ్య మీశ్వరునందున్నది. పృథివి, సూర్యచంద్రాదులతో గూడిన యీజగత్తును సృష్టించి, ధరించి, ప్రళయ మొనర్చుట కంటె గంస రావణాదులవధ, గోవర్ధనాది పర్వతముల నెత్తుటయు గొప్పకార్యములా? ఈ ప్రపంచమున బరమేశ్వరుని కర్మములను గూర్చి యెవడేని విచారించిన 'న భూతో న భవిష్యతి' ఈశ్వరసదృశుడు పూర్వము పుట్ట లేదు. ఇకముందు బుట్టబోడని సులభముగా దెలిసికొనగలడు.

యుక్తితోను నీశ్వరజన్మము సిద్ధింపదు. 'అనంతాకాశము గర్భమునందిమిడినది. నేను దానిని ముష్టితో బంధించితిని' అని యెవడేని చెప్పిన నది యెన్నడును సత్యము కాదు. ఏలయన నాకాశమనం తము. అన్నింటియందును వ్యాపించి యుండును. అందువలన నది వెలుపలకు రాదు. లోపలకు బోదు. అట్లే పరమేశ్వరుడు ననంతుడు, వ్యాపకుడు నగుటవలన నతడు వచ్చుట పోవుట యనున దెన్నడును సిద్ధముకాదు. గమనాగమనములు – రాకపోకలు వస్తువొకయెడ నుండి మఱియొకయెడ లేకున్న జరుగ గలవు. అంతట నుండువస్తువులో రాకపోకలు జరుగనేరవు. పరమేశ్వరు డెటనుండియో వచ్చుటకు గర్భ ములో లేడా? వెలుపల లేడా లోపల నుండి బయటకు వచ్చుటకు? ఈశ్వరుని విషయమున నిట్లు చెప్పు టయు నంగీకరించుటయు విద్యావిహీనులకు గాక మఱియెవ్వరికిని దగదు. కావున నీశ్వరుని రాకపోకలు జన్మమరణములు నెన్నడు సిద్ధింపవు.

అందువలననే క్రీస్తు మున్నగు వారుకూడ నీశ్వరుని యవతారములు కావు. రాగద్వేషములు, నాకలిదప్పికలు, భయశోకములు, సుఖదుఃఖములు, జన్మమరణములు కలవారగుటచే వారు మనుష్యులే యగుదురు.

(ఈశ్వరుడు పాపములు క్షమింపడు)

ప్రశ్న:- ఈశ్వరుడు తనభక్తుల పాపములను క్షమించునా? లేదా?

ఉత్తరము:- లేదు. ఈశ్వరుడు పాపమును క్షమించినచో నతని న్యాయము నష్టమగును. మనుష్యు లెల్లరు మహాపాపులగుదురు. క్షమనుగూర్చి వినగానే మనుష్యునకు బాపమొనర్చుటలో నిర్భయత, యుత్సాహము కలుగును. రాజపరాధిని క్షమించిన నతడుత్సాహియై యధికాధికముగ గొప్పగొప్ప పాపము లను జేయును. కారణము, రాజు తనయపరాధములను క్షమించునుగదా! 'అపరాధములు చేసి రాజునకు నమస్కరించిన రాజు మనలను క్షమించును' అని విశ్వాసము కలవారై యపరాధము లెక్కుడుగా జేయ దొడగుదురు. అపరాధములు చేయనివారుకూడ భయములేనివారై పాపములు చేయుటకు బూనుకొం దురు. కావున నెల్లకర్మములకు దగినట్లు ఫలము నొసంగుటయే యీశ్వరుని కార్యము. క్షమించుట కాదు.

(జీవస్వాతంత్ర్యము)

ప్రశ్న:- జీవుడు స్వతంత్రుడా? పరతంత్రుడా?

ఉత్తరము:- తన కర్తవ్యకర్మములందు స్వతంత్రుడు, ఈశ్వర వ్యవస్థయందు బరతంత్రుడై

యున్నాడు. 'స్వతంత్రః కర్తా' అనునిది పాణినీయసూత్రము. స్వతంత్రుడైనవాడే కర్తయని దీని యభిప్రాయము.

ప్రశ్నః- స్వతంత్రుడని యెవని నందురు?

ఉత్తః- శరీరము, ప్రాణములు, నింద్రియములు నంతఃకరణము నెవని యధీనమున నుండునో వాడు స్వతంత్రుడు. స్వతంత్రుడు కానివానికి బాపపుణ్యఫలము లెన్నడు నంటవు. భృత్యుడు యజమానుని, సేన సేనాధ్యక్షుని యాజ్ఞ - ప్రేరణమునసుసరించి యుద్ధమున ననేకులను జంపుదురు. కాని సైనికులప రాధులు కారు. అట్లే పరమేశ్వరుని ప్రేరణయధీనతలకు లోబడి జీవుడు చేయు కార్యములు సిద్ధించిన జీవునకు బాపపుణ్యము లంటవు. ఆ ఫలములు ప్రేరకుడగు పరమేశ్వరునకు జెందును. నరకస్వర్గములు, దుఃఖసుఖములు పరమేశ్వరున కగునని యెంచవలయును.

ఒకానొకపురుషు డొకశస్త్రముతో నొకనిని జంపినాడనుకొనుడు. అప్పుడు చంపినవాడే పట్టువడును. అతడే శిక్షింపబడును. శస్త్రము కాదు. అట్లే జీవుడు పరాధీనుడగునేని పాపపుణ్యముల కతడు భాగికాడు. కావున దన సామర్థ్యము ననుసరించి కర్మముల నొనర్చుటలో జీవుడు స్వతంత్రుడు. కాని, వాడు పాపము చేసిన పిమ్మట నీశ్వరుని వ్యవస్థలో బరాధీనుడై పాపఫలము ననుభవించును. కావున గర్మముల నాచరించుటలో జీవుడు స్వతంత్రుడు, పాపకర్మ ఫలము దుఃఖరూపమున ననుభవించుటలో బరతంత్రుడు నగుచున్నాడు.

(ఈశ్వరుడు జీవుని బుట్టింపడు)

ప్రశ్నః- ఈశ్వరుడు జీవుని సృష్టించి యతనికి సామర్థ్యము నీయకున్న నతడేమియు జేయజాలడు. కావున బరమేశ్వరుని ప్రేరణముచేతనే జీవుడు కర్మముల నాచరించునుగదా!

ఉత్తరముః- జీవుడెన్నడు నుత్పన్నుడు కాడు. అతడనాది. (ఈశ్వరుడతనిని సృష్టింపలేదు) ఈశ్వరుడు, జగత్తున కుపాదానకారణమగు ప్రకృతియు, నిత్యములైనట్లు జీవుడును నిత్యుడే. జీవుని శరీరము, నింద్రియములు, వానిగోలకములు పరమేశ్వరునిచే నిర్మింపబడును. కాని యవి యన్నియు జీవుని యధీనముననే యుండును. మనోవాక్కాయములతో బాపపుణ్యముల నొనర్చువాడే వానిఫలముల ననుభవించును. ఈశ్వరుడు కాడు. ఎట్లనః- ఒకడు పర్వతమునుండి యినుమును దీయును. దాని నొకవ్యాపారి తీసికొనును. ఆ వ్యాపారినుండి యినుమును దెచ్చి కమ్మరి కత్తిని నిర్మించును. దాని నొకసిపాయి తీసికొనును. దానితో నతడొకని శిరస్సును ఖండించు ననుకొనుడు. అప్పుడినుమును సంపాదించినవానిని, కొనిన వ్యాపారిని, గమ్మరిని, ఖడ్గమును బట్టుకొని రాజు వారిని దండింపడు. ఆ ఖడ్గముతో నెవడు చంపెనో వానినే పట్టుకొని దండించును. అట్లే శరీరాదుల నుత్పన్నముచేయు నీశ్వరుడు వానికర్మములఫలము ననుభవింపడు; ఆ కర్మముల నొనరించినవానిచే - జీవునిచే భోగింపజేయువాడగును.

పరమేశ్వరుడే కర్మముల నొనరించువాడగునేని యేజీవుడును బాపములు చేయడు. పరమేశ్వరుడు పవిత్రుడు, ధార్మికుడు నగుటవలన నతడు జీవుని బాపములు చేయుటకు బ్రేరేపింపడు. కావున జీవుడు తన కర్మములను జేయుటలో స్వతంత్రుడు. జీవుడు తన కర్మములను జేయుటలో స్వతంత్రుడైనట్లు పరమేశ్వరుడును దనకర్మములలో స్వతంత్రుడై యున్నాడు.

(జీవేశ్వరుల స్వరూపభేదము)

ప్రశ్నః- జీవేశ్వరుల స్వరూపములు, గుణకర్మ స్వభావములు నెట్టివి?

ఉత్తః- ఇరువురు చేతనస్వరూపులు. ఇరువురి స్వభావమును బవిత్రము, నవినాశి, ధార్మికతాది యుక్తమునై యున్నది. కాని సృష్టియొక్క యుత్పత్తిస్థితి ప్రళయములు, నన్నిటిని నియమమున

నుంచుట, జీవుల పాపపుణ్యములకు ఫలముల నొసంగుట మున్నగు ధర్మకర్మము లీశ్వరునివి. సంతానోత్పత్తి, వారిని బోషించుట, శిల్పవిద్యాదుల నేర్చుట మున్నగు మంచిచెడు పనులు జీవునివి. నిత్యజ్ఞానము, నానందము, ననంతబలము మున్నగునవి యీశ్వరగుణములు.

జీవునివిః– ఇచ్ఛాద్వేషప్రయత్నసుఖదుఃఖజ్ఞానాన్యాత్మనోలింగమితి. న్యా. ౧–౧.౧౦
ప్రాణాపాననిమేషోన్మేష జీవన మనోగతీన్ద్రియాంతర్వికారాః,
సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నాశ్చాత్మనో లింగాని. వైశేషిక. సూ. ౩–౨–౪.

ఇచ్ఛా = పదార్థములను బొందుటకు నభిలాష, ద్వేష = దుఃఖాదులను గోరకుండుట, వైరము, ప్రయత్నము=పురుషార్థము, బలము, సుఖము=ఆనందము, దుఃఖము=విలాపము, అప్రసన్నత, జ్ఞానము = వివేకము, గుర్తించుట యనునివి న్యాయవైశేషికములందు సమానములు. కాని వైశేషికమునందు ప్రాణము = ప్రాణవాయువును బయటకు వదలుట, అపానము = ప్రాణవాయువును వెలుపల నుండి లోనికి దీసికొనుట (ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు), నిమేషము = కన్నుమూయుట, ఉన్మేషము = కన్ను తెఱచుట, జీవనము = ప్రాణధారణము చేయుట (వృద్ధిక్షత ప్రరోహణాదులు), మనస్సు = నిశ్చయించుట, స్మరించుట, అహంకరించుట, గతి = చలనము, ఇంద్రియ = సమస్తేంద్రియములను నడుపుట, అంతర్వికారాః = ఆకలిగొనుట, దప్పిగొనుట, హర్షశోకములతో యుక్తుడగుట యను నీ జీవాత్మగుణములు పరమాత్ముని గుణములకంటె భిన్నమైనవి. వీనివలననే యాత్మనెఱుగవలయును. ఏలయనగా నాత్మ స్థూలము కాదు.

దేహమునం దాత్మయున్నంత వఱకు నీగుణములు ప్రకాశితములగును. శరీరమును వదలిపోగానే యాగుణములు శరీరమున నుండవు. ఏది యుండిన నేది యుండునో, యేది లేనపు డేవి యుండవో యాగుణములు దానివే యగును. దీపమును సూర్యాదులును లేకపోవుటచే బ్రకాశాదులు లేకపోవుటయు, నవి యుండుటచే బ్రకాశాదులుండుటయు జరుగును. అందువలన బ్రకాశాదులు దీపసూర్యుల యునికికి బోధకము లగుచున్నవి. అట్లే జ్ఞానాది గుణములవలన జీవపరమేశ్వరుల విజ్ఞానమును గలుగును.

(ఈశ్వరుని త్రికాలదర్శిత్వము)

ప్రశ్నః– పరమేశ్వరుడు త్రికాలదర్శి కావున భవిష్యద్విషయముల నెఱుగును. అతడెట్లు నిశ్చయించునో జీవుడట్లే చేయును. దీనినిబట్టి జీవుడు స్వతంత్రుడు కాడు. జీవుని నీశ్వరుడు దండింపను జాలడు. ఏలయనగా నీశ్వరుడెట్లు తనజ్ఞానముతో నిశ్చయించునో యట్లే జీవుడు చేయును గదా?

ఉత్తరముః– ఈశ్వరుని ద్రికాలదర్శియనుట మూర్ఖత. ఏలయనగా బుట్టి నశించినది భూతకాలమగును. ఇంతవఱకు లేక ముందేర్పడునది భవిష్యత్కాలము. ఈశ్వరునకు గొండొకజ్ఞానము కలిగి లేకుండుటకాని, యింతవఱకు లేక ముందు కలుగున దేమైన గలదా? కాబట్టి పరమేశ్వరుని జ్ఞానమెల్లప్పుడు నేకరసము, నఖండితముగ వర్తమానమునై యున్నది. భూతభవిష్యత్తులు జీవుల కొఱకై యున్నవి. జీవుల కర్మములనుబట్టి త్రికాలజ్ఞాన మీశ్వరునియందు ఘటించుచున్నది, కాని స్వీయముగా లేదు. జీవుడెట్లు స్వతంత్రతతో జేయునో, యీశ్వరుడట్లే సర్వజ్ఞతతో నెఱుగును. ఈశ్వరు డెట్లెఱుగునో జీవుడట్లు చేయును. అనగా భూతభవిష్యద్వర్తమానముల జ్ఞానమందును, ఫలము నిచ్చుటలోను నీశ్వరుడు స్వతంత్రుడు. ఈశ్వరుని జ్ఞానమనాది యగుటవలన కర్మజ్ఞానమువలెనే దండించుజ్ఞానముగూడ ననాదియే. అతని యీరెండు జ్ఞానములును సత్యములే. కర్మజ్ఞానము సత్యమును, దండజ్ఞానమసత్యమును నెన్నడైన గాగలదా?

(జీవేశ్వరుల సంబంధము)

ప్రశ్నః– జీవుడు శరీరమునందు భిన్నుడై విభువై యున్నాడా? లేక పరిచ్ఛిన్నుడా?

ఉత్తరము:- పరిచ్ఛిన్నుడు. విభువగునెడల జాగ్రత్త. స్వప్నము, సుషుప్తులు, జన్మమరణములు - సంయోగవియోగములు, రాకపోకలు నెన్నడు గలుగజాలవు. కావున జీవుని స్వరూపము - అల్పుడు - సూక్ష్ముడైయున్నాడు. పరమేశ్వరుడు మిక్కిలి సూక్ష్మముకంటె సూక్ష్మతరుడు, ననంతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకస్వరూపుడై యున్నాడు. కాబట్టి జీవపరమేశ్వరులకు వ్యాప్యవ్యాపకభావ సంబంధము కలదు.

ప్రశ్న:- ఏస్థలమందొకవస్తువున్నదో యదేస్థలమందు మఱియొక వస్తువుండజాలదు. జీవేశ్వరులకు సంయోగసంబంధ ముండగలుగునే కాని వ్యాప్యవ్యాపకము కాదు.

ఉత్తరము:- ఈ నియమము సమానాకారముగల పదార్థములందు వర్తిల్లగలదు. కాని యసమానాకృతికలవానియందు గాదు. ఏలయనగా నినుము స్థూలము, అగ్ని సూక్ష్మము. ఈ కారణముచే విద్యుత్తు, నగ్ని వ్యాపకములై యొకేయవకాశమందు రెండునుండును. జీవుడు పరమేశ్వరునికంటె స్థూలుడును, బరమేశ్వరుడు జీవునికంటె సూక్ష్ముడు నగుటచే బరమేశ్వరుడు వ్యాపకుడు జీవుడు వ్యాప్యుడు. జీవేశ్వరుల కీవ్యాప్యవ్యాపక సంబంధ ముండునట్లే సేవ్యసేవక, ఆధారాధేయ, స్వామిభృత్య, రాజాప్రజా, పితాపుత్రాది సంబంధములుగూడ నున్నవి.

(తత్త్వమస్యాది వాక్యములు)

ప్రశ్న:- జీవేశ్వరులు వేఱుగుదురేని :-

ప్రజ్ఞానం బ్రహ్మ (ఐతరేయ. ఉప. ౩-౩) (౧)

అహం బ్రహ్మాస్మి (బృహ. ఉప. ౧-౪-౧౦) (౨)

తత్త్వమసి (ఛాందో. ఉప. ౬-౮-౭) (౩)

అయమాత్మా బ్రహ్మ (మాండూక్య. ఉప. ౨) (౪)

వేదములందలి యీమహావాక్యముల కర్థమేమి?

ఉత్తరము:- ఇవి వేదవాక్యములేకావు. బ్రాహ్మణ గ్రంథముల వచనములు. వీనికి మహావాక్యము అను పేరు సత్యశాస్త్రము లందెందును వ్రాయబడలేదు. వీనియర్థము:- అహమ్ = నేను, బ్రహ్మ = బ్రహ్మస్థుడుగ, అస్మి = ఉన్నాను. ఇక్కడ తాత్స్థ్యోపాధి. ఏలయనగా మంచా: క్రోశంతి = మంచెలు కేకలు వేయుచున్నవి. మంచెలు జడములు. వానిలో గేకలువేయు శక్తి లేదు. కావున మంచెల మీదనున్న మనుష్యులు కేకలు పెట్టుచున్నారు. (అని యర్థము) ఇట్లే యిక్కడకూడ దెలిసికొనవలయును. అన్ని పదార్థములు బ్రహ్మస్థములయి యుండగా జీవుని బ్రహ్మస్థుడనుటలో నేమివిశేషమని యెవడేని యనిన దీని కుత్తరమిది. అన్ని పదార్థములును బ్రహ్మయందుండినను జీవునివలె దక్కినవి సాధర్మ్యయుక్త ములును, నికటస్థములును గావు. జీవునకు బ్రహ్మజ్ఞానమును, ముక్తియందు బ్రహ్మముతో సాక్షాత్సంబంధమును గలుగును. కాబట్టి జీవునకు బ్రహ్మముతో తాత్స్థ్యము, లేక తత్సహచరితోపాధి యున్నది. అనగా జీవుడు బ్రహ్మమునకు సహచారి. కాబట్టి జీవుడును బ్రహ్మము నొక్కటి కాదు. ఒకడు మఱియొకని గూర్చి "నేనును నితడు నొకటి" అనగా నవిరోధులమన్నమాట. సమాధిస్థుడగు జీవుడు ప్రేమబద్ధుడై పరమేశ్వరునియందు నిమగ్నుడైనపుడు 'నేనును బ్రహ్మయు నొకటి, అనగా నవిరోధులమనుట. ఒక యవకాశస్థులమని చెప్పగలడు. ఏ జీవుడు పరమాత్మగుణకర్మస్వభావముల కనుకూలముగ దనగుణకర్మ స్వభావములను జేసికొనునో యతడే సాధర్మ్యముచే బ్రహ్మముతో నేకత్వము ననగా బ్రహ్మము నేనునొకటియని చెప్పగలుగును. (౨)

ప్రశ్న:- మంచిది. 'తత్త్వమసి' దీని కెట్లర్థము చెప్పుదురు? తత్ = ఆ బ్రహ్మము, త్వం = జీవుడు, నీవు; అసి = అయితివి, ఓ జీవా! త్వం = నీవు; తత్ = ఆ బ్రహ్మవయి; అసి = ఉన్నావు. అనికదా.

ఉత్తరము:- మీరు తత్ శబ్దముచే నేమి గ్రహింతురు? "బ్రహ్మ" అందురేని బ్రహ్మమును గ్రహించుటకు బ్రహ్మశబ్దమున కనువృత్తి నెక్కడనుండి తేగలిగితిరి?

ప్రశ్న:- 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ' ఈ పూర్వవాక్యమునుండి.

ఉత్తరము:- మీరీఛాందోగ్యోపనిషత్తు దర్శనముకూడ జేయలేదు. ఏలయనగా మీరు చూచియుందురేని యక్కడ బ్రహ్మశబ్దపాఠము లేనిదే (ఇట్లు బ్రహ్మశబ్దమును జేర్చి) యబద్ధమేల చెప్పుదురు?

**స దేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్ ॥ (ఛాం.ప్ర. ౬.ఖం.౨.మం.౧)**

అని యిట్లు పాఠమున్నదే గాని బ్రహ్మశబ్ద మక్కడలేదు.

ప్రశ్న:- తమరు తత్ శబ్దముచే నేమి గ్రహింతురు?

ఉత్తరము:- స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం
స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి ॥ (ఛాం. ౬-౮-౭)

ఆపరమాత్మ తెలియుటకు యోగ్యుడు. ఎవడత్యంత సూక్ష్ముడును, నీసమస్త జగత్తునకును జీవునకు నాత్మయో యతడే సత్యస్వరూపుడు. తనయాత్మ తానే యయియున్నాడు. ఓశ్వేతకేతు! ప్రియపుత్ర! 'తదాత్మకస్తదంతర్యామీ త్వమసి' ॥ అంతర్యామియగు నాపరమాత్మచే నీవు యుక్తుడవు. ఇదే యర్థముపనిషత్తులతో నవిరుద్ధమయి యున్నది. ఏలయన:-

**య ఆత్మని తిష్ఠన్నాత్మనోంతరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరమ్,**
**ఆత్మనోంతరో యమయతి స త ఆత్మాంతర్యామ్యమృతః.**
**(బృ.ఆ.ఉ. ౩-౭-౨౨) (శత.బ్రా.౧౪-౬-౭-౩౦)**

ఇది బృహదారణ్యకవచనము:- మహర్షి యాజ్ఞవల్క్యుడు తనస్త్రీయగు మైత్రేయితో ఓ మైత్రేయి! ఏ పరమేశ్వరు డాత్మయందు జీవునియందు స్థితుడై జీవాత్మకంటె భిన్నుడై యున్నాడో, మూఢుడగు జీవాత్మ తనయందు వ్యాపకుడై యున్న యాపరమేశ్వరుని దెలియడో, యేపరమేశ్వరునకు జీవాత్మ శరీరమో, యనగా శరీరమందు జీవుడున్నట్లు జీవునియందు బరమేశ్వరుడు వ్యాపకుడై యున్నాడో, యేపరమేశ్వరుడు జీవునికంటె భిన్నుడై జీవుని పాపపుణ్యములకు సాక్షియై వానిఫలములను జీవులకిచ్చి నియమమునందుంచుచున్నాడో, యాయవినాశిస్వరూపుడే నీకు నంతర్యామియగు నాత్మ. అనగా నీలోపలను వ్యాపకుడై యున్నాడు. అతనిని నీవెఱుగుము. అని చెప్పును. ఏమి? ఇత్యాదివచనముల కెవ్వడేని వేఱుగ నర్థము చేయగలడా?(౩) (అయమాత్మాబ్రహ్మ) సమాధిదశయందు యోగికి బరమేశ్వరుడు ప్రత్యక్షమయినపుడు 'ఈనాయందు వ్యాపకుడగు బ్రహ్మయే సర్వత్ర వ్యాపకుడై యున్నాడు' అని యనును. కాబట్టి జీవబ్రహ్మముల నేకముచేయు నేటి వేదాంతులు వేదాంత శాస్త్రము నెఱుగరు. (౪)

ప్రశ్న:- **అనేన ఆత్మనా జీవేనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి. (ఛాం.౬-౩-౨) (౧)**
**తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్ ॥ (తైత్తిరీయ. బ్రహ్మానం. అను ౬) (౨)**

పరమేశ్వరుడు చెప్పుచున్నాడు:- నేను జగత్తును, శరీరములను రచించి జగత్తునందు వ్యాపకుడను, జీవరూపుడనయి శరీరమందు బ్రవిష్టుడ నగుచు నామరూపముల వ్యాఖ్య చేయుదును. (౧)

పరమేశ్వరు డీజగత్తును శరీరమును జేసి దానియం దతడే ప్రవిష్టుడయ్యెను. (౨)

ఇట్టి శ్రుతుల యర్థమును వేఱుగ నెట్లు చేయగలరు?

ఉత్తరము:- మీరు పదమును పదార్థమును, వాక్యార్థమును దెలిసియుందురేని యిట్టి యనర్థముల నెన్నడును జేయరు. ఏలయనగా నిక్కడ నొకటి ప్రవేశము, రెండవది యను ప్రవేశము - పిమ్మట ప్రవేశము ననబడును. పరమేశ్వరుడు శరీరములందు బ్రవిష్టులయిన జీవులవెంట ననుప్రవిష్టునివలె

వేదముద్వారా సమస్త నామరూపాదుల విద్యను ప్రకటనము చేయును. శరీరమందు జీవుని ప్రవేశపెట్టి, తాను జీవునిలో ననుప్రవిష్టుడగుచున్నాడు. అని యిట్లు తెలిసికొనుము. మీకు 'అను' శబ్దార్థము తెలిసి యున్నచో నిట్లు విపరీతార్థము నెన్నడును జేయరు.

ప్రశ్నః- సోఽయం దేవదత్తో య ఉష్ణకాలే కాశ్యాం దృష్టః, స ఇదానీం
ప్రావృట్ సమయే మథురాయాం దృశ్యతే.

నేనుష్ణకాలమందు గాశిలో జూచియుండిన దేవదత్తునే వర్షాకాలమందు మథురలో జూచుచున్నాడను. ఇక్కడ కాశీదేశమును, నుష్ణకాలమునువదలి శరీరమాత్రమందే లక్ష్యముంచితిమేని దేవదత్తుడు లక్షితుడగును. అట్లే భాగత్యాగ లక్షణము (కొంత గ్రహించుట మఱికొంత విడుచుట)చే నీశ్వరుని పరోక్ష దేశ కాలమాయోపాధిని, జీవుని వర్తమానదేశకాల, అవిద్యా, అల్పజ్ఞతోపాధిని వదలి, చేతనమాత్రమందు లక్ష్యముంచుటచే నొకే బ్రహ్మవస్తువు రెంటియందును లక్షితమగుచున్నది. కొంత గ్రహించుట కొంత వదలిపెట్టుట యను నీభాగత్యాగ లక్షణమును బట్టి ఈశ్వరుని సర్వజ్ఞత్వాది వాచ్యార్థమును జీవునియల్పజ్ఞత్వాది వాచ్యార్థమును వదలి చేతన మాత్రలక్ష్యార్థమును గ్రహించుటవలన నద్వైతము సిద్ధమగుచున్నది. దీనికి మీరేమి చెప్పగలరు?

ఉత్తరముః- మీరు జీవుని, నీశ్వరుని నిత్యులని నమ్ముచున్నారా? అనిత్యులనియా? మొదట జెప్పుడు.

ప్రశ్నః- వీరిద్దఱును, నుపాధిజన్యులును, గల్పితులు నగుటచే ననిత్యులని నమ్ముచున్నాము.

ఉత్తరముః- ఆయుపాధిని నిత్యమని నమ్ముచున్నారా? అనిత్యమనియా?

(నవీన వేదాంతుల యాఱనాదిపదార్థములు - ఖండనము)

ప్రశ్నః- మామతమందు --

**జీవేశౌ చ విశుద్ధాచిద్విభేదస్తు తయోర్ద్వయోః,**
**అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః. (౧)**
**కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః,**
**కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే. (౨)**

ఇవి సంక్షేపశారీరకము, శారీరక భాష్యములోని కారికలు :- ఒకటి జీవుడు, రెండవది యీశ్వరుడు, మూడవది బ్రహ్మము, నాల్గవది జీవేశ్వరుల విశేషభేదము, ఐదవది యవిద్య -అజ్ఞానము, ఆఱవది యవిద్యాచేతనముల యోగము నను నీయాఱు పదార్థములను ననాదులని వేదాంతులమగు మేమంగీకరించుచున్నాము. (౧)

కాని బ్రహ్మముమాత్రమనాది, యనంతము. తక్కినయైదును ప్రాగభావమువలె, ననాదులు సాంతములు. అజ్ఞాన ముండువఱకే యైదు నుండును. ఈ యైదింటికి నాది విదితము కానందున ననాదులు, జ్ఞానము కలిగిన మీదటనివి నష్టమయిపోవును గనుక సాంతములు - అనగా నాశవంతము లనబడును. (౨)

ఉత్తరముః- మీ యీ రెండు శ్లోకములును నశుద్ధములే. ఏలయన మీమతమందు నవిద్యతో గూడక జీవుడును, మాయతో గూడక యీశ్వరుడును సిద్ధింపజాలరు. కాబట్టి 'తచ్చితోర్యోగః' (అవిద్యాచిత్తుల యోగము) అని మీరెంచిన యాఱవపదార్థ ముండనేయుండదు. ఏలయనగా నది యవిద్యా మాయ యనునీ రెండును జీవేశ్వరులయందు జరితార్థమై పోయినవి. మఱి బ్రహ్మము మాయా - అవిద్య సంయోగము లేక యీశ్వరుడు కాజాలడు. అవిద్యా బ్రహ్మములకంటె నీశ్వరుని వేఱుగ నెన్నుట వ్యర్థము.

కాబట్టి మీమతమందు బ్రహ్మము, నవిద్య యను నీరెండు పదార్థములే సిద్ధమగుచున్నవి. ఆఱు కావు.

అట్లే, యనంతుడు, నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావుడు, సర్వవ్యాపకము నగు బ్రహ్మమునందు నజ్ఞానము సిద్ధమైనగాని, మీరు చెప్పిన కార్యోపాధి, కారణోపాధివలన జీవేశ్వరులు సిద్ధము కాజాలరు. బ్రహ్మైకదేశమున స్వాశ్రయము, స్వవిషయమునగు నజ్ఞానము ననాదిగా సర్వత్ర నంగీకరింతువేని సంపూర్ణబ్రహ్మము శుద్ధము కానేరదు. బ్రహ్మమున నేకదేశమున నజ్ఞానము నంగీకరింతువేని, యాయజ్ఞానము పరిచ్ఛిన్నమగును. కావున నది బ్రహ్మమున నిటునటు వచ్చుచు బోవుచు నుండును. అది యేయే స్థానమునకు బోవునో యచ్చటి బ్రహ్మమజ్ఞానియు, యేయేదేశమును విడిచిపోవునో యయాదేశపు బ్రహ్మము జ్ఞానియు నగుచుండును. అప్పుడు బ్రహ్మ మేదేశమునందును ననాది, శుద్ధము, జ్ఞానయుక్తము నని చెప్పజాలవు. మఱియు నజ్ఞానముచే నావరింపబడి దానిసీమయందున్న బ్రహ్మమజ్ఞానమునే తెలిసికొనును. అవిద్యకు లోపలనున్న బ్రహ్మము, దానికి వెలుపలనున్న బ్రహ్మమునని బ్రహ్మము ఖండితమగును. బ్రహ్మము ఖండితమైన నేమిహాని యందువేని బ్రహ్మమఖండము కానేరదు. బ్రహ్మము ఖండితము కాదఖండమే యందువా, బ్రహ్మమజ్ఞాని కారాదు. అట్లు జ్ఞానాభావము –లేక విపరీతజ్ఞానము గుణమగుటవలన నొకద్రవ్యమున నిత్యసంబంధముతో నుండును. అటులయినచో నది సమవాయసంబంధ మగుటవలన ననిత్య మెన్నటికిని కాజాలదు.

మఱియు శరీరమున నొకయెడ పుండేర్పడినపుడు దుఃఖమంతట వ్యాపించునట్లు బ్రహ్మమున నేకదేశమున నజ్ఞానము, సుఖదుఃఖక్లేశములయుపలబ్ధి కలుగుటవలన బ్రహ్మమంతయు దుఃఖాదులయనుభవముతో గూడినదగును. అందువలన సమస్త బ్రహ్మము శుద్ధమని చెప్పజాలవు. అట్లే కార్యోపాధి – అంతఃకరణోపాధి సంబంధమున జీవుడగునని యంగీకరింతువేని బ్రహ్మము వ్యాపకమా? పరిచ్ఛిన్నమా? యని మేము ప్రశ్నింతుము. అందులకు సమాధానముగా బ్రహ్మము వ్యాపకము నుపాధిమాత్రము పరిచ్ఛిన్నము – ఏకదేశి. ఆయుపాధియు నొక్కటి కాదనేకము వేఱువేఱుగా నుండునందువేని, యంతఃకరణ మిటునటు జలించునా లేదా? తిరుగునా లేదా? యని ప్రశ్నింతుము.

ప్రశ్నః– చలించును – తిరుగును.

ఉత్తరముః– అంతఃకరణముతోబాటు బ్రహ్మముకూడ జలించునా – తిరుగునా? లేక స్థిరముగా నుండునా?

ప్రశ్నః– స్థిరముగా నుండును.

ఉత్తరముః– అటులయిన, నంతఃకరణ మేయేదేశమును బ్రహ్మమున వదలిపోవునో యాయాదేశము నగల బ్రహ్మ మజ్ఞానరహిత మగును. అంతఃకరణ మేయేదేశమునకు బోయి యట బ్రహ్మము నావరించునో యటనున్న శుద్ధబ్రహ్మమజ్ఞాని యగును. ఇట్లు బ్రహ్మ మొకక్షణమున జ్ఞాని, మఱియొక క్షణమున నజ్ఞానియు నగుచుండునని సిద్ధమగును. అందువలన బంధమోక్షములును క్షణికము – క్షణభంగురము లగును. మఱియు నొకడు చూచినదానిని మఱియొకడు స్మరింపజాలనట్లు, నిన్నజూచిన, వినిన వస్తువునకు, లేక విషయమునకు సంబంధించిన జ్ఞానముకూడ నేడుండజాలదు. ఏలయన నేసమయమున జూచి, వినియుండెనో యాదేశము కాలము మఱియొకటి, ఎప్పుడు స్మరింతుమో యాదేశము, కాలము మఱియొకటి యగును. కావున స్మరణము కలుగదు.

బ్రహ్మమొకటేకదా యందువేని సర్వజ్ఞ మేలకాదు? అంతఃకరణము భిన్నభిన్నము కావున బ్రహ్మముకూడ భిన్నభిన్నమగును. అంతఃకరణము జడము. దానిలో జ్ఞానము కలుగజాలదు. కేవల మంతఃకరణమునకుగాని, కేవల బ్రహ్మమునకుగాని జ్ఞానము కలుగదు. అంతఃకరణస్థచిదాభాసమునకు

జ్ఞానము కలుగును; అందువేని, యంతఃకరణమ్మునుద్వారా చేతనమునకే జ్ఞానము కలిగినది కదా! అప్పుడు బ్రహ్మము - జీవుడు నేత్రము మున్నగు నింద్రియములద్వారా యల్పుడు నల్పజ్ఞుడు నేల యగుచున్నాడు? కావున బ్రహ్మమును, గారణోపాధివలన నీశ్వరుని, కార్యోపాధియోగమువలన జీవుని జేయజాలవు.

వాస్తవమున బ్రహ్మమునకే యాశ్వరుడని నామము. బ్రహ్మముకంటె భిన్నమైన అనాది, అనుత్పన్న, అమృతస్వరూపమగు (మఱియొకచేతనము) జీవునకే జీవుడని నామము. అట్లుకాక చిదాభాసమునకే జీవుడని నామమందువేని, చిదాభాసము క్షణభంగమగుటవలన జీవుడు నశించును. మోక్షసుఖము నెవడనుభవించును? కావున బ్రహ్మము జీవుడుకాని, జీవుడు బ్రహ్మము కాని యెన్నడు గాలేదు. ఇప్పుడును గాదు. ముందెన్నడును గాబోదు.

(అద్వైతశబ్దార్థము - సిద్ధి)

ప్రశ్నః- సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్. ఛాం . (౬.౨.౧)

అటులయిన నద్వైతసిద్ధి యెట్లు కలుగును? మామతమున బ్రహ్మమునకు భిన్నముగా గొండొక సజాతీయ, విజాతీయ స్వగతావయవభేదములు లేనందున నొక్కబ్రహ్మము సిద్ధమగును. జీవుడు రెండవవాడున్నచో నద్వైతసిద్ధి యెట్లు కలుగగలదు?

ఉత్తరముః- నీవీభ్రమలోబడి యేల భయపడుచున్నావు? విశేష్య విశేషణ విద్యాజ్ఞానమును సంపాదింపుము. దాని ఫలమేమనగా - 'వ్యావర్తకం విశేషణం భవతీతి'. విశేషణము భేదకారకమగు నందువేని, దానితోబాటు, 'ప్రవర్తకం ప్రకాశకమపి విశేషణం భవతీతి'. విశేషణము ప్రవర్తకము ప్రకాశకము గూడ నగునని యెఱుంగుము. అప్పుడద్వైతపదము బ్రహ్మకు విశేషణమని నీకు దెలియును. విశేషణమునందలి వ్యావర్తకధర్మము - అద్వైతవిశేషణము, బ్రహ్మమును ననేకులగు జీవులనుండియు, నితరతత్త్వముల నుండియు వేఱుచేయును. ఇక విశేషణమునందలి ప్రకాశకధర్మము బ్రహ్మ మేకమగుటలో బ్రవృత్తి గలిగించును. అది యెట్లనః- 'అస్మిన్నగరేఽద్వితీయో ధనాఢ్యో దేవదత్తః'. 'అస్యాం సేనాయామద్వితీయః శూరవీరో విక్రమసింహః'. ఒకడొకనితో ' ఈ నగరమున నద్వితీయధనాఢ్యుడు దేవదత్తుడు, ఈసేనయందద్వితీయశూరవీరుడు విక్రమసింహుడు, అనిన నేమి సిద్ధమగును? ఈ నగరమున దేవదత్తునితో సమానుడగు ధనవంతుడు మఱియొకడు లేడు. ఈసేనయందు విక్రమసింహునితో సమానుడగు శూరవీరుడు మఱియొకడు లేడనియు సిద్ధమగును. కాని, వారికంటె దక్కువ ధనాఢ్యుడు, దక్కువ శూరవీరులు నున్నారనియు సిద్ధమగును. అట్లే పృథివ్యాదిజడపదార్థములు, పశ్వాది ప్రాణులు, వృక్షాదులు, నున్నవి యనుటను నిషేధింపదుకదా! అట్లే అద్వైత విశేషణము బ్రహ్మమునకు సదృశమగు పదార్థము మఱియొండులేదని చెప్పునేకాని, బ్రహ్మముకంటె న్యూనములైన జీవప్రకృతులు లేవని నిషేధింపదని భావము. దీనింబట్టి బ్రహ్మమొక్కటియే యనియు, జీవులు, ప్రకృతిస్థ పదార్థములు ననేకములనియు సిద్ధించును. అనేకములగు జీవాదులనుండి వేఱుచేసి బ్రహ్మముయొక్క యేకత్వమును సిద్ధముచేయునది అద్వైతము - అద్వితీయము ననువిశేషణమే. దీనివలన జీవులయు, బ్రకృతియు, గార్యరూప జగత్తుయొక్కయు నభావ మెన్నడు సిద్ధింపదు. వాని నిషేధముకాని జరుగదు. ఇవి యన్నియు నున్నవి; కాని బ్రహ్మమునకు దుల్యములు కావు. కావున నద్వైతసిద్ధికిగాని, ద్వైతసిద్ధికిగాని హానియెన్నడు కలుగదు. గాభరాపడక - తొందరపడక యాలోచించి తెలిసికొనుము.

ప్రశ్నః- బ్రహ్మమునకు సంబంధించిన సత్-చిత్-ఆనందము నను వానితో, జీవుని-అస్తి, భాతి, ప్రియరూపములకు నేకత యున్నదికదా? మీరెందుకు ఖండించుచున్నారు?

ఉత్తరము:- కొంచెము సాధర్మ్యము లభించినంతమాత్రమున నేకత సిద్ధింపదు. పృథివి జడము, దృశ్యము. అట్లే జలము, నగ్ని మున్నగు పదార్థములు జడములే, దృశ్యములే. అంతమాత్రమున బృథివి, జలము మున్నగునవి యొకటి కాజాలవు. వానిలో నేకత సిద్ధింపదు. వీనిలో భేదకారకములగు ధర్మములు - వైధర్మ్యము-పృథివియందు గంధము, కఠినత మున్నగునవి. జలమున ద్రవత్వము, అగ్నియందు ఉష్ణత - దాహకత మున్నగునవి యున్నందున బృథివీజలాదు లేకము కావు.

మనుష్యులు కీటకములు కన్నులతో జూచును. నోటితో దినును. పాదములతో నడుచును. ఇట్లు కొన్ని విషయములలో వానిలో సామాన్యత - సామ్యమున్నను మనుష్యుని యాకృతి రెండు పాదములు, కీటకాదుల యాకృతి, యనేకపాదములతో భిన్నమగుటచే మనుష్యకీటకములలో నేకత లేదనియే చెప్పవలయును. అట్లే పరమేశ్వరుని యనంతజ్ఞానము, నానందము,బలము, క్రియ, నిర్ భ్రాంతిత్వము, వ్యాపకత మున్నగు గుణములు, జీవుని యల్పజ్ఞానము, నల్పబలము, నల్ప స్వరూపము, భ్రాంతిత్వము పరిచ్ఛిన్నతాది గుణములకంటెను భిన్నములగుటవలన జీవేశ్వరు లొక్కటి యెన్నడు గాజాలరు. ఏల యనగా వీరి స్వరూపములును (పరమేశ్వరుడతిసూక్ష్ముడు, జీవుడతనింటె గొంతస్థూలము నగుటవలన), భిన్నములగుటవల భిన్నులే యగుదురు.

(భయమువలన నద్వైతసిద్ధి)

ప్రశ్న:- **అథోదరమంతరం కురుతే అథ తస్య భయం భవతి,**
**ద్వితీయాద్ వై భయం భవతి. బృహదారణ్య ౧.౪.౨.**

జీవబ్రహ్మముల మధ్య భేదము నంగీకరించువానికి భయము కలుగును. ఏలయన రెండవవానివల నసే కదా భయము కలుగును?

ఉత్త:- దీని యర్థమిదికాదు. జీవుడు పరమేశ్వరుని నిషేధించినను పరమేశ్వరుడు దేశకాలపరిచ్ఛిన్ను డని యంగీకరించినను, నతని యాజ్ఞలకు నతని గుణకర్మ స్వభావములకు విరుద్ధముగా నడుచుకొనినను, మఱియొకనిని ద్వేషించినను నతనికి భయము కలుగును. ఏలయనగా ద్వితీయబుద్ధి యీశ్వరునకు దనకు నేసంబంధము లేదనియెంచినను నట్లే యొకనితో నీవెంత వాడవు, నిన్ను నేను లెక్కచేయను, నీవేమి చేయగలవు? అని యతనిని దిరస్కరించినను, నితరులకు దుఃఖము కలిగించుచు హాని గలిగించి నను, వారివలన నతనికి భయము కలుగును. సర్వవిధముల నవిరోధులైనవా రేకమనబడుదురు. దేవ దత్తుడు, యజ్ఞదత్తుడు, విశ్వమిత్రుడు ముగ్గురు నొక్కటే యని లోకమున వాడుదురు. అనగా వారిలో విరోధము లేదని భావము. విరోధము లేకున్న సుఖము, విరోధము కలిగిన దుఃఖము కలుగుచుండును.

ప్రశ్న:- జీవబ్రహ్మలలో నెల్లప్పుడు నేకత, యనేకత లుండునా? లేక యెప్పుడైన నిరువురు గలిసి యొకటి యగుదురా కారా?

ఉత్తరము:- ఇప్పుడే యింతకుపూర్వమే కొంతసమాధానము చెప్పియున్నాము. కాని సాధర్మ్యము - అన్వయభావముతో నేకత యేర్పడును. జడత్వము, ఎన్నడు వేఱుకాకుండుట యను నీధర్మముల వలన నాకాశమునకు నితర మూర్తపదార్థములకు నేకతయు, నాకాశమునగల విభుత్వము, సూక్ష్మత, యరూపత, యనంతత మున్నగు గుణములవలన, మూర్తద్రవ్యములందు గల పరిచ్ఛిన్నత్వము, దృశ్య త్వము మున్నగు విరుద్ధగుణములు - వైధర్మ్యమువలన నాకాశమూర్త ద్రవ్యములలో భిన్నత - భేదము కలుగును. అనగా బృథివ్యాది ద్రవ్యము లాకాశమునుండి యెన్నడును వేఱుకావు. ఏలయనగా నన్వయము - అనగా నాకాశము లేక మూర్తద్రవ్యము లెన్నడు నుండజాలవు. కాని వ్యతిరేకము - అనగా స్వరూపముతో భిన్నములగుటవలన వానిలో భిన్నత యుండనే యుండును. అట్లే బ్రహ్మము వ్యాపకమగుటవలన

జీవులు, పృథివ్యాది జడపదార్థములు బ్రహ్మమునుండి వేఱుగా నుండజాలవు. కాని స్వస్వరూపముతో నెన్నడు నేకమును గావు.

ఇంటిని నిర్మించుటకు బూర్వము భిన్నభిన్నదేశములలో మట్టి, కొయ్యలు, ఇనుము మొదలగు పదార్థము లాకాశమునందే యుండును. గృహము నిర్మింపబడిన మీదటను నాకాశమునందే యుండును. ఆ యిల్లు నశించి దానియవయవములన్నియు భిన్నభిన్న ప్రదేశములందు బడియున్నను నాకాశమునందే యుండును. అనగా మూడుకాలములందును నవియాకాశమునుండి వేఱు కాజాలవు. స్వరూపమున నవి యాకాశముతో గలిసి యెన్నడు నొకటి కాలేదు, కావు, కాబోవుకూడ. ఇట్లే జీవులు జగత్పదార్థములు పరమేశ్వరునందు వ్యాప్యము లగుటవలన మూడుకాలములందును బరమేశ్వరునితో నభిన్నములై స్వరూపములో భిన్నములగుటచే నెన్నడు నేకములు గావు.

(ఈశ్వరుడు సగుణుడు – నిర్గుణుడు)

ప్రశ్న:– ఈశ్వరుడు సగుణుడా? నిర్గుణుడా?

ఉత్తరము:– సగుణుడు నిర్గుణుడును రెండు విధములు.

ప్రశ్న:– బాగు! బాగు! ఒకయొరలో రెండు కత్తు లెన్నడైన నుండునా? ఒకే పదార్థమున సగుణత నిర్గుణత రెండు నెట్లు పొసగును?

ఉత్తరము:– జడమున రూపాదిగుణములుండును. చేతనమునకు జెందిన జ్ఞానాదిగుణములు జడమున నుండవు. అట్లే చేతనమున నిచ్ఛాది గుణము లుండును. రూపాది జడగుణము లందుండవు. కావున, 'యత్ గుణైః సహ వర్తమానం తత్ సగుణమ్. గుణేభ్యో యన్నిర్గతం పృథగ్ భూతం తన్నిర్గుణమ్' ఏది గుణములతో గూడియుండునో యది సగుణము. గుణములతో రహితమైనది నిర్గుణము నన బడును. తమతమ స్వాభావికగుణములతో గూడియుండి, పరపదార్థముల విరోధిగుణములతో రహితములై యుండుటవలన బదార్థములన్నియు సగుణ, నిర్గుణము లనబడును. కేవల సగుణత, కేవల నిర్గుణత గలిగిన పదార్థ మొక్కటియు సంసారమున నుండదు. కాని యొకే పదార్థమున సగుణత, నిర్గుణతయు నెల్లపుడు నుండును. అట్లే పరమేశ్వరుడును దన యనంతజ్ఞాన బలాదిగుణములతో సహితుడగుట వలన సగుణుడనియు రూపాదిజడపదార్థగుణములు, ద్వేషాదిజీవగుణములు లేనివాడగుటవలన నిర్గుణుడనియు ననబడుచున్నాడు.

ప్రశ్న:– లోకమున నిరాకారుని నిర్గుణుడనియు, సాకారుని సగుణుడనియు ననుచున్నారు. అనగా బరమేశ్వరుడు జన్మధారణము చేయనపుడు నిర్గుణుడనియు, నవతరించినపుడు సగుణుడనియు ననబడుచున్నాడు గదా?

ఉత్తరము:– ఇది కేవల యజ్ఞానులయు, నవిద్వాంసులయు గల్పనయై యున్నది. విద్యలేనివారు పశువులవలె బ్రలాపము లాడుచుందురు. సన్నిపాతజ్వరయుక్త మనుష్య డసంబద్ధప్రలాపము లాడునట్లవిద్వాంసులు చెప్పునవియు, వ్రాయునవియు ననర్థములు వ్యర్థములని యెంచవలయును.

ప్రశ్న:– పరమేశ్వరుడు రాగముగలవాడా లేక విరక్తుడా?

ఉత్తరము:– రెండునుగాదు. ఏలయన రాగము తనకంటె నుత్తమము భిన్నము నగువస్తువునందు గలుగును. పరమేశ్వరునకు వేఱుగా నతనికంటె నుత్తమ పదార్థ మొండును లేదు. అందువలన బరమేశ్వరునియందు రాగము సంభవము కాదు. తనకు బ్రాప్తించిన దానిని విడుచువాడు విరక్తుడనబడును. పరమేశ్వరుడు వ్యాపకుడగుటచే నేపదార్థమును విడువజాలడు. తననుండి వేఱుచేయజాలడు. కావున విరక్తుడును గాడు.

ప్రశ్నః- ఈశ్వరునియందు నిచ్ఛ యున్నదా లేదా?

ఉత్తరముః- జీవులలో చూడబడు నిచ్ఛలవంటి యిచ్ఛ పరమేశ్వరునియందు లేదు. ఇచ్ఛ యప్రాప్తము, నుత్తమము, దేనిప్రాప్తివలన సుఖవిశేషము లభించునో యట్టి వస్తువువిషయమున గలుగును. ఈశ్వరున కప్రాప్త వస్తువుకాని, యతనికంటె నుత్తమమగు వస్తువుకాని లేదు. మఱియు నతడు పూర్ణసుఖయుక్తుడు. కావున నతనికి సుఖవిశేషాభిలాషయు గలుగదు. అందువలన నీశ్వరునందు నిచ్ఛ యెట్లు కలుగగలదు? ఈశ్వరునం దిచ్ఛ కలుగుట యసంభవము. కాని యీక్షణము - సర్వవిధ విద్యల దర్శనము, సర్వమును సృష్టించుట యనునీక్షణ మీశ్వరుని యందు గలుగును. ఇట్టిది సంక్షేపముగ జెప్పిన విషయము ననుబట్టి సజ్జనులు విద్వాంసులు విస్తరణము చేసికొనగలరు.

(వేదము లీశ్వర ప్రకాశితములు)

ఇంతవఱకు సంక్షేపముగా నీశ్వరుని విషయము వ్రాసి యికముందు వేదవిషయము వ్రాయుచున్నాము.

యస్మాదృచోఽపాతక్షన్ యజుర్ యస్మాదపాకషన్, సామాని యస్య
లోమాన్యథర్వాఙ్గిరసో ముఖం స్కంభం తం బ్రూహి కతమఃస్విదేవ సః. (౧)
(అథర్వ కాం.౧౦. ప్ర. ౨౩. అను ౪. మం. ౨౦)

ఏ పరమాత్మనుండి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, నథర్వవేదము ప్రకాశితములైనవో యత డేదేవుడు? దీనికి నుత్తరము - ఎల్లర నుత్పన్నముచేసి ధారణము చేయుచున్న పరమేశ్వరుడే యతడు. అతడే వేదములను బ్రకటించెనని భావము.

స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్
వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః. యజు. ౪౦-౮

స్వయంభువు, సర్వవ్యాపకుడు, శుద్ధుడు, సనాతనుడు, నిరాకారుడునైన పరమేశ్వరుడు సనాతనులైన జీవరూపప్రజల కల్యాణార్థము తగినట్లు రీతిపూర్వకముగ వేదముల మూలమున నన్నివిద్యలను నుపదేశించుచున్నాడు.

ప్రశ్నః- మీరు పరమేశ్వరుని నిరాకారునిగా నంగీకరించుచున్నారా? సాకారునిగా నంగీకరించుచున్నారా?

ఉత్తరముః- నిరాకారుడని యంగీకరింతుము.

(వేదోపదేశము)

ప్రశ్నః- నిరాకారుడైన వేదవిద్యోపదేశమందు ముఖము లేక వర్ణోచ్చారణ మెట్లు కలిగియుండును. ఏలయనగా వర్ణముల నుచ్చరించుటకు దాల్వాదిస్థానములును. జిహ్వ, ప్రయత్నము తప్పక యుండవలయునుగదా!

ఉత్తరముః- పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు నగుటవలన జీవులకు దనవ్యాప్తితో వేదవిద్య నుపదేశించుటలో ముఖాదుల యపేక్ష కొంచెమును నుండదు. ఏలయనగా ముఖజిహ్వలతో వర్ణోచ్చారణము తనకంటె భిన్నులైనవారికి బోధచేయుటకు జేయబడును. తనకొఱకు నావశ్యకముండదు. ముఖజిహ్వల వ్యాపారము లేకయే మనస్సులో ననేక వ్యవహారములను విచారించుటచే శబ్దోచ్చారణమగుచునే యుండును. చెవులను వ్రేళ్ళతో మూసికొని, ముఖజిహ్వా తాల్వాదిస్థానములు లేకయే యెట్టి శబ్దములు కలుగుచున్నవో వినుడు. అట్లే పరమేశ్వరు డంతర్యామిరూపముతో జీవుల కుపదేశించియున్నాడు. ఇతరులకు బోధించుటకు కేవల ముచ్చారణము చేయవలసి యున్నది.

పరమేశ్వరుడు నిరాకారుడు, సర్వవ్యాపకుడు నగుటవలన జీవస్థ స్వరూపముతో నఖిలవేదవిద్యోపదేశమును జీవాత్మలో ప్రకాశితము చేయును. పిమ్మట నా మనుష్యుడు తన ముఖముతో నుచ్చరించి యితరులకు వినిపించును. కాబట్టి యీశ్వరునీ యందేదోషము రాజాలదు.

ప్రశ్నః- ఎవరియాత్మలం దెప్పుడు వేదములను ప్రకాశింప జేసెను?

ఉత్తః- అగ్నేర్ ఋగ్వేదో వాయోర్యజుర్వేదఃసూర్యాత్సామవేదః (శత. ౧౧-౫-౭-౩)

సృష్ట్యాదియందు పరమాత్మ - అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరసులను ఋషుల యాత్మలం దొక్కొక్క వేదమును ప్రకాశపఱచెను.

ప్రశ్నః- యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం,
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై. (శ్వేత. అ. ౬.మం.౧౮)

ఇది యుపనిషద్వచనము. ఈ వచనమువలన బ్రహ్మహృదయమందు వేదముల నుపదేశించినట్లు చెప్పబడియుండగా మరల నగ్న్యాదిఋషుల యాత్మలందని యేల చెప్పబడెను?

ఉత్తరముః- బ్రహ్మయాత్మయందగ్న్యాదుల ద్వారా స్థాపింపబడెను. మనుస్మృతిలో నేమి వ్రాయబడియున్నదో చూడుడుః-

అగ్ని వాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్,
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థమ్ ఋగ్యజుస్సామ లక్షణమ్. (మను. ౧-౨౩)

పరమాత్మ సృష్ట్యాదియందు మనుష్యుల నుత్పన్నముచేసి యగ్ని మొదలగు నలువురు ఋషుల ద్వారా నాలుగు వేదములను బ్రహ్మకు బ్రాప్తింపజేసెను. ఆ బ్రహ్మయు - అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు నను వారినుండి ఋగ్యజుస్సామములను నథర్వమును గ్రహించెను.

ప్రశ్నః- ఆ నలుగురినుండియే వేదమును బ్రకాశపఱచెను. అన్యుల యందుగాదు. కాబట్టి దీనిచే నీశ్వరుడు పక్షపాతి కాడా?

ఉత్తరముః- కాదు. జీవులందఱకంటె నానలుగురే మిక్కిలి పవిత్రాత్ములుగ నుండిరి. తక్కినవారు వారితో సమానులు కాకుండిరి. అందువలన వారియందు బవిత్రవిద్యను బ్రకాశింపజేసెను.

ప్రశ్నః- కొండొక దేశభాషయందు వేదములను బ్రకాశపఱపక సంస్కృతమున నేల చేసెను?

ఉత్తరముః- కొండొక దేశభాషయందు బ్రకాశము చేసిన నీశ్వరుడు పక్షపాతి యగును. ఏలయనగా నేదేశభాషయందు బ్రకాశింపజేయునో యాదేశవాసులకు సుగమమును, నితరదేశవాసులకు వేదములను జదువుట, చదివించుటలోను గఠినమగును. కావున సంస్కృతముననే ప్రకాశింపజేసెను. ఏదేశభాషయందు జేయలేదు. వేదభాష యితరభాషల కన్నిటికి గారణము. అందువలన దానియందే వేదములను బ్రకాశింపజేసెను. ఈశ్వరుని పృథివ్యాదుల సృష్టి సర్వదేశములకు దేశవాసులకు నొక్కవిధముగా నుండి సమస్త శిల్ప విద్యలకు గారణమైనట్లు పరమేశ్వరుని విద్యకు సంబంధించిన భాషయు నొక్కటిగానే యుండవలయును. సర్వదేశవాసులకు దానిని జదువుటలోను, జదివించుటలోను సమానపరిశ్రమము కలుగును. కావున నీశ్వరుడు పక్షపాతికాడు. వేదభాష సర్వభాషలకు గారణముకూడ.

(వేదము-ఈశ్వర కర్తృకము)

ప్రశ్నః- వేదమీశ్వరకృతము, అన్యకృతము కాదు. అనుటలో బ్రమాణమేమి?

ఉత్తరముః- ఈశ్వరుడు పవిత్రుడు, సర్వవిద్యావిదుడు, శుద్ధగుణ కర్మస్వభావుడు, దయాళువు నను నిట్టి గుణములు కలవాడైనట్లుగా నేపుస్తకమున నీశ్వరుని గుణకర్మస్వభావముల కనుకూలమైన కథనముండునో యది యీశ్వరకృతము. అన్యము కాదు. దేనిలో సృష్టిక్రమము, ప్రత్యక్షాది

ప్రమాణములు, నాప్తులకు, బవిత్రాత్ములకు సంబంధించిన వ్యవహారములకంటె విరుద్ధకథన ముండదో యది యీశ్వర కృతము. ఈశ్వరుని నిర్భ్రమజ్ఞానమునకు దగిన ట్లేపుస్తకమున భ్రాంతిరహితజ్ఞానము ప్రతిపాదింపబడునో యది యీశ్వరోక్తము. పరమేశ్వరుడు, సృష్టిక్రమమునున్న ట్లేగ్రంథమున నీశ్వరుడు, సృష్టికార్యకారణములు, జీవుని ప్రతిపాదనము నుండునో యది యీశ్వరోక్తము. మఱియు ప్రత్యక్షాది ప్రమాణముల కవిరుద్ధము, శుద్ధాత్మస్వభావమునకు విరుద్ధము కానిది పరమేశ్వరోక్త పుస్తకమగును. అట్టిదే వేదము. బైబిలు, కురాను మున్నగు పుస్తకము లట్టివికావు. బైబిలు, కురాను ప్రకరణములలో ననగా బదుమూడవ, పదునాల్గవ సముల్లాసములలో నీవిషయము స్పష్టముగా వ్యాఖ్యానము చేయబడును.

ప్రశ్నః- వేద మీశ్వరుని నుండి కలుగు నావశ్యకమేమియు లేదు. మనుష్యులే క్రమముగా జ్ఞానమును బెంపు జేసికొని పిమ్మట బుస్తకములను గూడ వ్రాయుదురు.

ఉత్తరముః- ఎన్నడు వ్రాయజాలరు. కారణములేక కార్యోత్పత్తి సంభవము గాదు. ఎట్లన నాటవికులు సృష్టిని జూచియు విద్వాంసులు కాజాలరు. వారికి శిక్షకుడు లభించినపుడు విద్వాంసులగుదురు. ఇప్పుడు కూడ నితరులనుండి చదువు నేర్చుకొనక యెవడును విద్వాంసుడు కాడు. ఇట్లే పరమేశ్వరుడు సృష్ట్యాదియం దాబుషులకు వేదవిద్య నుపదేశింపకున్నను, వారితరులను జదివింపకున్నను నెల్లరు నవిద్వాంసులై యుండెడివారు. ఇందులకు దృష్టాంతము – అడవిలోనుండు శబరులు, భిల్లులు మున్నగువారు.

ఆర్యావర్తదేశమునుండి శిక్షను బొందనంతవఱకు నీజిప్టు, గ్రీసు, యూరోపు మొదలగు దేశములలో నున్న మనుష్యులలో గొంచెముకూడ విద్య లేకుండెను. ఇంగ్లండునుండి కొలంబసు మున్నగువారమెరికాకు వెళ్ళక ముందు వేలకొలది లక్షలకొలది కోట్లకొలది సంవత్సరములనుండి యటనున్నవారు మూర్ఖులు, నవిద్వాంసులుగానే యుండిరి. తదుపరి సుశిక్షను బొందుటవలన విద్వాంసులైరి. అట్లే సృష్టి ప్రారంభమున బరమేశ్వరుని వలన విద్యాశిక్షల బొందుటవలన నుత్తరోత్తర కాలమందు విద్వాంసు లగుచు వచ్చిరి.

**న పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్ (యోగ. సమాధి. సూ. ౨౬)**

వర్తమానసమయమున మనమధ్యాపకులనుండి చదివియే విద్వాంసుల మగుచున్నట్లు సృష్టిలో నారంభమున బుట్టిన అగ్న్యాది బుషులకు బరమేశ్వరుడు గురువై యుండెను. ఏలయన జీవులు సుషుప్తియందును బ్రలయమునందును జ్ఞానరహితులై యుండునట్లు పరమేశ్వరుడు జ్ఞానరహితుడుగాడు. అతనిజ్ఞానము నిత్యము. కాబట్టి నిమిత్తములేక యెన్నడును నైమిత్తిక ప్రయోజనము సిద్ధింపదని నిశ్చితముగా నెఱుగవలయును.

ప్రశ్నః- వేదములు సంస్కృతభాషలో బ్రకాశితములైనవి. అగ్ని మున్నగు మహర్షులు సంస్కృతభాష నెఱుగరుకదా! మఱివారు వేదార్థముల నెట్లు తెలిసికొనిరి?

ఉత్తరముః- పరమేశ్వరుడు వారికి దెలిపియున్నాడు. ధర్మాత్ములు యోగులు మహర్షులైనవారేయేసమయమున నేయేమంత్రార్థముల నెఱుగగోరి ధ్యానావస్థితులై పరమేశ్వరుని స్వరూపమున సమాధిస్థులైనపుడు పరమేశ్వరుడు వారి యభీష్టమంత్రముల కర్థము తెలియజేసి యున్నాడు. పలువురి యాత్మలలో వేదార్థము ప్రకటితమైన తదుపరి బుషులు, మునులు నాయర్థములను బుషుల, మునుల యితిహాసపూర్వకముగ గ్రంథములను రచియించిరి. ఆ గ్రంథములే బ్రాహ్మణములు. బ్రహ్మమనగా వేదము. దానికి సంబంధించిన వ్యాఖ్యాన గ్రంథములే బ్రాహ్మణములు. మఱియు, 'బుషయో మంత్ర దృష్టయః మన్త్రాన్ సంప్రాదుః' (నిరుక్తము. ౧-౨౦)

ఏయే మంత్రార్థదర్శన మే యే ఋషికి గలిగెనో, యంతకు మున్నెవరును బ్రకాశపఱపని మంత్రార్థము మొదట నేఋషి తాను బ్రకాశపఱచి యితరులకును బోధించెనో, యామంత్రముతో గూడ నాఋషిపేరు స్మరణార్థ మప్పటినుండి నేటివఱకు వ్రాయబడుచు వచ్చుచున్నది. ఋషులనే మంత్రకర్త లనెడివారు మిథ్యావాదులని తెలియవలయును. ఋషులు మంత్రార్థ ప్రకాశకులు.

(వేదసంజ్ఞ)

ప్రశ్నః- ఏ గ్రంథములకు వేదమని పేరు?

ఉత్తరముః- ఋక్, యజుః, సామ, అథర్వము లను మంత్ర సంహితలకు మాత్రమే.

ప్రశ్నః- 'మంత్ర బ్రాహ్మణయోర్వేదనామ ధేయమ్.' కాత్యాయనాదులు చేసిన యీ ప్రతిజ్ఞా సూత్రాదుల కర్థమేమి చేయుదురు?

ఉత్తరముః- చూడుడు! సంహితా పుస్తకారంభమందును, నధ్యాయసమాప్తియందును వేదమను శబ్దము సనాతనముగ వ్రాయబడుచు వచ్చుచున్నది. బ్రాహ్మణ పుస్తకముల యారంభమందుగాని యధ్యాయ సమాప్తియందుగాని వేదశబ్ద మెచ్చటను వ్రాయబడలేదు. మఱియు నిరుక్తమందు --

**ఇత్యపి నిగమో భవతి ఇతి (చ) బ్రాహ్మణమ్ (నిరు. ౧-౩-౪)**

**ఛందో బ్రాహ్మణాని చ తద్విషయాణి (పాణినీయ సూత్రము అ ౪-౨-౬౬)**

వీనివలనగూడ మంత్రభాగము వేదమనియు, వ్యాఖ్యానభాగము బ్రాహ్మణమనియు స్పష్టమగు చున్నది. ఈ విషయమై విశేషించి చూడదలచినవారు నాచేవ్రాయబడిన ఋగ్వేదాది భాష్యభూమిక యందు జూడుడు. అచ్చట నిది యనేక ప్రమాణములకు విరుద్ధమగుటచే గాత్యాయనులవచనము కాజాల దని సిద్ధాంతము చేయబడినది. బ్రాహ్మణములనుగూడ వేదమని యంగీకరించితిమేని వేదములు సనాతన ములు కాజాలవు. ఏలయనగా బ్రాహ్మణ గ్రంథముల యం దనేక ఋషిమహర్షి రాజాదుల యితిహాసములు వ్రాయబడియున్నవి. ఎవని యితిహాసమైనను వానిజన్మమునకు బిమ్మటనే వ్రాయబడును. ఆ గ్రంథ మును వాని జన్మమునకు బిమ్మటనే కలుగును. వేదముల యం దెవని యితిహాసమును లేదు. కాని విశేషించి యే యే శబ్దముచే విద్యాబోధకలుగునో యా యా శబ్దము ప్రయోగింపబడి యున్నది. వేదమం దేమహాపురుషుని పేరు (సంజ్ఞ) కాని, కథా ప్రసంగము కాని లేదు.

(వేదశాఖలు)

ప్రశ్నః- వేదముల కెన్ని శాఖలున్నవి?

ఉత్తరముః-పదునొకండువందల యిరుదియేడు.

ప్రశ్నః- వేనిని శాఖలందురు?

ఉత్తరముః- వ్యాఖ్యానములను శాఖలందురు.

ప్రశ్నః- లోకమున విద్వాంసులు వేదావయవభూతములగు విభాగములను శాఖలని నమ్ముచున్నారు గదా!

ఉత్తరముః- కొంచెము విచారించి చూడుడు. ఎన్ని శాఖలున్నవో యవి యన్నియు నాశ్వలాయ నాది ఋషులనామములచే బ్రసిద్ధములయి యున్నవి. మంత్రసంహిత పరమేశ్వరుని నామముచే బ్రసిద్ధ మయి యున్నది. నాలుగువేదములు పరమేశ్వర కృతములని నమ్ముచున్న ట్లాశ్వలాయనాది శాఖలు నాయాఋషికృతములని నమ్ముచున్నాము. శాఖల యందంతటను వేదమంత్రములు ప్రతీకగ నిచ్చి వ్యాఖ్యానములు చేసియున్నారు. ఎట్లనగా తైత్తిరీయశాఖయందు 'ఇషేత్వోర్జేత్వేతి, ఈ మొదలగు మంత్రముల మొదళ్ళిచ్చి వ్యాఖ్యానము చేయబడియున్నది. వేదసంహితలందెచ్చటను మంత్రమును

ప్రతీకగ నుంచుకొని వ్యాఖ్యానము చేయబడలేదు. కాబట్టి పరమేశ్వర కృతములగు నాలుగువేదములు మూలవృక్షము. ఆశ్వలాయనాది శాఖలన్నియు ఋషిముని కృతములు. పరమేశ్వర కృతములు కావు. ఈ విషయమై విశేషవ్యాఖ్యానమును జూడగోరువారు ఋగ్వేదాది భాష్యభూమికలో జూడదగును. తల్లి దండ్రులు తమ సంతానముపై గృపాదృష్టియుంచి వారి యున్నతినే కోరునట్లు పరమాత్మయు, మనుష్యు లందఱు నవిద్యాంధకార భ్రమజాలమునుండి తొలగి విద్యావిజ్ఞానరూపమగు సూర్యుని బొంది యానం దింపగలిగి విద్యను, సుఖమును వృద్ధిపఱపగలుగునట్లు దయతో వేదములను బ్రకాశపఱచెను.

ప్రశ్నః– వేదము నిత్యమా? అనిత్యమా?

ఉత్తరముః– నిత్యము. ఏలయనగా బరమేశ్వరుడు నిత్యుడు. కాబట్టి యతని జ్ఞానాదిగుణములును నిత్యములు. నిత్యపదార్థముల గుణకర్మస్వభావములు నిత్యములును, ననిత్యద్రవ్యముల గుణకర్మస్వభా వము లనిత్యములు నగుచున్నవి.

ప్రశ్నః– ఈ పుస్తకముగూడ నిత్యమా?

ఉత్తరముః– కాదు. ఏలన పుస్తకము కాగితములు సిరాతో సిద్ధమైనది. అది నిత్యమెట్లగును. కాని శబ్దార్థ సంబంధములు మాత్రము నిత్యము.

ప్రశ్నః– ఈశ్వరు డాఋషులకు జ్ఞానము నిచ్చియుండవచ్చును. వారాజ్ఞానముచే వేదములను జేసియుందురు.

ఉత్తరముః– జ్ఞేయములేక జ్ఞానము కలుగజాలదు. గాయత్ర్యాది ఛందములతోడను, షడ్జాది, ఉదాత్తానుదాత్తాది స్వరములతోడను జ్ఞానపూర్వకముగు గాయత్ర్యాది ఛందములను నిర్మించుటకు, సర్వ జ్ఞానయుక్త శాస్త్రమును రచించుటకు, సర్వజ్ఞుడగు పరమేశ్వరునికంటె మఱియెవ్వడు నర్హుడుగానేరడు. వేదములను జదివిన పిమ్మటనే విద్యలను బ్రకాశపఱచుటకు ఋషులును, మునులును, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు మున్నగు గ్రంథములు చేసిరి. పరమాత్మ వేదములను బ్రకాశపఱపకుండిన నెవ్వరు నేమియును జేయజాలకుందురు. కాబట్టి వేదము పరమేశ్వరోక్తము. దాని ననుసరించియే యందఱు నడువవలయును. ఎవ్వడేని మీ మతమేమి యని యడిగెనేని, మా మతము వేదము. అనగా వేదమం దేమి చెప్పబడియున్నదో దానినే నమ్ముచున్నామని ప్రత్యుత్తర మీయవలయును. ఇకముందు సృష్టివిషయమై వ్రాయబడును. సంక్షేపముగ నీశ్వరవేద విషయములగూర్చి వ్యాఖ్యానింపబడినది.

**శ్రీ మద్దయానంద సరస్వతీస్వామి కృతమగు**

**సుభాషా విభూషిత**

**సత్యార్థ ప్రకాశమున ఈశ్వర–వేదవిషయముగల**

**సప్తమ సముల్లాసము సంపూర్ణము.**

# అష్టమ సముల్లాసము

## సృష్ట్యుత్పత్తిస్థితి ప్రళయవిషయములను వ్యాఖ్యానింతుము

(బ్రహ్మ జగత్కర్త)

ఇయం విసృష్టిర్ యత ఆబభూవ యది వా దధే యది వా న,
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ త్సో అఙ్గ వేద యది వా న వేద.
ఋ.మం.౧౦-సూ ౧౨౯. మం. ౭ (౧)

తమ ఆసీత్తమసా గూఢమగ్రేఽ ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్,
తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీత్తపసస్తన్మహినాజాయతైకమ్. ఋ-౧౦-౧౨౯-౩. (౨)
హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్,
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ. ఋ.౧౦-౧౨౧-౧. (౩)
పురుష ఏవేదం సర్వం యద్ భూతం యచ్చ భావ్యమ్,
ఉతామృతత్వస్యేశానో యదన్నేనాతిరోహతి. యజు. ౩౧-౨. (౪)
యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి,
యత్ ప్రయన్త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్ బ్రహ్మ. తైత్తిరీయ. ఉ.భృ.వ.౧. (౫)

హే అఙ్గ! = ఓ మానవా! ఈ వివిధ సృష్టిని జేసి, ధరించి, ప్రళయము చేయువాడే యీజగత్తునకు స్వామి. ఏ వ్యాపకపదార్థమునం దీసృష్టి యుత్పత్తి స్థితిప్రళయముల నందుచున్నదో యదియే పరమేశ్వరుడుగా నీవెఱుంగుము. ఇతరుని సృష్టికర్తగా నంగీకరింపకుము. (౧)

ఈ సమస్త జగత్తు సృష్టికి బూర్వమంధకారముతో నావృతమై రాత్రిరూపమున నెఱుంగనయోగ్యమై, యాకాశరూపమున దుచ్ఛముగా ననంత పరమేశ్వరునియం దేకదేశియై యాచ్ఛాదితమై యుండెను. తరువాత బరమేశ్వరుడు తన సామర్థ్యముతో గారణరూపమునుండి కార్యరూపమునకు దెచ్చెను. (౨)

ఓ మనుష్యులార! సూర్యాది సర్వతేజోమయ పదార్థములకు నాధారము, పుట్టిన జగత్తునకు, బుట్టనున్నదానికి నద్వితీయ స్వామియు నగుపరమాత్మ యీజగదుత్పత్తికి బూర్వముండెను. అతడే యీపృథివి మొదలు సూర్యునివఱకుగల జగత్తు నుత్పన్నము చేసియున్నాడు. ఆ పరమేశ్వరునకు ప్రేమతో భక్తి నొనరింపవలయును. (౩)

ఓమానవులార! సమస్తమున బూర్ణపురుషుడు, నాశరహితకారణము, జీవులకు స్వామి, పృథివ్యాది సమస్తజడ పదార్థములకంటెను, జీవులకంటెను భిన్నుడైన యాపురుషుడే యీభూతభవిష్యద్వర్తమాన జగత్తును నిర్మించువాడు. (౪)

ఏ పరమాత్మనిరచనమువలన నీపృథివ్యాది సమస్తపదార్థము లుత్పన్నములై, జీవించి ప్రళయము నొందునో యతడే బ్రహ్మము. అతని నెఱుంగ గోరుము.

'జన్మాద్యస్య యతః'.వే-ద-౧-౧-౨ ఎవని వలన నీజగత్తుయొక్క యుత్పత్తిస్థితి ప్రళయములు జరుగునో యాబ్రహ్మమే యెఱుగదగినది.

(పరమేశ్వరుడు జగత్తునకు నిమిత్తకారణము)

ప్రశ్నః- ఈ జగత్తు పరమేశ్వరునినుండి యుత్పత్తియైనదా? అన్యునినుండియా?
ఉత్తరముః- నిమిత్త కారణమైన పరమాత్మునివలన నుత్పన్నమైనది. కాని, ఈ జగత్తునకు నుపాదాన

కారణము ప్రకృతి.

ప్రశ్నః- ప్రకృతిని బరమేశ్వరు డుత్పన్నము చేయలేదా?

ఉత్తరముః- లేదు. అది యనాది.

ప్రశ్నః- అనాది దేనినందురు? అనాదిపదార్థము లెన్ని?

ఉత్తః- దేని కాది - కొండొక కారణము లేక సమయము నుండదో యది యనాది యనబడును. ఈశ్వరుడు, జీవులు, జగత్తునకుపాదాన కారణము ప్రకృతి యీమూడు ననాదిపదార్థములు.

ప్రశ్నః- ఇందులకు బ్రమాణమేమి?

ఉత్తః- ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే,

తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి. ఋ. ౧-౧౬౪-౨౦. (౧)

శాశ్వతీభ్యః సమాభ్యః. యజు ౪౦-౮ (౨)

ద్వా = పరమేశ్వరుడు, జీవులునను రెండు, సుపర్ణా = చేతనత, పాలనాది గుణములలో సదృశులు, సయుజా = వ్యాప్యవ్యాపకభావముతో సంయుక్తులు, సఖాయా = పరస్పర మిత్రతా యుక్తులు, సనాతనులు, ననాదులు, సమానమ్= అట్లే, వృక్షం = అనాదిమూలరూపకారణము, శాఖారూపకార్యయుక్త వృక్షము స్థూలమై ప్రళయమున భిన్నభిన్నమగునట్టి మూడవ యనాదిపదార్థము. ఈ మూటిగుణకర్మస్వభావము లును ననాదియై యున్నవి. ఈ జీవబ్రహ్మలలో జీవుడీవృక్షరూప ప్రపంచమున - సంసారమున, బాపపుణ్యరూప ఫలములను, స్వాద్వత్తి = బాగుగ ననుభవించును. రెండవవాడైన పరమాత్మ కర్మఫలములను, అనశ్నన్ = అనుభవింపక నాలుగువైపుల - లోపల, వెలుపల నంతట బ్రకాశించు చున్నాడు. జీవునికంటె బరమేశ్వరుడు, నీశ్వరునికంటె జీవుడు, నీ రెండింటికంటె బ్రకృతి, మూడును, భిన్నస్వరూపములుగలవై, యాదిలేని యనాదులునై యున్నవి. (౧)

(శాశ్వతీ) - అనగా ననాది సనాతన జీవరూప ప్రజల కొఱకు వేదము ద్వారా పరమాత్మ సర్వవిద్యల ప్రబోధ మొనర్చెను. (౨)

**అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం స్వరూపాః,**

**అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః. శ్వేతా. ఉ. ౪-౫ (౩)**

ఇది యుపనిషద్వచనము. ప్రకృతి, జీవుడు, పరమాత్మయ ను నీమూడును, అజ = జన్మములేనివి ఎన్నడు నివిజన్మింపవు. అనగా నీమూడును జగత్తునకు గారణములు. వీనికి గారణములు లేవు. ఈయనాది ప్రకృతిని ననాదిజీవుడు భోగించుచు నందు జిక్కువడును. పరమాత్మ ప్రకృతిలో జిక్కుకొనడు. అతడు దానిని భోగింపడుకూడ. (౩)

(ప్రకృతి స్వరూపము)

జీవేశ్వరుల లక్షణము లీశ్వరవిషయమున జెప్పితిమి. ఇప్పుడు ప్రకృతి లక్షణము చెప్పుచున్నాము.

**సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః. ప్రకృతేర్ మహాన్. మహతోఽహంకారోఽ**

**హంకారాత్ పంచతన్మాత్రా ణ్యుభయ మింద్రియం పంచతన్మాత్రేభ్యః**

**స్థూలభూతాని పురుష ఇతి పంచవింశతిర్ గణః. సాంఖ్య. సూ. ౧-౬౧.**

సత్త్వం = శుద్ధము, రజః = మధ్యమము, తమః = జాడ్యము - జడత మూడు వస్తువులు కలిసిన సంఘాతము ప్రకృతి యనబడును. దానినుండి మహత్తత్త్వము - బుద్ధి, దాని నుండి యహంకారము, దాని నుండి పంచతన్మాత్రలు - సూక్ష్మభూతములు, పదియింద్రియములు, పదునొకండవది మనస్సు, నైదుతన్మాత్రల నుండి పంచ పృథివ్యాది భూతములు ననునీయిరువది నాలుగు, నిరువదియైదవ

పురుషుడు - జీవుడు, పరమేశ్వరుడు -౨౫ గణము. వీనిలో ప్రకృతి యవికారిణి. మహత్తత్త్వము, నహంకారము, పంచసూక్ష్మభూతములు - ప్రకృతి కార్యములు. ఇయ్యవి యింద్రియములకు, మనస్సునకు, స్థూలభూతములకు గారణములు. పురుషుడు దేనికిని ప్రకృతి -ఉపాదాన కారణముకాని, దేనికిని కార్యముగాని కాడు.

ప్రశ్న:- సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్. ఛాం. ఉ. ౬-౨-౧. (౧)
అసద్ వా ఇదమగ్ర ఆసీత్. తై. ఉ. బ్ర. వ. ౭. (౨)
ఆత్మా వా ఇదమగ్ర ఆసీత్. బృ. ఉ. ౧-౪-౧. (౩)
బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీత్. శత. ౧౧-౧-౧౧-౧. (౪)

ఓ శ్వేతకేతూ! ఈ జగత్తు సృష్టికి బూర్వము సత్తు, అసత్తు, ఆత్మా, బ్రహ్మరూపమున నుండెను. పిమ్మట -

తదైక్షత బహుః స్యామ్ ప్రజాయేయేతి. ఛాం. ఉ. ౬-౨-౨. (౧)
సోఽకామయత బహుః స్యాం ప్రజాయేయేతి. తై. ఉ. బ్ర. వ. ౬ (౨)
ఆపరమాత్మయే తనకోరికవలన బహురూపుడయ్యెను. (౧.౨)
సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన. (౩)

ఇదికూడ ఉపనిషద్వచనము. ఈజగత్తు నిశ్చయముగ బ్రహ్మమే. అందు నితర పదార్థము లేవియులేవు. సర్వము బ్రహ్మరూపమే. (౩)

ఉత్తరము:- ఎందు కీవచనముల కనర్థము కల్పింతువు? ఆయుప నిషత్తులలోనే -
(ఏవమేవ ఖలు) సోమ్యాన్నేన శుంగేనాపో మూలమన్విచ్ఛ, అద్భిః సోమ్య
శుంగేన తేజో మూలమన్విచ్ఛ, తేజసా సోమ్య శుంగేన సన్మూలమన్విచ్ఛ,
సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః. ఛాం. ఉ. ౬-౮-౪.

ఓశ్వేతకేతూ! అన్నరూపమగు పృథివీకార్యము వలన జలరూపమూల కారణమును, నీవెఱుగుము. కార్యరూపజలమువలన తేజోరూపమూలమును, మఱియు, దేజోరూపకార్యము వలన సద్రూపకారణమును - ప్రకృతిని నీవెఱుగుము. ఈ సత్యస్వరూపమగు ప్రకృతియే సర్వజగత్తునకు మూలగృహము - స్థితిస్థానము. ఈసర్వజగత్తు - సృష్టికి బూర్వమున నసత్తునకు సదృశమై యున్నది. జీవులు, బ్రహ్మము, ప్రకృతి యను నీమూడింటియందును లీనమై యుండెను. అభావముగా లేదు.

మఱియు 'సర్వంఖలు' అను నీవచనము, (కహీఁకీఈంటే కహీఁకారోడా భానుమతీనే కుడవాం జోడా) అన్నట్లున్నది. అనగా నొకచోనున్న యిటికను, మఱియొకయెడనున్న ఱాతిని జేర్చి భానుమతి యిల్లు కట్టినట్లున్నదని భావము. ఏలయన:-

సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత. ఛాం. ఉ. ౩-౧౪-౧.
నేహ నానాస్తి కించన. కఠ. ౨-౪-౧౧

శరీరాంగములు శరీరముతో నున్నంతవఱకు గార్యసాధకములు, శరీరమునుండి విడిపోయిన నిరర్థకములు నగును. అట్లే ప్రకరణస్థవాక్యములు సార్థకములగును. ప్రకరణము నుండి వేఱుచేసినను, నితరములతో గలిపినను ననర్థకములగును. వినుము - దీనియర్థమిది.

ఓజీవ! నీవు బ్రహ్మము నుపాసింపుము. ఆ బ్రహ్మము వలన జగదుత్పత్తి స్థితి జీవనము కలుగుచున్నది. బ్రహ్మముచే రచింపబడుటచేతను, ధారణము చేయుటచేతను జగత్తు విద్యమానమై యున్నది. లేక బ్రహ్మతోగూడి సహచరితమై యున్నది. అట్టి బ్రహ్మమును వదలి యితరుని నుపాసింపరాదు. ఈ

చేతనరూప మఖండైకరసమునగు బ్రహ్మమునందు నానావస్తువుల మేళనము లేదు. కాని యివి యన్నియు వేఱువేఱు స్వరూపములతో బరమేశ్వరునియందే యతనియాధారమున స్థితములై యున్నవి.

(జగదుత్పత్తికి మూడుకారణములు)

ప్రశ్నః- జగత్తున కెన్నికారణము లుండును?

ఉత్తః- మూడు. ఒకటి నిమిత్త కారణము, రెండవది యుపాదాన కారణము, మూడవది సాధారణ కారణము. ఎవడు చేసిన నొకవస్తువు సిద్ధమై, చేయకున్నగాదో యతడు నిమిత్తకారణము - అనగా స్వయముగా గార్యరూపమున బరిణమింపక తనకంటె భిన్నమైన వస్తువును బ్రకారాంతరమున సిద్ధము చేయునది నిమిత్తకారణ మగుననిభావము. ఏది లేకున్న వస్తువేర్పడదో యది యుపాదాన కారణము. అనగా నేవస్తువు స్వయముగా మార్పుచెంది యవస్థాంతరమును బొందునో యది యుపాదానకారణ మనబడును. ఒక వస్తువును నిర్మించుటకు సాధనమగునది సాధారణకారణ మనబడును.

నిమిత్తకారణము రెండు విధములు. ఒకటి - సమస్తసృష్టిని గారణము నుండి నిర్మించి, దానిని ధరించి, ప్రళయముచేయు నదియు, నన్నింటికి సంబంధించిన వ్యవస్థ నొనర్చునదియునగు ముఖ్యనిమిత్త కారణము పరమాత్మ. రెండవది - పరమేశ్వరుని సృష్టినుండి పదార్థములను దీసికొని యనేక విధములగు కార్యములను - పదార్థములను జేయు సాధారణనిమిత్త కారణము జీవుడు.

ఉపాదాన కారణము ప్రకృతి - పరమాణువులు. సమస్త ప్రపంచమును నిర్మించుటకు బరమాణువులు సామగ్రి యనదగును. ప్రకృతి - పరమాణువులు జడములగుటవలన దమకుదా మేమియుగా జాలవు, చెడిపోజాలవు కూడ. అక్కడక్కడ జడపదార్థము నిమిత్తము కాగా మఱియొక జడపదార్థము సిద్ధమగును చెడిపోవును కూడ.

ఎట్లనః- పరమేశ్వరునిచే రచింపబడిన బీజము - విత్తనము భూమి మీదబడి జలము లభించుటవలన వృక్షాకారము బొందును. అగ్ని మున్నగు జడపదార్థ సంయోగమువలన జెడిపోవును - నశించును. కాని జడపదార్థములు నియమబద్ధముగా నేర్పడుట, చెడిపోవుట యనునది పరమేశ్వరుని యధీనముననను, జీవుని యధీనమునందు నుండును.

ఏదేని యొక వస్తువు నిర్మింపబడునపుడు, జ్ఞానము, దర్శనము, బలము, చేతులు, నానా విధములగు సాధనములు, దిక్కు, కాలము, నాకాశము నునువి సాధనములుగా దోడ్పడును. వీనిని సాధారణ కారణములందురు. ఉదాహరణార్థము :- కుండను నిర్మించు కుమ్మరి కుండకు నిమిత్తకారణము, మట్టి యుపాదాన కారణము. ఇక దండము, చక్రము, మున్నగు (సాధనములు) సామాన్యనిమిత్తకారణములు. దిక్కు, కాలము, నాకాశము, ప్రకాశము, కన్నులు, హస్తములు, జ్ఞానము, క్రియ మున్నగునవి సాధారణ నిమిత్త కారణములు, నిమిత్తకారణములు కూడ. ఈ మూడు కారణములు లేక యేవస్తువు నిర్మితము కాజాలదు. నశింపను జాలదు.

ప్రశ్నః- నవీనవేదాంతులు పరమేశ్వరు డొక్కడే జగత్తున కభిన్న నిమిత్తోపాదానకారణమని యంగీకరింతురు.

**యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ. ముం. ఉ. ౧-౧-౭.**

ఇది యుపనిషద్ వాక్యముః- సాలీడు వెలుపలినుండి యేపదార్థము తీసికొనదు. తనలోపలి నుండియే తంతువును దీసి గూడును నిర్మించును. తాను నందులోనే యాడుకొనును. అట్లే బ్రహ్మముకూడ దనలోనుండి జగత్తును నిర్మించి తాను జగదాకారమై తానే జగత్తున క్రీడించును. కావున బ్రహ్మము కోరుచు -కామించుచు "నేను బహురూపము - జగదాకారమును బొందుదును గాక" అని

సంకల్పించుట వలన సర్వజగద్రూపము సిద్ధమైనది. ఏలయన :-

**ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేపి తత్తథా: మాం. ఉ. గౌడ. కారిక. ౩౧.**

ఏది ప్రథమమున నుండక, యంతమున నుండదో యది వర్తమానమునను నుండదు - లేదు. సృష్టికి బూర్వము జగత్తు లేదు. బ్రహ్మముండెను. ప్రళయాంతమున జగత్తుండదు. (కేవల బ్రహ్మముండును) కావున వర్తమానమున నీజగత్తంతయు బ్రహ్మమేల కాదు?

ఉత్త:- నీవు చెప్పినదాని ననుసరించిన, జగత్తున కుపాదానకారణము బ్రహ్మమేయైన నాబ్రహ్మము పరిణామి, యవస్థాంతరయుక్తుడు, వికారియు నగును. మఱియు నుపాదానకారణగుణములు, కర్మ ములు, స్వభావము కార్యమున వచ్చును.

**కారణగుణపూర్వకః కార్యగుణో దృష్టః. వైశేషిక. ద. ౨-౧-౨౪**

ఉపాదానకారణగుణములకు సమానమైన గుణములు కార్యమున నుండును - (అని సూత్రార్థము).

కావున బ్రహ్మము సచ్చిదానందస్వరూపము. జగత్తు కార్యరూపమున 'అసత్' జడము, నానంద రహితమును. బ్రహ్మమజము - జన్మములేనిది. ఇక జగత్తు జన్మించినది. బ్రహ్మమదృశ్యము, జగత్తు దృశ్యము. బ్రహ్మ మఖండము, జగత్తు ఖండరూపము. బ్రహ్మము నుండి పృథివ్యాది కార్య పదార్థము లేర్పడియుండిన పృథివ్యాదికార్యరూప జగత్తునగల జడత్వాది గుణము బ్రహ్మమున నుండవలసి వచ్చును. పృథివ్యాదులు జడములైనట్లు బ్రహ్మము (ఉపాదానము కావున) కూడ జడము కావలయునని (వివేకము). మఱియు బ్రహ్మము చేతనము కావున పృథివ్యాది కార్యములును జేతనములు కావలయును.

ఇక నీవొసంగిన సాలెపురుగు దృష్టాంతముకూడ నీమతమును సాధింపదు. పైపెచ్చు బాధించును. ఏలయనగా సాలెపురుగుయొక్క జడశరీరము అది తీయుదారమునకు నుపాదానకారణము. పురుగులోని జీవాత్మ నిమిత్త కారణము. ఇదికూడ బరమేశ్వరుని యద్భుతరచనా ప్రభావమే. కారణమేమన నితరజంతు వేదియు దనశరీరమునుండి తంతువును దీయజాలదు. అట్లే వ్యాపక బ్రహ్మము తనయందు వ్యాప్యమైయున్న ప్రకృతి - పరమాణు రూపమగు నుపాదాన కారణమునుండి స్థూలజగత్తును సృష్టించి - వెలుపల స్థూలరూపమొనర్చి, తాను దానియందే వ్యాపకమై సాక్షిభూతమై యానందమయమై యున్నది.

ఇక, బరమాత్మని యీక్షణ మనగా దర్శనము - విచారము. 'నేను సమస్త జగత్తును నిర్మించి ప్రసిద్ధుడ నగుదును' అని కామించిన విషయము.. జగత్తు నిర్మింపబడినపుడే జీవుల విచారము, జ్ఞానము, ధ్యానము, నుపదేశము, శ్రవణములందు బరమేశ్వరుడు ప్రసిద్ధుడగును. మఱియు స్థూలపదార్థములందు వానితోబాటు వానిలోనుండును. ప్రళయమైనపుడు పరమేశ్వరుడు, ముక్తజీవులు తక్క దానిని (ప్రళయరూపజగత్తును) మఱియెవ్వరు నెఱుగరు.

గౌడపాదుని కారిక భ్రమమూలకము. ప్రళయమున జగత్తు ప్రసిద్ధము గాలేదు. సృష్టికి నంతమున - అనగా ప్రళయారంభమునుండి రెండవసృష్టి జరుగునంతవఱకు జగత్తుయొక్క కారణము సూక్ష్మరూప మున నప్రసిద్ధముగా నుండును. ఏలయన :-

**తమ ఆసీత్ తమసా గూఢమగ్రే. ఇది ఋగ్వేద వచనము. ఋ. ౧౦-౧౨౯-౩ (౧)**

**ఆసీదిదం తమోభూతమప్రజ్ఞాతమలక్షణమ్,**

**అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః. మను. ౧-౫ (౨)**

'ఈ సమస్త జగత్తు సృష్టికి బూర్వము ప్రళయమున నంధకారముతో నావృతము - ఆచ్ఛాదితమై యుండెను. ప్రళయారంభమునకు మీదటను నట్లే యుండెను. ఆసమయమున నెవనికిని నెఱుగుటకును, దర్శించుటకును బ్రసిద్ధచిహ్నములతో గూడి యింద్రియములతో నెఱుగదగినదిగా లేకుండెను.

ఉండబోదు. కాని వర్తమానమున నెఱుగదగిన దగుచున్నది. ఉన్నదున్న ట్లుపలబ్ధమగును. (౧,౨)

మరల నాకారిక వర్తమానమునను జగదభావము చెప్పుచున్నది. అది సర్వథా యప్రమాణము. ఏల యన ప్రమాతా (ఎఱుగువాడు కర్త). దేనిని బ్రమాణముల మూలమున దెలిసికొని, దానిని బొందునో యది మఱియొక విధమున నెన్నడు గాజాలదు.

(సృష్టిప్రయోజనము)

ప్రశ్నః– జగన్నిర్మాణమున బరమేశ్వరున కేమిప్రయోజనము?

ఉత్తః– నిర్మాణము చేయకుండుటలో బ్రయోజనమేమి?

ప్రశ్నః– నిర్మింపకున్న నానందములో నుండవచ్చును. జీవులకు సుఖదుఃఖములు కలుగకుండును.

ఉత్తః– ఇది యలసులు, దరిద్రులు చెప్పువిషయము. పురుషార్థపరులు చెప్పునదికాదు. ప్రళయమున జీవులకు సుఖదుఃఖము లేమియుండును? సృష్టిలోగల సుఖదుఃఖములను దులనచేసి చూచిన సుఖమెన్నియో రెట్లెక్కుడ యుండును. మఱియు నెందఱో పవిత్రాత్ములగు జీవులు ముక్తికి దగుసాధనజేసి మోక్షానందమును బొందుదురు. సుషుప్తియందు బడియుండునట్లు ప్రళయమున నిష్కర్ములై పడియుందురు. ప్రళయమునకు బూర్వము సృష్టియందు జీవులొనర్చిన పాపపుణ్యకర్మలకు నీశ్వరుడు ఫలముల నెట్లీయగలడు? జీవుడెట్లనుభవింపగలడు?

ఎవడేని కన్నులుండుటకు బ్రయోజన మేమని నిన్నడిగిన, జూచుట ప్రయోజనమనియేకదా చెప్పుదువు? అయిన, నీశ్వరునందు జగత్తును రచింపగల విజ్ఞానము, బలము, క్రియయు నున్నవికదా! వాని ప్రయోజనమేమి? జగత్తును రచించు ప్రయోజనమునకుమించి మఱియొకటి చెప్పలేవుకదా? మఱియు బరమేశ్వరునందుగల దయ, న్యాయధారణము మున్నగు గుణములు కూడ జగత్తును రచించినపుడే సార్థకములు కాగలవు. అతని యనంత సామర్థ్యముకూడ జగదుత్పత్తిస్థితి ప్రళయములు, వ్యవస్థయు జేసినపుడే సఫలమగును. నేత్రమునకు స్వాభావికగుణము చూచుటయైనట్లు పరమేశ్వరుని స్వాభావికగుణము జగత్తు నుత్పన్నముచేసి, సర్వజీవులకు నసంఖ్య పదార్థముల నొసంగి పరోపకారము చేయుటయే.

ప్రశ్నః– విత్తనముముందా? చెట్టుముందా?

ఉత్తః– విత్తనము – బీజము ముందు. ఏలయన బీజము, హేతువు, నిదానము, నిమిత్తము, కారణము నను నీశబ్దములన్నియు సమానార్థకములు. ఒకేయర్థమును బోధించును. కారణము – బీజము (విత్తనము) నకు బేరు. కావున గారణము కార్యమునకంటె ముందే యుండును.

ప్రశ్నః– పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు. కావున నతడు కారణమును (ప్రకృతి) జీవులనుగూడ నుత్పన్నము చేయగలడు. చేయజాలని పక్షమున సర్వశక్తిమంతుడు కాడు.

ఉత్తః– సర్వశక్తిమంతు డనుశబ్దమున కర్థము పూర్వము వ్రాసియుంటిమి. కాని యసంభవమును జేయువాడు సర్వశక్తిమంతుడని చెప్పబడునా? ఎవడేని యసంభవమును – కారణములేక కార్యము చేయగలడా? ఈశ్వరుడు కారణములేక రెండవ యీశ్వరు నుత్పన్న మొనర్చి, స్వయముగా మృత్యువును బొంది, జడుడు, దుఃఖితుడు, నన్యాయకారి, యపవిత్రుడు, కుకర్మియు గాగలడా? స్వాభావిక నియమము – అనగా – అగ్నియుష్ణము, జలము శీతము, పృథివ్యాదిజడ పదార్థములనన్నింటిని విపరీతగుణములు కలవిగా నీశ్వరుడును జేయజాలడు.

ఈశ్వరుని నియమములు సత్యములు, పూర్ణములును. కావున వానిని బరివర్తనము చేయజాలడు. పరమేశ్వరు డితరుని సాహాయ్యము నపేక్షింపకయే తన కార్యముల నన్నింటిని బూర్ణము చేయగలుగు

-టయే 'సర్వశక్తిమాన్' పదమున కర్థము.

ప్రశ్న:- ఈశ్వరుడు సాకారుడా? నిరాకారుడా? నిరాకారుడైన హస్తపాదాదులు లేక జగత్తును నిర్మింపజాలడు. సాకారుడైన నెట్టి దోషమును నుండదు.

ఉత్త:- ఈశ్వరుడు నిరాకారుడు. సాకారుడు - శరీరయుక్తుడైన వాడీశ్వరుడు కాడు. ఏలయన సాకారుడు పరిమిత శక్తియుక్తుడు, దేశకాల వస్తువులందు బరిచ్ఛిన్నుడు, నాకలిదప్పికలు, ఛేదనభేదనములు, శీతోష్ణములు, జ్వరపీడాదిసహితు డగును. సాకారుడైనచో నతనియందు జీవుని గుణములు తక్క యీశ్వరుని గుణములు వర్తింపవు. మీరు మేము సాకారులము - శరీరధారులము. అందువలన మనము త్రసరేణువులను, నణువులను, బరమాణువులను - ప్రకృతిని వశపఱచుకొనజాలము. అట్లే యీశ్వరుడును స్థూలదేహధారియైనచో నతడును నాసూక్ష్మపదార్థములతో స్థూలజగత్తును నిర్మింపజాలడు. పరమేశ్వరుడు భౌతికములగు నింద్రియ గోలకములు, హస్తపాదాద్యవయవములు లేనివాడు. కాని, యతడనంత శక్తి బలపరాక్రమములు కలవాడు. కావున వానితో నన్నియు జేయగలడు. ఆపనులను జీవప్రకృతు లెన్నడు జేయజాలవు. ఈశ్వరుడు ప్రకృతికంటె సూక్ష్ముడు. జీవ ప్రకృతులలో వ్యాపకుడు. అందువల -ననే వానిని బట్టుకొని జగదాకారమున మార్చగలడు.

ప్రశ్న:- మనుష్యాదుల తల్లిదండ్రులు సాకారులు కావున వారి సంతానమును సాకారము, తల్లి దండ్రులు నిరాకారులైన సంతానము నిరాకారమై యుండెడిది. అట్లే పరమేశ్వరుడు నిరాకారుడైనచో నతడు నిర్మించిన జగత్తుకూడ నిరాకారమై యుండవలసినదికదా!

ఉత్తరము:- ఈమీప్రశ్నము పిల్లవాని ప్రశ్నమువలె నున్నది. మేమిప్పుడు చెప్పియున్నాముకదా! పరమేశ్వరుడు జగత్తున కుపాదాన కారణముకాదు. అతడు నిమిత్తకారణము -అని. మఱియు స్థూలమైనది ప్రకృతి - పరమాణువులు జగత్తునకుపాదానకారణము. అది నిరాకారము కాదు. పరమేశ్వరునికంటె స్థూలమై యితర కార్యపదార్థములకంటె సూక్ష్మమైన యాకారము కలిగి యున్నది. (అనగా నుపాదాన కారణగుణములు కార్యమున నుండును గాని నిమిత్త కారణగుణములు కారణమున నుండవని భావము.)

ప్రశ్న:- కారణములేకున్న బరమేశ్వరుడు కార్యమును జేయజాలడా?

ఉత్త:- చేయలేడు. ఏలయన దేనికి నభావము - ఉనికి యుండదో యది భావము - ఉనికి గలదియగుట యసంభవము. ఎవడేని నేను వంధ్యాపుత్ర పుత్రికల వివాహము చూచితిని. వారు నరశృంగపుధనుర్బాణములు ధరించి, యాకాశపుష్పముల మాలలు వేసికొని యుండిరి. వారెండమావుల జలముతో స్నానము చేయుచుండి గంధర్వనగరమున నుండెడివారు. అట మేఘములు లేకయే వర్షము కురిసెడిది. పృథివి లేకయే యన్నిధాన్యములు పండెడివి. యని గప్పాలు పలికిన నవి యెట్లసంభవమో యట్లే కారణములేక కార్యమేర్పడుట యసంభవము. మఱియు నట్లే యెవడేని 'నాకు దల్లిదండ్రులు లేరు. నేనే పుట్టితిని. నా ముఖమున నాలుక లేదు, నేను మాటలాడుచున్నాను' అనియు, 'కన్నములో బాము లేదు, కాని యందుండి బయటకు వచ్చినది. నేనెక్కడను లేను, మీరు నెక్కడను లేరు, కాని మేమందఱము వచ్చితిమి. అని యనిన నవి యన్నియు నసంభవములు, పిచ్చివాని మాటలగును.

(కారణమునకు గారణముండదు)

ప్రశ్న:- కారణము లేక కార్యము కాజాలదేని కారణమునకు గారణమేమి?

ఉత్త:- కేవలము కారణమైనవి వేనికిని నవి కార్యములు కావు. ఏది యొకదానికి గారణము మఱి యొకదానికి గార్యమునగునో యాపదార్థము వేఱు. ఎట్లన - పృథివి, గృహము మున్నగు వానికి గారణము, జలాదులకు గార్యమునై యున్నది. కాని, యాదికారణము ప్రకృతి యనాది. దానికి గారణముండదు.

'మూలే మూలాభావాత్ అమూలం మూలమ్' ( సాంఖ్య. ౧-౬౭)

మూలమునకు మూలము - అనగా గారణమునకు గారణ ముండదు. దీనింబట్టి యకారణము - కారణములేనిది సర్వకార్యములకు గారణమగును.

ఏలయన గొండొక కార్యారంభ సమయమునకు బూర్వము మూడు కారణములు తప్పక యుండ వలయును. వస్త్రము సిద్ధమగుటకు బూర్వము సాలెవాడు, దూదితో నిర్మించిననూలు, నలికా - కండెయు, మగ్గపుసామాను పూర్వముండినపుడే వస్త్రము సిద్ధమగును. అట్లే జగదుత్పత్తికి బూర్వము పరమేశ్వరుడు, ప్రకృతి, కాలము, ఆకాశము, జీవులు ననాదులై యున్నపుడే యీజగత్తుత్పన్న మగును. వీనిలో నేయొక్కటి లేకున్నను జగదుత్పత్తి కానేరదు.

(సృష్టి - ఇతరమతములు)

ఈ సృష్టి విషయమున నాస్తికులిట్లందురు.

శూన్యం తత్త్వం భావోఽపి వినశ్యతి వస్తుధర్మత్వా ద్వినాశస్య. సాం. సూ. ౧-౪౪ (౧)

అభావాద్ భావోత్పత్తిర్ నానుపమృద్య ప్రాదుర్భావాత్. (౨)

ఈశ్వరః కారణం పురుషకర్మాఫల్యదర్శనాత్. (౩)

అనిమిత్తతో భావోత్పత్తిః కంటకతైక్ష్ణ్యాది దర్శనాత్. (౪)

సర్వమనిత్యముత్పత్తివినాశ ధర్మకత్వాత్. (౫)

సర్వం నిత్యం పంచభూతనిత్యత్వాత్. (౬)

సర్వం పృథగ్ భావలక్షణ పృథక్త్వాత్. (౭)

సర్వమభావః భావేష్వితరేతరాభావసిద్ధేః. (౮)

న స్వభావసిద్ధిరాపేక్షికత్వాత్. (౯)

న్యాయ. సూ. అ. ౪ ఆ౧-౧౪, ౧౯, ౨౨, ౨౫, ౨౯, ౩౪, ౩౭, ౩౯.

ఈ విషయమున నాస్తికు లిట్లందురు:-

ప్రథమనాస్తికుడు :- శూన్యమే యొకపదార్థము సృష్టికి బూర్వముండెను. అంతమున శూన్యమే యుండును. కారణమేమన భావము - ఉన్నపదార్థములన్నియు నభావములై శూన్యమగును.

ఉత్తరము:- శూన్యము - ఆకాశము, అదృశ్యము, అవకాశము మఱియు బిందువునకును నామము. శూన్యము జడపదార్థము. ఈశూన్యమున సర్వపదార్థములు నదృశ్యములుగా నుండును. బిందువు వలన రేఖయు, రేఖల వలన వర్తులాకారమును నగునట్లు భూమి, పర్వతాది పదార్థము లీశ్వరుని రచనవలన నేర్పడును. (౧) శూన్యము నెఱుగువాడు శూన్యముకాడు.

రెండవనాస్తికుడు :- అభావమునుండి భావముత్పన్నమగును. బీజము మర్దింపబడక యంకుర మేర్పడదు. బీజమును ఖండితముచేసి చూచిన నందంకుర మభావమై యుండును. మొదట నంకురము లేదు. కావున నభావమునుండియే యది యుత్పన్నమగునని భావము.

ఉత్తరము:- బీజము నుపమర్దము - నాశము చేయునది ప్రథమమున బీజముననే యుండును. (అనగా నంకుర మందున్నదని భావము) లేకున్న నది బీజము నుండి యెన్నడు నుత్పన్నము కానేరదు. (౨)

మూడవనాస్తికుడు :- కర్మములకు ఫలము పురుషుడు కర్మముల నాచరించుటవలన లభింపదు. కారణమేమన - ఎన్నియో కర్మములు నిష్ఫలములగుట జూచుచున్నాము. కావున, గర్మములకు ఫలము లభించుట యీశ్వరాధీనమై యున్నదని యూహింపబడును. ఈశ్వరు డేకర్మఫలము నీయదలచునో

యది యిచ్చును. దేనిఫల మీయదలపడో యది యొసంగడు. దీనివలన గర్మఫలమీశ్వరాధీనమై యున్నదని సిద్ధమగుచున్నది.

ఉత్తరము:- కర్మఫలము కేవల మీశ్వరాధీనమై యున్న, గర్మముచేయకయే యీశ్వరుడు ఫలమేల యీడు? కావున మనుష్యుడెట్టి కర్మము నాచరించునో యట్లే ఫలమీశ్వరు డిచ్చును. ఈశ్వరుడు స్వతంత్రుడై మనుష్యుని కర్మములకు ఫలమునీయడు. కాని జీవుడెట్టి కర్మము నాచరించునో యట్టి ఫలము నీశ్వరుడిచ్చునని తేలుచున్నది. (౩)

నాలుగవనాస్తికుడు:- నిమిత్తము లేకయే పదార్థముల యుత్పత్తి జరుగును. తుమ్మచెట్లు మున్నగు వృక్షములలో బదునైనముండ్లు చూచుచున్నాము. సృష్టియెప్పుడెప్పు డారంభింపబడునో యప్పుడు నిమిత్తము లేకయే శరీరాది పదార్థములు పుట్టుచున్నట్లు విదితమగుచున్నది.

ఉత్తరము:- దేనివలన బదార్థ ముత్పన్నమగునో యదియే దానికి నిమిత్తము. ముండ్లులేని చెట్లకు ముండ్లేలపుట్టవు? (ముండ్లు నిమిత్తము లేకయే పుట్టిన నన్ని చెట్లలోను నేలపుట్టవు?) (౪)

ఐదవనాస్తికుడు:- పదార్థము లన్నియు నుత్పత్తి, వినాశములు కలవియే కావున నన్నియు ననిత్యములే.

శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః,
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః. బ్రహ్మనామావలి స్తోత్ర. శ్లో. (౨౦)

ఈ యైదవ నాస్తికుల వర్గముననే నవీన వేదాంతులును జేరుదురు. ఏలయన వారిట్లు చెప్పుచున్నారు. 'బ్రహ్మసత్యము, జగత్తు మిథ్య, జీవుడు బ్రహ్మమే, యితరుడు కాడు. కోటి గ్రంథములలో జెప్పబడినదిదియే' యని వారు చెప్పుచున్నారు.

ఉత్తరము:- అన్నిటి యనిత్యము నిత్యమగుటచేత నన్నియు ననిత్యములనుట తగదు.

ప్రశ్న:- అన్నిటి యనిత్యతయు ననిత్యమే. అగ్ని కాష్ఠములను నశింపజేసి - దహనముచేసి, తానును నశించును గదా?

ఉత్తరము:- లోకమున నేపదార్థ ముపలబ్ధమగుచున్నదో యది యుండగా దాని ననిత్యమనుటయు, బరమసూక్ష్మకారణము ననిత్యమనుట యెన్నడును దగదు. వేదాంతులు బ్రహ్మమునుండి జగత్తుత్పన్నమైనది యందురు. బ్రహ్మ సత్యముకావున దానికార్య మెన్నడు నసత్యము కాజాలదు. స్వప్నమువలె, రజ్జుసర్పమువలెను గల్పితమందురేని యదియు సరికాదు. ఏలయన గల్పన యనునది గుణము. గుణము నుండి ద్రవ్యముత్పన్నము కాదు. గుణము ద్రవ్యమును విడిచి వేఱుగాను నుండదు. కల్పనచేయువాడు (బ్రహ్మము) నిత్యుడు కావున నతని కల్పనయు (గుణము) నిత్యము కావలసివచ్చును. లేకున్న గల్పనాకర్తనుగూడ ననిత్యమని యంగీకరింపుము.

చూడని వినని వస్తువెన్నడు స్వప్నమున గానరాదు. జాగ్రదవస్థయందు వర్తమానసమయమునగల సత్యపదార్థముతో సాక్షాత్ సంబంధమువలన ప్రత్యక్షాది ప్రమాణమువలన జ్ఞానము కలిగిన మీదట, దాని సంస్కారము - వాసనారూపజ్ఞాన మాత్మయందు స్థిరమగును. స్వప్నమున వానినే ప్రత్యక్షముగ జూచును. సుషుప్తి - గాఢనిద్ర కలిగినపుడు బాహ్యపదార్థముల జ్ఞానము కలుగదు. అట్లే ప్రళయమునందును కారణద్రవ్యముండును. సంస్కారము లేకయే స్వప్నము కలుగునెడల జన్మాంధునకును రూపము స్వప్నమున గనబడవలయును. కావున నట వానిజ్ఞానముమాత్ర ముండును. వెలుపల నన్ని వస్తువులు నుండును.

ప్రశ్న:- జగత్తులోని పదార్థములు స్వప్నమునందును, రెండును (స్వప్నజాగ్రత్తలలోని) సుషుప్తి

యందును ననిత్యము లయినట్లు జా(గదవస్థ యందలి పదార్థములను గూడ స్వప్నములోనివానివలె నెంచవలయును.

ఉత్తరము:- అట్లెన్నడు నంగీకరింపజాలము. ఏలయన స్వప్నసుషుప్తులలో బాహ్యపదార్థముల యజ్ఞానము మా(త్రముండును. వానియభావ మెన్నడును గాదు. ఒకని వెనుకనున్న వస్తువు లతనికి గనిపింపక పోవచ్చును. అంద్ధులన వానియభావ మెన్నడును గలుగదు. స్వప్నసుషుప్తులందు నట్లే యెంచవలయును. కావున నింతకుబూర్వము చెప్పినట్లు (బహ్మము, జీవులు, (ప్రకృతి (జగత్తునకుపాదాన కారణము) యను నివియన్నియు ననాదులు, నిత్యములు, సత్యములును. (౫)

ఆఱవనాస్తికుడు:- పంచభూతములు నిత్యములగుటవలన సమస్త జగత్తుకూడ నిత్యమే.

ఉత్తరము:- ఈ విషయము సత్యముకాదు. ఏలయన నేపదార్థముల యుత్పత్తికి వినాశమునకు గారణములు చూడబడుచున్నవో (యవి నిత్యములుగావు). అవి నిత్యములగుచో సమస్త స్థూలజగత్తు, శరీరములు, ఘటపటాదులయిన పదార్థము లుత్పన్నములై నశించుట చూచుచున్నాము గదా! కావున గార్యపదార్థములు - ఉత్పత్తి వినాశముగలవి నిత్యము లెన్నడును గావు. నిత్యములని యంగీకరింపము.

ఏడవనాస్తికుడు:- భావపదార్థము లన్నియు వేఱువేఱుగా నున్నవి. (అవయవపుంజములు) ఏదియు నొక్కపదార్థముకాదు. (అవయవ సముదాయమే కాని వానియందవయవి యనునదేదియు లేదు.) మనము చూచు పదార్థములలో వేఱుగా నొకపదార్థము (అవయవి) కనిపింపదు కదా!

ఉత్తరము:- అవయవములలో నవయవి యొకటి యున్నది. కాలము, నాకాశము, పరమాత్మ, జాతి, యనునివి పృథక్ పృథక్ పదార్థములు సమూహములందు వేఱుగా నొక్కొక్కటి యున్నవి. వానినుండి వేఱుగా నేపదార్థము నుండజాలదు. కావున నన్నియు పృథక్ పదార్థములు కావు. కాని స్వరూపముతో భిన్నభిన్నములుగా నున్నను వానిలో వేఱువేఱుగా నొక్కొక్క పదార్థమున్నది. (౬)

ఎనిమిదవనాస్తికుడు:- అన్ని పదార్థములందును నితరేతరాభావము సిద్ధమగుటవలన (ఘటము పటము కాదు. పటము ఘటముకాదు. ఘటమున బటములేదు. పటమున ఘటములేదు) పదార్థము లన్నియు నభావరూపములే. ఎట్లన 'అనశ్వో గౌః, అగౌరశ్వః' గోవు గుఱ్ఱము కాదు. గుఱ్ఱము గోవుకాదు. కావున నన్నియు నభావములని యంగీకరింపవలయును.

ఉత్తరము:- సర్వపదార్థములందును నితరేతరాభావమునకు సంబంధముండవచ్చును. కాని 'గవిగౌః, అశ్వేఅశ్వః' గోవునందశ్వాభావమున్నను గోవునందు గోవున్నది కదా? అట్లే యశ్వమున గోవులేకుండ వచ్చును. కాని యశ్వమున నశ్వభావమున్నది కదా! కావున నన్నియు నభావము లెన్నడును గావు. పదార్థములభావమే లేకున్న నితరేతరాభావ మెందులో దేని యభావము జెప్పగలరు? (౭)

తొమ్మిదవనాస్తికుడు:- స్వభావమువలననే జగదుత్పత్తి జరుగును. నీరు నన్నము కలిసిన పురుగులు పుట్టును. విత్తనములు, మట్టి జలము కలిసిన గడ్డి, వృక్షములు, పాషాణములు మున్నగునవి పుట్టును. సము(దమున వాయుయోగమున దరంగములు, తరంగములవలన నురుగు, పసుపు సున్నము నిమ్మరసము కలిసిన లాల్ కుంకుమ సిద్ధమగును. ఇట్లే సర్వజగత్తును దత్త్వముల స్వాభావికగుణములవలన నుత్పన్నమగును. దీనిని నిర్మించు కర్త యెవడును లేడు.

ఉత్తరము:- స్వభావము వలన జగత్తు పుట్టిన వినాశమెన్నడును గాదు. వినాశము చెందుట వస్తుస్వభావమందువేని యుత్పత్తి కలుగజాలదు. (ద్రవ్యములం దుత్పత్తి, వినాశము ననురెండు స్వభావము లొక్కక్షణమున నంగీకరింతువేని యుత్పత్తి వినాశముల వ్యవస్థ యేర్పడదు. మఱియు నిమిత్తముండుట వలన నుత్పత్తివినాశముల నంగీకరింతువేని నిమిత్తమును నుత్పన్నములై వినష్టములగు (ద్రవ్యములకంటె

వేఱుగ నంగీకరింపక తప్పదు. స్వభావము వలన వస్తువుత్పన్నమగుచో నీభూగోళమునకు సమీపమున నింకొక భూగోళము, సూర్యుడు, చంద్రుడు నేల యుత్పన్నము కావు?

ఏయే వస్తువులు కలిసిన నెయ్యదెయ్యది యుత్పన్నమగుచున్నదో యవియన్నియు నీశ్వరునిచే నుత్పన్నము చేయబడిన బీజములు, నన్నము, జలము కలియుటవలన గడ్డిగాదము, వృక్షములు, క్రిమికీటకాదులు నుత్పన్నము లగుచున్నవి. అవి లేకున్న గలుగవు. పసుపు, సున్నము, నిమ్మరసము వేఱువేఱుగా దూరముగా నున్నవానిని నీవొకచో జేర్చిన జేరును. వానియంతటనవి యొకచో జేరవు. అవియు దగినట్లు సరియైన పాళ్లలో గలిపిన కుంకుమ సిద్ధమగును. అట్లే ప్రకృతి పరమాణువులను జ్ఞానముతో యుక్తితో బరమేశ్వరుడు కలుపనిచో జడపదార్థములేవియు నొకకార్యసిద్ధికొఱకు స్వయముగా గలిసి విశేషపదార్థము కాజాలవు. కావున స్వభావాదుల వలన సృష్టి యేర్పడదు. పరమేశ్వరుని రచన వలననే సృష్టి యేర్పడును.

(జగత్తు అనాదికాదు)

ప్రశ్న:- ఈ జగత్తునకు గర్త పూర్వము లేడు, ఇప్పుడును లేడు, ముందును నుండబోడు. అనాది కాలమునుండి యిట్లే యున్నది. ఎన్నడు నిది పుట్టలేదు, ముందెన్నడును నశింపదు.

ఉత్తరము:- కర్త లేక క్రియ కాని, క్రియాజన్య పదార్థము కాని యేర్పడజాలదు. సంయోగవిశేషము వలన రచన గనబడుచున్నది. అందువలన నవి యనాదు లెన్నడును గాజాలవు. సంయోగమువలన నేర్పడు వస్తువు సంయోగమునకు బూర్వముండదు. వియోగమునకు దరువాత నుండదు. ఇది నీవంగీకరింపవేని, కఠినముకంటె గఠినమైన పాషాణాదులు, వజ్రములు, నుక్కు మున్నగునవి ముక్కలు ముక్కలు చేసికాని, కరిగించికాని, భస్మము చేసికాని చూడుము. దానిలో జిన్నజిన్న పరమాణువులు కలిసి యున్నవో లేవో నీకు దెలియును. కలిసిన వస్తువులు సమయాంతరమున దప్పక వేఱగును.

(జీవుడెన్నడు నీశ్వరుడు కాడు)

ప్రశ్న:- అనాదియీశ్వరు డెవ్వడును లేడు. యోగాభ్యాసమువలన నణిమాద్యైశ్వర్యమును బొంది, సర్వజ్ఞత్వాదిగుణయుక్తుడై, కేవలజ్ఞానియైన జీవుడే పరమేశ్వరు డనబడుచున్నాడు.

ఉత్తరము:- అనాది పరమేశ్వరుడు జగత్స్రష్ట లేనినాడు సాధనములవలన సిద్ధమగు జీవుల యాధారము, జీవనరూపమగు జగత్తు, శరీరము, నింద్రియ గోళములు నెట్లు సిద్ధమగును? ఇయ్యవి లేక జీవుడభ్యాసము సాధనము చేయజాలడు. సాధనములు లేనినాడు సిద్ధు డెట్లుకాగలడు? జీవుడెంత యెట్టిసాధనము జేసి సిద్ధుడైనను, స్వయం సనాతన - అనాదిసిద్ధిగల యీశ్వరునిసిద్ధిలో ననంతసిద్ధి యున్నది. అతనికి దుల్యు డేజీవుడును గాలేడు. ఏలయన జీవునిజ్ఞానము పరమావధివఱకు వృద్ధిబొందినను పరిమిత జ్ఞానము, పరిమితసామర్థ్యము కలవాడే యగును. అనంతజ్ఞానము, ననంత సామర్థ్యము గలవాడెన్నడును గాజాలడు. చూడుడు! ఏయోగియు, నేటివఱకు నీశ్వరకృతసృష్టి క్రమమును మార్పగలవాడు కాలేదు. ఇకముందును గాజాలడు. అనాదిసిద్ధపరమేశ్వరుడు నేత్రములతో జూచుటకును, జెవులతో వినుటకును నిబంధమేర్పఱచి యున్నాడు. దీని నేయోగియు మార్పజాలడు. కావున జీవుడెన్నడు నీశ్వరుడు కాజాలడు.

ప్రశ్న:- కల్పకల్పాంతరములందు సృష్టి నీశ్వరుడు విలక్షణ విలక్షణముగా నిర్మించునా? ఒకే విధముగ రచించునా?

ఉత్తరము:- ఇప్పుడెట్లున్నదో యట్లే పూర్వమున నుండెను. ముందును నుండును. భేదముండదు.

**సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వమకల్పయత్,**

**దివం చ పృథివీం చాంతరిక్షమథో స్వః. ఋ ౧౦-౧౯౦-౩.**

ధాతా = పరమేశ్వరుడు పూర్వకల్పమున నెట్లు సూర్యచంద్రులను విద్యుత్తును, బృథివిని, నంతరిక్షము మున్నగు వాని నిర్మించెనో యట్లే యిప్పుడును నిర్మించియున్నాడు. ముందును నట్లే చేయును. కావున బరమేశ్వరుని కార్యములలో బ్రమాదాదు లుండవు. కావున నెల్లప్పుడు నొక్కటిగానే జరుగుచుండును. వృద్ధిక్షయములను బొందు జ్ఞానముగల జీవుడు - అల్పజ్ఞుడు కావున నతని కార్యము లలో భ్రమప్రమాదములు కలుగుచుండును. ఈశ్వరకార్యముల నెన్నడట్లు కలుగవు.

ప్రశ్నః- సృష్టివిషయమున వేదాదిశాస్త్రములలో విరోధమున్నదా లేదా?

ఉత్తరముః- విరోధము లేదు. అవిరోధమే యున్నది.

ప్రశ్నః- అవిరోధమే యున్నయెడల --

**తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్ వాయుః, వాయోరగ్నిః,**
**అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధిభ్యో అన్నమ్, అన్నాద్**
**రేతః, రేతసః పురుషః, స వా ఏష పురుషోఽన్నరసమయః. తై. ఉ. బ్ర. వల్లీ. (౧)**

ఆపరమేశ్వరుడు ప్రకృతినుండి యాకాశము - కారణరూపద్రవ్య మంతట వ్యాపించియుండు దాని నొకచో జేర్చిన నాకాశ ముత్పన్నమైనట్లగును. వాస్తవమున నాకాశముత్పన్నము కాదు. ఏలయన నాకాశము లేకున్న బ్రకృతి - పరమాణువు లెక్కడ నుండును? ఆకాశమునకు బిమ్మట వాయువు, దానికి దదుపరి యగ్ని, దానికి బిదప జలము, జలము తరువాత బృథివి, పృథివినుండి యోషధులు, వానినుండి యన్నము, దానివలన వీర్యము, వీర్యమువలన బురుషుడు-శరీరము నుత్పన్నమగును.

ఇట నాకాశాదిక్రమము ననుసరించియు, ఛాందోగ్యమున నగ్న్యాది క్రమముతోను, ఐతరేయమున జలాది క్రమమునను సృష్టియైనట్లు చెప్పబడినది. వేదములందొకచో బురుషుడు, హిరణ్యగర్భుడు మున్నగు వారినుండియు, మీమాంసయందు కర్మము, వైశేషికమునందు గాలము, న్యాయమున బరమాణువులు, యోగమున బురుషార్థము, సాంఖ్యమున బ్రకృతి, వేదాంతమున బ్రహ్మమునుండియు సృష్టి జరిగి నట్లంగీకరింపబడినది. అందువలన దేనిని సత్యమని, దేని నసత్యమని యంగీకరింపవలయును?

ఉత్తరముః- వీనిలో నన్నియు సత్యములే. ఒక్కటియు నసత్యము కాదు. వీనిని విపరీతముగా దెలిసికొనువా డసత్యవాది. ఏలయన జగత్తునకు బరమేశ్వరుడు నిమిత్తకారణము, ప్రకృతి యుపాదాన కారణము. మహాప్రళయము జరిగినపు డాకాశాదిక్రమము ననుసరించి సృష్టిజరుగును. అనగా నాకాశము వాయువు, ప్రళయము నొందనపు డగ్న్యాదులు ప్రళయము బొందినపు డగ్న్యాదిక్రమమున సృష్టిజరుగును. విద్యుత్తు, నగ్ని ప్రళయము నొందినపుడు జలాదిక్రమమున సృష్టిజరుగును. ఏయే ప్రళయమున నెంతవఱకు బ్రళయము జరుగునో యటనుండియే సృష్టి యేర్పడును. పురుషుడు, హిరణ్యగర్భుడు ననునీపదము లీశ్వరవాచకములే. ప్రథమ సముల్లాసమున వీనిని గుఱించి వ్రాసియున్నాము.

ఒక కార్యమున నొకేవిషయమున విరుద్ధవాదమున్న నది విరోధమనబడును. ఆఱు శాస్త్రములందును నవిరోధ మెట్లున్నదో చూడుము. మీమాంసయందు లోకమున గర్మము - చేష్ట చేయక యేర్పడు కార్యమొండును లేదు. వైశేషికమున సమయము వెచ్చింపక యేకార్యము నెఱవేరదు. న్యాయమున నుపాదాన కారణము లేకున్న నేకార్యము కలుగజాలదు. యోగమున విద్యా, జ్ఞానము, విచారము లేక యేదియు నేర్పడదు. సాంఖ్యమున తత్త్వముల కలయిక లేక సృష్టి యేర్పడదు. వేదాంతమున నిర్మించువాడు నిర్మింపకున్న నేపదార్థము నుత్పన్నముకాదు. కావున సృష్టి యాఱుకారణములచే నేర్పడు చున్నది. ఆయాఱు కారణముల వ్యాఖ్య యొక్కొక్క శాస్త్రమున నొక్కటొక్కటిగా జేయబడినది. కావున విరోధ మావంతయు వానిలో లేదు. ఒక గదికప్పును నాలుగురు మనుష్యులెత్తి గోడల మీద

పెట్టునట్లుగా నార్గురు శాస్త్రకారులు కలిసి సృష్టిరూపకార్యమును వ్యాఖ్యానించియున్నారు.

గ్రుడ్డివారికి నైదుగురకు, నొకమందదృష్టిగల వానికి నేనుగునకు సంబంధించిన యవయవములలో నొక్కొక్క యవయవమును దెలిపి యటుపై వారినెవరేని యేనుగెట్లుండునని ప్రశ్నించిన నొకడు స్తంభమువలె నున్నదనియు, నింకొకడు చేటవలెను, మఱియొకడు రోకలివలెను, నాల్గవ యంధుడు చీపురుకట్టవలెను, ఐదవయంధుడరుగువలెను, మందదృష్టిగల యాఱవవాడు నాలుగుస్తంభములమీద నొకదున్నపోతు నుంచినట్లు నున్నదనియు చెప్పుదురు. అట్లే నేటియనార్షములు, నవీనములు నగు క్షుద్రబుద్ధులచే రచియింపబడిన గ్రంథములను జదివి యొకరు మఱియొకరిని నిందించుటలో దత్పరులై వ్యర్థకలహములు చేయుచుందురు. వీరిరచనములను, బుద్ధిమంతులుకాని యితరులుకాని నమ్మరాదు. ఏలయన నంధుల ననుసరించు నంధులు దుఃఖముల నేలపొందరు? అట్లే నేటి యల్పవిద్యాయుక్తులు, స్వార్థపరులు, విషయలోలురునైన పురుషులలీలలు లోకమును నాశము చేయును.

ప్రశ్న:- కారణము లేక కార్యమేర్పడనపుడు కారణమునకు గారణ మేలయుండదు?

ఉత్తరము:- అమాయకులగు నోసోదరులారా! కొంచెము మీబుద్ధి నేలయుపయోగింపరు? చూడుడు. లోకమున రెండు విధములైన పదార్థములే యున్నవి. ఒకటి కార్యము, రెండవది కారణము. కారణము కార్యముకాదు. ఒక పదార్థము కార్యముగా నున్నప్పు డదికారణము కాజాలదు. మనుష్యుడు సృష్టిని యథారీతిని దెలిసికొనునంతవఱకు నతనికి యథార్థజ్ఞానము కలుగనేరదు.

నిత్యాయాః సత్వరజస్తమసాం సామ్యావస్థాయాః ప్రకృతేరుత్పన్నానాం
పరమసూక్ష్మాణాం పృథక్ పృథక్ వర్తమానానాం తత్త్వపరమాణూనాం ప్రథమః
సంయోగారంభః సంయోగ విశేషా దవస్థాంతరస్య స్థూలాకారప్రాప్తిః సృష్టిరుచ్యతే.

అనాదినిత్యస్వరూపమగు సత్వరజస్తమోగుణముల యేకావస్థయగు ప్రకృతినుండి యుత్పన్నములైనవి, పరమసూక్ష్ములైనట్టివి, వేఱు వేఱుగా దత్త్వావయవము లున్నవి. వానిలో బ్రథమమున సంయోగమారంభమగును. అట్టి సంయోగ విశేషములవలన నవస్థాంతరములు - అన్యాన్యములైన యవస్థలను గ్రమముగా స్థూలస్థూలములగు నవస్థలను బొంది విచిత్రరూపమున నీసృష్టి యేర్పడినది. ఇట్టి సంయోగమువలననే సృష్టి యేర్పడును.

ఈ సూక్ష్మావయవముల ప్రథమ సంయోగమునందు గలియునదియు, గలుపునట్టిదియు నగు నేపదార్థము కలదో యది సంయోగమున కాదియు విభాగమున కంతము నగును. అనగా దాని నిక విభజించు నవకాశముండదు. అట్టిదానినే కారణమందురు. సంయోగమునకు బిదప నేర్పడునది, వియోగమునకు దదుపరి సంయోగానంతరమున్నట్లుండనిదియు గార్యమనబడును. అట్టి కారణమునకు గారణము, కార్యమునకు గార్యము, కర్తలకు గర్త, సాధనమునకు సాధనము, సాధ్యమునకు సాధ్యము నడుగువాడు చూచుచు నంధుడు, వినుచు బధిరుడు, నెఱుగుచు మూర్ఖుడు నగును. కంటికి గన్ను, దీపమునకు దీపము, సూర్యునకు సూర్యుడు నుండునా? దేనినుండి యొకవస్తు వుత్పన్నమగునో యది కారణము. ఉత్పన్నమైనది కార్యము. కారణమునకు గార్యరూపము నిచ్చువాడు కర్త యగును.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః. భ.గీత. ౨-౧౬.

అసత్తునకు - భావః = వర్తమానము, సత్తునకు - అభావః = అవర్తమానము నెన్నడునుండదు. ఈ రెండింటి నిర్ణయము తత్త్వదర్శులు చేసియున్నారు.

పక్షపాతముగలవారు, దురాగ్రహులు, మలినాత్ములు, నవిద్వాంసులు నైనవా రీవిషయమున సహజ

ముగా నెట్లు తెలిసికొనగలరు? ఏలయన విద్వాంసుడు, సత్సంగియునై, విచారణము చేయని మనుష్యు డెల్లపుడు భ్రమజాలమున బడియుండును. సర్వవిద్యల సిద్ధాంతముల నెఱుగువారు, నెఱుగుటకు బరిశ్రమము చేయువారు నైనజనులు ధన్యులు. వారు తెలిసికొని యితరులకు నిష్కపటతతో బోధింతురు. కావున గారణము లేకయే సృష్టి నంగీకరించువాడేమియు నెఱుగడు.

(సృష్టిరచన)

సృష్టి కలుగవలసినపు డాపరమసూక్ష్మ పదార్థములను బరమాత్మ యొకచో జేర్చును. ప్రథమావస్థయం దాపరమసూక్ష్మమగు ప్రకృతిరూప కారణమునుండి కొంచెము స్థూలపదార్థ మేర్పడును. దానికి మహత్తత్త్వమని పేరు. దానికంటె గొంచెము స్థూలమయిన దానికి నహంకారమని నామము. అహంకారమునుండి భిన్నభిన్నములైన పంచసూక్ష్మభూతములు, పంచజ్ఞానేంద్రియములు - శ్రోత్రములు, త్వక్కు, నేత్రములు, జిహ్వ, ఘ్రాణము - నాసిక యనుజ్ఞానేంద్రియములు, వాక్కు, హస్తములు, పాదములు, ఉపస్థమూత్రేంద్రియము, గుద - మలేంద్రియము నను నీ పంచకర్మేంద్రియములు, పదునొకండవది యగు మనస్సు కొంచెము స్థూలములై యుత్పన్నము లగును. ఆ పంచ సూక్ష్మభూతము లనగా దన్మాత్రలనుండి యనేక స్థూలావస్థలను బొందుచు గ్రమముగా మనము ప్రత్యక్షముగా జూచు స్థూల భూతము లయిదును నుత్పన్నము లగును. వానినుండి నానావిధములగు నోషధులు, వృక్షములు మున్నగున వేర్పడును. వానినుండి యన్నము, నాయన్నము నుండి వీర్యము, దానినుండి శరీర మేర్పడును. కాని యాదిసృష్టి మైథునసృష్టికాదు. ఏలయనగా బరమేశ్వరుడు స్త్రీపురుషుల శరీరములను సృష్టించి వానిలో జీవులను సంయుక్తము చేయును. తదనంతరము మైథునసృష్టి నడచును.

శరీరమం దెట్టి జ్ఞానపూర్వకమగు సృష్టి రచింపబడినదో చూడుడు. దానిని జూచి విద్వాంసు లాశ్చర్యమగ్ను లగుచున్నారు. లోపలి యెముకల కూర్పు, నరములకట్టు, మాంసముపూత, చర్మము కప్పు, శ్వాసకోశము, పిత్తకోశము, ప్లీహాదులు, హృదయయంత్రస్థాపనము, జీవుని సంయోజనము, శిరోరూపమూల రచన, వెంద్రుకలు, గోళ్ళు మొదలగువాని స్థాపనము, కంటి యందలి యతిసూక్ష్మమగు నరముల తంత్రుల బోలిన బిగింపు, నింద్రియభాగముల ప్రకాశము, జీవుడు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను భోగించుటకు దగిన స్థానవిశేషముల నిర్మాణము, సమస్త ధాతువుల విభాగకరణము, కళాకౌశల స్థాపనాదులతో గూడిన యద్భుతసృష్టిని బరమేశ్వరుడు గాక మఱెవ్వడు చేయగలడు?

ఇదియుగాక నానాప్రకారములగు రత్నధాతువులచే జటితభూమిని, నానావిధములగు వటవృక్షాదుల బీజములందలి యతిసూక్ష్మరచనను, నసంఖ్యములగు హరిత, శ్వేత, పీత, కృష్ణ, చిత్రమధ్యరూపములతో గూడిన పత్ర, పుష్ప, ఫల, మూల నిర్మాణమును, మధుర, క్షార, లవణ, కషాయ, తిక్త, ఆమ్లాది వివిధరసములను, సుగంధాదియుక్తములగు పత్ర, పుష్ప, ఫల, అన్న, కందమూలాదుల రచనను, ననేకానేకములగు - కోట్లకొలది భూగోళ సూర్య చంద్రాదిలోకముల నిర్మాణమును, వాని ధారణము, చలనము, నియమములలో నుంచుట మొదలగువానిని బరమేశ్వరుడు దక్క యన్యుడెవ్వడు చేయగలడు? ఎవడేని యొకపదార్థమును జూచినపుడు రెండు విధములగు జ్ఞానమతనికి గలుగును. ఒకటి - ఆపదార్థమెట్లున్నదో యట్టిజ్ఞానము. రెండవది - ఆ పదార్థములోని రచనను జూచి దానిని నిర్మించువారి జ్ఞానము కలుగును. ఎవ్వడేని సుందరమగు నొకయాభరణమును నడవియందు బడియుండగ జూచెనేని యది సువర్ణముతో జేయబడినదనియు, బుద్ధిమంతుడైన శిల్పి యెవ్వడో చేసినాడనియు జ్ఞానము కలుగును. అదేరీతి నీ నానావిధమగు సృష్టియందలి వివిధరచనా విశేషము దానిని జేసిన పరమేశ్వరుని సిద్ధింపజేయుచున్నది.

ప్రశ్నః- మొదట మనుష్యుడు సృష్టింపబడెనా? పృథివ్యాదులా?

ఉత్తరముః- పృథివ్యాదులు. ఏలయనగా బృథివ్యాదులు లేక మనుష్యునిస్థితియు, బాలనాదులు గలుగజాలవు.

ప్రశ్నః- సృష్ట్యాదియందు సృష్టింపబడినది యొక్కడా? అనేకులా?

ఉత్తరముః- అనేకులు. ఈశ్వరీయసృష్టియందుత్పన్నులగుటకుదగిన కర్మముగల జీవులనే యీశ్వరుడు సృష్ట్యాది యందు బుట్టించుచున్నాడు.

**మనుష్యా ఋషయశ్చ యే తతో మనుష్యా అజాయంత. (యజు. ౩౧.౯)**

ఇది యజుర్వేదవచనము. ఈ ప్రమాణముచే నాదియందనేకులు వందలకొది, వేలకొలది, మనుష్య లుత్పన్నులయిరని నిశ్చయమగుచున్నది. సృష్టియందు జూచినను మనుష్యులు పెక్కురు తల్లి దండ్రుల సంతానమని తేటపడుచున్నది. (అనగా సృష్టిలోని మానవులు సృష్ట్యాది యందు భగవంతునిచే నమైథునసృష్టిద్వారా పుట్టింపబడిన స్త్రీపురుషుల నుండి వచ్చిన సంతానపరంపరగా బోధపడుచున్నది.)

ప్రశ్నః- సృష్ట్యాదియందు మనుష్యాదులు బాల్యావస్థయందు సృష్టింపబడిరా? యువావస్థయందా? వృద్ధావస్థయందా? లేక మూడవస్థల యందునా?

ఉత్తరముః- యువావస్థయందు. ఏలయనగా - బాలురనుగా నుత్పన్నము చేసియున్న వారిని బాలించుటకు నితరమనుష్యులు యావశ్యకత యుండియుండును. వృద్ధులనుగా నుత్పన్నము చేసిన మైథున సృష్టి కలుగ కుండెడిది. కాబట్టి యువావస్థయందే సృష్టింపబడిరి.

ప్రశ్నః- సృష్టికి బ్రారంభ మెన్నడేని యున్నదా, లేదా?

ఉత్తరముః- లేదు. ఎట్లు దినమునకు ముందు రాత్రియు, రాత్రికి ముందు దినమును, దినమునకు బిమ్మట రాత్రియు, రాత్రికి బిమ్మట దినమును గ్రమముగా వచ్చుచున్నవో యదేరీతిని సృష్టికి బూర్వము ప్రలయమును, బ్రలయమునకు బూర్వము సృష్టియు ననాదికాలమునుండి చక్రముగ దిరుగుచున్నవి. దీని కాదిగాని, యంతముకాని లేదు. ఇక దినమునకుగాని రాత్రికిగాని యారంభమును, నంతమును గోచరమగు చున్నట్లు ప్రతిసృష్టికి బ్రలయమునకు నాదియు నంతమును గలుగుచుండును. పరమేశ్వరుడు, జీవుడు, జగత్తున కుపాదానకారణమగు ప్రకృతియు నను నీమూడును స్వరూపముచే ననాదులయినట్లే జగదుత్పత్తి, స్థితి, ప్రలయమును బ్రవాహముచే ననాదులు. నదీ ప్రవాహముకూడ నట్లే కనబడుచుండును. ఒకప్పుడు నది యెండిపోవును. మఱియొకప్పుడు కనబడదు. మరల వానకాలములో గనబడును. ఎండ కాలములో గనబడదు. ఇట్లొకప్పుడు కనబడుచు నొకప్పుడు కనబడకయు నుండు వ్యవహారములను బ్రవాహరూపములని తెలియవలయును. పరమేశ్వరుని గుణకర్మస్వభావములనాదియయిన ట్లతనిచే జగదుత్పత్తిస్థితిలయములును ననాదీయములు. ఈశ్వరుని గుణకర్మ స్వభావముల కెన్నడు నారంభమును, నంతమును, లేనియట్టు లతనికర్తవ్యములగు కర్మములకును నారంభమును నంతమును లేదు.

ప్రశ్నః- ఈశ్వరు డెన్నియో జీవులకు మనుష్యజన్మమును, నెన్నియో జీవులకు సింహాదిక్రూర మృగముల జన్మమును, నెన్నియో జీవులకు జింక, ఆవు, మొదలగు పశువుల జన్మమును, నెన్నియో జీవులకు వృక్షాదులయు, గ్రిమికీటపతంగాదులయు జన్మమును నిచ్చియున్నాడు. దీనిచే బరమాత్మయందు బక్షపాతము సంభవించుచున్నది.

ఉత్తరముః- పూర్వసృష్టియం దాజీవులు చేసిన కర్మానుసారము వ్యవస్థ చేసియున్నందున బక్షపాతము సంభవింపదు. ఏలయన గర్మము లేకయే జన్మమిచ్చియున్న బక్షపాత మగును.

ప్రశ్నః- ఈ సృష్ట్యాదియందు మనుష్య లేస్థలమందు సృష్టింపబడిరి?

ఉత్తరము:- త్రివిష్టపము. ఇప్పుడు టిబెట్టని చెప్పబడు దేశమందు.

ప్రశ్న:- సృష్ట్యాది యందుండినది యొకజాతియా? అనేక జాతులా?

ఉత్తరము:- మనుష్య జాతియొక్కటే కాని, పిదప 'విజానీహ్యార్యాన్యేచ దస్యవః' అను ఋగ్వేదవచనముచే శ్రేష్ఠులకు నార్యులు, విద్వాంసులు, దేవులు ననియు, దుష్టులకు దస్యులు, దొంగలు, మూర్ఖులు ననియు నామము కలిగి యార్యులు, దస్యులు నను రెండు భేదము లయ్యెను. 'ఉత శూద్ర ఉతార్యే' ఇది అథర్వవేదవచనము. ఆర్యులయందు బూర్వము చెప్పబడినట్లు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని నాలుగు భేదము లేర్పడెను. ద్విజులగు విద్వాంసులకు నార్యులనియు, మూర్ఖులకు శూద్రులు, ననార్యులు - తెలివిలేనివారు నని పేర్లు.

ప్రశ్న- మఱి వారెట్టు లిక్కడకు వచ్చిరి?

ఉత్తరము:- వారియందు నార్యులకును, దస్యులకును - విద్వాంసులనెడు దేవతలకును నవిద్వాంసులనెడు నసురులకును సదా కలహములు కాదొడగెను. మిక్కిలి యుపద్రవము కాసాగినపు డార్యులు సమస్త భూగోళమం దీభూభాగ ముత్తమమని తెలిసి యిక్కడికి వచ్చి వసించిరి. కాబట్టి యీదేశమునకు నార్యావర్తమను పేరు కలిగెను.

ప్రశ్న:- ఆర్యావర్తపుటవధి యెంతవఱకు?

ఉత్తరము:-

> ఆ సముద్రాత్తు వై పూర్వాదాసముద్రాత్తు పశ్చిమాత్,
> తయోరేవాంతరం గిర్యోరార్యావర్తం విదుర్బుధాః. (౧)
> సరస్వతీ దృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరమ్,
> తం దేవనిర్మితం దేశమార్యావర్తం ప్రచక్షతే. (మను. ౨.౨౨, ౧౭)

ఉత్తరమందు హిమాలయము, దక్షిణమందు వింధ్యాచలము, పూర్వపశ్చిమముల యందు సముద్రము, పశ్చిమమందు సరస్వతి-అటక్ నది, (ఇదియుత్తర పర్వతమందుబుట్టి దక్షిణసముద్రపు టఖాతమందు గలియుచున్నది.) తూర్పుదిక్కున బ్రహ్మపుత్రయని పిలువబడు దృషద్వతీనది (ఇది నేపాళపు బూర్వభాగమందలి కొండనుండి వెడలి బంగాళ, అస్సాములకు బూర్వమునను, బ్రహ్మదేశమునకు బశ్చిమమునను బ్రవహించి దక్షిణముగా బాఱి సముద్రమందు జేరును.) ఈ రెంటికి నడుమనుండు నదియు, హిమాలయపు మధ్యరేఖనుండి దక్షిణమున బర్వతముల నడిమి ప్రదేశమును, వింధ్యా, రామేశ్వరముల నడిమి ప్రదేశమును, నివన్నియును గలిసిన దేశమునకు నార్యావర్తమని పేరు. ఇక్కడ దేవతలు - విద్వాంసులను నార్యులు వసించిరి. కాబట్టి దీనికి ఆర్యావర్తమని పేరు కలిగెను.

ప్రశ్న:- అంతకు మునుపీదేశమునకు బేరేమి? ఇక్కడ నెవరు వసించుచుండిరి?

ఉత్తరము:- అంతకు మునుపీదేశమున కేపేరును లేదు. ఆర్యులకు బూర్వమీదేశమం దెవరును లేరు. ఏలయనగా నార్యులాది సృష్టియందు గొంతకాలమునకు బిమ్మట టిబెట్టునుండి తిన్నగ నీదేశమందువచ్చి వసించిరి.

ప్రశ్న:- వీరు 'ఇరాను' దేశమునుండి వచ్చుటచే నార్యులన బడినారనియు, వీరికి బూర్వమిక్కడ నడవిమనుష్యులు వసించుచుండిరనియు, తమ్ము దేవతలని చెప్పుకొను చుండిరనియు, వారిరువురకు గలిగిన సంగ్రామములకు దేవాసురసంగ్రామము లను కథలు కల్పింపబడెననియు గొందఱు చెప్పుచున్నారు. ఇది నిజమా?

ఉత్తరము:- ఇది సర్వథా యసత్యము. ఏలయనగా -

విజానీహ్యార్యాన్యే చ దస్యవో బర్హిష్మతే రంధయా శాసదవ్రతాన్. (ఋ. ౧.౫౧.౮)
ఉత శూద్ర ఉతార్యే. (అథర్వ. కాం. ౧౯.సూ.౬౨. మం. ౧)

ధార్మికులు, విద్వాంసులు, నాప్తపురుషులు నగువారికి నార్యులనియు, వీరికంటె భిన్నులగువారికి దస్యులు - అనగా దొంగలు, దుష్టులు, అధార్మికులు, అవిద్వాంసులనియు, బ్రహ్మక్షత్రియవైశ్య లను ద్విజులకు నార్యులనియు, శూద్రులకు ననార్యులనియు బేళ్ళని యింతకు మునుపే వ్రాయ బడినది. వేదమిట్లు చెప్పునపు డితరవిదేశీయుల కపోలకల్పనములను బుద్ధిమంతులెన్నడును నమ్మజాలరు. ఆర్యావర్తీయులగు - అర్జునుడు, దశరథుడు మొదలగువారు, హిమాలయపర్వత ప్రాంతములం దార్యులకును, దస్యులను నసురమ్లేచ్ఛులకును, జరిగిన యుద్ధమందు (దేవాసుర సంగ్రామమందు) దేవతలను నార్యులను రక్షించుటకును, అసురుల నోడించుటకును సహాయకులైరి. దానివలన నార్యావర్తమునకు వెలుపల నాలుగువైపులందు ననగా హిమాలయమునకు బూర్వ ఆగ్నేయ, దక్షిణ, నైఋత, పశ్చిమ, వాయవ్య ఉత్తర, ఈశాన్య దేశములందు, వసించు మనుష్యులే యసురులని సిద్ధమగుచున్నది. ఏలయనగా హిమాలయ ప్రదేశమందుండు నార్యులమీద మ్లేచ్ఛులు దండెత్తివచ్చినపుడెల్ల యిక్కడి మహారాజులందఱు నాయుత్తర దేశమందలి యార్యులకు సహాయకు లగుచుండిరి. దక్షిణదేశమందు శ్రీ రామచంద్రునితో జరిగిన యుద్ధము దేవాసురసంగ్రామము కాదు. రామరావణసంగ్రామము, ఆర్యరాక్షస సంగ్రామమని చెప్ప నొప్పును. ఆర్యులు 'ఇరాన్' దేశమునుండి వచ్చి యిక్కడి యడవి మనుష్యులతో గలహించి జయమును బొంది వారిని దఱిమి యీదేశమునకు రాజులయిరని యేసంస్కృత గ్రంథమందును లేక చరిత్ర యందును లేదు. ఇట్లుండగా విదేశీయుల వ్రాతలెట్లు माననీయములు కాగలవు? ఇదియును గాక -

ఆర్యవాచో మ్లేచ్ఛ వాచః సర్వే తే దస్యవః స్మృతాః. (మను. ౧౦—౪౫)
మ్లేచ్ఛ దేశస్త్వతః పరః (మను. ౨—౨౩)

ఆర్యావర్త దేశమునకంటె భిన్నదేశములు దస్యుదేశములనియు, మ్లేచ్ఛదేశములనియు జెప్ప బడును. దీనివలన నార్యావర్తమునకంటె భిన్నమగు పూర్వదేశము మొదలుకొని, ఈశాన్య, ఉత్తర, వాయవ్య, పశ్చిమ దేశములందుండు వారికి దస్యులు, మ్లేచ్ఛులు, నసురులనియు, నైఋత, దక్షిణ, ఆగ్నేయ దిశలయందలి యార్యావర్తమునకంటె భిన్నములయిన దేశములందుండు మనుష్యులకు రాక్షసులనియు బేళ్ళని దీనింబట్టియు సిద్ధమగుచున్నది. ఇప్పుడును జూడుడు. హబ్శీ-నీగ్రోల స్వరూప మసురులవలె భయంకరముగా గనబడుచున్నది. ఆర్యావర్తమునకు సరిగా కాళ్ళవైపునుండు దేశమునకు బాతాళమని పేరు. ఏలయనగా నాదేశ మార్యావర్తీయులకుదిన్నగ బాదములక్రింద నున్నది. ఆ దేశస్థులు నాగులనబడుదురు. అచ్చట నాగవంశపు రాజులు రాజ్యమేలుచుండిరి.

ఆదేశపు రాజకన్యయగు 'ఉలూపిని' అర్జునుడు వివాహమాడెను. ఇక్ష్వాకువు మొదలు కౌరవపాండవుల వఱకు సమస్తభూగోళమం దార్యుల రాజ్యమునను, నార్యావర్తమునకంటె భిన్నదేశములయందు గొంతకొంత వేదప్రచారమును నుండెననుట స్పష్టము. బ్రహ్మకు బుత్రుడు విరాట్టు, విరాట్టునకు మనువు, మనువునకు మరీచి మొదలగు పదుగురు పుత్రులు కలిగిరి. వీరికి స్వాయంభువు మొదలగు నేడుగురు రాజులు పుట్టి రాజ్యమేలిరి. వారిసంతానమే 'ఇక్ష్వాకువు' మున్నగు రాజులు. వారే యార్యావర్తమందు రాజ్యమేలిన మొదటి రాజులు. ఇప్పుడు దౌర్భాగ్యోదయముచేతను, నార్యుల యాలస్యప్రమాద పరస్పర విరోధముల చేతను నన్యదేశముల మీద రాజ్యము చేయుమాట యటుండగా నార్యావర్తమందైన నార్యుల యఖండ, స్వతంత్ర, స్వాధీన నిర్భయ రాజ్య మీకాలమున లేదు. ఉన్నదియును విదేశీయుల పాదాక్రాంతమయినది. కొందఱు రాజులు మాత్రము స్వతంత్రులుగ నున్నారు. దుర్దినములు సంభవించునపుడు

దేశవాసు లనేకదుఃఖము లనుభవింప వలసివచ్చును.

(స్వరాజ్యమహత్త్వము)

ఎవరెంత చేసినను స్వదేశీయరాజ్యమే సర్వోపరి యుత్తమము. ఇక మత మతాంతరముల పట్టుదల లేనట్టియు, దనవారు పరవారను పక్షపాత రహితమ్మయినట్టియు, ప్రజలను దలిదండ్రులవలె గృపతో న్యాయముతో జూచునట్టిదియునైనను విదేశీయుల రాజ్యము పూర్ణసుఖదాయకము కానేరదు. కాని యాదేశమునందు. భిన్న భిన్న భాషలు వేఱువేఱు శిక్షణములు, పరస్పరవిరుద్ధ వ్యవహారములు దూర మగుట యతిదుష్కరము. ఇవి దూరము కానంతవఱకు పరస్పరోపకారము, నభిప్రాయసిద్ధియు గలుగుట కఠినము. కాబట్టి వేదాది శాస్త్రములందలి వ్యవస్థను, నితిహాసమును గౌరవించుట భద్రపురుషులకు గర్తవ్యము.

ప్రశ్నః- జగత్తుయొక్క యుత్పత్తిలో నెంత సమయము గడచినది?

ఉత్తరముః- జగదుత్పత్తియందును వేదముల ప్రకాశమునందును నూటతొంబదియాఱుకోట్ల కొన్ని లక్షల కొన్ని సహస్రముల వర్షముల సమయము గడచినది. దీని స్పష్టవ్యాఖ్యానము నాచేవ్రాయబడిన 'ఋగ్వేదాది భాష్యభూమికా' వేదోత్పత్తి విషయమున జూడుడు. సృష్టి నిర్మాణము చేయుటలోను సృష్టి యేర్పడుటలోను నిట్టి విధములున్నవి. అన్నింటికంటె సూక్ష్మమైనదానికి - విభజింపబడనేరని దానికి పరమాణువని పేరు. అట్టియఱువది పరమాణువులు కలసిన 'అణువగును.' రెండణువులు కలిసి ద్వ్యణుకము స్థూలవాయువగును. మూడు ద్వ్యణుకములు కలిసి యగ్ని, నాలుగు ద్వ్యణుకములు కలిసిజలము, అయిదు ద్వ్యణుకములు కలిసి పృథివి - అనగా మూడు ద్వ్యణుకము లొకత్రసరేణువు. అది రెండింత లయ్యేనేని పృథివి మొదలగు దృశ్యపదార్థము లేర్పడును. ఇట్టి క్రమ ముతో గలిపి భూగోళాదులను బరమేశ్వరుడు రచించెను.

(పృథివీధారణము)

ప్రశ్నః- ఎవరు పృథివిని ధరించుచున్నారు? కొందఱు సహస్ర ఫణములుకల శేషనామక సర్పముయొక్క శిరస్సులమీద పృథివి యున్నదందురు. రెండవ వారెద్దుకొమ్ములమీద నున్నదందురు. మూడవవారు దేనిపైనను లేదందురు. నాల్గవవారు వాయువునాధారమున నున్నదనియు, నైదవవారు సూర్యుని యాకర్షణమువలన నీడ్వబడి తనస్థానమునందున్నదనియు జెప్పుదురు. ఆఱవవారు పృథివి బరువైన దగుటవలన నాకాశమున గ్రింది క్రిందికి బోవుచున్నదనియు జెప్పుచున్నారు. వానిలో దేనిని సత్యమని యంగీకరింపవలయును?

ఉత్తరముః- శేషసర్పపు బడగలమీదను, నెద్దుకొమ్ములమీదను బృథివి ధరింపబడియున్నదని చెప్పు వారిని గూర్చి యీసర్పవృషభముల తల్లిదండ్రులు పుట్టినపుడు దేనిపై నుండెను? అట్లే సర్పము నెద్దు మొదలగునవి దేనిపై నుండెను? అని ప్రశ్నింపవలయును. ఎద్దుమీద నున్నదని చెప్పు ముసల్మానులేమో మాటలాడలేక యూరకుందురు. సర్పముమీద నున్నదనువారో సర్పము కూర్మము మీదను, కూర్మము నీటి మీదను, నీరగ్ని మీదను, నగ్ని వాయువు మీదను, వాయువాకాశమందు నున్నదని చెప్పుదురు. ఇవన్నియు దేనిమీద నున్నవని యడిగితిమేని పరమేశ్వరునిమీద నున్నవని తప్పక చెప్పుదురు. శేషవృష భము లెవరిబిడ్డలని యడిగితిమేని (వృషభమును గోవృషభముల బిడ్డయందురేమోకాని) శేషుడు కద్రూకశ్యపులబిడ్డయనియు, కశ్యపుడు మరీచి పుత్రుడనియు, మరీచి మనువుపుత్రుడనియు, మనువు విరాట్టు పుత్రుడనియు, విరాట్టు బ్రహ్మపుత్రుడనియు, బ్రహ్మ యాదిసృష్టి యందలివాడనియు జెప్పుదురు. శేషుడు జన్మింపకముందు నయిదుతరములు గడచినవే యప్పుడీపృథివి నెవరు ధరించి

యుండిరి? అప్పుడు దేనిపై నుండెను? అని యడిగితిమేని ముందు మాటాడదోచక జగడమాడ దొడగుదురు.

మిగిలియుండుదానికి శేషమని పేరు. అందువలననే యెవడో యొకకవి 'శేషాధారా పృథివీ' 'శేషుని యాధారమున బృథివి యున్నది ' యన మఱియొక డతని యభిప్రాయమును గ్రహింపక శేషుని మునకు సర్పమని మిథ్యాకల్పనము చేసినాడు. కాని పరమేశ్వరు డుత్పత్తి ప్రళయములకు పృథక్ - వేఱుగా మిగిలియుండును. అందువలన నాయీశ్వరునకు శేషుడని నామము కలిగినది. ఇదియే శేషపదము నకు నిజమైన యభిప్రాయము. పరమేశ్వరుని యాధారమున పృథివ్యాదిలోకము లున్నవని భావము.

సత్యేనోత్తభితా భూమిః. ఋ.౧౦-౮౫-౧.

సత్యమనగా త్రికాలాబాధ్యము - ఎన్నడు నాశము కానిది. అట్టి పరమేశ్వరుడే పృథివి, యాదిత్యుడు మున్నగు లోకముల నన్నింటిని ధరించియున్నాడు.

ఉక్షా దాధార పృథివీముత ద్యామ్. ఋ. ౧౦-౩౧-౮.

'ఇందలి ఉక్షా' శబ్దమును జూచి యెవడో యెద్దు - అనునర్థమును గ్రహించియుండును. ఎద్దునకును 'ఉక్షా' యను నామమున్నది. కాని యామూఢునకు నింతటి పెద్దభూగోళము నెద్దెట్లు ధారణము చేయగలదు? దానికంత సామర్థ్యము లేదే యని తోచలేదు. కావున వర్షముద్వారా భూగోళమును దడుపువాడు కావున సూర్యునకు 'ఉక్షా' యని నామము. సూర్యుడు తన యాకర్షణముతో భూమిని ధారణము చేయుచున్నాడు. కాని యట్టి సూర్యాదులను ధరించు శక్తి పరమేశ్వరునకు దప్ప మఱియొకని కెవ్వనికిని లేదు.

ప్రశ్నః- ఇంతింత పెద్దభూగోళములను బరమేశ్వరు డెట్లు ధారణము చేయుచుండవచ్చును?

ఉత్తరముః- అనంతాకాశము ముందీ భూగోళము లెంతవి? సముద్రమునెదుట చిన్న నీటిబిందువు లంతగూడ లేవు. అనంతపరమేశ్వరునెదుట నసంఖ్యాతలోకములుగూడ నొక్క పరమాణువంతగూడ గావు. అతడు లోపల వెలుపల నంతట నున్నాడు. 'విభుః ప్రజాసు' యజు. ౩౨-౮. ఆ పరమేశ్వరుడు సర్వప్రజలందును వ్యాపకుడై సర్వమునుధరించుచున్నాడు. క్రైస్తవులు, మహమ్మదీయులు, పౌరాణికులు చెప్పునట్లు పరమేశ్వరుడు విభువు కాకయున్న నీసృష్టి నెన్నడు ధరింపజాలకుండెడివాడు. వస్తువును బొందక యెవడును దేనిని ధారణము చేయజాలడు.

లోకములన్నియు బరస్పరాకర్షణమువలన ధారితములై యున్నవి, కావున బరమేశ్వరుని యపేక్ష యేమియుండును? అని యెవరేని పలికిన వారికీ సమాధాన మొసంగవలయును. ఈసృష్టి సాంతమా? అనంతమా? అనంతమందురేని యాకారముగల వస్తువనంత మెన్నడును గాజాలదు. సాంతమందురేని యాలోకముల పరభాగమున - సీమాంతమున మఱియొక లోకము పరమున లేనితావుననెవని యాకర్షణ ముచే ధారణముండును? సమష్టి, వ్యష్టి - యనగా సముదాయమునకు సమష్టియనియు, నొక్కొక్క దానికి వ్యష్టియనియు బేరు. సమస్త భూగోళములను సమష్టిగా లెక్కించి జగత్తనిన, నాసమస్తజగత్తును ధారణము - ఆకర్షణము చేయగలవాడు పరమేశ్వరుడు తక్క మఱియెవడుండును? కావున సమస్త జగత్తును ధారణముచేయు వాడతడే.

స దాధార పృథివీముత ద్యామ్. యజు. ౧౩-౪.

ప్రకాశరహితములగు పృథివ్యాదిలోకలోకాంతర పదార్థములను, ప్రకాశవంతములగు సూర్యాదిలోక ములను, నితర పదార్థములను రచించువాడు, ధరించువాడు పరమేశ్వరుడే. అతడన్నింటియందును వ్యాప కుడై యున్నాడు. అతడే సర్వజగత్తునకు గర్తయు ధర్తయును.

(భూభ్రమణము)

ప్రశ్నః- భూమ్యాదిలోకములు తిరుగుచున్నవా? లేక స్థిరములా?

ఉత్తరముః- తిరుగుచున్నవి.

ప్రశ్నః- సూర్యుడు తిరుగుచున్నాడు - భూమి స్థిరముగా నుండునని కొందఱు, కాదు, భూమియే తిరుగుచున్నది, సూర్యుడు స్థిరముగా నుండునని మఱికొందఱు జెప్పుదురు. ఇందేది సత్యమని యంగీకరింపవలయును?

ఉత్తరముః- ఈ యిరువురు సగము సత్యము చెప్పుచున్నారు. ఏలయన వేదమున నిట్లు వ్రాయబడి యున్నది.

ఆయం గౌః పృశ్నిరక్రమీదసదన్ మాతరం పురః,

పితరం చ ప్రయన్త్స్వః. యజు ౩-౬.

అనగా నీ భూగోళము నీటితోగూడి సూర్యునకు నలువైపుల దిరుగుచున్నది. కావున భూమి తిరుగుననుట సత్యము.

ఆకృష్ణేన రజసా వర్తమానో, నివేశయన్నమృతం మర్త్యం చ,

హిరణ్యయేన సవితా రథేనాదేవో యాతి భువనాని పశ్యన్. యజు. ౩౩-౪౩.

సవితా = వర్షాదులకు గర్తయగు సూర్యుడు, ప్రకాశస్వరూపుడు, తేజోయముడు, రమణీయస్వరూపముతో నుండువాడు, సమస్తములైన ప్రాణి యప్రాణి పదార్థములందు నమృతరూపవృష్టిని లేక కిరణము లద్వారా యమృతమును బ్రవేశింపజేయుచు, మూర్తిమంతములగు నెల్ల ద్రవ్యములను దర్శింపజేయుచు, సర్వలోకములతోబాటుగా నాకర్షణగుణయుక్తుడై వర్తించుచు దనపరిధియందు దిరుగుచుండును. కాని యేలోకము చుట్టును దిరుగడు?

ఇట్లే యొక్కొక్క బ్రహ్మాండమున నొక్కసూర్యుడు ప్రకాశకుడు, నితరసర్వలోకలోకాంతరములు ప్రకాశ్యములునై యుండును.

దివి సోమో అధిశ్రితః. అథర్వ. ౧౪-౧-౧.

ఈ చంద్రలోకము సూర్యునిచే బ్రకాశితమగుచున్నట్లు పృథివ్యాది లోకములుకూడ సూర్యుని ప్రకాశముచేతనే ప్రకాశితము లగుచున్నవి. కాని, రాత్రిందినము లెల్లపుడు నుండును. ఏలయనగా బృథివ్యాదిలోకములు తిరుగుచు నెంతభాగము సూర్యునకెదురుగా నుండునో యంతభాగమున దినము, సూర్యునకెదురుగానున్న భాగమునకు వెనుకవైపుననున్న భాగమున రాత్రి యగును. అనగా ఉదయము, అస్తమయము, సంధ్యా, మధ్యాహ్నము, మధ్యరాత్రి మున్నగు కాలావయవములు దేశదేశాంతరములం దెప్పుడునుండును. అనగా నార్యావర్తమున సూర్యోదయమైనపుడు పాతాళమున - అమెరికాలో నస్తమయము జరుగును. ఆర్యావర్తమున నస్తమయము జరుగుచున్నపుడమెరికాలో నుదయము నగును. ఆర్యావర్తమున మధ్యదినము, మధ్యరాత్రియైనపుడు పాతాలదేశమున మధ్యరాత్రి, మధ్యదినము నగును.

'సూర్యుడు తిరుగును, పృథివి తిరుగుటలేదు' అని యనువారెల్లరు నజ్ఞులు. ఏలయన వారు చెప్పునది సత్యముగునేని, యెన్నియో సహస్ర వర్షముల పర్యంతము దినము, అట్లే రాత్రియు నగును. సూర్యుడు బ్రధ్ననాముడు, పృథివికంటె లక్షలరెట్లు పెద్దది. కోట్ల క్రోశముల దూరమున నున్నది. ఆవగింజచుట్టు పర్వతము తిరుగజొచ్చిన బహుకాలము పట్టును. పర్వతముచుట్టు నావగింజ తిరుగజొచ్చిన నెక్కువసమయము పట్టదు. అట్లే పృథివి సూర్యునిచుట్టు దిరిగినందున దగినట్లు దినరాత్రు లేర్పడును. సూర్యుడు తిరిగిన నట్లు కాదు. సూర్యుడు స్థిరుడని చెప్పువారును జ్యోతిర్విద్యావిదులు కారు.

కారణమేమన గురుపదార్థము లాకాశమున దిరుగకున్న నియతస్థానమున నెన్నడు నుండజాలవు. (కావున సూర్యుడును దనయక్షమున దానెల్లపుడు దిరుగుచునే యుండును.)

పృథివి తిరుగదు. కాని క్రింది క్రిందికి గ్రమముగా బడిపోవుచున్నదని జైనులు చెప్పుదురు. ఇంతేకాక యిద్దఱు సూర్యులు నిద్దఱు చంద్రులు జంబూద్వీపమున మాత్రమే నున్నారనియు నందురు. కాని, వారు భంగుమత్తులో నిమగ్నులై యున్నారనవలయును. ఏలయనగా, భూమి తిరుగక క్రిందికి గ్రమముగా బడిపోవుచున్నచో బృథివికి జుట్టు వాయుచక్రమేర్పడక భూమి ఛిన్నభిన్నము కావలసియున్నది. నిమ్న స్థలములలో నుండువారికి వాయుస్పర్శ ముండదు; క్రిందివారికి నధికమగును. వాయువు గతియు నొక్కటిగా నుండును. ఇద్దఱు సూర్యులు, నిద్దఱు చంద్రులు నున్నపక్షమున రాత్రులు, కృష్ణపక్షము కలుగక నష్టభ్రష్టమగును. కావున నొకభూమికి సమీపమున నొకచంద్రుడో యనేక చంద్రులో యుండును. అనేక భూముల మధ్య నొకసూర్యుడు నుండును.

ప్రశ్నః– సూర్యుడు, చంద్రుడు, నక్షత్రము లనునీవస్తువులేమిటి? వానిలో మనుష్యాది సృష్టి యుండునా? ఉండదా?

ఉత్తరముః– సమస్త భూగోళలోకములందును మనుష్యాది ప్రజయుండును. ఏలయనగా -

ఏతేషు హీదం సర్వం వసు హితమేతే హీదం సర్వం వాసయన్తే,

తద్యదిదం సర్వం వాసయంతే తస్మాత్ వసవ ఇతి. శత. ౧౪–౬–౯–౪.

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, చంద్రుడు, నక్షత్రములు, సూర్యుడు ననునివి వసువులు. వీనియందు సర్వపదార్థములు, బ్రజయు వసించును. ఇవియే యన్నింటిని వసింపజేయును. కావుననే వీనికి వసువులని పేరు. పృథివికి సమానములైనందున సూర్యచంద్రనక్షత్రములు వసువులనబడుచున్నవి. కావున బృథివిలోవలె వీనియందును బ్రజలుండుటలో సందేహమెందులకు? పరమేశ్వరుని యీచిన్నలోకమైన పృథివిలో మనుష్యాదిసృష్టి నిండియున్నపుడు తక్కినలోకములన్నియు శూన్యములుగా నుండునా? పరమేశ్వరుని యేకార్యమును బ్రయోజనము లేనిదిగా నుండదు. ఈ యసంఖ్యాకములగు లోకములందు మనుష్యాదిసృష్టి లేకున్న సఫలము లెట్లగును? కావున సర్వత్ర మనుష్యాదిసృష్టి యున్నది.

ప్రశ్నః– ఈలోకమున మనుష్యాదిసృష్టికి నాకారము నవయవము లెట్టులున్నవో యట్లే యన్యలోకముల నుండునా? విపరీతముగా నుండునా?

ఉత్తరముః– కొంత యాకృతిలో భేదముండుట సంభవము. ఈ లోకముననే చైనా, ఆఫ్రికా, ఆర్యావర్తము, ఐరోపా మున్నగు దేశములలో నుండువారిలో రంగు, రూపము, ఆకృతి మున్నగువానిలో గొంచెము కొంచెము భేదము కనిపించుచున్నట్లు లోకలోకాంతరములలో భేదము లుండవచ్చును. కాని యేజాతి కెట్టి సృష్టి యీదేశముననున్నదో యట్టి జాతికి సంబంధించినసృష్టి యితర లోకములందును నుండును. ఈలోకమున బ్రాణుల కేయేప్రదేశమున నేత్రాద్యంగములెట్లున్నవో యట్లే యితరలోకములందును నాయాజాతికి జెందిన ప్రాణులయవయవము లాయా ప్రదేశములందే యుండును. కారణమేమన –

సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్,

దివం చ పృథివీం చాంతరిక్షమథో స్వః. (ఋ.౧౦–౧౯౦–౩)

ధాతా = పరమేశ్వరుడు పూర్వకల్పమున నెట్టి సూర్యుని, చంద్రుని, దివమును, భూమిని నంతరిక్షమును నట సుఖవిశేషమును సృష్టించెనో యట్లే యీకల్పమునందునను సృష్టించెను. అట్లే

లోకలోకాంతరములందును సృష్టి జేసెను. భేదము కొంచెము నుండదు.

ప్రశ్నః- ఈ లోకమున నేవేదములు ప్రకాశితములైనవో యితర లోకములందును నవియే ప్రకాశితములైనవా? ఇతరములా?

ఉత్తరముః- ఆవేదములే ప్రకాశితములగును. ఒకరాజుయొక్క రాజనీతివ్యవస్థయన్ని ప్రాంతములందును సమానమైనట్లు రాజరాజేశ్వరుడైన పరమేశ్వరుని వేదోక్తనీతి తన సృష్టిరూపరాజ్యములందన్నింటిలోను నొక్కటిగా నుండును.

ప్రశ్నః- జీవులు, ప్రకృతిస్థ తత్త్వములు ననాదులు. ఈశ్వర నిర్మితములు కానవు డీశ్వరుని యధికారమును వీనిపై నుండరాదు. కారణమేమన నన్నియు స్వతంత్రములేకదా!

ఉత్తరముః- రాజు ప్రజలు సమకాలికులైనను రాజుయొక్క యధికారము ప్రజలపై నుండును. అట్లే జీవులు, జడపదార్థములు పరమేశ్వరుని యధీనముననే యుండును. పరమేశ్వరుడు సర్వసృష్టికర్త. జీవులకు గర్మఫలముల నొసంగి యందఱను దగినట్లు రక్షించువాడు, అనంత సామర్థ్యవంతుడును. కావున నల్పసామర్థ్యముగల జీవులు జడపదార్థములు నతని యధీనమున నేలయుండవు? కాబట్టి జీవులు కర్మముల నొనర్చుటలో స్వతంత్రులు, గర్మఫలముల ననుభవించుటలో నీశ్వరునివ్యవస్థకు లోబడి పరతంత్రులగుదురు. అట్లే యీశ్వరుడు సర్వశక్తిమంతుడై సమస్త విశ్వముయొక్క సృష్టిస్థితిలయము లొనర్చుచుండును.

ఇకముందు, విద్య, అవిద్య, బంధమోక్షములు ననువిషయములు వ్రాయబడును. అష్టమసముల్లాసము పూర్ణమైనది.

**శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును**
**సుభాషా విభూషితమునగు సత్యార్థ ప్రకాశమున**
**సృష్ట్యుత్పత్తి స్థితిప్రళయ విషయములుగల**
**అష్టమ సముల్లాసము సంపూర్ణము.**

# నవమ సముల్లాసము

(విద్యావిద్యలు, బంధమోక్షములు వ్యాఖ్యానింపబడును.)

**విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ం సహ,**

**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే. (యజు. ౪౦—౧౪)**

విద్య, యవిద్యయను నీరెంటి స్వరూపమును దోడ్తో నెఱిగిన మనుష్యుడు - అవిద్య - అనగా గర్మోపాసనవలన మృత్యువును దరించి, విద్య - యథార్థజ్ఞానమువలన మోక్షమును బొందును.

అవిద్యాలక్షణము :-

అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా. (యో.ద.సా.సూ. ౫)

అనిత్యమగు సంసారమునందు, శరీరాదులందును నిత్యములు - కనివిని యెఱుగు కార్యజగత్తెల్లప్పుడుండుననియు, యోగబలమున దేవతల శరీరమెల్లపుడు నుండుననెడి విపరీతబుద్ధి కలిగియుండుట యవిద్యలో బ్రథమభాగము. అశుచి = అనగా మలమయమగు స్త్రీమున్నగువారి శరీరము అందును, చౌర్యము, మిథ్యాభాషణము మున్నగు నపవిత్ర విషయములందు బవిత్రబుద్ధినుంచుటయు నవిద్యలో రెండవ భాగము. అత్యంత విషయ సేవన రూపదుఃఖమునందు సుఖబుద్ధి నుంచుట యవిద్యలో మూడవ భాగము. అనాత్మయైన దానియందు నాత్మబుద్ధి నుంచుట యవిద్యలో నాల్గవభాగము. ఈ నాలుగు విధములగు విపరీతజ్ఞానము 'అవిద్య' యనబడును.

(విద్య లక్షణము)

దీనికి విపరీతముగ - అనిత్యము ననిత్యమనియు, అపవిత్రము నపవిత్రమనియు, దుఃఖమును దుఃఖమనియు, సుఖమును సుఖమనియు, అనాత్మ ననాత్మయనియు, ఆత్మనాత్మయనియు దెలిసికొనుట విద్యయనబడును. అనగా

**వేత్తి యథావత్ తత్త్వపదార్థస్వరూపం యయా సా విద్యా. యయా**

**తత్త్వస్వరూపం న జానాతి భ్రమాదన్యస్మిన్నన్యన్నిశ్చినోతి యయా సాఽవిద్యా.**

దేనిమూలమున బదార్థముల యథార్థస్వరూపము బోధపడునో యది విద్య. దేనిమూలమున తత్త్వస్వరూపము తెలియదో యన్యమున నన్యబుద్ధి కలుగునో యది యవిద్య యనబడును.

మంత్రమునగల యవిద్యాశబ్దమున కర్థము కర్మ, ఉపాసన. ఇయ్యది బాహ్యము నాభ్యంతరమునగు కర్మవిశేషమునకు నామము. జ్ఞానవిశేషముకాదు. అందువలననే శుద్ధకర్మములు, పరమేశ్వరుని నుపాసన చేయక మృత్యుదుఃఖమునుండి తప్పించుకొనలేడని మంత్రమున జెప్పబడినది. అనగా బవిత్ర కర్మము, పవిత్రోపాసన, పవిత్రజ్ఞానమువలన ముక్తియు, నపవిత్రమిథ్యాభాషణాదికర్మలు, పాషాణమూర్తి మున్నగు వానియుపాసన, మిథ్యాజ్ఞానము ననువానివలన బంధము కలుగును. ఏమనుష్యుడును క్షణమాత్రము కూడ గర్మ, ఉపాసనా, జ్ఞానరహితుడు కాడు. కావున ధర్మయుక్తసత్యభాషణాది కర్మములు చేయుట, మిథ్యాభాషణాద్యధర్మకర్మములను విడుచుటయే ముక్తికి సాధనము.

(నవీనవేదాంతమతసమీక్ష)

ప్రశ్నః- ముక్తి యెవనికి లభింపదు?

ఉః- బద్ధుడైన వానికి.

ప్రః- బద్ధుడెవడు?

ఉః- అధర్మమున, నజ్ఞానమున జిక్కుపడిన జీవుడు.

ప్రశః- బంధమోక్షములు స్వభావమువలన గలుగునా? నిమిత్తము వలననా?

ఉః– నిమిత్తము వలన. ఏలయనగా స్వభావమువలన గలుగునెడల బంధమోక్షములకు నివృత్తి యెన్నడును గలుగదు.

ప్రశ్నః– న నిరోధో న చోత్పత్తిర్ న బద్ధో న చ సాధకః,
న ముముక్షుర్ న వై ముక్తిరిత్యేషా పరమార్థతా. (౨-౩౨)

ఈ శ్లోకము మాండూక్యముమీద గౌడపాదుని కారిక. జీవుడు బ్రహ్మమగుటవలన జీవునకు నిరోధము లేదు. అనగా నెన్నడు నావరణమునందు రాడు – జన్మమునెత్తడు. అతనికి బంధములేదు. అతడు సాధకుడును గాడు. అనగా గొంచెమైనను సాధనము చేయడు. అతడు విడివడుటను గోరడు. ఇతనికి ముక్తియు లేదు. ఎందువలన ననగా బరమార్థమున బంధమే లేనపుడు ముక్తి యేమి?

ఉత్తరముః– నవీనవేదాంతుల యీకథనము సత్యము కాదు. కారణమేమన జీవుని స్వరూప మల్ప మగుటవలన నావరణమునందు వచ్చును. శరీరముతోబాటు ప్రకటమగుటయను జన్మమెత్తును. పాపరూప కర్మముల ఫలముల ననుభవించుట యను బంధనమున బడును. దానినుండి విడివడుటకు సాధనము చేయును. దుఃఖమునుండి విడివడుటకు గోరును. దుఃఖములనుండి వేఱై పరమానందస్వరూపుడగు పరమేశ్వరుని బొందును. ముక్తిసుఖము ననుభవించును.

(ఆత్మనిర్లేపత్వఖండనము)

ప్రశ్నః– ఈధర్మములన్నియు దేహమునకు నంతఃకరణమునకు సంబంధించినవియే కాని జీవునివి కావు. జీవుడు పాప – పుణ్యరహితుడు, సాక్షి మాత్రుడును. శీతోష్ణాదులు శరీరధర్మములు ఆత్మనిర్లేపము.

ఉత్తః– దేహము, నంతఃకరణము జడములు. వానికి శీతోష్ణప్రాప్తి కాని భోగముకాని లేదు. చేతనము – మనుష్యాది ప్రాణి స్పృశించును. ఆ ప్రాణికే శీతోష్ణములభానము (జ్ఞానము), భోగము కలుగును. ప్రాణములును జడములే. వానికి నాకలి దప్పికలు లేవు; కాని ప్రాణములుగల జీవునకే యాకలిదప్పికలు కలుగును. అట్లే మనస్సుకూడ జడమే. దానికి హర్షశోకములు గలుగవు. కాని, మనస్సుద్వారా హర్షశోకము లను, సుఖదుఃఖములను జీవు డనుభవించును. బాహ్యకరణములైన శ్రోత్రాదీంద్రియములతో మంచి, చెడు, శబ్దాదివిషయములను గ్రహించి జీవుడు సుఖియో దుఃఖియో యగును. అట్లే యంతఃకరణము – మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారముతో సంకల్పవికల్పములు, నిశ్చయము, స్మరణము, అభిమానము చేయుజీవుడు దండనమునకో, గౌరవమునకో భాగి యగుచున్నాడు.

ఖడ్గముతో జంపువాడు దండనమునకు బాత్రుడై ఖడ్గము దండన పాత్రము కానట్లు దేహము, నింద్రియములు, నంతఃకరణము, ప్రాణములు ననుసాధనములతో మంచిచెడుకర్మములు చేయుజీవుడు సుఖదుఃఖముల ననుభవించువాడగును. జీవుడు కర్మములకు స్వామికాడు. అతడు కర్తయు భోక్తయు నైయున్నాడు. కర్మములకు సాక్షి యద్వితీయుడగు పరమాత్మయేకాని జీవుడు కాడు. కర్మములను జేయువాడు జీవుడు. అతడే కర్మములచే లిప్తుడగును. సాక్షియైన యీశ్వరుడు కర్మలిప్తుడుకాడు.

(జీవుడు బ్రహ్మప్రతిబింబము కాదు)

ప్రశ్నః– జీవుడు బ్రహ్మమునకు బ్రతిబింబము. దర్పణము పగిలిన బింబమున కేమియు హాని కలుగ నట్లుగా నంతఃకరణోపాధి యుండువఱకే యంతఃకరణమున బ్రహ్మప్రతిబింబమనెడి జీవుడుండును. అంతఃకరణము నష్టమయినప్పుడు జీవుడు ముక్తుడగును.

ఉత్తరముః– ఇది పసితనపుమాట. ఆకారము గలిగిన వస్తువు ప్రతిబింబము సాకారమునం దేర్పడును. అనగా నాకారముకలదాని యందేర్పడును. దేనిప్రతిబింబము దేనియందు గలుగునో యవిరెండును వేఱుగ నుండవలయును. అనగా నొకదానిలో నొకటి యుండరాదు. ఆకారముగల ముఖము నద్దము నివి వేఱు

వేఱుగ (ఒకదానికొకటి దూరముగ) నుండుటవలననే ప్రతిబింబ మేర్పడుచున్నది. వేఱుగ నుండనియెడల ప్రతిబింబము కలుగజాలదు. బ్రహ్మ నిరాకారుడును సర్వవ్యాపకుడు నగుటచే నతనిప్రతిబింబమే సిద్ధింపదు.

ప్రశ్న:- చూడుడు. లోతుగల స్వచ్ఛమైన జలమందు నిరాకారము వ్యాపకమునగు నాకాశము యొక్క యాభాస కలుగుచున్నట్లే, స్వచ్ఛమైన యంతఃకరణమందు బరమాత్మాభాస కలుగుచున్నది. దీనికే చిదాభాసమనిపేరు.

ఉత్తరము:- ఇది బాలబుద్ధిగలవాని మిథ్యాప్రలాపము. ఏలయనగా నా ఆకాశము దృశ్యమే కానపుడు దాని నెవడేనియు గంటితో నెట్లు చూడలగడు?

ప్రశ్న:- పైన నీలముగను, ధూమ్రముగను గనబడునది యాకాశము కాదా?

ఉత్తరము:- కాదు.

ప్రశ్న:- మఱి యదేమి?

ఉత్తరము:- వేఱువేఱుగ బృథివీజలాగ్నుల త్రసరేణువు లగపడుచున్నవి. అందు నీలముగ గనబడునది వర్షించునట్టి యధిక జలభాగము. బూడిదరంగువలె గనబడుధూమ్రము భూమినుండి పైకెగిరి వాయువునందు దిరుగుచుండు ధూళి. దాని ప్రతిబింబమే నీళ్ళయందు గాని, యద్దమందుగాని కనబడునది. ఆకాశ ప్రతిబింబ మెన్నటికిని గాదు.

ప్రశ్న:- ఘటాకాశము, మఠాకాశము, మేఘాకాశము, మహదాకాశము నను భేదములు వ్యవహారమందున్నట్లే బ్రహ్మాండము, అంతఃకరణము నను నుపాధులభేదముచే బ్రహ్మమునకు జీవుడు, నీశ్వరుడు నను నామములు గలుగును. ఘటాదులు నష్టమైనపుడు మహాకాశమే యనబడును.

ఉత్తరము:- ఇదియు నవిద్వాంసుల మాటయే. ఏలయనగా నాకాశ మెన్నడును ఛిన్నభిన్నము గాదు. వ్యవహారమందుగూడ 'ఘటమును దెమ్ము' మొదలగు వాక్యములు ప్రయోగింపబడునే కాని ఘటాకాశమును దెమ్మని యెవ్వరు ననరు. కాబట్టి యీమాటయు సరికాదు.

ప్రశ్న:- సముద్రమధ్యమందు జేపలును బురుగులును, నాకాశమధ్యమందు బక్షులు మొదలగు నవియు దిరుగునట్లు చిదాకాశబ్రహ్మమందు నంతఃకరణము లన్నియు దిరుగుచుండును. అవి స్వయముగా జడములేకాని సర్వవ్యాపకుడగు పరమాత్మని సత్తాచేత నగ్నితో గూడిన లోహములవలె జేతనము లగుచున్నవి. అవి చలించుచు దిరుగుచు నున్నను నాకాశము, బ్రహ్మము నిశ్చలములై యున్నట్లే జీవుని బ్రహ్మమని నమ్ముటచే దోషమేమియు గలుగదు గద?

ఉత్తరము:- ఈ నీదృష్టాంతమును సత్యము కాదు. ఏలయనగా సర్వవ్యాపియగు బ్రహ్మ మంతఃకరణములందు బ్రకాశమానుడై జీవుడగునేని సర్వజ్ఞత్వాదిగుణము లతనిలో నుండునా? ఉండవా? ఆవరణముండుటచేత సర్వజ్ఞత యుండదందువేని, బ్రహ్మమావృతమై ఖండితమగునా? లేక యఖండితమా? అఖండితమందువేని మధ్యలో నెవరును దెర వేయజాలరు. పరదా లేనపుడు సర్వజ్ఞత యేల యుండదు. తన స్వరూపమును మఱచి యంతఃకరణముతోబాటు గదలుచుండున ట్లుండునేగాని స్వరూపముతో గదలదందువేని, స్వయముగా బ్రహ్మముకదలనపు డంతఃకరణమెంతెంత పూర్వప్రాప్త దేశమును వదలునో, మఱియు ముందుముందు నెక్కడెక్కడకు జరుగుచు బోవునో యక్కడక్కడ బ్రహ్మము భ్రాంతము, నజ్ఞానియు నగుచు బోవును. ఏయేప్రదేశములు విడువబడునో యాయాస్థలముల బ్రహ్మము జ్ఞానియు, బవిత్రుడై ముక్తుడగుచుండును. ఈ విధముగ నంతట సృష్టియందలి బ్రహ్మమును నంతఃకరణములు చెడగొట్టును. బంధమోక్షములును క్షణక్షణములో గలుగుచుండును. నీవు చెప్పిన

ప్రమాణమునుబట్టి యట్లుజరిగిన నేజీవునకును బూర్వము చూచినది వినినది స్మరణమునకు రాకుండును. ఏలయన నే(బహ్మము చూచెనో యది లేదు. కాబట్టి జీవుడు బ్రహ్మముకాని, బ్రహ్మము జీవుడుగాని యెన్నటికిని నొక్కటికారు. సర్వదా వేఱువేఱుగ నుందురు.

ప్రశ్నః– ఇదంతయు నధ్యారోపమే. అధ్యారోపమనగా నొక వస్తువునందు మఱియొకవస్తువు నారోపించుట. అట్లే బ్రహ్మమను వస్తువునందు జగత్తును దానివ్యవహారమును నధ్యారోపముచేసి జిజ్ఞాసువునకు బోధింపనగును. వాస్తవమందంతయు బ్రహ్మమే.

(సిద్ధాంతి) అధ్యారోపము చేయువాడెవడు?

(నవీన వేదాంతి) జీవుడు.

(సిద్ధాంతి) ఎవనిని జీవుడందురు?

(నవీన వేదాంతి) అంతఃకరణావచ్ఛిన్న చేతనమును.

(సిద్ధాంతి) అంతఃకరణావచ్ఛిన్న చేతన మా(బహ్మమేనా? మఱియొకటియా?

(నవీన వేదాంతి) ఆ(బహ్మమే.

(సిద్ధాంతి) ఏమి? బ్రహ్మమే తనలో జగత్తునకు సంబంధించిన యబద్ధపుగల్పన చేసికొన్నదా?

(నవీన వేదాంతి) అవును. బ్రహ్మమునకు దీనిచే నేమిహాని.

(సిద్ధాంతి) మిథ్యాకల్పనలు చేయువా డసత్యవాది కాడా?

(నవీన వేదాంతి) కాడు. మనస్సుచేతను, వాక్కుచేతను గల్పింపబడినది, చెప్పబడినది యంతయు నసత్యమే.

(సిద్ధాంతి) అట్లేని మనస్సు చేతను, వాక్కుచేతను మిథ్యాకల్పనలుచేసి మిథ్యలను జెప్పు బ్రహ్మము కల్పితుడును, మిథ్యావాదియు నయ్యెనా? లేదా?

(నవీన వేదాంతి) అవును. అది మాకు నిష్టాపత్తియే.

(సిద్ధాంతి) వహ్వారే! అసత్యవేదాంతులారా! మీరు సత్యస్వరూపుడును, సత్యకాముడును, సత్యసంకల్పుడును నగుపరమాత్మను మిథ్యావాదిగా జేసివేసితిరే? ఏమి? ఇది మీదుర్గతికి గారణముకాదా? పరమేశ్వరుడు మిథ్యావాది, మిథ్యాసంకల్పుడని యేయుపనిషత్తునం, దేసూత్రమందు, నేవేదమునందు వ్రాయబడియున్నది? మీమాట 'దొంగ కొత్వాలును దండించెను.' అన్నట్లున్నది. కొత్వాలు దొంగను దండించుట యుచితముకాని, దొంగ కొత్వాలును దండించుట విపరీతము. అట్లే మీరును మిథ్యాసంకల్పులును, మిథ్యావాదులునయి, యా మీదోషమును బ్రహ్మమందు వ్యర్థముగా నారోపించుచున్నారు. బ్రహ్మ మిథ్యాజ్ఞానియు, మిథ్యావాదియు, మిథ్యాకారియు నయ్యెనేని యనంత(బహ్మమంతయు నట్లేయయి పోవును. ఏలయనగా నత డేకరసుడు, సత్యస్వరూపుడు, సత్యమాని, సత్యవాది, సత్యకారియై యున్నాడు. కావున నీదోషములన్నియు మీవేకాని బ్రహ్మవి కావు. మీరు దేనిని విద్యయందురో యదియే యవిద్య. మీ యధ్యారోపముకూడ మిథ్యయే. ఏలయనగా దాము బ్రహ్మముకానిది తమ్ము బ్రహ్మ మనియు, బ్రహ్మను జీవుడనియు నమ్ముట యిది మిథ్యాజ్ఞానముకాక మఱి యేమగును? సర్వవ్యాపకుడగువాడు పరిచ్ఛిన్నుడు నజ్ఞానియై బంధమున నెన్నడును బడడు. ఏలయనగా నజ్ఞాని, పరిచ్ఛిన్నుడును, నేకదేశియు, నల్పుడును, జీవుడగును. సర్వజ్ఞుడు సర్వవ్యాపియు నగు(బహ్మకాడు.

(ఇక ముక్తిని బంధనమును వర్ణించుచున్నాము)

ప్రశ్నః– దేనిని ముక్తి యందురు?

ఉత్తరముః–'ముంచంతి పృథగ్భవంతి జనా యస్యాం సా ముక్తిః' దేనియందు విడుదల కలుగునో

దానికి ముక్తి యని పేరు.

ప్రశ్నః- దేనినుండి విడుదల?

ఉత్తరముః- దేనినుండి విడివడుటకు జీవులందఱు నిచ్ఛగించుచున్నారో దానినుండి.

ప్రశ్నః- దేనినుండి విడివడుట కిచ్ఛగించుచున్నారు?

ఉత్తరముః-దేనినుండి తొలగ గోరుదురో దానినుండి.

ప్రశ్నః- దేనినుండి తొలగగోరుచున్నారు?

ఉత్తరముః- దుఃఖమునుండి.

ప్రశ్నః- తొలగి దేనిని బొందుదురు? ఎక్కడ నుందురు?

ఉత్తరముః- సుఖమునుబొంది బ్రహ్మయందుందురు.

ప్రశ్నః- ముక్తిగాని, బంధముగాని యే యే విషయములవలన గలుగును?

ఉత్తరముః- పరమేశ్వరుని యాజ్ఞను బాలించుట, అధర్మావిద్యాదుస్సంగ కుసంస్కార, దుష్టవ్యసనములనుండి దూరముగనుండుట, సత్యభాషణము, పరోపకారము, విద్య, పక్షపాతరహిత న్యాయాచరణము, ధర్మము వీనిని వృద్ధిపఱచుట, పూర్వోక్త ప్రకారము పరమేశ్వరుని స్తుతి, ప్రార్థనోపాసనలను ననగా యోగాభ్యానముచేయుట, విద్యను జదువుట చదివించుట, ధర్మపూర్వకముగ బురుషార్థము చేయుచు జ్ఞానము నున్నతి పఱచుకొనుట, యన్నిటికంటె నుత్తమసాధనములను జేయుట, చేయున దంతయు బక్షపాతము లేకుండ న్యాయధర్మానుసారముగ జేయుట, యీ మొదలగు సాధనములచే ముక్తియు, దీనికి విపరీతముగ ననగా నీశ్వరాజ్ఞాభంగము చేయుట మొదలగువానిచే బంధమును గలుగును.

ప్రశ్నః- ముక్తియందు జీవుడు లయమైపోవునా? లేక విద్యమానుడై యుండునా?

ఉత్తరముః- విద్యమానుడయి యుండును.

ప్రశ్నః- ఎచ్చట నుండును?

ఉత్తరముః- బ్రహ్మయందు.

ప్రశ్నః- బ్రహ్మ యెక్కడనున్నాడు? ఆముక్తజీవు డొకస్థల మందుండునా? లేక స్వేచ్ఛాచారి యయి సర్వత్ర సంచరించునా?

ఉత్తరముః- బ్రహ్మ యంతట బూర్ణుడయి యున్నాడు. అతనియందే ముక్తజీవు డవ్యాహతగతితో సంచరించును. అనగా నెక్కడను నాటంకము లేక విజ్ఞానానందపూర్వకముగ స్వతంత్రుడై సంచరించును.

ప్రశ్నః- ముక్తజీవునకు స్థూలశరీరముండునా? ఉండదా?

ఉత్తరముః- ఉండదు.

ప్రశ్నః- మఱి యతడెట్లు సుఖము, నానందము ననుభవించును?

ఉత్తరముః- అతనికి సత్యసంకల్పము మొదలగు స్వాభావికగుణము లనెడిసామర్థ్యము లన్నియు నుండును. భౌతిక సంబంధ ముండదు.

శృణ్వన్ శ్రోత్రం భవతి, స్పర్శయన్ త్వగ్భవతి, పశ్యన్ చక్షుర్భవతి, రసయన్
రసనా భవతి, జిఘ్రన్ ఘ్రాణం భవతి, మన్వానో మనో భవతి, బోధయన్
బుద్ధిర్భవతి, చేతయంశ్చిత్తం భవత్యహంకుర్వాణో ఽహంకారో భవతి.

(శతపథ. కాం. ౧౪-౨-౨-౧౫)

మోక్షమందు భౌతికశరీరముకాని, యింద్రియముల గోళకములుకాని జీవాత్మతో నుండవు. తన స్వాభావిక శుద్ధగుణములే యుండును. తన స్వశక్తిచే వినవలసినపుడు శ్రోత్రరూపుడును, స్పృశింపవలసి

నపుడు త్వగ్రూపుడును, చూడవలసినపుడు చక్షూరూపుడును, రుచిచూడవలసినపుడు రసనారూపుడును, వాసనచూడవలసినపుడు ఘ్రాణరూపుడును, సంకల్పవికల్ప సమయమందు మనోరూపుడును, నిశ్చయింపవలసినపుడు బుద్ధిరూపుడును, స్మరింపవలసినపుడు చిత్తరూపుడును, అహంకారము చేయవలసినపుడు అహంకారరూపుడును నగుచున్నాడు. ముక్తియందు సంకల్ప మాత్ర శరీరముండును. శరీరాధారమందుండి యింద్రియగోళములద్వారా జీవుడు స్వకార్యములను జేయునట్లే ముక్తియందు దనశక్తిచే సమస్తానందముల ననుభవించును.

ప్రశ్న:- అతనిశక్తి యెంత? అది యెన్ని విధములు?

ఉత్తరము:- ముఖ్యముగా నొకేవిధమైన శక్తి కలదు. కాని బల, పరాక్రమ, ఆకర్షణ, ప్రేరణ, గతి, భీషణ, వివేచన, క్రియా ఉత్సాహ, స్మరణ, నిశ్చయ, ఇచ్ఛా, ప్రేమ, ద్వేష, సంయోగ, విభాగ, సంయోజక, విభాజక, శ్రవణ, స్పర్శన, దర్శన, స్వాదన, గంధ, గ్రహణజ్ఞానములను నిరువదినాల్గు విధములైన సామర్థ్యముతో జీవుడు కూడియుండును. దీనిచే ముక్తియం దానందము ననుభవించును. ముక్తియందు జీవుడు లయమైన ముక్తిసుఖము నెవడనుభవించును? జీవుని నాశమునే ముక్తియనువారు మహామూఢులు. దుఃఖమునుండి విడివిడి యానందస్వరూపుడును, సర్వవ్యాపకుడు, ననంతుడు నగుపరమేశ్వరునియందు జీవుడానందముతో నుండుటయే జీవునకు ముక్తి. ఈ విషయమై వేదాంతమందలి శారీరక సూత్రములందు జూడుడు:-

అభావం బాదరిరాహహ్యేవమ్ (వేదాంత. ద. ౪-౪-౧౦)

వ్యాసుని తండ్రి పరాశరుడు ముక్తియందు జీవునియు, నతనితో మనస్సుయొక్క భావము నంగీకరించుచున్నాడు. అనగా జీవమనస్సుల లయమును పరాశరు డంగీకరింపడు. (కాని యితరేంద్రియములయు శరీరముయొక్కయు నభావముండునని యంగీకరించును.) అట్లే -

భావం జైమినిర్వికల్పామననాత్. (వేదాంత. ద. ౪-౪-౧౧)

జైమిన్యాచార్యుడు ముక్తపురుషునకు మనస్సువలెనే సూక్ష్మశరీరమును, నింద్రియములును, ప్రాణాదులునుకూడ విద్యమానములై యుండునని నమ్ముచున్నాడు. అభావము నొప్పడు.

ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽతః. (వేదాంత. ద. ౪-౪-౧౨)

వ్యాసముని ముక్తియందు భావాభావములను రెంటిని నంగీకరించుచున్నాడు. అనగా జీవుడు ముక్తియందు శుద్ధసామర్థ్యముతో గూడియుండుననియు, నపవిత్రత, పాపాచరణము, దుఃఖము, నజ్ఞానము మున్నగునవి యుండవనియు నంగీకరించుచున్నాడు.

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ
బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిమ్. (కఠ. ౨.౩.౧౦)

శుద్ధ మనస్సుతో గూడి పంచజ్ఞానేంద్రియములు జీవునితో నుండి బుద్ధి నిశ్చయము స్థిరమయినపుడు దానిని పరమగతి - మోక్షమందురు.

య ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యుర్ విశోకో విజిఘత్సోఽపిపాసః
సత్యకామః సత్యసంకల్పః సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః సర్వాంశ్చ
లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్ యస్తమాత్మాన మనువిద్య విజానాతీతి.

(ఛాందోగ్య. ౮-౭-౧) (౧)

స వా ఏష ఏతేన దైవేన చక్షుషా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే । య
ఏతే బ్రహ్మలోకే తం వా ఏతం దేవా ఆత్మానముపాసతే తస్మాత్తేషాగ్ం సర్వే

చ లోకా ఆప్తాః సర్వే చ కామా స సర్వాగ్ంశ్చ లోకానాప్నోతి సర్వాగ్ంశ్చ
కామాన్ యస్తమాత్మానమనువిద్య విజానాతీతి. (ఛాందోగ్య. ౮.౧౨, ౫-౬) (౨)
మఘవన్ మర్త్యం వా ఇదగ్ం శరీరమాత్తం మృత్యునా తదస్యాఽమృతస్యా
శరీరస్యాత్మనోఽధిష్ఠానమాత్తో వై సశరీరః ప్రియాప్రియాభ్యాం న వై
సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిరస్త్యశరీరం వావ సంతం న
ప్రియాప్రియే స్పృశతః ॥ (ఛాందోగ్య. ౮.౧౨.౧) (౩)

అపహతపాప్ముడు, సమస్తపాప, జరా, మృత్యు, శోక, క్షుధా, పిపాసరహితుడు, సత్యకాముడు, సత్యసంకల్పుడునైన పరమాత్ముని వెదకి యతనినే యెఱుగఁగోరవలయును. పరమాత్మను దెలిసికొని మోక్షసాధనములను, దనను శుద్ధపఱచుకొనుట నెఱిగిన ముక్తజీవుడు పరమాత్ముని సంబంధముతో సర్వలోకములను, సర్వకామములను బొందును. (౧)

ముక్తినిబొందిన యాజీవుడు శుద్ధదివ్యనేత్రములతోను, శుద్ధమనస్సుతోను, గామములనుజూచుచు, బొందుచు, రమించును. ఎవరు బ్రహ్మలోకమందు, ననగా దర్శనీయ పరమాత్మయందు స్థితులై మోక్షసుఖము ననుభవింతురో సర్వాంతర్యామియగు నాపరమాత్మను, ముక్తినిబొంద నేవిద్వాంసులందఱు నుపాసింతురో వారి కాయుపాసనవలన సమస్త లోకములు, సర్వకామములును బ్రాప్తించును. అనగా నేయే సంకల్పముల జేయుచున్నారో యాయా లోకములను నాయా కామములను బొందుదురు. మఱియు నాముక్తజీవులు స్థూలశరీరమును వదలి సంకల్పమయ శరీరముతో నాకాశమున బరమేశ్వరునియందు విహరింతురు. ఏలయన శరీరవంతులు సాంసారికదుఃఖములనుండి విడివడజాలరు. (౨)

దీనినిగూర్చి ప్రజాపతి యింద్రునకు జెప్పినదేమనగాః- ఓ పరమపూజితుడవు, ధనయుక్తుడవు నగుపురుషుడా! ఈ స్థూలశరీరము మరణ ధర్మముతో గూడినది. సింహముఖమందు మేక యుండులాగున నీశరీరము మృత్యుముఖమం దున్నయది. ఈ శరీరము మరణమునకు, శరీర రహిత జీవాత్మకు నివాస స్థానము. కాబట్టి యీజీవుడు సర్వదా సుఖదుఃఖములచే నావరింపబడియుండును. ఏలయనగా శరీర సహితుడగు జీవుని సాంసారిక ప్రసన్నతకు నివృత్తియే యగును. కాని శరీరరహితుడగు ముక్తజీవుడు బ్రహ్మ యందుండును గాన నతనికి సాంసారిక సుఖదుఃఖము లంటనే యంటవు. సర్వదా యానందమందే యుండును. (౩)

(ముక్తినుండి తిరిగివచ్చుట)

ప్రశ్నః- జీవుడు ముక్తినిబొంది మరల జన్మమరణరూప బంధనమున నెన్నడైన బడునా లేదా? ఏలయన --

న చ పునరావర్తతే న చ పునరావర్తత ఇతి. ఛాం. ౮-౧౫-౧.
అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్. వే.ద. ౪-౪-౨౨.
యద్ గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ: గీత. ౧౫-౬.

ఇట్టి వచనములవలన దేనినుండి మరల సంసారమునకు దిరిగి యెన్నడు రారో యదియే ముక్తి యనిగదా తెలియుచున్నది.

ఉత్తరముః- ఇది సరికాదు. ఏలయన వేదమునం దీవిషయము నిషేధింప బడియున్నది.
కస్య నూనం కతమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ,
కో నో మహ్యా అదితయే పునర్దాత్ పితరం చ దృశేయమ్ మాతరం చ. (౧)

అగ్నేర్ వయం ప్రథమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ,
స నో మహ్యా అదితయే పునర్దాత్ పితరం చ దృశేయం మాతరం చ. (౨)

(ఋ. ౧.౨౪.౧, ౨)

ఇదానీమివ సర్వత్ర నాత్యంతోచ్ఛేదః. సాం. ౧–౧౬౦. (౩)

ప్రశ్నః– మేమెవరినామమును బవిత్రముగా నెఱుంగవలయును? సదా ప్రకాశస్వరూపుడు నాశ రహిత పదార్థముల మధ్య నంతట నుండువాడునైన యేదేవుడు మమ్ములను ముక్తి సుఖము ననుభవింపజేసి మరల నీసంసారమున జన్మనొసంగును? మఱియు దల్లిదండ్రుల దర్శనము కలిగించుదేవత యెవరు? (౧)

ఉత్తరముః– మేమీ స్వప్రకాశస్వరూపుడు ననాది సదా ముక్తుడునగు పరమాత్ముని నామము పవిత్రముగా నెఱుగుదుము. అతడే ముక్తిలో నానందము ననుభవింపజేసి మమ్ములను బృథివిలో మరల మాతాపితరుల సంబంధమువలన జన్మము నిచ్చి తల్లిదండ్రుల దర్శనము చేయించును. ఆపరమాత్మయే ముక్తివ్యవస్థ చేయును. అతడే యందఱకు స్వామి. (౨)

ఇప్పుడు బద్ధముక్తజీవులున్నట్లే యెల్లపుడు నుందురు. బంధమోక్షముల కత్యంతవిచ్ఛేద మెన్న డును గలుగదు. బంధముకాని ముక్తిగాని యెల్లపుడు నుండదు. (౩)

ప్రశ్నః– తదత్యంతవిమోక్షోఽపవర్గః. న్యా. ౮.౧.౨౨.
దుఃఖజన్మ ప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానానా ముత్తరోత్త రాపాయే
తదనంతరాపాయా దపవర్గః. (న్యా. సూ. ౧–౧–౨)

దుఃఖముల యత్యంత విచ్ఛేదమే ముక్తి యనబడును. మిథ్యాజ్ఞానము అవిద్య, లోభాదిదోషములు, విషయములు, దుష్టవ్యసనములందు బ్రవృత్తి, జన్మము, దుఃఖము, ననువీనిలో నుత్తరోత్తరము వదలిన బూర్వపూర్వము నివృత్తమగును. (అనగా మిథ్యాజ్ఞానము పోయిన దోషములు పోవును. అవి పోయిన బ్రవృత్తి పోవును. అది పోయిన జన్మము పోవును. అది పోయిన దుఃఖములు పోవునని యభిప్రాయము.) ఇట్లు దుఃఖనివృత్తివలన మోక్షము లభించును. అది యెల్లప్పుడుండును.

ఉత్తరముః– అత్యంతశబ్ద మత్యంతాభావమునకు వాచకమగుట యావశ్యకము కాదు. ఎట్లన – అత్యంతం దుఃఖమత్యంతం సుఖం వాస్య వర్తతే. ఈ మనుష్యునకు నెక్కువ దుఃఖము, నెక్కువ సుఖము నున్నది. అనువ్యవహారము లోకమున జూచుచున్నాము. దీనింబట్టి యత్యంతశబ్దమునకు 'బహు' అర్థమని తెలియనగును.

(ముక్తికాలము)

ప్రశ్నః– ముక్తినుండియు జీవుడు తిరిగివచ్చిన, నతడు ముక్తిలో నెంతకాలముండును?

ఉత్తరముః– తే బ్రహ్మలోకే హ పరాంతకాలే పరామృతాత్ పరిముచ్యన్తి సర్వే. (కైవల్య ఉ. ౧–౧.); (ముండక ౩.౨.౬)

ఇది ముండకోపనిషద్వచనము. ముక్తజీవులు ముక్తిని బొంది బ్రహ్మమునందు బరాంతకాలము వఱకు నానందము ననుభవించి మహాకల్పానంతరమున ముక్తిసుఖమును వదలి మరల సంసారమునకు వత్తురు.

నలుబదిమూడులక్షల యిరువదివేల సంవత్సరము లొకచతుర్యుగము. రెండువేల చతుర్యుగము లొకయహోరాత్రము. అట్టి యహోరాత్రములు ముప్పది యొకమాసము. పండ్రెండు మాసము లొకసంవత్సరము. ఇట్టి నూఱువత్సరము లొకపరాంతకాలమగును. ముక్తజీవు డింతకాలము ముక్తి

సుఖము ననుభవించును.

ప్రశ్న:- సమస్తలోకము, సర్వగ్రంథాలు ముక్తజీవుడు మరల జన్మమరణముల పరంపరకు రాడ నియేకదా యంగీకరించుచున్నారు?

ఉత్తరము:- ఇది యెన్నటికిని గాదు. ఏలయన మొదటిమాట, జీవుని సామర్థ్యము, శరీరాది పదార్థములు, సాధనములు నన్నియు బరిమితములు. మఱి వానిఫల మనంత మెట్లు కాగలదు? అనంతానందము ననుభవించుటకు నసీమసామర్థ్యము, నసీమకర్మము, నసీమసాధనములు జీవునకు లేవు. కావున ననంతానందము ననుభవింపజాలడు. ఎవరి సాధనము లనిత్యములో వానిఫలము నిత్యమెన్నడు గాజాలదు. మఱియు ముక్తినుండి యెవరును దిరిగి యీ ప్రపంచమునకు రాకున్న ప్రపంచము ఛిన్నము కావలయును. ప్రపంచమున జీవులు నిశ్శేషులును గావలయును.

ప్రశ్న:- జీవులెందఱు ముక్తులగుదురో యందఱును గ్రొత్తజీవులను బరమేశ్వరుడు సృష్టించి జగత్తున నుంచును. కావున నిశ్శేషులు కారు.

ఉత్తరము:- అట్లంగీకరించిన జీవు లనిత్యులగుదురు. ఎవనికి నుత్పత్తి యుండునో యతనికి నాశము తప్పదు. ఇంతేకాక నీమతము ననుసరించి జీవుని ముక్తియు ననిత్యమగును. (జీవుడు నశించినచో, ముక్తి యనంతత కర్థమేమి?) ముక్తిలో గుంపులెక్కువయై దొమ్మి జరుగును. (ఇయ్యది పరిహాసముగా దోచుచున్నది) కారణమేమన నట నాగమనమే కాని వ్యయము లేదుకదా! కావున నట గలుగువృద్ధికి నంతముండదు.

మఱియు దుఃఖానుభవములేని సుఖము కొంచెము నుండజాలదు. చేదులేని మధురత కర్థమేమి? మాధుర్యము లేనినాడు కటురసమున కర్థముండదు. ఒక స్వాదురసమునకు విరుద్ధరస మున్నపుడే రెండింటి పరీక్ష జరుగవీలగును. ఎల్లపుడు నొక్క మధురపదార్థమునే తినువానికి షడ్రసోపేత భోజన మొనర్చువానికి గలుగుసుఖము లభింపదు.

జీవుడొనర్చు సాంతకర్మములకు బరమేశ్వరుడనంత ఫలమునొసంగిన నతని న్యాయమే నష్టమగును. ఎవడెంత బరువు మోయగలడో యంతబరువతనికెత్తుట బుద్ధిమంతుల పని. ఒక మణుగు బరువు మోయగలవాని శిరస్సుపై బదిమణుగుల బరువు నెత్తువాడు నిందాపాత్రుడగును. అట్లే యల్పజ్ఞుడు, నల్పసామర్థ్యము గలవాడునైన జీవున కనంతసుఖభారమును గలిగించుట యీశ్వరునకు సరికాదుగదా!

పరమేశ్వరుడు క్రొత్త జీవుల నుత్పన్నము చేయునెడల జీవుల నుత్పన్నము చేయుట కుపయోగించు సామగ్రి యొకనాడు నిశ్శేషము కాగలదు. ఎంత గొప్పధనాగారమైనను దానినుండి వ్యయమగుచు, ఆయము లేనిదగునెడల నొకనాడది దివాలా తీయక పోదుకదా! కావున జీవులు ముక్తిబొంది మరల యటనుండి తిరిగివచ్చుటయే తగినవ్యవస్థ యగుచున్నది. దండితులగు ప్రాణులు కొంతకాలము కారాగారమున నుండుట కంటె యావజ్జీవకారాగారమునుగాని, యురిశిక్షను గాని శ్రేష్ఠముగా నెంచెదరా? ముక్తి నుండి తిరిగి రానపుడు జన్మము కారాగారము వంటిదగును. ఇక భేదము కేవల మట గూలిచేయు నావశ్యక ముండదు. ఇక ముక్తిలో జీవుడు బ్రహ్మమున లయమగుట సముద్రమున మునిగి చచ్చుటయే యగును.

(జీవుడీశ్వరసదృశుడెన్నడు కాడు)

ప్రశ్న:- పరమేశ్వరుడు నిత్యముక్తుడు, పూర్ణసుఖియు నైనట్లు జీవుడుకూడ నిత్యముక్తుడు నిత్య సుఖియునైన నెట్టి దోషముండదు కదా?

ఉత్తరము:- పరమేశ్వరు డనంతస్వరూప సామర్థ్యగుణకర్మ స్వభావములు కలవాడు. కావున

నతడెన్నడు నవిద్యయందును, దుఃఖబంధనము నందును బడడు. జీవుడు ముక్తుడైనను శుద్ధస్వరూపుడు, నల్పజ్ఞుడు, పరిమిత గుణకర్మస్వభావములు కలవాడుగానే యుండును. అతడెన్నడు నీశ్వర సదృశుడు కాజాలడు.

(ముక్తి జన్మమరణము వంటిది కాదు)

ప్రశ్నః- అటులయిన ముక్తియు జన్మమరణసదృశమే యగును. కావున నందులకు శ్రమపడుట వ్యర్థము కాదా?

ఉత్తరముః- ముక్తి జన్మమరణసదృశము కాదు. కారణమేమన ముప్పదియాఱువేల (౩౬౦౦౦) పర్యాయములు సృష్టిప్రళయములు జరుగుట కెంతసమయము పట్టునో యంతకాలము ముక్తజీవుడు ముక్తియందు నానందము ననుభవించును. దుఃఖము లేశమాత్రము నుండదు. ఇది చిన్న విషయమా? నేడు భోజనము చేయుదుము. మఱునాడు మరల నాకలి యగును. మరల నందుల కేల యుపాయ మొనర్చు చున్నాము? ఆకలి దప్పికల కొఱకు, క్షుద్రములగు ధనము, రాజ్యము, ప్రతిష్ఠ స్త్రీ,సంతానము మున్నగు వాని కొఱకు నుపాయము లొనర్చుట యావశ్యకమైనపుడు ముక్తికొఱకేలచేయరు? మరణించుట తప్పకపోయినను జీవించుట కుపాయమొనర్చునట్లు ముక్తినుండి జన్మమునకు వచ్చినను ముక్తికొఱకు ప్రయత్నించుట యావశ్యకమే యగును.

ముక్తిసాధనములు (సాధనచతుష్టయము)

ప్రశ్నః- ముక్తికి సాధనములేవి?

ఉత్తరముః- కొన్ని సాధనములు పూర్వము వ్రాసితిమి. కాని విశేషోపాయము లిప్పుడు చెప్పుచు న్నాము. ముక్తిని గోరువాడు అనగా జీవన ముక్తుడు (ముముక్షువు) మిథ్యాభాషణాదులు, పాపకర్మములు, వాని ఫలము దుఃఖము, కావున వానిని వదలి సుఖరూపఫలము నొసంగు సత్యభాషణాది ధర్మకర్మము లవశ్యమొనరింపవలయును. దుఃఖమునుండి విడివడి సుఖము ననుభవింపగోరువా డధర్మమును వదలి ధర్మాచరణము తప్పక చేయవలయును. కారణమేమన, దుఃఖమునకు బాపాచరణము, సుఖమునకు ధర్మాచరణము మూలకారణము – ప్రథమస్థానము.

సత్పురుషుల సాంగత్యమువలన సత్యాసత్యములు, ధర్మాధర్మములు, గర్తవ్యాకర్తవ్యములు నిశ్చ యించి వానిని వేఱువేఱుగా నెఱుగవలయును. శరీరము – అనగా జీవపంచకోశములంగూర్చి వివేచింప వలయును.

పంచకోశములలో మొదటిది – అన్నమయము. చర్మము మొదలుకొని యెముకలవఱకు నుండు సముదాయము పృథివీమయము. అన్నమయకోశ మిదియే. రెండవది ప్రాణమయము. ఇందు బ్రాణము – శరీరములోపలనుండి నాసికద్వారా బయటికి పోవువాయువు. అపానము – వెలుపల నుండి లోనికి బోవునది. సమానము – నాభియందుండి రసమును శరీరమున నంతట జేర్చునది. ఉదానము – కంఠమున నుండి యన్నపానములను నడుపునది. బలపరాక్రమములు గలిగించునది. వ్యానము – దేనిమూలమున జీవుడు కర్మముల నాచరించునో యది. ఇవియన్నియు బ్రాణమయకోశము.

మనోమయముః- దీనియందు మనస్సుతోబాటు వాక్పాణిపాద పాయూపస్థ లనుపంచకర్మేం ద్రియము లుండును. విజ్ఞానమయముః- ఇందు బుద్ధి, చిత్తము, శ్రోత్ర త్వచా నేత్ర జిహ్వా ఘ్రాణము లనుజ్ఞానేంద్రియము లుండును. వీనితో జీవుడు జ్ఞానాదివ్యవహారముల నొనరించును. ఇక నైదవది ఆనంద మయకోశముః- ఇందు బ్రీతి, ప్రసన్నత, న్యూనానందము, నధికానందము, నానందమునకు నాధారమైన కారణరూప ప్రకృతియు నుండును. ఇవి యైదును బంచకోశము లనబడును. వీనితోనే జీవుడన్నివిధము

లగు కర్మములు నుపాసన, జ్ఞానాదివ్యవహారములు చేయుచుండును. త్రివిధావస్థలు :- ఒకటి జాగ్రదవస్థ, రెండది స్వప్నావస్థ, మూడవది సుషుప్త్యవస్థ. మూడు శరీరములు :- ఒకటి స్థూలము ఈకనబడునది. రెండవది - పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు, పంచసూక్ష్మ భూతములు - తన్మాత్రలు, మనస్సు, బుద్ధి యీపదునేడు తత్త్వముల సముదాయమే సూక్ష్మశరీరమనబడును. ఈ సూక్ష్మశరీరము జన్మమరణాదు లందును జీవుని వెంట నుండును. ఈ సూక్ష్మశరీరము రెండు విధములు. ఒకటి భౌతికము, రెండవది స్వాభావికము. అందు భౌతికము - సూక్ష్మ భూతముల యంశములతో సిద్ధమగును. స్వాభావికము జీవుని స్వాభావికగుణరూపము. ఈ రెండవది యభౌతికము. ఇది ముక్తి యందుండును. దీనితోనే జీవుడు ముక్తియందు సుఖము ననుభవించును. ఇక మూడవది - కారణశరీరము. దీనిలోనే సుషుప్తి - గాఢనిద్ర కలుగును. అది ప్రకృతి రూపమగుటవలన సర్వత్రవిభువు. ఎల్లజీవులకు నొక్కటియే. నాల్గవది తురీయ శరీరము. ఇందు సమాధివలన బరమాత్మని యానంద స్వరూపమున జీవులు మగ్నులగుదురు. ఈసమాధి సంస్కారజన్యశుద్ధ శరీరముయొక్క పరాక్రమము ముక్తియందును యథారీతిని జీవునకు సహాయకమగును.

ఈ కోశములు, అవస్థలు ననువానినుండి జీవుడు వేఱుగానున్నాడు. అవస్థలకంటె జీవుడు వేఱని యెల్లరకు దెలియును. ఏలయన మరణము సంభవించినపుడు జీవుడు పోయెనని యెల్లరు జెప్పుదురు. ఈ జీవుడే యన్నింటికి ప్రేరకుడు, నన్నింటిని ధరించువాడు, సాక్షి, కర్తయు, భోక్తయు ననబడును. జీవుడు కర్తయు, భోక్తయు గాడని చెప్పువా డజ్ఞాని, యవివేకి యని తెలిసికొనుము. ఏలయన :- జీవుడు లేని యీజడపదార్థముల కన్నింటికి సుఖదుఃఖభోగముకాని, పుణ్యాపాపముల కర్తృత్వముకాని యెన్నడు గలుగ జాలదు. కాని వీని సంబంధముతో జీవుడు పాపపుణ్యముల కర్తయు, సుఖదుఃఖముల భోక్తయు నగుచున్నాడు.

ఇంద్రియము లర్థములతోను, మనస్సింద్రియములతోను, ఆత్మ మనస్సుతోను సంయుక్తమైన ప్పుడు జీవుడు ప్రాణములను బ్రేరేపించి, మంచి చెడు కర్మలలో లగ్నము చేయును. అప్పుడే యతడు బహిర్ముఖుడగును. ఆసమయముననే లోపలనుండి మంచికర్మములలో నానందోత్సాహములు, నిర్భ యత, చెడుకర్మములందు భయశంకాలజ్జాదు లుత్పన్నము లగును. అదియే యంతర్యామియగు పరమా త్ముని శిక్షణము. ఈ శిక్షణమున కనుకూలముగా వర్తించువాడే ముక్తిజన్యసుఖములను బొందును. విపరీ తముగా నడుచువాడు బంధజన్యదుఃఖముల ననుభవించును.

ఇట్లు పృథివి మొదలు పరమేశ్వరునివఱకు నుండు పదార్థముల గుణకర్మస్వభావములను దెలిసి కొని, పరమేశ్వరుని యాజ్ఞలను బాలించుటలోను, నతని నుపాసించుటలోను దత్పరుడైయుండి, యందులకు విరుద్ధముగా నడువక సృష్టివలన లాభము బొందుట వివేకమనబడును. (ఇది ముక్తికి ప్రథమ సాధనము.)

(ద్వితీయసాధనము)

రెండసాధనము వైరాగ్యము :- వివేకమువలన సత్యాసత్యములు వేఱువేఱుగా దెలిసికొని సత్యాచర ణము గ్రహించుట, యసత్యాచరణమును త్యజించుటయే వైరాగ్యము.

(మూడవసాధనము)

తదుపరి మూడవసాధనము - షట్కసంపత్తి :- అనగా నాఱువిధములగు కర్మముల నాచరించుట. ఒకటి శమము. తనయాత్మను, నంతఃకరణమును నధర్మాచరణమునుండి తొలగించి ధర్మాచరణమున నెల్లప్పుడు బ్రవృత్తము చేయుట.

రెండవది – దమము:– శ్రోత్రాదీంద్రియములను శరీరమును వ్యభిచారాది దుష్కర్మములనుండి వేఱుగానుంచి, జితేంద్రియత్వాది శుభకర్మలందు లగ్నముచేయుట. మూడవది – ఉపరతి :– దుష్టకర్మములనొనర్చు పురుషులనుండి యెల్లపుడు దూరముగా నుండుట. నాల్గవది – తితిక్ష. నిందాస్తుతులు, హాని లాభము లెంతగా ప్రాప్తించినను హర్షశోకాదులకు లోనుగాక ముక్తిసాధనములం దెల్లపుడు దగుల్కొని యుండుట. ఐదవది – శ్రద్ధ :– వేదాది సత్యశాస్త్రములందును, వానిజ్ఞానముతో బూర్ణులు, నాప్తులు, విద్వాంసులు సత్యోపదేష్టలు నగు మహాశయుల వచనములందు విశ్వాస ముంచుట. ఆఱవది – సమాధానము :– చిత్తైకాగ్రత. ఈయాఱును గలిసి మూడవసాధనము.

(ముక్తికి నాల్గవసాధనము)

నాల్గవసాధనము ముముక్షుత్వము :– ఆకలిదప్పికలచే బీడితుడగు వ్యక్తికి నన్నపానములుతక్క మఱియేదియు రుచింపనట్లు, ముక్తి, ముక్తి సాధనములందు దప్ప యితరవస్తువులందు బ్రీతిలేకుండుట ముముక్షుత్వ మనబడును. ఈనాలుగు సాధనచతుష్టయ మనబడును.

(అనుబంధచతుష్టయము)

నాలుగనుబంధములు సాధనముల తదుపరి చేయదగిన కర్మములు.

మొదటిది – అధికారి :– ఉపర్యుక్త నాలుగు సాధనములతో గూడిన వ్యక్తి మోక్షమునకు నధికారి యగును.

రెండవది – సంబంధము :– బ్రహ్మప్రాప్తిరూప ముక్తి ప్రతిపాద్యమనియు, వేదశాస్త్రములు ప్రతిపాదకములనియు బాగుగ దెలిసికొని యన్వితముచేయుట.

మూడవది – 'విషయీ' :– సర్వశాస్త్రములకు బ్రతిపాదన విషయము బ్రహ్మము. ఆ బ్రహ్మప్రాప్తిరూప విషయముగల పురుషునకు 'విషయి' యనిపేరు.

నాల్గవది – ప్రయోజనము :– సర్వదుఃఖనివృత్తి, పరమానందమును బొంది ముక్తి సుఖముకలుగుట అను నీ నాల్గును 'అనుబంధచతుష్టయ' మనబడును.

(శ్రవణచతుష్టయము)

తదుపరి శ్రవణచతుష్టయము. అందు మొదటిది – శ్రవణము – విద్వాంసు డుపదేశించునపుడు శాంతుడై ధ్యానముతో వినుట. విశేషించి బ్రహ్మవిద్యను గూర్చి వినునపుడు మిక్కిలి ధ్యానముతో విననలయును. అన్ని విద్యలలో నిది సూక్ష్మవిద్య.

రెండవది – మననము :– ఏకాంతదేశమున గూర్చుండి వినినదానిని గూర్చి విచారించుట, వినిన విషయమున నేదేనిసందేహము కలిగిన మరల నడిగి తెలిసికొనవలయును. వినునప్పుడే వక్తయు, శ్రోతయు నుచితమని యెంచినచో నడిగి సమాధానము పొందవలయును.

మూడవది – నిదిధ్యాసనము :– శ్రవణమననములవలన గొండొక విషయము నిస్సందిగ్ధమైనపు డేకాగ్రచిత్తుడై యదివినినట్లును, విచారించినట్లు నున్నదా లేదా యని ధ్యానయోగముతో దెలిసికొనవలయును.

నాల్గవది – సాక్షాత్కారము :– పదార్థముయొక్క స్వరూపము, గుణములు, స్వభావము నెట్లున్నవో యట్లే యథాతథముగా నెఱుగుట. ఈ నాల్గును శ్రవణచతుష్టయ మనబడును.

తమోగుణములు – అనగా క్రోధము, మాలిన్యము, ఆలస్యము, ప్రమాదము మొదలగువాని నుండియు, రజోగుణములు – అనగా, ఈర్ష్య, ద్వేష, కామ, అభిమాన, విక్షేపాది దోషములనుండియు దొలగి సత్త్వరూపములు – అనగా, శాంత – ప్రకృతి, పవిత్రత, విద్య – ఆలోచనము, మొదలుగాగల గుణ

ములు వహింపవలయును. (మైత్రి) సుఖముగా నున్నవారియందు మిత్రత్వము, (కరుణ) దుఃఖితులగు వారిమీద దయ, (ముదిత) పుణ్యాత్ములజూచి సంతోషించుట, (ఉపేక్ష) దుష్టాత్ములయందు ప్రీతికాని వైరముగాని లేకుండుట.

ముముక్షువు ప్రతిదినము కనీసము రెండుగంటల సమయము తన లోపలి మనస్సు మున్నగు పదార్థములను సాక్షాత్కారము చేసికొనుటకు ధ్యానమవశ్యము చేయవలయును. చూడుడు. మనము చేతనస్వరూపులము. అందువలననే జ్ఞానస్వరూపులము. మఱియు మనస్సునకు సాక్షిగా నున్నాము. ఏలయనగా మనస్సు శాంతము, చంచలము, నానందితము, విషాదయుక్తము నైనప్పుడు దానిని యథారీతిని జూచుచున్నాము. అట్లే యింద్రియములను ప్రాణాదులను దెలియువాడును, పూర్వము చూచినదానిని స్మరించువాడును, నొకకాలమున ననేకపదార్థముల నెఱుగువాడును, ధారణాకర్షణ కర్తయునగు జీవుడు శరీరాదుల కన్నిటికంటె వేఱుగా నున్నాడు. అట్లు వేఱుగా నుండకున్న స్వతంత్రకర్తయై వీనికి ప్రేరకుడును, నధిష్ఠాతయు నెన్నటికిని గాజాలడు.

అవిద్యాఽస్మితా రాగద్వేషాభినివేశాః పంచక్లేశాః.(యోగశాస్త్ర. పాద ౨. సూ.౩)

వీనిలో నవిద్యాస్వరూపము పూర్వమే చెప్పబడినది. వేఱుగా నుండు బుద్ధిని, నాత్మనుండి వేఱుగా దెలిసికొనకుండుట - అస్మిత యనబడును. సుఖమున ప్రీతికి రాగము, దుఃఖమున నప్రీతికి ద్వేషము నని పేర్లు. 'నేనెల్లప్పుడు శరీరస్థుడనై యుందునుగాక! చావకుందునుగాక!' అనుకోరిక సర్వప్రాణులకు నెల్లపుడుండును. ఈకోరికయు, మృత్యుదుఃఖమువలన గలుగుభయము - అభినివేశ మనబడును. యోగాభ్యాసము, విజ్ఞానము వలన నీపంచక్లేశములను విడిపించుకొని బ్రహ్మమును బొంది పరమమగు మోక్షానందము ననుభవింపవలయును.

(ఇతర ముక్తుల సమాలోచనము)

ప్రశ్నః- మీరు నమ్ము ముక్తివలె నితరులెవ్వరు నమ్మరు. చూడుడు! జైనులు - శివపురికిబోయి యందు మోక్షశిలపై నూరక కూర్చుండుటయు, క్రైస్తవులు - నాల్గవయాకాశమును జేరి యచ్చట వివాహము, జగడము, నాట, పాట, వస్త్రాదులధారణము మొదలగువానిచే నానందము నొందుటయు, ముసల్మానులు - ఏడవయాకాశమును, వామమార్గులు - శ్రీపురమును, శైవులు - కైలాసమును, వైష్ణవులు - వైకుంఠమును, గోకులపు గోసాయులు - గోలోకాదులను జేరి యచట నుత్తమస్త్రీలను, నన్నపాన వస్త్రస్థానాదులను బొంది యానందము నొందుటను 'ముక్తి' యని నమ్ముచున్నారు. పౌరాణికులు (సాలోక్యము) ఈశ్వరునిలోకమునందు వసించుట, (సానుజ్యము) తమ్మునివలె నీశ్వరునితో గూడియుండుట, (సారూప్యము) ఉపాసనీయదేవుని యాకృతివలె నగుట, (సామీప్యము) సేవకునివలె నీశ్వరునిసమీపమందుండుట, (సాయుజ్యము) ఈశ్వరునితో సంయుక్తుడై యుండుట యను నీనాల్గు విధముల ముక్తిని నమ్ముచున్నారు. వీనిలో (సారూప్య ముక్తిని లెక్కించినట్లు కనబడదు. సమాధానమున సారూప్యముక్తిని గూర్చి యేమియు జెప్పలేదు.) వేదాంతులు బ్రహ్మలో లయమగుటయే మోక్షముగా దలచుచున్నారు.

ఉత్తరముః- పండ్రెండవ సముల్లాసమందు జైనులయు, బదుమూడవ సముల్లాసమందు క్రైస్తవులయు, బదునాల్గవ సముల్లాసమందు ముసల్మానులయు ముక్తి మొదలుగాగల మత విషయములు వ్రాయబడును. వామమార్గులు శ్రీపురమునకు బోయి మద్యము ద్రాగుచు, మాంసమును దినుచు, లక్ష్మివంటి సుందరమైన స్త్రీలను బొంది, క్రీడాదులు సలుపుటను ముక్తి యనుచున్నారు. ఆ ముక్తి యీలోకమున జరుగు భోగవిలాసాదులకంటె మించి విశేషముగా నేమియు లేదు. అట్లే మహాదేవునివంటియు, విష్ణువువంటియు నాకృతిగలవారై పార్వతివంటియు, లక్ష్మివంటియు స్త్రీలతో గూడి యానందము ననుభవించుట

ముక్తియన్న నిక్కడి ధనాఢ్యులైన రాజాదుల భోగవిలాసములకంటె నక్కడ ముక్తియందు నింతయే యధికమున్నట్లు వ్రాయుచున్నారు. ఆయాధిక్యమేమన - రోగములు లేకుండుట, యువావస్థలో నెల్లప్పుడు నుండుట. కాని, వారి యీమాట సత్యము కాదు. ఏలయనగా నెక్కడభోగమో యక్కడ రోగమును, నెక్కడరోగమో యక్కడ వార్ధక్యము నవశ్యముగా సంభవించును.

ఇక పౌరాణికుల నిట్లనవలయును. మీరు నమ్ముచున్న నాల్గుప్రకారముల ముక్తి క్రిమికీటపతంగ పశ్వాదులకు గూడ స్వతః సిద్ధముగ బ్రాప్తించి యున్నదని చెప్పవలయును. ఏలయనగా నెన్నిలోకము లున్నవో యవన్నియు నీశ్వరునివే కదా! సమస్త జీవులును, వానియందు వసించుచున్నారు. కాబట్టి సాలోక్య ముక్తి యనాయాసముగా నందఱకును బ్రాప్తించియే యున్నది. ఈశ్వరుడు సర్వత్ర వ్యాప్తుడై యుండుటవలన నెల్లరు నతని సమీపముననే యున్నారు. కావున సామీప్యముక్తియు స్వతః సిద్ధమయ్యే యున్నది. జీవుడీశ్వరునికంటె నన్నివిధముల జిన్నవాడయి, చేతనుడగుటచే స్వతఃసిద్ధముగనే బంధువు వలె నున్నాడు. కాబట్టి సానుజ్య ముక్తియు బ్రయత్నము లేకయే సిద్ధించియున్నది. సమస్త జీవులు సర్వవ్యాపకుడగు పరమాత్మయందు వ్యాప్యులగుటచే సంయుక్తులై యున్నారు. కాబట్టి సాయుజ్య ముక్తియు స్వతః సిద్ధమయి యున్నది. ఇతర సాధారణనాస్తికులు మరణించినందున తత్త్వములందు దత్త్వములు కలిసి పరమముక్తి కలుగునని నమ్ముచున్నారు. ఆముక్తి కుక్కలకు గాడిదలు మున్నగువానికి గూడ లభించుచున్నది. ఇవన్నియు ముక్తులు కావు. కాని యివి యొకవిధమైన బంధనము లనవచ్చును. ఏలయనగా వీరు శివపురము, లేక మోక్షశిల, నాల్గవయాకాశము, నేడవయాకాశము, శ్రీపురము, కైలాసము, వైకుంఠము,గోలోకము నను నేదోయొకదేశమందలి స్థానవిశేషమ్ములను ముక్తియని నమ్ముచున్నారు. వారాస్థానములనుండి వేఱయిన ముక్తి వదలిపోవును. కావున బంద్రెండు ఊరిమధ్యలో దృష్టిబంధు లున్నట్లు (నగరము బయటనుండు హద్దుఊాయి. ఇది రాజస్థాన్ లోనిసామెత) వారును బంధనమున నుందురు. కావున నిరాటంకముగ నిష్టమైన స్థలములందంతట స్వేచ్ఛగా దిరుగుటయే ముక్తియన నొప్పును. అందు భయముకాని, శంకకాని, దుఃఖముగాని కలుగదు. జన్మమున నుత్పత్తి, మరణమున బ్రలయము, సమయము వచ్చినపుడు జన్మమెత్తుదురనుట స్పష్టము.

ప్రశ్నః- జన్మమొక్కటా? అనేకములా?

ఉత్తరముః- అనేకములు.

ప్రశ్నః- అనేకములైన బూర్వపుజన్మమరణముల విషయము లేల తెలియవు?

ఉత్తరముః- జీవు డల్పజ్ఞుడు, త్రికాలదర్శి కాడు. కాబట్టి స్మరణ ముండదు. ఏమనస్సుతో నెఱుగుచున్నాడో యదియును రెండువిషయముల నొకటేసమయమందు దెలిసికొనజాలదు. పూర్వజన్మపు మాట యటుండనిండు. ఈజన్మమందే గర్భమందు జీవుడుండినప్పుడును, శరీరమేర్పడి జన్మించిన పిమ్మట నయిదవయేటివఱకును జరిగినసంగతు లేలస్మరణమునకు రావు? మిమ్మెవ్వరేని బంద్రెండేండ్లకు ముందు బదుమూడవయేట నైదవ మాసపు తొమ్మిదవ దినమున బదిగంటల మొదటి నిముషమున మీరేమి చేసితిరి? మీ ముఖము, చేతులు, చెవులు, గన్నులు, శరీరము నేవైపున నెట్లుండెను? మనస్సున నేవిచారముండెను? అనియడిగిన నేమియు మీరు చెప్పజాలరు. ఈ శరీరముననే యిట్లుండ బూర్వజన్మ విషయముల స్మరణమందు శంకించుట కేవలము పసితనపుమాట కాదా? మఱియు స్మరణము లేకపోవుటచేతనే జీవుడు సుఖముగా నున్నాడు. లేకున్న నన్నిజన్మములలోని దుఃఖములను జూచిచూచి దుఃఖితుడై మరణించును. ఎవ్వడేని పూర్వజన్మము, నంతకుమునుపటి జన్మముల వర్తమానములను దెలిసికొనదలచినను దెలిసికొనజాలడు. ఏలయనగా జీవునిజ్ఞానమును, స్వరూపమును నల్పము. దీని

నీశ్వరుడు తెలియుట కర్తుడుకాని జీవుడెఱుగనేరడు.

ప్రశ్నః- జీవునకు బూర్వజ్ఞానము లేనపుడు వాని నీశ్వరుడు దండించినను జీవుడు తన్ను సవరించు కోజాలడు. ఏలయనగా నేను ఫలానా కార్యము చేసియున్నందులకు నాకీ ఫలము కలిగినదని తెలిసినపుడే జీవుడు పాపకర్మములనుండి తొలగి యుండగలుగును.

ఉత్తరముః- మీరెన్నివిధముల జ్ఞానమును నమ్ముచున్నారు?

ప్రశ్నః- ప్రత్యక్షాది ప్రమాణములచే నెనిమిది విధముల జ్ఞానమును.

ఉత్తరముః- మీరు జన్మము మొదలు ప్రతిక్షణమున రాజ్యము, ధనము, బుద్ధి, విద్య, దారిద్ర్యము, బుద్ధిలేనితనము, మూర్ఖత్వము మొదలగు సుఖదుఃఖములను బ్రపంచమందు జూచి పూర్వజన్మ జ్ఞానమును గూర్చి యెందుకు తెలిసికొనరు? ఒక వైద్యునకు, అవైద్యునకును నేదేనిరోగము సంభవించినపుడు దాని కారణమును వైద్యుడు తెలిసికొనును. అవైద్యుడు తెలిసికొనజాలడు. వైద్యుడు వైద్యశాస్త్రము జదివినాడు. ఇతరుడు చదువలేదు. కాని జ్వరాదిరోగములు కలిగెనేని యవైద్యుడుగూడ నే నేమో యపథ్యము చేసితిని. అందువలన నాకారోగము వచ్చినది యని తెలిసికొనగలడు. అట్లే లోకమునందు విచిత్రసుఖదుఃఖాదుల వృద్ధిక్షయములను జూచి పూర్వజన్మము నేల యూహించి తెలిసికొనరు? మఱియు పూర్వజన్మము నంగీకరింపవేని పరమేశ్వరుడు పక్షపాతియగును. ఏలయనగా బాపములేకయే రాజ్యమును, ధనాఢ్యతను నొకని కెందులకిచ్చును? పూర్వపుణ్యముల ననుసరించి సుఖదుఃఖముల నిచ్చుటవలన బరమేశ్వరుడు న్యాయకారి యథారీతిని గాగలడు.

ప్రశ్నః- ఒకే జన్మమైనను బరమేశ్వరుడు న్యాయకారి కావచ్చును. ఎట్లన రాజేదిచేసిన నది న్యాయము, తోటమాలి తోటయందు జిన్నపెద్ద వృక్షములను సిద్ధము చేయును. ఒకదానిని ఖండించును. మఱియొకదానిని బెఱికివేయును. కొన్నింటిని రక్షించుచు బెంపుజేయును. తనవస్తువును దానేమిచేసినను నెట్లుంచినను దోషములేదు. ఏలయన నతనిపైన నింకొక డెవడును న్యాయము చేయువాడుగాని, దండించువాడు గాని లేడుగదా! ఈశ్వరు డెవరినుండి భయపడును?

ఉత్తరముః- పరమాత్మ న్యాయమునే కోరును, చేయును. అన్యాయమెన్నడును జేయడు. అతడు గొప్పవాడు. అందువలననే యతడు పూజనీయుడుకూడ. న్యాయమునకు విరుద్ధముగా జేయువా డీశ్వరుడే కాడు. తోటమాలి యుక్తి విడిచి మార్గమునందుకాని, యనర్హస్థానమునందుగాని వృక్షములను బెంచడు. నఱుకుటకు యోగ్యముకాని దానిని నఱికినను నయోగ్యమయినదానిని బెంచినను, యోగ్యమయినదానిని బెంచకున్నను నతడు దూషితుడగును. అట్లే కారణములేక యేది చేసినను నీశ్వరునకును దోషము కలుగును. పరమేశ్వరు డవశ్యముగ న్యాయయుక్తమైన కార్యమే చేయును. ఏలయన నతడు స్వభావముచే బవిత్రుడు, న్యాయకారియునై యున్నాడు. అత డున్మత్తునివలె బనిచేసిన లోకముననున్న శ్రేష్ఠన్యాయాధీశునికంటెను జిన్నవాడును నప్రతిష్ఠితుడు నగును. ఈలోకమున యోగ్యతకు దగిన యుత్తమకార్యములను జేయక ప్రతిష్ఠ కలుగునా? దుష్టకార్యములు చేయనివారిని దండించువాడు నిందనీయుడు, నప్రతిష్ఠితుడును గాడా? కావున నీశ్వరు డన్యాయము చేయడు. అందువలననే యతడు భయపడడు.

(కర్మానుసారమే భోగము)

ప్రశ్నః- పరమాత్మ మొదటనే యెవరికెంత యీయవలయునని విచారించి యున్నాడో యంతయే యిచ్చును. ఎంతపని చేయవలయునో యంతయే చేయును.

ఉత్తరముః- అతడు జీవుల కర్మానుసారము విచారించును. వేఱుగా విచారింపడు. విపరీతముగా జేసిన నతడే యపరాధియు నన్యాయకారియు నగును.

ప్రశ్న:- సుఖదుఃఖములు చిన్నలకు బెద్దలకు నొకటిగానే యున్నవి. గొప్పవారికి గొప్పచింత, చిన్నలకు జిన్నచింత. ఎట్లనగా :- ఒకానొక సాహుకారునకు న్యాయాలయమున లక్షరూప్యముల వివాదముంచిన నతడు తనగృహమునుండి పల్లకిలో గూర్చుండి న్యాయాలయమునకు నుష్ణకాలమున బోవును. వీధినుండి పోవునతనిని జూచి యజ్ఞాను లిట్లందురు. పుణ్యాపాపముల ఫలము చూడుడు! ఒకడు పల్లకిలో సుఖముగా గూర్చుండి యున్నాడు. ఇతరులు కాలికి జెప్పులైన ధరింపక క్రింద పైన గాలుచుండగా బాలకిని మోయుచున్నారు. కాని బుద్ధిమంతు లీవిషయమున నిట్లు దెలిసికొందురు. న్యాయాలయము సమీపించినకొలది సాహుకారునకు శోకము సందేహము నెక్కువ కాజొచ్చును. కాని పల్లకీమోయు బోయీలకు సుఖము కలుగజొచ్చును. న్యాయాలయమున జేరినప్పుడు సాహుకా రిటునటు దిరుగుచు వకీలుదగ్గఱకు బోవుదునా? శిరస్తాదారుదగ్గఱకు బోవుదునా? నేడోడిపోవుదునో, జయింతునో యేమి కానున్నదో తెలియదని విచారింప దొడగును. కాని బోయీలు మాత్రము చుట్టలు త్రాగుచు బరస్పరము వార్తాలాపము జేయుచు బ్రసన్నులై సుఖముగా నేచెట్టుక్రిందనో పడి నిద్రపోవుదురు. ఆసాహుకారు జయించెనేని సుఖమును బొందును. ఓడిపోయిన దుఃఖసాగరమందు మునిగిపోవును. బోయీలు మాత్రము నిర్వికారముగా నుందురు.

అట్లే రాజు మృదువు సుందరమునగు మెత్తపై బరుండినను త్వరగా నతనికి నిదురరాదు. కూలిజేయువారు ఱాళ్లమీదనో, మట్టిమీదనో నిమ్నోన్నత ప్రదేశముల మీదనో పడుకొని వెంటనే సుఖముగ నిద్రింతురు. ఇట్లే సర్వత్ర తెలియవలయునని బుద్ధిమంతులు గ్రహింతురు.

ఉత్తరము:- ఈ తెలివి యజ్ఞానులది. ఏలయనగా:- మనమొక సాహుకారుని బాలకిమోయు బోయీవి కమ్మనియు, బాలకిమోయు బోయీని సాహుకారువు గమ్మనియు జెప్పితిమేని సాహుకారు పల్లకిమోయు బోయీయగుట కెన్నడు నంగీకరింపడు. బోయీలు మాత్రము సాహుకారులు కాగోరుదురు. సుఖదుఃఖములు సమానములైన దమయవస్థలను వదలి హెచ్చుతగ్గులను బొందుట కిద్దఱును గోరకుందురు. చూడుడు. ఒక జీవుడు విద్వాంసుడు, బుణ్యాత్ముడు, శ్రీమంతుడు నగురాజుయొక్క భార్యగర్భమందు బుట్టును. మఱియొకడు మహాదరిద్రదుర్గాలైన గడ్డికోయుదాని గర్భమున బుట్టును. ఒకనికి గర్భమునుండి యన్నివిధముల సుఖమును, మఱియొకని కన్నివిధముల దుఃఖమును గలుగుచుండును. ఒకడు జన్మించినపుడు సుందర సుగంధయుక్త జలాదులతో స్నానమును, నుపాయముగ నాడీచ్ఛేదనమును, దుగ్ధపానాదులును యథాయోగ్యముగ వానికి బ్రాప్తములగును.వాడు పాలు త్రాగగోరునేని పాలలో బంచదార మొదలగునవి చేర్చినపాలు యథేష్టముగ వానికి దొరకును. అతనిని బ్రసన్నునిగా నుంచుటకు నౌకరులు, చాకరులు, నాడుకొనువస్తువులు, వాహనములు సిద్ధముగా నుండును. ప్రేమ లభించును. మఱియొక డడవియందు బుట్టి స్నానమునకు నీళ్ళను గూడ బొందజాలడు. పాలు త్రాగగోరినపుడు పాలకు బదులు తిట్లు, తిమ్ములు, దెబ్బలుకూడ లభించును. అత్యంతార్తస్వరముతో నేడ్చును. అతనిని లాలించువాడెవడు నుండడు. జీవులకు బూర్వజన్మపు బుణ్యాపాపములు లేకయే యిట్టి సుఖదుఃఖములు లభించిన బరమేశ్వరుని మీద దోషారోపణము కలుగును. కర్మములు చేయకయే సుఖదుఃఖములు కలుగునెడల జన్మాంతరమునను బాపపుణ్యఫలములుగ స్వర్గనరకములనబడు సుఖదుఃఖ ములును నుండరాదు. ఏలయనగా బరమేశ్వరు డిప్పుడెట్లు కర్మములు లేకయే సుఖదుఃఖముల నిచ్చునో యట్లే మరణానంతరము కూడ నిష్టమైనవారిని స్వర్గమునకు ననగా సుఖములభించు జన్మము నొందుటకు , నన్యులను నరకమునకును ననగా దుఃఖములభించు జన్మమునొందుటకు బంపివేయును. అట్టియెడ జీవులెల్లరు నధర్మయుక్తు లగుదురు. ధర్మము నేలచేయుదురు? ఏలయన ధర్మమునకు ఫలము లభించుటలో సందేహము

కదా! ఫలము పరమేశ్వరుని యధీనములో నుండును. అతని కెవనియెడ బ్రసన్నత గలుగునో యతనికే సుఖము నిచ్చును. అందువలన బాపకర్మములను జేయుటయందు భయములేక లోకమున బాపమునకు వృద్ధి, ధర్మమునకు క్షయము గలుగును. కావున బూర్వజన్మ బుణ్యాపాపముల ననుసరించి వర్తమాన జన్మమును, వర్తమాన, పూర్వజన్మముల కర్మముల ననుసరించి భవిష్యజ్జన్మమును గలుగుచుండును.

ప్రశ్న:- మనుష్యునియందును, నన్యపశ్వాదిశరీరములయందును నొకేజాతి జీవులుందురా? భిన్న భిన్న జాతిజీవులా?

ఉత్తరము:- ఒకజాతి జీవులే. కాని పాపపుణ్యముల యోగముచేత బవిత్రులు నపవిత్రులు నగుచున్నారు.

ప్రశ్న:- మనుష్యులయు, నితరపశ్వాదులయు శరీరములందుండు జీవులొక్కటిగా నుందురా? విడివిడిగా నుందురా?

ఉత్తరము:- జీవులెల్లరు నొక్కటిగానే యుందురు. (వాని స్వరూపములో భేదములేదు.) కాని పాపపుణ్యముల సంబంధమున మలినములు పవిత్రములు నగును.

ప్రశ్న:- మనుష్యశరీరములందలి జీవులు పశ్వాది శరీరములకును, పశ్వాది శరీరగతజీవులు మనుష్య శరీరములకును బోవునా? అట్లే స్త్రీల శరీరమందలి జీవులు పురుష శరీరములను, బురుషుల జీవులు స్త్రీల శరీరములను ధరించునా? ధరింపవా?

ఉత్తరము:- అవును. మాఱుచుండును. పాప మెక్కుడైనపుడు, పుణ్యము తగ్గినప్పుడు, మనుష్యుల శరీరములందలి జీవులు పశ్వాదినీచ శరీరము లందును, ధర్మమధికమై యధర్మము తఱిగినపుడు జీవులకు దేవ - విద్వాంసుల శరీరములు లభించును. పుణ్యాపాపములు సమానము లయినపుడు సాధారణ మనుష్య జన్మమును గలుగును. ఇందునను బుణ్యాపాపములలోగల నుత్తమ మధ్యమ భేదములనుబట్టి మనుష్యాదులందును నుత్తమ - మధ్యమ - అధమ శరీరములు లభించును. అధికపాపఫలమగు పశ్వాది శరీరములందు భోగము సమాప్తమైనప్పుడు మరల పుణ్యాపాపములు సమము లయినపుడు జీవులు మనుష్యశరీరములకు వత్తురు. పుణ్యఫలము ననుభవించి మరల మధ్యస్థ మనుష్యశరీరమున జేరుదురు.

జీవుడు శరీరమునుండి బయటకు బోవుటచే మృత్యువందురు. శరీరముతో సంబంధమేర్పడుటకే 'జన్మ' మనిపేరు. శరీరము విడిచినపుడు యమాలయము - ఆకాశస్థవాయువున జేరును. యమేన = వాయునా - యని వేదమందున్నది. వాయువునకు యముడని పేరు. గరుడపురాణమున గల్పించిన యముడు లేడు. దీనికి సంబంధించిన విశేషఖండనములు పదునొకండవ సముల్లాసమున వ్రాయబడును. తరువాత ధర్మరాజు - పరమేశ్వరు డాజీవునకు బుణ్యాపాపముల ననుసరించి వ్యవస్థచేయును.

జీవుడు వాయువు, అన్నము, జలము ద్వారమునను లేక శరీర ఛిద్రముద్వారా యీశ్వరుని ప్రేరణమువలన రెండవ శరీరమున బ్రవిష్టుడగును. అట్లు ప్రవేశించి వీర్యమున జేరి, దానిమూలమున గర్భమున స్థితమై శరీరధారణ మొనర్చి బయటకు వచ్చును. స్త్రీ శరీరమును ధరింపదగు కర్మములు చేసియున్న స్త్రీ శరీరమును, పురుషశరీరమును ధరింపయోగ్యములగు కర్మములున్న పురుషశరీరమున బ్రవేశించును. రజస్సు, వీర్యము సమముగానున్న నపుంసకుడగును.

ఉత్తమ కర్మోపాసనలు చేసి యుత్తమజ్ఞానము కలిగి ముక్తి కలుగ నంతవఱకు నుపర్యుక్తనానావిధ జన్మమరణబంధనమున జీవుడు పడుచుండును. ఉత్తమకర్మములు మున్నుగునవి చేయుటవలననే యుత్తమ జన్మములు లభించును. ముక్తియందు మహాకల్పపర్యంతము జన్మమరణరూప దుఃఖరహితుడై జీవు డానందమున నుండును.

ప్రశ్నః- ముక్తి యొకజన్మమున లభించునా? లేక యనేక జన్మములందా?

ఉత్తరముః- అనేక జన్మములందు . ఏలయన -

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యన్తే సర్వసంశయాః,

క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరాఽవరే. ముండ. ఉ. ౨-౨.౮.

ఈ జీవుని హృదయమునకు సంబంధించిన అవిద్యా - అజ్ఞానరూపమగు గ్రంథి భిన్నమయినపుడు సర్వసంశయములు ఛిన్నములగును. దుష్టకర్మములు క్షయించును. అప్పుడే తనయాత్మయందు లోపల వెలుపల వ్యాపకుడైయున్న పరమాత్మయందు నివసించును.

ప్రశ్నః- ముక్తియందు బరమేశ్వరునిలో జీవుడు కలిసిపోవునా వేఱుగా నుండునా?

ఉత్తరముః- వేఱుగా నుండును. ఏలయన జీవుడు పరమేశ్వరునిలో లీనమైన ముక్తి సుఖము నెవడనుభవించును? మఱియు ముక్తి సాధనములన్నియు నిష్ఫలములగును. అప్పుడది ముక్తికాదు. జీవుని ప్రళయమనవలసి వచ్చును. పరమేశ్వరుని యాజ్ఞాపాలనము, నుత్తమకర్మములు, సత్సంగము, యోగాభ్యాసము, పూర్వోక్తసర్వసాధనములు చేసినపుడు జీవుడు ముక్తిని బొందును.

సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యో వేద విహితం గుహాయాం పరమే వ్యోమన్,

సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి. తై.ఉ.ఆనంద. అను. ౧-౧.

జీవుడు తనబుద్ధియందును, నాత్మయందును స్థితమై యున్న సత్యము, జ్ఞానము, ననంతము, నానందస్వరూపము నగుపరమాత్మను దెలిసికొనినచా డతడావ్యాపకరూప బ్రహ్మమున స్థితుడై యా, 'విపశ్చితా' = అనంతవిద్యా యుక్తుడయిన బ్రహ్మముతోబాటు సర్వకామములను బొందును. అనగా నేయే యానందమును గామించునో యాయా యానందమును బొందును. ఇదియే 'ముక్తి.'

ప్రశ్నః- శరీరములేక సాంసారికభోగముల ననుభవింపజాలనట్లు ముక్తిలో శరీరములేక యానందము నెట్లనుభవించును?

ఉత్తరముః- ఇందుకు సమాధానము పూర్వము చెప్పితిమి. ఇంక గొంత యధికము వినుము. సాంసారిక సుఖములను శరీరాధారమున ననుభవించునట్లు పరమేశ్వరుని యాధారమున జీవాత్మ ముక్తి సుఖము ననుభవించును. ఆముక్తజీవు డనంతవ్యాపక బ్రహ్మమునందు స్వచ్ఛందముగా దిరుగును. శుద్ధజ్ఞానముతో సృష్టిని జూచును. ఇతరముక్తాత్మలతో గలియును. సృష్టివిద్యను గ్రముముగా జూచుచు సర్వలోకలోకాంతరములందు ననగా దృశ్యాదృశ్యములగు నీలోకములందంతటను దిరుగును. అతని జ్ఞానము నకు విషయములైన పదార్థముల నన్నింటిని జూచును. జ్ఞానమెంత యెక్కువైన నంతయానంద మధిక మగును.

(స్వర్గనరకములు)

ముక్తియందు జీవాత్మ నిర్మలమగుటచే బూర్ణజ్ఞాని యగును. కావున నతనికి సర్వసన్నిహిత పదార్థముల జ్ఞానము యథారీతిని గలుగును. సుఖ విశేషమే స్వర్గము. విషయతృష్ణయందు జిక్కువడి దుఃఖవిశేషము ననుభవించుటయే 'నరక' మనబడును. సుఖమునకు 'స్వః' అని పేరు. స్వః సుఖం గచ్ఛతి యస్మిన్ స స్వర్గః 'అతో విపరీతో దుఃఖభోగో యస్మిన్ స నరకః' ఇది సామాన్యసాంసారిక సుఖము సామాన్యస్వర్గము. పరమేశ్వరప్రాప్తి వలన గలుగునానందము విశేషస్వర్గ మనబడును.

సర్వజీవులు స్వభావముతో సుఖప్రాప్తిని గోరుచుందురు. మఱియు దుఃఖవియోగమును వాంఛింతురు. కాని ధర్మము నాచరింపనంతవఱకు, పాపకర్మములు విడువనంతవఱకు జీవునకు సుఖము లభింపదు. దుఃఖము దూరమును గాదు. ఏలయన గారణమున్నంతవఱకు గార్యము నశింపదు.

“ఛిన్నేమూలే వృక్షో నశ్యతి. తథా పాపే క్షీణే దుఃఖం వినశ్యతి” మూలమును ఛేదించినపుడు వృక్షము నశించునట్లు, పాపములు వదలిన దుఃఖములు దూరములగును.

మనుస్మృతియందలి పాపపుణ్యముల బహువిధగతిని జూడుడు :-

మానసం మనసైవాయ ముపభుంక్తే శుభాశుభమ్,
వాచా వాచాకృతం కర్మ కాయేనైవ చ కాయికమ్. (౧)
శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాం నరః,
వాచికైః పక్షిమృగతాం మానసైరంత్యజాతితామ్. (౨)
యో యదైషాం గుణో దేహే సాకల్యేనాతిరిచ్యతే,
స తదా తద్గుణప్రాయం తం కరోతి శరీరిణమ్. (౩)
సత్త్వం జ్ఞానం తమోఽజ్ఞానం రాగద్వేషౌ రజః స్మృతమ్,
ఏతద్ వ్యాప్తి మదేతేషాం సర్వభూతాశ్రితం వపుః. (౪)
తత్ర యత్ ప్రీతిసంయుక్తం కించిదాత్మని లక్షయేత్,
ప్రశాంతమివ శుద్ధాభం సత్త్వం తదుపధారయేత్. (౫)
యత్తు దుఃఖసమాయుక్తమప్రీతికరమాత్మనః,
తద్ రజోఽప్రతిపం విద్యాత్ సతతం హారి దేహినామ్. (౬)
యత్తు స్యాన్మోహసంయుక్తమవ్యక్తం విషయాత్మకమ్,
అప్రతర్క్యమవిజ్ఞేయం తమస్తదుపధారయేత్. (౭)
త్రయాణామపి చైతేషాం గుణానాం యః ఫలోదయః,
అగ్ర్యో మధ్యో జఘన్యశ్చ తం ప్రవక్ష్యామ్యశేషతః. (౮)
వేదాభ్యాసస్తపో జ్ఞానం శౌచమింద్రియనిగ్రహః,
ధర్మక్రియాత్మచింతా చ సాత్త్వికం గుణలక్షణమ్. (౯)
ఆరంభరుచితాఽధైర్యమసత్కార్య పరిగ్రహః,
విషయోపసేవా ఽజస్రం రాజసం గుణలక్షణమ్. (౧౦)
లోభః స్వప్నో ధృతిః క్రౌర్యం నాస్తిక్యం భిన్నవృత్తితా,
యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణమ్. (౧౧)
యత్ కర్మ కృత్వా కుర్వంశ్చ కరిష్యంశ్చైవ లజ్జతి,
తజ్జ్ఞేయం విదుషా సర్వం తామసం గుణలక్షణమ్. (౧౨)
యేనాస్మిన్ కర్మణా లోకే ఖ్యాతిమిచ్ఛతి పుష్కలామ్,
న చ శోచత్యసంపత్తౌ తద్ విజ్ఞేయం తు రాజసమ్. (౧౩)
యత్ సర్వేణేచ్ఛతి జ్ఞాతుం యన్న లజ్జతి చాచరన్,
యేన తుష్యతి చాత్మాస్య తత్ సత్త్వగుణలక్షణమ్. (౧౪)
తమసో లక్షణం కామో రజసస్త్వర్థ ఉచ్యతే,
సత్త్వస్య లక్షణం ధర్మః శ్రైష్ఠ్యమేషాం యథోత్తరమ్. (౧౫)

మను. అ. ౧౨.౮, ౯, ౨౫–౩౩, ౩౫–౩౮

మనుష్యు డీవిధముగ నుత్తమ, మధ్యమ, నికృష్టస్వభావములను దెలిసికొని, యుత్తమ స్వభావమును గ్రహించి మధ్యమ నికృష్టములను వదలవలయును. జీవుడు మంచి చెడు కర్మములను మనస్సులో

నాచరించిన మనస్సుతోను, వాక్కుతో జేసిన వాక్కుతోను, శరీరముతో జేసిన శరీరముతో ననుభవించు నని నిశ్చయముగ దెలిసికొనవలయును. (౧)

శరీరముతో దొంగతనము, వ్యభిచారము, నుత్తములను గొట్టుట, చంపుట మున్నగు దుష్కర్మముల నాచరించువాడు వృక్షాదిస్థావరజన్మమును, వాక్కుతో నొనరించిన దుష్టకర్మములవలన బక్షి, మృగము మున్నగువాని శరీరమును, మనస్సుతో జేసిన దుష్టకర్మములవలన చాండాలాది శరీరమును బొందును. (౨)

ఏగుణ మీజీవులదేహములం దధికముగానుండునో యది జీవులను దనవలె జేయును. (౩)

ఆత్మయందధికజ్ఞానము కలిగినపుడు సత్త్వగుణము, అజ్ఞానముండునపుడు తమోగుణము, రాగద్వేషము లుండునపుడు రజోగుణము నున్నట్లు తెలిసికొనవలయును. ప్రాకృతికములగు నీమూడు గుణములు సమస్త పదార్థములందు వ్యాపించి యుండును. (౪)

వానిని దెలియు విధమేమన :- ఆత్మయందు బ్రసన్నత యుండి, మనస్సు ప్రశాంతమైన శుద్ధసాత్త్వికవర్తనము గలిగియున్న సత్త్వగుణమధికముగాను, రజస్తమోగుణము లప్రధానముగాను నున్నట్లు తెలిసికొనవలయును. (౫)

ఆత్మ, మనస్సు, రెండును దుఃఖయుక్తములు ప్రసన్నతారహితములునై విషయములం దిటునటు గమనాగమనములు చేయుచుండిన రజోగుణము ప్రధానమై సత్త్వ, తమోగుణములు తక్కువగా నున్నట్లెంచవలయును. (౬)

ఆత్మ, మనస్సు నీరెండును మోహమందు - సాంసారిక పదార్థములం దాసక్తములై యున్నను, మనస్సున వివేకము లేనప్పుడును, విషయాసక్తత వలన దర్కవితర్క శూన్యమై తెలియయోగ్యము గానపుడు తమోగుణము ప్రధానముగను, సత్త్వరజస్సు లప్రధానములుగ నున్నట్లెంచవలయును. (౭)

ఇక నీమూడు గుణములచే గలుగు నుత్తమ మధ్యమాధమఫలములను బూర్ణముగ జెప్పుదును. (౮)

వేదాభ్యాసము, ధర్మానుష్ఠానము, జ్ఞానాభివృద్ధి, పవిత్రతాకాంక్ష, జితేంద్రియత, ధర్మాచరణము, ఆత్మచింతనము ననునివి సత్త్వగుణము వలన గలుగు లక్షణములు. (౯)

రజోగుణము వృద్ధిచెంది, సత్త్వతమోగుణము లణగియున్నపుడు కార్యారంభమున రుచి, ధైర్యత్యాగము, నసత్కార్య గ్రహణము, విషయ సేవనమునం దెడతెగని ప్రేమయు గలుగును. అట్టియెడ దనలో రజోగుణ మధికమై యున్నట్లు గ్రహింపవలయును. (౧౦)

తమోగుణము వర్ధిల్లి మిగిలిన రెండు గుణములు సన్నగిల్లినపుడు, సర్వపాపమూలమగు లోభము పెరిగి, మిక్కిలి యాలస్యము, నిద్ర, యధైర్యము, క్రూరత, నాస్తిక్యము - ఈశ్వరునందు, వేదములందు నశ్రద్ధ, అంతఃకరణమున భిన్నభిన్న వృత్తులు గలుగుట, మఱియు నేకాగ్రత లేకుండుట, వ్యసనాసక్తి మున్నగునవి తమోగుణలక్షణములుగా విద్వాంసు డెఱుంగవలయును. (౧౧)

ఏదేని యొకకర్మము చేసినపుడు, చేయునపుడు, చేయదలచినపుడును దనయాత్మయందు లజ్జ, శంక, భయమును గలుగునో యప్పుడు తనయందు దమోగుణ మెక్కువగా నున్నట్లు తెలిసికొనవలయును. (౧౨)

ఏకార్యమొనర్చి యీలోకమున జీవాత్మ పుష్కలకీర్తి నభిలషించునో, దరిద్రుడైనను వందిమాగధులకు స్తోత్రపాఠకులకు ధనము నిచ్చుట మానడో యప్పుడు రజోగుణము తనలో నధికమైనదని గుర్తింపవలయును. (౧౪)

తమోగుణలక్షణము - కామము, రజోగుణ లక్షణము - అర్థసంగ్రహేచ్ఛ, సత్త్వగుణ లక్షణము -

ధర్మమును సేవించుట యని తెలియవలయును. ఈమూడు గుణములలో దమోగుణముకంటె రజోగుణము, దానికంటె సత్త్వగుణము శ్రేష్ఠములని యెఱుగునది. (౧౫)

ఇప్పు డేయేగుణములవలన నేయేగతిని జీవుడు పొందునో వానిని ముందు వ్రాయుచున్నాము.

దేవత్వం సాత్త్వికా యాన్తి మనుష్యత్వం చ రాజసాః,
తిర్యక్త్వం తామసా నిత్యమిత్యేషా త్రివిధా గతిః. (మను. ౧౨-౪౦)

సాత్త్వికులు (దేవత్వం) విద్వాంసు లగుదురు, రజోగుణము కలవారు మధ్యమమనుష్య లగుదురు. తమోగుణముకలవారు నీచగతిని బొందుదురు.

స్థావరాః కృమికీటాశ్చ మత్స్యాః సర్పాశ్చ కచ్ఛపాః,
పశవశ్చ మృగాశ్చైవ జఘన్యా తామసీ గతిః. (మను. ౧౨-౪౨)

అధికతమోగుణముకలవారు స్థావరములగు వృక్షాదిజన్మములను, క్రిమి, కీట, మత్స్య, సర్ప, కచ్ఛప, పశు మృగముల జన్మములను బొందుదురు.

హస్తినశ్చ తురంగాశ్చ శూద్రా మ్లేచ్ఛాశ్చ గర్హితాః,
సింహా వ్యాఘ్రా వరాహాశ్చ మధ్యమా తామసీ గతిః. (మను. ౧౨-౪౩)

మధ్యమ తమోగుణము గలవా రేనుగు, గుఱ్ఱము, శూద్రుడు, మ్లేచ్ఛుడు, నింద్యకర్మకారులు, సింహము, వ్యాఘ్రము, వరాహము నను నీజన్మములను బొందుదురు.

చారణాశ్చ సుపర్ణాశ్చ పురుషాశ్చైవ దాంభికాః,
రక్షాంసి చ పిశాచాశ్చ తామసీషూత్తమాగతిః. (మను. ౧౨-౪౪)

ఉత్తమ తమోగుణము కలవారు చారణులు - కవిత్వముతో నితరుల స్తుతించువారు, సుందరములైన పక్షులు, దాంభికులు - తన సుఖముకొఱకు దన్నుదాను బొగడుకొనువారు, రాక్షసులు = హింసకులు, పిశాచులు = మద్యమాంసాదులను సేవించువారు, మలినులుగా జన్మింతురు.

ఝల్లా మల్లా నటాశ్చైవ పురుషాః శస్త్రవృత్తయః,
ద్యూతపానప్రసక్తాశ్చ జఘన్యా రాజసీ గతిః. (మను -౧౨. ౪౫)

మిక్కిలి రజోగుణముగలవారు ఝల్ల = ఖడ్గజీవులు, పలుగుతో ద్రవ్వువారు, మల్ల = పల్లెవాండ్రు, నట = దొమ్మరులు, శస్త్రధారులగు భృత్యులు, జూదరులు, మద్యపానము చేయువారుగా జన్మింతురు. ఇది నీచరజోగుణము.

రాజానః క్షత్రియాశ్చైవ రాజ్ఞాం చైవ పురోహితాః,
వాదయుద్ధప్రధానాశ్చ మధ్యమా రాజసీ గతిః (మను. ౧౨-౪౬)

మధ్యమ రజోగుణము కలవారు రాజులు, క్షత్రియవర్ణస్థులైన రాజపురోహితులు, వాదవివాదములు చేయువారు - న్యాయవాదులు, యుద్ధవిభాగాధ్యక్షులు - సేనాపతులుగా జన్మింతురు.

గంధర్వా గుహ్యకా యక్షా విబుధానుచరాశ్చ యే,
తథైవాప్సరసః సర్వా రాజసీషూత్తమా గతిః. (మను. ౧౨-౪౭)

ఉత్తమ రజోగుణము కలవారు గంధర్వులు - గాయకులు, గుహ్యక - వాద్యజీవులు, యక్షులు - ధనాఢ్యులు, విద్వాంసుల సేవకులు, అప్సరసలు - రూపవతులగు స్త్రీలుగాను జన్మింతురు.

తాపసా యతయో విప్రా యే చ వైమానికా గణాః,
నక్షత్రాణి చ దైత్యాశ్చ ప్రథమా సాత్త్వికీ గతిః (మను. ౧౨-౪౮)

తపస్వులు, యతులు, సంన్యాసులు, వేదపాఠకులు, విమానములు నడుపువారు, జ్యోతిర్విదులు

దైత్యులు = దేహపోషణపరులగు మనుష్యులుగా జన్మించుట ప్రథమసత్త్వగుణఫలము.

**యజ్వాన ఋషయో దేవా వేదా జ్యోతీంషి వత్సరాః,**

**పితరశ్చైవ సాధ్యాశ్చ ద్వితీయా సాత్త్వికీ గతిః. (మను. ౧౨-౪౯)**

మధ్యమ సత్త్వగుణసంపన్నులు యజ్ఞాదికర్మముల నొనర్చువారు, వేదార్థవిదులు, విద్వాంసులు, వేదములను, విద్యుదాదులను, కాలవిద్యను దెలిసినవారు, రక్షకులు, జ్ఞానులు నగుదురు. సాధ్యులు - కార్య సిద్ధికై యత్నించు నధ్యాపకుల జన్మమును బొందుదురు.

**బ్రహ్మా విశ్వసృజో ధర్మో మహానవ్యక్తమేవ చ,**

**ఉత్తమాం సాత్త్వికీమేతాం గతిమాహుర్మనీషిణః. (మను. ౧౨-౫౦)**

ఉత్తమ సత్త్వగుణ సంపన్నులై యుత్తమకర్మముల నొనర్చువారు బ్రహ్మలు - చతుర్వేదవిదులు, విశ్వస్రష్టలు-సృష్టివిద్య నెఱిగి విమానాదుల జేయువారుగాను, ధార్మికులుగాను, సర్వోత్తమబుద్ధి యుక్తులుగాను జన్మించి యవ్యక్త జన్మమును - ప్రకృతికార్యమును, దెలిసికొని ప్రకృతిని వశపఱచు కొందురు.

**ఇంద్రియాణాం ప్రసంగేన ధర్మస్యాసేవనేన చ,**

**పాపాన్ సంయాంతి సంసారానవిద్వాంసో నరాధమాః. (మను. ౧౨-౫౨)**

ఇంద్రియములకు లోబడి విషయాసక్తులై ధర్మమువదలి యధర్మము నాచరించు నవిద్వాంసులు నీచజన్మములు - దుఃఖరూప హీన జన్మములను బొందుదురు.

ఇట్లు సత్త్వరజస్తమోగుణముల వేగమువలన జీవు డెట్టి కర్మముల నాచరించునో యట్టి ఫలములను బొందును. కావున ముక్తిగోరువారు గుణాతీతులై యనగా గుణస్వభావములందు జిక్కుకొనక మహా యోగ్యులై ముక్తికొఱకు యత్నింపవలయును.

**యోగశ్చిత్తవృత్తినిరోధః యో. ద. ౧-౨.**

ఇది పతంజలిరచితయోగశాస్త్ర సూత్రము. మనుష్యుడు సత్త్వరజస్తమోగుణ యుక్తకర్మములనుండి మనస్సును నిరోధించి శుద్ధసత్త్వగుణయుక్తుడై, పిమ్మట దానినిగూడ నిరోధించి యేకాగ్రతవహించి యొక్క పరమాత్ముడు, ధర్మకర్మాచరణము నను నీరెండింటియందే మనస్సును నిరోధించవలయును.

తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్. యోగ. ౧-౩.

చిత్తము నేకాగ్రముచేసి నిరోధించినపుడే జీవుడు సర్వద్రష్టయైన పరమేశ్వరుని స్వరూపమున స్థితుడగును.

**అథ త్రివిధదుఃఖాత్యంతనివృత్తి రత్యంతపురుషార్థః. సాం. ౧-౧.**

ఆధ్యాత్మికము - శరీరమునకు సంబంధించినబాధ, ఆధిభౌతికము = ఇతర ప్రాణులనుండి కలుగు బాధ, ఆధిదైవికము = అతివృష్టి, అతితాపము అతిశీతము, నింద్రియములయు, మనస్సుయొక్కయు చాంచల్యము మున్నగు వానిచే గలుగు దుఃఖము, నీత్రివిధదుఃఖములనుండి తొలగి ముక్తిని బొందుటయే యత్యంతపురుషార్థము.

ఇకముందు ఆచారానాచార భక్ష్యాభక్ష్యములను గుఱించి వ్రాయుదుము.

## శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును సుభాషా విభూషితమునగు సత్యార్థ ప్రకాశమున విద్యావిద్య బంధమోక్ష విషయములుగల నవమ సముల్లాసము సంపూర్ణము.

# దశమ సముల్లాసము

(ఆచారానాచార భక్ష్యాఽభక్ష్య విషయములు) ధర్మయుక్త కార్యాచరణము, సుశీలత, సత్పురుషుల సాంగత్యము, సద్విద్యాగ్రహణమునరుచి మున్నగునవి యాచారములు. వీనికి విపరీతములైనవి యనాచారము లనబడును. వానిని గుఱించి వ్రాయుచున్నాము.

(వేదోక్త ధర్మసేవనము)

విద్వద్భిః సేవితః సద్భిర్నిత్యమద్వేషరాగిభిః,
హృదయే నాభ్యనుజ్ఞాతో యో ధర్మస్తన్నిబోధత. (౧)
కామాత్మతా న ప్రశస్తా న చైవేహాస్త్యకామతా,
కామ్యో హి వేదాధిగమః కర్మ యోగశ్చ వైదికః. (౨)
సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః,
వ్రతాని యమధర్మాశ్చ సర్వే సంకల్పజాః స్మృతాః. (౩)
అకామస్య క్రియా కాచిద్ దృశ్యతే నేహ కర్హిచిత్,
యద్యద్ధి కురుతే కించిత్ తత్తత్కామస్య చేష్టితమ్. (౪)
వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలే చ తద్విదామ్,
ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టిరేవ చ. (౫)
సర్వం తు సమవేక్ష్యేదం నిఖిలం జ్ఞానచక్షుషా,
శ్రుతిప్రామాణ్యతో విద్వాన్ స్వధర్మే నివిశేత వై. (౬)
శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హి మానవః,
ఇహ కీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్. (౭)
శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః,
తే సర్వార్థేష్వమీమాంస్యే తాభ్యాం ధర్మో హి నిర్బభౌ. (౮)
యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్ ద్విజః,
స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః. (౯)
వేదః స్మృతి సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః,
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య, లక్షణమ్. (౧౦)
అర్థకామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే,
ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః. (౧౧)
వైదికైః కర్మభిః పుణ్యై ర్నిషేకాది ర్ద్విజన్మనామ్,
కార్యః శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ. (౧౨)
కేశాంతః షోడశే వర్షే బ్రాహ్మణస్య విధీయతే,
రాజన్యబంధోర్ద్వావింశే వైశ్యస్య ద్వ్యధికే తతః. (౧౩)

(మను. అ. ౨.౧–౪, ౬, ౮, ౯, ౧౦–౧౩, ౨౬, ౬౫)

రాగద్వేషాదిరహితులు, విద్వాంసులు నగువారు దేనిని నిత్యము సేవింతురో,హృదయమున నాత్మకేది సత్యకర్తవ్యమని తెలియునో, యాధర్మమే మాననీయమును, గరణీయము నని మనుష్యులు సదా ధ్యానముంచవలయును. (౧)

ఈ ప్రపంచమందత్యంతకామాత్మతకాని, నిష్కామతకాని శ్రేష్ఠము కాదు. ఏలయన వేదార్థజ్ఞానము, వేదోక్తకర్మములు నన్నియు గామము చేతనే సిద్ధించుచున్నవి. (౨)

ఎవ్వడేని నేనిచ్ఛారహితుడను, నిష్కాముడను - అనికాని యటుల గాగలననికాని చెప్పెనేని, వాడెన్నడును నటుల గాజాలడు. ఏలయనగా యజ్ఞము, సత్యభాషణాదివ్రతములు, యమనియమము లను ధర్మాదులన్నియు సంకల్పముచేతనే సిద్ధమగును. (౩)

చేతులు, కాళ్ళు, కన్నులు మనస్సు, మొదలగువాని చలనములన్నియు గామముచేతనే కలుగు చున్నవి. ఇచ్ఛ లేకుండెనేని గన్ను తెఱచుటయు మూయుటయుగూడ జరుగదు. (౪)

కాబట్టి సంపూర్ణ వేదములను, మనుస్మృత్యాది ఋషిప్రణీతశాస్త్రములను, సత్పురుషుల యాచారమును, దన యాత్మప్రసన్నమగు కర్మములు - భయముగాని, శంకకాని, సిగ్గుకాని కలుగనివి సేవించుట యుచితము. చూడుడు. అబద్ధము చెప్పుటకును, దొంగతనము మొదలగునవి చేయుటకు నిచ్ఛగించినపుడే వానియాత్మయందు భయము, శంక, లజ్జ యనునవి యుత్పన్నమగును. కాబట్టి యాకర్మములను జేయగూడదు. (౫)

మనుష్యుడు సంపూర్ణశాస్త్రములను, వేదమును, సత్పురుషుల యాచారమును తనయాత్మ కవి రుద్ధమగువానిని బాగుగ జ్ఞాననేత్రముద్వారా విచారించి శ్రుతిప్రమాణములచే స్వాత్మానుకూల ధర్మమందు బ్రవేశింపవలయును. (౬)

వేదోక్తధర్మమును, వేదమున కవిరుద్ధమగు స్మృత్యుక్తధర్మమును ననుష్ఠించు నతడీలోకమందు గీర్తిని, మరణించి సర్వోత్తమ సుఖమును బొందును. (౭)

శ్రుతియని వేదమును, స్మృతియని ధర్మశాస్త్రమును నందురు. వీనిచే సమస్త కర్తవ్యాకర్తవ్యములను నిశ్చయించుకొనవలయును. (౮)

వేదమునుగాని, వేదానుకూలములగు నాప్తగ్రంథములనుగాని యవమానము చేయువానిని శ్రేష్ఠులు జాతిబాహ్యునిగా జేయవలయును. ఏలయనగా వేదమును నిందించువాడు నాస్తికుడు. (౯)

కాబట్టి వేదము, స్మృతి, సత్పురుషుల యాచారము, తన యాత్మజ్ఞానమున కవిరుద్ధమగు ప్రియా చరణము ననునీనాలుగు ధర్మలక్షణములు. అనగా వీనిచేతనే ధర్మము లక్షితమగుచున్నది. (౧౦)

ద్రవ్యలోభమందును, కామమను విషయవాసనలయందును జిక్కువడని యతనికే ధర్మజ్ఞానము కలుగును. ధర్మమును దెలిసికొనగోరువారికి వేదమే పరమ ప్రమాణము. (౧౧)

కాబట్టి వేదోక్త పుణ్యరూపకర్మములచే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు తమ సంతానమున కీజన్మ మందును, బరజన్మమందును బవిత్రతను గలుగజేయు నిషేకాది సంస్కారములను జేయుట యుచి తము. (౧౨)

బ్రాహ్మణునకు బదియాఱవయేట, క్షత్రియునకు నిరువదిరెండవయేట, వైశ్యునకు నిరువది నాల్గవయేట కేశాంతకర్మ మనగా నీవిధికి బిమ్మట శిఖనుమాత్రమే యుంచి గడ్డమును మీసమును దల వెంద్రుకలను గొఱిగించుకొనుచుండవలయును. అనగా మరల నెన్నడును బెట్టుకొనగూడదు. శీత ప్రధానదేశ మయ్యెనేని వారి యిష్టానుసార మెన్ని వెంద్రుకలేని యుంచుకొనవచ్చును. అత్యుష్ణదేశ మయ్యెనేని శిఖాసహితముగ నంతయును గొఱిగించుకొనవచ్చును. ఏలయనగా దలయందు వెంద్రుక లుండుటచే నుష్ణమధికమగుటయేగాక బుద్ధియు దగ్గును. గడ్డము, మీసము లుండుటచే భోజనములం దాటంకమును గలుగును. ఇక నెంగిలియు వెంద్రుకలనంటి యుండును. (౧౩)

(మనుష్య విశేష కర్తవ్యములు)

ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు,
సంయమే యత్నమాతిష్ఠే ద్విద్వాన్ యంతేవ వాజినామ్. (౧)
ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయమ్,
సన్నియమ్య తు తాన్యేవ తతః సిద్ధిం నియచ్ఛతి. (౨)
న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేన భూయ ఏవాభివర్ధతే. (౩)
వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ,
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్. (౪)
వశే కృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మనస్తథా,
సర్వాన్ సంసాధయేదర్థా నక్షిణ్వన్ యోగతస్తనుమ్. (౫)
శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః,
న హృష్యతి గ్లాయతి వా స విజ్ఞేయో జితేంద్రియః. (౬)
నాపృష్టః కస్య చిద్ బ్రూయాన్న చాన్యాయేన పృచ్ఛతః,
జానన్నపి హి మేధావీ జడవల్లోక ఆచరేత్. (౭)
విత్తం బంధుర్వయః కర్మ విద్యా భవతి పంచమీ,
ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తరమ్. (౮)
అజ్ఞో భవతి వై బాలః పితా భవతి మంత్రదః,
అజ్ఞం హి బాలమిత్యాహుః పితేత్యేవ తు మంత్రదమ్. (౯)
న హాయనై ర్న పలితై ర్న విత్తేన న బంధుభిః,
ఋషయ శ్చక్రిరే ధర్మం యోఽనూచానః స నో మహాన్. (౧౦)
విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాం తు వీర్యతః,
వైశ్యానాం ధాన్యధనతః శూద్రాణామేవ జన్మతః. (౧౧)
న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః,
యో వై యువాప్యధీయాన స్తం దేవాః స్థవిరం విదుః. (౧౨)
యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః,
యశ్చ విప్రోఽనధీయాన స్త్రయ స్తే నామ బిభ్రతి. (౧౩)
అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోఽనుశాసనమ్,
వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా. (౧౪)
మను. ౨.౮౮, ౯౩, ౯౪, ౯౭, ౯౮, ౧౦౦, ౧౧౦, ౧౩౬, ౧౫౩—౧౫౭, ౧౫౯.

మనుష్యుని ముఖ్యాచారము :- చిత్తమును హరించు విషయములందు ప్రవర్తించు నింద్రియములను నిరోధింప బ్రయత్నింప వలయును. సారథి గుఱ్ఱములను లాగి శుద్ధమార్గమందు నడపునట్టు లీయింద్రియములను దనవశమందు బెట్టుకొని యధర్మమార్గమునుండి తొలగించి, ధర్మమార్గమందెల్లపుడు నడపింపవలయును. (౧)

ఏలయనగా నింద్రియములను విషయాసక్తియందు, నధర్మమునందు నడపుటవలన మనుష్యుడు నిశ్చయముగా దోషి యగును. మఱియు వానిని జయించి ధర్మమునందు నడపునపుడే యభీష్టసిద్ధిని

బొందును. (౨)

ఇంధనములను, నేతిని వేయుటచేత నగ్ని వర్ధిల్లునట్లే కామముల నుపయోగించుటవలన గామమెన్నడు శాంతింపదు, వర్ధిల్లును. కావున మనుష్యుడు విషయాసక్తు డెన్నడు గాగూడదు. (౩)

జితేంద్రియుడుకాని పురుషుని విప్రదుష్ట డందురు. వాని వేదజ్ఞానము కాని, త్యాగముకాని, యజ్ఞముకాని, నియమములుకాని, ధర్మాచరణముకాని సిద్ధిపొందవు. ఇవి యన్నియు జితేంద్రియులైన ధార్మికునకు సిద్ధములగును. (౪)

కావున బంచజ్ఞానేంద్రియములను, బంచకర్మేంద్రియములను, బదునొకండవ మనస్సును దనవశమున నుంచుకొని, యుక్తాహార విహార రూపయోగముతో శరీరమును రక్షించుకొనుచు సర్వార్థములను సిద్ధము చేసికొనవలయును. (౫)

స్తుతిని విని హర్షమును, నిందను విని శోకమును, నుత్తమస్పర్శముచే సుఖమును, దుష్టస్పర్శముచే దుఃఖమును, సుందరరూపమును జూచి ప్రసన్నతను, దుష్టరూపమును జూచి యప్రసన్నతను, నుత్తమభోజనము చేసి యానందమును, నికృష్టభోజనము చేసి దుఃఖమును, సుగంధమందు రుచిని, దుర్గంధమందరుచిని జెందనివాడే జితేంద్రియు డనబడును. (౬)

అడుగనివారికిని, నన్యాయముతో, గపటముతో నడుగువారికిని, నుత్తర మీయగూడదు. బుద్ధిమంతుడు వారియెదుట జడునివలె నుండవలయును. నిష్కపటులు, జిజ్ఞాసువులు నైనవారికి నడుగకయే యుపదేశింపవలయును. (౭)

ఒకటి – ధనము, రెండవది – బంధువులు, కుటుంబము, కులము, మూడవది – యవస్థ, నాల్గవది – ఉత్తమ కర్మము, ఐదవది – శ్రేష్ఠవిద్య యనునీ యైదును మాన్యస్థానములు. కాని ధనముకంటె నుత్తములు బంధువులు, బంధువులకంటె నధికమవస్థ, యవస్థ (ఆయువు) కంటె శ్రేష్ఠము కర్మము, కర్మము కంటె బవిత్రులు విద్యావంతులు, నిట్లుత్తరోత్తర మధికమాననీయులు. (౮)

ఏలయనగా నూతేండ్లవయస్సు కలవాడైనను విద్యావిజ్ఞాన రహితుడేని బాలకుడనబడును. విద్యావిజ్ఞానముల నిచ్చువాడు బాలుడైనను వృద్ధుడని యంగీకరింపవలయును. ఏలయనగా సర్వశాస్త్రములు, నాప్తవిద్వాంసులు నజ్ఞానిని బాలకుడనియు, జ్ఞానిని పితయనియు నందురు. (౯)

మిక్కిలి వయస్సు చెల్లుటచేతగాని, వెంద్రుకలు తెల్లబడుటచేతగాని, మిక్కిలి ధనము కలిగియుండుటచేత గాని, గొప్పకుటుంబపు వాడగుటచేత గాని వృద్ధుడుకాడు. కాని మనలో విద్యావిజ్ఞానములయందు నధికుడైనవాడే వృద్ధుడని ఋషులును, మహాత్ములును నిశ్చయించియున్నారు. (౧౦)

బ్రాహ్మణుడు జ్ఞానముచేత, క్షత్రియుడు బలముచేత, వైశ్యుడు ధనధాన్యములచేత, శూద్రుడు జన్మముచేత, నధికవయస్సుచేత వృద్ధుడనబడును. (౧౧)

విద్వాంసులు తలవెంద్రుకలు నెఱసిన ముసలివానిని గొప్పవాడనరు. యువకుడైనను విద్యనేర్చిన వానిని గొప్పవాడని భావింతురు. (౧౨)

విద్యచదువని మూఢుడు కొయ్యతో జేయబడిన యేనుగువలె, దోలుతో జేయబడిన మృగమువలె నగును. అట్టి యవిద్వాంసుడైన మనుష్యుడు జగత్తున నామమునకు మనుష్యుడనబడును. (౧౩)

కాబట్టి విద్యచదివి విద్వాంసుడు, ధర్మాత్ముడునై నిర్వైరముతో సమస్తప్రాణుల కల్యాణము నుపదేశింపవలయును. ఉపదేశము చేయునపుడు వాణి మధురముగను, గోమలముగ నుండవలయును. ఇట్లు సత్యోపదేశముతో ధర్మవృద్ధిని నధర్మనాశమును జేయుపురుషుడు ధన్యుడు. (౧౪)

నిత్యము స్నానము చేయుచు వస్త్రములను, నన్నపానములను, స్థానమును శుద్ధముగా నుంచుకొన

వలయును. ఏలయనగా నివి శుద్ధముగా నుండుటచే జిత్తశుద్ధియు, నారోగ్యమును గలిగి పురుషార్థ మధిక మగును. మలమును, దుర్గంధమును దూరమగునట్లు శుద్ధిచేయవలయును.

(ఆచార మహత్త్వము)

ఆచారః పరమో ధర్మః శ్రుత్యుక్తః స్మార్త ఏవ చ. (మను. ౧–౧౦౮)

సత్యభాషణాది కర్మముల నాచరించుటయే వేదమందును, స్మృతియందును జెప్పబడిన యాచారము.

మా నో వధీః పితరం మోత మాతరమ్. (యజు. అ ౧౬–. మం. ౧౫)

ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణ మిచ్ఛతే.(అథర్వ. కాం. ౧౧ సూ. ౫ మం. ౩)

మాతృదేవో భవ పితృదేవో భవ ఆచార్యదేవో భవ అతిథిదేవో భవ.

(తైత్తిరీయారణ్యకే ప్ర. ౭. అను. ౧౧)

తల్లి, తండ్రి, యాచార్యుడు, నతిథి యనువీరికి సేవచేయుట దేవపూజ యనబడును. ఏయే కర్మముచే జగత్తునకుపకారము కలుగునో యాయాకర్మములను జేయుచు హానికారక కర్మములను వదలివేయుటయే మనుష్యుని ముఖ్యకర్తవ్యము. నాస్తికులు, లంపటులు, విశ్వాసఘాతకులు, మిథ్యావాదులు, స్వార్థపరులు, వంచకులు, ఛలముతో వర్తించువారునైన దుష్టమనుష్యుల సాంగత్యము నెన్నడు జేయరాదు. ఆప్తులు, సత్యవాదులు, ధర్మాత్ములు, పరోపకారప్రియులు నైన జనులతో నెల్లపుడు సాంగత్యము చేయుటయే శ్రేష్ఠాచారమనబడును.

(విదేశగమనమువలన నాచారము నష్టమగునా?)

ప్రశ్నః– ఆర్యావర్తదేశవాసులు తమదేశమునకంటె భిన్నమగు దేశములకు బోవుటవలన నాచారము నష్టమయిపోవునా? లేదా?

ఉత్తరముః– ఇది మిథ్యావచనము. ఏలయనగా సత్యభాషణాదుల నాచరించుటయే లోపలి వెలుపలి పవిత్రత యనబడును. అట్టి యాచరణ మెక్కడ చేసినను నాచారభ్రష్టుడుకాని, కర్మభ్రష్టుడుకాని యెన్నడును గాడు. ఆర్యావర్తమున నుండియు దుష్టాచారియైనవాడే ధర్మభ్రష్టుడు, నాచారభ్రష్టుడు ననబడును. ఇతరదేశములకు బోవుటచే భ్రష్టుడగునేని :–

మేరోర్హరేశ్చ ద్వే వర్షే వర్షం హైమవతం తతః,
క్రమేణైవ సమాగమ్య భారతం వర్షమాసదత్. (౧)
స దృష్ట్వా వివిధాన్ దేశాన్ చీనహూణనిషేవితాన్,
మహాభారత, శాంతిపర్వ, మోక్షధర్మ. అ ౩౨౫.౧౮,౧౫ (౨)

ఈ శ్లోకములు భారతశాంతిపర్వపు మోక్షధర్మమునందు వ్యాస శుకసంవాదమున నున్నవి. ఒకప్పుడు వ్యాసుడు తనపుత్రుడగు శుకునితోడను, శిష్యులతోడను బాతాళమున (అమెరికా) నివసించు చుండిరి. అప్పుడు శుకాచార్యుడు తనతండ్రిని నాత్మవిద్య యింతయేనా? ఇంకను నధికముగా నున్నదా? యని ప్రశ్నించెను. వ్యాసుడు తెలిసియు నా ప్రశ్నకు ప్రత్యుత్తర మీయలేదు. ఏలయన నావిషయము నంతకు ముందే యుపదేశించి యుండెను. మఱియొక సాక్షికొఱకు దనపుత్రుడగు శుకునితో వ్యాసుడు "ఓ కుమారా! నీవు మిథిలాపురికి వెళ్ళి యీప్రశ్ననే జనకరాజు నడుగుము. అతడు దీనికి దగినరీతిని సమాధానమిచ్చును. అని చెప్పెను. తండ్రిమాటలు విని శుకుడు పాతాళమునుండి మిథిలాపురము వైపునకు బయలుదేరెను. మేరువునకు – హిమాలయమునకు ఈశాన్యము, ఉత్తరవాయవ్య దిశలయందున్న దేశములకు హరివర్షమను పేరుండెను. కోతిని "హరి" యందురు. ఆదేశపు మనుష్యులు నేడును రక్తముఖము కోతుల

వలె దెల్లనికండ్లుగలవారై యుందురు. ఆ దేశములను నేడు "యూరోప్" అందురు. వానినే సంస్కృతమున "హరివర్ష" మని చెప్పుచుండెడివారు. శుకుడాదేశములను జూచుచు హూణ, యహూది దేశములను గూడ దాటి చీనాదేశమునకు వచ్చెను. అటనుండి హిమాలయమును దాటి మిథిలాపురికి వచ్చెను.

శ్రీకృష్ణుడు, నర్జునుడు నిరువురు అశ్వతరీ - అగ్నియాన నౌకలో గూర్చుండి పాతాళమున (అమెరికా) కేగి యటనుండి ఉద్దాలకమహర్షిని, యుధిష్ఠిరునియజ్ఞమునకు దీసికొనివచ్చిరి. ధృతరాష్ట్రుని వివాహము గంధార - కంధార దేశపురాజపుత్రికతో జరిగినది. పాండురాజు పత్ని మాద్రి 'ఈరాన్' దేశపురాజకుమారియై యుండెను. అర్జునుడు పాతాలమున (అమెరికా) కేగి యచటి రాజకన్యయైన 'ఉలూపి'ని వివాహమాడియున్నాడు. దేశదేశాంతరములకు ద్వీపద్వీపాంతరములకు వెళ్ళకయున్న నివియన్నియు నెట్లు జరుగును?

మనుస్మృతియందు సముద్రమున వెళ్ళు నౌకలమీద పన్నువిధించి వసూలుచేయుమని యున్నది. ఇదియు నార్యావర్తమునుండి ద్వీపాంతరము వెళ్ళుటవలననే సంభవించును. యుధిష్ఠిరమహారాజు రాజసూయ యజ్ఞము చేసినపుడు, భూగోళదేశములలోని రాజులనందఱ నాహ్వానించుటకు భీమార్జున నకుల సహదేవులను నాలుగుదిశలకు బంపియున్నాడు కదా? ద్వీపాంతరములకు బోవుట దోషమైన నిది యెన్నడు జరిగి యుండెడిది కాదు. పూర్వమార్యావర్తదేశీయులు వ్యాపారము కొఱకు, రాజకార్యార్థము భూభ్రమణము కొఱకు సమస్తభూగోళమున దిరుగుచుండెడివారు.

నేటి యంటుదోషము, ధర్మభ్రష్టులగుదురను శంకయు గేవలము మూర్ఖుల కల్పనవలనను, నజ్ఞానుల యధికమూర్ఖతవలనను నేర్పడినవి. దేశదేశాంతరములకు ద్వీపద్వీపాంతరములకు వెళ్ళి వచ్చుటలో దోషము నంగీకరింపనివారికి భిన్నదేశవాసుల రీతినీతులు నేర్చుకొనుటకు సాంగత్యము చేయుటకు దమరాజ్యవ్యవహారముల నొనర్చుటలో భయరహితులగుటకు నవకాశముండెడిది. దేశాంతర గమనమున నాయాదేశముల సద్వ్యవహారములను గ్రహించుటకు, జెడువిషయములను విడుచుటకు నవకాశము గలుగును. మహాభ్రష్టులు, మ్లేచ్ఛకులోత్పన్నులైన వేశ్యలతో వ్యభిచారాదులొనర్చిన యాచార భ్రష్టులు ధర్మహీనులు కారు, కాని దేశదేశాంతరములనుండు నుత్తమపురుషుల సాంగత్యమువలన నంటు దోషము నంగీకరించుట కేవలము మూర్ఖతకాక మఱియేమగును?

కాని, మాంసభక్షణము, మద్యపానాదుల నొనర్చువారి శరీరములు, వీర్యాదిధాతువులు దుర్గంధయుక్తములయి దూషితములగును. అట్టివారి సాంగత్యము వలన నార్యులకుగూడ నా కులక్షణ మంటవచ్చును. దానినుండి జాగ్రత్తపడవలయును. కాని, వారితో వ్యవహరించుటలోను వారినుండి గుణగ్రహణము చేయుటలోను దోషముకాని, పాపముకాని యేమియునుండదు. వారిలోగల మద్యపానాదిదోషములను విడిచి గుణ ములు గ్రహించిన నేమియు దోషముండదు. వారిని స్పృశించుటలోను వారిని జూచుటలో దోషము నంగీకరించు మూర్ఖులావశ్యకమైనపుడు వారితో యుద్ధాదులనుగూడ జేయజాలరు. యుద్ధములో వారిని జూచుట స్పృశించుట తప్పనిసరి యగునుకదా!

రాగద్వేషములు, నన్యాయము, మిథ్యాభాషణాది దోషములు వదలి, ప్రతీతి, నిర్వైరత, పరోపకారము, సజ్జనత మున్నగు గుణములు ధరించుట సజ్జనులకునుత్తమాచారము. ధర్మమునకు మనయాత్మలతోను కర్మములతోను సంబంధమున్నదని గుర్తింపవలయును.

మనము మంచిపనులు చేయువార మగుదుమేని దేశదేశాంతరములకు ద్వీపద్వీపాంతరములకు బోవుటలో నెట్టిదోషము కలుగదు. పాపకర్మముల నొనర్చుటలో దోషమున్నది. వేదోక్త ధర్మమును నిశ్చయించుట, పాషండ మతఖండనము చేయుటయు దప్పక నేర్చుకొనవలయును. అందువలన నెవరును

మనలను మిథ్యావ్యవహారులుగా నిశ్చయింపజాలరు.

దేశదేశాంతరములకు ద్వీపద్వీపాంతరములకు గమనాగమనముల నొనర్చి రాజ్యముచేయక, వ్యాపారములుచేయక స్వదేశోన్నతి యెట్లు కాగలదు? స్వదేశమునందే స్వదేశవాసులు నితరదేశవాసులను వ్యాపారము చేయుచుండిన దేశమున దారిద్ర్యము, దుఃఖముతక్క మఱియొండేమియు గలుగదు.

దేశవాసులకు విద్యలునేర్పినను, దేశదేశాంతరములకు వారిని వెళ్ళ నాజ్ఞయిచ్చినను వారు బుద్ధిమంతులై వారు తమ పాషండజాలమున జిక్కుకొనరనియు, దమప్రతిష్ఠకు జీవికకు భంగము వాటిల్లుననియు పాషండులు భావించుచున్నారు. అందువలననే భోజన - ఛాదనములలో వ్యర్థాడంబరములను స్పర్శదోషాదులను గల్పించుచున్నారు. విదేశగమనము నిషేధించుచున్నారు. కాని, విదేశగమనాదులొనర్చువారు మద్యమాంససేవనాదుల నెన్నడును బొరపాటునగూడ గ్రహింపరాదు.

యుద్ధసమయమున రాజపురుషులు, సైనికులు, స్పర్శదోషభయముతో మడిగట్టుకొని వంట వార్పులు చేసికొనుచు గూర్చుండిన బరాజయము కలుగుట తప్పదని బుద్ధిమంతులు నిశ్చయింపలేదా?

క్షత్రియులు యుద్ధమున నొకచేత రొట్టెలను దినుచు నీళ్ళు త్రావుచు రెండవచేత శత్రువులతో యుద్ధము చేయవలయును. రథగజాదుల నారోహించియో, నడకతోనో శత్రువులను జయింపవలయును. యుద్ధరంగమున శత్రువులను జంపి విజయము పొందుటయే యాచారము. అపజయము బొందుట యనాచారమునై యున్నది.

ఇట్టి మూర్ఖతతోనే యీదేశవాసులు నిత్యము వంటయింటినలుకుచు నెక్కడ స్పర్శదోషము వాటిల్లునోయని భయపడుచు బరస్పర విరోధములు పెంచుకొనుచు స్వాతంత్ర్యము, నానందము, ధనము, రాజ్యము, విద్య, పురుషార్థము నన్నియు నాశముచేసి చేతిమీదజేయి, కాలిమీదగాలు వేసికొని నిశ్చేష్టులై కూర్చున్నారు. పైగా నేదైన దొరకిన వంటజేసికొనవచ్చునని యభిలషించుచున్నారు. కాని యది జరుగనందున నార్యావర్తదేశమంతటిని నలికి ముగ్గుబెట్టినట్లు సర్వనాశమొనర్చి యున్నారు.

కాని, భోజనమొనర్చు తావును గడిగి. శుభ్రముచేసి, యలికి ముగ్గులుపెట్టి, మలినపదార్థమును దూరమొనర్చి శుభ్రముగా నుంచుకొనుటలో బ్రయత్నలోపము చేయరాదు. క్రైస్తవ, మహమ్మదీయులవలె బాకశాలను నపరిశుభ్రముగా నెన్నడు నుంచరాదు.

ప్రశ్నః- సఖరీ నిఖరీ యననేమి?

ఉత్తరముః- జలముతో బక్వముచేసిన పదార్థము 'సఖరీ' యందురు. పాలు, నేయి, నూనెలతో బక్వముచేయబడిన వంటకములను 'నిఖరీ' యందురు. ఇదియు నీధూర్తులు ప్రవర్తింపజేసిన పాషండతయే. కారణమేమన నేవంటకమున నేయి పాలు నధికముగా నుపయోగింపబడునో యవి తినుటకు స్వాదిష్టములై యుండును. ఉదరమున స్నేహపదార్థ మెక్కువగా జేరును. ఇందులకే యీప్రపంచము రచించిరి. అగ్నివలనను, గాలిము గతించుటవలనను బక్వమైన వస్తువు పక్వమనబడును. దీనినే హిందీలో 'పక్కా' అందురు. అట్లు పక్వముకానిదాని నపక్వము 'కచ్చా' యందురు. పక్వమైప 'పక్కా' పదార్థము తినవలయును. అపక్వము - 'కచ్చా' పదార్థము తినరాదు. కాని యీనియమము సర్వత్ర పనికిరాదు. శనగలు మున్నగునవి పచ్చివికూడ దినవచ్చును.

(ఉత్తరభారతమున నీ పక్వాపక్వములే - (కచ్చా, పక్కా) 'సఖరీ, నిఖరీ' పదములతో వ్యవహరింపబడును. బ్రాహ్మణాది - ఉచ్చవర్ణస్థులు శూద్రులయింటవండిన 'సఖరీ' జలపక్వపదార్థములను దినరు. కాని 'నిఖరీ' నేతితోను బాలతోను జేసిన పదార్థమును దినుటలో దోషములేదని చెప్పి వానిని శూద్రులు చేసినను దినుచుందురు. ఇది యంతయు దయానందుని దృష్టిలో పాషండతయే.)

ప్రశ్నః- ద్విజాలు తాము వంటచేసికొని తినవలయునా? లేక శూద్రుడు చేసినదానిని దినవచ్చునా?

ఉత్తరముః- శూద్రుడు వంటచేసినదియే తినవలయును. కారణమేమన, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణములవారు స్త్రీపురుషులు క్రమముగా విద్యనునేర్పుటకు, రాజ్యపాలన జేయుటకు, పశుపాలనము, వ్యాపా రము, చేయుటలో దత్పరులై యుందురు. శూద్రునిపాత్రలలో, వారియింట సిద్ధమైనవస్తువుల నాపత్కా లమున దినవలయును. ఇందులకు ప్రమాణములు వినుము :-

ఆర్యాధిష్ఠితా వా శూద్రాః సంస్కర్తారః స్యుః. ఆపస్తంబసూత్రము ౨-౨-౪-౪.

ఆర్యులగృహమునందు శూద్రులు - అనగా మూర్ఖులైన స్త్రీ పురుషులు వంటవార్పులు చేయవల యును. కాని యీవంటచేయువారు శరీరములను వస్త్రాదులను బవిత్రము - శుద్ధముగా నుంచుకొనవల యును. ఆర్యులయింట వంటచేయునపుడు వీరు తమనోటికి గుడ్డనడ్డముగా గట్టుకొని వంటచేయవల యును. ఏలయన వారినోటినుండి తుంపరలు - ఎంగిలినీరన్నాది పదార్థములలో బడకుండుట మంచిది. వారెనిమిది రోజుల కొకసారి గోళ్ళు కత్తిరించి శుభ్రముగా నుంచుకొన వలయును. ప్రతిదినము స్నాన మొనర్చి వంటజేయవలయును. ఆర్యులకు భోజనము పెట్టి యనంతరము తాము దినవలయును.

ప్రశ్నః- శూద్రులు స్పృశించిన యన్నము తినుటలో దోషము కలుగుచుండ, వారిచే బక్వము చేయబడిన దెట్లు తిననొప్పును?

ఉత్తరముః- ఇది కపోలకల్పితము. సత్యము కాదు. బెల్లము, పంచదార, నేయి, పాలు, పిండి, శాక ములు, దుంపలు, ఫలములు, తినువారెల్లరు జగమునగల వారియందఱిచేతులతో జేసిన పదార్థములను, ఉచ్ఛిష్టములను - ఎంగిలిని - తినినట్లే యెంచవలయును. ఏలయన, శూద్రులు, మాలమాదిగలు, తుర కలు, క్రైస్తవులెల్లరు చెఱకు పొలములో జెఱకు కోయుదురు. చీల్చుదురు. గానుగలలో వేసి రసము తీయుదురు. వారు మలమూత్రముల విసర్జనముచేసి చేతులు కాళ్ళు శుద్ధముచేసి కొనకయే యాచేతుల తోనే పనులు చేయుదురు. సగముతినిన చెఱకు నందులోనే వేయుదురు. త్రాగి మిగిలిన రసము నావంట చేయు రసములోనే పోయుదురు. రసమును వంటచేయునపు డారసములోనే రొట్టెలను పక్వముచేసికొని తిందురు.

పంచదార సిద్ధము చేయునపుడు, మలమూత్రవిసర్జన స్థలములలో దిరిగిన చెప్పులతో, పేడబెల్లము నంటుకొనియున్న ప్రాత చెప్పులతో బంచదారను మర్దనము చేయుదురు. తమయింటి యశుద్ధ పాత్ర లతో జలము పోయుచుందురు. పిండిని విసరి యెత్తునపు డుచ్ఛిష్టముతో గూడిన చేతులతో ద్రోవుచేయు దురు. వారి దేహములనుండి చెమటకారి యందు బడుచుండును. ఫలమూలకందాదులను సేకరించుట లోను నిట్టిలీలయే జరుగుచుండును. కావున నుపర్యుక్త పదార్థములను దినువా రెల్లరిచేతుల పాకమును దిని నట్లు కాదా!! ఆలోచించుడు.

ప్రశ్నః- ఫలమూల కందరసాదులలో నెట్టి దోషము నుండదు. కారణమేమన నవియదృష్టపదార్థ ములు. సిద్ధమగు సమయమున నెవరు చూతురు?

ఉత్తరముః- వహ్వారే, ఈ సమాధానము చెప్పక చేయునదేమి? లేకున్న మట్టి బూడిద తినవలసి వచ్చును. బెల్లము, చక్కెర మధురపదార్థములు, నేయి, పాలు పుష్టికారకములు. అందువలననే యీకుక్షిం భరులిట్టివి యన్నియు రచించియున్నారు. మంచిది. అదృష్టపదార్థములందు దోషములేకున్న పాకీపని చేయువారు, తురకలు తమచేతులతో మీరుచూడనిచోట వంటచేసి తీసికొనియిచ్చిన దిందురా? 'తినము' అందురేని యదృష్ట - చూడని పదార్థములందును దోషమున్నదని సిద్ధమగుచున్నది. మహమ్మదీయులు, క్రైస్తవులు మద్యమాంసభక్షకులు కావున వారిచేతులతో జేయబడిన పదార్థములను దినుటవలన మద్య

మాంసాదుల కలవాటుపడు నవకాశముండును. కావున వారి పదార్థములను దినరాదు. కాని యార్యులలో బరస్పరము శూద్రాదులు వంటచేసి దినుటలో నేదోషము లేదు.

మఱియు మతము, హానిలాభములు, సుఖదుఃఖములు పరస్పర మొక్కటిగా నెంచనంతవఱకు నున్నతి కలుగుట మిక్కిలి కఠినము. అన్నపానము లేకమైనంత మాత్రమున సంస్కరణము కాజాలదు. చెడు విషయములు వదలి మంచివిషయములు గ్రహింపనంతవఱకు వృద్ధి కలుగక పోగా హాని కలుగును.

ఆర్యావర్తమున విదేశీయుల రాజ్య మేర్పడుటకు గారణమేమి? పరస్పరభేదభావము, మతభేదములు, బ్రహ్మచర్యమును బాలింపకుండుట, విద్యాభ్యాసము చేయకుండుట, చేయింపకుండుట, బాల్యావస్థలో 'అస్వయంవర' వివాహములు, విషయలోలుపత, మిథ్యాభాషణాది కులక్షణములు, వేదవిద్యా ప్రచారము లేకుండుట, మున్నగు కుకర్మలు. వీనివలననే దేశము పరాధీనమైనది. పరస్పరము సోదరులు కలహించుచుండుట వలననే విదేశీయుడు మూడవవాడు వచ్చి మధ్యవర్తి యగుటకు యత్నించును.

ఐదువేల సంవత్సరములకు బూర్వము జరిగిన మహాభారత విషయములుకూడ మఱచితిరా? చూడుడు. మహాభారత యుద్ధమునందు నెల్లరు వారి వాహనములమీదనే యుండి యుద్ధము చేయుచు దినుచు త్రాగుచు నుండెడివారు. పరస్పర భేదభావము, వైరభావము వలననే కౌరవులు, పాండవులు, యాదవులు నశించినారు. అదియేదో యైపోయినది. కాని నేటికి నారోగ మీదేశము నింకను విడువలేదు. ఈ భయంకర వ్యాధిరూపరాక్షసు డీదేశము నెన్నడైన విడుచునో లేక యార్యులను సర్వసుఖములనుండి ముక్తులను జేసి దుఃఖసాగరమున ముంచునో యెఱుగలేకున్నాము. గోత్రహంతకుడు, స్వదేశవినాశకుడు, దుష్టుడు, నీచుడునైన దుర్యోధనుని దుష్టమార్గమున నడచుచు నార్యులు నేటికిని దమదుఃఖములను బెంపు చేసికొనుచున్నారు. ఈరాజరోగ మార్యులమైన మననుండి నాశమగునట్లు పరమేశ్వరు డనుగ్రహించుగాక!

(భక్ష్యాభక్ష్య భేదములు)

భక్ష్యాభక్ష్యములు రెండు విధములు. ఒకటి ధర్మశాస్త్రోక్తము. రెండవది వైద్యకశాస్త్రోక్తము. ధర్మశాస్త్రమున –

**అభక్ష్యాణి ద్విజాతీనామమేధ్యప్రభవాణి చ. మను ౫–౫.**

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యవర్ణులైన ద్విజులు, శూద్రులును మలినములగు మలమూత్రాదుల సంసర్గమున నుత్పన్నములైన శాక, ఫలమూలాదులను దినరాదు.

**వర్జయేన్ మధుమాంసం చ. మను. ౨–౧౭౭.**

నానావిధములగు మద్యములు, గంజాయి, భంగు, నల్లమందు మున్నగు మత్తుపదార్థములు.

**బుద్ధిం లుంపతి యద్ ద్రవ్యం మదకారి తదుచ్యతే. (శార్‌ఙ్గధర – ౪–౨౧)**

అనగా బుద్ధిని నశింపజేయు పదార్థములను నెన్నడు సేవింపరాదు. అట్లే, పాచిపోయి, చెడిపోయి దుర్గంధముతోగూడి, దూషితములైనట్టియు, బాగుగ సిద్ధముచేయనట్టియు, మద్యమాంసాదుల పరమాణువులతో నిండియున్న శరీరములుగల మద్యమాంసాశనులైన వారిచేతులతో నిర్మింపబడినట్టియు బదార్థముల నెన్నడు సేవింపరాదు.

(గోవధవలన హాని)

మాంసభక్షణము వలన నుపకారకములగు జంతువులవధ జరుగును. కావున నది వర్జింపవలయును. ఉదాహరణమునకు --

ఒక గోవు శరీరమునుండి పాలు, నేయి లభించును. మఱియు దూడలు మగవి, యాడవి కొన్నికలిగి యవిపెద్దవియై యెద్దులు నావులు నగును. ఒకయావు దానిసంతతివలన నొకతరములో నాలుగులక్ష

డెబ్బదియైదువేల యాఱువందల (౪౭౫౬౦౦) మంది మనుష్యులకు సుఖము లభించును. కావున నట్టి పశువులను స్వయముగా జంపరాదు. ఇతరులచే జంపబడనీరాదు. ఒకగోవు ప్రతిదినము (౨౦) ఇరువది సేర్లు, మఱియొకటి రెండు (౨) సేర్లు పాలనిచ్చు ననుకొందము. ఆ రెంటిపాలు సగటున పదునొకండు సేర్లగును. ఒకగోవు పదునెనిమిది మాసములు, మఱియొకటి యాఱు మాసములు పాలనిచ్చిన వానిసగటు లెక్క పండ్రెండు మాసము లగును. ఇట్లు ప్రతిగోవు జన్మమంతటిలో నిచ్చుపాలవలన (౨౪౯౬౦) ఇరువది నాలుగువేల తొమ్మిదివందల యఱువది మంది మనుష్య లోకమూటు తృప్తి పడగలరు.

ఒక గోవునకు నాఱు కోడెదూడలు, నాఱు పెయ్యదూడలు పుట్టును. వానిలో రెండు చచ్చిపోయి నను పదిదూడలు మిగులును. వానిలో నైదాఱు దూడలు పెద్దవై పాలనిచ్చిన నాపాలతో ౧౨౪౮౦౦ ఒకలక్ష యిరువది నాలుగువేల యెనిమిది వందల మంది మనుష్య లోక్కమూటు తృప్తులగుదురు ఇకనైదు మగదూడలు నెద్దులై వ్యవసాయమునకు దోడ్పడి వానిజన్మములో గనీసము (౫౦౦౦) ఐదువేల మణుపుల ధాన్యము నుత్పన్నము చేయును. ఆయన్నము నొక్కొక్కడు ముప్పావు సేరు చొప్పున భుజించిన రెండున్నర లక్షలమందికి నొకసారి భోజనమగును. ఇట్లన్నము పాలు కలిపి భుజించిన (౩౭౪౮౦౦) మూడు లక్షల డెబ్బదినాలుగువేల యెనిమిది వందల మంది మనుష్యలోకపర్యాయము తృప్తులగుదురు. రెండు సంఖ్యలు కలిపి ౪౭౫౬౦౦ మంది మనుష్యులు ఒక పర్యాయము పాలితులగుదురు. ఇది యొక్క యావునకు సంబంధించిన యొక్కతరము లెక్క. దానిసంతతికి గలుగు సంతానతరములను లెక్కించిన నసంఖ్యమనుష్యుల పాలనము జరుగునట్లు తెలియును.

ఇంతేకాక యెద్దులు బండిలాగి బరువులు మోసి యనేకుల కనేక విధములైన యుపకారమొనర్చును. అట్లే గోదుగ్ధము మిక్కిలి యుపకారకము. ఎద్దులుపకరించినట్లు దున్నలు నుపకరించును. గేదెలును బాలకుపయోగించును. కాని గోదుగ్ధము, గోఘృతము బుద్ధిని వృద్ధిజేయుటలో నెంతటి యుపకారము జేయునో గెదెలపాలు నెయ్యి యంతటి యుపకారము సేయవు. అందువలన నార్యులు గోవును ముఖ్యోపకారక జంతువుగా నెంచుచున్నారు. ఆర్యేతరులు విద్వాంసులుకూడ నీవిషయము నంగీకరింపకపోరు.

మేకపాలవలన ౨౫౯౨౦ ఇరువది యైదువేల తొమ్మిదివందల యిరువది మంది పాలనము జరుగును. ఇట్లే యేనుగు, గుఱ్ఱము, ఒంటె, గొఱ్ఱె, గాడిద మున్నగు జంతువుల వలనను బెద్దపెద్ద యుపకారములు జరుగును. కావున నిట్టి పశువులను జంపువాడు సర్వమానవులను జంపువాడుగా నెంచబడవలయును.

(గోహత్యారంభము)

చూడుడు. ఆర్యులరాజ్యమున్నపుడు మహోపకారకములగు గోవు మున్నగు జంతువుల హత్య జరిగెడిది కాదు. అప్పుడే యార్యావర్తమునందును, నితరభూగోళదేశములందును మానవులు మిక్కిలి యానందముతో నుండెడివారు. ఏలయన - పాలు , నెయ్యి, యెద్దులు మున్నగు జంతువులు నధిక సంఖ్యలో నుండుట వలన నన్నము, రసములు పుష్కలముగా లభించుచుండెడివి. విదేశీయులు మాంసాహారు లీదేశమునకు వచ్చి గోవు మున్నగు పశువులను జంపుచు, మద్యపానమొనర్చుచు రాజ్యాధికారులైనప్పటి నుండియు గ్రమముగా నార్యులదుఃఖములు వృద్ధినొందసాగెను. ఏలయన - 'నష్టే మూలే నైవ ఫలం న పుష్పమ్' వృక్షమూలమునే నఱకిన ఫలపుష్పములెటనుండి కలుగును.

(పశురక్షణము)

ప్రశ్నః- ఎల్లరు నహింసకులైనచో వ్యాఘ్రాదిక్రూరజంతువు లధికమై గోవుమున్నగు పశువులను జంపి తినునుగదా! అప్పుడు మీపురుషార్థమే వ్యర్థమగునా? కాదా?

ఉత్తరము:- హానికారకములగు పశువులను మనుష్యులను దండించుట లేక చంపుట రాజపురుషుల కర్తవ్యము.

ప్రశ్న:- మఱి వాని మాంసమును బాఱవేయవలయునా?

ఉత్తరము:- పాఱవేయవచ్చును. లేక మాంసాహారి జంతువులు కుక్కలు మున్నగు వానికి వేయవచ్చును. లేక కాల్చి భస్మము చేయవచ్చును. లేదా యెవడేని మాంసాహారి తినదలచిన తినవచ్చును. అందువలన లోకమునకు గలుగుహాని యుండదు. కాని యామాంసాహారిమనుష్యుని స్వభావము హింసకము కావచ్చును.

హింస, చౌర్యము, విశ్వాసఘాతము ఛల - కపటాదుల మూలమున బదార్థములను సంపాదించి భుజించుపదార్థము లభక్ష్యములు; అహింస, ధర్మాచరణమువలన సంపాదించి భుజించు పదార్థములు భక్ష్యములు ననబడును.

ఏపదార్థముల వలన స్వాస్థ్యము, రోగనాశముకలిగి, బుద్ధిబలపరాక్రమాదులు వృద్ధిబొందునో యట్టి తండులములు, గోధుమలు, ఫలములు, మూలములు, కందగడ్డలు, పాలు, పెరుగు, నెయ్యి, మిష్టాది పదార్థములు తగినట్లు పక్వముచేసి, కలిపి తగినట్లుగా మితముగా భుజించుననవన్నియు భక్ష్యములు.

ఏయేపదార్థములు తనప్రకృతికి విరుద్ధములై వికారము గలిగించునో వానిని సర్వధా త్యజింపవలయును. ఏయేపదార్థము లెవరెవరికి హితములో యాపదార్థములను గ్రహించుటయు భక్ష్యమనబడును.

(సహభోజనదోషములు)

ప్రశ్న:- కలిసి భుజించుటలో నేమైన దోషము కలదా? లేదా?

ఉత్తరము:- దోషమున్నది. ఒకని స్వభావముతో మఱియొకని స్వభావము, ప్రకృతి కలియదు. కుష్ఠరోగితో గలిసి భోజనము చేసిన మంచివాని రక్తము చెడునవకాశమున్నది. అట్లే మఱియొకనితో గలిసి తినుటలో జెడుగే యున్నదికాని మంచిలేదు. అందువలననే -

నోచ్ఛిష్టం కస్యచిద్ దద్యాన్నాద్యాచ్చైవ తథాన్తరా,
న చైవాత్యశనం కుర్యాన్న చోచ్ఛిష్టః క్వచిద్ వ్రజేత్. మ. ౨-౫౬

ఎవనికిని దనయెంగిలి నీయరాదు. మఱియొకని భోజనము మధ్య నుండి పదార్థము తీసికొని తినరాదు. అధికముగా భుజింపరాదు. ఉచ్ఛిష్టము - ఒకరు తినగా మిగిలినదియు దినరాదు. భోజనానంతరము ముఖము చేతులు కడుగుకొనక యిటునటు పోరాదు.

ప్రశ్న:- 'గురోరుచ్ఛిష్టభోజనమ్' ఈ వాక్యమున కర్థమేమి?

ఉత్తరము:- గురువు భోజనము చేసిన పిమ్మట వేఱుగా మిగిలియున్న శుద్ధాన్నమును శిష్యుడు భోజనము చేయవలయునని దీని యర్థము. ముందుగా గురువునకు భోజనము చేయించి తరువాత శిష్యుడు భుజింపవలయునని తాత్పర్యము.

ప్రశ్న:- ఉచ్ఛిష్టమంతయు నిషిద్ధమేని, యీగలయుచ్ఛిష్టమగుతేనె, దూడలయుచ్ఛిష్టమగు పాలు, నోకముద్ద దిన్న పిమ్మట పాత్రలో మిగిలిన యన్నము నుచ్ఛిష్టములే యగును. వానినిగూడ మనము తినగూడదుగదా?

ఉత్తరము:- తేనె నుచ్ఛిష్టమందుము కాని యది యనేకౌషధముల సారమగుటవలన గ్రాహ్యము. దూడ తనతల్లి పాదుగులోని వెలుపలి పాలు ద్రాగునేకాని లోపలిపాలను ద్రాగదు. కాబట్టి యుచ్ఛిష్టము కాదు. దూడ త్రాగిన పిమ్మట దల్లి పొదుగును నీళ్ళతోగడిగి పరిశుద్ధమగు పాత్రయందు బిండవలయును. ఇక దనయుచ్ఛిష్టము తనకు వికారకారకమును గాదు. ఒకరి యెంగిలి మఱియొకరు దినగూడదనుట

న్యాయము. ఏలయన దనముఖము, ముక్కు, చెవి, కన్ను, గుహ్యేంద్రియముల, మలమూత్రాదుల నంటుట యసహ్యము కాదు. కాని యితరుల మలమూత్రముల నంటుటయం దసహ్యము కలుగును. కాబట్టి తన యెంగిలి తనకు వికారము కాదనుట విపరీతము కాదు. కాబట్టి యితరుల యుచ్ఛిష్టమును - ఎంగిలిని దినకుండుట మనుష్యుల కందఱకు నుచితము.

ప్రశ్నః- స్త్రీపురుషులు గూడ బరస్పర ముచ్ఛిష్టము తినగూడదా?
ఉత్తరముః- తినగూడదు. వారి శరీర స్వభావములును భిన్న భిన్నములే.

ప్రశ్నః- మనుష్యమాత్రుడు వండినదానిని దినుటచే నేమిదోషము? బ్రాహ్మణ శరీరము రక్తము, ఎముకలు, మాంసము, తోలు వీనితోగూడి యున్నట్లే చండాలాదుల శరీరములు నట్లే రక్తమమున్నగు వానిచే గూడియున్నవి. కాబట్టి మనుష్యమాత్రునిచే వండబడిన దానిని దినుట యందేమి దోషము?

ఉత్తరముః- దోషమున్నది. ఏలయనగా నుత్తమ పదార్థములను దిని త్రాగుటచే బ్రాహ్మణీ బ్రాహ్మణుల శరీరములందు దుర్గంధాది దోషరహితములగు రజోవీర్యము లుత్పన్నములగునట్లు చండాలుర శరీరములందు గావు. చండాలురశరీరము దుర్గంధమైన బరమాణువులచే నిండియుండును. బ్రాహ్మణాదుల వట్లుండవు. కాబట్టి బ్రాహ్మణాది యుత్తమవర్ణములవారిచే జేయబడినది దినవలసినదే కాని, చాండాలాది నీచుల చేత జేయబడినదానిని దినగూడదు. తల్లి, యత్త, వదినె, కూతురు, కోడలు, మున్నగువారి శరీరమువలెనే మీ స్త్రీ శరీరమును గలదు. తల్లి మొదలగు స్త్రీలతో, స్వస్త్రీతో వర్తించునట్లేల వర్తింపరని మిమ్మెవ్వరేని యడిగిన మీరు సంకోచపడి యూరకుండవలసి వచ్చునుగద! చేతితోను, నుత్తమాన్నములు తిననగునట్లు దుర్గంధ పదార్థములును దిననగునా? మఱేల నీచాదులను దినరని యడిగిన బాగుగ నుండునా?

ప్రశ్నః- ఆవుపేడచే నలుకునట్లు తమపేడచే నేలయలుకరు? వంటయింటి లోనికి బేడదెచ్చుట వలన నాస్థలము మలినమై పోదా?

ఉత్తరముః- ఆవు పేడయందు మనుష్యుని మలమువంటి దుర్గంధము లేదు. జిగట గలిగియుండును. కాబట్టి శీఘ్రముగ పేడెత్తదు. వస్త్రములు చెడవు. మలినము గాదు. మన్నునుండి దుమ్ము లేచునట్లు పేడనుండి లేవదు. మన్నుగలిపి యలుకుటచే జూచుటకు నందముగా నుండును. ఇక భోజనాదులు చేయుటచేతను, నేయి, చక్కెర, యెంగిలి పడుటచేతను బాకశాల మలినమై పోవును. దానిచే నీగలు, పురుగులు, విశేషముగా నటజేరును. ఇక నా స్థలమును బ్రతిదినమును నూడ్చి పేడమన్ను కలిపి దానితో నలికి యన్ని విధముల శుభ్రముగా నుంచుకొనవలయును. గచ్చుటిల్లయ్యేనేని నీటితో బాగుగ గడుగదగును. దానిచే బూర్వోక్తదోషములన్నియు నివృత్తి యగును. తురకల వంటయిండ్ల యందొకవైపున బొగ్గులు, నొకవైపున బూడిద, యొకవైపున గట్టెలు, బగిలినకుండలు, నెంగిలిగిన్నెలు, నక్కడనెముకలు, నిక్కడ మన్ను పడి యీగలచే నిండి యసహ్యముగా నుండును. ఎవడేని శ్రేష్ఠపురుషు డక్కడకు బోదటస్థించెనేని వమనము చేసికొనును. మఱియు దురకలు పేడచే వంటయిల్లలుకుట యందు దోషము గలదం దురు. వారు దమపొయ్యిలో బిడుకలుకాల్చి యానిప్పుతో జుట్టలు గాల్చుటచేతను. దమయింటిగోడలకు పేడబూయించుట చేతను, భ్రష్టులగుటయేగాక వారి వంటశాలకూడ భ్రష్టమై పోవుననుటకు సందేహ ముండదు గద.

ప్రశ్నః- వంటశాలలో గూర్చుండి భోజనము చేయుట మంచిదా? వెలుపల భుజించుట మంచిదా?

ఉత్తరముః- సుందర రమణీయ స్థానమని తోచినచోట గూర్చుండి భోజనము చేయవలయును. కాని, యావశ్యక యుద్ధాదులయందు మాత్రము గుఱ్ఱము మొదలగు వాహనములమీద గూర్చుండియో, నిలుచుండియో తినుటయు, త్రాగుటయు నత్యావశ్యకము.

ప్రశ్నః- తనచేతి భోజనమే చేయవలయునా? ఇతరుల చేతిది తినగూడదా?

ఉత్తరముః- ఆర్యులు పరిశుభ్రముగ వంటచేయుదురేని యార్యులందఱతో సరిగగూర్చుండి భోజనముచేయుటయం దేమియు హానిలేదు. బ్రాహ్మణాదివర్ణ స్త్రీపురుషులే వంటచేయుచు, నలుకుచు, నూడ్చుచు, పాత్రలను దోముచు నుందురేని విద్యాదిగుణము లెన్నటికిని వృద్ధిపొందజాలవు. చూడుడు! యుధిష్ఠిరమహారాజు చేసిన రాజసూయ యజ్ఞమందు భూగోళమందలి రాజులును, ఋషులును, మహర్షులును వచ్చియుండిరి. అందఱు నొకటే పాకశాలయందు భోజనము చేయుచుండిరి. క్రైస్తవ మహమ్మదీయాది మతమతాంతరములు ప్రబలమై తమలో దమకు విరోధములు కలిగి మద్యపానము, గోమాంసాది భోజనము చేయదొడగిననాటినుండి భోజనాదులయందు గష్టలు కలిగెను. చూడుడు! కాబూలు, కందహారు, ఈరాన్, అమెరికా, యూరోపు మొదలగు దేశముల రాజకన్యలగు గాంధారి, మాద్రి, ఉలూపి మొదలగు వారిని నార్యావర్తీయులగు రాజులు వివాహమాడిరి. శకుని మొదలగువారు కౌరవపాండవులతో గలిసి భోజనాదులు చేయుచుండిరి. విరోధించుచుండ లేదు. ఏలయనగా నప్పుడు భూగోళమందంతట నొక్కవేదోక్త ధర్మమే యుండెను. అందఱకు నిష్ఠయు దానియందే యుండెను. ఒకరి సుఖదుఃఖహాని లాభముల నితరులు తమవని తలంచుచుండిరి. అప్పుడే భూగోళమందు సుఖముండెను. ఇప్పు డనేక మతస్థులగుటచే మిక్కిలి దుఃఖము, విరోధము వర్ధిల్లినది. దీనిని దూరపఱచుటయే బుద్ధిమంతుల కుచితము. మిథ్యామతములు శీఘ్రముగా నశించుట కాపరమాత్మ యందఱి మనస్సులందు సత్యమతాంకురమును నాటునుగాక! ఈ విషయమునందు విద్వాంసులందఱును విచారించి విరోధము వదలి యానందమును వృద్ధిపఱతురుగాక!

ఇది సంక్షేపముగ ఆచారానాచార భక్ష్యాభక్ష్యముల విషయము. ఈ గ్రంథపూర్వార్ధ మీపదియవ సముల్లాసముతో ముగిసినది. ఈ సముల్లాసములయందు విశేషించి ఖండన మండనములు వ్రాయబడలేదు. ఏలయనగా మనుష్యుడు సత్యాసత్య విచారమందు నించుకేని సామర్థ్యమును వృద్ధిపఱచుకొననంతవఱకు స్థూలసూక్ష్మఖండనముల యభిప్రాయమును దెలిసికొనజాలడు. కాబట్టి మొదట సత్యశిక్షయే యెల్లరకుపదేశింపబడినది.

ఇక నాలుగు సముల్లాసములుగల యుత్తరార్ధమందు ఖండనమండనములు వ్రాయబడును. ఈ నాల్గింటిలో మొదటి సముల్లాసమందు నార్యావర్తీయమతమతాంతరములయు, రెండవ దానియందు జైనులయు, మూడవదానియందు గ్రైస్తవులయు, నాల్గవదానియందు ముసల్మానులయు మతఖండన మండన విషయములు వ్రాయబడును. విశేషించి ఖండనమండనములను జూడగోరువారీ నాలుగు సముల్లాసములను బక్షపాతమువదలి న్యాయదృష్టితో జూచువారికి నాత్మయందు సత్యార్థప్రకాశము కలిగి యానందమంకురించును. హఠము, దురాగ్రహము, నీర్ష్య వీనితో జూచువారికి గాని, వినువారికిగాని, యీగ్రంథాభిప్రాయము యథార్థముగ విదితమగుట మిక్కిలి కఠినము. కాబట్టి యథారీతిని విచారింపని

వాడు దీనియభిప్రాయమును దెలిసికొనలేక మునిగిపోగలడు. సత్యాసత్యనిర్ణయము చేసి సత్యమును గ్రహించి యసత్యమును వదలి పరమానందము నొందు గుణగ్రాహకులే విద్వాంసులై, ధర్మార్థ కామ మోక్షము లను ఫలములను బొంది ప్రసన్నులై యుందురు. ఇదియే విద్వాంసుల కర్తవ్యము.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును
సుభాషా విభూషితమునగు సత్యార్థ ప్రకాశమున
ఆచారానాచార భక్ష్యాభక్ష్య విషయములుగల
దశమ సముల్లాసము సంపూర్ణము.

ఓ౩మ్

ఉత్తరార్ధము

# అనుభూమిక

ఐదువేల సంవత్సరములకు బూర్వము వేదమతము తక్క మఱియొక మతము లేదని సిద్ధమైనది. ఏలయనగా వేదోక్తములైన సర్వ విషయములు విద్యకు నవిరుద్ధములయి యున్నవి. వేదముల యప్రవృత్తి కారణముగా మహాభారత యుద్ధము జరిగినది. వేదముల యప్రవృత్తి వలననే భూగోళమున నవిద్యాంధకారము విస్తృతమై మనుష్యుల బుద్ధి భ్రమయుక్త మగుటవలన నెవరి మనస్సునకు దోచినట్లు వారు నానా విధమతముల నారంభించిరి.

ఆమతము లన్నింటిలోను నాలుగు మతములు పురాణీ,జైనీ, కిరానీ, కురానీ, పురాణమతము, జైన మతము, క్రైస్తవమతము, మహమ్మదీయ మతము ననువేదవిరుద్ధ మతములు ప్రచలితములు కాదొడగెను. ఇవి యన్నియు నొకదానివెంట మఱియొకటి వెలసినవి. ఇప్పుడీమతముల శాఖలు సహస్రముకంటె నెక్కువయే యుండును. ఈ సర్వమతవాదులు, వీరిశిష్యులు, మిగిలిన వారెల్లరు గలిసి సత్యాసత్యములను విచారించుటలో నెక్కువశ్రమ కలుగకుండుటకే యీ గ్రంథము వ్రాయబడినది.

సత్యమతమండనము, నసత్యమతఖండనము నెల్లరకు దెలుపుటయే ప్రయోజనముగా నిందుజేయబడినవి. నా బుద్ధికొలది నా విద్యానుసార మీ నాల్గుమతముల మూలగ్రంథముల నవలోకించుటవలన నాకు బోధపడినంత నందఱియెదుట నివేదించుటయే యుత్తమమని యూహించితిని. ఏలయనగా, గుప్తమైన విజ్ఞానము మరల లభించుట సహజము కాదు. పక్షపాతము వదలి యీ గ్రంథమును జదువుట వలన సత్యాసత్యమతములెల్లరకు దెలియగలవు. పిమ్మట వారివారి తెలివికొలది సత్యమతమును గ్రహించుటయును, నసత్యమతములను ద్యజించుటయును వారికి సులభమగును. వీనిలో బురాణాది గ్రంథములనుబట్టి శాఖశాఖాంతర రూపములనుబొంది, యార్యావర్తదేశమునందు బ్రచలితమై యున్న మతముల గుణదోషములను సంక్షిప్తముగా నీపదునొకండవ సముల్లాసమున గనబఱచుచున్నాడను. ఒకనికి హాని గలుగ జేయుట గాని, యొకరితో విరోధము బూనుటగాని నాయభిప్రాయము కాదు. కాని సత్యాసత్య నిర్ణయము జేయుటయు, జేయించుటయు నాపని. కావున నా యీ కార్య ముపకారకమని యెన్నక పోయినను, విరోధము మాత్రము చేయకుడు. ఈరీతినే మనుష్యులందఱును న్యాయవిచక్షణ గల్గి వర్తించుట యత్యుచితము. మనుష్యుడై పుట్టినది సత్యాసత్యనిర్ణయము చేయుటకును, జేయించుటకే కాని , వాదవివాదము లొనర్చుచు విరోధము బూనుటకుగాని, కలిగించుటకు గాని కాదు. ఈమతమతాంతరముల వివాదముల వలన జగత్తునందు నింతవఱకు బుట్టినట్టియు, నిప్పుడు పుట్టుచున్నట్టియు, నికముందు బుట్టబోవునట్టియు ననర్థములను బక్షపాతరహితులైన విద్వాంసులెఱుంగ సమర్థులు. ఈ మనుష్యజాతిలో మిథ్యా, మతమతాంతరముల పరస్పర విరుద్ధ వాదములు దూరము గానంతవఱకు నన్యోన్యానందము కలుగ జాలదు. కావున మనుష్యుల మగు మన మందఱమును నందులో ముఖ్యముగా విద్వజ్జనులును నీర్ష్యాద్వేషములను, వదలి సత్యాసత్యనిర్ణయము చేసి, సత్యగ్రహణమును, నసత్యపరిత్యాగమును జేయుట, జేయింప గోరుట యసాధ్యము కాదు. ఈ విద్వాంసుల విరోధమును బట్టియేయందఱును విరోధ మమువలలో దగులువడి యున్నారనుటలో సందేహము లేదు. కాని స్వార్థపరత్వమునకు లోబడక యందఱిప్రయోజన సిద్ధికొఱకు బాటుపడదలచినచో నైకమత్యమిప్పుడుగూడ గలుగవచ్చును. దీనికి గావలసిన యుపాయముల నీ గ్రంథము చివర వ్రాయగలవాడను. సర్వశక్తిమంతుడగు పరమాత్మ మనుష్యులందఱు నొక్క మతమునే యవలంబించునట్టి యుత్సాహమును వారియాత్మలందు బ్రకాశింపజేయునుగాక, విద్వద్వర శిరోమణులకు వివరములతో బనిలేదు.

# ఏకాదశసముల్లాసము

## (ఆర్యావర్తీయ మత ఖండన మండనములు)

ఇప్పుడార్యావర్తదేశమున నుండు నార్యులమత ఖండనము మండనము చేయుదుము. ఈ యార్యావర్తదేశమునకు సదృశమైన మఱియొక దేశము భూగోళమున లేదు. కావున నీ భూమిని సువర్ణభూమి యందురు. ఇక్కడ సువర్ణాదిరత్నము లుత్పన్నములగును. కావుననే సృష్టికి నాదియందు నార్యులీ దేశమునకు వచ్చి వసించిరి. అందువలననే యింతకు బూర్వము సృష్టి విషయమున నుత్తమ పురుషులను నార్యులనియు, నార్యులకంటె భిన్నులైన మనుష్యులను దస్యులని చెప్పియుంటిమి

భూగోళమున నున్న దేశములన్నియు, నీ దేశమును బ్రశంసించుచున్నవి. మఱియు పరుసవేది యనుమణి యొకటి యున్నట్లుగా నాశలు పెట్టుకొనుచున్నారు. పరుసవేది మణి యుండుట యనిత్యము. కాని యార్యావర్తదేశమే నిజమైన పరుసవేది. పరుసవేది యను నీదేశమును లోహరూపమగు దరిద్రులయిన విదేశీయులు స్పృశించగానే సువర్ణ మనగా ధనాఢ్యులగుచున్నారు.

(ఆర్యసార్వభౌమరాజ్యము)

సృష్టినుండి ౫000సంవత్సరముల పూర్వసమయమువఱకు నార్యుల సార్వభౌమ చక్రవర్తి రాజ్యము భూగోళమునందంతట సర్వోపరి విరాజిల్లు చుండెను. అన్ని దేశములలో మాండలికులు - చిన్నచిన్న రాజులుండెడివారు. కౌరవపాండవుల పర్యంత మిక్కడి రాజ్యమునందు, రాజశాసనమునందును భూగోళమునందలి రాజులెల్లరు, బ్రజలును వర్తించుచుండిరి. ఏలయన సృష్టికాదియందు వ్రాయబడిన మనుస్మృతిలో నిందుకు బ్రమాణము చూడబడుచున్నది.

"ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః,
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః (మను. ౨-౨౦)

'ఈ యార్యావర్తదేశమునందుత్పన్నులైన బ్రాహ్మణులు-విద్వాంసులైనవారినుండియే భూగోళమునందలి మనుష్యులు -బ్రాహ్మణులు, క్షత్రియులు,వైశ్యులు, శూద్రులు, దస్యులు, మ్లేచ్ఛులు మున్నగువారెల్లరు దమకు యోగ్యమైన విద్యను, చరిత్రములను, శిక్షను, విద్యాభ్యాసమును నేర్చుకొందురుగాకః

మఱియు యుధిష్ఠిర మహారాజు చేసిన రాజసూయయాగము వఱకు, మహాభారతయుద్ధము వఱకు సమస్తభూమండలరాజ్యము లన్నియు నీదేశపు రాజ్యాధీనముననే యుండెను. వినుడు చీనాదేశపు భగదత్తుడు, అమెరికా దేశపు బభ్రువాహనుడు, ఐరోపాదేశపు బిడాలాక్షుడు - పిల్లికన్నులవంటి కన్నులు గలవాడును, నింతకు బూర్వము చెప్పిన యూనాన్ (గ్రీకు ) దేశమునకు సంబంధించిన యవనుడు, 'ఈరాను'కు సంబంధించిన శల్యుడు నను నీ రాజు లెల్లరు, రాజసూయ యజ్ఞమునందును, మహాభారత యుద్ధమునందును నాజ్ఞానుసారము వచ్చి పాల్గొని యుండిరి. రఘువంశజులు రాజులుగా నున్నపుడు రావణుడుకూడ నీదేశమువారి కధీనుడై యుండెను. రామచంద్రుని సమయమున నతడు విరోధియయ్యెను. అందువలన రామచంద్రుడతనిని దండించి రాజ్యభ్రష్టుని జేసి యతని తమ్ముడైన విభీషణుని రాజ్యమునం దభిషిక్తుని జేసి యున్నాడు.

స్వాయంభువరాజు మొదలు పాండవులవఱకు నార్యుల చక్రవర్తి రాజ్యము సర్వత్ర వర్తిల్లుచుండెను. తదుపరి పరస్పరవిరోధమువలన గలహించి నాశముబొందిరి. ఏలయన నీ పరమేశ్వరుని సృష్టియందు నభిమానులు, నన్యాయకారులు, నవిద్వాంసులునగువారి రాజ్యము బహుకాలము నడవదు. మఱియు నధికధనము నసంఖ్య ప్రయోజనములవలన నధికమైనపుడాలస్యము, పురుషార్థరహితత, ఈర్ష్యా

ద్వేషములు, విషయాసక్తి ప్రమాదము లెక్కువగును. అందువలన దేశమున విద్య సుశిక్ష నష్టమై దుర్గుణములు, దుష్టవ్యసనములు ప్రబలిపోవును. అట్లే మద్యమాంసముల సేవనము, బాల్యవివాహాదులు, స్వేచ్ఛాచారాదిదోషములు వృద్ధిపొందును. ఇయ్యది లోకమునకు స్వాభావిక ప్రవృత్తియై యున్నది.

యుద్ధవిభాగమున యుద్ధవిద్యాకుశలత, సేనయు, భూగోళమున నెవ్వరిచేతను నెదుర్కొనబడజాలనంత యధికముగా బెరిగినపుడు వారిలో బక్షపాతము, నభిమానము నెక్కువయై యన్యాయము వృద్ధిపొందును. ఇట్టి దోషములు కలిగినపుడు తమలో దమకు విరోధము లేర్పడును. లేక వారికంటె నధికులైన చిన్నకులములవారిలో నెవడో యొకడు సమర్థుడై నిలబడి వారి బరాజితులం జేయ సమర్థుడగును. మహమ్మదీయుల శాసన కాలమున, శివాజీ, గోవిందసింహుడు నిలబడి మహమ్మదీయుల రాజ్యమును ఛిన్నభిన్నము జేయుట నెవరెఱుగరు ?

(పూర్వకాలపు చక్రవర్తి రాజులు)

అథ కిమేతైర్వా పరేఽన్యే మహాధనుర్ధరాశ్చక్రవర్తినః కేచిత్ సుద్యుమ్న
భూరిద్యుమ్నేంద్రద్యుమ్న కువలయాశ్వ యౌవనాశ్వ వధ్ర్యశ్వ
అశ్వపతి శశబిందు హరిశ్చంద్రాంబరీష ననక్తు సర్యాతి యయాత్యనరణ్యాక్ష సేనాదయః
అథ మరుత్త భరతప్రభృతయో రాజానః మైత్ర్యుప ౧-౪

ఇట్టి ప్రమాణములతో సృష్టి - ఆరంభమునుండి మహాభారతయుద్ధము వఱకు జక్రవర్తులైన సార్వభౌమరాజు లార్యావర్తదేశమున నుండిరనుట సిద్ధమగుచున్నది. తదుపరి వీరిసంతాన మభాగ్యోదయమువలన రాజ్యభ్రష్టులై విదేశీయులకు బాదాక్రాంతులై యున్నారు. సుద్యుమ్నుడు, భూరిద్యుమ్నుడు, ఇంద్రద్యుమ్నుడు, కువలయాశ్వుడు, యౌవనాశ్వుడు, వధ్ర్యశ్వుడు, అశ్వపతి, శశబిందుడు, హరిశ్చంద్రుడు, అంబరీషుడు, ననక్తుడు, సర్యాతి, యయాతి, అనరణ్యుడు, అక్షసేనుడు, మరుత్తుడు, భరతుడు, సమస్తభూమియందు బ్రసిద్ధులై సార్వభౌములైన చక్రవర్తిరాజుల నామములు వ్రాయబడినట్లు స్వాయంభువాది చక్రవర్తుల నామములుకూడ మనుస్మృతిలోను, మహాభారతాది గ్రంథములందును వ్రాయబడియున్నవి. ఇదియంతయు మిథ్యయనుట యజ్ఞానులయు బక్షపాతముగలవారియు గార్యము.

(అస్త్రములు)

ప్రశ్నః-ఆగ్నేయాద్యస్త్రములున్నవా? సత్యమేనా? పూర్వము శతఘ్నులు, తుపాకులునున్నవా?

ఉత్తరముః-ఉన్నవి. సత్యములే. అస్త్రములు శస్త్రములు నన్నియు నున్నవి. ఏలయనగా బదార్థవిజ్ఞానమువలన నివి యన్నియు సంభవములే.

ప్రశ్నః- ఇవి యన్నియు దేవతల మంత్రములవలన సిద్ధము లగుచుండెడివా?

ఉత్తరముః- కాదు. మంత్రము లనగా విచారములు - ఆలోచనలు, ఆలోచించి యస్త్రశస్త్రములు సిద్ధము చేయబడుచుండెడివి. ఆలోచనా పూర్వకముగానే వానిని నడపెడివారు. శబ్దమయ మంత్రముల వలన ద్రవ్యములుత్పన్నములు కావు. మంత్రజపమువలన నగ్నిపుట్టునని యెవరేని యనిన నదియు సత్యము కాదు. జపమువలన నగ్ని పుట్టిన జపము చేయువాని నాలుక ముందు దగ్ధము కావలయును. అది నిజమే యగునెడల శత్రువును జంపబోయి తానే చచ్చును. కావున మంత్రమనగా నాలోచన - విచారమని యర్థము. రాజమంత్రి - అనగానేమి? రాజునకు సలహాలు - ఆలోచనలు చెప్పువాడనికదా యర్థము. మంత్రము - విచారమువలన బ్రథమమున సృష్టిలోని పదార్థ ముల నెఱిగి యటుపై గ్రియ నొనర్చుట వలన ననేకపదార్థములు క్రియాకౌశలములును సిద్ధించును.

ఎవడేని యొక లోహపు బాణమునుగాని, గోళమునుగాని సిద్ధముచేసి యందు నగ్నిని రగుల్చగానే

గాలిలో నగ్నిధూమము వ్యాపించునట్లు పదార్థములనుంచి ప్రయోగించిన నది యాగ్నేయాస్త్రమగును.

ఆగ్నేయాస్త్రమును బ్రయోగించినపుడు దానిని నివారించుటకు మఱియొకడు వారుణాస్త్రమును బ్రయోగించును. దానివలన నాగ్నేయాస్త్రము నుండి వెలువడిన యగ్ని యాఱిపోవును. అట్టిదియే నాగ పాశము. దానిప్రయోగమువలన శత్రువుల యంగముల నది గట్టిగా గట్టివేయును. అట్లే మోహనాస్త్రము. అందులో మత్తును గలిగించు పదార్థముల నిమిడ్చి ప్రయోగింతురు. అందువలన నామత్తుపదార్థము గాలిలో వ్యాపించి యది సోకినవారికి మూర్ఛవచ్చినట్లగును. ఇట్లే శస్త్రాస్త్రములన్నియు సిద్ధము చేయ బడును. ఒకతీగెతోగాని, యేదేని మఱియొక పదార్థముతో గాని విద్యుత్తు నుత్పన్నముచేసి శత్రువును నాశనము చేయుచుండెడివారు. దానిని నాగ్నేయాస్త్రమనిగాని, పాశుపతాస్త్రమని గాని యందురు.

'తోపు, బందూక్ ' అను నీపదము లితరదేశభాషలకు సంబంధించినవి. సంస్కృతమునకు గాని, యార్యావర్తపుదేశభాషకు సంబంధించినవికాని కావు. వీనిని సంస్కృతమున శతఘ్ని,'భుశుండీ' యందురు. సంస్కృతము నెఱుగనివారు భ్రమలోబడి తమకిష్టము వచ్చిన నామములు పెట్టి వ్యవహరింప సాగిరి. బుద్ధిమంతులు వానిని బ్రమాణముగా నెంచరు.

(ఆర్యావర్తమునుండి యన్నివిద్యలు వ్యాపించినవి)

భూగోళమున వ్యాపించియున్న విద్యలన్నియు నీ యార్యావర్తమునుండియే వ్యాపించినవి. ఈ దేశమునుండి మిశ్రదేశమువారు, వారినుండి యూనానులు, వారినుండి రోమువాసులు, నటనుండి ఐరోపా దేశము, వారినుండి అమెరికాదేశమువారు విద్యలు నేర్చుకొనిరి. నేటివఱకు సంస్కృతవిద్య యార్యావర్త మున నున్నంత మఱియేదేశమునందును లేదు. జర్మనీదేశమునందు సంస్కృతవిద్యాప్రచార మెక్కుడు న్నట్లు జనులు చెప్పుచున్నారు. ఇంతేకాక మోక్షమూలర్ చదివినంత సంస్కృతము మఱియెవరు జదువ లేదనియు నందురు. ఇది కథనము మాత్రమే కాని వాస్తవము కాదు. ఏలయనగా-

'యస్మిన్ దేశే, ద్రుమో నాస్తి తత్రై రండోపి ద్రుమాయతే' చెట్టు లేనిచోట నాముదపుచెట్టుకూడ బెద్దవృక్షముగా నెంచబడును. అని సామెత యున్నట్లు - ఐరోపాదేశమున సంస్కృత ప్రచారము లేనందున జర్మనీ దేశవాసులు మోక్షమూలర్ కొలదిగా జదివినను బెద్దగా బ్రసిద్ధిబొందిరి. ఆర్యావర్తమువంక జూచిన వారివిద్య యత్యల్ప మనవలయును. ఏలయనగా జర్మనీదేశ వాసి యొక ప్రిన్సిపాల్ వ్రాసిన లేఖనుబట్టి జర్మనీదేశమున సంస్కృత పత్రమును జదివి యర్థము తెలిసికొనగలిగినవారు కూడ లేరని తెలిసినది.

ఇక మోక్షమూలర్ వ్రాసిన సంస్కృత సాహిత్యమును, వేదవ్యాఖ్యను జూచిన మీదట నాకు విదిత మైన దేమనగా నతడార్యావర్తీయులు వ్రాసిన టీకలు చూచి యేదో యొక విధముగ గొంచెము వ్రాసినాడే కాని యంతకుమించి యేమియు లేదు. అదియెట్లన

**యుంజన్తి బ్రధ్నమరుషం చరంతం పరితస్థుషః రోచన్తే రోచనా దివి (ఋ.౧-౬-౧)**

ఈ మంత్రములోని 'బ్రధ్నం' అనుపదమునకు గుఱ్ఱమని యర్థము వ్రాసినాడు. ఇతనికంటె సాయణాచార్యుడు 'సూర్యుడు' అని చేసిన యర్థమెంతయో బాగుగా నున్నది. వాస్తవమున నీరెండర్థములు సరికావు. ఈ పదమున కర్థము పరమాత్మ. నేను వ్రాసిన ఋగ్వేదాదిభాష్యభూమికను జూడుడు. అట నీ మంత్రమునకు యథార్థమైన యర్థము వ్రాయబడినది. దీనితోనే జర్మనీదేశమున నెంత సంస్కృతవిద్యా ప్రచార మున్నదియు మోక్షమూలర్ గారి పాండిత్య మెంతలో నున్నదియు దెలిసికొనవచ్చును.

భూగోలమున వ్యాపించియున్న విద్యలు మతములు నన్నియు నార్యావర్తదేశమునుండియే వ్యాపిం చిన వనుట నిశ్చితము. చూడుడు - ఫ్రాన్స్‌దేశమువాడైన గోల్డుస్టకర్ పైరస్ అనువ్యక్తి బైబిల్ ఇన్ ఇండియాఅను పుస్తకమున నేమి వ్రాసియున్నాడో -" సర్వవిద్యలకు, సర్వశుభములకు నాకర మార్యా

వర్తదేశమే యై యున్నది. ఈదేశమునుండియే సర్వవిద్యలు, సర్వమతములు నంతట వ్యాపించినవి. "ఓపరమేశ్వర! పూర్వకాలమున నార్యావర్తదేశమున నెట్టి యున్నతియుండెనో యట్టి యున్నతి మా దేశమునకును గలిగించుము. అని నేను ప్రార్థించుచున్నాను."

దారాశికోహ పాదుషా కూడ నిట్లే నిశ్చయించియున్నాడు. సంస్కృతమున నెట్లు పూర్ణవిద్య యున్నదో యట్లేభాషయందును లేదు. అతడుపనిషత్తులకు భాషాంతరముచేయుచు వ్రాసిన మాటలివి. "నేను 'అరబ్బీ' మున్నగు భాషలు చదివితిని. కాని నా మనస్సునగల సందేహములు పోయి యానందము కలుగలేదు. సంస్కృతమును చూచి విన్న తరువాత నా సందేహము లన్నియు బోయి మిక్కిలి యానందమును బొందితిని."

(ప్రాచీన జ్యోతిషయన్త్రము)

కాశీలోనున్న మానమందిరమునగల శిశుమార చక్రమును జూడుడు. దానికి బూర్తిరక్షణమును లేదు. ఐనను నది యెంతటి యుత్తమమైనది? ఇప్పటికిని దానినిబట్టి చాల భూగోళ వృత్తాంతము తెలిసికొన వచ్చును. జయపురాధీశుడైన సవాయీమహారాజు దానిని బాగుచేసి మరమ్మతు చేయించిన బాగుండును.

(మహాభారతయుద్ధ ప్రభావము)

కాని, యిట్టి శిరోమణియైన దేశమునకు మహాభారతయుద్ధమువలన గలిగిన క్షతివలన నీదేశము నేటికిని బూర్వదశను మరల బొందజాలక పోయినది. ఏలయన సోదరుని సోదరుడు చంపబూనుకొనిన దేశము నాశము బొందక యేమగును.

'వినాశకాలే విపరీతబుద్ధిః' చా. నీ. ౧౬-౫

ఇది యొక కవివచనము. నాశము సమీపించినపుడు విపరీతబుద్ధి కలిగి విపరీతముగ బ్రవర్తింతురు. ఎవరైనను సరిగా బోధించిన దానిని విపరీతముగ గ్రహింతురు. విపరీతముగ బోధించినదానిని సరియని భావింతురు.

మహాభారత యుద్ధమున బెద్దబెద్ద విద్వాంసులు, రాజులు,మహారాజులు, ఋషులు, మహర్షులు నెందఱో చంపబడిరి. అందువలన నప్పటినుండియు విద్యయు, వేదోక్తధర్మప్రచారము నష్టమై పోయిన దీదేశమున.ఈ దేశవాసులు పరస్పరము నీర్ష్యాద్వేషములు నభిమానము చేయదొడగిరి. బలవంతుడైన వాడు దేశమును బణముగా నొడ్డి రాజై కూర్చుండసాగెను.అట్లే యార్యావర్తమున నంతట ఖండఖండ రాజ్యము లేర్పడెను. అట్టియెడ ద్వీపద్వీపాంతరముల రాజ్యముల వ్యవస్థను జేయువారెవరున్నారు?

(నామధారి బ్రాహ్మణులు)

బ్రాహ్మణులు విద్యావిహీను లయినపుడు క్షత్రియులు,వైశ్యులు, శూద్రులు, నవిద్వాంసు లగుటలో జెప్పవలసిన దేమున్నది? పరంపరగా వేదశాస్త్రముల నర్థసహితముగా జదువు ప్రచారము దేశమున నశించినది. బ్రాహ్మణులు కేవలము జీవికార్థము చదువ నారంభించిరి. క్షత్రియాదులకు నర్థములేకున్నను బాఠముమాత్రముకూడ జెప్పుట మానిరి. అవిద్వాంసులు గురువులు కాగా ఛలకపటాదులు, నధర్మము వారిలో వృద్ధిజెందజొచ్చెను. తమ జీవికకు దగిన ప్రబంధము నేర్పఱచుకొనవలయునని బ్రాహ్మణులు తలంచిరి. అందఱు గలిసి నిశ్చయించుకొని క్షత్రియాదులకు దామే పూజ్యదేవతలమని చెప్పదొడగిరి. తమకు సేవ చేయకున్న స్వర్గముకాని మోక్షముకాని లభింపదని యుపదేశింపసాగిరి. అంతేకాక తమకు సేవచేయని వారికి ఘోరనరకము గూడ ప్రాప్తించునని చెప్ప నారంభించిరి. వేదశాస్త్రములందు బూర్ణవిద్వాంసులైన ధార్మికులను బ్రాహ్మణులనియు, వారికి బూజచేయవలయుననియు వ్రాయబడియుండెను. అట్టే బ్రాహ్మణులము తామే యని మూర్ఖులు, కపటులు, విషయలంపటులు చెప్పుకొనుచు

బూజింప బడసాగిరి. భళీః ఆయాప్త విద్వాంసుల లక్షణము లీమూర్ఖులలో నెట్లు వర్తించును. కాని క్షత్రి యాదులు విద్వాంసులు కానందున, సంస్కృతవిద్య నభ్యసింపనందునను నట్టివారిని యజ మానులుగా జేసి వారి యెదుట నిష్టము వచ్చినట్లు గప్పాలు గొట్ట నారంభించిన ధూర్తులమాటలు వారు నమ్మసాగిరి. అప్పుడీ నామమాత్ర బ్రాహ్మణుల యాటలు సాగనువయ్యెను. ఇట్లు జనులను దమవలలో వేసికొని, వశపఱచుకొనిరి. 'బ్రహ్మవాక్యం జనార్దనః' బ్రాహ్మణముఖమునుండి వెలువడిన ప్రతివాక్యము సాక్షాత్తు భగవంతుని నోటినుండి వెలువడినట్లెంచవలయునని బోధింపసాగిరి.

ఇట్లు క్షత్రియాదులు విద్యారూప నేత్రములు లేక యంధులై దగ్గఱ బుష్కలధనము గలవారగుట వలన నట్టివారిని శిష్యులుగా జేసికొని యీ నామమాత్రులైన బ్రాహ్మణులకు విషయానందము ననుభవింప నవకాశము దొరకెను. భూమిమీద నున్న శ్రేష్ఠమైన పదార్థము లన్నియు బ్రాహ్మణుల కొఱకే యనియు వారు ప్రసిద్ధిజేసిరి. గుణకర్మస్వభావమువలన నేర్పడియున్న వర్ణవ్యవస్థను నాశముచేసి దానిని జన్మసిద్ధమని నిర్ణయించిరి. మృతకదానములను గూడ యజమానుల నుండి తీసికొనజొచ్చిరి.

తమ యిష్టము వచ్చినట్లెల్ల జేయ దొడగిరి. తమ్మువారము భూదేవులమనియు జెప్పుకొన నారం భించిరి. తమ సేవ జేయనివారికి దేవలోకము లభింపదనిరి. కాని వారేలోకమునకు బోదురో వారి నడుగ వలయును. కారణమేమన వారొనర్చుపనులు ఘోరనరకమునకు బోదగినవిగా నున్నవి. వారి కానారకీయ దుఃఖములు కృమికీటకాది నారకీయ జన్మములలోనే దొరకును. వారి నెట్లెవరైన మందలించిన నట్టివారిని మేము మిమ్ములను శపింతుము. మీరు నశింతురు. కారణ మేమన 'బ్రహ్మద్రోహీ వినశ్యతి' బ్రాహ్మణులను ద్వేషించువాడు నశించును. అని వ్రాయబడియున్నది. అని చెప్పుదురు. బెదరింతురు. వాస్తవమున బూర్ణ వేదమును, బరమాత్మను నెఱిగినవారై సర్వజగత్తునకు నుపకారము జేయు పురుషులను - నిజమైన బ్రాహ్మణపదవాచ్యులను నిందించువారు ద్వేషించువారు నశింతురు. కాని, నామధారులైన యీధూర్తుల యిన బ్రాహ్మణులను సేవింపరాదు. వీరికి బ్రాహ్మణనామమే వర్తింపదు. ఇట్టినామధారి బ్రాహ్మణులే యిట 'పోపు' లనబడుదురు.

ప్రశ్నః- అయిన మేమెవరము? ( ఇక్కడ ప్రశ్నకర్త బ్రాహ్మణ నామధారిగా నెంచవలయును)

ఉత్తరముః- మీరు 'పోపు'లు.

ప్రశ్నః- 'పోపు' అని యెవరినందురు?

ఉత్తరముః- 'రోమన్' భాషలో నీ పదమునకు బెద్దవాడు-తండ్రి యని యర్థము. కాని మేము మాత్ర మిపుడు ఛలకపటాదులతో నితరులను వంచించి తమప్రయోజనములను నెఱవేర్చుకొనువారిని పోపు లని చెప్పుదుము.

ప్రశ్నః- మేము బ్రాహ్మణులము-సాధువులము కదా; ఏలయనగా మా తల్లిదండ్రులు బ్రాహ్మణులు మేముకూడ కొండొక సాధువునకు శిష్యులము.

ఉత్తరముః- ఇది సత్యమే కాని, సోదరా! వినుము. తల్లిదండ్రులు బ్రాహ్మణులైనంతమాత్రమున కాని యొకానొక సాధువునకు శిష్యులైనంత మాత్రమున గాని యెవరును బ్రాహ్మణులు, సాధువులును కారు. ఉత్తమగుణకర్మ స్వభావములచేతను, పరోపకార మొనర్చుటచేతను బ్రాహ్మణ సాధువు లగుదురు.

(రోము-పోపులు)

ఇది మేము వినిన విషయముః- రోములో బోపులు తమశిష్యుల కిట్లు చెప్పుదురు. 'మీరు మీపాప ములు మాకు జెప్పిన మేము వానిని క్షమింతుము. మాసేవ చేయక, మా యాజ్ఞ లేక యెవరును స్వర్గము 'నకు వెళ్ళజాలరు. నీవు స్వర్గమునకు వెళ్ళదలంతువేని, నీవు మాదగ్గఱ నెంత ధనము జమ చేయుదువో

యంతయే సామగ్రి నీకు స్వర్గమున లభించును. ఇట్లు విని యెవడేని జ్ఞానాంధుడైన ధనవంతుడు పోపు గారికిస్వర్గమునకు బోగోరి ధనము పుష్కలముగా నిచ్చినపుడు క్రీస్తు మరియమ్మ బొమ్మల యెదుట నిలబడి పోపు హుండీ యొకటి వ్రాసి యిచ్చెడివాడు. పోపువ్రాయుహుండీ స్వరూపము:-

"ఓఖుదావంద యేసుప్రభూ! ఈ మనుష్యుడు నీ నామముమీద నొకలక్షరూప్యములు స్వర్గమునకు వెళ్ళుటకు నా దగ్గఱ జమచేసినాడు. ఇతడు స్వర్గమునకు వచ్చినపుడు నీవు నీ తండ్రియొక్క స్వర్గరాజ్యమున నిరువదియైదువేలకు నొకతోట, భవనము, మఱియొక పావులక్షకు వాహనములు, నౌకరులు, ఇంకొక పావులక్షకు నన్నపానములు, వస్త్రములు, మిగిలిన పావు లక్షకు నితని యిష్టమిత్రులయు, బంధువులయు సుఖాదుల కొఱకు నిప్పింపుము."

ఇట్లు హుండీ వ్రాసి దానిక్రింద దనసంతకము చేసి యతనిచేతి కందించి యిట్లు చెప్పెడివాడు. "నీవు చనిపోయినపు డీహుండిని నీగోరీలో నీ తలక్రింద బెట్టుటకు నీ బంధువులకు జెప్పియుంచుము. నిన్ను దీసికొని వెళ్ళుటకు దేవదూతలు వచ్చినప్పుడు వారు నిన్ను నీతో బాటీహుండీని దీసికొనివెళ్ళి హుండీలో వ్రాసినట్లు నీ కక్కడ నన్నియు నేర్పాటుచేసి చేకూర్చుదురు."

చూడుడు: పోపు స్వర్గమును గుత్తకు దీసికొనినట్లు వ్యవహరించుచున్నాడు. ఐరోపాదేశమున మూర్ఖత యున్నంతవఱకు నీపోపులీల యిట్లు నడుచుచుండెను. కాని యిప్పుడు విద్యాధిక్యతవలన నీపోపు-వ్యర్థలీల యంతగా నడుచుట లేదు. కాని పూర్తిగ నిర్మూలమును గాలేదు.

(ఆర్యావర్తపుపోపులు)

ఇట్లే యార్యావర్తమునందును పోపు లక్షలాది రూపములు దాల్చి తనలీలలను వ్యాపింపజేసి యున్నాడు. రాజులలోను బ్రజలలోను జదువు లేకుండచేయుట, సత్పురుషులసాంగత్యము చేయకుండుట, రాత్రిందినములు జనులను మోసగించుట తప్ప మఱియొకపని చేయకుండుట మున్నగు కార్యము లన్నియు పోపు లీలాఫలితములే. ఛలకపటాది కుత్సిత వ్యవహారము లొనర్చువారందఱు పోపులే యని నిశ్చయించుకొనవలయును. వారిలో నెవరేని నిజమైన ధార్మికులు, పరోపకారులు, విద్వాంసులు నున్నవారే బ్రాహ్మణులు, వారే సాధువులు ననబడుదురు. ఇప్పుడు ఛలులు, వంచకులు, స్వార్థపరులు నైనవారినే పోపుశబ్దముచే గ్రహింప నగును. ఉత్తమ పురుషులను సాధువులు, బ్రాహ్మణులు నని యెంచవలయును.

(ఉత్తమబ్రాహ్మణులు-వేదరక్షకులు)

ఉత్తమబ్రాహ్మణులు, సాధుపురుషులు లేకున్న వేదాదిశాస్త్రములు, స్వరసహితముగా బఠనపాఠములు చేయుట, జైన, క్రైస్తవ, మహమ్మదీయుల వలలలో బడకుండ నార్యులను గాపాడి వేదాది సత్యశాస్త్రము లందు బ్రీతి గలుగజేసి వర్ణాశ్రమవ్యవస్థలో నుంచుట, మున్నగు కార్యములు సాధువులైన బ్రాహ్మణులు కాక మఱియెవ్వరు చేయగలరు?

"విషాదప్యమృతం గ్రాహ్యమ్" మను. ౨-౨౩౯.

విషమునుండియు నమృతమును గ్రహించుటవలె దారి తప్పించుట వంటి పోపులీలనుండి జనులను గాపాడుటయు, మతాంతరులవలలో జిక్కుకొనకుండజేయుటయు విషమునుండి యమృతమును గ్రహించుటవంటిదే.

(స్వార్థులైన బ్రాహ్మణులు)

యజమానులు విద్యావిహీనులైనపుడు స్వయముగా గొంచెము చదివి పూజాపాఠములు చేయనేర్చి యభిమానులై బ్రాహ్మణనామధారులు పరస్పర మాలోచించుకొని యేకమతితో రాజులు మున్నగు వారితో "బ్రాహ్మణులు సాధువులు నదండ్యులు", బ్రాహ్మణులు సాధువులు దండింప దగినవారు కారు. అని చెప్పి

'బ్రాహ్మణో న హంతవ్యః' 'సాధుర్న హంతవ్యః' అనునిట్టి సత్యమైన బ్రాహ్మణులకొఱకు, సాధువులకొఱకు వ్రాయబడిన వాక్యములు తమ కన్వయింప జేసికొనసాగిరి. ఇంకను మిథ్యావచనములతో గూడిన గ్రంథములు వ్రాసి, ఋషుల మునుల నామములందు జొప్పించి వారిపేర్లతోనే వినిపింప సాగిరి. ప్రసిద్ధులైన ఋషులయు మహర్షులయు నామముల నడ్డము పెట్టుకొని తాము తప్పులను జేసియు దండనమునుండి తప్పించుకొన మొదలిడిరి. తమ యిచ్చవచ్చినట్లు వ్యవహరింపసాగిరి. మఱియు వారి యాజ్ఞ లేకుండ తినుట, త్రాగుట, రాకపోకలు, కూర్చుండుట, నిలుచుండుట మున్నగు కార్యము లేవియు జేయుటకు వీలుకాని నియమములను నిర్మింప జేసికొనిరి.

పోపుపేరుతో బిలువబడు బ్రాహ్మణనామకు లెట్టి యపరాధ మొనర్చినను వారిని దండింప జేయరాదను నియమములు రాజులచే నొప్పించి శాసనముగా జేయించుకొనిరి. దండించుట యటుంచి మనస్సులో గూడ వారిని దండింప సంకల్పించుట పాపముగా నొప్పించిరి.

ఆర్యావర్తమున నిట్టి యనర్థములు మహాభారత యుద్ధము జరుగుట కొక సహస్రవర్షములకు పూర్వమే ప్రారంభమయ్యెను. కారణమేమన నప్పటికే యీదేశమున ఋషులు మునులు లోపించిరి. కొందఱున్నను వారిలో నాలస్య ప్రమాదములు నీర్ష్యాద్వేషములు కొలదికొలదిగా నారంభమయ్యెను. అవి క్రమముగా బెరిగి పెద్దవయ్యెను.

(సత్యోపదేశకులు లేక అంధపరంపర)

సత్యోపదేశకులు లేనప్పు డార్యావర్తమున నవిద్య వ్యాపించి పరస్పరము యుద్ధ మొనర్పసాగిరి. ఏలయనగా—

'ఉపదేశ్యోపదేష్టృత్వాత్ తత్సిద్ధిః, ఇతరథాన్ధపరంపరా' సాంఖ్య. ౩—౭౯ —౮౧.

ఉత్తములైన యుపదేశకు లున్నపుడు ధర్మార్థకామమోక్షములు బాగుగ సిద్ధించును. వారు లేనినాడు వినువా రుండరు. అప్పుడంధపరంపర యేర్పడును. అయినను సత్పురుషు లుత్పన్నులై యుపదేశించి నపుడీ యంధపరంపర నశించి ప్రకాశము—జ్ఞానపరంపర యేర్పడును.

అప్పుడు పోపులు మరల సావధానులై తమయొక్కయు, తమ పాదములయొక్కయు బూజలు చేయించుకొన నారంభింతురు. అందులోనే జనుల కల్యాణ మున్నదనియు బోధింతురు. ఇట్లు లోకులను వశపఱచుకొని తాము విషయాసక్తిలో నిమగ్నులై శిష్యులను వంచించుచు గాలము నయింతురు. విద్య, బలము, బుద్ధి,పరాక్రమము, శూరత, వీరత మున్నగు శుభగుణములు నశించును. అప్పుడు విషయాసక్తులై రహస్యముగా మాంసమద్యాదులను సేవింప దొడగుదురు.

(వామమార్గము పంచమకారములు)

తదుపరి యట్టివారినుండియే యొకడు వామమార్గమును నిలబెట్టెను. 'శివ ఉవాచ' పార్వత్యువాచ 'భైరవ ఉవాచ' అను నిట్టివాక్యములు వ్రాసి వానికి దంత్రములని నామములిడిరి. వానిలో నిట్టి చిత్రవిచిత్రములైన లీల లెన్నియో వ్రాసిరి.

"మద్యం మాంసం చ మీనం చ ముద్రా మైథునమేవ చ,
ఏతే పంచ మకారాః స్యుర్ మోక్షదా హి యుగే యుగే." ౧
"ప్రవృత్తే భైరవీచక్రే సర్వే వర్ణాః ద్విజాతయః,
నివృత్తే భైరవీచక్రే సర్వే వర్ణాః పృథక్ పృథక్." ౨
"పీత్వా పీత్వా పునః పీత్వా యావత్ పతతి భూతలే,
పునరుత్థాయ వై పీత్వా, పునర్జన్మ న విద్యతే" ౩.

"మాతృయోనిం పరిత్యజ్య విహరేత్ సర్వయోనిషు". ౪.
"వేద శాస్త్ర పురాణాని సామాన్యగణికా ఇవ,
ఏకైవ శాంభవీ ముద్రా గుప్తా కులవధూరివ"౫."జ్ఞాన సంకలనీ తంత్రము"

వేదమునకు విరుద్ధములైన మిక్కిలి యధర్మకార్యములను వామమార్గులు శ్రేష్ఠములుగా నంగీకరించిరి. చూడుడుః ఈ 'గవర్గండ' పోపులీలలుః

మద్యము, మాంసము, మీనము-చేప, ముద్రా - అనగా పూరీలు, కచోరీలు, పెద్దరొట్టె మున్నగునవి తినుట, మైథునము-పురుషులందఱు శివులనియు స్త్రీలందఱు పార్వతులనియు నంగీకరించి-

"అహం భైరవస్త్వం భైరవీ హ్యావయోరస్తు సంగమః"

పురుషుడుకాని, స్త్రీకాని యీవాక్యమును జదివి పరస్పరము సంగమము చేసిన దోషము లేదని వామమార్గులంగీకరింతురు.

అనగా స్పృశించుటకును నర్హులుకాని స్త్రీలను గూడ నీమంత్రముతో నతిపవిత్ర లను జేయుదురు. శాస్త్రములందు రజస్వల స్త్రీని దాకుట నిషిద్ధము. అట్టిస్త్రీలు నీవామమార్గుల కతిపవిత్రలు. వినుడు-వీరి ఖండబండశ్లోకములు.

"రజస్వలా పుష్కరం తీర్థం, చాండాలీ తు స్వయం కాశీ, చర్మకారీ ప్రయాగః
స్యాద్, రజకీ మథురా మతా, అయోధ్యా పుక్కసీ ప్రోక్తా" ఇత్యాదిరుద్రాయామలతంత్రము.

రజస్వలతో సంభోగించిన పుష్కరస్నానము చేసినట్లగును. చాండాలినితో వ్యభిచరించుట కాశీ యాత్ర,చర్మకారుని స్త్రీతో గలిసిన ప్రయాగస్నానము, చాకలిదానితో గలిసిన మథురా యాత్ర, కంజరీతో లీలలు చేసిన అయోధ్యాతీర్థస్నానముచేసినట్లు నగునని చెప్పుచున్నారు.

మద్యమునకు దీర్థము, మాంసమునకు శుద్ధి, పుష్పమునకు మత్స్యమునకు దృతీయ, జలతుంబికకు ముద్రకు జతుర్థీ, మైథునమునకు బంచమీ యనియు నామాంతరములు పెట్టుకొనిరి. ఇతరులకు దెలియకుండుటకై యీనామాంతరములు పెట్టబడినవి. తమకు, కౌల్, ఆర్ద్రవీర్, శాంభవ, గణాదినామములు పెట్టుకొనిరి. వామమార్గమతమున జేరని వారికి కంటకులు, విముఖులు, శుష్కపశువులు నని పేరులు పెట్టిరి. (౧)

భైరవీచక్రము నడుచునపుడు బ్రాహ్మణుడు మొదలు చండాలురవఱకు నందఱు ద్విజు లగుదురు. చక్రమునుండి వేఱు కాగానే యెవరి వర్ణములు వారివే యగును.(౨).

భైరవీచక్రమునందు వామమార్గులు, భూమిమీదనో కొయ్యపలక మీదనో యొక బిందువును త్రికోణములు కలదిగానో చతుష్కోణములు గలదియో వర్తులాకారముననో చేసి దానిమీద మద్యపు బాత్ర నుంచి దానిని బూజింతురు. ఆ సమయమున 'బ్రహ్మశాపం విమోచయ, అను మంత్రమును జదువుదురు. 'ఓమద్యమాః నీవు 'బ్రహ్మాదుల శాపమునుండి ముక్త మగుదువు గాక ' యని మంత్రాభిప్రాయము.

వామమార్గులు చేరుస్థలమున కితరులను రానీయరు. రహస్యస్థలమున వారు స్త్రీపురుషు లెల్లరు జేరుదురు. అంతట నక్కడ నొకస్త్రీని నగ్నను జేసి పురుషులు, నొకపురుషుని దిగంబరుని జేసి స్త్రీలును బూజింతురు. అక్కడకు స్త్రీలు పలువురు- అచట జేరిన పురుషుల భార్యలు, కుమార్తెలు, తల్లులు, నక్కచెల్లెండ్రు, కోడండ్రు మున్నగువారెల్లరు చేరుదురు. తదుపరి యొకపాత్రలో మద్యమునింపి, యొక పళ్ళెరమున మాంసము నుంచి గారెలు మున్నగు వస్తువులను గూడ నుంచెదరు. వారిలో నాచార్యుడైనవాడొకగిన్నెలో మద్యమును దీసికొని యది చేతిలో నుంచుకొని (భైరవోఽహం) (శివోఽహం) నేను భైరవుడను, నేను శివుడను, అని చెప్పి యా-మద్యమును ద్రాగును. ఆ యెంగిలి గిన్నెతోనే మిగిలిన వారును

నట్లే త్రావుదురు. పిమ్మట నొక మగనాలునో, వేశ్యనో లేక యొక పురుషునో వస్త్రహీనుంజేసి యతని చేతి కొకకత్తి నిచ్చి స్త్రీయైన దేవియనియు,, పురుషుడైన మహాదేవుడనియు బిలుతురు. వారి యుపస్థేంద్రి యములను బూజింతురు. తరువాత నాదేవికో యా శివునకో గిన్నెడు సారాయి నిచ్చి త్రాగించి యా యెంగిలి గిన్నెతోనే యెల్లరు నొక్కొక్క గిన్నెడు మద్యమును సేవింతురు. మరల నిట్లే యందఱును ద్రాగి త్రాగి మైమఱచి యెవరి కెవరిష్టమగుదురో తల్లి, తోబుట్టువు, కూతురు నను భేదము పాటింపక కుకర్మకు బూనుకొందురు. బాగుగ మత్తెక్కుటవలన మధ్యమధ్య గొట్టుకొనుటయు దిట్టుకొనుటయు సంభవించును. కొందఱు వాంతి చేసికొందురు. వారిలో బూర్ణసిద్ధుడని యెంచబడు 'అఘోరీ' నామకు డావమనము చేసిన దానిని గూడ దిన నారంభించును. ఇదియు సిద్ధికి లక్షణముగా నెంచబడును.

"హాలాం పిబతి దీక్షితస్య మందిరే సుప్తో నిశాయాం గణికాగృహేషు విరాజతే కౌలవచక్రవర్తీ".

కల్లునమ్మువాని యింటికి వెళ్ళి సీసా మీద సీసా సారాయి నెక్కించువాడు, వేశ్యల యిండ్లకు బోయి వారితో వ్యభిచరించి నిద్రించువాడు, నిట్టి కుకర్మలు సిగ్గు విడిచి చేయువాడు వామమార్గము ననుసరించి వారిలో సర్వోపరి శ్రేష్ఠచక్రవర్తితో సమానుడుగా నెంచబడును. అనగా నెక్కుడు దుష్కర్మల నాచరించువాడు శ్రేష్ఠుడు, వానినుండి దూరముగా నుండువాడు చిన్నవాడని భావము.

పాశబద్ధో భవేజ్జీవః పాశముక్తః సదా శివః(శ్లో.౪౩.జ్ఞానసంకలినీతంత్రం).

లోకలజ్జ, శాస్త్రలజ్జ, కులలజ్జ, దేశలజ్జ యను పాశములచే బంధింపబడినవాడు జీవుడనియు, లజ్జావిహీనుడై కుకర్మల నొనర్చువాడు సదా శివుడనియు నీ తంత్రాభిప్రాయము. ఉడ్డీస మున్నగు తంత్రములందొక ప్రయోగము వ్రాయబడి యున్నది. అది యెద్ది యన నింటిలో నలువైపుల గోడలలో గూడు లుండవలయును. వానియందు సారా నింపిన బుడ్లుంచవలయును. మొదట నొక గూటిలోని యొక సారా బుడ్డిలోని సారాయి త్రాగి రెండవ గూటిదగ్గఱకు బోవలయును. అందున్న యొకసీసా సారాయి త్రాగి, మూడవ గూటికి బోయి యట నొక సారాబుడ్డిని ఖాళీచేసి, నాల్గవ గూటియందున్న సారాబుడ్డిని బుచ్చుకొని, యిట్లు త్రాగి త్రాగి నిలబడి యున్నవాడు కఱ్ఱవలె భూమిమీద బడువఱకు ద్రాగవలయును. మత్తు దిగిపోయినపుడు లేచి మరల బడిపోవువఱకు ద్రాగవలయును. ఇట్లు మూడు పర్యాయములు త్రాగి పడిపోయిన వారికి బునర్జన్మ ముండదు. నిజమే యేల యుండును? వాస్తవ మేమన నట్టివారికి, మరల మనుష్యజన్మము లభించుట దుర్లభము. కావున వాడు నీచజన్మములలో బడి బహుదుఃఖము లనుభవించుట తథ్యము. (౩)

వామమార్గీయుల గ్రంథములలో నిది యొకనియమము. తల్లిని దక్క మఱి యేస్త్రీని వదలరాదు. కన్యకాని, తోబుట్టువుకాని, యెవరైనను విడువక వారితో వ్యభిచరింపవలయును.ఈ వామమార్గీయులలో 'దశమహావిద్య' యొకటి ప్రసిద్ధము. వారిలో నొకడు మాతంగీ' విద్యావంతుడుండును. వాడు 'మాతరమపి న త్యజేత్' తల్లిని గూడ వదలరాదు అనును. స్త్రీ పురుషులు సంగమము చేయునపుడు తమకు సిద్ధికావలయునని జపము చేయుదురు. ఇట్టి మహామూర్ఖులు, పిచ్చివారు లోకమున జాల యరుదుగా నుందురు. (౪)

అబద్ధము లాడదలచిన మనుష్యుడు సత్యమును దప్పక నిందించును. చూడుడు. వామమార్గు లేమనుచున్నారో: వేదశాస్త్రము లన్నియు సామాన్య వేశ్యవంటివి. వామమార్గమునకు సంబంధించిన శాంభవి ముద్ర గుప్త కులవధువు వంటిది.(౫)

ఇందులకే వీరు వేదవిరుద్ధమైన యీమతమును నిలబెట్టిరి. ఇది క్రమముగా వర్ధిల్లినది. తదుపరి వేదముల పేరిట గూడ నీవామమార్గపులీల నడపబడినది.

'సౌత్రామణ్యాం సురాం పిబేత్'
'ప్రోక్షితం భక్షయేన్మాంసమ్'
'వైదికీ హింసా హింసా న భవతి
న మాంసభక్షణే దోషో, న మద్యే, న చ మైథునే,
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా'.(మను.౫-౫౬)

సౌత్రామణి యజ్ఞమునందు సురాపానము చేయుట మద్యపానము సేయుట కాదు. సోమవల్లీరసమును సేవింపవలయునని దాని యర్థము. యజ్ఞమునందు ప్రోక్షితమాంసము దినుట దోషములేదను నీతెలివిమాలిన మాట నీవామమార్గులు తెచ్చిపెట్టినదే. వైదికహింస హింస కాకున్న నిన్ను నీకుటుంబము వారి నెల్లరను జంపి యజ్ఞము చేసినను బాపముండదు కదా!యని. వారి నడుగవలయును. మాంసమును భక్షించుట, సారాయి త్రాగుట, పరస్త్రీగమనము దోషములు కావని చెప్పుమాటలు పసితనపు మాటలు. ఏలయన ప్రాణులకు బాధకలిగింపక మాంసము లభింపదు. నేరము లేక ప్రాణికి బాధకలిగించుట పాపము, ధర్మవిరుద్ధము. మద్యపానమన్నివిధముల నిషిద్ధమే. ఇది మంచిదని చెప్పు గ్రంథములు వామమార్గపు వారివే. కాని యితర గ్రంథములలో నెచ్చటను నట్లు లేదు. అంతటను నిషేధింపబడియే యున్నది. వివాహితులు కానివారి మైథునము మిక్కిలి దోషముగా నెంచబడినది. ఇది దోషము కాదని చెప్పువారు దుష్టులు, ఎందఱో యిట్టి వాక్యములను ఋషుల గ్రంథములందు జేర్చిరి. ఋషులపేర్లతో గ్రంథములందు వ్రాసి గోమేధము, అశ్వమేధము ననుయజ్ఞములు కూడ జేయింపసాగిరి. అనగా గోవును గుఱ్ఱమును జంపి యజ్ఞముచేసిన యజమానునకు, జంపబడిన పశువునకు స్వర్గము కలుగునను వ్యవహారమునకు మూలము బ్రాహ్మణ గ్రంథములందలి అశ్వమేధ, గోమేధ, నరమేధాది శబ్దముల కర్థము సరిగా గ్రహింపక పోవుటయే. సరిగా దెలిసియున్న నిట్టి యనర్థము లేల చేయుదురు?

(అశ్వమేధ గోమేధ శబ్దార్థములు)

ప్రశ్నః- అశ్వమేధ, గోమేధ, నరమేధ, శబ్దముల కర్థమేమి?
ఉత్తరముః- ఈ పదముల కర్థమిది.
రాష్ట్రం వా అశ్వమేధః (౧) అన్నం హి గౌః (౨)
'అగ్నిర్ వా అశ్వః(3)' ఆజ్యం మేధః ' (౪)
శతపథము. ౧3-౧-౨,3,(౪-3-౧-౨౫) (3-౬-౨-౫) (౧3-3-౬-౨)

గుఱ్ఱములు, గోవులు, మున్నగు పశువులను జంపి హోమము చేయుట యెక్కడను వ్రాయబడలేదు. వామమార్గుల గ్రంథములలోనే యట్టి యనర్థములు వ్రాయబడియున్నవి. ఇతర గ్రంథములలో నెక్కడనైన నట్టి వ్రాతలున్న నవి వామమార్గమువారిచే జొప్పింపబడినవియే. చూడుడు- రాజు న్యాయముతో ధర్మముతో బ్రజాపాలనము చేయవలయును. విద్యాదుల నొసంగవలయును. యజమానుడై యగ్నియందు నేతిని హోమము చేయవలయును. రాజు చేయవలసిన యీకార్యములకే యశ్వమేధమనిపేరు. అన్నము, ఇంద్రియములు, కిరణములు, పృథివి మున్నగువానిని బవిత్రముగా నుంచుట గోమేధ మనబడును. మనుష్యుడు మరణించినపు డతని శరీరమును విధిపూర్వముగ దహనముసేయుట

నరమేధ మనబడును.

ప్రశ్న:- యజ్ఞము చేయుటవలన యజమానుడు, పశువు స్వర్గగాములగుదురనియు, హోమము చేసి మరల బశువును జీవింప జేసెడివారనియు యజ్ఞకర్త లనుచున్నారు. అది నిజముకాదా?

ఉత్తరము:- నిజము కాదు. స్వర్గమునకు బోవుట నిజమే యగునేని యజ్ఞము చేయువానిని జంపి స్వర్గమునకు బంపవలయును. లేక యతనికి ప్రియమైన తల్లిని, దండ్రిని, భార్యను, బుత్రాదులను జంపి హోమము జేసి స్వర్గమున కేల బంపరు? హోమము చేసి మరల నేల జీవింప జేసికొనరు?

ప్రశ్న: యజ్ఞము చేయునపుడు మంత్రములను బఠియింతురు. వేదములలో లేకున్న నెటనుండి చదివెదరు?

ఉత్తరము:- మంత్రములను నెవరెక్కడ జదివినను నవి వారి నడ్డగింపవు. అవి శబ్దములే కదా: వాని యర్థము పశువులను జంపి యజ్ఞము చేయుమని లేదు. 'అగ్నయే స్వాహా' ఇట్టి మంత్రముల యర్థము - అగ్నియందు బుష్టిని గలిగించు ఘృతము మున్నగు వస్తువులతో హవ్యపదార్థమును సిద్ధము చేసి హోమము చేసినందున వాయువు, వృష్టిజలము, శుద్ధములై జగత్తునకు సుఖకారకము లగును. కాని యట్టి సత్యమైన యర్థముల నామూఢులు తెలిసికొనకుండిరి. ఏలయన స్వార్థబుద్ధి గలవారు తమ స్వార్థము సిద్ధ పఱచుకొనుట తప్ప మఱియొకటి నెఱుగరు. అంగీకరింపరు.

ఈ పోపులకు సంబంధించిన నిట్టి యనర్థకములగు ననాచారములను జూచినపుడును, మరణించిన వారికి దర్పణశ్రాద్ధాదులు చూచినపుడు మహాభయంకరములు, వేదాదిశాస్త్రనిందకములు నైన బౌద్ధజైనమతములు దేశమున ప్రచలితము లైనవి. ఈ దేశమున గోరఖపురమును బాలించు రాజొక డుండెను. పోపు లతనిచే నొక యజ్ఞము చేయించిరట. ఆరాజు ప్రియురాలైన రాణిసమాగమము గుఱ్ఱముతో జేయించినందున నామె చనిపోయినదట. తదుపరి యారాజు విరక్తుడై తనపుత్రుని రాజ్యమున నుంచి సాధువై పోపుల లీలలను వెలిబుచ్చుటకు బూనుకున్నాడట. అని వినికిడి. దీనికి శాఖల రూపమున చారవాక, ఆభాణక మతము లేర్పడెను. వారిట్టి శ్లోకములు రచించిరి.

"పశుశ్చేన్నిహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి,
స్వపితా యజమానేన తత్ర కథం న హింస్యతే." (౧)
"మృతానామిహ జంతూనాం శ్రాద్ధం చేత్తృప్తికారణమ్,
గచ్ఛతామిహ జంతూనాం వ్యర్థం పాథేయకల్పనమ్." (౨)

(సర్వదర్శన సంగ్రహము - చార్వాక మత ప్రకరణము)

పశువును జంపి యగ్నిలో హోమము చేసినందున నాపశువు స్వర్గమునకు వెళ్ళినచో యజమానుడు తనతండ్రి మున్నగువారిని జంపి స్వర్గమున కేల పంపడు? (౧)

శ్రాద్ధము, తర్పణము నను వానివలన మరణించిన వారికి దృప్తి గలిగిన విదేశములకు, వెళ్ళువారికి బాథేయము-మార్గమున దినుటకు బదార్థములు వెంట బంప నేల? (౨)

ఏల యనగా జనిపోయిన వానికి నన్నజలములు చేరునెడల జీవించి పరదేశముననుండు వ్యక్తికి గాని, మార్గమున వెళ్ళువానికి గాని, యింటిలో వంటచేసి యాకులో నన్నియు బెట్టి చెంబునిండ నీరుంచి మంత్రములతో ఏల పంపరు? జీవించి దూరదేశమున నుండువానికి గాని, యింటికి గొంచెము దూరములో నున్న బాటసారికి గాని యన్నము చేరనపుడు మరణించిన వాని కెట్లు చేరగలదు?

(బౌద్ధ జైనమతములవృద్ధి)

జనులు వారి యుక్తిసిద్ధములగు నుపదేశములను విని యంగీకరింపదొడగిరి. వారి మతము వృద్ధికా

దొడగెను. పలువురు రాజులు భూస్వాములు వారి మతమున జేరుట జూచి పోపులును వారినే యనుస రింప మొదలిడిరి. వారి కెక్కడ స్వార్థము సిద్ధించునో యటు పోవుటయే పని. వెనుకముందు జూడక జైనులు కాజొచ్చిరి. జైనులలో గూడ మఱియొక విధమైన పోపులీలలు మిక్కిలిగా నున్నవి. అయ్యవి పండ్రెండవ సముల్లాసమున వ్రాయుదుము. చాలమంది వీరి మతమును స్వీకరించిరి. కాని పర్వత, కాశీ, కన్నౌజ్, పశ్చిమ, దక్షిణదేశవాసులు జైనమతమును స్వీకరింపలేదు.

జైనులు వేదార్థముల నెఱుగక వెలుపలి పోపులీలలు వేదములకంటె మిన్నగా నెంచి భ్రాంతిలో బడి వేదములను నిందింప సాగిరి. వేదముల పఠనపాఠనములను, బ్రహ్మచర్యాదివ్రతములను, యజ్ఞోపవీత ధారణాదులను నాశముజేయ నారంభించిరి. వేదములకు సంబంధించిన గ్రంథముల నెక్కడ లభించిన నక్కడ వానిని నాశముజేసిరి. ఆర్యులమీద రాజశాసనము చేసి వారిని బీడించిరి. వారికి భయము తీఱి పోయిన తదుపరి తమ మతస్థులైన గృహస్థులను, సాధువులను సమ్మానింప మొదలిడి వేదానుయాయుల నవమానించుటయు, బక్షపాతముతో వారిని దండించుటయు జరిగినది. స్వయముగా సుఖముల ననుభ వించుచు గర్వితులై యుండసాగిరి.

ఋషభదేవుడు మొదలు మహావీరుని పర్యంతముగల తమ తీర్థంకరులకు బెద్దబెద్ద విగ్రహములు నిర్మించి పూజింప దొడగిరి. పరమేశ్వర ధ్యానము వీడి పాషాణాదులతో మూర్తులను జేసి యామూర్తులను బూజించు విధానమునకు జైనులే పునాది వేసిరి. ఇట్లు మూడు వందల సంవత్సరములు జైనుల రాజ్యము నిరాతంకముగా నడచినది. తఱచు జనులు వేదార్థ- జ్ఞానశూన్యులైరి. ఇది జరిగి సుమారు రెండువేల యైదువందల సంవత్సరములై యుండును.

(శంకరాచార్యులు)

రెండువేల రెండువందల సంవత్సరములకు బూర్వము దక్షిణదేశమున ద్రవిడ బ్రాహ్మణుడు బాల్యముననే బ్రహ్మచర్యవ్రతముతో వ్యాకరణాది సర్వ శాస్త్రములను జదివి సంన్యాసియై శంకరాచార్య నామ ముతో బ్రసిద్ధుడై యిట్లాలోచించెను. 'ఆహా! సత్యము, ఆస్తికము నైన వేదమతము నష్టమై నాస్తిక జైన మతము వ్యాపించుట మిక్కిలి హానికర విషయము. ఈ మతము నెట్లులైన దొలగింపవలయును'. శంకరా చార్యులు శాస్త్రములు చదివియే యుండిరి. జైనమతగ్రంథములను గూడ జదివిరి. వారి యుక్తికూడ మిక్కిలి ప్రబలమైనది. జైనమతమును, జైనులను దొలగించుటకుపదేశము, శాస్త్రార్థములు నుపయోగ కరములని యెంచిరి.

(జైనమతనిరాకరణము)

ఇట్లాలోచించి శంకరాచార్యులు ఉజ్జైననగరమున కేతెంచిరి. అప్పుడాప్రాంతమును సుధన్వారాజు పాలించుచుండెను. ఆ రాజు జైనగ్రంథములను, గొలదిగా సంస్కృతమును జదివి యుండెను. శంకరా చార్యులు వేదవిషయముల నుపదేశింప మొదలిడిరి. వారు రాజును గలిసికొని 'మీరు జైన గ్రంథములను జదివియున్నారు. జైనమతము నంగీకరించి యున్నారు. కావున మీ జైనపండితులతో నా శాస్త్రార్థమును జరిపింపుడు. అందునోడిపోయినవారు గెలిచినవారి మతమును గ్రహించుట పణముగా- ప్రతిజ్ఞగా నంగీక రింప జేయుడు. మీరుకూడ జయించినవారి మతమును స్వీకరింపవలయును, అని కోరిరి.

రాజు సుధన్వుడు జైనమతమును స్వీకరించినను సంస్కృతమును జదివి యుండుట వలన నత నిలో గొంత విద్యాప్రకాశ ముండెను. కావున నతనిలో మతోన్మాద మంతగా లేకుండెను. ఏలయనగా విద్వాంసుడైనవాడు సత్యాసత్యములను బరీక్షించి సత్యమును గ్రహించి యసత్యమును విడిచి పెట్టును. సుధన్వునకు గొప్ప విద్వాంసు డుపదేశముచేయువాడు దొరకనంత వఱకు సత్యాసత్యములను నిర్ణ

యింపజాలక సందిగ్ధావస్థలో నుండెడివాడు. అందువలన శంకరాచార్యుని మాటలు విని మిక్కిలి ప్రసన్నతతో మేము శాస్త్రార్థమును జరిపించి సత్యాసత్యముల నిర్ణయము చేయించెదమని యంగీకరించెను.

దూరదూర ప్రదేశములనుండి జైనపండితులను రావించి సభను సమావేశపఱచెను. శాస్త్రార్థమున కేర్పాటుచేసెను. శంకరాచార్యుని పక్షము వేదమతము. జైనపండితుల పక్షము వేదవిరుద్ధ మతము. అనగా జైన మతమును ఖండించి వేదమతమును స్థాపించుట శంకరాచార్యుల కర్తవ్యము. జైన పండితులు తమ మతమును స్థాపించి వేదమతమును ఖండింపవలసి యుండిరి. జైనుల పక్షము-"సృష్టికర్త అనాది ఈశ్వరు డెవ్వడును లేడు. ఈ జగత్తు జీవులు ననాదులు. ఈ రెండింటి యుత్పత్తి వినాశము లెన్నడును జరుగవు" దీనికి విపరీతముగ శంకరాచార్యుల మతమిది. అనాదిసిద్ధ పరమాత్మయే తన మాయతో జగత్తునకు గర్త. ఈ జగత్తు జీవులును మిథ్య. కారణమేమన నాపరమాత్మయే తన మాయతో జగత్తును రచించెను. అతడే జగత్తును ధరించును, ప్రళయముకూడ చేయును. ఈ జీవుడు, ప్రపంచమును స్వప్నమువలె మిథ్యలే. పరమేశ్వరుడే స్వయముగా ననేక రూపములతో గ్రీడించుచున్నాడు.

కొన్ని దినములవఱకు నీ విషయమున శాస్త్రార్థము జరిగెను. కాని, యంతమున యుక్తి ప్రమాణములతో జైనమతము ఖండింపబడి వేదమత మఖండితమై యుండెను. అప్పుడా జైనపండితులు, రాజాసుధన్వుడు నెల్లరు జైనమతమును వదలి వేదమతమును స్వీకరించిరి. అప్పుడు చాల గందరగోళము జరిగెను. రాజా సుధన్వుడు తనకు బరిచితులు మిత్రులు నైన రాజులకు లేఖలు వ్రాసి శంకరాచార్యులతో శాస్త్రార్థములను జరిపింప జేసెను. జైనులు పరాజితులైరి. తదుపరి సుధన్వుడు మున్నగు రాజులు శంకరాచార్యులకు నార్యావర్తమున నెల్లయెడల దిరుగుటకు దగిన ప్రబంధము జేసిరి. వారి రక్షణమునకు నావశ్యమైన యేర్పాట్లు చేసి వారి వెంట రక్షణమునకు దగిన మనుష్యుల నుంచిరి.

(వైదికమతోద్ధరణము)

అప్పటినుండియే మరల యజ్ఞోపవీతధారణము వేదాధ్యయనాధ్యాపనములు ప్రారంభ మయ్యెను. శంకరాచార్యులు పది సంవత్సరములపాటు ఆర్యావర్తమున నెల్లయెడలకు బోయి జైనమతమును ఖండించి వేదమతమండనము జేసెను. మఱియు శంకరాచార్యుని సమయముననే జైనమత ఖండనము, జైనుల మూర్తులును చాలవఱకు ఖండితము లయ్యెను. ఎటనేని జైన విగ్రహము లఖండితములుగా లభించిన నవి జైను లాసమయమున భూమిలో దాచినవై యుండును. ఇప్పటికిని నక్కడక్కడ భూమినుండి జైన విగ్రహములు బయట పడుచునేయున్నవి.

శంకరాచార్యులకు బూర్వమున శైవమతముకూడ నిట వ్యాపించి యుండెను. దానిని గూడ శంకరాచార్యులు ఖండించి యుండిరి. మఱియు వామమార్గమును గూడ నతడు ఖండించి యున్నాడు. అప్పుడీ దేశమున జాల ధనముండెను. స్వదేశభక్తియు నుండెను. శంకరాచార్యులు కాని, సుధన్వరాజా గాని జైనమందిరములను బడగొట్టింప లేదు, ఖండితములు చేయింపలేదు. ఏలయన నామందిరములలో వేదపాఠశాలలు నడపనెంచిరి.

వేదమతము స్థాపింప బడెను. విద్యాప్రచారము గాజొచ్చెను. ఇంకను గాలేదు. తద్విషయక విచారణము జరుగుచునే యుండెను. ఇంతలో నిరువురు జైనులు పైకి వైదికులుగా జెప్పుకొనుచు లోపల జైనమతాభిమానముతో నుండిరి. కపటమునులై యుండిరి. శంకరాచార్యులు వారియెడ మిక్కిలి ప్రసన్నులై యుండెడివారు. వారిరువురు నవకాశము జిక్కించుకొని శంకరాచార్యులకేదో విషయుక్త పదార్థము తినిపించిరి. దానితో నాచార్యులకు మందాగ్ని యేర్పడెను. ఆకలి తగ్గి పోయెను. తదుపరి శరీరమున వ్రణము లేర్పడి యాఱుమాసములలో జనిపోయిరి.

అంతట నెల్లరు నిరుత్సాహులైరి. కావలసియున్న విద్యాప్రచారము నిలిచి పోయెను. శంకరాచార్యులు వ్రాసిన శారీరక భాష్యాదులను శంకరాచార్యుని శిష్యులు ప్రచారము జేయ దొడగిరి. అనగా జైనుల మతమును ఖండించుటకు శంకరాచార్యులు ప్రతిపాదించిన బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య, జీవబ్రహ్ముల యేకత-అను నీ సిద్ధాంతములను శిష్యులు ప్రచారము చేయసాగిరి. దక్షిణమున 'శృంగేరీ' పూర్వమున 'భూగోవర్ధనము' ఉత్తరమున 'జోశీ' ద్వారికయందు 'శారదా' యను మతములను స్థాపించి శంకరాచార్య శిష్యులు వానికి మహంతులై, శ్రీమంతులై యానందము ననుభవింపజొచ్చిరి. శంకరాచార్యుల యనంతరము శిష్యులకు బ్రతిష్ఠ కలిగెను.

ఇప్పుడిందు విచారింపవలసిన విషయ మొకటి యున్నది. జీవబ్రహ్మల యేకత, జగన్మిథ్యావాదము శంకరాచార్యుల నిజమతమగునెడలనది మంచిమతము కాదు. జైనులమతమును ఖండించుటకు స్వీకరించి యున్నచో గొంతవఱకు సరి యగును. కొంత మంచి యున్నదనవచ్చును.

(నవీనవేదాంతము)

ఇక నవీన వేదాంతుల మత మిట్లున్నది.

ప్రశ్నః- జగత్తు స్వప్నమువంటిది. త్రాటిలో బాము, ముత్యపు జిప్పయందు వెండి, మృగతృష్ణికలో జలము, నింద్రజాలకుని గంధర్వ నగరమువలె నీ ప్రపంచమసత్యము, ఒక్క బ్రహ్మమే సత్యము.

సిద్ధాంతిః- అసత్యము-మిథ్య యని నీవు దేని ననుచున్నావు?

నవీనః- ఏవస్తువు లేకయే ప్రకాశించునో యది.

సిద్ధాంతిః- ఏది వస్తువే కాదో యది యెట్లు ప్రతీతమగును?

నవీనః- అధ్యారోపము వలన.

సద్ధాంతిః- దేని నధ్యారోప మనుచున్నావు?

నవీనః-"వస్తున్యవస్త్వారోపణమధ్యాసః" వేదాంతసార.ఖం. ౬

అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే," అనుభూతి ప్రకాశ.౧-౨౫

పదార్థము వేఱే యొకటి యుండగా నందు నవస్తు-వస్తువు కాని దాని నారోపించుట యధ్యాస మనబడును. అధ్యారోపము మఱియు దాని నిరాకరించుట అపవాద మనబడును. ఈ రెండింటితో బ్రపంచరహిత బ్రహ్మమునందు బ్రపంచరూప జగత్తును విస్తరింపజేయుదురు.

సిద్ధాంతిః- నీవు రజ్జు-త్రాటిని వస్తు వనియు, పామును నవస్తువనియు నెంచి యీ భ్రమజాలమున బడుచున్నావు. ఏమి? సర్పము వస్తువు కాదా? రజ్జువునందు లేదుగదా! యందువేని సర్పము మఱియొక చోట నున్నదికదా! అంతే కాక దాని సంస్కారము హృదయమునందు నున్నదా లేదా! మఱియు సర్పము వస్తువు కాదు. అట్లే స్థాణువున బురుషుడు, ముత్యపుజిప్పలో రజతము-వెండి, మున్నగువాని వ్యవస్థయు దెలిసికొనుడు. స్వప్నమున నెవరి భావము కలుగునో వారు వేఱుచోట నుందురు. వాని - వారి సంస్కారము లాత్మయందున్నవి. కావున స్వప్నముకూడ వస్తువునందు నవస్త్వారోపణ మెన్నడును గాదు.

నవీనః- స్వప్నమున నెన్నడు జూడని దినని వస్తువులు చూతుము. ఎట్లన- తన శిరస్సు ఖండించినట్లు, నేడ్చుచున్నట్లును జూతుము. జలధార పైకి బోవుచున్నట్లును జూతుము. ఇవి యన్నియు సత్యము లెట్లగును ?

సిద్ధాంతిః- ఈ దృష్టాంతము కూడ నీ పక్షమును సిద్ధము చేయజాలదు. ఏలయనగా వినక చూడక సంస్కారము లేర్పడవు. సంస్కారము లేర్పడకున్న స్మృతికాని, స్వప్నముకాని యేర్పడవు. ఒక వ్యక్తి

శిరస్సు ఖండింపబడుట చూచుటయో వినుటయో ముందు గలుగును. ఖండిత శిరస్కుని తండ్రియో సోదరుడో యేడ్చుట చూచి యుందుము- అట్లే 'ఫవ్వారాలో నీరు' పైకెగురుట చూచి యుందుము. వాని సంస్కారములు చూచిన వారి, వినినవారి యాత్మలందు గలుగును. జాగ్రదవస్థయందు బదార్థములకు దూరముగానుండి మనుష్యుడు జూచును. ఆపదార్థములనే స్వప్నమున దనలో జూచును. తనలో జూచినపుడు తనశిరస్సే ఖండింప బడినట్లు తా నేడ్చుచున్నట్లును జలధార పైకి బోవుచున్నట్లు జూచును.

ఇదియును వస్తువునందవస్తువు నారోపించుట వంటిది కాదు. నక్షా-మ్యాపు వ్రాయువాడు పూర్వము తాను జూచినవానినో వినినవానినో తనలో నుండియే యూహించి కాగితముపై నంకితము చేయును. చిత్రము వ్రాయువాడు, దేని ప్రతిబింబము సిద్ధము చేయునో దాని బింబమును బాగుగ జూచి దాని యాకృత్యాదులను దనలో నింపుకొని యటుపై గాగితమున బ్రతిబింబింప జేయును.

బహుకాలము క్రిందట దాను జూచిన దానినిగాని, వినిన దానినిగాని మరల సాక్షాత్కారము జేసికొని నపుడు దానిని దా నిపుడు చూచుచున్నట్లు పూర్వము చూచియుంటి నని యొకప్పుడు స్మరింపజాలక పోవచ్చును. జాగ్రదవస్థలో స్మరణము నియమపూర్వకముగ జరిగినట్లు స్వప్నమున నియతస్మరణము జరుగదు. కాని స్వప్నముకూడ నొక స్మరణము వంటిదే. జన్మాంధునకు రూపమునకు సంబంధించిన స్వప్నము కలుగదు. కావున నీవు చెప్పిన యధ్యాసము-అధ్యారోపము రెండును నసత్యములే. ఇక వేదాంతులు బ్రహ్మమునందు జగత్తుభావము కలుగు ననుటకు వివర్తవాదము పేరిట త్రాటియందు సర్పభ్రాంతి కలుగునని దృష్టాంతము చెప్పుదురు. అదియును సరికాదు.

నవీనః- అధిష్ఠానములేక యధ్యస్త మెన్నడును బ్రతీతము కాదు. ఎట్లన త్రాడు లేకున్న సర్పభ్రాంతి కలుగదు. వాస్తవమున రజ్జువునందు మూడుకాలములందును లేని సర్పము కనుచీకటిలో నకస్మాత్తుగ త్రాటిని-రజ్జువును జూచినందున సర్పభ్రమ కలిగి కంపింపసాగును. దీపప్రకాశమున దానిని జూచి యిది సర్పము కాదు త్రాడని తెలిసికొనినపుడు భ్రమ, భయము రెండును దొలగిపోవును. అట్లే బ్రహ్మమునందు జగత్తుయొక్క మిథ్యాప్రతీతి కలిగినది. బ్రహ్మము సాక్షాత్కారమైనపు డాజగద్భ్రాంతి దూరమగును. బ్రహ్మప్రతీతి కలుగును. సర్పభ్రాంతి పోయి రజ్జుజ్ఞానము కలిగినట్లు.

సిద్ధాంతిః- బ్రహ్మమునందు జగద్ భ్రాంతి యెవరికి గలిగినది?

నవీన ః- జీవునకు.

సిద్ధాంతిః- జీవుడెక్కడినుండి కలిగెను?

నవీనః- అజ్ఞానమువలన.

సిద్ధాంతిః- అజ్ఞాన మెటనుండి కలిగినది? ఎట నుండును?

నవీనః- అజ్ఞానము అనాది. బ్రహ్మమునం దుండును.

సిద్ధాంతిః- బ్రహ్మమునందు బ్రహ్మమునకు సంబంధించిన యజ్ఞానము కలిగినదా? ఇతరునకు సంబంధించిన యజ్ఞానమా? మఱియు నాయజ్ఞాన మెవనికి గలిగినది?

నవీనః- చిదాభాసకు.

సిద్ధాంతిః- చిదాభాస స్వరూపమేమి?

నవీనః- బ్రహ్మము. బ్రహ్మమునకే బ్రహ్మమునకు సంబంధించిన యజ్ఞానము కలిగెను. అనగా దన స్వరూపమును దానే మఱచి పోయెను.

సిద్ధాంతిః- బ్రహ్మ మట్లు మఱచుటకు నిమిత్తమేమి?

నవీనః- అవిద్య.

సిద్ధాంతిః- ఈ యవిద్య సర్వవ్యాపియైన సర్వజ్ఞుని గుణమా? అల్పజ్ఞుని గుణమా?

నవీనః- అల్పజ్ఞునిది.

సిద్ధాంతిః- నీమతమునందు ననంత సర్వజ్ఞచేతనము కాక మఱియొక చేతనమున్నదా? లేదా? అల్పజ్ఞు డెటనుండి వచ్చెను? అవును. అల్పజ్ఞుడైన చేతనుడు బ్రహ్మముకంటె భిన్నుడని యంగీకరింతువేని సరియే బాగు. లేకున్న బ్రహ్మమునం దొకచో బ్రహ్మమునకు దనస్వరూపమునకు సంబంధించిన యజ్ఞానము కలిగిన నది బ్రహ్మము నందంతట వ్యాపించును. శరీరమున నొకచో బుండు పుట్టినపుడు దాని పీడ శరీరమునందంతటను గలుగుటయే కాక మిగిలిన యవయవము లన్నియు బనికిరానివిగా జేయునట్లు బ్రహ్మమున నొకచో నజ్ఞానము కలిగిన బ్రహ్మమంతయు నజ్ఞానియై పోవును.

నవీనః- ఇది యంతయు నుపాధిధర్మమే కాని బ్రహ్మమునకు సంబంధించినది కాదు.

సిద్ధాంతిః- ఉపాధి జడమా? చేతనమా? సత్యమా? అసత్యమా?

నవీనః- అది యనిర్వచనీయము. అనగా నది జడమని కాని, చేతనమని కాని, సత్యమని కాని, అసత్యమని కాని చెప్ప వీలుకాదు.

సిద్ధాంతిః- నీకథనము 'వదతో వ్యాఘాతము' గా నున్నది. ఏలయనగా నవిద్య యని యొకవంక చెప్పుచున్నావు. మఱియొకవంక జడ, చేతన, సత్తు, అసత్తు శబ్దములచే జెప్పనలవి కాని దనుచున్నావు. ఇది యెట్లున్న దనగా ఇత్తడి కలిసిన బంగారమును షరాఫ్ దగ్గఱకు దీసికొని వెళ్ళి యిది బంగారమా ఇత్తడియా? యని పరీక్షింప జేసిన నత డది బంగారము కాదు, ఇత్తడి కాదు. రెండును గలిసిన వస్తువనితెలిపినట్లున్నది.

నవీనః- చూడండి, ఘటాకాశము, మఠాకాశము, మేఘాకాశము, మహదాకాశము- అని ఘటము, మఠము, మేఘము నను నుపాధులవలన నాకాశము భిన్నభిన్నముగా బ్రతీత మగుచున్నను, వానిని దొలగించిన వాస్తవమున మహదాకాశ మొక్కటియే. ఇట్లే మాయా- అవిద్యా సమష్టి- వ్యష్టి మఱియు నంతఃకరణమునకు సంబంధించిన యుపాధులవలన బ్రహ్మమజ్ఞానులకు వేఱువేఱుగా బ్రతీత మగుచున్నది. వాస్తవమున నొక్కటియే. చూడుడు. అగ్రిమ ప్రమాణమున నేమి చెప్పబడినదో.

"అగ్నిర్ యథైకో భువనం ప్రవిష్టో రూపంరూపం ప్రతిరూపో బభూవ,
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ." కఠ.౫-౯

అగ్ని చిన్న పెద్ద వెడల్పు పొడవుగల లోహపు గోళములలో జేరి వానిలో వ్యాపకమై వాని యాకారములలో గనిపించును. వానికంటె వేఱుగా నుండును. అట్లే సర్వవ్యాపక మగు పరమాత్మ యంతఃకరణములందు వ్యాపించి వాని యాకారములను బొందును. కాని వానికంటె భిన్నముగా నుండును.

సిద్ధాంతిః- ఈ నీమాటయు వ్యర్థమే. ఘటము, మఠము, మేఘము నను నవి యాకాశముకంటె భిన్నములుగా నంగీకరించుచున్నావు. అట్లే కారణ కార్యరూప జగత్తు, జీవుడు నను నీరెండింటిని బ్రహ్మముకంటెను, బ్రహ్మము నీరెండింటికంటెను భిన్నముగా నంగీకరింపుము.

నవీనః- అగ్ని యన్నింటియందును బ్రవేశించి వాని యాకారమున గనబడునట్లు పరమాత్మయు జడచేతనము (జీవుడు) లలో వ్యాపకమై యజ్ఞానులకు నాకారవంతముగా గనిపించును. వాస్తవమున బ్రహ్మము జడము కాదు, జీవుడును గాదు. సహస్రజలపాత్రలలో సూర్యుని సహస్ర ప్రతిబింబములు కనిపించును. వాస్తవమున సూర్యుడొక్కడే. జలకలశములు నష్టమైన జలము భూమిపై వ్యాపించును. సూర్యున కేహానియు గలుగదు. అతడుచలింపడు-వ్యాపింపడు. ఇట్లే అంతఃకరణములందు బ్రహ్మము యొక్క ఆభాసము-చిదాభాస మనబడునది యేర్పడును. అంతఃకరణమున్నంతవఱకు జిదాభాస మన

బడు జీవుడుండును. అంతఃకరణము జ్ఞానమువలన నష్టమైనపుడు జీవుడు బ్రహ్మస్వరూపుడగును. ఈ చిదాభాసము-జీవుడు తన బ్రహ్మస్వరూపమును దెలిసికొననివాడై తనను భోక్తగా సుఖిగా దుఃఖిగా బాపిగా, బుణ్యవంతునిగా నెంచి జన్మమరణములు తనలో నారోపించుకొనునంతవఱకు సంసారపు బంధనముల నుండి ముక్తుడు కాడు.

సిద్ధాంతిః- నీ యీ దృష్టాంతముకూడ వ్యర్థమే. కారణమేమన, సూర్యు డాకారవంతుడు. అనగా సూర్యున కాకార మున్నది. జలకుండములకును నాకారమున్నది. సూర్యుడు జలకుండములకు వేఱుగా దూరమున నున్నాడు. అందువలన సూర్యుని ప్రతిబింబములు జలకలశములందు నేర్పడును. సూర్యుడు, జలకలశములు నిరాకారము లైనను బరస్పరము దూరముగా నుండకున్నను బ్రతిబింబములు కలుగవు.

పరమేశ్వరుడు నిరాకారుడు. ఆకాశమువలె సర్వత్ర వ్యాపకుడు నగుటవలన నేపదార్థమును బ్రహ్మకు భిన్నముగా - వేఱుగా నుండజాలదు. వ్యాప్యవ్యాపకభావ సంబంధ ముండుటవలన రెండును నొక్కటి యెన్నడును కానేరవు. అనగా నన్వయవ్యతిరేక భావముతో జూచినపుడు వ్యాప్యవ్యాపకములు రెండును గలిసి యుండియు నెల్లపుడు వేఱుగనే యుండును. ఒక్కటియే యగునెడల వ్యాప్యవ్యాపక భావ మెట్లు పొసగును? వ్యాప్యవ్యాపక సంబంధము కలుగదు. బృహదారణ్యకము యొక్కయంతర్యామీ బ్రాహ్మణమున స్పష్టముగ వ్రాయబడియున్నది. బ్రహ్మమున కాభాసము కలుగదు. ఆకారములేని వస్తువున కాభాసము కలుగుట యసంభవము.

అంతఃకరణోపాధివలన బ్రహ్మమును జీవుడుగా నంగీకరింతువేని నీమాట బాలుని మాటవంటి దగును. అంతఃకరణము ఖండఖండములుగా నుండి చలించుచుండును. బ్రహ్మ మఖండము, నచలమును. బ్రహ్మమును జీవుని వేఱుగా నంగీకరింపవేని దీనికి సమాధానము చెప్పుము. అంతఃకరణమేయే ప్రదేశములకు జలించి పోవునో యాయాదేశపు బ్రహ్మమును నజ్ఞానిగను, దాను విడిచివెళ్ళిన తావులనుండు బ్రహ్మమును జ్ఞానిగను జేయునా లేదా? తెఱచి యుంచిన గొడుగు ప్రకాశమున నెటనెటకు బోవునో యటనట బ్రకాశము నావరించి నీడను, గలుగజేయును. తాను విడిచిన తావులను బ్రకాశయుక్తములు చేయును. అట్లే యంతఃకరణముకూడ బ్రహ్మమును జేయునా? చేయదా? అట్లు చేసిన బ్రహ్మము క్షణక్షణమున నజ్ఞానిగాను, జ్ఞానిగాను మాఱవలసి వచ్చును. బంధ-మోక్షములు క్షణికములుగావలసి వచ్చును.

మఱియు నఖండబ్రహ్మమునం దేకదేశమున నంతఃకరణము వలన గలుగు ప్రభావము-అనగా బ్రహ్మము నజ్ఞానవంతము జేయుట సర్వదేశమున నగుటవలన బ్రహ్మము సర్వము నజ్ఞాని యగును. ఏలయన నది చేతనము. మఱియు మధురలో నున్న యంతఃకరణముచే నావరింపబడిన బ్రహ్మ మేవస్తువును జూచునో యా యంతఃకరణము కాశీదేశమునకు బోయి యటనున్న బ్రహ్మము నావరించినపుడా బ్రహ్మము మధురలో జూచిన వస్తువును స్మరింప జాలదు. ఏలయనగా 'అన్యదృష్ట మన్యో న స్మరతీతి న్యాయాత్' ఒకరు చూచిన దానిని మఱియొకరు స్మరింపజాల రను నియమ ముండుట వలన, మధురాంతఃకరణావచ్ఛిన్న బ్రహ్మము వేఱు, కాశీలో నంతఃకరణా వచ్ఛిన్న బ్రహ్మము వేఱుకదా! మధురలోని చిదాభాసము వేఱు, కాశీలోని చిదాభాసము వేఱని భావము.

బ్రహ్మమే జీవుడై యతడు వేఱు కానినాడు జీవుడు సర్వజ్ఞుడు కావలయును. బ్రహ్మ ప్రతిబింబము బ్రహ్మముకంటె భిన్నమైన 'ప్రత్యభిజ్ఞ' పూర్వము చూచినది కాని, విన్నది కాని తెలియబడనేరదు.'అదియే యిది' అను ప్రత్యభిజ్ఞ కలుగదు. బ్రహ్మ మొక్కటియే కావున స్మరణముకలుగ గల దందువేని బ్రహ్మమునం దొకయెడ నజ్ఞానము కాని, దుఃఖము కాని గలిగిన బ్రహ్మమున కంతటికి నది వర్తింపవలసి వచ్చును. మఱియు నిట్టి దృష్టాంతమువలన నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావయుక్తమగు బ్రహ్మమును నజ

ద్ధము నజ్ఞానయుక్తము, బద్ధము చేసితిరి. అఖండ బ్రహ్మమును ఖండఖండములు చేసి బ్రహ్మమును గొ
గానిదిగా జేసితిరి.

నవీనః- నిరాకారమునకును 'ఆభాస' మేర్పడును. దర్పణము నందును, జలాశయమందును నాకాశముయొక్క యాభాసము చూడనగుచున్నది. ఆకాశము నీలముగా గాని, యన్యవిధమున గంభీరముగా గాని కనిపించును. అట్లే బ్రహ్మముకూడ నిరాకారమైనను నంతఃకరణములలో భాసించును.

సిద్ధాంతిః- ఆకాశమున రూపమే లేనపుడు దానిని గంటితో నొక డెట్లు చూచును? కనబడని వస్తువు దర్పణమునందును జలాదులందును నెట్లు కనిపించును? లోతుగానో లోతులేనిదిగానో యాకారముగల వస్తువు కనిపించును. కాని నిరాకార వస్తు వెన్నడు నట్లు కనిపింపదు.

నవీనః-ఆపైన నీలముగా గనిపించునదియే దర్పణమునను నీటియందును భాసించును. అదియేమి పదార్థము? ఆకాశము కాదా?

సిద్ధాంతిః- భూమినుండి పైకెగిరి పోయిన పృథివీ, జలము, నగ్ని యను పదార్థముల త్రసరేణువులు. ఎటనుండి వర్షము కురియునో యట జలము లేకున్న వర్ష మెట్లు వచ్చును? దూరమున బండిరివలె గనబడునది జలపరమాణువుల-త్రసరేణువుల సముదాయము. మంచు దూరమున మేఘాకారమున గనిపించును. దగ్గఱలో బలచగా గనిపించును. డేరా వలెను గనిపించును. అట్లే యాకాశమున జలకణములు కనిపించును.

నవీనః- మా రజ్జుసర్ప దృష్టాంతము స్వప్నదృష్టాంతము మిథ్యలేనా?

సిద్ధాంతిః- అవి మిథ్య కాదు; కాని మీ బుద్ధి మాత్రము మిథ్యయై యున్నది. ఇది పూర్వమే వ్రాసి వచ్చితిమి. ఒకమాట చెప్పుము. మొదట నజ్ఞాన మెవరికి గలుగును?

నవీనః- బ్రహ్మమునకు.

సిద్ధాంతిః- బ్రహ్మము సర్వజ్ఞమా అల్పజ్ఞమా?

నవీనః- అల్పజ్ఞము కాదు. సర్వజ్ఞము కాదు. అల్పజ్ఞత, సర్వజ్ఞత యుపాధిసహిత మందుండును.

సిద్ధాంతిః- ఉపాధి సహితు డెవరు?

నవీనః- బ్రహ్మము.

సిద్ధాంతిః- అయిన బ్రహ్మమే సర్వజ్ఞము, అల్పజ్ఞము నైనది కదా? అల్పజ్ఞము కాదు, సర్వజ్ఞము కాదని యేల నిషేధించితివి? ఉపాధి కల్పిత మందువేని, కల్పించున దెవరు?

నవీనః- జీవుడు బ్రహ్మమా? అన్యుడా?

సిద్ధాంతిః- అన్యుడు. ఏలయన బ్రహ్మ స్వరూపుడైన మిథ్యా కల్పన జేయువాడు బ్రహ్మము కాజాలడు. ఎవని కల్పన మిథ్యయో యతడు సత్యమెట్లు కాగలడు?

నవీనుడుః- మేము సత్యమును, నసత్యమును నబద్ధమని యంగీకరింతుము. వాణితో జెప్పునదియు మిథ్యయే.

సిద్ధాంతిః- మీరు చెప్పునదియు, నంగీకరించునదియు మిథ్యయేయైన మీ రసత్యము చెప్పువారేల కారు?

నవీనః- కావచ్చును. కానిండు, సత్యము, నసత్యము మాలోనే కల్పితము లగుచున్నవి. మేము సత్యాసత్యములకు సాక్షులము, నధిష్ఠాతలము నైయున్నాము.

సిద్ధాంతిః- సత్యాసత్యములకు మీరే యాధారమైన సాహుకారునకు జోరునకు నిరువురకు మీరు తుల్యు లగుదురు. అందువలన మీరు ప్రామాణికులును గారు. ఏల యనగా నెల్లప్పుడు సత్యము చెప్పు

వాడు, సత్యము నాచరించువాడు, సత్యము నంగీకరించువాడే ప్రామాణికు డగును. అతడబద్ధము నంగీకరింపడు, చెప్పడు, ఆచరింపడు. నీవు చెప్పునది నీవే యసత్య మనుచున్నావు. కావున నిన్ను నీవే 'మిథ్యావాది' వని చెప్పుకొనుచున్నావు.

నవీనః– బ్రహ్మ నాశ్రయించి యుండు ననాది మాయయే బ్రహ్మ నావరించును. మీరు దాని నంగీకరింతురా? లేదా?

సిద్ధాంతిః– అంగీకరింపము. ఏల యనగా వస్తువు కాకయే భాసించు దానిని మాయయని నీ వంగీకరించుచున్నావు. ఇట్టి విషయమును హృదయపు గన్ను లొట్టపోయిన వ్యక్తి యంగీకరించును. కాని బుద్ధిమంతుడంగీకరింప జాలడు. ఏది వస్తువు కాదో యది భాసించు ననుట యసంభవము. వంధ్యాపుత్రుని ప్రతిబింబ మెంత యసంభవమో యంతటి యసంభవ మగును. అవస్తువు భాసించుట "సన్మూలాః సోమ్యేమాః ప్రజాః" అను నిట్టి ఛాందోగ్యోపనిషత్తు యొక్క వచనములకు విరుద్ధముగా జెప్పుచున్నావు.

నవీనః–వసిష్ఠుడు, శంకరాచార్యుడు మొదలు నిశ్చలదాసు వఱకు గలవారు మీకంటె నధికపాండిత్యము కలవారైరి. వారు వ్రాసిన దానిని ఖండించుచున్నారు. మాకు వసిష్ఠాదులు గొప్ప విద్వాంసులుగా గనబడుచున్నారు.

సిద్ధాంతిః– నీవు విద్వాంసుడవా? అవిద్వాంసుడవా?

నవీనః– మేము కూడ గొంత విద్వాంసులమే.

సిద్ధాంతిః– మంచిది. అటులయిన వసిష్ఠునియు, శంకరాచార్యులయు నిశ్చలదాసునియుబక్షములను మా యెదుట స్థాపింపుము. మేము వానిని ఖండింతుము. ఎవరి పక్షము సిద్ధించిన వారే గొప్పవారు. వారు, నీవు చెప్పు విషయము లఖండనీయము లగునెడల వారి యుక్తులతో మా పక్షమును ఖండింపుము. ఖండనము చేయగలిగినచో వారి విషయములు, నీవి మాననీయము లగును.

జైనుల మతమును ఖండించుటకు శంకరాచార్యాదు లీ మాయావాదమును గ్రహించి యుండవచ్చును. ఏల యనగా దేశకాలముల కనుకూలముగ దమపక్షమును నిలబెట్టుకొనుటకు స్వార్థపరులయిన విద్వాంసులు తమ యాత్మజ్ఞానమునకు విరుద్ధమైన పక్షమును గూడ గ్రహించుచుందురు. మఱియు జీవేశ్వరుల యేకత, జగన్మిథ్యాత్వము మున్నగు విషయములు శంకరాచార్యాదులు సత్యములే యని యంగీకరించి యుండినచో నవియెన్నడును సత్యములు కానేరవు.

ఇక నిశ్చలదాసు పాండిత్యమును జూడుము. అది యిట్లున్నది – "జీవో బ్రహ్మాభిన్న శ్చేతనత్వాత్". అతడు 'వృత్తిప్రభాకరము' నందు జీవబ్రహ్మల యేకతను సిద్ధపఱచుట కీయనుమాన వాక్యమును బ్రయోగించి యున్నాడు. 'జీవుడు బ్రహ్మాభిన్నుడు, చేతన మగుటవలన, ఇయ్యది మందబుద్ధి గలవాని మాటవలె నున్నది. ఏల యనగా సాధర్మ్యమువలననే రెండు వస్తువు లేకము కాజాలవు. (కారణమేమన) వైధర్మ్యము భేదక మగును. అది యెట్లన ః– " పృథివీ జలాభిన్నా జడత్వాత్" పృథివి జలము కంటె భిన్నము కాదు – జడ మగుటవలన. అని యెవడేని యనిన నది యెట్లు సత్యము – సంగతము కాదో, అట్టిదే నిశ్చలదాసు ప్రయోగించిన యనుమాన వాక్యముగూడ నసంగతము – నసత్యమగును. (జడత్వధర్మమును బురస్కరించుకొని భూమి జలము రెండు నొక్కటియే యనుట సరి కాని విధమున) నిశ్చలదాసు చెప్పిన చేతనత్వధర్మము జీవబ్రహ్మలలో సమానముగా నున్నంతమాత్రమున జీవబ్రహ్మము లొక్కటి కాజాలవు. కారణమేమన యల్పజ్ఞత, భ్రాంతిమత్త్వము మున్నగు ధర్మములు జీవునిలో నున్నవి. అవి బ్రహ్మమున లేవు. బ్రహ్మమునందున్న సర్వజ్ఞత, సర్వగతత్వము, నిర్భ్రాంతిత్వము మున్నగు ధర్మములు జీవునిలో నున్న ధర్మములకంటె విరుద్ధ ధర్మములు. కావున జీవుడు బ్రహ్మము భిన్నులే కాని

యొకటి యెన్నడును గారు. అట్లే భూమియందుగల గంధవత్త్వము, కఠినత్వము మున్నగు ధర్మములు జలమునందున్న రసత్వము, ద్రవత్వము మున్నగు ధర్మములకంటె విరుద్ధధర్మములు. కావుననే భూ జలములు రెండును నొకటి కావు. అట్లే జీవబ్రహ్మములలో నెన్నియో విరుద్ధధర్మములుండుటవలన నవి రెండు నొకటి యెన్నడును గాలేవు; కావు కాబోవు అని వివేకము. దీనింబట్టియే నిశ్చలదాసాదుల పాండిత్యమెంతటిదో తెలిసికొనుడు. ఇక యోగవాసిష్ఠమును వ్రాసి నదియు నెవడో యాధునిక వేదాంతియై యుండును. దానితో వాల్మీకి, వసిష్ఠ, రామచంద్రులకు నెట్టి సంబంధము లేదు. వారు చెప్పినది కాదు. వినినది కాదు. వారు వేదానుయాయులు. కావున వేదవిరుద్ధముగా వ్రాయరు, చెప్పరు, వినరుకూడ.

ప్రశ్నః- వ్యాసుడు వ్రాసిన శారీరక సూత్రములందును జీవబ్రహ్మల యేకత కనిపింపదా? చూడుడు.

"సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్." (౧)

" బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః." (౨)

"చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః." (౩)

" ఏవమప్యుపన్యాసాత్ పూర్వభావాదవిరోధం బాదరాయణః." (౪)

" అత ఏవ చానన్యాధిపతిః . " (౫) ( వేదాంత. ద ౪-౪-౧,౫,౬,౭,౯.)

జీవుడు స్వస్వరూపమును బొంది ప్రకట మగుచున్నాడు. అతడు పూర్వము బ్రహ్మరూపమున నుండెను. ఏల యనగా స్వశబ్దము తన బ్రహ్మస్వరూపమును గ్రహించును. (౧)

'అయమాత్మా అపహతపాప్మా' అను నిట్టి యుపన్యాస మైశ్వర్యప్రాప్తి పర్యంత మున్నహేతువులవలన బ్రహ్మస్వరూపమున జీవుడు స్థితుడై యున్నాడు. అని జైమిని ఆచార్యుని మతము. (౨).

ఔడులోమి ఆచార్యుడు, తదాత్మ స్వరూపనిరూపణాది బృహదారణ్యకములోని హేతురూప వచనములవలన చైతన్య మాత్ర స్వరూపముతో జీవుడు ముక్తియందు స్థితుడై యుండును. (౩)

వ్యాసు డీపూర్వోక్తములైన యుపన్యాసాది యైశ్వర్యప్రాప్తిరూప హేతువులవలన జీవుడు బ్రహ్మస్వరూపుడనుటలో నవిరోధము నంగీకరించుచున్నాడు. (౪)

యోగి యైశ్వర్యసహితుడై తన బ్రహ్మస్వరూపమును బొంది యన్యాధిపతిరహితుడై యనగా తాను స్వయముగా దనకు నెల్లరకు నధిపతి రూపమగు బ్రహ్మస్వరూపముతో ముక్తియందు స్థితుడై యుండును. (౫)

ఉత్తరముః- ఈ సూత్రములకు నీవు చెప్పిన యర్థము సరికాదు. వాని యర్థముయథార్థముగ నిదిః-

జీవుడు సర్వమలములనుండి రహితుడై స్వకీయ శుద్ధస్వరూపమును బొంది పవిత్రుడు కానంతవఱకు, యోగము వలన నైశ్వర్యమును బొంది తన కంతర్యామి యగు బ్రహ్మమును బొంది యానందమున స్థితుడు కాజాలడు. (౧)

ఇదే విధముగ బాపాదులనుండి రహితుడై యైశ్వర్యయుక్తయోగి యైనపుడు బ్రహ్మముతో బాటు మోక్షానందము ననుభవింప గలడు. ఇది జైమిని ఆచార్యునిమతము. (౨)

అవిద్యాది దోషములనుండి విడివడి శుద్ధచైతన్యమాత్రస్వరూపముతో జీవుడు స్థిరుడైనపుడు 'తదాత్మస్వరూప' బ్రహ్మస్వరూపముతో సంబంధమును బొందును. ఇది ఔడులోమి ఆచార్యునిమతము. (౩)

జీవుడు బ్రహ్మముతో నైశ్వర్యమును శుద్ధవిజ్ఞానమును బొంది జీవించి యుండగానే జీవన్ముక్తుడగును. అప్పుడు తన నిర్మల పూర్వ స్వరూపమును బొంది యానందితు డగును. ఇది వ్యాసుని మతము. (౪)

యోగి సత్యసంకల్పుడైనపుడు స్వయముగా బరమేశ్వరుని బొంది ముక్తి సుఖము ననుభవించును. అటుల స్వాధీనుడు స్వతంత్రుడునై యుండును. లోకమున నొకడు ప్రధానుడుగాను మఱియొక డప్రధానుడుగాను నుండునట్లు ముక్తియందుండరు. అక్కడ నెల్లముక్తజీవు లొక్కటిగానే యుందురు. (౫)

ఇట్లు కానిచో:-

"నేతరోఽనుపపత్తేః." వే.ద.౧-౧-౧౬ (౧)

"భేదవ్యపదేశాచ్చ" వే.ద. ౧-౧-౧౭ (౨)

"విశేషణభేదవ్యపదేశాభ్యామ్ చ నేతరౌ" వే.ద.౧-౨-౨౨ (౩)

"అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి " వే.ద.. ౧-౧-౧౯ (౪)

"అంతస్తద్ధర్మోపదేశాత్" వే.ద. ౧-౧-౨౦ (౫)

" భేదవ్యపదేశాచ్చాన్యః" వే.ద.౧-౧-౨౧ (౬)

"గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్." వే.ద.౧-౨-౧౧ (౭)

"అనుపపత్తేస్తు న శారీరః " వే.ద.౧-౨-౩ (౮)

"అంతర్యామ్యధిదేవాదిషు తద్ధర్మవ్యపదేశాత్" వే.ద.౧-౨-౧౮ (౯)

"శారీరశ్చోభయేఽపి హి భేదేనైనమధీయతే". వే.ద.౧-౨-౨౦ (౧౦)

(ఇవి వ్యాసమునికృతవేదాంత సూత్రములు)

అర్థములు:- బ్రహ్మముకంటె భిన్నుడైన జీవుడు సృష్టికర్త కాడు. ఏల యనగా నీ యల్పుడు, నల్పజ్ఞుడు, నల్పసామర్థ్యము గల జీవునియందు సృష్టి కర్తృత్వము ఘటిల్లదు- ఒప్పదు. కావున జీవుడు బ్రహ్మముకాదు. (౧)

"రసం హ్యేవాయం లబ్ధ్వాఽనందీభవతి. (తై.ఉ.బ్ర.వ.౭)

ఇది యుపనిషద్ వచనము. జీవుడు బ్రహ్మము భిన్నములు. కారణమేమన నీరెండింటియందును భేదము ప్రతిపాదింపబడినది. భేదము లేకున్న నానందస్వరూప బ్రహ్మమును బొంది జీవు డానందస్వరూపుడగును. ఇట బొందబడువాడు బ్రహ్మము, పొందువాడు జీవుడునని వేఱుగా నిరూపణము తగదు. కావున జీవబ్రహ్మ లొక్కటి కారు. (౨)

"దివ్యోహ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరోహ్యజః, అప్రాణో హ్యమనాః

శుభ్రోఽక్షరాత్ పరతః పరః.' ముం. ఉ. ౨-౧-౨.

దివ్యుడు, శుద్ధుడు, మూర్తిమత్వ రహితుడు, సర్వమున బూర్ణుడు- లోపల వెలుపల నిరంతరముగా వ్యాపించి యుండువాడు, అజుడు- జన్మ మరణ శరీరాది ధారణరహితుడు, శ్వాస ప్రశ్వాసములతో, శరీర మనస్సులతోను సంబంధము లేనివాడు, ప్రకాశస్వరూపుడు నను నివి యన్నియు బరమేశ్వరునకు విశేషణములు. జీవుడక్షరుడు- నాశరహితుడు, ప్రకృతికంటె సూక్ష్ముడు, ఇట్టి జీవునికంటెను బరమేశ్వరుడు పరుడు- సూక్ష్ముడు. ఇట్లు జీవునికంటెను బ్రకృతికంటెను భిన్నముగా వర్ణింపబడుట వలన బ్రహ్మ జీవు నికంటె భిన్నుడు. (౩)

ఈ సర్వవ్యాపక బ్రహ్మమునందు జీవుని యోగము లేక జీవునందు బ్రహ్మసంబంధము, ప్రతిపాదింపబడుటవలన జీవబ్రహ్మములు భిన్నములు. కారణమేమన యోగము- సంయోగము భిన్నపదార్థములందే జరుగును. (౪)

బ్రహ్మమునం దంతర్యామిత్వాది ధర్మములు ప్రతిపాదింపబడుటవలన బ్రహ్మము, జీవునిలో వ్యాపించియున్నట్లు బోధపడుచున్నది. కావున వ్యాప్యుడైన జీవుడు వ్యాపకమగు బ్రహ్మముకంటె భిన్నుడని తెలియుచున్నది. వ్యాప్యవ్యాపకసంబంధముకూడ భిన్నవస్తువులలోనే యుండును. (౫)

పరమాత్మ జీవునికంటె భిన్నస్వరూపు డైన ట్లింద్రియములు, నంతఃకరణము, పృథివ్యాదిభూతములు, దిశలు, సూర్యాదులు, దివ్యగుణయోగమువలన దేవత లనబడువిద్వాంసులు వను వీరందఱకంటె భిన్నుడని తెలిసికొనవలయును. (౬)

"గుహాం ప్రవిష్టౌ సుకృతస్య లోకే" అను నిట్టి యుపనిషద్వాక్యముల వలన జీవుడు, పరమాత్ముడు పరస్పరభిన్నులు. ఇట్లే యుపనిషత్తులలో బలుచోట్ల జూపబడినది. (౭)

"శరీరే భవః శారీరః "శరీరధారి జీవుడు. బ్రహ్మము కాదు. బ్రహ్మము గుణకర్మస్వభావములు జీవునిలో ఘటిల్లవు – ఒప్పవు. (౮)

అధిదేవ- దివ్యమైనమనస్సు మున్నగు నింద్రియములందు నధిభూత పృథివ్యాదిభూతములందు, అధ్యాత్మ- సర్వజీవులయందును బరమేశ్వరుడంతర్యామి రూపమున నున్నాడు. ఏలయన నాపరమేశ్వరుని వ్యాపకత్వాది గుణము లుపనిషత్తులలో నంతటను వర్ణింపబడినవి. (౯)

శరీరధారియైన జీవుడు బ్రహ్మము కాదు. కారణమేమన బ్రహ్మము కంటె జీవుడు భిన్నుడని స్వరూపముచేతనే సిద్ధ మగుచున్నది. (౧౦)

ఇట్టి శారీరక సూత్రములవలన బ్రహ్మము జీవుడు నిరువురు స్వరూపముతోనే భిన్నులని స్పష్ట మగుచున్నది.

అట్లే వేదాంతుల యుపక్రమ యుపసంహారములు కూడ ఘటిల్లవు. ఏల యనగా నుపక్రమము - ఆరంభము బ్రహ్మముతో, నుపసంహారము - ప్రళయముకూడ బ్రహ్మమునందే చేయుచున్నారు. బ్రహ్మముతక్క మఱియొక వస్తువు నంగీకరింపనపు డుత్పత్తి ప్రళయములు కూడ బ్రహ్మధర్మములే యగును. మఱి బ్రహ్మ ముత్పత్తి వినాశ ధర్మములు లేనిదిగా వేదాది సత్యశాస్త్రములు వర్ణించుచున్నవి. అవి నవీన వేదాంతులపై గోపించును. ఏల యనగా నిర్వికారి, యపరిణామి,శుద్ధము, సనాతనము, నిర్భ్రాంతిత్వాది విశేషణయుక్త బ్రహ్మమునందు వికారము, నుత్పత్తి, యజ్ఞానము మున్నగునవి యెన్నటికిని సంభవము కావు. అట్లే యుపసంహారము-ప్రళయము జరిగిన పిమ్మటకూడ బ్రహ్మము, కారణాత్మకమగు జడప్రకృతి, జీవులును, మిగిలియుండును. కావున నీ వేదాంతుల యుపక్రమోపసంహారములును గల్పితములే. ఇట్లే యితరములగు ననేకములైన యశుద్ధులు శాస్త్రములకు బ్రత్యక్షాది ప్రమాణములకు విరుద్ధములైనవి యున్నవి.

## (విక్రమాదిత్యుడు-భర్తృహరి)

పిమ్మట జైనులయు, శంకరాచార్యుల యనుయాయులయు నుపదేశముల సంస్కారము లార్యావర్తమున వ్యాపించెను. పరస్పర ఖండన మండనములు నడచుచుండెను. శంకరాచార్యులకు తదుపరి మూడు వందల సంవత్సరములు గడచినమీదట ఉజ్జైన నగరమున విక్రమాదిత్యుడనురాజు కొంత పరాక్రమశాలి రాజ్యము చేసెను. అతడు రాజులలో గల యంతఃకలహములు దూరము చేసి శాంతిని స్థాపించెను. తదుపరి భర్తృహరి రాజు కావ్యాదులందును శాస్త్రములందు నితర విషయములందు గొంత వైదుష్యమును సంపాదించెను. అతడు విరక్తుడై రాజ్యమును వదలిపెట్టెను.

(భోజరాజు-కాళిదాసు)

విక్రమాదిత్యుని తదుపరి యైదువందల సంవత్సరములు గడచిన మీదట భోజుడు రాజ్యము నక్షిష్ఠించెను. అతడు కొంత వ్యాకరణమును కావ్యాలంకారాదులను గొంత ప్రచారము చేసెను. అతని రాజ్యమున గొఱ్ఱెలను మేపు, కాళిదాసుకూడ కావ్యకర్త యయ్యెను. ఎవడేని మంచి శ్లోకము వ్రాసి తీసికొని వచ్చి భోజరాజుకు వినిపించిన నతనికి నధికముగా ధనము నిచ్చువాడు, నని ప్రతిష్ఠయు నతనికి గలిగెను. అతని తరువాత రాజ్యమునకు వచ్చిన రాజులు, శ్రీమంతులు చదువులయే మానిరి.

వామమార్గులకు దరువాత శంకరాచార్యులకు బూర్వము శైవశాక్తాది సంప్రదాయములు కొంత వ్యాపించినవి. కాని యవి యంతగా బలపడవయ్యె. విక్రమాదిత్య మహారాజు కాలమునుండి శైవమతము కొంత యభివృద్ధి బొందెను. శైవులలో పాశుపతాది శాఖలును నేర్పడెను. వామమార్గులలో దశ మహా విద్యాదిశాఖ లేర్పడినట్లు శైవులలోను బహుశాఖ లేర్పడెను.

జనులు శంకరాచార్యుని శివుని యవతారముగా నెంచిరి. వారి యనుయాయులు శైవమతమున బ్రవృత్తులైరి. వామమార్గులను గూడ దమలో గలుపుకొనుచుండిరి. వామమార్గులు శివునిపత్నిని దేవిని నుపాసింప నారంభించిరి. శైవులు మహాదేవుని నుపాసింపసాగిరి. ఈ యిరుతెగల వారును రుద్రాక్షమాలలు, భస్మము నేటికిని ధరించుచున్నారు. కాని వామమార్గులు వేదమార్గమున కెంతవిరోధులో శైవులంత విరోధులు కారు.

(రుద్రాక్షధారణమహత్త్వము)

"ధిక్ ధిక్ కపాలం భస్మరుద్రాక్షవిహీనమ్" (౧)
"రుద్రాక్షాన్ కంఠదేశే దశనపరిమితాన్, మస్తకే వింశతి ద్వే, షట్ షట్ కర్ణ
ప్రదేశే, కరయుగలగతాన్ ద్వాదశాన్ ద్వాదశైవ, బాహ్వోరిన్దోః కలాభిః
పృథగితి గదితమేకమేవం శిఖాయాం, వక్షస్యష్టాధికం యః కలయతి శతకం
స స్వయం నీలకంఠః" (౨) (రుద్రాక్షజాబాల ఉపనిషత్. ౧-౧౫,౧౬)

వీరిట్టి శ్లోకములను ననేకములను రచియించిరి. ఎవని కపాలమున భస్మము, కంఠమున రుద్రాక్షలు నుండవో యతడు ధిక్కారమునకు బాత్రుడు. 'తం త్యజేదంత్యజం యథా' అతని నంత్యజునివలె త్యజింపవలయును-చాండాలునివలె దూరమున నుంచవలయును. (౧)

కంఠమున ముప్పదిరెండు (౩౨) శిరస్సున నలుపది (౪౦) కర్ణములందు నాఱాఱు (౬) చేతులకు బంద్రెండు, పంద్రెండు, (౧౨), భుజములందు షోడశషోడశ, (౧౬) శిఖలో నొక్కటి (౧), హృదయమున (౧౦౮), రుద్రాక్షలు ధరించువాడు సాక్షాత్తుగా నీలకంఠుని సదృశుడగును. (౨) ఇట్లే శాక్తులు నంగీకరింతురు.

(భగ, లింగ, పూజ)

తదుపరి యీవామమార్గులు శైవులు కలిసి భగ, లింగములను స్థాపించిరి. వానినే జలధారి, లింగము నని చెప్పుదురు. వానిని బూజింపసాగిరి. ఇట్టి పిచ్చిపని నెందుకు చేయుచున్నామా యని కొంచెము లజ్జయైనను నా నిర్లజ్జులకు గలుగదయ్యె. అందువలననే యొకకవి " స్వార్థీ దోషం న పశ్యతి" 'స్వార్థపరుడు దోషమును జూడడు' అని నుడివెను. స్వార్థపరులు తమ స్వార్థమును సిద్ధింపజేసికొనుటకు

దుష్టకార్యములనుగూడ శ్రేష్ఠములుగా నెంచి దోషములను జూడరు. రాతి విగ్రహములను, భగలింగములను బూజించుటయందే ధర్మార్థకామమోక్షములసిద్ధి నెంచుచున్నారు.

భోజరాజునకు దరుపరి జైనులు తమ మందిరములందు మూర్తులు స్థాపించి వాని దర్శన స్పర్శనాదులకొఱకు రాకడ పోకడ సాగించిరి. అప్పుడీపోపుల శిష్యగణముకూడ నామందిరములకు బోదొడగిరి. మఱియు బశ్చిమదేశములనుండి యితరమతముల యవనులు నార్యావర్తమునకు రా బోదొడగిరి. అప్పుడు పోపు లీశ్లోకమును రచించిరి.

"న వదేద్ యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి, హస్తినా తాడ్యమానోఽపి
న గచ్ఛేజ్జైనమందిరమ్." (భవిష్యపురాణము)

ఎంతటి దుఃఖము ప్రాప్తించినను, ప్రాణములు కంఠగతము లైనను మృత్యుసమయ మాసన్నమైనను యావనీ-మ్లేచ్ఛభాషను నోట నుచ్చరింపరాదు. ఉన్మత్తగజము-పిచ్చిపట్టిన యేనుగు చంపుటకు వచ్చినపుడు జైనమందిరమునకు వెళ్ళిన ప్రాణములు దక్కునవకాశ మున్నను జైనమందిరమున నడుగిడ రాదు. అనగా జైనమందిరమున దూఱి ప్రాణములు దక్కించుకొనుటకంటె యేనుగున కెదురేగి చచ్చుట శ్రేయస్కరమని భావము.

వారు తమశిష్యులకు మిక్కిలి చిత్రముగా నుపదేశింపసాగిరి. ఎవరేని మీ మతమునకు ప్రమాణ గ్రంథ మేదైన నున్నదా యని యడిగిన లేకేమి యున్నది యని చెప్పి మార్కండేయ పురాణమును జూపసాగిరి. అందలి వచనములను జదివి వినిపించెడివారు. దుర్గాపాఠమున దేవీవర్ణనము వ్రాయబడి యున్నది. దానినే వినిపించెడివారు.

భోజరాజు రాజ్యముచేయు కాలమందు నెవరో శివపురాణము, మార్కండేయపురాణము వ్రాసి వ్యాసుని నామముతో ప్రచారమునకు దెచ్చిరి. భోజరాజు కీవిషయము తెలిసినపుడు వానిని వ్రాసిన పండితులకు హస్తచ్ఛేదన దండనము విధించెను. అంతేకాక వారి నిట్లాదేశించెను. 'మీరేదేని కావ్యము వ్రాసిన నది మీపేరుతోనే వ్రాయుడు. ఋషుల మునుల పేర వ్రాయవలదు. ఈ భోజరాజు రచించిన సంజీవనీ నామక మగు నితిహాసమున నీవిషయము నంకితము చేసెను. ఆ గ్రంథము గ్వాలియర్ రాజ్యమున 'భిండ్' నామక గ్రామమున తివారీ బ్రాహ్మణుల యింట నున్నది. ఆ గ్రంథమును 'లఖనా'కు సంబంధించిన రావుసాహబ్, అతనిగుమాస్తా రామదయాల్ చౌబే తమ కన్నులతో జూచి యుండిరి.

వ్యాసమహర్షి నాలుగువేల నాలుగువందల శ్లోకములు, వారి శిష్యులైదువేల యాఱువందల శ్లోకములు మొత్తము పదివేల శ్లోకములతో భారతము వ్రాయబడినట్లు భారతమునందే స్పష్టముగా వ్రాయబడి యున్నది. మహారాజు విక్రమాదిత్యుని కాలమున నిరువదివేల శ్లోకములతోను, నా తండ్రిగారి సమయమున నిరువదియైదువేల శ్లోకములతోను, నేను రాజ్యము చేయుకాలమున ముప్పదివేల శ్లోకములతోను గూడియున్న మహాభారతము లభించుచున్నదని మహారాజు భోజుడు చెప్పియున్నాడు. ఆ మహాభారత మిట్లే పెరుగుచు బోయినచో నది యొకయొంటెబరువు గ్రంథముకావచ్చును.

మఱియు నిట్లే ఋషుల మునుల నామములతో బురాణాది గ్రంథములను రచించుచు బోయిన యార్యావర్తపు మానవులు భ్రమజాలమున బడి వైదికధర్మవిహీనులై భ్రష్టులగుదురు. దీనింబట్టి చూచిన భోజ రాజునకు గొంత వైదికసంస్కారము లున్నట్లు విదిత మగుచున్నది.

('భోజ' సమయమున యంత్రములు)

భోజరాజు తన భోజప్రబంధనామక గ్రంథమున నిట్లు వ్రాసెను.

"ఘట్యేకయా క్రోశదశైకమశ్వః సుకృత్రిమో గచ్ఛతి చారు గత్యా,
వాయుం దదాతి వ్యజనం సుపుష్కలం వినా మనుష్యేణ చలత్యజస్రమ్"
(భోజరచితసమరాంగణసూత్రధార, యుక్తి కల్పతరుః)

భోజరాజు రాజ్యమునను, నతని సమీపమునను మంచిశిల్పులుండిరి. వారు యంత్రసాహాయ్యముతో నడుచునట్టి గుఱ్ఱపు టాకారమున నొకయానమును రచించిరి. ఒక ఘడియ కాలములో నది పదునొకండుక్రోసులు, నొకగంటలో నిరువదియేడున్నర క్రోసులు దూరము పోవుచుండెడిది. అది భూమి మీదను, నంతరిక్షమునను బోయెడిది. రెండవది పంఖా-విసనకఱ్ఱ-వీవన.అదియు యంత్రసాహాయ్యముతో నడచి పుష్కలముగా వాయుసంచారము చేసెడిది. దానికి మనుష్యునితో బ్రమేయము లేదు. ఇయ్యవి రెండును నేటివఱకు బ్రచారములోనుండిన నిరోపావాసులింత గర్వపడ కుండెడివారు.

పోపులు తమ శిష్యులను జైనులవంకకు బోనీక యెంత నిషేధించినను జనులు జైనుల మందిరములకు బోవుచునే యుండిరి. జైనుల కథలు వినుటకును వెళ్ళ నారంభించిరి. జైనుల పోపులు పౌరాణికుల శిష్యులను దమవలలో వేసికొన జొచ్చిరి. ఇందుల కేదేని యుపాయ మాలోచింప వలయునని పౌరాణికులు నాలోచించిరి. లేకున్న దమశిష్యు లెల్లరు జైనులగుదురను భయము కలిగెను. తదుపరి యెల్లరు గలిసి జైనులకువలె దాముకూడ మందిరములను మూర్తులను, గథలను నిర్మించుటకు నిశ్చయించి, జైనుల తీర్థంకరులకువలె నిరువదినాలు గవతారములు ప్రసిద్ధము చేసిరి. మందిరములను నిర్మించిరి. అందు మూర్తులను బ్రతిష్ఠచేసిరి. జైనుల యాదిపురాణము, నుత్తరపురాణములవలె, పౌరాణికులును నష్టాదశపురాణములు రచించిరి.

(వైష్ణవ మతము)

భోజరాజునకు తదుపరి నూటయేబదివత్సరములు గడచిన పిమ్మట వైష్ణవమతమారంభమయ్యెను.ఒక శఠకోపయతి కంజరవర్ణమున నుత్పన్న మయ్యెను. అతనివలన గొంతమతము నడచినది. అతని తరువాత భంగీకులోత్పన్నుడైన మునివాహనుడు, యవన కులోత్పన్నుడైన యావనాచార్యుడును వైష్ణవమత ప్రచారకు లయిరి. వారి తరువాత బ్రాహ్మణకులజుడైన రామానుజుడు వచ్చెను. అతడు తన మతమును విస్తారము చేసెను.

(వివిధపురాణములు)

శైవులు శివపురాణాదులను, శాక్తమతమువారు దేవీభాగవతాదులను, వైష్ణవులు విష్ణుపురాణాదులను రచించిరి. వానిలో దమనామములను జేర్చినచో నెవరును వానిని బ్రమాణములుగా నెంచరని భావించి వారిపేళ్ళ నందు జేర్పరైరి. పైపెచ్చు వ్యాసాది ఋషులపేళ్ళతో వానిని నిర్మించిరి. వాస్తవమున నీగ్రంథములకు నవీనము లనిపేరు పెట్టవలసి యుండెను. కాని, ఒక దరిద్రుడు తనపుత్రుని మహారాజాధిరాజనియు, నాధునిక పదార్థమును సనాతనమనియు జెప్పుకొనుటలో నాశ్చర్యమేమున్నది.

వీరు తమ పారస్పరిక కలహములు పురాణములలోను జొప్పించి వ్రాసియున్నారు. చూడుడు-దేవీభాగవతమున శ్రీ యను నొకదేవిని శ్రీపురమునకు స్వామినిగా వ్రాసియున్నారు. ఆమెయే సమస్తజగత్తును నిర్మించినది. బ్రహ్మ,విష్ణువు, మహాదేవుడు కూడ నీమెచేతనే రచియింప బడినట్లున్నది. ఆమె తనకు గోరిక గలిగినపుడు తనచేతిని (నేలకు)రాచినది. అందువలన, నామెచేతిలో నొక బొబ్బ కలిగినది. దానినుండి బ్రహ్మపుట్టెను. ఆదేవి తనను వివాహమాడు మని యాదేశించినది. బ్రహ్మ యామెతో 'నీవు నాతల్లివి. కావున నేను నిన్ను వివాహమాడజాలను' అనెను. అది విని యామెకు గ్రోధము కలిగెను. అతనిని భస్మము చేసి వైచెను.

మరల జేతిని రాచి పూర్వమువలె రెండవకుమారుని బుట్టించెను. అతడే విష్ణువు. అతనితోను బూర్వమువలె దనను వివాహ మాడవలసినదని చెప్పెను. అతడు నంగీకరింపక పోవుటవలన నతనిని భస్మము చేసెను. మరల మూడవసారి పూర్వమువలెనే మూడవ కుమారుని బుట్టించెను. అతనిపేరు మహాదేవుడు. అతనితోను నీవు నన్ను బెండ్లియాడు మనెను. అందులకు మహాదేవుడు నేను బెండ్లియాడజాలను. కాని నీవు మఱియొక స్త్రీరూపమును ధరించుము-అనెను. అట్లే యాదేవి చేసెను. అంతట నామహాదేవు డామె నీభస్మరాసు లేమిటి యని యడిగెను. అందులకు దేవి ' వీరిద్దరు నీ సోదరులు. వీరు నాయాజ్ఞను దిరస్కరించిరి. కావున భస్మము చేసితిని, అనెను. అప్పుడు మహాదేవుడు- 'నేకొక్కడ నేమి చేయుదును? వీరిని గూడ జీవింప జేయుము. వీరికొఱకు మఱి యిరువురు స్త్రీలనుగూడ నుత్పన్నము చేయుము. ముప్పురితో ముప్పురికి వివాహము లగును. ' అనెను. దేవి యట్లే చేయగా ముప్పురు నా ముప్పురిని వివాహము చేసికొనిరి.

(సమీక్ష)

(ఆహా! ఏమిపురాణమహిమ!) తల్లిని బెండ్లాడ లేదు-కాని తోబుట్టువును బెండ్లాడిరి. ఇందలి యౌచిత్యము నేమనవలయును? అటుపై నింద్రాదుల నుత్పన్నము చేసెను. బ్రహ్మ, విష్ణువు, మహాదేవుడు, నింద్రుడు మున్నగు వారిని బల్లకిలో నుంచి మోయుటకు బోయీల నుత్పన్నము చేసెను. ఇట్టి గప్పాలు మితిలేకుండ వ్రాయబడినవి. 'ఈ దేవి శరీరమును, శ్రీపురమును బుట్టించిన వారెవరు? ఆమె తల్లిదండ్రు లెవరు? అని యడిగిన నేమి చెప్పగలరు? దేవి యనాది యందురేని దేవిశరీరము సంయోగజన్యము కదా! సంయోగజన్య మనాది యెట్లగును? ఎన్నడును గాజాలదు. మాతాపుత్రుల వివాహముజేయభయపడువారికన్న చెల్లెండ్ర వివాహమున గలుగుమంచియేమి.

ఈ దేవీభాగవతమున బ్రహ్మ విష్ణు మహేశ్వరాదుల క్షుద్రతయు, దేవియొక్క గొప్పతనము వర్ణింపబడినట్లు, శివపురాణమున దేవ్యాదుల క్షుద్రత మిక్కిలిగ వ్రాయబడినది. అందు మహాదేవు డీశ్వరుడు, మిగిలిన వారందఱు నతని సేవకులు నని వ్రాయబడియుండుట జూడనగును.

కొండొక వృక్షఫల బీజములైన రుద్రాక్షలు, భస్మము ధరించిన మోక్షము లభించు నెడల బూడిదలో బొరలు గాడిద మున్నగు జంతువులు, గురుగింజలు, పూసలు ధరించు భిల్లులు, పిచ్చిగుంటలవాళ్ళు ముక్తి నేలపొందరు? బూడిదలో బొర్లాడు కుక్కలు, పందులు, గాడిదలు ముక్తిని బొందవనుటలో నుచిత మేమి?

ప్రశ్న:- కాలాగ్ని రుద్రోపనిషత్తులో భస్మము ధరించు విధానము వ్రాయబడియున్నది. ఏమి యది యబద్ధమా? " త్ర్యాయుషం జమదగ్నే" ఇది యజుర్వేదమంత్రము. ఇట్టి మంత్రములు చదువుచు భస్మధారణము చేయవలయునట. రుద్రుని కంటినుండి జారిపడిన కన్నీటిబొట్టునుండి పుట్టినది రుద్రాక్ష యనబడునట. కావున దానిని ధరించిన బుణ్యము కలుగునట. ఒక్కరుద్రాక్షను ధరించినను బాపములన్నియు బోయి స్వర్గమునకు బోవునట. ఇక యమరాజు నరకముల భయమేల యుండును?

ఉత్తరము:- ఎవడో బూడిదను బూసికొనువాడు ' కాలాగ్ని రుద్రోపనిషత్తు' వ్రాసియుండును. ఏల యనగా నందు " యాఽస్య ప్రథమా రేఖా సా భూర్లోకః" మొదటిరేఖ భూలోకము' అను నిట్టి యనర్థములు వ్రాయబడియున్నవి. ప్రతిదినము చేతివ్రేళ్ళతో నిర్మించు భస్మరేఖ భూలోకము, దానికి వాచకము నెట్లగును?

" త్ర్యాయుషం జమదగ్నే" అను నీమంత్రములు భస్మధారణమునకు సంబంధించినవి కానేకావు. 'చక్షుర్వై జమదగ్నిః' ఇది శతపథ వాక్యము. మంత్రార్థము – ' ఓపరమేశ్వర! నా నేత్రజ్యోతి త్ర్యాయుషం=త్రిగుణము-మూడువందల సంవత్సరములవఱకు దఱుగకుండుగాక; దృష్టి నశింపని

ధర్మకార్యములు చేయునట్లు నన్ను ననుగ్రహింపు మని ప్రార్థన. ఆహా! ఇది యెంతటి మూర్ఖత యనవల యును. లోకమున నెక్కడనైన గన్నేరుబొట్టు వృక్షమగునా? పరమేశ్వరుని యీ సృష్టిక్రమము నెవడైనను మఱియొకవిధముగ జేయగలడా? సృష్టినియమము- పరమేశ్వరు డేవృక్షబీజమును నిర్మించెనో దానినుం డియే యావృక్ష ముద్భవించును. మఱియొక విధమున గలుగదు. కావున రుద్రాక్షలు, భస్మము, కమలా క్షలు, గడ్డి,గాదము మున్నగునవి కంఠమున ధరించుట మనుష్యు డడవిజంతువుగా వర్తించుట యగును.

ఇట్టి వామమార్గులు, శైవులు, పలువురు మిథ్యాచారులు, విరోధులు కర్తవ్యకర్మలను విడిచి వ్యర్థముగా దిరుగువారగుదురు. వారిలో నెవరేని శ్రేష్ఠులున్న వారీవిషయములను విశ్వసింపక మంచిపనులు చేయు దురు. రుద్రాక్షలు, భస్మము ధరించువారిని జూచి యముడు నతనిదూతలు భయపడిన నిట లోకమున బోలీసులు కూడ వారిని జూచి భయపడు చుండవచ్చును. ఈ భస్మధారులను జూచి కుక్క, పిల్లి, సింహము, తేలు, ఈగ, దోమ, పాము మున్నగు క్షుద్రజంతువులే భయపడనప్పుడు న్యాయాధీశుని సేవ కగణ మేల భయపడును?

(వైష్ణవమతము)

ప్రశ్న:- వామమార్గులు, శైవులు మంచివారు కాకున్న బోనిండు. వైష్ణవులు మంచివారేనా?

ఉత్తరము:- వీరును వేదవిరోధు లగుటవలన వారికంటెను మిక్కిలి చెడ్డవారే.

ప్రశ్న:- 'నమస్తే రుద్రమన్యవే' 'శివాయ చ శివతరాయ చ' 'వైష్ణవ మసి' 'వామనాయ చ' 'గణానాం త్వా గణపతిం హవామహే' 'భగవతీ హి భూయా:, సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ' ఇట్టి వేదమంత్రముల వలన శైవాది మతములు సిద్ధమగుచుండ వానినేల ఖండించుచున్నారు?

ఉత్తరము:- ఈ మంత్రములవలన శైవాది మతములు సిద్ధము కావు. ఏల యన:- రుద్ర శబ్దము పరమేశ్వరుడు, ప్రాణము మున్నగు వానికి; వాయువు, జీవుడు, అగ్ని మున్నగు వానికి నామము. 'నమస్తే రుద్రమన్యవే' అనగా- క్రోధకర్త-దుష్టులను దండించు పరమేశ్వరునకు నమస్కారము చేయుట. అట్లే, ప్రాణములు, జాఠరాగ్నికి నన్నము నొసంగుట యని యర్థము. 'నమ ఇతి అన్ననామ' నమ:శబ్దము అన్నవాచకము. (నిరుక్త.౨.౭.) మంగళ కారియగు పరమాత్మునకు నమస్కారము చేయవలయును. 'శివస్య పరమేశ్వరస్యాయం భక్త: శైవ:' విష్ణో: పరమాత్మనోఽయం భక్తో వైష్ణవ:' 'గణపతే: సకలజగత్ స్వామినోఽయం సేవక: గాణపత:' ' భగవత్యా వాణ్యా అయం సేవక: భాగవత:' సూర్యస్య చరాచరా త్మనోఽయం సేవక: సౌర:. ఈరుద్ర, శివ, విష్ణు, గణపతి, సూర్యాది పదములన్నియు బరమేశ్వరుని నామములు. సత్యభాష ణాద్యుక్తవాణి ' భగవతీ' యనబడును. శివుని భక్తుడు శైవుడు, విష్ణుభక్తుడు వైష్ణవుడు, గణపతి భక్తుడు గాణపతుడు, భగవతీభక్తుడు భాగవతుడు, సూర్యసేవకుడు సౌరుడు. ఈపదముల యర్థమును దెలిసికొనక భిన్నసంప్రదాయముల నేర్పఱచుకొని కలహించుచున్నారు.

(బైరాగి-శిష్యులు)

ఒక బైరాగికి నిరువురు శిష్యు లుండిరి. వారు ప్రతిదినము గురువు పాదముల నొత్తి సేవ జేయు వారు. ఒకడు కుడికాలు, రెండవవాడెడమకాలు తమ సేవ్యములుగా నెంచి సేవ చేయుచుండిరి. ఒకనాడు శిష్యులలో నొకడు దుకాణమునకు వెళ్ళిన సమయమున రెండవ శిష్యుడు గురుసేవకు వచ్చి తన కాలికి సేవజేయ దొడగెను. గురువు మధ్యలో నొకప్రక్కకు నొరిగెను. అప్పుడతని యొకకాలు రెండవకాలి మీద బడెను. శిష్యుడదిచూచి తాను సేవించు కాలిమీద రెండవశిష్యుడు సేవించుకాలు పడుటజూచి క్రోధముతో నొకదండముతో నాకాలిపై బలముగా గొట్టెను. అంతట నాగురువు లబ్బున మొత్తుకొని 'అరే! మూర్ఖ! ఇదేమిటిరా?' యన నేను సేవించు కాలిమీద వాడు సేవించుకాలు పడుటను నేనెట్లు సహింపగల ననెను.

ఇంతలో రెండవ సేవకుడు వచ్చి తాను సేవించుకాలు వాచియుండుట జూచి 'స్వామీ కాలు వాచినదేం?' అని యడుగగా బైరాగి గురువు జరిగిన సంగతి చెప్పగా, వాడు కినుకతో బలుకక లేచి వెళ్ళి యొకకఱ్ఱ తీసికొని వెనుక ముందు జూడక రెండవకాలిని మోద నారంభించెను. మొదటి శిష్యు డదిచూచి యతడు నొకదుడ్డుకఱ్ఱ తీసికొని చెరియొక కాలిపై బడితలతో బాదనారంభించిరి. గురువు బొబ్బలు పెట్టి యేడువ నారంభించెను.

ఆ కోలాహలము విని జనులు గుమికూడి 'సాధూజీ! ఇదియేమి!' యని యడిగి తెలిసికొని వారిలో నొకబుద్ధిమంతుడు బైరాగిని శిష్యుల బారినుండి తప్పించెను. శిష్యులను సంబోధించి మూర్ఖులారా! చూడుడు. ఈ కాళ్ళు రెండును మీ గురువునకు జెందినవే కదా! మీరు సేవజేసిన గురువునకు సుఖము కలుగును. ఆకాళ్ళను గొట్టిన బాధ కలుగునది మీగురువునకే గదా! యని యుపదేశించెను.

ఒక గురువును సేవించుటలో శిష్యు లజ్ఞానముతో జేసిన లీలవలెనే యీ సంప్రదాయములవారి స్థితియు నున్నది. సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరుడొక్కడు. అతనికే విష్ణురుద్రాది నామము లనేకము లున్నవి. వీని సత్యార్థములను ప్రథమ సముల్లాసమున వివరించి యుంటిమి. ఆ సత్యార్థముల నెఱుగక శైవ శాక్త వైష్ణవాది సంప్రదాయములవారు పరస్పర మొకరినామమునొకరు నిందించుకొను చున్నారు. మందమతులై కొంచెమైనను దమబుద్ధిని విశాల మొనర్చి యాలోచింపరు. ఈ శివ విష్ణు మహాదేవాది నామము లన్నియు, నద్వితీయుడు, సర్వనియంతయు, సర్వాంతర్యామియు, నైన జగదీశ్వరుని గుణకర్మస్వభావములను దెలుపు నవియే యగుటవలన నాపరమేశ్వరునకు జెందినవే. ఆతనివాచకములే యని సుంతైన నాలోచింపరు. ఇట్టి జనులపైన బరమేశ్వరునకు గోపము రాక యేమగును?

(చక్రాంకితులు)

ఇకచూడుడు. చక్రాంకితులగు వైష్ణవుల యద్భుతలీల!

**'తాపః పుండ్రం తథా నామ మాలా మన్త్రస్త థైవ చ, అమీ హి పంచ సంస్కారాః పరమైకాంత హేతవః " రామానుజపటపద్ధతి పే. ౩.**

**"అతప్తతనూర్న తదామో అశ్నుతే."ఇతిశ్రుతేః.(ఋ.౯.౮౩-౧)**

అనగా తాపః - శంఖము , చక్రము, గద, పద్మము, నను వీని చిహ్నములను నగ్నిలో గాల్చి, భుజముల మూలమున వాతలు పెట్టినట్లు కాల్చి తదుపరి వానిని బాలగిన్నెలో ముంచుదురు. చల్లార్తురు. కొందఱాపాలను ద్రాగుటయు గలదు.

చూడుడు! వారు ప్రత్యక్షముగా మనుష్యుని మాంసపు స్వాదును రుచి చూతురన్నమాట. ఇట్టి దుష్కర్మ లొనర్చి పరమేశ్వరుని ప్రాప్తి నభిలషించు చున్నారు. శంఖచక్రాదులతో శరీరమును గాల్చి ముద్రలు వేసికొనకపోయిన బరమేశ్వరుడు ప్రాప్తింపడని నమ్ముచున్నారు. ఏలయన గాల్చకున్న 'ఆమ' పక్వము కాదట.

రాజ్యమున బంట్రోతులు రాజ్యమునకు సంబంధించిన బిళ్ళలు పట్టీలు ధరించుటవలన వారిని జూచి రాజపురుషులుగా నెంచి జనులు భయపడుదురు. అట్లే చక్రాంకితులను జూచి యముడు, నతని సేవకగణము భయపడుదురట. మఱియు నిట్లందురు.

"బానా బడా దయాల్ కా, తిలక, ఛాప్, ఔర్ మాల్, యమదర్పై కాలూ కహే భూయ మానే భూపాల్" అనగా భగవంతుని వేషమైన తిలకము, ముద్రలు, మాలలు ధరించుట గొప్పతనము. అందు వలన యమరాజా, రాజాకూడ భయపడును.

పుండ్రము :- నుదుటిపైన ద్రిశూలమువలెను ఊర్ధ్వపుండ్రము - నిలువుబొట్టు - పంగనామాలు

పెట్టుకొనుట. నామము :- నారాయణదాసు, విష్ణుదాసు మున్నగు దాసాంత నామములు పెట్టుకొనుట, మాల :- తులసి మాలలు మున్నగునవి కంఠమున చేసికొనుట. ఇక నైదవది :-

మంత్రము :- ఓం నమో నారాయణాయ, (౧) అను నిట్టి మంత్రములు సాధారణ జనుల కొఱకు గల్పించిరి.

"శ్రీమన్నారాయణచరణం శరణం ప్రపద్యే" (౨)

'శ్రీమతే నారాయణాయ నమః" (౩)

"శ్రీమతే రామానుజాయ నమః" (౪)

ఇట్టి మంత్రములు ధనాఢ్యులకొఱకు మాననీయులకొఱకు వేఱుగా గల్పించిరి. చూడుడు - ఇదియు నొక దుకాణముగా లేదా! ముఖమునకు దగినబొట్టు, చక్రాంకితులు, తాపాది పంచ సంస్కారములును ముక్తికి హేతువులుగా నంగీకరించుచున్నారు.

పైమంత్రార్థములు :-

'నేను నారాయణునకు నమస్కరించుచున్నాను.' (౧)

'నేను లక్ష్మీయుక్తుడైన నారాయణుని చరణారవిందమును శరణుజొచ్చుచున్నాను. (౨)

'శ్రీయుతుడైన నారాయణునకు నమస్కారము - అనగా శోభాయుక్తుడైన నారాయణునకు నా నమస్కారము.' (౩)

'శ్రీయుతుడగు రామానుజునకు నా నమస్కార మగుగాక! (౪)

వామమార్గులు పంచమకారముల నంగీకరించునట్లు చక్రాంకితులు పంచ సంస్కారముల నంగీక రింతురు. ఇక వీరు శంఖచక్రాదులతో మనుష్యులకు ముద్రలు వేయుటకుగా నుపయోగించు మంత్రము దాని యర్థము చూడుడు.

"పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్ గాత్రాణి పర్యేషి విశ్వతః
అతప్తతనూర్ న తదామో అశ్నుతే శృతాస ఇద్ వహన్తస్తత్ సమాశత" (౧)
'తపోష్పవిత్రం వితతం దివస్పదే" (౨) (ఋ. మం. ౯. సూ.౮ ౩. మం. ౧, ౨)

బ్రహ్మాండమును, వేదములను బాలించు నో ప్రభూ! నీవు సర్వసామర్థ్యయుక్తుడవు - సర్వశక్తి మంతుడవు. నీవు నీ వ్యాప్తితో సంసారపు సకలావయవములను వ్యాప్తమొనర్చి యుంచితివి. అట్టి నీవ్యాపక పవిత్ర స్వరూపమును బ్రహ్మచర్యము, సత్యభాషణము, శమదమములు, యోగాభ్యాసము, జితేంద్రియత, సత్సాంగత్యము మున్నగు తపశ్చర్యల నాచరింపక యపరిపక్వమైన యాత్మాంతఃకరణములు గల వ్యక్తి పొందజాలడు. పూర్వోక్తతపములతో శుద్ధులైన వారే యీ తపము నాచరించుచు నీ యీ శుద్ధస్వరూ పమును బొందుదురు. (౧)

ప్రకాశస్వరూపుడగు పరమేశ్వరుని యీసృష్టియందు విస్తృత పవిత్రాచరణరూప తపమొనర్చు వారే పరమాత్మను బొందుటకు యోగ్యులగుచున్నారు. (౨)

(అతప్తతనుః - అర్థము)

రామానుజేయాదు లీమంత్రముతో జక్రాంకితు లగుట నేల సిద్ధపఱచు చున్నారో కొంచెము విచా రింపుడు. వారు విద్వాంసులా? అవిద్వాంసులా? ఆలోచింపుడు. విద్వాంసులందురేని వారిట్టి యసంభవార్థ ములను మంత్రమున కేల చేయుదురు? ఈ మంత్రమున 'అతప్తతనూః' అను పదమున్నది. 'అతప్తభుజైక దేశః' అని లేదు. ఇందలి తనుశబ్దము నఖశిఖపర్యంతముగల సమస్తశరీరమును బోధించును.

ఈ మంత్ర ప్రమాణముతో జక్రాంకితు లగ్నితో గాల్చుటయే స్వీకరింతురేని తమతమ శరీరము లను భట్టీలో వేసి తగులబెట్టవలయును. అట్లు చేసినను మంత్రార్థమునకు విరుద్ధ మగును. ఏలయనగా నీ మంత్రమున సత్యభాషణాది పవిత్ర కర్మలాచరించుట తపః శబ్దముచే జెప్పబడినది.

"ఋతం తపః సత్యం తపో దమస్తపః, స్వాధ్యాయస్తపః." తై.ఆరణ్య (౧౦)

ఋతంతపః :- యథార్థశుద్ధభావము, సత్యము నంగీకరించుట, సత్యముచెప్పుట, సత్యాచరణము, మనస్సు నధర్మమువంక బోనీయకుండుట, బాహ్యేంద్రియములను నన్యాయాచరణమునకు బొల్పడ నీయకుండుట తపస్సనబడును. అనగా శరీరమును, నింద్రియములను మనస్సును శుభకర్మల నాచరించుటలో లగ్నముచేయుట, వేదాది సత్యవిద్యలను జదువుట, జదివించుట, వేదముల ననుసరించి యాచరించుట, మున్నగు నుత్తమధర్మ యుక్తములగు కర్మలకు తప మనిపేరు. ధాతువు నొకదానిని గాల్చి దానితో జర్మమును గాల్చుట తపము కాదు.

(చక్రాంకితమతప్రవర్తకుడు)

చూడు! ఈ చక్రాంకితులైనవారు తమ్ము గొప్ప వైష్ణవు లనుకొందురు. కాని తమ పరంపరనుగాని, కుకర్మలను గుఱించి గాని యాలోచింపరు. ప్రథమమున వీరి మూలపురుషుడు శఠకోపయతి నాభాదూస్‌చే వ్రాయబడిన భక్తమాల గ్రంథమందును, జక్రాంకితుల గ్రంథములందును "విక్రీయశూర్పం విచచార యోగీ" యని వ్రాయబడి యున్నది. శఠకోపయోగి చేటలు చేసి యమ్ముకొనుచు దిరుగుచుం డెడివాడు. అనగా 'కంజర్' కులమున (మేదర కులమున) బుట్టినవాడని భావము. అతడు బ్రాహ్మణుల దగ్గఱ జదువను వినను గోరి యుండవచ్చును. కాని బ్రాహ్మణు లందుకు దిరస్కరించి యుందురు. అప్పు డతడు బ్రాహ్మణులకు విరుద్ధముగా దన కిష్టము వచ్చినట్లు తిలక, చక్రాంకితాదులుగల శాస్త్రవిరుద్ధ సంప్రదాయము నారంభించి యుండును. అతని శిష్యుడు మునివాహనుడు, చాండాలకులజుడు. అతని శిష్యుడు యావనాచార్యుడు యవనకులోత్పన్నుడు. అతని నామమును మార్చి కొందఱు యామునాచార్యుడని చెప్పదొడగిరి. తదుపరి రామానుజుడు బ్రాహ్మణ కులమున బుట్టినవా డతనికి శిష్యుడై చక్రాంకితు డయ్యెను.

అతనికి బూర్వము కొన్నిగ్రంథములు భాష (హిందీ)లో వ్రాయబడెను. రామానుజుడు కొంత సంస్కృతమును నేర్చుకొని సంస్కృతమున శ్లోకబద్ధ గ్రంథములను రచియించెను. శారీరక సూత్రము లకు, ఉపనిషత్తులకు టీకలు శంకరాచార్యులకు విరుద్ధముగా రచియించెను. శంకరాచార్యుని మిక్కిలిగా నిందించి యున్నాడు. అద్వైతము – జీవుడు బ్రహ్మము రెండును నొక్కటియే, మఱియొక వస్తువు లేదు. జగత్తు ప్రపంచ మంతయు మిథ్యయే – మాయారూపము – అనిత్యము. ఇది శంకరాచార్యుని మతము. 'దీనికి విరుద్ధముగా జీవుడు, బ్రహ్మము, మాయ మూడు నిత్యములు' అనునది రామానుజమతము.

(రామానుజ మతసమీక్ష)

ఇక్కడ శంకరాచార్య మతమున బ్రహ్మకంటె భిన్నముగా జీవులను, జడప్రపంచమునకు నుపాదాన కారణము ప్రకృతిని వేఱుగా నంగీకరింపకుండుట సరికాదు. రామానుజ మతమును విశిష్టాద్వైతము – జీవ మాయాసహిత పరమేశ్వరు డొక్కడేయని మూటిని నంగీకరించుచు నద్వైత మొక్కటే యనుట సర్వథా వ్యర్థము. మఱియు జీవుడు సర్వథా యీశ్వరాధీనుడు – పూర్తిగ బరతంత్రు డనుట, కంఠమాలలు, పుండ్ర – తిలకధారణము నంగీకరించుటయు సరికాదు. ఇంతేకాక మూర్తిపూజ, చక్రాంకితము మున్నగు ననాచారము లంగీకరించుటయు సరికాదు. రామానుజమతమున వేదవిరుద్ధములైన చక్రాంకితాదు లున్నట్లు శంకరాచార్యుల మతమున లేవు.

(మూర్తిపూజ)

ప్రశ్న :- మూర్తిపూజ యెప్పుడు ప్రారంభమైనది?

ఉత్తరము :- జైనుల కాలమునుండి.

ప్రశ్న:- జైను లెక్కడినుండి గ్రహించిరి?

ఉత్తరము :- తమ మూర్ఖతనుండి.

ప్రశ్న:- శాంతధ్యానావస్థితమై కూర్చుండియున్న మూర్తిని జూచి తన జీవునకు శుభపరిణామ మట్లే కలుగుని జైనులు చెప్పుదురుగదా!

ఉత్తరము :- జీవుడు చేతనము. మూర్తి జడము. మూర్తివలె జీవుడు జడుడగునా! ఈ మూర్తిపూజ కేవలము పాషండమతము. జైనులు దీనిని ప్రచారము చేసియున్నారు. పంద్రెండవ సముల్లాసమున దీనిని ఖండింతుము.

ప్రశ్న :- వైష్ణవాదులు జైనుల ననుసరించినట్లు కనిపింపదు. కారణమేమన జైనుల మూర్తులు వేఱుగా నుండును. వైష్ణవులవి భిన్నములుగా నున్నవి.

ఉత్తరము :- అవును - ఇది నిజమే. జైనుల మూర్తులవలె దమ మూర్తులు నిర్మించిన నెల్లరు జైనమతములో గలిసిపోవుదురు. అందువలన భిన్నముగా దమమూర్తులు నిర్మించిరి. జైనులను విరోధించుట వీరి కర్తవ్యము. కావున వీరిని విరోధించుట జైనుల కర్తవ్యమునై యున్నది. జైనులు తమ మూర్తులను నగ్నముగాను, ధ్యానావస్థితములై యున్నట్లును, విరక్తమనుష్యులవలె నిర్మించిన వారికి విరుద్ధముగా వైష్ణవులు తమ మూర్తులను శృంగారము చేసికొనిన స్త్రీమూర్తులతో గూడ పురుషమూర్తు లందముగా సిద్ధము చేయబడియుండుట చూడనగును. వైష్ణవుల మూర్తులలో విషయాసక్తి, శృంగార భావము కనబడును. జైనుల దేవాలయములలో గంటలు మొదలైనవాని ధ్వని తక్కువగా నుండగా వైష్ణవ దేవాలయాలు కోలాహల యుక్తములుగా నుండును.

ఇట్టి లీలలు రచించినందువలన వైష్ణవాది పోపుల శిష్యులు జైనుల లీలాజాలము నుండి తప్పించుకొని తమ లీలలకు వశులగుదురని యెంచి మఱియు వ్యాసాది మహర్షుల నామములతో దమయిష్టము వచ్చిన యసంభవ కథలుగల గ్రంథములు రచించి వానికి పురాణములని పేరు పెట్టి వినిపింపసాగిరి.

వైష్ణవులు చేయు విచిత్రమాయ లెన్నియో యున్నవి. రాతి విగ్రహములను జేసి, వానిని రహస్యముగా పర్వతములమీదనో, యడవులలో నేదో యొకప్రదేశముననో భూమిలో బూడ్చియుంచి తదుపరి మిత్రులతోను, నితరులతోను దమకు రాత్రి నిద్రలో స్వప్నమందు సీతారాములో, లక్ష్మియో, మఱి యితర భైరవాది దేవతలో కనబడి మేము ఫలానా స్థానములో మట్టిలో బడియున్నాము. మాకు గుడి గోపురములు కట్టింపవలసినదని చెప్పినట్లు చెప్పుదురు. ఇంతేకాక తననే పూజారిగ నుండ గోరిరనియు నట్లు చేసిన ప్రజలకోరికల తీర్తుమని వెల్లడి చేయుదురు.

మూర్ఖులైన ధనవంతు లట్టిమాటలు విని చెప్పినవారిని వెంటగొనిపోయి యట విగ్రహములను గాంచి పోపులను సత్యవాదులుగా గొనియాడి యా మూర్తులకు మందిరముల నిర్మింప వాగ్దానము చేయుదురు. గుళ్ళు కట్టించి చెప్పినపోపునే పూజారిగా నుంచి పూజల నేర్పాటు చేయుదురు. ఇట్లే యొకరిని జూచి మఱియొకరు జనులను మోసగించుచు వచ్చిరి. ఇట్టి వైష్ణవలీల లెన్నో యున్నవి.

ప్రశ్న :- పరమేశ్వరుడు నిరాకారుడు. కావున నతడు ధ్యానములో రాడు. అందువలన మూర్తి తప్పక యుండవలయును. మఱియేమి చేసినను జేయకున్నను మూర్తియెదుట నిలబడి చేతులు జోడించి పరమేశ్వరుని స్మరింతురు. పరమేశ్వరుని నామము నుచ్చరింతురు. దీనివలన నష్టమేమి?

ఉత్తరము :- పరమేశ్వరుడు నిరాకారుడు. సర్వవ్యాపకుడు నైయున్నాడు. కావుననే యతనికి మూర్తి నేర్పఱప వలనుపడదు. మూర్తి దర్శనమువలననే పరమేశ్వరుని స్మరణము కలుగునెడల బరమేశ్వరునిచే రచింపబడిన భూమి, జలము, నగ్ని, వాయువు, వనస్పత్యాద్యనేక పదార్థములు విచిత్రరచనతో గూడినవియు, వేనినుండి మనుష్యరచిత విగ్రహము లెన్నియో నిర్మింపబడుచున్నవో యట్టి పృథివ్యాది పదార్థములను జూచినపుడు పరమేశ్వరుని స్మరణము కలుగదా?

మూర్తులను జూచినందున బరమేశ్వరుని స్మరణము కలుగునని నీవు చెప్పునది సర్వథా యబద్ధము. మఱియు మూర్తి యెదుటలేనపుడు పరమేశ్వరుని స్మరణము కలుగనందున మనుష్యుడు తానొంటరిగా నున్నట్లెంచి చౌర్యము, జారత్వము మున్నగు కుకర్మలలో బ్రవృత్తుడగుట జరుగుచున్నవి. కారణమేమన నతడు తన నాసమయమున నెవ్వరు జూచుట లేదుగదా యని యెంచి నిర్భయముగా కర్మచేయుటకు సిద్ధపడును. ఇట్టివి యనేక దోషములు మూర్తిపూజ నంగీకరించుటలో నున్నవి.

(ఈశ్వరవ్యాపకత నంగీకరించుటవలన లాభము)

ఇప్పుడు చూడుడు. రాతి విగ్రహములను దేవుడని నమ్మక, యెల్లప్పుడు పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, న్యాయకారి, యని పరమాత్మ నెఱిగి యంగీకరించువా డంతట నెల్లపుడు పరమేశ్వరుడెల్లరి పుణ్యపాపములను దెలిసికొను ద్రష్టయని గుర్తించి క్షణముకూడ బరమేశ్వరునుండి తాను వేఱుగా నుండజాలనని యెఱిగి కుకర్మనాచరించుట యటుంచి మనస్సునందును దుస్సంకల్పము జేయడు. తాను మనోవాక్కాయములతో నేపాప మాచరించినను బరమేశ్వరుని దండనమునుండి తప్పించుకొన జాలనని యత డెఱుగును. కారణమేమన బరమేశ్వరు డంతర్యామి యనునది యతనికి దెలియునుగదా!

(నామస్మరణ)

మఱియు గేవల నామస్మరణమువలన నేమియు ఫలము కలుగదు. బెల్లము బెల్లమని యుచ్చరించినంత మాత్రమున నోరు తియ్యబడదు. వేము వేమన్నంత మాత్రమున నోరు చేదు కాదు. బెల్లమో, లేక వేపాకో నోటిలో వేసికొని రుచిచూచిన దీపియో చేదో తెలియును.

ప్రశ్న :- నామమును స్మరించుట సర్వథా మిథ్యయేనా? పురాణములలో నామస్మరణ మంతట వ్రాయబడియున్నది కదా!

ఉత్తరము :- మీరు నామమును స్మరించురీతి యుత్తమమైనది కాదు. మీరు స్మరించురీతి యబద్ధమైనది.

ప్రశ్న :- మారీతి యెట్టిది?

ఉత్తరము :- మీరీతి వేదవిరుద్ధ మైనది.

ప్రశ్న :- మంచిది. ఇప్పుడు మీరు మాకు వైదికనామ స్మరణరీతిని దెలుపుడు.

ఉత్తరము :- నామస్మరణ మిట్లు చేయవలయును. పరమేశ్వరుని నామము న్యాయకారి. ఈ పదమున కర్థము పక్షపాతము విడిచి యథార్థమునకు దగినట్లు న్యాయము చేయుట. ఈ యర్థమును గ్రహించి పరమేశ్వరు డెట్లు పక్షపాతము విడిచి న్యాయ మొనర్చునో యట్లే యెల్లపుడు న్యాయయుక్త వ్యవహారము చేయుచు నన్యాయముగ నెన్నడు వ్యవహరింప కుండవలయును. ఇట్లు భగవంతునియొక్క యొక నామ స్మరణము వలన గూడ మనుష్యునకు గల్యాణము గలుగును.

(అవతారము)

ప్రశ్న:- పరమేశ్వరుడు నిరాకారుడని మేము నెఱుగుదుము. కాని యతడు శివ విష్ణు గణేశ దేవ్యా

దుల శరీరములను ధరించి, రామ కృష్ణ ప్రభృతుల రూపమున నవతరించెను. కావున వారి మూర్తులు నిర్మింపబడును. ఇదియు నబద్ధమేనా?

ఉత్తరము :– అవునవును. ఇదియు ననత్యమే – ఏలయనగా 'అజ ఏకపాత్' 'అకాయమ్' – పరమేశ్వరుడు జన్మరహితుడు, శరీరము లేనివాడను విశేషణములు గలవాడు. అతనికి జన్మమరణములు, శరీరధారణము నుండవని వేదములు చెప్పుచున్నవి. యుక్తితో నాలోచించినను, బరమేశ్వరు డవతరింప జాలడనియే తెలియుచున్నది. కారణమేమన బరమేశ్వరు డాకాశమువలె నంతట వ్యాపకుడు, అనంతుడు, సుఖదుఃఖదృశ్యత్వాది గుణములు లేనివాడు. అట్టివాడు చిన్నశరీరములో నెట్లు రాగలుగును? ఏకదేశీయుడు – ఒకచో నుండి మఱియొకయెడ లేనివాడు రాగలడు పోగలడు. అచలుడు, నదృశ్యుడు, ప్రతిపరమాణువునందును నిండియుండువాడు నవతరించు ననుట వంధ్యాపుత్రునకు వివాహము జేసి యతని పౌత్రుని దర్శించుటవంటి దగును.

(మూర్తియందీశ్వరభావన)

ప్రశ్న :– పరమేశ్వరుడు వ్యాపకుడు కావున మూర్తియందు నుండును. కావున నేపదార్థ మందైనను భావించి పూజించుట మంచి దేలకాదు? చూడుడు.

"న కాష్ఠే విద్యతే దేవో న పాషాణే న మృణ్మయే
భావే హి విద్యతే దేవః తస్మాద్ భావో హి కారణమ్. (గరుడ పురాణ. ౩౦–౧౩)

పరమేశ్వరదేవుడు కొయ్యలో, రాతిలో, మట్టిలో నెక్కడ లేడు, భావములో నున్నాడు. ఎక్కడ భావించిన నక్కడే పరమేశ్వరుడు సిద్ధించును. అని యున్నది కదా!

ఉత్తరము :– పరమేశ్వరు డంతట వ్యాపకుడై యుండ గొండొక వస్తువునందు భావించుట, మఱియొక వస్తువునందు భావింపకుండుట యెట్లుండు ననగా – చక్రవర్తియైన రాజుయొక్క రాజ్యాధికారమును నతని రాజ్యమునం దంతట నంగీకరింపక ఏదో యొక గుడిసెలో మాత్ర మున్న ట్లంగీకరించుట వంటి దగును. చూడు! ఇది యెంతటి యవమానము! గొప్పగా నవమానించుట కాదా! అట్లే పరమేశ్వరుని గూడ నవమానించుచున్నావా?

పరమేశ్వరుడు వ్యాపకుడని యంగీకరించుచున్నారు కదా? అట్టియెడ తోటనుండి పత్రపుష్పములు కోసి మూర్తిపై నేల యుంచుచున్నారు? గంధముతీసి పూయనేల? ధూపము నేల యర్పించుచున్నారు? గంటలు వాయించుట, తాళాలు తప్పెట్లు మ్రోయించుట మున్నగు క్రియ లేల చేయుచున్నారు. పరమేశ్వరుడు నీచేతులలోగూడ నున్నాడు కదా? దానిని జోడించు టేల? శిరస్సున నున్నాడు. శిరస్సు వంచనేల? అన్నజలాదుల నున్నాడు. వాని నేల నైవేద్యముగా నర్పించుచున్నారు? స్నాన మేల చేయించుచున్నారు? వానిలో నన్నింట బరమేశ్వరు డున్నాడు కదా!

మఱియు నీవు వ్యాపకుని బూజించుచున్నావా? వ్యాప్యమునా? వ్యాపకుని బూజింతువేని పాషాణాదులచే నిర్మింపబడిన మూర్తులపై జందనాదుల నుంచనేల; వ్యాప్యమును బూజింతువేని మేము పరమేశ్వరుని బూజించుచున్నామని యబద్ధ మేల చెప్పుచున్నావు. 'మేము రాళ్ళను బూజించు పూజారులమని' యేల నత్యమును జెప్పవు?

(భావన – అభిప్రాయము)

ఇప్పుడు మీరు చెప్పు 'భావము' సత్యమా? అసత్యమా? సత్యమందువేని నీభావమునకు లోబడి పరమేశ్వరుడు బద్ధుడగును. మఱియు మట్టిలో సువర్ణ రత్నాదులను, బాషాణమున వజ్రాదులను, సముద్రపు నురుగునందు ముత్యములను, జలమున ఘృత దుగ్ధ దధ్యాదులను, ధూళిలో జక్కెర మున్నగు వానిని

భావించి వాని నట్లేల చేసికొనరు? మీరెన్నడు దుఃఖమును భావించరు కదా! మీకు దుఃఖమేల కలుగుచున్నది? మీరెల్లపుడు సుఖమును భావింతురు కదా! సుఖమేల ప్రాప్తింపదు? అంధుడు కన్నులను భావించి యేల చూడజాలడు? మరణము కావలయునని భావింపరు గదా! ఏల మరణించుచున్నారు? కావున మీభావన సత్యము కాదని స్పష్టమగుచున్నది. ఏలయన నేది యెట్లున్న దాని నట్లే యెంచుట 'భావన' యనబడును. అగ్ని నగ్నిగాను, జలమును జలముగాను నెఱుగుట భావన యగును. జలము నగ్నిగాను, నగ్నిని జలముగాను నెంచుట – ఎఱుగుట 'అభావన' యనబడును. ఏ వస్తువెట్లున్న నట్లు తెలిసికొనుట జ్ఞానము, విపరీతముగా నెఱుగుట 'అజ్ఞాన'మునగును. కావున మీరు భావన నభావనగాను నభావనను భావనగా జెప్పుచున్నారు.

(ఆవాహన – విసర్జన)

ప్రశ్న :– అది కాదు స్వామీ! వేదమంత్రములతో నావాహనము జేయనంతవఱకు దేవతలు రారు. ఆవాహనము జేయగానే వెంటనే వత్తురు. విసర్జనము చేసినపుడు వెళ్ళిపోవుదురు.

ఉత్తరము :– మంత్రములను జదివి యావాహనము చేసినపుడు దేవత వచ్చునేని మూర్తి చేతన మేల కాదు? విసర్జనము చేసినందువలన నెందుకు వెళ్ళిపోదు? దేవత మూర్తిలోనికి నెటనుండి వచ్చును? ఎక్కడకు బోవును. నాయనా! విను. పూర్ణుడైన పరమేశ్వరుడు రాడు పోడు. మంత్రబలముతో బరమేశ్వరుని బిలువగలుగు నెడల నామంత్రముల బలముతోనే చనిపోయిన పుత్రుని శరీరమునందు జీవు నేల పిలువవు? శత్రువుల శరీరములందుండు జీవులను మంత్రములు చదివి విసర్జనము చేయరాదా? (యుద్ధము జేయకయే శత్రునాశన మగునుగదా!) అమాయక సోదరులార! వినుడు. ఈ పోపులు – (పురోహితులు – పూజారులు) మిమ్ములను వంచించి తమ ప్రయోజనములను సిద్ధము చేసికొనుచున్నారు. వేదములందు మూర్తి పూజకుగాని, దేవత నాహ్వానించుటకు విసర్జించుటకు గాని యెక్కడ నొక్క యక్షరము కూడ లేదు.

ప్రశ్న :– "ప్రాణా ఇహాగచ్ఛన్తు, సుఖం చిరం తిష్ఠన్తు స్వాహా"
"ఆత్మేహాగచ్ఛతు, సుఖం చిరం తిష్ఠతు స్వాహా"
"ఇంద్రియాణీహాగచ్ఛన్తు సుఖం చిరం తిష్ఠన్తు స్వాహా!"

ఇట్టి వేదమంత్రము లుండగా లేవనుచున్నా రేల?

ఉత్తరము :– నాయనా! బుద్ధిని గొంచెమైన నేల యుపయోగింపవు? ఇవి యన్నియు గపోలకల్పితములు. ఇవి వేదమంత్రములు కావు. వామమార్గులు వేదవిరుద్ధముగా వ్రాసిన తంత్రగ్రంథములలోని పోపులు వ్రాసిన వాక్యములు.

ప్రశ్న :– తంత్ర గ్రంథము లన్నియు నబద్ధములా?

ఉత్తరము :– అవును. సర్వథా యబద్ధములు. ఆవాహనము, ప్రాణప్రతిష్ఠ, మూర్తిపూజ, విసర్జనము మున్నగు విషయములకు సంబంధించిన మంత్రములు వేదమున లేనట్లు 'స్నానం సమర్పయామి' అనునిట్టి మంత్రములును లేవు. 'పాషాణాది మూర్తిం రచయిత్వా మందిరేషు సంస్థాప్య గంధాభిరర్చయేత్' రాతితో మూర్తిని జేసి మందిరముననుంచి గంధాదులతో బూజింపవలయును. అను నొక్క వాక్యమైన నెక్కడ వేదములందుగనబడదు.

ప్రశ్న :– వేదములందు విధానము లేకున్నను ఖండనముకూడ లేదుగదా! ఎక్కడనైన ఖండనమున్నను 'ప్రాప్తౌ సత్యాం నిషేధః' మూర్తిపూజ ప్రాప్తించినపుడే కదా ఖండనము – నిషేధింపబడుట.

ఉత్తరము :– విధి మాత్రము లేదు. కాని, పరమేశ్వరుని స్థానమున నతనికి బదులు మఱియొక వస్తు

పూజనీయుడు కాడను విధాన మున్నది. మూర్తి సర్వథా నిషేధింపబడి యున్నది. అపూర్వవిధి యుండదా? చూడు.

'అంధః తమః ప్రవిశన్తి యేఽసంభూతిముపాసతే, తతో భూయ ఇవ తే
తమో య ఉ సంభూత్యాం రతాః." (౧) (యజు. ౪౦—౯)
"న తస్య ప్రతిమా అస్తి." (౨) (యజు. ౩౨—౩)
"యద్ వాచా నాభ్యుదితం యేన వాగభ్యుద్యతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే." (౧)
"యన్ మనసా న మనుతే యేనాహుర్ మనో మతమ్,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే." (౨)
"యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యన్తి,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే." (౩)
"యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే." (౪)
"యత్ ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే." (౫) (కేన. ౧—౪—౮)

అసంభూతి - అనుత్పన్న - అనాది ప్రకృతిరూప కారణపదార్థమును బ్రహ్మస్థానమున నుపాసించువాడు - అంధకారము, అజ్ఞానము, దుఃఖము ననెడి సాగరమున మునుగును. మఱియు సంభూతి కారణమువలన నుత్పన్నమైన కార్యరూప పృథివ్యాది భూతములను, పాషాణములను, వృక్షాద్యవయవములను, మనుష్యాదుల శరీరములను బ్రహ్మస్థానమున నుపాసించువా రంధకారముకంటె నధికమగు నంధకారమున నసగా జిరకాలము మూర్ఖులై దుఃఖరూప నరకమున బడి మహాక్లేశముల ననుభవింతురు. (౧)

సమస్త జగత్తునందు వ్యాపించియున్న నిరాకార పరమాత్మునకు ప్రతిమా = పరిమాణము, సాదృశ్యము, లేక మూర్తి లేదు. (౨)

'ఇది జలము, దీనిని దీసికొనుడు' అని వాణికి జలము విషయమైనట్లుగా నేబ్రహ్మము వాణికి విషయము కాదో, మఱి దేని సత్తా - ఉనికి వలన వాణికి ప్రవృత్తి కలుగుచున్నదో దానినే బ్రహ్మముగా నెంచి యుపాసింపుము. దానికంటె భిన్నమైనది యుపాస్యము కాదు. (౧)

మనస్సునం దేది 'ఇది యింత' యని మననము చేయ ననువుకాదో, యేది మనస్సు నెఱుగునో దానినే నీవు బ్రహ్మముగా నెఱిగి యుపాసింపుము. దానికంటె భిన్నమైన యంతఃకరణమునుగాని జీవుని గాని బ్రహ్మము స్థానమున నుపాసింపవలదు. (౨)

ఏది కంటికి గనబడదో దేనివలన నేత్రములన్నియు జూచుచున్నవో దానినే బ్రహ్మముగా నెఱిగి దాని నుపాసింపుము. దానికంటె భిన్నములైన సూర్యుని, విద్యుత్తును, నగ్ని మున్నగువానిని బ్రహ్మస్థానమున నుపాసింపకు. (౩)

చెవితో నేది వినబడదో, దేని మూలమున జెవి వినుచున్నదో దానినే నీవు బ్రహ్మ మని తెలిసికొనుము, ఉపాసింపుము. దానికంటె భిన్నమైన శబ్దాదుల నుపాసింపకుము. (౪)

ఏది ప్రాణములచే జలింప జేయబడదో, దేనివలన ప్రాణములకు గతి ప్రాప్తించునో యా బ్రహ్మమునే తెలిసికొని యుపాసింపుము. దాని కంటె భిన్నవాయువు నుపాసింపకు. (౫)

ఇట్లెన్నియో నిషేధము లున్నవి. ప్రాప్తమునకు నప్రాప్తమునకు నిషేధము లున్నవి. ప్రాప్త

నిషేధము:- ఒక డొకచో గూర్చుండియుండ నతని నటనుండి లేపుట. అప్రాప్తనిషేధము :- ఓ పుత్ర! నీవు దొంగతనము చేయవద్దు, బావిలో బడవద్దు, దుష్టుల సాంగత్యము సేయకు, విద్యావిహీనుడవు కావలదు. ఇట్టివి యెన్నియో యప్రాప్త నిషేధములు చూడనగును. కావున మనుష్యుల జ్ఞానమువందు బ్రాప్తింపనివి పరమేశ్వరుని జ్ఞానమున బ్రాప్తమైన దానిని నిషేధించుట యైనది. అందువలన బాషాణాది మూర్తిపూజ యత్యంతనిషిద్ధము.

(మూర్తిపూజపాపము)

ప్రశ్న :- మూర్తిపూజలో బుణ్యము లేకపోయినను బాపము లేదు కదా?

ఉత్తరము :- కర్మలు రెండు విధములు. ఒకటి విహితకర్మ – కర్తవ్యములు సత్యభాషణాదులు వేదమున విహితములై యున్నవి. రెండవది నిషిద్ధకర్మ – వేదమునఁ అకర్తవ్యములుగా మిథ్యాభాషణాదులు నిషిద్ధములై యున్నవి. విహితకర్మ ననుష్ఠించుట ధర్మము, నిషిద్ధకర్మ ననుష్ఠించుట యధర్మము. అట్లే విహితకర్మము నాచరింపకుండుట యధర్మము, నిషిద్ధ కర్మమును వదలుట ధర్మము నగును. వేదము లందు నిషిద్ధముగా వ్రాయబడిన మూర్తిపూజను మీరు చేయుచున్నారు. కావున బాపమెందుకు గాదు?

(మూర్తిపూజ – అగడ్త)

ప్రశ్న :- చూడుడు! వేద మనాది. అప్పుడు మూర్తితో బనియేమున్నది? అప్పుడు దేవతలు ప్రత్యక్ష మయ్యెడివారు. అందువలన నీరీతి తరువాత తంత్రములవలన, బురాణములవలన నాచరణమునకు వచ్చినది. మానవులలో జ్ఞానము, సామర్థ్యము తక్కువైనపుడు పరమేశ్వరుని ధ్యానమున దెచ్చుకొనలేక పోయిరి. మూర్తిని ధ్యానము చేయగలరు. ఈ కారణముచే నజ్ఞానులకొఱకు మూర్తిపూజ యేర్పడినది. ఒక్కొక్క మెట్టు నెక్కిన గదా భవనము పైకి జేరుదురు! మొదటి మెట్టువదలి పైకిబోవుట దుర్ఘటము. కావున మూర్తి మొదటిమెట్టు.

మూర్తిని బూజింపగా బూజింపగా జ్ఞానము కలుగును. అంతఃకరణము పవిత్రమగును. అప్పుడు పరమాత్మను ధ్యానము చేయగలుగును. లక్ష్యమును భేదించు వ్యక్తి మొదట స్థూలలక్ష్యమున బాణాదులను వదలుచు నభ్యసించి, క్రమముగా సూక్ష్మలక్ష్యమును భేదింప గల్గును. అట్లే స్థూలమైన మూర్తిని బూజించి పూజించి తదుపరి సూక్ష్మబ్రహ్మమును బొందును. ఆడపిల్లలు మొదట బొమ్మలతో నాడుకొనుచు గ్రమముగా నిజమైన పతిని బొందునట్లు మొదట మూర్తిని బూజించి తదుపరి బ్రహ్మధ్యానము చేయుదురు.

ఉత్తరము :- వేదవిహితము ధర్మము, వేదనిషిద్ధాచరణ మధర్మమునని నిశ్చయమైన పిదప నీవెంత చెప్పినను నధర్మము ధర్మ మగునా? మూర్తిపూజ ధర్మకార్య మెన్నడు గాదు. వేదవిరుద్ధములైన వానిని బ్రమాణీకరించుట నాస్తిక్య మగును. వినుము.

'నాస్తికో వేదనిందకః' ! (౧) మ. ౨-౧౧

"యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః,
సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః" (౨)
"ఉత్పద్యన్తే చ్యవంతే చ యాన్యతోఽన్యాని కానిచిత్,
తాన్యర్వాక్కాలికతయా నిష్ఫలాన్యనృతాని చ" మ. ౧౨-౯౫, ౯౬

వేదములనింద – అవమానము, త్యాగము, విరుద్ధాచరణము జేయువాడు నాస్తికు డనబడునని మనువు చెప్పుచున్నాడు. (౧)

ఏ గ్రంథములు వేదబాహ్యములై దుష్టులచే వ్రాయబడి సంసారమును దుఃఖసాగరమున ముంచున్

యవి యన్నియు నిష్ఫలములు, నసత్యములు, నంధకారరూపములు, నిహపరలోకములందు దుఃఖదాయకములై యున్నవి. (౨)

వేదములకు విరుద్ధముగా వ్రాయబడిన గ్రంథములన్నియు నాధునికములు. అందువలన నవి త్వరగా నశించును. వాని నంగీకరించుట నిష్ఫలము, నబద్ధమును. (౩)

బ్రహ్మ మొదలు జైమిని మహర్షి వఱకు ఈమతమునే యంగీకరించుచు వచ్చిరి. వేదవిరుద్ధమైన దాని నంగీకరింపక వేదానుకూలమైన దాని నాచరించుటయే ధర్మము. ఏలయనగా వేదము సత్యధర్మ ప్రతిపాదకము. వేదవిరుద్ధములైన తంత్రములు పురాణములు నన్నియు నసత్యములు. వేదవిరుద్ధములందు వర్ణింపబడిన మూర్తిపూజయు నధర్మరూపమే యై యున్నది.

మనుష్యుల జ్ఞానము జడపూజనమువలన వృద్ధి నొందదు. పైపెచ్చున్నది కూడ నశించును. కావున జ్ఞానుల సాంగత్యమువలన వారిని సేవించుటవలన జ్ఞానము వర్ధిల్లును. పాషాణ పూజ వలన బెరుగదు. మూర్తి పూజవలన బరమేశ్వరుని ధ్యానమున కెవడేని రాగలుగునా!

మూర్తిపూజ మెట్టుకాదు. అది యొక యగడ్త యనదగినది. అందు బడినవాడు నష్టభష్టు డగును. ఆ యగడ్తనుండి బయటికి రాజాలడు. అందే మరణించును. వాస్తవమున ధార్మికులైన చిన్న విద్వాంసులు మొదలు పెద్ద విద్వాంసులు యోగులు నైనవారి సాంగత్యమున సద్విద్యనభ్యసించుట, సత్యభాషణాదులు పరమేశ్వరుని ప్రాప్తికి మెట్లగును. మేడ నెక్కుటకు నిచ్చెన మెట్లుపయోగించునట్లవి యుపయోగించును. మూర్తిపూజ చేసిచేసి యెవడును జ్ఞాని కాలేదు. పైపెచ్చు మూర్తిపూజకు లెల్లరు నజ్ఞానులైయుండి మనుష్యజన్మమును వ్యర్థము చేసికొని మరణించిరి. ఇప్పుడు మూర్తిపూజ చేయువారు, ముందు జేయనున్నవారు ధర్మార్థకామమోక్ష ప్రాప్తిరూపఫలముల నుండి విముఖులై నిరర్థకముగా నశింతురు.

బ్రహ్మ ప్రాప్తియందు మూర్తిపూజ స్థూలలక్ష్యమువంటిది కానేకాదు. ఆ లక్ష్యము ధార్మిక విద్వాంసుడు, సృష్టివిద్యయు నగును. ధర్మాచరణమును, సృష్టివిద్యను బెంపుజేయుచు జేయుచు బ్రహ్మమును గూడ బొందును. మూర్తిపూజ బొమ్మలాట వంటిదియు గాదు. ప్రథమమున నక్షరాభ్యాసము, సుశిక్షను బొందుట బొమ్మలాటవలె బ్రహ్మప్రాప్తికి సాధనమై యున్నది. మంచిశిక్షను, నుత్తమవిద్యను బొందినవాడు సత్యస్వామియగు పరమాత్మను గూడ బొందును.

(సాకారమున మనస్సు స్థిరపడదు)

ప్రశ్నః– సాకార పదార్థమున మనస్సు స్థిరమగును. నిరాకారమున స్థిరమగుట కఠినము. కావున మూర్తి పూజ యుండవలసినదే.

ఉత్తరము :– సాకార పదార్థమున మనస్సెన్నడు స్థిరపడజాలదు. కారణమేమన – సాకారపదార్థమును మనస్సు శీఘ్రముగా గ్రహించి, దాని ప్రతియవయవమునందును దిరుగును. పూర్తియైన తదుపరి మఱి యొక పదార్థమునకు బరుగిడును. నిరాకారపరమేశ్వరుని గ్రహించుటలో మనస్సు తన సామర్థ్యము నంతటిని నుపయోగించి యెంత పరువిడినను నంతము గనజాలదు. పరమేశ్వరుడు నిరవయవుడు – అంగరహితుడగుటవలన నందు జంచలమై తిరుగాడు నవకాశము లేదు. కాని యతని గుణకర్మస్వభావములను గూర్చి విచారించుచు నానందమున మగ్నమై స్థిరపడును.

సాకారమున మనస్సు స్థిరమగు నెడల లోకమున నెల్లరి మనస్సులు స్థిరములగును. కారణమేమన, జగత్తునందలి మనుష్యులు, స్త్రీపుత్రమిత్ర ధనాదిసాకార పదార్థములందే చిక్కువడి యుండును. కాని యెవరి మనస్సు స్థిరము కాదు గదా! నిరాకారమున లగ్నము చేయనంతవఱకు నది స్థిరపడదు. నిరాకారము నిరవయవ మగుట వలన నందు మనస్సు స్థిరమగును. కావున మూర్తిపూజ చేయుట యధర్మ

మనక తప్పదు.

(మూర్తిపూజ దోషములు)

ఇంతవఱకు జెప్పినది మొదటి దోషము. ఇక రెండవది :- మూర్తి పూజలలో గోట్లకొలది రూప్యములు మందిర నిర్మాణమున వెచ్చించి దరిద్రులగుదురు. అందు ప్రమాదముకూడ జరుగును.

మూడవది :- మందిరములలో స్త్రీ పురుష లొక్కచో జేరుటవలన వ్యభిచారము, జగడములు, రోగములు నుత్పన్నము లగును.

నాల్గవది :- మూర్తిపూజయే ధర్మార్థకామమోక్షములకు సాధన మని యెంచి పురుషార్థ మొనర్పక మనుష్య జన్మమును వ్యర్థము చేసికొందురు.

ఐదవది :- నానావిధములగు విరుద్ధస్వరూపములు, నామ, చరిత్ర యుక్తములునగు మూర్తులను బూజించు పూజారులలో నైకమత్యము లేక విరుద్ధమతములందు నడచి పరస్పరము భేదభావము వర్ధిల్లజేసికొని దేశమును నశింపజేయుదురు.

ఆఱవది :- మూర్తిపై నున్న విశ్వాసము 'బరవాసా'మీద నాధారపడి శత్రు పరాజయము, నిజవిజయము కలుగునని సోమరులై కూర్చుందురు. అట్టివారికి బరాజయము కలిగి రాజ్యము పరాధీన మగును. స్వాతంత్ర్యము నశించును. సుఖసంపదలు శత్రువుల పాలగును. తాము పరాధీనులై చాకలివాని గాడిదవలె శత్రువులకు వశులై చాకిరి చేసి యనేకవిధ దుఃఖముల పాలగుదురు.

ఏడవదోషము :- ఎవడేని యొకనితో 'నీవు కూర్చుండు నాసనముమీద గాని నీనామము మీదగాని రాతి నుంచెదము' అనిన నతడు క్రుద్ధుడై కొట్టుటకైన సిద్ధమగును లేదా తిట్టుటకైన నారంభించును. అట్లే పరమేశ్వరుని యుపాసన స్థానమైన హృదయముమీదనో నామము మీదనో పాషాణాది మూర్తుల నుంచిన పరమేశ్వరు డాదుష్టబుద్ధులనేల నాశనము జేయడు?

ఎనిమిదవది :- భ్రాంతులై మందిర మందిరమునకు దేశదేశమునకు దిరిగితిరిగి దుఃఖముల పాలగుదురు. ధర్మమును, సంసారమును, పరమార్థ కార్యములను నాశము చేసికొందురు. దొంగలు మున్నగు వారివలన బీడితులగుదురు. వంచకులచే వంచింప బడుదురు.

తొమ్మిదవది :- దుష్టులయిన పూజారులకు ధనము దోచిపెట్టుదురు. వారాధనమును వ్యభిచారమునందు వేశ్యాగమనాదులందు జూదమున గలహములందు మద్యమాంససేవనమున వ్యయింతురు. సుఖములు నష్టమై దుఃఖములు వాటిల్లును.

దశమము :- పాషాణాది మూర్తులకు మానమన్ననల నిచ్చుచు, దల్లిదండ్రులను మాననీయుల నవమానింతురు.

పదునొకండవది :- మూర్తుల నెవరైన ఖండించినను విఱుగగొట్టినను దొంగిలించినను రొమ్ములు బాదుకొని యేడ్తురు.

పండ్రెండవది :- పూజారి పరస్త్రీ సాంగత్యమువలనను, బూజారిస్త్రీ పరపురుష సాంగత్యమువలనను దూషితులై స్త్రీ పురుషుల పారస్పరిక ప్రేమకు నోచుకొనక తఱచు దుఃఖితు లగుచుందురు.

పదమూడవది :- స్వామి సేవకుల యాజ్ఞాపాలన సరిగా జరుగనందున బరస్పర విరుద్ధభావములు గలవారై నష్టభ్రష్టు లగుదురు.

పదునాల్గవది :- జడమును ధ్యానము చేయువారి యాత్మయు జడబుద్ధి గలదై పోవును. ధ్యేయవస్తువునందలి జడత్వధర్మము నంతఃకరణము ద్వారా ధ్యాత యాత్మయందు జేరును.

పదునైదవది :- పరమేశ్వరుడు సుగంధముగల పుష్పాది పదార్థములను వాయుజలములలోని

దుర్గంధాదులను దొలగించుటకును, నారోగ్యమును బ్రసాదించుటకును నిర్మించుచున్నాడు. పుష్పములు చెట్టుననేయున్న గొన్నిదినములవఱకు నవి వాయుజలములలో దమ సుగంధములను నింపి యెంతో యుపకరించును. అట్టివానిని బూజారులు, పూజకు విచ్చివిచ్చకముందే గోసి నాశనము చేయుదురు. వానిని మూర్తులపై నుంచి నీరు పోయుటతో నవి నీటితో జేరి మురిగి దుర్గంధము నుత్పన్నము చేయును. పరమేశ్వరు డీసుగంధయుక్త పుష్పములను రాతిబొమ్మలమీద నుంచుటకా నిర్మించినది?

పదునాఱవది :- మూర్తిమీద నుంచిన పుష్పములు, చందనము, నక్షతలు మున్నగునవి జలముతో మట్టితో గలిసి, మురుగుకాలువలందు మురిగి మనుష్యుని మలమువలన గలుగు దుర్గంధముకంటె నెక్కుడు దుర్గంధము కలిగించి వాయువు నెంతగానో భ్రష్టము చేయును.

మూర్తి పూజవలన నిట్టి దోషము లెన్నియో కలుగును. కావున సజ్జనులైనవారు మూర్తిపూజను సర్వదా వదలివేయవలయును. ఎవరు పాషాణాది మూర్తులను బూజించి యుండిరో, ఇప్పుడు పూజించు చున్నారో, ముందు బూజింపనున్నారో వారెల్లరు నింతకు బూర్వము చెప్పిన దోషములనుండి తప్పించు కొనజాలరు. పూర్వ మెవ్వరు దప్పించుకొన లేదు. ముందెవ్వరును దప్పించుకొన జాలరు.

(పంచాయతన పూజ)

ప్రశ్న :- ఏవిధమైన మూర్తిపూజయు జేయుటగాని చేయించుటగాని తగదా? మన యీయార్యావర్త దేశమున బ్రాచీనపరంపరగా పంచదేవ పూజాశబ్దము వచ్చుచున్నది గదా! శివుడు విష్ణువు అంబిక గణేశుడు సూర్యుడు నను నీదేవతలకు సంబంధించిన మూర్తులను జేసి 'పంచాయతన పూజ' చేయు చున్నారు. అదియును దగదా?

ఉత్తరము :- ఏవిధమైన మూర్తిపూజయు జేయరాదు. కాని యీక్రింద జెప్పబోవు మూర్తిమంతులైనవారి పూజ – సత్కారము చేయవలయును. ఆ పంచదేవపూజ లేక పంచాయతనపూజ చాలమంచిది. అర్థవంతమైనదియును. కాని విద్యావిహీనులైన మూఢులు దాని యుత్తమార్థమును వదలి నికృష్టార్థమును గ్రహించిరి. నేడు శివాదులకు సంబంధించిన యైదుమూర్తులను జేసి పూజించుట పంచాయతన పూజ కాదు. ఈ పూజ నికృష్టార్థమువలన కలిగిన పూజ. వాస్తవమైన యుత్తమార్థమునకు సంబంధించిన వేదోక్తమైన పంచాయతనపూజ, పంచదేవపూజ నిజమైన మూర్తిమంతులపూజ యెద్దియన :-

"మానో వధీః పితరం మోత మాతరమ్." యజు ౧౬–౧౫ (౧)

"ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణమిచ్ఛతే." (అథ. ౧౧–౫–౩, ౧౧–౫–౧౭) (౨)

"అతిథిర్ గృహానుపగచ్ఛేత్" అథర్వ. ౧౫–౧౩–౧౧. (౩)

"అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత." ఋ. ౮–౬౯–౮. (౪)

"త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి." తై. ఉ. ౧–౧. (౫)

"కతమ ఏకో దేవ ఇతి స బ్రహ్మ త్యదిత్యాచక్షతే."

శత. ౧౪–౬–౯–౧౧. ప్రపాఠకమము. శత. ౧౪–౫–౭–౧౧. (౬)

"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ. తై. ఉ. ౧–౧౧. (౭)

"పితృభిర్ భ్రాతృభిశ్చైతాః పతిభిర్ దేవరైస్తథా,

పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణమీప్సుభిః" మ. ౩–౫౫. (౮)

"పూజ్యో హి దేవవత్ పతిః" మ. ౫–౧౫౪. (౯)

ప్రథమదేవత :- మాత. మూర్తిమతియైన దేవత. తను మనోధనములతో సేవజేయుమాతను బ్రసన్నగా నుంచుచు నామె నెన్నడు హింసింపరాదు. రెండవదేవత – పిత. అతడు సత్కారింపదగిన దేవత,

తల్లివలె దండ్రికిని సేవ జేయవలయును. (౧)

మూడవదేవత - ఆచార్యుడు. విద్యాదాన మొసంగు నాచార్యుని దనుమనోధనములతో సేవింప వలయును. (౨)

నాలుగవదేవత :- అతిథి - విద్వాంసుడు, ధార్మికుడు, నిష్కపటి, యెల్లరి యున్నతిని గోరు వాడునై జగత్తున భ్రమణ మొనర్చుచు దన సత్యోపదేశముతో నెల్లరకు సుఖము నొసంగు నతిథికి సేవ చేయవలయును. (౩)

ఐదవదేవత :- స్త్రీ-భార్య, ఆమెకు బతి, పతికి భార్య పరస్పర మొకరికొకరు పూజ్యులు. (౪-౫)

ఈ యైదుగురు మూర్తిమంతములైన దేవతలు. వీరివలన మనుష్యుని దేహముయొక్క యుత్పత్తి పాలన, సత్యశిక్ష, విద్యా, సత్యోపదేశపుబ్రాప్తి జరుగును. వీరే పరమేశ్వరుని ప్రాప్తికి మెట్లు. వీరికి సేవ జేయక పాషాణాది మూర్తులను బూజించువాడు మిక్కిలి వేదవిరోధి యగుచున్నాడు.

ప్రశ్న :- తల్లి దండ్రులు మున్నగువారి సేవ జేయుచు మూర్తులపూజ చేసిన దోషమేమియు లేదుకదా?

ఉత్తరము :- పాషాణాదులమూర్తి యన్నివిధముల వదలవలసినదే. తల్లిదండ్రులు మున్నగు మూర్తిమంతులను సేవించుటయే మేలు. ప్రత్యక్షములగు తల్లి మున్నగు దేవతలను వదలి వారిని బూజింపక పాషాణాది మూర్తులను బూజించుట మిక్కిలి యనర్థదాయకము.

(పూజారులలీల)

తల్లిదండ్రుల యెదుట నైవేద్యము, నుపహారము లుంచి సేవజేసిన వారు వానిని స్వీకరింతురు. అందువలన వారిని వదలి పాషాణాది మూర్తుల ముందు నైవేద్యముంచిన నవి తినవు. కావున నది మేలుగా భావించి మూర్తిపూజ నారంభించిరేమో యనవలసి వచ్చుచున్నది. సేవ్యులయెదుట నుంచుపదార్థములను వారే తినిన సేవకుల నోట నేమియు బడదుగదా? అందువలననే మూర్తులను చేసి వానియెదుట నైవేద్యము నుంచి ఘంటలు వాయించి యేదో కోలాహల మొనర్చి యటుపై నానైవేద్యమును స్వయముగా నారగింపవచ్చును. 'త్వమంగుష్ఠం గృహాణ భోజనం పదార్థం వాఽహం గ్రహీష్యామి.' నీవంగుష్ఠమును గ్రహించుము. నేను భోజనమును బదార్థమును బుచ్చుకొందును. అని వాక్యార్థము.

ఒక డింకొకని కేదో పెట్టుదునని యాశగొల్పి వాడు దానిని గ్రహించుటకు జేయి చాపగా నతనికి దన యంగుష్ఠమును జూపి నీవు దీనిని దీసికొనుము. తినవలసిన వస్తువును నేనే తిందుననుచు నతనికి బెట్టవలసిన వస్తువును దన నోటిలో వేసికొనునట్టులే మూర్తిపూజ పరిహాసాస్పదముగా బుద్ధిమంతులకు దోచును. మూర్తులముందు భోజ్యపదార్థముల నుంచి ఘంటలు వాయించి యనంతరము పూజారులాభోజ్యపదార్థముల నారగించుట యీశ్వరపూజ యగునా?

చూచుటకు జిత్రవిచిత్రముగా నందముగా గనిపించు మూర్తులను స్థాపించి, మూర్ఖులను మోసగించి వారినుండి ధనాదులను గ్రహించి వాని నారగించి పూజారులు సుఖముగా జీవితము గడపుదురు. రాజు ధార్మికుడైనచో నీపాషాణ ప్రియులతో రాళ్ళను జెక్కించి దానితో భవననిర్మాణాదుల నొనర్చి రాళ్ళను జెక్కిన పాషాణ ప్రియులకు నన్నవస్త్రములనిచ్చి పోషించును.

ప్రశ్న :- పాషాణాదులచే నిర్మింపబడిన స్త్రీమూర్తిని జూచినపుడు కామము గలుగునట్లు, వీతరాగులు శాంతులు నైనవారి మూర్తులను జూచినపుడు వైరాగ్యము శాంతియేల కలుగదు?

ఉత్తరము :- కలుగనేరదు. ఏలయనగా మూర్తిలోగల జడత్వ మాత్మలో వచ్చుటవలన విచారశక్తి నశించును. వివేకము లేనివానికి వైరాగ్యముగాని, విజ్ఞానముగాని కలుగదు. అవి లేనివానికి శాంతి యెట్లు

గలుగును? మఱియు నేదైన గొంచెము కలిగిన నది వారిసంగతివలన నుపదేశమువలన వారి యితి వృత్తములను జదువుటచేతను గలుగును. కారణమేమన గుణదోషములు తెలియని వ్యక్తియొక్క మూర్తిని మాత్రము జూచిన నేమియు గలుగదు. గుణజ్ఞానము ప్రీతిని గల్గించును.

ఇట్టి మూర్తిపూజారి దుష్టకారణములవలననే యార్యావర్తము కర్మరహిత మైనది. పూజారులు భిక్షుకులు కోట్లకొలది మనుష్యులు సోమరులై పురుషార్థరహితులై యున్నారు. వారు దేశమంతట మూర్ఖతను వ్యాపింపజేసిరి. అసత్యము, ఛలకపటాదులు నెక్కువ యైనవి.

ప్రశ్న :- చూడుడు! కాశీలో 'ఔరంగజేబు' చక్రవర్తికి లాటభైరవుడు మున్నగు దేవతామూర్తులు గొప్ప గొప్ప చమత్కారములు జూపినవిగదా! మహమ్మదీయు లామూర్తులను విఱుగగొట్టుటకు, భుశుండి, శతఘ్ని మున్నగువానిని ప్రయోగింపగా నపుడు పెద్దపెద్ద కందిరీగలు బయలుదేరి వారిని వ్యాకులపఱచి పాఱగొట్టినవిగదా!

ఉత్తరము :- అది యారాతివిగ్రహముల చమత్కారము కాదు. ఆ మందిరమున గందిరీగల గూళ్ళుండి యుండును. అవి మనుష్యులను గుట్టు క్రూరస్వభావము కలవి. వాని జోలికి బోయినవారిని కుట్టును. దుగ్ధధారా చమత్కారము పూజారి లీలయై యుండును.

ప్రశ్న :- చూడుడు. మహాదేవుడు మ్లేచ్ఛులకు దర్శన మీయనిచ్ఛగింపక బావియందును, వేణుమాధవు డొక బ్రాహ్మణుని గృహమందును దాగియుండలేదా? ఇదియు జమత్కారము కాదా?

ఉత్తరము :- ఆహా! చాల బాగుగ నున్నది. మహాదేవుని దుర్గరక్షకుడు కాలభైరవుడు, లాటభైరవుడు మున్నగు భూతప్రేతములు, గరుడుడు మున్నగు గణములు మహమ్మదీయులతో యుద్ధముచేసి యేల వారిని పాఱద్రోల లేదు? త్రిపురాసురాది భయంకరరాక్షసులను భస్మము చేసినట్లు విష్ణుపురాణాదులందు వర్ణింపబడిన మహాదేవుడు మహమ్మదీయుల నేల భస్మము చేయలేదు? పైగా బావిలో దాగుటేల? మహమ్మదీయులు మూర్తులను భగ్నము చేయుచు కాశీకి రాగా బూజారులు శివలింగమును గూపమున బడవేసి, వేణుమాధవుని బ్రాహ్మణుని యింట దాచియుంచిరి. కాశీలో నున్న కాలభైరవునకు భయపడి యమకింకరులే రాజాలరు. ప్రళయ సమయమున గాశీని నాశము కానీయరు. అట్టియెడ నీ కాలభైరవాదులు ముసల్మానుల నేల భయపెట్టరైరి. తమ రాజైన మహాదేవుని మందిరము నేల కాపాడరైరి! ఇది యంతయు బోపుల మాయ.

(గయాశ్రాద్ధము)

ప్రశ్న :- గయలో శ్రాద్ధము చేసిన బితరుల పాపము పోయి, శ్రాద్ధ ప్రభావమువలన బితరులు స్వర్గమునకు బోవుదురు. పితరులు తమచేతిని జాచి పిండమును గ్రహింతురు. ఇదియు నసత్యమేనా?

ఉత్తరము :- సర్వథా యబద్ధమే. గయలో బిండదానము చేసిన ప్రభావ మట్టిదైన యెడల బితరుల సుఖప్రాప్తికొఱకు పండాలకిచ్చు ధనమంతయు వేశ్యాగమనాది పాపకార్యములందు వినియోగింతురు. ఆ పాప మేలపోదు. పిండములను గ్రహించుటకు బితరులిప్పుడేల చేతులు చాపరు. పండాల చేతులు తప్ప పితరుల చేతులు కనబడవేల! ఒకప్పుడెవడో ధూర్తుడు భూమిలో గుహ నొకదానిని గల్పించి యందొక మనుష్యుని నుంచి పైన దర్భలు కప్పియుంచి వానిచేతిలో పిండము సర్పింపజేసి యొకానొక మూర్ఖుని వంచించి ధనము కాజేసి యుండును. అట్లే 'వైద్యనాథుని' రావణుడు తెచ్చినాడనుటయు మిథ్యయే యగును.

ప్రశ్న :- చూడండి! కలకత్తాలోని కాళీదేవతను, కామాక్షదేవతను లక్షలాది మనుష్యులు నమ్ముచున్నారు. ఇదియు జమత్కారము కాదా!

ఉత్తరము :- చమత్కారము కాదు; ఏమియు గాదు. జనులంధులు గొఱ్ఱెదాటు రకము. ఒక గొఱ్ఱె వెనుక నింకొకటి పోవునట్లు వారును నంధానుకరణమునకు జెందినవారే. ఒకరివెంట నొకరు గోతిలో బడువారే. ఒకరివెంట నొకరు మూర్తిపూజారూపమగు గుంటలోబడి దుఃఖముల పాలగుచున్నారు.

(పూరి-జగన్నాథుడు)

ప్రశ్న :- పోనీ దీనిని బోనిండు. జగన్నాథమున జమత్కారము ప్రత్యక్షమగుచున్నది కదా! ఒక కళేబరము మాఱవలసివచ్చినపుడు చందనపు కొట్టె సముద్రమునుండి స్వయముగా వచ్చును. పొయ్యిమీద నొకదానిపై నింకొకటి చొప్పున నేడుకుండలు పెట్టి వంటచేసిన ముందు పై కుండలలో బదార్థములు పక్వమగును. యాత్రికులలో నెవడేని యట బ్రసాదమును దినకపోయిన వానికి 'కుష్ఠవ్యాధి' కలుగును. రథము స్వయముగా నడచును. పాపులకు దర్శనము కాదు. ఇంద్రదమనుని రాజ్యమున దేవతలు మందిర మును నిర్మించిరి. కళేబరము మాఱునపు డొకరాజు, నొకపండా యొకవడ్రంగి చచ్చిపోవుట మున్నగు చమత్కారములను మీరసత్యము లనజాలరు.

ఉత్తరము :- ఒకడు పండ్రెండు సంవత్సరములు జగన్నాథుని బూజించి విరక్తుడై యటనుండి మధురకు జేరి నాదగ్గఱకు వచ్చియుండెను. నే నీవిషయములను గూర్చి యతని నడుగగా నత డివి యన్నియు నసత్యములే యని చెప్పియున్నాడు. విచారించిన మీదట దెలిసిన నిశ్చయ మిది. కళేబరము మార్చవలసిన సమయము వచ్చినపుడొకచందనపుగొట్టె నౌక మీద తీసికొనివెళ్లి సముద్రమున వదలి పెట్టు దురు. అది సముద్రతరంగములతో గొట్టుకొని వచ్చి తీరమున జేరిన మీదట వడ్రంగులు దానిని దీసికొని వెళ్ళి మూర్తులు సిద్ధముచేసి తెత్తురు.

వంట జరుగునపుడు వంటవారిని దప్ప మఱియెవరిని బాకశాలలోనికి రానీరు. తలుపులు మూసి యుంచుదురు. భూమిమీద జక్రాకారమున నాఱు ప్రొయ్యిలు చేసి మధ్యలో నేడవ ప్రొయ్యి సిద్ధముచేసి యుంచెదరు. వానిమీద గుండలనుంచి యన్నము పక్వము చేయుదురు. ఆ కుండల కడుగు భాగమున నెయ్యి మట్టి, భస్మము కలిసి లేపనముచేసి వానిని బ్రొయ్యిమీద బెట్టుదురు. అన్నము పక్వమైన తదుపరి వానిని దించి, కుండల యడుగు భాగములు శుద్ధిజేసి, మధ్యనున్న ప్రొయ్యిమీద జివరకు గుండనుంచి దానిలో నప్పుడే బియ్యముపోసి యుడికిన యన్నముగల యాఱుకుండలను మధ్యనున్న కుండపై నుంచెదరు. చుట్టునున్న ప్రొయ్యిలను లోహపురేకులతో మూసి కనబడకుండ జేయుదురు. మధ్యనున్న కుండలలోని యన్న ముడకక ముందే మూర్ఖులైన ధనాఢ్యులను దీసికొని వెళ్ళి వారలకు బైకుండలలోని యుడికిన యన్నమును, గ్రిందికుండలోని యుడుకని యన్నము జూపి మోసగింతురు. ఈ మహత్తును జూపి యట ధనము గుంజుకొందురు. కొందఱు మూర్ఖధనికు లా మహత్త్వమునకు విస్మితులై ప్రతినెలకు నింత యిత్తుమని వాగ్దానముచేసి యటులే ధనము పంపుచుందురు.

నీచులైన శూద్రులు నైవేద్యమును మందిరమునకు దెత్తురు. నైవేద్యము పెట్టిన తదుపరి యా నీచశూద్రు లానైవేద్యమును నెంగిలి చేయుదురు. పిమ్మట యాత్రికులు రూప్యములిచ్చి ప్రసాదము కొనినచో వారి బసలకు గొంపోయి వారికి ముట్ట జెప్పుదురు. బీదగృహస్థులు, సాధువులు, శూద్రులు మొదలుగా నంత్యజాలవఱకు నందఱు నొకేపంక్తిలో గూర్చుండి యొకరి యెంగిలి నొకరు తిందురు. మొదటి పంక్తివారు తిని వదలి వెళ్ళిన యాకులలోనే తరువాత వచ్చిన వారికి బెట్టుదురు. ఇది మిక్కిలి యనాచారము. వెళ్ళిన వారిలో ననేకు లాయెంగిలి తినక వేఱుగా వంటజేసికొని తిని వచ్చుచుందురు. అట్టివారికి గుష్ఠరోగము సంభవింపదు. జగన్నాథపురిలో బెక్కురు కుష్ఠరోగులున్నారు. ప్రతిదినము వారాయెంగిలినే తినుచుందురు. వారి నా కుష్ఠరోగము వదలదు. అట వామమార్గులు భైరవీచక్రమును జేసి

యుంచిరి. ఏలయనగా సుభద్రాదేవి కృష్ణబలరాములకు జెల్లెలు. ఆమెనే యా సోదరుల మధ్యనుంచి యామెను స్త్రీగాను, తల్లిగాను జేసియుంచినారు. భైరవీచక్రము కానినా డిది యిట్లెన్నడును జరుగదు.

రథచక్రములలో నేదో యంత్రకళ నుంచి యుందురు. దానిని దిన్నగా ద్రిప్పినప్పుడు రథము నడచును. జనసముదాయములో నెక్కడ దాని నాప దలతురో యట నాయంత్రమును విపరీతముగా ద్రిప్పిన నది యాగిపోవును. అప్పుడు పూజారులు కేకలు పెట్ట దొడగుదురు. దానము చెయ్యండి. పుణ్యము చెయ్యండి. అప్పుడే జగన్నాథుడు ప్రసన్నుడై రథమును నడపును. మీకు బుణ్య మబ్బును. దానధర్మములు చేయనంత వఱకు నట్లే కేకలు పెట్టుచుందురు. ఏవో కొన్ని దానదక్షిణలు దొరకిన మీదట నొక వ్రజవాసి మంచిదుస్తులు ధరించి పైన దుశ్శాలువ నొకదానిని వేసికొని వచ్చి రథమునెదుట నిలబడి “ఓ జగన్నాథస్వామీ! మీరు దయతో రథమును నడపుడు మాధర్మము నిలుపుడు” అని ప్రార్థించును. సాష్టాంగ ప్రణామము చేయును. తదుపరి రథమెక్కి కూర్చుండును. వెంటనే యంత్రమును దిన్నగా ద్రిప్పుటవలన రథము నడువ నారంభించును. రథమునకు గట్టియున్న త్రాళ్ళను వేలాదిజనులు బట్టి జయజయధ్వానములతో లాగుదురు.

దర్శనమునకు బెక్కురు జనులు పోవుచుందురు. కావున మందిరము చాల పెద్దదిగా నిర్మింపబడి యున్నది. అందుబగలే చీకటి యుండును. దీపములు పెట్టవలసి వచ్చును. మూర్తులముందు బరదాలు రెండువైపుల వ్రేలాడుచుండును. వానిని లాగి మూర్తులు కనబడకుండ మూత వేయుదురు. పూజారులు లోపల నుందురు. అటనుండి మీరు కానుక లర్పింపుడు. మీ పాపములు పోవును. అప్పుడు దర్శనము లభించును. త్వరపడుడు. అని కేకలు పెట్టుచుందురు. మూర్ఖభక్తులు తాము తెచ్చినవి యర్పించి చేతులు కడుగుకొందురు. పరదా లాగి దర్శనము చేయింతురు. దర్శనము చేసికొని యెట్లో బయట పడుదురు.

ఇంద్ర దమను డొక ధనాఢ్యుడైన రాజు. అతడు దేవీ–ఉపాసకుడు. అతని వంశమువా రిప్పటికిని కలకత్తాలో నున్నారు. అతడు లక్షల రూపాయలు వెచ్చించి మందిరమును నిర్మింపజేసెను. ఆర్యావర్తమున గల భోజనసంబంధమైన దృష్టిదోషము స్పర్శదోషము మున్నగు దుర్వ్యవస్థలను దూరము చేయు నుద్దేశముతో బహుధనమును వెచ్చించి యీగుడిని గట్టించి యుండును. కాని యీ మూర్ఖులు దాని నేల విడిచిపెట్టుదురు? మందిరమును గట్టిన శిల్పులే దేవతలు (మందిర నిర్మాణమునకు వేఱే దేవత లెవరు వత్తురు?)గా నంగీకరింపుడు. రాజు, పండా, వడ్రంగి యప్పుడే యెన్నడు చావరు. వారక్కడ ముఖ్యులుగా నుందురు. చిన్నవారిని దుఃఖపెట్టుచుండియుందురు. కళేబరము మాఱునపుడు వారు ముగ్గురు దగ్గఱనే యుందురు. మూర్తిలోపలి భాగము హృదయసమీపమున బోలుగా (లిట్ట) ఖాళీగా నుంచుదురు. ఆ ఖాళీ భాగమునందొక సాలిగ్రామమును బంగారపు సంపుటములో బెట్టి యుంచుదురు. దానిని బ్రతిదినము కడిగి చరణామృతము సిద్ధము చేయుదురు. రాజు మున్నగువారిచే బాధింపబడు చిన్నవారు, రాత్రి శయనసమయమున నారతి యిచ్చునపు డాసాలిగ్రామము ద్రావకముతో నింపి యుంచి ప్రాతఃకాలమున దానిని ద్రావకముతోబాటు కడిగి చరణామృతము సిద్ధముచేసి యాచరణామృతమును బ్రత్యేకముగా రాజు, వడ్రంగి, పండా ముగ్గురకు బ్రత్యేకముగా నిచ్చియుందురు. అందువలన నాముగ్గురు నొకప్పుడు చచ్చి యుందురు. అప్పు డాభోజన భట్టులు 'జగన్నాథస్వామి' తన శరీరమును మార్చుకొనినపు డీముగ్గురు భక్తులను దనవెంట వైకుంఠమునకు దీసికొని పోయినాడని ప్రసిద్ధము చేసియుందురు. ఇతరుల ధనమును వంచనముచేసి సంపాదించుట కిటువంటి యసత్యపు కథలెన్నియో కల్పించుట సహజము.

(రామేశ్వరలింగ చమత్కారము)

ప్రశ్న :– రామేశ్వరమున గంగోత్రీజలముతో నభిషేకము చేసినచో లింగము వృద్ధిపొందు నమువిష

యముకూడ నసత్యమేనా?

ఉత్తరము :- అవును. అసత్యమే. ఆ మందిరమునందును దినమున నంధకార ముండును. రాత్రిం బవళ్ళు దీపము వెలుగుచుండును. జలమును లింగముమీద ధారగా బోయునపుడు దీపపు ప్రతిబింబ మాజలమందు విద్యుత్తువలె భాసించును. అంతకుమించి మఱి యొండులేదు. పాషాణము-లింగము పెద్దది కాదు. చిన్నది కాదు. అది యెప్పటియట్లే యుండును. ఇట్టి లీలలు వ్యాపింపజేసి మూర్ఖులను వంచింతురు.

ప్రశ్న :- రామేశ్వరమును రామచంద్రుడు స్థాపించి యున్నాడు. మూర్తిపూజ వేదవిరుద్ధ మగునెడల రామచంద్రుడు మూర్తి నెందుకు స్థాపించును? రామాయణమున వాల్మీకి యేల వ్రాయును?

ఉత్తరము :- రామచంద్రుని సమయమున నామందిర నామముకాని లింగముకాని యేమియు లేకుండెను. దక్షిణదేశపు రాజు రామనామము గలవా డామందిరమును నిర్మింపజేసి దానికి రామేశ్వర మని పేరుపెట్టి యుండుట నిజము కావచ్చును. రామచంద్రుడు సీతాదేవిని దీసికొని హనుమంతుడు మున్నగు వారితో లంకనుండి బయలుదేరి విమానముమీద గూర్చుండి యాకాశమార్గమున నయోధ్యకు వెళ్ళుచుం డిరి. అప్పుడు సీతతో నిట్లనెను.

"అత్ర పూర్వం మహాదేవః ప్రసాదమకరోద్ విభుః, సేతుబంధ ఇతి ఖ్యాతమ్"

(రామా. లంకా. ౧౨౩.౨౨, ౨౧)

'ఓ సీతా! నీ వియోగమున వ్యాకులుడనై నేను దిరుగుచుండెడివాడ. ఇక్కడనే చాతుర్మాస్యము చేసితిని. పరమేశ్వరుని యుపాసనా-ధ్యానము చేయుచుంటిని, సర్వత్ర విభువు-వ్యాపకుడై దేవతలకు మహాదేవుడైన పరమేశ్వరుని యనుగ్రహమున మాకు గావలసిన సామగ్రి యంతయు లభించినది. మఱియు చూడుము. ఈ సేతువును బంధించి లంకకు వచ్చి రావణుని వధించి నిన్ను దెచ్చుచున్నాము!'

ఇంతకు మించి వాల్మీకి రామాయణమున నేమియు వ్రాయలేదు.

ప్రశ్న :- రంగ్ హై కాళియ కాంతకో జిస్ నే హుక్కా పిలాయా సంతకో" దక్షిణదేశమున నొక 'కాళియకాంతు'ని మూర్తి యున్నది. ఆ మూర్తి యిప్పటికి హుక్కా త్రాగుచున్నది. మూర్తిపూజ యసత్య మగునెడల నిదియు నసత్యము కావలసివచ్చును.

ఉత్తరము :- అబద్ధము. అబద్ధము. ఇది యంతయు బోపుల లీలయే. ఆ మూర్తి ముఖము రంధ్రముతోగూడి లోపల లొట్టగా నుండియుండును. ముఖమునుండి మూర్తి వెనుకభాగము వఱకు ఛిద్రముచేసి యందుండి 'హుక్కా' గొట్టము మూర్తిముఖమునుండి వెనుకకు దీసి గుప్తముగా దానికి బూజారి యింటితో సంబంధము కల్పించి యుందురు. అక్కడ నెవడో కూర్చుండి హుక్కా పీల్చుచుండును. ఇక్కడ హుక్కాలో గుడగుడ శబ్దము వినబడుచుండును. అట్లే యటునుండి ధూమము మఱియొక గొట్టము ద్వారా విడిచిన నది మూర్తి ముక్కురంధ్రములనుండి వచ్చు నేర్పాటు చేసియుందురు. ఇట్టి లీలలతో మూర్ఖధనికులనుండి ధనమును సంపాదించి వారిని దరిద్రులను జేయుచుందురు.

ప్రశ్న :- చూడండి. 'డాకోరు' దేవతామూర్తి ద్వారికనుండి భక్తునివెంట వచ్చినది. ఒకటింబావు రత్తీసువర్ణముతో గొన్నిమణుగుల బరువుగల మూర్తి తులతూగినది. ఇదియు జమత్కారము కాదా?

ఉత్తరము :- కాదు. ఆ భక్తుడు మూర్తిని దొంగిలించి తెచ్చియుండును. ఒకటింబావు రత్తీ బంగార ముతో మూర్తి తులతూగుట భంగుత్రాగి కొట్టిన గప్పాలయి యుండును.

(సోమనాథమందిరము)

ప్రశ్న :- సోమనాథుడు పృథివినంటకుండ బైన నుండెడివాడు. ఇది యొక గొప్ప చమత్కారము.

ఇదియు మిథ్యయేనా?

ఉత్తరము :- అవును. మిథ్యయే విను. పైన క్రింద సూదంటు రాళ్ళ నమర్చి యుండిరి. వాని యాకర్షణమువలన మూర్తి మధ్యలో నిలిచినది. 'మహమూద్ గజనవీ' వచ్చి యుద్ధము చేసి మందిరమును గూలగొట్టెను. పూజారులయు భక్తులయు దుర్దశ చెప్పనలవి కాదు. లక్షల కొలది యున్న సేన పదివేల మంది సైనికులతో బోరాడ జాలక పాఱిపోయిరి.

పోపులు పూజారులు పూజలు పురశ్చరణములు చేసి ప్రార్థించిరి. "ఓ మహాదేవ! ఈ మ్లేచ్ఛుని జంపుము. మమ్ముల రక్షింపుము. ఇంతేకాక – వారు తమ శిష్యులైన రాజులతో మీరు నిశ్చింతగా నుండుడు. మహాదేవుడు భైరవునో లేక వీరభద్రునో పంపును. వారు మ్లేచ్ఛులను జంపివేయుదురు. అంధులను జేసివైతురు. మన దేవత లోకమున ప్రసిద్ధ మగును. హనుమంతుడు, దుర్గ, భైరవుడు మాకు స్వప్నములో దర్శనమిచ్చి 'మేము పనిచేయుదు'మని చెప్పిరి. యని చెప్పి బోధించిరి. పాప మా యమాయకులైన క్షత్రియరాజులు వారి మాటలు నమ్మి మోసపోయిరి. ఎందఱో జ్యోతిష్కు లారాజులకు 'ఇంకను మీరు దండయాత్ర చేయుసమయము రాలేదు' అని చెప్పిరి. ఒకడు 'అష్టమిలో జంద్రు డున్నాడ'ని యింకొకడు 'యోగిని యెదురగుచున్నది' యని యేమేమో చెప్పి వంచించిరి. మ్లేచ్ఛసైనికులు వచ్చి చుట్టుముట్టి నపుడు దుర్దశాగ్రస్తులై పాఱిపోయిరి. పోపులు, పూజారులు పట్టుపడిరి. వారు చేతులు జోడించి శత్రువును బ్రార్థించిరి. మూడుకోట్ల రూపాయల నిత్తుము. మందిరమును మూర్తిని బడగొట్టకండి. అని కాళ్ళు వ్రేళ్ళ బడిరి. ఆ మ్లేచ్ఛులు "అరే! భాయీ! మేము మూర్తులను బూజించు వారము గాము. మూర్తిభంజకులము" అనుచు వెళ్ళి మందిరమును బడగొట్టి, మూర్తిని బ్రద్దలుచేసి రత్నరాసులను దోచుకొనిరి.

మందిరము పైకప్పు పడగానే సూదంటురాయి పడిపోయినందున మూర్తి క్రిందబడెను. మూర్తిని బ్రద్దలు చేయగా దానియందు బదునెనిమిది కోట్ల రూప్యముల విలువగల రత్నరాసులు వెడలినట్లు వినుచున్నాము. తదుపరి కోశ మెక్కడ నున్నదో చెప్పుమని కొరడాలతో గొట్టగా నాదెబ్బల నోర్చుకొన జాలక కోశాగారమును జూపిరి. కోశాగార మంతయు గొల్లగొట్టి పూజారులను దమక్రీతదాసులను జేసికొని వారిచేత నానావిధముల జాకిరి చేయించుకొనిరి. మలమూత్రముల నెత్తించిరి. పిండి విసరించిరి. గడ్డి కోయించిరి. తినుటకు సెనగలను మాత్ర మిచ్చి నానాదుర్దశల పాలుచేసిరి. రాళ్ళను బూజించి యెట్టి దుర్దశను బొందిరో పాపము చెప్పనలవి కాదు. అది వదలి పరమేశ్వరుని భక్తితో సేవించిన నెంత బాగుండెడిది. మ్లేచ్ఛుల పళ్ళు విఱుగ గొట్టెడివారు. తమకు విజయము చేకూర్చుకొనెడివారు. మూర్తులకు బదులు శూర వీరులను సత్కరించియున్న నెంతటి రక్షణ కలిగి యుండెడిది! పాషాణ మూర్తుల నింతగా బూజించినను నొక్కటియైనను మ్లేచ్ఛుల తలను బగుల గొట్టదయ్యె. శూరవీరు నొక్కని బూజించినను నతడు వీరిని రక్షించి యుండెడివాడు.

ప్రశ్న :- ద్వారికలో నుండు రణఛోడ్ నర్సీమహతాకు హుండీ పంపి యతని ఋణమును దీర్చుటయు నబద్ధమేనా?

ఉత్తరము :- ఎవరో యొకసాహుకారు ధనము నిచ్చి యుండవచ్చును. శ్రీకృష్ణుడు పంపినాడని యబద్ధపు వదంతి వ్యాపింపజేసి యుండవచ్చును. విక్రమసంవత్ ౧౯౧౪లో నాంగ్లేయులు శతఘ్నులతో మందిరమును మూర్తిని బడగొట్టినపుడు మూర్తి యెక్కడకు బోయినది? అప్పుడు బాఘేర్ జను లెంతో వీరతను జూపి యుద్ధము జేసిరి, శత్రువులను జంపిరి. మూర్తి యొక్క యీగకాలినైన భగ్నము చేయలేదేల? శ్రీకృష్ణసదృశు డెవడైన నుండియున్న నీ యాంగ్లేయుల బండారము బయటబడి యుండెడిది కాదా? రక్షకుడే ప్రాణాలు దక్కించుకొనలేని సమయమున శరణాగతులగతి యేమగును?

ప్రశ్న :- జ్వాలాముఖీ ప్రత్యక్షదేవి, అందఱను దినివేయును. నైవేద్యమున సగము తినివేయును. సగము వదలి వేయును. మహమ్మదీయ చక్రవర్తి లాదేవిపై జలధార ప్రవహింప జేసిరి. లోహపు రేకులతో మూత వేయించిరి. కాని జ్వాలయారలేదు, ఆగలేదు.

అట్లే హింగలాజ్ అర్ధరాత్రియందు వాహనము నెక్కి పర్వతముపై దిరుగుచు గనిపించును. పర్వతముచే గర్జనము చేయించును. చంద్రకూపము మాటలాడును. యోని యంత్రమునుండి దూరి బయట బడిన వారికి బునర్జన్మము కలుగదు. 'ఠుమరా' కట్టుకొన్నందున బూర్తిగ మహాపురుషు డనబడును. హింగలాజ్ వెళ్ళి రానంతవఱకు నర్ధమహాపురుషు డనబడును. ఈ విషయములన్నియు నమ్మదగినవి కావా?

ఉత్తరము :- కాదు. ఏలయనగా నది జ్వాలాముఖీ యగ్నిపర్వతము. దానినుండి యగ్నిజ్వాల బయటికి వెలువడుచుండును. అందు బూజారుల విచిత్రలీలయు నున్నది. తిరుగబోత వేయుటకు నొకగరిటెలో నేతినుంచి యాగరిటెను గాచునపుడు గరిటెలోనున్న నేతికి నిప్పంటుకొనిన నది భగ్గుమని మండును. దానిని దొలగించి యూదిన మంట యారిపోవును. గరిటెలో నున్న నెయ్యి కొంత తరిగిపోవును. కొంత మిగిలి యుండును. అట్లే యట జరుగుచుండును. ప్రొయ్యి మంటలో నేదైన వేసిన నంతయు భస్మమగును. అరణ్యమునకుగాని యింటికిగాని నిప్పంటుకొన్న నంతయు భస్మమగును. అంతకుమించి యక్కడ నేమున్నది? ఒక గుడి, యొక కోనేరు అక్కడక్కడ నీటిపైపులు రచింపబడి యున్నవి. అంతకుమించి యేమియు లేదు.

ఇక హింగలాజ్ వాహనము మీద సంచారము లేదు. ఏమియులేదు. అక్కడ జరుగున దంతయు బూజారుల చమత్కారములే. అక్కడ నొక జలకుండ మున్నది. అదియు నూబితో గూడి యున్నది. అందుండి బుడగలు వచ్చుచుండును. దానిని సఫలయాత్ర యనుట మూఢుల నమ్మకము. యోని యంత్రము ధనము గుంజుకొనుటకు జేసియుండిరి. ఠుమరులుకూడ బూజారుల లీలయే. ఠుమరులతో మహాపురుషు లగుదురేని యొక పశువుపై వాని నుంచిన నదియు మహాపురుషు డగునా? గొప్ప గొప్ప ధర్మయుక్తములగు పురుషార్థములు చేసిన మహాపురుషు లగుదురు.

ప్రశ్న :- అమృత్‌సర్‌లోని సరస్సమృతరూపము. ఒక కుంకుడు కాయ సగము తియ్యగా నుండును. ఒక గోడ వంగి యున్నది. కాని యది పడదు. రేవాల సరస్సునందు రాళ్ళు (బేడే) తేలును. అమరనాథ క్షేత్రమున లింగములు స్వయముగా నిర్మితము లగును. హిమాలయమునుండి పావురముల జంట వచ్చి దర్శన మిచ్చి పోవును. ఇవి యన్నియు నమ్మదగినవి కావా?

ఉత్తరము :- కాదు. ఆ సరస్సునకు అమృతసరస్సు అని పేరు మాత్రమే. ఒకప్పు డాప్రదేశమున నడవి యుండి యుండును. అప్పుడాచెఱువునీరు స్వచ్ఛముగా దియ్యగా నుండి యుండును. అందువలన నప్పుడమృతసరస్సని పేరు పెట్టి యుందురు. ఆ నీరమృతమేయైన పౌరాణికులు చెప్పునట్టు లానీరు త్రాగినవారు చావగూడదు కదా? ఎందుకు జచ్చుచున్నారు? గోడ నిర్మాణములోనే యేదో యేర్పాటు చేసియుందురు. అందువలన నది వంగి కనబడును. నేల గూలదు. కుంకుడుకాయ సగము తియ్యగా నున్న నది యంటుకట్టిన చెట్టైయుండవచ్చును. తియ్యని పండ్లనిచ్చు చెట్టుతో గుంకుడుచెట్టు నంటుకట్టి యుండవచ్చు ననిభావము. రేవాలసరస్సులో రాళ్లు (బేడ) తేలుట కేదో యుపాయము చేసి యుందురు. (రాళ్ళలో - మధ్య వాయువు చేరియున్న నవి తేలును) అమరనాథక్షేత్రమున మంచుతో గొండలేర్పడుచుండ జిన్నజిన్న లింగము లేర్పడుటలో నాశ్చర్యమేమి? పావురముల జంట పెంపుడు జంటయై యుండును. వాని కభ్యాసము చేయించి యుందురు. పర్వతము వెనుక నెవరో యుండి వానిని వదలిన నవి వచ్చి పోవుచుండును. ఇట్టి తమాషాలు చూపి యాత్రికులనుండి ధనము కాజేయుచుందురు.

ప్రశ్న :- హరిద్వారము-స్వర్గద్వారము. 'హరకీపైడీ'లో స్నానము చేసిన బాపములు నశించును. తపోవనములో నున్న దపస్వి యగును. దేవప్రయాగ, గంగోత్తరిలో గోముఖము, నుత్తరకాశీలో గుప్తకాశి, త్రియుగీనారాయణునియు దర్శనము లగును. కేదార, బదరీనారాయణుల పూజ యాఱుమాసములు మనుష్యులు, నాఱుమాసములు దేవతలు చేయుదురు. మహాదేవుని ముఖము నేపాలునందు బశుపతి నామముతోను, కేదారమున బిరుదులు, తుంగనాథమున జానువులు, నమరనాథలో జరణములు, (నున్నవి) వీనిని దర్శించి స్పృశించినందున, స్నానము చేసిన ముక్తికలుగును. కేదారమునుండి బదరీనుండి స్వర్గము వెళ్ళదలచినవారు వెళ్ళవచ్చును. ఈ విషయము లన్నియు నేమనవలయును?

ఉత్తరము :- హరిద్వారము - ఉత్తరముగా బర్వతములలో బోవుట కొకమార్గమున కారంభము. ఇక 'హరకీపైడీ' స్నానమున కొకకుండమునకు బోవుటకు మెట్లు నిర్మింపబడినవి. ఆ మెట్లనే 'హరకీపైడీ' అందురు. నిజమడిగిన నది 'హాడ్ పైడీ'ఎముకలస్థాన మనవలయును. ఏలయనగా దేశదేశాంతరములలో జనిపోయినవారి యెముకలన్నియు నట గంగలో వేయబడును. పాపము లెన్నడు నెక్కడ విడువవు. అనుభవింపక యవి నశింపవు. తపోవనము - అది యెప్పుడో యొకప్పుడు తపోవనమై యుండవచ్చును. ఇప్పుడు మాత్రమది భిక్షుకవనము. తపోవనమునకు వెళ్ళి యట నున్నంత మాత్రమున దపము కాదు. తపము చేయుటవలన నగును. అక్కడ నెందఱో యసత్యము లాడు దుకాణదారు లున్నారు.

'హిమవతః ప్రభవతి గంగా' పర్వతముపై నుండి జలము క్రిందికి బడును. అక్కడ డబ్బులు కాజేయువారు గోముఖము నాకారము నిర్మించి యుంచిరి. అదియే పోపుల స్వర్గమై యుండును. అట నుత్తరకాశీ మున్నగు స్థానములు ధ్యానము చేసికొనువారికి మంచిగా నుండును. కాని దుకాణదారుల కదియు వ్యాపారము చేసికొనుటకు బాగుగనే యుండును.

దేవప్రయాగ పురాణముల గప్పాలు గొట్టువారి లీలాస్థానము. అక్కడ నలఖనందా, గంగా రెండును గలిసినవి. కావున నట దేవతలు వసింతురని గప్పాలు కొట్టకున్న నక్కడ కెవరు వెళ్ళుదురు? వారికి డబ్బు లెవరిత్తురు? గుప్తకాశీ లేదు, కాని యది ప్రసిద్ధకాశియే. అట మూడు యుగముల 'ధూని' కనబడదు. కాని పది, యిరువది తరముల పోపులది యున్నది. అది ఖాతిల భస్మధారణము చేయువారి ధూనీ, పారసీకుల యగ్నిగృహము - 'అగ్యారీ' వలె నెల్లపుడు కాష్టములు కాలుచుండును. ధూమము వచ్చుచుండును. అందువలననే దానిని మూడు యుగముల ధూని యనుచుందురు.

తప్తకుండముకూడ బర్వతముల లోపలనుండి వేడిమి కలుగుచుండును. అందువలన నాకుండమున వెచ్చని జలము లభించును. దానికి సమీపమున నున్న మఱియొక కుండమునకు జలము వచ్చును. అది చల్లగానే యుండును. ఆ జలము చల్లని ప్రదేశమునుండి వచ్చును.

'కేదార' స్థానపు భూమి చాల మంచిది. కాని యక్కడకూడ నొక రాతిమీద బూజారులో వారి శిష్యులో యొక మందిరమును నిర్మించి యున్నారు. అక్కడి మహంతు పూజారులు జ్ఞానశూన్యులగు ధన వంతుల నుండి కావలసిన వన్నియు సంపాదించుకొని విషయానందము ననుభవించుచుందురు. అట్లే 'బదరీనారాయణ' మునందును వంచనావిద్యలో నేర్పరులైన వంచకులు చాలమంది తిష్ఠవేసికొని యుం దురు. అక్కడ వారిలో ముఖ్యుడు 'రావల్ జీ' ఒక స్త్రీ కాక పలువురు స్త్రీల నుంచుకొని యుండును. 'పశు పతి' యనునదొక మందిరము. మూర్తిపేరు పంచముఖి. అడుగువారు లేనప్పుడే యిట్టి లీలలు బలపడు చుండును. తీర్థవాసులు ధూర్తులు, ధనమును హరించు వారుగా నుందురు. పర్వతనివాసు లట్టివారు కారు. అక్కడి భూమి మిక్కిలి రమణీయమైనది. పవిత్రమైనది కూడ.

ప్రశ్న :- వింధ్యాచలమున వింధ్యేశ్వరీ కాళీ అష్టభుజా ప్రత్యక్ష సత్యమై యున్నది. వింధ్యేశ్వరీ

మూడువేళల మూడురూపములు మార్చుచుండును. ఆ యావరణమునందు ఒక్క మక్షికయైన నుండదు.

'ప్రయాగ' తీర్థరాజము- అట శిరమును ముండనము చేయించుకొన్న సిద్ధి కలుగును. గంగా యమునల సంగమమున స్నానముచేసిన నిష్టసిద్ధి కలుగును.

అట్లే 'అయోధ్య' యెన్నియో పర్యాయములు బస్తీతోబాటు స్వర్గమునకు బోయినది. మధురా - అన్ని తీర్థములకంటె గొప్పది. 'బృందావనము' - లీలాస్థలము. మఱియు గోవర్ధనము వ్రజయాత్ర మిక్కిలి భాగ్యమువలన గానికాదు. సూర్యగ్రహణమునాడు 'కురుక్షేత్రమున' లక్షలాది జనులు గుమికూడు దురు. ఇవి యన్నియు మిథ్యలేనా?

ఉత్తరము :- మూడు మూర్తులు ప్రత్యక్షముగా గనబడుచుండును. అవి రాతి విగ్రహములు. పూజారులు వస్త్రాభూషణాదులను వానికి ధరింపజేసి రూపములు మార్చుచుందురు. ఆ రూపపరివర్తనము నకు గారణము వారే. ఈగలు - మక్షికలునొక్కటి కాదు. వేలు లక్షలు మూగి యుండును. నేను నాకన్నులతో జూచియున్నాను.

ప్రయాగలో నెవడో (నాయీ) మంగలి స్వయముగానో లేక పూజారికి గొంత ధనమిచ్చియో శిరస్సును ముండనము చేసికొన్నందున గలుగు మాహాత్మ్యమును శ్లోకములలో వ్రాసియో వ్రాయించియో వ్యాపకము చేయించి యుండును. ప్రయాగలో స్నానము చేసినవారు స్వర్గమునకు బోయి తిరిగి వచ్చిన వారెవ్వరు కనిపింపరేల? స్నానము చేసినవారందఱు నిండ్లకే తిరిగి వెళ్ళుదురు. ఇంటికి దిరిగి రానివారు స్నానము చేయుచు నదిలో మునిగి చచ్చి మఱి యెటనో జన్మించి యుందురు. మధుర-తీర్థరాజమని నామము యాత్రికులను వంచించి ధనము గుంజుకొనువారు పెట్టినపేరు. జడపదార్థములలో రాజా ప్రజాభావ మెన్నడు సంగతము కాదు.

అయోధ్యానగరి యంతయు దనలోనున్న కుక్కలు, గాడిదెలు, పాకీవాళ్ళు, చర్మకారులు, నను వారితో మూడు మార్లు స్వర్గమునకు వెళ్ళిన దనుట మిక్కిలి యసంభవము. స్వర్గమున కెన్నడు వెళ్ళ లేదు. అది యక్కడనే యున్నది. కాని పోపు ముఖము నుండి వెలువడు గప్పాలలో నయోధ్య స్వర్గమున కెగిరిపోయి యుండును. ఈ గప్పాలు శబ్దరూపమున వాయుమండలమున నెగురుచుండును. ఇట్లే నైమిశారణ్యము మున్నగువాని విషయమునను దెలిసికొనుడు.

మధుర ముల్లోకములలో విలక్షణ మేమియు గాదు. కాని యందు మూడు జంతువులు మాత్రము మిక్కిలి లీలాధారులై యున్నవి. వానివలన జలము, స్థలము, నంతరిక్షము నను ముల్లోకములందును నెవని కిని సుఖము లభింపదు. అందులో నొక జంతువు చౌబే (పండా) ఎవడేని నదిలో స్నానము చేయబోయిన వానిని నిలబెట్టి 'యజమానుడా! తే ముందు పన్ను చెల్లించు' అని వారిదగ్గఱనుండి దొరకినది వసూలు చేయుదురు. "భంగు, మిర్చి, లడ్లు తిందుము. త్రాగుదుము. యజమానునకు జయము పలుకుదుము" అందురు. ఇక రెండవ జంతువు యమునలోని కూర్మము-తాబేలు . నీటిలో దిగినవారిని నవి కఱవక మానవు. వానివలన ఘట్టము-రేవులో స్నానము చేయుట దుర్ఘటము. ఇక మూడవ జంతు వెఱ్ఱని ముఖముగల కోతులు. అవి యాత్రికుల తలపాగలు, టోపీలు, స్త్రీల దేహముపైనుండు నగలు, కాలి చెప్పులు వేనిని వదలవు. కఱచుటకు వెనుకాడవు. నెట్టి పడవేయును. వీనిబాధలు చెప్పనలవి కాదు.

వీనిని బోపులు, పోపుల శిష్యులు పూజించుచుందురు. మణుగుల కొలది సెనగలు కూర్మము లకు, బెల్లముతో సిద్ధముచేసిన సెనగలు కోతులకు, చౌబేళ్ళకు లడ్డులు సమర్పించి యీజంతువులకు సేవలు చేయుచుందురు.

బృందావన మెప్పుడో యొకప్పుడు బృందావనముగా నుండెనేమోకాని, యిప్పుడది వేశ్యావనము

వలె అల్లా, అల్లీ, గురువు శిష్యురాండ్రు, మున్నగు వారిలీలలు వ్యాపించి యున్నవి. అట్లే దీపమాలిక యుత్సవము నందును, గోవర్ధన, వ్రజయాత్రల యందును బోపులు వారి ప్రయోజనము సిద్ధింప జేసి కొందురు.

కురుక్షేత్రమునందును జీవికకు సంబంధించిన లీలయే తెలిసికొన దగినది. వీరిలో నెవరో ధార్మికుడు, పరోపకారియునగు పురుషుడు మాత్రము పోపుల లీలలనుండి తప్పుకొన గలుగును.

(మూర్తిపూజ-తీర్థములు)

ప్రశ్న :- ఈ మూర్తిపూజ, తీర్థములు సనాతనముగా వచ్చుచున్నవి కదా! అసత్యము లేలయగును?

ఉత్తరము :- మీరు సనాతన మని దేని ననుచున్నారు? సృష్ట్యారంభమునుండి వచ్చుచున్నది యని మీయభిప్రాయ మగునేని వేదములందును ఋషికృత బ్రాహ్మణగ్రంథములందును వీని నామములైన నేల కనిపింపవు? మూర్తిపూజ రెండున్నర, మూడువేల సంవత్సరములనుండి వామమార్గుల వలనను జైనుల వలనను బ్రారంభింపబడినది. అంతకు బూర్వ మార్యావర్తమున మూర్తిపూజ లేదు.

ఈ తీర్థములును లేవు. గిరినార్, పాలిటానా శిఖరశత్రుంజయ్, ఆబూ మున్నగు తీర్థస్థానములను బ్రారంభించిన తదుపరి వామమార్గులు పోపులు తీర్థముల నేర్పఱచిరి. వీరి యారంభమును బరీక్షింప గోరువారు పండాల ప్రాచీన బహీఖాతా పుస్తకాలు, రాగిపత్రములు చూచినవారికి సత్యము తెలియును. తీర్థము లైదువందలు లేక సహస్రవర్షములనుండి ప్రారంభించినట్లు తెలియుచున్నవి. కావున నివి సనాతనములు కావు. ఆధునికములే.

ప్రశ్న :- తీర్థమాహాత్మ్యములు, నామమహత్త్యముననగా 'అన్యక్షేత్రేకృతం పాపం కాశీక్షేత్రే వినశ్యతి' అను నిట్టి విషయములు సత్యములా కావా?

ఉత్తరము :- కాదు. ఏలయనగా నట్లు పాపములు నశించిన దరిద్రులకు ధనము, రాజ్యము, నంధులకు గన్నులు లభించి యుండును. కుష్ఠరోగుల కుష్ఠవ్యాధిపోయి యుండవలసినది. అట్లెక్కడను జరుగుటలేదు. కావున నెవరికిని బాపపుణ్యములు తీర్థసేవనమున నశింపవు.

ప్రశ్న :- "గంగా గంగేతి యో బ్రూయాద్ యోజనానాం శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి"

బ్రహ్మపురాణ ౧౫౫—౮౨. పద్మ. పు. ఉ. ౨౩—౨.

"హరిర్ హరతి పాపాని హరిరిత్యక్షరద్వయమ్" పద్మపు. ఉ.ఖ. ౨౨—౩౪

"ప్రాతః కాలే శివం దృష్ట్వా నిశి పాపం వినశ్యతి"
ఆజన్మకృతం మధ్యాహ్నే, సాయాహ్నే సప్త జన్మనామ్" (పోపు పురాణము)

వందలకొలది, వేలకొలది యామడల దూరముననుండి యైనను, గంగా, గంగా అని యనిన నతని పాపములు నశించును. వైకుంఠమున కేగును. 'హరి'యను రెండక్షరముల నామము నుచ్చరించిన నది సర్వపాపములను హరించును. అట్లే రామ, కృష్ణ, శివ, భగవతీ నామముల మాహాత్మ్యము వ్రాయబడి యున్నది.

ఎవడేని ప్రాతఃకాలమున శివలింగమును దర్శించిన రాత్రియందు జేసిన పాపములు, మధ్యాహ్నమున దర్శించిన పుట్టిననాటినుండి చేసిన పాపములు, సాయంకాలము దర్శనము చేసికొనిన నేడుజన్మములందు జేసిన పాపములు నశించును. ఇది దర్శనమాహాత్మ్యము. ఇవి యన్నియు నబద్ధములేనా?

ఉత్తరము :- ఇవి యన్నియు మిథ్య యనుటలో సందేహమేమున్నది? గంగా గంగా హరేరామ హరేకృష్ణ శివ భగవతీ మున్నగు నామస్మరణమువలన బాపము లెన్నడు నశింపవు. అట్లు నశించిన లోకమున నెవ్వరు దుఃఖితులే యుండరు. పాపము చేయుటకును నెవ్వరు భయపడరు. ప్రస్తుతము పోపు

లీలలో బాపము లెక్కువగుచున్నవి. పాపము చేసినను తీర్థస్నానాదులవలన నవి నశించునని మూఢులు విశ్వసించుచున్నారు. ఈ విశ్వాసముతోనే యీలోకమున పాపములు చేసి యిహపరములను నాశము చేసికొనుచున్నారు. కాని, చేసిన పాపము భోగింపక తప్పదు.

ప్రశ్న :- అయిన, సత్యమైన నామస్మరణము కాని, తీర్థముకాని యేదైన నున్నదా? లేదా?

ఉత్తరము :- ఉన్నది. వేదాది సత్యశాస్త్రములను జదువుట, చదివించుట, ధార్మికులయిన విద్వాంసుల సాంగత్యము, పరోపకారము, ధర్మానుష్ఠానము, యోగాభ్యాసము, నిర్వైరము, నిష్కపటత, సత్యమును నమ్ముట, సత్యము చెప్పుట, సత్యము నాచరించుట, బ్రహ్మచర్యము, తల్లి దండ్రులయు, ఆచార్యునియు, నతిథియు సేవచేయుట, పరమేశ్వరుని స్తుతిప్రార్థనోపాసనలు చేయుట, శాంతి, జితేంద్రియత, సుశీలత, ధర్మయుక్త పురుషార్థము, జ్ఞానవిజ్ఞానములు, మున్నగు శుభగుణ కర్మలు దుఃఖములనుండి తరింప జేయునవి. కావున వీనికి దీర్థములని పేరు.

జలస్థలాదు లెన్నడును దీర్థములు కావు. కారణమేమన :- "జనా యైస్తరన్తి తాని తీర్థాని" జనులు వేనివలన దుఃఖములనుండి తరింతురో యవి తీర్థములు. జలస్థలాదులు తరింపజేయకపోగా ముంచి చంపివేయును. నౌకలు మున్నగు వానిని దీర్థములని చెప్పినను దోషము లేదు. ఏలయన వానివలన మనుజులు సముద్రములు, నదులు దాట గలుగుదురు.

"సమానతీర్థే వాసీ" పా. అ. ౪-౪-౧౦౭ (౧)

"నమస్తీర్థ్యాయ" యజు. అ. ౧౬-౪౨.

ఒక యాచార్యుని దగ్గఱ నొకేశాస్త్రమును జదువు బ్రహ్మచారులు సతీర్థులు-సమాన తీర్థమును సేవించువారగుచున్నారు. (౧)

వేదాదిశాస్త్రములందు, సత్యభాషణాది ధర్మలక్షణములందు సాధువులైన వారికి నన్నాది పదార్థముల నొసంగి వారినుండి విద్యాదులను గ్రహించుట తీర్థము లనబడును. (౨)

నామస్మరణము దేని నందురన :-

"యస్య నామ మహద్యశః." యజు. ౩౨-౩.

పరమేశ్వరుని నామము మిక్కిలి యశస్సు - అనగా ధర్మయుక్త కర్మలనాచరించుట. ఎట్లన :- బ్రహ్మము, పరమేశ్వరుడు, ఈశ్వరుడు, న్యాయకారి, దయాళువు, సర్వశక్తిమంతుడు, మున్నగునవి గుణ కర్మ స్వభావములను దెలుపు నామములు. బ్రహ్మము అన్నింటికంటె గొప్పవాడు, పరమేశ్వరుడు = ఈశ్వరుల కీశ్వరుడు, ఈశ్వరుడు = సామర్థ్యయుక్తుడు, న్యాయకారి = ఎన్నడు నన్యాయము చేయనివాడు, దయాళువు = ఎల్లరిపై గృపాదృష్టి నుంచువాడు, సర్వశక్తిమంతుడు = తన సామర్థ్యముచేతనే యుత్పత్తి స్థితి లయము జగత్తునకు జేయువాడు. ఇందెవరి సహాయత నపేక్షింపనివాడు, బ్రహ్మ = వివిధజగత్పదార్థములను నిర్మించువాడు, విష్ణువు = అంతట, నన్నింటియందు వ్యాపించియుండి రక్షించువాడు, మహాదేవుడు = సమస్త దేవతలకు దేవుడు. రుద్రుడు = ప్రళయము జేయువాడు. అను నిట్టి నామార్థములను దనయందు ధారణ చేయవలయును. అనగా బెద్దపనులలో బెద్దయై, సమర్థులలో సమర్థుడై తన సామర్థ్యములను బెంపుజేసికొనవలయును. అధర్మమెన్నడు చేయరాదు. ఎల్లరిపై దయనుంచవలెను. అన్ని విధములైన సాధనములను సమర్థము చేయవలెను. శిల్ప విద్యతో నానావిధములైన పదార్థములను జేయవలెను. సమస్త సంసారమునందును దన యాత్మకు దుల్యముగా సుఖదుఃఖముల నెంచవలయును. ఎల్లరను రక్షింప వలయును. విద్వాంసులలో విద్వాంసుడు గావలయును. దుష్టకర్మలు చేసి చేయించువారిని దండింప బ్రయత్నింపవలయును. సజ్జనులను రక్షించుటకు యత్నింపవలయును.

ఇట్లు పరమేశ్వరుని నామముల యర్థములను దెలిసికొని పరమేశ్వరుని గుణకర్మ స్వభావముల కనుకూలముగ దనగుణకర్మ స్వభావములను మార్చుకొనుచు నుండవలయును. ఇదియే పరమేశ్వరుని నామస్మరణము.

ప్రశ్న :- "గురుర్ బ్రహ్మా గురుర్ విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః,
గురురేవ పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః." గురుగీత గురుమాహాత్మ్య—౧౬

ఇట్టి గురుమాహాత్మ్యము సత్యమే కదా? గురువు పాదములు కడిగి త్రాగుట, యెట్టి యాజ్ఞ నిచ్చినను దానిని బాలించుట, గురువు లోభియైన వామన సమానుడనియు, క్రోధియైన నరసింహ సదృశుడనియు, మోహియైన రామునివంటి వాడనియు, గామియగునెడల గృష్ణతుల్యుడనియు గురువు నెంచవలయును. గురు వెట్టి పాపము చేసినను శ్రద్ధను విడువకుండ వలయును. సంత–గురుదర్శనమునకు వెళ్ళిన ప్రతి పదమునందును నశ్వమేధ ఫలము లభించును. ఇది యంతయు సత్యమా కాదా!

ఉత్తరము :- సరికాదు. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వర నామములు పరమేశ్వరునివి. గురువు పరమేశ్వరుని తుల్యు డెన్నడు గాజాలడు. గురుమాహాత్మ్యము, గురుగీతము మిక్కిలి పోపులీలయే. తల్లిదండ్రులు, నాచార్యుడు, నతిథి గురువు లగుదురు. వారిని సేవింపవలయును. వారినుండి విద్య, శిక్షయు గ్రహింప వలయును. పరస్పర మొకరినుండి యొక్కరు మంచి విషయముల నిచ్చి పుచ్చుకొనుటలు గురుశిష్యులు చేసికొనవలయును.

కాని, గురువు లోభి, మోహి, క్రోధి, కామియునైన నతనిని విడిచిపెట్టవలయును. చేతనైన దండింప వలయును. సాధారణ శిక్షవలన నంగీకరింపకున్న నర్ఘ్యపాద్యము లనగా దాడన దండాదులతో బాతము చెప్పవలయును. ప్రాణహరణ దండన విధించినను దోషము లేదు.

విద్యాది సద్గుణములలో గురుత్వము లేనివారై, కంఠమున మాలలు నుదుట దిలకము ధరించుట, వేదవిరుద్ధ ధర్మోపదేశము చేయుట, మున్నగునవి చేయువారు గురువులే కారు. వారు గొఱ్ఱెల కాపరుల వంటివారు. గొఱ్ఱెలకాపరులు గొఱ్ఱెల నుండి మేకలనుండి పాలుదీసికొని ప్రయోజనమును బొందుదురు. అట్లే వీరును శిష్యులనుండియు, శిష్యురాండ్ర నుండియు ధనాదులు సంపాదించుకొని తమ ప్రయోజనములను సిద్ధము చేసికొనుచుందురు. దోహా :- గురులోభీ చేలా లాలచీ దోనోం ఖేలే దావ్ భవసాగర మేఁ డూబతే బైఠ పత్థరకీ నావ్" 'శిష్యులు, శిష్యలు నేదో కొంచె మీక పోరు, అని గురువు భావించును. ఇక శిష్యుడు 'కానిమ్ము గురు వబద్ధపాట్లు బెట్టించుటకు బాపములు విడిపించుటకు బనికి వచ్చును. నష్ట మేమున్నది? అని భావించును. ఇట్లు లిరువురు గురువు శిష్యుడు నేదోయొక లోభబుద్ధితో నొకరి నొకరు వంచించుకొనుచు భవసాగరమున దుఃఖములలో మునుగుదురు. రాతినావపై గూర్చుండి సముద్రమును దాటనెంచువారు మునుగునట్లు వీరును మునుగుదురు.

ఇటువంటి గురుశిష్యుల ముఖముల మీద మన్ను బూడిద బోయవలయును. వారిదగ్గఱ నెవరు నిలుచుండను రాదు. వారిచెంత నుండువారు దుఃఖసాగరమున బడుదురు. ఎట్టి పోపులీల బూజారులు పౌరాణికులు నడపిరో యట్టి లీలయే యీగొల్లల వంటి మూర్ఖ గురువులు కూడ నడపిరి. ఇది యంతయు స్వార్థపరులైన వారి పనియే. పరమార్థము నభిలషించువారు స్వయముగా దుఃఖముల ననుభవించియు లోకమున కుపకారము జేయుట మానరు. గురుమాహాత్మ్యము గురుగీత మున్నగు పుస్తకములు కూడ లోభులు కుకర్ములు నైన యీగురువులచే రచింపబడినవియే.

(పురాణములు)

ప్రశ్న :- "అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీసుతః" (౧)

"ఇతిహాస పురాణాభ్యాం వేదార్థముపబృంహయేత్" (౨) మ. ఆదిప. ౩-౨౬౭
"పురాణాని ఖిలాని చ" (౩) మను. ౩-౨౩౨.
"ఇతిహాసపురాణః పంచమో వేదానాం వేదః" (౪) ఛాందోగ్య. ౭-౧-౪
"దశమేఽహని కించిత్ పురాణ మాచక్షీత" (౪) (శతపథ. ౧౩-౪-౩-౧౩)
"పురాణవిద్యా వేదః" సూత్రమ్.

పదునెనిమిది పురాణముల కర్త వ్యాసుడే. వ్యాసుని వచనము తప్పక ప్రమాణముగా నంగీకరింపవల యును. (౧)

ఇతిహాస = మహాభారతము నుండియు అష్టాదశ పురాణముల నుండియు వేదార్థములను జదువవలయును. చదివింపవలయును. ఏలయన నితిహాస పురాణములు వేదార్థముల కనుకూలముగానే యున్నవి. (౨)

పితృకర్మమునందు బురాణము హరివంశపు కథ వినుము. (౩)

ఇతిహాసము, పురాణములు పంచమవేదముగా చెప్పబడును. (౪)

అశ్వమేధ సమాప్తియందు బదియవ దినమున గొంచెము పురాణకథ వినవలయును. (౫)

పురాణవిద్య వేదార్థమును దెలుపుట వలననే వేదము. (౬)

ఇట్టి ప్రమాణములవలన బురాణముల ప్రమాణము, మఱియు వీని ప్రమాణములవలన మూర్తి పూజయు, దీర్థములును బ్రామాణికములని తెలియుచున్నవి. పురాణములందు మూర్తిపూజ, తీర్థములు విధింపబడి యున్నవి.

ఉత్తరము :- వ్యాసుడు పదునెనిమిది పురాణములకు గర్తయై యుండిన వానియం దిట్టిగప్పా లుండియుండవు. ఏలయనగా వ్యాసుడు వ్రాసిన శారీరక సూత్రములు (వేదాంతదర్శనము) యోగశాస్త్ర ముపై వ్రాసిన భాష్యము మున్నగు గ్రంథములను జూచిన వ్యాసుడు గొప్పవిద్వాంసుడనియు, సత్య వాదియు, ధార్మికుడనియు, యోగియనియు విదిత మగుచున్నది.

అటువంటివారు మిథ్యాకథల నెన్నడు వ్రాయరు. అందువలన సాంప్రదాయకులు పరస్పర విరో ధులు భాగవతాది నవీనములు కపోల కల్పితములైన గ్రంథములను రచియించిరనియు వానియందు వ్యాసుని గుణలేశములుకూడ లేవనియు స్పష్టమగుచున్నది. వేదశాస్త్రములను విరోధించు స్వార్థపరులు, నవిద్వాంసులునైనవారే యిట్టిపని చేయుదురు.

ఇతిహాసము, పురాణము నను నామములు శివపురాణాదులవి కావు.

"బ్రాహ్మణానీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా నారాశంసీరితి"
(ఇది బ్రాహ్మణము, సూత్రవచనము.)

ఐతరేయ, శతపథ, సామ, గోపథ, బ్రాహ్మణ గ్రంథములకే ఇతిహాసము, పురాణము, కల్పము, గాథా, నారాశంసీ యని యైదు నామము లున్నవి. ఇతిహాసము = జనకయాజ్ఞవల్క్యుల సంవాదము మున్న గునవి, పురాణము = జగదుత్పత్తి మున్నగువాని వర్ణన, కల్పము = వేదశబ్దముల సామర్థ్య వర్ణనము - అర్థనిరూపణము చేయుట, గాథా = కొండొకని దృష్టాంతదార్ష్టాంత రూప కథాప్రసంగమును జెప్పుట, నారాశంసీ = మనుష్యులకు సంబంధించిన ప్రశంసనీయములు, అప్రశంసనీయములు నగుకార్యములను వర్ణించుట. వీనివలననే వేదార్థములు బోధపడును.

'పితృకర్మ' అనగా జ్ఞానుల ప్రశంసనుగూర్చి కొంతవినుట. అశ్వమేధ యజ్ఞాంతమునను నిట్టి ప్రశం సలను వినుట వ్రాయబడి యున్నది. ఏలయనగా వ్యాసకృత గ్రంథములు వినుట, వినిపించుట వ్యాసుని

జన్మమునకు దదుపరియే జరుగ వీలుండును. వ్యాసుని జన్మకు బూర్వము వారిచే రచింపబడిన గ్రంథములు వినుట యసంభవము కదా! వ్యాసునికి బూర్వముకూడ వేదములు వేదార్థములు చదివి, చదివించుచు, విని, వినిపించుచు నుండెడివారే కదా! అందువలన నన్నింటికంటె ప్రాచీనములైన బ్రాహ్మణ గ్రంథములందే యిది సంగతమగును. ఈ నవీన కపోల కల్పిత శ్రీమద్ భాగవత శివపురాణాదులం దెట్లు సంగతమగును? ఈ దూషిత గ్రంథముల కిది వర్తింపనే వర్తింపదు. వీనివలన వేదార్థ మెన్నడు బోధపడదు.

(వేదవ్యాసుడు)

వ్యాసుడు వేదములను జదివి వానిని నర్థములతో జదివించి ప్రచారముచేసి వ్యాపింప జేసినందున నతనికి వేదవ్యాసుడని నామము కలిగెను. వర్తులమునగల మధ్యరేఖకు వ్యాస మనిపేరు. వ్యాసుడనగా ఋగ్వేదము మొదలుగా నథర్వవేదము సాంతము చదివినవాడని యర్థము. శుకదేవునకు, జైమినికి నింక నితరులకును వేదములను జెప్పినవాడు. వ్యాసుని జన్మనామము కృష్ణద్వైపాయనుడు. వ్యాసుడు వేదములను ప్రోగుచేసినవాడు, ఏకము చేసినవాడు ననుట సత్యముకాదు. ఏల యనగా వ్యాసుని పిత, పితామహుడు, పరాశర, శక్తి, వసిష్ఠ బ్రహ్మాదు లెల్లరును నాలుగు వేదములను జదివియుండిరి. కావున నిది యెట్లు సంగతమగును?

(శివపురాణము)

ప్రశ్న :- పురాణములలోని యన్ని విషయములు ననత్యములేనా? కొన్ని సత్యము లున్నవా?

ఉత్తరము :- అధిక విషయము లసత్యములు. కొన్ని ఘుణాక్షర న్యాయముతో సత్యములు నున్నవి. సత్యములైనవి వేదాది సత్యశాస్త్రములవి. అందలి మిథ్యావిషయము లీపోపుల పురాణరూపమగు నింటి నుండి వచ్చినవి. ఎట్లన :- శివపురాణమందు శైవులు శివుని బరమేశ్వరునిగా నంగీకరించి, విష్ణువు, బ్రహ్మము, గణేశుడు నింద్రుడు మున్నగువారిని బరమేశ్వరుని దాసులుగ జేసివైచిరి. వైష్ణవులు విష్ణుపురాణమున విష్ణువును బరమాత్మగా నంగీకరించి శివుడు మున్నగు వారిని విష్ణువునకు దాసులుగ జేసిరి. దేవీ భాగవతమునందు దేవిని బరమేశ్వరిగను, శివవిష్ణ్వాదులను నామెకింకరులుగ జేసిరి. గణేశఖండ మున గణేశునీశ్వరునిగను, మిగిలిన వారి నందఱను గణేశుని దాసులుగను జేసిరి.

ఇది యంతయు సాంప్రదాయకులది కాక మఱియెవరిది? పురాణము లన్నియు నొకవ్యక్తి రచియించి యుండిననిట్టి పరస్పర విరుద్ధవిషయములు వ్రాయడు. విద్వాంసుని వ్రాతలో నెన్నడు నిట్టి విషయములు వ్రాయబడవు. వీనిలో నొకటి సత్యమని యెంచిన మిగిలినవి యసత్యము లగును. రెండవ విషయమును సత్యమనిన మిగిలినవి యసత్యములగును. మూడవ విషయమును సత్యమనిన మొదటి రెండును నసత్యము లగును.

శివపురాణ కర్తలు శివునిచేతను, విష్ణుపురాణ కర్తలు విష్ణువుచేతను దేవీపురాణమువారు దేవిచేతను, గణేశఖండమువారు గణేశునిచేతను, సూర్యపురాణమువారు సూర్యునిచేతను, వాయుపురాణమువారు వాయువు చేతను సృష్టికి నుత్పత్తిస్థితిలయములు చేయించిరి. మరల నొక్కొక్క జగత్కర్త యైన దేవత మిగిలిన జగత్కర్తలను సృష్టించినట్లు వ్రాసియున్నారు.

జగత్తుయొక్క సృష్టికి, స్థితికి, ప్రళయమునకు గర్తయైన వాడెట్లు పుట్టును? పుట్టినవాడు సృష్టికర్త యెట్లు కాగలడు? అని వీరి నడుగుడు. ఏమి చెప్పుదురు? మౌనము వహించుట తప్ప గత్యంతర మేముండును? మఱియు నీసృష్టికర్తల శరీరము లెట్లు పుట్టినవి? తాము సృష్టిలోని పదార్థములై, పరిచ్ఛిన్నులై సంసారము నుత్పన్నము చేయుటకు గర్త లెట్లు కాగలరు? మఱియు జగత్తుయొక్క యుత్పత్తియు విలక్షణ విలక్షణ ప్రకారములతో నంగీకరించిరి. అది సర్వధా యసంభవము. ఎట్లన :-

(శివపురాణ-సృష్టి)

శివపురాణమున శివుడు, 'నేను సృష్టి జేయుదును' అని కోరెను. అంతట 'నారాయణ' జలాశయమును గలిగించి దాని నాభినుండి కమలమును, నాకమలమున బ్రహ్మను సృష్టించెను. అత డంతయు జలమయమై యుండుట జూచెను. ఆ జలము నంజలిలో దీసికొని చూచి జలములో మరల బోసెను. దానినుండి యొకబుడగ లేచెను. ఆ బుడగనుండి యొకపురుషుడు (విష్ణువు)త్పన్నమయ్యెను. అతడు బ్రహ్మతో ఓపుత్ర! సృష్టి నుత్పన్నము చేయుము అనెను. అంతట బ్రహ్మ 'నేను నీపుత్రుడను గాను, నీవే నాపుత్రుడవు' అనెను. అంతట నాయిరువురిలో వివాదము కలిగెను. సహస్ర దివ్యవర్షముల పర్యంతము వారిరువురు జలముమీద గలహించుచుండిరి.

అప్పుడు మహాదేవుడు 'సృష్టిని జేయుటకు నేనుబంపిన వారిరువురు బరస్పరము గలహించుచున్నారు' అని విచారించెను. అంతట నాకలహించు వారిమధ్యలో దేజోమయ లింగ ముత్పన్నమయ్యెను. అది శీఘ్రముగా నాకాశమునకు బెరిగిపోయెను. దానిం జూచి వారిరువురు నాశ్చర్యపడిరి. దీని యాద్యంతములు కనుగొన వలయునని యాలోచించిరి. దీని యాద్యంతములను గనుగొని ముందువచ్చువాడు తండ్రియనియు నాలస్యముగా వచ్చువాడు, కనుగొనజాలనివాడు పుత్రుడనియు నంగీకరింప నిశ్చయించుకొనిరి.

విష్ణువు కూర్మము రూపము ధరించి క్రింది వైపునకు, బ్రహ్మ హంసరూపము ధరించి యాకసము వంకకును బోయిరి. ఇరువురు మనోవేగముతో బోయిరి. దివ్యసహస్రవర్ష పర్యంతము వెళ్ళుచునే యుండిరి. కాని దాని యాద్యంతములు దొరకవయ్యె. అప్పుడు క్రిందినుండి పైకి విష్ణువు, పైనుండి క్రిందికి బ్రహ్మయు రాదొడగిరి. దారిలో బ్రహ్మ "అతడంతము కనుగొని వచ్చిన నేను బుత్రుడను గావలసియుండును' అని యాలోచించుచుండగా బైనుండి యొకగోవు, నొక మొగలి వృక్షము క్రిందికి దిగివచ్చుచు గనిపించెను. బ్రహ్మవాని నిట్లడిగెను, 'మీరెటనుండి వచ్చుచున్నారు?' వారు 'మేము సహస్ర వర్షముల నుండి యీలింగము (సహారా) నాధారముతో వచ్చుచున్నాము' అనిరి. అంతట బ్రహ్మ 'ఈ లింగమున కంత మున్నదా? లేదా?' అని యడిగెను. వారు లేదనిరి.

అప్పుడు బ్రహ్మ వారితో నిట్లనెను. 'మీరు నాతో రండు. నే నీలింగము శిరస్సుమీద దుగ్ధధార ప్రవహింపజేసితిని' అని గోవు, 'నేనీ లింగముపై బుష్ప వృష్టిని గురిపించితిన'ని మొగలి వృక్షమును మీరిరువురు సాక్ష్యము చెప్పుడు. మీరట్లు చెప్పిన మిమ్ము మీస్థానముల జేర్చెదను." అంతట వారు బ్రహ్మతో 'మే మబద్ధపు సాక్ష్యము చెప్పము' అనిరి. అంతట బ్రహ్మ కుపితుడై 'మీరు సాక్ష్యము చెప్పనిచో మిమ్ము నిప్పుడే భస్మము చేసెదను' అని బెదరించెను. అప్పుడు వారిరువురును భయపడి 'నీవు చెప్పినట్లే సాక్ష్యమిచ్చెదము' అని యంగీకరించిరి. తదుపరి ముగ్గురు గ్రిందికి దిగివచ్చిరి.

విష్ణువు ముందుగానే వచ్చి యుండెను. ఇప్పుడు బ్రహ్మకూడ జేరెను. చేరి 'నీవు క్రింది యంతు గనుగొని వచ్చితివా?' అని విష్ణువు నడిగెను. అంతట విష్ణువు 'నాకు దీనియంతు దొరకలేదు.' అనెను. 'నేను పైయంతమును జూచి వచ్చితిని' అని బ్రహ్మ చెప్పగా 'ఇందులకు సాక్ష్యమేమి?' అని విష్ణునడిగెను. అప్పుడు గోవు, వృక్షము రెండును లింగముపైన మేముంటిమి' అని సాక్ష్యము చెప్పెను. అప్పుడాలింగము నుండి శబ్దమొకటి బయటపడెను. 'నీవబద్ధము చెప్పితివి కావున నీ పువ్వులు నామీద గానీ, మఱి యేదేవత మీదగాని యుంచబడవు. ఎవరేని యర్పించిన వారు నశింతురు'అని వృక్షమును, 'నీ వేముఖముతో నబద్ధము చెప్పితివో యాముఖముతో మలమును తిందువు. నీ ముఖము నెవరు బూజింపరు. నీతోకను బూజింతురు' అని గోవును, 'అబద్ధము చెప్పితివి గావున లోకమున నిన్నెవ్వరు బూజింపరు' అని బ్రహ్మ ను

నాశబ్దము శపించినది. మఱియు విష్ణువునకు "నీవు సత్యము చెప్పితివి. కావున నిన్నంతట బూజింతురు" అని వరమిచ్చెను.

తదుపరి బ్రహ్మ, విష్ణువు లిరువురు లింగమును స్తుతియించిరి. దానిచే బ్రసన్నుడై యాలింగము నుండి యొక జటాజూటమూర్తి బయటికి వచ్చెను. "మిమ్ములను సృష్టిజేయ బంపితిని. ఏల కలహింప దొడగితిరి?" అని జటాజూటమూర్తి యడుగగా "బ్రహ్మ, విష్ణువు లిరువురును మేము సామగ్రి లేక యెట్లు సృష్టిజేయగలము?" అనిరి. అంతట మహాదేవుడు తన జటనుండి యొక భస్మపు ముద్దను దీసి వారికిచ్చి "వెళ్ళుడు. దీనినుండి సమస్త సృష్టిని జేయుడు" అని యాదేశించెను. (ఇది శివుని సృష్టి.)

ఆహా! యెంత బాగున్నది? ఈ పురాణములను నిర్మించినవారి నడుగవలయును. అయ్యా! సృష్టికి బూర్వము సృష్టితత్త్వములు పంచమహాభూతములు లేని సమయమున బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుల శరీరములు, లింగము, గోవు , మొగలి వృక్షము, భస్మపుటుండ యివియన్నియు నెటనుండి వచ్చినవి? మీతాతగారి యింటినుండి సృష్టింపబడి పంపబడినవా?"

(భాగవతపురాణసృష్టి)

శివపురాణమునందు వలెనే భాగవతమునందును విష్ణువు నాభినుండి కమలము, నాకమలమునుండి బ్రహ్మ, బ్రహ్మదక్షిణపాదాంగుష్ఠమునుండి స్వాయంభువుడు. వామపాదాంగుష్ఠమునుండి శతరూపారాణి, లలాటమునుండి రుద్రుడు, మరీచ్యాది దశపుత్రులు, వారినుండి పదిమంది ప్రజాపతులు, వారికి బద ముగ్గురు పుత్రికలు, వారికి గశ్యపునితో వివాహము, వారిలో దితినుండి దైత్యులు, దనువునుండి దానవులు, నదితినుండి యాదిత్యులు, వినతనుండి పక్షులు, కద్రువనుండి పాములు, సరమానుండి కుక్కలు, నక్కలు మున్నగునవి, యితరస్త్రీల నుండి యేనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు, గాడిదెలు, గేదెలు, గడ్డిగాదము, తుమ్మలు మున్నగు కంటక వృక్షములు పుట్టినవి.

వహ్వారే! వహ్వా! ఈ భాగవతకర్త బుద్ధివైశద్యము నేమనవలయును? అరేభాయీ! ఇట్టి యసత్య విషయములను వ్రాయుటలో గొంచెము సిగ్గు బిడియమైనను గలుగలేదా? పూర్తిగ గన్నులు మూత పడినవా? గ్రుడ్డివాడ వైతివా? స్త్రీ పురుషుల రజోవీర్య సంయోగమువలన మనుష్యశరీరము లేర్పడును. అంతియకాదు, పరమేశ్వరుని సృష్టిక్రమమునకు విరుద్ధముగా బశువులు పక్షులు సర్పాదు లెట్లు పుట్టును? ఎన్నడును బుట్టవు. ఏనుగు, ఒంటె, సింహము, కుక్క, గాడిదె, వృక్షాదులును స్త్రీ గర్భాశయమున నెట నుండగలవు? సింహము మున్నగు క్రూరజంతువులు పుట్టి తల్లి దండ్రులను దినివేయలేదా? మఱియు మనుష్య శరీరమునుండి పశువులు, పక్షులు, వృక్షాదులు పుట్టుట యెట్లు సంభవమగును?

వీరిచే వ్రాయబడిన యిట్టి మిక్కిలి యసంభవ విషయములకు సంబంధించిన లీలలు నేటికిని మానవలోకమును భ్రమలో నుంచియున్నవి. ఇది యెంతటి దుఃఖకర విషయము! ఈ పచ్చి యబద్ధము లను నంధులగు పోపులు, నంతకంటెను గన్నులుండియు జూడని వారిశిష్యులు నేటికిని జదివి-చదివించి, విని-వినిపించుచున్నారు. ఇంతకంటె నాశ్చర్యమేముండును? వీరు మనుష్యులా? లేక యింకెవరైననా? ఈ భాగవతాదులను రచించువారు గర్భమునందో, లేక జన్మించుటయే తడవుగా నేల చావరైరి? లేక జన్మించు క్షణములలోనైన నేల చావరైరి? ఏలయన నట్లు చచ్చియున్న నీ పోపుల నుండి తప్పించుకొని యార్యావర్త దేశము దుఃఖముల పాలు కాకుండెడిది.

ప్రశ్న :- ఈ విషయములలో విరోధము లేదు. ఏలయన వివాహమెవనిదైన వాని గీతములు పాడ బడును, అన్నట్లు విష్ణువును స్తుతి చేయదలచినపు డతనిని బరమేశ్వరుడనియు మిగిలిన వారిని దాసు లనియు నట్లే శివుని స్తుతించు నపుడతడు పరమేశ్వరుడు మిగిలినవారతని దాసులు నని స్తుతియించుటలో

దోషమేమున్నది? పరమేశ్వరుని మాయలో నన్నియు జరుగవచ్చును. మనుష్యులనుండి పశ్వాదులను, పశ్వాదులనుండి మనుష్యులనుత్పత్తి పరమేశ్వరుడు చేయగలుగును. చూడుడు! కారణము లేకయే సృష్టి యంతయు జేసినాడు. అతనిచే ఘటితము-కానిది యేమున్నది? ఏది చేయదలచిన నది చేయగలడు.

ఉత్తరము :- ఓ యమాయకులార! వివాహమున బాటలు పాడువారతని నందఱకంటె గొప్పచేసి మిగిలినవారిని జిన్నలను జేయుటగాని, నిందించుటగాని, యతని నందఱి తండ్రిని గాని చేయరు గదా? 'పోపుజీ! చెప్పండి. నీవు భట్టువా? వందిమాగధులు చారణులు ననువారికంటెను నెక్కువ గప్పాలు గొట్టువాడవా? కాదా? ఎవనివెంట బడితే వానినే యందఱకంటె గొప్పచేయుదువా? ఎవనితోనైన విరోధము కలిగిన వాని నందఱకంటె నీచు నొనరింతువా? అవును. నీకు సత్యాసత్యములతో ధర్మముతో నేమి ప్రయోజనమున్నది? ఛలియు, గపటియునైన మనుష్యునియందు మాయ యుండును. అట్టివారినే మాయావి యందురు. పరమేశ్వరునందు ఛలకపటాదులుండవు. కావున మాయావి యని యతని ననరు. ఆదిసృష్టి యందు గశ్యపున కతనిపత్నులందు బశుపక్ష్యాదులున్నగునవి జనించిన నేడు పుట్టవేల? కావున బూర్వ మెట్లు సృష్టిక్రమము వ్రాసియుంటిమో యదియే సరియైనది.

పోపున కీక్రింది వాక్యమువలననే భ్రమకలిగి దారితప్పి యుండవచ్చునని యనుమానింపవలసి వచ్చుచున్నది. 'తస్మాత్ కాశ్యప్య ఇమాః ప్రజాః (శత. ౭.౫.౧.౫). అని శతపథవాక్యము. ఈ సృష్టి యంతయు కశ్యపునిచే జేయబడినది. కశ్యపః కస్మాత్ పశ్యకో భవతీతి, నిరు. సృష్టికర్తయగు పరమేశ్వరునకు గశ్యపుడని పేరు. కారణమేమన, నతడు పశ్యకుడు. 'పశ్యతీతి పశ్యః, పశ్య ఏవ పశ్యకః'. భ్రమరహితుడై చరాచరాత్మక జగత్తును, జీవులను వారి కర్మలను సకలవిద్యలను నున్నవియున్నయట్లు చూచును. తెలిసికొనును. కావున బరమేశ్వరుడు పశ్యకు డనబడును. కశ్యపుడు పశ్యకు డెట్లయ్యెనన. మహాభాష్యకర్త 'ఆద్యన్త విపర్యయశ్చ' వాక్యమువలన 'కశ్యప' శబ్దములోని ఆది 'క' అంతమునకు, అంతిమ 'ప' వర్ణమును మొదటికి మార్చిన కశ్యపుడు - పశ్యకుడగును. పాపము పోపు కీయర్థము తెలియక చెంబెడు భంగు పొట్టకెక్కించి సృష్టివిరుద్ధములు వ్రాయుటలో జెప్పుటలో దనజన్మము నష్టము చేసికొనెను.

(మార్కండేయపురాణము - రక్తబీజుడు)

మార్కండేయ పురాణపు దుర్గాపాఠమునందు దేవి శరీరమునుండి తేజస్సు వెడలి యొక దేవి యయ్యెను. ఆమె 'మహిషాసురు'ని జంపెను. రక్తబీజుని శరీరమునుండి యొక రక్తబిందువు భూమిపై బడి యందునుండి రక్తబీజుని సదృశుడు మఱియొకడు పుట్టుట యిట్లే జగత్తంతయు రక్తబీజునితో నిండిపోయి రక్తపుటేర్లు ప్రవహించుట మున్నగు గప్పాలెన్నో వ్రాయబడియున్నవి.

రక్తబీజునితో జగత్తంతయు నిండిపోయినపుడు దేవి, యామె సింహము, సేన యందఱు నెక్కడుండిరి? రక్తబీజులు దేవికి దూరదూరమున నుండిరి అందురేని జగత్తంతయు రక్తబీజునితో నిండిపోయిన బశువులు, మనుష్యులు, పక్షులు మున్నగు ప్రాణులెక్కడ నుండెను. జలజంతువులు మత్స్యములు, మొసళ్ళు మున్నగునవి యెక్కడనుండెను? వనస్పతి మున్నగు వృక్షము లేమాయె? ఇవి యన్నియు దుర్గాపాఠమును రచించువాని యింటిలో దాగుకొనినవా? చూడుడు! ఎంతటి యసంభవమైన గప్పాలు కొట్టినాడో యీమహానుభావుడు! భంగుత్రాగి దానివలన గలిగిన మత్తుప్రవాహమున నోలలాడుచు వ్రాసి యుండును.

(భాగవత సమాలోచన)

ఇక శ్రీమద్ భాగవత మని చెప్పబడు దానిలీలలు వినుడు! బ్రహ్మకు నారాయణుడు 'చతుః శ్లోకీ భాగవతము' నుపదేశించెను.

"జ్ఞానం పరమగుహ్యం మే యద్విజ్ఞానసమన్వితమ్
స రహస్యం తదంగంచ గృహాణ గదితం మయా." (భాగవతము ౨-౯-౩౦.౧)

ఓ బ్రహ్మా! నీవు నా పరమగుహ్యమైన జ్ఞానవిజ్ఞానములతో రహస్యముతోను గూడిన ధర్మార్థకామ మోక్షముల కంగమైనదానిని నా నుండి గ్రహింపుము.

సమీక్ష :- విజ్ఞానయుక్త జ్ఞానమని చెప్పిన తదుపరి జ్ఞానశబ్దమును బరమ-శ్రేష్ఠపదము విశేషణము చేర్చుట వ్యర్థము. గుహ్య విశేషణ ముండుటవలన రహస్య శబ్దప్రయోగము పునరుక్తదోష మగును. ఇట్లు మూలశ్లోకమే యనర్థకమైన నన్యగ్రంథములలో ననర్థకములకు గొఱత యేముండును? భాగవతమునకు మూలమే యబద్ధమైనపుడు వృక్షమేల యబద్ధము కాదు?

(బ్రహ్మకు వరము నిచ్చెను)

"భవాన్ కల్పవికల్పేషు న విముహ్యతి కర్హిచిత్" (భాగవతము. ౧౦.౧౩.౧౪)

'నీవు కల్ప = సృష్టియందును, వికల్ప = ప్రళయమునందు నెన్నడు మోహమును బొందవు' అని యిట్లు వ్రాసి దశమస్కంధమునందే "మోహితుడవై వత్సహరణమును జేసితివి" అని యున్నది. ఈ రెండు విషయములలో నొకటి సత్యము, మఱియొకటి యసత్యము కావలయును. ఇట్లు రెండును నసత్యములే యగును.

(జయ విజయులకు శాపము)

వైకుంఠమున రాగద్వేషములు, ఈర్ష్య, క్రోధము, దుఃఖములు నుండవు. వైకుంఠద్వారమున సనకాదులకు గ్రోధ మెట్లు వచ్చినది? క్రోధము కలిగిన నది స్వర్గము-వైకుంఠ మెట్లగును? కానేకాదు. అప్పుడు జయవిజయులు ద్వారపాలకులుగా నుండిరి. వారికి స్వామియాజ్ఞ తప్పక పాలింపదగినది. వారు సనకాదులను నడ్డగించిరి. ఇం దపరాధ మేమున్నది? అపరాధము చేయనివారికి శాపము తగులనేరదు. 'మీరు పృథివిపై బడిపొండు' అను శాపము వారికి దగిలినది. అనగా నేమి సిద్ధించినది. అక్కడ బృథివి లేదని సిద్ధమగుచున్నది. కాని, ఆకాశము, వాయువు, అగ్ని, జలము నుండియే యుండును. అట్టియెడ ద్వారము, మందిరము నను నివి దేని యాధారమున నున్నవి? మరల జయవిజయులు సనకాదులను స్తుతించిరి. "స్వామీ! మేము మరల వైకుంఠమున కెన్నడు వచ్చెదము?" అంతట వారు "ప్రేమతో నారాయణుని భక్తి జేయుదురేని యేడవ జన్మమునందును; విరోధముతో భక్తి నొనరించిన మూడవ జన్మమునందును వైకుంఠమునకు రాగలరు" అని పలికిరి.

సమీక్ష :- ఇం దాలోచింప వలసిన విషయము. జయవిజయులు నారాయణునకు సేవకులై యుండిరి. వారికి సాహాయ్యము, రక్షణ చేయుట నారాయణుని కర్తవ్యము. తన సేవకుల నెవ్వరైనను నపరాధము చేయకయే దండించినను దుఃఖములు కలిగించినను స్వామి వారిని దండింపవలదా? అట్లు దండింపని స్వామి సేవకుల నెల్లరు బాధింపరాదా? కావున నారాయణుడు జయవిజయుల నాదరించి సనకాదులను దండింప వలసినది. వారు లోపల బ్రవేశింప నేల పట్టుబట్టిరి? ఎందుకు గలహించిరి? శపింప నేల? జయవిజయులకు బదులు సనకాదులే పృథివిపై బడునట్లు దండింప వలసినది. అట్లు చేయుట నారాయణుని కర్తవ్యము న్యాయముగూడ. నారాయణుని యింటిలోనే యింత యన్యాయ మున్నయెడల నారాయణుని భక్తులు సేవకులైన వైష్ణవుల కెట్టి దుర్దశ కలిగినను గలుగవచ్చును.

(వరాహము - హిరణ్యాక్షవధ)

జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులుగా బుట్టిరి. వారిలో హిరణ్యాక్షుని వరాహము చంపినది. ఆ కథ యిట్లున్నది. 'హిరణ్యాక్షుడు పృథివిని జాపవలె జుట్టి తలక్రింద బెట్టుకొని నిద్రించెను. విష్ణువు

వరాహ రూపమును ధరించి యతనిశిరస్సు క్రిందనున్న పృథివిని దనముఖమున ధరింపగా హిరణ్యాక్షుడు లేచెను. ఇరువురకు యుద్ధము జరిగెను. వరాహము హిరణ్యాక్షుని జంపెను.

సమీక్ష :- భూమి గుండ్రముగా నున్నదా? లేక చాపవలె బరచబడి యున్నదా? యని యీరచయితల నడిగిన నేమందురు? ఏమియు జెప్పజాలరు. పౌరాణికులు భూగోళవిద్యకు విరోధులు. హిరణ్యాక్షుడు భూమిని జాపగా జుట్టి తలక్రింద బెట్టుకొని తానెక్కడ బరుండెను? వరాహము దేనిపై బరుగిడి తనకాళ్ళతో వచ్చినది? భూమిని దన ముఖములో నుంచుకొన్నపుడు వారిరువు రెక్కడ యుద్ధము చేసిరి? అక్కడ నెవరికిని నిలుచుండుటకు తావు లేదుకదా? భాగవతాది పురాణములను వ్రాయు పోపుం రొమ్ములమీద నిలబడి వరాహ హిరణ్యాక్షు లిరువురు యుద్ధము చేసియుందురేమో! కాని పోపుగారు ఎక్కడనుండెనో! ఈ వ్రాత యెట్లున్నదన :-

ఒక యసత్యవాది (గప్పాలు గొట్టువాని) యింటికి మఱియొక యసత్యవాది వచ్చి వారిరువురు మాటలాడ నారంభించిన నిట్లే యసంభవ విషయము లొకరితో నొకరు నిరాతంకముగా మాటలాడుదురు. ఆ మాటలకు దల తోక యుండదు. అట్లే యీ కథలు లేవా?

(నృసింహుడు హిరణ్యకశ్యపుడు)

ఇక హిరణ్యకశ్యపుడు, అతని కుమారుడు ప్రహ్లాదుడు. అతడు భక్తుడు. తండ్రి యతనిని జదువుకొనుటకు బడికి బంపెను. అట బ్రహ్లాదు డధ్యాపకులతో 'నాపలకమీద 'రామరామ' అని వ్రాయుడు' అనెను. ఈ విషయము తండ్రికి దెలిసి 'ఓరీ! మన శత్రువు నేల భజించుచున్నావురా' యని యడిగెను. అయినను బ్రహ్లాదుడు మానలేదు. అపు డతనితండ్రి యతనిని బంధించి పర్వతమునుండి క్రిందికి బడ నెట్టించెను. బావిలో వేయించెను. కాని యతని కేమియు హాని కలుగదయ్యె. అప్పుడత డొక యినుపస్తంభము నెఱ్ఱగా గాల్పించి ప్రహ్లాదుని బిలిపించి 'ఓరీ: నీ వీ స్తంభమును బట్టుకొనుము. అది నిన్ను గాల్పకున్న నీ రాముడు సత్యవంతుడగు' ననెను. ప్రహ్లాదుడు దానిని దాకుటకు వెళ్ళుచుండ నతని మనస్సున 'కాలునో లేదో' యను శంక కలిగెను. నారాయణు డాసమయమున నాస్తంభముమీద జిన్నజిన్న చీమలు పంక్తిలో నడుచునట్లు చేసెను. ప్రహ్లాదుడది చూచి కాలదని నిశ్చయించి వెంటనే వెళ్ళి దానిని బట్టుకొనెను. ఆ స్తంభము వెంటనే పగిలి యందుండి నృసింహుడు వెడలెను. హిరణ్యకశ్యపుని బట్టుకొని యతనిపొట్ట చీల్చి చంపి, తదుపరి బ్రహ్లాదుని దననాలుకతో నాకసాగెను. ప్రహ్లాదుని వరము గోరుమనెను. అంతట బ్రహ్లాదుడు తనతండ్రికి సద్గతి కలిగింప గోరెను. నృసింహుడు "నీ యిరువదియొక తరముల పురుషులు సద్గతిని బొందిరి" అని వరమొసంగెను.

సమీక్ష :- చూడుడు! ఇది కూడ మఱియొక గప్పాలుచెప్పు సోదరుని మాటయై యున్నది. కొండొక భాగవతము వినువానిని గాని, చెప్పువానినిగాని, తీసికొనివెళ్ళి కొండమీదనుండి పడవేసిన వానిని రక్షించువా డెవడుండును. వాడు ముక్కలు ముక్కలై చచ్చును. ప్రహ్లాదుని తండ్రి యతనిని జదువుటకు బంపిన నది చెడుపని కాదుగదా! అతడేమి చెడుగు చేసెను? ఆ ప్రహ్లాదు డెంతటి మూర్ఖుడు! చదువుట మాని బైరాగి కావలయునని కోరినాడట. ఇది మంచిపనియా!

మండుచున్న స్తంభముమీద జీమలు పాఱుచుండెను, ప్రహ్లాదు డాకంబమును బట్టుకొనెను. అతడు కాలలేదు. ఈ విషయమును సత్యమని నమ్ము వానిని గూడ మండుచున్న స్తంభమునకు గట్టివేయ వలయును. ఇతడు కాలకపోయిన బ్రహ్లాదుడు కాలలేదని నమ్మవచ్చును. నృసింహుడు కాలలే దనవచ్చును.

ప్రథమమున సనకాదులు "మూడవజన్మమున వైకుంఠము చేరగలరని వరమిచ్చిరి. దానిని మీ నారాయణుడు మఱచి పోయెనా? భాగవతరీతి ననుసరించి బ్రహ్మ ప్రజాపతి కశ్యపుడు హిరణ్యాక్ష హిరణ్య

కశ్యపులు నాల్గవతరము వారగుదురు. ఇరువదియొక్క తరములు ప్రహ్లాదునకు కానే లేదు. మఱి యిరువదియొక్క తరముల పురుషులు సద్గతిని బొందిరి' అనుట యెంత పొరపాటు? మఱియు నా హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులే రావణ కుంభకర్ణులై, శిశుపాలదంతవక్త్రులుగా నుత్పన్నులైరి. అప్పుడు నృసింహుని వర మెక్కడికి కెగిరి పోయెను? ఇట్టి ప్రమాదయుక్త విషయములు ప్రమాదిపురుషులు ప్రమాదముల నొనర్చువారే చెప్పుచుందురు. వినుచుందురు. విద్వాంసులిట్లు చేయరు.

(పూతన అక్రూరులు)

పూతన, యక్రూరుల విషయమును జూడుడు!

"రథేన వాయువేగేన జగామ గోకులం ప్రతి" (భాగవతము-౧౦-౩౮-౨౪)

అక్రూరుడు కంసునిచే బంపబడినవాడై వాయువేగముతో సమానముగ బరుగిడు గుఱ్ఱములు పూన్చిన రథముపై గూర్చుండి సూర్యోదయ సమయమున బయలుదేరి నాలుగుమైళ్ళ దూరముననున్న గోకులమును సూర్యాస్తసమయమున జేరెను. దీని నెట్లు నమ్మవలయును. నాలుగుమైళ్ళ దూరము వాయువేగముతో బోవు గుఱ్ఱములు సాయంకాలము వఱకు నెక్కడ బరువెత్తుచుండెను? భాగవతము రచించువాని చుట్టు పరిక్రమ చేయుచుండి యుండవచ్చును. లేదా మార్గమును మఱచి యక్రూరుడు, గుఱ్ఱములను నడుపు సారథియు భాగవతకర్త యింట గుఱ్ఱపెట్టి నిద్రపోయి యుండవచ్చును.

పూతన శరీర మాఱుక్రోసుల వెడల్పు, చాలక్రోసుల పొడవునని వ్రాసియున్నది. శ్రీకృష్ణుడామెను జంపి మధుర-గోకులము మధ్య పడవేసెను. అప్పుడు మథుర, గోకులములు రెండు నాపూతనశవము క్రింద నణగిపోయి యుండవలయును. వీనిమధ్య పోవుగృహముకూడ దానిక్రింద బడి పాతాళమున కేగి యుండును.

(అజామీళుని కథ)

మఱియు నజామీళుని కథయు విచిత్రముగ వ్రాయబడి యున్నది. ఆతడు నారదుడు చెప్పినందున దనపిల్లవానికి నారాయణుడని పేరు పెట్టుకొనెను. అజామీళుడు చచ్చునపుడు తన పుత్రుని బిలిచెను. మధ్యలో నారాయణుడు వచ్చి నిలుచుండెను. వైకుంఠవాసియైన యీనారాయణున కీమాత్రమైనను జ్ఞానము లేదా? 'ఈతడు నన్ను బిలుచుట లేదు. తన కొడుకును బిలుచుకొనెను' అని కూడ తెలియదా! నారాయణ మాహాత్మ్యమిట్టిదియే యైన నేడు నారాయణ నామస్మరణము జేయువారి దుఃఖములను బాప నారాయణు డేలరాడు? ఇది సత్య మగునెడల జైళ్ళలో శిక్షల ననుభవించువారు నారాయణ స్మరణ జేసి జైళ్ళనుండి యేల తప్పించుకొనరు?

ఇట్లే సుమేరుపర్వతపు బరిమాణము కూడ జ్యోతిషశాస్త్రమునకు విరుద్ధముగా వ్రాయబడినది. మఱియు ప్రియవ్రతరాజు యొక్క రథచక్రపు గాడివలన సముద్రము లేర్పడినవట. నలువదితొమ్మిది కోట్ల యోజనములు పృథివియట. ఇట్టి మిథ్యావిషయములకు సంబంధించిన గప్పాలు లెక్కకు మిక్కిలిగ భాగవతమునందు వ్రాయబడియున్నవి.

(భాగవతకర్త బోబదేవుడు)

ఈ భాగవతము బోబదేవునిచే రచింపబడినది. అతని సోదరుడు జయదేవుడు గీతగోవిందమును రచించెను. చూడుడు. అతడు తన హిమాద్రి నామక గ్రంథమున నీశ్లోకములు వ్రాసియున్నాడు 'శ్రీమద్ భాగవత పురాణమును నేనే వ్రాసియున్నాను' ఆ లేఖకు సంబంధించిన మూడు పేజీలు మాదగ్గఱ నుండెను. వానిలో నొక్కటి యెక్కడనో పోయినది. ఆ పత్రమునందలి శ్లోకాశయముల ననుసరించి మేము శ్లోకములు రచియించి యీక్రింద వ్రాసితిమి. చూడదలచినవారు హిమాద్రిగ్రంథమున జూడుడు.

"హేమాద్రేః సచివస్యార్థే సూచనా క్రియతేఽధునా
స్కంధాధ్యాయకథానాం చ యత్ప్రమాణం సమాసతః" (౧)
"శ్రీమద్భాగవతం నామ పురాణం చ మయేరితమ్
విదుషా బోపదేవేన శ్రీకృష్ణస్య యశోన్వితమ్" (౨)

నష్టపత్రమున నిట్టివే శ్లోకము లుండెను. అనగా రాజుయొక్క మంత్రి హేమాద్రి బోపదేవు పండితునితో 'నాకు నీవు వ్రాసిన శ్రీమద్‌భాగవతము సంపూర్ణముగ విను నవకాశము లేదు. కావున సంక్షేపముగ శ్లోకబద్ధమైన సూచీ పత్రము వ్రాయుము. దానిని జూచి శ్రీమద్‌భాగవత కథను సంక్షేపముగ దెలిసికొనగలను' అనెను. అందువలన నిమ్నలిఖిత సూచీపత్రమును ఆబోపదేవుడు రచించెను.

దానినుండియే యానష్ట పత్రమున బదిశ్లోకములు పోయినవి, పదునొకండవ శ్లోకమునుండి యిట వ్రాయుచున్నాము. ఈ నిమ్నాంకిత శ్లోకము లన్నియు బోపదేవుని రచనలే.

"బోధయన్తీతి హి ప్రాహుః శ్రీమద్భాగవతం పునః
పంచ ప్రశ్నాః శౌనకస్య సూతస్యాత్రోత్తరం త్రిషు, (౧౧)
"ప్రశ్నావతారయోశ్చైవ వ్యాసస్యానిర్వృతిః కృతాత్
నారదస్యాత్ర హేతూక్తిః ప్రతీత్యర్థం స్వజన్మ చ." (౧౨)
"సుప్తఘ్నం ద్రౌణ్యభిభవస్తదస్త్రాత్ పాండవా వనమ్
భీష్మస్య స్వపద ప్రాప్తిః కృష్ణస్య ద్వారికాగమః." (౧౩)
"శ్రోతుః పరీక్షితో జన్మ ధృతరాష్ట్రస్య నిర్గమః
కృష్ణమర్త్యత్యాగసూచా తతః పార్థమహాపథః" (౧౪)
'ఇత్యష్టాదశభిః పాదై రధ్యాయార్థః క్రమాత్ స్మృతః
స్వపరప్రతిబంధోనం స్ఫీతం రాజ్యం జహౌ నృపః." (౧౫)
"ఇతి వైరాజ్ఞో దార్ఢ్యోక్తౌ ప్రోక్తా ద్రౌణిజయాదయః." (౧౬)
'ఇతి ప్రథమస్కంధః'

ఇట్టి పండ్రెండు స్కంధములకు సూచీపత్ర మీవిధముగనే బోపదేవ పండితుడు వ్రాసి హేమాద్రి సచివున కిచ్చెను. వీని విస్తారము చూడదలచిన వారు బోపదేవుడు వ్రాసిన హేమాద్రిగ్రంథమున జూడ వచ్చును.

ఇట్లే యితరపురాణముల లీలలు నెఱుగవలయును. అన్నియు నిట్లే యొకదానిని మించి మఱియొకటి యసత్యములతో నిండియున్నవి.

చూడుడు. శ్రీకృష్ణునిచరిత్రము మహాభారతమున నుత్తమముగ నున్నది. అతని గుణకర్మస్వభావము లాప్తపురుషునివలె నున్నవి. అందు శ్రీకృష్ణుడు జన్మించినది మొదలు మరణపర్యంతము కొంచెము కూడ చెడ్డకర్మ చేసినట్లందు వ్రాయలేదు. అత డనర్థాచరణ మేమియు జేసినట్లు లేదు.

ఈ భాగవతకారు డనుచితముగ దనయిష్టము వచ్చినట్లు దోషములు శ్రీకృష్ణున కాపాదించెను. పాలు, పెరుగు, వెన్న దొంగిలించినట్లు వ్రాసినాడు. ఇట్లే కుబ్జాదాసీ సమాగమము, పరస్త్రీలతో రాసక్రీడలు మున్నగు మిథ్యాదోషము లెన్నియో శ్రీకృష్ణున కంటగట్టెను. వీనిని జదివి చదివించి, విని వినిపించి యితర మతములవారు శ్రీకృష్ణుని మిక్కిలిగా నిందించుచున్నారు. ఈ భాగవతమే లేకున్న శ్రీకృష్ణునివంటి మహాత్ములకు నింద యేల కలుగును?

(శివపురాణము-జ్యోతిర్ లింగములు)

శివపురాణమున బంద్రెండు జ్యోతిర్లింగములు వ్రాయబడియున్నవి. ఆ కథయు సర్వథా యసంభవము. పేరుకు జ్యోతిర్లింగములు. ప్రకాశము లేశమాత్రమును లేదు. రాత్రియందు దీపములేక యేదియు గనిపింపదు. ఇది యంతయు పోపులీల తప్ప మఱి యేమియు లేదు.

ప్రశ్న :- వేదము జదువు సామర్థ్యము లేనపుడు స్మృతి, దానిని జదువలేనపుడు శాస్త్రము, నదియు జదువు సామర్థ్యము లేనపుడు పురాణములు వ్రాయబడినవి. అవియును కేవలము స్త్రీ శూద్రులకొఱకు. వీరికి వేదములు చదువుటకు వినుటకు నధికారము లేదు. కావున నివి వ్రాయబడినవి.

ఉత్తరము :- ఇదియు నసత్యమే. చదివి చదివించుటవలన సామర్థ్యము కలుగును. మఱియు వేదములు చదువుటకు వినుటకు నెల్లరకు నధికారమున్నది. గార్గి మున్నగు స్త్రీలు, ఛాందోగ్యమున జానశ్రుతి శూద్రుడును రైక్వమునియొద్ద వేదమును జదివెను. వేదములను జదువుటకు వినుటకు మనుష్యమాత్రున కధికార మున్నట్లు యజుర్వేదమున నిరువది యాఱవ యధ్యాయమున రెండవమంత్రమున స్పష్టముగా వ్రాయబడి యున్నది. అయినను నిట్టి మిథ్యాగ్రంథములను వ్రాసి సత్యగ్రంథముల నుండి జనులను విముఖులను జేసి తమవలలో వేసికొని స్వప్రయోజనములను సాధించుకొనువారు మహాపాపులేంకారు?

(గ్రహములు-సమీక్ష)

గ్రహముల చక్రము నెట్లు నడపిరో చూడుడు. ఎందఱో విద్యావిహీను లీచక్రమున జిక్కుకొని యున్నారు.

"ఆకృష్ణేన రజసా" (౧) సూర్యునిమంత్రము. యజు. ౩౩-౪౩
"ఇమం దేవమసపత్నం సువధ్వమ్" (౨) చంద్రమంత్రము. యజు. ౬-౪౦
"అగ్నిర్ మూర్ధా దివః కకుత్పతిః (౩) మంగళుని మంత్రము. యజు. ౩-౧౨
"ఉద్బుధ్యస్వాగ్నే" (౪) బుధుని మంత్రము యజు. ౧౫-౫౪
"బృహస్పతే అతియదర్యో" (౫) బృహస్పతి మంత్రము. యజు. ౨౬-౩
"శుక్రమంధసః" (౬) శుక్రమంత్రము. యజు. ౧౯-౭౫
'శన్నోదేవీరభిష్టయ" (౭) శనిమంత్రము. యజు. ౩౬-౧౨
"కయా న శ్చిత్ర ఆభువ" (౮) రాహుమంత్రము. యజు. ౨౭-౩౯
"కేతుం కృణ్వన్న కేతవే" (౯) దీనిని కేతుకండికయందురు. యజు. ౨౯-౩౭

(౧) ఇది సూర్యుడు భూమి నాకర్షించు మంత్రము. (౨) రాజ గుణవిధాయక మంత్రము. (౩) అగ్నికి సంబంధించినది. (౪) యజమానునికి సంబంధించినది. (౫) విద్వాంసునకు (౬) వీర్యము నన్నమునకు (౭) పరమేశ్వరునకు (౮) మిత్రునకు (౯) జ్ఞానగ్రహణవిధాయకమునకు సంబంధించిన మంత్రములు. ఇవి గ్రహములకు వాచకములు కావు. అర్థముల నెఱుగక భ్రమజాలమున జిక్కియున్నారు.

(గ్రహఫలములు)

ప్రశ్న :- గ్రహములకు ఫల మున్నదా లేదా?

ఉత్తరము :- పోపులీలలకునంటి ఫలము లేదు. సూర్యచంద్రుల కిరణములద్వారా యుష్ణత, శీతత లభించును. లేక, ఋతువులవలె గాలచక్రమునకు గల సంబంధమువలన దమప్రకృతుల కనుకూలముగాను, ప్రతికూలముగాను సుఖదుఃఖములకు నిమిత్తము లగును.

కాని, పోపులీల వారు చెప్పునట్లు కాదు. "వినండి సావుకారుగారూ! యజమానులారా! వినుడు! సూర్యుడు, చంద్రుడు మున్నగు క్రూర గ్రహములు మీయింట నేడు ప్రవేశించినవి. రెండున్నర సంవత్సరములకుగాను శనిపాదమున బ్రవేశించినాడు. మీకు బెద్దవిఘ్నము కలుగనున్నది. ఇల్లు వాకిలి విడిపించి పరదేశమున ద్రిప్పును. నీవు గ్రహపూజనము చేయించిన జపము, పాఠము పూజ జరిపించిన దుఃఖములనుండి తప్పుకొందువు."

ఇట్లు సంకటములు తెచ్చిపెట్టువారితో నిట్లనవలయును. 'ఓపోపు గారూ! మీకు గ్రహముల కేమి సంబంధము? గ్రహము లేమి వస్తువులు?' (అంతేకాని వారు చెప్పినట్లు విని పూజాపాఠములలో బడి ధనవ్యయము చేసికొని దుఃఖింపరాదు.)

పోపు : దైవాధీనం జగత్ సర్వం మన్త్రాధీనాశ్చ దేవతాః,
తే మంత్రా బ్రాహ్మణాధీనాః తస్మాద్ బ్రాహ్మణదైవతమ్"

చూచితిరా! యెట్టి ప్రమాణములున్నవో! సమస్త జగత్తు దేవతల యధీనమున నుండును. దేవతలు మంత్రాధీనమున, మంత్రములు బ్రాహ్మణాధీనమున నున్నవి. కావున బ్రాహ్మణుడు దేవత యనబడును. ఏలయనగా, నేదేవత నైనను మంత్రబలముతో పిలిచి ప్రసన్నుం జేసి కార్యమును సిద్ధింప జేయునధికారము మాకే యున్నది. మాలో మంత్రశక్తి లేనిపక్షమున మీవంటి నాస్తికులు మమ్మీలోకముననే యుండనీయరు.

సత్యవాది :- దొంగలు, బందిపోటు దొంగలు కుకర్మముల నాచరించువారు మీదేవతల యధీనమున నుందురా? దేవతలే వారిచేత దుష్టకర్మల నాచరింప జేయుచుందురేమో! అది సత్యమగుచో మీ దేవతలకు రాక్షసులకు భేదమేమియు నుండదు. మీ యధీనమున మంత్రము లున్నవి. కావున మీ యిష్టము వచ్చినది చేయింప గలుగుదురు. అట్లైన మంత్రములతో దేవతలను వశపఱచుకొని రాజుల కోశముల నుండి దేవతలద్వారా ధనమును దెప్పించుకొని మీయిండ్ల నింపుకొని సుఖముగా గూర్చుండి యానందము నేల యనుభవింపరు? ఇంటింటికి శనిగ్రహాదుల నెపముతో దైలదానము, ఛాయాదానములు పట్టుటకేల కాలికి బలపములు కట్టునట్లు తిరిగి తిరిగి బాధల పాలగుచున్నారు? ఎవనిని మీరు కుబేర దేవత యందురో వానిని వశపఱచుకొని కావలసిన ధనము సంపాదించుకొనవచ్చును గదా! పాప మీదరిద్రుల నేల దోచుకొనుచున్నారు?

(గ్రహముల ప్రసన్నత-అప్రసన్నత)

మీకు దానమొసంగిన గ్రహములు ప్రసన్నములై యీయకున్న నప్రసన్నము లగునెడల మాకు సూర్యాది గ్రహముల ప్రసన్నతను నప్రసన్నతను బ్రత్యక్షముగా జూపుడు. ఒకనికి నెనిమిదింట సూర్య చంద్రులు మఱియొకనికి మూడింట నున్నపుడు వారినిరువురిని జ్యేష్ఠమాసమున బాగుగ గాలియున్న భూమిమీద చెప్పులు తొడుగుకొనక నగ్నపాదములతో నడపించి చూపుడు. ఎవనిపై బ్రసన్నులో వానిశరీరము కాళ్ళు తపింపక- కాలక యుండవలయును. అప్రసన్నుని కాళ్ళు శరీరము కాలవలయును గదా? అట్లే పుష్యమాసమున పూర్ణిమ రాత్రియందు నగ్నశరీరముతో నారుబైట బరుండ బెట్టుము. ఒకరికి జలి తగిలి, రెండవవానికి జలివేయకున్నప్పుడు గ్రహములు క్రూర ప్రసన్నదృష్టి కలిగి యుండునని మాకు బ్రత్యక్షమగును. మఱియు నాగ్రహములు మీకేమైన బంధువులా? వారినుండి మీకు బత్రములు వచ్చిపోవుట లున్నవా? లేక మీరు వారిదగ్గఱకు గాని, వారు మీదగ్గఱకుగాని వచ్చిపోవుచుందురా? మీకు మంత్రశక్తి యున్న మీరు స్వయముగా ధనాఢ్యులో రాజులో యేలకారు? మీ శత్రువులను మీరేల వశపఱచుకొనరు?

వేదములయు నీశ్వరునియు నాజ్ఞలను బాలింపక వేదవిరుద్ధముగా లీలలు చేయువారే నాస్తికులు.

గ్రహదానము మీకిక దానిని గ్రహ మెవరిని బట్టినదో వారే తినిన నేమగును? అటుల గాదు. మాకు దాన మిచ్చినందుననే గ్రహము ప్రసన్నమగు నందురేని మీరు గ్రహములను గుత్తకు దీసికొంటిరా? తీసికొనిన నాగ్రహములను సూర్యాదులను మీయిండ్లకు బిలిచి వారిద్వారా కాలి భస్మమై చావండి.

వాస్తవ మేమన సూర్యాదిలోకములు జడములు. అవి యెవరికిని సుఖముకాని, దుఃఖముగాని కలిగింపవు. కాని గ్రహదానోపజీవులైన మీరే మూర్తిమంతములైన గ్రహములు. కారణమేమన గ్రహశబ్దమున కర్థము కూడ మీకే సంగత మగును. "యే గృహ్ణన్తి తే గ్రహాః" గ్రహించువారే గ్రహములు.

రాజులు, ధనవంతులు, సేతులు సావుకారులు, దరిద్రులు నెవరైనను వీరిదగ్గఱ మీచరణములు చేర నంతవఱకు వారికి నవగ్రహముల స్మరణమైనను గలుగదు. మీరు సూర్యాదిగ్రహరూపములు ధరించి వారిపైన బడనంతవఱకు వారి కేచింతయు నుండదు. మీరు వారిపైబడి వారినుండి యేమియు గ్రహింపక యూరక పోరు. ఎవడేని మీమాటలకు లోబడకున్న నాస్తి కాదిపదములతో వారిని నిందింతురు.

పోపు :- చూడుడు. జ్యోతిష్యప్రత్యక్షఫలము. ఆకాశముననుండు సూర్యచంద్రులను రాహుకేతువులు గ్రహించుటను ముందుగానే మేము చెప్పుదుము. ఈ గ్రహణములు ప్రత్యక్షమైనట్లు గ్రహఫలములును బ్రత్యక్షములగును. ధనాఢ్యుడు, దరిద్రుడు, రాజు, రంకు, గ్రహములవలననే కదా! సుఖదుఃఖముల ననుభవించుచున్నారు.

సత్యవాది :- ఈ గ్రహణరూప ప్రత్యక్షఫలము గణితవిద్యకు సంబంధించినది. ఫలితవిద్యకు సంబంధించినది కాదు. గణితవిద్య సత్యమే. ఫలితవిద్య స్వాభావిక సంబంధము వలన గలుగునది కాక మిగిలిన దంతయు మిథ్యయే. అనులోమ ప్రతిలోమ గతుల ననుసరించి తిరుగు పృథివియు, జంద్రునియు గణితమువలన సూర్యచంద్ర గ్రహణము లెప్పు డెక్కడ నెంతమేరకు గలుగునో స్పష్టముగా దెలియును ఎట్లన :-

"ఛాదయత్యర్కమిందుర్ విధుం భూమి భా," ఇది సిద్ధాంతశిరోమణి వాక్యము. (౫-౪)

ఇట్లే సూర్యసిద్ధాంతము మున్నగు వానియందును గలదు. సూర్యునకు భూమికి మధ్య చంద్రుడు వచ్చినపుడు సూర్యగ్రహణము, సూర్యచంద్రులకు మధ్య భూమి వచ్చినప్పుడు చంద్రగ్రహణము జరుగును. అనగా జంద్రుని ఛాయ భూమిమీదను, భూమిఛాయ చంద్రుని మీదను బడును. సూర్యుడు ప్రకాశస్వరూపు డగుటవలన నతని కెదురుగా నెవనిఛాయయు బడదు. ప్రకాశవంతుడగు సూర్యునకు దీపమునకు నెదురుగా నిలుచున్నపుడు మన శరీరముల ఛాయలు విపరీతదశలో బడుచుండును. అట్లే గ్రహచ్ఛాయలు నెఱుంగునది.

లోకమున జనులు వారుచేయు కర్మలవలన ధనాఢ్యులు దరిద్రులు రాజులు రంకులు నగుదురు కాని గ్రహములవలన గారు. పలువురు జ్యోతిష్కులు తమపుత్రపుత్రికల వివాహములు గ్రహముల లెక్కలు వేసి తదనుసారముగ జేయుచుందురు. మఱి యేల విరోధములు పుత్రికలు విధవలగుటయు బుత్రులు విధురు లగుటయు జూచుచున్నాము. ఫలము సత్యమగుచో నిట్లేల యగుచున్నది? కావున గర్మలగతి-ఫలము సత్యము. గ్రహగతి సుఖదుఃఖ భోగమునందు గారణముకాదు. గ్రహములు, పృథివియు నాకాశమున బహుదూరమున నున్నవి. కర్త, కర్మలతో నీ గ్రహములకు సంబంధము సాక్షాత్తుగ నేమియు లేదు. కర్మ, కర్మ ఫలములకు సంబంధము కర్తయు భోక్తయు నగుజీవునితో సాక్షాత్తు సంబంధమున్నది. కర్మఫలముల ననుభవింప జేయువాడు పరమాత్మయై యున్నాడు.

మీరు గ్రహముల ఫలము నంగీకరింతురేని దీనికి సమాధానము చెప్పుడు? ఏక్షణమున నొకమనుష్యుని జన్మము కలుగునో యెవనికి మీరు ధ్రువాత్రుటి నంగీకరించి జన్మపత్రము సిద్ధము

చేయుదురో, యాక్షణమున భూగోళమున నితరుల జన్మలు కలుగవా? కలుగునా? కలుగ వందురేని యబద్ధము. కలుగునందురేని యొక చక్రవర్తివలె భూగోళమున రెండవచక్రవర్తి రాజేలకాడు? మీరేమి చెప్పగలరు? అవును. ఈ లీల యంతయు మాయుదరములు నింపుకొనుటకే యని చెప్పగలరు. అది యెవరైనను నంగీకరింపవచ్చును.

(గరుడపురాణము)

ప్రశ్న :- గరుడపురాణముకూడ నబద్ధమేనా?

ఉత్తరము :- అవును. అబద్ధమే.

ప్రశ్న :- మరణించిన జీవునిగతి యేమి యగును?

ఉత్తరము :- అతనికర్మ లెట్లుండునో యట్టిగతి.

ప్రశ్న :- యముడు రాజు. చిత్రగుప్తుడు మంత్రి. అతని కింకరులు మిక్కిలి భయంకరులు. కాటుక పర్వతములవంటి శరీరములు కలవారు. వారు జీవుని బట్టుకొని తీసికొని వెళ్ళుదురు. జీవుని పాపపుణ్యముల ననుసరించి నరక స్వర్గములందు వారిని బడవేయుదురు. అందులకు దానపుణ్యాము, శ్రాద్ధతర్పణములు, వైతరిణినది దాటుటకు గోదానాదులు చేయుదురు. ఇవి యన్నియు నసత్యము లెట్లు కాగలవు?

ఉత్తరము :- ఇవి యన్నియు పోపులలీలల గప్పాలు. యమలోకమునకు దూరముననున్న జీవులు యమలోకమునకు వెళ్ళుదురు. అక్కడ యముడు చిత్రగుప్తుడు వారికి న్యాయమొనర్తురు. యమలోకమున నున్నజీవులు పాపములు చేసిన వారిని శిక్షించుటకు మఱియొక యమలోకము నంగీకరింపవలయును. అక్కడ నింకొక యముడు న్యాయాధీశుడు కావలయును.

పర్వతములంత శరీరములు గలవారైన యమకింకరులు కనబడరేల? మరణించు జీవుల యిండ్ల ద్వారములు చిన్నవిగా నుండును. పర్వతశరీరు లాజీవులను దీసికొని వెళ్ళుటకు వారియొక్క వ్రేలైన నాయింట దూరజాలదు కదా? వారు సూక్ష్మశరీరధారులు కాగలుగుదు రందురేని, పర్వతాకారపు శరీరములందలి పెద్దపెద్ద యెముకలన్నియు పోపుగారి యింటిలో నుంచి సూక్ష్మశరీరధారు లగుదురా? అరణ్యమున నగ్ని యేర్పడి యరణ్యమును దహించునపుడు వేలకొలది, లక్షలకొలది జీవులు చనిపోవును కదా. ఆ జీవుల నందఱను గొంపోవుట కక్కడ వేలాది యమకింకరులు వెళ్ళిన నటచీకటి, కటికచీకటి యేర్పడవలయును కదా! వారు జీవులను బట్టుకొనుటకు ద్వరపడి పరుగిడుదురు. అప్పుడు పరస్పర మొకరికొకరు కొట్టుకొని పర్వతశిఖరములవంటి వారియవయవములు విఱిగి గరుడ పురాణము జదువువారి కొంపలమీద బడిన వానిక్రిందబడి యణగిమణగి యాపోపులు-పురోహితులు చచ్చిపోరా? పడిపోయినయిండ్లు వానిపైన యమకింకరుల శరీరావయవములు పడి దారులుకూడ లేక జనులు నానావస్థల పాలగుదురేమో!

శ్రాద్ధతర్పణ పిండదానాదులు, చనిపోయిన జీవుల కెన్నడును జేరవు. కాని మృతకులకు ప్రతినిధులైన పురోహితుల యిండ్లలోను వారి యుదరములందును హస్తములందును జేరును. వైతరణీ నదిని దాటించుట కిచ్చుగోవుకూడ బురోహితుని యింటికో లేక కసాయి యింటికో చేరును. దానమిచ్చిన గోవిక్కడనే యుండును. వైతరణికి బోదుగదా! మృతజీవు డెవరితోకను బట్టుకొని నదిని దరించును? మృతుని చేతులిక్కడే యగ్నిలో దగులబడును. భూమిలో బూడ్చబడును. జీవునకు జేతులుండవు. తోక యెట్లు పట్టుకొనును?

ఈ విషయమున నిట నొకదృష్టాంతము మిక్కిలి యుపయుక్తమగును. ఒక కృషీవలు డుండెను. ఆ రైతు గృహమున నొకగోవు రోజుకు నిరువది సేర్లపాల నిచ్చునది యుండెను. దానిపాలు మిక్కిలి స్వాదిష్ట

ములుకూడ. అప్పుడప్పు డాయింటి పురోహితునకుగూడ నాపాలరుచి తెలియుచుండెడిది. ఆ కృషీ వలుని ముసలితండ్రి చచ్చిపోయినపు డీయావునే సంకల్పము చేయించవలయుననియు నాపురోహితు డాశపెట్టుకొనియుండెను.

కొలది దినములలోనే దైవయోగమువలన నారైతు తండ్రి చావు సమయము సమీపించెను. అతని మాటలు పోయినవి. అతనిని మంచము మీదనుండి దించి భూమిపై పరుండబెట్టిరి. ప్రాణములు బోవనుండెను. అప్పుడారైతు ఇష్టమిత్రులు సంబంధులు గూడ వచ్చియుండిరి. అప్పుడు పురోహితుడు వచ్చి యజమానుని బిలిచి 'అయ్యా! ఇప్పుడింక నాలస్యము చేయకుడు. మీ తండ్రిగారిచేత గోదానము చేయించండి' అనెను. ఆ రైతు రూప్యములు పదితీసి తండ్రిచేతిలో బోసి ' సంకల్పము చదవండి' అని పురోహితుని గోరెను. "వహ్వ! యజమానుడా! ఇదేమిటి! ఇప్పుడు సాక్షాత్తుగా గోవును దానము చేయవల యును. నీతండ్రి మరల మరల చావడు కదా! ఈ సమయమున బాగుగా బాలనిచ్చు వయస్సులో నున్న గోవును దానము చేయవలయును" అని యనెను.

రైతు :- 'అయ్యా! మాదగ్గఱ నొక్కటే గోవున్నది. అది లేకున్న మాపిల్లలను నిర్వహించుట కవకాశము లేదు. కావున దాని నీయను. దానికి బదు లిరువది రూప్యములు తీసికొని సంకల్పము చెప్పు డనెను. ఈ రూప్యములతో మఱియొక పాలనిచ్చు నావును గొని తెచ్చుకొనుడు' అనెను.

పురోహితుడు :- వహ్వ! నీవు నీ తండ్రికంటె గోవు నెక్కువగా జూచుచున్నావా? నీ తండ్రిని వైతరణిలో ముంచి దుఃఖములపాలు చేయదలచితివా? మంచి సుపుత్రుడవే దొరికితివయ్యా!

అప్పుడు చుట్టపక్కాలుకూడ బురోహితుని పక్షమే వహించిరి. పురోహితుడు ముందుగానే వారిని సిద్ధపఱచి యుంచెను. అప్పుడును వారికి సైగజేసి తనపక్షమున కనుకూలము చేసికొనెను. అందువలన నెల్లరు బట్టుబట్టి యాగోవును బురోహితునకు సంకల్పము జేయించిరి. ఆ సమయమున రైతేమియు ననక యందఱియిష్ట ప్రకారము చేసి మెదలక యూరకుండెను. తండ్రి చనిపోయినాడు. పురోహితుడు గోవు నుబలాటముతో బాలపాత్రతో బాటు తనయింటికి దీసికొనిపోయి గోవును గట్టివేసి పాలపాత్ర నింటనుంచి రైతునింటికి వెళ్ళెను. శవమువెంట శ్మశానమునకు వెళ్ళి దహనకర్మ చేయించెను. అక్కడ కూడ దనలీల లేవో చేసి తదుపరి దశగాత్రములు సపిండీకరణాదులు చేయించి యారైతును బాగుగ దోచుకొనెను. అతడే కాక మహాబ్రాహ్మణులుకూడ నతనిని వదలరైరి. ఇతర కుక్షింభరులును దమ పొట్టల నింపుకొనిరి. ఇట్లు కావలసిన క్రతువు లన్నియు ముగియువఱకు నిరుగుపొరుగు వారినుండి పాలు సంపాదించుకొని తనయిల్లు గడపుకొనెను.

పదునాల్గవ దినమున రైతు పురోహితు నింటికి వెళ్ళెను. అప్పుడే పురోహితుడు పాలుపిండి పాత్ర నిండగా లేచి యింటిలోనికి వెళ్ళ సిద్ధపడు చుండెను. ఇంతలో రైతు వెళ్ళెను. అతనిని జూచి 'ఓహో మీరా రండి కూర్చుండుడు" అని పురోహితుడు పలికెను.

రైతు :- పురోహితబాబా ! మీరుకూడ నిటురండి.

పురో :- ఇదిగో వచ్చితిని. పాలపాత్ర నింటబెట్టి వత్తును.

రైతు :- కాదు. కాదు దుగ్ధపాత్రకూడ నిటు తెండు. ఆ మాటలు విని పురోహితుడు పాత్రతో దగ్గఱకు వెళ్ళి యట బాత్ర నుంచెను.

రైతు :- ఏమయ్యా! ఇంత యబద్ధములా చెప్పునది?

పురో :- నేనేమి యబద్ధము చెప్పితినయ్యా!

రైతు :- నీవు గోవును దీసికొనిన దెందుకు చెప్పు!

పురో :– నీ తండ్రిని వైతరణీ నదిని దాటించుటకు దీసికొంటిని.

రైతు :– మంచిది. మఱినీవు గోవును వైతరణీ నదీతీరమున కేలపంపలేదు? మేము విశ్వసించి, నీవు గోవును బంపితివని యుంటిమి. కాని నీవు గోవును నీయింటనే కట్టివేసి యుంచితివి. మాతండ్రి నదిలో నెన్నిమునకలు వేసియున్నాడో! యెంత దుఃఖమును బొందెనో తెలియదుకదా!

పురో :– అరేభాయి! అట్లెందుకు జరుగును? నీవు చేసినదాన ప్రభావమువలన నట మఱియొక గోవు మీతండ్రిని దాటించి యుండును.

రైతు :– వైతరణీ నది యిట కెంతదూరమున నేవైపున నున్నది?

పురో :– సుమా రిరువది కోట్ల క్రోసుల దూరమున నుండును. నలువది తొమ్మిది కోట్ల యోజనములు పృథివియే యున్నది. వైతరణీ నది దక్షిణనైరృత్యదిశలో నున్నది.

రైతు :– ఇంతదూరము నీపత్రముకాని, టెలిగ్రాంకాని పోయి యటనుండి తిరుగు జవాబు వచ్చి యుండవచ్చును గదా! అక్కడ బుణ్యగోవు మాతండ్రికి లభించినదా? మాతండ్రి నదిదాటినట్లు జవాబు వచ్చియుండును గదా! కొంచెము చూపండి.

పురో :– మాదగ్గఱ గరుడపురాణలేఖ తప్ప మఱిజాబు –టెలిగ్రాంలు ఏమియు నుండవు.

రైతు :– ఈ గరుడపురాణము సత్యమని మేమెట్లు నమ్మవలయునో చెప్పండి.

పురో :– అందఱు నమ్మినట్లే మీరు నమ్మండి.

రైతు :– ఈ పుస్తకమును మీ పూర్వులు మీ జీవికకొఱకు రచించి యుందురు. తండ్రికి బుత్రుని మించిన ప్రియు డింకొక డుండడు. నా తండ్రి నాకు బత్రమో టెలిగ్రామో పంపినపుడు నేనే స్వయముగా గోవు నటకు తీసికొని వెళ్ళుదును. నా తండ్రిని నదిని దాటించిన తరువాత గోవును దెచ్చుకొని నేను నా పిల్లలు పాలు త్రాగుదుము. 'దుగ్ధపాత్ర నిటు తెమ్ము' అని పాత్రను దీసికొని గోవును దూడను వెంట గొనిపోయి తనయింట జేర్చెను.

పురో :– దానమిచ్చిన వస్తువును నీవు మరల దీసికొందువా? నీవు సకుటుంబముగా నశింతువు.

రైతు :– నోరు మూసికొనవయ్యా! ఈ పదునాలుగు దినములు పాలు లేక మేము పడినపాట్లకు బదులుగా నింకేమైన నీయొద్ద వసూలు చేయవలసి వచ్చును. నోరెత్తకు. అప్పుడు పురోహితుడు నోరు మూసెను. ఇట్లే యెల్లరు సిద్ధపడిననాడు పోపులీల లన్నియు నశించును.

దశగాత్ర పిండమువలన దశాంగములు, సపిండీకరణము వలన శరీరముతో జీవుడు కలిసి యంగుష్ఠమాత్ర శరీరముతో యమలోకమునకు వెళ్ళునందురు. అది సత్యమైన యమదూతల రాక మరణసమయమున వ్యర్థమగును. పదమూడు రోజులకు దరువాత వెళ్ళవలయును. శరీరము సిద్ధమగు నెడల స్త్రీ పుత్రాదుల మోహముతో నతడు మరల తిరిగి రాడేల?

ప్రశ్న :– స్వర్గమున నేమియు లభింపదు. ఇక్కడ జేయుదానమే యట లభించును. కావున దాన మెల్లరు జేయవలయును.

ఉత్తరము :– అటులైన మీ స్వర్గముకంటె నీ లోకమే యుత్తమ మనదగును. ఇక్కడ ధర్మశాలలు దానము చేయువారు నున్నారు. ఇష్టమిత్రు లున్నారు. కులమువా రప్పుడప్పుడు నిమంత్రించి బాగుగ సత్కరింతురు. మంచిమంచి గుడ్డలు లభించును. నీవు చెప్పినదానినిబట్టి స్వర్గమున నేమియు లభింపదు కదా! ఇట్టి నిర్దయ, కృపణ, దరిద్ర స్వర్గమున బోపులు, పురోహితులు పోయి దుఃఖముల ననుభవింతురుగాక! పుణ్యాత్ములకు ధర్మాత్ముల కట నేమి పని యున్నది?

(యముడు-యమలోకము)

ప్రశ్న :- మీరు చెప్పునట్లు యమలోకము, యముడు లేకున్న మరణించి జీవు లెటకు బోవుదురు? వారికి న్యాయ మొనరించువారెవరు?

ఉత్తరము :- మీ గరుడపురాణములో జెప్పినది ప్రమాణము కాదు. కాని వేదోక్తము మాత్రము నిజము. 'యమేన', 'వాయునా' 'సత్యరాజన్' (ఋ.౧౦-౧౪-౮, అథర్వ. ౨౦-౧౪౧-౨. యజు. ౨౦-౪) అను నీ వేదవాక్యములవలన, యముడన వాయువని నిశ్చయ మగుచున్నది. మరణించిన మీదట జీవుడు వాయువునందు నంతరిక్షమున నుండును. పక్షపాతరహితుడు, సత్యకర్తయునగు పరమేశ్వరుడే ధర్మరాజు. అతడే యెల్లరకు న్యాయము చేయువాడు.

ప్రశ్న :- నీవు చెప్పిన దానినిబట్టి గోదానాదు లెవ్వరికి నీరాదు. ఇతర దానపుణ్యములు కూడ జేయరాదని స్పష్టమగుచున్నది.

ఉత్తరము :- ఈ నీ కథనము సర్వథా వ్యర్థము. ఏలయనగా సుపాత్రులైన పరోపకారపరులైన వారికి బరోపకారార్థము బంగారము, వెండి, రత్నములు, ముత్యములు, నన్నజలములు, స్నానపానాదులు నన్నియు దప్పక దానము చేయవలయును. కాని దుష్టులకు కుపాత్రుల కెన్నడు నీరాదు.

ప్రశ్న :- కుపాత్ర సుపాత్ర లక్షణము లేమిటి?

ఉత్తరము :- ఛలి. కపటి-వంచకుడు, స్వార్థపరులు, విషయలంపటులు, కామక్రోధలోభమోహములతో గూడినవారు, పరులకు హాని గలిగించువారు, లంపటులు, మిథ్యావాదులు, నవిద్వాంసులు, కుసంగులు, నలసులు, దాతను మాటిమాటికి యాచించువారు, మొండికివేసి కూర్చుండువారు, హఠముతో యాచించు వారు, నెంత యిచ్చినను సంతోషింపనివారు, ఇయ్యనివారిని నిందించువారు, శపించువారు-తిట్టువారు, తనదగ్గఱ బదార్థము లున్నను లేదని యాచించువారు, పలుమార్లు కోరినదిచ్చి యెన్నడేని యొకసారి యీయకున్న శత్రుత్వము వహించువారు, పైకి సాధువేషము ధరించి జనులను దారితప్పించి మోసగించువారు, వెంటబడి వేధించి వేధించి తమ స్వార్థమును సిద్ధము చేసికొనువారు, రాత్రింబవళ్ళు యాచనలోనే ప్రవృత్తులై యుండువారు, నిమంత్రించినపుడు మిక్కిలిగా భంగు మున్నగు మాదక ద్రవ్యములను సేవించి యటుపై నితరుల పదార్థముల నమితముగా మెక్కువారు, తదుపరి యున్మత్తులై ప్రమాదముల నొనర్చువారు, సత్యమార్గమును విరోధించి తన ప్రయోజనము కొఱకు నసత్యమార్గము నవలంబించువారు, అట్లే తన శిష్యులను దనకే సేవచేయవలయును, కాని యితరులు మంచివారైనను వారికి సేవచేయరాదని బోధించువారు, సద్విద్యాది ప్రవృత్తిని విరోధించువారు, నిదియంతయు నసత్యము జగత్తు మిథ్యయని చెప్పి, స్త్రీ పురుష , మాతాపితలు-సంతానము రాజా-ప్రజ యిష్టమిత్రులు నను నీజగత్తునకు సంబంధించిన వ్యవహారములందు నప్రీతిని గలిగించువారు, దుష్టోపదేశములు చేయువారు గుపాత్రులుగా నెంచవలయును.

బ్రహ్మచారులు, జితేంద్రియులు, వేదాది విద్యలను జదువువారు, చదివించువారు, సుశీలురు, సత్యవాదులు, పరోపకారప్రియులు, పురుషార్థపరులు, నుదారులు, విద్యను ధర్మమును నిరంతరము నభివృద్ధి పఱచువారు, ధర్మాత్ములు, శాంతులు, నిందాస్తుతులలో హర్షశోకములను బొందనివారు, నిర్భయులు, ఉత్సాహవంతులు, యోగులు, జ్ఞానులు, సృష్టిక్రమమునకు, వేదాజ్ఞలకు, ఈశ్వరునిగుణకర్మస్వభావములకు ననుకూలముగా వర్తించువారు, న్యాయపద్ధతితో గూడినవారు, పక్షపాతరహితులు, సత్యోపదేశకులు సత్యశాస్త్రములను జదివి జదివించువారిని బరీక్షించువారు; ఒకరి మెచ్చుకోలుకు బ్రయత్నింపనివారు, ప్రశ్నలకు యథార్థములైన సమాధానములు చెప్పువారు, తన యాత్మతో బోల్చుకొని యితరుల సుఖ

దుఃఖములను హాని లాభములను గుర్తించువారు, అవిద్యాది క్లేశము హఠదురాగ్రహాదులు లేనివారు, అవమానము నమృతసమానముగను, మానమర్యాదలను విషసమానముగ నెంచువారును, సంతోషముగలవారు ఎవరేది ప్రీతితో నెంత యిచ్చిన నంతతోనే ప్రసన్నులగువారు, ఆపత్కాలమున యాచించినపు డియ్యని వారినిగూర్చి దుఃఖము కుచేష్టలు చేయనివారు, తిరస్కరించినను మిన్నక యుండువారు, అటనుండి చివాలున లేచి తిరిగివచ్చి వారిని నిందింపకుండువారు, సుఖము ననుభవించువారితో మిత్రత, దుఃఖితులపై గరుణ, పుణ్యాత్ములతో నానందము, పాపా త్ములయెడ నుదాసీనత అనగా రాగద్వేష రహితత గలిగి యుండువారు, సత్యము నంగీకరించి సత్యమును జెప్పుచు సత్యము నాచరించువారు, నిష్కపటులు, ఈర్ష్యాద్వేషరహితులు, గంభీరాశయముగల సత్పురు షులు, ధర్మయుక్తులై యెల్లప్పుడు నధర్మమునకు దూరముగా నుండువారు, తమ తనుమనోధనములను బరోపకారము చేయుటకు నర్పించువారు, ఇతరులకు సుఖము చేకూర్చుటలో దమ ప్రాణముల నర్పించువారు, నిట్టి శుభగుణయుక్తులు సుపాత్రులని యెంచవలయును.

కాని దుర్భిక్షము మున్నగు నాపత్కాలమున నన్నజలములకు, వస్త్రములకు, నౌషధములకు బథ్య పానములకు నధికారులెల్లరు బ్రాణిమాత్రులగుదురు. ఉపర్యుక్త వస్తువులను దానము చేయుటలో నాపత్కాలమున వివక్షత జూపరాదని భావము

(దాతలభేదములు)

ప్రశ్న :- దాత లెన్నివిధములుగ నుందురు?

ఉత్తరము :- ముప్విధములుగా నుందురు. ఉత్తములు, మధ్యములు, నధములు.

ఉత్తమదాతలు :- దేశకాలపాత్రముల నెఱిగి సత్యవిద్యను ధర్మము నున్నతిచేయుట యను పరోపకారార్థము దానముచేయువా రుత్తమదాత లనబడుదురు. కీర్తికొఱకో స్వార్థముకొఱకో దానము చేయువారు మధ్యమ దాతలు. తన యుపకారము కొఱకుగాని, యితరుల యుపకారము కొఱకుగాని దానము చేయక వేశ్యాగమనాదులందు మిథ్యాస్తుతిజేయు భట్టులకు దానము చేయువాడు నీచ-నికృష్టదాత యనబడును. దానము చేయునపుడు తిరస్కారము నపమానము మున్నగు కుచేష్టలు చేయరాదు. పాత్ర కుపాత్రల భేదము కొంచెమైనను నెంచక, యన్ని ధాన్యముల నొకేధరకు నమ్మువానివలె, వివాదము, కలహము, జేయుచు, నితర ధర్మాత్ములను దుఃఖపెట్టి తాను సుఖపడుట కిచ్చువాడు నధమదాత యగును. అనగా బరీక్ష నొనర్చి విద్వాంసులైన ధర్మాత్ములకు దాన మిచ్చువాడు-ఉత్తమదాత యగును. పరీక్షచేసియో చేయకయో తన ప్రశంసకొఱకు దానము చేయువాడు మధ్యమదాత యగును. పరీక్ష నొనర్పక కన్నులు మూసికొని నిష్ఫలదానము చేయువాడు నీచదాత యగును.

ప్రశ్న :-దానఫల మిక్కడ లభించునా పరలోకముననా?

ఉత్తరము :- సర్వత్ర లభించును.

ప్రశ్న :- ఫలములు స్వయముగా లభించునా? ఎవ్వడైన నిచ్చువాడున్నాడా?

ఉత్తరము :- ఫలముల నిచ్చువా డీశ్వరుడు. లోకమున దొంగకాని, బందిపోటు దొంగకాని స్వయముగ గారాగారమునకు వెళ్ళడు. రాజట్టి వారిని జైలుకు బంపును. అట్లే ధర్మాత్ములను రక్షించును. సుఖముల ననుభవింపజేయును. హంతకులనుండియు దొంగలు తోడుబోతుల నుండియు వారిని దప్పించి సుఖమున నుంచును. అట్లే పరమేశ్వరుడు నెల్లర పుణ్యపాపములకు వలయు సుఖదుఃఖరూప ఫలములను దగినట్టు లనుభవింపజేయును.

ప్రశ్న :- గరుడపురాణాది గ్రంథములు వేదార్థములను వేదమును బలపఱచునా లేదా?

ఉత్తరము :- బలవఅవవు. పైపెచ్చు వేదములకు విరుద్ధముగా నడచును. తంత్రములుకూడ వేదవిరుద్ధములే. కొండొక మనుష్యుడు లోకమున నొకనికి మిత్రుడై మిగిలిన ప్రపంచమునకు శత్రు వగునట్లు పురాణములు తంత్రములు నంగీకరించువాడు నగును. ఏలయనగా నీగ్రంథములన్నియు బరస్పర మొకరితో నింకొకరికి విరోధమును గలిగించునవై యున్నవి. విద్వాంసున కీగ్రంథముల నంగీకరించుట పనికాదు. అది యవిద్వాంసుని పని.

(ఏకాదశ్యాదివ్రతములు)

చూడుడు. శివపురాణమున త్రయోదశి సోమవారము, ఆదిత్యపురాణము నందు రవి, చంద్రఖండ మున సోమగ్రహమువారు, మంగళ, బుధ, బృహస్పతి, శుక్ర (వారములు) శనైశ్చర, రాహు, కేతువునకు సంబంధించినవారు, వైష్ణవ ఏకాదశి, వామనద్వాదశి, నృసింహుని లేక అనంతుని చతుర్దశి, చంద్రుని పౌర్ణమాసి, దిక్పాలకుల దశమి, దుర్గానవమి, వసువులయష్టమి, మునులసప్తమి, కార్తికస్వామిషష్ఠి నాగ పంచమి, గణేశచతుర్థి, గౌరీతృతీయ, అశ్వినీకుమారుని ద్వితీయ, ఆశాదేవిప్రతిపద్, పితరులకు నమా వాస్య. పురాణముల ననుసరించి యీదినములన్నియు నుపవాస దినములు. ఈ వారములందును తిథుల లోను నన్నపానములను గ్రహించువారు నరకమునకు బోవుదురని యంతటను వ్రాసియున్నది.

కావున పోపులు, వారిశిష్యులు నేవారమునందును నే తిథియందును భోజనము చేయరాదు. అన్నపానములను గ్రహించినవారు నరకమునకు బోవుదురు. నిర్ణయసింధు, ధర్మసింధు, వ్రతార్కము మున్నగు గ్రంథములను బ్రమాదీపురుషులు వ్రాసియున్నారు. ఆ గ్రంథములలో నొక్కొక్క వ్రతము నకు వారు కల్పించిన దుర్దశ యింతయంత గాదు. ఎట్లన, శైవులు దశమీవిద్ధ ఏకాదశియందును, కొందఱు ద్వాదశియందును నేకాదశీవ్రతము నాచరింతురు. అనగా, నీ పోపులీల లెంత గొప్పవిచిత్రములో చెప్ప జాలము. ఆకలితో నుండుటలోను వాదవివాదములే చేయుదురు.

ఏకాదశీవ్రతమును నడపిన వానిలో నతని స్వార్థము తప్ప దయ యొకింతయు లేదు. 'ఏకాదశ్యా మన్నే పాపాని వసంతి' పాపములన్నియు నేకాదశినా డన్నములో నుండునని వారు చెప్పుచున్నారు. ఈ విషయమున- 'నెవని పాపము లన్నములో నుండును. నీ పాపములా? నీ తండ్రి పాపములా? ఎవరి పాపము లన్నియు నన్నములో నుండును' అని యీపోపు, నడుగవలయును. ఆ దినమున బాపము లన్నియు వెళ్ళి యన్నమున వసించిన లోకమున నెవరికి నెట్టి దుఃఖము కలుగరాదు. ఏకాదశినాడు దుఃఖము లెవరికి గలుగవా? కలుగుచునే యుండును. ఉపవాస మొనర్చువారు, తిండి లేనివా రాకలిబాధతో బీడితులగుచునే యుందురు. దుఃఖము పాపఫలము. కావున నాకలితో బాధపడుట, చచ్చుట పాపము.

ఏకాదశీ వ్రతమాహాత్మ్యము గొప్పగా జేసినారు. దీని కథను జదివి వినిపించి జనులను మోసగింతురు. అందొక గాథ :-

'బ్రహ్మలోకమున నొక వేశ్యయుండెను. ఆమె యేదో కొంచెమపరాధము చేసెను. 'నీవు పృథివిపై బడిపొమ్ము' అని ఆమెకు శాపము గలిగెను. 'నేనెట్లు స్వర్గమునకు మరల రాగలుగుదును' అని యామె ప్రార్థించెను. శాపకర్త 'ఎవడైన నేకాదశీ వ్రతఫలమును నీకిచ్చిన నప్పుడు నీవు స్వర్గమునకు రాగలుగుదువు' అని శాపవిమోచనమును జెప్పెను. అంతట నామె విమానముతోబాటు కొండొక నగరమున భూమిపై బడినది. అక్కడి రాజు 'నీవెవతెవు?' అని యడిగెను. ఆమె తన వృత్తము నంతటిని వినిపించెను. 'ఎవడేని నాకు నేకాదశీవ్రత ఫలమును దానముచేసిన నేను మరల స్వర్గమునకు బోవుదు' ననియు జెప్పెను.

రాజు నగరమున నన్వేషింప జేసెను. ఏకాదశీవ్రతము చేయువారెవ్వరును దొరకరైరి. కాని, యొకనా డొక శూద్రభార్యాభర్తలలో గలహ మేర్పడెను. కోపమువలన నాస్త్రీ యా దినమున రాత్రింబవళ్ళేమియు

దినక యుండెను. దైవయోగమువలన నాదిన మేకాదశియై యుండెను. 'నేనెఱిగి యెఱిగి యేకాదశీ వ్రతము చేయలేదు. ఆకస్మికముగా నే నా నాడేమియు దినక యుంటిని' అని యామె రాజభటులకు జెప్పెను. రాజభృత్యు లీవార్తను రాజుకు వినిపించిరి. ఆమెను రాజసన్నిధికి దెచ్చిరి. అంతట రాజామెతో 'నీవీ విమానమును దాకుము' అనెను. ఆమె విమానమును దాకగా నావిమానము పైకెగిరిపోయెను.

ఇది తెలియకయే చేసిన యేకాదశీవ్రతఫలము. ఇక దెలిసి యేకాదశీవ్రతము చేసిన నెంతఫలము కలుగునో యూహించుడు! దాని కంతమే యుండక పోవచ్చును. అజ్ఞానులార! ఇది నిజమని నమ్ము చున్నారా! నమ్ముదురేని యొకపని చేయుడు. స్వర్గమున దాంబూలపు విడెములు దొరకవు. ఏకాదశీ వ్రతములు చేయువారు తమవ్రతఫలముచే నొక్క విడెమును స్వర్గమునకు బంపుమనుడు. చాలము. ఒక్క విడెము పంపగలిగిన లక్షలాది విడెముల నక్కడకు నెగుమతి చేయవచ్చును. మేమును నేకాదశీ వ్రతమును జేసి లాభము బొందుదుము. ఇది నిజము కాదని తెలిసిన గనీసము మీరు క్షుద్ బాధల నుండి యైన దప్పించుకొన వీలగును. మే మీవిధముగా మిమ్ము రక్షించిన వార మగుదుము.

నెలకు రెండువంతున సంవత్సరమున కిరువది నాలు గేకాదశులు. వీని కన్నింటికి వేఱువేఱు నామకరణములు చేసినారు. ఒకటి ధనదా-ఏకాదశి, ఇంకొకటి కామదా, మఱియొకటి పుత్రదా, వేఱొక దానికి నిర్జలా, ఎందఱోదరిద్రులు, నెందఱో కాముకులు-కోరికలు గలవారు, నెందఱో నిర్వంశులు-సంతానరహితులు నేకాదశీవ్రతములు చేసిచేసి వృద్ధులై పోయిరి. చచ్చిపోయిరి కూడ. కాని దరిద్రులు ధనవంతులు కాలేదు. ఎవరి కోరికలు తీఱలేదు. ఎవరికి సంతానము కలుగలేదు. ఒక్క ఘడియ సేపు నీరు త్రాగకున్న మనుష్యులు వ్యాకులు లగు జ్యేష్ఠమాసపు శుక్లపక్షమున నిర్జలేకాదశీవ్రత మాచరించువారు మహాకష్టము ననుభవింతురు. విశేషముగ బంగాల్ ప్రాంతపు విధవాస్త్రీ లందఱు నీవ్రతము చేసి మిక్కిలి దుర్దశల పాలగుచుందురు.

ఈ వ్రతమును గుఱించి మహత్తును బెంచి వ్రాయువాడు నిర్దయుడైన కసాయివంటివా డనవలయును. వాని కొకింతయు దయ లేదని యెంచవలయును. అతనికి గొంచెమైన దయయుండి యున్న జ్యేష్ఠమాసపు టేకాదశికి సజల యేకాదశియనియు, బుష్యమాసపు టేకాదశికి నిర్జల యేకాదశి యనియు బేరుపెట్టి యుండవలసినది. అందువలన గొంత బాధ తగ్గి యుండెడిది. కాని యాపోపులకు దయతో నేమున్నది? వ్రత మాచరించువారు పడుబాధలతో నతని కేమియు ప్రయోజనము లేదు. వారు చచ్చినను బ్రతికినను, నేమైనను సరియే తన పొట్ట మాత్రము నిండవలయును.

గర్భవతి, సద్యోవివాహిత స్త్రీలు, పిల్లలు, యువకులు నెన్నడు నుపవాసము చేయరాదు. ఎవరికేని యజీర్ణము కలిగినను, నాకలి కలుగకున్నను నట్టివా రుపవాసము చేయవలయును. అదియు బంచదారతో జేసిన షర్బత్తు త్రాగి కాని, పాలు త్రాగికాని చేయుట మంచిది.

ఆకలి కలిగియుండి తిననివాడు, నాకలిలేక తినువాడు నిరువురు రోగసాగరమున మునిగి దుఃఖముల పాలగుదురు. ఇట్టి వ్రతములు వ్రాయువారు చెప్పుమాటలకు గాని వ్రాతలకుగాని ప్రమాణ మేమియు లేదు.

(లుప్తవేదశాఖలలో మూర్తిపూజ యున్నది)

ఇప్పుడు గురుశిష్యుల మంత్రోపదేశములను గూర్చియు, మతమతాంతరముల చరిత్రను గూర్చియు జెప్పెదము.

ప్రశ్న :- మూర్తిపూజలను సమర్థించు సంప్రదాయకు లిట్లు ప్రశ్నింతురు. వేదము లనంతములు. ఋగ్వేదమునకు ౨౧, యజుర్వేదమునకు ౧౦౧, సామవేదమునకు ౧౦౦౦, అథర్వవేదమునకు ౯

శాఖలున్నవి. వీనిలో గొలది శాఖలే లభించుచున్నవి. మిగిలినవి లుప్తమైనవి. ఈ లోపించిన వానిలోనే మూర్తిపూజ, తీర్థమాహాత్మ్యమునకు బ్రమాణముండి యుండును. అట్లు కానిపక్షమున బురాణములలో వీని వర్ణన మేల యుండును? కార్యమును జూచి కారణము నూహించునట్లు, పురాణములలోని మూర్తిపూజ వర్ణనరూపకార్యములనుబట్టి వేదమూలము నేల యూహింపరాదు? అని యందురు.

ఉత్తరము :- వృక్షశాఖలు, వృక్షసదృశములుగా నుండును. కాని విరుద్ధముగా నుండవు. ఎన్ని వేద శాఖలు లభ్యమగుచున్నవో వానిలో నెక్కడను మూర్తిపూజకాని, స్థలజలరూప తీర్థముల వర్ణనగాని లభించుట లేదు. అట్టియెడ లుప్తశాఖలలో మాత్రమేల యుండును. నాలుగువేదములు పూర్ణముగ లభించుచనే యున్నవి. శాఖలు వానికి విరుద్ధములుగా నెన్నడు నుండవు. ఇప్పుడు లభించు మూలవేదములకు విరుద్ధముగా మూర్తిపూజాదులకు బ్రమాణములు లభించు గ్రంథము లేవియు వేదశాఖలని రుజువు చేయజాలరు. ఇది యిట్లుండ బురాణములు లుప్తవేదశాఖల మూలకము లనుట సరికాదు. సంప్రదాయ ప్రవర్తకులు పరస్పర విరుద్ధము లయిన గ్రంథములు వ్రాసిరనుట నిక్కువము.

వేదములు పరమేశ్వర కృతములని యంగీకరింతువేని, ఆశ్వలాయనాది ఋషికృత గ్రంథములను వేదము లని యేల యంగీకరించుచున్నారు? కొమ్మలను, నాకులను జూచి వటవృక్షమో, యామ్రవృక్షమో తెలిసికొన వీలగునట్లు, ఋషులచే మునులచే వ్రాయబడిన వేదాంగములవలన, నాలుగు బ్రాహ్మణములవలనను, అంగములు, ఉపాంగములు, ఉపవేదములు మున్నగు వానివలనను వేదార్థములు తెలియబడును. అందువలననే యీగ్రంథములను శాఖలుగా నంగీకరింతురు. వేదములకు విరుద్ధములైనవి ప్రమాణములు కావు. అనుకూలమైనవి యప్రమాణములు కావు.

అదృష్టములు-లుప్తములైన శాఖలలో మూర్తిపూజాదులకు బ్రమాణము లుండి యుండునని మీరూహింతురేని వేఱొకరు, లుప్తశాఖలలో వర్ణాశ్రమ ధర్మములు వానివ్యవస్థ ప్రస్తుత మున్నదానికి విరుద్ధముగా నుండియుండవచ్చును. అనగా నంత్యజులకు, శూద్రులకు బ్రాహ్మణాది నామములుండి యుండుననియు, నగ్లేయగమ్యము గమ్యమనియు, నకర్తవ్యము కర్తవ్యమనియు, మిథ్యాభాషణాదులు ధర్మమనియు, సత్యభాషణాదు లధర్మములనియు వ్రాసి యుండియుండునని కల్పింతురేని మీరేమి సమాధానము చెప్పుదురు. నేనిప్పుడు మీ కా సమాధానమే చెప్పవలసి వచ్చును. మఱియొక సమాధాన మేమున్నది? అనగా వేదములందును, బ్రసిద్ధశాఖలందును బ్రాహ్మణాది వర్ణవ్యవస్థయు, నితరధర్మాధర్మముల వ్యవస్థయు నెట్లో యట్లే లుప్తశాఖలందు నుండి యుండును. వేఱుగా నుండదనియే చెప్పనగును. జైమిని, వ్యాసుడు, పతంజలి మున్నగువారి సమయమువఱకు నన్నిశాఖలు నున్నవా లేవా? అప్పటి కున్నయెడల మీరు వానినెన్నడు నిషేధింపజాలరు. అప్పటికే లేవందువేని యసలుశాఖ లున్నవనుటకు బ్రమాణమేమి?

చూడుడు! జైమిని వ్రాసిన మీమాంసయందు సమస్త కర్మకాండము, పతంజలి యోగశాస్త్రమున సమస్తోపాసనాకాండము, వ్యాసమునికృత శారీరక సూత్రములందు సమస్తజ్ఞానకాండము వేదానుకూలముగా వ్రాయబడి యున్నవి. వానిలో బాషాణాది మూర్తుల పూజకాని, ప్రయాగాది తీర్థముల విషయము నామమాత్రమునకైన వ్రాయలేదు. ఎక్కడినుండి వ్రాయుదురు? వేదములలో నెక్కడైన నున్న వ్రాయక విడుచువారు కారు. కావున లుప్తశాఖలలోను మూర్తిపూజాదులున్నట్లు ప్రమాణము లేదు.

(శాఖలు వేదములు కావు)

ఈ శాఖలన్నియు వేదములు కావు. ఏలయనగా నీ శాఖలలో నీశ్వరకృత వేదముల ప్రతీక లుంచి వ్యాఖ్యయు సాంసారిక జనుల యితిహాసములు నున్నవి. ఇతిహాసాదులు వేదములం దుండవు. వేదము లందు కేవలము మనుష్యుల కుపదేశము చేయబడి యున్నది. ఏమనుష్యుని నామముకూడ నందులేదు.

కావున మూర్తిపూజ యన్నివిధముల ఖండితమే యగుచున్నది.

(మూర్తిపూజవలన మహాపురుషుల నింద)

చూడుడు. మూర్తి పూజవలన శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శివుడు, మున్నగు మహాపురుషుల నిందయు నుపహాసమును జరుగును. గొప్ప మహారాజాధిరాజులు రామచంద్రాదులు వారి స్త్రీలు సీత, యట్లే రుక్మిణి, లక్ష్మి, పార్వతి మున్నగువారు మహారాణులై యుండిరి. కాని వారి మూర్తులను దేవాలయాదులలో నుంచి, పూజారులు వారి పేళ్ళతో భిక్షనడుగుచుందురు. అనగా నా రామచంద్రాదులనే భిక్షుకులను జేయుచున్నారు.

'రండు! రండు! సేఠ్ సావుకారులార! దర్శనము చేసికొనుడు. కూర్చుండుడు. చరణామృతమును గ్రహించండి. కానుక లర్పింపుడు. సీతారాములు, రుక్మిణీకృష్ణులు, లక్ష్మీనారాయణులు, పార్వతీ మహాదేవులు వీరికి మూడు దినములనుండియు బాలభోగములు కాని, రాజభోగములుకాని జరుగలేదు. అల్పాహారము కాని, భోజనముకాని వీరికి బదార్థములు లభింపలేదు. నేడు వీరిదగ్గఱ నేమియు లేదు. సీతా లక్ష్మి మున్నగువారికి గూడ ముక్కుపుడక కూడలేదు. ఓరాణిగారూ! ఓ సేఠానీగారు కొంచెము ముక్కుపుడకలైన చేయించి పెట్టుడు. అన్నాదులను బంపుడు. వీరికి రాజభోగము జరుగును.'

"వస్త్రము లన్నియు జిరిగి పోయినవి. ఆలయపు కోణము లన్నియు బడిపోవుచున్నవి. పైనుండి వర్షము పడినపుడు నీళ్ళు కారుచున్నవి. దుష్టులైన దొంగ లున్నదంతయు దోచుకొని పోయిరి. మిగిలిన వేమైన నున్న యెలుకలు కొట్టివేసినవి. చూడండి! ఎలుక లొకరోజున రామచంద్రుని కన్ను కూడ నెత్తుకొని పోయినవి. మే మేమి చేయగలము! వెండి కన్ను చేయింపలేక గవ్వకన్ను పెట్టితిమి."

రామలీల, రామమండనము చేయింతురు, సీతారాములు, రాధాకృష్ణులు నాట్యము చేయుదురు. రాజు, మహంతు మున్నగువారు వారిసేవకులు నానందముతో గాలము గడుపుచున్నారు. మందిరములలో సీతారాములు, రాధాకృష్ణులు నిలబడియే యుందురు. కాని మహంతు మున్నగు వారు సుఖముగా గూర్చుండి యుందురు. గద్దీలమీద నానుడు దిండ్లు వేసికొని మఱి కూర్చుందురు.

మిక్కిలి వేడిదినములలో-మండువేసంగిలో సీతారాములను లోపల బెట్టి తాళములు బిగించి యుంచెదరు. పూజారులు మహంతులు స్వయముగా మంచిగాలిలో మంచములు బఱచుకొని పరుండెదరు. పలువురు పూజారులు తమ నారాయణుని డబ్బీలో బెట్టి బంధించి, పైన గుడ్డలతో గట్టి కంఠములలో వ్రేలాడ వేసికొని తిరుగుచుందురు. ఆడు కోతులు తమ పిల్లలను గంఠమున జేర్చుకొని తిరుగునట్లు పూజారులు తమ దేవతలను గంఠములలో వ్రేలాడ వేసికొని తిరుగుచుందురు.

ఎప్పుడేని యెవడైన మూర్తిని విఱుగగొట్టిన రొమ్ములు బాదుకుంటూ నేడ్చుచుందురు. "సీతారాములను, రాధాకృష్ణులను, శివపార్వతులను దుష్టులు ఖండితము చేసినారు. ఇప్పుడు మంచి శిల్పిద్వారా సిద్ధము చేయబడిన చలువరాతి మూర్తిని దెచ్చి ప్రతిష్ఠచేసి పూజింపవలయును. ఖండిత మూర్తులను బూజింపరాదు. నారాయణునకు ఘృతము లేక యెన్నడు భోగము జరుగదు. ఎక్కువ లేకున్న గొంచెమైనను బంపుడు." అనునిట్టి మాటలను మూర్తుల విషయమున జెప్పుచుందురు.

రాసమండలము, 'రామలీలా' మున్నగు నుత్సవముల చివర సీతారాములచేతను, రాధాకృష్ణులచేతను అనగా నావేషములు ధరించిన వారిచే యాచనలు చేయింతురు. భిక్షనడిగింతురు. ఇట్టి విషయములన్నియు నెంతటి శోచనీయములో మీరే యాలోచించి చూడుడు.

చెప్పండి, సీతారాములు మున్నగువారు దరిద్రులా? భిక్షుకులా? ఇది యంతయు వారిని నిందించుట, ఉపహసించుట కాక మఱియేమి యగును! సీతారాములు, రాధాకృష్ణులు, శివపార్వతులు నున్న

పుడు వారిని దీసికొని వచ్చి బజారులో గాని, మందిరములలోగాని వారిని నిలబెట్టి పూజారులు "రండు వీరిని దర్శింపుడు. కానుకలు కట్నాలు నర్పించుడు' అని చెప్పిన వారు సహింతురా? వారిని దండింపక విడిచిపెట్టుదురా? అట్టి దండనము పూజారులకు లభింపనందువలననే యిట్టి యనాచారములు ప్రబలినవి. వారివలన దండనము లభింపకున్నను బూజారుల కుకర్మలకు దగిన ఫలములు మూర్తి భంజకులవలన లభించుచునే యున్నవి. ఇక ముందును నిట్లే లభించును. కుకర్మలను విడువనంతవఱకు వీరికీ యాపదలు తప్పవు.

ఆర్యావర్తమునకు ప్రతిదినము కలుగుహాని, పాషాణాది మూర్తిపూజకులకు గలుగు పరాజయమును నీ కుకర్మఫలమే యనుటలో సందేహ మేమి యున్నది? పాపములకు ఫలము దుఃఖము కాక మఱి యేమున్నది? ఈ పాషాణాది మూర్తులపై నుండు విశ్వాసమువలననే మిక్కిలి హాని కలిగినది. ఇది విడువకున్న ప్రతిదినము హాని యధికాధికముగ గలుగుచునే యుండును.

(మారణహోమములు)

వీరిలో వామమార్గులు మిక్కిలి గొప్పయపరాధు లనవలయును. వారు శిష్యులను జేసికొనునపుడు ---"దం దుర్గాయై నమః, భం భైరవాయ నమః, ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే" అను నిట్టి మంత్రముల నుపదేశింతురు. బంగాళాదేశమున విశేషించి యేకాక్షరీ మంత్రమును నుపదేశింతురు. హ్రీం, శ్రీం, క్లీం" ఇవి యేకాక్షరీ మంత్రములు. మఱియు ధనాఢ్యులకు బూర్ణాభిషేకము చేయింతురు.

ఇట్లే దశమహావిద్యల మంత్రములు హ్రాం, హ్రీం, హ్రూం. బగలాముఖ్యైఫట్ స్వాహా!' అక్కడ నక్కడ, 'హుం ఫట్ స్వాహా' (శాబరతంత్రము. ౪౪, ౪౧)

మారణ, మోహన, యుచ్చాటన, విద్వేషణ, వశీకరణాదు లనుప్రయోగము చేయుదురు. కాని యీమంత్రములవలన నేమియు జరుగదు. అంతయు గ్రియలవలన జరుపుదురు. ఎవరినైన జంపుటకు ప్రయోగము చేయునపుడు చేయించు వానినుండి ధనము తీసికొని పిండితోగాని, మట్టితోగాని చంపబడు వాని బొమ్మను జేయుదురు. ఆ బొమ్మకు రొమ్ము, నాభి, కంఠము లందు గత్తులు దూర్చెదరు. కన్నులు, చేతులు, పాదములు వీనియందు మేకులు గొట్టుదురు. ఆ బొమ్మపైన దుర్గనో, భైరవునో గూర్చుండబెట్టి చేతిలో నొక త్రిశూలమును బెట్టి దాని నాబొమ్మహృదయమున లగ్నము చేసి యుంచెదరు. ఒక వేదికను సిద్ధముచేసి దానియందు మాంసము మున్నగు వానిని హోమము చేయుదురు. అక్కడ నెవని జంపదల చిరో వానిదగ్గఱకు సేవకులను బంపి వారిద్వారా యతనికి విషాదులు పెట్టించి చంపు నుపాయములు చేయుచుందురు. తన పురశ్చరణమున నతనిని జంపినచో దనకు భైరవసిద్ధి కలదనియో దేవీసిద్ధి కల దనియో ప్రకటించు కొందురు. "భైరవో భూతనాథశ్చ" అను నిట్టివి పఠింపదొడగుదురు.

మారయ మారయ, ఉచ్చాటయ ఉచ్చాటయ, విద్వేషయ విద్వేషయ, ఛింధి ఛింధి, భింధి భింధి, వశీకురు వశీకురు, ఖాదయ ఖాదయ, భక్షయ భక్షయ, త్రోటయ త్రోటయ, నాశయ నాశయ, మమ శత్రూన్ వశీకురు వశీకురు, హుం ఫట్ స్వాహా.

ఇట్టి మంత్రములను జపింతురు. మద్యమాంసాదుల నిష్టము వచ్చినట్లు సేవింతురు. భ్రుకుటిమధ్య బెద్దబొట్టు పెట్టుదురు. అప్పుడప్పుడు కాళీ మున్నగు దేవతలకొఱకు గొండొక మనుష్యుని జంపి యతని మాంసముతో హోమము జేయుదురు. కొంత వారు తినుచు నుందురు. ఎవడేని భైరవీచక్రమునకు వెళ్ళి యక్కడ మద్యమాంసమును సేవింపకున్న నతనినే చంపి హోమము చేయుదురు. వారిలో 'అఘోరీ' అనువాడు చచ్చిన మనుష్యుని మాంసమును గూడ దినును. 'అజరీబజరీ' చేయువారు మలమూత్రములను సేవించుచుందురు.

(చోలీమార్గము, బీజమార్గము)

చోలీమార్గమువారు బీజమార్గమువారు ననియు నుందురు. చోలీ మార్గమువారు, భూమిలో గాని, మఱియొకచోట గాని గుప్తస్థాన మేర్పఱచు కొందురు. అక్కడ నెల్లరు-స్త్రీలు, పురుషులు, దల్లి, యక్క చెల్లెలు, అన్న, తమ్ముడు కోడలు నను భేదము లేక చిన్నలు పెద్దలు నందఱు చేరుదురు. అందఱు గలిసి మద్యము త్రాగి మాంసము తిందురు. అందొక స్త్రీని నగ్నముచేసి యామె గుహ్యేంద్రియమును బురుషు లెల్లరు బూజింతురు. అట్లే యొక పురుషుని నగ్నునిజేసి యతని గుహ్యేంద్రియమును స్త్రీలెల్లరు బూజింతురు.

కల్లు, సారాయి త్రాగి మత్తిల్లి పోయినపుడు స్త్రీల రవికె (చోలీ) లన్నియు దీసి యొక మట్టిలొట్టిలో వేసి వానిని గలిపి వేయుదురు. తదుపరి యెవరి చేతికి దొరికిన రవికెను-బురుషులు తీసికొని యారవికె యే స్త్రీకి సంబంధించిన దగునో యాస్త్రీ తల్లియైనను, గుమార్తెయైనను, అక్క చెల్లెలు, కోడలు నెవరైనను సరియే యామెతో నాపురుషుడు వ్యభిచరించును. ఇట్లు కుకర్మ నాచరించుచు బాగుగ మత్తెక్కిన మీదట నొడలు తెలియక చెప్పులతోగూడ గొట్టుకొందురు. తదుపరి తెల్లవారక ముందే తమతమ యిండ్లకు జేరుకొందురు. అప్పుడు మరల వావివరుసలు పాటింతురు. తల్లిని దల్లిగాను, బిడ్డను బిడ్డగాను, భార్యను భార్యగాను జూచుకొందురు.

ఇక బీజమార్గము ననుసరించువారు స్త్రీపురుషులు సంగమము చేసి వీర్యమును నీటిలో గలిపి త్రాగుదురు. ఇయ్యది ముక్తికి మార్గమని యీ పామరులు తలంచుచున్నారు. వీరిలో విద్య, విచారణము సజ్జనత నామమాత్రమైన నుండవు.

(శైవమతఖండన)

ప్రశ్న :- శైవమతమువారు మంచివారై యుండవచ్చును.

ఉత్తరము :- వారు మాత్ర మెట్లు మంచివారగుదురు? ప్రేతనాథుని వంటి వాడే భూతనాథుడును. వామమార్గులు మంత్రోపదేశాదులతో ధనము హరించునట్లు శైవులును 'ఓం నమః శివాయ' అనునిట్టి మంత్రముల పంచాక్షరి నామముతో నుపదేశింతురు. రుద్రాక్షమాలలు ధరింతురు. భస్మధారణము సేయుదురు. మట్టితోగాని, పాషాణాదులతో గాని లింగములను జేసి పూజింతురు.

'హర హర బం బం' అని మేకపోతుల వలె నోటితో 'బడబడ' శబ్దములను జేయుదురు. దానికి గారణ మిట్లు చెప్పుదురు. చప్పట్లు గొట్టి 'బంబమ్మ'ను శబ్దము చేసిన పార్వతి ప్రసన్నయగును. మహాదేవు డప్రసన్నుడగును. కారణమేమన భస్మాసురుని యెదుటినుండి మహాదేవుడు పాఱిపోయినపుడు బంబమ్మను శబ్దమెగతాళికి సంబంధించిన చప్పట్లు కలిగెనట. దవడలు వాయించినందున-మేకపోతు ధ్వనివంటి ధ్వని చేసిన పార్వతి యప్రసన్న యగునట. కారణమేమన, బార్వతి తండ్రియైన దక్షుని శిరస్సు ద్రుంచి హోమము చేసి మొండెముపై మేకపోతు శిరస్సు నంటించినారట. దానికి నకలుగా దవడలతో శబ్దము చేయుటయని యెంచి పార్వతి యప్రసన్నయగును. శివరాత్రికి ప్రదోషవ్రత మాచరింతురు. ఇవి యన్నియు ముక్తికి మార్గములుగా నంగీకరింతురు. కావున వామమార్గులెట్లు భ్రాంతులో శైవులు నట్లే భ్రమలలో బడియున్నారు. వీరిలో విశేషించి కనఫటే, నాథ, గిరి, పురి, వన, ఆరణ్య, పర్వత, సాగర, అట్లే గృహస్థులు శైవులగుదురు. ఒక్కొక్కరు రెండు గుఱ్ఱముల నెక్కువారును గలరు. అనగా వామమతమును శైవమతమును రెండింటిని నంగీకరింతురు. వీరిలో నెందఱో వైష్ణవులు నుందురు.

**"అంతః శాక్తా బహిశ్శైవా సభామధ్యే చ వైష్ణవాః, నానారూపధరా కౌలా**
**విచరన్తి హ మహీతలే". (కులార్ణవ) తంత్రగ్రంథశ్లోకము.**

లోపల శాక్తాః = వామమార్గులు, వెలుపల శైవులు, రుద్రాక్ష భస్మధారణాదుల నొనర్తురు. సభలలో మేము వైష్ణవుల మని చెప్పుకొందురు. వైష్ణవులము = విష్ణువు నుపాసించువారము. వామమార్గులు నానారూపములు ధరించి భూమిపై దిరుగుచుందురు.

(వైష్ణవమతము)

ప్రశ్న :– వైష్ణవులు మంచివారేకదా?

ఉత్తరము :– ఏమి మంచి మన్ను మంచి. వారెట్లో వీరు నట్లే. వైష్ణవ లీలలు చూడుడు. తమ్ము దాము విష్ణువునకు దాసులమని చెప్పుకొందురు. వారిలో జక్రాంకితులు శ్రీవైష్ణవు లనబడుదురు. వారందఱకంటె గొప్ప యనబడుదురు. కానివాస్తవమునవెట్టి గొప్పదనము లేదు.

ప్రశ్న :– ఏమి? అంతయు నెందులకు లేదు? అంతయు నున్నది. చూడుడు. లలాటమున నారాయణుని చరణారవిందమునకు సమానమైన తిలకము మధ్యలో బీతవర్ణరేఖ శ్రీ–లక్ష్మియు నున్నది. అందువలన మేము శ్రీవైష్ణవులము. నారాయణుని దప్ప మఱి యెవరిని నంగీకరింపము. మహాదేవుని లింగమును దర్శింపనైన దర్శింపము. మా నుదుట లక్ష్మి విరాజిల్లుచున్నది. ఆమె లజ్జిత యగును. ఆల మందారాది స్తోత్రములను బఠింతుము. మంత్రపూర్వకముగ నారాయణుని బూజింతుము. మాంసమును దినము. మద్యమును ద్రాగము. మే మెందులకు మంచివారము కాము.

ఉత్తరము :– మీ తిలకమును హరి పదాకృతియనియు, పీతరేఖను 'శ్రీ' యనియు నెంచుట వ్యర్థము. ఏలయనగా నిది చేతితో దిద్దబడిన లలాట చిత్రము. గజమస్తకము ననేక విధముల చిత్రించినట్లు మీరు మీలలాటమును జిత్రింతురు. మీ నుదుట విష్ణుపదచిహ్నము లెటనుండి వచ్చినవి. వైకుంఠమునకు వెళ్ళి విష్ణుపాదముల చిహ్నములను మీ నుదుట నంకితము జేసికొని వచ్చితిరా? మీ శ్రీ–లక్ష్మి జడమా చేతనమా?

వైష్ణవుడు :– చేతనము.

వివేకి :– అయిన మీనుదుట నున్నరేఖ జడ మగుటవలన నది శ్రీ కాదు. శ్రీ మీరు నిర్మించినదా? నిర్మింపనిదా? మే మడుగుచున్నాము. చెప్పుడు. నిర్మింపని దందురేని యిది శ్రీ కాదు. ఏలయన దీనిని మీరు నిత్యము మీ చేతితో నిర్మింతురు. కావున నిది శ్రీ యెట్లగును? మీ ముఖమున శ్రీ యున్నయెడల వైష్ణవులలో నెందఱి ముఖములో శోభావిహీనముగా నేల యుండును? లలాటమున లక్ష్మినుంచుకొని యింటింట నడుగుకొని బ్రతుకుదు రేల? సదావర్తము సంపాదించుకొని పొట్ట నింపుకొందురేల? ఇది లజ్జావిహీనులయు బిచ్చివారలయు బని కాదా? కపాలమున లక్ష్మి నుంచుకొని మహాదరిద్రు లాచరించు పని చేయుదురు. దీని నేమనవలయును?

వీరిలో పరికాలుడను పేరుగల వైష్ణవభక్తు డొకడుండెను. అతడు చౌర్యము, బందిపోటు దొంగ తనము, ఛలము, కపటము, పరధనాపహరణము మున్నగు కార్యము లొనర్చుచు వైష్ణవుల దగ్గఱ ధనము నుంచి ప్రసన్ను డగుచుండెడివాడు. ఒకనా డతనికి జౌర్యములో ధనము – పదార్థమేమియు లభింపలేదు. అందువలన వ్యాకులుడై తిరుగుచుండెను. నారాయణుడు తనభక్తుడు దుఃఖము ననుభవించుచున్నాడని తెలిసికొనెను. ఒక సేఠ్–శ్రేష్ఠి రూపమును ధరించి యుంగరములు మున్నగు నాభూషణములు ధరించి రథమున గూర్చుండి యతని కెదురుగా వచ్చెను. అంతట పరికాలు డారథమును సమీపించెను. నీదగ్గఱ నున్న వస్తువు లన్నియు వెంటనే క్రిందికి దించు. లేకున్న జంపుదునని సేఠును గద్దించెను. ఆభూషణము లన్నియు దీయుచు సేఠ్ తన యుంగరమును దీయుటలో గొంత యాలస్యము చేసెను. ఇంతలో పరి కాలుడు సేఠ వ్రేలును నఱికి యుంగరమును దీసికొనెను. నారాయణుడు మిక్కిలి ప్రసన్నుడై చతుర్భుజ

శరీరమును ధరించి యతనికి దర్శనమిచ్చెను. 'నీవు నాకు మిక్కిలి ప్రియమైన భక్తుడవు. ఏల యనగా ధనమును దొంగిలించి వైష్ణవుల సేవ జేయుదువు. కావున నీవు మిక్కిలి ధన్యుడవు' అని పరికాలునితో ననెను. తదుపరి పరికాలు డా నగలనన్నిటిని దీసికొనివెళ్ళి వైష్ణవుల దగ్గఱ నుంచెను.

ఒకప్పుడు పరికాలుని దనభృత్యునిగా జేసికొని యొకసావుకా రోడమీద దేశాంతరమునకు గొంపో యెను. అక్కడనుండి యోడలో వక్కలను నింపుకొనెను. పరికాలు డొకవక్కను రెండు బ్రద్దలుచేసి యందొకటి సావుకారున కిచ్చి అయ్యా దీనిని నాదిగా మీయోడలో నుంచుడు. ఓడలో సగము వక్క పరికాలునిది యని నాకు వ్రాసి యిండు' అని కోరెను.

అంతట నావర్తకుడు 'అరే సగము వక్కయేమిటి నీకు గావలసియున్న వేయివక్కలను దీసికొనుము' అనెను. అది విని పరికాలుడు 'కాదు కాదు, సావుకారూ మన మేమి యధార్మికులమా! అబద్ధమేల! నాకు సగము వక్కయే కావలయును. అనెను. వర్తకుడు పాపము-అమాయకుడు. అతడు పరికాలుడు కోరినట్లు వ్రాసి యిచ్చెను. ఓడ తిరిగి స్వదేశమునకు చేరుకొనెను. ఓడ రేవునకు వచ్చిన తదుపరి వక్కల నోడ నుండి దింపుటకు సిద్ధపడుచుండగా పరికాలుడు వ్యాపారితో 'నాసగము వక్క నాకిండు' అని యడిగెను. వ్యాపారి యతడిచ్చిన సగభాగము వక్క యతని కీబోయెను. పరికాలుడు వ్యాపారితో 'ఓడలో నాది సగము వక్క ముక్క యున్నట్లు వ్రాసి యిచ్చితివి. కావున నోడలో నున్న వక్కలలో సగము నాది యని తగవు ప్రారంభించెను. చివరకు దగవు న్యాయాలయమునకు వెళ్ళెను. పరికాలుడు వ్యాపారి వ్రాసి యిచ్చిన లేఖ చూపెను. వ్యాపారి యెంతగా జెప్పినను, నెంతప్రయత్నించినను ఫలము లేకపోయెను. ఓడలోని సగభాగము వక్క తీసికొని వెళ్ళి పరికాలుడు వైష్ణవులకు సమర్పించెను. వైష్ణవులందఱు మిక్కిలి ప్రసన్నులైరి. నేటివఱకు నా దొంగయు దోపిడిగాడు నైన యాపరికాలుని మూర్తిని మందిరమున నుంచి పూజించు చున్నారు.

ఈ కథ భక్తమాలలో నున్నది. బుద్ధిమంతులు చూడుడు. దీనిని బట్టి తేలిన దేమిటి? వైష్ణవులు, వైష్ణవభక్తులు, నారాయణుడు మువ్వురు దొంగలనియు దొంగలముఠా యనియు దేలుట లేదా! ఈ మత మతాంతరములందు నేదేని కొంచెము మంచి యున్నను నీమతములలో జేరిన వాడెవ్వడు సర్వథా మంచి వాడు కాజాలడు.

(వైష్ణవభేదములు)

వైష్ణవులలో భేదము లేర్పడి పలుతెగ లేర్పడి యున్నవి. రామానందీయులు ప్రక్కన గోపీచందనము నుంచుకొందురు. మధ్యలో నెఱుపు తిలకమును దిద్దుకొందురు. నీమావతులు రెండువైపుల సన్నని రేఖలు పెట్టుకొని మధ్యలో నల్లబొట్టు పెట్టుదురు. మాధవ మతమువారు నల్లబొట్టు, గౌడమతమువారు బంగాళీలు నర్ధచంద్రాకారము-గిన్నె వలె బెట్టుకొందురు. రామప్రసాద మతమువారు రెండు చంద్రుని రేఖలకు మధ్యలో నొక తెల్లని బిందువు నుంచుకొందురు.

వీరు చెప్పు మాటలును విలక్షణ విలక్షణములుగా నుండును. రామానందీయులు మధ్యనున్న యెఱుపురేఖను లక్ష్మి యందురు. నారాయణుని హృదయమున లక్ష్మి, కృష్ణచంద్రుని హృదయమున రాధయు విరాజిల్లుచుండు నందురు.

ఒక కథ భక్తమాలలో నిట్లున్నది. ఒకానొక మనుష్యు డొక వృక్షము క్రింద నిద్రించుచుండెను. అత డానిద్రలోనే చనిపోయెను. చెట్టుపై నుండి యొక కాకి రెట్టవేయగా నది యావ్యక్తి ముఖముమీద బడి తిలక రూపము ధరించినది. యమదూత లతనిని దీసికొని వెళ్ళుట కటకు వెళ్ళిరి. ఇంతలో విష్ణుదూతలుకూడ నటకు జేరిరి. ఆ యిరుతెగల కింకరులలో జగడము కలిగెను. యమకింకరులు చనిపోయినవానిని దాము

తీసికొని వెళ్ళుదు మనియు విష్ణుకింకరులు తాము తీసికొని వెళ్ళుదుమనియు గలహము లాడ జొచ్చిరి. వైష్ణవులు చనిపోయిన వ్యక్తి ముఖముపై వైష్ణవ తిలక మున్నది. కావున మీరెట్లు తీసికొని వెళ్ళుదురు? అని యనగా యమకింకరులు నోరు మూసికొని వెళ్ళిపోయిరి. విష్ణుకింకరు లతనిని సుఖముగా వైకుంఠము నకు గొంపోయిరి. నారాయణు డతనిని వైకుంఠమున నుంచుకొనెను.

చూడుడు. ఆకస్మికముగా గాకిరెట్ట తిలకముతో వైకుంఠము లభించుచుండ బ్రేమతో నిత్యము లలాటమున దిలకము దిద్దుకొనువారికి యమలోకముతో నేమిపని? వారు తిన్నగా వైకుంఠమునకే పోయెద రని వారియభిప్రాయము.

ముఖమున జిన్నతిలకము దిద్దుకొనినంత మాత్రమున వైకుంఠము లభించిన, ముఖమంతయు దిలకముతో నింపుకొనిన నేమగును? ముఖమంతయు నల్లనిరంగు పులుముకొనినవారు, లేక శరీరమం తయు దిలకము నింపుకొనినవారు నెక్కడకు బోవుదురు? వారు వైకుంఠమునుగూడ దాటి యింకెక్కడి కైనను బోవుదురా! యని యడిగిన నేమి చెప్పుదురు. కావున నీ మతములు నీ భేదములు నన్నియు వ్యర్థ ములని యెంచవలయును.

(ఖాకీ–భస్మధారులు)

వీరిలో గొందఱు ఖాకీ–ఒంటినిండ భస్మము పూసికొని, లంగోటీ ధరించి కొయ్యలు మండుతున్న 'ధూనీ' –నెగడు, చుట్టుజేరి మంట కాగుచుందురు. వారు, జడలు పెంచుకొని, సిద్ధుని వేషములు ధరించి యుందురు. కొంగజపము చేయుదురు. గంజాయి, చరస్సు దమ్ము వేయుచుందురు. భంగు త్రాగి మత్తిల్లి యుందురు. కన్ను లెఱ్ఱబడి యుండును. అందఱను జిటికెడు పిండిపెట్టుమని యడుగుచుందురు. పైసలడుగు కొనుచుందురు. పిల్లలను వంచించి మోసగించి శిష్యులను జేసికొనుచుందురు. వీరిలో నెక్కువమంది కూలి నాలి చేసికొనువారు చేరుచుందురు.

ఎవడేని విద్య నభ్యసింప దలచెనేని వానిని జదువనీయరు. పైపెచ్చు "పఠితవ్యం తదపి మర్తవ్యం దంతకటా కటేతి కిం కర్తవ్యమ్" సంతుల–మహాత్ములకు జదువు లెందులకు? ఏలయన విద్య నేర్చిన వారును జచ్చిపోవుదురు. ఇక 'దంతకటకటలు' చేయనేల? సాధువు లైనవారు నాలుగుధామములు తిరుగవలయును. సంతుమహంతులకు సేవ జేయవలయును. రాముని భజింపవలయును. చాలు. ఇంతకు మించి చేయవలసిన దేమున్నది? లోకమున నెవడేని యవిద్యామూర్తియైన మూర్ఖుని చూడకున్న నీ 'ఖాకీ'ని జూచిన జాలును. వారి చెంతకు బోయిన వారిని 'బచ్చా, బచ్చీ' పిల్లవాడు! పిల్లా అని పిలుతురు. ఆ వెళ్ళినవారు 'ఖాకి' కంటె పెద్దవారై వాని తల్లిదండ్రులుగా గనబడుచున్నను వారినిగూడ నతడు బచ్చా బచ్చీ యనియే సంబోధించును.

ఈ ఖాకీలవలెనే రూంఖడులు, సూంఖడులు, గోదడులు, మఱియు జమాత్వాలే సుతరేసాయీలు, అకాలీలు, కనఫటీలు, జోగులు, ఔఘడులు మున్నగు వారందఱు నుందురు.

('ఖాకీ' కథ)

ఒక ఖాకి–శిష్యుడు 'శ్రీగణేశాయనమః' అను వాక్యము నుచ్చరించుచు నొకబావికి నీటికొఱకు వెళ్ళెను. అక్కడ నొక పండితుడు కూర్చుండి యుండెను. అత డాఖాకీ–శిష్యుడు 'శ్రీగణేసా జనమే' అని యశుద్ధముగా వల్లించుట విని, ఓసాధూ! నీ వశుద్ధముగా వల్లించుచున్నావు. శ్రీగణేశాయనమః అని వల్లించు మనెను.

ఆసాధువు తనపాత్రలో నీళ్ళు నింపుకొని తనగురువు నొద్దకు వెళ్ళి యతనితో "ఒక బొమ్మన్ నే నశుద్ధముగా వల్లించుచున్నా నన్నాడు. అని చెప్పెను. అది విని ఖాకి–గురువు వెంటనే లేచి బావిదగ్గఱకు

వెళ్ళి యా బ్రాహ్మణునితో 'ఓయీ బొమ్మన్! మా శిష్యుని మోసగించుచున్నావా? బచ్చా నీవెంత నీచదువెంత? నీవేమి చదివితివో-నీవాకపాఠము చదివి యుందువు. మేము మూడురకా లెఱుగుదుము. 'స్రీగనేసాజన్నమే' 'స్రీగనేసాయన్నమే' 'శ్రీగనేసాయనమేం' అని యాపాఠములు వినిపింపగా, పండిత :- 'సాధూజీ! వినుము. విద్య మిక్కిలి కఠినవిషయము. చదువకున్న విద్యరాదు. సాధుఖాకీ :- పో పోవయ్యా! విద్వాంసుల నందఱను మేము నలిచి వేసినాము. భంగులో గలిపి గుటక వేశాము. సంతుల యిల్లు చాలపెద్దది. నీకేమి తెలియును.

పండిత :- చూడు! నీవు చదివియున్న నిట్టియపశబ్దము లేలపలుకుదువు? నీ కన్నివిధముల జ్ఞానము కలిగియుండెడిది.

ఖాకీ :- అరే! నీవు మాకు గురు వవుతున్నావా? నీ యుపదేశమును మేము వినము.

పండిత :- నీ వెక్కడ విందువు? బుద్ధియే లేదు. ఉపదేశమును వినుటకు గూడ విద్య కావలయును.

ఖాకీ :- వేదశాస్త్రములన్నియు జదివినను సంతులను గౌరవింపకున్న నతడేమియు జదువనివాడే యగును.

పండిత :- మేము సంతుల సేవ జేయుదుము. కాని నీవంటి సింబోతులకు కాదు. సంతు అనగా సజ్జనుడు, విద్వాంసుడు, ధార్మికుడు, పరోపకారియు నని యర్థము.

ఖాకీ :- చూడు. మేము రాత్రింబవళ్ళు దిగంబరులమై తిరుగుదుము. 'ధూనీ' దగ్గఱ తపింతుము. గంజాయి, చరస్ దమ్ము వేయుదుము. మూడు మూడు చెంబుల భంగు త్రాగుదుము. గంజాయి, భంగు, ధత్తూరము ఉమ్మెత్త యాకులను గూరగా వండుకొని తిందుము. నాభి-పాషాణము, నల్లమందు నిత్యము మ్రింగుచుందుము. మత్తులో మగ్నులమై రాత్రింబవళ్ళు దుఃఖమెఱుగక పడియుందుము. ఈ ప్రపంచము నాకింతయు లెక్కచేయము. అడుగుకొని రొట్టెముక్కలు తిందుము. రాత్రి యంతయు దగ్గుచు సమీప వర్తులకు నిద్రలేకుండ జాగరణము జేయింతుము. ఇట్టి సిద్ధులుగల సాధువులము మేము. నీవు మమ్మేల నిందించుచున్నావు? అరే బాబా! ఇప్పటికైన మేల్కొనుము. మమ్ములను గష్టపెట్టిన నిన్ను భస్మము చేయుదుము.

పండితుడు :- నీవు చెప్పిన యీ లక్షణము లన్నియు నసాధువులు మూర్ఖులునైన వారివి. సాధువుల లక్షణములు కావు. విను. 'సాధ్నోతి పరాణి ధర్మకార్యాణి స సాధుః" ధర్మయుక్తములగు నుత్తమకార్యము లొనర్చుచు, సదా పరోపకారమున బ్రవృత్తుడై, దుర్గుణములు లేనివాడై, విద్వాంసుడు, సత్యోపదేష్టయై యెల్లరకు నుపకారము చేయువాడు సాధువనబడును.

ఖాకీ :- అరే పో! సాధువుల కర్మలు నీ కేమి దెలియును? సంతుల యిల్లు చాలపెద్దది. ఏ సంతుతోను జగడము కొనితెచ్చుకొనకు. లేకున్న జూడు. ఈ చిమటాతో నీతల బ్రద్దలు చేయుదును. కపాలము క్రియ్యలు చేయించుకొందువా యేమి?

పండిత :- మంచిది బాబా! నీవు నీ యాశ్రమమునకు బొమ్ము. నా మీద నెక్కువ కోపింపకు. రాజ్య మెట్లున్నదో తెలియునా? ఎవరినైన కొట్టుదువేని పట్టుబడుదువు. జైలు సుఖమనుభవింపవలసి వచ్చును. బెత్తపు దెబ్బలు తినవలసి వచ్చును. లేక నేను గాకున్న మఱియొక రెవరైనను నిన్ను బట్టుకొని కొట్టుదురు. అప్పుడేమి చేయుదువు? ఇది సాధులక్షణము కాదు.

ఖాకీ :- అరే చేలా! నడువు. నేడే రాక్షసుని ముఖము జూపించితివిరా?

పండిత :- నీ వెన్నడు నే మహాత్ముని సేవించి యుండవు. చేసియున్న నింత జడమూర్ఖుడవై యుండవు.

ఖాకీ :- మాకై మేము మహాత్ములము. ఇతర మహాత్ముని సేవింపవలసిన గర్జు-ఆవశ్యకము మాకేమియు లేదు.

పండిత :- ఎవనిభాగ్యము నశించునో యట్టివానికి నీవంటి బుద్ధి యభిమానము కలుగును.

ఖాకీ తన కుటీరమునకు బండితుడు తన యింటికి వెడలిపోయిరి.

వృద్ధఖాకీ-శిష్యులు

"సంధ్యా సమయవు టారతి యిచ్చిరి. ఒక వృద్ధఖాకీ సాధువును వృద్ధునిగా నెంచి మిగిలినవారు 'దండోత్ దండోత్' దండవత్ అని సాష్టాంగ ప్రణామము చేసి కూర్చుండిరి. అప్పు డావృద్ధుడు అరే రామదాసిగా! నీవేమి చదివితివిరా?" అని యడిగెను.

రామదాసు :- మహారాజా! నేను 'బేస్ను సహసరనామ' చదివి నానయ్యా!

ఖాకీ :- అరే గోవిందదాసిగా! నీవేమి చదివితివి?

గోవింద :- నేను ఒక ఖాకీసాధువు దగ్గఱ 'రామసతవరాజ్' చదివి నానయ్యా!

రామదాసు :- అయ్యా మీరేమి చదివారు!

వృద్ధఖాకీ :- మేము గీత చదివినాము.

రామదాసు :- ఎవరి దగ్గఱ జదివినారు?

ఖాకీ :- అరే బచ్చా! పోరా! మేమెవరిని గురువు చేసికొనముురా! చూడు! మేము పరాగరాజ (ప్రయాగ) మున నుంటిమి. మాకొక్క యక్కర మైనను రాదు. అప్పుడొక ధోవతి కట్టుకొని యున్న పండితుని జూచి గీత-గోటక గుటకునుండి, నెత్తిమీద గిటికి యున్న యీ యక్కర మేమిటని యడిగి యడిగి యప్పుడొక యక్కరము నప్పుడొక యక్కరమే నేర్చుకుంటిని. అట్లా గీతలోని పదునెనిమిది అధ్యాయములు సంగగొట్టితి ననుకో - కాని గురువు నొక్కనిని జేసికొనలేదు.

చూడుడు-ఇట్టి విద్యకు శత్రువులైన మూర్ఖులలో నివాస మేర్పఱచుకొని యుండక యవిద్య యెటకేగును?

ఈ ఖాకీ సాంప్రదాయకులు మత్తుపదార్థములు సేవింపక యుండరు. వీరిలో ప్రమాదము, కలహము, తినుట, నిద్రించుట, గంటలు వాయించుట, శంఖము లూదుట, ధూని-నెగడులు కాపాడుట, యన్ని దిశలలోను వ్యర్థముగా దిరుగుటకు మించి వీరుచేయు మంచిపని యొండును లేదు. రాతినైన గరగింప వచ్చుగాని యీ ఖాకీ సాధువుల యాత్మలకు బోధకలిగించుట సాధ్యముకాదు. ఏలయనగా వీరిలో నెక్కువమంది శూద్రకులజులు, కూలినాలి చేసికొనువారు. కూలిపని విడిచి బూడిద బూసికొని ఖాకీ, బైరాగి యగుచుందురు. విద్యా సత్సంగము ననువాని మహిమ వారికేమియు దెలియదు.

వీరిలో నాథ-సాధువుల మంత్రము 'నమఃశివాయ' ఖాకీసాధువుల మంత్రము 'నృసింహాయనమః' రామావతులమంత్రము "శ్రీరామచంద్రాయనమః" లేక 'సీతారామాభ్యాం నమః" కృష్ణోపాసకుల మంత్రము 'శ్రీరాధాకృష్ణాభ్యాం నమః' లేక నమో భగవతే వాసుదేవాయ నమః. బంగాలీల మంత్రము "గోవిందాయ నమః" ఈ మంత్రములను శిష్యులకు జెవిలో వినిపించి శిష్యులను జేసికొందురు. వారి కిట్టి శిక్షల నొసంగుదురు. 'బచ్చా! తుంబామంత్రము జదువుము. మంత్రము 'జల పవితర సథల పవితర. ఔర్ పవితర కుఆశివ కహే సును పార్వతీ తూంబా పవితర హొఆ'.

భళీ! ఇట్టి సాధువులు, పండితులు నున్నదేశముగల జగత్తున కుపకార మెన్నడైన జరుగునా! ఖాకీలు తగులబెట్టు కొయ్యల కొఱకు నడవి యంతయు గాలింతురు, లేదా పిడకలు సంపాదించి వానిని దగులబెట్టుదురు. ఒక మాసములో నెన్నియో రూప్యముల విలువగల కట్టెలు తగులబెట్టుదురు. ఒక్క

మాసములో దగులబెట్టు కట్టెల మూల్యముతో మంచి కంబళ్ళు కొని వానిని గప్పుకొనవచ్చు. వానిచే సుఖముగా జీవింపవచ్చును. వారి కిట్టిబుద్ధి యెట్లు కలుగును?

కొయ్యలు మండుచున్న యాధూని-నెగడి దగ్గఱ గూర్చుండి చేతులు కాచుకొనుచుండుటయే వారి తపస్సు. దానితో దమ్మ్మతాము తపస్వుల మని చెప్పుకొందురు. వీనితోనే వీరు తపస్వులగుదురు. జడలను బెంచుకొని, బూడిద రాచుకొని, తిలకము ధరించినంత మాత్రమున తపస్వులగుదురేని యెవ్వరును సులభముగా నీపని చేయగలుగుదురు. వీరు పైకి త్యాగస్వరూపము ధరించి లోపల నధికసంగ్రహమునపేక్షించుచుందురు.

(కబీరుపంథ)

ప్రశ్న :- కబీరుపంథి మంచివారేనా?

ఉత్తరము :- కాదు.

ప్రశ్న :- ఎందుకు మంచివారు కాదు? వారు మూర్తి పూజను ఖండింతురు. కబీరు పువ్వులలో బుట్టినాడు. చివరకు పువ్వై పోయినాడు. బ్రహ్మ, విష్ణువు, శివుడు ననువీరు జన్మింపక ముందరే కబీరు సాహేబు ఉండెను. ఆయన పెద్దసిద్ధుడు. వేదము పురాణములు నెఱుగని విషయములు కూడ కబీ రెఱుగగలిగి యుండెడివాడు. సత్యమార్గము కబీరుకే కనబడు చుండెడిది. వీరి మంత్రము 'సత్యనామ కబీర్' అని.

ఉత్తరము :- పాషాణమూర్తులను వదలి మంచము, పరుపు, దిండు, పావుకోళ్ళు, దీపము వీని బూజించుట మూర్తులను బూజించుటకంటె తక్కువ యేమియు గాదు. కబీర్ సాహేబు పువ్వులలోని పురుగా లేక పుష్పపు మొగ్గా పువ్వులలో బుట్టుటకు? చివరకు బువ్వనగుటకు? మనుష్యుడు పువ్వులలో నెట్లు పుట్టును?

(కబీరుజన్మసిద్ధాంతము)

కబీరు విషయములో వినుచున్న విషయము నిజమే కావచ్చును. ఒక సాలెవాడు కాశీలో నుండువాడు. అతనికి సంతానము లేకుండెను. ఒకనాడు కొంచెము రాత్రి మిగిలి యుండగా నతడొక గల్లీలో వెళ్ళుచుండెను. అప్పుడతనికి దారికి నొకవైపున బుట్టలో బువ్వులమధ్య నొకశిశువు కనిపించెను. ఆ శిశువప్పుడప్పుడే జన్మించి యున్నట్లుండెను. అంతట నత డాపిల్లవాని నింటికి దీసికొని వచ్చి భార్యచేతి కిచ్చెను. ఆమె యతనిని బెంచెను.

ఆ పిల్లవాడు క్రమముగా బెద్దవాడై నేత పనిచేయుచుండెడివాడు. సంస్కృతము జదువ నొకపండితుని కడకు వెళ్ళెను. అత డతని నవమానించెను. పైగా మేము సాలీలకు జెప్పము అనెను. ఇట్లే పలువురు పండితు లతనికి సంస్కృతము జెప్ప నిరాకరించిరి.

అంతట నతడు తనకు దోచిన విషయములను వికృతభాషలో దోటి సాలీలకు జెప్పదొడగెను. తంబూరా తీసికొని పాడుచుండెడివాడు. ఏవో పాటలు పాడుచుండెడివాడు. కొందఱు మూర్ఖులతని వలలో జిక్కిరి. అతడు చనిపోయినపు డతని శిష్యు లతనిని సిద్ధుని జేసిరి. అతడు బ్రతికియుండగా బాడిన పాటలు శిష్యులు తరువాత బాడుచుండెడివారు.

చెవులను మూసినపుడు వినబడు శబ్దమును 'అనహత శబ్దము' అని సిద్ధాంతము చేసిరి. మనస్సు యొక్క వృత్తి "సురతి" యనిరి. మనో వృత్తిని-సురతిని 'అనహత శబ్దము' వినుటలో లగ్నము చేయవలయును. దానినే సంత-పరమేశ్వర ధ్యాన మని చెప్పుదురు. అక్కడకు కాలము చేరదు. బల్లెము వంటి యాకృతిలో దిలకము దిద్దుకొందురు. చందనము, కాష్ఠముతో జేసిన పూసల మాలలు ధరింతురు.

భలా! ఆలోచించి చూడుడు. దీనివలన నాత్మోన్నతి కాని, జ్ఞానవృద్ధి కాని కలుగగలదా! ఇది

కేవలము పిల్లల యాటవంటి లీలా మాత్రమే.

(నానకపంథ)

ప్రశ్న :- పంజాబు దేశమున నానక్‌జీ యొక మార్గమును గనుగొనిరి. వారును మూర్తిపూజను ఖండించుచుండెడివారు. మునల్మానులు కాకుండ గాపాడిరి. వారు సాధువుకూడ గాలేదు. గృహస్థులుగానే యుండిరి. చూడుడు. వా రీమంత్రము నుపదేశించిరి. దీనిం బట్టియే వారి యాశయము మంచిదని తోచు చున్నది.

"ఓం సత్యనామ కర్తా, పురుష, నిర్భో, నిర్వైర, అకాలమూర్త, అజోని, సహ, భం, గురుప్రసాద, జప, ఆదిసచ్, జుగాదిసచ్, హై భీసచ్, నానక్ హెూసీభీ సచ్." 'ఓమ్' ఎవని సత్యనామమో యతడు కర్త పురుషుడు, భయ, వైర రహితుడు. అకాలమూర్తి-కాలమునందు, యోనియందు రానివాడు,ప్రకాశవం తుడు. అతని జపమే గురుకృపతో జేయుము. ఆ పరమాత్మ యాదియందు సత్యమై యుండెను. యుగ ముల యాదియందును సత్యము, వర్తమానమునను సత్యము, భవిష్యత్తునందును సత్యమే.

ఉత్తరము :- నానక్ గారి యాశయము మంచిదే. విద్య యేమియు లేకుండెను. భాష యాదేశపు గ్రామములకు సంబంధించినది. దానినే యతడెఱుగును. వేదాది శాస్త్రములను గాని సంస్కృతము గాని యేమియు నెఱుగడు. అత డెఱిగియుండిన 'నిర్భయ' శబ్దమును 'నిరోభ' యని యెందుకు వాడును! దీనికి వారు వ్రాసిన సంస్కృతీ స్తోత్రమే దృష్టాంతము. సంస్కృతమునందును ముందడుగు వేయగోరెను. కాని చదువక సంస్కృత మెట్లువచ్చును? సంస్కృతము నెన్నడును వినని గ్రామీణుల యెదుట 'సంస్కృతీ-స్తోత్రము' సిద్ధముచేసి సంస్కృత పండితుడని యనిపించుకొని యుండును.

ఈ పని మానప్రతిష్ఠ, ప్రఖ్యాతిని గోరి చేసియుండును. తనకు ప్రతిష్ఠ కలుగవలయునను కోరిక యతనికి నుండి యుండెను. లేకున్న దనకు వచ్చినభాషలోనే చెప్పుచుండి యుండవలసినది. తనకు సంస్కృతము రాదనియు జెప్పి యుండవలసినది. ఏదియో కొంత యభిమాన మున్నపుడే మానప్రతిష్ఠ లకొఱకు గొంత దంబముకూడ నవలంబించి యుండును. అందువలననే తమ గ్రంథములం దక్కడ నక్కడ వేదములనింద, స్తుతియు జేసియున్నాడు. అట్లు చేయక యున్న నెవరేని వేదార్థముల నడుగు దురు. అర్థము తెలియనపుడు ప్రతిష్ఠకు భంగము వాటిల్లును. కావుననే మొదటి నుండియు దనశిష్యుల యెదుట వేదములకు విరుద్ధముగా నక్కడ నక్కడ జెప్పెడివాడు. అక్కడక్కడ వేదములను గూర్చి మంచియు జెప్పియుండెను. కారణమేమన వేదములను సర్వథా నిందించిన జనులు నాస్తికు డందురు.

'వేద పఢత బ్రహ్మే మరే.' చారోం వేద కహానీ'

"సంత కి మహిమా వేద నజానీ" సుఖమనీ ౭-౮

"నానక్ బ్రహ్మజ్ఞానీ ఆప్ పరమేశ్వరీ" సుఖమనీ ౮-౬.

వేదము జదివిన వారందఱు జచ్చిపోయిరా? నానక్‌జీ మున్నగువారు తమ్ము దా మమరుల మని చెప్పిరి. వారు చావలేదా? వేదము సర్వవిద్యలకు భండారము. కాని, వేదములను నాల్గింటిని గథలని చెప్పు వారి విషయములే కథలగును. మూర్ఖులకు సంతపదవి లభించిన వారు వేదముల నెన్నడు నెఱుగ జాలరు. నానక్‌జీ వేదములను గౌరవించి యుండిన వారిసంప్రదాయము నడచియుండెడిది కాదు. ఆయన గురువు కూడ నయ్యెడివాడు కాడు. ఏలయన సంస్కృత విద్య చదివియే యెఱుగడు. కావున వేదములను నితరు లకు జెప్పి శిష్యుల నెట్లు చేసికొన గలిగెడివాడు?

నానక్‌జీ పంజాబునందు జన్మించిన కాలములో సంస్కృత మాప్రాంతమున లేకుండె ననుట సత్యము. ఆప్రాంతము మునల్మానులచే బీడింప బడుచుండెను. అప్పుడు నానక్‌జీ కొందఱను మునల్మా

నుల బారినుండి కాపాడెను. నానక్‌జీ యెదుట వారి సంప్రదాయముగాని, శిష్యులుగాని యధికముగా లేకుండిరి. కారణమేమన, మరణించిన మీదట వారిని సిద్ధులను జేయు పరిపాటి యవిద్వాంసులలో నుండెడిది. తదుపరి మాహాత్మ్యమును బెంచి యీశ్వరసమానుని జేయుదురు.

(ఉదాసీ-నిర్మలులు)

నానక్‌జీ పెద్దధనాఢ్యుడు కాదు. కాని వారి శిష్యులు 'నానక్ చంద్రోదయము' 'జన్మసాఖీ' మున్నగు గ్రంథములందు గొప్పసిద్ధుడు, గొప్ప యైశ్వర్యవంతుడు నని వర్ణించి యున్నారు. నానక్‌జీ బ్రహ్మాదులతో గలిసి నాడనియు, మాటలాడి నాడనియు, వ్రాసిరి. అందఱు నీవిషయములకు మాన్యత నిచ్చిరి. నానకుగారి వివాహమునందు జాలగుఱ్ఱములు, నేనుగులు, రథములు, బంగారము, వెండి తొడుపులు గలిగి యున్నట్లును, ముత్యములు, పచ్చలు మున్నగువానిచే నలంకృతములై యున్నట్లును నమూల్య రత్నములకు మేరలేకుండెననియు వ్రాసియున్నారు. భలా ఇవి గప్పాలుకాక మఱి యేమగును? ఇయ్యది శిష్యుల దోషమే. నానక్‌గారి దోషమేమియు లేదు. వారి తరువాత వారి కుమారుని వలన ఉదాసీ సంప్రదా యము, రామదాసాదులవలన 'నిర్మల' సంప్రదాయము ప్రారంభమయ్యెను.

గద్దీల నధిష్ఠించినవారు పలువురు భాషను రచించి గ్రంథమునందు జేర్చిరి. వీరిలో గురువు గోవింద సింహుడు పదియవ వ్యక్తి. వారి తరువాత గ్రంథములలో నెవరి వాణియు జేర్చబడలేదు. కాని యంత వఱకు నెందఱు గురువులై యుండిరో వారు రచించిన చిన్నచిన్న పుస్తకము లన్నియు గలిపి యొక పెద్ద గ్రంథముగా గ్రథింపబడినది. ఇట్లు సిక్కుల గ్రంథసాహబు సిద్ధమైనది. నానక్‌జీ తరువాత బలువురు చాలభాష రచించిరి. ఎందరో పురాణములలోని మిథ్యాకల్పనలవలె నానావిధములయిన విషయములు వ్రాసిరి. కాని బ్రహ్మజ్ఞానులు తాము స్వయముగా బరమేశ్వరులైరి. కర్మోపాసనలు విడిచి శిష్యులు ప్రణమిల్లుచు వచ్చిరి. ఇయ్యది మిక్కిలి చెరుపు గలిగించినది. నానక్‌జీ యీశ్వర విషయములో గొంతభక్తి విశేషము వ్రాసి యుండిరి. దానిని జేయుచు వచ్చినను గొంత బాగుండి యుండెడిది. ఇప్పుడు 'ఉదాసులు' 'మేము గొప్పవారము' అనగా, 'నిర్మలులు' 'మేము గొప్పవారము' అనుచున్నారు. అకాలీలు, సూతరహసా యీలు 'మేము సర్వోపరి గొప్పవార' మనుచున్నారు.

(గురుగోవిందసింహ – పంచకకారములు)

ఈ గురువులలో గురుగోవిందసింహుడు శూరవీరు డయ్యెను. వారి కుమారులను మహమ్మదీయులెంతో బాధించిరి. అందువలన గురుగోవింద సింహజీ మహమ్మదీయులను వైరముతో సాధింపబూనిరి. కాని వారిదగ్గఱ నెక్కువ సాధనసంపత్తి లేకుండెను. అటు మహమ్మదీయుల రాజ్యము ప్రజ్వలిత మగుచుండెను. అప్పుడు గోవింద సింహజీ పురశ్చరణము చేయింప దమకు దేవి ఖడ్గము నిచ్చినట్లు తాము మహమ్మదీయులతో యుద్ధముచేసిన జయము కలుగునను వరమిచ్చినట్లును బ్రసిద్ధి వ్యాపింపజేసెను. అంతట జాలమంది వారికి ననుయాయులైరి. వామమార్గులు పంచ మకారములను, చక్రాంకితులు పంచ సంస్కారములను నడపినట్లు గోవింద సింహజీ పంచ కకారములను నాచరణములోనికి దెచ్చిరి. ఈ పంచ కకారములు యుద్ధమున కుపయోగించు నవియై యుండెను.

ఒకటి :– కేశములు–శిరస్సుపై నుండు కేశములను ఖండింపక వానిని బెంచుకొనుట. అందువలన గఱ్ఱదెబ్బలను, గత్తిదెబ్బలను శిరస్సుసహింప వీలగును. కొంతరక్షణము జరుగగలదు.

రెండవది :– 'కంగణ్' సిక్కులు శిరస్సుపైన దలపాగలోపల నుంచుకొందురు.

మూడవది :– 'కాఛ్' మోకాళ్ళకు బైన మొలకు గట్టుకొను చిన్న లాగు (నిక్కరువంటిది). దానివలన బాగుగ బరుగెత్తుటకు, దుముకుటకు వీలుకలుగును. శరీరముయొక్క మర్మస్థానమునకు

రక్షణము గొంత కలుగును.

నాల్గవది :- 'కంగా' అనగా దువ్వెన. కేశములను దువ్వుకొనుట కుపయోగించును.

ఐదవది :- 'కాచూ' అనగా జిన్నఖడ్గము-కటారి యనియు నందురు. దానివలన శత్రువుల నెదుర్కొని నపుడు యుద్ధము చేయుటకు మిక్కిలి సాహాయ్యము లభించును.

గోవిందసింహజీ యాసమయమునకు దగినట్లు తనబుద్ధిమత్త నుపయోగించి వీనిని నాచరణమునకు దెచ్చెను. వీని యుపయోగ మిప్పుడంతగా నుండదు. అప్పుడు యుద్ధ ప్రయోజనమున కుపయోగపడిన సాధనములు, కర్తవ్యములు, నేడు ధర్మసాధనములుగా నంగీకరించి కాపాడబడుచున్నవి.

వీరు మూర్తి-పూజ చేయరు. కాని దానికంటె మించి 'గ్రంథసాహబు'ను బూజింతురు. ఇది మూర్తి పూజ కాక యేమగును? కొండొక జడ పదార్థమునకు శిరము వంచుట లేక దానిని బూజించుట యంతయు మూర్తిపూజయే యగును. మూర్తిపూజకులు దుకాణములను బెట్టుకొని జీవికను నిలబెట్టు కొనినట్లు వీరును జేసిరి. పూజారులు మూర్తుల దర్శనములు చేయించి కానుకలు సంపాదించుకొందురు. వీరును గ్రంథసాహబు దర్శనము చేయింతురు. గ్రంథమునకు బూజలు చేయుదురు. చేయింతురు. కానుక లర్పింప జేయుదురు. కాని, మూర్తిపూజకులు వేదమునకు మాన్యము నిచ్చినంతగా గ్రంథపూజకులైన వీరు వేదమున కంత మాన్యత నీయరు.

వీరు వేదములను గూర్చి వినను లేదు; చూడను లేదనవచ్చును. వేదములను విని, చూచి, చదివిన బుద్ధిమంతులు, దురాగ్రహులు నన్నిసాంప్రదాయములవారును వేదమతమునంగీకరింతురు. కాని సిక్కు సంప్రదాయమునకు జెందినవారు భోజనసంబంధమైన వ్యర్థపు విషయములను చాలవఱకు వదలి వేసిరి. అట్లే విషయాసక్తి దురభిమానము వదలి వేదమతము నభివృద్ధిజేసిన నెంతయు బాగుగనుండును.

(దాదూపంథీ)

ప్రశ్న :- దాదూపంథీ వారి మార్గము మంచిదేనా?

ఉత్తరము :- మంచి మార్గము మాత్రము వేదమార్గమే. గ్రహింపదలచినచో వేదమార్గమే గ్రహింప దగినది. లేకున్న నెల్లప్పుడు దుఃఖమగ్నుడ వగుదువు. 'దాదూజీ' జన్మము గుజరాత్‌లో నైనది. తదుపరి జయపురమునకు సమీపమున నున్న 'అజమేర్'లో నుండెడివాడు. నూనె తీసి యమ్ముకొనువారి పని చేయుచుండెడివాడు. ఈశ్వరుని సృష్టిలీల విచిత్రము. దాదూజీ కూడ బూజింప బడనారంభించెను. ఇక వీరిశిష్యులు వేదశాస్త్రముల విషయములన్నియు విడిచి 'దాదూరామ్ దాదూరామ్' అని భజన చేయుటలోనే ముక్తి నంగీకరింపసాగిరి. సత్యోపదేశము చేయువారు లేనప్పు డిట్టి గొడవలే జరుగు చుండును.

(రామసనేహీమతము)

కొలదిదినముల క్రిందటనే శాహపురానుండి 'రామసనేహీ' పేరుతో నొకమతము ప్రారంభమయ్యెను. వీరు వేదోక్త విషయము లన్నియు వదలి 'రామ-రామ' అని రామపదము నుచ్చరించుట మంచిదని యంగీకరించి అందులోనే జ్ఞానము, ధ్యానము, ముక్తియు నంగీకరింప సాగిరి. కాని యాకలి యైనపుడు 'రామరామ' నుండి యొక్క రొట్టెయైనను బయటపడదు. అన్నపానములు గృహస్థులనుండియే లభించును. దాదూపంథీవారుకూడ మూర్తిపూజను నిందింతురు. కాని వారే స్వయముగా మూర్తులై కూర్చున్నారు. స్త్రీలసాంగత్య మెక్కుడు. ఏలయనగా రాములకు రామకీ-రామక్క లేకున్న నానందము లభింపదుకదా? 'రామచరణ' మనుపేరుగల యొకసాధువుండెను. అతని మతము ముఖ్యముగా శాహపురా స్థానమున, మేవాడనుండి ప్రారంభమైనది. 'రామరామ' అనుటయే వారికి పరమమంత్రము. అదియే సిద్ధాం

తముగా నంగీకరింతురు. వారి కొక గ్రంథ మున్నది. అందులో నిట్లున్నది :-

"భరమ రోగ తబహీ మిట్యా, రట్యా నిరంజన రాశి,
తబ జమకా కాగజ ఫట్యా కట్యా కర్మ తబ జాశి" (సాఖీ—౬)

ఇప్పుడు బుద్ధిమంతు లాలోచించి చూడుడు. 'రామ' 'రామ' అనినంతమాత్రమున భ్రమ-అజ్ఞానము, యముని పాపానుకూల శాసనము, చేసిన పాపకర్మలు తొలగిపోగలవా? ఎన్నడును బోవు. ఇది కేవలము మనుజులను బాపము లొనర్చుటకు బురికొల్పుట యగును. ఈ విధముగ మనుష్య జన్మము నాశము చేయుటయు నగును.

వీరికి ముఖ్యగురువైన రామచరణు డేమనుచున్నాడో వినుడు :-

"మహమానాం వ ప్రతాపకీ సుణౌ సరవణ్ చిత్‌లాశి
రామచరణ రసనారటౌ క్రమసకల ఝుడజాయి" (౧)
"జినజిన సుమర్యా నాంవకూ సో సబ్ ఉతర్యా పార్
రామచరణ జో వీసర్యా సో హీ జమకే ద్వార్." (౨)
"రామవినా సబ్ ఝూఠ్ బతాయో."
"రామ భజత ఛూట్యా సబ్ క్రమ్మా చంద్ అరుసూర్ దేశి పరకమ్మా
రామ కహే తినకూ భై నాహీ, తీనలోకమే కీరతి గాహీ."
"రామ రటత జమ జోర్ నలాగై."
"రామనామ లిఖ పథరతరా ఈ భగతి హేతి ఔతార హీ ధరహీ
ఊంచ నీచ కులభేద విచారై సో తో జనమ ఆపణో హారై."
"సంతాం కై కుల దీసై నాహీం, రామ్ రామ్ కహ్ రామ్ సంహాం హీం
"ఐసో కుణ్ జో కీరతి గావై, హరి హరి జన్ కౌ పార్ న పావై.
రామ్ సంతాం కా అంత న ఆవై, ఆప్ ఆపకీ బుద్ధి సమ గావై."

(వీని ఖండనము)

రామచరణ ప్రభృతులు వ్రాసిన గ్రంథములను జూచిన మీదట వీరు గ్రామీణులు సరళస్వభావము గల యమాయకులుగా గనబడుదురు. 'రామ చరణ' ఏమియు జదివినవాడు కాడు. లేకున్న నిట్టి గప్పా లెందుకు వ్రాయును. రామరామ యన్నంత మాత్రమున కర్మలు దూరమగు ననుట వీరి భ్రమమాత్రమే కాని వేఱుకాదు. వీ రీయుపదేశములు చేసి తమ జన్మములను నితరుల జన్మమును నాశము చేయు చున్నారు.

యముని భయము చాలయెక్కువ. రాత్రింబవళ్ళు రామరామయనిన పోలీసులుగాని, దొంగలు, వ్యాఘ్రాది క్రూరమృగములు, పాములు, తేళ్ళు చివరకు దోమలైనను భయపడవు. అట్టిచో యముని భయమెట్లు దూరమగును? ఏమియు గాదు. 'చక్కెర చక్కెర' అని యఱచినంత మాత్రమున నేమగును. సత్యభాషణాది యుత్తమకార్యములు చేయక యేమియు గాదు. రామరామ యనిన రాముడు వినునా! ఒక మాటు పిలిచిన విననివాడు రాత్రింబవళ్ళఱచినను వినునా? కావున నిట్లు సమయము వ్యర్థము చేయుట మంచిది కాదు.

వీ రీవిధముగ దమపొట్టలను నింపుకొని యితరుల జన్మను నష్టపఱచుట కిట్టి పాషండ మతమును నిలబెట్టినారు. ఇది యంతయు మనము జూచుచు వినుచు నుండుట మిక్కిలి యాశ్చర్యకరము. వీరి పేరు 'రామ సనేహి' చేయుపనులు 'రాండ్‌స్నేహీ ' విధవా స్నేహమునకు సంబంధించినవిగా నున్నవి. ఎక్కడ

జూచిన నక్కడ నీసంతులను విధవలు చుట్టుముట్టి యుందురు.

ఇట్టి పాషండమతములు వ్యాపింపకున్న నీయార్యావర్తమున కిట్టి దుర్దశ యేలకలిగెడిది? వీరు తమ శిష్యులకు నెంగిలి తినిపింతురు. స్త్రీలు భూమిమీద సాగిలపడి నమస్కరింతురు. ఏకాంతమునందును స్త్రీలు సాధువులుచేరి మంతనము లాడుచుందురు.

వీరికి సంబంధించిన రెండవశాఖ మారవాడ దేశపు ఖేడాపా గ్రామము నుండి బయలు వెడలినది. దానిచరిత్ర – 'రామదాసు' అను పేరుగల యొక మాలవా డుండెను. అతడు మిక్కిలి చతురుడు. అతనికి నిరువురు భార్యలు. అతడు చాలదినములు 'ఔఘడ్' (ఒక తెగకు సంబంధించిన సాధువు) సాధువై కుక్కలతో గలిసి తినుచుండెడివాడు. తదుపరి వామమార్గీ, కూండాపంథీ, రామదేవ కామడియాగా మారెను. తన యిరువురి భార్యలను వెంటబెట్టుకొని పాడుచుండెడివాడు. ఇట్లే తిరుగుచు తిరుగుచు సీథలమందున్న మాలమాదిగల గురువైన రామదాసును గలిసికొనెను. అత డతనికి రామదేవుని పంథ–మార్గమును జెప్పి తనకు శిష్యునిగా జేర్చుకొనెను. ఆ రామదాసు ఖేడాపాగ్రామమున దనకు నివాసస్థాన మేర్పఱచుకొనెను. అతని మత మాప్రాంతముననే కొంత వ్యాపించెను.

అటు శాహపురమున రామచరణుని మతము వ్యాపించెను. అతని చరిత్రకూడ నిట్లే వినవచ్చినది. అతడు జయపురమున నుండు నొకవైశ్యుడై యుండెను. అతడు 'దాంతడా' గ్రామమున నుండు నొక సాధువు వలన వేషమును గ్రహించెను. అతనినే గురువుగా స్వీకరించెను. తదుపరి శాహపురమునకు వచ్చి యట దన స్థాన మేర్పఱచుకొనెను. అమాయకులలో పాషండమతము త్వరగా స్థానమేర్పఱచుకొనును. అట్లే యిదియు జరిగినది.

(వీరిమహా మంత్రము చరణామృతమే)

వీరందఱు రామచరణుని వచనముల ప్రమాణములను బట్టి శిష్యులను జేసికొందురు. అందువలన ఉచ్చనీచ భేదము వీరిలో లేదు. బ్రాహ్మణుడు మొదలు నంత్యజునివఱకు నెల్లరు శిష్యులగుదురు. ఇప్పుడుకూడ కుండాపంథీతోనే యున్నది. ఏలయన వీరు మట్టిపాత్రలలో దిందురు. సాధువుల యెంగిలి తిందురు. వేదధర్మమునుండి, తల్లిదండ్రులనుండి, సాంసారిక వ్యవహారముల నుండియు విడిపించి శిష్యులను జేసికొందురు. రామనామమును మహామంత్రముగా జెప్పుదురు. అంగీకరింతురు. దీనినే 'ఛచ్చమా' వేదమందురు. సూక్ష్మవేదమని దాని యభిప్రాయము. 'రామరామ' అని చెప్పుటవలన ననంతజన్మముల పాపములు విడిచి పోవును. ఇది లేక ముక్తి యెవరికిని లేదు.

శ్వాసప్రశ్వాసలతో ప్రాణాయామము జేయునప్పుడు రామనామము పలుకుటను బోధించువాడు 'సత్యగురువు' అనబడును. సత్యగురువును బరమేశ్వరునికంటె మిన్నగా నంగీకరింతురు. అతని మూర్తిని గూడ ధ్యానము చేయుదురు. సాధువుల పాదములు కడిగి త్రాగుదురు. శిష్యుడు గురువును వదలి దూరము వెళ్ళవలసివచ్చిన గురువు గోళ్ళుకాని, యతని గడ్డపు వెండ్రుకలుగాని వెంట నుంచుకొందురు. వాని చరణామృతము నిత్యము సేవింతురు.

(ధర్మ–పుస్తకపరిక్రమ–దండ ప్రణామము)

రామదాసు, హరరామదాసుల వాణిగల పుస్తకమును వేదముకంటె నెక్కువ యని నమ్ముదురు. దాని చుట్టును పరిక్రమముచేసి యెనిమిది పర్యాయములు దండ ప్రణామములు చేయుదురు. స్త్రీలకు బురుషులకు నెల్లరకు నొక్కటిగా 'రామరామ' మంత్రము నుపదేశింతురు. నామస్మరణము వలననే శుభము కలుగునని యంగీకరింతురు. మరల జదువుటలో బాపమని యందురు. వారి 'సాఖీ' "పండితాయీ పానే పడీ, ఓ పూరబలో పాప్, రామ్‌రామ్ సుమర్యాం వినా రహగ్యో రీతో ఆప్, వేదపురాణ పఢేపఢ గీతా,

రామభజన బిన రఞ గయే రీతా"

ఇట్టి వాణులతో బుస్తకములు రచించిరి. స్త్రీ పతికి సేవచేసిన పాపము, సాధువు-గురువు సేవచేసిన ధర్మమని చెప్పుదురు. వర్ణాశ్రమముల నంగీకరింపరు. బ్రాహ్మణుడు రామసనేహి కానిపక్షమున నతని నీచుడు చండాలుడు నందురు. రామసనేహి యయిన నతనిని నుత్తము డందురు. ఈశ్వరుని యవతార మంగీకరింపరు. కాని రామచరణుని వచనము పైన వ్రాసిన 'భగతిహేతి ఔతారహి ధరహి' అను నీ వాక్యమును నంగీకరింతురు. వీరికి సంబంధించిన యీ పాఖండమంతయు నార్యావర్తమున కెంతయు హానికారకము. ఈ వ్రాయబడిన దానితో బుద్ధిమంతులు తెలిసికొందురు.

(వల్లభ సంప్రదాయము)

ప్రశ్న :- గోకులీయ గుసాయీల మతము మిక్కిలి మంచిది. చూడుడు. వారెంత యైశ్వర్యము ననుభవించుచున్నారో! లీల లేక యిట్టి యైశ్వర్యము కలుగగలదా?

ఉత్తరము :- ఈ యైశ్వర్యము గృహస్థులదే కాని గోసాయీలది కాదు.

ప్రశ్న :- వహ్వా, ఇది యంతయు గోసాయీల ప్రభావమువలననే. ఏలయన నిట్టి యైశ్వర్య మితరుల కేల లభింపదు?

ఉత్తరము :- ఇతరులు కూడ నిట్టి కపటప్రపంచము రచించిన నైశ్వర్యము లభించుటలో సందేహమేమున్నది? వీరికంటె నధికధూర్తులకు నధికమైన యైశ్వర్యము లభింపగలదు.

ప్రశ్న :- వహ్వాజీ! ఇందు ధూర్తత యేమున్నది? ఇది యంతయు గోలోకపు లీల.

ఉత్తరము :- గోలోకపులీల కాదు.ఇది గుసాయీల లీల. గోలోకపు లీల యైనచో గోలోకముకూడ నిట్లే యుండునని యెంచవలసివచ్చును.

ఈ మతము తెలంగ దేశమునుండి ప్రారంభమైనది. ఒక తైలంగీ బ్రాహ్మణుడు లక్ష్మణభట్టు వివాహము చేసికొని యేదోకారణ వశమున దల్లిదండ్రులను, భార్యను వదలి కాశీ వెళ్ళి యట సంన్యాసి యయ్యెను. తనకు వివాహము కాలేదని యబద్ధము జెప్పెను.

అతడిట్లు కాశీలో సంన్యాసి యైనట్లు తల్లిదండ్రులు, భార్యయు నెట్లో తెలిసికొనిరి. వారు కాశీ వెళ్ళి 'మీ రితనికి సంన్యాసము నెందుల కిచ్చితిరి? యని సంన్యాసము నిచ్చిన వారి నడిగిరి. అతని భార్యను జూపి 'యువతియైన భార్య యుండగా నితనికి సంన్యాసము నెట్లిచ్చితిరి' అని యడిగిరి.

అతని భార్యయు 'నా భర్తను నాకు మరల నీయని పక్షమున నాకును 'సంన్యాసమునిండు' అని కోరెను. అంతట వారతని బిలిచి 'నీ వసత్యవాదివి. సంన్యాసమును వదలి మరల గృహాశ్రమివి కమ్ము. ఏలయన నీవబద్ధము చెప్పి సంన్యాసము తీసికొంటివి' అనిరి. అప్పుడతడు సంన్యాసము వదలి భార్యతో నుండసాగెను.

చూడుడు! ఈ మతమున మూలమే యసత్యముతో బ్రారంభమైనది. కాశీనుండి భార్యతో తెలంగ దేశమునకు వెళ్ళగా నతనిని జాతిలో దీసికొనక భ్రష్టుని జేసిరి. అంతట నత డట నుండి కాశీ సమీపమున నున్న చరణాగఢ్ తిరుగుచు దిరుగుచు జేరుకొనెను. సమీపమున నున్న చంపారణ్యా నామకారణ్యమున భార్యతో గలిసి తిరుగుటకు వెళ్ళుచుండెడివాడు. ఒక నాడెవరో యొకబాలుని నరణ్యములో వదలి యతనిని జంతువులు తినకుండుటకై చుట్టు నగ్నిని బ్రజ్వలింపజేసి పోయిరి. అటు తిరుగుటకు వెళ్ళిన లక్ష్మణభట్టు భార్యతో బాటాబాలుని జూచి యతనిని దీసికొని క్రమముగా మరల గాశీ చేరుకొనెను.

ఆ దొరికిన పిల్లవానిని బెంచి పెద్దవానిని జేసిరి. అతడు బాల్యావస్థ నుండి యువకుడగు వఱకు గొంత విద్యనభ్యసించెను. ఆస్థితిలో లక్ష్మణభట్టు నతని భార్యయు జనిపోయిరి. ఆ పిల్లవాడు మరల

సనాథుడై క్రమముగా విష్ణుస్వామి మందిరమున నొకనికి శిష్యుడై జీవనము గడపసాగెను. ఆ మందిరమున నున్నవారితో జగడమాడి మరల కాశీ చేరుకొనెను. అక్కడ నతడు సంన్యాసి యయ్యెను. అట్లే జాతి బహిష్కృత బ్రాహ్మణు డొకడు కాశీలో నివసించుచుండెడివాడు. అతని పుత్రిక యువతియై యుండెను. ఆ బ్రాహ్మణుడు లక్ష్మణభట్ట పాలితపుత్రునితో 'నీవు సంన్యాసము వదలి నా పుత్రికను బెండ్లిచేసికొని గృహస్థుడవు కమ్ము' అనెను. ఆత డందులకు నంగీకరించి యాయువతిని బెండ్లాడి గృహస్థుడయ్యెను. తండ్రిచేసిన లీలయే పుత్రుడు కూడ జేసెను. అతడు స్త్రీని వెంటబెట్టుకొని పూర్వము తానున్న విష్ణుస్వామి మందిరమునకు వెళ్ళగా వారతని నక్కడ నుండనీయక వెడల గొట్టిరి.

అతడట నుండి వెడలి క్రమముగా నవిద్యకు నిలయమైన వ్రజదేశమునకు వెళ్ళి నానావిధములగు కపటయుక్తులతో దన ప్రపంచము నట వ్యాపింపజేయ నారంభించెను. మిథ్యావిషయములను బ్రసిద్ధి జేయ నారంభించెను. శ్రీకృష్ణుడు నాకు దర్శనమిచ్చి 'గోలోకమునుండి దైవీజీవులు మర్త్యలోకమునకు వచ్చిరి. వారిని బ్రహ్మసంబంధాదులచే బవిత్రులను జేసి మరల గోలోకమునకు బంపుము. అను నిట్టి యబద్ధపు వార్తలను జనులలో బ్రసిద్ధి చేయదొడగెను. ఇట్టి ప్రలోభన వాక్యములతో గొందఱను వశపఱచుకొని యెనుబది నలుగురు వ్యక్తులను వైష్ణవులను జేసెను.

(వల్లభమంత్రము–సమీక్ష)

నిమ్న లిఖిత మంత్రములను గూడ రచియించెను. వానిలోను గొంత భేదమును గల్పించెను.

ఎట్లన :– "శ్రీకృష్ణః శరణం మమ." (౧)

"క్లీం కృష్ణాయ గోపీజన వల్లభాయ స్వాహా." (౨)

అను నివి రెండును నారాయణ మంత్రములు. ఇక ముందు జెప్పబోవు మంత్రము బ్రహ్మ సంబంధము. సమర్పణము జేయుటకు జెందినది.

"శ్రీకృష్ణః శరణం మమ. సహస్ర పరివత్సరమిత కాలజాత కృష్ణ వియోగ జనిత తాపక్లేశానంత తిరోభావోఽహం భగవతే కృష్ణాయ దేహేంద్రియ ప్రాణాంతఃకరణ తద్ధర్మాశ్చ దారాగార పుత్రాప్త విత్తేహ పరాణ్యాత్మనా సహ సమర్పయామి. దాసోఽహం కృష్ణ తవాస్మి."

సమీక్ష :– ఈ మంత్రము నుపదేశించి శిష్యులను, శిష్యలను సమర్పణము చేయించును. 'క్లీం కృష్ణాయ' ఇందలి క్లీం తంత్రములకు సంబంధించినది. దీనిం బట్టి వల్లభమతముకూడ వామమార్గులకు సంబంధించినదే యని బోధపడుచున్నది. తఱచుగా గుసాయీలు దీనితోనే స్త్రీ సంగమము చేయుచుందురు. 'గోపీజనవల్లభాయ' కృష్ణుడు గోపికలకేనా వల్లభుడు? ఇతరులకు గాడా? స్త్రీ భోగమున జిక్కిక స్త్రైణుడయినవాడే స్త్రీలకు బ్రియుడగును. కృష్ణు డిట్టివాడేనా?

"సహస్ర పరివత్సరేతి" ఈ సహస్ర వర్షముల గణన వ్యర్థము. ఏలయన వల్లభుడు నతని శిష్యులు సర్వజ్ఞులు కారు. కృష్ణుని వియోగమై సహస్రవర్షములేనా యైనది? వల్లభుడు కాని, యతని మతము కాని పుట్టక ముందు కృష్ణుడు తన దైవీజీవులను నుద్ధరింప నేల ప్రయత్నింప డయ్యె? తాపము, క్లేశము రెండు నొక్కటియే. ఇందేదేని యొకపదమును గ్రహింపవలసి యుండెను. రెండును గ్రహించుట దోషమనియు నతనికి దెలియదు. ఇందు ననంత శబ్దమును బఠించుట వ్యర్థము. అనంతశబ్దము గ్రహించిన సహస్రశబ్దము గ్రహింపరాదు. సహస్రశబ్దపాఠమునుంచిన ననంతశబ్దము వ్యర్థము. అనంతకాలమునుండి తిరోహితుడై – యాచ్ఛాదితుడై యున్నవాని ముక్తికొఱకు వల్లభుడు పుట్టుటయు వ్యర్థమే యగును. అనంతకాల మన్తము కాదుగదా! దేహము, నింద్రియములు, ప్రాణాంతఃకరణములు, వానిధర్మములు, స్త్రీ, స్థానము, పుత్రులు, ప్రాప్తధనము నన్నియు గృష్ణున కేల యర్పణము జేయవలయును? ఏలయన గృష్ణుడు పూర్ణకాముడు.

కావున నతడు వీని నేల కోరును? ఇంతేకాక దేహాదుల నర్పణము జేయుటయు జరుగనేరదు.దేహము నర్పించుట యనగా నఖాగ్రము మొదలు శిఖాగ్రమువఱకు దేహమనబడును. అందుగల మలము మూత్రము మున్నగు మంచి చెడు వస్తువుల నర్పణము జేయుటెట్లు పొసగును.

మఱియు బాపపుణ్యరూప కర్మలు నుండును. వానిని గృష్ణుని కర్పించినయెడల వాని ఫలములను గూడ గృష్ణుడే యనుభవింపవలయునా? అనగా గృష్ణున కర్పింపుడని యతనిపేరు చెప్పి సమర్పణము తమకొఱకే చేయించుకొందురు. దేహమునగల మలమూత్రాదు లన్నియు గోసాయీల కేల యర్పణము కావు? స్వాదిష్టపదార్థము లన్నియు దాను మ్రింగి చేదువస్తువుల నుమియుటయా గోసాయీల పని? అర్పణముకూడ గోసాయీలకే చేయవలయును. ఇతర మతముల వారికి సమర్పింప రాదనియు వ్రాయ బడియున్నది. ఇది స్వార్థ సింధువుల పని. పరుల ధనాది పదార్థములను హరించుటకు, వేదాది విహిత కర్మలను నాశము చేయుటకే యాలీల లన్నియు వ్రాయబడినవి. చూడుడీ వల్లభప్రపంచము :-

"శ్రావణస్యామలే పక్షే ఏకాదశ్యాం మహా నిశి
సాక్షాత్ భగవతా ప్రోక్తం తదక్షరశ ఉచ్యతే" (౧)
"బ్రహ్మసంబంధ కరణాత్ సర్వేషాం దేహజీవయోః
సర్వదోషనివృత్తిర్హి దోషాః పంచ విధాః స్మృతాః" (౨)
"సహజా దేశకాలోత్థా లోకవేద నిరూపితాః
సంయోగజాః స్పర్శజాశ్చ న మన్తవ్యాః కదాచన" (౩)
"అన్యథా సర్వదోషాణాం న నివృత్తిః కథంచన
అసమర్పిత వస్తూనాం తస్మాద్వర్జన మాచరేత్" (౪)
"నివేదిభిః సమర్ప్యైవ సర్వం కుర్యాదితి స్థితిః
న మతం దేవదేవస్య స్వామి ముక్తి సమర్పణమ్" (౫)
"తస్మాదాదౌ సర్వకార్యే సర్వవస్తు సమర్పణమ్
దత్తాపహారవచనం తథా చ సకలం హరేః" (౬)
"న గ్రాహ్యమితి వాక్యం హి భిన్నమార్గపరం మతమ్
సేవకానాం యథా లోకే వ్యవహారః ప్రసిద్ధ్యతి" (౭)
"తథా కార్యం సమర్ప్యైవ సర్వేషాం బ్రహ్మతా తతః
గంగాత్వే గుణదోషాణాం గుణదోషాది వర్ణనమ్" (౮)

ఇట్టి శ్లోకములు గోసాయీల 'సిద్ధాంతరహస్యము' మున్నగు గ్రంథములందున వ్రాయబడియున్నవి. ఇవియే గోసాయీమత ముఖ్యతత్త్వములు. ఎవ్వరైనను వీరి నడుగుడు. కృష్ణుని దేహాంతమై దాదాపుగా నైదువేల సంవత్సరము లగుచున్నది. అతడు వల్లభునితో శ్రావణమాసమున నర్ధరాత్రివేళ నెట్లు కలిసెను? (౧)

గోసాయికి శిష్యుడైనవాడు తన సర్వపదార్థములను గోసాయికి నర్పించును. అందువలన నతని శారీరక దోషములు, జీవదోషములు నన్నియు నివృత్తము లగును. ఇదియే వల్లభుని ప్రపంచము. మూర్ఖులను వంచించి తమమతములో జేర్చుకొనుటయే వారిమతము. గోసాయీల శిష్యులైనవారి సర్వదోషములు నివృత్తములైనచో వారు రోగములతోను దారిద్ర్యముతోను బీడితు లేల యగుచున్నారు? దోషము లైదువిధములు (౨)

మొదటిది - సహజదోషము-స్వాభావిక దోషములు. అనగా గామ క్రోధాదుల వలన నుత్పన్నము

లగునవి. రెండవది- ఒకానొక దేశమునందో కాలమునందో చేయబడు నానావిధ దోషములు. మూడవది- లోకమున భక్ష్యాభక్ష్యములవలన నేర్పడునవి. వేదోక్తములైన మిథ్యాభాషణాది దోషములు. నాల్గవది- సంయోగమువలన గలుగు దోషములు. చౌర్యము, జారత్వము-తల్లి, తోబుట్టువు, పుత్రిక, కోడలు, గురుపత్ని మున్నగు వారితో వ్యభిచరించుటవలన గలుగు దోషములు. ఐదవదోషము - స్పర్శజములు. స్పృశింప గూడని వారిని స్పృశించుట. ఈ యైదు విధములగు దోషములను గోసాయీ లంగీకరింపరాదు. అనగా నిష్టము వచ్చినట్లు చరింపవలయునని భావము. (౩)

గోసాయీల మతము తప్ప మఱియొక విధము దోషముల నివృత్తికి లేనేలేదు. కావున గోసాయీ శిష్యులు తమ పదార్థములను గోసాయికి నర్పింపక తా మనుభవింపరాదు. అందువలననే శిష్యులు తమ స్త్రీలను, బుత్రికలను, గోడండ్రను ధనాది పదార్థములను సమర్పింతురు. గోసాయి చరణ సేవకు సమర్పితము కానంతవఱకు శిష్యుడు తన స్త్రీని గూడ దాను స్పృశింపరాదు. ఇది వారి సమర్పణనియమము. (౪)

అందువలన శిష్యులు తమ పదార్థములను గోసాయికి సమర్పించి తదుపరి తాము భోగింపవలయును. పదార్థములను దాము ముందుగా ననుభవించినచో నవి సమర్పణమునకు బనికిరావు. (౫)

కావున నితరకార్యము లన్నియు వదలి ముందు దమ పదార్థములను సమర్పింపవలయును. ప్రథమమున గోసాయికి దనస్త్రీని సమర్పించి తదుపరి తాను గ్రహింపవలయును. అట్లే విష్ణువునకు గూడ సమస్త పదార్థములను సమర్పించి తదుపరి తాము భుజింపవలయును. (౬)

గోసాయీల శిష్యులు భిన్నమతస్థుల మాట లెన్నడు వినరాదు. వానిని గ్రహింపను గూడదు. వారి శిష్యుల వ్యవహారములలో నిదియే ప్రసిద్ధి. (౭)

సర్వవస్తువులను సమర్పించి యందఱి యెదుట బ్రహ్మబుద్ధి చేసికొనవలయును. తదుపరి గంగలో నన్యజలములు కలిసి గంగరూపమును ధరించునట్లు తమమతములో గుణములు, నితరమతములో దోషము లున్నట్లుగా భావించి తమ మతగుణములను వర్ణింపవలయును. (౮)

సమీక్ష :- చూడుడు. గోసాయీల మత మితర సర్వమతముల కంటె నెక్కుడుగ దన ప్రయోజనము సిద్ధపఱచుకొనునదియై యున్నది. బ్రహ్మమునకున్న లక్షణములలో నొక్కటియు మీరెఱుగరు. శిష్యులకు శిష్యురాండ్రకు బ్రహ్మసంబంధము నెట్లు మీరు చేయగలరు? అని గోసాయీల నడిగిన 'మేమే బ్రహ్మలము. మాతో సంబంధము చేసిన బ్రహ్మసంబంధమగును' అని యందురేని మీలో బ్రహ్మకు సంబంధించిన గుణకర్మస్వభావములలో నొక్కటియు లేదుకదా? కేవలము భోగవిలాసము కొఱకు బ్రహ్మవై కూర్చుంటివా? యని యడుగవలయును.

శిష్యులను, శిష్యురాండ్రను మీరు మీతోబాటు సమర్పితము చేసికొని శుద్ధము చేయుచున్నారు. బాగుగనే యున్నది. కాని మీభార్యలు, పిల్లలు, కోడండ్రు నెవరికి సమర్పితలు కారుగదా! వా రసమర్పితులై యెట్లు శుద్ధమగుదురు! వా రశుద్ధులుగానే యుందురా? అసమర్పిత వస్తువును మీ రశుద్ధముగా నెంచుచున్నారు. అసమర్పిత లై యశుద్ధముగా నున్నవారికే బుట్టిన మీరెట్లు శుద్ధులగుదురు? కావున మీరు కూడ మీ స్త్రీలను, బిల్లలను నితర మతస్థుల కర్పించి వారిని శుద్ధము చేసికొనుట మీకు గర్తవ్యమగుచున్నది. అది యట్లు కాదందురేని యితరుల స్త్రీలను బిల్లలను గూడ ధనాదులతోబాటు సమర్పితము జేసికొనుట మానివేయుడు.

ఇంతవఱకు జరిగిన దేదో జరిగినది. ఇకముందైన నిట్టి మిథ్యాప్రపంచాది చెడుగులను మానివేయుడు. సుందరము వేదవిహితమునైన మార్గము నవలంబించి మానవజన్మమును సఫలము చేసికొనుడు. ధర్మార్థకామమోక్షము లను నీ చతుష్టయ ఫలములను బొంది యానందము ననుభవింపుడు.

(పుష్టిమార్గము-కుష్ఠిమార్గము)

గోసాయీలు తమ సంప్రదాయమును 'పుష్టిమార్గ' మని చెప్పుదురు. అనగా దిని త్రాగి పుష్టిని సంపాదించుకొని స్త్రీలతో నెల్లరతో భోగవిలాసము లనుభవించుటనే వీరు పుష్టిమార్గమందురు. భోగముల నిట్లనుభవించుచు బెద్ద పెద్ద భయంకరములైన భగందరాది రోగముల పాలయి కుళ్ళి కుళ్ళి చచ్చు వారెవరని వీరిని ప్రశ్నింపవలయును.

వాస్తవ మేమన నిది పుష్టిమార్గము కాదు. ఇది కుష్ఠిమార్గమున దగియున్నది. కుష్ఠరోగి శరీరమునం దలి ధాతువు లన్నియు కరగి బయటబడుచుండ విలపించుచు శరీరము విడుచునట్లు యీగోసాయీల స్థితియు లీలలు చూడబడుచున్నవి. కావున దీనిని నరక మార్గమనుట సంగత మగును. ఏలయనగా దుఃఖమే నరకము. సుఖమే స్వర్గము.

ఇట్లే మిథ్యయను వలలను బన్ని మూర్ఖులను సమాయకులైన వారిని దమవలలో వేసికొందురు. తమ్ము దాము శ్రీకృష్ణుల మనుకొని యెల్లరకు స్వాము లగుచుందురు. గోలోకమునుండి పృథివికి దిగివచ్చిన జీవుల నుద్ధరించుటకే మేము లీలా పురుషోత్తములమై జన్మించితిమి అని చెప్పుచుందురు.

అంతేకాక మాయుపదేశము బొందనంతవఱకు మీకు గోలోక ప్రాప్తి కలుగ నేరదు. ఆ లోకమున గృష్ణుడొక్కడే పురుషుడు. మిగిలిన వారెల్లరు స్త్రీలు.

ఆహాహా! మీ మతమెంత మంచి దనవలయునో తోచకున్నది. గోసాయీల శిష్యు లెల్లరు గోపికలై పోవుదురు. పాఠకులార! విచారించుడు. వీరి మత వైశిష్ట్యమును! సాధారణముగ లోకమున నిరువురు భార్యలున్న పురుషుని దుర్దశ యింతయని చెప్పనలవికాదు. అట్టియెడ గోలోకమున బురుషు డొక్కడు వేల కోట్ల సంఖ్యలో స్త్రీ లాతని వెంట బడిన నతని గతి యేమి కావలయును! అతని దుఃఖముల కంతుండునా!

శ్రీకృష్ణునందు గొప్ప సామర్థ్యమున్నది. అత డందఱను ప్రసన్నులను జేయగల డందురేని, కృష్ణుని స్త్రీ-స్వామిని యనబడు నామెయందును శ్రీకృష్ణునియంత సామర్థ్య ముండవలయును. కారణమేమన నామె యతని యర్ధాంగిని కదా! ఈ లోకమున స్త్రీపురుషులలో గామచేష్ట సమానమో లేక స్త్రీయందు నధికముగానో యుండునందురు. కావున గోలోకమునమాత్రమేల యట్లుండదు? అది సత్య మగునెడల స్వామికి దక్కిన స్త్రీలకును జగడము జరుగుచుండవచ్చును. కాణమేమన సపత్ని భావము చాలచెడ్డది కదా! అందువలన గోలోకము స్వర్గమునకు బదులు నరకమై యుండవచ్చును.

ఈ లోకమున బలువురు స్త్రీలతో సాంగత్యము చేయు పురుషుడు భగందరాది వ్యాధులలో బాధలు పడునట్లు గోలోకమునగూడ నట్టి స్థితియే యుండవచ్చు. ఛీ! ఛీ!ఛీ! ఇట్టి గోలోకముకంటె నీమర్త్య లోకమే పాపము చాల మంచిగా గనబడుచున్నది. చూడుడు! ఇక్కడ గోసాయీబాబా తనను శ్రీకృష్ణుడని చెప్పుకొనును. ఇట్లు చెప్పుకొని పెక్కుమంది స్త్రీలతో లీలలు దుఃఖముల ననుభవించుచుండును. గోలోక మున నున్న కృష్ణుడు మాత్ర మీరోగములతో బీడితు డేలకాడు? శ్రీకృష్ణునకు బీడ గలుగ దందురేని యతని స్వరూపుడే యగు నీగోసాయి కేల రోగములు తగుల్కొనుచున్నవి? ఏల పీడితుడగుచున్నాడు!

ప్రశ్న :- మర్త్యలోకమున లీలావతారము ధారణము చేయుటవలన రోగదోషములు కలుగును. గోలోకమున నట్లు గలుగవు. అక్కడ రోగదోషమే లేదు.

ఉత్తరము :- 'భోగే రోగభయమ్' ఎట భోగముండునో యట రోగభయ మవశ్య ముండును. శ్రీకృష్ణునకు గోట్లకొలది సంతానముకూడ గలుగునా? కలుగదా? సంతానము కలిగిన యాసంతానము కేవలము స్త్రీ సంతానమేనా? లేక పురుష సంతానమా? లేక స్త్రీపురుషులిరువురు కలుగుదురా? కేవలము

స్త్రీ సంతానము కలుగునందురా? వారి వివాహ మెవరితో నగును?

అక్కడ శ్రీకృష్ణ డొక్కడే పురుషుడు కదా! మఱియొక పురుషుడు లేడుకదా! ఇంకొక పురుష దున్నాడందురేని గోలోకమున బురుషుడు శ్రీకృష్ణ డొక్కడే యను ప్రతిజ్ఞకు భంగము వాటిల్లును. కేవల పురుష సంతానము కలుగు నందురేని మరల నదియే దోష మేర్పడును. వారి వివాహము లెవరితో జరుగును? అందఱు నింటిలోనే 'గోల్‌మాల్' చేసికొందురా? లేక యితర పురుషు లుందు రందురేని గోలోకమున గృష్ణ డొక్కడే పురుషు డను మీ ప్రతిజ్ఞగతి యేమగును? నష్టము కాదా?

ఒకవేళ గోలోకమున సంతానమే కలుగ దందురేని, శ్రీకృష్ణుడు నపుంసకుడో లేక స్త్రీలందఱు మాచకమ్మ-వంధ్యలు కావలసి వత్తురు. ఇది గోలోకమా? లేక దిల్లీబాద్ షాహ బీబీల సేనయా!

(తను మనోధనముల యర్పణము)

ఇక గోసాయీ శిష్యులు, శిష్యలు నెల్లరు దనువును మనస్సును ధనమును నర్పణము చేయుదురు; గోసాయీలు చేయించుకొందురు. ఇదియు సరిగా లేదు. ఏలయనగా వివాహ సమయమున స్త్రీ పురుషు లిరువురు బరస్పర మొకరి శరీరమును మఱియొకరి కర్పణము చేసికొందురు. మనస్సు కూడ నితరుల కర్పింప వీలులేనిది. శరీరముతోబాటు మన స్సర్పింపబడును. అది విడిగా నర్పింప నెట్లగును? శరీరము నొకరి కప్పగించి మనస్సును మఱియొకరి కర్పించిన వ్యభిచారు లగుదురు. ఇక మిగిలినది ధనము. దాని లీలయు నింతే. మనస్సులేక యేదియు నర్పింప బడదు. దీనిం బట్టి శిష్యులు సంపాదించవలయును, గురువు దాని ననుభవింపవలయునని సిద్ధమగుచున్నది.

వల్లభ సంప్రదాయులగు గోసాయీ లెల్లరు తైలంగీ జాతికి జెందిన వారు కారు. పొరపాటున నెవరేని వీరికి బిల్లనిచ్చిన వారు జాతిభ్రష్టులై జాతిబాహ్యు లగుదురు. ఇట్లు జాతిబాహ్యు లైనందున, విద్యావిహీను లగుటచేతను బ్రమాదమున బడియుందురు.

(ఇంటికివచ్చిన గోసాయిలీల)

చూడుడు - ఎవరేని గోసాయిని నింటి కాహ్వానించినచో నతడు వానియింటికి వెళ్ళి మౌనము వహించి కొయ్యబొమ్మవలె గదలక మెదలక కూర్చుండును. పలకనైన బలకడు. ఏలయన నతడు మూర్ఖుడై యుండును. మూర్ఖుడు కాకున్న మాటలాడ గలుగును. 'మూర్ఖాణాం బలం మౌనమ్' మూర్ఖులకు మౌనమే బలము. నోరు తెఱచి మాటలాడిన నతని బండారము బయట పడును. కాని, స్త్రీలవంక ధ్యానముతో జూచుచుండును. గోసాయి యెవరి వంక ధ్యానముతో జూచునో యామె భాగ్యవంతురాల గును. ఆమె భర్త, తల్లిదండ్రులు, బంధువులు మిక్కిలిగా సంతోషింతురు.

అక్కడ స్త్రీలెల్లరు గోసాయి పాదములంటి నమస్కరింతురు. అందేస్త్రీపై నతని దృష్టి విశేషముగా బడునో యాస్త్రీ పాదములంటి నపుడామె యంగుళిని పాదముతో నొక్కును. అప్పుడు స్త్రీ యొక్క పతి, బంధువులు నామెతో "నీవు గోసాయి చరణసేవ జేయుము. వెళ్ళు" అందురు. ఎవరేని యిష్టపడకున్న దాసినో, మఱియొకరినో గోసాయి సేవకు బంపుదురు. వాస్తవ మడిగిన నిట్టి పనులు చేయువారు వారి మందిరములందును వారి సమీపముననను బలువు రుందురు.

(ఇక వీరి దక్షిణలీల కోరువిధము)

గోసాయిగారికి గానుకలు తెండు. కోడలి కానుక, పుత్రుని కానుక, పుత్రిక కానుక, యజమానుని కానుక, పరిచారిక కానుక, గాయకుని కానుక, ఠాకూర్‌జీ కానుక ఈ యేడు దుకాణముల నుండి యిష్టము వచ్చి నట్లు దానదక్షిణలు దోచుకొందురు. ఎప్పుడేని గోసాయి సేవకు డెవడైన మరణించుచున్న సమయమున నతని రొమ్ముమీద గోసాయి తన పాదము నుంచును. అప్పుడు తన కేది లభించిన నది గుటక

వేయును. ఇది యేమిపని? స్మశానములో శవములపై దానము గ్రహించు మహాబ్రాహ్మణులయు కాటికాప రులయు బనికాదా?

కొందఱు శిష్యులు వివాహ సమయమున గోసాయిని దమ యిండ్ల కాహ్వానించి యతనిచేత బుత్ర పుత్రికల వివాహములుకూడ జరిపింతురు. శిష్యులలో నొక్కొక్కరు గోసాయికి 'కేసరియా' స్నానము జేయింతురు. అనగా గోసాయి శరీరమునకు గుంకుమపువ్వుతో స్త్రీలు నలుగుపెట్టి యతని నొక పెద్ద పాత్రలో బీటవేసి కూర్చుండబెట్టి స్నానము చేయింతురు. ఈ స్నానము చేయించునపుడు పురుషులు న్నను ముఖ్యముగా స్త్రీలే యతని శరీరమును దోమి స్నానము చేయింతురు. తదుపరి యతడు పీతాంబరము ధరించి స్నానము చేసిన ధోవతి నందులోనే విడిచి పెట్టును. అంతట నాస్నానము చేసిన జలమును శిష్యు లాచమనము చేయుదురు. తదుపరి గోసాయికి బాగుగ మసాలా యుంచిన తాంబూల విడెము నిత్తురు. ఆతడాతాంబూలమును నమలి కొంత మ్రింగి కొంత నొక వెండి పాత్రలో నుమియును. ఆ యుమ్మిరసమును బ్రసాదముగ శిష్యులు పంచుకొని సేవింతురు. దీనిని విశేష ప్రసాదముగా నెంచుదురు.

వీ రెట్టివారో మీ రిప్పుడు విచారింపుడు. వీరు చేయుపనులు మానవోచితములేనా? ఇంతకు మించిన మూఢత గాని యనాచారముగాని లోకముననుండునా? అదే సమయమున చాలమంది నుండి సమర్పణమును గూడ గ్రహింతురు. వీరిలో గొందఱు వైష్ణవులు వంటచేసిన దిందురు. ఇతరుల చేతిది తినరు. మఱికొందఱు వైష్ణవుల చేతిదికూడ దినరు. వంటచెఱకును గూడ గడిగి శుద్ధిచేసి కొందురు. కాని, పిండి, బెల్లము, చక్కెర మున్నగు వానిని గడుగకయే గ్రహింతురు. వీనిని గడిగిన వస్తువు చేతికి దక్కదు కదా! కావున నీ పదార్థములను 'అస్పర్శ' స్పర్శదోషము లేనివిగా నెంచెదరు.

వీరు తాము (ఠాకూర్) కృష్ణుని విగ్రహము నలంకరించుటలోను, నైవేద్యాదుల నర్పించుటలోను, నధిక ధనమును వెచ్చింతు మని చెప్పుచుందురు. కాని యవి యన్నియు దామే యనుభవింతురు. నిజమారయ గొప్పగొప్ప యధర్మము లాచరింతురు. అనర్థములు జరుగును. 'హోలీ' వసంతోత్సవ సమయమున రంగులుకలిపిన నీటిని బిచికారులలో నింపి స్త్రీల గుప్తేంద్రియముల మీద గొట్టుదురు. బ్రాహ్మణులకు నిషిద్ధమయిన రసవిక్రయమును గూడ వీరు చేయుదురు.

ప్రశ్న :– గోసాయి రొట్టె, పప్పు, నన్నము, శాకము లడ్డు మున్నగు పదార్థములను దుకాణముమీద కూర్చుండి యమ్మరు–కాని తమ నౌకరులకు చాకరులకు నాకులలో బదార్థములనుంచి పంచిపెట్టుదురు. వారు వాని నమ్ముదురు. కాని గోసాయి యమ్మడు.

ఉత్తరము :– గోసాయి తమ నౌకరులకు మాసిక వేతనము నిచ్చినచో వారు తమ పత్రముల నమ్ము కొనవలసిన స్థితి యేల కలుగును? గోసాయి తన నౌకరులకు నన్నాది పదార్థముల నమ్మి వారిద్వారా యితరుల కమ్మింతురు. బ్రాహ్మణులు నౌకరులుగా నున్నవారు రసవిక్రయము నమ్ము దోషమునుండి తప్పుకొందురు. నౌకరులచే నా పని చేయింతురు. గోసాయి తానే రసవిక్రయ రూపదోషము ననుభ వించును. ప్రథమమున దా నీపాపమున మునిగి తదుపరి యితరులను ముంచెను. అక్కడక్కడ నాథ ద్వారము మున్నగుచోట్ల గోసాయికూడ స్వయముగ నన్నాదుల నమ్మును. ఈ రసవిక్రయము చేయుట నీచుల కార్యము. అది యుత్తముల పని కాదు. ఇట్టివారే యార్యావర్తము నధోగతికి దెచ్చిరి.

(స్వామినారాయణ మతఖండనము)

ప్రశ్న :– స్వామి నారాయణుని మత మెట్టిది?

ఉత్తరము :– "యాదృశీ శీతలాదేవీ తాదృశో వాహనః ఖరః" శీతలాదేవి యెట్టిదో యామె వాహనము

గాడిదకూడ నట్టిదియే యన్నట్లు గోసాయీల ధనాపహరణాదు లెట్టివో యట్టిద స్వామి నారాయణుని మతముకూడ.

చూడుడు! అయోధ్యకు సమీపమున నొక గ్రామమునందు సహజానందుడను నామముగల యొకవ్యక్తి జన్మించెను. అతడు బ్రహ్మచారియై గుజరాత్, కాఠియవాడ్, కచ్ మున్నగు ప్రాంతములలో దిరుగుచుండెడివాడు. అత డాప్రాంతములు మూర్ఖులతోను నమాయకులైన ప్రజలతో నిండియుండు టను గమనించెను. వారిని దన యిష్టము వచ్చినట్టు లాడింప వచ్చుననియు నతడు గ్రహించెను.

అక్కడ నతడు నలుగురైదుగురు శిష్యులను బ్రథమమున సంపాదించెను. వారితో నాలోచించి యైకమత్యముతో వారిద్వారా 'సహజానందుడు నారాయణుని యవతారము. గొప్పసిద్ధుడు' నని ప్రచారము జేయించెను. ఇంతేకాక 'చతుర్భుజ మూర్తి ధారణము జేసి భక్తులకు దర్శనమిచ్చు' ననియు బ్రసిద్ధిం జేయించెను.

ఒకసారి కాఠియవాడ ప్రాంతమున కాఠీ అనగా 'దాదాఖాచర్' అను పేరుగల యొక భూస్వామి దగ్గఱకు వెళ్ళి, సహజానందుని శిష్యులు 'నీవు చతుర్భుజుడగు నారాయణుని దర్శనము చేసికొనగోరుదు వేని, సహజానందుని బ్రార్థించి నీకు దర్శనము చేయింపగల'మని చెప్పిరి. అతడును మంచిది. 'ఇంతకంటె నాకు గావలసిన దేమున్నది? అట్లే చేయుడు' అని చెప్పెను. అతడు మిక్కిలి యమాయకుడు.

అంతట నొకనా డొకగదిలో సహజానందుని నిలబెట్టి యతని శిరముపై నొక కిరీటమునుంచి యతని రెండు చేతులలో శంఖము చక్రము నుంచి వానిని బైకెత్తి యుంచునట్లు చేసిరి. మఱియొక శిష్యు డతని వెనుక నిలబడి ప్రక్కలనుండి తన రెండుచేతులను ముందుకు జాచి వానిలో గదా పద్మములనుంచి సహజానందునకు జతుర్భుజాకారమును గలిగించిరి.

తదుపరి దాదాఖాచర్‌ను దీసికొనివచ్చి 'మీరు లోపలికి వెళ్ళి యొకసారి కనులు తెఱచి చూచి వెంటనే కనులు మూసికొని బయటికి రావలయును. ఎక్కువ తడ వట నుండరాదు' అని బోధించి శిష్యు లతనిని లోనికి బంపిరి. ఎక్కువ తడ వటనున్న దమ మోసము తెలిసిపోవు నేమో యనుభయము శిష్యులకు లేకపోలేదు. సహజానందుడు తళుకు బెళుకులతో గూడిన దుస్తులు ధరించి యుండెను. చీకటి గదిలో నతడు నిలబడి యుండెను. దాదాఖాచర్‌ను లోనికిబంపి శిష్యులొక్కసారి లాంతరు వెలుగు లోపల బ్రసరింప జేసిరి. ఆ వెలుగులో దాదాఖాచర్‌కు జతుర్భుజ మూర్తి తళుకు బెళుకులలో గనిపించెను. వెంటనే దీపమును దొలగించి మాటున నుంచిరి. శిష్యులతో బాటుగ చతుర్భుజ నారాయణునకు సాష్టాంగ ప్రణామము లొనర్చి బయటికి వచ్చిరి.

వెంటనే దాదాఖాచర్‌తో 'నీవు చాల ధన్యుడవు. చతుర్భుజుని దర్శనము లభించినది. కావున మీరు గూడ సహజానందుని శిష్యులైన నెంత బాగుండును' అని చెప్ప నారంభించిరి. 'మంచిది. అట్లే కానిండు' అని యతడు సహజానందుని శిష్యు డయ్యెను. ఇంతలో సహజానందుడు వస్త్రములను మార్చుకొని మఱి యొక గదిలో గద్దెపై గూర్చుండి యతనికి గనిపించెను. అప్పుడు 'చూచితిరా వీరి మహిమము. క్షణములో నవతారము మార్చుకొని మనకు దర్శనమిచ్చుచున్నారు' అని శిష్యులు ప్రశంసింపసాగిరి.

ఇట్లు దాదాఖాచర్ వీరి వలలో బడెను. అప్పటినుండియే యీమతమునకు గొంత బలము ప్రచారము కలిగెను. ఏలయనగా 'దాదాఖాచర్' ఒక భూస్వామి, పలుకుబడికలవాడు. అప్పటినుండి సహజానందు డాప్రాంతమున నక్కడక్కడ దిరిగి శిష్యులను సంగ్రహింప నారంభించెను. అప్పుడప్పుడు నొకసాధువు కంఠనాడిని నులిమి వానిని మూర్ఛితుం జేయుచుండెడివాడు. 'నే నితనికి సమాధిని గలిగించితి' నని చాటుచుండెడివాడు. అట్టి ధూర్తతతో 'కాఠియవాడు' ప్రాంతమున నమాయకులగు ప్రజలను దనవలలో

వేసికొన జొచ్చెను. అతడు మరణించిన మీదట నతని శిష్యులు మిక్కిలి పాషండతను వ్యాపింపజేసిరి.

ఈ విషయమున నీ దృష్టాంతము తగియుండును. 'ఒకడు దొంగతనము జేయుచు పట్టుపడెను. న్యాయాధీశు డతని ముక్కును ఖండింప దండనము నొసంగెను. అతనికి ముక్కు ఖండింపబడెను. అప్పుడా ధూర్తు డెగురుచు, నాట్యము చేయుచు, నాడుచు బాడుచు, నవ్వసాగెను. జను లతనిని 'నీవెందు కిట్లు నవ్వుచున్నావు' అని యడుగ నతడు 'ఇది మీకు జెప్పవలసిన విషయము కాదు' అనుచు జను లెక్కువ నిర్బంధింపగా 'ఇది మిక్కిలి యాశ్చర్యకరమైన విషయము. ఇట్టి దృశ్యము నేనెన్నడు జూచి యెఱుగను' అని చెప్పసాగెను.

జనులు మిక్కిలిగా వెంటబడి యడుగగా నతడు 'నేను మీ కేమని చెప్పుదును? నా యెదుట సాక్షాత్తుగా నారాయణుడు చతుర్భుజ ధారియై దర్శన మిచ్చుచున్నాడు. అందువలననే పట్టలేని సంతోష ముతో నే నాడుచు బాడుచున్నాను. నా జన్మము ధన్యమైది. నా భాగ్యమెంత మంచిదో నే నేమన గలను. చతుర్భుజుని దర్శనము చేసికొన గలుగుచున్నాను' అని చెప్పసాగెను. అయిన నీకు గనబడు చతుర్భుజుడు మా కేల కనబడడని లోకులడుగగా ముక్కు మీకు నడ్డము వచ్చుచున్నది. ఆ ముక్కుండగా నాకు మాత్రము కనిపించినాడా యని చెప్పెను. మీ ముక్కులను మీరు కూడ ఖండింప జేసికొనిన దప్పక దర్శనము కావచ్చు ననియెను.

వారిలో నొకమూర్ఖుడు-'ముక్కుపోతే పోయినది. నారాయణుని దర్శనము కలుగును గదా! అవశ్యము దర్శనము చేసికొనవలయును. అని యతడు 'నా ముక్కును ఖండించి నాకు దర్శన మిప్పిం చుడ'ని కోరెను. అత డంతట నతని ముక్కుకోసి యతని చెవిలో 'నేను చేసినట్లు నీవుకూడ జేయుము. లేకున్న నీమర్యాద, నా మర్యాద మంట గలియును, జనులు మనలను బరిహసింతుర'ని చెప్పెను. అంతట నతడును బోయిన ముక్కు రాదుగదా? కావున నతడు చెప్పినట్లు చేయుటయే మంచిదని యతడును నాడపాడ జొచ్చెను. 'నాకును నారాయణుని దర్శనమైనది' అని చెప్పసాగెను. ఇట్లొకరివెంట నొక్కరు ముక్కులను గోయించుకొని యొకవేయిమంది గుంపుగా జేరిరి. పెద్ద గందరగోళ మయ్యెను. వారందఱు 'నారాయణదర్శీ' నామముతో దమ మతమును వ్యాపింప జేయసాగిరి.

ఇది యంతయు మూర్ఖరాజు వినెను. అతడు వారిని దర్శింపబోగా నెల్లరు నాడుచు బాడుచు గం తులు వేయుచుండిరి. ఆ రాజు వారి నడుగగా 'మాకు నారాయణుని దర్శన మగుచున్నది. ఆ యానంద మున నోలలాడుచున్నా' మనిరి.

రాజు :- మా కేల నారాయణ దర్శనము కాదు?

నారాయణదర్శి :- ముక్కున్నంతవఱకు గనిపించడు. ముక్కును గోయించుకొన్న మీకును గన బడును.

రాజు వారి మాటలు నమ్మి జ్యోతిష్కుని బిలిచి ముహూర్తము బెట్టుమనెను. అంతట జ్యోతిష్కుడు 'అన్నదాత! అట్లే కానిండు' అని , 'దశమి నాడు ప్రాతఃకాలమున ముక్కును గోయించుకొని నారాయణుని దర్శనము జేసికొనుటకు మంచి ముహూర్తము'ని చెప్పెను. చూడుడు! ముక్కును గోయించుకొనుటకును జ్యోతిశాస్త్రమున ముహూర్త మున్నదట. ఈ ధూర్తుల నేమనవలయును?

రాజునకు గోరిక కలుగగానే, వారల కందఱకు షడ్రసోపేతమైన భోజనాదుల కేర్పాటు జేసెను. ముక్కిడు లందఱు బాగుగ దిని యెక్కువ గంతులు వేయుచు సంతోషముతో నోలలాడ జొచ్చిరి. కాని రాజు మంత్రులలో బుద్ధిమంతులైన వారి కీవిషయ మంతగా నచ్చదయ్యె. రాజవంశమునకు నాలుగు తరములనుండి మంత్రిగా నుండు నొకవ్యక్తి (౯౦) తొంబది యేండ్ల వయస్సువా డుండెను. అప్పుడు

మంత్రిగా బనిచేయుచున్న వృద్ధుని మునిమనుమడు వృద్ధుని సమీపించి యావిషయమును వినిపించెను. అంతట నావృద్ధుడు 'వారు మూర్ఖులు ధూర్తులును. కావున వారి మాటలను నమ్మరాదు. నన్ను రాజు దగ్గఱకు గొనిపొండు' అని కోరెను. అతనిని రాజుచెంతకు గొంపోయిరి. 'రాజా! ఈ విషయమున మీరు త్వరపడవలదు. త్వరపడి యాలోచింపక చేసిన పనులవలన బశ్చాత్తాప పడవలసి వచ్చును' అని పలికెను.

రాజు :- వేయిమంది యబద్ధము చెప్పుదురా?

మంత్రి :- అబద్ధము చెప్పుచున్నారో సత్యమే చెప్పుచున్నారో పరీక్షింపక యేదియు నమ్మరాదు. పరీక్షింపక యెట్లు చెప్పగలము.

రాజు :- పరీక్ష యెట్లు చేయవలయును?

మంత్రి :- విద్య, సృష్టిక్రమము, ప్రత్యక్షాది ప్రమాణములతో విషయము పరీక్షింపవలయును.

రాజు :- చదువనివా డెట్లు పరీక్షింపగలడు?

మంత్రి :- విద్వాంసుల సాంగత్యముతో జ్ఞానమును వృద్ధిచేసికొని పరీక్షింపవలయును.

రాజు :- విద్వాంసులు లభింపకపోయిన నేమి చేయవలయును?

మంత్రి :- పురుషార్థపరుల కేదియు దుర్లభము కాదు.

రాజు :- అటులయిన నేమి చేయవలయునో మీరే చెప్పుడు.

మంత్రి :- నేను వృద్ధుడను. ఇంటిలో గూర్చుండి యుండువాడను. నేనిక యెక్కువకాలము జీవించువాడను గాను. కావున నేను మొదట నీవిషయమును బరీక్షింతును. తదుపరి మీ కేది మంచిదని తోచిన నటుల జేయుడు.

రాజు :- చాల మంచిది. జ్యోతిష్కుని వంకజూచి దివానుగారి కొఱకు ముహూర్తము నిశ్చయించుడు.

జ్యోతిష్కుడు :- దేవరవారి చిత్తము. ఈ శుక్లపంచమి పదిగంటలకు మంచి ముహూర్తమున్నది.

పంచమి వచ్చినది. ఎనిమిది గంటల సమయమున వృద్ధమంత్రి రాజు గారిని సమీపించి 'రెండువేల సైనికులను దీసికొని రండు' అనెను.

రాజు :- అక్కడ సేనతో బని యేమున్నది?

మంత్రి :- మీకు రాజ్యవ్యవస్థ యేమియు దెలియదు. నేను జెప్పినట్లు చేయుడు.

రాజు :- మంచిది. 'వెళ్ళి సేనను సిద్ధపఱచండి' అని యాజ్ఞ నొసంగెను.

ఉదయము తొమ్మిదిన్నర గంటలకు రాజు వాహనము నెక్కి యెల్లరను వెంటబెట్టుకొని పోయెను. వీరిని జూచి ముక్కుడు అందఱు నాడ పాడ సాగిరి. రాజు తన బలగముతో వెళ్ళి యట గూర్చుండి, యాసంప్రదాయమును బ్రారంభించిన మొదటివానిని బిలిచి, రాజు 'ప్రథమమున మాదివాన్ గారికి నారాయణుని దర్శనము జేయింపు' మనెను. అత డామాటలు విని మంచిది యనెను.

పది గంటల సమయ మయ్యెను. అంతట నొకవ్యక్తి యొకపళ్ళెమును మంత్రిగారి నాసికకు గ్రింద బట్టుకొనెను. అతడు పదునైన కత్తియొకటి తీసికొని మంత్రిగారి ముక్కు కోసి పళ్ళెమున నుంచెను. మంత్రి ముక్కు నుండి రక్తము కారదొడగెను. మంత్రిగారి ముఖము మలిన మయ్యెను. ఆ ధూర్తు డంద ఱకు వలెనే మంత్రిగారి చెవిలో మంత్రోపదేశము చేసెను. "నవ్వుచు నాకు నారాయణుడు కనబడు చున్నాడని యందఱకు చెప్పండి. అటుల జెప్పకున్న నందఱు నిన్ను బరిహసింతురు. అందఱు నవ్వె దరు.' అని చెప్పి యతడు తొలగెను. మంత్రి యంగవస్త్రముతో దన నాసికనుండి కారుచున్న రక్తము నాపుకొనుచు రాజును సమీపించెను.

'మంత్రిగారూ! చెప్పండి, నారాయణుడు కనిపించుచున్నాడా లేదా?' అని రాజు మంత్రినడుగగా నతడు రాజు చెవిలో 'ఏమియు గనిపించుట లేదు. వ్యర్థముగా నీధూర్తుడు వేయిమందిని నాశనము చేసినాడు. అంతయు నబద్ధమే' యనెను. రాజు మంత్రితో 'అయ్యా! మంత్రిగారూ! ఇప్పుడేమి చేయవలె యును?' అని యడుగగా నతడు 'ఈ దుష్టుల నందఱను బట్టుకొని కారాగారములలో నుంచి వారిచేత బనులు చేయించుకొనవలయును. ముఖ్యముగా వీరి నందఱను జెడగొట్టిన వానిని, గాడిదమీద నెక్కించి వాని ముఖమున నలుపురంగు పూసి నగరమున ద్రిప్పి, దుర్దశ కలిగించి కారాగారమున నుంచవలయును.'

రాజు, మంత్రి యిట్లు మంత్రాంగము చేయ ధూర్తు లిది కనిపెట్టి పాఱిపోవ నుద్యమించిరి. కాని నలువైపుల సైనికులు చుట్టుముట్టి యుండిరి. అందువలన బాఱిపోవు నవకాశము లేకుండెను. రాజాజ్ఞ బొంది యెల్లరిని బట్టుకొని బేడీలు తగిలించిరి. ధూర్తనాయకుని ముఖమున మసిబూసి, కంఠమున జెప్పులదండ నొకదానిని వేసి గాడిదపై గూర్చుండబెట్టి నగరమున నూరేగించి వీథుల కూడలులలో జెప్పులతో గొట్టి తన్ని కారాగారమున బడవైచిరి. దానితో ముక్కిడుల సంప్రదాయ మడుగంటెను.

ఇట్లే వేదవిరోధు లెల్లరు గపటోపాయములతో బరుల ధనమానములను హరింతురు. ఇవి యన్నియు సాంప్రదాయకుల లీలలు.

ఈ స్వామి నారాయణమతము వారు ధనమును హరించుటకు వంచనతో గూడిన కార్యము లనేకములు చేయుచుండెడివారు. ఎందఱనో మూర్ఖులను మోసగించుటకు తెల్లగుఱ్ఱమునెక్కి సహజానందుడు మిమ్ముల మోక్షమునకు గొంపోవుటకు వచ్చినాడనియు, ప్రతిదిన మొకమారీమందిరమునకు వచ్చుననియు వారి మరణ సమయమున జెప్పుచుండెడివారు.

ఉత్సవ సమయమున బజారులు మందిరమున లోపల నుందురు. క్రింద నొక దుకాణము తెఱచి యుంచెడివారు. మందిరము నుండి దుకాణములోనికి నొకసొరంగము చేసియుంచిరి. ఎవరైనను గొబ్బరికాయ మందిరమున కానుకగా నిచ్చిన నది యాసొరంగముద్వారా మరల దుకాణమునకు జేర్చబడుచుండెడిది. ఇట్లొక్క కొబ్బరికాయ యొక దినమున సుమారు వెయ్యి పర్యాయము లమ్ముడు బోవుచుండెడిది. ఇట్లే యితర పదార్థములను గూడ నమ్మెడివారు.

ఏ జాతికి సంబంధించిన సాధువు నా జాతికి సంబంధించిన పనుల కుపయోగించెడివారు. మంగలి సాధువుతో మంగలిపని, కుమ్మరి సాధువుతో గుమ్మరిపని, శిల్పులచే శిల్పులపని, వైశ్యులచే వైశ్యులపని, శూద్రులచే శూద్రులపని చేయించెడివారు. తమ శిష్యులకు నొకవిధమగు పన్ను 'టేక్స్' అను పన్ను విధింపబడినది. లక్షల కోట్ల రూప్యములను భోగుచేసిరి. ప్రోగుచేయుచునే యున్నారు. గద్దె మీద గూర్చుండువాడు వివాహితుడై గృహస్థుడుగా నుండును. ఆభూషణములను ధరించి యుండును. ఎక్కడికైనను వెళ్ళినపు డచట గోకులీయులవలెనే పూజలు కానుకలు గ్రహించును.

తమ్ము దాము సత్సంగుల మనియు నితరమతముల వారిని గుసంగులనియు నందురు. ఇతరు లెంతయుత్తమ విద్వాంసులైనను వారిని గౌరవింపరు. సేవచేయరు. ఇతర మతస్థులకు సేవజేయుట పాపముగా నెంచుదురు. బయట స్త్రీసాధువుల ముఖమైనను జూడరు. గుప్తముగా వారేమి లీలలు వారితో జేయుదురో తెలియదు. దీని ప్రసిద్ధి యంతటను దక్కువయే. కాని సాధువుల పరస్త్రీ గమనాది లీల లతిప్రసిద్ధములే.

వారిలో బెద్దపెద్దసాధువులు చనిపోయినపుడు వారి శరీరముల నొకగుప్తమైన పెద్దకూపమున బడవైచి వారు దేహముతో వైకుంఠమునకు బోయిరని వెల్లడి చేయుదురు. సహజానందుడు వచ్చి వారిని దీసికొని వెళ్ళినట్లును జెప్పుదురు. ఇంతేకాక వారిని 'వీరిని దీసికొని వెళ్ళకండి, ఇంక గొంతకాల మిక్కడనే యుండ

నిండు. ఈ మహాత్ము డిక్కడ నుండుట చాల మంచిది' అని మేము ప్రార్థించితిమి. కాని, సహజానంద మహారాజు 'కాదు ఇప్పు డీమహాత్ముని యావశ్యకము వైకుంఠమున నెంతగానో యున్నది. అందువలన దీసికొనివెళ్ళుచున్నాము' అని చెప్పిరి. మేము మా కన్నులతో సహజానందస్వామిని విమానమును జూచితిమి. అని చెప్పుచుందురు. ఇంతేకాదు. 'మరణించిన మహాత్ముని విమానమున గూర్చుండబెట్టి పుష్ప వృష్టి గురియించుచు దీసికొని వెళ్ళిరి' అనియు బ్రసిద్ధి చేయుదురు.

ఎప్పుడేని యొకసాధువు రోగగ్రస్తుడై మరణాసన్నుడైనపుడతడు 'నేను రేపురాత్రికి వైకుంఠమునకు బోవుదును' అని చెప్ప నారంభించును. అత డారాత్రి చావకపోయిన మూర్ఛితావస్థలో నున్నపుడే యతని దీసికొని యాగుప్త కూపమున బడవేయుదు రనియు వినికిడి. అట్లు చేయకున్న నతడు చెప్పిన మాట లసత్యము లగును గదా? కావున నటుల జేయుదు రనుటలో నాశ్చర్యపడవలసిన దేమియు నుండదు. ఇట్లే గోకులీయ గోసాయి మరణించినపుడును వారును 'గోసాయి లీలావిస్తారము చేసినాడ'ని వారి శిష్యులు చెప్పుదురు.

గోకులీయ గోసాయీలు, నారాయణస్వామి మతమువారు నుపదేశించు మంత్ర మొక్కటియే. అది 'శ్రీకృష్ణః శరణం మమ' దీని యర్థము 'శ్రీకృష్ణుడు నాశరణము అనగా నేను శ్రీకృష్ణుని శరణా గతుడను. కాని దీని యర్థము 'శ్రీకృష్ణుడు నాశరణమునకు బ్రాప్తుడు, అనగా శ్రీకృష్ణుడు నాశరణాగతు డగుగాక! అనియు నగును. ఈ మతముల వారెల్లరు విద్యావిహీను లగుటవలన ననర్థకములగు శాస్త్రవిరుద్ధ వచనములను రచియింతురు. వీరికి విద్యానియమముల జ్ఞానముండదు.

(మాధ్వమతము-సమీక్ష)

ప్రశ్న :- మాధ్వమతము మంచిదేకదా!

ఉత్తరము :- ఇతర మతావలంబులవంటివారే మాధ్వమతము వారును. ఏలయనగా వారును జక్రాం కితు లగుదురు. వారిలో జక్రాంకితుల కంటె గొంచెము విశేషమున్నది. రామానుజీయు లొకేమాటు చక్రాంకితులైన మాధ్వులు సంవత్సరమున కొకసారి మరల జక్రాంకితు లగుదురు. చక్రాంకితులు కపాల మున బీతరేఖను దిద్దిన మాధ్వులు నలుపు రేఖను దిద్దుదురు. ఒక మాధ్వపండితునితో నొకమహాత్మునకు శాస్త్రార్థము జరిగెను. ఎట్లన --

మహాత్మా :- మీ రీనల్లనిరేఖ చందనపు దిలకమునేల పెట్టుకొనిరి?

మాధ్వ :- దీనిని బెట్టుకొనినందున మేము వైకుంఠమునకు బోవుదుము. శ్రీకృష్ణుని శరీరముకూడ నల్లనిదేగదా! అందువలననే మేము నల్లని బొట్టు పెట్టుకొందుము.

మహాత్మా :- ముఖమున గలయీ చిన్నబొట్టుతోనే వైకుంఠమునకు బోవుదువేని, ముఖమంతయు నలుపుజేసిన నెటకు బోవుదువు? వైకుంఠమును గూడ దాటిపోవుదువా? శ్రీకృష్ణుని శరీరము నలుపు కావున మీరు మీ శరీరమంతయు నలుపేల చేసికొనరు? అప్పుడు శ్రీకృష్ణునితో సాదృశ్యము కూడ గలుగును గదా? దీనిం బట్టి చూచిన నీమతముకూడ బూర్వమతముల వంటిదే.

(లింగాంకితమతము)

ప్రశ్న :- లింగాంకితుల మత మెట్టిది?

ఉత్తరము :- చక్రాంకితుల వంటిదే. చక్రాంకితులు చక్రముతో ముద్రలు వేసికొని నారాయణుని దప్ప యితరుల నంగీకరింపనట్లు, లింగాంకితులు, లింగముతో గాల్చి ముద్రలు వేసికొని మహాదేవుని దప్ప మఱియొకరి నంగీకరింపరు. వీరిలో విశేష మేమన, రాతిలింగము నొకదానిని వెండితోనో, బంగారము తోనో తొడుపువేసి దానిని గంతమున వ్రేలాడ వేసికొందురు. వారు నీరు త్రాగవలసివచ్చినను వాలింగము

నకుజూపి త్రాగుదురు. వారి మంత్రము కూడ శైవుల మంత్రమువలె నుండును.

(బ్రాహ్మ-ప్రార్థనాసమాజములు)

ప్రశ్న :- బ్రాహ్మసమాజము. ప్రార్థనా సమాజము మంచివే కదా?

ఉత్తరము :- కొన్ని విషయములు మంచివి యున్నవి. ఎక్కువ చెడ్డవి యున్నవి.

ప్రశ్న :- బ్రాహ్మ, ప్రార్థనా సమాజము లన్నింటికంటె మంచివి. కారణమేమన వాని నియమములు చాల మంచివి.

ఉత్తరము :- నియమములును సర్వాంశముల మంచివి కావు. ఏలయన వేదవిద్యా విరోధుల కల్పనము సర్వథా సత్యమేల కాగలదు? ఈ రెండు సమాజములు క్రైస్తవమతములో జేరకుండ గొంద అను గాపాడినవి. కొంత కొంత పాషాణాది మూర్తిపూజ నుండి తొలగించినవి. ఇతరములగు గ్రంథముల మోసగించు యుచ్చుల నుండియు గొంత కాపాడినవి. ఈ మతములలో నున్న మంచి యిదియే.

(బ్రాహ్మ-ప్రార్థనాసమాజ దోషములు ౧౬)

కాని, (౧) వీరిలో స్వదేశభక్తి చాల తక్కువ. క్రైస్తవుల యాచరణముల నెక్కువగా గ్రహించిరి. అన్నపానములయు వివాహాదులయు నియమములు మార్చివేసినారు.

(౨) తమ దేశమును, పూర్వజులను బ్రశంసింపక పోగా బాగుగ నిందింతురు. వ్యాఖ్యానములం దాంగ్లే యులను నోరార బ్రశంసింతురు. బ్రహ్మ మున్నగు మహర్షుల పేరైన నెత్తరు. పైపెచ్చు సృష్టిలో నాంగ్లే యులు తప్ప యితరు లెవ్వరు విద్వాంసులు కాలే దందురు. ఆర్యావర్తమున నెల్లపుడు జనులు మూర్ఖులు గానే యుండిరి. వీరి యున్నతి యెన్నడు గాలే దందురు.

(౩) వేదాదులను బ్రశంసింపకపోగా నిందించుటకు వెనుకాడరు. బ్రహ్మసమాజపుటుద్దేశ్యములను దెలుపు పుస్తకమున గ్రీస్తు, ముహమ్మద్, మూసా, నానక్, చైతన్యుడు మున్నగు వారిని పేర్కొనినారు. ఋషి-మహర్షుల పేళ్ళను గ్రహింపరైరి. దీనింబట్టి వీరెవరి పేళ్ళను వ్రాసిరో వారి మతాను యాయులే వీరని బోధపడుచున్నది.

ఆర్యావర్తమున బుట్టి, యీదేశపుటన్నజలములతో శరీరములు పోషించుకొనుచు, దమ మాతాపిత రుల మార్గము వదలి విదేశీయమతముల వంకకు బోవుచున్నారు. ఇంతేకాక యీదేశమునకు సంబంధిం చిన సంస్కృత విద్యను వదలి దానిని నేర్వకయే తమ్ముదాము విద్వాంసులమని ప్రకటించుకొనుచున్నారు. ఇంగ్లీషు విద్యను నేర్చుకొని పండితాభిమానముతో నొక మతమును స్థాపింప బ్రయత్నించుట మనుష్యు లకు స్థిరమై వృద్ధికారకమగు కార్యమేల యగును?

(౪) ఈ సమాజములవారు - ఆంగ్లేయులు, యవనులు, సంత్యజాలు మున్నగువారితో దినుటలో ద్రాగుటలో భేదము పాటింపకున్నారు. తినుట త్రాగుట వలన జాతిభేదము తీసివేసినంత మాత్రముననే మనదేశము చక్కబడునని యెంచి యుందురేమో ! వీనివలన దేశము బాగుపడుటకు బదులు చెడుటయే సంభవించును.

(జాతిభేదములు)

ప్రశ్న :- జాతిభేద మీశ్వరకృతమా? మనుష్యకృతమా?

ఉత్తరము :- ఈశ్వరకృతము, మనుష్యకృతమును.

ప్రశ్న :- ఏది యీశ్వరకృతము? ఏది మనుష్యకృతము?

ఉత్తరము :- మనుష్య, పశు, పక్షి వృక్ష జలజంతువులు మున్నగు జాతిభేదములు పరమేశ్వర కృతములు. ఎట్లన పశువులలో అశ్వములు, గోవులు, నేనుగులు మున్నగునవి, వృక్షములలో - రావి

మఱ్ఱి, మామిడి మొదలైనవి. పక్షులలో హంస, కాకి, బకాదులు, జలజంతువులలో మత్స్య, కూర్మ, మక రాది జాతిభేదము లీశ్వరకృతములు. అట్లే మనుష్యులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అంత్యజ జాతిభేదములు. కాని, మనుష్యులలో బ్రాహ్మణాదులను సామాన్య జాతులలో గాక, సామాన్య విశేషాత్మక జాతులలో లెక్కింతురు. పూర్వము వ్రాయబడినట్లు గుణకర్మ స్వభావముల వలన వర్ణవ్యవస్థ నంగీక రించుట యావశ్యకము. ఈ మనుష్యకృతత్వమునకు సంబంధించిన గుణకర్మ స్వభావము వలన బూర్వో క్తప్రకారము, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవర్ణముల వ్యవస్థ పరీక్షాపూర్వకముగ జేయుట రాజులయు విద్వాంసులయు గర్తవ్యమై యున్నది. భోజన భేదము కూడ నీశ్వరకృతము మనుష్యకృతమునై యున్నది. సింహము మాంసాహారి, అర్ణా భైంసా-ఖడ్గమృగము, అడవిదున్న గడ్డి మున్నగునవి తినును. ఇది యీశ్వరకృతము. ఇక దేశ కాలవస్తు భేదము ననుసరించి భోజన భేదము మనుష్యకృతము.

(ఐరోపీయుల గుణదోషములు)

ప్రశ్న :- చూడుడు. ఐరోపా దేశవాసులు, టోపి, కోటు, లాగులు, చెప్పులు తొడుగుకొని హోట ళ్ళలో నెల్లరతోను గలిసి తిందురు. అందువలననే వారు వృద్ధిని బొందుచున్నారు.

ఉత్తరము :- ఇయ్యది మీ పొరపాటు. ఏలయనగా మహమ్మదీయులు నంత్యజులు నెల్లరి చేతిది తినుచుందురు. మఱి వారియున్నతి యేలకాదు? యూరోపియనులు బాల్యావస్థయందు వివాహము చేసికొనరు. బాలబాలికలను విద్య, సుశిక్షణము ద్వారా యోగ్యులను జేయుదురు. స్వయంవర వివాహములు వారిలో జరుగును. వారిలో దుష్టుల యుపదేశము లుండవు. వారు విద్వాంసులై యన్యుల పాషండమున జిక్కుకొనరు. పరస్పరము నాలోచించి సభలో నిశ్చయించి పనులు చేయుదురు. తమ జాతి యున్నతి కొఱకు దనుమనోధనముల నుపయోగింతురు. అలసతను విడిచి ప్రయత్నపరులగుదురు. (ఇవి వారియున్నతికి గుణములు.)

చూడుడు! వారు తమ దేశపు బూట్లను నాఫీసుల-కార్యాలయముల లోనికి దీసికొని వెళ్లనిత్తురు. మనదేశపు జెప్పులను రానీయరు. దీనిని బట్టియే వారు తమదేశము నెంతగా ప్రేమించుచున్నదియు బోధ పడుచున్నది. వారు తమ దేశీయ బూట్ల కిచ్చినంత గౌరవము నితరదేశపు మనుష్యులకు గూడనీయరు.

మఱియు వారీదేశమునకు వచ్చి వందసంవత్సరములకు బైబడుచున్నది. కాని వారి దేశములో వలెనే మొద్దుగుడ్డలే ధరించుచున్నారు. కాని, యితరదేశపు టాచార విచారములను గ్రహింపలేదు. మీలో జాలమంది వారిననుకరింప బ్రారంభించినారు. దీనిని బట్టియే మీరు నిర్బుద్ధులు వారు బుద్ధిమంతు లనియు సిద్ధమగుచున్నది. ఇతరుల ననుకరించుట బుద్ధిమంతుల పనికాదు.

ఇంతేకాక, యెవరేపనిలోనున్న దానిని వారు చక్కగా నిర్వహింతురు. వా రాజ్ఞానువర్తులై యుందురు. వ్యాపారాదులలో తమ దేశవాసులకు సహాయకులగుదురు. ఇట్టి గుణము లుండుటవలనను, మంచిపనులు చేయుటవలనను వారి యున్నతి కలుగుచున్నది. కోట్లు బూట్లు పంట్లాములు కట్టుకొని భోజనాదులు చేయుటవలన గాని, చెడ్డకర్మల నాచరించినందువలనగాని యున్నతి కలుగదు.

వీరిలోను జాతిభేదమున్నది. ఒకానొక యూరోపియన్ వ్యక్తి యతడెంత ప్రతిష్ఠితుడైన యెంతటి పదవి మీద నున్నను నత డితరదేశపు గన్యనుగాని, యొకయైరోపీయకన్య మఱియొకదేశపు వ్యక్తిని గాని వివాహము చేసికొనినచో వారితో గలిసి భోజనము చేయుటకుగాని, వారి నిమంత్రణమునుగాని యితరు లంగీకరింపరు. అట్టి వారితో వివాహాది సంబంధములను జేయరు. ఇయ్యది జాతిభేదముకాక మఱి యేమిటి? పైగా మాలో భేదములేదని చెప్పుచు మీయట్టి యమాయకులను మోసగింతురు. మీ మూర్ఖత వలన మీ రామాటల నంగీకరింతురు. కావున నేది చేసినను నాలోచించి చేయుట మంచిది. అందువలన

బశ్చాత్తాపపడవలసిన స్థితి యెన్నడు గలుగదు.

చూడుడు! లోకమున రోగికి వైద్యుడు, నౌషధము నావశ్యకము లగును. ఆరోగ్యవంతునకు వానితో బ్రయోజన ముండదు. విద్యావంతుడు నీరోగిగా నుండును. అవిద్వాంసుడు రోగగ్రస్తు డగుచుండును. అవిద్యా రోగమును దొలగించుటకు సత్యవిద్య, సత్యోపదేశము నావశ్యకము. తినుటలోను, త్రాగుటలో ధర్మముండును, లేకపోవును. అను నీరోగ మవిద్వాంసులలో వ్యాపించియున్నది. ఎవడేని యన్నపాన ములలో ననాచారపరుడగుట జూచినపు డతడు ధర్మభ్రష్టుడైన ట్లెంచెదరు, చెప్పుదురు. అట్టివాని మాటలు వినరు. అతని చెంత గూర్చుండరు. అతనిని దమచెంత గూర్చుండనీయరు.

ఇప్పుడు చెప్పుడు. మీ విద్య స్వార్థము కొఱకా? పరమార్థము కొఱకా? మీ విద్యవలన సజ్జనులకు లాభము కలిగినచో మీ విద్య పరమార్థము కొఱకైనట్లు. మా విద్యవలన వారు లాభమును బొందరు. అందుకు మేమేమి చేయుదుము? అందురేని యది మీదోషమే కాని వారి దోషము కాదు. ఏలయనగా మీరు మీ యాచరణమును మంచిగా శ్రేష్ఠముగా నుంచుకొనినచో వారు మిమ్ము బ్రేమించి మీవలన నుపకృతు లగుదురు. కాని మీరు వేలకొలది జనుల యుపకారమును నశింపజేసి మీరు సుఖమును బొందినారు. అందువలన మీరు గొప్పయపరాధము చేసినవారైరి. పరోపకారము చేయుట ధర్మము-పరుల కపకారము చేయుట యధర్మము.

కావున విద్వాంసుడైనవాడు యోగ్యతకు దగినట్లు వ్యవహరించి యజ్ఞానులను దుఃఖసాగరమునుండి తరింపజేయుటకు దాను నౌకగా నుపయోగపడవలయును. ఎన్నడు మూర్ఖునివలె గర్మల నాచరింపరాదు. ప్రతిదినము తనయొక్కయు, సజ్జనులయు, నున్నతి కలుగునట్లు సత్కర్మల నాచరింపవలయును.

(౫) ప్రశ్న :- మే మే పుస్తకమును నీశ్వర ప్రణీత మనికాని, సర్వాంశమున సత్యమనికాని నమ్మము. ఏలయన మనుష్యులబుద్ధి నిర్భ్రాంతము కాదు. కావున వారిచే రచింపబడిన గ్రంథము లన్నియు భ్రాంతములే యగును. కావున మేమందఱనుండి సత్యమునే గ్రహింతుము. అసత్యమును విడిచిపెట్టు దుము. సత్యము వేదమున నున్నను, బైబిల్, కురాన్, లేక యితర గ్రంథములలో నెక్కడ నున్నను మాకు గ్రాహ్యమే. అసత్యము దేనిలోనిది గ్రాహ్యము కాదు.

ఉత్తరము :- ఏ విషయమువలన నీవు సత్యగ్రాహివిగా నెంచుచున్నావో యా విషయమువలననే యసత్యగ్రాహివి యగుచున్నావు. ఏలయనగా మనుష్యులెల్లరు భ్రాంతి రహితులు కాజాలనపుడు నీవును మనుష్యుడవే కావున భ్రాంతిసహితుడవేయగుదువు. భ్రాంతిసహితుని వచనములు సర్వాంశమున బ్రామాణి కములు కానియపుడు మీవచనములును విశ్వసింపదగినవి కావు. మీ వచనములమీద సర్వథా విశ్వాసముంచ రాదు. కావున విషమిశ్రితాన్నమువలె త్యాజ్యములే యగును.

మఱి మీచే రచియింపబడిన వ్యాఖ్యాన గ్రంథము లెవరికిని బ్రమాణములుకావు. 'చతుర్వేది షడ్వేది యగుటకు బోయి తనకున్న నాలుగువేదములలో రెండింటిని బోగొట్టుకొని ద్వివేదియై తిరిగి వచ్చినా డన్నట్లున్నది' నీ వ్యవహారము. మీరు సర్వజ్ఞులు కారు. ఇతరులు సర్వజ్ఞులు కానియట్లు మీరును గారు. కావున భ్రమపడి యసత్యమును గ్రహించి సత్యమును వదలుటయు మీకు సంభవము. కావున నల్పజ్ఞుల మగు మన మెల్లరము సర్వజ్ఞుడగు పరమేశ్వరుని సాహాయ్యము స్వీకరించుట యుచితము. వేదవ్యాఖ్యానముల విషయమున సప్తమసముల్లాసమున మేము వ్రాసినట్లు మీరును దప్పక యంగీకరింప వలయును. లేకున్న 'ఇతోభ్రష్ట స్తతోభ్రష్టః' ఉభయభ్రష్టు లగుదురు. సర్వసత్యములు వేదములనుండి లభించుచుండ, వేదములలో నసత్య మొండును లేకపోగా వానిని గ్రహించుటకు శంకించుట తనకు నితరులకు హాని కలిగించుటయే యగును.

అందువలననే యార్యావర్తీయులు మిమ్ముల నాత్మీయులుగా నెంచకున్నారు. మీరార్యావర్తపు టున్నతికిని గారణము కాజాలక పోయితిరి. ఏలయన మీరింట భిక్షుకులైరి. ఇందువలన మీరు మీకును నితరులకును నుపకారము చేయగలుగుదుమని యెంచితిరి కాని చేయజాలక పోయితిరి. ఒక బిడ్డ తల్లిదండ్రు లిరువురు ప్రపంచములోని పిల్లల నందఱను బాలింప బూనుకొన్న ట్లున్నది మీస్థితి. అందఱను బాలించుట యసంభవము. అంతేకాక తమ పిల్లలను సరిగా బోషింపజాలక నాశము చేసికొందురు. వేదాది సత్యశాస్త్రముల నంగీకరింపక మీరు మీవచనముల సత్యాసత్యముల నెట్లు పరీక్షింపగలరు! ఆర్యావర్తపు టున్నతి నెట్లు చేయగలను! ఎన్నడు జేయజాలరు.

ఈ దేశమునకు గలిగిన రోగమునకు మీదగ్గఱ మందులేదు. ఐరోపాదేశీయులు మిమ్ముపేక్షింపరు. ఆర్యావర్తవాసులు మిమ్ము నన్య మతులవలె నెంచుచున్నారు. ఇప్పటికైనను దెలిసికొని వేదాదుల మాన్యత నంగీకరించి దేశోన్నతికి నుద్యమించుట మంచిది. సమస్త సత్యము పరమేశ్వరుని నుండి ప్రకటమగునని చెప్పు మీరు మహర్షులలో నీశ్వరునిచే బ్రకాశితములైన సత్యార్థములుగల వేదముల నేల యంగీకరింపరు? వేదములను మీరు చదువక, చదువుటకు నిచ్చగింపకుండుటయే యిందులకు గారణము. అందువలన వేదోక్త జ్ఞానము మీకెట్లు కలుగును?

(ఉపాదానములేక జగదుత్పత్తికాదు)

(౬) మఱియొకటి –ఉపాదాన కారణము లేకయే జగదుత్పత్తి, జీవుని యుత్పత్తియు, క్రైస్తవ మహమ్మదీయు లంగీకరించునట్లు మీరును నంగీకరించుచున్నారు. దీనికి సమాధానము సృష్ట్యుత్పత్తి జీవేశ్వరుల వ్యాఖ్యానమున (సప్తమ–అష్టమ సముల్లాసములందు) జూడుడు. కారణములేక కార్యము జరుగుట సర్వధా యసంభవము. ఉత్పన్న వస్తువు నశింపకుండుటయు నట్లే యసంభవము.

(భోగము–పాపనివృత్తి)

(౭) పశ్చాత్తాపము వలనను బ్రార్థనవలనను బాపనివృత్తి కలుగునని మీరెంచుచున్నారు. ఇదియు నొక దోషము. ఈ దోషము వలననే లోకమున బాపము లెక్కువ యైనవి. పౌరాణికులు తీర్థాది యాత్రలవలనను, గ్రైస్తవులు క్రీస్తును నమ్మినందునను, ముసల్మానులు 'తోబా' అనుటవలనను, జైనులు నవకారమంత్రజపము, తీర్థయాత్రవలనను పాపములు భోగింపకయే పోవునని యెంచుచున్నారు. ఈ విషయమున బ్రాహ్మ ప్రార్థనా సమాజముల వారును బౌరాణికుల ననుకరించుచున్నారు. అందువలన బాపములకు భయపడక యెక్కువగా బాపములందు బ్రవృత్తులగుచున్నారు. వేదములను విని వేద సిద్ధాంత మును దెలిసికొని యున్నను బాపఫలము ననుభవింపక తప్పదు. ఎన్ని తీర్థము లాడినను లాభము లేదని తెలిసికొని పాపములకు భయపడి చేయకుండెడివారు. ధర్మమునందును బ్రవృత్తి కలిగెడిది. భోగింపకయే పాపనివృత్తి కలిగిన నీశ్వరు డన్యాయకారియు నగును.

(సీమితకర్మల కనంతఫలము లభింపదు)

(౮) జీవున కనంతమగు నున్నతి కలుగునని మీరెంచుచున్నారు. అట్లెన్నడును గలుగ జాలదు. ఏలయనగా ససీమ జీవుని గుణకర్మ స్వభావములకు గలుగుఫల మసీమ మెన్నడును గాదు.

ప్రశ్న :– పరమేశ్వరుడు దయాళువు. అందువలన నతడు ససీమ కర్మలకు ఫల మనంతముగా నీగలడు.

ఉత్తరము :– అట్లే చేసిన బరమేశ్వరుని న్యాయ మ్ము నష్టమగును. సత్కర్మముల యున్నతియు నెవ్వడు జేయడు. ఏలయన గొలది సత్కర్మకే పరమేశ్వరు డనంతఫలము నిచ్చును. పశ్చాత్తాప ప్రార్థనల వలన నెన్నిపాపములైనను వదలిపోవును. ఇట్టి నమ్మకములవలన ధర్మమునకు హాని, పాపకర్మల వృద్ధియు నగును.

(స్వాభావికజ్ఞానము సర్వోపరికాదు)

ప్రశ్న :- మేము స్వాభావిక జ్ఞానమును వేదముకంటె గొప్పదిగా నంగీకరింతుము. నైమిత్తికమును గాదు. ఏలయనగా పరమేశ్వర దత్తమగు స్వాభావిక జ్ఞానము మనలో లేకున్న వేదములను జదువుట, జదివించుటయు, వినుట, వినిపించుటయు నెట్లు జరుగును? కావున మామతము మిక్కిలి మంచిది.

ఉత్తరము :- ఈ మీ విషయము నిరర్థకమైనది. ఏలయనగా మఱియొకరిచే నీబడిన జ్ఞానము స్వాభావిక మెట్లగును? స్వాభావికము సహజ జ్ఞానమగును. అది యెక్కువ తక్కువలు కాదు. దానివలన నున్నతి నెవ్వడు బొందజాలడు. ఆటవిక మనుష్యులలో స్వాభావిక జ్ఞానమున్నది కదా? అయినను వారు తమ యున్నతి నేల చేసికొనజాల కున్నారు?

నైమిత్తిక జ్ఞానమే యున్నతికి గారణ మగును. చూడుడు! మీరు మేమును జిన్ననాడు కర్తవ్యాకర్తవ్య ములను, ధర్మాధర్మములను గొంచెముగా గూడ నేమియు దెలిసికొన జాలెడివారము కాము. విద్వాంసుల చెంతజేరి చదివిన తదుపరియే తెలిసికొన గలుగుచున్నాము. కావున స్వాభావిక జ్ఞానము సర్వోపరి యనుట సరికాదు.

(పూర్వోత్తర జన్మములు)

(౯) మీరు పునర్జన్మము నంగీకరింపరు. ఇయ్యది క్రైస్తవ మహమ్మదీయులనుండి గ్రహించి యుందురు. దీనికి సమాధానము కూడ బునర్జన్మ వ్యాఖ్యను జూచి తెలిసికొనుడు. (నవమసముల్లాసమున) కాని, జీవుడు నిత్యుడని ముందుగా గ్రహింపుడు. అతడు శాశ్వతుడు. అతని కర్మలును ప్రవాహరూపమున నిత్యములు. కర్మకు కర్మకారికి నిత్యసంబంధ ముండును. జీవు డెక్కడనైన నిష్కర్మియై కూర్చుండి యుండెనా? ముందుండ బోవునా? అట్లే మీరు చెప్పునట్లు పరమేశ్వరుడును నిష్కర్మి కాడు.

పునర్జన్మము నంగీకరింపకున్న కృతహాని, అకృతాభ్యాగమదోష, నైర్ఘృణ్య వైషమ్య దోషములు నీశ్వరునందు వాటిల్లును. పునర్జన్మము నంగీకరింపకున్న బాపపుణ్య ఫలములు నశించును. ఫలభోగము నకు హాని కలుగును. ఎట్లు పరులకు సుఖదుఃఖములు హానిలాభములు చేర్పబడునో యట్లే దానిఫలముకూడ శరీరధారణము జేయక ప్రాప్తింపనేరదు.

రెండవది-పూర్వజన్మపు పాపపుణ్యములు లేకున్న నీజన్మమున సుఖదుఃఖము లెందులకు గల్గును! ఈ జన్మమున గలుగు సుఖదుఃఖములు పూర్వజన్మపు బాపపుణ్యముల ననుసరించి కలుగకున్న బరమేశ్వరు డన్యాయకారియు, గర్మఫలమనుభవింపకయే నశించినట్లు నగును. కావున మీరు చెప్పు నీవిషయమును మంచిది కాదు.

(౧౦) ఈశ్వరుడు కాక, దివ్యగుణములుగల పదార్థములను, విద్వాంసులను దేవపదవాచ్యములుగా నంగీకరింపకుండుటయు సరికాదు. ఏలయన బరమేశ్వరుడు మహాదేవు డనబడుచున్నాడు. ఇతర దేవులే లేనపు డీశ్వరుడు మహాదేవు డెట్లు కాగలడు? ఎందుకు మహాదేవు డనబడును?

(౧౧) అగ్నిహోత్రము, శిఖాసూత్రాదిపరోపకారక కర్మలను వదలుటయు మంచిది కాదు.

(౧౨) ఋషులు, మహర్షులు జేసిన యుపకారములను విస్మరించి యీసా మూసాలవంకకు బరువిడుట, వారిని గౌరవించుట మంచిది కాదు.

(౧౩) కారణవిద్యయగు వేదము నంగీకరింపక యన్యకార్య విద్యల ప్రవృత్తి నంగీకరించుట సర్వథా యసంభవము.

(౧౪) విద్యావ్రత చిహ్నములైన శిఖా యజ్ఞోపవీతములను విడిచి క్రైస్తవ మహమ్మదీయులవలె సిద్ధమగుట వ్యర్థము. పంట్లాములు మున్నగు వస్త్రములు ధరించుచునే యున్నారు. వానిపైన బిరుదు

బిళ్ళలు ధరింప సిద్ధపడువారు యజ్ఞోపవీతమును ధరించుట బరువయ్యెనా?

(౧౫) బ్రహ్మ మొదలుగా నార్యావర్తమున నెందఱో విద్వాంసులైరి. వారిని బ్రశంసింపక యూరపియన్ విద్వాంసుల బ్రశంసించుట పక్షపాతమో మోమోటమో కాక యేమనవలయును?

(౧౬) బీజములనుండి యంకురము ఉత్పన్నము అగునట్లు జడచేతనముల యోగమున జీవు లుత్పన్నము అగుననియు, నుత్పత్తికి బూర్వము జీవతత్త్వము లేదనియు, నుత్పన్నమైన జీవుడు నశింప డనుటయు బూర్వాపర విరుద్ధములు. ఉత్పత్తికి బూర్వము జడచేతనములు లేకున్న జీవుడెటనుండి వచ్చెను? సంయోగము దేనికి గలిగెను? జడచేతనములను రెండింటిని సనాతనములని యంగీకరించిన సరియే! సృష్టికి బూర్వ మీశ్వరుడు తక్క మఱియొక తత్త్వము నంగీకరింపకుండుట సరికాదు. మీ పక్షము వ్యర్థము.

(ఉన్నతిగోరువారు ఆర్యసమాజమున జేరుడు.)

కావున నున్నతిజేయ గోరుదురేని ఆర్యసమాజముతో జేతులు కలిపి దాని యుద్దేశముల ననుకూలముగ నాచరించుట కంగీకరింపుడు. లేకున్న నేమియు చేజిక్కదు. ఏ దేశపు బదార్థములతో మీ మాశరీరములు నిర్మింపబడినవో, నేడును బాలింపబడుచున్నవో, ముందును బాలింపబడునో, యాదేశపుటున్నతిని దనుమనోధనముల నర్పించి చేయుట మీకు మాకును నెల్లరకు నుచితము. కావున నార్యావర్తదేశోన్నతికి నార్యసమాజమెట్లు కారణమో యట్లేదియు గాజాలదు. ఈ సమాజమునకు దగిన సాహాయ్యము జేయుట మంచిది. ఏలయన సమాజ సౌభాగ్యము పెంపొందుట సముదాయపు గార్యము గాని యొకవ్యక్తిది గాదు.

(ధర్మమందఱకు నొక్కటియే)

ప్రశ్న :- మీ రెల్లరి మతములను ఖండనము జేయుచువచ్చుచున్నారు. కాని తమ తమ ధర్మములలో నెల్లరు మంచివారే. కావున నెవరి మతమును ఖండింపరాదు. ఖండింతురేని మీరు వీరికంటె నెక్కువ చెప్పునదేమి? చెప్పుదురేని మీకంటె నధికుడుగాని, తుల్యుడుగాని లేడా? లేకుండెనా? ఇట్టి యభిమానము కలిగియుండుట మంచిదికాదు. ఏల యనగా బరమాత్ముని సృష్టిలో నొకరికంటె మఱియొక డధికుడు, తుల్యుడు, తక్కువయైన వారు నెందఱో యున్నారు. ఎవరికిని గర్వము మంచిది కాదు.

ఉత్తరము :- ధర్మమెల్లరకు నొక్కటియా? అనేకమా? అనేకము లందువా? అవి పరస్పర విరుద్ధములా! సమానములా? విరుద్ధములందువా? అప్పుడు వానిలో నేదియో యొకటి ధర్మమగును కాని యన్నియు గావు గదా! లేక యవిరుద్ధము లందువా? సమానములైనపుడు వేఱువేఱు ధర్మము లనుట యేల? కావున ధర్మముకాని, యధర్మముకాని యొక్కటియే యగును. అనేకములు కావు.

ఇదియే మేము చెప్పువిశేషము. సమస్త సంప్రదాయముల యుపదేశకుల నొకచో రాజు చేర్చినచో నొక సహస్రముకంటె దక్కువ గారు. వీనిని ముఖ్యభాగములుగా విభజించినచో బౌరాణికులు, జైనులు, క్రైస్తవులు, మహమ్మదీయులు నని నాలుగు భాగములుగా విభజింపవచ్చును. సమస్త సంప్రదాయములు నాలుగింటిలో సమావిష్టములు కావచ్చును.

(ధర్మజిజ్ఞాసువు సంప్రదాయములు)

ఒకానొక రాజు సభ చేసి కాని, యొక జిజ్ఞాసువై కాని, వామమార్గుల నడుగవలయును. 'మహారాజా! యింతవఱకు నే నెవరిని గురువుగా నంగీకరింపలేదు. ఏ ధర్మమును గ్రహింపలేదు. మీరు చెప్పండి. సర్వధర్మములలో నుత్తమ ధర్మము నేను గ్రహింపదగినది చెప్పుడు.'

వామమార్గి :- మా ధర్మమే మంచిది.

జిజ్ఞాసువు :- మిగిలిన తొమ్మిదివందల తొంబదితొమ్మిది ధర్మము లెట్టివి?

వామమార్గి :- అవి యన్నియు నసత్యములు. నరకమును గల్గించును. కౌలాత్ పరతరం నహి. (కులార్ణవతంత్రము. ౨-౮). ఈ వచన ప్రమాణమును బట్టి మా ధర్మమును మించినది లేదు.

జిజ్ఞాసువు :- అయ్యా మీ ధర్మ మెయ్యది?

వామ :- భగవతి నంగీకరించుట, మద్యమాంసాది పంచమకారముల సేవించుట, రుద్రయామలాది యఱువదినాల్గు తంత్రగ్రంథముల నంగీకరించుట మున్నగునవి. ముక్తిని గోరుదువేని మా శిష్యుడవు కమ్ము.

జిజ్ఞా:- మంచిది. ఇతర మహాత్ముల దర్శనము చేసికొని వారిని గూడ నడిగి వచ్చెదను. తదుపరి యేది నాకు నచ్చునో దానిని స్వీకరింతును.

వామ :- అరే! ఎందుకు భ్రాంతిలో బడుచున్నావు? వారు నిన్ను మోసగించి తమవలలో వేసికొందురు. ఎవరి దగ్గఱకు వెళ్ళకు. మాకే శరణాగతుడవగుము. లేకున్న బశ్చాత్తాప పడవలసి వచ్చును. చూడు. మామతమున భోగము మోక్షము రెండును లభించును.

జిజ్ఞా :- మంచిది కొంచెము చూచి రానిండు. అని ముందుకు వెళ్ళి యొక శైవుని జేరెను. వారి నడుగగా నతడు నట్లే సమాధానము చెప్పెను. విశేష మేమియన :- శివుని నంగీకరింపకున్నను భస్మరుద్రాక్షలను ధరింపకున్నను, లింగార్చన చేయకున్నను మోక్షము లభింపదనెను.

జిజ్ఞాసు వతనిని వదలి నవీన వేదాంతి కడకేగి, 'అయ్యా! మీ ధర్మమేమి' అనెను.

వేదాంతి :- మేము ధర్మాధర్మముల నంగీకరింపము. మేము సాక్షాత్ బ్రహ్మలము. మాలో ధర్మాధర్మము లెక్కడ నున్నవి? ఈ జగత్తంతయు మిథ్య. జ్ఞానియు శుద్ధచేతనుడు కాదలచువాడు తనను బ్రహ్మగా నంగీకరించి, జీవభావమును వదలి నిత్యముక్తుడగును.

జిజ్ఞా :- నీవు బ్రహ్మమై నిత్యముక్తుడ వగునెడల నీలో బ్రహ్మము గుణకర్మ స్వభావము లేల లేవు? ఈ శరీరమున నేల బంధింపబడి యున్నావు?

వేదాంతి :- నీకు శరీరములు కనబడుచున్నవి. అందువలననే నీవు భ్రాంతుడవై యున్నావు. మాకు బ్రహ్మము తక్క మఱేమియు గనిపింపదు.

జిజ్ఞా :- చూచువాడవు నీవెవడవు? ఎవనిని జూచుచున్నావు?

వేదాంతి :- చూచువాడు బ్రహ్మము. బ్రహ్మమునే బ్రహ్మము చూచుచున్నది.

జిజ్ఞా :- బ్రహ్మములు రెండున్నవా?

వేదాంతి :- లేదు. తనను దానే చూచుచున్నది.

జిజ్ఞా :- ఎవడైన దనభుజముపై దానెక్కునా? నీ మాటలన్నియు బిచ్చివాని మాటలుగా నున్నవి.

(జైనులు)

జిజ్ఞాసు వటనుండి వెడలి జైనునికడకు వెళ్ళి యడిగెను. అతడు నట్లే చెప్పెను. విశేషము 'జిన ధర్మము కాక మిగిలిన ధర్మము లన్నియు జెల్లుబడి కానివి. ఈ జగత్తునందు రచించు ననాది కర్త యీశ్వరు డెవ్వడును లేడు. ఈ జగత్తనాది కాలమునుండి యిట్లే వచ్చుచున్నది. ముందు నిట్లే యుండును. మా శిష్యుడ వగుము. మేము సమ్యక్త్వులము. అన్ని విధముల మంచివారము. ఉత్తమ విషయముల నంగీకరింతుము. జైనమార్గముకాక మిగిలినవన్నియు మిథ్యలే.

(క్రైస్తవము)

జిజ్ఞాసు వతనిని విడిచి ముందుకు సాగి క్రైస్తవు నడిగెను. అతనితో వామమార్గి నడిగినట్లు ప్రశ్నలడిగి సమాధానములు వినెను. అతడు చెప్పిన దానిలో విశేషము :- మనుష్యులందఱు పాపులు.

తమ సామర్థ్యముతో బాపములను బోగొట్టుకొన జాలరు. ఏసుప్రభువును నమ్మక పవిత్రుడు కాడు. ముక్తిని బొందడు. ఏసే యెల్లరి పాపముల ప్రాయశ్చిత్తము కొఱకు దనప్రాణములను బలియిచ్చి దయను బ్రకటించినాడు. కావున నీవు మా శిష్యుడ వగుము.

(మహమ్మదీయమతము)

జిజ్ఞాసు వది విని మౌలవీదగ్గఱకు వెళ్ళెను. అతనిని బూర్వమువారి వలెనే ప్రశ్నించెను. అతడు చెప్పిన విశేషము -అల్లాతప్ప మఱియొకడు లేడు. అతని పైగంబరును మహమ్మదును, కురాన్ షరీఫ్‌ను నంగీకరింపక ముక్తి దొరకదు. ఈ మతము నంగీకరింపనివాడు నరకమున బడును. అతడు కాఫిర్, అతడు వధింప దగినవాడు. (వాజిబుల్ కతల్ హై)

జిజ్ఞాసు వది విని వైష్ణవుని దగ్గఱకు బోయెను. మిగిలినవారి నడిగి నట్లతని నడిగెను. అత డందఱుచెప్పినట్లు చెప్పి తమ మతవిశేషము నిట్లు చెప్పెను - మా తిలకములను జూచి యముడే భయపడును. ఆ మాటలు విని జిజ్ఞాసువు తన మనస్సులో నిట్లనుకొనెను. ఇతనిని నితని తిలకములను జూచి యీగలు దోమలే భయపడవే యము డెట్లు భయపడును? ఇట్లే జిజ్ఞాసువు మిగిలిన మతముల వారికడకు బోయి ప్రశ్నింపగా నెల్లరు తమతమ మతములే సత్యములని చెప్పుచు, నొకరు మా కబీరు గొప్పయనియు, నింకొకరు నానక్, మఱియొకరు దాదూ, వేఱొకరు వల్లభుడు, వరుడు సహజానందుడు నొకరు మాధ్వుడు సత్యమనియు నవతార పురుషులనియు జెప్పగా జిజ్ఞాసువు వినెను. అత డెల్లమతముల వారిని వేయిమందిని బ్రశ్నించి వారిలో బరస్పర విరోధమును గుర్తించి తాను గురువుగా గ్రహింపదగిన వాడొక్కడు లేడని నిశ్చయించుకొనెను. ఏలయన నొక్కొక్కరి విషయ మసత్యమని నిర్ణయించుటకు మిగిలిన తొమ్మిదివందల తొంబది తొమ్మిది సాక్షులుగా నతనికి దోచిరి. అసత్యములాడు దుకాన్‌దారుడు, వేశ్య మున్నగు వారు తమతమ వస్తువులను గొప్పగా జెప్పుచు నితరులవి పనికిరానివిగా జెప్పుదురో యట్లే వీరు నున్నారని యతనికి దోచెను. ఇట్లాలోచించి యతడు --

"తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" (౧)
"తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ,
యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ
తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్" ముం.ఉ. ౧-౨-౧౨, ౧౩.

సత్యమును దెలిసికొనుటకొఱకు 'సమిత్పాణిః' చేతిలో నొక సమిధను దీసికొని యనగా రిక్తహస్తుడు కాక వేదవిదుడు, బ్రహ్మనిష్ఠుడు, పరమాత్మను నెఱుగు గురువునొద్దకు బోవలయును. ఈ పాషండుల వలలో జిక్కుకొనరాదు. ౧. అని యొక విద్వాంసుని సమీపించెను. ఆ విద్వాంసుడు శాంత చిత్తుడు జితేంద్రియుడునై తన సమీపమునకు వచ్చిన జిజ్ఞాసువునకు యథార్థమగు బ్రహ్మవిద్య-పరమా త్మని గుణకర్మస్వభావము వలె నేయే సాధనములవలన జిజ్ఞాసువు ధర్మార్థకామమోక్షములు, పరమేశ్వరు నెఱుగగలడో యట్టిశిక్ష నొసంగవలయును. (౨)

కావున జిజ్ఞాసు వట్టి విద్వాంసుని జేరి అయ్యా! ఈ సాంప్రదాయకుల పరస్పర విరుద్ధములగు నుపదేశములను విని నామనస్సు భ్రాంతమై యున్నది. నేను వీరిలో నెవనికి శిష్యుడనైనను మిగిలిన వారె ల్లరు విరోధులగుదురు. ఎవని కొక్కమిత్రుడు తొమ్మిదివందల తొంబది తొమ్మిది మంది శత్రువులుం దురో వానికి సుఖమెట్లు లభించును? కావున నేనేమి చేయవలయునో మీ రుపదేశింపుడు' అనెను.

ఆప్తవిద్వాంసుడు :- బాబూ! యీసంప్రదాయము లన్నియు నవిద్యాజనితములు, విద్యను

నిరోధించునవి. మూర్ఖులు, పామరులు నాటవికులునైన మనుష్యులను వంచించి తమ వలలో జిక్కించుకొని స్వార్థమును సిద్ధము చేసికొందురు. పాపము! వీరు తమ మనుష్యజన్మమునకు జెందిన ఫలము నుండి వంచితులై తమ జన్మమును వ్యర్థము చేసికొనుచున్నారు. చూడు! ఏ విషయమును నీ వేయిమంది యంగీ కరింతురో యదియే గ్రహింపదగిన వేదమతము. ఏ విషయమున వీరు పరస్పరము విరోధింతురో యదియే కల్పితము. అసత్యము, అధర్మము నగ్రాహ్యము నని యెఱుగుము.

జిజ్ఞాసువు :– దీని పరీక్ష యెట్లు చేయవలయును?

ఆప్తవిద్వాంసుడు :– నేను జెప్పు విషయములను వీరి నెల్లర నడుగుము. అందఱును నీ విషయములను నైకమత్యముతో నంగీకరింతురు.

అంతట నా జిజ్ఞాసువు వేయిమంది సాంప్రదాయకుల మధ్య నిలబడి యడిగెను. "అయ్యలారా! మీరెల్లరు విని నాకు సమాధానము జెప్పుడు. సత్యభాషణము ధర్మమా? లేక మిథ్యాభాషణమా? అందుల కెల్లరు నేకస్వరముతో 'సత్యభాషణమే ధర్మము. మిథ్యాభాషణ మధర్మము' అని సమాధానము చెప్పిరి. అట్లే 'విద్య నభ్యసించుట, బ్రహ్మచర్యమును బాలించుట, పూర్ణయువావస్థలో వివాహమాడుట, సత్సంగము చేయుట, పురుషార్థ మొనర్చుట, యట్లే సత్యవ్యవహారము ధర్మమనియు, అవిద్యా గ్రహణము, బ్రహ్మ చర్యము పాలింపకుండుట, వ్యభిచార మొనర్చుట, కుసంగము చేయుట, యాలస్యము, నసత్య వ్యవహారము, వంచించుట, హింసచేయుట, పరహానినొనర్చుట మున్నగునవి యధర్మము లనియు నెల్లరు నేకస్వరముతో నంగీకరించి యొప్పుకొనిరి.

అది విని జిజ్ఞాసువు సాంప్రదాయకులతో "అయ్యలార! ఇప్పుడు మీరు చెప్పినట్లు లెల్లరు గలిసి, యైకమత్యముతో సత్యధర్మమున కున్నతిని మిథ్యాధర్మమున కవనతిని గలిగింపనేల ప్రయత్నింపరు?' అని ప్రశ్నించెను. అందులకు వారు "మేమట్లు చేసిన మమ్మెవ్వరు లెక్కచేయుదురు? మా యాజ్ఞలో నెవరుందురు? మాజీవిక యెట్లు నడచును? మే మిప్పుడానందము ననుభవించుచున్నాము గదా! అది యప్పుడు లభించునా? లభింపదు. కావున మాకిది దెలిసినను మామతముల నుపదేశించి వానిద్వారా సుఖముల నందుచు బోవుచున్నాము. ఏలయన జనులను మోసగింపక యెవడును సుఖపడజాలడు. లోకమున సత్యము చెప్పువాని నెవ్వరు గమనింపరు. అతని కేమియు నీయరు. వంచకులు, మోసగాండ్రే పదార్థములను బొంద గలుగుదురు' అని నుడివిరి.

జిజ్ఞాసువు :– మీరిట్లు పాషండతను వ్యాపింపజేసి యన్యులను మోసగించిన రాజు మిమ్ములను దండింపరా?

సాంప్రదాయకులు :–మేము రాజులనుగూడ ముందుగానే శిష్యులను జేసికొందుము. మా వ్యవస్థ చాలగట్టిది. ఇది తేలికగా బోవునది కాదు.

జిజ్ఞా :– మీరు వంచించి యితరమతస్థులను మీవలలో వేసికొని వారికి హానికలిగించిన బరమేశ్వరున కేమి చెప్పుదురు? ఘోరనరకమున బడుదురుగదా? కొలది జీవన సుఖము కొఱకు నింతటి యపరాధములు చేయుట యేల? వీనిని విడువరాదా?

సాంప్ర :– ఎప్పు డేమగునో యప్పు డది చూచుకొందుము. పరమేశ్వరుని దండనము, నరకదుఃఖ మెప్పుడో కలుగును. ఇప్పుడు కాదు కదా! ఇప్పు డానందము ననుభవించుచున్నాము. జనులు మాకు బ్రసన్నులై యన్నాదిపదార్థముల నిచ్చుచున్నారు. బలాత్కరించి తీసికొనము గదా! అట్టిచో రాజు మమ్మేల దండించును?

జిజ్ఞా :– చిన్నపిల్లలను మోసగించి వారి నగనట్రలను హరించు వారికి దండనము లభించునట్లు

మిమ్మేల దండింపరు? ఏలయన "అజ్ఞో భవతి వై బాలః, పితా భవతి మంత్రదః" లోకమున నజ్ఞాని బాలుడు, జ్ఞానియైనవాడు పిత-వృద్ధు డనబడును. బుద్ధిమంతుడైన విద్వాంసుడు మీ వలలో జిక్కడు. మూర్ఖుడు-బాలకునివంటివాడు మీ వలలో జిక్కి మోసపోవును. కావున బాలకుని వంచించు వారికి, మీకును దప్పక దండనము లభింపవలయును.

సాంప్ర :- రాజా ప్రజలు నెల్లరు మా మతములో నున్నపుడు మమ్ము దండించువా రెవరు? అట్టి పరిస్థితి యేర్పడినపు డీవిషయములను వదలి మఱియొక మార్గము జూచుకొందుము.

జిజ్ఞా :- మీరు వ్యర్థముగా గాలము బుచ్చుచు గృహస్థులనుండి ధనాదుల నపహరించుచున్నారు. దానికి బదులు మీరు చదువుకొని గృహస్థుల సంతానమునకు జదువు చెప్పుచుండిన మీకు గృహస్థులకు నిరువురకు క్షేమము గలుగునుగదా!

సాంప్ర :- బాల్యమునుండి మరణపర్యంతము లభించు సుఖములను వదలి, చిన్ననాట నుండి విద్య నభ్యసించి పెద్దలమై విద్యనుబోధించుటకు నుపదేశించుటకు బరిశ్రమము చేసిన జీవన మంతయు బరిశ్రమము చేయవలసినవార మగుదుము. దానివలన మాకు గలుగు ప్రయోజనమేమి? ఇప్పుడు మాకు బరిశ్రమము చేయకయే లక్షలాది ధనము సుఖసాధనములు లభించుచున్నవి కదా? వీని నేల విడిచి శ్రమింపవలయును?

జిజ్ఞా :-దీని పరిణామము మంచిది కాదుగదా! చూడుడు! మీలో నెన్ని రోగము లున్నవో. వీనితో ద్వరగా జచ్చిపోవుదురు. బుద్ధిమంతులు నిందించుచున్నారు. అయినను నేల గ్రహింపరు?

సాంప్ర :- అరేబాబూ!

"టకా ధర్మష్టకా కర్మ టకాహి పరమం పదమ్"

యస్య గృహే టకా నాస్తి హాటకాం టకటకాయతే" (౧)

"అనా అంశకలాః ప్రోక్తా రూప్యోఽసౌ భగవాన్ స్వయమ్

అతస్తం సర్వం ఇచ్ఛన్తి రూప్యం హి గుణవత్తమమ్" (౨)

నీవు పిల్లవాడవు. లోకవిషయములు నీకు దెలియవు. చూడు! డబ్బులేక ధర్మము, కర్మ, పరమ పదము నేవియు లేవు. ఎవరియింట ధనముండదో వారు ప్రతిక్షణము ధనమువంక జూచుచు దానికొఱకు లాలాయితులై యుందురు. ఆహా! నాదగ్గఱధన మున్న నెంత బాగుండును? ఉత్తమోత్తమ పదార్థముల ననుభవింతుము గదా! యని యువ్విళ్ళూరుచుందురు. (౧)

లోకమున నెల్లరు షోడశ కళలతో గూడిన యదృశ్య భగవంతుని గూర్చి చెప్పుచుందురు. అతడు కనబడడు. పదునాఱణాలతో నేర్పడు భగవంతుడు రూప్యము. అది సాక్షాత్కరించును. అందువలననే రూప్య భగవంతుని వెదకుటకు దత్పరులై యున్నారు. సర్వకార్యములు రూప్యములచే సిద్ధింపగలవు.(౨)

జిజ్ఞా :- బాగుగ నున్నది. దీనివలన మీ లోపలి లీల బయట బడినది. మీరు చేయు నీ పాషండత యంతయు మీసుఖము కొఱకు జేయుచున్నారు. కాని, దీనివలన లోకమున కెంతయో హాని కలుగు చున్నది. సత్యోపదేశమువలన నెట్లు లాభము కలుగునో యసత్యోపదేశమువలన నట్లే హాని కలుగును. మీకు ధనసంపాదనమే ప్రయోజన మయిన నౌకరియో వ్యాపారమో చేసికొని ధనము నేల సంపాదించు కొనరు?

సాంప్ర :- అందు బరిశ్రమ మధికము. అప్పుడప్పుడు నష్టము వాటిల్లుచుండును. మా యీ లీలావ్యాపారమున లాభమే కాని హాని యెన్నడును గలుగదు. చూడు! నీళ్ళలో నొక తులసీదళమునుంచి చరణామృతము నిచ్చి మెడలో గుదిబండవలె నొకమాల వేయుదుము. దానితో శిష్యుడై యతడు

జన్మమంతయు మాకు బళువు వలె నుపయోగించును. అతనిని మా యిష్టము వచ్చినట్లు వాడుకొనవచ్చును.

జిజ్ఞా :– జనులు మీకు బుష్కలముగా ధనము నేల యొసగుదురు?

సాంప్ర :– ధర్మము, స్వర్గము, ముక్తికొఱకు నిత్తురు.

జిజ్ఞా :– మీరే ముక్తులు కారు. మీకు ముక్తి స్వరూపము కాని, ముక్త సాధనములు కాని యేమియు దెలియదు. అట్టియెడ మిమ్ము సేవించువారి కేమి లభించును?

సాంప్ర :– ఏమి? యీలోకమున దొరకునా? లేదు. మరణించిన పిదప బరలోకమున లభించును. వీరు మాకిక్కడ నిచ్చుదానికి, మాకు జేయుసేవకు బదులు వీరికి బరలోకమున దొరకును.

జిజ్ఞా :– వీరు మీకిచ్చిన దానికి బదులు దొరకునో దొరకదో యది యటుండనిండు. వీరినుండి తీసికొను మీకు బరలోకమున నేమి లభించును? నరకమేనా? లేక మఱి యేమైన గలదా?

సాంప్ర :– మేము భజనకూడ జేయుచుందుము కదా? దానికి ఫలము మాకు సుఖము లభించును.

జిజ్ఞా :– మీ భజన డబ్బుకొఱకే గదా! మీరు సంపాదించు డబ్బంతయు నిటనే పడియుండును. మీరు పోషించు మాంసపిండము కూడ నిటనే భస్మము చేయబడును. మీరు పరమేశ్వరుని భజించిన కసీ సము మీయాత్మ పవిత్ర మగును గదా!

సాంప్ర :– మే మశుద్ధులమా?

జిజ్ఞా :– లోలోపల మీరు మిక్కిలిగా నపవిత్రులు.

సాంప్ర :– నీ కెట్లు తెలియును?

జిజ్ఞా :– మీ ప్రవర్తన, వ్యవహారములవలన.

సాంప్ర :– మహాత్ముల వ్యవహారము లేనుగు దంతముల సమానములు. ఏనుగుదంతములు తినుటకు వేఱు. బయటికి గనబడు దంతములు వేఱుగా నుండును. అట్లే మేము లోపల మిక్కిలి పవిత్రులము. పైకి నేవో లీలల చేయుచుందుము.

జిజ్ఞా :– లోపల మీరు పవిత్రులై యున్నచో మీ వెలుపలి కార్యములును బవిత్రములై యుండెడివి. కావున మీరు లోపలకూడ నపవిత్రులే.

సాంప్ర :– మే మెట్టివార మైననేమి! మా శిష్యులు మంచివారే కదా?

జిజ్ఞా :– మీరు గురువు లెట్టివారో మీ శిష్యులు నట్టివారే యగుదురు. (ఆవు చేలో మేసిన దూడ గట్టున మేయునా) ఎల్లరి మత మేక మెన్నడు గాజాలదా?

సాంప్ర :– ఒకమత మెన్నడు గాజాలదు. మనుష్యుల గుణకర్మస్వభావములు భిన్నములు కదా?

జిజ్ఞా :– బాల్యావస్థనుండి శిక్షణ మొక్కటిగానుండి, సత్యభాషణాది ధర్మములను గ్రహింపజేసి మిథ్యాభాషణా ద్యధర్మములను విడిపింప జేసిన దప్పక యొక్కమత మేర్పడగలదు. లోకమున ధర్మాత్ము లధర్మాత్ములు ననువారు రెండు తెగలుగా నుండిన నుండుగాక! కాని, ధర్మాత్ములు లోకమున నెక్కువయై యధర్మాత్ములు తక్కువయైన సుఖము వర్ధిల్లగలదు. అధార్మికు లెక్కువయైన దుఃఖము పెంపగును. విద్వాంసు లెల్లరు నొక్కటిగా సత్యోపదేశము చేసిన నొకమత మేర్పడుటలో విలంబముండదు.

(కలి ధర్మమున బాధకము కాదు)

సాంప్ర :– నేడు నడచుచున్నది కలియుగము. ఇందు సత్యయుగపు ధర్మముల నేల యాసింతువు?

జిజ్ఞా :– కాలమునకు గలియుగ మనిపేరు. కాలములో గ్రియ నొనర్చు శక్తి లేదు. అది క్రియా రహితము. కావున నది ధర్మాధర్మముల నొనర్చుటలో సాధకము కాని బాధకము కాని కాదు. మీరే కలి

యుగపు మూర్ఖులై కూర్చున్నారు. మనుష్యులే సత్యయుగపు కలియుగపు మూర్తులు కాకున్న లోకమున ధర్మాత్ము లధర్మాత్ములు నుండరు. ఈ గుణదోషము లన్నియు సంగతివలన నేర్పడునవి. స్వాభావికములు కావు.

జిజ్ఞాసు వీమాటలను జెప్పి యాప్తుని మరల సమీపించెను. వారితో 'అయ్యా! మీరు నన్నుద్ధరించి నారు. లేకున్న నేనొకరి వలలో జిక్కి నష్టభ్రష్టుడ నయ్యెడివాడ. ఇక నేను గూడ నీపాషండుల మతఖండ నము వేదమతమైన సత్యమును మండనము చేయుదును' అనెను.

అపుడు – ఇదియే మనుష్యుల కెల్లరకు, విశేషించి విద్వాంసులకు సంన్యాసులకు ముఖ్యకర్తవ్యమై యున్నది. మనుష్యు లెల్లరు సత్యమండనము, నసత్యఖండనము నెల్లరకు జదివి వినిపించి సత్యోపదేశము ద్వారా యుపకారము చేకూర్పవలయును.

ప్రశ్న :– బ్రహ్మచారులు, సంన్యాసులు మంచివారే కదా!

ఉత్తరము :– బ్రహ్మచర్య, సంన్యాసాశ్రమములు మంచివే. కాని నేడు వీనిలో జాలగొడవ లేర్పడినవి. ఎందఱో బ్రహ్మచారులమని పేరు పెట్టుకొందురు. జడలు గడ్డములు పెంచుకొని, వ్యర్థసిద్ధులను బ్రక టింప జూతురు. జపములు పురశ్చరణములు చేయుచుందురు. విద్యాభ్యాసము పేరునకైనను జేయరు. విద్యాభ్యాసమే బ్రహ్మచర్యము. బ్రహ్మయనగా వేదము. దానిని జదువుటకు జదివించుటకు గొంచెమైనను బరిశ్రమము చేయరు. ఇట్టి బ్రహ్మచారు లెందఱో యజాగళస్తనములవలె నిరర్థకులై యున్నారు.

అట్లే యెందఱో సంన్యాసులు దండ కమండలువులు చేత బుచ్చుకొని భిక్షాటనము జేయుచు దిరుగుచుందురు. కొంచెమైనను వేదమార్గపు టున్నతికి బ్రయత్నింపరు. చిన్నవయస్సుననే సంన్యాసము గ్రహించి దేశమున దిరుగుచుందురు. విద్యాభ్యాసము జేయరు. ఇట్టి సంన్యాసులు బ్రహ్మచారులు నిటునటు దిరుగుచు, స్థల పాషాణాది మూర్తులను దర్శించుచు వానిని బూజించుచు వ్యర్థముగా గాలము నయింతురు. కొందఱు విద్య నెఱిగియు మౌనము వహించి యుందురు. బాగుగ దిని, త్రాగి యేకాంతదేశమున పడి నిద్రపోవుచు బొర్లాడుచుందురు. ఈర్ష్యా ద్వేషములలో జిక్కుపడి, నిద్రా కుచేష్ట లతో గాలము నయించుచుందురు. కాషాయవస్త్రములను, దండకమండలములను ధారణము చేయుట లోనే కృతకృత్యత యని యెంచెదరు. సర్వోత్కృష్టమని యెఱిగియు నుత్తమకర్మల నొనర్పరు. ఇట్టి బ్రహ్మచారులు, సంన్యాసులు దేశమున వ్యర్థముగా వసించుచున్నారు. వీరిలో నెవరైన జగత్తునకు హితము చేయువారుండిన వారు మంచివారు.

ప్రశ్న :– గిరి, పురి, భారతి మున్నగు గోసాయీలు మంచివారే కదా! వారు మండలిగా నేర్పడి దేశ మున సంచరింతురు. వందలాది సాధువుల కానందము గావింతురు. అంతట నద్వైతమతము నుపదేశిం తురు. కొలదిగానో గొప్పగానో చదువుచు జదివించుచు నుందురు. కావున వారు మంచివారే కదా!

ఉత్తరము :– గిరి, పురి మున్నగు పదినామములు తరువాత గల్పింపబడినవి. సనాతనములు కావు. పలువురు సాధువులు భోజనము కొఱకే మండలులలో నుందురు. వీరిలో దంభ మెక్కువ. తమలో నొక రిని మహంతుగా జేసి మండలి యేర్పఱచుకొందురు. సాయంకాలమున మహంతు గద్దీమీద గూర్చుండును. అప్పుడు బ్రాహ్మణులు సాధువులు నెల్లరు నిలబడి చేతులలో బుష్పములు తీసికొని, నారాయణం పద్మ భువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ, వ్యాసం శుకం గౌడపదం మహాన్తమ్" అను నిట్టి శ్లోకములు చదివి 'హరహర' యని పలికి మహన్తుమీద బుష్పవృష్టి గురియింతురు. సాష్టాంగ ప్రణామము చేయుదురు. అక్కడ నున్నవారిలో నెవరైన నట్లు చేయకున్న నతని నక్కడ నిలువనీరు. ఈ దంబాచార మంతయు లోకమునకు జూపుటకు జేయుదురు. అందువలన బ్రతిష్ఠ యేర్పడి మిక్కిలి ధనాదులు లభించును.

ఎందఱో మతధారులు గృహస్థులై యుండియు సంన్యాసాభిమానము కలిగి యుందురు. కర్మ యేమియు జేయరు. సంన్యాస ధర్మములను గూర్చి పంచమ సముల్లాసమున వ్రాసియున్నాము. వాని నాచరింపక వ్యర్థముగా సమయము వ్యయింతురు. ఎవరేని మంచి యుపదేశము నొసంగిన నతనిని ద్వేషింతురు. ఎక్కువగా వీరు భస్మము రుద్రాక్షలు ధరింతురు. కొందఱు శైవ సంప్రదాయాభిమానము కూడ గలిగియుందురు.

ఎప్పుడైన శాస్త్రార్థము చేయుదురేని శంకరాచార్యోక్త మతమును స్థాపించి, చక్రాంకితాది మతఖండన ములో బ్రవృత్తు లగుచుందురు. వేదమార్గము నున్నతము చేయుటకు గాని, పాషండమతములను ఖండ నము జేయుటకుగాని ప్రవృత్తులు కారు. ఈ ఖండనమండనములతో దమ కేమియు బ్రయోజనము లేదని యీసంన్యాసు లెంచుచుందురు. మేము మహాత్ములము. మాకేమిపని? ఇట్టి సంన్యాసులును లోక మున భారభూతులే.

వీ రిట్లుండుట వలననే వేదమార్గమునకు విరోధులైన వామమార్గాదులు, సంప్రదాయములు, క్రైస్తవ మహమ్మదీయులు లెక్కకు మిక్కిలియైరి. ఇంకను నెక్కువ యగుచునే యున్నారు. వైదికులు నశించు చున్నను వీరు కనరు. కన్నులు తెఱవరు. వారెందుకు దెఱచెదరు? వారిలో బరోపకారబుద్ధి యుండిన కదా! కర్తవ్యకర్మలు చేయుట కుత్సాహమున్న నిట్లు కన్నులెందుకు మూసికొందురు? వారికి వారిప్రతిష్ఠ భోజన భాజనములు సుఖసంపదలు తప్ప మఱియొండు కనిపింపవు. లోకనిందకు మిక్కిలి భయ పడుదురు.

(ఏషణాత్యాగ-సంన్యాసము)

మరల లోకైషణా = లోకమున బ్రతిష్ఠ, విత్తైషణా = ధనమును బెంపు జేయుటలో దత్పరుడై విషయముల ననుభవించుట, పుత్రైషణా = పుత్రులవలె శిష్యులయెడ మోహము గలిగి యుండుట యను నీమూడు 'ఏషణలను-కోరికలను విడిచిపెట్టుట సంన్యాసులకు ముఖ్యము. ఏషణయే విడువనపుడు సంన్యాస మెందుల కగును? అనగా బక్షపాతము విడిచి వేదధర్మోపదేశముతో జగత్తునకు మేలొనర్చుటలో నహర్నిశలు ప్రవృత్తులై యుండుట సంన్యాసులకు ముఖ్యకర్తవ్యము. తమకు యోగ్యములగు కర్మల నాచరింపని వారు సంన్యాసులమని పేర్లు పెట్టుకొనుట వ్యర్థము. గృహస్థులు తమ వ్యవహారములందును, స్వార్థమునందును నెట్లు పరిశ్రమ మొనర్తురో యంతకంటె నధికముగా బరోపకారము చేయుటలో సంన్యాసులు తత్పరులై యున్నపుడే యన్ని యాశ్రమములు నున్నతిలో నుండును.

సంన్యాసులార! చూడుడు. మీ యెదుటనే పాషండమతములు వృద్ధిజెందుచున్నవి. క్రైస్తవులు, మహమ్మదీయులు నగుచున్నారు. మీరు మీ యింటిని గొంచెమైనను రక్షించుకొన యత్నింపరు. మఱియు నితరులను మీలో గలుపుకొనుటయు మీకు జేతగాదు. మీరు చేయదలచిన గదా? మీకు చేతనగుట! వర్తమానమునందును భవిష్యత్తునందును మీ రున్నత శీలురు కానంత వఱకు నార్యావర్తదేశము కాని యితర దేశమనుష్యులు గాని వృద్ధిబొందజాలరు. వృద్ధికి గారణములైన వేదాది సత్యశాస్త్రముల పఠన పాఠనము, బ్రహ్మచర్యాద్యాశ్రమముల కర్తవ్యపాలనము సత్యోపదేశము జరిగినపుడే దేశోన్నతి కలుగును.

చైతన్యము కలిగియుండుడు. మేల్కొనుడు. ఎన్నియో పాషండ విషయములు మీరు చూచుచునే యున్నారు. ఎట్లన గొందఱు సాధువులు తమసిద్ధులతో జనులకు సంతానములను గలిగించు దుకాణ ములు పెట్టుకొని కూర్చున్నారు. ఎందఱో స్త్రీలు వారిదగ్గఱకు వెళ్ళి చేతులు జోడించి పుత్రభిక్ష బెట్టు డని ప్రార్థించుచున్నారు. బాబా-సాధు వెల్లరకు బుత్రుడు కలుగునని యాశీర్వాద మొసంగును. వారిలో నెవరికేని పుత్రుడు కలిగిన దనసిద్ధిగా బ్రకటించుకొనుచున్నాడు. మూర్ఖస్త్రీలు బాబా యాశీర్వాదము వలన

దమకు సంతానము కలిగిన ట్లెంచుచున్నారు. పందులకు, కుక్కలకు, గాడిదలకు, కోళ్ళకు నెవరి యాశీర్వాదము వలన బిల్లలు బుట్టుచున్నవయ్యా! చెప్పండి బాబా! యని యెవరేని యడిగిన నేమి చెప్పుదురు! ఆ మూర్ఖస్త్రీల నడిగిన వారును నేమియు జెప్పజాలరు. ఎవడేని 'నేను బిల్లలను జీవింపజేసి యుంచ గలుగుదును' అని ప్రగల్భము లాడిన వాడేల చచ్చుచున్నాడు. తన చావును దప్పించుకొనలేని వాడితరుల నెట్లు రక్షించును.

(ధనసారీవంచకులు)

ఎందఱో వంచకులు మాయలు పన్నుచుందురు. పెద్దపెద్ద బుద్ధిమంతులు కూడ వారి మాయలలో బడుచుందురు. ఇందు ధనసారీ వంచకులు మిక్కిలి ప్రసిద్ధులు. వీ రైదారుగురు కలిసి దూరదూర ప్రాంతములకు బోవుదురు. తమలో హృష్టపుష్ట శరీరముగల చూచుటకు డాబుగా గనబడు వ్యక్తిని సిద్ధునిగా జేయుదురు. ధనవంతులున్న కొండొక గ్రామమునో, నగరమునో కనుగొని దానికి సమీపమునగల యడవిలో నాసిద్ధుని గూర్చుండబెట్టుదురు.

మిగిలినవారు సాధకుల వేషములు ధరించి గ్రామములోనికి వెళ్ళి తామెఱుగనట్లు గ్రామవాసులను 'అయ్యా! మీ రిటువంటి మహాత్ముని మీ సమీపములో నెక్కడనైన జూచితిరా;' అని యడుగుదురు. వారందులకు నెటువంటి మహాత్ముడు మాకు దెలియదే యనగా నాసాధకులలో నొకడు, 'ఓహో' మీకు దెలియదా? ఆ సాధువు గొప్పసిద్ధుడు. మనస్సులో నున్న విషయములను జెప్పగలడు. అతడేది చెప్పిన నది జరిగి తీఱును. పెద్దయోగి, సిద్ధుడు. వారిని దర్శించుటకే మే మిండ్లు వాకిళ్ళు వదలి తిరుగుచు న్నాము. వా రీప్రాంతముననకే వచ్చినట్లు తెలిసినది. మీరు చూచియుందురేమో యని యడుగుచున్నాము' అనును. ఆ మాటలు విని గృహస్థులు "అయ్యా! మేము చూడలేదు. కాని మీకు గనబడినచో మాకును దెలియబఱచుడు. మేముకూడ దర్శనము చేసికొని మా మనోభావములను గూడ దెలిసికొందుము. తప్పక మాకు దెలుపుడని ప్రాధేయపడుదురు."

ఇట్లాదినమంతయు గ్రామములో దిరిగి సిద్ధుని వెల్లడి చేయుదురు. రాత్రికి నందఱు నొకచో జేరి తిని పరుండుదురు. ఇట్లు మూడు నాలుగు దినములు నగరమున నన్నివైపుల బ్రసిద్ధిజేసి తరువాత నొక నాడు నలుగురు సాధకులు నలుగురు ధనాఢ్యుల చెంతజేరి 'అయ్యా! మా కాసిద్ధుడు దొరకినాడు. ఇక్కడ సమీపారణ్యములోనే బసచేసియున్నాడు. మీరు దర్శనము చేసికొన గోరుదురేని నడువుడు. మేము చూపు దుము' అందురు. అంతట నాధనికులు సిద్ధపడగా 'మీరడుగ దలచిన దేమో మాకు జెప్పుడు. వారు పుత్రుల నీగలుగుదురు. ధనమును, శత్రునివారణాదులను, రోగనివారణమును జేయగలరు.' అనగా నా గృహస్థులు ధనికులు దమతమ కోరికల నమాయకముగా వారియెదుట వెల్లడింతురు. అంతట వారిని వెంటబెట్టుకొని తమ సిద్ధునికడకు గొంపోవుదురు. ఆ సిద్ధసాధకులు తా మేకోరికలు గలవారిని నెక్కడ గూర్చుండబెట్టవలయునో సంకేతముల నేర్పఱచుకొని యుందురు. ఆ సంకేతముల ప్రకారము, పుత్రులం గోరువారి నెదురుగాను ధనాపేక్షతో వచ్చినవారిని కుడివైపునను, శత్రువిషయమును దెలిసికొన వచ్చిన వారిని వెనుకవైపునను నిట్లా యా సంకేతిత స్థానములందు గూర్చుండబెట్టుదురు. ఇట్లు గృహస్థులు కూర్చుండి నమస్కారములు చేయుదురు. వెంటనే సిద్ధు డుచ్చస్వరముతో దనసిద్ధిని బ్రకటించుచు ఏమయ్యా! మాదగ్గఱ బిల్లల ఖజానా యున్నదనుకొని వచ్చితిరా? పుత్రులు కావాలని వచ్చితిరి! ఏమి యిక్కడ ధనము మూటగట్టి దాచియుంచితిరా! మీరు ధనాశతో నిటకువచ్చితిరి. ఫకీరుల దగ్గఱ ధన మెక్కడిదయ్యా! ఏమయ్యా! మీరు రోగ నివారణము కొఱకు వచ్చితిరి. మేము వైద్యులమా? వెళ్ళండి వైద్యుల దగ్గఱకు. మాకడ నేమియున్నది? అని ప్రగల్భము లాడును.

వచ్చినవాని తండ్రి రోగియైన సాధకు డంగుష్ఠమును, దల్లి రోగియైన, జూపుడు వ్రేలును, సోదరుడు రోగియైన నడిమివ్రేలును, నిట్లే యితర విషయములను సాధకుడు చూపి సిద్ధునకు దెలుపును. ఆ సంకేతముల ననుసరించి సిద్ధుడు వారెందులకు వచ్చినదియు జెప్పుచుండును. 'భాయీ! చూడు. నీతండ్రి రోగి, నీతల్లి రోగి, నీ సోదరుడు రోగి, లేక నీకన్య రోగి, యని చెప్ప నారంభించును. అప్పుడు సాధకులు చూచితిరా? సిద్ధుని ప్రభావము? మేము చెప్పలేదా! మేము చెప్పినది సత్యమా కాదా! అని నగరవాసులను నమ్మింపజేయుదురు.

గృహస్థుడు :- అవును స్వామీ! మీరు చెప్పినది నిజమే. మీరు మాకు జాలయుపకారము చేసితిరి. మా యదృష్టముకొలది సిద్ధుడు మాకు లభించినాడు. దర్శనము చేసికొని కృతార్థులమైతిమి.

సాధకుడు :- సోదరులార! వినుడు. ఈ సిద్ధుడు మనోగామి. ఇక్కడ నెక్కుడు దినము లుండడు. వీరి యాశీర్వాదము బొంద గోరువారు మీ మీ సామర్థ్యము ననుసరించి తనుమనోధనములతో వీరిసేవ జేయుడు. ఏలయన సేవ జేసిన వారికే గదా! ఫలము లభించును? ఎవరి యెడ బ్రసన్నుడగునో! యెవరి కేమి వరము నిచ్చునో చెప్పజాలము.

గృహస్థ లామాటలు నమ్మి వారిని బ్రశంసించుచు నిండ్లకు సంతోషముతో వెళ్ళుదురు. సాధకులు గూడ వారివెంటనే పోదురు. వారి మోసము తెలియక యుండుట కట్లు చేయుదురు. ఆధనాఢ్యులును గలిసిన మిత్రులకు గూడ సిద్ధుని గూర్చి ప్రశంసించి చెప్పుచుందురు. క్రొత్తవారును సాధకులతో గలిసి వారి కోరికలను దెలుపుచు సిద్ధుని దర్శనము చేసికొన బోవుచుందురు.

నగరమున బాగుగ వార్త వ్యాపించిన మీదట నగరవాసు లెల్లరు "ఫలానా చోట గొప్ప సిద్ధుడు వచ్చి యున్నాడట పదండి. అందఱము చూచెదము" అని గుంపులు గుంపులుగా వచ్చి, 'అయ్యా! మా మనస్సులో నేమున్నదో చెప్పండి? మా మనస్సులో నున్నది చెప్పండి' అని యొక్కుమ్మడిగా జనులు గుమికూడిన నేమియు జెప్పక మౌనము వహించి, 'మమ్మ మీరిట్లు బాధ పెట్టకుడు' అని యూరకుం డును. అప్పుడు శిష్యులు కూడ నతనితోబాటు 'మీరిట్లు బాధించిన మహారాజా వెళ్ళిపోవును' అని చెప్పు దురు. అప్పు డాజనులలో నొకధనాఢ్యుడు సాధకుని వేఱుగా దీసికొని పోయి మా మనోరథము చెప్పిం చండి. అప్పుడు సత్యము నంగీకరింతుము.' అనిన నతని మనోరథము ముందు శిష్యుడు తెలిసికొని సంకే తము ననుసరించి కూర్చుండ బెట్టగా సిద్ధుడు తెలిసికొని యతనికోరికను దెలుపును. ఆ విషయమును గుంపులో నెల్లరు దెలిసికొని 'సిద్ధుడు చాల గొప్పవాడని ప్రశంసింతురు.

ఇక గావలసిన దేమున్నది. కొందఱు మిఠాయి, కొందఱు పైసలు, కొందఱు నవరసులు వారివారి తాహతుకు దగినట్లు భక్తితో సిద్ధునకు సమర్పింప మొదలిడుదురు. గౌరవ సత్కారాలు జరిగినంత కాం మటనుండి లోకులను దోచుకొని, వారిలో నత్యంత మూర్ఖ ధనాఢ్యులైన వారి కింత బూడిద ప్రసాదించి పుత్రాదులు గలుగ నాశీర్వదించును. 'నీకు నిజమైన భక్తియున్న నీకార్యము నెఱవేరును. నీకు బుత్రుడు పుట్టున'ని వరములిచ్చి మఱియొక యెడకు బయనింతురు.

ఇట్టి వంచకులు లోకమున నెందఱో యున్నారు. అట్టివారిని విద్వాంసులే పరీక్షింప గలుగుదురు. ఇతరులు చేయలేరు. అందులకు వేదాది శాస్త్రములను జదువవలయును. సత్సంగము చేయుచుండ వలయును. అప్పుడట్టి వారి వంచనకు లోనుగారు. ఇతరులను గూడ దప్పింప గలుగుదురు. ఏలయన మనుష్యునకు విద్య నేత్రము వంటిది. విద్యయు శిక్షయు లేకున్న జ్ఞానము కలుగదు. బాల్యావస్థ నుండియు విద్య నభ్యసించువారే విద్వాంసు లగుదురు. కుసంగము దుస్సాంగత్యము గలవారు దుష్టులు, పాపులు, మూర్ఖులునై మిక్కిలి దుఃఖములను బొందుదురు. అందువలననే జ్ఞానమును గొప్పగా

వెంచుదురు. తెలిసినవాడే యంగీకరించును.

"న వేత్తి యో యస్య గుణప్రకర్షం న తస్యై నిందాం సతతం కరోతి
యథా కిరాతీ కరికుంభజాతా ముక్తాః పరిత్యజ్య బిభర్తి గుంజాః."
ఇది యొకకవి వచనము – వృద్ధచాణక్యము. ౧౧–౨.

ఒకని గుణముల నెఱుగని వాడతని నెల్లపుడు నిందించును. అడవిలో నుండు కిరాత స్త్రీ యేనుగు కుంభస్థలమునుండి వెలువడు ముత్యముల విలువ తెలియక గురిగింజల నాభరణముగా ధరించును. అట్లే యెవడు విద్వాంసులు ధార్మికులు, జ్ఞానులు, సత్పురుషులు నైనవారి సాంగత్య మొనర్చి యోగి, పురుషార్థ పరుడు, సుశీలుడు, జితేంద్రియుడు నగునో యతడే ధర్మార్థకామమోక్షములను బొంది యీ జన్మమునం దును బరజన్మమునందు నానందముతో నుండును.

(ఉపసంహారము)

ఇంతవఱకు నార్యావర్తమున నివసించు జనుల మతములను గుఱించి సంక్షేపముగ వర్ణించితిమి. ఇక ముందు గొంచె మార్యరాజుల చరిత్రమును గూర్చి తెలిసిన విషయమును సజ్జనులు తెలిసికొనుటకు ప్రకా శితము చేయుచున్నాము.

ఇప్పు డార్యావర్తదేశమునకు సంబంధించిన రాజవంశములలో, యుధిష్ఠిరమహారాజు మొదలు యశపాల్ మహారాజు వఱకుగల యితిహాసము వ్రాయుచున్నాము. శ్రీమంతుడైన స్వాయంభువ మనుమహారాజు నుండి యుధిష్ఠిర మహారాజు వఱకుగల చరిత్ర మంతయు మహాభారతాది గ్రంథములలో వ్రాయబడియే యున్నది. తదుపరి మేము వ్రాయుచరిత్రము చూచిన సజ్జనులకు గొంత యితిహాసము తెలియగలదు.

ఈ విషయము "విద్యార్థి" అను పత్రికతో బాటు, "హరిశ్చంద్ర చంద్రికా," "మోహనచంద్రికా" అను శ్రీనాథద్వారమునుండి వెడలు పక్షపత్రికలలో బ్రచురింపబడినదియే. ఈ పత్రికలద్వారా రాజపుత్ర స్థానమునందును, మేవాడ్ దేశమున 'ఉదయపురము', 'చిత్తోడ్‌గఢ' మున్నగు ప్రదేశముల వారీవిషయ ముల నెఱుగుదురు. అయినను నాపత్రికలనుండియే యుద్ధరించి యిట వ్రాయుచున్నాము. ఇట్లే మన యార్యసజ్జను లితిహాసము నుండియు నితర విద్యాపుస్తకములనుండియు నన్వేషించి ప్రకటించిన దేశమున మిక్కిలి లాభము చేకూరును.

ఉపర్యుక్త పత్రికా సంపాదకుడు తన మిత్రునినుండి, వి.సం. ౧౭౮౨న వ్రాసిన గ్రంథమును బొంది, తన వి.సం. ౧౯౩౯ మార్గశీర్షపు శుక్లపక్షమునకు సంబంధించిన, (౧౯–౨౦) రెండు సంచికలలో నీవిషయములను ముద్రించి యున్నాడు. ఆ విషయ మిట వ్రాయుచున్నామని యెఱుగుదురు గాక!

(ఆర్యావర్తదేశీయ రాజవంశావళి)

ఆర్యు లింద్రప్రస్థమున శ్రీమన్ మహారాజు 'యశపాల్' పర్యంతము రాజ్యము చేసియున్నారు. వారిలో 'యుధిష్ఠిర' మహారాజు మొదలు శ్రీ 'యశపాల్' మహారాజు వఱకు నావంశమునకు సంబంధించిన దాదాపు ౧౨౪ నూటయిరువది నాలుగు (తరములవారు) రాజులు ౪౧౫౭ సంవత్సరములు ౯ మాస ములు, ౧౪ దినములు రాజ్యము చేసినట్లు తెలియుచున్నది. వారి వివరణము :–

| రాజులు. | తరములు. | సం. | మా. | ది. |
|---|---|---|---|---|
| ఆర్యరాజులు | ౧౨౪ | ౪౧౫౭ | ౯ | ౧౪ |

శ్రీమన్‌మహారాజు యుధిష్ఠిరాదులు దాదాపు ౩౦ మంది రాజులు. వారి రాజ్యకాలము ౧౭౭౦ సంవత్సరములు. ౧౧ మా. ౧౦ దినములు.

| | మహారాజు. | సం. | మా. | ది. |
|---|---|---|---|---|
| ౧ | యుధిష్ఠిరుడు | ౩౬ | ౮ | ౨౫ |
| ౨ | పరీక్షితుడు | ౬౦ | ౦ | ౦ |
| ౩ | జనమేజయుడు | ౮౪ | ౭ | ౨౩ |
| ౪ | అశ్మమేఘుడు | ౮౨ | ౮ | ౨౨ |
| ౫ | ద్వితీయరాముడు | ౮౮ | ౨ | ౮ |
| ౬ | ఛత్రమల్ | ౮౧ | ౧౧ | ౨౭ |
| ౭ | చిత్రరథుడు | ౭౫ | ౩ | ౧౮ |
| ౮ | దుష్టశల్యుడు | ౭౫ | ౧౦ | ౨౪ |
| ౯ | ఉగ్రసేనుడు | ౭౮ | ౭ | ౨౧ |
| ౧౦ | శూరసేనుడు | ౭౮ | ౭ | ౨౧ |
| ౧౧ | భువనపతి | ౬౯ | ౫ | ౫ |
| ౧౨ | రణజీత్ | ౬౫ | ౧౦ | ౪ |
| ౧౩ | ఋక్షకుడు | ౬౪ | ౭ | ౪ |
| ౧౪ | సుఖదేవ్ | ౬౨ | ౦ | ౨౪ |
| ౧౫ | నరహరిదేవ్ | ౫౧ | ౧౦ | ౨ |
| ౧౬ | సుచిరథుడు | ౪౨ | ౧౧ | ౨ |
| ౧౭ | శూరసేన్ (౨) | ౫౮ | ౧౦ | ౮ |
| ౧౮ | పర్వత సేన్ | ౫౫ | ౮ | ౧౦ |
| ౧౯ | మేధావి | ౫౨ | ౧౦ | ౧౦ |
| ౨౦ | సోనచీర్ | ౫౦ | ౮ | ౨౧ |
| ౨౧ | భీమదేవ్ | ౪౭ | ౯ | ౨౦ |
| ౨౨ | నృహరిదేవ్ | ౪౫ | ౧౧ | ౨౩ |
| ౨౩ | పూర్ణమల్ | ౪౪ | ౮ | ౭ |
| ౨౪ | కరదవి | ౪౪ | ౧౦ | ౮ |
| ౨౫ | అలమ్మిక్ | ౫౦ | ౧౧ | ౮ |
| ౨౬ | ఉదయపాల్ | ౩౮ | ౯ | ౦ |
| ౨౭ | దువనమల్ | ౪౦ | ౧౦ | ౨౬ |
| ౨౮ | దమాత | ౩౨ | ౦ | ౦ |
| ౨౯ | భీమపాల్ | ౫౮ | ౫ | ౮ |
| ౩౦ | క్షేమక్ | ౪౮ | ౧౧ | ౨౧ |

క్షేమక రాజుకు మంత్రియైన విశ్రవుడు క్షేమకుని జంపి రాజ్యమున కధిపతి యయ్యెను. అతనిలో నావంశజులు ౧౪ మంది రాజులు ౫౦౦ సం॥ ౩ మా. ౧౦ దినములు రాజ్యమేలిరి. వివరములు --

| | రాజుపేరు. | సం. | మా. | ది. |
|---|---|---|---|---|
| ౧ | విశ్రవుడు | ౧౭ | ౩ | ౨౯ |
| ౨ | పురసేని | ౪౨ | ౮ | ౨౧ |

| | | | | |
|---|---|---|---|---|
| ౩ | వీరసేని | ౫౨ | ౧౦ | ౭ |
| ౪ | అనంగశాయి | ౪౭ | ౮ | ౨౩ |
| ౫ | హరిజిత్ | ౩౫ | ౯ | ౧౭ |
| ౬ | పరమసేని | ౪౪ | ౨ | ౨౩ |
| ౭ | సుఖపాతాల్ | ౩౦ | ౨ | ౨౧ |
| ౮ | కద్రుతుడు | ౪౨ | ౯ | ౨౪ |
| ౯ | సజ్జుడు | ౩౨ | ౨ | ౧౪ |
| ౧౦ | అమరచూడుడు | ౨౭ | ౩ | ౧౬ |
| ౧౧ | అమీపాల్ | ౨౨ | ౧౧ | ౨౫ |
| ౧౨ | దశరథుడు | ౨౫ | ౪ | ౧౨ |
| ౧౩ | వీరసాల్ | ౩౧ | ౮ | ౧౧ |
| ౧౪ | వీరసాలసేన్ | ౪౦ | ౦ | ౧౪ |

వీరసాల్ సేనరాజును, నతని మంత్రి వీరమహుడు చంపి రాజ్యము చేసెను. అతని వంశజాలు ౧౬ మంది ౪౪౫ సం. ౫ మా. ౩ ది. రాజ్య మొనర్చిరి. వారి వివరములు --

| | పేరు | సం. | మా. | ది. |
|---|---|---|---|---|
| ౧ | వీరమహుడు | ౩౫ | ౧౦ | ౮ |
| ౨ | అజిత సింహుడు | ౨౭ | ౭ | ౧౯ |
| ౩ | సర్వదత్తుడు | ౨౮ | ౩ | ౧౦ |
| ౪ | భువనపతి | ౧౫ | ౪ | ౧౦ |
| ౫ | వీరసేన్ (౧) | ౨౧ | ౨ | ౧౩ |
| ౬ | మహీ పాల్ | ౪౦ | ౮ | ౭ |
| ౭ | శత్రుశాల్ | ౨౬ | ౪ | ౩ |
| ౮ | సంఘరాజ్ | ౧౭ | ౨ | ౧౦ |
| ౯ | తేజపాల్ | ౨౮ | ౧౧ | ౧౦ |
| ౧౦ | మాణిక్ చంద్ | ౩౭ | ౭ | ౨౧ |
| ౧౧ | కామసేనీ | ౪౨ | ౫ | ౧౦ |
| ౧౨ | శత్రుమర్దన్ | ౮ | ౧౧ | ౧౩ |
| ౧౩ | జీవనలోక్ | ౨౮ | ౯ | ౧౭ |
| ౧౪ | హరిరావ్ | ౨౬ | ౧౦ | ౨౯ |
| ౧౫ | వీరసేన్ (౨) | ౩౫ | ౨ | ౨౦ |
| ౧౬ | ఆదిత్యకేతు | ౨౩ | ౧౧ | ౧౩ |

మగధదేశపు రాజైన ఆదిత్యకేతును ప్రయాగరాజు ధన్ ధర్ చంపి రాజ్యము చేయ నతని వంశజాలు ౯ మంది ౩౭౪ సం. ౧౧ మా. ౨౬ ది. రాజ్యమేలిరి.

| | | సం. | మా. | ది. |
|---|---|---|---|---|
| ౧ | ధన్ ధర్ | ౪౨ | ౭ | ౨౪ |
| ౨ | మహర్షి | ౪౧ | ౨ | ౨౯ |

| | | | | |
|---|---|---|---|---|
| ౩ | సనరచ్చీ | ౫౦ | ౧౦ | ౧౯ |
| ౪ | మహాయుద్దుడు | ౩౦ | ౩ | ౮ |
| ౫ | దురనాధుడు | ౨౮ | ౫ | ౨౫ |
| ౬ | జీవనరాజు | ౪౫ | ౨ | ౫ |
| ౭ | రుద్రసేనుడు | ౪౭ | ౪ | ౨౮ |
| ౮ | ఆరీలక్ | ౫౨ | ౧౦ | ౮ |
| ౯ | రాజపాల్ | ౩౬ | ౦ | ౦ |

రాజపాలుని, నతని సామంతరాజు మహాన్‌పాలుడు చంపి రాజ్యము నేలెను. అతడు ౧౪ సంవత్సరములు రాజ్యము చేసెను. అతని వంశజులు రాజులు కాలేదు.

ఆమహాన్‌పాలుని జయించి అవంతికాపుర ఉజ్జైనాధీశుడు రాజా విక్రమాదిత్యుడు ౩౯ సంవత్సరములు రాజ్యమేలెను.

విక్రమాదిత్యుని జయించి శాలివాహనుని సామంతుడైన సముద్రపాల్ యోగి పైఠణుడు రాజ్యమునకు వచ్చెను. అతడు నతని వంశజులు ౧౬ మంది రాజులు ౩౭౨ సం. ౪ మా. ౨౭ ది. రాజ్యమేలిరి.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | సముద్రపాల్ | ౫౪ | ౨ | ౨౦ |
| ౨ | చంద్రపాల్ | ౩౬ | ౫ | ౪ |
| ౩ | సహాయపాల్ | ౧౧ | ౪ | ౧౧ |
| ౪ | దేవపాల్ | ౨౭ | ౧ | ౨౮ |
| ౫ | నరసింహపాల్ | ౧౮ | ౦ | ౨౦ |
| ౬ | సామపాల్ | ౨౭ | ౧ | ౧౭ |
| ౭ | రఘుపాల్ | ౨౨ | ౩ | ౨౫ |
| ౮ | గోవిందపాల్ | ౨౭ | ౧ | ౧౭ |
| ౯ | అమృతపాల్ | ౩౬ | ౧౦ | ౧౩ |
| ౧౦ | బలీపాల్ | ౧౨ | ౫ | ౨౭ |
| ౧౧ | మహీపాల్ | ౧౩ | ౮ | ౪ |
| ౧౨ | హరీపాల్ | ౧౪ | ౮ | ౪ |
| ౧౩ | సీసపాల్ | ౧౧ | ౧౦ | ౧౩ |
| ౧౪ | మదనపాల్ | ౧౭ | ౧౦ | ౧౯ |
| ౧౫ | కర్మపాల్ | ౧౬ | ౨ | ౨ |
| ౧౬ | విక్రమపాల్ | ౨౪ | ౧౧ | ౧౩ |

విక్రమపాల్ పశ్చిమదిశకు రాజైన మలుఖచంద్ బోహరామీద దాడిచేసి యుద్ధమున నోడిపోయెను. మలుఖచంద్ విక్రమపాలుని జంపి ఇంద్రప్రస్థమునకు రాజయ్యెను. అతని వంశజులు ౧౦ మంది ౧౯౦ సం. ౧ మా. ౧౬ దినములు రాజ్యమేలిరి.

| | పేరు | సం. | మా. | ది. |
|---|---|---|---|---|
| ౧ | మలుఖచంద్ | ౫౪ | ౨ | ౧౦ |
| ౨ | విక్రమచంద్ | ౧౨ | ౭ | ౧౨ |

| | | | | |
|---|---|---|---|---|
| ౩ | అమీనచంద్ | ౧౦ | ౦ | ౫ |
| ౪ | రామచంద్ | ౧౩ | ౧౧ | ౮ |
| ౫ | హరీచంద్ | ౧౪ | ౯ | ౨౪ |
| ౬ | కల్యాణచంద్ | ౧౦ | ౫ | ౪ |
| ౭ | భీమచంద్ | ౧౬ | ౨ | ౯ |
| ౮ | లోవచంద్ | ౨౬ | ౩ | ౨౨ |
| ౯ | గోవిందచంద్ | ౩౧ | ౭ | ౧౨ |
| ౧౦ | రాణీపద్మావతి | ౧ | ౦ | ౦ |

పద్మావతీరాణి చనిపోయినది. పుత్రులు లేరు. కావున నారాజ్యమునగల 'ముత్సద్దీయు' లాలోచించి హరిప్రేమ 'బైరాగి'ని గద్దీ నెక్కించి ముత్సద్దీలే రాజ్యము చేయసాగిరి. వారు నలుగురు. ౫౦ సం. ౨౧ దినములు రాజ్యమేలిరి.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | హరిప్రేమ | ౭ | ౫ | ౧౬ |
| ౨ | గోవిందప్రేమ | ౨౦ | ౨ | ౮ |
| ౩ | గోపాలప్రేమ | ౧౫ | ౭ | ౨౮ |
| ౪ | మహాబాహు | ౬ | ౮ | ౨౯ |

మహాబాహువు రాజ్యము విడిచి వనమున దపశ్చర్య నారంభించెను బంగాల్ దేశపురాజు ఆధీసేను డిది విని వచ్చి ఇంద్రప్రస్థమును వశపఱచుకొని రాజ్య మేలసాగెను. అతని వంశజులు ౧౨ మంది ౧౫౧ సం. ౧౧ మా. ౨ దినములు రాజ్యము చేసిరి.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ఆధీసేన్ | ౧౮ | ౫ | ౨౧ |
| ౨ | బిలావ్ సేన్ | ౧౨ | ౪ | ౨ |
| ౩ | కేశవసేన్ | ౧౫ | ౭ | ౧౨ |
| ౪ | మాఘసేన్ | ౧౨ | ౪ | ౨ |
| ౫ | మయూర్ సేన్ | ౨౦ | ౧౧ | ౨౭ |
| ౬ | భీమసేన్ | ౫ | ౧౦ | ౯ |
| ౭ | కల్యాణసేన్ | ౪ | ౮ | ౨౧ |
| ౮ | హరీసేన్ | ౧౨ | ౦ | ౨౫ |
| ౯ | క్షేమసేన్ | ౮ | ౧౧ | ౧౫ |
| ౧౦ | నారాయణసేన్ | ౨ | ౨ | ౨౯ |
| ౧౧ | లక్ష్మీసేన్ | ౨౬ | ౧౦ | ౦ |
| ౧౨ | దామోదరసేన్ | ౧౧ | ౫ | ౧౯ |

దామోదర్ సేనుడు తనసామంతుని మిక్కిలి కష్టపెట్టెను. అపుడాసామంతుడు దీపసింహుడు సేనను వశపఱచుకొని రాజును జంపి స్వయముగా రాజ్యమేలెను. అతని వంశజులు ౬ గురు ౧౦౭ సం. ౬ మా. ౨౨ దినములు రాజ్యమేలిరి.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | దీపసింహుడు | ౧౭ | ౧ | ౨౬ |
| ౨ | రాజసింహుడు | ౧౪ | ౫ | ౦ |
| ౩ | రణసింహుడు | ౯ | ౮ | ౧౧ |

| | | | | |
|---|---|---|---|---|
| ౪ | నరసింహుడు | ౪౫ | ౦ | ౧౫ |
| ౫ | హరిసింహుడు | ౧౩ | ౨ | ౨౯ |
| ౬ | జీవనసింహుడు | ౮ | ౦ | ౧ |

జీవనసింహుడు తన సేనను గారణవశమున నుత్తరదిశకు బంపెను. విరాటరాజు పృథ్వీరాజు చహ్వాణుడిది తెలిసికొని జీవనసింహునిపై దాడిచేసి యతనిని జయించి యింద్రప్రస్థమునకు రాజయ్యెను. అతని వంశజాలు ౫ గురు ౮౬ సం. ౨౦ దినములు రాజ్యము చేసిరి.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | పృథ్వీరాజు | ౧౨ | ౨ | ౧౯ |
| ౨ | అభయపాల్ | ౧౪ | ౫ | ౧౭ |
| ౩ | దుర్జనపాల్ | ౧౧ | ౪ | ౧౪ |
| ౪ | ఉదయపాల్ | ౧౧ | ౭ | ౩ |
| ౫ | యశపాల్ | ౩౬ | ౪ | ౨౭ |

యశపాల్ రాజుమీద సుల్తాన్ శహబుద్దీన్ గోరీ గజనీదుర్గమునుండి దాడిచేసి యశపాల్ రాజును ప్రయాగకోటలో వి.సం. ౧౨౪౯న బట్టుకొని జైలులో నుంచెను. తదుపరి యింద్రప్రస్థమును సుల్తాన్ శహబుద్దీన్ పాలింపదొడగెను. ఇతని వంశమువారు ౫౩గ్గురు. ౭౫౪ సం. ౧ మా. ౧౭ దినములు పాలించిరి. వీరి వివరణము చరిత్ర గ్రంథములలో నుండుటచే నిట వివరింప మైతిమి.

ఇకముందు బౌద్ధజైన మతములను గూర్చి వ్రాయుదుము.

## శ్రీ మద్దయానంద సరస్వతీ స్వామి కృతమును సుభాషా విభూషితమునగు సత్యార్థప్రకాశమున ఆర్యావర్త మతఖండన మండనములుగల ఏకాదశసముల్లాసము సంపూర్ణము

# ద్వాదశ సముల్లాసము

## అనుభూమిక

ఆర్యావర్తమున నుండు మనుష్యులలో సత్యాసత్యములను యథార్థముగా నిర్ణయించు వేదవిద్య నశించి యవిద్య వ్యాపించి మత మతాంతరములు వ్యాపించి నపుడు జైనులు మున్నగువారి విద్యావిరుద్ధ మతప్రచారమునకు నవకాశ మేర్పడినది. ఏలయన వాల్మీకిరచిత రామాయణమునందుగాని, మహాభారతము నందుగాని జైనుల నామముకూడ గనిపింపదు. మఱియు జైనుల గ్రంథములందు వాల్మీకి రామాయణమునందు మహాభారతమునందు జెప్పబడిన రామకృష్ణాదుల గాథలు మిక్కిలి విస్తార పూర్వకముగ వ్రాయబడి యున్నవి. దీనింబట్టి జైనుల మతము రామాయణ మహాభారతాదులకు దదుపరి ప్రచారమునకు వచ్చినట్లు సిద్ధమగుచున్నది. ఏలయనగా జైనులు తమ మత మతిప్రాచీన మని మత గ్రంథములందు వ్రాసికొనుట సత్యమగు నెడల రామాయణ మహాభారతాది గ్రంథములందు జైనుల కథలు తప్పక వ్రాయబడి యుండెడివి. కావున జైనమతము రామాయణాదులకు దదుపరి యేర్పడిన దనుట నిశ్చితము.

జైనుల గ్రంథములనుండి కథలను గ్రహించియే రామాయణాది గ్రంథములు నిర్మింపబడియుండ వచ్చునని యెవరేని పలికిన, 'రామాయణాదులలో మీ గ్రంథముల నామమైన నెటను నేల యుల్లేఖింపబడలేదు' అని వారిని బ్రశ్నింపవలయును. మఱియు 'మీ గ్రంథములలో రామకృష్ణాదుల కథ లేల యున్నవి?' అనియు బ్రశ్నింపవలయును. పుత్రుడు పితృజన్మ దర్శనము చేసికొనగలడా? ఎన్నడును జేసికొనలేడు. దీనిం బట్టి జైన బౌద్ధమతములు శైవ, శాక్తాది మతముల తదుపరి యేర్పడిన వని సిద్ధమగుచున్నది.

ఇప్పు డీపంద్రెండవ సముల్లాసమున జైనుల మతమునకు సంబంధించిన యేయే విషయములు వ్రాయబడినవియో యవియన్నియు వారి గ్రంథములనుండియే వ్రాయబడినవి. ఉద్ధరణ స్థలములును నిర్దేశింపబడినవి. జైను లిది చూచి చెడుగా భావింపవలసిన పనియు లేదు. వీరి మతవిషయమున మేము వ్రాసిన దంతయు సత్యాసత్యములను నిర్ణయించుటకే కాని–విరోధముకాని, హానికాని కలిగించుటకు గాదు.

జైనులు కాని, బౌద్ధులుకాని, యితరులుకాని మాయీలేఖను జూచి సత్యాసత్యములను నిర్ణయించుటకు, విచారించుటకు, లేఖలు వ్రాయుట కవకాశము లభించును. జనులకు బోధయు గలుగును. వాది ప్రతివాదులుగా నేర్పడి ప్రేమతో వాదవివాదములు, లేఖలు ప్రతిలేఖలు వ్రాసినపుడే సత్యాసత్య నిర్ణయము కలుగును.

విద్వాంసులలో సత్యాసత్య నిర్ణయము లేని సమయముననే యవిద్వాంసులు మహాంధకారమునబడి మిక్కిలి దుఃఖముల పాలుకావలసి వచ్చును. కావున సత్యము జయించుటకు నసత్యము నశించుటకును మిత్ర బుద్ధితో విషయములను విమర్శించుచు లేఖలు వ్రాయుట మనుష్యుల కర్తవ్యము. అటుల జేయకున్న మనుష్యుల యున్నతి యెన్నడు గాదు.

మఱియు నీ బౌద్ధ జైన మత విషయములు వీరికే కాక యితర మతముల వారికిని నపూర్వ లాభము, బోధయు గలిగించును. ఏలయనగా వీరు వీరి గ్రంథములను నన్యమతముల వారికి జూచుటకు గాని, చదువుటకు గాని వ్రాయుటకు గాని యీరు. నేను మిక్కిలి పరిశ్రమ చేసిన మీదట, మఱియు బొంబాయి ఆర్యసమాజపు మంత్రి సేఠ్ సేవకలాల్ కృష్ణదాసుగారి పురుషార్థము వలనను వీరి గ్రంథములు లభించినవి. అట్లే కాశీలో నున్న 'జైన ప్రభాకర' యంత్రాలయమునందు, పుస్తకములు ముద్రింపబడుట వలనను, బొంబాయిలో 'ప్రకరణరత్నాకర' గ్రంథము ముద్రింపబడుటచేతను జైనమతమును గూర్చి

తెలిసికొనుటకు నెల్లరకు నవకాశము కలిగినది.

తమ మత గ్రంథములను దామే చూచుటయు, నితరులను జూడకుండ జేయుటయు విద్వాంసుల కిది యెట్లు శోభించునో తోచకున్నది. దీనిం బట్టి యీ గ్రంథములను రచించు విద్వాంసులకు 'దమ గ్రంథములలో నసంభవములైన విషయము లున్నవనియు, నితర మతములవారు వానింజూచిన ఖండింతు రనియు, మన మతమువా రితరుల గ్రంథములను జూచిన దమ మతమునందు వారికి శ్రద్ధ యుండ దనియు' ముందుగానే సందేహము కలదని సిద్ధ మగుచున్నది.

వారి యుద్దేశ మేమియైనను నది యట్లుండనిండు. కాని, మనుష్యులలో నెక్కువ మంది తమ దోషములను జూచుకొనక యితరుల దోషముల నెన్నుటకు మిక్కిలి యుద్యుక్తు లగుదురు. ఇది న్యాయము కాదు. ఏలయనగా మొదట దమ దోషములను దెలిసికొని వానిని దొలగించుకొని, తదుపరి యితరుల దోషములను దెలిసికొని వానిని దొలగింప యత్నింపవలయును.

ఇప్పు డీబౌద్ధ జైన విషయములను నెల్ల సజ్జనుల యెదుట నుంచు చున్నాడ. యథోచితముగా నాలోచింపుడు.

బుద్ధిమంతులైన వారి కెక్కువ వ్రాయ బనిలేదు. (కిమధిక లేఖేన బుద్ధిమద్వర్యేషు)

******

# ద్వాదశ సముల్లాసము

(నాస్తిక మతాంతర్గత చారవాక బౌద్ధ జైన మత ఖండనమండనములు) నాస్తిక మతములలో జేరిన చారవాక, బౌద్ధ, జైనుల మతములను గూర్చిన ఖండన మండనములను వ్రాయుచున్నాము.

(చారవాక మతము)

బృహస్పతి యను పేరుగల కొండొక పురుషుడుండెను. అతడు వేదము, ఈశ్వరుడు, యజ్ఞాద్యుత్తమ కర్మలనుగూడ నంగీకరించెడి వాడు కాడు. అతని మతమును జూడుడు.

"యావజ్జీవం సుఖం జీవేన్నాస్తి మృత్యోరగోచరః
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః" (సర్వదర్శనసంగ్రహము)

'మనుష్యాది ప్రాణులలో మృత్యువును దప్పించుకొనువారు లేరు. అనగా నెల్లరు జావవలసిన వారే. కావున జీవన మున్నంతవఱకు సుఖముగా జీవింపవలయును."

ధర్మాచరణమునందు గష్టము కలుగునని యెవరేని యందురేని, ధర్మము నాచరింపకున్న బునర్జన్మమున నెక్కువ దుఃఖము కలుగు ననగా దానికి జారవాక సమాధాన మిది. 'అరే యమాయక సోదరా! మరణించిన పిమ్మట శరీరము భస్మ మగును. తిని త్రాగి చనిపోయినవాడు మరల లోకమునకు రాడు – మరల జన్మింపడు. కావున మీకు దోచిన విధమున నానందముతో నుండుడు. లోకమున నీతితో నడచుకొనుడు. ఐశ్వర్యమును వృద్ధిచేయుడు. దానితో నిష్టభోగముల ననుభవింపుడు. ఈ లోకముతక్క పరలోకము మఱియొకటి లేదు.

చూడుడు, పృథివి, జలము, నగ్ని, వాయువు నను నీనాలుగు భూతములతో నీ శరీర మేర్పడినది. వీనివలన నిందు జైతన్యము గలుగును. మాదక ద్రవ్యములను దినుటవలన మత్తు కలుగునట్లు చైతన్యము కలుగును. అట్లే జీవుడు శరీరముతో పుట్టి, శరీరముతో బాటు నశించును. పాప పుణ్యముల ఫల మెవరికి గలుగును.

"తచ్చైతన్య విశిష్టదేహ ఏవ ఆత్మా, దేహాతిరిక్త
ఆత్మని ప్రమాణాభావాత్" (చార్వాకదర్శనం–పు. ౩)

ఈ శరీరమున నాలుగు భూతముల సంయోగమువలన జీవాత్మ యుత్పన్నమై వాని వియోగముతో బాటు జీవుడును నశించును. ఏలయనగా మరణించిన పిమ్మట జీవుడెవడును బ్రత్యక్షమగుట లేదు గదా! మేము ప్రత్యక్షమునే ప్రమాణముగా నంగీకరింతుము. ప్రత్యక్షము కాక యనుమానాది ప్రమాణములు లేనే లేవు. ముఖ్యమైన ప్రత్యక్ష ప్రమాణము ముందు ననుమానాదులు గౌణములు కావున వానిని మేము గ్రహింపము. సుందరియైన స్త్రీని గౌగలించుకొని యానందము ననుభవించుటయే పురుషార్థమునకు ఫలము.

(జడమునుండి చేతనము పుట్టదు)

ఉత్తరము :– పృథివ్యాది భూతములు జడములు. వాని నుండి చేతన మెన్నడు నుత్పన్నము కాదు. మాతాపితల సంయోగమువలన నిప్పుడు శరీర ముత్పన్న మగునట్లు సృష్ట్యాది యందును కర్తయైన పరమేశ్వరునివలన మనుష్యాది శరీరాకృతు లేర్పడినవి. అతడు లేకున్న నవి యేర్పడవు. మాదక ద్రవ్యములవలన మదము – మత్తేర్పడునట్లు జీవుని యుత్పత్తి వినాశము లెన్నడును జరుగవు. కారణ మేమన మదము జీవునకు గలుగును. జడములకు గలుగదు.

(పదార్థములు అదృశ్యములగును - అభావములు కావు)

పదార్థములు నష్టము లగును - అదృష్టము లగును. పదార్థమున కభావ మెన్నడు గలుగదు. అదృశ్యమైన (కనబడకున్న) మాత్రమున జీవుడు లేడని యెంచరాదు. జీవుడు దేహముతో నున్నపుడే యతడు ప్రకటితుడగును. జీవుడు శరీరమును విడిచినపుడాశరీరము మృత్యువును బొందును. అనగా నది పూర్వము చేతనముతో కూడియున్నట్టు లిప్పుడుండదు. ఈ విషయమే బృహదారణ్యకమున జెప్పబడినది:

**నాహం మోహం బ్రవీమి అనుచ్ఛిత్తి ధర్మాయ మాత్మేతి. బృ. ఉ. ౪-౫-౧౪.**

యాజ్ఞవల్క్యుడనుచున్నాడు. 'ఓ మైత్రేయీ! ఆత్మ యవినాశి యని నేను మోహమువలన జెప్పుట లేదు. ఆత్మనాశములేనిది. దానితో గూడి శరీరము చేష్టించును.

(శరీరముకంటె జీవుడుభిన్నుడు)

జీవుడు శరీరమునుండి వేఱైనపుడు శరీరమున జ్ఞాన మొకింతయు నుండదు. జీవుడు శరీరముకంటె వేఱు కానియెడల మరణించినపుడు శరీరమున జ్ఞానాభావము కలుగరాదు.. కావున దేని సంయోగమున దేహమున జ్ఞాన ముండునో, దేని వియోగమున దేహమున జ్ఞానము-చైతన్య ముండదో యది శరీరముకంటె భిన్న మగుట నిశ్చితము.

నేత్ర మన్నిటిని జూచును. కాని తనను దాను జూడలేదు. అట్లే యన్నిటిని జూచువాడు జీవుడు, తనను నింద్రియములతో జూడ జాలడు. జీవుడు తనకంటితో ఘటపటాది పదార్థముల నన్నిటిని జూచును. అట్లే జ్ఞానముతో గంటిని జూచును. కంటిని గంటితో జూడ జాలడు. ద్రష్టా-చూచువా డెల్లప్పుడు ద్రష్టగానే యుండును. దృశ్య మెన్నడును గాడు. ఆధారములేక యాధేయము కాని, కారణములేక కార్యముకాని, యవయవి లేక యవయవములు కాని, కర్తలేక కర్మముకాని యుండజాలని యట్లు కర్తలేక ప్రత్యక్ష మెట్లగును?

సుందరస్త్రీతో సమాగమము చేయుటయే పురుషార్థమునకు ఫలమగునెడల క్షణికసుఖము కలుగవచ్చును. కాని తదుపరి కలుగు దుఃఖము కూడ బురుషార్థఫల మేల కాదు? దుఃఖము పురుషార్థ ఫలమగును. అట్టి యెడ సుఖము (స్వర్గము) నకు హాని కలిగిన దుఃఖము ననుభవింప వలసివచ్చును. దుఃఖమును వదలుటకును, సుఖమును వృద్ధి చేయుటకును యత్న మొనరింప వలయునందువేని ముక్తి సుఖమునకు హాని కలుగును. కావున నది పురుషార్థమునకు ఫలము కానేరదు.

చార్వాకుడు :- దుఃఖసంయుక్త సుఖమును త్యజించువాడు మూర్ఖుడు. బియ్యము నపేక్షించు వాడు పొట్టును వదలి ధాన్యమునుండి బియ్యమును గ్రహించునట్లు బుద్ధిమంతు డీలోకమున దుఃఖమును వదలి సుఖమును గ్రహింపవలయును.

ఏలయనగా నీలోకమున లభించు సుఖమును వదలి లభింపని స్వర్గసుఖము గోరి ధూర్తులు రచించిన వేదోక్తములగు నగ్నిహోత్రాది కర్మలు చేయుచు నుపాసించుచు, పరలోకముకొఱకు జ్ఞానకాండము నపేక్షించువారజ్ఞానులు, లేని పరలోకమున కాశ పెట్టుకొనుట మూర్ఖత యగును.

**"అగ్నిహోత్రం త్రయో వేదా స్త్రిదండం భస్మగుంఠనమ్**
**బుద్ధిపౌరుషహీనానాం జీవికేతి బృహస్పతిః" (చార్వాకదర్శనము. పుట. ౫)**

'అగ్నిహోత్రము, మూడువేదములు, త్రిదండము, భస్మలేపనము నను నివి బుద్ధి, పౌరుషము లేనివారు జీవికగా గ్రహించిరి.' అని, చార్వాకమత ప్రచారకుడు బృహస్పతి చెప్పుచున్నాడు. దీనితోబాటు, శరీరమునకు ముల్లు గ్రుచ్చుకొనుట మున్నగు వానిచే గలుగు దుఃఖమే నరకము. లోకమున నుండు రాజు పరమేశ్వరుడు. దేహము నశించుటయే మోక్షము. ఇంతకు మించి మఱియొండు లేదు' అనియు బృహస్పతి మతము.

ఉత్తరము :– విషయానుభవము వలన గలుగు సుఖము మాత్రమే పురుషార్థఫలమనియు, విషయములవలన గలుగు దుఃఖములనుండి తొలగుటయే స్వర్గప్రాప్తి, కృతకృత్యతయనియు నెంచుట మూర్ఖత యగును. అగ్నిహోత్రాది యజ్ఞములవలన వాయువు, వృష్టిజలము శుద్ధములై వానివలన నారోగ్యము లభించును. దానివలన ధర్మార్థకామమోక్షములు సిద్ధించును. అది తెలియక వేదములను, నీశ్వరుని, వేదోక్త కర్మలను నిందించుటయే ధూర్తుల పని. త్రిదండము, భస్మధారణము ననువానిని నిందించుట యుక్తమే.

కంటకాదులవలన గలుగు సామాన్య దుఃఖములే నరక మగునెడల వానికంటెను నధికములగు మహారోగాదులవలన గలుగు దుఃఖములు నరకమేల కాదు? ఐశ్వర్యవంతుడు, ప్రజాపాలనమున సమర్థుడగుటచే రాజును శ్రేష్ఠుడుగా నంగీకరించుట యుచితమే. కాని, రాజన్యాయకారియై పాపి యగువానిని గూడ బరమేశ్వరుడని యంగీకరింతువేని నీవంటి మూర్ఖుడు లోకమున నింకొక డుండడనియే యనవలయును. శరీరము నశించుటయే – శరీరము విడిపోవుటయే మోక్ష మందువేని గాడిద, కుక్కలు మున్నగు వానికి నీకును భేద మేమి? ఆకృతి భేదము తప్ప మఱియొండు లేదుకదా?

చార్వాక :–

"అగ్నిరుష్ణో జలం శీతం శీతస్పర్శస్తథా ఽ నిలః
కేనేదం చిత్రితం తస్మాద్ స్వభావస్తద్ వ్యవస్థితిః" (౧)
"న స్వర్గో నాపవర్గో వా నైవాత్మా పారలౌకికః
నైవ వర్ణాశ్రమాదీనాం క్రియాశ్చ ఫలదాయికాః" (౨)
"పశుశ్చేన్నిహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి
స్వపితా యజమానేన తత్ర కస్మాన్న హింస్యతే." (౩)
"మృతానామపి జంతూనాం శ్రాద్ధం చేత్తృప్తికారణమ్
గచ్ఛతామిహ జంతూనాం వ్యర్థం పాథేయకల్పనమ్." (౪)
"స్వర్గస్థితా యదా తృప్తిం గచ్ఛేయు స్తత్ర దానతః
ప్రాసాదస్యోపరిస్థానామత్ర కస్మాన్న దీయతే." (౫)
"యావజ్జీవేత్ సుఖం జీవేదృణం కృత్వా ఘృతం పిబేత్
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః?" (౬)
"యది గచ్ఛేత్ పరం లోకం దేహాదేష వినిర్గతః
కస్మాద్ భూయో న చాయాతి బంధుస్నేహసమాకులః (౭)
"తతశ్చ జీవనోపాయో బ్రాహ్మణైర్ విహితస్త్విహ
మృతానాం ప్రేతకార్యాణి న త్వన్యద్ విద్యతే క్వచిత్." (౮)
"త్రయో వేదస్య కర్తారో భండధూర్త నిశాచరాః
జర్ఫరీతుర్ఫరీత్యాది పండితానాం వచః స్మృతమ్" (౯)
"అశ్వస్యాత్ర హి శిశ్నస్తు పత్నీ గ్రాహ్యం ప్రకీర్తితమ్
భండై స్తద్వత్ పరం చైవ గ్రాహ్యజాతం ప్రకీర్తితమ్" (౧౦)
"మాంసానాం ఖాదనం తద్వన్నిశాచరసమీరితమ్." (౧౧) (చార్వాకదర్శనము)

చార్వాకులు, ఆభాణకులు, బౌద్ధులు, జైనులును జగదుత్పత్తిని స్వాభావిక మందురు. ద్రవ్యములలో నున్న స్వాభావిక గుణములవలన నవి పరస్పరము కలిసి సర్వపదార్థములు నగును. జగత్తునకు గర్త యెవ్వడు లేదు. (౧)

వీరిలో జార్వాకు డిట్లంగీకరించును. కాని, బౌద్ధులు జీవులను, బరలోకము నంగీకరింతురు. చార్వా కుడు వీనిని నంగీకరింపడు. మిగిలిన విషయములలో వీరికి ముప్వురికి నంత భేదముండదు.

స్వర్గము లేదు. నరకము లేదు. పరలోకమునకు వెళ్ళు నాత్మయు లేదు. వర్ణాశ్రమమునకు జెందిన క్రియలును ఫలదాయకములు కావు. (౨)

పశువును జంపి యజ్ఞము జేసిన నాపశువు స్వర్గమునకు బోవునేని యజమానుడు తనతండ్రిని జంపి హోమము జేసి స్వర్గమున కేల పంపడు ? (౩)

శ్రాద్ధతర్పణములు మృతజీవులకు దృప్తి కలిగించునెడల బరదేశము పోవువారికి దారిబత్తెము, ధనా దుల నిచ్చి పంపుటేల? ఏల యనగా జనిపోయిన వానిపేరట నిటజేయబడిన తర్పణాదులు స్వర్గమును జేరును గదా! అట్లే పరదేశము వెళ్ళువారికి వారి బంధువు లింటియందే తర్పణము చేసిన పోవా? ఇట జేర కున్న స్వర్గమున కెట్లు చేరగలవు? (౪)

మర్త్యలోకమున జేసిన దానములు స్వర్గమున నున్నవారిని దృప్తి పఱచునెడల నింటిలో గ్రింద నుండు పదార్థములు పై యంతస్తున నున్నవారి కేలచేరవు? (౫)

కావున బ్రతికి నంతకాలము సుఖముగా జీవింపవలయును. ఇంటిలో వస్తువులు లేకున్న నప్పుచేసి సుఖముగా దినవలయును. అప్పు తీర్పవలయునని భయపడ నక్కఱలేదు. కారణ మేమన దిని త్రాగిన శరీరము జీవుడు మరల తిరిగి వచ్చునది లేదు. అడుగువాడెవడు? ఇచ్చువాడెవడు? (౬)

మరణసమయమున జీవుడు పరలోకమునకు బోవు ననుట కల్ల. అది నిజమైనచో స్వర్గమునకు వెళ్ళినవాడు మోహవశమున బద్ధుడై మరల దిరిగిరాడేల? (౭)

కావున నిదియంతయు బ్రాహ్మణులు తమ జీవికకొఱకు గల్పించినవియే కాని వేఱుకాదు. దశ గాత్రాది మొదలు మృతకశ్రాద్ధాదు లన్నియు జీవికకొఱకేర్పఱచు కొనినవే. (౮)

వేదకర్తలు, ధూర్తులు, మిథ్యాచారులు ననగా రాక్షసులు జర్ఫరీ, తుర్ఫరీ యను నిట్టివి పండితుల ధూర్తతతో గూడిన వచనములే. (౯)

చూడుడు, ధూర్తుల రచనలు, అశ్వలింగమును స్త్రీగ్రహణము చేయవలయును. దానితో యజమా నుని స్త్రీ సంగమము చేయింపవలయును. ఇట్టివి ధూర్తులు కాక మఱియెవరు వ్రాయుదురు? (౧౦)

మాంసము తినుటకు విధానాదులు గల వేదభాగము రాక్షసులు వ్రాసి యుందురు. (౧౧)

ఉత్తరము :– చేతనుడైన పరమేశ్వరుడు నిర్మింపకున్న జడపదార్థములు స్వయముగా బరస్పరము నియమపూర్వకముగా స్వభావము వలననే కలిసి భిన్నభిన్న పదార్థము లేర్పడుట యసంభవము. స్వభావ ముతో నేర్పడునేని మఱియొక సూర్యుడు, మఱియొక చంద్రుడు నట్లే పృథివి నక్షత్రాదులు స్వయముగా నేల యేర్పడవు ? (౧)

సుఖానుభవమునకు స్వర్గమనియు, దుఃఖానుభవమునకు నరకమనియు నామములు. జీవుడు లేని పుడు సుఖదుఃఖముల ననుభవించునదెవరు? ఈ జన్మములో జీవుడు దుఃఖసుఖముల ననుభవించునట్లు పర లోకమున–పరజన్మమునందు ననుభవించును. వర్ణాశ్రమధర్మములలో సత్యభాషణాదులును నిష్ఫలము లేనా? (౨)

పశువులను జంపి యజ్ఞహోమములు చేయుమని వేదమున నెక్కడను లేదు. చనిపోయినవారి నుద్దేశించి శ్రాద్ధతర్పణాదులును గపోల కల్పితములే. వేదాది సత్యశాస్త్రముల కిది విరుద్ధము. భాగవతాది పురాణములలో వ్రాయబడిన మతము కావున నిట్టి విషయములు ఖండింప దగినవే. (౩–౫)

ఏది వస్తువో దాని యభావ మెన్నడును గాదు. అస్తిత్వముగల జీవున కభావము కలుగదు. దేహము

భస్మమగునుకాని జీవుడు భస్మముకాడు. జీవుడు మఱియొక శరీరమును ధరించును. కాబట్టి ఋణాదు లొనర్చి సుఖమునిట ననుభవించువారు వానిని దీర్చకున్న నిశ్చయముగా బాపులై మఱు జన్మమున దుఃఖ రూప నరకము ననుభవింతురు. ఇందు సందేహమొకింతయు లేదు. (౬)

దేహమునుండి వెలువడి జీవుడు స్థానాంతరమునకు-శరీరాంతరమునకు బోవును. అతనికి బూర్వ జన్మమునకు గుటుంబమునకు సంబంధించిన జ్ఞాన ముండదు. కావున మరల కుటుంబమునకు రాజా లడు. (౭)

అవును. బ్రాహ్మణులు తమ జీవికకొఱకు బ్రేతకర్మలు కల్పించిరి. అవి వేదోక్తములు కానందున ఖండింప దగినవే. (౮)

చార్వాకాదులు వేదములను జూచి, చదివి లేక వినియున్నచో వానిని నిందింపరు. వేదములు భాండ ధూర్త నిశాచరులు వ్రాసినవని వారెన్నడు ననియుండెడివారు కారు. మహీధరాది వ్యాఖ్యాకారులు ధూర్తులైన మాట నిజము, ధూర్తత వారిది కాని వేదములది కాదు.

చార్వాకులు, బౌద్ధులు, జైనులు ఆభాణకులు నను వీరెవ్వరు మూల వేదములను జూచి యైన నుండరు. ఇక వానిని జదువుట యెక్కడ సంభవించును. కావుననే నష్టభష్టులై వేదములను వ్యర్థముగా నిందించుచున్నారు. దుష్టులగు వామమార్గీయుల ప్రమాణశూన్యములు, కపోల కల్పితములు నైన భ్రష్టటీక లను జూచి వేదములకు విరోధులై యవిద్యా రూపమగు నగాధసముద్రమున మునిగి యున్నారు. (౯)

స్త్రీ యశ్వలింగమును గ్రహించి సమాగమము చేయుట, యజమానుని కన్యతో నెకసక్కెము లాడుట మున్నగునవి వామమార్గావలంబులవి కాక యితరులవి యెట్లు కాగలవు? పాపులు భ్రష్టులునైన వామమార్గులు తప్ప వేదముల కిట్టి విపరీతార్థము లెవ్వరు వ్రాయుదురు?

ఈ చార్వాకాదులపై మిక్కిలి దుఃఖము కలుగుచున్నది. వీరు విచారింపక వేదములను నిందించు చున్నారు. కొంచెమైనను దమబుద్ధిని వినియోగింప కూడదా? పాపము వారి నేమనిన నేమి లాభము! సత్యా సత్యములను విచారించి సత్యమండనము, నసత్యఖండనము చేయగల విద్యయే వారికి లేదు. (౧౦)

మాంసభక్షణ విషయముకూడ వామమార్గుల లీలయే. అందువలన వారిని రాక్షసులనుట యుచి తమే. వేదములందు మాంసము భక్షణీయ మని యెక్కడను లేదు. కావున నిట్టి మిథ్యా విషయముల పాపము-వేదములను గూర్చి వినక, చూడక యిష్టము వచ్చినట్లు వేదముల నిందించువారికి, ధూర్త వ్యాఖ్యానములు వ్రాసినవారికి నిస్సందేహముగా దగులును.

వాస్తవ మేమన నెవరు వేదముల నింతకుబూర్వము విరోధించిరో, యిప్పుడు విరోధించుచున్నారో యికముందును విరోధింతురో వారు తప్పక యవిద్యారూపమగు నంధకారమున బడి సుఖమునకు బదులు దారుణ దుఃఖముల నెంతగా ననుభవించినను దక్కువయే యనవలయును. కావున మనుష్యులెల్లరు వేదానుకూలముగ నడచుట సముచితము. (౧౧)

వామమార్గముల ననుసరించువారు మిథ్యాకల్పనలు చేసి తమ ప్రయోజనముల సిద్ధము చేసికొను టకు వేదముల పేరిట నిష్టము వచ్చినట్లు మద్యమాంసములను సేవింప దొడగిరి. పరస్త్రీగమనాది దుష్ట కార్యములందు బ్రవృత్తులైరి. ఇట్లు వేదములను గలంకితము జేయగా వీరిని జూచి చార్వాక, బౌద్ధ జైనా దులు కూడ వేదములను నిందింపసాగిరి. వేదములకు విరుద్ధమైన యనీశ్వరవాదమునకు సంబంధించిన నాస్తికమతమును బ్రారంభించిరి. చార్వాకాదులు వేదముల మూలార్థములను విచారించి యున్నచో నస త్యపు టీకలను జూచి, సత్యమైన వేదోక్తమతమునకు దూరమై యేల వంచితు లగుదురు? పాపము! వారేమి చేయగలరు! 'వినాశకాలే విపరీతబుద్ధిః' నష్ట భ్రష్టులు కావలసిన సమయము వచ్చినపుడు మను

ష్యుని బుద్ధి విపరీతముగ ప్రవర్తించును.

(చార్వాక భేదము)

ఇప్పుడు చార్వాకాదులలో గల భేదమును గూర్చి వ్రాయుచున్నాము. చార్వాక బౌద్ధాదులు బహు విషయములలో నేకముగా నుందురు. కాని చార్వాకులు దేహోత్పత్తితో బాటు జీవుడుత్పన్న మగు నందురు. దేహముతో బాటు నశించుననియు జెప్పుదురు. పరలోకమును బునర్జన్మమును నంగీకరింపరు. ప్రత్యక్షము తక్క యనుమానాది ప్రమాణముల నంగీకరింపరు. మాటలాడుటలో జతురుడు 'చార్వాకు' డనబడును. విశేషార్థము 'వైతండికుడు' అని.

బౌద్ధులు జైనులు ప్రత్యక్షాదు లను నాలుగు ప్రమాణములను, ననాది జీవుని పునర్జన్మమును బర లోకమును ముక్తిని నంగీకరింతురు. చారవాకులకు జైనబౌద్ధులకు గల భేద మింతే. కాని, నాస్తిక్యము, వేద మును నీశ్వరుని నిందించుట, పరమతద్వేషము, నాఱుయత్నములు, జగత్తునకు గర్తలేడనుట, యను నీ విషయములందు నెల్లరు సమానులే. ఇది చార్వాకమతము సంక్షేపముగా వ్రాయబడినది.

(బౌద్ధమతము)

ఇప్పుడు బౌద్ధమతమును గూర్చి సంక్షేపముగ వ్రాయుచున్నాము.

కార్యకారణభావాద్ వా స్వభావాద్ వా నియామకాత్

అవినాభావనియమో దర్శనాంతర దర్శనాత్" (సర్వదర్శనసంగ్రహము. పుట. ౧౬)

కార్యకారణభావ = కార్యమును జూచి కారణమును, కారణదర్శనము వలన గార్యాదులను సాక్షాత్కా రము-ప్రత్యక్షముతో దెలిసికొందుము. మిగిలినదానియందు ననుమానముతో జ్ఞానము కలుగును. ప్రత్య క్షము, ననుమానము లేక ప్రాణుల సంపూర్ణ వ్యవహారము సిద్ధము కాదు-పూర్ణము కాదు. ఇట్టి లక్షణము లతో ననుమానమును నధికముగా-ప్రధానముగా నంగీకరించి బౌద్ధులు చార్వాకులకంటె భిన్నశాఖగా నేర్పడిరి.

(బౌద్ధులలో నాలుగు భేదములు)

బౌద్ధులు నాలుగు తెగలుగా నున్నారు. ఒకతెగ-మాధ్యమికులు, రెండవతెగ - యోగాచారులు, మూడవతెగ-సౌత్రాంతికులు, నాల్గవతెగ-వైభాషికులు. 'బుద్ధ్యా నిర్వర్తతే స బౌద్ధః' తన బుద్ధిలో వచ్చిన వాని నంగీకరించువాడు బౌద్ధుడు. తన బుద్ధియందు రానిదానిని దా నంగీకరింపడు.

వీరిలో మొదటివారు-మాధ్యమికులు. 'సర్వశూన్య' వాదులు. వారు సర్వము శూన్య మందురు. పదార్థము లన్నియు శూన్యపదవాచ్యము అని వారి భావము. అనగా బదార్థము లాదియందుండవు. అంతమునను నుండవు. మధ్యలో బదార్థ ప్రతీతి కలుగును. అదియు బ్రతీతి (జ్ఞానము) సమయమున నుండును. తదుపరి శూన్య మగును. ఎట్లన నుత్పత్తికి బూర్వము ఘటము లేదు. అది ధ్వంసము, ప్రధ్వంస మైనమీదట నుండదు. ఇది 'ఘటము' అను జ్ఞానము కలుగునపుడు భాసించును. పదార్థాంతరపు జ్ఞానము కలుగునపుడు ఘటజ్ఞాన ముండదు. మఱియొక వస్తువు జ్ఞానము కలుగునపుడు పూర్వవస్తు జ్ఞానముండదు. కావున శూన్యమే యొక తత్త్వము.

రెండవ యోగాచారులు-బాహ్య బదార్థము లన్నియు శూన్యము లందురు. అనగా బదార్థములు జ్ఞానములో భాసించును. వెలుపల నుండవు. ఉదాహరణము :- ఘటము-అనుజ్ఞాన మాత్మలో నుండును. అప్పుడే మనుష్యు డిది ఘట మనును. లోపల 'ఇది ఘటము' అనుజ్ఞానము లేకున్న నతడట్లు చెప్పడు. కాబట్టి 'అది జ్ఞానమే కాని బయట వస్తువు లేదు' అని యతడంగీకరించును.

మూడవవాడు-సౌత్రాంతికుడు. ఇతడు 'బయట పదార్థములున్నవి. కాని యవి యనుమానముచే

దెలియబడును' అని యనును. కారణమేమనే పదార్థమంతయు బ్రత్యక్షము కాదు. కొంతభాగము మాత్రమే. మిగిలినది యనుమానమువలననే తెలియును. అని యతని మతము.

నాల్గవవాడు-వైభాషికుడు. ఇతడు 'వెలుపల పదార్థము ప్రత్యక్షమగును. లోపల కాదు.' అనును. 'ఇది నీలఘటము' అనునీ (ప్రతీతి) జ్ఞానమునందు నీలయుక్త ఘటాకృతి-నీలిరంగుతో గూడిన ఘటము యొక్క యాకారము వెలుపలనే యున్నది. లోపలలేదు' అని యతనిమతము.

ఈ నాలుగు తెగలకు జెందిన శిష్యులకు నాచార్యుడు బుద్ధుడొక్కడే. కాని, శిష్యులలో గల బుద్ధి భేదమువలన నాలుగు శాఖలు బౌద్ధులలో నేర్పడినవి. సూర్యుడస్తమించిన మీదట బ్రకాశము లేనపుడు జారుడు పరస్త్రీగమన మందును, విద్వాంసుడు సత్యభాషణాదు లందును, శ్రేష్ఠకర్మలందు బ్రవృత్తు లగునట్లు సమయ మొక్కటియైనను బుద్ధిభేదముచే భిన్న కర్మ లాచరించునట్లు, బుద్ధిభేదముచే బౌద్ధులలో నాలుగు శాఖ లేర్పడినవని భావము.

వీరిలో బ్రథముడు మాధ్యమికుడు. పదార్థము లన్నియు క్షణికములనును. అనగా, బ్రతిక్షణము బుద్ధిలో బరిణామము కలుగు చుండుటవలన బూర్వక్షణమున దెలియబడిన వస్తువు, మఱుక్షణమున బూర్వ మున్నట్లుండదు. కావున నన్నియు క్షణికములని యంగీకరింపవలయును. అని యతని మతము.

రెండవ యోగాచారుడు – ప్రతిప్రవృత్తియు దుఃఖరూపమే యగును. ఏల యన నే ప్రవృత్తి యందును నెవడును సంతుష్టుడు కాడు. ఒక ప్రవృత్తి ప్రాప్తించినను-సఫలమైనను రెండవ ప్రవృత్తియందు గోరిక కలిగియే యుండును. ఇది యతని మతము.

మూడవ సౌత్రాంతికుడు – 'పదార్థము లన్నియు వాని లక్షణములచే లక్షితము లగుచుండును. ఎట్లన గోవు తన చిహ్నములతోను, గుఱ్ఱము తన చిహ్నములతోను నిది గోవిది గుఱ్ఱ మని తెలియబడును. లక్షణములు లక్ష్యములలో యెల్లపుడుండును' అని యతని మతము.

నాల్గవ వాడు వైభాషికుడు – శూన్యమునే యొక పదార్థముగా నంగీకరించును. ప్రథముడగు మాధ్యమికుడు సర్వమును శూన్య మనును. వైభాషికుని మతము నదియే. ఇట్లు బౌద్ధులలో వివాదగ్రస్త పక్షములు చాల యున్నవి. వీరు నాలుగు విధములగు భావన నంగీకరింతురు. వారి మతముల సమీక్ష-

(బౌద్ధమత సమీక్ష)

ఉత్తరము :- అంతయు శూన్యమగు నెడల శూన్యము నెఱుగువాడు శూన్యము కాజాలడు. శూన్యమును శూన్యము నెఱుగ జాలదు. అందువలన శూన్యము నెఱుగువాడు శూన్య మెన్నడు కాజాలడు. కావున శూన్యము నెఱుగు జ్ఞాత, యతనిచే నెఱుగబడు జ్ఞేయము శూన్యములు కావు. కావున జ్ఞాత జ్ఞేయము నను రెండు పదార్థము లున్నవని సిద్ధమగుచున్నది.

యోగాచారులు బాహ్యశూన్యత్వము నంగీకరించుచున్నారు. అట్టియెడ హిమాలయాది పర్వతములు వీరిలోపల నుండవలయును. లోపల నున్నట్లంగీకరింతురేని వారి హృదయములలో బర్వతము లుండదగినంత యవకాశ మెట నున్నది? కావున బర్వతాది పదార్థములు వెలుపలనే యున్నవి. వాని జ్ఞానము మాత్ర మాత్మలో నున్నదని యంగీకరింప వలయును.

సౌత్రాంతికు డే పదార్థమును బ్రత్యక్ష మగునని యంగీకరింపడు. కాబట్టి యతడు, నతని వచనముకూడ ననుమేయములు ననుమాన సిద్ధము లనియే యంగీకరింపవలయును. ప్రత్యక్షము కాదు – ఘటము ప్రత్యక్షము కానియెడల 'అయం ఘటః' 'ఇది ఘటము' అను ప్రయోగము చేయరాదు. కొంత భాగమే యతని మతమున బ్రత్యక్ష మగును. కావున 'అయం ఘటైక దేశః' 'ఇది ఘటైక దేశము' – 'ఘటములో నిది యొక భాగము' అని వ్యవహార ముండవలయును. ప్రయోగ ముండవలయును. ఏక దేశము-

భాగము ఘటము కాదు గదా! అంతయు గలిసి ఘట మగును. 'ఇది ఘటము.' 'ఇది ప్రత్యక్షము.' ఇది యనుమేయము కాదు. అన్ని యవయవములలో నుండు నవయవి యొక్కటియే. అది ప్రత్యక్షమైన పుడే ఘటావయవము లన్నియు ప్రత్యక్షము లగును. అనగా సావయవ ఘటము ప్రత్యక్ష మగును. భాగము ప్రత్యక్షము కాదు.

ఇక నాల్గవవాడు వైభాషికుడు. అతడు బాహ్యపదార్థములు ప్రత్యక్షములగునని యంగీకరించును. ఇదియును సరికాదు. కారణ మేమన జ్ఞాతయు జ్ఞానము నున్నతావుననే ప్రత్యక్ష మగును. ప్రత్యక్ష-ప్రమాణమునకు విషయము బాహ్యమైనను దదాకార జ్ఞాన మాత్రమకే యగును.

అట్లే, పదార్థములు క్షణికములై వానిజ్ఞానము క్షణికమైన ప్రత్యభిజ్ఞ కలుగ నేరదు. అనగా 'నే నావిషయమును మాట లాడితిని' అను నిట్టి స్మరణము కలుగనేరదు. కాని లోకమున బూర్వము చూచిన దాని నిప్పుడు స్మరించుట జరుగుచున్నది. కావున క్షణికవాదము కూడ సరికాదు.

'అంతయు దుఃఖమే – సుఖ మేమియు లేదు. సుఖము నపేక్షింపక దుఃఖము సిద్ధింపదు. సుఖము లేనినాడు దుఃఖమునుండదు. రాత్రి నపేక్షించి దినము, దినము నపేక్షించి రాత్రియు వ్యవహరింపబడును. కావున సర్వము దుఃఖ మనుట సరికాదు.

స్వలక్షణమే యంగీకరించిన – లక్షణము లక్ష్యమునందే యుండు నని యంగీకరించిన – నేత్రము రూపమునకు లక్షణము, రూపము లక్ష్యము. ఎట్లన – ఘటరూపము లక్ష్యము. ఘటరూపమునకు లక్షణము చక్షువు. (గ్రాహ్య మగు రూప మిట లక్ష్యము. గ్రాహక రూపలక్షణము గలది చక్షువు. గ్రాహ్య మగు రూపము ఘటమున నుండును. గ్రాహక లక్షణముగల చక్షువు ఘటమునకు భిన్నముగా నుండు నని భావము) కాని గంధము పృథివి కంటె నభిన్నము. ఇట్లు లక్ష్యలక్షణము భిన్నాభిన్నములుగా నంగీకరింప వలయును.

(ఇట లక్షణము లక్ష్యము భిన్న స్థలములలో నున్నవి. గంధము పృథిని పృథివియందే యుండును. వాస్తవమున నీసమీక్ష స్పష్టముగా లేదు. వాక్య రచనలో స్పష్టత కానరాదు. ఏలయన నేత్రము రూపమునకు గ్రాహకమగును. కాని లక్షణము కాదు. నేత్రము రూపమునకు లక్షణమని యున్నది. రూపము ఘట చిహ్నములలో నొకటి యగును, కాని నేత్రమునకు లక్ష్యముకాదు. ఏలయన ఘటములో రూపము, గంధము, నను నవి గుణములు. ఘటమునకు లక్షణము కంబుగ్రీవాది మత్వ మగును. రూప గంధములు ఘటమునకు లక్షణములు కావు. వానిని లక్షణములుగా గ్రహించిన లక్షణ మతి వ్యాప్త మగును. రూపగంధములు ఘటమునననే కాక యితర పుష్పాది పదార్థములందు నుండును. ఘటమున, రూపమున్నట్లనుద్భూతరూపము నేత్రమున నుండును. గంధము మాత్రము ఘటమున (పృథివివికారముకావున)నే యుండును, నేత్రమున నుండదు.

నేత్రముచే గ్రహింపబడు ఘటమునందలి రూపమునందలి రూపమును ఘటలక్షణముల –చిహ్నములలో నొకటిగా గ్రహించిన నది ఘటమను లక్ష్యమునందును గ్రాహకరూప చక్షువునందును రెండింట నుండును. గంధచిహ్నము మాత్రము గ్రాహ్య (లక్షణ)మగు ఘటమునందే యుండును. (గ్రాహకమగు) నేత్రమున నుండదు. ఈ నావివరణము కూడ విషయము నంతగా స్పష్టము చేయక పోవచ్చును.)

శూన్యము నంగీకరించు వారికి శూన్యమును గ్రహించు జ్ఞాత శూన్యము కాజాల దని యింతకు బూర్వమే సమాధానము చెప్పియున్నాము.

"సర్వస్య సంసారస్య దుఃఖాత్మకత్వం సర్వతీర్థంకరసంమతమ్." బౌద్ధదర్శన. పు.౨౫

సమస్త సంసారమునందు దుఃఖరూపము, దుఃఖనిలయుము, దుఃఖసాధనము ననుభావన చేసి సంసారమునుండి విడివడ వలయునని బౌద్ధు లెల్లరు నంగీకరింతురు. చార్వాకులు దీనికి భిన్నముగా ముక్తిని, జీవ

లను, ననుమానము ప్రమాణమును వేనిని నంగీకరింపరు.

బౌద్ధు లెవరిని దీర్థంకరులుగా నంగీకరింతురో వారినే జైనులును నంగీకరింతురు. కావున వీరిరువురు నొక్కటియే. మఱియు పూర్వోక్తము లగు 'భావనా చతుష్టయము' నాలుగు భావనలవలన సకలవాసనలు నివృత్తములు కాగా శూన్యరూప నిర్వాణ మనగా ముక్తిని బొందుటయంగీకరింతురు.

(పంచస్కంధములు)

తమ శిష్యులకు యోగము నాచారము నుపదేశింతురు. గురువు వచనమును బ్రమాణముగా నంగీకరించుట, యనాది బుద్ధియందువాసన యుండుట వలన బుద్ధియే యనేక విధముల భాసించును. వానిలో బంచస్కంధములు –

"రూప విజ్ఞాన వేదనా సంజ్ఞా సంస్కారసంజ్ఞకః" బౌద్ధదర్శన. పుట ౩౯

మొదటిది – ఇంద్రియాదులతో రూపాదుల గ్రహణము చేయబడును. ఇది రూపస్కంధము.

రెండవది – ఆలయవిజ్ఞానము, ప్రవృత్తి నెఱుగుటయను వ్యవహారమును విజ్ఞానస్కంధ మందురు.

మూడవది – రూపస్కంధము, విజ్ఞానస్కంధము ననువాని వలన నుత్పన్నమైన సుఖదుఃఖములు మున్నగువాని ప్రతీతిరూప వ్యవహారమును వేదనా స్కంధ మందురు.

నాల్గవది – గోవు మున్నగువాని నామములకు నామముగల వానితో సంబంధము నంగీకరించుట యను సంజ్ఞాస్కంధము.

ఐదవది – వేదనా స్కంధమువలన రాగద్వేషాది క్లేశములు, నాకలి దప్పికలు మున్నగు నుపక్లేశములు, మదము, ప్రమాదము, ధర్మము ననువ్యవహారములను సంస్కారస్కంధముగా నంగీకరింతురు.

## తీర్థంకరులు – ద్వాదశా యతనపూజ

"దేశనా లోకనాథానాం సత్త్వాశయ వశానుగాః
భిద్యన్తే బహుధా లోకే ఉపాయై ర్బహుభిః కిల." (౧) సర్వదర్శన.
"గంభీరోత్తానభేదేన క్వచిచ్చోభయలక్షణా
భిన్నా హి దేశనా భిన్నా శూన్యతా ద్వయలక్షణా." (౨) బౌద్ధదర్శన ౪౫.
"ద్వాదశాయతనపూజా శ్రేయస్కరీతి బౌద్ధా మన్యన్తే."
"అర్థానుపార్జ్య బహుశో ద్వాదశాయతనాని వై
పరితః పూజనీయాని కిమన్యైరిహ పూజితైః. (౩)
"జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి చ
మనో బుద్ధిరితి ప్రోక్తం ద్వాదశాయతనం బుధైః." (౪) బౌద్ధదర్శన–౪౬.

జ్ఞానులు, విరక్తులు, జీవన్ముక్తులు, లోకనాథులు, బుద్ధుడు మున్నగు తీర్థంకరులయు, బదార్థములయు స్వరూపముల నెఱుగువాడు, భిన్నభిన్న పదార్థముల నుపదేశించువాడును దేనిని బహువిధములగు భేదములతో బహూపాయములతోను జెప్పునో దానినంగీకరింపవలయును. (౧)

మిక్కిలి గంభీరము, ప్రసిద్ధమునగు భేదముతో దక్కువ లక్షణయుక్తములగు, కొన్ని యెడల గుప్తముగాను, కొన్నియెడల బ్రకటముగాను భిన్నభిన్న గురువులచే నుపదేశింపబడిన శూన్యలక్షణయుక్తము లగు నుపదేశములను బూర్వము చెప్పిన వానిని నంగీకరించుట. (౨)

ద్వాదశాయతనపూజయే మోక్షము కలిగించునది. ఆ పూజకొఱకు మిక్కిలి ధనాదిపదార్థములను సేకరించి, ద్వాదశాయతన మనగా బండ్రెండు విధములగు స్థానములను నిర్మించుకొని సర్వవిధముల బూజ నొనర్పవలయును. ఇతరుని పూజించిన నేమి ప్రయోజనము? (౩)

వీరి ద్వాదశాయతన పూజ యిది :-

ఐదు జ్ఞానేంద్రియములు - చెవులు, త్వక్కు, నేత్రములు, నాలుక, నాసిక, పంచకర్మేంద్రియములు - వాక్పాణిపాదపాయూపస్థలు నను నీపది యింద్రియములు, మనస్సు, బుద్ధి యను నీపండ్రెండింటిని బాగుగ సత్కరించుట యనగా వీని నానందమున ప్రవర్తింపజేయుట, మున్నగునవి బౌద్ధుల మతము. (౪)

(దుఃఖరూపసంసారమున ప్రవృత్తి యేల?)

ఉత్తరము:- సమస్త సంసారము దుఃఖరూప మగునెడల నేజీవునకు నిందు ప్రవృత్తి యుండరాదు. లోకమున జీవుల ప్రవృత్తి ప్రత్యక్షముగా జూడబడుచున్నది. కావున సమస్తసంసారము దుఃఖరూప మన జెల్లదు. కాని, యిందు సుఖము దుఃఖము రెండు నున్నవి. మఱియు బౌద్ధులు సంసారమును దుఃఖరూప మనుసిద్ధాంతము నమ్ముదురేని, యన్నపానాదుల గ్రహింపనేల? పథ్యము, నౌషధసేవనము జేసి శరీర రక్షణమున బ్రవృత్తులై సుఖము నేల యనుభవించుచున్నారు? మేము ప్రవృత్తుల మగుదుము, కాని దీనిని దుఃఖమనియే యంగీకరింతు మందురేని యిట్లనుట సంభవము కాదు. ఏలయన జీవుడు సుఖము నెఱిగి ప్రవృత్తుడు, దుఃఖము నెఱిగి నివృత్తుడు నగును. లోకమున ధర్మక్రియ, సత్సంగము, విద్యాదులు శ్రేష్ఠ వ్యవహారము లన్నియు సుఖకారకములు. వీని నే విద్వాంసుడును దుఃఖకారణములుగా నంగీకరింపడు. బౌద్ధులు తప్ప.

పంచస్కంధములు కూడ బూర్తిగ నపూర్ణములే. ఏల యన నిట్టి స్కంధములను విచారింపసాగిన నొక్కొక్కదాని కనేకభేదములు కావచ్చును.

తీర్థంకరులను నుపదేశకులుగాను, లోకనాథులుగాను నంగీకరించుచున్నారు. మఱినాథులకు నాథుడనాదియునైన పరమాత్ముని నంగీకరింపరు. అటులైన నా తీర్థంకరు లెవనినుండి యుపదేశములను బొందిరి? స్వయముగనే యుపదేశమును బొంది రందురేని యీకథన మసంభవము. కారణ మేమన-కారణములేక కార్యము కలుగదు. లేక వారి కథనము ననుసరించి యట్లే యైనదనిన, నిప్పుడును వారి నుండి చదువక వినకయే, చదివింపక వినిపింపకయే, జ్ఞానులసత్సంగము చేయకయే జ్ఞాను లెందుల కగుట లేదు? అగుటలేదు కావున నాకథనము సర్వథా నిర్మూలము, యుక్తి శూన్యమును, సన్నిపాతరోగి కలవరింతలు తప్ప మఱియొండు కాదు.

(ఉండు వస్తువు శూన్యరూప మెన్నడును గాదు.)

బౌద్ధుల శూన్యరూపమే యద్వైతోపదేశ మగునెడల విద్యమాన వస్తువెన్నడు శూన్యరూపము కాజాలదు - కాని సూక్ష్మమగు కారణరూపమును బొందగలుగును. కావున నీకథనమును భ్రమరూపమే.

(ద్వాదశాయతనపూజ ముక్తికాదు భోగము)

ద్రవ్యముల యుపార్జనమువలన బూర్వము చెప్పబడిన ద్వాదశా యతన పూజ మోక్షసాధన మగునెడల బదిప్రాణములు, పదునొకండవ యాత్మ యను వీని నేల పూజింపరు? ఇంద్రియములయు నంతఃకరణము యొక్కయు బూజయే మోక్షపద మగునెడల నీ బౌద్ధులలోను, విషయలంపటులలోను గల భేదమేమి? బౌద్ధులు వానినుండి తప్పించుకొన లేనపుడు ముక్తి యెక్కడ నున్నది? వీరు తమ యవిద్య నెంతగానో పెంపుచేసికొన్నారు. వీరికి సాటి వీరే కాని యన్యులు కారు.

వీరు వేదములను, నీశ్వరుని విరోధించుటవలన నిట్టిఫలమే లభించినదని నిశ్చయింపవలసి వచ్చుచున్నది. ముందు సర్వసంసారమును దుఃఖ రూపమని భావించుటయు, మధ్యలో ద్వాదశాయతన పూజనము లదగుల్కొనుటయు ననమేమి? వీరి ద్వాదశాయతన పూజ సాంసారిక పదార్థములకంటె భిన్నమై

నదా? వీరికి ముక్తి నిచ్చుటకు!

కన్నులు మూసికొని రత్నమును వెదక దలచినను వెదకినను రత్నమెన్నడైన నొకడు పొందగలడా? వేదమును నీశ్వరుని నంగీకరింపనందున వీరి దశ యట్లే యైనది. ఇప్పటికైన సుఖము కావలయుననిన వేదమును నీశ్వరుని నాశ్రయించి తమజన్మము సఫలము చేసికొనవచ్చును.

(వివేక విలాసమునందలి బౌద్ధసిద్ధాంతములు)

వివేకవిలాస మనుగ్రంథమున బౌద్ధుల సిద్ధాంతము లిట్లు నిర్దేశింపబడి యున్నవి.

"బౌద్ధానాం సుగతో దేవో విశ్వం చ క్షణభంగురమ్
ఆర్యసత్త్వాఖ్యయా తత్త్వచతుష్టయ మిదం క్రమాత్." (౧)
"దుఃఖమాయతనం చైవ తతః సముదయో మతః
మార్గశ్చేత్యస్య చ వ్యాఖ్యా క్రమేణ శ్రూయతామతః" (౨)
"దుఃఖం సంసారిణః స్కంధాస్తే చ పంచ ప్రకీర్తితాః,
విజ్ఞానం వేదనా సంజ్ఞా సంస్కారో రూపమేవ చ." (౩)
పంచేంద్రియాణి శబ్దాద్యాః విషయాః పంచమానసమ్
ధర్మాయతనమేతాని ద్వాదశాయతనాని తు." (౪)
"రాగాదీనాం గణోఽయం స్యాత్ సముదేతి నృణాం హృది,
ఆత్మాత్మీయస్వభావాఖ్యః స స్యాత్సముదయః పునః." (౫)
"క్షణికాః సర్వసంస్కారా ఇతి యా వాసనా స్థిరా
స మార్గ ఇతి విజ్ఞేయః స చ మోక్షోఽభిధీయతే." (౬)
"ప్రత్యక్షమనుమానం చ ప్రమాణ ద్వితయం తథా
చతుః ప్రస్థానికా బౌద్ధాః ఖ్యాతా వైభాషికాదయః." (౭)
"అర్థో జ్ఞానాన్వితో వైభాషికేణ బహు మన్యతే
సౌత్రాంతికేన ప్రత్యక్షగ్రాహ్యోర్థో న బహిర్మతః." (౮)
"ఆకారసహితా బుద్ధిర్ యోగాచారస్య సంమతా
కేవలాం సంవిదం స్వస్థాం మన్యన్తే మధ్యమాః పునః." (౯)
"రాగాది జ్ఞాన సంతాన వాసనాచ్ఛేదసంభవా
చతుర్ణామపి బౌద్ధానాం ముక్తి రేషా ప్రకీర్తితా." (౧౦)
"కృత్తిః కమండలుర్ మౌండ్యం చీరం పూర్వాహ్ణభోజనమ్,
సంఘో రక్తాంబరత్వం చ శిశ్రియే బౌద్ధభిక్షుభిః." (౧౧) బౌద్ధదర్శన–౪౬, ౪౭ పృష్ఠ.

బౌద్ధులకు సుగతదేవ బుద్ధుడు పూజనీయ భగవంతుడు. జగత్తు క్షణభంగురము. ఆర్యపురుషుడు, ఆర్యస్త్రీ , తత్త్వముల ఆఖ్యా=నామాది ప్రసిద్ధి యనునీనాలుగు తత్త్వములు బౌద్ధులలో మంతవ్య పదార్థములు. (౧)

ఈ విశ్వము దుఃఖము. శరీరము దుఃఖాలయముగా నెఱుగునది. తదనంతరము సముదయము–రాగాదుల యుత్పత్తి కలుగును. వీరి వ్యాఖ్య క్రమముగా వినుము. (౨)

సంసారమున దుఃఖమే పూర్వము చెప్పిన పంచస్కంధముల నెఱుగుట. (౩)

పంచ జ్ఞానేంద్రియములు, వాని విషయములు శబ్దాదులైదు, మనస్సు, బుద్ధి–అంతఃకరణము, ధర్మస్థానములు, ఈ పంద్రెండు ద్వాదశాయతనము.

మనుష్యుల హృదయమున గలుగు రాగాదుల సమూహోత్పత్తి 'సముదయము'. ఆత్మ, ఆత్మకు సంబంధించిన స్వభావము 'ఆఖ్య', వీని వలననే మరల సముదయ మగును. (౫)

'ఈ సంసారము క్షణికము'. అను నీ వాసన స్థిరమగుట బౌద్ధులకు మార్గము'. అదియే శూన్య తత్త్వము శూన్యరూప మగుట మోక్షము. (౬)

బౌద్ధులు ప్రత్యక్షము, ననుమానము నను రెండు ప్రమాణముల నంగీకరింతురు. వీరిలో నాలుగు భేదము లున్నవి. (౧) వైభాషికులు, (౨) సౌత్రాంతికులు, (౩) యోగాచారులు, (౪) మాధ్యమికులు (౭).

వీరిలో వైభాషికులు, జ్ఞానమున నర్థమున్న దందురు. జ్ఞానమునలేని దానిని సిద్ధపురుషుడంగీకరింపడు. సౌత్రాంతికుడు లోపల ప్రత్యక్షపదార్థము నంగీకరించును. వెలుపల నంగీకరింపడు (౮)

యోగాచారుడు – ఆకారసహిత విజ్ఞానయుక్త బుద్ధి నంగీకరించును. మాధ్యమికుడు – తనలో పదార్థముల జ్ఞానము మాత్ర మంగీకరించును. వెలుపల నంగీకరింపడు (౯)

రాగాది జ్ఞాన ప్రవాహముయొక్క వాసనా నాశమువలన నుత్పన్నమగు ముక్తిని బౌద్ధు లెల్లరు నంగీకరింతురు. (౧౦)

మృగాదుల చర్మము, కమండలువు, ముండితశిరస్సు, నారచీరలు, పండ్రెండు గంటలకు ముందే భోజనము చేయుట, యొంటరిగా నుండకుండుట, రక్త వస్త్రధారణము నిది బౌద్ధసాధువుల వేషము. (౧౧)

(క్షణికవాద దోషములు)

ఉత్తరము:– బౌద్ధులకు సుగతబుద్ధుడే దేవుడైన నతనికి గురువెవరు? విశ్వము క్షణభంగురమైన పూర్వ మెన్నడో చూచిన వస్తువునిపుడు మరల జూచి యీవస్తు విదియే యను స్మరణమెట్లు కలుగును? ప్రతివస్తువు క్షణభంగురమైన పూర్వము చూచిన వస్తువే యుండదు. కావున దేని స్మరణము కలుగును? క్షణికవాదమే బౌద్ధుల దగుచో వీరి ముక్తియు క్షణికమే యగును.

జ్ఞానయుక్త పదార్థము ద్రవ్య మగునెడల జడద్రవ్యమునందును జ్ఞాన ముండవలయును. బాహ్యమున పదార్థమే లేకున్న బౌద్ధుడు చలన చాలనాది క్రియలు దేని మీద జేయుచున్నాడు? బయట గనబడునది మిథ్య యెట్లగును? బుద్ధి యాకారసహిత మగునెడల నది దృశ్య మేల కాదు?

కేవలజ్ఞానమే హృదయముననుండు నాత్మయందున్న బాహ్యపదార్థములు జ్ఞానరూపమేయైన జ్ఞేయ పదార్థములు లేక జ్ఞానమెట్లు కలుగగలదు? వాసనాచ్ఛేదమే ముక్తి యగునెడల సుషుప్తియు ముక్తి యగును. అట్లంగీకరించుట విద్యకు విరుద్ధము. కావున నీ విషయము తిరస్కరింపదగినదే కాని మాన్యము కాదు.

ఇట్టి విషయములు బౌద్ధమతస్థులకు సంబంధించినవి సంక్షేపముగ ప్రదర్శింపబడినవి. ఇప్పుడు బుద్ధిమంతులు విచారశీలురైన పురుషులు వీనిని జూచి, బౌద్ధులవిద్య యెట్టిదో వారి మతమెట్టిదో తెలిసి కొనగలరు. ఈ మతమును జైనులు నంగీకరింతురు.

(బౌద్ధులు జైనులయు సమాన విషయములు)

ఇటనుండి జైనమత వర్ణనము. ప్రకరణరత్నాకరము, భాగము ౧. నయచక్రసారమున నిమ్నలిఖిత విషయములు వ్రాయబడి యున్నవి.

బౌద్ధులు సమయ సమయమున నవీనముగ (౧) ఆకాశము, (౨) కాలము, (౩) జీవులు, (౪) పుద్గలము నను నాలుగు ద్రవ్యముల నంగీకరింతురు. జైనులు, ధర్మాస్తికాయము, అధర్మాస్తికాయము, ఆకాశాస్తికాయము, పుద్గలాస్తి కాయము, జీవాస్తి కాయము, కాలము నను నాఱు ద్రవ్యముల నంగీకరింతురు. కాని, వీనిలో గాల ముపచార ద్రవ్యమే కాని వాస్తవమున ద్రవ్యము కాదనియు జెప్పుదురు.

(౧) వానిలో ధర్మాస్తి కాయము :– గతిపరిణామము వలన బరిణతిం బొందిన జీవ పుద్గలుల గత్యుపష్టంభక హేతువు ధర్మాస్తికాయ మనబడును. అదియు నసంఖ్య ప్రదేశ పరిమాణము గలదై లోకము ·లందు వ్యాపించి యున్నది.

(౨) అధర్మాస్తి కాయము :– స్థితిలో బరిణతములైన జీవపుద్గలుల స్థితికి నుపష్టంభక హేతువు – అధర్మాస్తి కాయ మనబడును.

(3) ఆకాశాస్తి కాయము :– సర్వద్రవ్యములకు నాధారభూతమై, నిర్గమన, ప్రవేశ క్రియ లొనర్చు జీవపుద్గలులకు నవగాహనహేతువై వ్యాపక మగునది – ఆకాశాస్తికాయ మనబడును.

(౪) పుద్గలాస్తి కాయము :– కారణరూపమున సూక్ష్మము, నిత్యము, ఏకము, రసవర్ణ గంధస్పర్శ రూపకార్యములకు లింగము, వృద్ధి వినాశముల స్వభావము కలిగి యుండునది – పుద్గలాస్తి కాయమన బడును.

(౫) జీవాస్తి కాయము :– చేతనాలక్షణము, జ్ఞానదర్శనమున నుపయుక్తము, అనంత పదార్థముల వలన బరిణామము బొందునది కర్తయు భోక్తయు నై యున్నది.

(౬) కాలము :– పూర్వము చెప్పబడిన పంచాస్తికాయములకు బరత్వము, నపరత్వము, నవీనత, ప్రాచీనతలకు జిహ్నరూప ప్రసిద్ధ వర్తమానరూప పదార్థములతో యుక్తమైనది కాల మనబడును.

సమీక్షకుడు :– బౌద్ధు లంగీకరించిన నాలుగు ద్రవ్యములు ప్రతిసమయము నను నవీనములగు చుండుననుట సత్యము కాదు. ఏల యన నాకాశము కాలము జీవులు పరమాణువులు నను నీ నాలుగును గ్రొత్తవి ప్రాతవి యెన్నడు గావు. ఇవి యనాది పదార్థములు. కారణరూపమున నాశము లేనివి. వీనిలో నవీనత పురాణత యెట్లు సంభవ మగును.

జైను లంగీకరించు నాఱుద్రవ్యములును సరికాదు. ధర్మాధర్మములు ద్రవ్యములు కావు, అవి గుణములు. అవి రెండును జీవాస్తి కాయమునందే వచ్చును. కావున నాకాశము కాలము జీవులు పరమాణువులు నంగీకరించుట సమంజసము.

వాస్తవమున గణాదమహర్షి వైశేషికమున నంగీకరించిన నవ ద్రవ్యములే సరియైనవి. ఏల యన బృథివ్యాది పంచతత్త్వములు, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు నను నీ తొమ్మిది ద్రవ్యములు వేఱు వేఱు పదార్థములగుట నిశ్చితము. జీవుల నంగీకరించి యీశ్వరు నంగీకరింపకుండుట జైనులయు బౌద్ధులయు మిథ్య పక్షపాతమే యగును.

(సప్త భంగీ – స్యాద్‌వాదము)

బౌద్ధులు, జైనులు నంగీకరించు సప్తభంగి స్యాద్‌వాదము నిదియే :–

(౧) 'సన్‌ఘటః' ఘట మున్నది – సత్తాగలిగినది – ఇది ప్రథమ భంగము, ఏల యన ఘటము తన వర్తమానత – ఉనికితో గూడియున్నది. అనగా ఘట మున్నది. ఇది యభావమును విరోధించుచున్నది.

(౨) రెండవభంగము :– 'అసన్‌ఘటః' ఘటము లేదు. ఘటము యొక్క భావము – ఉనికివలన మొదటిభంగము, ఘటము యొక్క యభావము వలన – ఉనికిలేందున, రెండవ భంగము.

(3) మూడవ భంగము :– 'సన్నసన్నఘటః' (సత్ అసత్ అఘటః) ఉన్నది, లేదు, ఘటము కాదు. అనగా నిది ఘటము కాని పటము కాదు. 'పూర్వపు ఘట మున్నది' ఘటము లేదు', అను నీరెంటికంటె నిది వేఱైనది.

(౪) చతుర్థభంగము :– 'ఘటోఽఘటః'.'ఘటము అఘటము.' ఎట్లు 'అఘటః పటః' 'అఘటము పటము' రెండవదియగు పటముయొక్క యభావము తనలో నుండుటచేత ఆయభావము నపేక్షించి

అఘట మనబడును. ఒకే క్షణమున ఘటము, నఘటమునని ఘటము రెండు సంజ్ఞలు కలదగుచున్నది.

(౫) పంచమ భంగము :- ఘటమును పటమనుట అయోగ్యము. అనగా ఘటమున ఘటత్వము వక్తవ్యము, పటత్వ మవక్తవ్యము (ఘటత్వము గలది ఘటమగును కాని పటము కాదనిభావము)

(౬) ఆఱవభంగము :- ఘటముకానిది వక్తవ్యమునుగాదు. ఏది యున్నదో యది వక్తవ్యము నగుచున్నది.

(౭) ఏది చెప్పుట కిష్టమైనదో, యది లేదు. మఱియు ఘటము వక్తవ్య యోగ్యమును గాదు, ఇదియేడవభంగము, ఇట్లే

"స్యాదస్తి జీవోఽయం ప్రథమో భంగః," (౧)

"స్యాన్నాస్తి జీవో ద్వితీయో భంగః,' (౨)

"స్యాదవక్తవ్యో జీవస్తృతీయో భంగః." (౩)

"స్యాదస్తి నాస్తి రూపో జీవశ్చతుర్థో భంగః." (౪)

"స్యాదస్తి (చ) అవక్తవ్యో జీవః పంచమో భంగః." (౫)

"స్యాన్నాస్తి (చ) అవక్తవ్యో జీవః షష్ఠో భంగః." (౬)

"స్యాదస్తి నాస్తి చ అవక్తవ్యో జీవ ఇతి సప్తమో భంగః." (౭)

అనగా :- (౧) 'జీవుడున్నాడు' అని చెప్పిన, జీవునకు విరుద్ధమైన జడపదార్థముల యభావము జీవునియందున్నది. అట్టి యభావరూపభంగము ప్రథమభంగము.

(౨) 'జడమునందు జీవుడు లేడు' అనియు జెప్పనగును - కావున నిది రెండవభంగము.

(౩) 'జీవుడు చెప్పదగిన వాడు కాడు' ఇది మూడవభంగము.

(౪). ఎప్పుడు జీవుడు శరీరధారణము చేయునో యప్పుడు ప్రసిద్ధుడగును. శరీరమునుండి వేఱైనపు డప్రసిద్ధు డగును - కావున నిట్లు చెప్పుట నాలుగవభంగ మనబడును.

(౫) 'జీవుడున్నాడు కాని వక్తవ్యుడు కాడు'. ఇట్టి కథనమే యైదవ భంగ మనబడును.

(౬) జీవుడు ప్రత్యక్ష ప్రమాణముతో జెప్పదగినవాడు కాడు. కాబట్టి చాక్షుష ప్రత్యక్షము కాదు. ఈ వ్యవహారమునే యాఱవ భంగ మందురు.

(౭) ఒకే కాలమున జీవు డనుమానముచే సిద్ధమగుటయు, మఱియు, నదృశ్యత్వమున లేకుండుట, మఱియు నొకటిగా నుండకుండుట, క్షణక్షణమున బరిణామము చెందుట, మఱియు, నున్నది, లేదు - అనుటకాని, లేదు - ఉన్నది యనువ్యవహారము లేకుండుట, ఇది యేడవ భంగ మనబడును.

ఇట్లే నిత్యత్వ సప్తభంగులు, ననిత్యత్వ సప్తభంగులు, అట్లే సామాన్యధర్మము, విశేషధర్మము, గుణము, పర్యాయములకు సంబంధించిన సప్తభంగులు ప్రతివస్తువునందు నుండును. అట్లే ద్రవ్యములు, గుణములు, కర్మలు, స్వభావములు, పర్యాయములు ననంతము లగుటచే సప్తభంగులు ననంతము లగును. ఇట్లు బౌద్ధులయు జైనులయు స్యాద్వాదము, సప్తభంగీన్యాయము చెప్పబడును.

సమీక్షకుడు :- ఈ కథన మంతయు నొక యన్యోన్యాభావము నందో, సాధర్మ్య వైధర్మ్యమునో చరితార్థము కాగలదు. ఈ సరల పద్ధతిని విడిచి కఠినరచనలు చేయుట యజ్ఞానులను వలలో వేసికొనుటకే కాని యన్య ప్రయోజనము కనిపింపదు. చూడుడు. జీవుని యభావ మజీవ పదార్థములందును, నజీవ పదార్థముల యభావము జీవులందును నుండుట స్వభావము. జీవులు, జడపదార్థములు రెండును నున్నవి. కావున వానిలో సాధర్మ్యము, వైధర్మ్యము నుండును. అనగా జీవునియందు చేతనత్వ ముండును. జడత్వ ముండదు. అట్లే జడపదార్థమునందు జడత్వముండును, చేతనత్వముండదు. దీనినిబట్టి పదార్థముల

యొక్క గుణకర్మస్వభావముల సమాన ధర్మము లేవో, విరుద్ధ ధర్మములేవో విచారించి తెలిసికొనిన జైన బౌద్ధుల సప్తభంగులు, స్యాద్వాదము సులభముగా బోధపడును. అట్టియెడ నీక్లిష్ట కల్పనా ప్రపంచము వలన గలుగు ప్రయోజనమేమున్నది?

ఇందు బౌద్ధులు జైనులు నేకమతము గలిగియున్నారు. కొలది భేద ముండుటవలన వీరిలో భిన్నతయు నుండును.

(కొన్ని జైన సిద్ధాంతములు)

ఇప్పు డికముందు కేవలము జైనులకు సంబంధించిన విషయములు వ్రాయుదుము.

"చిదచిద్ ద్వే పరే తత్త్వే వివేక స్తద్వివేచనమ్
ఉపాదేయముపాదేయం, హేయం హేయం చ కుర్వతః." (౧)
"హేయం హి కర్తృరాగాది, తత్కార్యమవివేకినః,
ఉపాదేయం పరం జ్యోతి రుపయోగైకలక్షణమ్." (౨) ఆర్హతదర్శనము. పృష్ఠ ౬౭

జైనులు, చిత్, అచిత్=చేతనము, జడమునను రెండే పరతత్త్వము లంగీకరింతురు. ఆ రెంటి వివేచనము 'వివేక' మనబడును. గ్రహింపదగిన వానిని గ్రహించి, త్యజింపదగిన వానిని త్యజించువాడు 'వివేకి' యనబడును. (౧)

జగత్కర్త, రాగాదులు, నీశ్వరుడు జగత్తును రచియించెను. అను నీ యవివేక మతమును విడువవలయును. యోగమువలన లక్షితపరమజ్యోతి రూపుడగు జీవుని గ్రహించుట యుత్తమము. (౨)

అనగా జీవుడుతక్క మఱియొక చేతనతత్త్వము లేదని వీరిమతము అనాది సిద్ధమగు నీశ్వరతత్త్వము లేదని వీరి సిద్ధాంతము. ఇందు జైన బౌద్ధులు సమానము.

(జైనులు బౌద్ధులొక్కటే)

ఇందు రాజాశివప్రసాదుగారు 'ఇతిహాసతిమిరనాశకము'ను గ్రంథమున నిట్లు వ్రాయుచున్నారు. "వీరికి రెండు నామములున్నవి. 'జైనులు బౌద్ధులు' అని. ఇవి రెండును బర్యాయవాచకములు. అనగా రెంటికి నర్థమొక్కటియే. కాని యీ బౌద్ధులలో వామమార్గులైన మద్యమాంసాహారులు బౌద్ధులు. వీరిని జైనులు విరోధింతురు. కాని, మహావీరుడు, గౌతమగణధరుడు నను వారికి బౌద్ధులు 'బుద్ధు' డని నామము పెట్టిరి. జైనులు 'గణధరుడు మఱియు జినదరుడు' ననిరి..

వీరిలో నెవరి పరంపర జైనమతమో, వారిని గూర్చి రాజాశివ ప్రసాద్ గారు తన 'ఇతిహాస తిమిర నాశక' గ్రంథమున నిట్లు వ్రాసిరి. 'స్వామిశంకరాచార్యులకు ముందు ననగా నొక సహస్ర వర్షములకు బూర్వము భారతము నందంతట బౌద్ధము లేక జైనమతము వ్యాపించి యుండెను.'

దీనిమీద 'నోటు'. "బౌద్ధ శబ్దముచే మాయభిప్రాయము - మహా వీరునకు సంబంధించిన గణధర స్వామి సమయము మొదలుకొని శంకర స్వాముల సమయమువఱకు భారతదేశమున వ్యాపించియున్నది వేద విరుద్ధ మతమనియు, మఱియు అశోకుడు, సంప్రతి మహారాజా దేని నంగీకరించిరో యా మతమ" నియు గ్రహింపనగును. ఆ మతము నుండి జైను లేవిధముగను వేఱు కాజాలరు. అంతవఱకు జైన బౌద్ధులొక్కటే యని యభిప్రాయము. 'జిన' పదముచే 'జైన' పదము, 'బుద్ధ' పదమునుండి బౌద్ధము నేర్పడినవి. కోశమున వీని రెండిటియర్థ మొక్కటియే. మఱియు 'గౌతము' నిరువురు నంగీకరింతురు. లేకున్న 'దీపవంశము' మున్నగు పూర్వపు బౌద్ధగ్రంథములలో శాక్యముని 'గౌతమబుద్ధు'ని తఱచు 'మహావీర' నామముతో నుల్లేఖించుటేల? కావున నతని సమయమున వారిది యొక్కటే మతమై యుండును. మేము వారిని 'జైన' శబ్దముతో జైనులని వ్రాయక బౌద్ధులని వ్రాయుటలో బ్రయోజన మింతయే - ఎద్దియన -

వారి నితర దేశవాసులు బౌద్ధులనియే వ్రాసియున్నారు.

(అమరకోశమతము)

ఇట్లే యమరకోశమునందును వ్రాయబడియున్నది.

"సర్వజ్ఞః సుగతో బుద్ధో ధర్మరాజ స్తథాగతః.
సమంతభద్రో భగవాన్ మారజిల్లోకజిజ్జినః" (౧)
షడభిజ్ఞో దశబలోఽద్వయవాదీ వినాయకః,
మునీంద్రః శ్రీఘనః శాస్తా మునిః శాక్యమునిస్తు యః" (౨)
స శాక్యసింహః సర్వార్థః సిద్ధః శౌద్ధోదనిశ్చ సః,
గౌతమశ్చార్కబంధుశ్చ మాయాదేవీసుతశ్చ సః." (౩) (అమరకోశము ౧కాం. ౧సర్గ. ౮-౧౦.)

ఇప్పుడు చూడుడు, 'బుద్ధుడు, జినుడు, బౌద్ధుడు, జైనుడు'. ఒకరి పేరులేనా కాదా? కేవలము హఠ భావముతో వాగుదురు. కాని, జైనవిద్వాంసుల కీవిషయము తెలియనిది కాదు. వారిరువురు నొకటియే యందురు. బౌద్ధులు జైనులు నొకటే యనుట సందేహము లేదు.

(మఱికొన్ని జైనసిద్ధాంతములు)

జీవుడే పరమేశ్వరు డగునని జైనులందురు. వారు వారి తీర్థంకరులనే కేవలు లనియు, ముక్తిని బొందిన పరమేశ్వరు లనియు నందురు. వీరిని మించి యనాది పరమేశ్వరు డెవ్వడు లేడు. సర్వజ్ఞులు, వీతరాగులు, అర్హతులు, కేవలులు, తీర్థకృత్ అను నీయాఱును నాస్తికుల దేవతలకుబేళ్ళు.

ఆదిదేవుని స్వరూపమును 'ఆప్తనిశ్చయాలంకారము' అను గ్రంథమున చంద్రసూరి యిట్లు వర్ణించుచున్నాడు.

'సర్వజ్ఞో వీతరాగాదిదోష స్త్రైలోక్యపూజితః
యథాస్థితార్థవాదీ చ దేవో ఽర్హన్ పరమేశ్వరః" (౧)
ఇట్లే 'తౌతాతితులు'ను వ్రాసిరి.
"సర్వజ్ఞో దృశ్యతే తావన్నేదానీమస్మదాదిభిః
దృష్టో న చైకదేశోఽస్తి లింగం వా యోఽనుమాపయేత్" (౨)
"న చాగమవిధిః కశ్చిన్నిత్యసర్వజ్ఞబోధకః,
న చ తత్రార్థ వాదానాం తాత్పర్యమపి కల్పతే." (౩)
"న చాన్యార్థప్రధానై స్తైస్తదస్తిత్వం విధీయతే
న చానువదితుం శక్యః పూర్వమన్యైరబోధితః" (౪) ఆర్హతదర్శన – పృష్ఠ ౫౬

రాగాది దోషములు లేనివాడు, త్రిలోకములందు బూజ్యుడు, పదార్థముల నున్నవి యున్నట్లు చెప్పువాడు, సర్వజ్ఞుడునైన అర్హన్ దేవుడే పరమేశ్వరుడు. (౧)

ఇప్పుడు పరమేశ్వరుని జూడనందున సర్వజ్ఞుడునాదియు నగు పరమేశ్వరుడు ప్రత్యక్షముగ లేడు. ఈశ్వరుని విషయమున బ్రత్యక్షము లేనందున ననుమాన ప్రమాణము వర్తింపదు. ఏకదేశము ప్రత్యక్షము కానంతవఱకు ననుమాపకలింగము లేనందున ననుమాన ప్రమాణము వర్తింపదు. (౨)

ప్రత్యక్షానుమానములు లేనందున నాగమము – నిత్యుడు, ననాది సర్వజ్ఞుడైన పరమేశ్వర బోధక శబ్ద ప్రమాణము కూడ లేదు. ఇట్లు మూడు ప్రమాణములు లేనపుడర్థవాదము – స్తుతి, నిందా, పరకృతి - అనగా నితరుని చరిత్రవర్ణనము, పురాకల్పము – అనగా నితిహాస తాత్పర్యముకూడ సంగతము కాదు - ఈశ్వరుని బోధింపజాల వనిభావము. (౩)

అన్వార్థ ప్రధానమగు బహువ్రీహి సమాసమువలె బరోక్ష - ప్రత్యక్షము కాని పరమేశ్వరునిసిద్ధి విషయక విధానము నుండ జాలదు. అప్పుడీశ్వరుని గుఱించి యుపదేశించువారి ద్వారా వినక యనువాదము కూడ గాజాలదు. (౪)

ఈ విషయముల ప్రత్యాఖ్యానము - ఖండన. అనాది - ఈశ్వరుడు లేకున్న అర్హన్‌దేవుని తల్లి దండ్రుల శరీరపు మూసలనెవరు చేసిరి ? సంయోగ మొనర్చువాడు లేక యోగ్యమైన సర్వావయవసంపన్నము యథోచిత కార్యముల నొనర్చుటకు దగిన శరీర మెన్నటికిని సిద్ధము కాజాలదు. ఏ పదార్థములతో శరీర మేర్పడినదో యవి జడములు. కావున స్వయముగా నవి యిట్టి యుత్తమరచనతో గూడిన శరీరరూపమును బొందజాలవు. కారణమేమన యోగ్యవస్తువుగా సిద్ధ మగుటకు దగిన జ్ఞానము వానిలో లేదు.

(జీవుడీశ్వరుడు కాజాలడు)

మొదట రాగాదిదోషములతో గూడియుండి తదుపరి దోషరహితుడగు వాడీశ్వరు డెన్నడును గాజాలడు. ఏ నిమిత్తమువలన రాగాది రహితుడగునో యందువలన గలుగుముక్తియు, నానిమిత్తము నశించిన దాని కార్యమగు ముక్తియు ననిత్య మగును.

అల్పుడు, నల్పజ్ఞుడునగు జీవుడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు నెన్నడు గాజాలడు. ఏలయన జీవుని స్వరూప మేకదేశి, పరిమిత గుణకర్మ స్వభావములు కలది. అట్టివాడు సర్వవిద్యలందును సర్వవిధముల యథార్థ వక్తకాజాలడు. కావున నీతీర్థంకరులు పరమేశ్వరు లెన్నడు గాజాలరు. (౧)

మీరు ప్రత్యక్షపదార్థములనే యంగీకరింతురా? అప్రత్యక్షము నంగీకరింపరా? చెవిచే రూపము, నేత్రముచే శబ్దము గ్రహింపబడవు. అట్లే యనాది పరమేశ్వరుని జూచుటకు సాధనములు శుద్ధాంతః కరణము, విద్య, యోగాభ్యాసములు, వాని మూలమున బవిత్రుడైనవాడు పరమాత్మను బ్రత్యక్షముగా జూచును. విద్య నభ్యసింపనివానికి విద్యాప్రయోజనము లభింపదు. అట్లే యోగాభ్యాసము విజ్ఞానము లేక పరమాత్మయు గనబడడు.

(ఈశ్వర ప్రత్యక్షము)

భూమియొక్క గుణములు రూపాదులను జూచి యెఱిగినందున, గుణములతో నవ్యవహిత సంబంధముగల పృథివి ప్రత్యక్ష మగునట్టు లీ సృష్టి యందలి రచనావిశేషము లనెడి లింగములను జూచినపుడు - తెలిసికొనినపుడు పరమేశ్వరుడు ప్రత్యక్ష మగును. మఱియు బాపాచరణ మొనర్ప నిచ్ఛ గలిగినపుడు భయము, శంక, లజ్జ మున్నగునవి యేర్పడును. అవి యంతర్యామియగు పరమేశ్వరునివలననే కలుగును. అందువలనను బరమేశ్వరుడు ప్రత్యక్ష మగును. ఇక ననుమాన ప్రమాణమువలన నీశ్వరుడు సిద్ధించుటలో సందేహ మేమి యుండును. (౨)

(శబ్ద ప్రమాణము)

ప్రత్యక్షానుమాన ప్రమాణములు రెండును సిద్ధించిన మీదట నాగమ ప్రమాణముకూడ నిత్యుడు, ననాది, సర్వజ్ఞుడు నైన యీశ్వరుని బోధించుటలో బాధక మేమి యుండును. తప్పక బోధించునని భావము. కాబట్టి శబ్దప్రమాణము కూడ నీశ్వరుని యందున్నది. మూడు ప్రమాణముల వలనను నీశ్వరుని జీవుడెఱుగ గలిగినపు డర్థవాదము-పరమేశ్వరుని గుణములను బ్రశంసించుటయు సంగతమే యగును. కారణ మేమన నిత్యపదార్థము లందలి గుణకర్మస్వభాములును నిత్యములే యగును. వానిని బ్రశంసించుటలో నేదియు బ్రతిబంధకము కాదు.

(ఈశ్వరుడు లేని సృష్టి సంభవము కాదు)

మనుష్యులలో గర్తలేక యే కార్యము సిద్ధింపనట్లు సృష్టిరూప మహత్ కార్యము కర్తలేక యెన్నడును

నేవిధముగను సంభవము కాదు. అట్టి యెడ నీశ్వరుని యునికి విషయమున మూఢునకును సందేహము కలుగదు. పరమాత్మను గుఱించి యుపదేశించు వారినుండి విని మీదట ననువాదము చేయుటయు సరలమగును. (౪)

దీనినిబట్టి ప్రత్యక్షాది ప్రమాణములతో నీశ్వరుని ఖండించుట మున్నగు జైనుల వ్యవహారము లనుచితములు.

(అనాది పదార్థములలో నన్యోన్యాశ్రయదోషము లేదు.)

ప్రశ్న :- "అనాదేరాగమస్యార్థో న చ సర్వజ్ఞ ఆదిమాన్
క్కృత్రిమేణ త్వసత్యేన స కథం ప్రతిపాద్యతే". (౧)
"అథ తద్వచనేనైవ సర్వజ్ఞోఽన్యైః ప్రతీయతే
ప్రకల్పేత కథం సిద్ధి రన్యోన్యాశ్రయయో స్తయోః. (౨)
"సర్వజ్ఞోక్తతయా వాక్యం సత్యం తేన తదస్తితా
కథం తదుభయం సిద్ధ్యేత్ సిద్ధమూలాన్తరాదృతే." (౩) ఆర్హతదర్శన—పృష్ఠ ౫౬.౫౭

మధ్యలో సర్వజ్ఞుడున్న ననాది శాస్త్రమునకు నర్థముండదు. ఏల యన జేసిన యసత్యభాషణము వలన నతని ప్రతిపాదన మెట్లుకాగలదు? (౧)

పరమేశ్వరుని వచనమువలన బరమేశ్వరుడు సిద్ధమగు నెడల, ననాది యీశ్వరునివలన ననాది శాస్త్రము సిద్ధియు, ననాదిశాస్త్రమువలన ననాది ఈశ్వరసిద్ధి కలిగి యన్యోన్యాశ్రయ దోషము గలుగును. (౨)

ఏలయన సర్వజ్ఞుని కథన మగుటవలన వేదవాక్యము సత్యము, నావేదవాక్యమువలన నీశ్వరుని సిద్ధము చేయుదువేని యిది యెట్లు సిద్ధము కాగలదు? ఆ శాస్త్రము, నీశ్వరుడు నను నీరెంటిసిద్ధికొఱకు మూడవ ప్రమాణము కావలయును. అట్లంగీకరింపవేని యనవస్థా దోషము కలుగును. (౩)

ఉత్తరము :- మేము పరమేశ్వరుని బరమేశ్వరుని గుణములను, గర్మలను స్వభావమును ననాదియని యంగీకరింతుము. అనాది నిత్యపదార్థములలో నన్యోన్యాశ్రయ దోషము కలుగనేరదు. కార్యమువలన గారణ జ్ఞానము, కారణమువలన గార్యబోధయు గలుగును. కార్యమున గారణ స్వభావము, గారణమున గార్య స్వభావము నిత్యమై యుండును. అట్లే పరమేశ్వరుడు, పరమేశ్వరుని యనంత విద్యాదిగుణములు నిత్యము లగుటవలన నీశ్వర ప్రణీత వేదమునందు ననవస్థాదోషము రాదు. (౧, ౨, ౩)

(తీర్థంకరు డీశ్వరుడు కాడు)

మీరు తీర్థంకరులను నీశ్వరుడు పరమేశ్వరుడని యంగీకరించుచున్నారు. అట్లెన్నడును గాజాలరు. ఏల యన దల్లిదండ్రులు లేక వారి శరీరము లేర్పడవు. అట్టి యెడ వారు తపశ్చర్య నెట్లు చేయుదురు? జ్ఞానమును, ముక్తిని నెట్లు పొందగలరు? అట్లే సంయోగమునకు గారణమవశ్య ముండును. వియోగములేక సంయోగము కలుగదు. కావున ననాది సృష్టి కర్తయగు పరమేశ్వరుని నంగీకరింపుడు.

చూడుడు! ఎవ డెంత సిద్ధుడైనను శరీరాది రచనలను బూర్ణముగా నెఱుగ జాలడు. సిద్ధజీవుడు సుషుప్తిదశలోనికి బోయినపుడతనికి నేమియు భాసింపదు. జీవుడు దుఃఖితుడైనపుడును నతనికి జ్ఞానము కొంత తగ్గును. ఇట్టి పరిచ్ఛిన్న సామర్థ్యము గల్గి యేకదేశమున నుండువానిని నీశ్వరునిగా నంగీకరించుట భ్రాన్తబుద్ధిగల జైనులకు దక్క మఱియెవరికిని దగదు.

తీర్థంకరులు వారి తల్లిదండ్రులవలన గలిగిరని, యందురేని యా తల్లిదండ్రు లెవరివలన గలిగిరి? వారి తల్లిదండ్రు లెవరివలన నని ప్రశ్నించుచు బోయిన ననవస్థ యేర్పడును.

(ఆస్తిక నాస్తిక సంవాదము)

ఇక ముందు 'ప్రకరణరత్నాకరపు ద్వితీయభాగము' నుండి 'ఆస్తిక నాస్తిక సంవాదము' నకు సంబంధించిన ప్రశ్నోత్తరముల నిట వ్రాయుచున్నాము. దానిని గొప్పగొప్ప జైన విద్వాంసులు తమ సమ్మతితో బాటు నంగీకరించిరి. బొంబాయిలో నచ్చువేయబడినది.

(ఈశ్వరీయవ్యవస్థ-కర్మఫలము)

నాస్తిక :- ఈశ్వరుని యిచ్ఛవలన నేమియు గాదు. జరుగున దంతయు గర్మవలన జరుగును.

ఆస్తిక :- అంతయు గర్మవలన నయిన గర్మ యెవనివలన నగును? జీవాదులవలన నగునందువేని, జీవు డేశ్రోత్రాదీంద్రియ సాధనములతో గర్మల నొనర్చునో యాయింద్రియాదు లెవనివలన నైనవి? అవి యనాది కాలము, స్వభావమువలన నైన వందువేని యనాదికి నాశము లేనందున నీమతమున ముక్తి కలుగ నేరదు. ప్రాగభావమువలె ననాది సాంత మగు నందువేని యత్నము లేకయే యెల్లరి కర్మలు నివృత్తము లగును.

ఈశ్వరుడు ఫలప్రదాత కానియెడల బాపఫలమగు దుఃఖమును జీవుడు తాను గోరి యెన్నడు ననుభవింపడు. చోరులు చౌర్యములకు ఫల రూపదండనమును బుద్ధిపూర్వకముగా గోరి యనుభవింపరు. రాజ వ్యవస్థకు లోబడి యనుభవింతురు. అట్లే పరమేశ్వరునివలన జీవులు పాపపుణ్యముల ననుభవింతురు. లేకున్న కర్మసాంకర్య మేర్పడును. ఒకరి కర్మఫలమును మఱియొక రనుభవింపవలసి వచ్చును.

(జీవుడీశ్వరుడు కాడు)

నాస్తికుడు:- ఈశ్వరు డక్రియుడు. కర్మచేయువా డగునెడల నతడును గర్మఫలము ననుభవింపవలసినవా డగును. కావున మేము కేవలీ-ప్రాప్తముక్తులను నక్రియులనుగా నంగీకరించునట్లు మీరును నీశ్వరు నక్రియుడని యంగీకరింపుడు.

ఆస్తికుడు:- ఈశ్వరు డక్రియుడు కాడు. సక్రియుడే. చేతను డైనపుడు కర్త యేల కాడు? కర్తయగువాడు క్రియనుండి వేఱు కాజాలడు. తీర్థంకరులైన జీవులే కృత్రిమ యీశ్వరు డైనట్లు మీరంగీకరింతురు. ఇట్టి కృత్రిమ-తయారైన యీశ్వరుని విద్వాంసు డెన్నడు నంగీకరింపడు.

కారణమేమన నిమిత్తముచే నేర్పడు నీశ్వరు డనిత్యుడు పరాధీనుడు నగును. మీరంగీకరించు నీశ్వరుడు, మొదట జీవుడుగా నుండును. తదుపరి యేదియో నిమిత్తమువలన నీశ్వరు డగును. (ఆ నిమిత్తము తొలగిన) మరల జీవు డగును. జీవుడు తన స్వభావమగు జీవత్వమును విడువజాలడు. ఏల యన ననంత కాలమునుండి యతడు జీవుడు. అనంత కాలమువఱకు జీవుడుగానే యుండును. కావున ననాదిస్వతఃసిద్ధ డగు నీశ్వరు నంగీకరించుట యుక్తము.

(ఈశ్వరుడు నిష్క్రియుడు కాడు)

చూడుడు. ప్రస్తుతమున జీవు డెట్లు పాపపుణ్యము లొనర్చి వాని ఫలముల ననుభవించుచున్నాడో యట్లెన్నడు నీశ్వరుడు కాడు. ఈశ్వరుడు క్రియావంతుడు కాకున్న నీజగత్తు నెట్లు సృష్టించును? కర్మలు ప్రాగభావము వలె ననాది సాంతములని యంగీకరింతువేని కర్మలు సమవాయ సంబంధముతో నుండవు. సమవాయ సంబంధముతో నుండకున్న నవి సంయోగజములై యనిత్యము లగును.

(ముక్తిలో జీవుడు నిష్క్రియుడైన పాషాణమువంటివాడగును)

ముక్తిలో జీవుడు క్రియాహీను డగునేని, ముక్తజీవులు జ్ఞానవంతులా? కారా? జ్ఞానవంతు లగుదురేని యంతఃక్రియావంతు లగుదురు. ముక్తిలో రాళ్ళవలె జడము లగుదురా? ఒకే చోట బడియుందురా? చేష్టయేమియు లేకున్న నది ముక్తి యగునా? అంధకార బంధనముల బడియుండుట యగునా?

నాస్తికుడు :– ఈశ్వరుడు వ్యాపకుడు కాడు. వ్యాపకు డగునేని సమస్త పదార్థములు చేతనము లేల కావు? బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో నుత్తమ మధ్యమ నికృష్టము లగునవస్థ లెట్లు కలిగినవి? ఏల యన నీశ్వరుడు సర్వమున నొక్కటిగా వ్యాపకుడై యున్నందున చిన్న పెద్ద యను భేద ముండరాదు.

ఆస్తికుడు :– వ్యాప్యము, వ్యాపకము ననురెండు నొక్కటి కావు. వ్యాప్య మేకదేశియు, వ్యాపకము సార్వదేశికము నగును. ఆకాశము వ్యాపకము, సర్వమున నుండును. భూగోళము, ఘటపటాది వస్తువులు వ్యాప్యములు, నేకదేశములును. పృథివి, యాకాశము నొక్కటి కాదు. అట్లే యీశ్వరుడు జగత్తు నొకటి కావు. ఆకాశము ఘటపటాది పదార్థము లన్నింటియందును వ్యాపకమైనను ఘట పటాదు లాకాశము కానట్లు పరమేశ్వరు డన్నింటియందు నున్నను నన్నియు జేతనములు కావు.

విద్వాంసులు, నవిద్వాంసులు, ధర్మాత్ములు నధర్మాత్ములు నెల్లరు సమానులు కారు. విద్యాది సద్గుణములు, సత్యభాషణాది కర్మలు, సుశీలతాది స్వభావములు న్యూనాధికము లగుటవలన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నన్త్యజులు నొకరికంటె నొకరు శ్రేష్ఠులు మధ్యములు నికృష్టులగుచున్నారు. వర్ణాశ్రమ వ్యవస్థను గూర్చి చతుర్థసముల్లాసమున వ్రాసియున్నాము. అక్కడ జూడవచ్చును.

నాస్తికుడు :– ఈశ్వరరచన వలన సృష్టియైన దల్లిదండ్రులతో నేమిపని ?

ఆస్తికుడు :– ఈశ్వరీయ సృష్టికి నీశ్వరుడు కర్త, జీవునిసృష్టికి నీశ్వరుడు కర్త కాడు. జీవుని కర్తవ్య కర్మల నీశ్వరుడు చేయడు. జీవుడే చేయును. వృక్షములు, నోషధులు, నన్నము మున్నగునవి యీశ్వర రచితములు. వానిని గ్రహించి జీవుడు తన కనుకూలముగా పిండి చేసికొని రొట్టెచేసికొని తినకున్న మనుష్యునకు బదులుగా నీశ్వరు డాపనులు చేయునా? మనుష్యులు తమపనులు తాము చేయకున్న జీవన నిర్వాహ మెట్లు కాగలదు? కావున నాదిసృష్టియందు జీవులకు వలయు శరీరములు వానిమూసలు పరమేశ్వరుడే చేయును. తదుపరి యా శరీరములద్వారా పుత్రాదుల నుత్పన్నముజేయుట జీవుల పనియై యున్నది.

నాస్తికుడు :– పరమాత్మ యనాది, శాశ్వతుడు, చిదానందుడు, జ్ఞానస్వరూపుడు జగద్రచనా ప్రపంచమున, దుఃఖమున బడనేల? సాధారణ మానవుడుకూడ నానందమును వదలి దుఃఖమును గ్రహింపడుగదా? ఈశ్వరు డేల యీగొడవలో బడినాడు?

ఆస్తికుడు :– పరమాత్మ యేప్రపంచమున గాని దుఃఖమున గాని పడడు. తన యానందమును విడువడు. ఏల యన ప్రపంచముననను దుఃఖముననను బడుట యేకదేశియైన వానిపనియగును. కాని సర్వదేశియగు వ్యాపకుని పనికాదు. అనాది, చిదానందుడు, జ్ఞానస్వరూపుడగు పరమేశ్వరుడు జగత్తును రచియింపకున్న నితరు డెవడు రచింపగలడు? జగత్తును రచించు సామర్థ్యము జీవునకు లేదు. అందువలన పరమేశ్వరుడే జగత్తును రచించునని సిద్ధమగుచున్నది. పరమాత్మ పరమాణువులతో సృష్టిని రచించునట్లు తల్లిదండ్రు లను నిమిత్తకారణముతో నుత్పత్తియగు వ్యవస్థకును నియమ మతడే చేసియున్నాడు.

నాస్తికుడు :– ఈశ్వరుడు ముక్తి రూప సుఖమును వదలి జగదుత్పత్తి స్థితి లయరూపమగు గొడవలో నేల పడెను ?

ఆస్తికుడు :– ఈశ్వరుడు సదాముక్తుడు. సాధనములవలన సిద్ధులైన మీతీర్థంకరులవలె నేకదేశమున

నుండు బంధనరూప ముక్తితో గూడినవాడు సనాతన పరమేశ్వరు డెన్నడును గాడు. అతడు తుచ్ఛమగు జగత్తును నిర్మించి పోషించి లయము చేయుచుండియు బంధనమున బడడు. ఏలయన బంధమోక్షములు సాపేక్షితములు, ముక్తి నపేక్షించి బంధము, బంధము నపేక్షించి ముక్తియు నేర్పడును. ఎన్నడు బద్ధుడే కానివాడు ముక్తుడని యెట్లు చెప్పబడగలడు? ఏకదేశియగు జీవుడే బద్ధుడు ముక్తుడు నగుచుండును.

అనంతుడు సర్వదేశియు, సర్వవ్యాపకుడు నగు నీశ్వరుడు బంధనమునందు కాని, నైమిత్తికమగు ముక్తి యందు గాని యెన్నడు జిక్కుకొనడు. అట్లు చిక్కువడుట మీ తీర్థంకరుల పని. ఈశ్వరునిపని కాదు. అతడు సర్వదా ముక్తుడే.

నాస్తికుడు :– భంగుత్రాగువాడు మత్తు ననుభవించునట్లు జీవుడు కర్మఫలములు స్వయముగానే యనుభవించును. కావున నీశ్వరుని పనియేమి?

ఆస్తికుడు :– రాజు లేకున్న బందిపోటుదొంగలు, దొంగలు, లంపటులు, దుష్టులునైనవారు తాము చేసిన దుష్కార్యముల ఫల మనుభవించుటకు స్వయముగా నురికంబము నెక్కుటకు గాని జైలులో బంధింపబడుటకు గాని యెవరు వెళ్ళగోరరు. కాని రాజ్యవ్యవస్థ ననుసరించి బలాత్కారముగా వారిని బట్టుకొని రాజు తగిన దండనము విధించును. అట్లే జీవునకుగూడ నీశ్వరుడు తన న్యాయవ్యవస్థ ననుసరించి స్వస్వ కర్మానుసారము దండనము నొసంగును. ఏల యన నేజీవుడును తనదుష్టకర్మలకు దగినఫలమ్మును స్వయముగా ననుభవింప గోరడు. కావున బరమాత్ముడు న్యాయాధీశుడు కాక తప్పదు.

(ఈశ్వరుడు ఒక్కడు)

నాస్తికుడు :– జగత్తున నీశ్వరు డొక్కడు కాడు, ముక్తజీవు లెల్లరు నీశ్వరులే.

ఆస్తికుడు :– ఈ కథన మంతయు వ్యర్థము. ఏల యన బ్రథమమున బద్ధుడై పిదప ముక్తుడైన వాడు మరల బద్ధు డగును. వీరు స్వాభావిక సదాముక్తులు కారు. మీ తీర్థంకరు లిరువదినలుగురు ప్రథమమున బద్ధులై యుండిరి. తరువాత ముక్తులైరి. కావున మరల వారు బంధనమున బడక తప్పదు. మఱియు జీవులు పలువు రీశ్వరులైన, నిటలోకమున మానవులు జగడ మాడునట్లు లట నీశ్వరులైన జీవులును గలహములాడ దొడగుదురు. కావున ముక్తజీవు లీశ్వరు లగుదురనుట సర్వథా యయుక్తము.

నాస్తికుడు :– ఓ మూర్ఖ! జగత్తునకు గర్తయెవ్వడును లేడు. ఈ జగత్తు స్వయం సిద్ధము.

ఆస్తికుడు :– ఇది జైనులలో గల గొప్ప పొరపాటు. కర్తలేని కర్మకాని, కర్మలేని కార్యము లోకమున నెక్కడైనను జూడనగునా? ఈ విషయము గోధుమలు పండుపొలములో స్వయముగానే పిండి యేర్పడి రొట్టెలు సిద్ధమై జైనుల యుదరమున జేరునని చెప్పినట్లున్నది. దూది స్వయముగా దారములుగా మాఱి, గుడ్డగా సిద్ధమై యంగీలుగా నేర్పడి, యుత్తరీయము, ధోవతిగా గూడ మాఱి యెన్నడైన యెవరికైన లభించునా? ఇట్లు జరుగనపు డీశ్వరు డనుకర్త లేక యీ వివిధరూపమగు జగత్తుకాని నానావిధములగు రచనా విశేషముగాని యెట్లు సిద్ధమగును.

హఠ ధర్మముతో జగత్తు స్వయం సిద్ధమని నమ్ముదువేని పైన జెప్పినట్లు స్వయంసిద్ధములైన వస్త్రములు, నంగీలు, పాగాలు కర్త లేకయే యేర్పడినట్లు ప్రత్యక్షముగా జూపుము. ఇట్లు సిద్ధము చేయలేనపుడు ప్రమాణశూన్యమగు నీమాటను బుద్ధిమంతు డెవడును నంగీకరింప జాలడు.

నాస్తికుడు :– ఈశ్వరుడు విరక్తుడా! మోహితుడా! విరక్తుడైన బ్రపంచ రచనాది క్రియలలో నేల పడును? మోహితుడగునెడల జగత్తును నిర్మించు సామర్థ్య ముండదు.

ఆస్తికుడు :– పరమేశ్వరునందు వైరాగ్యము కాని మోహము కాని యేదియు సంగతము కాదు. సర్వవ్యాపకుడు దేనిని విడువగలడు? దేనిని గ్రహింపగలడు? ఈశ్వరునికంటె నుత్తమమైనది కాని, యప్రాప్తమైనది కాని యేదియు లేదు. కావున నతనికి దేనియందును మోహ ముండదు. వైరాగ్య మోహ ములు జీవునకు గలుగును. ఈశ్వరునకు గలుగవు.

(ఈశ్వరుడు నిర్లిప్తుడు)

నాస్తికుడు :– ఈశ్వరుడు జగత్కర్త యనియు జీవులకు గర్మ ఫలముల నిచ్చువాడనియు నంగీక

రింతువేని యతడు సంసారియై దుఃఖితుడగును.

ఆస్తికుడు :- అనేక విధములగు కర్మలకు గర్తయు, ప్రాణులకు ఫలదాతయు, ధార్మికుడు, న్యాయాధీశుడు, విద్వాంసుడు నగువాడు కర్మలలో జిక్కుపడడు. సంసారియు గాడు. అట్టియెడ ననంత సామర్థ్యముగల పరమేశ్వరుడు ప్రపంచియు దుఃఖితుడు నేల యగును? నీవు నీ యజ్ఞానము వలన నీ వలెను నీ తీర్థంకరుల వలెను బరమేశ్వరుని నెఱుగుచున్నావు. అది నీ యవిద్యా లీల. ఈ యవిద్యాదుః నుండి విడివడ గోరుదు వేని వేదాది సత్యశాస్త్రముల నాశ్రయింపుము. ఎందుకు భ్రమలోబడి చెడిపోవు చున్నావు?

(సంసార మనాది యనంతమా?)

ఇప్పుడు జగత్తును గూర్చి జైనుల మాన్యతను వారి సూత్రముల ననుసరించి వ్రాయుచున్నాము. సంక్షేపముగా మూలార్థమును వ్రాసి తదుపరి వాని సత్యాసత్యములను సమీక్షింతుము.

మూలము :- 'సామి అణాఇ అణన్తే చ ఉ గ ఇ సంసార ఘోర కాంతారే, మోహాఇ కమ్మగురుఠిఇ వివాగవసఉ భమఇ జీవో'

ప్రకరణరత్నాకరము భాగము ౨ 'సమ్యక్త్వప్రకాశము'(౨) ఇది ప్రకరణరత్నాకరము భాగము ౨ నామక గ్రంథమున 'సమ్యక్త్వప్రకాశము' ప్రకరణమున గౌతమ మహావీరుల సంవాదము. దీనికి సంక్షేపముగా నుపయుక్తమగు నర్థమిది. ఈ సంసారము అనాది-అనంతము. దీనికి నుత్పత్తి కాని, వినాశము కాని యెన్నడు జరుగలేదు. కలుగదు. అనగా నీజగత్తు నెవడును జేయలేదు. అదియే ఆస్తిక నాస్తిక సంవాదమున 'ఓమూఢుడా! జగత్తునకు గర్త యెవడును లేడు. ఇది యెన్నడు నిర్మింపబడలేదు. ఎన్నడు నాశము కాదు. అనివ్రాయబడినది.

సమీక్షకుడు :- సంయోగమువలన నేర్పడునది యనాది యనంతము నెన్నడును గాదు. కాజాలదు. లోకమున నుత్పన్నములగు పదార్థము లన్నియు సంయోగజములు. ఉత్పత్తి వినాశము గలవిగా జూడబడు చున్నవి. అట్టియెడ జగత్తు-ఉత్పత్తి వినాశములు కలది యేల కాదు? కావున మీ తీర్థంకరులకు సమ్యగ్ బోధ లేకుండెను. వారికి సమ్యక్ జ్ఞానమున్న నిట్టి యసంభవముల నేల మాటలాడుదురు?

మీ గురువు లెట్టివారో శిష్యులు మీరును నట్టివారే. మీ విషయములను వినువారికి పదార్థ విజ్ఞాన మెన్నడును గలుగ జాలదు. ఉత్పన్న పదార్థము సంయుక్తమై కనబడుచుండ దాని యుత్పత్తి వినాశముల నేల యంగీకరింపరు? అనగా వీరి యాచార్యులకు-జైనులకు భూగోళ ఖగోళ విద్యలు కూడ దెలియ వన్న మాట. మఱియు నిప్పుడును వారియం దీవిద్య లేదు. లేకున్న నిమ్న లిఖితములగు నసంభవ విషయ ముల నేల నమ్ముదురు? చెప్పుదురు?

చూడుడు! ఈ సృష్టియందు, బృథివీకాయము - అనగా బృథివియు జీవుని శరీరము మఱియు జలకాయాది జీవులను గూడ నంగీకరింతురు. దీని నెవరు నంగీకరింప జాల యములను జూడుడు! జైను లేతీర్థంకరులను సమ్యక్ జ్ఞాను లనుచున్నారో వ మిథ్యావిషయముల మాదిరి చూడుడు. రత్నసారము భాగము (౧) పుట ౧ లంగీకరింతురు. ఇది క్రీ.శ.1879 ఏప్రిల్ 28న బనారస్ జైనప్రభాకర ప్రెస్‌ల జేసి ప్రకటించి యున్నాడు. దానియందె ౧౪౨౬వ పేజీలో కాలమును గూర్చి

అనగా సమయమునకు నామము సూక్ష్మకాలము. అసంఖ్యాత సమయ ఒకకోటి యఱువదియేడు లక్షల డెబ్బదివేల రెండువందల పదునాఱు (౧౬ ముహూర్తము' అగును. అట్టి ముప్పది ముహూర్తము లొకదినము. పదునైద

పక్షము లొకమాసము. పంద్రెండు మాసము లొకసంవత్సరము. డెబ్బది లక్షల కోట్ల, యేబదియాఱువేల కోట్ల వర్షము లొక 'పూర్వ' మగును. అట్టి యసంఖ్యాత పూర్వము లొక 'పల్యోపమము' అగును. అసంఖ్యాత మనగా నొక, నాలుగు క్రోసుల చతురస్రము నంతే లోతుగల బావి యొకటిత్రవ్వి దానిలో 'జుగులియా' మనుష్యుని శరీరము యొక్క నిమ్నలిఖిత కేశముల ముక్కలు నింపవలయును. అనగా ప్రస్తుత మనుష్యుని వెంద్రుకకంటె, 'జుగులియా' మనుష్యుని వెంద్రుక నాలుగువేల తొంబదియాఱవ (౪౦౯౬) వంతు సూక్ష్మముగా నుండును. అనగా 'జుగులియా' మనుష్యుల నాలుగువేల తొంబదియాఱు వెంద్రుకలను ప్రోవుచేసిన నవియిన్నియు గలిసి నేటి మనుష్యుని యొక్క వెంద్రుక యగును.

అట్టి 'జుగులియా' మనుష్యులు యొక వెంద్రుక లోని యొక యంగుళభాగపు వెంద్రుకను నేడు మాఱులుగా నెనిమిది దెనిమిది ముక్కలు చేసిన ౨౦౯౭౧౫౨ ఇరువది లక్షల తొంబదియేడువేల నూటయేబది రెండు ముక్కలగును. ఇట్టి ముక్కలతో బూర్వోక్త కూపమును నింపవలయును. ఆ కూపమునుండి నూఱు సంవత్సరముల కొకపర్యాయ మొక్క వెంద్రుక ముక్క తీయవలయును. అందలి వెంద్రుక ముక్కలన్నియు దీయబడి కూపము కాళీయైన నది 'సంఖ్యాతకాలమే' యగును. ఆ ముక్కల నొక్కొక్క దానిని నసంఖ్యాత ఖండములు చేసి యట్టి ఖండములతో నా కూపమును – ఆ బావి మీదుగా జక్రవర్తి రాజుసేన నడచి వెళ్ళినను గ్రుంగిపోని విధముగ నింపవలయును. తదుపరి యాముక్కలనుండి, నూఱు సంవత్సరముల యంతరముతో నొక్కొక్క వెంద్రుకముక్క తీయవలయును. అట్లు తీయగా నాబావి యెప్పుడు ఖాళీయగునో యప్పుడది యొక్క 'అసంఖ్యాతపూర్వ' మగును. అట్టి యసంఖ్యాతము లసంఖ్యాతములైననొక 'పల్యోపమ' కాలమగును. ఈ పల్యోపమకాలమును గూపదృష్టాంతముతో నెఱుగవలయును.

ఇట్టి పదికోట్ల కోట్లు పల్యోపమ కాలము గడచిన నొక సాగరోపమ కాల మగును. దశకోటి కోట్ల సాగరోపమ కాలము గడచిన నొక 'ఉత్సర్పిణీ' కాల మగును. ఒక 'ఉత్సర్పిణీ' యొక 'అవసర్పిణీ' కాలము గడచిన నొక కాలచక్ర మగును. ఇట్టి యనంత కాలచక్రములు గడచిన మీదట నొక 'పుద్గలపరావృత్తము' అగును.

ఇప్పు డీయనంత కాలమని దేని నందురు? సిద్ధాంత పుస్తకములలో నేది తొమ్మిది దృష్టాంతము 'లతో గాలసంఖ్యను లెక్కించిరో దానికి బైన 'అనంతకాలము' అనబడును. ఇట్టి యనంత పుద్గల పరావృత్తముల కాలము జీవునకు భ్రమించుచు గడచి పోయినది.

(కాలగణన అనర్గళము)

సమీక్షకుడు :– గణిత విద్యాభిజ్ఞులార! వినుడు. జైనుల గ్రంథముల కాలసంఖ్యను దెలిసికొనగలరా లేదా? మీరు దీనిని సత్యమని యంగీకరింపగలరా? లేదా? చూడుడు. ఈ తీర్థంకరు లిట్టి గణిత విద్యను జదివి యున్నారు. వీరి మతమున నిట్టి గురుశిష్యు లున్నారు. వీరి యవిద్య కేమైన పారావార మున్నదా?

ఇంకను వీరి యసంభవ విషయములను వినుడు. రత్నసారము ౧వ భాగము (పుట ౧౩౪) ౧౩౪వ పేజీ మొదలు 'బూటాబోల్' అను నది జైనుల సిద్ధాంతగ్రంథము. ఋషభదేవుడు మొదలు మహావీరుని వఱకుగల ౨౪ తీర్థంకరుల వచన సారసంగ్రహము–వఱకు గల గ్రంథములలో నెన్నియో యసంభవ విషయములు చూడనగును.

రత్నసారము భాగము (౧)లో ౧౪౭ పుటలో నిట్లు వ్రాయబడి యున్నది.

'పృథివీకాయజీవుడు' మట్టి, రాయి మున్నగునవి పృథివీ భేదములను నెఱుగవలయును. వానిలో నుండు జీవుల శరీర పరిమాణము నొక యంగుళము యొక్క యసంఖ్యాత భాగముగ నెఱుగవలయును.

అనగా నత్యంత సూక్ష్మమై యుండును. వారి యాయువు పరిమాణ మెక్కువలో నెక్కువ యిరువది రెండువేల వర్ష పర్యంత ముండును.

రత్నసారము (భాగము ౧) పుట ౧౪౯. వనస్పతియొక్క శరీరమునందు ననంత జీవు లుండును. కందమూల ప్రముఖములు, ననంతకాయ ప్రముఖములు ననువాని సాధారణ వనస్పతులందురు. వానిని సాధారణ వనస్పతి జీవులనవలయును. వాని యాయుః ప్రమాణము 'అనంత ముహూర్తము' లగును. కాని, యిక్కడ బూర్వోక్త ముహూర్తములుగా నెఱుగవలయును.

మఱియు నొకశరీరమున నొక్క స్పర్శేంద్రియముగల జీవు డొక్కడే యుండును. దానిని బ్రత్యేక వనస్పతి యందురు. వాని దేహమాన మొక సహస్రయోజనములు. అనగా బురాణముల యోజనము నాలుగు క్రోసులు. జైనుల యోజనము ౧౦౦౦౦ దశసహస్ర క్రోసుల పరిమితి యుండును. అట్టి నాలుగువేల యోజనముల పరిమాణము వాని శరీరముండును. వాని యాయుఃప్రమాణము పది సహస్ర వర్షములు.

ఇప్పుడు రెండింద్రియములు గల జీవులు. వానికి ముఖము, శరీరము నుండును. శంఖము, గవ్వ, పేలు మున్నగునవి యీతరగతిలోనివి. వాని దేహమాన మెక్కువలో నెక్కువ నలువది యెనిమిది క్రోసు లుండును. వాని యాయుమాన మెక్కువలో నెక్కువ పంద్రెండు వర్షములే యుండును.

సమీక్షకుడు :- ఇక్కడ జాల మఱచినాడు. ఏలయన నింత పెద్ద శరీరమునకు నాయువుకూడ నధికముగా వ్రాయవలసినది. నలువది యెనిమిది క్రోసుల స్థూలమైన పేను జైనుల శరీరమున నేర్పడు చుండును. వారు చూచి యుందురు కూడ. ఇంత పెద్ద పేనును జూచు భాగ్య మితరుల కెక్కడిది? చూడుడు! ఎంతటి ఘోరాంధకారమో!

'రత్నసారము భాగ. ౧.౧౫౦ పేజీలో తేలు, ఈగ మున్నగునవి యొక యోజనము. పొడవైన శరీరము గలిగి యుండును. వాని యాయుమాన మెక్కువలో నెక్కువ యాఱుమాసములు అని యున్నది.

సమీక్షకుడు :- సోదరులార! చూడుడు! నాలుగు నాలుగు క్రోసుల పరిమాణముగల తేళ్ళ నెవరు చూచి యుండరు. ఎనిమిది మైళ్ళ పొడవుగల తేలు, ఈగ జైనుల మతమున నుండవచ్చును. వారే చూచి యుందురు. మఱియెవరును జూచియుండరు. అట్టి తేలు-ఏజైనుని నైన గుట్టిన నతని స్థితి యేమగునో!

జలములోనుండు చేపలు మున్నగునవికూడ నొకసహస్ర యోజనములు (౧౦౦౦) క్రోసు లొక్క యోజన పరిమాణమయిన ౧౦౦౦౦౦౦౦ ఒక్క కోటి క్రోసుల శరీరములు గలిగి యుండునట. వీని యాయు వొకకోటి పూర్వవర్షము లుండునట.

సమీక్షకుడు :- ఇంతటి స్థూల శరీరములుగల జలచరముల జైనులే చూచి యుందురు.

మఱియు నేనుగు మున్నగు చతుష్పాత్తుల దేహమానము రెండు క్రోసులు మొదలు క్రోసుల పర్యంతము, నాయుమాన మెనుబది నాలుగు వేల వర్షముల వఱకు వ్రాయబడియున్న

సమీక్ష :- ఇంత పెద్ద పరిమాణముగల జంతువులను జైనులే చూచి యుందురు. వారే ఒ తురు. మఱి యే బుద్ధిమంతుడును నంగీకరింపడు.

'రత్నసారము-భా. ౧ పుట. ౧౫౧ జలచర గర్భజ జీవుల శరీర పరిమాణ మొక సహస్ర ములు. అనగా ౧,౦౦,౦౦౦,౦౦ ఒక కోటి క్రోసులుండును. ఆయుమాన మొకకోటి పూర్వవర్ష

సమీక్ష :- ఇంత పరిమాణముగల శరీరములను జైనుల గురువులు ఆచార్యులు స్వప్నము యుందురు. ఎన్నడు సంభవము కాని యిట్టి మాటలు మహామూఢులవి కాక మఱి యేమగును?

ఇప్పు డికభూమి పరిమాణమును వినుడు. రత్నసారము భా. ౧ పుట. ౧౫౨. ఈ పంకరగా నడ్డముగా నున్న లోకమున నసంఖ్యాక ద్వీపములు నసంఖ్యాత సముద్రములు నున్నవి. ఈ యసంఖ్యాతముల ప్రమాణము - రెండున్నర సాగరోపమ కాలమున నెంత సమయ ముండునో యన్ని ద్వీపములను, సముద్రములను నెఱుగవలయును.

ఇప్పు డీ పృథివియందు నొక జంబూద్వీపము ప్రథమమున నన్ని ద్వీపములకు మధ్య నున్నది. దీని ప్రమాణ మొక్క లక్ష యోజనములు. అనగా నొక్క యర్బుద సంఖ్య క్రోసులు. దీనికి నాలుగు వైపుల లవణ సముద్ర మున్నది. దాని ప్రమాణము రెండు లక్షల యోజనములు. అనగా రెండర్బుదముల క్రోసులు. ఈ జంబూద్వీపమునకు నలువైపుల 'ధాతకీ ఖండ' మను ద్వీప మున్నది. దాని ప్రమాణము నాలుగు లక్షల యోజనములు. అనగా నాలుగర్బుదముల క్రోసులు. మఱియు దానివెనుక కాలోదధి సముద్ర మున్నది. దాని ప్రమాణ మెనిమిది లక్షల యోజనములు-ఎనిమిదర్బుదముల క్రోసులు. దానికి వెనుక పుష్కరావర్తద్వీప మున్నది. దాని ప్రమాణము పదునాఱు లక్షల యోజనములు = పదునా ఱర్బుదముల క్రోసులు. ఆ ద్వీపములోపల 'కోరా' లున్నవి. ఆ ద్వీపములో సగభాగమున మనుష్యులు నివసింతురు. దాని కవతల నసంఖ్యాత ద్వీపములు సముద్రము లున్నవి. వానిలో దిర్యగ్యోనులు జీవు లున్నవి. ప్రాకులాడు జీవు లున్నవి.

రత్నసారము భా. ౧ పుట ౧౫౩. జంబూద్వీపమున నొక హిమవంతము, ఒక ఐరణ్యవంతము, ఒకహరివర్షము, ఒకరమ్యకము, ఒకదేవకురువు, ఒక ఉత్తరకురువు ననునాఱు క్షేత్రములున్నవి.

సమీక్ష :- భూగోలవిద్య నెఱుగు విద్వాంసులారా! వినుడు. భూగోళ పరిమాణ విషయమున మీరు పొరపడితిరా? లేక జైనులా? జైనులు పొరపడిన వారికి మీరు బోధించుడు. మీరు పొరపడి యున్నచో వారినుండి మీరు నేర్చుకొనుడు.

భళిరే! ఇట్టి యవిద్వాంసులగు పురుషులు జగత్తు-అకర్తృకము-జగత్తునకు గర్తలేడు. ఈశ్వరుడు లేడు అని యంగీకరించిన నాశ్చర్య పడవలసిన దేమున్నది? అందువలననే జైనులు తమ గ్రంథములను విద్వాంసులైన యితర మతముల వారికి జూపరు. ఏలయన వీరు తీర్థంకరులచే వ్రాయబడి ప్రామాణికము లని యెంచు సిద్ధాంత గ్రంథములందు నిట్టి యవిద్యాయుక్త విషయము లెన్నియో నిండియున్నవి. కావున వానిని జూడనీయరు. ఇతరులు చూచిన వానిలోని పొల్లు (అసారత) బయట బడును. జైనులు తప్ప యితరు లేకొంచెము బుద్ధి కలవాడైనను నెన్నడు నిట్టి గప్పాధ్యాయములను సత్యములని నమ్మడు.

జగత్తు-అనాది యని యంగీకరించుటకు గాను జైను లీ మిథ్యా ప్రపంచము నంతటిని గల్పించిరి. కాని యిది పచ్చి యబద్ధము. సుతరామసత్యము. కాని, జగత్తునకు గారణ మనాది. ఏలయన నవి పరమాణువులు మున్నగునవి తత్త్వస్వరూపము లకర్తృకములు. కాని, వానిలో నియమ పూర్వకముగ నొకవస్తువుగ సిద్ధ మగుటకు గాని, నశించుటకుగాని సామర్థ్య మొండును లేదు. కారణమేమన పరమాణుద్రవ్య మొకదానికి వేరు. పరమాణువులు స్వభావముతో నొకదాని కొకటి భిన్నరూపములు గలవి జడములును. అవి తమంత దాము తగిన విధమున గలియ జాలవు. కావున నియమబద్ధముగా వీనిని గలిపి వస్తు నిర్మాణము జేయుకర్త యొక డుండక తప్పదు. అతడు జ్ఞానస్వరూపుడు.

చూడుడు! పృథివి సూర్యుడు మున్నగు లోకములను నియమము నందుంచుట-అనాది, యనంత, చేతన పరమాత్మ కార్యమై యున్నది. సంయోగరూపమగు విశేషరచనగల స్థూలజగత్తు-ఎన్నడు ననాది కాజాలదు. కార్య జగత్తు నిత్యమని యంగీకరించిన దానికి గారణ ముండజాలదు. కాని యదియే కార్యకారణ రూపమగు నందురేని తనకార్యము కారణము తానే యగుటవలన నన్యోన్యాశ్రయ దోషము, నాత్మాశ్రయ

దోషము నగును. కావున జగత్కర్తను దప్పక యంగీకరింపవలయును.

(కర్తకుగర్త కారణమునకు గారణము నుండదు.)

ప్రశ్న :- ఈశ్వరుడు జగత్తునకు గర్తయందురేని యీశ్వరునకు గర్తయెవరు?

ఉత్తరము :- కర్తకు గర్త కాని, కారణమునకు గారణము కాని యుండవు. ప్రథమమున గర్త, కారణము రెండు నున్నపుడే కార్యమేర్పడును. దేనియందు సంయోగము వియోగము నుండదో, యేది ప్రథమ సంయోగ వియోగమునకు గారణమో దానికి కర్త కాని, కారణము కాని యేవిధముగను నుండజాలదు. దీని విశేషవ్యాఖ్యాన మెనిమిదవ సముల్లాసమున సృష్టివ్యాఖ్యలో వ్రాయబడినది. అట జూడవచ్చును.

ఈ జైనులకు స్థూలవిషయము కూడ సరిగా దెలియదు. అట్టియెడ మిక్కిలి సూక్ష్మమగు సృష్టి విద్యా సంబంధజ్ఞాన మెట్లు కలుగును? కావున జైనులు సృష్టిని-అనాది యనంతముగా నంగీకరించుచున్నం దున వారు ద్రవ్యపర్యాయములను గూడ ననాది యనంతముగా నంగీకరించుచున్నారు. మఱియు ప్రతి గుణము ప్రతిదేశమునందును బర్యాయములు, ప్రతివస్తువు నందును ననంతపర్యాయముల నంగీకరించుచు న్నారు. ఇది ప్రకరణ రత్నాకరపు ప్రథమభాగమున వ్రాయబడి యున్నది.

ఈ విషయముకూడ నెన్నడు సంగతము కాదు. ఏలయన వేనికి నంతము-మర్యాద యుండునో వానికి సంబంధించిన వన్నియు నంతము గలవి-సాంతములే యగును. అనంతము నసంఖ్య మనుటయు దగదు. కాని, జీవాపేక్షతో నిది సంగత మగును. పరమేశ్వరుని విషయమున గాదు. కారణమేమన నొక్కొక్క ద్రవ్యమునందును దనతన యొక్కొక్క కార్యకారణ సామర్థ్యమును నవిభాగ పర్యాయములవలన ననంత సామర్థ్యము నంగీకరించుట కేవల మవిద్యావిషయ మగును.

ఒక పరమాణు ద్రవ్యమునకు సీమ యున్నపుడు దానియందు ననంత విభాగరూప పర్యాయము లెట్లుండగలవు? అట్లే యొక్కొక్క ద్రవ్యమునందు ననంతగుణము లొక్కొక్క గుణప్రదేశమందు నవి భాగ రూపములగు ననంత పర్యాయములను గూడ ననంతములుగా నంగీకరించుట కేవలము పిల్లతనపు విషయమగును. కారణమేమన దేని యధికరణమున కంత ముండునో దానిలో నుండువానికంతమేల యుండదు? ఇట్టివే యనేకములైన పెద్దపెద్ద విషయములు వ్రాయబడియున్నవి.

(జడపుద్గలము-పాపపుణ్యములు)

జీవుడు, అజీవుడు, నను నీ రెండు పదార్థముల విషయమున జైనుల నిశ్చయ మిట్లున్నది.

**"చేతనాలక్షణో జీవః స్యాదజీవస్తదన్యకః**
**సత్కర్మపుద్గలాః పుణ్యం పాపం తస్య విపర్యయః"** **(ఆర్హత దర్శనము ప్రష్ఠ. ౫౮)**

ఇది జినదత్తసూరి వచనము. ఇదియే ప్రకరణ రత్నాకరము ప్రథమభాగమున నయచక్రసారమునను వ్రాయబడియున్నది. చేతనాలక్షణము జీవుడు. చేతనారహిత మజీవము-జడము. సత్కర్మరూప పుద్గ లము పుణ్యమును పాపకర్మరూప పుద్గలము పాపమును జేయించును.

సమీక్ష :- జీవ, జడలక్షణము సరిగానే యున్నది. కాని జడరూపములగు పుద్గలములు పాపపుణ్య యుక్తము లెన్నడును గాజాలవు. కారణమేమన బాపపుణ్యములు చేయు స్వభావము జీవుని యందు- చేతనమందున్నది. చూడుడు, ఈ జడపదార్థము లన్నియు బాపపుణ్య రహితములు. జీవు లనాదు లను చున్నారు. అది యుక్తమే కాని, యాయల్పుడు నల్పజ్ఞుడు నైన జీవుని ముక్తిదశయందు సర్వజ్ఞుడని యంగీ కరించుట యసత్యము. కారణమేమన నల్పుడు, నల్పజ్ఞుడు నగువాని సామర్థ్యము సర్వదా ససీమమే యగును.

(జగత్తు, జీవ కర్మలు, బంధము-అనాదులు కావు)

జైనులు, జగత్తును, జీవుని, జీవుని కర్మలను బంధమును ననాది యనుచున్నారు. ఇక్కడను జైనుల తీర్థంకరులు పప్పులో గాలు వేసిరి. కారణమేమన సంయుక్త జగత్తునకు గార్యకారణములు, ప్రవాహముతో గార్యము, జీవుని కర్మలు, బంధము నన్నియు బ్రవాహముతో ననాదులు కాని స్వరూపముతోగాదు. స్వరూపముతో గర్మలు, బంధము ననాదులని యంగీకరింతురేని కర్మలనుండి, బంధమునుండి విడిపోవుట నెట్లంగీకరించుచున్నారు? అనాది పదార్థము విడువదు కదా!

అనాది పదార్థమునకును నాశము నంగీకరింతువేని నీ వంగీకరించు ననాది పదార్థముల కన్నింటికి నాశప్రసంగము కలుగును. మఱియు నప్పుడే సర్వకర్మముల నాశప్రసంగము కలుగును. మఱి యనాది నిత్యమగు నందువేని, కర్మము బంధము కూడ నిత్యము లగును. సర్వకర్మలు విడిపోవుటవలన ముక్తి కలుగునని యంగీకరింతువేని సర్వకర్మనాశరూపమే ముక్తికి నిమిత్తమగును. అప్పుడు ముక్తి నైమిత్తికమగును. అప్పుడు ముక్తి యెల్లపుడు నుండజాలదు. అనగా ననిత్య మగును.

మఱియు గర్మలకు గర్తకు నిత్యసంబంధ ముండుటవలన గర్మలు కూడ నెన్నడు వదలవు. మఱి మీరు మీ ముక్తి, తీర్థంకరుల ముక్తి నిత్యమనుచున్నారు. అది యెట్లు పొసగును?

(సాధనసాధ్యముక్తి నిత్యముకాదు.)

ధాన్యపుపొట్టు తీసివేసినను, ధాన్యముతో నగ్నిసంయోగము కలిగినను, నాధాన్య మంకురింపదు. అట్లే ముక్తి నొందిన జీవుడు మరల జన్మమరణరూప సంసారమునకు రాడు.

ఉత్తరము :- జీవునకు గర్మలకుగల సంబంధము వరివిత్తనమునకు పొట్టుకు నున్న సంబంధము వంటిది కాదు. జీవకర్మల సంబంధము సమవాయము. కావున ననాది కాలము నుండి జీవునకు గర్మలకు, గర్తృత్వశక్తికి సంబంధ మున్నది. జీవునిలో గర్మచేయు శక్తికి నభావము నంగీకరింతువేని జీవులెల్లరు బాషాణమువంటి వారగుదురు. ముక్తి ననుభవించు శక్తియు నుండదు.

అనాది కాలపు గర్మబంధనము వదలి జీవుడు ముక్తుడైన మీ నిత్యముక్తినుండియు విడివడి బంధనమున బడును. ఏలయన గర్మరూప ముక్తి సాధనములనుండి విడివడి ముక్తుడనుట నెట్లంగీకరించుచున్నావో యట్లే నిత్యముక్తి నుండి విడివడి బంధనమున బడును.

సాధనమువలన సిద్ధించునది నిత్య మెన్నడును గాదు. మఱి సాధనసిద్ధి లేకయే ముక్తి నంగీకరింతువేని కర్మలు లేకయే బంధనము ప్రాప్తించును. వస్త్రములందు మైల యేర్పడును. ఉతికిన విడిపోవును. మరల మలిన మేర్పడును. అట్లే మిథ్యాత్వాది హేతువుల వలన రాగద్వేషాదుల కాశ్రయ మగుటంబట్టి జీవునకు గర్మరూపఫల మంటును.

మఱియు సమ్యక్ జ్ఞాన దర్శనము చరిత్రము వలన నిర్మలు డగు వానికి మల మేర్పడు కారణముల వలన మలమేర్పడుట నంగీకరింతువేని ముక్తజీవుడు సంసారి యగుటయు, సంసారి జీవుడు ముక్తుడగుటయు నంగీకరింపక తప్పదు. ఏలయన నిమిత్తములవలన మలినత నశించునట్లు నిమిత్తములవలన మలినత యేర్పడునుగూడ. కావున జీవునకు ముక్తి, బంధనము ప్రవాహరూపమున ననాది యని యంగీకరింపుము. అనాది, యనంతు డగుటవలన గాదు.

ప్రశ్న :- జీవు డెన్నడు నిర్మలుడు కాడు. మలినముతో గూడినవాడే.

ఉత్తరము :- ఎన్నడు నిర్మలుడు కాకున్న నిర్మలుడు కాలేడు కూడ. శుద్ధవస్త్రమున మైల యంటిన నుతికినచో బోవును. వస్త్రముయొక్క స్వాభావికమైన తెలుపురంగును విడిపింప జాలము. మైల మరల వస్త్రమున నంటవచ్చును. ఇట్లే ముక్తియందును నంటును.

ప్రశ్న :– జీవుడు పూర్వోపార్జిత కర్మలవలననే శరీరధారణము చేయును. ఈశ్వరు నంగీకరింపనేల?

ఉత్తరము :– కేవలము కర్మము శరీరధారణమునకు నిమిత్తమై, యీశ్వరుడు కాకున్నచో జీవుడు బహుదుఃఖముల ననుభవింపవలసిన చెడ్డజన్మము నెన్నడు ధరింపడు. ఎల్లప్పుడు మంచిమంచి జన్మములే ధరించును. కర్మలు ప్రతిబంధకము అగు నని నను దొంగ స్వయముగా వెళ్ళి జైలులో గూర్చుండనట్లు, స్వయముగా నొక దురికంబము నెక్కనట్లు, జీవుడు స్వయముగా జెడ్డజన్మ నంగీకరింపడు. చోరాదులు రాజవ్యవస్థకు లోనై దండనము ననుభవించునట్లు లీశ్వరుడు జీవునిచే గర్మఫలముల ననుభవింప జేయునని మీరును నంగీకరింపుడు.

ప్రశ్న :– మదము-మత్తువలె గర్మఫలము స్వయముగానే ప్రాప్తమగును. కర్మఫలము నిచ్చుటకు మఱి యొకని యావశ్యకత లేదు.

ఉత్తరము :– అటులైన నిత్యము మద్యపానము చేయువారికి మత్తు తక్కువ కలుగును. అభ్యాస మెక్కుడైన కొలది మత్తు తక్కువ గలుగును. క్రొత్తగా మద్యము సేవించినవానికి నధికముగా మత్తు కలుగును. అట్లే నిత్యము పాపము అధికమొనర్చువారికి దక్కువ దుఃఖఫలము, నెప్పుడైన జిన్నపాపము చేయువారికి నెక్కుడు దుఃఖము కలుగునని యంగీకరింప వలసి వచ్చును. దీనింబట్టి తక్కువ కర్మల నొనర్చువారి కెక్కుడు ఫలము కూడ లభించును.

ప్రశ్న :– ఎవని స్వభావ మెట్లుండునో యట్లే ఫలము లభించును.

ఉత్తరము :– స్వభావమువలన ఫలము లభించు నెడల నది విడిపోవుట కాని, లభించుట కాని కలుగ నేరదు. కావున నది సరికాదు. శుద్ధవస్త్రమున నిమిత్తముల ద్వారా మైల యేర్పడును. నిమిత్తముల ద్వారా దానిని విడిపింప వచ్చును. కావున ఫలము నైమిత్తిక మని యంగీకరించుట యుచితము.

ప్రశ్న :– సంయోగము లేక కర్మ పరిణామమును బొందదు. పాలు పులుపు సంయోగము కలుగక పెరుగు కాదు. ఇట్లే జీవ కర్మముల సంయోగమువలన గర్మ పరిణమించును.

ఉత్తరము :– దుగ్ధమున బులుసు కలుపువాడు మూడవవ్యక్తి యున్నట్లు జీవులకు గర్మ ఫలములతో సంయుక్తము చేయు నీశ్వరుడు మూడవ వాడుండుట యావశ్యకము. కారణమేమన జడపదార్థములు నియమముతో స్వయముగ సంయుక్తములు కానేరవు. జీవుడును నల్పజ్ఞుడగుటచే స్వయముగ దన కర్మ ఫలములను బొందనేరడు. దీనిం బట్టి యీశ్వర కల్పిత సృష్టిక్రమము లేనిది కర్మఫల వ్యవస్థయు నేర్పడ జాలదు.

ప్రశ్న :– కర్మల నుండి ముక్తుడైనవాడే యీశ్వరు డగును.

ఉత్తరము :– అనాది కాలమునుండి జీవునకు గర్మలతో సంబంధమున్నపుడు వానినుండి జీవు డెన్నడు ముక్తుడు కాలేడు.

ప్రశ్న :– కర్మబంధము సాది–ఆదికలది.

ఉత్తరము :– కర్మబంధము సాది యగునెడల గర్మయోగ మనాది యెట్లగును? సంయోగమునకు ముందు జీవుడు నిష్కర్మి–కర్మ లేనివాడగును.

మఱియు గర్మలేని జీవునకు గర్మ లగ్నమైనది. అట్లే ముక్తులకును గర్మము లగ్నము కావచ్చును. ఇంతేకాక, కర్మకు కర్తకు సమవాయ సంబంధము–నిత్యసంబంధము. ఇది యెన్నడు విడిపోదు. కావున మేము తొమ్మిదవ సముల్లాసమున వ్రాసినట్లే యంగీకరింపక తప్పదు.

జీవుడు తన యిష్టము వచ్చినట్లు, తన జ్ఞానమును, సామర్థ్యము నెంతగా బెంపు జేసికొనినను నతడు పరిమిత జ్ఞాన సామర్థ్యములు కలవాడే యగును. ఈశ్వరునితో సమాను డెన్నడు గాడు. ఎంత సామర్థ్యము

పెరుగుట యుచితమో యంత యోగమువలన బెంపు చేసికొన గలుగును.

(జీవ పరిమాణము)

జైనులలో నార్హతులు దేహముల పరిమాణ మెంత యుండునో జీవుల పరిమాణము నంతయే యుండునని యంగీకరింతురు. వారి నడుగ వలయును. "చీమలో నున్న జీవుడు నేనుగునందును, నేనుగు నందుండు జీవుడు చీమయందును నెట్టు లిముడును?" ఇట్లంగీకరించుటయు మూర్ఖతయే యగును. కారణ మేమన- జీవుడు సూక్ష్మపదార్థము. అతడొక పరమాణువు నందును నిముడును. ఉండ గలడు. కాని యతని శక్తులు శరీరమునందు ప్రాణములు, విద్యుత్తు, నాడులు మున్నగు వానిద్వారా సంయుక్తములై యుండును. వానివలన శరీరమునం దంతట జరుగు స్థితిగతులను దెలిసికొనును. మంచివారి సాంగత్యము వలన మంచివాడు, చెడ్డవారి సాంగత్యమున జెడ్డవాడు నగును.

ఇప్పుడు జైను లంగీకరించు ధర్మవిధమును వ్రాయుచున్నాము.

మూలము :- "రే జీవ భవ దుహో ఇక్కం చియ హరఇ జిణమయం ధమ్మం, ఇయరాణం పణమంతో సుహ కయ్యే మూఢ ముసిఓసి.

ప్రకరణరత్నాకరము భా, ౨. షష్ఠీశతక. ౬౧. సూ. (౩) సంక్షేపార్థము :- ఓ జీవ! ఒక్క జినమతమే వీత రాగ భాషిత ధర్మము. సంసారమునకు సంబంధించిన జన్మ మరణాది దుఃఖములను హరించు కర్తయై యున్నది. ఇట్లు సుదేవులు, సుగురువులు కూడ జైనులను దెలిసికొనవలయును. వీతరాగులైన ఋషభ దేవుడు మొదలు మహావీరునివఱకు గల వీతరాగులకంటె భిన్నులైన హరి, హరుడు, బ్రహ్మ మున్నగు కుదేవులను దమ కల్యాణకరులని వారిని బూజించు మనుష్యులు వంచింపబడిరని యెంచవలయును.

జైనమతమునకు సంబంధించిన సుదేవులు సుగురువులు, సుధర్మమును విడిచి యితర మతము లకు సంబంధించిన కుదేవులు, కుగురువులు, కుధర్మమును సేవించినను బూజించినను గొంచెముకూడ మేలు కలుగనేరదని దీనిభావము.

సమీక్షకుడు :- జైనుల ధర్మగ్రంథము లెంతటి నిందాయుక్తములో దీనింబట్టి విద్వాంసులు విచారిం పవలయును.

మూలము :- 'అరిహం దేవో సుగురూ సుద్ధం ధమ్మంచ పంచ నవకారో, ధన్నాణం కయచ్ఛాణం నిరంతరం వసఇ హియయమ్మి. ప్రక. ర. భా. ౨. ష. ౬౧, సూ. ౧.

సం. అర్థము :- అరి హన్ దేవేంద్రకృత పూజాదులకు యోగ్యమగు పదార్థ ముత్తమమైన దేదియు లేదు. ఇట్లు దేవులకు దేవుడు శోభాయ మానుడు, అరి హంతదేవుడు జ్ఞానక్రియావంతుడు. శాస్త్రముల యుపదేష్ట శుద్ధకషాయ మలరహిత సమ్యక్త్వ వినయ దయామూలమగు శ్రీ జిన భాషిత ధర్మమే దుర్గతి యందు బడు ప్రాణుల నుద్ధరించునది. ఇతర హరిహరాదుల ధర్మము సంసారమునుండి యుద్ధరించునది కాదు. మఱియు బంచ అరిహంతాదికులు, పరమేష్ఠి, తత్సంబంధులు, వారికి నమస్కారము నను నీనాలుగు పదార్థములు ధన్యములు. అనగా- దయ, క్షమ, సమ్యక్త్వ జ్ఞానము, దర్శనము, చారిత్రము నను నీయైదును జైనుల ధర్మము.

సమీక్షకుడు :- మనుష్యులైనవారి యందఱపై జూపని దయ దయ కాదు. క్షమయు గాదు. జ్ఞానము నకు బదులుగా నజ్ఞానము, దర్శనమునకు మారుగా నంధకారము, చారిత్రమునకు బదులుగా నాకలితో జచ్చుట యేమి మంచివిషయము?

దయ, క్షమ, మంచివైనప్పటికి నవి పక్షపాత యుక్తములైనచో దయ యదయ యగును. క్షమ యక్షమ యగును. ఏ జీవునకు దుఃఖము కలిగింపకుండుటయే దీని ప్రయోజనము. ఈ విషయము

సర్వథా సంభవము కాజాలదు. ఏలయన -దుష్టులను దండించుటయు దయయందే గణనీయము. ఒక్క దుష్టుని దండింపకున్న నతడు వేలకొలది వ్యక్తులకు దుఃఖము కలిగించును. కావున నట్టిదయ దయకాదు. క్షమ క్షమయు గాదు.

సర్వప్రాణులకు దుఃఖము నాశము కలిగించి సుఖమును జేకూర్చు నుపాయ మొనర్చుటయే దయ యనబడుట సరియగును. కేవలము జలము వడపోసి త్రాగుట, క్షుద్రజంతువులను రక్షించుటయే దయ కాదు. కాని, యిట్టి దయను గూర్చి జైనులు చెప్పుదురే కాని యట్లు వారు వర్తింపరు. మనుష్యు లే మతము నకు జెందినవారైనను వారికి దయతో నన్నపానాదుల నొసంగి సత్కరించుట, యితరమత విద్వాంసులను గౌరవించుట వారికి సేవచేయుట దయ కాదా?

ఒకటి – పరమతముల స్తుతి – అనగా నితరములలోని గుణముల నెన్నడు గీర్తింపకు.

రెండవది – వారికి నమస్కారము చేయరాదు.

మూడవది – ఆలపనము – ఇతర మతస్థులతో దక్కువ మాటలాడుము. నాల్గవది – సంలపనము – వారితో బలుమాఱులు మాటలాడరాదు. ఐదవది – వారికి నన్నవస్త్రాదుల దానము చేయరాదు. ఆఱ వది – గంధపుష్పాదుల దానము. ఇతర మతస్థుల మూర్తులను బూజించుటకు బుష్పాదుల నీయరాదు. ఈ యాఱు 'యతనా' పైనజెప్పిన యాఱు విధములగు కర్మలు జైనులెన్నడు జేయరాదు.

సమీక్షకుడు :– ఈ జైనులకితర మతముల వారిపై నెంత యదయ, కుదృష్టి, ద్వేషము నున్నదో దీనింబట్టి విద్వాంసులు విచారింపవచ్చును. అన్యమతస్థులైన మనుష్యులమీద నింతటి యదయయున్న జైనులను దయాహీను లనుట సంభవమే యగును. తన వారికే సేవ జేయుట విశేష ధర్మము కాదు. వారి మతస్థులు వారి యింటికి సంబంధించినవారే యగుదురు. కావున వారికి సేవ చేయుదురు. ఇతరులకు జేయరు. అట్టియెడ దయావంతు లని యెవరందురు?

వివేకసారము, పృష్ఠ. ౧౦౮లో నిట్లు వ్రాయబడి యున్నది. 'మధురానగరపు రాజమంత్రి నముచి యను వానిని జైనయతులు తమ విరోధిగా నెంచి చంపివేసిరి. తదుపరి 'ఆలోయణ' జేసి శుద్ధులైరి."

సమీక్ష :– ఇది దయను, క్షమను నశింపజేయు కర్మము కాదా? ఇతర మతములవారి ప్రాణములు తీయునంతటి వైరబుద్ధిగల జైనులను దయాళువులనుటకంటె హింసకులనుట సార్థకమగును.

ఇప్పుడిక సమ్యక్త్వ దర్శనాది లక్షణములు. ఆర్హత ప్రవచన సంగ్రహము. పరమాగమన సారమునందు జెప్పబడినది. "సమ్యక్ శ్రద్ధానము, సమ్యక్ దర్శనము, జ్ఞానము, చారిత్రము నను నీనాలుగు మోక్షమార్గము నకు సాధనములు." వీనికి వ్యాఖ్యానము యోగదేవుడు చేసియున్నాడు.

"ఏరూపమున జీవాది పదార్థము లవస్థితములై యున్నవో యారూపముతోనే జినప్రతిపాదిత గ్రంథానుసారముగ విపరీతాభినివేశాది రహితమైన శ్రద్ధ–అనగా జినమతమున నుండుప్రీతి 'సమ్యక్ శ్రద్ధాన్' 'సమ్యక్ దర్శన' మనబడును.

"రుచిర్ జినోక్తతత్త్వేషు సమ్యక్ శ్రద్ధానముచ్యతే." (ఆర్హతదర్శనము. పుట. ౬౨)

'జినోక్తతత్త్వములందు సమ్యక్ శ్రద్ధ యుంచవలయును. అనగా నన్యత్ర యెక్కడ నుంచరాదు.'

"యథావస్థిత తత్త్వానాం సంక్షేపాద్ విస్తరేణ వా
యోఽవబోధ స్తమత్రాహుః సమ్యక్ జ్ఞానం మనీషిణః" (ఆర్హతదర్శన. పు. ౬౨)

జీవాది తత్త్వము లెట్లున్నవో వానిని సంక్షేపముగానో విస్తారముగానో కలుగుబోధను సమ్యక్ జ్ఞాన మని బుద్ధిమంతులు చెప్పుదురు.

"సర్వథాఽవద్యయోగానాం త్యాగశ్చారిత్రముచ్యతే, కీర్తితం తదహింసాది
వ్రతభేదేన పంచధా అహింసాసూనృతాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాః!!" (ఆ.ద.పుట. ౬౫)

సర్వవిధముల నిందనీయమగు నన్యమత సంబంధ త్యాగము చారిత్ర మనబడును. అహింసాది భేదములతో నైదు విధములగు వ్రతములు.

(౧) అహింసా :- ప్రాణిమాత్రమును జంపకుండుట.

(౨) సూనృతా :- ప్రియమగు వాణిని బ్రయోగించుట.

(౩) అస్తేయము :- చౌర్యము చేయకుండుట.

(౪) బ్రహ్మచర్యము :- ఉపస్థేంద్రియ సంయమనము.

(౫) అపరిగ్రహము :- సర్వవస్తువులను ద్యజించుట.

సమీక్షకుడు :- వీనిలో నెక్కువ విషయములు మంచివే హింస చేయకుండుట, నిందనీయ కర్మలు చేయకుండుట మంచివిషయములే. కాని యివి యన్నియు బరమతమును నిందించుట యను దోషముతో గూడి మంచివిషయములు కూడ దోషయుక్తము లైనవి. ప్రథమసూత్రమున వ్రాసిన "అన్యహరిహరాదుల ధర్మము సంసారమునుండి యుద్ధరించునది కాదు" అను విషయము చిన్ననిందయా! ఎవరి గ్రంథములను జూచుటవలన నేపూర్ణ విద్య, ధార్మికత పొందబడుచున్నదో యట్టివానిని నిందించుటయు, బూర్వము వ్రాసినట్లు తమ మిక్కిలి యసంభవములైన విషయములను జెప్పు తీర్థంకరులను స్తుతించుటయు గేవలము దురాగ్రహమునకు జెందిన విషయములు.

## జైనమత ధర్మప్రశంస.

**మూలము :- జఇన కుణసి తవ చరణం న పఢసి న గుణేసి దేసినో దాణమ్,**
**తా ఇత్తియం న సక్కసి జం దేవో ఇక్క అరిహన్తో"**

**(ప్రకరణ భా. ౨ షష్ఠి. ౬౦. సూ. ౨)**

సం-అర్థము :- ఓమానవా! నీవు తపము చారిత్రము చేయజాలవు. సూత్రములను జదువనేరవు. ప్రకరణాదులను విచారణము చేయజాలవు. సుపాత్రాదులకు దానము నీజాలవు. అయినను నీవు- ఒక్క అరిహంతయే మాయారాధనకు యోగ్యుడగు గురువునందు, సుధర్మమగు జైనమతమందు శ్రద్ధయుంచుట సర్వోత్తమ విషయము. మఱియు నుద్ధారమునకును గారణము.

సమీక్షకుడు:-చారిత్రవంతుడు కాక, చదువనేరక, దానమిచ్చు సామర్థ్యము లేనివాడైనను జైనుడు 'జైనమతము సత్యము' అని చెప్పినంత మాత్రమున నతడుత్తము డగునా? అన్యమతస్థులు శ్రేష్ఠులు కూడ నశ్రేష్ఠులేనా? ఇట్టి మాటలు చెప్పు మనుష్యులను భ్రాంతులని, బాలబుద్ధులని చెప్పక యేమని చెప్పవలయును?

దీనింబట్టి వీరి యాచార్యులు స్వార్థపరులనియు బూర్ణవిద్వాంసులు కారనియు విదిత మగుచున్నది. కారణమేమన వీ రితరులను నెల్లరను నిందింపకున్న నీయసత్యమతమున నెవరు చిక్కుకొందురు? వారి ప్రయోజనము నెట్లు సిద్ధించును? చూడుడు! జైనుల మతము జనులను ముంచునది యనియు, వేదమత మెల్లర నుద్ధరించునది యనియు హరిహరాదిదేవులు సుదేవులనియు, జైనుల బుషభదేవాదు లెల్లరు కుదేవులనియు నితరులనిన జైనులకు జెడుగుగా దోచదా? వారికి దుఃఖము కలుగదా?

మఱియు జైనుల యాచార్యులు, వారి నంగీకరించువారి తప్పులను జూడుడు.

**మూలము :- జిణవర ఆణా భంగం ఉమగ్గ ఉస్సుత్త లేస దేసణ ఉ**

**ఆణా భగే పావంతా జిణయమ దుక్కరం ధమ్మమ్. (ప్రకర. భా .౨. షష్ఠి. ౬౧. సూ. ౧౧.)**

సం. అర్థము :- ఉన్మార్గము, ఉత్సూత్రముల లేశము చూపినందున జినవరులు-అనగా వీతరాగులైన తీర్థంకరుల యాజ్ఞకు భంగము కలుగును. అది దుఃఖహేతువు పాపమగును. జినేశ్వరుడు చెప్పిన సమ్యక్త్వాది ధర్మమును గ్రహించుట మిక్కిలి కఠినము. కావున జినఆజ్ఞకు భంగము కాని విధమున జేయవలయును.

సమీక్షకుడు :- తనను దానే ప్రశంసించుకొనుట, తనధర్మమునే గొప్పదిగా జెప్పుకొనుట, యితరుల మతమును నిందించుట యను నిదియంతయు మూర్ఖత యగును. ఏలయన నితర విద్వాంసులు తనను బ్రశంసించుట ప్రశంస యగును. దొంగకూడ దననోటితో దనను బ్రశంసించుకొనును. అంతమాత్రమున నతడు ప్రశంసనీయు డగునా? వీరి విషయము లిట్టివే.

మూలము :- "బహుగుణ విజ్జా నిల ఓ ఉసుత్తభాసీ తహా వి ముత్తవ్వో
జహ వరీ మణిజుత్తో విహు విగ్ఘకరో విసహరో లోఏ" (ప్ర.భా.౨-౮౦-౧౮.)

సం.అర్థము :- విషధరసర్పమునగల మణి త్యాజ్యమైనట్లు జైన మతస్థుడు కాని పండితు డెంత గొప్ప ధార్మికుడైనను వానిని ద్యజించుటయే జైనుల కుచితము.

సమీక్ష :- చూడుడు! ఎంత పొరపాటో! వీరి శిష్యులాచార్యులు విద్వాంసులైనచో వారిని బ్రేమింతురు. వీరి తీర్థంకరులును నవిద్వాంసులు కావున విద్వాంసుల నేల గౌరవింతురు? మైలలోనో ధూళి యందో పడియున్న సువర్ణము నెవరైన వదలుదురా? దీనింబట్టి జైనులుతప్ప మఱి యెవ్వరు లోకమున నింతటి పక్షపాతులు, హఠము చేయువారు, విద్యారహితులు, దురాగ్రహులు నుండరు.

మూలము - అఇసయ పావియ పావా ధమ్మి అ పవ్వేసు తోవి పావరయా,
న చలంతి సుద్ధ ధమ్మా ధన్నా కివిపావ పవ్వేసు" (ప్ర. భా. ౨. ష. సూ. ౨౯.)

సం-అర్థము :- అన్యదర్శని కులింగి అనగా జైనమతవిరోధులు. వారి దర్శనము కూడ జైనులు చేయరాదు.

సమీక్ష :- ఇది యెంతటి పామరుల నిర్ణయమో బుద్ధిమంతు లాలోచింపగలరు. వాస్తవ మేమన నెవరి మతము సత్యమో వారెవరికిని భయపడరు. తమ మతములో సారములేదని జైనాచార్యు లెఱుగుదురు. ఇతరులకు వినిపించిన వారు ఖండనము చేయుదురనియు వారెఱుగుదురు. కావుననే వారితరుల నెల్లరను నిందించి పామరులను వలలో వేసికొనుచుందురు.

మూలము :- నామంపి తస్స అసుహం జేణ నిదిఠాఇ మిచ్ఛ పవ్వాఇ,
జేసిం అణుసంగాఉ ధమ్మీణవి హెూఇ పావ మఈ (ప్ర. భా. ౨. షష్ఠి. సూ. ౨౭.)

సం.అర్థము :- జైనధర్మమునకు విరుద్ధములైన ధర్మము లన్నియు మనుష్యులను బాపులను జేయును. కావున నితరమతమును దేనిని నంగీకరింపక జైనధర్మము నంగీకరించుటయే శ్రేష్ఠము.

సమీక్ష :- దీనింబట్టి యందఱితోను వైరము, విరోధము, నింద, యీర్ష్య మున్నగు దుష్టకర్మ రూప సంసారమున ముంచునది జైనమార్గమే యని సిద్ధమగుచున్నది. జైనులవలె నితరుల నెల్లరను నిందించువారు కాని, యధార్మికులు కాని మఱియొకరు లేరు. ఒకవైపున నెల్లరను నిందించుచు దనను దాను మిక్కిలిగ బొగడుకొనుట శఠులైన మనుష్యుల పనికాదా? వివేకులైన వా రేమతమునకు జెందినవారైనను మంచివారిని మంచివారనియు జెడ్డవారిని జెడ్డవారనియే చెప్పుదురు.

మూలము :- "హా హా గురు అ అకజ్జం సామీ న హు అచ్ఛి కస్స పుక్కా రిమో,
కహ జిణ వయణ కహ సుగురు సావయా కహ ఇయ అకజ్జమ్"
(ప్ర.ర.భా.౨.షష్ఠి.సూ.౩౫.)

సం. అర్థ :- సర్వజ్ఞభాషిత జినవచనము, జైనుల సుగురువు, జైన ధర్మము నెక్కడ? వారికి విరోధు లైన కుగురువు, అన్యమార్గముల నుపదేశించు వారెక్కడ? అనగా మా మతము వారు సుగురువులు, సుదేవులు, సుధర్ములు. ఇతర మతమువారు కుదేవులు, కుగురువులు, కుధర్ములు ననిభావము.

సమీక్షకుడు :- ఈ విషయము రేగుపండ్ల నమ్ము 'కుంజరి' ముసలమ్మ మాటవలె నున్నది. ఆమె తన పుల్లని పండ్లను దియ్యనివనియు, నితరులవి తియ్యనివి కూడ బుల్లనివనియే చెప్పును. అట్లే యీ జైనసూత్రములు చెప్పుచున్నవి. జైనులు తమ మతముకంటె భిన్న మతస్థుల సేవలో మిక్కిలి యనర్థము పాపము నున్నట్లు లెక్కింతురు.

సర్పమునను్న మణిని త్యజించునట్టు లితరమత విద్వాంసులను ధార్మికులను త్యజింపవలయునని జైనమతమువా రందురని యింతకు బూర్వము వ్రాసియుంటిమి. ఇప్పుడంతకంటెమిన్నగా నెట్లు నిందించుచున్నారో చూడుడు.

మూలము :- "సప్పో ఇక్కం మరణం కుగురు అణంతాఇ దేఇ మరణాఇ;
తో వరిసప్పం గహియుం మా కుగురుసేవణం భద్దమ్." (ప్ర.ర.భా. ౨ ష.సూ. ౩౭)

సం. అర్థ :- జైనమతము కంటె భిన్నులైన వారెల్లరు కుగురువులు. అనగా వారు సర్పముకంటెను జెడ్డవారు. వారి దర్శనము, సేవ, సాంగత్యము నెన్నడును జేయరాదు. ఏలయన సర్పమువలన నొక్కసారి మరణించును. కాని యన్యమతముల కుగురువుల సాంగత్యమువలన బహుపర్యాయములు జన్మమరణములం బడయవలసి వచ్చును. కావున నో భద్రమానవ! అన్యమతములకు జెందిన కుగురువుల చెంత నిలువనైన నిలువకుము. ఏలయన నన్యమార్గములవారిసేవ యేకొంచెము చేసినను దుఃఖమున బడుదువు.

సమీక్షకుడు :- చూడుడు. జైనులవంటి కఠినులు, భ్రాంతులు, ద్వేషించువారు, నిందకులు, నితర మతముల వారెన్నడును గారు. జైను లితరులను నిందించి తమ ప్రశంస తాము చేసికొనకున్న దమ్మెవ్వరు బ్రశంసింపరని మనస్సున నిశ్చయించుకొని యుందురు. కాని యిది వారి దౌర్భాగ్య మనవలయును. ఏలయనగా నుత్తమ విద్వాంసుల సేవా సాంగత్యములు చేయకున్న వీరికి యథార్థజ్ఞానము కాని, సత్యధర్మ ప్రాప్తికాని యెన్నడు గలుగదు. కావున విద్యావిరుద్ధములయిన తమ మిథ్యావిషయములను వదలి, వేదోక్తములగు సత్యవిషయములను గ్రహించుట జైనులకు ముఖ్యకర్తవ్యమేకాక వారికిది మిక్కిలి కల్యాణకరమగు విషయ మగును.

మూలము :- "కిం భణిమో కిం కరిమో తాణ హయాసాణ ధిట్ఠ దుట్ఠాణం.
జే దంసిఊణ లింగం ఖివంతి న రయమ్మి ముద్ధజణం." (ప్రక.భా.౨ షష్టి.సూ.౪౦)

సం. అర్థ :- ఎవనికి గల్యాణేచ్ఛ నష్టమైనదో, చెడ్డకర్మల నాచరించుటలో జతురుడో, దుష్టదోషములు కలవాడో వాని కేమి చెప్పవలయును? ఏమి చేయవలయును? ఏల యన నతని కుపకారము చేసిన వానికి వాడు నాశము కలిగించును. ఎవడేని దయతో గ్రుడ్డిసింహపు గన్నులను దెఱవబోయిన నది యతనిని దినివేయునట్టు లన్యమత కుగురువులకు ననగా నన్ని మతముల వారి కుపకారము చేయుట తన నాశనము చేసికొనుటయే యగును. కావున నెల్లపుడు వారికి దూరముగ నుండవలయును.

సమీక్షకుడు:-జైను లాలోచించునట్టు లితర మతముల వారును నాలోచించిన జైను లెంతటి దుర్దశల పాలగుదురో వారికి తెలియదు. వారికి నెవరు నెట్టి యుపకారము చేయకున్న వారి పనుల కెంత నష్టము వాటిల్లునో వారి కెంత దుఃఖము కలుగునో వారూహింపజాలరు. అట్లే జైను లితరుల విషయమున నేల యాలోచింపరు?

మూలము :- "జహజహ తుట్టఇ ధమ్మో, జహజహ దుట్ఠాణ హెూఇ అఇ ఉదఉ,
సమద్దిట్ఠి జియాణం తహతహ ఉల్లసఇ సమత్తం." (ప్ర.ర.భా.౨ షష్ఠి.సూ. ౪౨)

సం. అర్థము :- ఏయే విధముల దర్శనభ్రష్టులయు, నిహ్నవులయు, పాసచ్ఛలయు, ఉసన్నులయు, అట్లే కుసీలియాదులయు మఱియు నన్యదర్శనులయు, వితండి పరివ్రాజకులయు నట్లే విప్రాదిక దుష్టజనులయు నతిశయ బలము, సత్కారము, పూజాదికములు జరిగిన నాయావిధముల సమ్యక్ దృష్టి జీవుల యొక్క సమ్యక్త్వము విశేషముగ బ్రకాశితము కాదొడగెను. ఇది మిక్కిలి యాశ్చర్యము.

సమీక్షకుడు :- ఇప్పుడు చూడుడు! ఈ జైనులకంటె నధికముగ నీర్ష్యా ద్వేషములు వైరబుద్ధితో గూడిన వ్యక్తి మఱియొక డుండునా! ఇతర మతములందును నీర్ష్యాద్వేషము లున్నవి. కాని, జైనులలో నెంతగా నున్నవో యంతగా నితరులందు లేవు. ద్వేషమే పాపమునకు మూలము. కావున జైనులలో బాపాచారము లేలయుండవు?

మూలము :- "సంగోవి జాణ అహిఉ తేసిం ధమ్మా హిజే పకువ్వన్తి,
ముత్తూణ చోరసంగం కరంతి తే చోరియం పావా" (ప్రక.భా.౨షష్ఠి.సూ. ౭౫)

సం. అర్థం :- దీని ముఖ్యప్రయోజన మింతయే. మూఢులు దొంగల సాంగత్యమువలన నాసికా చ్ఛేదనాది దండనములకు భయపడనట్లు, జైనమతమునకంటె భిన్నములైన చోరమతములందుండు జనులు తమ కల్యాణముల వలన భయపడరు.

సమీక్షకుడు :- ఏ మనుష్యు డెట్టివాడో యత డితరులను దఱచుగా దనవంటివారుగానే చూచును. ఇతర మతము లన్నియు దొంగమతములు. జైనమతము సాహుకార మతమనుట యెన్నడైన సత్యమగునా? మనుష్యుని యందు మిక్కిలి యజ్ఞానము, దుష్టసాంగత్యము వలన నేర్పడిన దుష్టబుద్ధియు నున్నంతవఱకు నితరులయెడ నీర్ష్యాద్వేషాదులతో దుష్టతతో వ్యవహరించుట మానడు. జైనమత మితర మతములను ద్వేషించున ట్లన్యమత మేదియు ద్వేషింపదు.

మూలము :- జచ్ఛ పసుమహి సలరకా పవ్వం హెూమంతి పావ నవమీవీ,
పూ అంతి తంపి సడ్ఢా హా హీలా వీయరాయస్స" (ప్ర.భా.౨ షష్ఠి. సూ. ౭౬)

సం. అర్థము :- పూర్వసూత్రమున జెప్పినట్లు-మిథ్యాత్వి అనగా జైనమతముకంటె భిన్నమతముల వారందఱు మిథ్యాత్వము గలవారు. జైనులు మాత్రము సమ్యక్త్వము గలవారు. అనగా నితరు లందఱు పాపులు. జైనులు పుణ్యాత్ములు నని సూత్రాభిప్రాయము. కావున నెవరేని మిథ్యాత్వము కలవారు, ధర్మము స్థాపించిన వారు పాపులు.

సమీక్షకుడు :- ఇతరుల స్థానమందు చాముండా, కాలికా, జ్వాలాప్రముఖుల యెదుట పాపనౌమీ-దుర్గానవమి మున్నగు తిథులు చెడుగు లైనట్లు జైనులైన మీ పజూషణ-పర్యూషణాది వ్రతము లెంతో కష్టముతో నాచరింప దగినవి చెడ్డవి కావా? ఇక్కడ దుర్గానవమి మున్నగు పండుగల సమయమున వామమార్గులు చేయు లీలలను ఖండించుట యుచితమే. కాని శాసన దేవి మరుతదేవి మున్నగు వాని నంగీకరింతురు. వానినిగూడ ఖండించిన బాగుండెడిది.

'మేమంగీకరించుదేవి హింసచేయునది కాదందురేని' మీరు చెప్పునది సత్యము కాదు. ఏలయన శాసనదేవి యొక మనుష్యునియు నొక మేకపోతు యొక్కయు గన్నులు తీసికొన్నది. మఱి యాదేవి రాక్షసి కాదా? దుర్గాదేవి తోబుట్టు వేలకాదు? మఱియు మీపంచఖాణము మున్నగు వ్రతములు మిక్కిలి శ్రేష్ఠము లనియు, దుర్గానవమి మున్నగునవి దుష్టములనియు జెప్పుట మూర్ఖతయే యగును. ఏలయన నితరుల యుపవాసములు చెడ్డవి, మీరు చేయు నుపవాసములు మంచివి యెట్లగును? ఇతరులు చేయు

వానిని నిందించుట మీరొనర్చు వానిని స్తుతించుట మూర్ఖత యేల కాదు? సత్యభాషణాది వ్రతములు చేయుట యెల్లరకు మంచిదియే. జైనులయు నితరులయు నుపవాసము లెవరివియైనను మంచివికావు.

మూలము :– "వేసాణ బందియాణయ మాహణ డుంబాణ జరకసిరకాణం;
భత్తా భర కట్ఠాణం వియాణం జంతి దూరేణం." (ప్ర.భా. ౨ షష్టి. సూ. ౮౨)

సం అర్థము :– వేశ్యలు, చారణులు, భట్టులు, బ్రాహ్మణులు, యక్షులు, మిథ్యాదృష్టిగల దేవీదేవతలు మున్నగు వారికి భక్తులైనవారు, వాని నంగీకరించువారు నెల్లరు దాము మునుగుదురు. ఇతరులను ముంచు దురు. ఏలయన వారి దగ్గఱనుండియే యన్నివస్తువులను యాచింతురు. వీతరాగు లైన పురుషులకు దూర ముగా నుందురు. అని సూత్రాభిప్రాయము.

సమీక్షకుడు :– ఇతరుల దేవీదేవతల నసత్యములనుటయు దమదేవీ దేవతలు సత్యము లనుటయు కేవలము పక్షపాతము. వామమార్గుల దేవీ దేవతలను నిషేధింతురు. కాని, వారి శ్రాద్ధదినకృత్యపు ౪౬ పేజీలో నిట్లు వ్రాయబడి యున్నది. 'ఒక పురుషుడు రాత్రియందు భోజనము చేసిన నేరమునకు శాసన దేవి యతనిని జెంపమీద గొట్టి యతని కన్నుల నూడబెఱికి వాని స్థానమున మఱియొక మేకపోతు కన్నులు తీసి పెట్టినది.' ఈ దేవి హింసక దేవి కాదా? ఎందువలన గాదు? రత్నసార గ్రంథమున ౧ భాగ ములో ౬౭వ పేజీలో నేమి వ్రాయబడి యున్నదో చూడుడు-'మరుత దేవి, రాతిమూర్తియై పథికులకు సహాయపడు చుండెడిది' దీనిని గూడ నట్లెందుకు నంగీకరింపరు?

మూలము :– కిం సోపి జణణి జాఓ జాణో జణణీఇ కిం గఓ విద్ధిం,
జఇ మిచ్ఛరఓ జాఓ గుణేసు తహ మచ్ఛరం వహ ఇ." (ప్రక.భా. ౨ షష్టి.సూ. ౮౧)

సం. అర్థము – జైన మతమును విరోధించు మిథ్యాత్వి–మిథ్యాధర్మమువా రెందుకు జన్మింపవల యును? జన్మించినను వృద్ధి పొందిరేల? అనగా త్వరగా నశించిన బాగుండెడిది.

సమీక్షకుడు :– చూడుడు! ఈ వీతరాగభాషితదయాధర్మ మెంత దయాధర్మము గలదియో! ఇతరమతముల వారు జీవింపనే కూడదట. వీరి దయా ధర్మము చెప్పుటకే కాని మఱియెందుకు గాదు. ఏదేని కొంచెము దయ యున్న క్షుద్రజంతువులపైన, ఋషులపైన జూపబడును. జైనులుకాని మను ష్యులపైన నించుకంతయు లేదు.

మూలము :– "సుద్ధే మగ్గే జాయా సుహేణ గచ్ఛత్తి సుద్ధ మగ్గంమి,
జే పుణ అమగ్గజాయా, మగ్గే గచ్ఛంతి తం చయ్యం" (ప్ర. భా. ౨ షష్టి.సూ. ౮౩)

సం. అర్థము :– జైనకులమందుబుట్టి ముక్తికి వెళ్ళిన నందాశ్చర్య మేమియు లేదు. కాని జైన భిన్న కులమందు బుట్టిన మిథ్యాత్వి–అన్యమార్గా వలంబి ముక్తిని బొందుట మిక్కిలి యాశ్చర్యకర విషయము. ఇదియే సూత్రాభిప్రాయము. అనగా దీని ఫలితార్థ మేమన జైనమతస్థులే ముక్తిని బొందుదురు. ఇతరు లెవరు బొందరు. జైనమతమును గ్రహింపనివారు నరకగాము లగుదురని భావము.

సమీక్షకుడు :– జైనమతములో దుష్టుడు, నరకగామియు లేడా? అందఱు ముక్తినే పొందుదురా? ఇతరు లెవరు ముక్తిని బొందరా? ఈ మాట లున్మత్తునివి కావా? అమాయకులు తప్ప యెవరీ మాటలను నమ్ముదురు?

మూలము :– "తిచ్ఛయ రాణం పూఆ సంమత్త గుణాణకారిణీ భణీయా,
సావియ మిచ్ఛత్తయరీ జిణ సమయే దేసియా పూఆ" (ప్రక.భా.౨ షష్టి. సూ. ౯౦)

సం. అర్థము :– జినమూర్తిని బూజించుట సారము. ఇతర మతముల వారి మూర్తిని బూజించుట యసారము. జినమార్గపు టాజ్ఞను బాలించువాడు తత్త్వజ్ఞాని. పాలించనివాడు తత్త్వజ్ఞాని కాడు.

సమీక్షకుడు :- ఆహా! ఎంత చక్కని మాట. మీ మూర్తులు రాళ్ళు మున్నగు జడపదార్థములతో జేయబడినవి కావా? వైష్ణవాదుల మూర్తులేనా రాళ్ళతో జేయబడినవి? వైష్ణవాదుల మూర్తిపూజ యెట్లు వ్యర్థమో యట్లే మీ జైనమూర్తుల పూజయు వ్యర్థమే - మిథ్యయే. మీ మూర్తిని బూజించువాడు తత్త్వ జ్ఞానియు నితర మూర్తిపూజకుడు కాడా? దీనింబట్టి మీ మతములోనే తత్త్వజ్ఞానము లేదని తెలియు చున్నది.

మూలము :- "జిణ ఆణావి ధమ్మో ఆణా రహి ఆణ ఫుడం అహముత్తి,
ఇయ ముణి ఊణయ యత్తం జిణ ఆణావి కుణహు ధమ్మం."

(ప్రక. భా. ౨ షష్ఠి. సూ. ౯౨)

సం. అర్థము :- జినదేవుని యాజ్ఞ దయాక్షమాదులు ధర్మము, దానికి భిన్నమైన యాజ్ఞలన్నియు నధర్మము.

సమీక్షకుడు :- ఇది యెంతటి యన్యాయ విషయమో చూడుడు! జైనులు కాక యితరు డెవడును సత్యవాదియు ధర్మాత్ముడును గాడా? అట్టి ధార్మికుని యాజ్ఞపాలింపరాదా! అవును - జైనమతస్థుల ముఖము జిహ్వయు జర్మముతో నిర్మింపబడక యితరుల ముఖాదులే చర్మముతో నిర్మింపబడి యున్నచో మీమాట లంగీకరింపవచ్చును. దీనింబట్టి జైనులు తమ గ్రంథపు వచనములను సాధువుల వచనములను బొగడుటలో భట్టులకు బెద్దన్నలుగా గనిపించుచున్నారు.

మూలము :- "వన్నేమి నారయాఉవి, జేసిం దురకాఇ సమ్మరం తాణం,
భవ్వాణ జణఇ హరిహర రిద్ధి సమిద్ధావి ఉద్ఘోసం." (ప్రక. భా. ౨ షష్ఠి. సూ. ౯౩)

సం. అర్థము :- దీని ముఖ్యతాత్పర్యమిది :- హరిహరాది దేవతల విభూతి నరకహేతువు. దానిని జూచి జైనుల దేహముల రోమములు నిక్కబొడుచుకొనును. రాజాజ్ఞను భంగముచేసిన మనుష్యుడు మరణ దండనమును గూడ బొందునట్లు జినేంద్రుని యాజ్ఞను భంగము చేయువాడు జన్మమరణరూప దుఃఖము నేల పొందడు?

సమీక్షకుడు :- చూడుడు! జైనాచార్యులు మున్నగువారి మనోవృత్తి, వారి కపటలీలలు ఇప్పుడు వీరిలోపల నేమియున్నదియో యదియు బయట బడినది. హరిహరాదులయు, వారి యుపాసకులయు నైశ్వర్యమును, వృద్ధిని గూడ చూడజాలరని తెలియుచున్నది. ఇతరుల వృద్ధిని జూచి వారికి వెంద్రుకలు నిక్కబొడుచు కొనునట. అది వారి వృద్ధిని జూచి సంతోషించుట కాదు. ఎందుకు వీరికి వృద్ధి కలుగు చున్నదా? కలుగకుండిన బాగుండునని వీరిలో బెక్కు రితరుల యభివృద్ధి తమకు లభించిన బాగుండు ననియు గోరువా రుందురు. అనగా నితరులు దరిద్రులు కావలయునని యభిప్రాయము. జైనులు రాజ్య స్తుతిపాఠకులు; పిఱికివారు-అందువలననే రాజాజ్ఞను దృష్టాంతముగా నిచ్చుచుందురు. రాజుల యసత్య మును గూడ బాటింపవలయునా? లోకమున జైనులను మించిన యీర్ష్యాద్వేషములు కలవారు మఱియొక రుండరు.

మూలము :- జో దేఈసుద్ధ ధమ్మం సో, పరమప్పా జయమ్మి నహు అన్నో,
కిం కప్పద్దుమ సరిసో ఇయర తరూహొఇ కఇ యావి"

(ప్రక. భా. ౨ షష్ఠి. సూ. ౧౦౧)

సం. అర్థం :- జైన ధర్మమును విరోధించువారు మూర్ఖులు - మఱియు నెవడు జినేంద్రభాషిత ధర్మోపదేష్ట సాధువు కాని, గృహస్థుడు కాని లేక గ్రంథకర్త కాని వారు తీర్థంకరులకు దుల్యులు. వారికి సమానులు మఱియొక రెవరును గారు.

సమీక్షకుడు :- ఎందుకు గారు? జైనులింత బాలబుద్ధి కలవారు కాకున్న నిట్టి విషయము లెందు కంగీకరించి కూర్చుందురు? వేశ్య తనను దప్ప మఱియొకరిని ప్రశంసింపదు. అట్లే యీజైనుల విషయము కనిపించుచున్నది.

మూలము :- "మూల జిణిదం దేవో తవ్వయణం గురుజణం మహాసయాణం,
సేసం పావట్ఠాణం పరమప్పాణం చ వజ్జేమి" (ప్ర.భా. ౨ షష్ఠి. సూ. ౧౦౩)

సం. అర్థము :- జినేంద్రదేవుని, తదుక్తసిద్ధాంతములను మఱియు జినమతము-ఉపదేష్టలను త్యాగము చేయుట జైనుల కుచితము కాదు.

సమీక్షకుడు :- ఇది జైనుల హఠము, పక్షపాతము మఱియు నవిద్య అనువాని ఫలము కాక మఱి యేమగును? జైనుల కొలది విషయములు తప్ప యితర మంతయు విడువదగినదే. ఏ కొంచెము బుద్ధి కలవాడైనను జైనుల దేవులను సిద్ధాంత గ్రంథములను, నుపదేష్టలను జూచినను వినినను విచారించినను నిస్సందేహముగ వారిని విడిచి పెట్టును.

మూలము :- "వయణే విసుగురు జిణవల్లహస్స కేసింవ ఉల్లసఇ సమ్మంఅహ కహ
దిణమణీ తేయంఉలుఆణం హరఇ అంధత్తం (ప్ర. భా. ౨ షష్ఠి. సూ. ౧౦౮)

సం. అర్థము :- జినవచనముల కనుకూలముగ నడచుకొనువారు పూజ్యులు, విరుద్ధముగా నడచుకొనువా రపూజ్యులు. జైనగురువులను నంగీకరింపవలయును. ఇతర మార్గముల వారిని నమ్మరాదు.

సమీక్ష :- జైను లితర యజ్ఞానులను శిష్యులను జేసికొని పశువులవలె బంధించి యుంచకున్న, వారి యుచ్చులనుండి విడివడి తమ ముక్తికి సాధనమొనర్చి జన్మములను సఫలము చేసికొని యుందురు. ఎవరైన మిమ్ము కుమార్గులనియు, మిథ్యాత్వులు, క్రూరచేష్టలు కలవారు ననిన మీకెంత దుఃఖము కలుగును? అట్లే మీరును నితరులకు దుఃఖదాయకులు. అందువలననే మీ మతమున సారములేని విషయము లెన్నియో నిండియున్నవి.

మూలము :- జేరజ్జధానఈణం కారణభూయ హవంతి వావారా,
తే విహు అఇపావజుయా ధన్నాఛడ్డంతి భవభియా" (ప్ర.భా. ౨ షష్ఠి. సూ. ౧౧౮)

సం. అర్థము :- మృత్యుపర్యంతదుఃఖ మున్నను జైనులు కృషి వ్యాపారాది కర్మలు చేయరాదు. ఈ కర్మలు నరకమునకు గొంపోవును.

సమీక్షకుడు :- ఇప్పుడు జైనులను 'మీరెందుకు వ్యాపారాది కర్మలు చేయుచున్నారు? వీని నెందుకు విడువరు?' అని యడిగిన నేమందురు? విడిచిన శరీర పాలన పోషణము లెట్లు జరుగును? జరుగదు. మీ కథనమును విని యెల్లరు కృషి వ్యాపార కర్మలను విడిచి పెట్టిన నేమి తిని బ్రతుకుదురు? ఇట్టి హానికరపు టుపదేశములు చేయుట మిక్కిలి వ్యర్థము. పాప మేమి చేయుదురు! విద్యాసత్సంగాదులు లేక పోవుటవలన నిష్టము వచ్చినట్లు వదరుచున్నారు.

మూలము :- "తఇయా హమాణ అహమా కారణ-రహియా అనాణగవ్వేణ!
జే జపంతి ఉస్సుత్తం తేసిం దిద్ధిచ్ఛ పండిచ్చం" (ప్ర.భా. ౨ షష్ఠి. సూ. ౧౨౧)

సం. అర్థము :- జైనాగమమునకు విరుద్ధములైన శాస్త్రముల నంగీకరించువా రధమాధములు. ఎట్టి ప్రయోజనము సిద్ధింపనున్నను దానికొఱకు జైనమతమునకు విరుద్ధముగా జెప్పకూడదు-అంగీకరింపరాదు. ఎట్టి ప్రయోజనము సిద్ధించుచున్నను నితర మతమును వదలవలయును.

సమీక్షకుడు :- మీ మతగురువులు మొదలుకొని నేటివఱకు బుట్టిన వారు పుట్టనున్నవారు నితర మతములను నిందించుటకాక మఱియొకటి చేసిన దేమియులేదు-ముందు చేయునదియు లేదు. జైనులు

తమ ప్రయోజన మెక్కడెక్కడ సిద్ధించునని తెలిసికొందురో యచ్చట శిష్యులకును శిష్యులగుదురు. ఇట్టి మిథ్యాభూతములగు గప్పాలు గొట్టుటకు గొంచెము సిగ్గైనను గలుగదా? ఇది మిక్కిలి శోచనీయ విషయము.

మూలము :- "న వీరజిణస్స జిఓ మిరఈ ఉస్సుత్త లేసదేసణఓ;
సాగర కోడాకోడిం హిండఇ అఇభీమ, భవవరణ్ణే" (ప్ర.భా. ౨ షష్టి. సూ. ౧౨౨)

సం. అర్థము :- ఎవడేని యొకడు జైనసాధువులలో ధర్మమున్నది. మాలోను, నితరులలోను ధర్మమున్నదని చెప్పినచో నతడు కోట్లకొలది వర్షములు నరకములో నుండి మరల నీచజన్మమును బొందును.

సమీక్షకుడు :- వహ్వారే వహ్వా! ఓ విద్యాశత్రువులారా! మీ మిథ్యావచనముల నెవ్వరు ఖండించ బోరని మీరాలోచించి యుందురు. అందువలననే యిట్టి భయంకర విషయములను మీరు వ్రాసియుందురు. కాని, యది యసంభవము. ఇప్పు డెంతవఱకు మీకు బోధింపగలము? మీరు మాత్రము వ్యర్థముగా నిందించుట, యితర మతములతో విరోధము పెట్టుకొనుటకే కటిబద్ధులై మీ ప్రయోజనము సిద్ధపఱచుకొనుటయే మోహనభోగము సమానముగా నెంచి యున్నారు.

మూలము :- "దూరేకరణం దూరమ్మి సాహణంతహ పభావణాదూరే
జిణధమ్మ సద్దహాణం పి తిరకదురకాఇ నిట్ఠవఇ" (ప్ర.భా. ౨ షష్టి. సూ. ౧౨౭)

సం. అర్థము :- ఏ మనుష్యుడు జైనధర్మము ననుష్ఠింప జాలడో యట్టివాడును, జైనధర్మము సత్యమనియు, నితరధర్మము కాదనియు శ్రద్ధ యుంచినను దుఃఖములనుండి తరించును.

సమీక్షకుడు :- మూర్ఖులను దమ మతజాలములో జిక్కించుకొనుట కింతకంటె నెక్కుడేమి కావలయును? ఏలయన కర్మలేమియు జేయకయే ముక్తి లభింపవలయును. ఇట్టి మత మింకొకటి యేది దొరకును?

మూలము :- "కఇయా హెూహీ దివసో జఇయా సుగురుణ పాయమూలమ్మి,
ఉత్సుత్తలేస విసలవ రహిఓ నిగుణేసు జిణధమ్మం"

(ప్రక. భా. ౨ షష్టి. సూ. ౧౨౮)

సం. అర్థము :- ఏ మనుష్యుడు 'జినాగమము' జైనశాస్త్రములను విందును, అన్యమతగ్రంథముల నెన్నడు వినను, అని మనస్సున దలంచునో యత డాతలంపు మాత్రముననే దుఃఖసాగరమునుండి తరించును.

సమీక్షకుడు :- ఇదియు నమాయకులను వలలో వేసికొనుటకే. కారణమేమన నిట్టి తలంపుతో నిక్కడి దుఃఖసాగరము నుండియే తరింపడు. ఇక బూర్వజన్మపు సంచిత పాపముల దుఃఖరూపఫలము ననుభవింపక విడివడుట యెన్నడును సంభవింపదు. అసత్యములు, విద్యావిరుద్ధములు నగు వీరి విషయములు తెలిసినచో వీరి యవిద్యా రూప గ్రంథములను, వేదాదిశాస్త్రములను జూచి విని సత్యాసత్యము లెఱిగి వీరి గ్రంథములను విడిచిపెట్టుదురు. కావున మూర్ఖులను నిట్లు గట్టిగా బంధించియున్నారు. ఈ బంధనముల నుండి తొలగుట యెవరికో యొక బుద్ధిమంతునకు సాధ్య మగునేమో కాని యితరులకు సాధ్యము కాదు.

మూలము :- "జహ్యా జేణహిం భణియం సుయ వవహారం విం
సోహియం తస్స; జాఇయ విసుద్ధ ఓహీ జిణఆణా రాహగత్తాఓ

(ప్రక.భా. ౨ షష్టి. సూ. ౧౩౮)

సం. అర్థము :- జినాచార్యులు చెప్పిన సూత్రనిరుక్తివృత్తి భాష్యచూర్ణి నెవరంగీకరింతురో వారే శుభవ్యవహారములను, దుస్సహవ్యవహారములను నాచరించుటవలన చారిత్రయుక్తులై సుఖములను

బొందుదురు. ఇతర మత గ్రంథములను జూచిన నట్లు కారు.

సమీక్ష :- మిక్కిలి యాకలితో జచ్చుట మున్నగు కష్టములను సహించుటయే చారిత్ర మన బడునా? ఆకలి దప్పికలతో జచ్చుటయే చారిత్ర మగునెడల, దుర్భిక్షములో నెందఱో యన్నాదులు లభింపక యాకలితో జచ్చుదురు. వారు కూడ శుద్ధులై శుభఫలములను బొందవలసి యుందురు. కాని వీరు శుద్ధులు కారు. మీరును శుద్ధులు కారు. వాస్తవమున పిత్తాదుల ప్రకోపము వలన రోగులై సుఖములకు బదులు దుఃఖముల పాలగుదురు.

ధర్మము-న్యాయాచరణము, బ్రహ్మచర్యము, సత్యభాషణాదులునై యున్నవి. అసత్యభాషణము, నన్యాయాచరణము పాపము. అందఱితో ప్రేమ పూర్వకముగ బరోపకారము చేయుట, శుభచారిత్రము నబడును. జైన మతస్థు లాకలిదప్పికలతో నుండుట మున్నగునవి ధర్మము కావు. ఈ సూత్రాదుల నంగీకరించుటవలన గొలదిగా సత్యము, నెక్కువ యసత్యమును బొంది దుఃఖసాగరమున మునుగుదురు.

**మూలము :— 'జఇ జాణసి జిణనాహొ లోయాయారా విపరకవీ**

**భూఓ; తా తం తం మన్నంతో కహ మన్నసి లోఅ ఆయారం"**

**(ప్రక. భా. ౨ షష్టి సూ. ౧౪౮)**

సం. అర్థము :- ఎవరుత్తమ ప్రారబ్ధముగల మనుష్య లుందురో వారే జినధర్మమును గ్రహింతురు. అనగా జినధర్మమును గ్రహింపనివారి ప్రారబ్ధము నష్టమని భావము.

సమీక్షకుడుః- ఈ విషయ మసత్యము, ప్రమాదభరితము కాదా? అన్యమతములలో శ్రేష్ఠప్రారబ్ధము గల వారు జైనమతమున నష్టప్రారబ్ధము గలవారు లేరా?

సాధర్మి - 'జైనధర్మమున నున్నవారు పరస్పరము కష్టములు కలిగించుకొన రాదు. ప్రేమపూర్వక ముగ వర్తింపవలయును' దీనింబట్టి జైనులు జైనులకు గష్టములు కలిగింపరాదు. కాని యితరులకు క్లేశ ములు కలిగింప వచ్చును. వారితో గలహించుటలో దోషము లేదని యంగీకరింతురని సిద్ధమగుచున్నది. కావున వీరి యీ యుపదేశము సరికాదని తెలియుచున్నది. ఏలయన సజ్జనులైన వారితో ప్రేమపూర్వక ముగ వర్తించుచు దుష్టులైన వారికి మంచిశిక్షనిచ్చి వారిని సంస్కరింతురు.

మఱియు "బ్రాహ్మణులు త్రిదండులు పరివ్రాజకాచార్యులు ననగా సంన్యాసులు, తాపసులు, బైరాగులు మున్నగు వారును జైనమతమునకు విరోధులు - శత్రువులు" అని వ్రాయుటయు సరికాదు.

చూడుడు - వీరితరుల నెల్లరను శత్రు భావముతో జూచి నిందించు చున్నారు. అట్టియెడ జైనులలో దయ క్షమ యనునవి యెక్కడ నున్నవి? ఇతరులపై ద్వేషభావ మున్నవారిలో దయ, క్షమ నశించును. అందువలన దీనికి సమానమైన హింసారూప దోషము మఱియొకటి యుండదు. జైనులెట్టి ద్వేష మూర్తులో యితరు లంతటి ద్వేషమూర్తు లెవ్వరును లేరు.

మఱియును 'హరి హరాదులు మిథ్యాత్వులు నన్యమతస్థులు సన్ని పాతరోగగ్రస్తులు, వారిమతము విషసమానము' అనియు వ్రాసియున్నారు. (ప్రక-భా.౨. పుట ౯౬౨)

ఋషభదేవుడు మొదలు మహావీర పర్యంత మిరువది నలుగురు తీర్థంకరులను రాగద్వేషములు గలవారనియు , జైనమతము నంగీకరించువారు సన్నిపాత రోగులవంటివారనియు వారి మతము నరకము విషముతో సమానమనియు ననిన జైనుల కెంత కష్టముగా నుండును? కావున జైనులు నింద, పరమత ద్వేషము నను నరకములో మునిగి మహాక్లేశముల ననుభవించుచున్నారు. వారిది వదలిన నెంతయు బాగుగా నుండును.

మూలము :- "ఏగో ఆగురు ఏగో విసావగీ చేద అణి వివహోణి, తచ్ఛ
య జం జిణదవ్వం పరుప్పరం తం న విచ్చన్తి."

(ప్ర.భా. ౨ షష్టి.సూ. ౧౫౦)

సం. అర్థము :- సమస్త శ్రావకులకు ధర్మము గురువొక్కడే. చైత్యవందనము-జినప్రతిబింబము, మూర్తి, దేవలము, జినద్రవ్యమును రక్షించుట, మూర్తిని బూజించుట ధర్మము.

సమీక్షకుడు :- చూడుడు. లోకమున బ్రచారమున నున్న మూర్తి పూజ గొడవలన్నియు జైనుల నుండియే బయలుదేరినట్లు స్పష్టమగుట లేదా? పాషండుల మతముకూడ జైనమతమే, మఱియొకటి కాదు.

(మూర్తిపూజ ప్రకారము)

"నవకారేణ వివోహా." ౧ "అనుసరణం సావ ఉ" ౨ "వయాఇ ఇమే" ౩.
"జోగో" ౪. "చియవందణగో" ౫. "యచ్చరఖాణం తు విహిపుబ్బం" ౬ ఇత్యాది.
శ్రావకులు మొదట ద్వారమున నవకార జపముచేసి వెళ్ళవలయును. ౧.

రెండవది :- నవకారము జపించిన మీద 'నేను శ్రావకుడను' అని స్మరింపవలయును ౨. మూడవది :- అణు వ్రతాదులు మనవి యెన్ని యున్నవి ౩. నాల్గవది :- ద్వారమున నాలుగు వర్గములలో మోక్షము ముందుండును. దానికి గారణము జ్ఞానాదికము -యోగము. దానికి నన్ని యతిచారములు నిర్మలము చేయుటవలన నానావశ్యక కారణములు. అవియు గౌణముగా యోగమని చెప్పబడును. అందువలన యోగ మందురు ౪. ఐదవది - చైత్య వందనము. అనగా మూర్తికి నమస్కరించుట. దీనిని ద్రవ్యభావ పూజ యందురు ౫. ఆఱవది - ప్రత్యాఖ్యానద్వారము. నవకారసీప్రముఖము విధి పూర్వకముగ జెప్పెదను. మున్నగునవి ౬.

మఱియు, నీ గ్రంథముననే ముందనేక విధులు వ్రాయబడి యున్నవి. అనగా సంధ్యాకాల భోజన సమయమున జినబింబమును-తీర్థంకరుని మూర్తిని బూజించుట, ద్వారమును బూజించుట ద్వార పూజలో జాల గొడవలున్నవి. మందిరము నిర్మించు నియమములు, ప్రాతమందిరములను నిర్మింప జేయుట, వానిని బాగుచేయుటలో ముక్తి లభించును. మందిరమునకు వెళ్ళి కూర్చుండు విధము. మిక్కిలి ప్రీతిభావముతో బూజించుట; 'నమో జినేంద్రేభ్యః.' అను నిట్టి మంత్రములతో స్నానాదులను జేయించుట. 'జల చందన పుష్ప ధూప దీపనైః' ఇట్టి మంత్రములతో గంధాదుల నర్పించుట. ఇట్టివి బహు విషయము లున్నవి.

రత్నసారము భాగ ౧. పుట ౧౨న నిట్లున్నది.

"పూజారిని రాజుగాని, ప్రజకాని యెవ్వరు నడ్డగింపరాదు" అని మూర్తిపూజ విషయమున వ్రాయబడి యున్నది.

సమీక్షకుడు :- ఈ విషయము లన్నియు గపోల కల్పితములు. ఏలయన నెందఱనో జైనపూజారులను రాజులు మున్నగువార డ్డగించుచునే యుందురు. ఈ వ్రాతలకు ప్రయోజనమేమి?

రత్నసారము. భా.౧.పుట. ౩న నిట్లు వ్రాయబడినది. "మూర్తిపూజ వలన రోగములు బాధలు, మహాదోషములు నన్నియు వదలి పోవును. ఎవడో యొకవ్యక్తి యైదునయాపైసల పువ్వులు తెచ్చి మూర్తిపైన వేసిన నతడు ౧౮ పదునెనిమిది దేశములకు రాజయ్యెను. అతని పేరు 'కుమారపాల్'. ఇట్టివి యనేకములు.

సమీక్షకుడు :- ఈ విషయము లసత్యములు; మూర్ఖులను లోభింపజేయుటకు బనికి వచ్చును.

ఏలయన నెందఱో జైనులు పూజలు చేయుచుందురు. రోగులు నగుచుందురు. ఒక కుంటనేలయైన మూర్తిపూజ వలన లభింపదే! రాజ్యమేల లభించును? ఐదు పైసల పువ్వులకు రాజ్యము లభించిన జైను లందఱు నైదేసి పైసలకు బుష్పములు కొని మూర్తిమీద నుంచిన భూమండలము దామే యేలవచ్చును గదా! రాజదండనము ననుభవింపనేల? మఱియు మూర్తి పూజవలననే భవసాగరము తరింప నవకాశ ముండగా జ్ఞానము, సమ్యక్ దర్శనము, చారిత్రము నివి యన్నియు నేల?

రత్నసారము భా. ౧ పుట ౧౩న వ్రాయబడియున్నది.

"గౌతముని యంగుష్ఠమున నమృత మున్నది. అతని స్మరణము వలన మనోవాంఛితము ఫలించును."

సమీక్షకుడు :- ఇది నిజమే యగునెడల జైనులందఱు ముక్తులు కావలసి యుందురు. ఎవరును గాలేదు. దీనింబట్టి యిది యంతయు మూర్ఖులను వంచించుటకు దప్ప మఱియొండు ప్రయోజనము లేదు. ఇందు గొంచెమైనను తత్త్వము లేదు.

వీరు పూజించుటకు శ్లోకములు రత్నసార. భా. ౧ పుట. ౧౫లో నిట్లున్నవి.

"జలచందన పుష్ప ధూపైరథ దీపాక్షతకై ర్నైవేద్యవస్త్రైః,
ఉపచారవరై ర్వయం జినేంద్రాన్ రుచిరై రద్య ముదా యజామహే"

మేము జలము, చందనము, అక్షతలు, పుష్పములు, ధూపదీప నైవేద్య వస్త్రములు మున్నగు వానితోను శ్రేష్ఠమైన యుపచారములతోను జినేంద్రులను తీర్థంకరుల బూజింతుము.

సమీక్షకుడు :- ఇందువలననే మేము జైనులనుండియే మూర్తిపూజ ప్రచారమునకు వచ్చినదని చెప్పుచున్నాము.

వివేకసారము పుట ౨౧ "జినమందిరములో మోహము రాదు, భవసాగరమును దరింపజేయునది." పుట ౫౧-౫౨లో "మూర్తిపూజవలన ముక్తి కలుగును. జినమందిరమునకు వెళ్ళిన సద్గుణములు వచ్చును. జలచందనాదులతో దీర్థంకరులను బూజించినవాడు నరకమునుండి విడివడి స్వర్గమునకు బోవును."

"౫౫వ పుటలో." జినమందిరమున ఋషభదేవుని మూర్తులను బూజించిన ధర్మార్థకామ మోక్ష ములు సిద్ధించును."

౬౧వ పుటలో "జినమూర్తులను బూజించిన జగత్తులోని సర్వక్లేశములు విడివడును."

సమీక్షకుడు :- ఇప్పుడు చూడుడు! వీరి యవిద్యకు సంబంధించిన యసంభవ విషయములు. ఇట్లు పాపకర్మలు విడిపోయి, మోహము కలుగక, భవసాగరమునుండి తరించి, సద్గుణములలవడిన, నరకము విడిచి స్వర్గమునకు బోగలిగిన, ధర్మార్థకామమోక్షములు సిద్ధించిన జైనులెల్లరు సుఖము నేల పొందకు న్నారు. సర్వపదార్థసిద్ధి వారికేల కలుగదు?

ఈ వివేకసారపు ౩వ పేజీలో 'జినమూర్తిని స్థాపించినవారు తమ యొక్కయు, దమకుటుంబము యొక్కయు జీవికను నిలుపుకొనిరి.

౨౨౫ పుటలో "విష్ణువు,శివుడు మున్నగు వారి మూర్తులను బూజించుట మిక్కిలి చెడ్డపని. అనగా నది నరకసాధన మగును." అని యున్నది.

సమీక్షకుడు :- శివవిష్ణ్వాదుల మూర్తులు నరకమునకు సాధనములైన జైనమూర్తులేల కావు? అవి యట్టివి కావా? 'మా మూర్తులు త్యాగము, శాంతి, శుభ, ముద్రాయుక్తములై యుండును. అందువలన మంచివి. శివాదుల మూర్తులట్టివి కావు. కావున చెడ్డవియని యందురేని 'మీ మూర్తులు అక్షతాది

రూప్యములతో సిద్ధము చేసిన మందిరములలో నుండును. వానిపై జందనకేసరాదులు పులుముదురు. కావున నవి త్యాజ్యము లెందుకు గావు? ఇక శాంతి – జడపదార్థము లన్నియు గదలవు కావున నన్నియు శాంతముగానే కనిపించును. కావున విశేషమేమి? అని వారి నడుగవలయును. వాస్తవమున నెల్ల మతము లందును మూర్తిపూజ వ్యర్థమే.

(మూర్తిపూజవలన జడతగలుగును)

ప్రశ్న :– మా మూర్తులు వస్త్రాభూషణాదులు ధరింపవు. కావున మంచివి.

ఉత్తరము :– అందఱియెదుట నగ్నమూర్తుల నుంచుట పశువుల లీల యగును.

ప్రశ్న :– స్త్రీల చిత్రములను మూర్తులను జూచిన కామోత్పత్తి కలుగునట్లు సాధువులయు యోగు లయు మూర్తులను జూచిన శుభగుణములు ప్రాప్తించును.

ఉత్తరము :– పాషాణమూర్తులం జూచిన శుభపరిణామము కలుగునందువేని వానిలోని జడత్వాది గుణములును మీకు లభించును. జడత యేర్పడిన సర్వథా నశింతువు. మఱియు నుత్తమ విద్వాంసుల సంగతిలేక, వారిసేవ జేయక యున్నందున మూఢతయు నెక్కువ యగును. పదునొకండవ సముల్లా సమునందలి దోషములన్నియు మూర్తిపూజకులకు లభించును. జైనులు మూర్తిపూజయందు వ్యర్థకోలా హలము చేయునట్లు వీరిమంత్రములందు ననేకములైన యసంభవ విషయములు వ్రాయబడి యున్నవి.

(ప్రసిద్ధజైన నవకారమంత్రము)

రత్నసారము భాగ ౧ పుట ౧ మంత్రము.

"నమో అరిహంతాణం నమో సిద్ధాణం నమో ఆయరియాణం,
నమో ఉవజ్ఝాయాణం నమో లోఏ సబ్బ సాహూణం, ఏసో పంచ
నముక్కారో సవ్వ పావప్పణా సణో ముంగలాచరణంచ సవ్వేసిం
పఢమం హవఇ మంగలమ్" (౧)

ఈ మంత్రమునకు గొప్ప మాహాత్మ్యము వ్రాయబడినది. జైనుల కందఱకు నిది గురుమంత్రము. ఈ మంత్ర మాహాత్మ్యము, తంత్రములయు బురాణములయు, భట్టుల కథలను గూడ జయింపగలదు.

శ్రాద్ధదిన కృత్యము పుట ౩.

"నముక్కారం తఉ పఢే" (౯)
"జఉ కబ్బం మంతాణ మంతో పరమో ఇముత్తి ధేయాణధేయం
పరమం ఇముత్తి, తత్తాణతత్తం, పరమం పవిత్తం. సంసార సత్తాణ దుహాఇయాణం" (౧౦)
తాణం అనంతు నో అత్థి జీవాణం భవసాయరే
బుడ్డుం తాణం ఇమం ముత్తుం నముక్కారం సుపోయయమ్" (౧౧)
'కబ్బం అణేగజమ్మంతరసం చిఆణం దుహాణం, సారీరి అమాణుసాణు సాణం,
కత్తోయ భవ్వాణ భివజ్జనాసో న జావపత్తో నవకారమంతో (౧౨)

ఈ మంత్రము పవిత్రము. పరమ మంత్రము. ఇది ధ్యానయోగమున బరమధ్యేయము. తత్త్వము లలో దత్త్వము. దుఃఖములవలన బీడింపబడు సంసారిజీవుల కీనవకారమంత్రము సముద్రమును దాటు టకు నావ వంటిది. (౧౦)

ఈ నవకారమంత్రము నౌకవంటిది. దీనిని విడుచువారు భవసాగరమున మునుగుదురు. దీనిని గ్రహించువారు దుఃఖముల నుండి తరింతురు. ఇది జీవులను దుఃఖములనుండి వేఱు చేయును. సర్వపాప ముల నశింప జేయును. ముక్తికారకము. దీనిని మించి మఱియొకటి లేదు. (౧౧)

అనేక భవాంతరములం దుత్పన్నమైన శరీర మనస్సులకు సంబంధించిన దుఃఖభవ్యజీవులను భవ సాగరమునుండి తరింపజేయున దిదియే. నవకార మంత్రమును బొందనంతవఱకు జీవుడు భవసాగరము నుండి తరింప నేరడు. (౧౨)

ఈ యర్థము సూత్రమున జెప్పబడినది. మఱియు నగ్నిప్రముఖములగు అష్టమహాభయములందు సహాయపడునది నవకారమంత్రము తప్ప మఱియొకటి లేదు. మహారత్నమగు వైడూర్య నామక రత్న మును గ్రహించునట్లు, లేక శత్రు భయమునం దమోఘశస్త్రమును గ్రహించునట్లు, శ్రుతకేవలిని గ్రహింప వలయును. మఱియు సర్వద్వాదశాంగియొక్క నవకార మంత్ర రహస్య మున్నది.

ఈ మంత్రార్థము :- (నమో అరిహంతాణం = సర్వతీర్థంకరులకు నమస్కారము. నమోసిద్ధాణం = జైనమతపు సర్వసిద్ధులకు నమస్కారము. నమో ఆయరియాణం = జైనమతసర్వ-ఆచార్యులకు నమస్కారము. నమో ఉవజ్ఝాయాణం = జైనుల యుపాధ్యాయుల కందఱకు నమస్కారము. నమో లోఏ సబ్బసాహూణం = ఈ లోకమునగల జైనసాధువుల కెల్లరకు నమస్కారము.)

ఈ మంత్రమున జైనపదము లేదు. అయినను జైనులకు సంబంధించిన యనేక గ్రంథములలో జైనులకుదప్ప యితరులకు నమస్కారము చేయరాదని నిషేధింపబడి యున్నది. కావున నర్థమునందు జైనపదము జోడింప బడినది. అందుచే నీయర్థమే సరియైనది.

తత్త్వవివేకము ౧౬౯పేజీ. "ఏ మనుష్యుడు కొయ్యనుగాని, రాతిని గాని దేవబుద్ధితో బూజించునో యతడు మంచిఫలములను బొందును." అని యున్నది.

సమీక్షకుడు :- అటులయిన దర్శనము చేసికొనువారి కెల్లరకు సుఖరూపఫల మేల లభింపదు?

రత్నసారము భాగ. ౧ పుట ౧౦. "పార్శ్వనాథుని మూర్తిని దర్శించుట వలన బాపములు నశించును." అని యున్నది.

కల్పసూత్రభాష్యము పుట ౫౧లో నిట్లున్నది.

'ఒక లక్ష యిరువదియైదువేల మందిరముల జీర్ణోద్ధారము చేయబడినది'

మూర్తిపూజ విషయమున నిట్టివి యనేక లేఖలున్నవి. అందువలననే జైనమతమే మూర్తిపూజకు మూలకారణమని తెలియుచున్నది.

ఇప్పు డీజైన సాధువుల లీలలు చూడుడు.

వివేకసారము పుట (౨౨౮) "ఒక జైనమత సాధువు కోశావేశ్యతో భోగించి తదుపరి త్యాగియై స్వర్గమునకు బోయెను."

"పుటలు ౧౦౧, ౧౦౬, ౧౦౭. అర్ణకముని చారిత్రమునుండి చ్యుతుడై పలువర్షములు దత్తసేఠ్ గృహంబున విషయభోగ మనుభవించి తదుపరి దేవలోకమునకు బోయెను. శ్రీకృష్ణుని పుత్రుడయిన ఢంఢణ మునిని నక్క యెత్తుకొని పోయెను. తరువాత దేవత యయ్యెను."

వివేకసారము పుట ౧౫౬. 'జైనమతపుసాధువు లింగధారి. అనగా వేశధారీ మాత్రుడైనను శ్రావకు లతనికి సత్కారము చేయవలయును. సాధువు శుద్ధచరిత్రుడైనను, నశుద్ధచరిత్రుడైనను బూజ్యుడే యగును.'

"పుట ౧౬౮. జైనమత సాధువు జైనసాధువులను జరిత్రహీనులు, భ్రష్టాచారులనుగా జూచినను వారికి సేవజేయవలసినదే."

పుట ౨౧౬ "ఒక దొంగ యైదు గుప్పెళ్ళ వెండ్రుక లూడబెరుకుకొని చారిత్రమును గ్రహించెను. మిక్కిలి కష్టమును బొందెను. పశ్చాత్తాపపడెను. అతడాఱవమాసముననే కేవలము జ్ఞానముబొంది

సిద్ధుడయ్యెను."

సమీక్షకుడు :- ఇప్పుడు చూడుడు. ఈ సాధువులయు గృహస్థులయు లీలలు. వీరి మతమున నెంతటి కుకర్మ లాచరించువాడైనను సాధువు సద్గతిని బొందెను. మఱియు--

వివేకసారము పుట ౧౦౬లో వ్రాయబడియున్నది.

'శ్రీకృష్ణుడు మూడవ నరకమునకు బోయెను.'

౧౪౫ పుటలో "ధన్వంతరి నరకమునకు బోయెను."

౪౮ పుటలో "జోగి, జంగము, కాజీ, ముల్లా యజ్ఞానముతో నెంతటి తపము, కష్టము చేసినను దుర్గతినే బొందుదురు."

రత్నసారము భా ౧ పుట ౧౭౦, ౧౭౧లో నిట్లున్నది.

"నవవాసుదేవు లనగా -- (౧) త్రిపుష్ట వాసుదేవుడు, (౨) ద్విపుష్ట వాసుదేవుడు, (౩) స్వయంభూ వాసుదేవుడు, (౪) పురుషోత్తమ వాసుదేవుడు, (౫) సింహపురుష వాసుదేవుడు, (౬) పురుషపుండరీక వాసుదేవుడు, (౭) దత్త వాసుదేవుడు, (౮) లక్ష్మణ వాసుదేవుడు, (౯) శ్రీకృష్ణ వాసుదేవుడు నను వీరందఱు, పదునొకండవ, పండ్రెండవ, పదుమూడవ, పదునాల్గవ, పదునైదవ, పదునెనిమిదవ, యిరువది యవ, యిరువదిరెండవ, తీర్థంకరుల సమయమున నరకమునకు బోయిరి.

మఱియు, నవప్రతివాసుదేవులు (౧) అశ్వగ్రీవ ప్రతివాసుదేవుడు. (౨) తారక . . . . . . (౩) మోదక . . . . . . (౪) మధు . . . . . . (౫) నిశుంభ . . . . . . (౬) బలీ . . . . . . (౭) ప్రహ్లాద . . . . . . (౮) రావణ . . . . . . (౯) జరాసింధు ప్రతివాసుదేవు లను వీరెల్లరు నరకమునకే పోయిరి.

కల్పసూత్రభాష్యమున నిట్లున్నది.

"ఋషభదేవుడు మొదలు మహావీరుని వఱకుగల ౨౪ గురు తీర్థంకరులెల్లరు మోక్షమును బొందిరి."

సమీక్షకుడు :- భళీ! బుద్ధిమంతులు విచారింతురుగాక! జైనుల తీర్థంకరులు, సాధువులు, గృహస్థులు. వీరిలో నెందఱో వేశ్యాగాములు, పరస్త్రీ గాములు, దొంగలు నున్నారు. అయినను వీరందఱు స్వర్గమునకు బోయిరి. ఇట్లనుట యెంతటి చెడ్డమాటయో చూడుడు. వాస్తవమున బాగుగ నాలోచించి చూచి సత్పురుషులైనవారు జైనులతో సాంగత్యము చేయుట యటుంచి వారిని జూచుటయు జెడుగే యగును. ఏలయనగా వారి సాంగత్యము చేసిన నిట్టి చెడ్డయసత్యపు విషయములు వారి హృదయమున నంకితము లగును. మిక్కిలి దురాగ్రహులైన వారి సాంగత్యము వలన జెడుగులు తప్ప మంచి యేదియు నేర్వరాదు. వారిలో నుత్తములైన వారితో సాంగత్యముజేసిన నేమియు దోషముండదు.

వివేకసారము పుట ౫౫లో నిట్లున్నది.

గంగాది తీర్థములు, కాశ్యాదిక్షేత్రములు, సేవించిన నేమియు సిద్ధింపదు. కాని తమ గిరనార్, పాలీటాణా, ఆబూ ఆదితీర్థములు మాత్రము మోక్షమునుగూడ నీగలవు."

సమీక్షకుడు :- శైవ వైష్ణవాదుల తీర్థములు, క్షేత్రములు, జలస్థలములు నెట్లు జడములో జైనుల క్షేత్రములు నట్లే జడములు. వీనిలో గొన్నింటిని బ్రశంసించుట మఱికొన్నింటిని నిందించుట మూర్ఖత తప్ప వేఱేమియు లేదు.

రత్నసారము భాగము ౧ పుట ౨౩, ౨౪లో మహావీర తీర్థంకరుడు గౌతమునితో ననుచున్నాడు. "ఊర్ధ్వలోకమున నొక సిద్ధశిలాస్థానమున్నది. స్వర్గపురి పైన నలువదియైదు లక్షల యోజనముల పొడవు, నంతే (పోలీ) వెడల్పు, నెనిమిది యోజనముల మందము గలిగియున్నది. తెల్లని ముత్యాల హారము కంటెను గోదుగ్ధముకంటెను మిక్కిలి తెలుపు గలిగియున్నది. సువర్ణము వలె బ్రకాశమానము, స్ఫటికము

కంటె నిర్మలము. ఆ సిద్ధశిల పదునాల్గవ లోకపు శిఖమీద నున్నది. ఆ సిద్ధశిలమీద శివపురధామము. దానియందును ముక్తపురుషులు అధరమున-క్రింద నుందురు. అక్కడ జన్మమరణాది దోషములుండవు. ఆనందము చేయుచుందురు. మరల జన్మమరణములకు రారు. సర్వకర్మలనుండియు విడివడుదురు. ఇదియే జైనుల ముక్తి."

సమీక్షకుడు :- ఇట విచారించవలసిన విషయము. అన్యమతస్థుల వైకుంఠము, కైలాసము, గోలోక శ్రీపురము, మున్నగు పౌరాణికులయు, క్రైస్తవుల నాల్గవయాకాశము, మహమ్మదీయుల యేడవ యాకాశము ముక్తిస్థానము లైనట్లు జైనుల సిద్ధశిల, శివపురము నన్నవి. కారణమేమన దేనిని జైను లెత్తున నున్నదనుచున్నారో యదియే క్రిందనుండువారికి-భూగోళమున గ్రిందనున్నారో వారి నపేక్షించి క్రింద యగును. ఆర్యావర్తపు వారు దేనిని గ్రిందనుచున్నారో యమెరికా వాసుల కది యున్నత మగును.

ఆశిల చెప్పినదానికంటె రెండురెట్లు తొంబది లక్షల క్రోసుల పొడవైన దైనను ముక్తులు బంధనములో నున్నట్లే యగును. ఏలయనగా నాశిలనుండి కాని, శివపురమునుండికాని వెలుపలకు వచ్చిన వారి ముక్తి నశించును. ఎప్పుడు నటనే యుండుటలో బ్రీతియు, విడిచిపోవుటలో నప్రీతియు నాముక్తుల కుండవచ్చును. ఎక్కడ నాటంకము, ప్రీతి, యప్రీతి యుండునో యది ముక్తి యెట్లగును? ముక్తి నవమసముల్లాసమున వర్ణింపబడినట్టు లంగీకరించుట సమంజసమగును.

జైనులముక్తి యొక విధమగుబంధనమే. జైనులు ముక్తి విషయమున భ్రమలో బడియున్నారు. వేదములయథార్థము కలుగకున్న ముక్తి స్వరూపముకూడ తెలియదనుట వాస్తవము.

ఇప్పుడింకను నీజైనుల యసంభవ విషయములను వినుడు. వివేకసారము పుట ౭౮- "మహావీరుడు జన్మించినపు డతనికి నొకక్కోటి యఱువది లక్షల కలశములతో స్నానము చేయించిరి."

వివేకసారము ౧౩౬ పుటలో "దశార్ణ రాజు మహావీరుని దర్శించుటకు వెళ్ళి యట గొంచె మభిమాన పడెను. అతని యభిమానమును దొలగించుటకు ౧౬౭౭౭౨౧౬౦౦౦ ఇంద్రస్వరూపులు, ౧౩ ౩౭౦ ౯౭౨ ౮౦ ౦౦౦౦౦౦౦ ఇంద్రాణులు నక్కడికి వచ్చిరి. వారిని జూచి రాజు చకితు డయ్యెను."

సమీక్షకుడు :- ఇంతమంది యింద్రులు, నింతమంది యింద్రాణులు నిలబడుట కెన్ని భూగోళములు కావలయునో బుద్ధిమంతు లాలోచింపుడు!

శ్రాద్ధదినకృత్యము - ఆత్మనిందాభావనా పుట ౩౦లో "బావికాని, చెఱువుకాని త్రవ్వింపరాదు" అని వ్రాయబడి యున్నది.

సమీక్షకుడు :- లోకమున నెల్లరు జైనమతస్థులై పోయి, బావికాని, చెఱువుకాని త్రవ్వింపకపోయిన వీరందఱు నీటిని నెటనుండి త్రాగగలరు?

ప్రశ్న :- చెఱువులు మున్నగునవి త్రవ్వించిన బురుగులు పడును. కావున ద్రవ్వించువారికి బాపము కలుగును. కావున మేము జైనుల మిట్టి పనులు చేయము.

ఉత్తరము :- మీ బుద్ధి యెందులకు నష్టమై పోయినది? క్షుద్ర ప్రాణులు మరణించిన బాప మనుచున్నారు. చెఱువులలో బశువులు మున్నగు పెద్దప్రాణులు మనుష్యులు నీరుద్రాగి బ్రతుకుదురు! ఈ పెద్ద ప్రాణుల కుపకారము చేసిన బుణ్యము కలుగదా! నీరు లేక యీపెద్ద ప్రాణులు చచ్చిన బాపము రాదా!

తత్త్వవివేకము పుట ౧౯౬, ౧౯౮లో వ్రాయబడినది.

'ఒక నగరమున నందమణికార్ అనునొక సేఠ్-శ్రేష్ఠి బావిని ద్రవ్వించెను. అందువలన నతడు ధర్మభ్రష్టుడై పదునాఱు మహారోగములకు గుఱి యయ్యెను. చనిపోయి యాబావిలోనే కప్పయై పుట్టెను.

మహావీరుని దర్శనము వలన నతనికి జాతిస్మరణము కలిగెను.' అంతట మహావీరు డనెను. "నారాకను విని యతడు పూర్వజన్మపు ధర్మాచార్యుడని యెఱిగి వందనము చేయుటకు బయలుదేరగా మార్గమధ్యమున శ్రేణికుని గుఱ్ఱపుగిట్ట క్రిందబడి చచ్చి శుభధ్యాన యోగమున దర్దురాంక నామక మహర్ధిక దేవత యయ్యెను. అవధిజ్ఞానము వలన నేనిటకు వచ్చినది తెలిసికొని వందన పూర్వకముగ బుద్ధివెల్లడించి వెళ్ళెను."

సమీక్షకుడు :- ఇట్టి విద్యావిరుద్ధములు, నసంభవములునగు మిథ్యా విషయములను జెప్పు మహావీరుని సర్వోత్తముడని యంగీకరించుట మహాభ్రాంతి యగును.

శ్రాద్ధదినకృత్యము పుట ౧౬లో నిట్లున్నది.

"మృతకవస్త్రములను సాధువులు తీసికొనవలయును."

సమీక్షకుడు :- చూడుడు! వీరి సాధువులుకూడ మహాబ్రాహ్మణులకు సమానులైరి. చచ్చినవారి వస్త్రములను సాధువులు తీసికొనవలయునట. ఆ చచ్చినవాని యాభూషణముల నెవరు గ్రహింపవలయును? బహుమూల్యము కలవియగుటవలన వాని నింటిలోనే యుంచుకొందురేమో! అప్పుడాయింటి వారుకూడ నెవరైరి! (మహాబ్రాహ్మణులు కారా?)

(పిండిచేయుట రొట్టెచేయుట పాపము)

రత్నసారము భాగము ౧ పుట ౧౦౫లో

"ధాన్యమును వేయించుటలోను, పిండి చేయుటలోను, దంచుటలోను, నన్నము వండుటలోను బాపము కలుగును."

సమీక్షకుడు :- వీరి విద్యావిహీనతను జూడుడు. ఉపర్యుక్త కర్మల నాచరింపకున్న మనుష్యులు బ్రతుకు టెట్లు? జైనులు కూడ పీడితులై మరణింతురు.

రత్నసారము భాగము ౧ పుట ౧౦౪లో

"తోటను పెంచుటలో దోటమాలికి నొకలక్ష పాపము లంటుకొనును"

సమీక్షకుడు :- తోటమాలికి లక్షపాపములు తగిలిన దగలనిండు. కాని తోటలోని ఫలపుష్ప పత్రాదులవలన నెన్నియో ప్రాణులు సుఖము ననుభవించును. అందువలన గోట్లకొలది పుణ్యములు లభించును గదా! ఈ విషయముపై గొంచెమైన ధ్యానము కలుగదా! ఎంతటి యజ్ఞానము.

తత్త్వవివేకము పుట ౨౦౧, ౨౦౨ :- "ఒక దినమున నొకలబ్ధి – సిద్ధుడు (నందిషేణుడు) ఆకలితో నొక వేశ్యయింటికి వెళ్ళెను. ధర్మముతో భిక్ష నడిగెను. 'ఇక్కడ ధర్మముతో పనిలేదు'. కాని ధనముతో బనియున్నది'. అని వేశ్య యనెను. అంతట నా లబ్ధిసాధువు పండ్రెండున్నర లక్షల బంగారు నవరసుల వర్షము కురియించెను. వేశ్యయిల్లు నిండిపోయెను."

సమీక్షకుడు :- ఈ విషయము నష్టబుద్ధియైన మనుష్యుడు తప్ప బుద్ధిగలవాడు సత్యమని యంగీకరింపగలడా?

రత్నసారము భాగము ౧ పుట ౬౭లో నిట్లున్నది.

"గుఱ్ఱము మీద నెక్కియున్న యొకరాతిమూర్తి, తనను స్మరించిన వారిని వారున్న తావునకు వెళ్ళి రక్షించును."

సమీక్షకుడు :- జైనమహాశయా చెప్పండి! ఈ కాలములో మీకు జోరులు, బందిపోటు దొంగలు, శత్రువులు మున్నగు వారివలన భయము కలుగుచుండును గదా! అట్టి సమయములలో నామూర్తిని స్మరించి మీరక్షణము నేల చేసికొనరు? పోలీసులదగ్గఱకు, గోర్టులకు బోయి నానావస్థ లెందుకు బడు చున్నారు?

(శ్వేతాంబరులు దిగంబరులు)

ఇప్పుడు వీరిసాధువుల లక్షణములు.

"సరజోహరణా భైక్షభుజో లుంచితమూర్ధజాః
శ్వేతాంబరాః క్షమాశీలా నిఃసంగా జైనసాధవః." (౧)
"లుంచితాః పిచ్ఛికాహస్తాః పాణిపాత్రాదిగంబరాః
ఊర్ధ్వాశినో గృహే దాతుర్ద్వితీయాస్యు ర్జినర్షయః." (౨)
"భుంక్తే న కేవలీ న స్త్రీ మోక్షమేతి దిగంబరః
ప్రాహురేషామయం భేదో మహాన్ శ్వేతాంబరైః సహ" (౩)

జైనసాధువుల లక్షణము కొఱకు 'జినదత్తసూరి' యీశ్లోకములను జెప్పియున్నాడు. సరజోహరణ = చామరము నుంచుకొనుట, భిక్షాన్నమును దినుట, తలవెంట్రుకల నూడబెఱికికొనుట, తెల్లని వస్త్రము లను ధరించుట, క్షమాయుక్తుడై యుండుట, యెవని సంగతియు జేయకుండుట యనులక్షణ ములు జైనుల శ్వేతాంబర సాధువులు కలిగియుందురు. వీరిని 'జతీ' యందురు. (౧)

దిగంబరులు- వస్త్రములు ధరింపకుండుట, తల వెంట్రుకలూడబెఱికికొనుట, పిచ్ఛికా = ఉన్ని దారముతో జేయబడిన చీపురు చంకలో నుంచుకొనుట, ఎవరేని భిక్షపెట్టిన జేతిలో గ్రహించి తినుట దిగంబరుల లక్షణములు. జైనులలో వీరు రెండవవిధసాధువులు. భిక్షపెట్టు గృహస్థులు తాము ముందు భుజించిన తదుపరి భుజించువారు జినర్షులు మూడవ విధపు సాధువులు. (౨)

దిగంబరులకు శ్వేతాంబరులకు భేదమేమన, దిగంబరులు స్త్రీలకు నపవర్గము లేదందురు. శ్వేతాం బరు లపవర్గ మున్నదందురు. వీరిలో గేవలులు భోజనము చేయరు. ఇట్టి విషయములవలన మోక్షమును బొందుదురు. ఇదియే వీరి సాధువులలో భేదము. (౩)

జైనులలో గేశలుంచనము-వెంట్రుకల నూడబెఱికికొనుట, యంతటను బ్రసిద్ధమై యున్నది. ఐదు పిడికెళ్ళ వెంట్రుకల లుంచనము కూడ నక్కడక్కడ వ్రాయబడి యున్నది.

వివేకసారము భా. ౨౧౬ పుటలో వ్రాయబడి యున్నది. "పంచముష్టి లుంచనముజేసి చారిత్రను గ్రహించెను. అనగా నైదు పిడికిళ్ళ వెంట్రుక లూడబెఱికికొని సాధువయ్యెను." కల్పసూత్రభాష్యము. పృష్ఠ ౧౦౮. కేశలుంచనము చేయవలయును. గోవు వెంట్రుకలవలె నుంచవలయును.

సమీక్షకుడు :- జైనులార! ఇప్పుడు చెప్పుడు. మీధర్మము దయాధర్మ మెట్లగును? ఎవరైనను చేయిండు. కేశములు లుంచనము స్వయముగా జేసినను, గురువుచేసినను లేక యితరులు చేసినను గేశ లుంచనము బాధ కలుగదా? అది హింసకాదా? జీవునకు గష్టము కలిగించుటయే కదా హింస యనబడును.

వివేకసారము పుట ౭, ౮, "సంవత్ ౧౬౩౩ సంవత్సరమున శ్వేతాంబరులలో నుండి 'ఢూంఢియా' అనువారు, వారినుండి 'తేరహపంథీ' అనువారును మిక్కిలి యాడంబరులు బయలుదేరిరి. ఢూంఢియాలు పాషాణాది మూర్తుల నంగీకరింపరు. వారు భోజనము, స్నానము వదలి యెల్లపుడు నోటికడ్డముగా నొకపట్టీ కట్టి యుంచుదురు. ఇతర సమయమున నుంచరు.

ప్రశ్న :- ముఖము-నోటిపై గుడ్డ తప్పక కట్టియుంచవలయును. ఏలయన వాయుకాయ-అనగా వాయువునందుండు సూక్ష్మశరీరములుగల జీవులు ముఖము నుండి వెలువడు నుష్ణబాష్పమువలన చనిపోవును. గుడ్డ కట్టుకొననివారికి బాపము కలుగును. కావున నోటిపై గుడ్డకట్టుకొనుట మంచిదని తలంచుచున్నాము.

ఉత్తరము :- ఈ విషయము విద్యకు, ప్రత్యక్షాది ప్రమాణాది రీతుల ననుసరించి యయుక్తము.

ఏలయన జీవులమరులు, నజరులు. కావున ముఖపువేడికి నవి చావవు. మీరుకూడ జీవులను నజరులు నమరు లనియే యంగీకరింతురు.

ప్రశ్న :- జీవుడు చావడు. కాని నోటి వేడిగాలి వలన వానికి గష్టము కలుగును. ఆ కష్టము కలిగించువారికి బాపము వాటిల్లును. అందువలన ముఖముపై గుడ్డకట్టి యుంచవలయును.

ఉత్తరము :- ఈ నీ విషయముకూడ సర్వథా యసంభవము. ఏ జీవునకు గొంచెమైనను కష్టము కలిగింపక యేకార్యమును నెఱవేఱదు. నోటిగాలి వలన జీవులకు బీడ గలుగునెడల మనుష్యులు తిరుగుటలో, గూర్చుండుటలో, నిల్చుండుటలో, గాళ్ళు చేతులాడించుటలో జీవులకు గష్టములు కలుగ వచ్చును. కావున నోటికి గుడ్డలు కట్టుకొని మీరును జీవులకు గష్టములు కలిగించువారే యగుదురు.

ప్రశ్న :- అవును. అయినను వీలైనంతవఱకు జీవులను రక్షింపవలయును. ఎక్కడ రక్షించుటకు వీలుకాదో యక్కడ మేమసమర్థులము కావచ్చును. ఎందువలన ననగా వాయువు మున్నగు పదార్థము లన్నింటి యందును జీవులు నిండియున్నవి. కావున మేము గుడ్డకట్టుకొనకున్న నెక్కువ జీవులకు కష్టము కలుగును - చచ్చిపోవును. గుడ్డ కట్టినందున దక్కువ చచ్చును.

ఉత్తరము :- ఈ నీమాటలు యుక్తిశూన్యములే. కారణమేమన గుడ్డ కట్టుటవలననే యెక్కుడు కష్టము కలుగును. నోటికి గుడ్డ కట్టినందున నోటి నుండి తిన్నగా బయటికి గాలిరాక ప్రక్కలకు బోవును. గుడ్డవలన నడ్డగింపబడి యెక్కువదట్టమై గాలి వేగముగా బయటికి వచ్చును. నోరుమూసి యుంచినపుడు ముక్కు ద్వారమున బయటికి వచ్చును. అప్పుడు జీవు లెక్కువ బాధ పొందును. ఉష్ణత కూడ నెక్కువయై జీవుల కెక్కువ కష్టము కలిగించును.

చూడుడు; ఇంటినిగాని, యొకగదినికాని ద్వారములన్నియు మూసి పరదాలువేసి యుంచిన నందలి గాలి యెక్కువ యుష్ణము కలది యగును. తెఱచియుంచిన నంతవేడిమి యుండదు. అట్లే నోటిమీద గుడ్డ యుంచిన నుష్ణ మధిక మగును. విడిగా నుంచిన నంతవేడిమి కలుగదు. కావున నీమతము ననుసరించి మీరు చేయుపనులవలన జీవుల కెక్కువ కష్టము కలుగును. ముఖమును బంధించి యుంచినచో లోపల వాయు వడ్డగింపబడి వేడియై ముక్కుపుటముల నుండి వేగముగా బయలు వెడలును. అందువలన జీవులకు నెక్కువ కష్టమే కలుగును.

అగ్నిని బ్రజ్వలింపజేయుట కొకవ్యక్తి నోటితో నూదును. ఇంకొక్కడు నోటిని సంకోచింపజేసి గొట్టముద్వారా యూదిన నెక్కుడు గాలి వేగముగా దగిలి యగ్ని రగుల్కొనును. అట్లే నోటిని మూసి యుంచినచో గాలి యడ్డగింపబడి ముక్కు రంధ్రముల నుండి బయటకు వేగముగా వెడలును. అందు వలన మీయాచారము వలననే జీవుల కెక్కువ కష్టము కల్గును. కావున బట్టీ కట్టుకొనువారికంటె కట్టని వారే యెక్కువ పుణ్యాత్ములగుదురు. పట్టీ కట్టుకొనినవారు శబ్దములను నక్షరములను సరిగా నుచ్చరింప జాలరు. నిరనునాసికాక్షరములను సానునాసికములుగా బలుకుట వలన దోషము కలుగును.

ఈ గుడ్డ కట్టుకొనువారి ముఖము నుండి దుర్గంధముకూడ నెక్కువ వచ్చును. శరీరమునుండి బయటికివచ్చు వాయువు దుర్గంధయుక్తమై యుండుట ప్రత్యక్షము. అది యడ్డగించిన దుర్గంధ మెక్కువగుట సహజము. మూతబడియుండు చోటు దుర్గంధయుక్తమై, తెఱచియుండుచోటు దుర్గంధము లేకుండుట ప్రసిద్ధమైన విషయము. నోటికి గుడ్డకట్టుకొని, దంతధావనము చేయక, గండూషము చేయక, స్నానము చేయక, వస్త్రము లుతుకక మీరు మిక్కిలి మురికితో నుందురు. అందువలన మీనుండి దుర్గంధ మధికముగా వచ్చును. ఇట్లు దుర్గంధము వాయువుద్వారా వ్యాపించి జీవులకు రోగములు కల్పించి వారి కెక్కువ దుఃఖములు వాటిల్ల జేయుటవలన మీకు మిక్కిలి పాపము కలుగును.

జాతర జరుగు తావున దుర్గంధ మెక్కుడై కలరా మున్నగు వ్యాధులు వ్యాపించును. జీవులు దుఃఖ ములపాలగును. దుర్గంధము తక్కువయైన రోగము లుండవు. జీవులకు దుఃఖము కలుగదు. దీనింబట్టి మీవలన దుర్గంధ మెక్కువ వ్యాపించి జీవు లెక్కువ పీడితు లగుదురు. పట్టీ కట్టని వారివలన నట్టి దుఃఖములు కలుగవు. మీకంటె వారే మంచివారు.

అన్త్యజులలో దుర్గంధ మెక్కువ యుండును. కావున వారితో బుద్ధిమంతులు సాంగత్యము చేయరు. అట్లే మీరును మిక్కిలి దుర్గంధయుక్త శరీరములు కలిగియుందురు. మీ సాంగత్యము వలనను మంచి బుద్ధి కలుగనేరదు. మీకు మీతో నుండువారికి నంతే. రోగము లెక్కువై బుద్ధి తక్కువయైనచో ధర్మానుష్ఠానము కలుగదు. అట్లే మీస్థితియు మీసహచరుల స్థితియు నుండవచ్చును. దంతధావనాదులు చేయనందున మీనోటినుండి మిక్కిలి దుర్గంధము వెలువడుచుండును. మీ రెవరిదగ్గఱ కూర్చుండినను, మీదగ్గఱ నెవరైన గూర్చుండినను, వారికి మీ నుండి లభించునది దుర్గంధమే కాని మఱియేమియు లభించదు.

ప్రశ్న :- మూసియుంచిన యింటిలో ప్రజ్వలించు నగ్ని వెలుపలి వారికి బాధ కలిగింప జాలనట్లు మేము నోటికి గుడ్డ కట్టుకొనుటవలన నుష్ణత లోపలనే యుండి బయటి జీవులకు దక్కువ బాధ కలుగును. పట్టీ కట్టుకొనుట వలన వెలుపలి జీవులకు దక్కువ పీడ కలుగును. ఎదుట నగ్ని జ్వలించుచున్నపుడు చేతి నడ్డము పెట్టుకొనిన గొంతవేడి తక్కువ తగులును. అట్లే గుడ్డ కట్టుకొనినందున వాయువు నందలి జీవులు శరీరములు కలవగుట వలన వానికి దక్కువ పీడ గలుగును.

ఉత్తరము :- ఈ నీమాటలు పిల్లల మాటలుగా నున్నవి. మొదట చూడుడు! మూసి యుంచిన యింటిలో నగ్ని ప్రజ్వలింపవలయు ననిన వెలుపలి గాలికి లోపలి గాలికి సంబంధ ముండవలయును. లేకున్ననట నగ్ని ప్రజ్వలింపదు. ఇది ప్రత్యక్షముగా జూడదలచిన నొకపాత్రలో నగ్నిని వెలిగించి వెలుపలి గాలి తగలకుండ మూతవేసి చూడుడు. అగ్ని యప్పు డాఱిపోవును.భూమిపై నుండు మనుష్యులు వెలుపలి గాలితో సంబంధము లేకున్న బ్రతుకజాలరు. అట్లే యగ్నికూడ వాయుసంబంధము లేక మండదు. ఒకవైపునుండి యగ్నివేగము నాపిన రెండవ వైపున నెక్కువ వేగముతో బయటికి వచ్చును. ఎదుటనున్న యగ్నియొక్క యుష్ణము తగులకుండునట్లు ముఖమునకు నడ్డముగా జేతినుంచిన ముఖమునకు నుష్ణము తక్కువ తగులును. కాని యడ్డము పెట్టిన చేతిమీద నెక్కువగా నుష్ణము తగు ·లును. కావున నీవు చెప్పునది సంగతము కాదు.

ప్రశ్న :- ఇది యంద రెఱిగిన విషయము. ఒక పెద్ద మనుష్యునితో నొకచిన్న వ్యక్తి మాటలాడ దలచిన నతడు పెద్దదగ్గఱకు వెళ్ళి యతని చెవిలోనైన జెప్పును లేక ముఖమునకు జేతిని గాని గుడ్డనుగాని యడ్డము పెట్టుకొని మాటలాడును. అందువలన నతని నోటినుండి తుంపురులు కాని దుర్గంధము కాని పెద్దమనుష్యునిపై బడకుండును. అట్లే పుస్తకము చదువు నపుడును గుడ్డ నడ్డము పెట్టుకొనకున్న నోటితుంపురులు పుస్తకముపైబడి యది చెడును. కావున ముఖముపై గుడ్డ పెట్టుకొనుటయే మంచిది.

ఉత్తరము :- దీనింబట్టి జీవరక్షార్థము పట్టీ కట్టుకొనుట వ్యర్థమని తెలుచున్నది. ఒక పెద్దతో జిన్న వ్యక్తి మాటలాడునపుడు చేతినో గుడ్డనో యడ్డముంచుకొనుట జీవరక్షార్థము కాదు. వారు మాటలాడు గుప్త విషయ మితరులకు దెలియకుండుట కట్లు చేయుదురు. ఏలయన ప్రసిద్ధ విషయము మాటలాడునపు డెవరును నేదియు నడ్డము పెట్టరు. దీనింబట్టి గుప్తవిషయము కొఱకు నట్లు చేయుదురని సిద్ధమగు చున్నది.

ముఖమున కడ్డుగా జేతినో, గుడ్డనో యుంచుకొనుటలో ప్రయోజన మింకను వేఱుగా నున్నది. పలువురు మనుష్యులుండగా వారియెదుట గుప్తవిషయము మాటలాడునపుడు చేతినో గుడ్డనో యడ్డము

పెట్టుకొనకున్న నావిషయ మితరులు వినుట కవకాశము కలుగును. ఇద్దఱు వ్యక్తులేకాంతమున మాట లాడుకొనునపు డట నెవరు నితరులు వినువారుండరు గావున నేమియు నడ్డము నుంచుకొనకయే మాట లాడుదురు. పెద్దల మీదనే నోటితుంపురులు పడకూడ దనునియమములో నర్థమేమి? చిన్నవారిపై నెంగిలి తుంపురులు పడవచ్చునా? ఎంగిలి తుంపురు లెవరిమీదను బడకూడదు. కాని, యుమ్మి తుంపురులు మాటలాడునపుడితరుల మీద బొత్తిగా బడకుండుటయు నసంభవము. దూరముననుండి మాటలాడినను నుమ్మి తుంపురులు సూక్ష్మరూపమున వాయువుద్వారా యితరులమీద బడకుండ నుండనేరవు. కాని యది తప్పుగా భావించుట యవిద్య యగును.

నోటి వేడివలన జీవులు చచ్చుటయో లేక వానికి బీడ గలుగుటయో జరిగిన వైశాఖ జ్యేష్ఠమాసము లలో సూర్యునితాపమునకు వాయుకాయజీవులలో నేవియు చావక యుండనేరవు. వాస్తవమున నాయుష్ణ తకు వాయుగత జీవులు చనిపోవు. జీవు లజరులు నమరులును. కావున మీ సిద్ధాంత మసత్యము. మీ తీర్థం కరులును విద్వాంసులైయున్న నిట్టి వ్యర్థవిషయము లేలయంగీకరింతురు?

చూడుడు! ఏ జీవుని వృత్తి యన్నియవయవములతో నుండునో యట్టి జీవునకే పీడ గలుగును. ఇందు బ్రమాణము.

"పంచావయవయోగాత్ సుఖసంవిత్తిః" (సాంఖ్యసూ. ౫–౨౭)

పంచేంద్రియములతో బంచవిషయములకు సంబంధమేర్పడినపుడే జీవునకు సుఖమో దుఃఖమో కలుగును.

చెవిటివానికి దిట్లు దుఃఖము కలిగింపవు. గ్రుడ్డివాని సమీపము నుండి సర్పము పోయినను నతనికి భయము కలుగదు. ముక్కిడికి దుర్గంధము బాధ కలిగింపదు. జిహ్వ లేనివానికి రసప్రాప్తి తెలియదు. ఇట్లే వాయుగత జీవుల విషయమని యెంచవలయును.

జీవుడు సుషుప్తిలో నున్నప్పు డతనికి సుఖదుఃఖములు తెలియవు. జీవుడు శరీరములో నుండియు బాహ్యేంద్రియములతో సంబంధము లేనందున నతని కేమియు దెలియదు. వైద్యుడుకాని, డాక్టరుకాని రోగికి మత్తు మందు నిచ్చి యతని శరీరమును జీరుదురు. అయినను నతనికి దుఃఖము కలుగదు. అట్లే వాయుకాయజీవులకు స్థావరాదులలో నుండు జీవులకు సుఖదుఃఖప్రాప్తి కలుగదు.

మూర్ఛిత ప్రాణులకు సుఖదుఃఖములెట్లు తెలియవో అట్లే వాయుకాయాది జీవులకు అత్యంత మూర్ఛావస్థలో నున్నందున సుఖదుఃఖములు తెలియవు. కావున వానిని బాధనుండి రక్షించుననుట యెట్లు కుదురును? వాని సుఖదుఃఖ ప్రాప్తి ప్రత్యక్ష సిద్ధము కానపుడు అనుమానాదులెట్లు పొసగును?

ప్రశ్న :– జీవులైనపుడు వారికి సుఖదుఃఖము లేలకలుగవు?

ఉత్తరము :– అమాయకులార! వినుడు. మీరు సుషుప్తిలో నున్నపుడు మీకు సుఖదుఃఖము లేల కలుగవు? సుఖదుఃఖప్రాప్తికి గారణము ప్రసిద్ధ సంబంధము. ఇప్పుడే మేము సమాధానము చెప్పితిమి. మత్తుమందును వాసనచూపి డాక్టర్ శరీరమును గోసినను బాధకలుగదు. అట్లే యతిమూర్ఛిత జీవులకును సుఖదుఃఖములు కలుగవు. కారణము సుఖదుఃఖములు కలిగించు సాధన మేదియు లేకుండుటయే.

ప్రశ్న :– చూడుడు! మేము 'నిలోతి' అనగా పచ్చిశాకములు, కందమూలములు తినము. కారణము వానిలో జాలజీవు లుండును. వానిని దిందుమేని యా జీవులను జంపిన పాపము, హింసించిన పాపము మాకు గలుగును.

ఉత్తరము :– ఇది మీ మిక్కిలి యవిద్యా విషయము. పచ్చిశాకములను దినిన జీవులు చచ్చుననియు వానికి హింస జరుగుననియు నేల యెంచుచున్నారు! జీవులు బాధపడుచున్నట్లు మీకేమైన బ్రత్యక్షముగా

దెలియుచున్నదా? మీకు గనబడుచున్న మాకును జూపుడు. మీరెన్నడు జూడలేరు; ఇతరులకు జూపను లేరు. ప్రత్యక్షప్రమాణమే లేనపు డనుమానోపమాన శబ్ద ప్రమాణము లెట్లీవిషయమున సంగతము లగును? మేము పైన జెప్పిన సమాధాన మిటను నుత్తరము కాగలదు. అత్యంతాంధకారము-అనగా నింద్రియ ములతో విషయములకు సంబంధము లేనపుడును, మహాసుషుప్తియందును, మిక్కిలి మత్తులోను జీవు డున్నపుడు సుఖదుఃఖప్రాప్తి కలుగునని యంగీకరించుటద్వారా మీతీర్థంకరుల యజ్ఞానము విదితమగు చున్నది. అందువలననే వారు మీ కిట్టి యుక్తివిరుద్ధములు విద్యావిరుద్ధములైన విషయము లుపదేశించి యున్నారు.

ఇంటికి నంతమున్నపుడు దానిలోనుండు వారికి నంతమేల యుండదు? కందమున కంతము మనకు గనబడుచుండ నందుండు జీవుల కంతమేల యుండదు? దీనింబట్టి మీరు చెప్పెడిది తప్పని తేలుచున్నది.

ప్రశ్న :- చూడుడు! మీరు నీటిని కాచకయే చల్లని నీరు త్రాగుచున్నారు. అందువలన మిక్కిలి పాపము చేయుచున్నారు. మే ముష్ణజలమును త్రాగుచున్నట్లు మీరును ద్రాగుడు.

ఉత్తరము :- ఈ మీ మాటయు భ్రమయుక్తమై యున్నది. మీరు నీటిని గాచినపు డందలి జీవు లన్నియు జచ్చుచుండవచ్చును. వాని శరీరము లన్నియు నానీటిలో గలిసిపోయి యుండును. ఆ నీటిని మీరు త్రాగుదురు. ఆ జీవుల శరీరసార మంతయు మీలో జేరును, కావున మీరే మిక్కిలి పాపము చేయు చున్నారు. చల్లనినీరు త్రాగువారు పాపము చేయుటయే లేదు. చల్లనినీరు త్రాగిన నానీరుదరములో జేరి నపుడు కొంత వేడి యగును. ఆ నీటియందలి జీవులు శ్వాసతోబాటు బయటకు బోవును. జలకాయ జీవులకు మేము పైన జెప్పినట్లు సుఖదుఃఖములు కలుగవు. కావున జల్లని నీరు త్రాగువారికి బాపముతో బని యేమున్నది?

ప్రశ్న :- జఠరాగ్ని యుష్ణమును బొంది జీవులు బయటికి బోవునట్లు నీటిని గాచినపుడు వేడిక్షి జీవులు బయటకేల పోవు?

ఉత్తరము :- అవును. బయటకు బోవును. కాని మీరు నోటివేడికే జీవులు చచ్చిపోవునని చెప్పు మీ మతము ననుసరించి జీవులు చచ్చిపోవును. లేకున్న నెక్కువవేడి తగులుటచే హింసింపబడును. వాని శరీరములు జలములో నుండిపోవును. అందువలన నుష్ణజలము త్రాగువారే పాపులగుదురు.

ప్రశ్న :- మేము మా చేతులతో జలమును గాచము. ఏ గృహస్థునకును జలమును గాచుటకు నాజ్ఞయు నీము. కావున మాకు బాప మంటదు.

ఉత్తరము :- మీ రుష్ణమును ద్రాగకున్న గృహస్థులు జలము నేల వేడిచేయుదురు. కావున మీకొఱకు వారు నీటిని గాచుచున్నారు. కావున నాపాపము మీకే తగులును. మీ రెవరికైన నీటిని వేడి చేయుట కొకనికి నాజ్ఞయిచ్చిన నతడొక్కడే కాచి యిచ్చును. అప్పుడొక స్థలముననే జీవులు చచ్చును. కాని గృహస్థులు పాప మెప్పుడేసాధువు దప్పికతో దమయింటికి వచ్చునో యనుభయముతో నెల్లరు కాచియుంచుదురు. అందువలన వ్యాపక జీవహింస మీ కారణమున జరుగుచున్నది. ఆ పాపమంతయు మీకే తగులును.

మఱియు నెక్కువ కాష్ఠములు కాలినందునను, గాల్చినందునను, బైనజెప్పిన ప్రమాణము ననుసరించి వంటచేయుటలో గృషికర్మలో, వ్యాపారాదులలో నన్నిట మీరు జీవులకు హింస గలిగించి మిక్కిలి పాపులగుచున్నారు. వేడినీరు త్రాగుచు నితరులకు వేడినీరు త్రాగుడని యుపదేశించుచున్నారు. కావున మీరే జలము కాచుటకు ముఖ్య నిమిత్తము. అందువలన నేర్పడు పాపము మీకే తగులును. మీ

మాటలతో మిమ్మనుసరించు వారికిని బాపము గలుగును. చల్లని నీరు త్రాగువారికి బాప మంటదు.

మీరు మిక్కిలి యవిద్యలో బడియున్నదియు లేనిదియు మీరే చూడుడు. చిన్నచిన్న జీవులపై దయజూపుచు నితర మతముల వారిని నిందించుట, వారికుపకారము చేయకుండుట పాపము కాదా! పాప మేల కాదు. మిక్కిలి పాపము కూడ. మీ తీర్థంకరులు చెప్పుమతము సత్యమైన సృష్టి యందు నింత వర్షము, నదులు ప్రవహించుట, సముద్రాలలో నింతజలము పరమేశ్వరు డేల సృష్టించును. అట్లే సూర్యుని గూడ నుత్పన్నము చేయక యుండవలసినది. మీ మతానుసారము సూర్యుని వేడివలన గోట్లకొలది జీవులు చచ్చిపోవుచున్నవి కదా? మీరంగీకరించు నీశ్వరుడు జీవులను రక్షింపనేల యత్నింపడు? మేఘములు వర్షింపకుండునట్లు చేయడేల? సూర్యుని తాపము నేల తగ్గింపడు? సూర్యునిలో వేడిలేకుండ జేసిన నెంత బాగుండును!

పూర్వము చెప్పినట్లు జీవాత్మకు నింద్రియాదులతో సంబంధరూప వృత్తిలేనపుడు జీవులకు సుఖ దుఃఖములు కలుగవు. కావున గందమూలాదులలో నుండు జీవులకు దుఃఖసుఖప్రాప్తి కలుగదు. సర్వ జీవులమీద సర్వథా దయజూపుటయు దుఃఖమునకు గారణ మగును. ఏలయన మీ మతానుసారము నెల్లరు మనుష్యులు నడచుకొన నారంభించిన దొంగలను దోడుబోతులను దండించు వారెవ్వరు నుండరు. అందు వలన లోకమున నెంత పాపము వర్ధిల్లునో యాలోచింపుడు. దండించువారు లేనపుడు దుష్టులెప్పుడు నితరులను హింసించుచునే యుందురు. కావున దుష్టులను యథారీతిని దండింపవలయును. సజ్జనులపై దయగలిగి వారిని రక్షింపవలయును. దీనికి విపరీతముగ మీ యాచరణము వలన లోకమున బాప మెక్కు డగును. దయాధర్మము లన్నియు నశించును.

ఎందఱో జైనులు దుకాణాలు పెట్టుకొని వ్యాపారము చేయుచుందురు. అసత్యము లాడుచుందురు. పరులధనము నపహరింతురు. దీనులను వంచింతురు. ఇట్టి కుకర్మలు చేయుచుందురు. వారి నట్టి పనులు చేయకుండుట కేల యుపదేశింపరు? నోటి కడ్డముగా గుడ్డలు కట్టుకొని తిరిగిన నేమగును?

మీరు శిష్యులను దగ్గఱ జేర్చుకొందురు. వారికి గేశలుంచనము చేయుటకు బహుదినము లుపవసించుటకు నుపదేశింతురు. అందువలన వారెంతో హింసింప బడుదురు. తద్ద్వారా మీకును హింస కలుగును. ఇతరులను బీడించుట, స్వయముగా బీడింపబడుటయు నొకవిధమగు నాత్మ హత్యయే యగును. ఇట్లు హింసకు లగుటలో మీకు గలుగు ప్రయోజనమేమి?

మీరు జైనులు గుఱ్ఱములపై నొంటెలపై, నేనుగులపై నెక్కి తిరుగుదురు. కూలివారిచే బనులు చేయించుకొందురు. ఇందు మీకు బాపము కలుగదా? మీ శిష్యులు వ్యర్థవిషయములను సత్యములుగా నిరూపింప లేనపుడు తీర్థంకరులు మాత్రము సత్యము నెట్లు చేయగలరు!

మీరు కథలు చెప్పి సత్సంగము చేయునపుడు శ్రోతలు వినుటకు వత్తురు. మీ మతానుసార మప్పు డెన్నో జీవులు చనిపోవును గదా! అందువలన నీ పాపమునకు ముఖ్యకారణము మీరే కదా! ఎందుకిట్లు పాపము చేయుచున్నారు? ఇంతవఱకు మేము చెప్పిన కొలది విషయములను బట్టియే విశేషముగ దెలిసి కొనుడు. జలము, స్థలము, వాయువు మున్నగు వానియందుండు జీవులు మిక్కిలి మూర్ఛితావస్థ యందుండును. కావున వానికి సుఖదుఃఖము లుండవని గుర్తింపుడు.

ఇప్పుడింకను గొన్ని జైనుల యసంభవకథలను వ్రాయుచున్నాము. వానిని వినవలయును. విని యిదియు ధ్యానమున నుంచుకొనవలయును. "ధనుస్సు మనచేతితో గొలిచిన మూడున్నఱ చేతుల - మూరల - పొడవుండును. కాలసంఖ్య మేము పూర్వము వ్రాసినట్లు తెలిసికొనుడు."

రత్నసారము భాగము ౧ పుటలు ౧౬౬, ౧౬౭లో నిట్లున్నది.

(౧) ఋషభదేవుని శరీరము ౫౦౦ ధనుస్సుల పొడవున్నది. ఆయువు ౮౪౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౨) అజితనాథుని శరీరము ౪౫౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౭౨౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౩) సంభవనాథుని శరీరము ౪౦౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౬౦౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౪) అభినందన శరీరము ౩౫౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౫౦౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౫) సుమతినాథుని శరీరము ౩౫౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౪౦౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౬) పద్మప్రభుని శరీరము ౧౪౦ ధనుస్సుల పొడవు, ౩౦౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౭) పార్శ్వనాథుని శరీరము ౨౦౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౨౦౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౮) చంద్రప్రభుని శరీరము ౧౫౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౧౦౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౯) సువిధినాథుని శరీరము ౧౦౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౨౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౦) శీతలనాథుని శరీరము ౯౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౧౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౧) శ్రేయాంసనాథుని శరీరము ౮౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౮౪౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౧౨) వాసుపూజ్యస్వామి శరీరము ౭౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౭౨౦౦౦౦౦ ల పూర్వ వర్షములు.

(౧౩) విమలనాథుని శరీరము ౬౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౬౦౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౪) అనన్తనాథుని శరీరము ౫౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౩౦౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౫) ధర్మనాథుని శరీరము ౪౫ ధనుస్సుల పొడవు, ఆయువు ౧౦౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౬) శాంతినాథుని శరీరము ౪౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౧౦౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౭) కుంథునాథుని శరీరము ౩౫ ధనుస్సుల పొడవు, ఆయువు ౯౫౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౮) అమరనాథుని శరీరము ౩౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౮౪౦౦౦ ల పూర్వవర్షములు.

(౧౯) మల్లీనాథుని శరీరము ౨౫ ధనుస్సుల పొడవు, ఆయువు ౫౫౦౦౦ ల పూర్వవర్షములు.

(౨౦) మునిసువ్రతుని శరీరము ౨౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౩౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౨౧) నమినాథుని శరీరము ౧౪ ధనుస్సుల పొడవు, ఆయువు ౧౦౦౦౦ ల పూర్వవర్షములు.

(౨౨) నేమినాథుని శరీరము ౧౦ ధనుస్సుల పొడవు, ఆయువు ౧౦౦౦ పూర్వవర్షములు.

(౨౩) పార్శ్వనాథుని శరీరము ౯ చేతుల పొడవు, ఆయువు ౧౦౦ పూర్వవర్షములు.

(౨౪) మహావీరస్వామి శరీరము ౭ చేతుల పొడవు, ఆయువు ౭౨ వర్షములు.

సమీక్షకుడు :- ఈ యిరువది నలుగురు తీర్థంకరులు జైనమత ప్రచారకులు, నాచార్యులు, గురువులును. వీరినే జైనులు పరమేశ్వరులని యంగీకరింతురు. వీరందఱు మోక్షమునకు బోయి యున్నారు. వీరు పైన వర్ణించినంత పెద్దపెద్ద దేహములు కలిగి బహుకాలము జీవించినట్లు వ్రాయుచు న్నారు. మనుష్యదేహమింతపెద్దది, యింతదీర్ఘకాల మాయువు గలిగి యుండుట యెంతవఱకు సంభవమో బుద్ధిమంతు లాలో

చింపుడు. ఈ భూగోళమున నిట్టి మనుష్యు లుండబోరు. ఈ జైనుల గప్పాలు చూచియే పౌరాణికులును దమపురాణములలో లక్షలు వేలు సంవత్సరములు కొందఱు జీవించి యున్నట్లు వ్రాసియున్నారు. అదియును నసంభవమేయని యెంచవలయును. ఇదియే యసంభవ మైనపుడు జైనులది సంభవ మెట్లగును?

ఇప్పుడింకను వినుడు :- కల్పభాష్యము పుట ౪ లో "నాగకేతు వొక గ్రామములో బెద్దశిలను దన యొక్క యంగుళిమీద నిలబెట్టెను" అని యున్నది.

కల్పభాష్యము పుట ౩౫:- మహారుడు తన యంగుష్ఠముతో బృథివిని నణచగా శేషుడు కంపించి పోయెను.

"కల్పభాష్యము ౪౬వ పుటలో :- మహావీరుని నొకసర్పము కాటు వేయగా నతని శరీరము నుండి పాలు వెలువడెను. ఆపామెనిమిదవ స్వర్గమునకు బోయెను.

"౪౭వ పుటలో" మహావీరుని పాదముపై బాయసము పక్వము చేయగా నాతని పాదము కాలలేదు.

కల్పభాష్య ౧౬ పుట :- చిన్నపాత్రలో నొంటెను రప్పించెను.

రత్నసారము భా ౧ పుట ౧౪ :- శరీరముపై నున్న మైలను దీసి వేయరాదు. ఎన్నడు శరీరమును గోకరాదు.

వివేకసారమ భా. ౧ పుట ౧౫ :- జైనుల యొకదమసారు డను సాధువు కుపితుడై యుద్వేగజనక సూత్రమును జదివి యొక పట్టణమును దగులబెట్టెను. అతడు మహావీరునకు మిక్కిలి ప్రియుడు.

వివేకసారము భా. ౧ పుట ౧౨౭ :- "రాజునాజ్ఞ నవశ్యము పాటింపవలయును.

వివేకసారము భా. ౧ పుట ౨౨౭ :- ఒక కోశావేశ్య పళ్లెములో నావాలు ప్రోగుగా బోసి దానిమీద బువ్వులతో గప్పియున్న సూది నొక దానిని నిలబెట్టెను. ఆ సూదిమీద బాగుగా నృత్యము చేసినది. కాని సూది యామెకాలికి గ్రుచ్చుకొనలేదు. ఆవాల ప్రోగు చెదరలేదు.

తత్త్వవివేకము పుట ౨౨౮ :- ఈ కోశావేశ్యతో నొకస్థూలముని ౧౨ సంవత్సరములు భోగించెను. తదుపరి దీక్షతీసికొని సద్గతిని బొందెను. ఆ కోశావేశ్యయు జైనధర్మము పాలించుచు సద్గతినిబొందెను.

వివేక. భా. ౧ పుట ౧౮౫ :- 'ఒక సిద్ధుని 'కంథా' (బొంత) తనకంఠమున ధరించునది, ౫౦౦ సవరుల కంఠమాల ప్రతిదిన మొకవేశ్య కిచ్చుచుండెడిది.

వివేక. భా. ౧ పుట ౨౨౮ :- "బలవంతుడైన పురుషుని యాజ్ఞ, దేవుని యాజ్ఞ, ఘోరారణ్యమున గష్టజీవనయాపనము, గురువు, తల్లి దండ్రులు, కులాచార్యుడు, జ్ఞాతి, ధర్మోపదేష్ట యను నీయార్గురు నడ్డగించుటవలన ధర్మమున గొఱ యేర్పడినను ధర్మహాని కలుగదు.

సమీక్షకుడు :- వీరి మిథ్యా విషయములు చూడుడు! గ్రామమంత పెద్ద రాతిని వ్రేలిమీద నొక మనుష్యు డెట్లు నిలుపగలడు? (౧)

పృథివిని నంగుష్ఠముతో నొత్తిన బృథివి యెట్టు లణగును; శేషుడే లేనప్పు డతడు కంపించు టెట్లు గలుగును? (౨)

లోకమున శరీరమును గోసిన నెత్తురు వచ్చుట చూచితిమి కాని పాలు కారు టెక్కడ జూడలేదు. ఇది గారడియగును కాని మఱియొకటి కాదు. మహావీరుని కాటువేసిన బాము స్వర్గమునకు బోయినది. మహాత్ములైన శ్రీకృష్ణాదులు నరకమునకు బోయిరి. ఇది యెంతటి యసత్యమో చెప్పనక్కఱ లేదు? (౩)

మహావీరుని కాళ్ళమీద పాయసము వండిన బాదము లెందుకు గాలలేదు? (౪)

చిన్నపాత్రలో నొంటె యెట్లు రాగలుగును? (౫)

శరీరపుమైలను శుభ్రము చేయక, గోకక యున్నచో దుర్గంధముతో గూడి మహాకష్టముల పాలుగాక యేమగుదురు? (౬)

నగరమును గాలబెట్టిన జైనసాధువునందు క్షమ యెక్కడికి బోయెను? మహావీరుని ప్రియుడైనను నతనిలో బవిత్రత రాలేదన్నమాట. అట్టియెడ మహావీరుని మరణానంతర మతనిని సేవించువారిగతి యేమి? వారెన్నడు బవిత్రులు కారు. (౭)

రాజాజ్ఞను బాలింపవలసినదే కాని, జైనులు వ్యాపారులు కావున భయముతో నట్లు వ్రాసియుందురు. (౮)

కోశావేశ్య యెంత తేలికగల శరీరము కలదైనను, సూదిమీద నాట్యము చేసినను సూది గ్రుచ్చుకొన కుండుట, యావాలరాశి చెదరకుండుట సర్వథా యబద్ధము. దీనిని జైనులే నమ్ముదురు. (౯)

ధర్మము నెన్నడు వదలరాదు,. ఏది యేమైనను బాలింపవలసినదే. (౧౦)

సాధువు 'కంథా' బొంత –గుడ్డలతో నిర్మింపబడునది. అది నిత్యము ౫౦౦సవరు లెక్కడనుండి యిచ్చును? (౧౧)

ఇట్టి యసంభవములగు కథలన్నియు వారి గ్రంథములలో నున్నవి. వాని నన్నిటి నిట వ్రాసిన గాగితములను వ్యర్థము చేయుట యగును. ఏవో కొలది విషయములు విడిచి మిగిలిన జైనుల విషయము లన్నియు నసత్యములే.

"దోససి దోరవి పఢమే, దుగుణా లవణంమి ధాయ ఈ సండే
వారస ససి వారస రవి తప్ప మి ఇం నిదిశ ససి రవిణో" (౧)
"తిగుణా పుబ్బిలజయా అణంతరాణంతరం మిఖిత్తమి
కాలో ఏ బయాలా విసత్తరీ పుక్కర ద్ధంమి"
(ప్రక. భా. ४ సంగ్రహణీ సూత్ర ౭౭.౭౮)

జంబూద్వీపము లక్షయోజనములు – ४ లక్షల క్రోసులు వ్రాయబడి యున్నది. ఇది మొదటి ద్వీపము. ఇందు నిద్దఱు చంద్రులు, నిద్దఱు సూర్యులు నున్నారు. అట్లే లవణసముద్రమున, దానికి ద్విగుణము నలుగురు చంద్రులు, నలుగురు సూర్యులున్నారు. అట్లే ఘాతకీఖండమున ౧౨ సూర్యులు, ౧౨ చంద్రులు నున్నారు. వీనికి మూడురెట్లు ౩౬ అగును. వానితోబాటు రెండు జంబూద్వీపములు కలిసి ४౨ చంద్రులు, ४౨ సూర్యులు నగును. కాలోదధి సముద్రమున నున్నారు.

ఇదే విధముగ ముందుముందు ద్వీపములందు, సముద్రములందు, బూర్వోక్త సంఖ్యకు త్రిగుణము చేసిన ౧౨౬ అగును. వానిలో ఘాతకీఖండపు ౧౨, లవణసముద్రపు ४, జంబూద్వీపపు ౨, ఇదేరీతిన తీసి ౧४४చంద్రులు, ౧४४ సూర్యులు పుష్కరద్వీపమున నుండును. ఇదియు నర్ధమనుష్య క్షేత్రమునకు సంబంధించిన లెక్క యగును. కాని యెంతవఱకు మనుష్యులుండరో యటబహుచంద్రులు బహు సూర్యులు నుందురు. మఱియు నర్ధపుష్కర ద్వీపమున నుండు బహుచంద్రులు బహుసూర్యులు స్థిరముగా నుందురు.

పూర్వోక్త ౧४४ త్రిగుణకము చేసిన ४౩౨ అగును. వానిలో బూర్వోక్త జంబూద్వీపపు ౨ చంద్రులు, ౨ సూర్యులు, నాలుగు నాలుగు లవణసముద్రపు, పంద్రెండు పంద్రెండు ఘాతకీ ఖండమునకు, ४౨ కాలోదధికి సంబంధించినవి కలిపిన ४౯౨ చంద్రులు, ४౯౨ సూర్యులు నగుదురు. వీరందఱు పుష్కర సముద్రమున నుందురు.

ఈ విషయము లన్నియు శ్రీ జినభద్రగణీ క్షమాశ్రమణుడు, పెద్దసంఘయణియందు, 'యోతీ స

కరండక పయన్నా' మధ్యమున, 'చంద్ర పన్నతి', 'సూరపన్నతి' ప్రముఖ సిద్ధాంత గ్రంథము లందిట్లే వ్రాయబడి యున్నవి.

(అసంభవ సూర్యచంద్రులు)

సమీక్షకుడు :- భూగోళ, ఖగోళ విద్వాంసులారా! వినుడు. ఈ భూగోళమునం దొకవిధముగ ౪౯౨, మఱియొక విధముగ నసంఖ్య చంద్ర సూర్యు లున్నట్లు జైను లంగీకరించుచున్నారు. మీరు చాల భాగ్యవంతులు. సూర్య సిద్ధాంతాది జ్యోతిష గ్రంథములు చదువుటవలన వైదికులగు మీకు భూగోళ, ఖగోళ విషయములు యథార్థముగ బోధపడినవి. జైనుల వలలలో జిక్కియున్న మహాంధకారమున బడియుం డెడివారు. జైనులట్లే యంధకారమున బడియున్నారు. జంబూద్వీపమున నొకచంద్రుడు నొక సూర్యు డుండుటవలన గార్యము నెఱవేఱదని యీ యవిద్వాంసులకు శంక గలిగి యుండును. ఏలయన నింత పెద్దపృథివిని ముప్పదిగడియలలో నెట్లు చుట్టివత్తురు? వీరు పృథివిని సూర్యునికంటె బెద్దదిగా నంగీకరింతురు. ఇదియే వీరి పెద్ద తప్పు.

"దోససి దోరవి పంతీ ఏగంతరియా ఛసఠి సంఖాయా
మేరుం పయాహిణంతా మాణుసఖిత్తే పరిఅడంతి." (ప్రకరణ. భా.౪ సంగ్రహణీ సూత్ర ౭౯)

సం. అర్థము :- మనుష్యలోకమున జంద్ర సూర్యుల పంక్తి సంఖ్యను జెప్పుచున్నారు. రెండు చంద్రుల, రెండు సూర్యుల పంక్తి యున్నది. అవి యొక్కొలక్ష యోజనములు – ౪ లక్షల క్రోసుల దూరపు టంతరముతో నడుచు చున్నవి. సూర్యునిపంక్తికి మధ్య చంద్రునిపంక్తి యున్నది. ఇట్లే చంద్ర పంక్తికి మధ్య సూర్యపంక్తి యున్నది. ఇట్టివి నాలుగు పంక్తులున్నవి. ఒక్కొక్క చంద్రపంక్తిలో ౬౬ చంద్రులున్నవి. ఒక్కొక్క సూర్యపంక్తిలో ౬౬ సూర్యులున్నవి.

ఆ నాలుగు పంక్తులు జంబూద్వీపమునగల మేరుపర్వతము చుట్టి తిరుగుచు మనుష్య క్షేత్రమున బరిభ్రమించుచున్నవి. అనగా నొక సూర్యుడు జంబూద్వీపపు దక్షిణదిశలో దిరుగుచుండ మఱియొక సూర్యుడు – ఉత్తర దిశలో దిరుగును. అట్లే లవణసముద్రపు టొక్కొక్క దిశలో రెండు రెండు తిరుగును. ఘాతకీ సముద్రమునకు నాఱు ౬, కాలోదధికి ౨౧, పుష్కరార్ధమునకు ౩౬, ఇట్లన్నియు గలిసి ౬౬ సూర్యులు దక్షిణ దిశయందు, ౬౬ సూర్యు లుత్తర దిశయందు దమక్రమము ననుసరించి తిరుగు చుండును.

ఈ రెండు దిశలలోని సూర్యుల నన్నిటిని గలిపిన ౧౩౨ సూర్యులు, నొక్కొక్క దిశకు ౬౬ చొప్పున రెండు దిశల చంద్రపంక్తులను గలిపిన ౧౩౨ చంద్రులు మనుష్యలోకమున దిరుగుచుండును. ఇట్లే చంద్రులతో బాటు నక్షత్రపంక్తులు గూడ జాల తిరుగుచున్నట్టు లెఱుగవలయును.

సమీక్షకుడు :- సోదరులారా! చూడుడు. ఈ భూగోళమున ౧౩౨ చంద్రులు, ౧౩౨ సూర్యులు జైనుల యిండ్ల మీద దపించుచుండ వచ్చును. నిజముగా దపించిన వారెట్లు జీవింప గలుగుదురు. రాత్రి యందును ౧౩౨ చంద్రులు ప్రకాశించిన నెంత శీతత యుండునో యాలోచింపుడు. అది నిజమగు నేని జైనులందఱు నొక్కరాత్రిలో బిగుసుకొని పోవుదురు.

భూగోళ ఖగోళ విద్య నెఱుగనివారు వీరి యసంభవ విషయముల నంగీకరింతురు. ఇతరు లెవ్వరు నంగీకరింపరు. ఒక సూర్యుడు మనభూగోళము వంటి భూగోళముల నెన్నింటినో తపింప జేయుచుండ నొక్క భూగోళమును గూర్చి యేమి చెప్పవలయును?

మఱియు భూమి తిరుగక సూర్యుడు తిరుగ నారంభించిన దిన రాత్రుల పరిమాణ మెన్నియో వర్షము లగును. హిమాలయము కాక వేఱు సుమేరు వనునది లేదు. ఈ హిమాలయముకూడ సూర్యుని

యెదుట, నొక యింటి యెదుట నావగింజ యెంతో యంత యగును. జైనులు వారి మతములో నున్నంతవఱకు నీవిషయముల నెఱుగజాలరు. ఎల్లపుడు నంధకారముననే యుందురు.

(కేవలుని రాజ్యభ్రమణము)

**"సమత్తచరణ సహియా సవ్వం లోగం ఫుసే నిరవసేసం, సత్తయ చఉద**
**సభానీ పంచయ సుయదేసవిరఈవి. "** (ప్రక. భాగ. ౪. సంగ్రహణీ సూత్ర. ౧౩౫)

సం. అర్థము :- సమ్యక్ చరిత్రగల కేవలుడు సముద్ఘాత-అవస్థ వలన సమస్త చతుర్దశ రాజ్య లోకములందును భ్రమించును-తిరుగును.

సమీక్షకుడు :- జైనులు పదునాలుగు రాజ్యము లంగీకరింతురు. అందు బదునాల్గవ రాజ్యపు శిఖమీద సర్వార్థసిద్ధి విమానముయొక్క ధ్వజమునకు బైన గొంతదూరమున సిద్ధశిలయు నట్లే దివ్యాకాశమును శివపుర మందురు. కేవలు రనగా నెవరికి గేవలము జ్ఞానము, సర్వజ్ఞత, పూర్ణపవిత్రత ప్రాప్తించినదో వారే యాలోకమునకు బోవుదురు. మఱియు దమ యాత్మ ప్రదేశముతో సర్వజ్ఞులై యుందురు. ఎవనికి ప్రదేశ ముండునో యతడు విభువు కాడు. విభువు కానివాడు సర్వజ్ఞుడు కాడు. కేవల జ్ఞానియు నెన్నడు గాడు. ఏలయన నేకదేశి యైనవాడే వచ్చి పోవుచుండును. అతడు బద్ధుడు, ముక్తుడు, జ్ఞానియు, నజ్ఞానియు నగును, సర్వవ్యాపకుడగు సర్వజ్ఞుడెన్నడు నట్లుండ జాలడు.

జైనుల తీర్థంకరులు జీవరూపులును, అల్పులు నత్యల్పులునై యుండిరి. వారు సర్వవ్యాపకులు, సర్వజ్ఞులు నెన్నడు గాజాలరు. అనాద్యనంతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, పవిత్రుడు, జ్ఞానస్వరూపుడునగు పరమేశ్వరుని జైను లంగీకరింపరు. సర్వజ్ఞత్వాది గుణములు పరమేశ్వరునందే సంగతములగును.

**"గబ్భనర తిపలియాఊ తిగాఉ ఉక్కోస తే జహన్నేణం**
**ముచ్ఛిమ దుహావి అంతముహు అంగుల అసంఖ భాగతణూ**

(ప్ర.ర.భాగ.౪ సంగ్రహణీ సూత్ర. ౨౪౧)

సం. అర్థము :- ఇక్కడ మనుష్యులు రెండు విధములవారున్నారు. ఒకరు గర్భజులు, రెండవవారగర్భజులు. వారిలో గర్భజుల యత్యధికమగు నాయువు మూడు పల్యోపమములు. వారి శరీరము మూడు క్రోసులుండును.

సమీక్షకుడు :- మూడు క్రోసుల పరిమాణముగల శరీరముగలవారు, మూడుపల్యోపమముల యాయువుగల వారీలోకమున గొలది మందియే నివసింప వీలగును. పూర్వము వ్రాసినట్లు మూడు పల్యోపమముల వర్షములు వారు బ్రతికిన వారికి గలుగు సంతానము నట్టివారేయైన బొంబాయి, కలకత్తా వంటి పట్టణములలో నేముగ్గురో నలుగురో యుండగలుగుదురు.

ఇయ్యది వాస్తవ మగునెడల లక్షల మనుష్యులు వసించు పట్టణము లున్నట్లు జైనులు వ్రాసియున్నారు. ఆ పట్టణముల వైశాల్య మెంత యుండవలయునో యాలోచింపుడు. భూమండలము నంతట నొక్క నగరముకూడ వసించు నవకాశ ముండదు.

(సిద్ధశిలా)

**"పణయాల లరకజోయణ విరకంభా సిద్ధిసిల ఫలిహ విమలా,**
**తదువరి గజోయణంతే లోగంతో తచ్ఛ సిద్ధఠిఈ"** (ప్ర. ర. భా. ౪. సం. సూ. ౨౫౮)

సం. అర్థము :- సర్వార్థసిద్ధి విమానము యొక్క ధ్వజమునకు బైన బంద్రెండు యోజనముల సిద్ధశిల యున్నది. దాని వెడల్పు, పొడవు, డొల్లల వైశాల్యము (౪౫) నలువదియైదు లక్షల యోజనములు. అది యంతయు ధవళమై సువర్ణమయమై స్ఫటికమువలె నిర్మలమై సిద్ధశిల సిద్ధభూమి యున్నది. దీనిని

గొందఱు 'ఈషత్ ప్రాగ్భరా' యందురు. ఇది సర్వార్థసిద్ధశిల విమానమునుండి పండ్రెండు యోజనముల యలోకమై యున్నది. ఈ పరమార్థము కేవలుడు మాత్ర మెఱుగును.

ఈ సిద్ధశిల సర్వార్థ మధ్యభాగమున నెనిమిది యోజనముల స్థూలమై యున్నది. అటనుండి నాల్గుదిశలకు, నాలు గుపదిశలకు దగ్గింపబడుచు నీగటెక్కవలె మిక్కిలి పలచనయై యుత్తాన చక్రాకారమున సమానముగ నాసిద్ధశిల స్థాపింపబడి యున్నది. అదికాక యోజనదూరమున లోకాంతరము కలదు. సిద్ధులకు నిలకడ స్థానమదే.

సమీక్షకుడు :- ఇప్పు డిట విచారింపవలసిన విషయము. జైనుల ముక్తిస్థానము సర్వార్థసిద్ధి విమానముయొక్క ధ్వజమునకు పైన (౪౫) నలువదియైదు లక్షల యోజనముల శిల యున్నది. ఆ శిల యెంటి శుద్ధమైనదైనను నెంతమంచిదైనను నందుండు ముక్తజీవు లొకవిధముగ బద్ధులే యనవల యును. ఆశిల వదలి బయటకు వచ్చినచో వారి ముక్తి సుఖము వారికి లభింపదు. మఱిలోపల నుండు వారికి వాయువుకూడ లభింపదు. ఇది కేవలము కల్పన మాత్రమే. అవిద్వాంసులను వలలో వేసికొనుటకు మాత్రమే యిది యుపయోగించును.

(కీటకాదుల పరిమాణము)

**"జోయణ సహస్స మహియం వీగిందియదేహ ముక్కోసం,**
**విలి చఉరిందిన సరీయం వారసజోయణం తికోస చఉకోసం**
**జోయణ సహసపణిం దియ ఉహే వుచ్ఛంత విసేసంతు"** (ప్ర.భా. ౪ సం.౨౬౬, ౨౬౭)

సం. అర్థము :- సామాన్యముగ నేకేంద్రియ జీవుల శరీర మొక్కవేయి యోజనములు పరిమాణ ముత్కృష్టముగా నెంచవలయును. రెండింద్రియములుగల జీవశరీరము ౧౨ పండ్రెండు యోజన ములు. అట్లే చీమలు మున్నగు మూడింద్రియములు గలవాని శరీరములు మూడుక్రోసులు. చతురిం ద్రియ భ్రమరాదుల శరీరములు నాల్గుక్రోసులు. పంచేంద్రియముల శరీరము లొకసహస్ర యోజనములు - నాలుగువేల క్రోసుల పరిమాణము కలిగియుండును.

సమీక్షకుడు :- పంచేంద్రియములుగల యొక్కొక్క మనుష్యుని శరీరము నాలుగువేల క్రోసుల పరిమాణమున్న భూగోళమున గొలదిమంది మనుష్యులే నివసింప వీలగును. మనుష్యుల సంఖ్య వందల కొలది పెరిగిన వారికి దిరుగాడు చోటే యుండక పోవచ్చును. అప్పు డీజైనులనే తాముండు చోటునకు యాచింప వలసి వచ్చును. వారు మాత్రమెక్కడ జూపగలరు! తమ యిండ్లలోనే స్థాన మొసంగుదురేమో! లేకున్న యీ వ్రాతల కర్థమేమి!

నాల్గువేల క్రోసుల శరీరముల వారొక్కరు నివసించుటకే ౩౨ క్రోసుల పరిమాణముగల యిల్లు కావలసివచ్చును. ఇట్టి యొక యిల్లు కట్టుటకే జైనుల ధనమంతయు జాలక పోవచ్చును. అంత పెద్ద యింటికప్పుకు గావలసిన కలప-అంత పెద్దపెద్ద దూలములు నెక్కడ లభించును? ఇట్లూహింప మొదలిడిన నీవిషయము లెంతటి యసత్యములో బోధపడగలదు.

(కాలపరిమాణము)

**తే థూలా పల్లే విహు సంఖిజ్జాచే వహుంతి సవ్వేవి**
**తే ఇక్కిక్క అసంఖే సుహుమే ఖమ్మే పకప్పేహ"**

(ప్ర-ర-భాగ ౪ లఘుక్షేత్ర సమాస ప్రకరణ. సూ. ౪)

సం. అర్థము :- పూర్వోక్తపు టొకయంగుళము పొడవుగల వెండ్రుకల ముక్కలతో నింపిన నాలుగు చదరపు క్రోసుల పరిమాణము - అంతే లోతుగల బావియొకటి -అంగుళప్రమాణ మిరువది లక్షల

యేబది యేడు వేల నూటయేబది రెండగును. ఎక్కువలో నెక్కువ ౩౩౦౭౬౨౧౦౪, ౨౪౬౫౬౨౫, ౪౨౧౯౯౬౦; ౯౭౫౩౬౦౦, ౦౦౦౦౦౦౦. ముప్పది మూడుకోటానకోట్లు నేడులక్షల యఱువది రెండువేల నూటనాలుగు కోటానుకోట్లు, నిరువది నాలుగు లక్షల యఱువదియైదువేల యాఱువందల యిరువది యైదు కోటానకోట్లు, నట్లే నలువది రెండు లక్షల పందొమ్మిది వేల తొమ్మిది వందల యఱువది కోటానకోట్లు, నట్లే తొంబదియేడు లక్షల యేబదిమూడు వేల యాఱువందల కోటానకోట్లు నింత వెడల్పుగల ఘనయోజనముల పల్యోపమమునందు సర్వస్థూల రోమఖండముల సంఖ్య యుండవల యును. ఇదియు సంఖ్యాత కాలమే యగును. పూర్వోక్తమగు నొక్కరోమఖండమునకు నసంఖ్యాత ఖండన ములు మనస్సుతో గల్పించుకొనవలయును. అప్పుడసంఖ్యాత రోమాణువు లగును.

సమీక్షకుడు :- వీరు లెక్కించు పద్ధతిని జూడుడు. ఒక్క యంగుళ ప్రమాణముగల వెంట్రుక నెన్నితునకలు చేసిరో చూడుడు. ఇది యెన్నడైన నెవరి లెక్కకైన రాగలదా! పైగా మనస్సుతో నసంఖ్య ఖండములు కల్పించు చున్నారు. దీనింబట్టి పై ఖండములన్నియు జేసినట్లు తోచుచున్నది. చేతితో జేయుట సాధ్యము కానివానిని మనస్సుతో జేయుడని యప్పుడే సంభవించునుగదా! ఇది యెన్నడైన సంభవమగు నదియేనా?

**"జంబూద్వీపపమాణం గులజోయణలరక వట్టవిరకంభీ**
**లవణా-ఈ యాసేసా బలయాభా దుగుణ దుగుణాయ"**

(ప్ర-ర-భాగ. ౪. లఘుక్షేత్ర సమా. స. ౧౨)

సం. అర్థము :- ప్రథమ జంబూద్వీపము ప్రమాణము లక్షయోజనములు, ఖాళీగా నున్నది. మిగిలిన లవణాది సముద్రము లేదు, సప్తద్వీపములు జంబూద్వీప ప్రమాణమునకు రెండు రెట్లు. ఈ యొక్క పృథివి యందు జంబూద్వీపాదు లేదు, సముద్రము లేదును నున్నవి. వీనిని బూర్వము వ్రాసియున్నాము.

సమీక్షకుడు :- ఇప్పుడు జంబూద్వీపము కంటె రెండవ ద్వీపము రెండు లక్షల యోజనములు, మూడవద్వీపము నాలుగు లక్షల యోజనములు, నాల్గవ ద్వీపమెనిమిది లక్షల యోజనములు, నైదవది పదునాఱు లక్షలు, నాఱవది ముప్పది రెండు లక్షలు, నేడవది యఱువది నాలుగులక్షల యోజనములు, నంతయో, యంతకంటె నెక్కువయో ప్రమాణములుగల సముద్రములు పదునైదు సహస్రయోజన ములు పరిధిగల భూమిపై నెట్లుండ గలవు? ఉండజాలవు. కావున నిదియంతయు మిథ్యాకల్పనయే.

**"కురు నఖ చులసీ సహసా ఛచ్చేవంతరనఈఉ పఖ విజయం**
**దోదో మహా నఈఉ చఉదస సహసాఉ పత్తేయం** (ప్ర-ర.భాగ.౪-లఘుక్షేత్రసమా. సూ.౬౩)

సం.అర్థ :- కురుక్షేత్రమున "౮౪ వేల నదులున్నవి."

సమీక్షకుడు :- కురుక్షేత్ర మొకచిన్నదేశము. దానిని జూడకయే యిట్టి యసత్యపు వ్రాతలు వ్రాయుటకు సిగ్గైనను లేదు.

**జాముత్తరాఉ తాఉ ఇగేగ సింహాసణా అఇపుబ్బం**
**చఉసువి తాసు నియాసణ దిసి భవజిణ మజ్జణం హెూ ఈ"**

(ప్ర. ర. భాగ ౪. లఘుక్షేత్ర సమా. సూ. ౧౯)

సం. అర్థ :- ఆశిలకు విశేషముగ దక్షిణోత్తర దిశలందు నొక్కొక్క సింహాసనము నెఱుంగవల యును. ఆ శిలల నామములు దక్షిణ దిశయందు నతిపాండు కంబల, యుత్తర దిశయందు నతిరక్త కంబల శిల యున్నది. ఆ సింహాసనముల మీద దీర్థంకరులు కూర్చుండియున్నారు.

సమీక్షకుడు :- చూడుడు! వీరి తీర్థంకరుల జన్మోత్సవములు మున్నగునవి చేయు శిలలను. ఇట్లే

ముక్తికి సంబంధించిన సిద్ధశిలయు నున్నది. ఇట్టి విషయము లెన్నియో తలతోకలేనివి యున్నవి. ఎన్నియని వ్రాయవలయును. కాని, నీరు వడపోసి త్రాగుట, నామమాత్రమునకు సూక్ష్మజీవులపై దయచూపుట, రాత్రిభోజనము చేయకుండుట యను నీమూడు విషయములు మంచివే. మిగిలిన వీరి విషయము లన్నియు నసంభవములే.

ఈ వ్రాసినదానిని బట్టియే బుద్ధిమంతులు చాల తెలిసికొందురు. ఇక్కడ దృష్టాంతము కొఱకు గొలదిగా వ్రాయబడినది. వీరి యసంభవ విషయములన్నియు వ్రాసిన వానినన్నిటి నొకవ్యక్తి జీవిత మంతయు జదివినను బూర్తికావు.

పాత్రలోని యన్నముడికినది లేనిది యొక్క మెతుకు చూచిన దెలిసికొనవచ్చును. అట్లే కొలది లేఖల వలన సజ్జనులు చాల తెలిసికొనగలరు. బుద్ధిమంతుల కెక్కువ వ్రాయునావశ్యకము లేదు. బుద్ధిమంతులు దిగ్దర్శనమువలె నంతయు దెలిసికొనగలరు.

ఇక ముందు క్రైస్తవమతమును గూర్చి వ్రాయుదుము.

**శ్రీ మద్దయానంద స్వామి నిర్మితము సుభాషా విభూషితమునగు సత్యార్థ ప్రకాశమున నాస్తిక మతాంతర్గత చార్వాక బౌద్ధ జైన మతఖండన మండన విషయములుగల ద్వాదశ సముల్లాసము సంపూర్ణము.**

ఓమ్

# అనుభూమిక

క్రైస్తవులు మాత్రమేకాక యూదాదులును నీబైబిలు మతానుయాయులై యున్నట్లు విదితమగుచున్నది. కాని యీ ౧౩వ సముల్లాసమున గ్రైస్తవ మతమును గూర్చి వ్రాయబడినది. అనగా నిప్పుడు బైబిలు మతమున గ్రైస్తవులు ముఖ్యులు, యూదాదులు గౌణులు నగుచున్నారు. ముఖ్యగ్రహణముచే గౌణము గ్రహింపబడును. కాన దీనిచే యూదులును గ్రహింపబడుదురని యెఱుగ దగును. వీరి యీవిషయము బైబిలునుండియే యిక్కడ వ్రాయబడినది. ఈ గ్రంథమును గ్రైస్తవులు, యూదాదులందఱు నొప్పుకొనుచు దీనినే తమ ధర్మమునకు మూలకారణమని భావించుచున్నారు. వీరి మతగురువులయిన గొప్ప గొప్ప ఫాదరీ లీగ్రంథమును బెక్కు భాషల లోనికి భాషాంతరీకరించి యున్నారు. అందలి సంస్కృత దేవ నాగరీ భాషాంతరములను జూచుటవలన నాకీ బైబిలునం దనేక సందేహములు గలిగినవి. వాని నుండి కొన్నిటి నీ ౧౩వ సముల్లాసమున నందఱును బరికింపగల్గుటకు వ్రాసినాడను. కేవలము సత్యవృద్ధి కొఱకు, నసత్య క్షయము కొఱకు దీని వ్రాసితినే కాని యొకరికి దుఃఖము కలుగజేయవలయునని గాని, హాని గలిగింపవలయుననిగాని, యొకరిపై మిథ్యాదోషమును మోపవలయునని గాని వ్రాయలేదు. ఇక దరువాతి విషయమును జూచి యీ గ్రంథమెట్లున్నది, వీరి మతమేమి? యను నంశముల నందఱు గనుగొనవచ్చును. మనుష్యులందఱు సులభముగా జూడ, విన, వ్రాయగలుగుటయు, బక్ష ప్రతి పక్షముల బూని క్రైస్తవ మతమును బరికించి యాందోళనము చేయగలుగుటయు నీలేఖ ప్రయోజనము. మనుష్యులకు ధర్మసంబంధమైన జ్ఞానము వర్ధిల్లి వారు సత్యాసత్యమతమును, గర్తవ్యా కర్తవ్య కర్మసంబంధములగు విషయములు (ఆచారవ్యవహారములను) యథాయోగ్యముగా దెలిసికొన గలిగి, సత్యమును, గర్తవ్యములైన కర్మములను స్వీకరించుచు నసత్యమును, నకర్తవ్యములను సులభముగా బరిత్యజింప గలుగుటయు నీవ్రాత వలని ప్రయోజనము. అందఱి మత గ్రంథములను జూచి, తెలిసికొని, యనుకూల ప్రతికూలాభిప్రాయము వాఙ్మూలముగనో, వ్రాతమూలముగనో ప్రకటించుట మనుష్యులందఱకు నుచితము. లేనిచో వారు వినుచుండవలసినదే. ఏమనగా జదువుటవలన బండితు డగునట్లు వినుటవలన బహుశ్రుతుడగును. ఒకవేళ విననతడు మఱొకతనికి విన జెప్పజాలక పోయినను దాను మాత్ర మవశ్యముగ దెలిసికొనగలుగును. ఎవరు పక్షపాత మను వాహనముపై నారూఢులై చూతురో, వారికి దమ గుణదోషములు కాని, పరుల గుణదోషములుకాని తెలియజాలవు. మనుష్యుని యాత్మ సత్యాసత్యములను యథాయోగ్యముగ నిశ్చయింప గలుగును. ఒకానొక మతమును గూర్చి యొకనికి దెలిసి మఱియొకనికి దెలియకున్న దగురీతిని జర్చ జరుగనేరదు. కాని యజ్ఞానులు భ్రమజాలమున జిక్కియుందురు. అట్లు గాకుండుటకే యీగ్రంథమున వాడుకలోనున్న సమస్త మతవిషయములను గొంచెము కొంచెముగా వ్రాసినాడను. దీనివలన మిగిలిన విషయములు సత్యములా? అసత్యములా? అని యూహింపవచ్చును. సర్వమాన్యములయిన సత్యవిషయము లన్నియు నంతట నొకేవిధముగ నున్నవి. కాని వివాద మసత్యవిషయములందే కలుగుచున్నది. ఇక నొకడు సత్యవాదియు, మఱొక డసత్యవాదియు నయ్యేనేని కొంత చర్చ జరుగవచ్చును. వాది ప్రతివాదులు సత్యాసత్య నిర్ణయము కొఱకు వాద ప్రతివాదములు గావించిన నవశ్యముగ నిశ్చయము కాగలదు. ఇక నేనీ పదమూడవ సముల్లాసమునందు గ్రైస్తవ మత విషయములు గొన్నిటి నుల్లేఖించి విచారణార్థ మందఱియెదుట బెట్టుచున్నాడను. ఎట్లున్నదో కనుగొనుడు.

విచక్షణాపరులకు వివరింప నక్కఱ యుండదు.

# త్రయోదశ సముల్లాసము

## క్రైస్తవ మతవిషయ సమీక్ష

ఇప్పుడు క్రైస్తవ మతమును గూర్చి వ్రాయుచున్నాము. వీరి మతము దోషరహితమా, కాదా? వీరి బైబిలు పుస్తక మీశ్వరకృతమా, కాదా? అని తెలిసికొనుటకు వ్రాయుచున్నాము. మొదట బైబిలులోని "తౌరేతు" న గల విషయములు వ్రాయబడును.

౧. ఆరంభమందు దేవుడు భూమ్యాకాశములను సృజించెను. భూమి అసమానముగాను శూన్యముగా నుండెను. చీకటి అగాధ జలముపైన కమ్మియుండెను. దేవుని యాత్మ జలములపైన అల్లాడుచుండెను. (ఆః ౧ః ౧-౨)

సమీక్షకుడు :- దేని నారంభమని చెప్పుచున్నారు?

క్రైస్తవుడు :- సృష్టి ప్రథమోత్పత్తిని.

స :- ఇదియే ప్రథమసృష్టియా? దీనికి ముందెన్నడును సృష్టి కాలేదా?

క్రై :- అయినదో కాలేదో మాకు దెలియదు. ఈశ్వరున కెఱుక.

స :- తెలియదేని యీపుస్తకముపై విశ్వాస మెందులకు? దేనిచే సందేహనివృత్తి కాజాలదో, యటువంటిదాని నాశ్రయముగా గొని బోధించుచు జనుల నందఱను నీ సందేహముతో గూడిన మతమున నెందుకు బడవేయుచున్నారు? ఇక నేవిధమయిన సందేహము లేని, సర్వసందేహములు నివారించునట్టి వేద మతమునేల స్వీకరింపరు? ఈశ్వరసృష్టి సమాచారమే మీకు దెలియనపు డీశ్వరు నెట్లు తెలిసికొనగలుగు దురు? ఆకాశమని దేనిని నమ్ముచున్నారు?

క్రై :- మనపై నున్నదానిని, ఖాళీప్రదేశమును.

స :- ఈ బట్టబయలగు విభుపదార్థ మతిసూక్ష్మమై క్రింద మీద నేకరీతిగా నున్నదే. దీని యుత్పత్తి యెట్లు? ఆకాశము సృజింపబడనపుడు బయలు, నాకాశము నుండెనా? లేదా? లేకుండెనేని యీశ్వరుడు, జగత్కారణము, జీవులు నెచ్చటనుండిరి? ఆకాశమే లేకున్న నొకపదార్థమైన నుండజాలదు. కాబట్టి మీ బైబిలులో జెప్పిన మాట సరికాదు. ఈశ్వరుడు నతని జ్ఞానకర్మములు బేడౌలు నసమానములా? లేక యన్నియు సమానములేనా?

క్రై :- సమానములు.

స :- అటులైన నిచట నీశ్వరునిచే జేయబడిన పృథివి యసమానమై యుండెనని యేల వ్రాయ బడెను?

క్రై :- అసమాన మన మిట్టపల్లములు గలదిగ నుండెను. సమానముగా లేకుండెను. అని యర్థము.

స :- మరల సమానముగా జేసిన దెవరు? ఏమి ! ఇప్పుడు మిట్టపల్లములు గలిగి లేదా? కావున నీశ్వ రుని పని యసమాన మయినది కాజాలదు. అతడు సర్వజ్ఞుడు. అతనికి బనిలో మఱపుకాని, తప్పుకాని యెన్నటికిని సంభవింపదు. బైబిలునందు నీశ్వరసృష్టి యసమానమైనదని వ్రాయబడి యున్నది. కావున బైబిలు - ఈశ్వరకృతము కానేరదు. మొట్టమొదట నీశ్వరుని యాత్మ యేమి పదార్థము?

క్రై :- చేతనము.

స :- అది సాకారమా? నిరాకారమా? ఏకదేశీయమా? వ్యాపకమా?

క్రై :- నిరాకారము, చేతనము, వ్యాపకమైనది; కాని యొకానొక సీనాయి పర్వతమందును,

నాలుగవ యాకాశాది స్థానములందును విశేషముగ నుండును.

స :- నిరాకార మైనచో దాని నెవరు చూచిరి? వ్యాపకమేని జలముపై నల్లాడుచుండె ననుట నితాంత మసంగతము. మంచిది! ఈశ్వరుని యాత్మ నీటిపై నల్లాడుచున్నప్పు డీశ్వరు డెచ్చట నుండెను?

ఈశ్వరుని శరీరము మఱియొకచోట నుండి యుండెను. లేక తన యాత్మలో నొక్క భాగమును నీటిపై నల్లాడజేసి యుండుననియే కద సిద్ధమగుచున్నది. అట్లులైన విభుడును, సర్వజ్ఞుడు నెన్నటికిని గాజాలడు. విభుడు కాడేని జగత్తును రచించుటకు, ధరించుటకు, పాలించుటకు,జీవుల కర్మవ్యవస్థ చేయుటకు, ప్రళయము చేయుటకు నెప్పటికిని సమర్థుడు గాకుండును. ఏలయనగా నే పదార్థ స్వరూప మేకదేశీయమో దాని గుణ కర్మ స్వభావములు కూడ నేకదేశీయములే యగును. అట్లయిన నత డీశ్వరుడే కాజాలడు. ఈశ్వరుడు సర్వవ్యాపకుడు ననన్త గుణకర్మ స్వభావ యుక్తుడు, సచ్చిదానంద స్వరూపుడు, నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తస్వభావుడు, ననాద్యనంతాది లక్షణ యుక్తుడని వేదములలో జెప్ప బడెను. అతనినే నమ్ముకొనుడు. అప్పుడే మీకు శుభము కలుగును. లేనిచో నది సిద్ధింపనేరదు. (౧)

౨. దేవుడు వెలుగు కమ్మని ఆజ్ఞ నియ్యగా వెలుగు కలిగెను. వెలుగు మంచి దైనట్లు దేవుడు చూచెను. (ఆ: ౧: ౩-౪)

స :- ఏమి? ఈశ్వరుని మాట జడరూపమయిన వెలుతురు వినెనా? వినినచో నీ సమయమందును సూర్యదీపాగ్నుల వెలుతురు మనమాటల నేల వినదు? వెలుతురు జడము. అది యెప్పుడు నొకరి మాట వినజాలదు. ఏమి? దేవుడు వెలుగును జూచినపుడే యది మంచిదని తెలిసికొనెనా? అంతకు ముందు నతనికి దెలియకుండెనా? తెలిసియున్న దానిని జూచి మంచిదని యేల యనును? తెలియక యుండెనేని యతడు దేవుడే కాడు. కావున మీ బైబి లీశ్వరోక్తము కాదు. అందు జెప్పబడిన యీశ్వరుడును సర్వజ్ఞుడు కాడు. (౨)

౩. మఱియు దేవుడు జలముల మధ్య నొక యాకాశ మేర్పడి 'ఆ జలముల నీ జలములను వేఱుపఱచుగాక' యని యాజ్ఞ నిచ్చెను. అప్పుడు దేవుడు ఆకాశమునే జేసి ఆకాశము క్రింది జలములను, ఆకాశముమీది జలములను వేఱుపఱపగా నీ ప్రకారమాయెను. దేవు డాకాశమును స్వర్గమనెను. అస్తమయ మును, ఉదయమును కలుగగా రెండవ దినమాయెను. (ఆ: ౧: ౬,౮)

స :- ఏమీ! ఆకాశము, జలము సయిత మీశ్వరుని మాటలు వినెనా? జలముల మధ్య నాకాశము లేకున్న నాజల మెక్కడ నుండగలుగును. మొదటి- ఆయతునందు నాకాశమును సృజించియే యుండె నని చెప్పి మరల నాకాశమును రచించెననుట వ్యర్థము. ఆకాశమునే స్వర్గమని చెప్పినప్పు డది సర్వవ్యాపక మైనందున విశ్వమంతయు స్వర్గ మగును. ఇక స్వర్గము పైన నున్నదనుట నిరర్థకము. అప్పటికి సూర్యుడే సృష్టింపబడలేదు. మఱి పగలు, రాత్రు లెట్లు కలిగెను? ఇట్టి యసంభవోక్తులు ఆయతులందు నిండి యున్నవి. (౩)

౪. తరువాత దేవుడు తన స్వరూపమున, తన పోలిక చొప్పున 'ఆదాము'ను చేయుదునని పలికెను. దేవుడు తన స్వరూపమందు ఆదామును సృజించెను. దేవుని స్వరూపమందు వానిని సృజించెను. స్త్రీనిగాను పురుషునిగాను వారిని సృజించెను. దేవుడు వారి నాశీర్వదించెను. (ఆ: ౧: ౨౬, ౨౭, ౨౮)

స :- ఒకవేళ నీశ్వరు డాదామును దన స్వరూపమున జేసెనేని యీశ్వరుడు పవిత్రుడు, జ్ఞానస్వరూ పుడు, నానందమయాది లక్షణ యుక్తుడు గద! అతనితో సదృశు డాదా మేల కాలేదు? కాలేదు గనుక నత డాతని స్వరూపమున జేయబడలేదు. ఆదామును బుట్టించెనన్న నీశ్వరుడు తన స్వరూపమునే యుత్పత్తి గలదిగ జేసిన నది యనిత్య మెందులకు గాకుండును. మఱి యాదాము నెక్కడనుండి పుట్టించెను?

క్రై :- మట్టినుండి చేసెను.

స :- మట్టి నెక్కడనుండి చేసెను?

క్రై :- తన సామర్థ్యముచేత.

స :- ఈశ్వరుని సామర్థ్య మనాదియా? నవీనమా?

క్రై :- అనాది.

స :- అనాదియైన జగత్కారణము సనాతన మగును. మఱి యభావము నుండి భావము నేల నమ్ముచున్నారు.

క్రై :- సృష్టికి బూర్వ మీశ్వరు డొక్కడే యుండెను. మఱి యే వస్తువును లేదు.

స :- ఏ వస్తువును లేకుండెనేని యీ జగత్తెట్లు చేయబడెను? ఈశ్వరుని సామర్థ్యము ద్రవ్యమా? లేక గుణమా? ద్రవ్యమందురేని యీశ్వరుని కంటె వేఱుగ రెండవ పదార్థమున్నట్లు. గుణ మందురేని గుణము నుండి ద్రవ్య మెన్నటికిని గాజాలదు. ఏలయనగా రూపమునుండి యగ్నియు, రసము నుండి జలమును గాజాలవు. ఈశ్వరుని నుండియే జగత్తు చేయబడియున్న నది యీశ్వరుని వంటి గుణకర్మ స్వభావములు గలిగియుండెడిది. ఆతని గుణకర్మ స్వభావములతో దుల్యమైనది కానందున నీశ్వరునుండి చేయబడ లేదనియే నిశ్చయము. కాని జగత్కారణము పరమాణువు లనబడు జడపదార్థమునుండి చేయబడినది. కాబట్టి యీశ్వరుడు జగత్తును రచించు చున్నాడని వేదాది శాస్త్రములందు వ్రాయబడి నటులే యొప్పుకొనుడు. ఆదాము లోపలి స్వరూపము జీవకుగను, వెలుపలి స్వరూపము మనుష్యునివలె నుండెనన్న నీశ్వరుని స్వరూప మటులెందుకు లేదు? ఏలయన నాదా మీశ్వరునితో సమానముగ జేయబడి నవు డీశ్వరు డవశ్యముగ నాదామును బోలి యుండవలయును. (౪)

౫. దేవుడయిన సర్వేశ్వరుడు నేలమట్టితో నరుని (ఆదామును) నిర్మించి వాని నాసికారంధ్రములో జీవవాయువును ఊదగా నరుడు (ఆదాము) జీవాత్మ యయ్యెను. దేవుడైన సర్వేశ్వరుడు తూర్పున ఏథెనులో నొక తోట వేసి తాను నిర్మించిన నరుని దానిలో నుంచెను. ఆతోట మధ్యలో జీవ వృక్షమును, మంచిచెడ్డల తెలివి నిచ్చు వృక్షమును నేలనుండి మొలిపించెను. (ఆ: ౨: ౭-౯)

స :- ఈశ్వరుడు 'ఏథెను'లో దోట వేసి దానిలో నాదాము నుంచి నప్పు డతనిని మరల నక్కడ నుండి తీసివేయవలసి వచ్చునని యీశ్వరునకు దెలియక యుండెనా? మఱియు నీశ్వరు డాదామును మట్టితో జేసినపుడత డీశ్వర స్వరూపుడు కాలేదు. అయినాడన్న నీశ్వరుడు సయితము మట్టితో నయియుండవలసి వచ్చును. ఈశ్వరు డతని ముక్కు పుటములలో నూపిరి యూదినప్పు డాయూపిరి యీశ్వర స్వరూపమా?లేక భిన్నమా? భిన్నమై యుండెనేని, యీశ్వరు డాదాము స్వరూపమున లేడు. ఏకమనిన నాదామును, నీశ్వరుడును నొక్కటైరి. ఒక్కటిగ నున్నచో జన్మము, మరణము, వృద్ధి, క్షయము, నాకలి, దప్పిక మొదలగు దోషము లాదామునకు వలెనే యీశ్వరుని యందును గలుగును. ఇక నాతడెట్లు లీశ్వరుడు కాగలడు? ఇందువలన నీ 'తౌరేతు' నందలి మాట సరియని తోపదు. మఱియు నీ పుస్తకము సయిత మీశ్వరకృతము కాదు. (౫)

౬. అప్పుడు దేవుడైన సర్వేశ్వరుడు ఆదామునకు గాఢనిద్రను గలుగజేసి, అతడు నిద్రించునపు డతని ప్రక్క టెముకలలో నొకదానిని దీసి యాచోటనున్న మాంసమును పూడ్చివేసెను. తరువాత దేవుడయిన సర్వేశ్వరుడు తాను ఆదాము నుండి తీసిన ప్రక్కటెముకనుండి యొకస్త్రీని నిర్మించి ఆమెను ఆదాము నొద్దకు తీసికొని వచ్చెను. (ఆ: ౨: ౨౧-౨౨)

స :- ఈశ్వరు డాదామును మట్టితో జేసినచో నతని స్త్రీని మట్టితో నేల చేయలేదు? స్త్రీని

నెముకతో జేసినచో నాదాము నెముకతో నేల చేయలేదు? నరుని నుండి వెడలుట వలన నారీనామము కలిగినచో నారినుండి నరనామము కూడ గలుగవలసి యుండును. మఱి వారియందు బరస్పరము ప్రేమయు నుండదగును. స్త్రీని బురుషుడు ప్రేమించునటులే పురుషుని స్త్రీ కూడ బ్రేమింపవలయును. విద్వాంసులారా! ఈశ్వరుని పదార్థ విద్య (ఫిలాసఫి) యెట్లు చిలుకుచున్నదో చూడుడు! ఆదాము ప్రక్కయెముక నొక దానిని దీసి నారిని (స్త్రీని) జేసినచో మనుష్యుల కందఱకు బ్రక్కయెముక యొకటి తక్కువగ నుండదేల? మఱియు స్త్రీ శరీరమందు బ్రక్కయెముక యొకటే యుండదగును. ఏలయనగా నది యొకే ప్రక్కయెముకనుండి చేయబడినది. ఏమి! ఈ జగత్తంతయు నేసామగ్రితో జేయబడెనో యా సామగ్రితోనే స్త్రీ శరీరము చేయబడ నేరకుండెనా? కావున నీ బైబిలులో జెప్పబడిన సృష్టిక్రమము సృష్టివిద్యకు విరుద్ధము (౬)

౭. దేవుడయిన సర్వేశ్వరుడు చేసిన సమస్త భూజంతువులలో సర్పము యుక్తి (ధూర్తస్వభావము) కలదై యుండెను. అది యాస్త్రీని జూచి "ఇది నిజమా? ఈ తోట చెట్లలో దేని ఫలముల నైనను మీరు తినగూడదని దేవుడు చెప్పెనా?" అని యడిగెను! అందులకు స్త్రీ "యీతోటలోని చెట్ల ఫలములను మేము తినవచ్చును. అయితే తోటమధ్యనున్న చెట్టుఫలములను గూర్చి దేవుడు "మీరు చావకుండుటకై వానిని దినగూడ దనియు, వానిని ముట్టగూడదనియు జెప్పె"నని సర్పముతో ననెను. అందులకు సర్పము "మీరు చావనే చావరు. ఏలయనగా మీరు వానిని దిన్నవెంటనే మీకన్నులు తెఱవబడుననియు, మీరు మంచిచెడ్డల నెఱిగినవారై దేవతల వలె నుందురనియు దేవునకు దెలియు" నని స్త్రీతో జెప్పగా నావృక్ష ఫలము నాహారమునకు మంచిదనియు, గన్నుల కందమైనదనియు, వివేక మిచ్చునదనియు నెఱిగి యావృక్షమును జూచినప్పు డామె దానిఫలములలో గొన్ని తీసికొని తిని తనతోబాటు భర్తకు నిచ్చెను. అతడు కూడ దినెను. అప్పుడు వారిద్దఱి కన్నులు తెఱవబడెను. వారు తాము దిగంబరుల మనుకొని యంజూరపుటాకులను గుట్టి తమకు గచ్చడములను జేసికొనిరి. అందులకు దేవుడైన సర్వేశ్వరుడు సర్పమును జూచి "నీవు చేసినపనికి ఫలముగా పశువు లన్నిటిలోను, భూజంతువు లన్నింటిలోను నీవు శపింపబడిన దానవై కడుపుతో నడచుచుందువు. నీవు బ్రతుకు దినములన్నియు మన్ను తిందువు. నీకును, స్త్రీకిని, నీ సంతానమునకును, నామె సంతానమునకును వైరము కలుగజేసెదను. అది నిన్ను తలమీద కొట్టును, నీవు దాని మడెమను కఱచెద" వని చెప్పెను. ఆయన స్త్రీని చూచి "నీ ప్రయాసమును గర్భవేదనను నేను మిక్కిలి హెచ్చించెదను. వేదనతో పిల్లల కందువు. నీ భర్తయెడల నీకు వాంఛ కలుగును. అతడు నిన్ను ఏలునని చెప్పెను. ఆయన ఆదామును చూచి "నీవు నీభార్యమాట విని నేను తినవద్దని నీకాజ్ఞాపించిన వృక్ష ఫలములు తింటివి. కనుక నీ నిమిత్తము నేల శపింపబడి యున్నది. ప్రయాసతోనే నీవు బ్రతుకు దినములన్నియు దాని పంట తిందువు. అది ముండ్ల తుప్పలను, గచ్చ పొదలను మొలిపించును. పొలములోని పంట తిందువు" అనెను.

(ఆః ౩ః ౧-౨-౩-౪-౫-౬-౭- ౧౪-౧౫-౧౬-౧౭-౧౮)

స :- క్రైస్తవుల దేవుడు సర్వజ్ఞుడుగానున్న నీ ధూర్తసర్పమను సైతాను నేల సృజించును. సృష్టించెనేని యాదేవుడే యపరాధి యనదగును. ఏలయన నతడు దానిని దుష్టస్వభావము గలదిగ సృజింపకున్న నది దుష్టత్వ మెందుకు జేసియుండును. పూర్వజన్మము నంగీకరింపనిచో నపరాధములేక దానిని బాపస్వభావము గలదిగ నేల సృజించెను? నిజము విచారించి చూచిన నది సర్పము గాక మనుష్యుడై యుండెను. ఏలయన మనుష్యుడు గాకున్న మానుషభాష నెట్లు చెప్పగలిగి యుండును? తానసత్యవంతుడై యితరుల నబద్ధమార్గమున నడపించు వానినే సైతాననవలయును. ఇచట సైతాను సత్యవాది

గనుక నత డాస్త్రీకి విపరీతములు బోధింపలేదు. సత్యమే చెప్పెను. ఈశ్వరు డాదాము హవ్వలతో దీనిని దినుటవలన మీరు చనిపోవుదురని యబద్ధమాడెను. ఆ చెట్టు జ్ఞానమును, నమరత్వము నిచ్చు నదిగ నుండెనేని దాని ఫలములను దినగూడదని యెందుకు నిషేధించెను? అట్లు నిషేధించిన యీశ్వరుడే యసత్యవాదియు, మోసగాడు నయ్యెను. ఏలయనగా నావృక్షఫలములు మనుష్యులకు జ్ఞానసుఖముల నిచ్చునవై యుండెనే గాని యజ్ఞానమును, మృత్యువును గలుగజేయునవి కాకుండెను. ఈశ్వరు డాఫలమును దినవలదని చెప్పెనుగద! మఱి యా వృక్షమును సృష్టించిన దెందులకు? తనకొఱకే సృష్టించె ననుకొన్న దా నజ్ఞానియు మృత్యుధర్మము గలవాడునై యుండెనా? ఇతరుల కొఱకు సృష్టించె నన్న ఫలములను దినుట యందపరాధ మేమియు లేదు. వర్తమాన సమయమందు జ్ఞానకారకమును, మృత్యునివారకమగు వృక్ష మొక్కటియు గనబడుట లేదు. ఈశ్వరుడు దాని విత్తనమును గూడ నశింప జేసెనా యేమి? ఇట్టి పనులు చేసిన మనుష్యుడు మోసగాడును, గపటియు నగునేని యీశ్వరుడు నటువంటివా డేల కాకుండును? ఏలయనగా బరులను టక్కులబన్ని మోసపుచ్చువాడు మోసగాడును, టక్కరియు నేల కాకుండును? అపరాధము లేనిదే యీ ముగ్గురకు శాపము పెట్టెను. కావున నాయీశ్వరు డన్యాయకారియు నయ్యెను. ఈ శాపమీశ్వరునకు జెందవలసినదే. ఎందుకనగా నతడే యబద్ధము చెప్పి వారిని మోసపుచ్చి యుండెను. ఈ తత్త్వవిజ్ఞానమును (ఫిలాసఫీని) కనుగొనుడు! బాధ కలుగకుండ గర్భధారణము కాని, శిశువు పుట్టుటగాని సంభవమై యుండునా? శ్రమపడక యెవ్వరయిన జీవనము గడప గలుగుదురా? మొదట ముండ్లచెట్లు లేకుండెనా? కూరగాయలు దినుట మానవుల కందఱకు నీశ్వరుని యాజ్ఞవలన నుచితమేని తిరిగి బైబిలునందు మాంసము తినవలయునని వ్రాసినది యబద్ధము కాదా? అది నిజమేని యిది యబద్ధము. ఆదాము నం దేమియు నపరాధము సిద్ధింపదేని క్రైస్తవులు జనులందఱును "ఆదాము చేసిన యపరాధమునుబట్టి యతని సంతానమై నందున పాపు"లని యెందుకు జెప్పుచున్నారు. బలే! ఇటువంటి పుస్తకము కాని యిట్టి యీశ్వరుడు కాని బుద్ధిమంతుల కొప్పిదములా? (౭)

౮. అప్పుడు దేవుడయిన సర్వేశ్వరుడు చెప్పెను. ఇదిగో మంచి చెడ్డల నెఱుగునట్లు ఆదాము మనలో నొకనివంటివా డయ్యెను. కాబట్టి అతడొకవేళ తనచేతిని చాచి జీవవృక్ష ఫలములను గూడ తీసికొని తిని నిరంతరము జీవించునేమో అనుకొని అత డాదామును వెళ్ళగొట్టి ఏథేనుతోటకు తూర్పు దిక్కున 'కేరూబు'లను జీవవృక్షమునకు పోవుమార్గమును కాచుటకు ఇటునటు దిరుగుచున్న ఖడ్గజ్వాలను నిలబెట్టెను. (ఆః ౩ః ౨౨-౨౪)

స :- మంచిది. జ్ఞానమందు మాతో సమాను డయ్యెనని యీశ్వరున కిట్టి యీర్ష్యాభ్రమ లెందుకు గలిగెను. ఇదేమి చెడుగా? ఇట్టి శంక యేల కలిగెను? ఈశ్వరునకు సమాను డొక డెన్నటికిని గాజాలడు. ఈ వ్రాత వలన నత డీశ్వరుడు గాక మనుష్యమాత్రుడై యుండెననియే తేటపడుచున్నది. బైబిలునందు వర్ణింపబడిన యీశ్వరుడు మనుష్యునివంటి వాడే యని విదిత మగుచున్నది. అంతేగాక యీశ్వరు డాదాము జ్ఞానోన్నతిని జూచి దుఃఖితు డగుటయే గాక, యమరవృక్ష ఫలములను దినునని యెంతయో యీర్ష్యకలవా డయ్యెను. మొదట దోటలో నుంచినప్పుడు తిరిగి యితనిని వెళ్ళగొట్ట వలసివచ్చునను భవిష్యత్ జ్ఞాన మతనికి లేకుండెను. కావున గ్రైస్తవుల యీశ్వరుడు సర్వజ్ఞుడు గాకుండెను. ఇక మెఱయు చుండు ఖడ్గమును ధరింపజేసి కొందఱను గావలి యుంచెను. ఇదికూడ మానవుల పనియేకాని ఈశ్వరునిది కాదు. (౮)

౯. కొంతకాల మయిన తరువాత కయీను పొలము పంటలో కొంత యెహోవాకు అర్పణగా తెచ్చెను. హేబేలుకూడ తన మందలో తొలుచూలు పుట్టినవానిలో క్రొవ్విన వానిని కొన్ని తెచ్చెను.

యెహోవా అతని అర్పణను లక్ష్యపెట్టెను. కయీనును అతని అర్పణను గూడ ఆయన లక్ష్యపెట్టలేదు. కాబట్టి కయీనునకు మిక్కిలి ఆగ్రహము కలిగి ముఖము చిన్నబుచ్చుకొనగా యెహోవా కయీనును చూచి, నీకు ఆగ్రహమేల కలిగెను? ముఖము చిన్నబుచ్చుకొని యున్నావేమి? అనెను. (ఆ: ౪: ౩,౪,౫,౬)

స :– దేవుడు మాంసాహారి కాడేని గొఱ్ఱెల యర్పణమును, హేబేలు నాదరించి, కయీనును, నతని యర్పణమెందుకు దిరస్కరించి యుండును? మఱియు నీ జగడమునకును, హేబేలు మరణమునకు దేవుడే కారకుడయ్యెను. మనుష్య లొకరితో నొకరు మాట్లాడుకొను నట్లే క్రైస్తవుల దేవుడును మాట్లాడును. తోటలో వచ్చుచు బోవుచుండుటయు, దానిని వేయుట సయితము, మనుష్యుల పనియే గనుక నీ బైబిలు మనుష్యులచే గల్పింప బడినదే కాని యీశ్వరోక్తము గాదు. (౯)

౧౦. దేవుడు (యెహోవా) "నీతమ్ముడయిన హేబేలు ఎక్కడ నున్నా"డని కయీను నడుగగా నతడు "నేనెఱుగను, నా తమ్మునికి నేను కావలివాడనా" యనెను. అప్పుడాయన నీవు చేసిన పని యేమిటి? నీ తమ్ముని రక్తపు స్వరము నేలలోనుండి నాకు మొఱపెట్టుచున్నది. ఈనేలమీద నుండకుండ నీవు శపింపబడినవాడవు" అనెను. (ఆ: ౪: ౯,౧౦,౧౧)

స :– ఏమి! హేబేలు గతి యేమై యుండునదియు నీశ్వరు డెఱుగక కయీను నడిగెనా? రక్తనాదము భూమిలో నుండి యెప్పుడైన నొకరిని పిలువగలుగునా? ఇవన్నియు బామరుల మాటలే. కావున నీ పుస్తక మీశ్వర కృతము కాని యొక విద్వాంసునిచే వ్రాయబడినది కాని కాజాలదు. (౧౦)

౧౧. హనోకు, మతూషెలహును కనిన తరువాత మున్నూఱేండ్లు దేవునితో నడచుచుండెను. (ఆ: ౫: ౨౨)

స :– బలే! క్రైస్తవుల దేవుడు మనుష్యుడు గాకున్న హనోకు నతని వెంబడి యెట్లు నడచి యుండును? కనుక వేదమందు జెప్పబడిన నిరాకారుడగు పరమేశ్వరుని నమ్ముటయే క్రైస్తవులకు శ్రేయస్కరము. (౧౧)

౧౨. వారికి కుమార్తెలు పుట్టినప్పుడు, దేవుని కుమారులు, నరుల కుమార్తెలు చక్కనివారని చూచి వారందఱిలో తమకు నచ్చిన స్త్రీలను వివాహము చేసికొనిరి. ఆ దినములలో దానవులు భూమిమీద నుండిరి. తరువాత కూడ దేవుని కుమారులు నరులు (ఆదాము) కుమార్తెలతో సంతోషించినప్పుడు, వారికి పిల్లలు కలిగిరి. వారు పూర్వపువారికంటె పేరు పొందినవారు. నరుల చెడుతనము భూమిమీద గొప్పదనియు, వారి హృదయమునందలి తలపులలోని ఊహయంతయు నెల్లప్పుడు కేవలము చెడ్డ దనియు దేవుడు చూచి తాను భూమిమీద నరులను సృష్టించినందుకు "యెహోవా" సంతాపము నొంది తన హృదయములో నొచ్చుకొనెను. అప్పుడు దేవుడు నేను సృజించిన నరులను, నరులతో గూడ జంతువులను పురుగులను, ఆకాశ పక్ష్యాదులను, భూమిమీద నుండకుండ తుడిచి పెట్టుదును. ఏలయనగా నేను వారిని సృజించి పశ్చాత్తాపము పొంది యున్నాననెను. (ఆ: ౬: ౧,౨,౪,౭)

స :– క్రైస్తవులను "దేవుని కుమారు లెవరనియు, దేవుని భార్య, అత్త, మామ, బావమఱది, సంబంధు లెవరెవరనియు" నడుగవలయును. ఏలయన నిప్పు డానరుల కుమార్తెలతో వివాహ మైనందున దేవుడు వారికి వియ్యంకు డయ్యెను. అట్లే వారికి బుట్టిన పుత్రులు పౌత్రులయిరి. ఏమి? ఇవి దేవ వాక్కులు కాని, దేవపుస్తకమందలి వాక్కులు కాని కాగలవా? కావున నీ పుస్తకము ననాగరికులు రచించి రనియే స్పష్ట మగుచున్నది. సర్వజ్ఞుడు గానివాడును, ముందు రాగల మాటల నెఱుగని వాడును నీశ్వరుడే కాడు. అతడు జీవుడు. సృష్టిని రచించినపుడు ముందుముందు మనుష్యులు దుష్టులగుదు రనుమాట యత నికి దెలియకుండెనా? ఇట్లు పశ్చాత్తాప పడుట, యతిశోకాదులు భరించుట, పొరపడి పనిచేసి పిమ్మట

బశ్చాత్తాప పడుట, మొదలగునవి యీ క్రైస్తవుల దేవునియందే ఘటిల్లుచున్నవి. ఏమనగా వీరి దేవుడు పూర్ణవిద్వాంసుడు గాడు. ఒక యోగియును గాడు. ఐనచో శాంతియుక్తుడును, విజ్ఞానయుక్తుడు నయి శోకాదుల నుండి దూరమై యుండెడివాడు. సరి! పశుపక్షులు కూడ దుష్టస్వభావములు గలవయ్యెనా; ఈశ్వరుడు సర్వజ్ఞు డైనచో నింతటి విషాదము నేల పొందియుండును? ఇందువలన నత డీశ్వరుడు కాడు, ఈ పుస్తకము నీశ్వరకృతము కాజాలదు. వేదమందు జెప్పబడియున్నట్లు సమస్త పాప క్లేశ దుఃఖ శోకాది రహితుడును, సచ్చిదానంద స్వరూపుడు నగు పరమేశ్వరుని నీ క్రైస్తవు లిప్పుడయిన నమ్ముదురేని తమ మనుష్య జన్మమును సఫలపఱచుకొన గలుగుదురు. (౧౨)

౧౩. ఆ యోడ మున్నూఱు మూరల పొడవును, ఏబది మూరల వెడల్పును, ముప్పది మూరల యెత్తును గలదై యుండవలెను. నీవును నీతోడ నీ కుమారులును, నీ భార్యయు, నీకోడండ్రు ఆయోడలో ప్రవేశింప వలయును. నీతోకూడ వానిని బ్రతికించి యుంచుకొనుటకు, సమస్త శరీరులలో - ప్రతిజాతిలోనివి - రెండేసి చొప్పున నీవు ఓడలోనికి తేవలయును. వానిలో మగదియు నాడుదియు నుండవలయును. నీవు వానిని బ్రతికించి యుంచుకొనుటకై ఆ యా జాతుల ప్రకారము పక్షులలోను, ఆ యా జాతుల ప్రకారము జంతువులలోను, ఆ యా జాతుల ప్రకారమ నేలపై ప్రాకువాని యన్నిటిలోను, ప్రతి జాతిలో రెండేసి చొప్పున నీ యొద్దకు అవి వచ్చును. మఱియు నీవు తినుటకు కావలసిన పదార్థములను సమకూర్చుకొని నీవద్ద నుంచుకొనుము. అది నీకును, వానికిని ఆహారమగునని చెప్పెను. నోవహు ఈశ్వరాజ్ఞానుసారము చేసెను. (ఆః ౬ః ౧౫, ౧౮-౨౨)

స :- ఔరా! ఇట్టి జ్ఞానవిరుద్ధమగు నసంభవమైన మాటలు చెప్పిన వానిని దేవుడని యేవిద్వాంసుడైనను నమ్మునా? ఇక నింత గొప్ప వెడల్పును, నెత్తును గల నావయందు, ఏనుగులు, లొట్టిపిట్టలు మొదలుగాగల కోట్లకొలది జంతువుల జతలను, వానికొఱకును, దనకుటుంబము కొఱకును నన్నపానాది సామగ్రులన్నియు నిముడగలుగునా? కావున నీ పుస్తకము మనుష్యునిచే వ్రాయబడినది. దీనిని వ్రాసినవా డయినను విద్వాంసుడు గాక యుండెను. (౧౩)

౧౪. అప్పుడు నోవహు యెహోవాకు బలిపీఠము కట్టి పవిత్ర పశువులన్నిటిలోను, పవిత్ర పక్షులన్నిటిలోను, కొన్ని తీసికొని, ఆ పీఠము మీద దహనబలి నర్పించెను. అప్పుడు యెహోవా యింపయిన సువాసన నాఘ్రాణించి, ఇక మీదట నరుల మూలముగ భూమిని మరల శపింపను. ఎందుకనగా నరుల హృదయాలోచన వారి బాల్యము నుండి చెడ్డది. నేనిప్పుడు చేసిన ప్రకారముగా సమస్త జీవులను సంహరింపను అని యనుకొనెను. (ఆః ౮ః ౨౦, ౨౧)

స :- వేదిని గట్టుట, హోమ మొనరించుట యను నీ మాటలు వేదమునుండి తీసికొని బైబిలునందు జేర్చబడినట్లు తోచుచున్నది. ఏమి? సువాసన నాఘ్రాణించుటకు బరమేశ్వరునకు ముక్కు కలదా? ఈ క్రైస్తవుల దేవుడు మనుష్యునివలె నల్పజ్ఞుడు కాడా? ఒకప్పుడు శపించుటయు, పిదప బశ్చాత్తాపపడుటయు, నొకప్పుడు శపింపననియు ననుచున్నాడు. మొదట శపించినట్లే మరలకూడ శపింపగలడు. మొదట నందఱను జంపి వేసెను. ఇప్పుడో యిక నెప్పుడును జంప ననుచున్నాడు. ఇవన్నియు జిన్నపిల్లల మాటల వంటివి. ఈశ్వరుని వను టెట్లు? ఒక విద్వాంసుని వైనను గాజాలవు. ఏలయన విద్వాంసుని మాటకాని ప్రతిజ్ఞకాని స్థిరముగా నుండగలుగును. (౧౪)

౧౫. మఱియు దేవుడు నోవహును, అతని కుమారులను, ఆశీర్వదించి ప్రాణముగల ప్రతి జంతువు మీకు ఆహారమగును. పచ్చని కూర మొక్కల నిచ్చినట్లు వానిని మీకిచ్చియున్నాను. అయి నను మాంసమును దాని రక్తముతో మీరు తినగూడదు, రక్తమే దాని ప్రాణము అనెను. (ఆః ౯ః ౧-౩-౪)

స :- ఒకరి ప్రాణము దీయించి యితరుల నానందింప జేసినందున నీ క్రైస్తవుల దేవుడు దయావిహీనుడు కాడా? తల్లి దండ్రులు లోకపుత్రునిజంపించి మఱొకనికి దినబెట్టుదురేని వారు మహాపాపులు కారా? ఇదియు నట్లే యున్నది. ఏలయన ప్రాణులన్నియు నీశ్వరునకు బుత్రులవంటివే. అట్లు భావింపనందుననే కద వీరిదేవుడు కటికవానివలె వర్తించుచున్నాడు. ఇక మానవులందఱను హింసకులుగ గూడ నితడే చేసియున్నాడు. కాబట్టి క్రైస్తవుల దేవుడు దయలేని వాడయినందున బాపాత్ముడెందుకు గాడు? (౧౫)

౧౬. భూమి యందంతట నొక్కభాషయు నొక్క పలుకును నుండెను. మఱియు వారు "మనము భూమి యందంతట చెదరిపోకుండ నొకపట్టణమును ఆకాశమునంటు శిఖరముగల యొక గోపురమును కట్టుకొని పేరు సంపాదించి కొందము రండ"ని మాటలాడుకొనగా యెహోవా నరుల కుమారులు కట్టిన పట్టణమును, గోపురమును చూడ దిగివచ్చెను. అప్పుడు దేవుడు, ఇదిగో జనము ఒకటే; వారందఱికి భాషయొకటే, వారీపని యారంభించి యున్నారు. ఇకమీదట వారు చేయదలంచు నే పనియైనను చేయకుండ వారి కాటంక మేమియు నుండదు గనుక మనము దిగిపోయి వారిలో నొకని మాట మఱియొకనికి దెలియకుండ అక్కడ వారిభాషను తారుమారు చేయుదము రండని అనుకొనెను. ఆలాగున యెహోవా అక్కడనుండి భూమి యందంతట వారిని చెదర గొట్టెను. కనుక వారు ఆ పట్టణమును కట్టుట మానివేసిరి. (ఆ: ౧౧: ౧, ౪-౮)

స :- పృథివియం దంతట నొక్క భాషయు నొక్కపలుకును నుండి నప్పుడు మానవు లందఱకు బరస్పర మత్యంతానందము ప్రాప్తమై యుండవచ్చును. కాని చేయునదేమి? ఈ క్రైస్తవుల యీర్ష్యగల దేవుడు వారి భాషను దాఱుమాఱుచేసి యందఱను పాడుచేసెను! అతడట్లు చేయుట గొప్ప తప్పు! అది సైతాను పనికంటెను జెడ్డపని కాదా; ఇక గ్రైస్తవుల దేవుడు సేనాయిపర్వతము మొదలగువాని మీద నివసించు చుండెననియు, జీవుల యున్నతినైన జూడలేకుండె ననియు గూడ దీనివలన బోధపడుచున్నది. ఇది యొక పామరుని మాటగాక యీశ్వర వాక్యమని కాని యిది యీశ్వరోక్త పుస్తకమని కాని యెట్లంగీకరింపబడ గలుగును? (౧౬)

౧౭. అప్పుడతడు తన భార్యయైన సారయిని చూచి ఇదిగో నేను నీవు చక్కని దానవని యెఱుగుదును. ఐగుప్తీయులు నిన్ను చూచి యీమె అతని భార్యయని నన్ను చంపి, నిన్ను బ్రతుకనిచ్చెదరె. నీ వలన నాకు మేలు కలుగు నట్లును, నిన్ను బట్టి నేను బ్రతుకు నట్లును, నీవు నా సహోదరివని దయచేసి చెప్పుమనెను. (ఆ: ౧౨: ౧౧, ౧౨, ౧౩)

స :- ఇప్పుడు చూడుడు! అబ్రహామును గ్రైస్తవులు, ముసల్మానులు గూడ గొప్ప పైగంబరు (దేవదూత) అని భావించుచున్నారు. అతని మిథ్యాభాషణాది కార్యము లనుచితములే కద. పైగంబరు లిట్టివారైన వారి యనుచరులకు విద్యకాని మంచి మార్గము కాని యెట్లు లభింపగలదు. (౧౭)

౧౮. మఱియు దేవుడు "నీవును నీవేకాదు; నీ తరువాతి వారి తరములలో నీ సంతతియు నా నిబంధన గైకొనవలెను. నాకును నీకును నీ తరువాత నీ సంతతికిని మధ్యను మీరు గైకొనవలసిన నా నిబంధన యేదనగా మీలో ప్రతి మగవాడును సున్నతి పొందవలెను. మీరు మీ గోప్యాంగ చర్మమున సున్నతిని పొందవలెను. అది నాకు నీకు మధ్యనున్న నిబంధనకు సూచనగా నుండును. ఎనిమిది దినముల వయస్సుగలవాడు అనగా నీ యింట పుట్టిన వాడయినను నీ సంతానముకాని, అన్యునియొద్ద వెండిచేత కొనబడిన వాడయినను మీ తరములలో ప్రతిమగవాడు మీలో సున్నతి పొందవలెను. నీయింటిలో పుట్టినవాడును, నీ వెండిచేత కొనబడినవాడును తప్పక సున్నతి పొందవలెను. అప్పుడు నా నిబంధన మీ

శరీరమందు నిత్యనిబంధనగా నుండును. సున్నతి పొందని మగవాడు అనగా నెవని గోప్యాంగ చర్మము సున్నతి చేయబడదో అట్టివాడు తన జనులలో నుండి కొట్టివేయబడును. వాడు నా నిబంధన మీఱి యున్నాడని" అబ్రాహముతో చెప్పెను. (ఆః ౧౭ః ౯-౧౪)

స ః- ఇప్పుడీశ్వరుని విపరీతమైన యాజ్ఞ చూడుడు! ఈ సున్నతి యను గోప్యాంగ చర్మఖండనము గావించుట యతని కిష్టమై యున్నచో సృష్ట్యాదియం దాచర్మము కలిగింపకయే యుండెడివాడు. అది కంటికి ఱెప్పవలె రక్షణ కొఱకై కలిగింపబడి యున్నది. ఏలయనగా నా గోప్యాంగ మతికోమలమైనది. అట్లది చర్మముతో గూడి యుండకున్న నొకపురుగు కాటువలననో చిన్న దెబ్బ తగులుట వలననో మిక్కిలి నొప్పి కలుగును. ఇక నది లఘుశంకానంతరము కొంత మూత్రాంశమును బట్టలకు దగులకుండ జేయుట మొదలగు పనుల కుపయుక్తమై యున్నది. కాన దానిని ఛేదించుట తప్పు. మఱియును, నిప్పుడు క్రైస్తవు లీయాజ్ఞను బాలించుట లేదెందులకు? సర్వథా పాలింపబడవలయునను నీ యాజ్ఞ పాలింపబడుట లేదు. కావున వ్యవస్థా పుస్తకమును బైబిలు నం దొక బిందుమాత్ర మసత్యోక్తి లేదని యేసు చెప్పిన సాక్ష్యము మిథ్య యయ్యెను. దీనిని గ్రైస్తవు లెంత మాత్రము కనుగొనుట లేదుగదా? (౧౮)

౧౯. దేవుడు అబ్రహముతో మాటలాడుట చాలించిన తరువాత అతని యొద్దనుండి (పరమునకు) పైకి వెళ్ళెను. (ఆః ౧౭ః ౨౨)

స ః- క్రిందినుండి మీదకును, మీదనుండి క్రిందకును బోవుచు వచ్చుచు నుండెనన్న నీదేవు డొక మనుష్యుడో లేక పక్షియో యైయుండె నని దీని వలన విదిత మగుచున్నది. కాన నిత డొక యింద్రజాలకునివలె నుండెననుటయే నిశ్చయము. (౧౯)

౨౦. మఱియు మమ్రే దగ్గఱ నున్న సింధూరవనములో అబ్రహము ఎండవేళను గుడారపు ద్వారమందు కూర్చుండి యున్నపుడు పర్వేశ్వరు డతనికి కనబడెను. అతడు కనులెత్తి చూచినప్పుడు ముగ్గురు మనుష్యు లతని యెదుట నిలువబడి యుండిరి. అతడు వారిని చూచి గుడారపు వాకిట నుండి వారి నెదుర్కొనుటకు పరుగెత్తి నేలమట్టునకు వంగి "ప్రభువా! నీ కటాక్షము నామీదనున్న యెడల నిప్పుడు నీ దాసుని దాటిపోవద్దు. నేను కొంచెము నీళ్ళు తెచ్చెదను. దయచేసి కాళ్ళు కడుగుకొని ఈ చెట్టు క్రింద అలసట తీర్చుకొనుడి. కొంచె మాహారమును తెచ్చెదను. మీ ప్రాణములను బలపఱచుకొనుడి. తరువాత మీరు వెళ్ళవచ్చును. ఇందు నిమిత్తముగ తామీ దాసుని యొద్దకు వచ్చితి"రనెను. వారు నీవు చెప్పినట్లు చేయుమనగా అబ్రహము గుడారములోనున్న శారాయొద్దకు త్వరగ వెళ్ళి నీవు త్వరపడి మూడుమానికల మెత్తని పిండి తెచ్చి పిసికి రొట్టెలు చేయుమని చెప్పెను. మఱియు అబ్రహము పశువుల మందకు పరుగెత్తి యొక లేతదూడను తెచ్చి యొకపనివాని కప్పగించెను. ఆ పనివాడు దానిని త్వరగా సిద్ధపఱచెను. తరువాత అతడు వెన్నయును, పాలను, తాను సిద్ధము చేయించిన దూడను తెచ్చి వారియెదుట బెట్టి వారు భోజనము చేయుచుండగా వారి యొద్ద ఆ చెట్టు క్రింద నిలుచుండెను. (ఆః ౧౮ః ౧-౮)

స ః- సజ్జనులార! చూచితిరా! దేవుడే దూడమాంసమును దినునప్పుడతని యుపాసకు లావులు దూడలు మొదలగు పశువుల నేల వీడుదురు? కొంచెమైన దయలేక మాంసము దినుటకు సిద్ధముగా నుండువాడు హింసకుడగు మనుష్యుడు గాక యెప్పుడైన నీశ్వరుడు కాగలడా? మఱి యీశ్వరుని వెంట నిద్దఱు మనుష్యు లెవరుండిరో తెలియదు. అనాగరికుల సముదాయ మొకటి యుండెననియు, నందులో ముఖ్యుడుగా నుండినవాడే యీబైబిలు నందు నీశ్వరుడని పేర్కొనబడి యుండవచ్చుననియు దీనివలన దెలియుచున్నది. కావున బుద్ధిమంతులు వీరి పుస్తకమును నీశ్వరకృత మనికాని, యందు వర్ణింపబడిన

యీశ్వరుని నీశ్వరుడనికాని యంగీకరింప జాలరు. (౨౦)

౨౧. అంతట సర్వేశ్వరుడు అబ్రహముతో "వృద్ధురాలైన నేను నిశ్చయముగా ప్రసవించెదనా యని శారా నవ్వనేల! సర్వేశ్వరున కసాధ్యమైన దేదైన నున్నదా" అనెను. (ఆ: ౧౮: ౧౩, ౧౪)

స :- ఈ క్రైస్తవుల దేవుని చిత్రములు చూడుడు. పిల్లలవలెనో లేక స్త్రీ వలెనో చిరాకుపడుచు వెత్తి పొడుచుచున్నాడు. (౨౧)

౨౨. అప్పుడు సర్వేశ్వరుడు సోదొమ మీదను గొమొఱ్ఱా మీదను సర్వేశ్వరుని యొద్దనుండి గంధకమును, అగ్నిని ఆకాశమునుండి కురిపించి, ఆ పట్టణములను, ఆ మైదానమంతటిని, ఆ పట్టణములో నివసించిన వారి నందఱను నేల మొలకలను నాశము చేసెను. (ఆ: ౧౯: ౨౪, ౨౫)

స :- బైబిలునందు వర్ణింపబడిన దేవుని యీలీలను గూడ గనుడు. బాలకాదుల మీదనయిన నించుకేనియు దయరాలేదుగా! భూమిని బొరలించి యందఱ నొత్తి చంపెనన్న వారందఱు నపరాధులుగ నుండిరా? ఈ మాట న్యాయ దయా వివేకములకు విరుద్ధమైనదే కద. దేవుడే యిట్టి పనుల నొనరించిన నాతని యుపాసకు లల్లెందుకు జేయకుందురు? (౨౨)

౨౩. మన తండ్రికి ద్రాక్షారసము త్రాగించి అతనితో శయనించి మన తండ్రివలన సంతానమును కలుగజేసికొందము రమ్మని చెప్పెను. ఆ రాత్రి వారు తమ తండ్రికి ద్రాక్షారసము త్రాగించిన తరువాత అతని పెద్ద కుమార్తె లోపలికి వెళ్ళి తన తండ్రితో శయనించెను. "మనము నేటి రాత్రియు ద్రాక్షారసము త్రాగించెదము. నీవు వెళ్ళి శయనింపుము." చిన్నదివెళ్ళి యతనితో శయనించెను. అలాగున లోతు కుమార్తె లిద్దఱు తమ తండ్రివలన గర్భవతులైరి. (ఆ: ౧౯: ౩౨, ౩౩, ౩౪, ౩౬)

స :- చూడుడు! ఏమద్యపానపుమత్తు తండ్రికిని గుమార్తెకును సంపర్కము కలుగజేసెనో యట్టి దుష్టమగు మద్యమును గ్రైస్తవాదు లిప్పటికిని ద్రాగుచునేయున్నారు గదా! ఇకవారి దుష్టత్వమున కొక మేర యుండునా! కావున సజ్జను లీదుష్టమద్యమును దలంపను గూడదు. (౨౩)

౨౪. దేవుడు తాను చెప్పిన ప్రకారము శారాను గూర్చి చేసెను. మఱి శారా గర్భవతి యాయెను. (ఆ: ౨౧: ౧-౨)

స :- ఇపుడు శారానుగూడి గర్భవతిగా జేసెనను కార్య మెట్లయ్యెనో గమనింపుడు. ఏమి పరమేశ్వరుడును, శారాయు గాక మూడవవా డెవడైన గర్భస్థాపకుడుగ గనబడుచున్నాడా? శారా పరమేశ్వరుని కృపవలననే కద గర్భవతి యయ్యెనని విదిత మగుచున్నది. (౨౪)

౨౫. కావున తెల్లవాఱునప్పుడు అబ్రహము లేచి ఆహారమును నీళ్ళతిత్తిని తీసికొని ఆ పిల్లవానితో గూడ ఆగరున కప్పగించి ఆమె భుజము మీద వానిని పెట్టి ఆమెను పంపివేసెను. ఆమె పిల్లవానిని నొకపొదలో బడవేసి యెదురుగా కూర్చుండి యెలుగెత్తి యేడ్చెను. అప్పుడు దేవుడు ఆ చిన్నవాని మొఱ వినెను. (ఆ: ౨౧: ౧౪-౧౭)

స :- చూచితిరా! మొదట శారాకు బక్షపాతియై ఆగరునువాని నచ్చట నుండి వెళ్ళగొట్టించిన క్రైస్తవుల దేవుని చిత్రములు! ఎలుగెత్తి యేడ్చునది ఆగరు. వినబడినది బాలకుని శబ్దమట. ఇదియు నొకవింతయే. బాలకుడే యేడ్చుచున్నాడని యీశ్వరునకే భ్రమ కలుగవచ్చును గాబోలు. ఇది యీశ్వర వాక్యమని కాని, యీశ్వరకృత గ్రంథస్థ వాక్యమని కాని చెప్పబడగలదా! ఒక సాధారణమైన మనుష్యుని మాటల వంటివే యీపుస్తకము నందు గలవు. వానిలో గొన్ని మాత్రము సత్యములై తక్కినవన్నియు సారములేని మాటలతో నిండియున్నవి. (౨౫)

౨౬. ఆ సంగతులు జరిగిన తరువాత దేవుడు అబ్రహామును శోధించెను. ఎట్లనగా ఆయన

"అబ్రహమా!" యని పిలువగా అతడు "చిత్తము ప్రభువా" యనెను! అప్పుడాయన - నీకు ఒక్కడై యున్న నీ కుమారుని అనగా నీవు ప్రేమించు ఇస్సాకును తీసికొని దహనబలిగా నతని సమర్పింపుమనెను. తన కుమారుడగు ఇస్సాకును బంధించి ఆ పీఠముపై కట్టెలమీద నుంచెను. అప్పుడు అబ్రహము తన కుమారుని వధించుటకు తన చేయిచాపి కత్తి పట్టుకొనగా సర్వేశ్వరుని దూత పరలోకము నుండి "అబ్రహమాః అబ్రహమాః" అని యతనిని బిలిచెను. అందుకతడు 'చిత్తము ప్రభువా" యనెను. అప్పుడాయన " ఆ చిన్నవానిమీద చేయి వేయకుము. అతని నేమియు చేయకుము. నీవు దేవునికి భయపడువాడవని ఇందువలన నాకు కనబడుచున్న"దనెను. (ఆః ౨౨ః ౧, ౨, ౯-౧౨)

స :- ఇప్పుడు బైబిలు నందలి దేవు డల్పజ్ఞుడనియు, సర్వజ్ఞుడు కాడనియు స్పష్టమైనది. అబ్రహమును నతడు నొక యమాయకుడయి యుండెను. లేనిచో నిట్టి చేష్ట నెందుకు జేసియుండును. బైబిలు నందలి దేవుడు సర్వజ్ఞుడే యైన నతని భవిష్యత్తులోని భక్తిని దన సర్వజ్ఞత్వముతో తెలిసికొనియే యుండును. కావున గ్రైస్తవుల దేవుడు సర్వజ్ఞుడు కాడనుటయే నిశ్చయము. (౨౬)

౨౭. మా శ్మశాన భూములలో అతి శ్రేష్ఠమైన దానియందు మృతి బొందిన నీ భార్యను పాతిపెట్టుము. (ఆః ౨౩ః ౨౬)

స :- శవములను బాతిపెట్టుటవలన బ్రపంచమునకు గొప్పహాని కలుగుచున్నది. ఎట్లన నవి మురిగి వాయువును దుర్గంధపఱచి రోగములను వ్యాపింప జేయుచున్నవి.

ప్రశ్న :- చూడుడు! ప్రీతి మెండుగా నుండువానిని గాల్చుట మంచిది కాదు. పాతి పెట్టుట వలన వానిని బరుండ బెట్టిన ట్లగును. కావున బాతిపెట్టుటయే మంచిది.

ఉత్తరము :- మృతినొందినవారిని బ్రేమింతురేని తమ యింట నేల యుంచుకొనరు? మఱి యెందుకు బాతిపెట్టుచున్నారు? ఏ జీవాత్మయందు బ్రీతియుండెనో యది వెళ్ళిపోయెను. ఇక దుర్గంధయుక్తమగు మట్టియందేమి ప్రీతి? ప్రీతియుంతురేని దానిని మట్టిలో నేల పూడ్చిపెట్టుచున్నారు? చూడుడు. ఒక డొకనితో "నిన్ను మట్టిలో బూడ్చి పెట్టవలె"నని చెప్పెనేని యతడు విని ప్రసన్ను డెప్పటికి గాడు. అట్లే యతని ముఖనేత్ర శరీరములపై ధూళిని, ఱాలను, నిటికలను, సున్నమును వేయుట, ఱొమ్ముమీద బండ పెట్టుట యనునదొక ప్రీతియా? మఱి పెట్టెలో నుంచి పాతిపెట్టుటవలనను దుర్గంధమధికమై భూమినుండి వెడలి వాయువును జెఱచి దారుణమైన రోగములను బుట్టించును. (రెండవది) ఒక శవమును బూడ్చి పెట్టుటకు గనీస మాఱు మూరల పొడవును, నాలుగు మూరల వెడల్పునుగల భూమి కావలసి వచ్చును. ఈ లెక్క చొప్పున నూఱుశవములనో, వెయ్యింటినో, లక్ష సంఖ్యాకములనో లేక కోటి సంఖ్యాకములనో పూడ్చి పెట్టిన నెంతయో భూమి వ్యర్థముగ బనికిరానిదై పోవును. ఇక నది పొలమునకు గాని, తోటకుగాని, కాపురమునకుగాని యుపయోగపడ కుండును. కావున బాతి పెట్టుట యన్నిటి కంటె జెడ్డది. జలములలో వేయుట దానికంటె గొంత చెడ్డది. ఏలయనగా దాని నప్పుడే జలజంతువులు చీల్చి పీల్చి తినును. కాని జలమున మిగిలిన యెముకలు, మలము మురిగి ప్రపంచమునకు హాని కలిగించును. ఇక నడవిలో బాఱవేయుట యంతకంటెను జెడ్డది. ఏలయనగా దానిని మాంసాహారులైన పశుపక్ష్యాదులు కొరికి తిన్నను, దాని యెముకలలోని మజ్జ మలము, మురుగుటచేత నెంతయో దుర్గంధము పుట్టి యది జగత్తునకు మహాపకారము చేయును. కావున దహనము చేయుట సర్వోత్తమము. ఏలయనగా శవము నందలి పదార్థములన్నియు నణురూపమును బొంది వాయువులో గలసి పోవును.

ప్రశ్న :- దహనము చేయుటవలన గూడ దుర్గంధము కలుగును గదా?

ఉత్తరము :- దహన సంస్కార విధి ననుసరించి దహనము చేయని పక్షమందు గొంచెము కలుగును.

కాని పూడ్చిపెట్టుట మున్నగు వానికంటె నది చాల తక్కువ కలుగును. ఇక విధిపూర్వకముగ వేదమందు జెప్పబడినట్లు మూడుమూరల లోతును, మూడున్నర మూరల వెడల్పును, నైదు మూరల పొడవును, గ్రిందిభాగ మొకటిన్నఱ జేనెడు పరిమాణ మెత్తును వంపునుగల వేదికను ద్రవ్వించి శరీరపు బరువుగల ఘృతమును, నందు సేరునకు రతియెత్తు కస్తూరి, మాషయెత్తు కేసరి జేర్చి, యధమ పక్షమం దఱమణుగు చందనమును, (అధిక మెంతైన దీసికొనవచ్చును) అగరు, తగరు, కర్పూరము, పలాశాదులగు కట్టెలు దెచ్చి వేదియందు బేర్చి దానిపై శవమునుంచి పిదప నాలుగు దిక్కులను వేదిక ముఖమునుండి జేనెడువఱకు నిండుగ బేర్చి ఘృతాహుతుల నిచ్చుచు దహనము చేయవలయును. ఈ విధముగా దహన మొనరించిన గొంచెమైనను దుర్గంధము కలుగదు.దీనికే యంత్యేష్టి యనియు నరమేధ (పురుషమేధ) యాగమనియు నామములు. దరిద్రుడైనచో నిరువదిసేర్ల ఘృతముకంటె దక్కువగ నాచితి మీద వేయదగదు. భిక్షమెత్తియో, బంధువులనుండియో లేక రాజు నుండియో సంపాదించి యీ విధముగ దహనమే చేయవలయును. ఏ కారణముననైన ఘృతాదులు చిక్కని పక్షమందు బాతిపెట్టుట మున్నగు వానికంటె వట్టికట్టెలతో గళేబరమును దహనము జేయుటయే యుత్తమము. ఏలయనగా నొక యెకరపు భూమియందో లేక యొక వేదికయందో లక్షల కోట్ల శవములను దహనము చేయవచ్చును. భూమికూడ బాతి పెట్టుటవలన బాడగునట్లు దహనమువలన నంతగా గాదు. ఇక సమాధులను జూచుట వలన గూడ భయము కలుగుచున్నది. కావున బాతిపెట్టుట మొదలగునవి సర్వథా నిషిద్ధములని గ్రహింపవలయును.

౨౮. అబ్రహాము యజమానుని దేవుడయిన సర్వేశ్వరుడు స్తుతింపబడుగాక. ఆయన నా యజమానునకు తన కృపను, తన సత్యమును, చూపుట మానలేదు. నేను త్రోవలో నుండగానే దేవుడు నా యజమానుని బంధువుల యింటికి నన్ను నడపించెను. (ఆః ౨౪ః ౨౭)

స :- అత డబ్రహామునకు మాత్రమే సర్వేశ్వరుడై యుండెనా? ఇప్పటి కూలివాండ్రుగాని, ముందు నడచువారు గాని, ముందునడచుచు ద్రోవ చూపునట్టు లీశ్వరుడును జూపెనన్న నిప్పు డెందుకు మార్గము చూపుట లేదు? మనుష్యులతో మాటలాడ డెందుకు? కావున నిట్టిమాట లీశ్వరుని మాటలు కాని యీశ్వరకృత గ్రంథములోనివి కాని కాజాలవు. ఇవి యనాగరికుల మాటలే యననొప్పును. (౨౮)

౨౯. ఇస్మాయేలు పుత్రుల పేర్లు :- ఇస్మాయేలు జ్యేష్ఠకుమారుడయిన నెబాయోతు, కేదారు, అద్బియేలు, మిబ్శాము, మిష్మా, దూమా, మశ్శా, హదరు, తేమా, ఇతూరు, నాపీషు, కేదమా.

(ఆః ౨౫ః ౧౩-౧౫)

స :- ఈ యిస్మాయే లబ్రహామువలన నతని హాజి రను దాసికి బుట్టినవాడు. (౨౯)

౩౦. నేను నీ తండ్రి కిష్టమైన రుచిగల భోజ్యములను చేసెదను. నీ తండ్రి మృతి నొందక మునుపు అతడు వానిని తిని నిన్నాశీర్వదించునట్లు నీవు వానిని నీ తండ్రి యొద్దకు తీసికొని పోవలె ననెను. మఱియు తన జ్యేష్ఠకుమారుడగు ఏశావుయొక్క సొగసైన వస్త్రములు ఇంటిలో తన యొద్ద నుండెను. కనుక రిబ్కా వానిని తీసి తన చిన్నకుమారుడగు యాకోబునకు తొడిగించి ఆ మేకపిల్లల చర్మములతో అతని మెడలమీద నునుపు భాగమును కప్పెను. అందుకు యాకోబు నేను ఏశావును, నీ జ్యేష్ఠకుమారుడను, నీవు నాతో చెప్పినట్లు చేసియున్నాను. నీవు నన్ను దీవించుటకై దయచేసి లేచి కూర్చుండి, నేను వేటాడి తెచ్చినదానిని తినుమనెను. (ఆః ౨౭ః ౯-౧౦-౧౫-౧౬-౧౯)

స :- గమనింపుడు! ఇట్లు కల్లలాడి, కపటవేషముని యాశీర్వాదము పొందినవారే పిదప సిద్ధులు, పైగంబరులు నయిరనుట యాశ్చర్యము కాదా? ఇటువంటివారు క్రైస్తవులకు మార్గదర్శకులై యుండిన నిక వీరి మతమందు బొరపాటు లుండుటకు గొదువయేమి? (౩౦)

౩౧. తెల్లవాఱినప్పుడు యాకోబు లేచి తాను తలగడగా చేసికొనిన ఱాయితీసి దానిని స్తంభము నకు నిలిపి దానికొనమీద నూనెపోసెను. మఱియూనతడాస్థలమునకు "బేతేలు" అని పేరు పెట్టెను. స్తంభ ముగా నేను నిలిపిన యీఱాయి దేవుని మందిర మగును. (ఆ: ౨౮: ౧౮, ౧౯, ౨౨)

స :- ఇప్పు డీయనార్యుల పనులను జూడుడు! ఱాల బూజించినది, పూజింపజేసినది వీరేకద. దీనినే యిప్పుడు ముసల్మానులు "బయితుల్ ముకద్దస్" అనియెదరు. ఏమి? ఈ ఱాయియే యీశ్వర మందిరమా? ఈ ఱాయి యందే యీశ్వరుడు వసించుచుండెనా? మేలు! మేలు! ఏమి చెప్పవలయును! క్రైస్తవులారా! మీరే గొప్ప విగ్రహారాధకులనుట స్పష్టము. (౩౧)

౩౨. దేవుడు రాహేలును జ్ఞాపకము చేసికొని ఆమె మనవి విని ఆమె గర్భము తెఱచెను. అప్పుడు ఆమె గర్భవతియై కుమారుని కని దేవుడు నానింద తొలగించెననుకొనెను. (ఆ: ౩౦: ౨౨-౨౩)

స :- భళిరేభళీ! క్రైస్తవుల దేవుడెంత గొప్ప డాక్టరనవలయును? స్త్రీల గర్భములను దెఱచుటకు నెట్టి శస్త్రౌషధము లున్నవో కదా! ఇవన్నియు బోలిక పొందిక లేని మాటలే. (౩౨)

౩౩. ఆ రాత్రి స్వప్నమందు దేవుడు విశ్రాంతి యుతుడైన లాబాను నొద్దకు వచ్చి నీవు యాకో బుతో మంచిగాని చెడుగాని పలుకకుము. జాగ్రత్త సుమీ! అని యతనితో చెప్పెను. నీ తండ్రి యింటిమీద బహువాంఛ గలవాడవై నా దేవతల నేల దొంగిలించితివి? (ఆ: ౩౧: ౨౪, ౩౦)

స :- మేమిట గొన్ని మాటల నుదాహరించుచున్నాము. గమనింపుడు! వేలకొలది మనుష్యులకు స్వప్నమందు దేవుడు వచ్చెననియు, వారితో మాట్లాడెననియు, జాగ్రదవస్థలో గూడ బ్రత్యక్షముగ వచ్చి కలిసెననియు, దినెననియు, ద్రాగెననియు, వచ్చుచు, బోవుచు నుండెననియు నిట్టి మాట లెన్నియో బైబిలునందు వ్రాయబడి యున్నవి. కాని యిప్పుడత డున్నాడో లేడో తెలియుటలేదు. ఏమనగా నిప్పుడా దేవు డెవరికిని స్వప్నమందు గాని, జాగ్రదవస్థయందు గాని వచ్చి కలియడు. మఱి యీయనా ర్యులు పాషాణాది మూర్తులను దేవతలని నమ్మి పూజించు చుండిరని కూడ దీనివలన తేటపడినది. ఇక గ్రైస్తవుల దేవుడు కూడ ఱాతినే దేవుడని నమ్ముచున్నాడు. లేనిచో దేవతలు దొంగిలింపబడుట యెట్లు ఘటించును? (౩౩)

౩౪. యాకోబు తన త్రోవను వెళ్ళుచుండగా దేవదూత లతని నెదుర్కొనిరి. యాకోబు వారిని చూచి ఇది దేవుని సేన అని చెప్పెను. (ఆ: ౩౨: ౧, ౨)

స :- ఇప్పుడు క్రైస్తవుల దేవుడు మనుష్యుడనుట కేమి సందేహము? ఏమనగా - సైన్యమునుగూడ నుంచుకొని యున్నాడు గదా! సైన్యమున శస్త్రములుకూడ నుండవచ్చును. మఱి యేవైపుననేని యుద్ధము కూడ జేయుచుండవచ్చును గద! లేనిచో సైన్యముతో నేమి ప్రయోజనము? (౩౪)

౩౫. యాకోబు ఒక్కడు మిగిలిపోయెను. ఒక నరుడు తెల్లవారు పర్యంత మతనితో పెనగులాడెను. తానతని గెలువకుండుట జూచి తొడగూటిమీద నతనిని కొట్టెను. అప్పుడతడు, ఆయనతో పెనగు లాడుట వలన యాకోబు తొడగూడు వదిలెను. ఆయన తెల్లవారుచున్నది గనుక నన్ను పోనిమ్మనగా అతడు నీవు నన్నాశీర్వదించిన గాని నిన్ను పోనియ్యననెను. ఆయన నీ పేరేమని యడుగగా యాకోబని చెప్పెను. అప్పుడాయన నీవు దేవునితోను, మనుష్యులతోను పోరాడి గెలిచితివి. కనుక ఇకమీదట నీపేరు ఇశ్రాయేలే కాని యాకోబు అనబడదని చెప్పెను. అప్పుడు యాకోబు నీపేరు దయచేసి చెప్పుమనెను. అందుల కాయన నీవు నా పేరెందు కడిగితివని యడిగి అతని నాశీర్వదించెను. యాకోబు నేను ముఖాముఖిగా దేవుని చూచితిని. అయినను నా ప్రాణము దక్కినదని ఆ స్థలమునకు పెనీయేలు అని పేరు పెట్టెను. అతడు పెనీయేలు నుండి సాగిపోయినపుడు సూర్యోదయ మాయెను. అప్పుడతడు తొడ

కుంటుచుండెను. అందుచేత ఆయన యాకోబు తొడగూటిమీద తుంటినరము కొట్టినందున నేటివరకు ఇశ్రాయేలీయులు తొడగూటి మీదనున్న తుంటినరము తినరు. (ఆః ३२ః २४-३२)

స ః- క్రైస్తవుల దేవుడు మల్లుడయినందుననే కదా దయగలిగి శారకును, హేబేలుకును, బుత్రులను గలుగజేసెను! ఆహా! ఇట్టివా డెప్పుడయిన నీశ్వరుడు కాగలడా? ఒకడు పేరడుగగా నతడు తన పేరే తెలుపడు. ఇదియు నొక చిత్రమే కదా! ఇక నీశ్వరు డతని నరమును బెణికించి గెలిచెనే కాని భక్తుడయిన యాకోబు కుంటుచుండినట్లే యన్యభక్తులును గుంటుచుండగలరు. ఈశ్వరుని ముఖాముఖిగ జూచి యతనితో మల్లయుద్ధము చేసెనన్న నతడు శరీరసహితుడే యననొప్పును గద. లేనిచో నది సంభవమగునా? కాన నిది కేవలము కుఱ్ఱదనపు జేష్ట అనుట స్పష్టము. (३५)

३६. ఈశ్వరుని ముఖము చూచెను. (తౌ. ३३. ఆ १०)

స ః- ఈశ్వరునకు ముఖమున్నచో తక్కిన యవయవములు కలిగి జన్మమరణములు కలవాడు కూడ గావలెను.

३७. యూదా జ్యేష్ఠకుమారుడైన ఏరు సర్వేశ్వరుని దృష్టికి చెడ్డవాడు గనుక సర్వేశ్వరు డతనిని చంపెను. అప్పుడు యూదా ఓనానుతో నీఅన్నభార్య యొద్దకు వెళ్ళి మఱది ధర్మ(నియోగ)ము జరిగించి నీ అన్నకు సంతానము కలుగజేయు మని చెప్పెను. ఓనాను ఆ సంతానము తనది కానేరదని యెఱిగి ఆమెతో పోయినప్పుడు తన అన్నకు సంతానము కలుగజేయకుండునట్లు తన రేతస్సును నేలను విడిచెను. అతడు చేసినది సర్వేశ్వరుని దృష్టికి చెడ్డది గనుక ఆయన అతనిని గూడ చంపెను.

(ఆః ३८ః ७-१०)

స ః- ఇప్పుడు గమనింపుడు! ఈ పనులు మనుష్యులవా? ఈశ్వరునివా? ఆమెతో నియోగ మైనపుడతని జంపిన దెందులకు? అతని బుద్ధిని శుద్ధి చేయలే దేల? దీనిని బట్టి పూర్వకాలమం దంతట వేదోక్త నియోగ పద్ధతులు ప్రచారమం దుండెననుటయే నిశ్చయము. (३७)

## నిర్గమ కాండము

३८. మోషే పెద్దవాడైనప్పుడు తన జనులలో నొక ఇబ్రీయుని నొక ఐగుప్తీయుడు కొట్టగా చూచెను. అతడు ఇటునటు తిరిగి చూచి యెవడును లేకపోగా ఆ ఐగుప్తీయుని చంపి, ఇసుకలో వానిని కప్పిపెట్టెను. మఱునాడు అతడు బయట నడచి వెళ్ళుచుండగా ఇబ్రీయులైన మనుష్యులిద్దఱు పోట్లాడుచుండిరి. అప్పుడతడు అన్యాయము చేసినవానిని చూచి నీవేల నీ పొరుగువానిని కొట్టుచున్నావని యడుగగా - అతడు మామీద నిన్ను అధికారినిగాను తీర్పుచేయువానిగాను నియమించిన వాడెవడు? నీవు ఐగుప్తీయుని చంపినట్లు నన్ను చంపవలెనని అనుకొనుచున్నావా? అనెను. అందులకు మోషే భయపడి పరుగిడెను. (నిర్గః २ః ११-१५)

స ః- ఇప్పుడు విచారింపుడు! బైబిలులోని ముఖ్యసిద్ధపురుషుడు మతాచార్యుడు నగుమోషే యనునతని చరిత్ర క్రోధాది దుర్గుణములతో గూడినదియు, నరహత్యచేసి దొంగవలె రాజదండనమును దప్పించుకొనునదియు నైయుండెను. ఈ సంగతిని మఱుగుపడజేసినచో నత డవశ్యముగ నసత్య వాదియై యుండవచ్చును గద. ఇట్టి వానితోడ నీశ్వరుడు కలిసెను. ఇక నతడు పైగంబరుగా గణింపబడి యూదాదుల మతమును బ్రవర్తింప జేసినపుడది కూడ నా మోషేను బోలియే యుండవచ్చును. దీనివలన గ్రైస్తవులకు మూలపురుషులగు మోషే మొదలగు వారందఱును నాటవికులై యుండిరనియు విద్యావంతులు గాకుండిరనియు దేటపడుచున్నది. (३८)

౩౯. పరమేశ్వరుడు చూచుటకు ఒక ప్రక్క ముడుచుకొన్న దానిని త్రిప్పి చిన్నపొద మధ్యలో నున్న వానిని పిలిచి ఓ మోషే! మోషే! అని పిలిచెను. అప్పుడు మోషే యిక్కడ నున్నాడననగా - ఇక్కడకు రావలదనియు, నిది పవిత్రభూమి కనుక చెప్పులు తొడిగిన పాదములతో రావలదనియు జెప్పెను. (తౌరీ. ౩. ఆ ౪-౫)

స :- చూడుడు. మనుష్యుని జంపి యిసుకలో బూడ్చు వారితో నీశ్వరునకు మైత్రి, మఱియు దేవదూతగా నంగీకరించుటయు చేయుచున్నారు. మీ యీశ్వరుడు మోషేతో పవిత్ర స్థలమునకు చెప్పులు తొడిగి రావలదని చెప్పెను. మీ క్రైస్తవులేల యాతని యాజ్ఞకు విరుద్ధముగ నడచుచున్నారు?

ప్రశ్న :- మేము చెప్పులకు బదులు టోపీలు తీయుచున్నాము.

ఉత్తరము :- మీరు రెండవ యపరాధము చేయుచున్నారు. టోపీ తీయుమని ఈశ్వరుడు చెప్ప లేదు. మీ పుస్తకములలో వ్రాయబడలేదు. తొలగింపవలసిన వానిని తొలగింపకయు, తొలగింప నావశ్యకము లేని వానిని తొలగించుటయు రెండును మీ పుస్తకమునకు విరుద్ధములే.

ప్రశ్న :- మా యూరోపు దేశములో చలి యెక్కువగుటచే మేము పాదరక్షల విడువము.

ఉత్తరము :- ఏమి? తలకు చలిలేదా? ఇదే యగుచో యూరోపు దేశమునకు వెళ్ళినపుడు చేయుడు. ఇక్కడ మా యింటికి వచ్చినప్పుడుకాని పడకపై చేరినపుడుకాని పాదరక్షలు విడువుడు. మీరు అటుల విడువకున్నచో మీ బైబిలుకు విరుద్ధముగా నడచిన వారగుదురు.

౪౦. ఈశ్వరుడు మోషేతో నీ చేతిలో నేమున్నదనెను. ఆతడు చిన్న బెత్తమున్న దనెను. అయి నచో దానిని భూమిపై బడవేయుమనెను. ఆతడు పడవేసెను. అప్పుడది సర్పముగా మారెను. దానిని చూచి మోషే పరుగిడుచుండ పరమేశ్వరుడు ఆతనితో నీచేయి చాచి దానితోకను బట్టుకొమ్మనెను. ఆతడట్లే చేయగా నది చేతిలో బెత్తమాయెను.

అప్పుడు పరమేశ్వరు డాతనితో నీ చేతిని నీ యొడిలో నుంచుకొమ్మనెను. ఆతడట్లే చేసి బయటకి దీయగా నాతని చేయి మంచువలె కుష్ఠరోగి చేయివలె ముడుచుకొనెను. దానిని జూచి పరమేశ్వరుడు ఆతనితో నీచేయి మరల నొడిలో నుంచుకొనుమనగా నాతడట్లే చేసి బయటకు దీయగా నెప్పటివలె బాగుగా నుండెను. నీవు నీలమగు నదియొక్క నీరు తీసికొని యెండిన దానిపై పోయుము. నది నుండి తీసిన నీరు ఎండిన దానిపై నెత్తురగును. (తౌ. ౪. ఆ ౨-౪, ౬, ౭, ౯)

స :- చూడుడు. ఈ గారడీవాని ఆట. ఆటగాడైన యీశ్వరుడు, ఆతని సేవకుడైన మోషే యీ మాటల నెట్లంగీకరింతురు? నేటిగారడీవాండ్రు ఇంతకంటె తక్కువ చమత్కారములు చేయుచున్నారా? ఇది ఈశ్వరుని గొప్ప యాటయా? వీనిని విద్వాంసులెట్లంగీకరింతురు?

మఱియు మాటి మాటికి నేను పరమేశ్వరుడను, అబ్రహామ్, ఇజక్, యాకోబులకు ఈశ్వరుడను నిట్టి వానిని ప్రతిపర్యాయము తన నోటిద్వారా తన ప్రశంసను చేయుట యుత్తముల లక్షణము గాదు. ఇట్టిది గర్వము గలవాని లక్షణము.

౪౧. పస్క పశువును వధింపుడీ! మఱియు హిస్సోపు కుంచె తీసికొని పళ్ళెములో నున్న రక్త ములో దానిని ముంచి ద్వారబంధపు పైకమ్మికిని, రెండు నిలువు కమ్ములకును పళ్ళెములోని రక్తము తాకిం పవలెను. తరువాత మీలో నెవడు ఉదయకాలము వఱకు తన యింటి ద్వారమునుండి బయలు వెడల గూడదు. సర్వేశ్వరుడు ఐగుప్తీయులను హతముచేయుటకు దేశసంచారము చేయుచు ద్వారబంధపు పై కమ్మిమీదను రెండు నిలువు కమ్ముల మీదనున్న రక్తమును జూచి సర్వేశ్వరు డాతలుపును దాటి పోవును. మిమ్ము హతము చేయుటకు మీ యిండ్లలోనికి సంహారకుని చొరనీయడు. (నిర్గ: ౧౨:౨౧; ౨౨, ౨౩)

స :- ఆహా! ఇట్టి గారడీవానివలె నున్న యీశ్వరు డెన్నడైన సర్వజ్ఞు డనబడగలడా? రక్తముద్రను జూచినపుడేకద యది ఇశ్రాయేలీయుల వంశమువారి యిల్లని గుర్తించును. లేనిచో గుర్తింపనేరకుండును. ఇదియు నొక క్షుద్రబుద్ధిగల మనుష్యుని పనివంటి పనియే. కావున నివి యొకా నొక యాటవికునిచే వ్రాయబడిన మాటలే యని విదిత మగుచున్నది. (౪౧)

౪౨. అర్ధరాత్రివేళ జరిగినదేమనగా - సింహాసనము మీద కూర్చున్న ఫరోయు మొదలుకొని చెఱసాలలో నున్న ఖైదీయొక్క తొలిపిల్ల పర్యంతము ఐగుప్త దేశమందలి తొలిపిల్లల నందఱిని, పశువుల తొలిపిల్లల నన్నిటిని సర్వేశ్వరుడు హతము చేసెను. ఆ రాత్రి ఫరోయు, అతని సేవకు లందఱును ఐగుప్తీయులందఱును లేచినపుడు శవములేని యిల్లొకటియు లేకపోగా ఐగుప్తులో మహాఘోషపుట్టెను. (నిర్గ: ౧౨: ౨౯, ౩౦)

స :- అకటా! అర్ధరాత్రివేళ దొంగవలె దయలేని క్రైస్తవుల దేవు డేయపరాధములేని యా బాల వృద్ధులను, స్త్రీలను, పశువులను జంపివేసెను. ఎంతమాత్రము దయరాలేదుగా! ఐగుప్త దేశమందు మహాఘోష పుట్టినప్పుడును నీక్రైస్తవులదేవుని చిత్తమునందలి క్రోధము నశింపకుండెనా? ఇది యీశ్వరుని పనియా? ఒక సామాన్య పురుషుడైనను జేయదగినది కాదు. కాని, యిది యాశ్చర్యమును గాదు. ఏలయన "మాంసాహారిణః కుతో దయా" అనునట్లు క్రైస్తవుల దేవుడు మాంసాహారి కాబట్టి యతనికి దయ యెక్కడినుండి వచ్చును? (౪౨)

౪౩. "సర్వేశ్వరుడు మీ పక్షమున యుద్ధము చేయును. సాగిపోవుడి" అని ఇశ్రాయేలీయులతో చెప్పుము. నీవు నీ కఱ్ఱను ఎత్తి ఆ సముద్రము వైపు నీ చెయ్యి చూపి దానిని పాయలు చేయుము. అప్పుడు ఇశ్రాయేలీయులు సముద్రమధ్యమున ఆరిన నేలను నడచి పోవుదురు.

(నిర్గ: ౧౪: ౧౪, ౧౫, ౧౬)

స :- ఏమయ్యా! మొదట నీశ్వరుడు గొఱ్ఱెల వెనుకనుండు గొఱ్ఱెల కాపరివలె నిశ్రాయేలీయుల వెనువెంట దిరుగుచుండెను. ఇప్పు డెక్కడికి మాయమైపోయెనో తెలియకున్నదిగా? అటులగాకున్న నడిసముద్రమునుండి నాలుగు వైపులకు రైలుబండ్లు నినుపదారులు చేయించుకొని యుందురుగద. దాని వలన సమస్త జగత్తునకు లాభము కలుగుచుండెడిది. అట్లే నావలు మొదలగు వానిని జేయుశ్రమము దప్పి పోవుచుండెడిది. కాని యేమి చేయవలయును? క్రైస్తవులదేవు డెచ్చట దాగియున్నాడో గదా! ఈ బైబిలు నందలి యీశ్వరుడు మోషేతో నిటువంటి వెన్నియో యసంభవములైన లీలలు గావించి యున్నాడు. క్రైస్తవుల దేవు డెట్లున్నాడో యట్లే యతని సేవకులును గలరనియు, నతడు రచించిన పుస్తకము నట్లే యున్నదనియు విదిత మగుచున్నది. ఇట్టి పుస్తకమును, నిటువంటి దేవుడును మననుండి దూరముగా నుండుటయే మేలు. (౪౩)

౪౪. ఏలయనగా నీ దేవుడనైన సర్వేశ్వరుడనగు నేను ద్వేషముగల దేవుడను. నన్ను ద్వేషించు వారి విషయములో మూడునాలుగు తరములవారు పర్యంతము తండ్రుల దోషమును కుమారుల మీదికి రప్పించుచున్నాను. (నిర్గ: ౨౦-౫)

స :- సరి. తండ్రి చేసిన యపరాధమును బట్టి యతని నాలుగు తరముల వారిని దండించుట న్యాయమేనా? మంచి తండ్రికి దుష్టులును, దుష్టునకు మంచి సంతానమును గలుగుట లేదా? అటులైన నాలుగు తరములవారి నెట్లు దండింప గలుగును. ఇక నైదవతరమువారు దుష్టులయినను వారిని దండింప నేరకుండును. కాబట్టి యపరాధము లేనివానిని దండించువా డన్యాయకారి యనబడును. (౪౪)

౪౫. విశ్రాంతిదినము పరిశుద్ధదినముగా నాచరించుటకు జ్ఞాపకముంచుకొనుము. ఆఱు దినములు

నీవు కష్టపడి నీపని యంతయు చేయవలయును. ఏడవ దినము నీ దేవుడయిన సర్వేశ్వరునికి విశ్రాం దినము. సర్వేశ్వరుడు విశ్రాంతిదినమును ఆశీర్వదించెను. (నిర్గ: ౨౦: ౮-౧౧)

స :- ఒక యాదివారమే పవిత్రమై తక్కిన యాఱుదినములు నపవిత్రములా! పరమేశ్వరు డాఱు దినముల వఱకు గొప్ప పరిశ్రమముచేసి యుండెనా? అందువలన నలసి యేడవదినము నిద్రపోయెన చెప్పబడినది. ఇక నాదిత్యవారమున నాశీర్వదించెనన్న సోమవారము మొదలుగ నాఱుదినముల శాప యిచ్చెను. వానిని శపించియే యుండవచ్చును గద. ఇట్టి పని నొక విద్వాంసుడైన జేయడే. ఈశ్వరుడెట్ల చేయును. మంచిది! ఒక దానిని పరిశుద్ధ దినమని యాశీర్వదించి తదితరములను వ్యర్థముగా నపరిశుద్ధము లని చెప్పెనేని యాదిత్యవారమం దేమి గుణము కలదు? మఱి సోమవారము మున్నగు వానియందేమి దోషము లున్నవి? (౪౫)

౪౬. నీ పొరుగు వానిమీద అబద్ధసాక్ష్యము పలుకకూడదు. నీ పొరుగువాని యిల్లు ఆశింపగూడదు. నీ పొరుగువాని భార్యనైనను, అతని దాసునైనను, అతని దాసినైనను, అతని యెద్దునైనను, అతని గాడిదనై నను, నీ పొరుగువానిదగు దేనినైనను ఆశింపగూడదు. (నిర్గ: ౨౦-౧౬, ౧౭)

స :- ఔరా! అందులకే దప్పిక గలవాడు జలము, నాకలిగలవాడన్నము నాశించునట్లు క్రైస్తవులు పరదేశీయుల సొమ్మున కాశపడి యున్నారు. ఇది తమ ప్రయోజనము సిద్ధింపజేయునదియు, బక్షపాత ముతో గూడినదియునై యున్నటులే యీ క్రైస్తవుల దేవుడు నుండవచ్చును. మేము మనుష్య మాత్రు లను పొరుగువారుగా భావించుచున్నా మన్న మనుష్యులుగాక పొరుగువారుగా నుండి స్త్రీలు, దాసీలు గలవా రితరు లెవరుందురు? కావున నివి స్వార్థసాధకులచే వ్రాయబడిన మాటలేకాని యీశ్వర వాక్యములు కావు. (౪౬)

౪౭. నరుని చావగొట్టిన వానికి నిశ్చయముగా మరణశిక్ష విధింపవలెను. అయితే వాడు చంపవలెనని పొంచియుండకయే దైవికముగా వాని చేత ఆ హత్య జరిగిన యెడల అప్పుడు పారిపోగల యొకస్థలము నీకు నిర్ణయించెదను. (నిర్గ: ౨౧: ౧౨, ౧౩)

స :- ఈ దేవుని న్యాయము సత్యమేని మోషే యొక మనుష్యుని జంపి పూడ్చిపెట్టి పాఱిపోయి యుండెను. వాని కేదండనము విధింపలే దెందుకు? ఈశ్వరుడు వానిని జంపుమని మోషే కప్పగించెనన్న నీశ్వరుడు పక్షపాతి యయ్యెను. ఏలయనగా మోషేకు రాజుచే నేల న్యాయము చేయింపలేదు. (౪౭)

౪౮. సర్వేశ్వరుని సమాధాన బలులుగా కోడెలను వధించిరి. అప్పుడు మోషే ఆ రక్తములో సగము తీసికొని పళ్ళెములో బోసి ఆ రక్తములో సగము బలిపీఠము మీద ప్రోక్షించెను. అప్పుడు మోషే రక్తము తీసికొని ప్రజలమీద ప్రోక్షించి ఇదుగో యీ సంగతు లన్నిటి విషయమున సర్వేశ్వరుడు మీతో చేసిన నిబంధన రక్తము ఇదే అని చెప్పెను. అప్పుడు సర్వేశ్వరుడు మోషేతో నిట్లనెను :- నీవు కొండెక్కి నాయొద్దకు వచ్చి యిచట నుండుము. నీవు వారికి బోధించునట్లు నేను వ్రాసిన ఆజ్ఞలను ధర్మశాస్త్రమును ఱాతి పలకలను నీకిచ్చెదను. (నిర్గ: ౨౪: ౫, ౬, ౮, ౧౨)

స :- ఇప్పుడు చూడుడు! ఇవన్నియు నడవి మనుష్యుల మాటలే కదా! పరమేశ్వరుడు కోడెల బలిదానము నంగీకరించెను. బలిపీఠముమీద రక్తమును ప్రోక్షించెను అనుమాట లనాగరికతా సభ్యతలనే బోధించుచున్నవి. క్రైస్తవుల దేవుడు కూడ కోడెదూడల బలిదానమును బుచ్చుకొనుచున్నప్పుడతని భక్తులు గోవుల బలిదానము ప్రసాదముగా గొని తమపొట్టల నేల నింపుకొనరు? ఇక జగత్తునకు హాని కలుగ జేయక యుందురా? ఇటువంటి చెడ్డ మాట లెన్నియో యీ బైబిలునందు నిండి యున్నవి. ఆ కుసం స్కారములు పొందియున్నందుననే కద వేదములందును నట్టి మిథ్యా దోషముల నారోపింప గోరుచు

న్నారు. కాని వేదములం దిట్టి విషయములు పేరుకుగూడ లేవు. మఱి క్రైస్తవుల దేవు డొకగుట్ట మీద వసించుచుండెననియు, నొక యడవి మనుష్యుడుగ నుండెననియు గూడ నిశ్చయమైనది. ఇక నా దేవుడు కలము, కాగితములు, సిరా యనువాని నెఱుగని వాడయి నందుననే కద రాతి పలకల మీద వ్రాసి యిచ్చుచుండెను. ఇటువంటివా డాయడవి మనుష్యుల కీశ్వరుడయ్యెను! (౪౮)

౪౯. ఆయన నీవు నా ముఖమును చూడజాలవు. ఏ నరుడును నన్ను చూచి బ్రతుక డనెను. మఱియు సర్వేశ్వరు డిట్లనెను. ఇదిగో సమీపమున ఒక స్థలమున్నది. నీవు ఆ బండ మీద నిలువవలెను. నా మహిమ నిన్ను దాటి వెళ్ళుచుండగా ఆబండ సందులో నిన్నుంచి నిన్నుదాటి వెళ్ళువఱకు నా చేతితో నిన్ను కప్పెదను. నేను నా చెయ్యి తీసిన తరువాత నా వెనుక పార్శ్వమును చూచెదవు గాని నా ముఖము నీకు కనబడదని మోషేతో చెప్పెను. (నిర్గ: ౩౩: ౨౦-౨౩)

స :- ఇప్పుడు క్రైస్తవుల దేవుడు మనుష్యునివలె శరీరము కలవాడై యుండినను మోషేను మోసపుచ్చి తానెట్లు దేవుడయ్యెనో కనుగొనుడు. వెనుకటి పార్శ్వమును చూడగలవు. కాని రూపమును చూడలేవని చెప్పినపుడు చేతితో నతనిని గప్పకయు నుండవచ్చును. దేవుడు తన చేతితో మోషేను గప్పినప్పు డతని కాచేతి రూపము కనబడ కుండునా! (౪౯)

## లేవీయ కాండము

౫౦. సర్వేశ్వరుడు మోషేను పిలిచి ప్రత్యక్షపు గుడారములో నుండి అతని కిట్లు సెలవిచ్చెను. నీవు ఇశ్రాయేలీయులతో నిట్లనుము - ఎవడైనను సర్వేశ్వరునికి బలి యర్పించునప్పుడు గోవుల మందలో నుండిగాని, గొఱ్ఱెల మందలోనుండిగాని, మేకల మందలోనుండిగాని దానిని తీసికొని రావలెను.

(లేవీయ. కాం. ౧. ౧, ౨)

స :- ఇప్పు డాలోచింపుడు. క్రైస్తవుల దేవుడు గోవృషభాదులను బలిగా బుచ్చుకొనువాడై నందుకే కద! వానిని దనకు బలిగా నర్పింపుడని యుపదేశించుచున్నాడు. ఇక నతడు గోవృషభాదిపశువుల రక్త మాంసముల కాకలి దప్పియు గలవాడా? కాడా? దీనివలన నత డహింసకుడు గాడు. ఈశ్వరుడును గాడు కాని మాంసాహారియగు మానవుడే యనవొప్పును. (౫౦)

౫౧. అతడు సర్వేశ్వరుని సన్నిధిని ఆ కోడెదూడను వధించి తరువాత యాజకులైన అహరోను కుమారులు దాని రక్తమును తెచ్చి ప్రత్యక్షపు గుడారము నెదుటనున్న బలిపీఠముచుట్టు ఆ రక్తమును ప్రోక్షింపవలెను. అప్పు డతడు దహన బలిరూపమైన ఆ పశుచర్మము నొలిచి దాని యవయవములను విడదీసిన తరువాత యాజకుడయిన అహరోను కుమారులు బలిపీఠముమీద అగ్నినుంచి అగ్నిమీద కట్టె లను చక్కగా పేర్చవలెను. అప్పుడు యాజకులైన అహరోను కుమారులు అవయవములను, తలను, క్రొవ్వును బలిపీఠము మీదనున్న అగ్నిమీద కట్టెలపైని చక్కగా పేర్చవలెను. దాని ఆంత్రములను, కాళ్ళను నీళ్ళతో కడుగవలెను. అది సర్వేశ్వరుని కింపైన సువాసనగల దహనబలి యగునట్లు యాజకుడు అదంతయు బలిపీఠముమీద దహింపవలెను. (లేవీయ. కాం. ౧. ౫-౯)

స :- కొంచెమాలోచింపుడు! దేవుని సమ్ముఖమునందు తన భక్తులు దూడను జంపుట, తాను జంపించుట, రక్తమును వారు నలువైపుల జిలుకరించుట, యగ్నియందు హోమము చేయుట, దేవు డా సుగంధమును బీల్చుట యనునివి కటికవాని యింట జరుగు కృత్యములకంటె గడునీచములు కావా? కావున బైబి లీశ్వరకృతము కాదు. అందు వర్ణింపబడిన యడవి మనుష్యునివంటి చరిత్రగలవా డీశ్వరుడును గానేరడు. (౫౧)

౫౨. మఱియు సర్వేశ్వరుడు మోషేకు నీలాగు సెలవిచ్చెను. ప్రజలు అపరాధు లగునట్లుగా అభిషిక్తుడయిన యాజకుడు పాపము చేసిన పక్షమున తాను చేసిన పాపమునకై నిర్దోషమైన కోడెదూడను సర్వేశ్వరునికి పాపపరిహారార్థము బలిగా సర్పింపవలెను. మఱి కోడె తలమీద చెయ్యి యుంచి సర్వేశ్వరుని సన్నిధి కోడెను వధింపవలెను. (లేవీయ. కాం. ౪ః ౧, ౩, ౪)

స :- ఇప్పుడు చూడుడు! స్వయముగ బాపకార్యముల జేయుచు నా పాపపరిహారార్థ మావు మున్నగు శ్రేష్ఠమైన పశువుల జంపుటయు, బరమేశ్వరుడు వాని జంపు మనుటయు నివి పాపముల దొలగజేయుటకు బ్రాయశ్చిత్తములట. ఇట్టి పనులను జేయుచు, జేయించువానిని సయిత మీశ్వరుడని భావించి తమకు ముక్తి కలుగుననుకొను క్రైస్తవులు ధన్యులే గదా! (౫౨)

౫౩. అధికారి అపరాధియైన యెడల అతడు నిర్దోషమైన మగమేక పిల్లను అర్పణముగా తీసికొని వచ్చి సర్వేశ్వరుని సన్నిధిని దాని వధింపవలెను. ఇది పాపపరిహారార్థమైన బలి (లేవీయ. కాం. ౪÷౨౨, ౨౩, ౨౪)

స :- సరి! ఇటులేని వీరి యధికారులును, న్యాయాధీశులును, సేనాధిపతులు మొదలగువారును బాపము చేయుట కెంతమాత్రము జడియకుందురు. ఏమనగా తా మిష్టమైన పాపముల జేయవచ్చునట. మఱి వానికి బదులుగా నావు, కోడె, మేక మున్నగువాని ప్రాణముల దీయుచు బ్రాయశ్చిత్తము చేసికొన వచ్చు నట! అందుకే కద క్రైస్తవు లొక పశుప్రాణమును గాని, పక్షి ప్రాణమును గాని తీయుటకు శంకింప కుండునది. క్రైస్తవులారా! వినుడు! ఇప్పుడయిన నీ యనార్యమతమును విడిచి సుసభ్యతాది ధర్మయుక్త మగు వేదమతమును స్వీకరింపుడు. దానిచేతనే మీకు శుభము చేకూరును. (౫౩)

౫౪. అతడు గొఱ్ఱెపిల్లను తేజాలని పక్షమున అతడు తాను జేసిన అపరాధ విషయమై రెండు తెల్లగువ్వలను గాని, రెండు పావురము పిల్లలను గాని సర్వేశ్వరు సన్నిధికి తీసికొని రావలెను. దానిమెడ నుండి దానితలను నులమవలెను. కాని, దాని నూడదీయ గూడదు. అతడు చేసిన పాపము విషయమై ప్రాయశ్చిత్తము చేయగా అతనికి క్షమాపణ కలుగును. రెండు తెల్లగువ్వలైనను రెండు పావురపు పిల్లలయినను తనకు దొరకనియెడల తూమెడు గోధుమపిండిలో పదియవవంతును పాపపరిహారార్థమై బలిరూపముగా తేవలెను. దాని మీద నూనె పోయవలదు. అతనికి క్షమాపణ కలుగును.

(తౌ. లేవీయ. కాం. ౫ః ౭, ౮, ౧౧-౧౩)

---

¹ కోడెను, గొఱ్ఱెను, మేకపిల్లను, బావురమును తుదకు బిండి నైనను బుచ్చుకొందునని నియమించి నట్టి యీ యీశ్వరునకు ధన్యవాదము! పావురపు బిల్లలను "మెడను నులిపించి" పుచ్చుకొనుచుండెను. అనగా మెడను ద్రుంచివేయుటకు జేయవలసిన శ్రమము దప్పిపోయెను. ఇదియు నొక యద్భుతమయిన వింతయే. వీని నన్నింటిని విచారించుటవలన నడవి మనుష్యులలో నొకానొక చతురుడగు పురుషుడుండె ననియు, నతడు పర్వత మెక్కి కూర్చుండి తన్ను నీశ్వరుడని ప్రసిద్ధ పఱచుకొనె ననియు, నజ్ఞానులుగ నున్న యితర మనుష్య లతనినే యీశ్వరుడని నమ్ముచుండిరనియు దెలియుచున్నది. ఇక నతడు తన యుక్తులచే నాపర్వతము మీదికి దినుటకు బశువులను బక్షులను నన్నాది పదార్థములను దెప్పించుకొనుచు నానందించు చుండెను. అతని దూతలు (ఫరిశ్తాలు) పనిచేయుచుండిరి. సజ్జనులార! బైబిలు నందలి కోడె లను, గొఱ్ఱెలను, మేకపిల్లలను, బావురపు పిల్లలను మంచిపిండిని దినునీశ్వరుడెక్కడ? మఱి సర్వవ్యాప కుడు సర్వజ్ఞుడు, నజన్ముడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి యను నిత్యాది యుత్తమ గుణములతో గూడిన వేదోక్తమగు నీశ్వరు డెక్కడ? విచారింతురు గాక!

స :- ఇప్పుడు వినుడు! క్రైస్తవులలో నొక దరిద్రుడుకాని, ధనవంతుడు కాని పాపము చేయుటకు జంక కుండవచ్చును. ఎందుకనగా వీరి యీశ్వరుడు పాపములకు ప్రాయశ్చిత్తము సులభముగా జూపించి యున్నాడు. కష్టపడవలసిన పనిలేక పాపమునుండియే పాపము దూరమగునని యీ క్రైస్తవుల బైబిలునం దుండుట మిక్కిలి యద్భుతమైన సంగతి. ఎందుకనగా మొదట బాపము చేసెను. రెండవసారి దాని నివారణకై జీవుల హింసించెను. ఇట్లు కోరినట్లుగా మాంసము దినుటకు లభించెను. పాపమును దొలగి పోయెను! అబ్బా! ఎంత పావురపు పిల్లమెడ విఱిచివేయుటవలన నది యెంతో తడవు విలవిల దన్నుకొన వచ్చును గద. అప్పటికి నీ క్రైస్తవులకు దయరాదు గదా! దయ ఎట్లు వచ్చును? వీరి యీశ్వరుడే హింస చేయుట కుపదేశించుచున్నాడు. ఇక బాపము లన్నియు నిట్టి ప్రాయశ్చిత్తములవలననే తొలగుచున్న నేసును విశ్వసించిన బాపపరిహార మగునను నాడంబరము లేల? (౫౪)

౫౫. దహనబలి పశుచర్మము ఏ యాజకుడు అర్పించునో అది అతని దగును. ప్రొయ్యిమీద వండిన ప్రతినైవేద్యము, కుండలోగాని, పెనముమీద గాని గాల్చినది యావత్తును దాని నర్పించిన యాజకు నిది. (తౌ. లేవీయ. కాం. ౭ః ౮, ౯)

స :- మే మిచ్చటి దేవీభోపుల (శక్తిపూజకుల)యు, మందిరముల నుండు పూజారులయు, బోపులీల లనెడు టక్కుల నెఱిగియుంటిమి. కాని క్రైస్తవుల యీశ్వరునియు, వారి పూజారులయు, బోపులీల లంతకంటె వేయిరెట్లు మించి యున్నవి. ఏలయన జర్మపువెల, దినుటకు భోజన పదార్థములు చిక్కినపుడు క్రైస్తవులు బాగుగా నానందించియే యుందురు. ఇప్పుడుకూడ నానందించు చుండ వచ్చును. ఔరా! ఏ మానవుడైన నొక బాలుని జంపించి మఱియొక బాలునకు వాని మాంసమును దినిపించునా? ఇటు లెన్నడైనను జరుగునా? అట్లే యీశ్వరునకు మనుష్య లందఱును, బహుపక్ష్యాదులగు జీవులన్నియు బుత్ర తుల్యములు కాబట్టి పరమేశ్వరు డిట్లెన్నడును జేయడు. కావున నీ బైబి లీశ్వర కృతము కాని యందువ్రాయ బడినవా డీశ్వరుడు గాని, దాని నమ్మువారు ధర్మజ్ఞులుగాని యెన్నటికిని గారు. కాని లేవీయ వ్యవస్థాది పుస్తకములం దిట్టి మాట లెన్నియో నిండియున్నవి. ఎంతవఱకని వివరింప వలయును. (౫౫)

## సంఖ్యా కాండము

౫౬. సర్వేశ్వరుని దూత కత్తిని దూసి చేతపట్టుకొని త్రోవలో నిలిచి యుండుట ఆగాడిద చూచెను. కనుక అది త్రోవ విడిచి పొలము లోనికి పోయెను. బిలాము ఆ గాడిదను దారికి మలుపవలెనని దానిని కొట్టెను. అప్పుడు సర్వేశ్వరుడు ఆ గాడిదకు వాక్కు నిచ్చెను. కనుక అది నీవు నన్ను ముమ్మారు కొట్టితివి. నేను నిన్నేమి చేసితినని బిలాముతో ననెను. (సంఖ్యాః ౨౨, ౨౩, ౨౮)

స :- పూర్వము గాడిదలును దేవదూతలను జూచుచుండెను. కాని యిప్పుడో బిషప్, ఫాదరి మున్నగు శ్రేష్ఠపురుషులకు గాని పామర పురుషులకు గాని యా దేవుడో యతని దూతలో కనబడుటలేదు. ఏమి యిప్పు డా పరమేశ్వరుడు నతనిదూతలు నున్నారా? లేరా? ఉన్నారేని గాఢనిద్రలో బరుండి యున్నారా? రోగగ్రస్తులై యున్నారా? లేక వేఱొక భూగోళమునకు వెళ్ళిపోయిరా? లేక మఱియొక పనిలో బ్రవేశించిరా? లేక యిప్పుడు క్రైస్తవుల మీద నలిగి పోయిరా? లేక చనిపోయిరా? ఏమై పోయిరో కద తెలియకున్నది. ఇప్పుడు లేరు. వారు కనబడుట లేదు. కావున నప్పుడును లేకుండ వచ్చును. కనబడ కుండ వచ్చునని యనుమానింప బడుచున్నది. కావున నివి వట్టి కల్పనలే యనదగును. (౫౬)

౫౭. మీరు పిల్లలలో ప్రతిమగవానిని, పురుషసంయోగము నెఱిగిన ప్రతిస్త్రీని చంపుడి. పురుష

సంయోగము నెఱుగని ప్రతి ఆడుపిల్లను మీ నిమిత్తము బ్రతుకనిండు. (సంఖ్యా. ౩౧ః ౧౭-౧౮)

స :- భళిరే! పైగంబరగు మోషేయు, మీ దేవుడును ధన్యులు! స్త్రీలను, బాలురను, వృద్ధులను బశ్వాదులను గూడ జంపిరిగదా! ఇక మోషే జారుడుగ నుండెననియే దీనివలన స్పష్టమగుచున్నది. ఎందుకనగా జారుడు గాకుండిన నక్షత యోని కన్యలను అనగా పురుష సంగము మెఱుగని కన్యలను దనకొఱకు దెప్పించి యుండడు. అట్లే వారికి దయారహితమౌ విషయాసక్తితో గూడిన యాజ్ఞయు నొసంగియుండడు. (౫౭)

# సమూయేలు రెండవ పుస్తకము

౫౮. అయితే ఆరాత్రి సర్వేశ్వరుని వాక్కు సైతానుకు ప్రత్యక్షమై సెలవిచ్చిన దేమనగా నీవు పోయి నా సేవకుడగు దావీదుతో నిట్లనుము - సర్వేశ్వరుడు నీకాజ్ఞ నిచ్చిన దేమనగా - నాకు నివాసముగా నొకమందిరము కట్టించుటకు నీవు తగినవాడవా? ఐగుప్తులో నుండి నేను ఇశ్రాయేలీయులను రప్పించిన నాటినుండి నేటివఱకు మందిరములో నివసింపక డేరాలోను, గుడారములలోను నివసించుచు సంచరించితిని. (తౌః సమూ. రెండవ. పు. అ ౭, ౫, ౬)

స :- ఇప్పుడు క్రైస్తవుల దేవుడు మనుష్యునివలె దేహధారియే యని స్పష్టమైనదిగదా! చూడుడు. నేను బహుపరిశ్రమము చేసితిని. అచ్చటచ్చట సంచరించితిని. ఇప్పుడు దావీదిల్లు కట్టించునేని యందు విశ్రాంతి పొందుదును. అని యొగ్గాడుచున్నాడు. ఇటువంటి దేవుని నిట్టి పుస్తకమును విశ్వసించుట కీక్రైస్తవులు లజ్జితు లగుటలేదే! పాపము వారేమి చేయగలరు! చిక్కి పోయిరికద! తప్పించుకొనుటకు గొప్ప పురుషార్థము చేయదగును. (౫౮)

# రాజుల పుస్తకము

౫౯. మఱియు బాబెలు రాజైన నెబుకద్ నేజరు ఏలుబడిలో పందొమ్మిదవ సంవత్సరమందు ఐదవనెల ఏడవదినమున రాజదేహ సంరక్షకులకు అధిపతియు, బాబెలురాజు సేవకుడగు నెబూజరుద్దాను యెరూషలేముకు వచ్చి సర్వేశ్వరుని మందిరమును, రాజనగరును, యెరూషలేము నందున్న యిండ్లన్నిటిని, గొప్పవారి యిండ్లన్నిటిని అగ్నిచేత కాల్పించెను. మఱియు రాజదేహ సంరక్షకుల అధిపతి యొద్ద నున్న కల్దీయుల సైనికులందఱును యెరూషలేము చుట్టునున్న ప్రాకారములను పడగొట్టిరి. (తౌ. రాజ. అః ౨౫; ౮-౧౦)

స :- చేయునదేమి! క్రైస్తవుల దేవుడు తన సుఖము కొఱకే కద దావీదునిచే నిల్లు కట్టించుకొని యందు విశ్రాంతి నొందుచుండగా నేబూజరు నుద్దా ననువాడే యాదేవుని యింటిని బడగొట్టి పాడు చేసెను. అప్పు డీశ్వరుడు గాని యతని దూతలు సైన్యము కాని యేమియు జేయలేక పోయిరి. మొదట వీరి దేవుడు గొప్ప యుద్ధముల జేయుచు విజయముల బొందు చుండెను. కాని యిప్పుడు తనయింటిని గాల్చి పడగొట్టినను నెందుకో పాపమూరక కూర్చుండి యుండెను. ఆతని దూత లెక్కడకు బాఱిపోయిరో గదా! ఇట్టి సమయమున నెవ్వడు నక్కఱకు రాలేక పోయెనే! ఇక నీశ్వరుని పరాక్రమ మెక్కడికి లేచిపోయెనో తెలియదు. ఒకవేళ నీసంగతి జరిగినది నిజమేని మొదట వ్రాయబడిన విజయపు సంగతు లన్నియు వట్టివే యనుట నిక్కము. ఏమి! ఐగుప్తు నందలి బాలబాలికలను జంపుటకే వీరుడయి యుండెనా? ఇప్పుడు వీరుల యెదుట మౌనముద్ర ధరించెనా? ఇట్టిక్రైస్తవుల దేవుడు నిందితుడయి తనకు నగౌరవము గలుగజేసికొనెను గద. ఈ పుస్తకమునం దిట్టి నిందాస్పదములగు వేలకొలది కథలు నిండి యున్నవి. (౫౯)

## జబూరు రెండవభాగము

౬౦. కావున సర్వేశ్వరుడు ఇశ్రాయేలీయుల మీదికి తెగులుపంపగా ఇశ్రాయేలీయులలో డెబ్బది వేలమంది చచ్చిరి. (దిన వృత్తాంతము. ౨౧: ౧౪)

స :- ఇప్పు డీయిశ్రాయేలీయులను గ్రైస్తవుల దేవుని లీల జూడుడు. ఏయిశ్రాయేలీయ కులమునకు బహువరము లొసంగి యుండెనో, యెవరని బాలింప నహర్నిశలు ప్రయత్నించుచుండెనో యట్టి దేవు డిప్పు డంతలోనే కోపించి తెగులు పంపి యాకులమందలి డెబ్బదివేల మందిని జంపించెను. ఈవింత యొకకవి వ్రాసినదానికి సరిపోయినట్లే యున్నది.

క్షణే రుష్టః క్షణే తుష్టో రుష్టస్తుష్టః క్షణే క్షణే।
అవ్యవస్థితచిత్తస్య ప్రసాదోఽపి భయంకరః॥ (సు. ర. భాండాగారము. ప్రక. ౩. శ్లో. ౧౩౯)

ఒక మనుష్య డొకక్షణమందు ప్రసన్నుడును మఱియొక క్షణమందప్రసన్నుడు నగునేని యతని ప్రసన్నతయు భయదాయక మగునట్లే యీ క్రైస్తవుల దేవుని సమాచారమును గలదు. (౬౦)

## యోబు గ్రంథము

౬౧. దేవదూతలు సర్వేశ్వరుని సన్నిధిని నిలుచుటకై వచ్చిన మఱియొక దినము తటస్థింపగా వారితో కూడ అపవాది సర్వేశ్వరుని సన్నిధిని నిలుచుటకై వచ్చెను. సర్వేశ్వరుడు – నీవు ఎక్కడనుండి వచ్చితివని వాని నడుగగా అపవాది – భూమిలో ఇటునటు తిరుగులాడుచు అందులో సంచరించుచు వచ్చితి నని సర్వేశ్వరునికి ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు సర్వేశ్వరుడు – నీవు నా సేవకుడైన యోబు సంగతి నాలోచించితివా? అతడు యథార్థవర్తనుడు, న్యాయవంతుడై దేవునియందు భయభక్తులు గలిగి చెడుతనము విసర్జించినవాడు భూమి మీద అతనివంటి వాడెవడును లేడు. నిష్కారణముగా అతనిని పాడుచేయుటకు నీవు నన్ను ప్రేరేపించినను అతడు ఇంకను వదలక నిలకడగా నున్నాడనగా అపవాది – చర్మమును కాపాడుకొనుటకై చర్మమును, తన ప్రాణము కాపాడుకొనుటకై తనకు కలిగినది యావత్తును నరుడిచ్చును గదా, ఇంకొకసారి నీవు చేయిచాపి అతని యెముకను, అతని దేహమును మొత్తిన యెడల అతడు నీముఖము నెదుటనే దూషించి నిన్ను విడిచిపోవును. అందులకు సర్వేశ్వరుడు – అతడు నీవశమున నున్నాడు. అతని ప్రాణమును మాత్రము నీవు ముట్టవద్దని సెలవిచ్చెను. కాబట్టి అపవాది సర్వేశ్వరుని సన్నిధినుండి బయల్వెడలి అఱికాలు మొదలుకొని నెత్తివఱకు బాధగల కురుపులతో యోబును మొత్తెను. (జబూరు: యోబు: ౨: ౧-౭)

స :- ఇప్పుడు క్రైస్తవుల యీశ్వరుని సామర్థ్యము జూడుడు. సైతాను తన యెదుటనే తన భక్తులను దుఃఖపెట్టుచుండగా దాను సైతానును శిక్షించి తన భక్తుల రక్షింపలేక పోయెను. మఱి దూతలలో సైతానుతో నెదురాడ గలుగునంతటి సమర్థుడు లేడు. ఈ యొక్క సైతానే యందఱను భయభీతులను జేసియుండునది. ఇక గ్రైస్తవుల యీశ్వరుడు సర్వజ్ఞుడయిన యోబుపరీక్ష సైతానుచే నేల చేయించి యుండును? (౬౧)

## ప్రసంగి ఉపదేశ పుస్తకము

౬౨. జ్ఞానమును విద్యను నేను పూర్ణముగా నభ్యసించితి నని నామనస్సులో నేననుకొంటిని. నా మనస్సును నిలిపి జ్ఞానాభ్యాసమును, వెఱ్ఱితనమును, మతిహీనతను తెలిసికొనుటకు ప్రయత్నించితిని. అయితే ఇదియు గాలికి ప్రయాసపడుటే యని తెలిసికొంటిని. విస్తారమైన జ్ఞానాభ్యాసముచేత విస్తారమైన

దుఃఖము కలుగును. అధికవిద్య సంపాదించిన వానికి అధిక శోకము కలుగును.

(జబూ. ప్ర. సం. అ. ౧: ౧౬-౧౮)

స :- చూచితిరా! బుద్ధి జ్ఞానము లనుపదములు పర్యాయ వాచకములు. వానిని వేఱువేఱుగా నమ్ముచున్నారే. ఇక బుద్ధి పెరిగినచో శోకమును దుఃఖమును కలుగునని, మూర్ఖులుగాక మఱి యెవ్వరు వ్రాయగలుగుదురు? కావున నీ బైబి లీశ్వరకృతము గాదు. విద్వాంసునిచే వ్రాయబడినదియును గాదు. (౬౨)

ఇట్లు సంక్షేపముగ తౌరేతు జబూరులలోని సంగతులు వ్రాయబడినవి. ఇకమీదట గ్రైస్తవులు పరమప్రమాణముగ నెంచెడు మత్తయి రచితాది (ఇంజీలు) సువార్తలలోని సంగతు లిందు వ్రాయబడును. (ఇంజీలు) సువార్త యనునదెట్లుండునో కొంత వివరముగా వ్రాయుచున్నాము. గమనింపుడు!

# మత్తయి సువార్త

౬౩. యేసుక్రీస్తు జన్మవిధ మెట్లనగా ఆయన తల్లియైన మరియ, యోసేపుకు ప్రదానము చేయబడిన తరువాత వారేకము కాకమునుపు ఆమె పరిశుద్ధాత్మవలన గర్భవతిగా నున్నట్లు కనబడెను. పరమేశ్వరుని దూత స్వప్నమం దతనికి ప్రత్యక్షమై దావీదు కుమారుడవైన యోసేపూ! నీ భార్య యైన మరియను చేర్చుకొనుటకు భయపడకుము. ఆమె గర్భము ధరించినది. పరిశుద్ధాత్మవలన కలిగినది.

(మత్త. ౧: ౧౮, ౨౦)

స :- ప్రత్యక్షాది ప్రమాణములకును, సృష్టిక్రమమునకును విరుద్ధము లగుటవలన నీ మాట లేవిద్వాంసుడయినను నమ్మజాలడు. ఇటువంటి మాటలు మూర్ఖజనులు నవివేకులు నిజమని నమ్ముదురేని సభ్యులయిన విద్వాంసులు నమ్మజాలరు. ఈశ్వర నియమము నెవరయిన ఖండింప గలుగుదురా? పరమేశ్వరుడే తన నియమము నతిక్రమించిన నాతని యాజ్ఞ నెవరును బాలింపకుందురు. ఇక నతడు సర్వజ్ఞుడు నిర్భ్రాంతుడు నయినందున గర్భవతులగు కన్య లందఱు నా సర్వేశ్వరుని వలననే గర్భిణు లగుచున్నారని సర్వసాధారణులు చెప్పవచ్చును. అట్లే పరమేశ్వరుని దూత నాతో స్వప్నమం దీగర్భ మీశ్వరుని వలన నిలిచినట్లు చెప్పినాడని యొక డబద్ధము పలుక వచ్చును. ఈ యసంభవమైన వార్త కల్పింపబడినట్లే, సూర్యుని వలన గుంతి గర్భవతి యయ్యెనని పురాణములందు వ్రాయబడినదియు నసంభవము. ఇటువంటి మాటలను వివేక శూన్యులును విత్తవంతులు నిజమనుకొనుచు భ్రమజాలమున జిక్కువడి యుందురు. ఇక నీ సంగతి యిట్లు జరిగి యుండవచ్చును. ఎట్లనగా నొకానొక పురుషునితో సమాగముమగుట వలన మరియ గర్భవతి గావచ్చునని యామెయో లేక మఱియొకడో యామెకు గర్భ మీశ్వరుని వలన నిలిచిన దను నసంభవ వార్తను వెల్లడించి యుండుననియు దేటపడుచున్నది. (౬౩)

౬౪. అప్పుడు యేసు సైతానుచేత శోధింపబడుటకు ఆత్మవలన అరణ్యమునకు కొనిపోబడెను. నలువది దినములు రాత్రింబవ ళ్ళుపవాస ముండిన తరువాత ఆయన ఆకలి గొనగా ఆశోధకు డాయన యొద్దకు వచ్చి నీవు దేవుని కుమారుడవైన ఈఱాలు రొట్టె లగునట్లు ఆజ్ఞాపింపు మనెను.

(మత్త. ౪: ౧-౩)

స :- ఈ క్రైస్తవుల యీశ్వరుడు సర్వజ్ఞుడు కాడని దీనివలన స్పష్టముగ సిద్ధ మగుచున్నది. ఎందుకనగా సర్వజ్ఞుడే యైన నతనిని పరీక్షించుటకు సైతాను నెందుకు బంపియుండును? స్వయముగనే తెలిసికొని యుండును. మంచిది. ఇప్పుడొక క్రైస్తవుని నలువది రాత్రింబవళ్ళు నిరాహారముగా నుంచితి మేని యతడు బ్రతికి యుండ గలుగునా? మఱి యత డీశ్వర కుమారుడుగాని యతడొక సిద్ధిని బొందిన వాడుకాని కాకుండె ననియే దీనివలన సిద్ధమైనది. లేనిచో నా సైతాను నెదుట ఱాలను రొట్టెలుగా నేల

చేయకుండును? తా నాకలితో నుండు టెందుకు? కావున బరమేశ్వరుడు చేసిన టూలి నెవ్వడును రొట్టెలుగా జేయజాల డనుటయే సిద్ధాంతము. ఈశ్వరుడు కూడ బూర్వకృత నియమము నతిక్రమింపజాలడు. ఏలయనగ నతడు సర్వజ్ఞుడు. అతని పనులన్నియు దప్పులుగాని మఱపులుగాని లేనివి. (౬౪)

౬౫. ఆయన "నా వెంబడి రండి నేను మనుష్యులను పట్టుజాలరులుగా మిమ్ము చేయుదునని వారితో చెప్పిన వెంటనే వారు తమ వలలు విడిచి పెట్టి ఆయనను వెంబడించిరి. (మత్త: ౪: ౧౯-౨౧)

స :- తౌరేతున వ్రాయబడిన పదియాజ్ఞలలో నొకటగు "బిడ్డలు తల్లి దండ్రులకు సేవయు, మన్ననయు తమ యాయుర్వృద్ధి నిమిత్తము చేయవలెను" (౨౦. ఆ. ౨౧) దీని బాలింపలేదనియే విదితమగుచున్నది. ఎందుకనగా నేసు తన తల్లి దండ్రులకు సేవచేయలేదు. ఇతరులను గూడ దమ తల్లి దండ్రుల సేవలో నుండి విడదీసెను. ఈ యపరాధ మను పాపమును చేసినందుకే కద యతడు చిరంజీవుడు కాలేదు. ఇక వలలో జేపలను జిక్కించు కొనునట్టు లేసు మనుష్యులను తన మతమున జిక్కించుకొని తన ప్రయోజనమును సాధించు నుద్దేశ్యముతో నొక మత మేర్పఱచెనని గూడ దేటపడినది. ఏసే యిట్లుండినపు డిప్పటి ఫాదరీలు తమ వలలో మనుష్యులను జిక్కించుకొనుట యొక యాశ్చర్యమా! పెద్ద పెద్ద చేపలను బెక్కు వలలలో జిక్కించుకొనువా డధిక ప్రతిష్ఠావంతుడు, జీవనము గడపగలవాడును నగునట్లే యనేకులను దమ మతములో జిక్కించుకొనువా రధిక ప్రతిష్ఠావంతులును, జీవనము గడపగలుగువారు నగుదురు. అందువలననే కద వీరు వేదశాస్త్రములను జదువని వినని యమాయక జనులను మోసపుచ్చి దమ వలలో జిక్కించుకొనుచు వారిని దల్లి, తండ్రి, బాంధవులు మున్నగు వారి నుండి వేఱుపఱచుచున్నారు. కావున వీరి భ్రమజాలములో జిక్కక యమాయకులైన యితర సోదరులను వీరినుండి తప్పించుటయే విద్వాంసులగు నార్యులకు గర్తవ్యము. (౬౫)

౬౬. ఏసు వారి సమాజ మందిరములలో బోధించు రాజ్యమును గూర్చిన సువార్తను ప్రకటించుచు ప్రజలలోని ప్రతివ్యాధిని రోగమును స్వస్థపఱచుచు గలిలయ యందంతట సంచరించెను. నానారకములగు రోగములచేతను, బాధలచేతను పీడింపబడిన వ్యాధిగ్రస్తుల నందఱను, దయ్యము పట్టిన వారిని, చాంద్రరోగులను, పక్షవాయువు గలవారిని వారాయన యొద్దకు తీసికొనిరాగా ఆయన వారిని స్వస్థతపఱచెను. (మత్త ౪: ౨౩, ౨౪)

స :- పోపు లీలలను, టక్కులను బన్ని మంత్రపురశ్చరణమును, నాశీర్వాదాదులను గావించువారు చిటికెడు భస్మము నిచ్చి భూతములను బాఱద్రోలుదు రనుటగాని రోగములను మాన్పగలుగుదు రనుటగాని నిజమైనచో నీ సువార్త యందలి మాటయు నిజము కావచ్చును. కాబట్టి యివి యమాయకులను భ్రమలో బడద్రోయు మాటలే. క్రైస్తవు లేసుమాటలను నమ్ముచున్నారేని యిచటి (దేవీబోపుల) శక్తి పూజల మాటలను గూడ నెందుకు నమ్మరు? ఏలయన నామాటలు వీరి మాటలవలెనే యున్నవి. (౬౬)

౬౭. ఆత్మ విషయమై దీనులైనవారు ధన్యులు. పరలోక రాజ్యము వారిది. ఆకాశమును, భూమియు గతించిపోయిననే కాని ధర్మశాస్త్ర మంతయు నెఱవేఱువఱకు దానినుండి యొకపొల్లయినను ఒక సున్నయైనను తప్పిపోదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. కాబట్టి యీ యాజ్ఞలలో మిక్కిలి అల్పమయిన యొకదానినైనను మీఱి మనుష్యులి కాలాగున చేయబోధించువాడు పరలోక రాజ్యములో మిక్కిలి అల్పుడనబడును. (మత్త. ౫: ౩-౧౮, ౧౯)

స :- స్వర్గ మొకటియే గద. దానికి రాజుగూడ నొక్కడె కాగలుగును. కాబట్టి దీనులయిన వారందఱును స్వర్గమున కేగుదురన్న నాస్వర్గమందు రాజ్యాధికార మెవరకి గల్గును? అనగా నొండొరులు జగడ మాడుచుందురు. ఇక రాజ్యవ్యవస్థ యంతయు నస్తవ్యస్తమై పోవును. దరిద్రులగువారే దీను

లనబడుదు రన్నను సరికాదు. లేక నిరభిమానులను దీనులందురన్న నుపయోగము లేదు. ఏలయన దీన శబ్దమునకు, నభిమాన శబ్దమునకు నర్థ మొకటి కాదు. ఇక మనస్సులో దీనుడగువానికి సంతోష మెన్నటికిని గలుగదు. కావున నీ మాట యుపయుక్తము కాదు. ఆకాశమును, భూమియు నుండగలుగు నప్పుడే యీ వ్యవస్థయు నష్టమై పోవును. ఇటువంటి యశాశ్వతమైన యేర్పాటు మనుష్యులు చేయుదురేకాని సర్వజ్ఞుడైన యీశ్వరుడును గాదు. కాని యీయాజ్ఞలను నమ్మనివాడు స్వర్గమున నందఱ కంటె నల్పు డనబడునని భయప్రలోభనములు గలిగించుటకు వ్రాయబడినదని యెఱుగవలయును. (౬౭)

౬౮. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. --- భూమి మీద మీకొఱకు ధనము గూర్చుకొనవద్దు. (మత్త. ౬: ౧౧, ౧౯)

స :- యేసు జన్మించిన కాలమందు జను లనాగరికులుగను, దరిద్రులుగ నుండిరనియు, యేసు కూడ నట్లే దరిద్రుడుగ నుండెననియు నందు వలననే తాను దినాహార నిమిత్త మీశ్వరుని బ్రార్థించుచు నట్లే యితరులకు నేర్పెననియు దీనివలన దెలియుచున్నది. అటులైన నిక నీక్రైస్తవులు ధనమేల కూడబెట్టుచున్నారు? మఱి వారు యేసు వాక్యమునకు విరుద్ధముగ నడవక దానధర్మములు చేసి దీను లగుటయే మేలు. (౬౮)

౬౯. ప్రభువా! ప్రభువా! అని నన్ను పిలుచు ప్రతివాడు పరలోక రాజ్యములో ప్రవేశింపడు. (మత: ౭: ౨౧)

స:-ఇప్పుడు గమనింపుడు! గొప్పగొప్ప పాదరీలును, బిషప్పులును గ్రైస్తవులనబడువారును యేసు చెప్పిన యీమాట సత్యమే యని నమ్ముదురేని యేసును ప్రభువు-ఈశ్వరుడని యెప్పటికిని జెప్పగూడదు. మఱి యీ మాట నంగీకరింపరేని వారెప్పటికిని బాపములనుండి తొలగి యుండజాలరు.(౬౯)

౭౦. ఆ దినమం దనేకులు నన్ను చూచి చెప్పుదురు. అప్పుడు "నేను మిమ్మెన్నడును ఎఱుగను. అక్రమము చేయువారలారా! నా యొద్దనుండి పొండని" వారితో జెప్పుదును. (మత్త: ౭: ౨౨, ౨౩)

స :- చూడుడు! యే సడవి మనుష్యులను విశ్వసింప జేయుటకే కద స్వర్గమందు న్యాయాధీశుడగుట కిష్టపడుచుండెను. ఇది కేవల మమాయకులకు బ్రలోభము గలుగజేయు మాటయే. (౭౦)

౭౧. అప్పుడొక కుష్ఠరోగి వచ్చి ఆయనకు మ్రొక్కి "ప్రభువా! నీకిష్టమైన నన్ను శుద్ధునిగా చేయగల"వనెను. అందులకాయన తన చేయి చాపి వానిని ముట్టుకొని నాకిష్టమే; నీవు శుద్ధుడవు కమ్మని చెప్పగా తక్షణమే వాని కుష్ఠరోగము శుద్ధియాయెను. (మ: ౮. ౨, ౩)

స :- ఇవి కేవల మమాయకులను వశపఱచుకొను మాటలే. క్రైస్తవులిట్టి జ్ఞానవిరుద్ధములును, సృష్టిక్రమ విరుద్ధములు నగు మాటలను సత్యము లని నమ్ముచున్నప్పుడు, శుక్రాచారి, ధన్వంతరి, కశ్యపుడు మున్నగువారు చచ్చిన యనేక దైత్యుల సైన్యమును బ్రతికించిరనియు, బృహస్పతి పుత్రుడగు కచుని నఱికి ముక్కలు ముక్కలుగా జేసి పశువులకును జేపలకును దినబెట్టినను శుక్రాచార్యుడు వానిని మరల బ్రతికించెననియు, బిమ్మట గచుని జంపి శుక్రాచార్యునకు దినిపింపగా గడుపులోనే యతనిని బ్రతికించి బయటికి రప్పించెననియు, దాను మృతి జెందగా గచు డతని బ్రతికించెననియు, గశ్యపఋషి తక్షకునివలన మనుష్య సహితముగ భస్మమై పోయిన వృక్షమును, నా మనుష్యుని సజీవులు గావించెననియు, ధన్వంతరి లక్షల కొలది శవములను బ్రతికించెననియు, లక్షల కొలది కుష్ఠ మొదలుగాగల రోగములను మాన్పెననియు, లక్షల కొలది గ్రుడ్డివాండ్రకు గన్నులను, జెవిటి వాండ్రకు జెవులును నిచ్చెననియు పురాణములందును, మహాభారతము నందును వ్రాయబడి యున్నవి. ఇటువంటి కథలను మిథ్యయని యేల యనుచున్నారు. పై జెప్పిన మాట లసత్యములన్న యేసు మాట లేల యసత్యములు కాకుం

దును? ఇతరుల మాటల నబద్ధములనియు దమ్మదబ్బఱ పలుకులను సత్యములనియు జెప్పువారు దురాగ్రహు లేల కాకుందురు? కావున నీక్రైస్తవుల మాటలు కేవలము హఠముతో గూడిన బాలుర మాటల వంటివే యననొప్పును. (౨౧)

౨౨. దయ్యములు పట్టిన మనుష్యులు సమాధులలోనుండి బయలుదేరి ఆయన కెదురుగా వచ్చిరి. వారు మిక్కిలి యుగ్రు లయినందున నెవడును ఆ మార్గమున వెళ్ళలేకపోయెను. వారు దేవుని కుమారుడా! నీతో మాకేమి? కాలము రాకమునుపే మమ్ములను బాధించుటకు ఇక్కడికి వచ్చితివా?అని కేకలు వేసిరి. దూరమున గొప్ప పందుల మంద మేయుచుండగా ఆ దయ్యములు "నీవు మమ్ము వెళ్ళగొట్టిన యెడల ఆ పందుల మందలోనికి పోని"మ్మని ఆయనను వేడుకొనెను. ఆయన వానిని పొమ్మనగా అవి మనుష్యులను వదలిపెట్టి ఆ పందులలోనికి పోయెను. అంతట ఆ మంద యంతయు ప్రపాతము నుండి సముద్రములోనికి వడిగా పరుగెత్తిపోయి నీళ్ళలోబడి చచ్చెను. (మత్తః ౮, ౨౮, ౨౯, ౩౧, ౩౨)

స :– సరి. ఇచ్చట గొంచెము విచారించిన మీ మాటలన్నియు నబద్ధములే యని తేలును. ఎట్లన మృతినొందిన మనుష్యుడు సమాధులలో నుండి లేచి రాజాలడు. ఇక నవి యొకరిపై నావేశము గావు. ఒకరితో సంవాదమును జేయజాలవు. ఇవన్నియు విద్యావిహీనులచే గల్పింపబడిన మాటలు. వీనిని నిజమని మిక్కిలి పామరులైనవారే యంగీకరింతురు. ఇక బందుల జంపించి యాపందుల వాండ్రకు నష్టము కలిగించిన పాపము యేసునకు తగులవచ్చును గ్దద. క్రైస్తవులు యేసును బాపవిమోచనుడు పవిత్ర పఱచువాడు నని నమ్ముచున్నారు. అట్లయిన నాత డాభూతముల నేల పవిత్ర పఱపలేక పోయెను? పందులవాండ్ర నష్టమును భరింపలే దెందుకు? ఏమి? ఇప్పటి సుశిక్షితులైన క్రైస్తవులగు నాంగ్లేయులు గూడ నీ వట్టి మాటలను నిజమని నమ్ముచుండవచ్చునా! నమ్ముచున్నారేని భ్రమజాలమున జిక్కియున్నారు. (౨౨)

౨౩. జనులు పక్షవాతముతో మంచము పట్టియున్న యొకనిని ఆయన యొద్దకు తీసికొని వచ్చిరి. యేసు వారి విశ్వాసము చూచి కుమారుడా ధైర్యముగా నుండుము. నీ పాపములు పరిహరింపబడి యున్న వని పక్షవాతము గలవానితో జెప్పెను. నీతిమంతులను పిలువ రాలేదు. కాని పాపులను పశ్చాత్తాప నిమిత్తము పిలువ వచ్చితిని. (మత్తః ౯ః ౨, ౧౩)

స :– ఇదికూడ నింతకుముందు వ్రాయబడినటువంటి యసంభవమైన మాటయే. ఇక బాపమును క్షమించుననెడి మాట కేవల మమాయకులను, ప్రలోభపఱచి, వలలో జిక్కించుకొనుటకే కల్పింపబడినది. ఒకడు మద్యమునో, భంగునో, నల్లమందునో సేవించినపుడు వాడుగాక మఱొకడు మత్తును బొందనేరడు. ఒకడు చేసిన పాపము మఱియొకని కంటక, చేసిన వాడే యాపాప మనుభవించును. ఇదియే యీశ్వరుని న్యాయవ్యవస్థ. ఒకడు చేసిన పాపపుణ్యములను మఱొకడో లేక స్వయముగ న్యాయాధీశుడో పొందు నన్నను లేదా చేసిన వారలకు దగిన ఫల మీశ్వరుడీయక పోవు నన్న నతడన్యాయకారియే యగును. ఇక మేలొనగూర్చునది ధర్మమే కాని యేసు గాడు. మఱి యెవ్వడును గాడు. కావున ధర్మాత్ములకే కాని పాపాత్ములకే కాని యేసు మున్నగువారి యావశ్యక మేమియు లేదు. ఏమనగా పాపానుభవ మెవనికిని దప్పదు. (౨౩)

౨౪. యేసు తన పండ్రెండు మంది శిష్యులను పిలిచి దయ్యములను వెడల గొట్టుటకును, ప్రతి రోగమును స్వస్థపఱచుటకు వారి కధికార మిచ్చెను. మీ తండ్రి ఆత్మ మీలోనుండి మాటలాడుచున్నాడే గాని మాటలాడువారు మీరు కారు. నేను భూమి మీదికి సమాధానమును పంప వచ్చితినని తలంపకుడి. కాని ఖడ్గము నుపయోగింప జేయుటకు వచ్చితిని. ఒక మనుష్యునికిని వాని తండ్రికిని, కుమార్తెకును ఆమె

తల్లికిని, కోడలికిని, ఆమె అత్తకును విరోధము పెట్టవచ్చితిని. ఒక మనుష్యుని యింటిలోనివారే అతనికి శత్రువు లగుదురు. (మత్త: ౧౦: ౧, ౨౦, ౩౪-౩౬)

స :- ఈ శిష్యులలోని వాడొకడు ముప్పది రూప్యముల కాశచెంది యేసును బట్టించుచుండగా దక్కినవారందఱు దప్పించుకొని పాఱిపోయిన వారలే. ఈ శిష్యులు దయ్యములు పట్టుట, వానిని బాఱద్రోలుట, యౌషధ పథ్యాదులు లేక రోగములు మాన్పుట యను నీ మాటలు విద్యావిరుద్ధములే గాక సృష్టిక్రమ విరుద్ధములు నసంభవములు నైయున్నవి. కావున నిట్టి మాటల నజ్ఞానులే నిజ మనుకొందురు. జీవులు మాటలాడువారు కారు. ఈశ్వరుడే మాట్లాడు నన్న జీవు లేల పనిచేయుదురు? ఇక సత్యాసత్యములకు ఫలమగు సుఖమునో దుఃఖమునో యీశ్వరుడే యనుభవించుచుండ వచ్చునుగా! ఈ మాట గూడ మిథ్యయే. యేసే భేదమును జగడమును గలుగజేయుటకు వచ్చియుండెనో యిప్పుడది యెట్లు లోకుల నంటియుండునది! భేదము కలిగించుట మంచిది కాదు. దానివలన మనుష్యులకు నిరంతర దుఃఖమే సంభవించును. కాని క్రైస్తవులు మాత్రము దీనినే గురుమంత్రమని గ్రహించి యుండవచ్చును. ఏలయన నాండొరులలో భేదము కలిగించుటను యేసే మంచి దనుకొనునపుడు వీరెందు కనుకొనక పోవుదురు. ఇంటివారితో నింటి వారిని శత్రువులుగ జేయుట యేసు చేసినదే కావచ్చును. ఐన నిది శ్రేష్ఠ పురుషుల పనికాదు. (౭౪)

౭౫. యేసు - మీయొద్ద ఎన్ని రొట్టెలున్నవని వారి నడుగగా వారు - ఏడు రొట్టెలు, కొన్ని చిన్న చేపలు నున్నవని చెప్పిరి. అప్పుడాయన నేల మీద కూర్చుండుడని జనసమూహమునకు ఆజ్ఞాపించి ఆయేడు రొట్టెలను, ఆ చేపలను పట్టుకొని కృతజ్ఞతా స్తుతులను చెల్లించి వానిని విఱిచి తన శిష్యుల కిచ్చెను. శిష్యులు జనసమూహములకు పంచిపెట్టిరి. వారందఱు తిని తృప్తి పొందిన మీదట మిగిలిన ముక్క లేడుగంపల నిండ నెత్తిరి - స్త్రీలును పిల్లలును గాక తినినవారు నాలుగువేల మంది పురుషులు.

(మత్త ౧౫: ౩౪-౩౮)

స :- ఇప్పుడు గమనింపుడు.! ఏమి? ఇది యిప్పటి యబద్ధపు సిద్ధులు, నైంద్ర జాలికులు మున్నగు వారల మోసపు బనులవంటిది కాదా?ఆ రొట్టెలో నితరములగు రొట్టె లెక్కడ నుండి రాగలిగెను? యేసునం దిట్టి సిద్ధు లుండెనన్న దా నాకలి గొనినపుడు మేడిపండ్ల నేల దినుచుండెను. మట్టి, నీరు, ఱాలు మొదలగువానితో మోహన భోగునో, రొట్టెలనో తన కొఱకు జేసికొనలేదెందుకు? ఈ మాటలన్నియు బిల్లల మాటలుగ నున్నవి. ఎందఱో సాధువులు, బైరాగులు నిట్టి మోసపు బనులచేత నమాయకుల నెట్లు మోసపుచ్చుచుందురో యివియు నటువంటివే. (౭౫)

౭౬. అప్పుడాయన "ప్రతి మనుష్యునకు" నెవని క్రియల చొప్పున వానికి ఫలమిచ్చును.

(మత్త ౧౬: ౨౭)

స :- కర్మానుసారముగ ఫలమియ్యబడునన్న నిక క్రైస్తవులు పాపము క్షమింపబడునని బోధించుట వ్యర్థము. అదియే సత్యమేని యిది మిథ్య యగును. ఎవరేని, క్షమింపబడదగినవారే క్షమింపబడుదురనియు, క్షమింపబడదగనివారు క్షమింపబడరనియు నన్న నది సరికాదు. కర్మము లన్నిటికి దగిన ఫలము నిచ్చుటయే న్యాయము. అదియే పూర్ణదయయు నగును. (౭౬)

౭౭. విశ్వాసములేని మూర్ఖతరము వారలారా! ఆవగింజంత విశ్వాసము మీకు గలిగి యుండిన యెడల యీకొండను చూచి యిక్కడినుండి యక్కడికి పొమ్మనగా అది పోవును. మీకసాధ్యమైన దేదియు నుండదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని వారితో ననెను. (మత్త: ౧౭: ౧౭, ౨౦)

స :- ఇప్పుడు క్రైస్తవులు- "మా మతమున ప్రవేశింపుడు. పాపపరిహారము బొందుడు. "ముక్తులు

కండు” అని యితరులకు బోధించుచుండున దంతయు మిథ్యయే యని తెలియుచున్నది. ఏమనగా యేసునందు బాపములను దొలగించునట్టియు, విశ్వాసము దృఢపఱచునట్టియు, పరిశుద్ధుల గావించు నట్టియు సామర్థ్యమే యుండియున్న స్వశిష్యుల యాత్మలను బాపరహితములుగాను, విశ్వాస్యార్హములు గాను, బరిశుద్ధములుగాను నేలచేయకుండును? యేసు తన వెంట దిరుగుచుండిన వారినే పరిశుద్ధులుగను, విశ్వాసార్హులుగను, గళ్యాణయుక్తులుగను జేయలేక పోయినప్పుడు మరణించిన పిదప నతడెక్కడ నుండు నది తెలియదే యేమి చేయగలడు? ఇప్పు డొక్కనినైన బవిత్రుని జేయలేడు. ఆవగింజంత విశ్వాసము లేని యేసు శిష్యులచే రచియింపబడిన యీ సువార్తల పుస్తకము ప్రమాణ యోగ్యము కాజాలదు. ఏమనగా విశ్వాసము లేనివా రపవిత్రులు నధర్మపరులు నగు మనుష్యులచే వ్రాయబడిన లేఖలను శుభము గోరువారు విశ్వసింపవలసిన పని లేదు. ఇక నీ యేసువాక్యము సత్యమేని యే క్రైస్తవుని యందు నొక యావగింజంత విశ్వాసము, సత్యము లేదనియు సిద్ధమగును. ఒకానొకరు మాయందు గొంచెమో, గొప్పయో విశ్వాస మున్న దందురేని వారితో మీరీపర్వతమును మార్గములో నుండి తొలగింపుడని యనవలయును; వారిచే నది తొలగింపబడిన మీయందు బూర్ణవిశ్వాసము లేదుగాని యావగింజంత గలదనియు, దొలగింపబడక పోయిన నొక బిందుమాత్రము విశ్వాసము, సత్యము మీ క్రైస్తవులయందు లేదనియు నెఱుగదగును. కొందఱిట నభిమానాది దోషములను బర్వతనామముతో నుదాహరించినా రనవచ్చు గాని యందున నుపయోగము లేదు. మృతులను, గ్రుడ్డివారిని, గుష్ఠరోగులను, భూతగ్రస్తులను బాగుపఱచినా డనునది నయితము సోమరులకో, యజ్ఞానులకో, కాముకులకో, భ్రాంతియుక్తులకో నేర్పించి సజీవులు గాను, స్వస్థ చిత్తులుగాను జేసి చూపవచ్చును. కాని యిదియును నిజమని తోచదు. ఏలయన స్వశిష్యుల నిట్లేందుకు జేయలేకుండును? కావున నీ యసంభవమైన వార్త యేసు నవివేకమును బ్రకటించుచున్నది. మంచిది. యేసు కొంచెమైన విద్య గలిగియున్న నిట్టి తెలివి దప్పిన మాటల నెందుకు జెప్పియుండును? (నిరస్తపాదపే దేశే ఏరండోఽపి ద్రుమాయతే) చెట్టు లేని దేశమందు నాముదపు చెట్టే శ్రేష్ఠమైనదిగా గణింపబడుచున్నట్లు గొప్ప మొరటులును విద్యావిహీనులును గల దేశమున యేసుకూడ నొక శ్రేష్ఠుడుగా గణింపబడెనని సిద్ధమగును. కాని యిప్పుడు యే సే తరగతిలో గణింపబడ గలుగును? (౭౭)

౭౮. మీరు మనస్సు మార్పునొంది పిల్లల వంటివా రైనగాని, పరలోక రాజ్యములో ప్రవేశింపరని నిజముగా మీతో చెప్పుచున్నాను. (మత్తః ౧౮ః ౩)

స :– స్వేచ్ఛగా మనస్సును ద్రిప్పుకొనుటకు స్వర్గమునకు గారణమనియు, మనస్సును ద్రిప్పుకొనక పోవుట నరకమునకు గారణమనియు జెప్పబడినవు డొకని పుణ్యాపాపములను మఱియొకడు దీసికొన జాలడని యేర్పడు చున్నది. యేసు మాటలు బాలకుల మాటలవంటి వయినందున నవి విద్య కును, సృష్టిక్రమమునకును బహు విపరీతమై యున్నవనియు లోకు లతని మాటలను విని బాలకులవలె మాఱేమియు నడుగక కన్నులు మూసికొని యొప్పుకొన వలయునని కూడ నితని మనస్సులో నుండె ననియు విదిత మగుచున్నది. క్రైస్తవుల యనేక చేష్టలు బాలబుద్ధితో గూడినవే యన వచ్చును. లేనిచో నీ విద్యావిరుద్ధమును, యుక్తి రహితము నగుమాటల నేల యంగీకరింతురు? యేసు తాను విద్యా విహీను డును, బాలబుద్ధి గలవాడును గాకున్న నన్యులను బాలురుగా జేయుట కేల బోధించి యుండును? ఎందు కనగా నెవ డెట్లుండెనో వాడితరులను గూడ దనవలెనే చేయ గోరును. (౭౮)

౭౯. ధనవంతుడు పరలోక రాజ్యములో ప్రవేశించుట దుర్లభమని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. ఇదిగాక ధనవంతుడు పరలోక రాజ్యములో ప్రవేశించుటకంటె సూదిబెజ్జములో ఒంటె దూరుట సులభమని మీతో చెప్పుచున్నాననెను. (మత్తః ౧౯ః ౨౩, ౨౪)

స :- యేసు దరిద్రుడుగ నుండెననియు, ధనవంతు లతనిని గౌరవింపక పోవచ్చుననియు, నందుకే యిట్లు వ్రాసియుండవచ్చుననియు దీని వలన దెలియుచున్నది. కాని యిది సత్యము కాదు. ఏలయన ధనికులలోను దరిద్రులలోను మంచివారును, జెడ్డవారు నుందురు. మంచి కర్మను జేయువాడు మంచిఫలమును, జెడుకర్మను జేయువాడు చెడ్డఫలమును బొందుచున్నాడు. ఈశ్వరుని రాజ్యము సర్వత్ర గాక యేదోయొక దేశమున నున్నదని యేసు నమ్ముచుండె నని గూడ దీనివలన స్పష్టమైనది. అటులైన నటువంటివా డీశ్వరుడే కాడు. ఎవ డీశ్వరుడో యతని రాజ్యమంతట గలదు. అత డొకచోట బ్రవేశింపగల డనికాని బ్రవేశింపజాల డనికాని చెప్పుట కేవల మవిద్యయే. ఇక గ్రైస్తవులలోని ధనాఢ్యు లందఱు నరకమునకును, దరిద్రులందఱు స్వర్గమునకును బోవుదురా యేమి? ధనాఢ్యుల వద్ద నుండునంత సామగ్రి దరిద్రుల వద్ద నుండదు. ధనికులు వివేకముతో ధర్మమార్గమున వ్యయపఱతురేని యుత్తమ గతిని బొందగలుగుదురు. మఱి దరిద్రులు నీచగతినే పొంది యుందురని యేసు కొంచెమైన నాలోచింపవలసి యుండెను. (౭౯)

౮౦. యేసు వారితో నిట్లనెను - ప్రపంచ పునరుత్థాన కాలమందు మనుష్యకుమారుడు తన మహిమగల సింహాసనముమీద కూర్చుండునపుడు నన్ను వెంబడించిన మీరును పండ్రెండు సింహాసనములమీద కూర్చుండి ఇస్రాయేలుల పండ్రెండు గోత్రముల వారికి తీర్పు చేయుదురు. నా నామము నిమిత్తము అన్నదమ్ములనైనను, అక్కచెల్లెండ్రనైనను, తండ్రినైనను, పిల్లలనైనను, ఇండ్లనైనను విడిచిపెట్టిన ప్రతివాడు నూఱురెట్లు పొందును. అదిగాక నిత్యజీవనమును స్వతంత్రించుకొనును.

(మత్తః ౧౯ః ౨౮, ౨౯)

స :- ఇప్పుడు గమనింపుడు. లోకులు నా వలలో నుండి నా వెనుక వెడల కుందురుగాక యని యేసు మనస్సులో నుండి యున్నందుకే కద ముప్పది రూప్యముల లోభమునకును దనగురువును-యేసును బట్టించి చంపించినట్టి దుర్మార్గుడుకూడ నితనియొద్ద సింహాసనము మీద గూర్చుండు ననియు, బక్షపాతముతో విమర్శింపబడకయే ఇస్రాయేలు కులమువారి పాపము లన్నియు క్షమింపబడుననియు, నన్యకులమువారు విమర్శింప బడుదురనియు జెప్పెను. ఇందువలననే కద క్రైస్తవులు తమ మతములపై బక్షపాతముతో-నొక తెల్లవా డొక నల్లవానిని గొట్టి వేసినను బహుశః వానిని నిరపరాధిగా జేసి విడిచిపెట్టుచు బ్రవర్తింతురు. ఇక యేసుచే స్వర్గమందు నిటువంటి న్యాయమే చేయబడవచ్చును. దీనివలన గొప్ప దోషము సంభవించుచున్నది. ఏమనగా నొకడు సృష్ట్యారంభమందు జనిపోయెను; మఱియొకడు ప్రళయమునాటి రాత్రి యంతమున జనిపోయెను; ఒకడు విమర్శన మెపుడగునా యని యాదినుండి యంతమువఱకు నాశలోనే పడి యుండెను; మఱియొకని విమర్శనము తత్క్షణమే యయ్యెను. ఇదెంత గొప్పయన్యాయము! ఇక నరకమునకు బోవువా డనంతకాలము నరక మనుభవించుననియు, స్వర్గమునకు బోవువాడు సదా సర్వసౌఖ్యము ననుభవించుననుటయు గొప్ప యన్యాయమే. ఏమనిన నంతముగల సాధనకర్మములకు నంతముగల ఫలమే యబ్బును. జీవు లిద్దఱైనను బాపములో బుణ్యములో సమానములై యుండనేరవు. కావున దారతమ్యమునుబట్టి న్యూనాధిక సుఖదుఃఖములుగల స్వర్గనరకము లెన్నియో యున్నప్పుడే కద యట్టి సుఖ దుఃఖముల ననుభవింప గలుగుదురు. ఇట్టి వ్యవస్థ క్రైస్తవుల పుస్తకము నందు లేనేలేదు. కావున నీపుస్తక మీశ్వరకృతము కాదు. యేసుకూడ నీశ్వరుని పుత్రుడు గాజాలడు. ఎవనికైనను నూర్గురు తల్లులు, నూర్గురు తండ్రులలో యుండనేరరుగాని యొకేతల్లి యొకేతండ్రి మాత్ర ముండనగును. ముసల్మానులు ఒకనికి డెబ్బది యిద్దఱు స్త్రీలు స్వర్గమందు జిక్కుదురని దీనినుండియే గ్రహించి యుందురని యనుమానము కలుగుచున్నది. (౮౦)

౭౧. ఉదయమందు పట్టణమునకు మరల వెళ్ళుచుండగా ఆయన ఆకలి గొనెను. అప్పుడు త్రోవప్రక్క నొంటిగానున్న యొక అంజూరపు చెట్టును చూచి దాని యొద్దకురాగా దానియందు ఆకులు తప్ప మఱేమియు కనబడలేదు. కనుక దానిని జూచి ఇకమీదట నెన్నటికిని నీవు కాపు కాయకుందువు అనెను. తత్క్షణమే ఆ అంజూరపు చెట్టు ఎండిపోయెను. (మః ౨౧ః ౧౮, ౧౯)

స :- ఆతడు గొప్ప శాంత సమన్వితుడై క్రోధాది దోషరహితుడుగ నుండెనని పాదరీలును, క్రైస్తవు లందఱును చెప్పుదురు. కాని యీమాటలను బట్టి చూడగా యేసు క్రోధియు, ఋతుజ్ఞానము లేని వాడును దెలివి తప్పిన యనాగరికులవంటి ప్రవర్తనము కలవాడు నయి యుండెనని తేలుచున్నది. పోనిండు! వృక్షము జడపదార్థము కదా! ఎండిపోవునట్లు శపించుట కావృక్షమేమి యపరాధము చేసియుం డెను. అది యతని శాపము వలన నెండిపోకుండ వచ్చునుగాని యొకానొక యౌషధ ప్రయోగము వలన నెండిపోయిన నాశ్చర్యము కాదు. (౭౧)

౭౨. ఆ దినము శ్రమ ముగిసిన వెంటనే చీకటి సూర్యుని క్రమ్మును. చంద్రుడు తనకాంతి నీయడు. నక్షత్రము లాకాశము నుండి రాలును. ఆకాశమునందలి సైన్యము శక్తులు కదలింపబడును. (మః ౨౪ః ౨౯)

స :- భళిరా యేసు! నక్షత్రములు రాలిపడు ననుట నీ వేవిద్యచే తెలిసికొంటివో! కదలి పడునను నాకాశ సైన్య మెయ్యది? ఆహా! యేసు కొంత విద్యావంతుడే యైయున్న నక్షత్రము లన్నియు గోళ ములు, నవి యెట్లు కదలి పడగలవని యవశ్యముగ దెలిసికొనగలిగి యుండును. యేసు వడ్రంగి కులమున నుత్పన్నమైనందున నెప్పుడును గట్టెలనే చీల్చుచు, జెక్కుచు గోయుచు జోడించుచు నుండవచ్చును. కాని యత డాయనార్య దేశమున దానును బైగంబరు గావచ్చునను తలంపు కలుగగా నిట్లు చెప్పదొడగెనని విదిత మగుచున్నది. అతని నోటితో నెన్నియో మంచి మాటలును జెడ్డ మాటలును వెలివడినవి. అచ్చటి జనులు తెలివి తక్కువవారు గావున నంగీకరించిరి. ఇప్పు డైరోపాదేశ మున్నతిలో నున్నట్లు పూర్వము నున్న నితని గొప్పతన మేమియు సాగకుండెడిది. ఇప్పుడు కొంత విద్యావంతులైనను వ్యవహారపు జిక్కులవలనను, హఠములవలనను వా రీనిరర్థక మతమును విడువజాలక సర్వథా సత్యమైన వేదమార్గమునకు రా బ్రయత్నించుట లేదు. ఇదియే వారియందు గల కొఱత. (౭౨)

౭౩. ఆకాశమును, భూమియు గతించును గాని నా మాట లేమాత్రము గతింపవు. (మః ౨౪ః ౩౫)

స :- ఇది కూడ నవిద్యతో గూడిన తెలివి దప్పిన మాటయే. ఔరా! ఆకాశము కదలి యెక్కడకు బోగలదు? ఆకాశ మతిసూక్ష్మమైనందున గంటికే కానరానపుడు దాని కదలిక నెవరు చూడగలుగుదురు? ఇక దన్ను దా గొప్ప చేసికొనుట శ్రేష్ఠుల పనికాదు. (౭౩)

౭౪. అప్పుడాయన యెడమ వైపున నుండువారిని చూచి "శపించబడిన వారలారా! నన్ను విడిచి సైతానునకును, వాని దూతలకును సిద్ధపఱపబడిన నిత్యాగ్నిలోనికి పొండి" అనెను. (మః ౨౫ః ౪౧)

స :- సరి. తన శిష్యులను స్వర్గమునకు బంపుచు నితరులను నిత్యాగ్నిలో బడవేయుట గొప్ప పక్ష పాతమే కద. మఱి యాకాశమే లేక యుండునపుడు నిత్యాగ్నియు, నరకమును, స్వర్గము నెక్కడ నుండ గలుగును? సైతానును, నతని దూతలను నీశ్వరుడు పుట్టింపకున్న నిట్టి నరకము నేల నిర్మింపవలసి వచ్చును? ఒక సైతానే యీశ్వరునకు భయపడనిచో నతడీశ్వరు డనుట యెట్లు? ఏలయన నతని దూతయే యతనికి ద్రోహి యయ్యెను. ఈశ్వరు డతనిని మొదటనే పట్టి చెఱసాలలో నుంచలేకపోయెను. చంపజాలకయు బోయెను. యేసును గూడ నలువది దినములు దుఃఖపెట్టెను. ఇకనతని యీశ్వరత్వ మేమని చెప్పవలయును? యేసు కూడ నతని నేమియు జేయజాలక పోయెను. కావున నీశ్వర పుత్రు

డనుట వ్యర్థమని తేటపడెను. కాబట్టి యేసీశ్వరుని కుమారుడు గాని బైబిలునందు వర్ణింపబడిన యీశ్వరుడు గాని కాజాలడు. (౮౪)

౮౫. అప్పుడు పండ్రెండు మందిలో ఇస్కరియోతు- యూదా అను నొకడు ప్రధాన యాజకుల యొద్దకు వెళ్ళి నేనాయనను మీ కప్పగించిన యెడల నాకేమి యిత్తురని వారి నడిగెను. అందులకు వారు ముప్పది వెండి నాణెములు వానికి తూచి యిచ్చిరి. (మః ౨౬ః ౧౪, ౧౫)

స ః- ఇప్పుడు యేసుయొక్క సిద్ధులు, నీశ్వరత్వము నంతయు బ్రకట మయ్యెను. ఏమనిన వెంటనున్న యతని ప్రధాన శిష్యుడెనను నతని సాంగత్యముచే బవిత్రాత్ముడు కానపుడు మరణానంతర మత డితరుల బవిత్రాత్ములుగ నేమి చేయగలడు? అతని విశ్వసించు వార లెందఱో మోసపోవుచున్నారు. ఏలయనగా దన్ననుసరించి యుండిన శిష్యునకే మేలు చేయనివాడు మరణానంతర మొకని కేమి మేలు చేయగలుగును? (౮౫)

౮౬. వారు భోజనము చేయుచుండగా యేసు ఒక రొట్టె పట్టుకొని దాని నాశీర్వదించి విఱిచి తన శిష్యుల కిచ్చి మీరు తీసికొని తినుడి. ఇది నా శరీరమని చెప్పెను. మఱియు ఆయన గిన్నె పట్టుకొని కృతజ్ఞతా స్తుతులను చెల్లించి వారికిచ్చి దీనిలోనిది మీరందఱు త్రాగుడి- ఇది నా రక్తము అనగా పాపపరిహారములు కలుగుటకై చిందింపబడుచున్న నిబంధన రక్తము. (మః ౨౬ః ౨౬-౨౮)

స ః- సరి! ఇట్టి మాట నొక విద్యావిహీను డయిన యడవి మనుష్యుడు గాక సభ్యపురుషు డెవడేని చెప్పునా? శిష్యులతో భోజన పదార్థమును దన మాంసమనియు, బానీయములను రక్తమనియు జెప్ప జాలునా? దీనినే యిప్పుడు క్రైస్తవులు ప్రభుభోజన మనుచున్నారు. అనగా దిను త్రాగు వస్తువులనే యేసు మాంసరక్తములని భావించి తినుచు త్రాగుచున్నారు. ఇదెంత విచారకరమైన మాట. తమ గురువు రక్త మాంసములతో దిను త్రాగు భావనను విడువలేరేని యితరముల నెట్లు విడువగలుగుదురు? (౮౬)

౮౭. పేతురును, జెబెదయి ఇద్దఱు కుమారులను వెంటబెట్టుకొని పోయి దుఃఖపడుటకు, చింతాక్రాంతులగుటకు నారంభించిరి. అప్పుడు యేసు నా ప్రాణము మరణ మగునంతగా బహుదుఃఖము కలిగియున్నది. మీరిక్కడ నిలిచి నాతో కూడ మెలకువగా నుండుడని వారితో చెప్పి కొంతదూరము వెళ్ళి సాగిలపడి "నా తండ్రి సాధ్యమైన నీగిన్నె నాయొద్దనుండి తొలగి పోనిమ్ము." అని ప్రార్థించెను.

(మః ౨౬; ౩౭-౩౯)

స ః- చూడుడు! ఆతడు కేవలము మనుష్యుడుగాక, యీశ్వరుని కుమారుడుగాని త్రికాలజ్ఞుడు గాని యొక విద్వాంసుడే గాని యై యున్న నిట్టి యయోగ్యమైన చేష్టలు చేయకయే యుండును. అత డీశ్వరుని కుమారుడు, భూత భవిష్యదాదుల నెఱుగువాడు, పాపపరిహార కర్తయను నిత్యాదికము లైన కల్లమాటలను, యేసో యతని శిష్యులో కల్పించి, ప్రకటించి చేసిరనియే దీనివలన దేటపడుచున్నది. ఇతడు కేవల మొక సామాన్యమైన మనుష్యుడు, నమాయకుడు, నవిద్వాంసుడునయి యుండెనేకాని యొకవిద్వాంసుడు గాని యోగిగాని, సిద్ధుడుగాని కాక యుండెనని యెఱుగదగును. (౮౭)

౮౮. ఆయన యింకను మాట లాడుచుండగా పండ్రెండు మందిలో నొకడైన యూదా వచ్చెను. వానితో గూడ బహుజనసమూహము కత్తులు, గుదియలు పట్టుకొని ప్రధాన యాజకుల యొద్దనుండియు ప్రజల పెద్దల నుండియు వచ్చెను. ఆయన నప్పగించువాడు-నేనెవరిని ముద్దుపెట్టుకొందునో ఆయనే యేసు. ఆయనను పట్టుకొను డనుమాట వారికి గుఱుతుగా చెప్పి - వెంటనే యేసు నొద్దకు వచ్చి గురువా వందనమని చెప్పి ఆయనను ముద్దు పెట్టుకొనెను. వారు దగ్గఱకు వచ్చి యేసును బలవంతముగా పట్టుకొనిరి. అప్పుడు శిష్యులందరు ఆయనను విడిచి పారిపోయిరి . తుదకిద్దఱు అబద్ధసాక్షులు వచ్చి-

వీడు దేవాలయమును పడగొట్టి మూడు దినములలో దానిని కట్టగలనని చెప్పెననిరి. ప్రధాన యాజకుడు లేచి- నీవు వుత్తర మేని చెప్పవా? వీరు నీమీద పలుకుచున్న సాక్ష్య మేమని అడుగగా యేసు ఊరకుండెను. అందులకు ప్రధాన యాజకుడు ఆయనను చూచి – నీవు దేవుని కుమారుడవైన క్రీస్తువైన ఆమాట మాతో చెప్పుమని జీవముగల దేవుని తోడను నీ కానపెట్టు చున్నాననెను. అందుకు యేసు –నీవన్నట్లే అనెను. ప్రధాన యాజకుడు తన వస్త్రమును చించుకొని –వీడు దేవదూషణ చేసెను. మనకిక సాక్షులతో పనియేమి? ఇదిగో ఈ దూషణపుమాట మీరిప్పుడు విన్నారు గదా. మీకిప్పు డేమి తోచుచున్నదని అడిగెను. అందులకు వారు – వీడు మరణమునకు పాత్రుడనిరి. అప్పుడు వారు ఆయన ముఖము మీద ఉమ్మివేసి ఆయనను గ్రుద్దిరి. కొందఱు ఆయనను చేతులతో కొట్టి – క్రీస్తు! నిన్ను కొట్టినవా డెవడో మాతో చెప్పుమనిరి. పేతురు వెలుపటి ముంగట కూర్చుండగా నొకచిన్నది అతనియొద్దకు వచ్చి – నీవును గలిలయ్యుడగు యేసుతోకూడ నుంటివి గదా యనెను. అందు కతడు నేనుండలేదు. నీవు చెప్పినది నాకు తెలియదని అందఱియెదుట ననెను. అతడు నడవలోనికి వెళ్ళిన తరువాత మఱియొక చిన్నది అతని చూచి వీడును నజోరీయుడగు యేసుతో కూడ నుండెనని అక్కడివారితో చెప్పగా అతడొట్టు పెట్టుకొని – నేనుండలేదు. ఆ మనుష్యుని నేనెఱుగనని మరల చెప్పెను. అందు కతడు ఆ మనుష్యుని నేనెఱుగనే యెఱుగనని శపించుకొనుటకు, ఒట్టుపెట్టు కొనుటకు నారంభించెను.

(మ్ ౨౬: ౪౭- ౫౦, ౫౬, ౬౧-౭౨, ౭౪)

స :- ఇప్పుడు కనుగొనుడు. తన శిష్యులను దృఢవిశ్వాసులుగ జేయగలుగునంతటి సామర్థ్యము గాని, ప్రతాపము గాని యతనియందు లేకుండెను. ఉండియే యున్న నా శిష్యులు ప్రాణములు పోయినను దమ గురువును లోభముచే బట్టింప కుందురు. అట్లే తప్పించుకొనకయు, బొంకులు బొంకకయు నొట్టు పెట్టుకొనకయు నుందురు. యేసు సయితము చమత్కారి గాకుండెను. కుంటి, గ్రుడ్డి మున్నగువారిని జంపుట కనేకులు లోతనువాని యింటిమీదకు వచ్చి యుండగా నట దేవదూత లిద్దఱు వారిని గ్రుడ్డివా రగునట్లు చేసిరని తౌరేతునందు వ్రాయబడిన మాటయు నసంభవమే. ఐన యేసునం దిట్టి సామర్థ్యమైన లేక యుండెనే, క్రైస్తవు లిప్పు డతని నెంతయో గొప్పగా బొగడుచున్నారు. అకటా! ఇట్టి దుర్దశచే జచ్చుటకంటె యుద్ధము చేసిగాని సమాధిస్థుడై గాని మఱియొక విధమున గాని ప్రాణత్యాగము జేసి యున్న మేలైయుండెడిది గదా! కావున నవిద్వాంసున కట్టి బుద్ధి యెక్కడ నుండి పొడమును. (౮౮)

ఆ యేసిం కను జెప్పున దేమనగా :-

౮౯. ఈ సమయమున నేను నా తండ్రిని వేడుకొన లేననియు వేడుకొనిన పక్షమున ఆయన పండ్రెండు సేనలకంటె ఎక్కువమంది దూతలను నాకు పంపడనియు నీవను కొనుచున్నావా?

(మః ౨౬: ౫౩)

స :- ఇతరులను బెదరించుచు దనయొక్కయు తన తండ్రి యొక్కయు గొప్పతనములను వెల్లడించుచున్నాడే కాని యేమియు జేయలేడు. ఆశ్చర్య మేమన వీరు నీకు విరుద్ధముగ సాక్ష్య మిచ్చు చున్నారు. దీనికి జవా బిమ్మని మహాయాజకు డడిగినపుడు యేసూరక యుండెను. ఏసిట్లుండుటయు ననుచితమే. ఏలయన యథార్థమైన మాట నచట నవశ్యముగ జెప్పి యుండిన బాగుండెడిది. ఇట్లు తన గొప్ప తనపు మాటల నెన్నియో చెప్పుకొనుట యతని కుచితము కాదు. యేసుపై వట్టినేరము మోపి చంపించుట కూడ వారి కుచితముగాదు. ఏమన యేసుపై మోపబడిన నేరము మరణదండనకు తగినది కాదు. వారు ననాగరికులై యుండిరి. కావున వారికి న్యాయ మేమి తెలియును? కావున యేసు తానీశ్వరుని కుమారుడనని ప్రకటించుకొన కుండిన వారతనితో నింత కఠినముగ వర్తింపక పోవుదురు. ఉభయులకు

శ్రేయస్కరమై యుండెడిది. కాని వారి కింతటి విద్య, ధర్మ భావము న్యాయశీలత యెచట నుండి వచ్చును? (౮౯)

౯౦. యేసు అధిపతి యెదుట నిలిచినప్పుడు అధిపతి-యూదాదుల రాజావు నీవేనా అని ఆయన నడుగగా యేసు అతనిని జూచి-నీవన్నట్లే అనెను. ప్రధాన యాజకులును, పెద్దలును ఆయన మీద నేరము మోపినపు డాయన ప్రత్యుత్తర మేమియు నీయలేదు. కాబట్టి పిలాతు-నీమీద వీరెన్ని నేరములు మోపుచున్నారో నీవు వినలేదా అని ఆయన నడిగెను. అయినను ఆయన యొక మాటకైనను అతనికి ఉత్తర మీయలేదు గనుక అధిపతి మిక్కిలి ఆశ్చర్యపడెను. పిలాతు- ఆలాగైన క్రీస్తనబడిన యేసు నేమి చేయుదునని వారి నడుగగా- సిలువ వేయుమని అందఱు చెప్పిరి . యేసును కొరడాలతో కొట్టించి సిలువ వేయ నప్పగించెను. అప్పుడు అధిపతి యొక్క రాణువవారు యేసును అధికార మందిరములోనికి తీసికొని పోయి ఆయనవద్ద తమ స్తోమమంతయు సమకూర్చిరి. వారు ఆయన వస్త్రములు తీసివేసి ఆయన కెఱ్ఱని అంగీ తొడిగించి ముండ్లకిరీటము నల్లి ఆయన తలకు పెట్టి యొకఱెల్లు ఆయన కుడిచేత నుంచి ఆయన యెదుట మోకాళ్ళూని - యూదులరాజా! నీకు శుభమని ఆయన నపహాస్యము చేసి, ఆయన మీద ఉమ్మిని వేసి ఆఱెల్లును తీసికొని దానితో ఆయనను తలమీద కొట్టిరి. ఆయన నపహసించిన తరువాత ఆయన మీదనున్న ఆ అంగీతీసివేసి ఆయన బట్ట లాయనకు తొడిగించి సిలువ వేయుటకు ఆయనను తీసికొని పోయిరి. వారు కపాలస్థలమను అర్థమిచ్చు గొల్గొతా అనబడిన చోటికి వచ్చి చేదు కలిపిన ద్రాక్షారసమును ఆయనకు త్రాగనిచ్చిరి. కాని ఆయన దాని రుచిచూచి త్రాగనొల్లక పోయెను. అప్పుడు వారు ఆయనను సిలువ వేసిరి. ఆయన మీద మోపబడిన నేరము వ్రాసి ఆయనకు తలపైగా ఉంచిరి. మఱియు కుడివైపున నొకడును ఎడమవైపున నొకడును ఇద్దఱు దొంగలాయనతో కూడ సిలువ వేయబడిరి. ఆ మార్గమున వెళ్ళుచుండిన వారు తలలూచుచు "దేవాలయమును పడగొట్టి మూడు దినములలో కట్టువాడా! నిన్ను నీవే రక్షించుకొనుము. నీవు దేవుని కుమారుడవైన సిలువ మీదనుండి దిగు" మని చెప్పుచు ఆయనను దూషించిరి. అలాగే శాస్త్రులును, పెద్దలును ప్రధాన యాజకులు కూడ ఆయన నపహాస్యము చేయుచు- "నితరులను రక్షించెను. తన్ను తానే రక్షించుకొనలేడుః ఇశ్రాయేలు రాజుగదా; ఇప్పుడు సిలువ మీదనుండి దిగిన యెడల వాని నమ్ముదుము. వాడు దేవునియందు విశ్వాసముంచెను. నేను దేవుని కుమారుడ నని చెప్పెను. కనుక ఆయన కిష్టుడైన ఆయన యిప్పుడు వానిని తప్పించు" నని చెప్పిరి. ఆయనతో కూడ సిలువ వేయబడిన దొంగలును అలాగే ఆయనను నిందించిరి. మధ్యాహ్నము మొదలుకొని మూడు గంటలవఱకు ఆదేశమంతట చీకటి క్రమ్మెను. ఇంచుమించు మూడు గంట లప్పుడు యేసుః "ఏలీఏలీ లామా సబక్తానీ" అని బిగ్గఱగా కేక వేసెను. ఆమాటకు నాదేవా! నాదేవా! నన్నెందుకు చెయ్యి విడిచితివని యర్థము. అక్కడ నిలిచియున్న వారిలో కొందరామాట విని ఇతడు ఏలియాను బిలుచుచున్నాడనిరి. వెంటనే వారిలో నొకడు పరుగెత్తి పోయి స్పంజీ తీసికొని సిరకాలో ముంచి ఱెల్లున తగిలించి ఆయనకు త్రాగనిచ్చెను. తక్కినవారు "ఊరకుండుడి, ఏలియా అతనిని రక్షింప వచ్చునేమో చూత"మనిరి. ఏసు మరల బిగ్గరగా కేకవేసి ప్రాణము విడిచెను. (మః ౨౭ః ౧౧-౧౪, ౨౦, ౨౨, ౨౩, ౨౯-౩౧-౩౩, ౩౪, ౩౫, ౩౭-౫౦)

స :- ఆ దుష్టులు వ్యర్థముగ ఏసునకు చెఱుపు గలుగ జేయుట నిజమే కాని యేసునందును దోషము కలదు. ఏలయన నీశ్వరున కొకడు పుత్రుడు లేడు. అత డొకనికి దండ్రియు గాడు. ఏలయన నొకనికి దండ్రి యైనవాడు మఱొకనికి మామ, బావ, బంధువు - మొదలగు వాడును గావలసి వచ్చును. అధ్యక్షు డడిగినపుడు యథార్థమైన యుత్తర మీవలసి యుండెను. ఇక బూర్వము చూపబడిన యాశ్చర్య

కరములగు కార్యములన్నియు సత్యములేని యిప్పుడుకూడ సిలువ మీదనుండి దిగివచ్చి యందఱను దన శిష్యులుగా జేసికొని యుండును. మఱి యతడీశ్వరుని పుత్రుడే యయిన నీశ్వరు డతనిని గాపాడక యుండునా? అతడు త్రికాలజ్ఞుడుగా నున్నచో పిత్తము కలిసియున్న సిర్కాను రుచిచూచి విడుచు టెందుకు? పూర్వమే తెలిసికొని యుండెడివాడు. ఇక మహిమ గలవాడే యయిన నఱచి యఱచి ప్రాణత్యాగ మేలచేసి యుండును? కావున నెవ డెంత చాతుర్యముల గనపఱచినను తుదకు సత్యము సత్యమే. అసత్య మసత్యమే యగునని యెఱుగదగును. కాని యిక నక్కలపుటడవి మనుష్యులలో యేసు కొంత మంచి వాడయియుండెనే కాని యతడు మహిమ గలవాడు గాని, యీశ్వరపుత్రుడు గాని విద్వాంసుడు గాని కాకుండె ననియు దీనివలన సిద్ధమైనది. అటులే యుండిన నత డట్టి దుఃఖము నేల యనుభవించి యుండును. (౯౦)

౯౧. సర్వేశ్వరుని దూత పరలోకము నుండి దిగివచ్చి ఱాయి పొరలించి దానిమీద కూర్చుండెను. అప్పుడు మహాభూకంపము కలిగెను. ఆయన ఇక్కడ లేడు. తాను చెప్పినట్టే లేచి యున్నాడు. ఆయన శిష్యుల కావర్తమానము తెలుప పరుగెత్తుచుండగా యేసు వారి నెదుర్కొని మీకు శుభమని చెప్పెను. వారు ఆయన యొద్దకు వచ్చి ఆయనకు మ్రొక్కిరి. అంతట యేసు భయపడకుడి. మీరు వెళ్ళి నా సహోదరులు గలిలయ్యకు వెళ్ళవలెననియు వారక్కడ నన్నుఁ చూతురనియు వారికి తెలుపు డనెను. పదునొకండు మంది శిష్యులు యేసు తమకు నిర్ణయించిన గలిలయ్యలోని కొండకు వెళ్ళిరి. వారు ఆయనను చూచి ఆయనకు మ్రొక్కిరి. కాని కొందఱు సందేహించిరి. యేసు వారియొద్దకు వచ్చి పరలోకమందును, భూమిమీదను నాకు సర్వాధికార మీయబడినదని వారితో చెప్పెను. ఇదిగో నేను యుగసమాప్తి పర్యంతము సర్వదా మీతోకూడ నున్నాను. (మః ౨౮ః ౨, ౬, ౯, ౧౦, ౧౬, ౧౭, ౧౮, ౨౦)

స :- ఈ మాట కూడ సృష్టిక్రమమునకును, విద్యకును, విరుద్ధమగుటవలన నమ్మదగినది కాదు. మొదట నీశ్వరుని యొద్ద దూతలుందురు. వారి నటునిటు పంపును. మీదనుండి దిగుదురని యొక తహసీలుదారు కలక్టరువలె నీశ్వరుని జేసిరా యేమి? యే సదే శరీరముతో స్వర్గమునకు బోయి బ్రతికి లేచెనా? స్త్రీ లతని పాదములు పట్టి మ్రొక్కినప్పుడు శరీర మదే యుండినదా? మూడు దినములకే యది క్రుళ్ళి పోలే దెందుకు? తన నోటితో సర్వాధికారి ననుట కేవల దంభాలాపమే. అట్లే శిష్యులతో గలిసెను. వారితో మాటలాడెను - అనువార్త లసంభవములే. ఈ మాట లన్నియు యథార్థములేని యిప్పుడు కూడ నట్లే బ్రతికి లేచుట లేదెందుకు? బొందితో స్వర్గమున కేలపోరు? ఇట్లు సువార్తలో మత్తయి వ్రాసిన దానిసమీక్ష వ్రాయబడినది. ఇక మార్కుచే రచియింపబడిన దానినిగూర్చి వ్రాయబడును. (౯౧)

## మార్కు సువార్త

౯౨. ఇతడు వడ్రంగి కాడా? (మార్కుః ౬ః 3 ॥)

స :- యథార్థముగ యోసేపు వడ్రంగి యయి యుండెను. కావున యేసుకూడ వడ్రంగియే. అత డెన్నియో సంవత్సరముల వఱకు వడ్రంగము చేయుచుండెను. అటువెనుక (పైగంబరు) ప్రవక్తగా మాఱి తుదకీశ్వరుని కుమారుడే యయి కూర్చుండెను. తన కడవి మనుష్యులు స్వాధీను లగుట వలననే గదా! డంబమును సాగించుకొన గలిగినది. కోసికోసి విడదీయుట యతని వృత్తియే గదా! (౯౨)

## లూకా సువార్త

౯3. అందులకు ఏసు నేను సత్పురుషుడనని ఏల చెప్పుచున్నావు? దేవు డొక్కడే తప్ప మఱి యెవడును సత్పురుషుడు కాడు. (లూః ౧౮ః ౧౯)

స :- అద్వితీయుడైన పరమేశ్వరు డొక్కడే యని యేసు చెప్పుచుండగా నీ క్రైస్తవులు పవిత్రాత్మ, పిత, పుత్రు అను ముగ్గుర నెక్కడ నుండి కల్పించిరి. (౯౩)

౯౪. హేరోదు నొద్దకు ఆయనను పంపెను. హేరోదు ఏసును చూచి మిక్కిలి సంతోషించెను. ఆయనను గూర్చి పెక్కు సంగతులు విన్నందున ఆయన ఏదైన నొక సూచక క్రియను చేయగా చూడ నిరీక్షించి బహు కాలము నుండి చూడగోరెను. ఆయనను చూచినప్పుడు చాల మాటలతో ప్రశ్నలు వేసి నను అతని కుత్తర మేమియు నీయలేదు. (లూ. ౨౩. ౭, ౮, ౯)

స :- ఈ మాట మత్తయి సువార్తలో లేదు గావున నీ సాక్షులు విరోధాభిప్రాయులైరి. ఏలయన సాక్షులు సమానాభిప్రాయులై యుండవలసి యుండెను. ఏసు చతురుడు, మహిమ గలవాడు నయియున్న తత్క్షణమే హేరోదున కుత్తర మిచ్చి సిద్ధులను గూడ జూపియుండును. దీనివలన యేసునందు విద్యాసి యొక సిద్ధిగాని యెంతమాత్రము లేకుండెననియే విదిత మగుచున్నది. (౯౪)

## యోహాను సువార్త

౯౫. ఆదియందు వాక్యముండెను. వాక్యము దేవుని యొద్ద నుండెను. వాక్యము దేవుడై యుండెను. ఆ వాక్యము ఆదియందు దేవుని యొద్దనుండెను. సమస్తమును ఆయన మూలముగా కలిగెను. కలిగియున్నదేదియు ఆయన లేకుండ కలుగలేదు. ఆయనలో జీవముండెను. ఆ జీవము మనుష్యులకు వెలుగై యుండెను. (యో॥ ౧॥ ౧-౪)

స :- ఆదియందు బలుకువాడే లేకున్న వచన ముండనేరదు. వచన మీశ్వరునియొద్ద నుండెనన్న నట్లు చెప్పుట వ్యర్థ మయ్యెను. మఱి వచన మెప్పటికిని పరమాత్మ కాజాలదు. ఏలయన నది యాది యందు నీశ్వరుని యొద్ద నుండెనన్న దొలుత వచన ముండెనా? లేక యీశ్వరుడా? అన్వయించుట లేదు. కారణ ముండనంతవఱకు వచనము ద్వారా సృష్టి యెప్పటికిని గాజాలదు. వచనముతో బనిలేక కర్త మౌన ముగా సృష్టిని జేయగలుగును. మఱి జీవమన నెద్ది? అది దేనియం దుండెను? ఈ వచనమువలన జీవము లనాదినుండి యున్నవని యొప్పుకొందురు గదా! అనాదియము లయ్యెనేని యాదాము ముక్కు తొఱ్ఱలో నూపిరి యూదుట మిథ్య యయ్యెను. జీవము మనుష్యులకే వెలుగయ్యెనా? పశ్వాదులకు గాలేదా? (౯౫)

౯౬. వారు భోజనము చేయుచుండగా ఆయన నప్పగింప వలెనని సీమోను కుమారుడగు ఇస్కరి యోతు యూదా హృదయములో సైతాను ఇంతకుముందు ఆలోచన పుట్టించి యుండెను.

(యో॥ ౧౩॥ ౨)

స :- ఈ మాట సత్యము కాదు. ఏలయనగా సైతానే యందఱను బురికొలుపునన్న నాసైతాను నెవరు పురికొల్పుచున్నారని యీక్రైస్తవుల నడుగవలయును. సైతాను తనంతట తానే పురికొల్పుకొను నన్న మనుష్యులు సైతము తమ్ము దామే పురికొల్పుకొన గలుగుదురు. సైతానావశ్యకమేమి? సైతానును సృజించినవాడు పురిగొల్పువాడు పరమేశ్వరుడే యయిన నీ క్రైస్తవుల దేవుడే యా సైతానునకు సైతానై నిలచును. ఎందుకనగా నతడే యా సైతాను ద్వారా యందఱను బురిగొలిపించును. సరి. ఇవి యీశ్వ రుని పనులు కాగలవా? క్రైస్తవుల పుస్తక మీశ్వరకృత మనియు, యేసీశ్వర కుమారుడనియు గల్పించిన వారే సైతానులై యుందురనుట నిశ్చయము. కాని యిది యీశ్వరకృతము కాదు. ఇందు జెప్పబడిన వాడీశ్వరుడు గాని యేసీశ్వరుని కుమారుడుగాని కాజాలరు. (౯౬)

౯౭. మీ హృదయము కలవరపడ నీకుడి. దేవుని యందు విశ్వాస ముంచుచున్నారు. నాయందును

విశ్వాస ముంచుడి. నా తండ్రి యింటిలో ననేక నివాసములు కలవు. లేనిపక్షమున మీతో చెప్పుదును. మీకు స్థలము సిద్ధపఱుప వెళ్ళుచున్నాను. నేను వెళ్ళి మీకు స్థలము సిద్ధపఱచినపుడు నేనుండు స్థలములో మీరుండునట్లు మరలవచ్చి నాయొద్ద నుండుటకు మిమ్ములను తీసికొని పోవుదును. ఏసు అతని చూచి నేనే మార్గమును, సత్యమును, జీవమునై యున్నాను. నాద్వారానే కాని యెవడును తండ్రి యొద్దకు రాడు. మీరు నన్నెఱిగి యున్న నాతండ్రి నెఱిగియుందురు. (యో॰ ౧౪: ౧-౪, ౬, ౭)

స :- ఇప్పుడు చూడుడు! యేసు వాక్యములు పోపులీలల కంటె నేమైన దక్కువగా నున్నవా? ఇట్టి వాక్యములను రచియింపకున్న నతని మతమందెవరు చిక్కుకొందురు? యేసు తన తండ్రిని గుత్తగొని యున్నాడా? అతడేసు వశమందున్నచో పరాధీను డగుటవలన నత డీశ్వరుడే కాడు. ఏలయనగా నీశ్వరు డొకని వాక్సహాయము (సిఫారసు) వినడు. ఏసునకు బూర్వ మెవ్వడును నీశ్వరుని బొందకుండెనా? ఇట్లు స్థానాదుల ప్రలోభనము గలిగించుచు దన నోటితో దానే సత్యమార్గమును, జీవమును గల వాడనని చెప్పుకొనువాడు వట్టి దాంభికుడే యనబడును. కావున నీమాట యెన్నటికిని సత్యము కాజాలదు. (౯౭)

౯౮. నేను చేయు క్రియలు నాయందు విశ్వాస ముంచువాడును చేయును. వానికంటె గొప్పవి కూడ అతడు చేయునని మీతో యథార్థము చెప్పుచున్నాను. (యో॰ ౧౪, ౧౨)

స :- ఇప్పుడు చూడుడు! ఏసునందు బూర్ణవిశ్వాసము కలిగియున్న క్రైస్తవులు పీనుగులను బ్రతికించుట మున్నగు పనుల జేయలేరెందుకు? విశ్వాసము కలిగియుండియు నాశ్చర్యము గొలుపు కార్యముల జేయలేరని యేసుకూడ నట్టి కార్యము జేయకుండెననియె గట్టిగా జెప్పవచ్చును. ఏమనగా యేసు తానే "మీరును నాశ్చర్యము గొలుపు కార్యములను జేయవచ్చు ననుచున్నాడు." అట్లయిన నిప్పుడు క్రైస్తవు లొకరైన వానిని జేయలేరేని యేసు పీనుగులను బ్రతికించుచుండెను అనునిట్టి మాటలు జ్ఞానవిహీనుడు తప్ప మఱి యెవ్వ డంగీకరింపగలడు? (౯౮)

౯౯. అద్వితీయ సత్యదేవుడైన వాడవు. (యో॰ ౧౭: ౩)

స :- అద్వితీయుడయిన యీశ్వరు డొక్కడేయైన గ్రైస్తవులు చెప్పెడు త్రిత్వ మబద్ధము. (౯౯)

ఇట్లే సువార్తలలో ననేక స్థలముల విరుద్ధవిషయములు నిండియున్నవి.

## యోహాను ప్రకటన వాక్యములు

ఇక యోహానుయొక్క అద్భుత వాక్యముల నాలకింపుడు :-

౧౦౦. తమ తలల మీద సువర్ణ కిరీటములు పెట్టుకొన్నవారై కూర్చుండిరి. మఱియు ఆ సింహాసనము ఎదుట ఏడు దీపములు ప్రజ్వలించుచున్నవి. అవి దేవుని ఏడాత్మలే. మఱియు ఆ సింహాసనము నెదుట స్ఫటికమును పోలిన గాజువంటి సముద్రమున్న ట్లుండెను. ఆ సింహాసనమునకు మధ్యను, సింహాసనముచుట్టు ముందు వెనుక కన్నులతో నిండిన నాలుగు జీవులుండెను. (యో॰ ప్ర. ౪. ౪౫.౬)

స :- ఇక జూడుడు! క్రైస్తవుల స్వర్గ మొక నగరమువలె నున్నది. వీరి యీశ్వరుడును దీపాగ్నివలె నున్నాడు. సువర్ణ కిరీటాది భూషణములను ధరించుటయు, వెనుక ముందు నేత్రములు కల్గియుండుటయు ననంభవము. ఈ మాటల నెవ రొప్పుకొందురు? అచ్చట సింహాది మృగములు కూడ నాలుగుండె నని వ్రాసియున్నారు. (౧౦౦)

౧౦౧. మఱియు లోపలను, వెలుపలను వ్రాత కలిగి యేడు ముద్రలు గట్టిగా వేసియున్న యొక గ్రంథము సింహాసనము మీద గూర్చుండు వాని చేత జూచితిని. దాని ముద్రలు తీసి ఆ గ్రంథము

విప్పుటకు యోగ్యుడైన వాడెవడు? పరలోకమందు గాని భూమిమీద గాని భూమిక్రింద గాని ఆ గ్రంథమును విప్పుటకైన చూచుటకైన నెవనికిని శక్తి లేకపోయెను. ఆ గ్రంథము విప్పుటకు చూచుటకును యోగ్యు డెవడును కనబడనందున నేను మిక్కిలి యేడ్చుచుంటిని . . . . . (యో॥ ప్ర. ౫. ౧-౪)

స ః- ఆహా! క్రైస్తవుల స్వర్గమందు సింహాసనములు మనుష్యుల సొగసులు ననేక ముద్రలతో నిండిన పుస్తకము నుండుట, యాపుస్తకమును స్వర్గమందును, భూమిమీదను విప్పి చూచుటకును దగినవా డెవడును దొరకక పోవుట యనుమాటలు చూడుడు. యోహా నేడ్చుచుండగా దానిని యేసే విప్పునని యొక ప్రాచీనుడు చెప్పెనట. ప్రయోజన మేమన వివాహ మెవనిదో పాటయు నతని గూర్చియే యుండును గదా! ఇట్లు యేసునందే మాహాత్మ్య మంతయు నారోపింపబడినది. కాని యివన్నియు వట్టి బూటకములే. (౧౦౧)

౧౦౨. మఱియు సింహాసనమునకు, ఆ నాలుగు జీవులకు పెద్దలకు మధ్య వధింపబడిన ట్లుండిన గొఱ్ఱెపిల్ల యొకటి నిలిచి యుండగా చూచితిని. దాని కేడుకొమ్ములు నేడు కన్నులు నుండెను. ఆ కన్నులు భూమి యందంతటికి పంపబడిన దేవుని యేడాత్మలు. (యో॥ ప్ర. ౫-౬)

స ః- ఇప్పు డీయోహాను స్వప్నమందలి మనోవ్యాపారమును చూడుడు! ఆ స్వర్గమున నందఱు గ్రైస్తవులును, నాలుగు పశువులును, యేసు నయిత ముండి యితరు లెవ్వరును లేనట్లున్నది. ఇక యేసున కిచ్చట రెండు నేత్రములు మాత్రమే యుండెను. కొమ్ముల పేరుకూడ లేదు. కాని స్వర్గమున కేగిన తరువాత నేడు కన్నులు, నేడు కొమ్ములును కలవాడయ్యెను. ఇది గొప్ప యద్భుతమే. ఈశ్వరుని యా యేడాత్మలే యేసు నేత్రములు కొమ్ములు నయ్యెనట. అకటా! ఇట్టి మాటలను గ్రైస్తవులెట్లు నమ్మి యున్నారో గదా? వారు కొంచెమైన నాలోచింపవలసి యుండెను. (౧౦౨)

౧౦౩. ఆయన పుస్తకమును తీసికొనినప్పుడు ఆ నాలుగు జీవులును, వీణలను, ధూప ద్రవ్యము లతో నిండిన సువర్ణ పాత్రలును పట్టుకొని యున్న ఆ యిఱువది నలుగురు పెద్దలును ఆ గొఱ్ఱెపిల్ల యెదుట సాగిలపడిరి. (యో॥ ప్ర. ౫; ౮)

స ః- సరి. యేసు స్వర్గమందు లేకున్నప్పుడు వీరు ధూపదీప నైవేద్య హారతి మొదలగు పూజ లెవనికి సలుపు చుండవచ్చును? ఇచ్చట 'ప్రొటస్టెంటు' క్రైస్తవులు విగ్రహారాధనమును నిరాకరించు చున్నారు గాని వీరి స్వర్గము మాత్రము విగ్రహారాధనమునకిల్లయి యున్నది. (౧౦౩)

౧౦౪. ఆ గొఱ్ఱెపిల్ల ఆ యేడు ముద్రలలో మొదటి దానిని విప్పినపుడు నేను చూడగా ఆ నాలుగు జీవులలో నొకటి - రమ్మని యుఱుము వంటి స్వరముతో చెప్పుట వింటిని. మఱియు నేను చూడగా నొక తెల్లని గుఱ్ఱము కనబడెను. ఒకడు విల్లు పట్టుకొని దానిమీద కూర్చుండి యుండెను. ఆయన కొక కిరీట మీయబడెను. ఆయన జయింప వలెనను తాత్పర్యముతో జయశాలిగా బయలువెడలెను. ఆయన రెండవ ముద్ర విప్పినప్పుడు ఎఱ్ఱనిదైన వేరొక గుఱ్ఱము బయలు వెడలెను. భూలోకములో సమాధానము లేకుండ చేయుటకు వాని కధికార మియ్యబడెను. ఆయన మూడవ ముద్ర విప్పినప్పుడు నల్లని గుఱ్ఱము కనబడెను. ఆయన నాలుగవ ముద్ర విప్పినపుడు పాండువర్ణముగల గుఱ్ఱము కనబడెను. దాని మీద గూర్చున్న వానిపేరు మృత్యువు ఇత్యాదులు. (యో॥ ప్ర. ౬. ౧-౫, ౭, ౮)

స ః- ఇప్పుడు చూడుడు! ఇది పురాణములను మించిన మిథ్యాలాపమా, గాదా? ఔరా! ఆ పుస్తక బంధనము లనుముద్రలలో గుఱ్ఱపురౌతు లెట్లుండ గలిగిరో కదా! ఈ స్వప్నాలాపములను గూడ సత్యమని నమ్మిన వారి యవిద్య నెంత వర్ణించినను దక్కువయే గదా! (౧౦౪)

౧౦౫. వారు - నాథా! సత్యరూపీ! పరిశుద్ధుడా! ఎందాక తీర్పు చేయకయు, మా రక్తము నిమి

త్తము భూనివాసులకు ప్రతిదండన చేయకయు నుందువని బిగ్గరగా కేకలు వేసిరి. తెల్లని వస్త్రము వారిలో ప్రతివాని కీయబడెను. మఱియు వారివలెనే చంపబడ బోవువారి సహవాసులయు సహోదరులయు లెక్క పూర్తి యగు పర్యంతము ఇంక కొంచెము కాలము విశ్రమింపవలెనని వారితో జెప్పబడెను.

(యో: ప్ర. ౯. ౧౦, ౧౧)

స :- క్రైస్తవు లిటువంటి న్యాయము కొఱకే కద యట చెఱసాల వంటి యిబ్బందిలో బడియుండి యేడ్చుచుందురు. వేదమార్గమును స్వీకరించువానికి న్యాయము తత్క్షణమే కలుగును. ఇప్పుడీశ్వరుని కార్యాలయము (కచ్చేరీ) మూయబడి యున్నదా? విమర్శింపవలసిన పనిలేక న్యాయాధీశు లును నిష్క్రియులై యున్నారా యేమి? అని యీ క్రైస్తవుల నడుగవలయును. సరియైన యుత్తర మేమియు జెప్పజాలరు. వీరి యీశ్వరునకు గూడ మతి భ్రమ కలుగుచుండును. ఎందుకనగా వీరి ప్రార్థనల ప్రకారము తత్క్షణమే వీరి శత్రువులను బీడింపసాగును. పగబట్టి కఱచు సర్ప స్వభావము గలవారు గనుక చచ్చిన పిమ్మటను స్వవైరమును దీర్చుకొనుచున్నారు. శాంతి కించిత్తయినను లేదు. శాంతిలేని చోట దుఃఖమున కంతమే యుండబోదు. (౧౦౫)

౧౦౬. పెద్దగాలిచేత ఊగులాడు అంజూరపు చెట్టునుండి ఆకాలపు కాయలు రాలినట్టు ఆకాశ నక్షత్రములు భూమి మీద రాలెను. మఱియు చుట్టబడిన పటమువలె కానరానట్లు ఆకాశమండలము తొలగి పోయెను. (యో. ప్ర. ౬. ౧౩, ౧౪)

స :- గమనించితిరా! భవిష్యద్వక్తయగు యోహాను విద్యావిహీను డైనందుననే కదా యిట్టి యసంగత మగుకథ కల్పించెను. నక్షత్రము లన్నియు గోళములే. అవి పృథివిపై నెట్లు రాలిపడును? సూర్యాదుల యాకర్షణము వాని నిటునటు కదలనీయదు. ఆకాశమును జాపవంటి దనుకొనుచున్నాడా యేమి? ఆకాశ మొకరిచేత జుట్టబడుటకు నది సాకార పదార్థము కాదు. కావున యోహానాదు లందు ననార్యులై యుండిరి. వారి కీవిషయముల జ్ఞానము లేదనుట స్పష్టము. (౧౦౬)

౧౦౭. మఱియు ముద్రింపబడిన వారిలెక్క చెప్పగా వింటిని. ఇశ్రాయేలీయుల గోత్రము లన్నిటిలో ముద్రింపబడిన వారలు లక్ష నలువది నాలుగు వేలమంది. యూదా గోత్రములో ముద్రింప బడినవారు పండ్రెండు వేలు. (యో. ప్ర. ౭. ౪, ౫)

స :- బైబిలునందు వర్ణింపబడిన యీశ్వరు డిశ్రాయేలీయులు మున్నగు కులములకే రక్షకుడా లేక సర్వప్రపంచమునకా! అట్లు కానిచో నా యనాగరికులకే యేల సాహాయ్యము చేసియుండును? వారికే సాహాయ్యము చేయును. ఇతరుల నడిగియే చూడడు గదా! కావున నతడీశ్వరుడు కాడు. ఇశ్రాయేలీయుల వంశస్థులకు ముద్రలువేయుట యతని యల్పజ్ఞతయో, యోహాను మిథ్యా కల్పనయో! తెలియదు. (౧౦౭)

౧౦౮. అందువలన వారు దేవుని సింహాసనము నెదుట నుండి దివారాత్రములు ఆయన ఆలయ ములో ఆయనను సేవించుచున్నారు. (యో. ప్ర. ౭. ౧౫)

స :- ఇది గొప్ప ప్రతిమారాధనము కాదా? ఇక వారి యీశ్వరుడును దేహధారియగు మనుష్యునివలె నేకదేశీయుడు గాడా? క్రైస్తవుల యీ యీశ్వరుడు రాత్రియందు నిద్రకూడ పోడుగద. పరుండునేని రాత్రియందు పూజ లెట్లు చేయగలుగుదురు? అట్లతని నిద్రకు భంగమును గలుగవచ్చును. ఇక రాత్రింబవళ్ళు మేల్కొనుచుండునేని విక్షిప్తుడో, యతిరోగియో యై పోవచ్చును. (౧౦౮)

౧౦౯. మఱియు సువర్ణ ధూపార్తి చేత బట్టుకొని యున్న వేఱొక దూత వచ్చి బలిపీఠము నెదుట నిలువగా అతనికి బహుధూప ద్రవ్యము లియ్యబడెను. అప్పు డాధూప ద్రవ్యముల పొగ పరిశుద్ధుల ప్రార్థన

లతో కలిసి దూత చేతిలోనుండి పైకిలేచి దేవుని యెదుటికి చేరెను. ఆ దూత ధూపార్తి తీసికొని బలిపీఠము పైనున్న నిప్పులతో దానిని నింపి భూమి మీద పడవేయగా ఉరుములు, ధ్వనులు, మెఱుపులు, భూకంపమును కలిగెను. (యో. ప్ర. ౮-౩, ౪, ౫)

స :- ఇక చూడుడు! స్వర్గమందును వేదిక, ధూపదీప నైవేద్యములు, బూరగొమ్ము నాదములు గలవుగా! అటులేని బైరాగుల మందిరముకంటె నీ క్రైస్తవుల స్వర్గము తక్కువైనదా? కొంత యల్లరి యెక్కువగనే యుండును. (౧౦౯)

౧౧౦. మొదటి దూత బూర యూదినప్పుడు రక్తముతో మిళితమైన వడగండ్లును అగ్నియు పుట్టి భూమిపైన పడవేయబడెను. అందువలన భూమిలో మూడవభాగము కాలిపోయెను. (యో. ప్ర. ౮. ౭ ॥)

స :- భళిరే! క్రైస్తవుల భవిష్యద్వక్తా! ఈ యీశ్వరుడు నీ యీశ్వర దూతలు, బూరల గోలలు, ప్రళయ లీలలు ననునవి కేవలము పిల్లల యాటలే యని తేటపడుచున్నది గదా! (౧౧౦)

౧౧౧. అయిదవదూత బూర ఊదినప్పుడు ఆకాశము నుండి భూమి మీద రాలిన యొక నక్షత్రమును చూచితిని. పాతాళపు గుండపు తాళపుచెవి ఆ దూత కీయబడెను. అతడు పాతాళపు గుండము తెఱవగా పెద్ద కొలిమిలో నుండి లేచు పొగవంటి పొగ ఆ గుండములో నుండి లేచెను. ఆ గుండపు పొగ చేత సూర్యుని, ఆకాశమును చీకటి కమ్మెను. ఆ పొగలోనుండి మిడుతలు భూమిమీదికి వచ్చెను. భూమిలో నుండు తేళ్ళకు బలమున్నట్టు వానికి బలమియ్యబడెను. మఱియు నొసళ్ళయందు దేవుని ముద్రలేని మనుష్యులను అయిదు నెలలవఱకు బాధించుటకు వానికి అధికారమును ఆజ్ఞయు నియ్యబడెను. (యో. ప్ర. ౯. ౧-౫)

స :- ఏమి! తూతూరాల శబ్దములు విని నక్షత్రము లా దూతలమీద నా స్వర్గమందే పడవచ్చుగా? ఇక్కడ మాత్రము పడలేదు. మంచిది. ఆ గుండమును గాని, మిడుతలను గాని ప్రళయము గావించుటకే యీశ్వరుడు చేసియుంచెనా? ముద్ర గలవారిని గఱవ వలదని యవి ముద్రలుచూచి చదువుకొనునా? ఇది "మీరు క్రైస్తవులు కారేని మిమ్ములను మిడుతలు కఱచు"నను భయము జూపి సామాన్య జనులను గ్రైస్తవులలో గలుపుకొనుటకు బన్నిన టక్కులే. ఇట్టి మాటలు విద్యాశూన్యమగు దేశమందు సాగునేకాని యార్యావర్తమందు సాగనేరవు. ప్రళయ మట్లే యగునా? (౧౧౧)

౧౧౨. గుఱ్ఱపు రౌతుల సైన్యముల లెక్క ఇఱువది కోట్లు. (యో. ప్ర. ౯. ౧౬)

స :- అహో! ఇన్ని గుఱ్ఱములు స్వర్గమున నెట్లుండగలుగునో? యవి యెచ్చట మేయునో? ఎచ్చట నివసించునో? ఎచ్చట లద్దెపెట్టునో గద. ఇక దాని దుర్గంధము గూడ స్వర్గమున విశేషముగ వ్యాపించి యుండును. చాలు. చాలు. ఇట్టి స్వర్గమునకు, నీ దేవునకు, నిట్టి మతమునకు నార్యుల మంద ఱము నీళ్ళు వదలి యున్నారము. సర్వశక్తిమంతుని కృపవలన గ్రైస్తవు లందలి యీ గందరగోళమంతయు దూరమైపోయిన నెంతయో మేలు కలుగవచ్చును. (౧౧౨)

౧౧౩. బలాఢ్యుడైన వేఱొకదూత పరలోకమునుండి దిగి వచ్చుట చూచితిని. ఆయన శిరస్సు మీద మేఘము, ఇంద్రధనుస్సు నుండెను. ఆయన ముఖము సూర్యబింబమువలె, ఆయన పాదములు అగ్ని స్తంభములవలె నుండెను. ఆయన తన కుడి పాదము సముద్రము మీదను ఎడమ పాదము భూమి మీదను మోపెను. (యో. ప్ర. ౧౦. ౧-౩)

స :- ఇప్పుడు చూడుడు. ఈ దూతల కథలు పురాణ గాథలను, బట్టుల పొగడ్తలను గూడ మీఱి యున్నవి. (౧౧౩)

౧౧౪. మఱియు నొకడు చేతికఱ్ఱ నాకిచ్చి - నీవు లేచి దేవుని యాలయమును, బలిపీఠమును

గొలత వేసి యాలయములో పూజించు వారిని లెక్కపెట్టుము. (యో. ప్ర. ౧౧.౧)

స :- ఇక్కడనే కాదు. క్రైస్తవుల స్వర్గమందును మందిరములు నిర్మింపబడుటకు గొలత వేయబడుచున్నది గదా! వారి స్వర్గ మెట్లున్నదో వారి మాటలు నట్లే యున్నవి. ఇందువలన నిచట ప్రభు భోజనకాలమున యేసు శరీరాయవములను రక్తమాంసములని భావించి తినుచు ద్రాగుచు నున్నారు. ఇక వీరు గుడిలో గూడ సిలువ యాకారముల జేసి యుండుట సయితము ప్రతిమారాధనయే యననొప్పును. (౧౦౪)

౧౦౫. మఱియు పరలోకమందు దేవుని ఆలయము తెఱవబడగా దేవుని నిబంధనము ఆయన ఆలయములో కనబడెను. (యో. ప్ర. ౧౧.౧౯)

స :- స్వర్గమందుగల మందిర మెల్లప్పుడు మూయబడి యుండును గాబోలు. అది యెప్పుడో యొకప్పుడు తెఱవబడు చుండవచ్చును. ఏమి? పరమేశ్వరునికి గూడ నొక మందిరము కలదనుట సంభవమా! వేదమందు జెప్పబడినట్లు పరమాత్ముడు సర్వవ్యాపకుడు గావున నతని కొక మందిరము కలదనుట సంభవమే కాదు. కాని క్రైస్తవుల యీశ్వరుడు సాకారుడు గదా! అతడు స్వర్గమందునో భూమి మీదనో యెక్కడ నున్ననేమి? ఏ ప్రకారముగ నిట "ఠంఠంపూంపూం" లీలలు జరుగుచున్నవో యటులే యీ క్రైస్తవుల స్వర్గమందును జరుగుచుండవచ్చును. అప్పుడప్పుడు వారా నిబంధన మందసమును గూడ జూచుచుండవచ్చును. ఇక దానితో నేమి ప్రయోజనము నెఱవేర్చుకొందురో తెలియదు గదా! సత్యమేమన నివన్నియు మనుష్యులను లోభమున బడవేయు మాటలే యనుమాట స్పష్టము. (౧౦౫)

౧౦౬. అప్పుడు పరలోకమందు గొప్ప వింత కనబడెను. అదేమనగా సూర్యుని ధరించుకొనిన యొకస్త్రీ కనబడెను. ఆమె పాదముల క్రింద జంద్రుడును, శిరస్సుమీద బంద్రెండు నక్షత్రముల కిరీటము నుండెను. ఆమె గర్భిణియై ప్రసవవేదన పడుచు ఆ నొప్పులకు కేకలు వేయుచుండెను. అంతట పరలోకమందు నొకవింత కనబడెను. ఇదిగో యెఱ్ఱని మహాఘటసర్పము; దానికి ఏడు తలలు, పది కొమ్ము లుండెను. దాని తలమీద ఏడు కిరీటము లుండెను. దానితోక ఆకాశ నక్షత్రములలో మూడవభాగము నీడ్చి వానిని భూమిమీద పడవేసెను. (యో. ప్ర. ౧౨.౧.-౪)

స :- ఈ గొప్ప కట్టుకథల నిప్పుడు చూడుడు! వీరి స్వర్గమున నొకానొక స్త్రీ కేకలు పెట్టుచుండగా నామె దుఃఖమును వినువారు గాని, దూరము చేయువారుగాని లేరు. ఆ యజగరము తోక యెంత నిడివి గలిగి యుండెనో కాని నక్షత్రములలో మూడవభాగమును దానితో భూమిమీద పడవైచెనుగా! మఱి పృథివి యనున దొకచిన్న లోకము. నక్షత్రము లంత కంటె గొప్ప లోకములు. అట్టి నక్షత్రము లీ భూమిమీద నొకటికూడ బట్టదు. కావున వానిలోని మూడవభాగ మీమాటను గల్పించిన వాని యింటి మీదనే పడి యుండవచ్చునని యనుమానింప దగియున్నది. ఇక నక్షత్రములలోని మూడవ భాగమును తన నిడివిగల తోకతో జొట్టి భూమిమీద బడవైచిన యాయజగరము కూడ వాని యింటియందే నివసించుచుండ వచ్చును. (౧౦౬)

౧౦౭. అంతట పరలోకమందు యుద్ధము జరిగెను. మీఖయేలును, అతని దూతలును ఆ ఘటసర్పముతో యుద్ధము చేయవలెనని యుండగా ఆ ఘటసర్పమును వాని దూతలును యుద్ధము చేసిరి. (యో. ప్ర. ౧, ౨, ౭, ౮)

స :- ఈ క్రైస్తవుల స్వర్గమున కేగు ప్రతివాడు యుద్ధమందు దుఃఖమును పొందుచుండవచ్చును! అట్టి స్వర్గము మీద యాశ నిచ్చటనే విడిచి చేతులు జోడించు కొనుడు. ఏమన శాంతికి భంగమును నుపద్రవములను గలుగజేయు స్థాన మీ క్రైస్తవులకే తగును. (౧౦౭)

౧౧౮. కాగా సర్వలోకమును మోసపుచ్చుచు అపవాది యనియు సైతాననియు పేరుగల పురాతన సర్పమైన ఆ మహాఘట సర్పము పడద్రోయ బడెను. (యో. ప్ర. ౧, ౨.౯)

స :- ఏమి? ఆ సైతాను స్వర్గమం దుండినప్పుడు లోకులను మోసపుచ్చుచుండలేదా? వాని నా మరణాంతము కారాగారమందో లేక చంపియో వేయలే దెందుకు? వానిని భూమిమీద నేలబడవైచెను? ఇక లోకుల నందఱను భ్రమింపజేయునది సైతానే యైన సైతానును భ్రమింప జేయువా డెవడు? సైతాను తనంతట తానే భ్రమపడునన్న సైతాను లేకపోయినను భ్రమపడువారు పడనే పడుదురు. ఇక నీశ్వరు డాసైతానును భ్రమింపజేయునన్న నత డీశ్వరుడే కానేరడు. మఱి దీనివలన గ్రైస్తవుల ఈశ్వరుడు కూడ సైతానునకు భయపడవచ్చునని తెలియుచున్నది. ఎందుకనగా నీశ్వరుడు సైతానుకంటె మించిన వాడేని యపరాధము చేయునపు డాసైతానును శిక్షింపలే దెందుకు? క్రైస్తవుల యీశ్వరుని రాజ్య మాసైతాను రాజ్యములో నొక సహస్రాంశమైనను లెక్కకు రాదు. ఇందువలననే క్రైస్తవుల యీశ్వరు డాసైతానును దొలగింపలేక పోవచ్చును. ఈ కాలపు రాజ్యాధికారు లయిన క్రైస్తవులు, బందిపోటు దొంగలు మున్నగు వారిని బట్టి తక్షణమే శిక్షించునట్లును నీ క్రైస్తవుల యీశ్వరుడు శిక్షింప కుండెనని తేటపడుచున్నది. కనుక వైదిక మతమును విడిచిపెట్టి యీక్రైస్తవుల వట్టి కల్పిత మతమును స్వీకరించునట్టి బుద్ధిహీను డెవడుండును? (౧౧౮)

౧౧౯. పృథివి సముద్రముల నివాసులారా! శోకము ఎందుకన అపవాది మీ యొద్దకు దిగివచ్చి యున్నాడు. (యో. ప్ర. ౧౨.౧౨)

స :- ఏమి! ఆ యీశ్వరు డక్కడకు మాత్రమే స్వామియు రక్షకుడై యున్నాడా? పృథివికిని, మనుష్యాది ప్రాణులకును రక్షకుడును స్వామియు గాడా. భూమికి నతడే రాజయినచో నాసైతాను నేల చంపలేక పోయెను? సైతాను లోకుల నందఱను భ్రమింప జేయుచున్నను నీశ్వరు డూరక చూచుచుం డునే కాని వానిని దొలగింప లేడు. కావున మంచి యీశ్వరు డొకడును, సమర్థుడైన దుష్టుడగు నీశ్వరుడు మఱియొకడు నున్నట్లు విదిత మగుచున్నది. (౧౧౯)

౧౨౦. మఱియు నలుబది రెండు నెలలు (తన కార్యము) జరుపు నధికారము దాని కేర్పాటా యెను. కనుక దేవుని నామమును, ఆయన గుడారమును, పరలోక నివాసులను, దూషించుటకై దేవుని దూషింపవలెనని యది తన నోరు తెఱచెను. మఱియు పరిశుద్ధులతో యుద్ధము జేయుటకు, వారిని జయించుటకు దాని కధికార మీయబడెను. ప్రతిగోత్రము మీదను, ప్రతి ప్రజమీదను, ఆ యా భాషలు మాటలాడు వారిమీదను, ప్రతిజనము మీదను అధికారము దాని కియ్యబడెను. (యో. ప్ర. ౧౩ః ౫, ౬, ౭)

స :- సరి! భూమిమీది లోకులను భ్రమింప జేయుటకు సైతానును బశ్వాదులను బంపి పరిశుద్ధులైన మనుష్యులతో యుద్ధము జేయించుట యను కార్యము బందిపోటు దొంగల యజమానునిదే యనవచ్చునా, కాదా? ఇటువంటి కార్య మీశ్వరునిది కాని, యీశ్వర భక్తులది కాని కాజాలదు. (౧౨౦)

౧౨౧. మఱియు నేను చూడగా ఆ గొఱ్ఱెపిల్ల సీయోను పర్వతము మీద నిలువబడి యుండెను. ఆయన నామమును ఆయన తండ్రి నామమును నొసటియందు లిఖింపబడియున్న నూటనలుబది నాలుగువేల మంది ఆయనతో కూడా నుండిరి. (యో. ప్ర. ౧౪-౧)

స :- ఇది చూడుడు! యేసు తండ్రి నివసించి యుండెడు సీయోను పర్వతము మీదనే యతని పుత్రుడును నివసించుచుండవచ్చును. కాని యిత డొకలక్ష నలువది నాలుగువేల మనుష్యుల నెట్లు లెక్కింప గలిగెనో కద! మఱియొక లక్ష నలువదివేల జనులు మాత్రమే స్వర్గవాసులైరి. ఇక దక్కిన కోట్లకొలది క్రైస్తవుల శిరస్సులమీద ముద్రలు పడినట్లే కద. వారంఱును నరకమునకే పోయిరా? ఇప్పుడు

యేసు తండ్రియు నతని సైనికులు నక్కడ నున్నారో లేరో యను సంగతి కనుగొనుటకు క్రైస్తవులు సీయోను పర్వతము మీదకు బోయి చూడవలసినదే. ఉందురేని యీ లేఖ సత్య మగును. లేనిచో నబద్ధము. ఒకానొక చోటునుండి వచ్చి యుండి రందురేని యింత గొప్ప సైన్యము తాను క్రిందకును, మీదకును నెగిరి వచ్చుచు బోవుచు నుండుటకు వారు పక్షులా యేమి? ఇంక నతడు వచ్చుచు బోవుచు నుండునేని యొక జిల్లా న్యాయాధిపతి వలె నయ్యెను. మఱి యత డొకడో యిద్దఱో లేక ముగ్గురో యున్న నదికూడ సంభవము కాదు. కాని కనిష్ఠపక్షమందు ప్రతిభూగోళమున కొక్కొక్క యీశ్వరుడు కావలసియుండును. ఏలయన ననేక బ్రహ్మాండములను నొక రిద్దఱు ముగ్గురు పాలించుటకు గాని సర్వత్ర కలిసి సంచరించుటకు గాని సమర్థు లెప్పటికిని గాజాలరు. (౧౨౧)

౧౨౨. వారు తమ ప్రయాసములు మాని విశ్రాంతి పొందుదురు. వారి క్రియలు వారి వెంట పోవునని ఆత్మ చెప్పుచున్నాడు. (యో. ప్ర. ౧౪-౧౩)

స :- చూచితిరా! క్రైస్తవుల యీశ్వరు డిట 'వారి కర్మములు వారివెంట బోవును- అనగా నందఱకు గర్మానుసారమే ఫలము లభించు'నని చెప్పుచున్నాడు. అట్లు కాక పాపములను యేసు తీసికొన గలడు. పాపములు క్షమింపబడును. అని వీరేమో చెప్పుచున్నారు. ఇప్పుడీశ్వరుని మాట సత్యమా లేక క్రైస్తవులదా? బుద్ధిమంతు లూహించి కనుగొన దగును. ఒకే విషయమం దిట్టి రెండు మాటలు సత్యములు కావు. ఇందొకటి తప్పక యబద్ధమై పోవును. ఐనమాకేమి? క్రైస్తవుల యీశ్వరుడో క్రైస్తవులో యసత్యవంతు లగుదురుగాక. (౧౨౨)

౧౨౩. మఱియు దానిని దేవుని కోసమని ద్రాక్షల పెద్దతొట్టిలో వేసెను. ఆ ద్రాక్షల తొట్టి పట్టణమునకు వెలుపల త్రొక్కబడుచుండెను. నూఱు క్రోసుల దూరము గుఱ్ఱముల కళ్ళెము మట్టుకు ద్రాక్షల తొట్టిలో నుండి రక్తము ప్రవహించుచుండెను. (యో. ప్ర. ౧౪-౧౯,౨౦)

స :- ఇక జూడుడు! వీరి గప్పాలు పురాణముల కన్నను మించినవి కావా? క్రైస్తవుల యీశ్వరుడు కోపపడునపుడు మిగుల దుఃఖితు డగు చుండవచ్చును. అతని కోపకుండములు నిండి యున్నవన్న నతని కోపమనునది జలమా? లేక యొకానొక ద్రవపదార్థమా? మఱియు నూఱు క్రోసుల వఱకు రక్తము ప్రవహించు చుండె ననుటయు నసంభవమే. ఏమనగా రక్తము గాలి తగులుటవలన వెంటనే గడ్డ కట్టుకొనును. కావున నది యెట్లు ప్రవహింప గలదు? ఇందువలన నివన్నియు వట్టిమాటలే యని యెఱుగవలయును. (౧౨౩)

౧౨౪. నేను చూడగా సాక్ష్యపు గుడారమునకు సంబంధమైన గర్భాలయము పరలోకమందు తెఱవబడెను. (యో. ప్ర. ౧౫-౫)

స :- క్రైస్తవుల దేవుడు సర్వజ్ఞు డయియున్న సాక్షులతో నేమి పని? తనంతట దానే దెలిసికొని యుండును. వీరి దేవుడు సర్వజ్ఞుడు, కాడనియే దీనివలన నిశ్చయమగుచున్నది. ఏలయన నతడు మనుష్యునివలె నల్పజ్ఞు డయినందున నీశ్వరీయ కార్యము నెట్లు చేయగలుగును? ఇంతియే కాదు. గొప్ప యసంభవములగు దూతల వార్త లెన్నియో యీప్రకరణమున వ్రాయబడియున్నవి. కాని వానిని సత్యము లని యెవ్వరును నమ్మజాలరు. ఈ ప్రకరణమం దన్నియు నిటువంటి మాటలే నిండియున్నవి. (౧౨౪)

౧౨౫. దాని దోషమును దేవుడు జ్ఞాపకము చేసికొని యున్నాడు. అది యిచ్చిన ప్రకారము దానికియ్యండి. దానిక్రియ చొప్పున దానికి రెట్టింపు చేయండి. (యో. ప్ర. ౧౮-౫,౬)

స :- చూడుడు! క్రైస్తవుల దేవు డన్యాయకారి యగుట ప్రత్యక్షమయ్యెను. ఎవడెట్టు లెంత కర్మము చేసెనో వానికట్లే యంతటి ఫలమునే యిచ్చుట న్యాయమనబడును. కాని దానికంటె దక్కువ

గనో, యెక్కువగనో ఫలముల నిచ్చుట యన్యాయము. అన్యాయకారి నుపాసించువారు నన్యాయకారు లేల కాకుందురు. (౧౨౫)

౧౨౬. గొఱ్ఱెపిల్ల వివాహోత్సవ సమయము వచ్చినది. ఆయన భార్య తన్ను తాను సిద్ధపఱచు కొని యున్నది. (యో. ప్ర. ౧౯-౭)

స:-ఆలకించితిరా! క్రైస్తవుల స్వర్గమందు వివాహములు కూడ జరుగుచున్నవిగా. ఏమన నట యేసునకు వివాహ మీశ్వరుడే చేసెను గద! మఱి యతని యత్తమామలు బావమఱదులు మొదలగువా రెవరనియు, బిడ్డ లెందఱనియు నడుగవలయును. ఇక వీర్యనాశనమువలన బలము, బుద్ధి, పరాక్రమము, నాయువు మున్నగునవి కూడ దగ్గిపోవునే! దానివలన నిప్పటికి యేసచ్చట శరీరత్యాగమును జేసి యుండవచ్చును. ఏమన సంయోగ జన్య పదార్థ మవశ్యముగ వియోగమును బొందును. ఇప్పటివఱకును గ్రైస్తవు లతనిని విశ్వసించి మోసపోయిరి. ఇంక నెంతవఱకు మోసపోవుదురో తెలియదు. (౧౨౬)

౧౨౭. అతడు ఆదియందున్న సర్పమును అనగా అపవాదియు సైతాను అను ఆ ఘటసర్పమును పట్టుకొని వేయి సంవత్సరములు వాని బంధించెను. ఆ వేయి సంవత్సరములు గడచు పర్యంతమును ఇంక జనులను మోసపఱుప కుండుటకై పాతాళమును మూసి దానికి ముద్రవేసెను. (యో. ప్ర. ౨౦ ౨, ౩)

స:-చూడుడు. చచ్చుచు బ్రతుకుచు నెటులో సైతానును బట్టి వేయేండ్లవఱకు బంధించెను. కాని విడుదల యయినపిదప మరల భ్రమింప జేయకుండునా? ఇట్టి దుష్టుని గారాగారమునందే యుంచవలసి యుండెను. లేదా చంపి వేయవలసి యుండెను; కాని సైతాను గలడనుకొనుట యీ క్రైస్తవుల వట్టి భ్రమయే. యథార్థమందేమియు లేదు. భయము చూపి లోకులను దమవలలో వేసికొనుటకై యీయుపా యమును బన్నియుండును. ఎట్లన నొక ధూర్తు డమాయకులైన కొందఱు మనుష్యులతో "రండు మీకు దేవదర్శనము జేయింతు"నని చెప్పి యొక యేకాంత స్థానమునకు దోడ్కొనిపోయి యొక మనుష్య నకు నాలుగు భుజము లేర్పఱచి చెట్లపొదలలో నిలువబెట్టి "మీరు కన్నులు మూసి కొనుడు. చెప్పి నప్పుడు తెఱవుడు. మరల నేను జెప్పినప్పుడు చప్పున మూసికొనుడు. మూసి కొనని వాడంధుడగును" అని చెప్పినట్లు "మా మతమును నమ్మనివాడు సైతానుచే భ్రమింపబడిన వాడని చెప్పుడు." అను నీమత స్థుల బోధలును గలవు. ఎట్లన నతడు ముందుకు వచ్చినప్పుడు చూడుడనియు మరల తత్క్షణమే మూసి కొనుడనియు దిరిగి పొదలలో దాగినప్పుడు తెఱవుడనియు జెప్పి మీరందఱును నారాయణుని దర్శించి ధన్యులయితిరని యన్నటులే యీ మతాను యాయుల లీలలు నెఱుగదగును. కావున వీరి మాయలో నెవరును జిక్కగూడదు. (౧౨౭)

౧౨౮. భూమియు, ఆకాశమును ఆయన సమ్ముఖమునుండి పాఱిపోయెను. వానికి నిలువ చోటు కనపడకపోయెను. మఱియు గొప్పవారేమి, కొద్దివారేమి మృత్యులయినవారు దేవుని యెదుట నిలువబడి యుండుట జూచితిని. అప్పుడు గ్రంథము విప్పబడెను. మఱియు జీవగ్రంథమను వేఱొక గ్రంథము విప్పబడెను. ఆ గ్రంథములందు వ్రాయబడియున్న వానిని బట్టి తమ క్రియల చొప్పున మృతులు తీర్పు పొందిరి. (యో. ప్ర. ౨౦:౧౧, ౧౨)

స:- ఈ పసితనపు మాటలు చూడుడు. భూమియు నాకాశము నెట్లు పరుగెత్త గలుగును? మఱి దేని మీద నిలువ గలుగును? ఎవరి సమ్ముఖము నుండి పరుగిడెనో యతని సింహాసనమును, నత డెచ్చట నిలిచి యుండ గలిగిరి? మఱి చనిపోయిన వారు దేవునియెదుట నిలువబెట్టబడినపుడు దేవుడు కూడ గూర్చుండి యుండెనా లేక నిలిచి యుండెనా? ఇచ్చట కచేరీలలోను, దుకాణములలోను వ్యావహారిక విషయములన్నియు బుస్తకమునందు వ్రాయబడునటులే యీశ్వరునియొద్ద కూడా వ్రాయబడునా?

జీవులందఱి స్థితి గతుల వ్రాయున దీశ్వరుడా, యతని గుమాస్తాలా? ఇట్టి మాటల బట్టియే కద యనీశ్వరుని, నీశ్వరునిగాను, నీశ్వరుని ననీశ్వరునిగాను నీ క్రైస్తవాదులు చేసిపెట్టిరి. (౧౨౮)

౧౨౯. వారిలో నొకడు వచ్చి యిటురమ్ము పెండ్లికుమార్తె అనగా గొఱ్ఱెపిల్ల యొక్క భార్యను నీకు చూపెదనని నాతో చెప్పెను. (యో. ప్ర. ౨౧: ౯)

స :- ఓహో! యేసునకు స్వర్గమందు బెండ్లికూతురు-మంచిభార్య లభించెనుగదా! ఆనందించుచుండవచ్చును. ఇంక నే యే క్రైస్తవు లచ్చటకు బోవుదురో వారికిని స్త్రీలు లభింతురు గాబోలు! బిడ్డలు కూడ బుట్టుచుండవచ్చును. జన మెక్కువగుటవలన రోగములు ప్రబలి చనిపోవుచు నుండవచ్చును. ఇట్టి స్వర్గమునకు దూరమునుండియే చేతులు జోడించుట యుచితము. (౧౨౯)

౧౩౦. అతడు ఆ కోలకఱ్ఱతో పట్టణము కొలువగా దానికొలత యేడు నూర్ల క్రోసులైనది. దాని పొడవును, ఎత్తును, వెడల్పును సమముగా నున్నది. మఱియు అతడు ప్రాకారమును కొలువగా అది మనుష్యుని కొలత చొప్పున నూట నలువది నాలుగు మూరలు అయినది. ఆ కొలత దూతల కొలతయే. ఆ పట్టణపు ప్రాకారము సూర్యకాంతములతో కట్టబడెను. పట్టణము స్వచ్ఛమగు స్ఫటికముతో సమానమైన శుద్ధసువర్ణముగా నున్నది. ఆ పట్టణపు ప్రాకారపు పునాదులు అమూల్యమైన నానావిధ రత్నములతో అలంకరింపబడి యుండెను. మొదటి పునాది సూర్యకాంతపుఱాయి, రెండవది నీలము, మూడవది కెంపు, నాలుగవది మరకతము, అయిదవది గోమేధికము, ఆఱవది మాణిక్యము, ఏడవది పచ్చ, ఎనిమిదవది వైడూర్యము, తొమ్మిదవది పుష్యరాగము, పదియవది సువర్ణలశునీయము, పదునొకండవది పద్మరాగము, పన్నెండవది సుగంధము. దాని పన్నెండు గుమ్మములు. పన్నెండు ముత్యములు. ఒక్కొక్క గుమ్మము ఒక్కొక్క ముత్యముతో కట్టబడి యున్నది. పట్టణపు రాజవీథి శుద్ధ సువర్ణమయమై స్వచ్ఛమైన స్ఫటికమును పోలియున్నది. (యో. ప్ర. ౨౧: ౧౬-౨౧)

స :- క్రైస్తవుల స్వర్గవర్ణనము వినుడు! క్రైస్తవులు పుట్టుచు గిట్టుచు నుందురేని యింత గొప్ప పట్టణమం దెట్లిమడగలరు? ఏమనగా నందు మనుష్యుల యాగమనము కలదు. కాని తిరిగి వెళ్ళిపోవుట లేదు. ఈ పట్టణము బహుమూల్య రత్నములచే నిర్మింపబడి యున్నట్లు నమ్మియున్నారు. కాని బంగారుతో జేయబడినది యను మున్నగు వ్రాతలన్నియు గేవల మమాయకులైన మనుష్యులను మోసపుచ్చి తమవలలో జిక్కించు కొనుటకు గల్పింపబడిన లీలలే. అహో! ఆ పట్టణపు వెడల్పు నిడివి వ్రాసినది సంభవమా? ఎత్తేడువందల యేబది క్రోసు లనున దెట్లు సంభవమగును? ఇది పట్టి మిథ్యా లాపమే. ఇంత పెద్దముత్యము లెట్లు చిక్కి యుండును? ఆ లేఖ వ్రాసిన వాని యింటి కుండలలో నుండెనేమో? ఈ గప్పాలు పురాణముల కబ్బలై యున్నవి. (౧౩౦)

౧౩౧. దుష్టవస్తువును గాని, నింద్యకార్యమును గాని చేయువాడు, అసత్యవాది దానిలోనికి ప్రవేశింపనే ప్రవేశింపరు. (యో. ప్ర. ౨౧. ౨౭)

స :- అటులేని, పాపులు గూడ గ్రైస్తవమతములో జేరుటవలన స్వర్గమునకు బోగలుగుదు రని క్రైస్తవులెందుకు జెప్పుచున్నారు? అది సరికాదు. అటులయినచో (స్వప్నమందలి) మిథ్యా వాక్యములు చెప్పు యోహా నెప్పుడును స్వర్గమున బ్రవేశింప జాలడు. యేసుకూడ స్వర్గమునకు బోయి యుండడు. ఏల యనిన నొకపాపియే స్వర్గమును బొందజాలనప్పు డనేక బాపుల పాపముల బొందువా డెట్లు స్వర్గవాసి కాగలడు? (౧౩౧)

౧౩౨. ఇకమీదట శాపగ్రస్తమైన దేదియు నుండదు. దేవునియు, గొఱ్ఱెపిల్లయు సింహాసనము దానిలో నుండును. ఆయన దాసులు ఆయనను సేవించుచు ఆయన ముఖావలోకనము చేయుచుందురు.

ఆయన నామము వారి నొసళ్ళ యందుండును. రాత్రి యిక నెన్నడు నుండదు. దీపకాంతి కాని, సూర్యకాంతి కాని వారి కక్కఱ లేదు. దేవుడైన సర్వేశ్వరుడే వారిమీద ప్రకాశించును. వారు యుగయుగములు రాజ్యము చేయుదురు. (యో. ప్ర. ౨౨. ౩-౫)

స :- చూడుడు! ఇదియే కద! క్రైస్తవుల స్వర్గము. ఏమి? ఈశ్వరుడును, యేసును నిరంతరము సింహాసనముపై గూర్చుండి యుందురా! మఱి వారి దాసులు వారి యెదుట సర్వదా ముఖావలోకనమునే చేయుచుందురు. మీ దేవుని ముఖము యూరోపియనులవలె దెల్లనిదా? ఆఫ్రికనుల వలె నల్లనిదా? లేక యన్య దేశీయుల బోలి యున్నదా? చెప్పుడు! ఈ స్వర్గము కూడ నొక బంధనమే యనవచ్చును. ఏలయనగా చిన్న పెద్ద లుండునట్టి నగరమందు నివసింపవలసి వచ్చుచో నట దుఃఖమేల కలుగ కుండును? ఇక ముఖముగల యీశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు నెప్పుడును గాజాలడు. (౧౩౨)

౧౩౩. ఇదిగో త్వరగా వచ్చుచున్నాను. వాని వాని పనిచొప్పున ప్రతివాని కిచ్చుటకు నేను సిద్ధపఱచిన జీతము నాయొద్ద నున్నది. (యో. ప్ర. ౨౨. ౧౨)

స :- కర్మానుసారమే ఫలము లభించు ననుట నిజమైనపుడు పాపము లెన్నటికిని క్షమింపబడ జాలవు. క్షమింపబడు నన్న నీ దూతల మాట యబద్ధము. ఎవరేని క్షమింపబడు ననుమాట గూడ సువార్త లలో వ్రాయబడి యున్నదందురేని పూర్వాపర విరుద్ధమైన మిథ్యాసాక్ష్య మయ్యెను. కావున నీ మిథ్యోక్తుల నంగీకరించుట మానుడు. ఇక నెంతవఱకని వ్రాయుదుము. వీరి బైబిలునందు లక్షలకొలది విషయ ములు ఖండింప దగినవి కలవు. కాని వానినుండి కొన్నిటిని మాత్రమే యందఱకు బోధపడుటకు నిందు దాహరించి యున్నాడను. ఇంతటితోనే బుద్ధిమంతు లధికముగనూహించి తెలిసికొనగలరు. ఈ బైబిలు నందు గొన్ని మాటలు మాత్రము కాక తక్కిన వన్నియు మిథ్యోక్తులే నిండియున్నవి. అసత్యముతో గూడియున్న బరిశుద్ధముగ నుండనటులే యీ బైబిలుకూడ మాననీయము కాజాలదు. కాని యీ సత్యమనునది వేదములను స్వీకరించునపుడే యలవడును. (౧౩౩)

శ్రీమద్దయానంద సరస్వతీ స్వామి నిర్మితమును
సుభాషావిభూషితము నగు సత్యార్థప్రకాశమున
క్రైస్తవమత విషయముగల త్రయోదశ
సముల్లాసము సంపూర్ణము.

ఓమ్

# అనుభూమిక

ఈ పదునాల్గవ సముల్లాసము ముసల్మానుల మతమును గూర్చి యన్య గ్రంథమునుండి కాక కేవలము వారి కురానును బట్టియే వ్రాయబడినది. ఏమన ముసల్మానులు కురానునందే పూర్ణముగ విశ్వాసముంతురు. వారిలో సంప్రదాయము లున్నందున శబ్దార్థాది విషయములలో గొంత విరోధమున్నను కురాను విషయమున నెల్లరు నేకమతులు. అరబ్బీ భాషయందున్న కురానునకు మౌల్వీలు ఉర్దూభాషయందర్థము వ్రాసియున్నారు. ఆ యర్థమే యార్యభాషాంతరీకరణ మొనరింపబడి గొప్పగొప్ప అరబ్బీ పండితులచే శోధింపబడిన పిదప దేవనాగరి యక్షరములలో వ్రాయింపబడెను. ఎవ్వరేని యీ యర్థము బాగుగ లేదన్న మొదట మౌల్వీసాహెబుల యనువాదములను రద్దుపఱచి పిమ్మట నీ విషయము మీద వ్రాయవచ్చును. ఏలయన నిది కేవలము మనుష్యుల యున్నతి కొఱకు సత్యాసత్యముల నిర్ణయము కొఱకును వ్రాయబడినది. దీనివలన నెల్ల మతవిషయములు గొంతబోధపడుటయేకాక మనుష్యులకు బరస్పరము విచారించుకొనుట కవకాశము చిక్కి యొకరు మఱొకరి దోషములు ఖండించుచు గుణములు గ్రహింప గలుగుదురు. మఱొక మతమందో లేక యీ మతమందో వ్యర్థముగ గుణదోషముల నారోపించుట లేదు. కాని గుణములు గుణములుగాను, దోషములు దోషములుగాను నెల్లరకు విదితమగును. ఒకడొకనితో నబద్ధము ప్రచారము చేయుటకు గాని, సత్యమ్ము నవరోధించుటకుగాని సమర్థుడు గాకుండును. సత్యాసత్యములు తేటపడినను నిష్టమున్నవా డంగీకరింప వచ్చును. లేదా యంగీకరింపక పోవచ్చును. ఎవ్వనియెడను బలాత్కారము జరుగదు.

తమవే కాని యితరులవే కాని దోషములను దోషములుగాను, గుణములను గుణములుగాను దెలిసికొని, గుణములను గ్రహించి దోషములను బరిత్యజించుటయే సజ్జనుల తెఱగై యున్నది. అట్లే హఠమును మొండితనమును దగ్గింపవలయును, తగ్గింపజేయవలయును. ఏమన బక్షపాతముచే నెన్నెన్ని యనర్థములు జగమున జరిగియుండలేదు? జరుగుచుండుటలేదు? జరుగకుండ బోవును? అనిశ్చయము - క్షణభంగురము–నైన యీజీవనమందు బరులకు హాని కలిగించి తాను లాభము వదలుకొనుటయు, నన్యుల నట్లుంచుటయు, మనుష్యత్వమునకు దూరమైన విషయము.

దీనియందు విరుద్ధ మేమయిన వ్రాయబడియున్న దానిని సజ్జనులు తెలియబఱతురు గాక! అది యుచితముగా నున్న నంగీకరింపబడును. ఇది హఠమును దురాగ్రహమును, నీర్ష్యా ద్వేషములను, వాదవివాదములను, విరోధమును దగ్గించుకొనుటకు వ్రాయబడినదే కాని వీని బెంచుటకు గాదు. ఒకరికొకరు హాని కలుగనట్లు ప్రవర్తించుటయు, లాభము గలుగజేయుటయు మా ముఖ్యకార్యము. కావున నీ పదునాల్గవ సముల్లాసమునందు ముసల్మానుల మతమును గూర్చి సజ్జను లందఱియెదుట నివేదించుచున్నాడ. ఇష్టమైనదానిని గ్రహింపుడు. ఇష్టము కానిదాని ద్యజింపుడు.

బుద్ధిమద్వర్యులకు విస్తరింపనేల!!

# చతుర్దశ సముల్లాసము
# ముసల్మానుల మత విషయము

౧:- క్షమించువాడు, దయాళువునగు అల్లాహ నామముతో నారంభము.

(మంజిల ౧. సిపారా ౧ సూరత ౧.)

స :- ఈ కురాను ఖుదావలన జెప్పబడినదని ముసల్మాను లనుచున్నారు. కాని దీనిని రచించినవాడు వేఱొకడు కలడని యీ మాటవలన విదిత మగుచున్నది. ఏమన బరమేశ్వరునిచే రచింపబడి యుండిన "అల్లా నామముతో నారంభము" అనక యుండును. కాని "మనుష్యుల కుపదేశార్థ మారంభము" అని యుండెడిది. మీరిట్లు చెప్పుడని మనుష్యులకు నేర్పుచున్నాడన్న నదియు సరికాదు. ఏలయన దీనివలన ఖుదానామముతో బాపము కూడ నారంభమయి యతని నామము కూడ దూషితమై పోవును. అతడు క్షమించువాడు, దయాకరుడు నగునేని తన సృష్టియం దతడు మనుష్యుల సుఖము కొఱకు నన్యప్రాణుల జంపుటకు దారుణమైన పీడ కలుగజేసి, చంపించుచు మాంసము దినుటకు నాజ్ఞ యేల యిచ్చెను? ఏమి? ఆ ప్రాణు లపరాధ మెఱుగనివియు, బరమేశ్వరునిచే సృజింపబడినవియు గావా? ఇక బరమేశ్వర నామముతో మంచిమాటల యారంభము, చెడ్డమాటలది కాదు, అనియు వచింపవలసి యుండెను. ఈ మాట గోలగా నున్నది. ఏమి? దొంగతనము, జారత్వము, మిథ్యాభాషణము మొదలగు నధర్మ కార్యముల యారంభముకూడ బరమేశ్వరుని నామముతో జేయబడవలయునా? దీనివలననే కద కటికలు మొదలగు ముసల్మాను లావు మున్నగు పశువుల గొంతులు గోయునపుడు "బిస్మిల్లాహ" అను వచనమునే పఠించు చున్నారు. చూడుడు! దీనికి బ్రాయబడిన యర్థమే వచ్చును గావున జెడుకార్యముల యారంభము కూడ నీ ముసల్మానులు పరమేశ్వరుని పేరుతో జేయుచున్నారు. అటులేని ముసల్మానుల "ఖుదా" దయాళువు గాకుండును. ఏమన నతని దయ యా పశువుల మీద లేకపోయినది. ముసల్మానులు దీనియర్థము నెఱుగరేని యీ మాట వెల్లడి యగుట వ్యర్థము. ముసల్మానులు దీనికి వేఱర్థము జేయుదురేని, సరియైన యర్థమేమి? అను నిత్యాదులు ప్రశ్నలు కలుగును. (౧)

౨. అన్ని స్తుతులు "పరవరదిగార్" అనగా సకల ప్రపంచమును పాలించునట్టి పరమేశ్వరుని కొఱకే "అతడు" క్షమించునట్టి దయాళుడు. (మం. ౧. సి. ౧. సూరతుల్ఫాతిహా. ఆ. ౧. ౨.)

స :- కురానులో ఖుదా ప్రపంచమును బాలించువాడు. అందఱపై క్షమాదయలను జూపువాడు నైయున్న నన్యమతస్థులనే కాక పశ్వాదులను గూడ ముసల్మానులచేత జంపించుటకు నాజ్ఞ నొసంగకయే యుండును. క్షమించువాడేని పాపులను గూడ క్షమించునా? అటులైన ముందు జెప్పబోవునట్లు "కాఫిరులను జంపుడు". (కురాను, పైగంబరుల నంగీకరింపని వారు కాఫిరులు) అని యెందుకు వ్రాసియుండును? కావున 'కురాను' ఈశ్వర కృతమని తోచదు. (౨)

3. న్యాయదినమునకు స్వామివి. నీభక్తినే మేము చేయుచున్నాము. నీ సాహాయ్యమునే కోరుచు న్నాము. మాకు చక్కని మార్గము జూపుము. (మం-౧-సి-౧. సూ. ౧. ఆ-3,౪,౫)

స :- ఖుదా యెల్లప్పుడు న్యాయము జేయడా? ఏదో యొకదినమున న్యాయము చేయునా? ఇది యన్యాయమే యని తోచుచున్నది. అతనినే భజింపవలయును. అతని నుండియే సాహాయ్యము గోరవలయు ననుట సరియే కాని చెడు కార్యములందును సాహాయ్యమును గోరవలయునా ఏమి? చక్కని మార్గము కేవలము ముసల్మానులదేనా లేక యితరులకు గలదా? చక్కని మార్గమును ముసల్మాను లేల గ్రహించుటలేదు? ఏమి? చక్కని మార్గము కీడు గలుగచేయుటకే కోరుట లేదుగద? మేలందఱకు

నొకటే యైన ముసల్మానులందే యను విశేష మేమియు నుండకుండును. ఇతరుల మేలు నొప్పనివారు పక్షపాతము కలవారే యగుదురు. (౩)

౪. ఎవరియెడ నీవు దయ జూపితివో వారి మార్గమును జూపుము. నీ వెవరి నత్యంత క్రోధముగ జూచితివో వారి మార్గమును గాని త్రోవతప్పిన వారి మార్గము గాని మాకు జూపకుము.

(మం-౧. సి-౧. సూ-౧ ఆ. ౬-౭)

స :- ముసల్మానులు పూర్వజన్మమును, బూర్వకృత పాపపుణ్యముల నొప్పుకొనరేని కొందఱి యెడ దయజూపి కొందఱియెడ దయ చూపక పోవుట వలన ఖుదా పక్షపాతి యయిపోవును. ఏమన బాపపుణ్యములే లేనపుడు సుఖదుఃఖముల బొందజేయుట కేవల మన్యాయము. నిష్కారణముగా నొకనిపై దయను, మఱొకనిపై గ్రోధమును జూపుట కూడ స్వభావమునకు విరుద్ధము. అతడు దయనో, క్రోధమునో చూపనేరడు. ఏమన వారికి బూర్వసంచిత పుణ్యపాపములే లేనపు డొకనిపై దయను, మఱొకనిపై గ్రోధమును జూపు ననుట సంభవింపదు. ఇక నీ సూరతునకు టిప్పణము "ఈ ప్రకారముగ సర్వదా చెప్పుచుండునని యీ సూరతును అల్లాసాహెబు మనుష్యుల నోటితో నుచ్చరింపజేసెనని" వ్రాయబడి యున్నది. అది నిజమేని 'అలీఫ్ బే' మొదలుగా గల యక్షరములను గూడ ఖుదా చదివించి యుండవచ్చును. అక్షరజ్ఞానము లేనివా రీసూరతు నెట్లు చదువ గలిగిరి? ఏమి! నోటితోనే చదివింప బడుచు, చదువుచు బోయిరా? అటులేని కురాను నంతటిని నోటితోనే చదివించి యుండవచ్చును. పక్షపాతముతో గూడిన మాటలుండు పుస్తక మీశ్వరకృతము కాజాలదని దీనివలన గ్రహింపవలయును. అరబ్బీ భాషయం దుండుటవలన నరేబీయులకు దీని జదువుట సులభమును నన్యభాష నెఱుగువారికి గఠినము నగునుగాన ఖుదా యందు బక్షపాతము సంభవించుచున్నది. పరమేశ్వరుడు సృష్టిలోని సమస్త దేశములందలి మనుష్యులయెడ న్యాయపూర్వకముగ నెల్ల దేశభాషలకంటె విలక్షణమై యెల్ల దేశీయులకు సమాన పరిశ్రమముచే విదితము కాగల సంస్కృత భాషయందే వేదములను బ్రకాశపఱచి యున్నట్లు రచియించి యున్న నీ దోషము సంభవింప కుండెడిది. (౪)

౫. ఈ పుస్తకము నిస్సందేహముగ పరోహెజాగారులకు మార్గము జూపుచున్నది. విశ్వాసము గలవారు (పరోక్షముగ) నమాజు చదువువారు, మేమిచ్చిన వస్తువునే వెచ్చపెట్టుచున్నవారు, ఆ పుస్తకమును విశ్వసించువారు, నిన్నును, నీకంటె ముందుగా వచ్చిన దానిని (పుస్తకమును) ఉంచువారు, ప్రలయమును (కయామతు) నమ్మికొనువారును తమ ప్రభువు శిక్షలో నున్నవారును విడుదల బొందుదురు. కాఫిరులను నీవు భయపెట్టుటయు, భయపెట్టకుండుటయు నొక్కటియే. వారు విశ్వాసము నుంచరు. దేవుడు వారి హృదయముమీద కర్ణములమీద ముద్రవేసి యున్నాడు. వారి నేత్రముల మీద పొరలు క్రమ్మియున్నాడు. వారికి గొప్పనరకము (అజాబు) గలదు. (మం. ౧. సి. ౧ సూరత ౨. ఆ. ౧-౬)

స :- ఏమి? ఖుదా తన నోటితో తానే తన పుస్తకమును పొగడుకొనుట దంభాలాపము కాదా? పరోహెజాగారు అనువారు ధర్మాత్ములేని వారు స్వయముగా సన్మార్గమున నున్నవారు. ఆ సన్మార్గమున నున్నవారికి నీ కురాను మార్గము చూపజాలదేని దీని ప్రయోజనమేమి? పాపపుణ్యములు "పురుషార్థమును సంచితము" లేనిచో ఖుదా తన కోశమునుండియే వెచ్చపెట్టుట కిచ్చుచున్నాడా యేమి? ఇచ్చుచున్నాడేని, యందఱి కెందుకీయడు. ఇక ముసల్మాను లేల పరిశ్రమము చేయుచున్నారు? బైబిలు, ఇంజీలు మొదలగునవి విశ్వసింపదగినవేని, ముసల్మానులు కురానును విశ్వసించునట్లు ఇంజీలు మున్నగువానిని విశ్వసించుట లేదెందుకు? విశ్వసించుచున్నారేని కురాను నావశ్యక మేయుండదుగదా! (వాస్తవమం దీశబ్దము "కురఅన్" అని యున్నది. కాని భాషలో లోకులు మాట్లాడునపుడు కురానని చెప్పబడుచున్నది. కావున నటులే

వ్రాయబడినది.) కురాను నం దనేక విషయము లున్నవని చెప్పుదురేని ఖుదా మొదటి పుస్తకమందు వ్రాయుటను మఱచిపోయి యుండెనా? మఱవలేదన్న కురాను రచించుట నిష్ప్రయోజనము. బైబిలు నందలివియు, కురానునందలివియు గొన్ని కొన్ని సంగతులేతప్ప తక్కినవన్నియు సమానములై యున్నట్లు మాకు గోచర మగుచున్నవి. వేదమువలె నొకపుస్తకమునే రచింపలే దెందుకు? కయామతునందే విశ్వాసముంచవల యునా? ఇతరము నందుంచవలదా? (౧-౨-౩)

ఏమి క్రైస్తవులు, ముసల్మానులు మాత్రమే దేవుని శిక్షలో నున్నారా? వారియం దెవడును బాపాత్ముడే లేడా? ధర్మవిహీనులైన క్రైస్తవులు, ముసల్మానులును గూడ విడుదల పొందుదురా? ఇతర ధర్మాత్ములైన వారు పొందకుందురా? అటులేని గొప్ప యన్యాయము, ననుచితము కాదా? (౪)

ముసల్మానుల మతము నంగీకరింపని వారిని కాఫిరు లనుట యేక పక్షపు తీర్పు కాదా? పరమేశ్వరుడు వారి యంతఃకరణముల మీదను, చెవుల మీదను ముద్రలు వేసి యున్నందుననే కదా వారు పాప మొనరించుచున్నారు? వారి దోష మేమియు లేదు. ఆ దోషము ఖుదాదే. ఇంక వారికి సుఖదుఃఖములు కాని పాపపుణ్యములు గాని కలుగనేరవు. మఱి వారినేల శిక్షించుచున్నారు? ఏలయన వారు పాపమో, పుణ్యమో స్వతంత్రముగా జేయనే లేదుగదా! (౫-౬)

౬. వారి హృదయమునందు రోగము కలదు. అల్లా వారి రోగమును హెచ్చించెను.

(మం. ౧. సి. ౧. సూ. ౨. ఆ. ౯)

స :- చూచితిరా! అపరాధము లేనిదే ఖుదా వారి రోగముల బెంచెను. దయరాలేదే! ఆ దీనజను లెంతో దుఃఖపడవచ్చును గదా! ఇది సైతాను కంటె మించిన సైతానుతనపు బనికాదా? ఒకని మనస్సుమీద ముద్ర వేయుట, యొకని రోగమును బెంచుట యనుపనులు ఖుదావి కాజాలవు. ఏలయన రోగము తన పాపమువలననే పెరుగును. (౬)

౭. మీకొఱకు పృథివీశయ్య, ఆకాశాచ్ఛాదనమును చేసియున్నాడు.

(మం. ౧. సి. ౧. సూ. ౨. ఆ ౨౨)

స :- మంచిది. ఆకాశ మొకని కాచ్ఛాదనము కాగలదా? ఇది యవిద్యతో గూడినమాట. ఆకాశము నొకకప్పుగా నమ్ముటయు హాస్యపు మాటయేగద! ఏదో యొక పృథివినే యాకాశమని నమ్ముదురేని యది వారి యింటిమాటయే యగును. (౭)

౮. మేము మా పైగంబరు మీద దించినట్టి వస్తువునెడ మీకు సందేహమున్న దానివంటి యొకసూరతును తెండు. మఱి యల్లా కాక మీరే సత్యవంతులేని మీ సాక్షులను పిలువుడు. మీరట్లు చేయక పోవుదురేని మనుష్యులను కాఫిరులకొఱకు తయారుచేయబడిన ఱాలను కాల్చివేయు నగ్నికి భయ పడుడు. (మం. ౧-సి-౧-సూ-౨-ఆ-౨౩,౨౪)

స :- ఔరా! దానివంటి దొక సూరతయిన రచియింప బడనేరదను నది యొప్పునా? అకబరు బాదశాహ కాలమందు మౌలవీఫైజీ యనువాడు సున్నలేని కురానును రచించి యుండలేదా? అది యే నరకపుటగ్ని? ఈ యగ్నికి భయపడవలదా? దీనిలో బడున దంతయు నింధనమే యగును. కాఫిరుల కొఱకు ఱాలు సిద్ధపఱపబడి యున్నవని కురానునందు వ్రాయబడినట్లే, మ్లేచ్ఛులకొఱకు ఘోరనరకము సిద్ధమయియున్న దని పురాణములందు వ్రాయబడి యున్నది. ఇప్పు డెవని మాట నిజమని నమ్మవలెనో చెప్పుడు? వారి వారి వచనములవలన నిద్దఱు స్వర్గగాములును నొండొరుల మతభేదమువలన నిద్దఱు నరకగాము లగుచున్నారు. కాని వీరి యీ వ్యర్థాలాపము లన్నియు వట్టివే. సకలమతములలోగల ధర్మాత్ము లందఱు సుఖమును, బాపాత్ము లందఱు దుఃఖమును దప్పక పొందుదురు. (౮)

౯. మఱి విశ్వసించిన వారికిని, మంచిపను లొనరించిన వారికి ఈ శుభవార్త వినజెప్పుము. అదే మనగా మీకొఱకు స్వర్గములు కలవు. వాని క్రిందుగా నదులు పారుచుండును. అందు దినుటకు ఫలము లియ్యబడు నపుడు ఇవి మాచే దీనికి ముందీయబడిన వస్తువులే యనగలరు. మఱి మీ కొఱకు పవిత్ర స్త్రీలు నక్కడ సర్వదా యుందురు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౨౫)

స :- మంచిది! ఈ కురాను నందలి స్వర్గమున జగత్తులో లేని యుత్తమపదార్థ మేమి కలదు? ఏలయన జగత్తులోగల పదార్థములే యీ ముసల్మానుల స్వర్గమందును గలవు. కాని విశేష మేమన నిచ్చట బురుషులు పుట్టుచు, గిట్టుచు, వచ్చుచు, బోవుచు నున్న ట్లాస్వర్గమందు తటస్థింప దనుట. ఇచ్చట స్త్రీ లెల్లప్పుడు నుండుట లేదు. కాని యక్కడ జక్కని స్త్రీలు సర్వదా యుందురేని కయామతు రాత్రి రానంతవఱకు బాప మా స్త్రీ లెట్లు కాలము గడపగలుగుదురో గద! ఖుదాయే వారిపై దయ జూపుచుండ వచ్చును. ఖుదా నాశ్రయించియే వారు కాలము గడపుచుండవచ్చు నన్న బాగుగనే యున్నది. ఈ ముసల్మానుల స్వర్గము, గోకులపు గోసాయీల గోలోకమువలెను వారి మందిరమువలెను గనబడుచున్నది. అచ్చట స్త్రీల కున్నంత మాన్యత పురుషులకు లేదు. అటులే ఖుదా గృహమందును స్త్రీలకు మాన్యత మెండుగా గలదు. వారిపై ఖుదా ప్రేమకూడ మెండుగ నున్నది. ఆ పురుషులమీద లేదు. ఏలయన ఖుదా బీబీలను స్వర్గమం దెల్లప్పుడు నుంచెను. పురుషుల నుంచలేదు. ఆ బీబీలు ఖుదా యంగీకారములేక స్వర్గమందెట్లుండ గలుగుదురు? ఈ వార్త నిజమేని, ఖుదా స్త్రీలోలు డయిపోవును. (౯)

౧౦. ఆదామున కన్నినామములను నేర్పును. ఫురల (ఫరిశాల) దేవదూతల యెదుట మీరు సత్యవంతులయిన నాకు వారి నామములు దెలుపుడనెను;- ఓ ఆదాము! వారికి వారి నామములు దెలుపు మనెను. అప్పు డతడు తెలుపగా "నేను యథార్థముగ పృథివియందును, ఆకాశమందును గుప్తముగా నున్న వస్తువులను, ప్రకటితములు, గుప్తములు నగుకర్మములను ఎఱుగుదునని మీతో జెప్పియుండ లేదా యని ఖుదా ఫరిశ్తాలతో ననెను. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౩౧, ౩౩)

స :- మంచిది. ఫరిశ్తాల నిట్లు మోసపుచ్చి తన్ను బొగడుకొనుట ఖుదా పనియా? ఇది యొక డాంబికమే కదా. దీని నేవిద్వాంసుడు నంగీకరింపడు. ఇక నిట్టి యభిమానమును జూపడు. ఇటువంటి మాటల వలననే ఖుదా తన గొప్పతనమును జాటుకొన గోరుచున్నాడా యేమి? తెలివి తప్పిన లోకులలో నొక డెట్టి యక్రమముల నయినను సాగించుకొనగలుగు ననుట నిశ్చయమే కాని యవి సభ్యజనులలో సాగనేరవు. (౧౦)

౧౧. మేము ఫరిశ్తాలతో బాబా ఆదామునకు దండము బెట్టు డన్నపుడు, నందఱు దండము పెట్టిరి. కాని సైతా నంగీకరింపక యభిమాన పడెను. ఎందుకన నతడొక కాఫిరుడై యుండెను.
(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౩౪)

స :- దీనివలన ఖుదా సర్వజ్ఞుడు కాడు. అనగా భూతభవిష్యద్వర్తమానముల నన్నిటి నెఱుగని వాడుగా నున్నాడు. ఎఱిగి యున్నవాడేని సైతాను బుట్టింపనేల? ఇక ఖుదాయందు బరాక్రమము కొంత యైన లేదు. సైతాను ఖుదా యాజ్ఞను బాలింపలేదు. ఐనను ఖుదా వాని నేమియు జేయలేకపోయెను. ఒక సైతాను - కాఫిరుడే ఖుదాను గూడ దాఱుమాఱు పఱచెనన్న నిక ముసల్మానుల కథనానుసారము కోట్లకొలది కాఫిరు లున్నచోట ముసల్మానుల ఖుదాది కాని, ముసల్మానులది కాని యేమి సాగగలదు? ఇక నప్పుడప్పుడు ఖుదానయిత మొకని రోగమును బెంచుచు, నొకని భ్రమింప జేయుచు నున్నాడు గదా! ఈ మాటలను ఖుదా సైతానునుండియే నేర్చియుండవచ్చును గదా! ఏమన సైతానునకు పంతులు ఖుదాకాక మఱెవ్వడు గాజాలడు. (౧౧)

౧౨. ఆదామూ! నీవు నీ పెండ్లాము నానందపూర్వకముగ స్వర్గమున నుండి యిష్టమైనచోట దినుడు. కాని యాచెట్టుదగ్గఱకు బోకుడు. పాపాత్ములగుదురని మేమే చెప్పితిమి. సైతాను వారిని మోసపుచ్చెను. మఱి వారిని స్వర్గానందమునుండి తొలగ జేసెను. అప్పుడు మీలో నొకానొక శత్రువు కలడు. ఇక మీనివాసము పృథివి. కొంతకాలమువఱకు లాభము కలదు. దిగుడని మేమనగా ఆదాము తనస్వామి మాటలు గొన్నిటిని నేర్చుకొని పృథివిమీదకు వచ్చి చేరెను.

(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౩౫, ౩౬, ౩౭)

స :- ఇక నీ ఖుదా యల్పజ్ఞత్వమును గనుగొనుడు! అప్పుడే స్వర్గమం దుండుట కాశీర్వదించెను. మఱి కించిత్కాలము తరువాత వెళ్ళుడని చెప్పెను. భవిష్యద్వార్తల నెఱిగినవాడయిన వరమే యెందు కొసంగి యుండును? భ్రమింప జేసెడి సైతానునుగూడ దండింప నేరనట్లు గోచరమగుచున్నది. మఱి యాచెట్టు నెవరి కొఱకు బుట్టించి యుండెను? తన కొఱకేనా యన్యులకొఱకా? అన్యుల కొఱకేని యాటంకపఱచిన దెందుకు? కనుక నిట్టిమాటలు 'ఖుదా'విగాని, యతడు రచించిన పుస్తకమందలివి గాని కానేరవు. ఖుదానుండి ఆదా మెన్ని మాటలు నేర్చుకొని వచ్చెను? ఆదాము పృథివి మీదకు వచ్చినపు డే ప్రకారముగ వచ్చెను? ఆ స్వర్గము పర్వతము మీద నున్నదా, యాకాశము మీదనా? దానినుండి యెట్లు దిగివచ్చెను? పక్షివలె వచ్చెనా? లేక మీదినుండి రాలిపడినట్లా? ఇక ఆదాము మంటితో జేయబడెనన్న వీరి స్వర్గమందు మన్నుండెనని కదా దీనివలన విదిత మగుచున్నది! ఇక నక్కడగలవారు నటులే ఫరిశ్తాలు మొదలయినవారు గావచ్చును. ఏలయన మంటి శరీరము లేకున్న నింద్రియభాగ మేర్పడజాలదు. మఱి పార్థివ శరీరమేని, మృత్యువుగూడ గలుగనే కలుగును. మృత్యువు కలుగునపుడు, వారక్కడనుండి యెక్క డికి బోవుదురు? మృత్యువు కలుగదన్నవారు పుట్టలే దనుటయు స్పష్టము. ఏమన బుట్టినవారు చావనే చత్తురు. అట్లయిన నిక బీబీలు స్వర్గమం దెల్లప్పు డుందురని, ఖురానునందు వ్రాసిన దబద్ధము. ఏలయన వారికిని మృత్యు వవశ్యముగా గలుగును. కావున స్వర్గమునకు బోవువారికి గూడ మృత్యువు కలుగనే కలుగు ననుట స్పష్టము. (౧౨)

౧౩. ఒకజీవి వేఱొక జీవియెడ విశ్వాస ముంచని దినమును గూర్చి భయపడుడు. వాని సిఫారసు స్వీకరింపబడదు. వానినుండి బదులు తీసికొనబడదు. మఱివారు సాహాయ్యము పొందరు.

(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౪౮)

స :- వర్తమాన దినములందును భయపడవలదా? కీడొనరించుట కన్నిదినములందును భయపడవలయును. సిఫార సంగీకరింప బడినపుడు మఱి పైగంబరు సాక్ష్యముతో గాని సిఫారసుతోగాని ఖుదా స్వర్గ మిచ్చుననుమాట యెట్లు సత్యము కాగలదు? ఖుదా స్వర్గస్థులకే సహాయకుడా? నరకస్థులకు గాడా? అటులేని ఖుదా పక్షపాతి యయ్యెను. (౧౩)

౧౪. "మేము మూసాకు పుస్తకమును (మోజిజాలను చమత్కారములును) ఇచ్చితిమి."

(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౫౩)

స :- మూసాకు పుస్తకము నిచ్చియున్నప్పుడు ఖురాను ఆవశ్యకమే యుండబోదు. ఇక నతని కాశ్చర్యశక్తి నిచ్చెనని బైబిలులోనే కాక ఖురాను నందును వ్రాయబడి యున్నది. కాని యీమాట నమ్మదగినది కాదు. ఏలయన నట్లయియున్న నిప్పుడును నగుచుండెడిది. ఇప్పు డగుటలేదేని పూర్వమును గాలేదు. స్వార్థులు నవిద్వాంసులు నయినవా రిప్పుడును నెట్లు మేమే విద్వాంసులమని యనిపించుకొనుచున్నారో యట్లే యాకాలమందును డక్కులు చేసి యుండవచ్చును. ఖుదాయు నతని సేవకులు నిప్పుడును గలరుగదా! ఇక నీ సమయమున ఖుదా యాశ్చర్యశక్తి నెందుకీయడు? ఇతరులు

చేయజాలరనిన మూసాకు బుస్తకము నిచ్చియుండెను గదా? మరల ఖురాను నీయవలసిన యావశ్యక మేమియుండెను? శుభాశుభములు చేయుటకు జేయకుండుటకు నుపదేశము సర్వత్ర యేకవిధముగ నున్నప్పుడు వేర్వేఱు పుస్తకములు రచించుటవలన బునరుక్తదోషము కలుగుచున్నది. మూసా మొదలగువారి కిచ్చిన పుస్తకములందు ఖుదా కొంత మఱచిపోయి యుండెనాయేమి? (౧౪)

౧౫. మఱియు జెప్పుము. క్షమించుమని కోరినవారి పాపములను, మేలుచేయువారి పాపములను మేము క్షమింతుము. (మం. ౧. సి. ౧. సూ. ౨. అ. ౫౮)

స :- భళీ ఈ దేవుని యుపదేశము అందఱను పాపులను జేయునదియా? కాదా? పాపములను క్షమించు నవకాశము మనుష్యులకు లభించినచో నెవ్వడును పాపములకు భయపడడు. కావున నిట్లు చెప్పువాడు దేవుడు కాని, ఆతడు వ్రాసిన పుస్తకము కాని కాజాలదు. కారణము దేవుడు న్యాయకారి కావున అన్యాయము నెన్నడు చేయజాలడు. పాపములను క్షమించినచో అన్యాయమగును. తప్పునకు శిక్ష నిచ్చువాడే న్యాయకారి. (౧౫)

౧౬. మూసా తన జాతి కొఱకు నీరు కోరినపుడు అతనితో 'నీ కఱ్ఱతో ఱాతిపై కొట్టినచో దానినుండి పండ్రెండు నీటి ధారలు వెలువడునని' నేను చెప్పితిని. (మం. ౧. సి. ౧. స. ౨. ఆ ౬౦)

స :- చూడుడు. ఇట్టి అసంభవములగు వానికి సమానముగా నితరుడెవ్వడు చెప్పడు. ఱాతిపైన కఱ్ఱతో గొట్టిన పండ్రెండు నీటిధారలు వచ్చుట యసంభవము. ఆఱాతి లోపల బోలుగాచేసి దానిలో నీరు నింపి పండ్రెండు బెజ్జములుంచినచో సంభవము కావచ్చును. మఱొక విధమున కాదు. (౧౬)

౧౭. నీవు నిందితమైన కోతివి కమ్మని ఆయనతో జెప్పితిమి. ఇటులాయన కెదురుగా వెనుక నుండి నవారల కొక భయమును, విశ్వాసులకు బోధను గలిగించితిమి. (మం.౧.సి.౧.సూ.౨.ఆ౬౫, ౬౬)

స :- ఖుదా నిందితమైన కోతివి కమ్మని కేవలము భయపెట్టుటకే వచించియున్న నతనిమాట యబద్ధ మాయెనా? లేక యతడు టక్కు చేసెనా? ఇట్టి మాటలు చెప్పువాడు ఖుదా కాజాలడు. ఇక దేనియం దిట్టి మాటలు గలవో యాపుస్తకము ఖుదా రచితమును గాజాలదు. (౧౭)

౧౮. ఈ ప్రకారముగ ఖుదా శవములను, మిమ్ములను బ్రతికించుచున్నాడు. మీ రెఱుంగుడని తన చిహ్నముల గనబఱచుచున్నాడు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ ౭౩)

స :- ఖుదా శవములను బ్రతికించుచుండెనేని యిప్పుడెందుకు బ్రతికించుట లేదు? ఏమి; కయామతు (తీర్పుదినము) రాత్రివఱకు సమాధులలోనే పడియుందురా? ఇప్పుడు విచారణార్థ మిబ్బందిలో నున్నారా యేమి? ఈశ్వర చిహ్నము లివియేనా? పృథివి, సూర్యుడు, చంద్రాదులు చిహ్నములు కావా? ప్రపంచములో బ్రత్యక్షముగ గనపడుచున్న నీ వివిధరచనా విశేషము లను చిహ్నములు చాలవా! (౧౮)

౧౯. వారెల్లకాలము బహిశ్తు అను వైకుంఠమందు నివసించువారలు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౮౨)

స :- ఏ జీవుడయిన ననంతపాపముల జేయనేరడు. కాబట్టి యెల్లప్పుడు స్వర్గనరకములం దుండజాలరు. ఖుదా యట్లుంచునేని యాత డన్యాయకారియు, నవిద్వాంసుడు నగును. కయామతు రాత్రియందే న్యాయము చేయునేని, మనుష్యుల పాపపుణ్యములు సమానములై యుండదగును. కర్మమనంత మైనది కానపుడు దానిఫల మనంత మెట్లు కాగలదు? ఏడెనిమిదివేల సంవత్సరముల కిటీవలనే, సృష్టి నిర్మింపబడినట్లు తెలుపుచున్నారు. ఏమి? దీనికి బూర్వము ఖుదా పనిలేక కూర్చుండి యుండెనా? ఇవన్నియు బిల్లల మాటలవంటి మాటలే. ఏలయన బరమేశ్వరుని పనులు సర్వదా జరుగు

చుండును. ఎవనికైనను బాపపుణ్యములకు దగినంతటి ఫలమునే యొసంగుచున్నాడు. కనుక ఖురానులో జెప్పబడిన యీమాట సత్యము కాదు. (౧౯)

౨౦. పరస్పరము మీలో మీరుగాని, మీలోని యొకానొక గృహము నుండిగాని రక్తమును బ్రవహింప జేయరాదని మేము మీతో బ్రతిజ్ఞ చేయించినపుడు మీరు ప్రతిజ్ఞ చేసితిరి. దానికి సాక్షులు మీరే. మరల మీరే యొకరి నొకరు చంపుకొనుచున్నారు. మీలో నొకతెగవారిని వారియిండ్ల నుండి వెడలగొట్టు చున్నారు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౭౪, ౭౫)

స :- సరి! ఇట్లు ప్రతిజ్ఞ చేయుట, చేయించుట యల్పజ్ఞుల పనియా? లేక పరమేశ్వరుని దగునా? పరమేశ్వరుడు సర్వజ్ఞు డయినపుడు సాంసారిక మనుష్యునివలె నిట్టి కఠిన నిబంధన నెందుకేర్పఱచి యుండును? ఇక నొండొరుల రక్తము ప్రవహింపజేయరాదు. తమ మతస్థుల నిండ్లనుండి వెడలగొట్టరాదు. అనుట యితర మతస్థుల రక్తమును బ్రవహింపజేసి వారినిండ్ల నుండి వెడలగొట్ట వచ్చుననుటయేగద. ఇది మంచి మాటయా? ఇది వట్టి మూర్ఖత్వము తోను బక్షపాతముతోను గూడినమాటయే. మఱి వీరు ప్రతిజ్ఞ నుల్లంఘింతురని మొదటనే పరమేశ్వరునకు దెలిసియుండ కుండెనా? ముసల్మానుల ఖుదాకూడ ననేకాం శములందు గ్రైస్తవుల ఖుదాను బోలియే యున్నాడు. ఇక నీ ఖురాను స్వతంత్రముగ రచింపబడలేదు. ఏలయన దీనిలో గొన్ని మాటలు తప్ప తక్కినవన్నియు బైబిలులోనివే కలవు. (౨౦)

౨౧. పరలోకమునకు మాఱుగా నిహలోక జీవనమును, బరిగ్రహించి యున్నవారే వీరు. వారి పాప మెప్పటికిని తగ్గింపబడదు. మఱి వారికి సాహాయ్యమును చేయబడదు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౭౬)

స :- మంచిది. ఇటువంటి యీర్ష్యాద్వేషములతో గూడిన మాట లీశ్వరునివి కాగలవా! మఱి యెవరి పాపములు తగ్గింపబడునో, లేక యెవరికి సాహాయ్యము చేయబడునో వారెవరు? పాపము చేసినవారిని శిక్షింపక వారిపాపములు తగ్గింపబడునేని యన్యాయ మగును. వారు శిక్షింపబడుచు వారి పాపములు తగ్గింపబడునన్న నీ ఆయతున జెప్పబడిన వారును శిక్షింపబడిన వారి పాపములును దగ్గింపబడ వచ్చును. మఱి దండింపబడినవారి పాపములు తగ్గింపబడనిచో నన్యాయమే యగును. పాపములు తగ్గింపబడు ననువారు ధర్మాత్ములని యభిప్రాయమేని వారి పాపములు సహజముగనే తగ్గియుండును. ఖుదా చేయునదేమి! కావున నిదియొక విద్వాంసునిచే వ్రాయబడినది కాదు. నిశ్చయముగ ధర్మాత్ములకు సుఖమును వారి కర్మములననుసరించి సదా కలుగజేయు చుండవలయును. (౨౧)

౨౨. మేము మూసాకు నిశ్చయముగ పుస్తకము నిచ్చితిమి. అతనికి పిమ్మట మేము పైగంబరును బంపితిమి. మరియమ్మ పుత్రుడగు యేసును యేసునకు ప్రకటమయిన మోజిజాలను-దైవీశక్తిని-సామర్థ్యము నిచ్చితిమి. "రూహుల్ కుదస్" (ఎల్లప్పుడు ఏసువెంట నుండిన జిబరయీలును రూహుల్ కుదస్ అందురు)తో మీ యొద్దకు తద్వస్తుసహితముగ పైగంబరు వచ్చినప్పుడు వానిని మీ మనస్సు ఒప్పుకొనలేదు. మరల మీరభిమానించితిరి. ఒక మతము నసత్యముజేసి యొకని బంపుచున్నారు.

(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౭౭)

స :- మూసాకు బుస్తకము నిచ్చెనని ఖురానునందు సాక్ష్యమున్నప్పుడు దాని నొప్పుకొనుట ముసల్మానుల కావశ్యక మయ్యెను. ఆ పుస్తకమునగల దోషములుకూడ ముసల్మానుల మతమునందు వచ్చిపడెను. మోజిజాలను-దైవశక్తిని-బ్రకటించు వార్తలన్నియు నసంభవములు. అమాయకులగు మను ష్యులను మోసపుచ్చుటకు వట్టి టక్కుల బన్నిరి. ఏలయనగా సృష్టి క్రమమునకు, విద్యకును విరుద్ధమగు వార్తలన్నియు నబద్ధములే. ఆ సమయమున మోజిజాలుండిన నీ సమయమున నేల లేవు. ఈ

సమయమున లేవేని యాసమయమునను లేకుండె ననుటకు సందేహ మేమియు నుండదు. (౨౨)

౨౩. దీనికి బూర్వము కాఫిరులను జయింప గోరుచుండిరి. కొంత గుర్తెఱింగినపు డతడు వారి వద్దకు వచ్చెను. తత్క్షణమే కాఫిరు లయిరి. కాఫిరులకు (అల్లా) దేవుని ధిక్కారము. (లానతు)
(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౮౯)

స :- మీరన్యమతస్థులను కాఫిరు లనునట్లు వారును మిమ్ము కాఫిరు లనకుందురా? అట్లే వారు తాము నమ్మిన యీశ్వరుని ధిక్కారము (లానతు) మీ మీద గలదందురు. ఇంక నిప్పుడు సత్యవంతు డెవడో యసత్యవంతు డెవడో చెప్పుడు. విచారించి చూచిన సకల మతస్థులలో నసత్యమున్నట్లు గోచర మగుచున్నది. ఇక సత్యమయినది యంతట నొక్కటిగానే యున్నది. కావున నీ వాదము లన్నియు మూర్ఖత్వముతో గూడినవే. (౨౩)

౨౪. అల్లా ఆనందసందేశము విశ్వాసులకు మాత్రము. ఫరిశ్తాలకు పైగంబరులకు, జిబిరయీలు లకు, మీకాయీలులకు, శత్రువులగు కాఫిరులకు అల్లాకూడ శత్రువు.(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౯౭, ౯౮)

స :- ఖుదా (లాశరీక్) అసమ్మిళితుడని ముసల్మానులు చెప్పుకొనుచున్నారే. ఈ సైన్యము నంతటి నెక్కడనుండి (శరీక్) సమ్మిళిత పఱచిరి? ఏమి? అన్యులకు శత్రువయినవాడు ఖుదాకు గూడ శత్రువా? అటులేని యది సరికాదు. ఏలయన నీశ్వరు డెవ్వనికిని శత్రువు కానేరడు. (౨౪)

౨౫. అల్లా దయతో దన కిష్టమైన వానిని ముఖ్యుని చేయుచున్నాడు.
(మం-౧-సి-౧-సూ-౨-ఆ-౧౦౫)

స :- ఏమి! ముఖ్యు డగుటకును, దయచూపబడుటకును యోగ్యుడు కానివానిని గూడ ప్రధానునిగా జేసి వానిపై దయచూపునా? అటులేని ఖుదా కడుగందరగోళము చేయువాడై యున్నాడు. ఏలయన నింక మంచి కార్యముల నెవడు చేయును? మఱి చెడుకార్యముల నెవడు మానును? ఏలయన గర్మఫలమును గాక ఖుదా ప్రసన్నతనే ముఖ్యమని భావించుచున్నారు. దీనివలన నందఱిప్రతిష్ఠకు హాని కలిగి కర్మోచ్ఛేదనము కాదొడగును. (౨౫)

౨౬. కాఫిరులు ఈర్ష్యచే మిమ్ములను "ఈమాన్" విశ్వాసము నుండి తొలగజేయ కుందురుగాక! వారియం దనేకులు విశ్వాసులకు స్నేహితులై యున్నారు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౧౦౯)

స :- ఇప్పుడు చూడుడు! మీ విశ్వాసమును కాఫిరులు తొలగింపకుందురుగాక, యని ఖుదాయే వారిని మేల్కొల్పుచున్నాడు. ఏమి! అతడు సర్వజ్ఞుడు కాడా! ఇట్టి మాటలు ఖుదావి కాజాలవు. (౨౬)

౨౭. మీరెటు ముఖము పెట్టిన నటు అల్లాముఖము కలదు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౧౧౫)

స :- ఈ మాట సత్యమేని ముసల్మానులు "కిబలా" పశ్చిమదిక్కునకు ముఖము నేల పెట్టు చున్నారు? మాకు కిబలా దిక్కునకే ముఖము నుంచవలయు ననునాజ్ఞ గలదందురేని యిష్టమైన దిక్కు నకును ముఖ ముంచవచ్చునను నాజ్ఞకూడ గలదు గద. ఏమి? ఒకమాట సత్యమై మఱొకటి యసత్య మగునా? అల్లాకు ముఖము కలదేని యది యన్నిదిక్కులకు నుండనేరదు. ఏమన నొకముఖ మొక దిక్కున కుండగలుగునే కాని యన్నిదిక్కులకు నెట్లుండగలుగును? కావున నిది యసంగతము. (౨౭)

౨౮. ఆకాశమును భూమిని ఉత్పన్నము చేయువాడగు నతడు దేనినయిన చేయగోరుచున్నప్పుడు అతనికి దానిని చేయవలసిన యగత్యముండదు. కాని 'కమ్ము' అని యనినంత మాత్రమున నది యగు చున్నది. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౧౧౭)

స :- సరి! 'కమ్ము' అని ఖుదా యాజ్ఞాపించినపు డాయాజ్ఞ నెవడు వినెను? అత డెవనికి వినిపించెను? మఱి యేమయ్యెను? ఏ కారణమునుబట్టి చేసెను? సృష్టికి బూర్వము ఖుదాకాక మఱి యేవస్తువును లేకయుండెనని వ్రాయుచున్నారే! ఈ సంసార మెక్కడనుండి రాగలిగెను? కారణములేక యేకార్యమును గానేరదేని యింత గొప్ప జగత్తు కారణములేక దేనినుండి తయారయ్యెను? ఇది కేవలము పసితనపు మాటయే. (పూర్వపక్షి) కాదుకాదు. ఖుదా యిచ్ఛనుండి (ఉత్తరపక్షి) ఏమి? మీ యిచ్ఛవలన నొక యీగకాలయినను గాగలదా? ఖుదా యిచ్ఛనుండియే యీజగత్తంతయు నయ్యె ననుచున్నారు. (పూర్వపక్షి) ఖుదా సర్వశక్తిమంతుడు గనుక గోరినదానిని జేసివేయుచున్నాడు. (ఉత్తరపక్షి) సర్వశక్తిమంతుడనగా నర్థమేమి? (పూర్వపక్షి) కోరినదాని జేయగలవాడు. (ఉత్తరపక్షి) ఖుదా మఱియొక ఖుదాను గూడజేయగలడా? తనంతట దానే చావగలడా? అటులే మూర్ఖుడును, రోగియు నజ్ఞానియు గాగలడా? (పూర్వపక్షి) ఇటు లెన్నడును గాజాలడు. (ఉత్తరపక్షి) అందుకే పరమేశ్వరుడు తన, యితరుల గుణకర్మ స్వభావములకు విరుద్ధముగ నేమియు జేయజాలడు. సంసారమున నొక వస్తువు గలుగుటకును గలుగ జేయుటకు మొదట మూడు పదార్థము లుండి తీఱవలయును :- ఒకటి కుండను జేయువాడు కుమ్మరివాడు. రెండవది :- ఘటము చేయుటకు మన్ను, మూడవది :- దేనిచే నా ఘటము చేయబడునో యాసాధనము. కుమ్మరివాడు, మన్ను, సాధనములు వీనిచే ఘటము తయారగును. ఆ చేయబడు ఘటమునకు బూర్వమున జగత్కారణం బగు ప్రకృతియు, వాని గుణకర్మ స్వభావములును, ననాదులే కావున నీ ఖురానునందు జెప్పబడినది సర్వదా యసంభవము. (౨౭)

౨౮. మేము లోకులకొఱకు 'కాబా' అను పవిత్ర స్థానమును సుఖకరముగా చేసియున్నాము. మీరు నమాజుకొఱకు ఇబ్రహీము స్థానమును గైకొనుడు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ- ౧౨౫)

స :- ఖుదా కాబాకు బూర్వ మొక పవిత్రస్థానమును జేయకయే యుండెనా? చేసెనన్న కాబాను మరల చేయవలసిన యావశ్యక మేమియు లేకయుండెను. చేయలే దందురేని పూర్వోత్పన్నులను బవిత్రస్థానము లేకయే యుంచియుండెనా? మొదట నీశ్వరునకు బవిత్రస్థానము చేయవలయునను స్మరణము లేకుండవచ్చును. (౨౮)

౩౦.ఇబ్రహీము 'దీన్'మతమునుండి విముఖులగు మనుష్యు లెవరు కాని తన జీవనమును మూర్ఖ మైనదిగా చేసికొన్న వాడు గాక ఇబ్రహీం మతమునకు విముఖుడగు మనుష్యుడెవడో వానినే ప్రపంచమందు నిశ్చయముగ మేము మెచ్చితిమి. నిశ్చయముగ పరమందు వాడే ధర్మాత్ముడు. (మం-౧-సి-౧-సూ-౨-ఆ-౧౩౦)

స :- ఇబ్రహీము మతము నొప్పని వారందఱు మూర్ఖులనుట సంభవమగునా? ఇబ్రహీమునే ఖుదా మెచ్చుకొనెనన్న దీనికి గారణమేమి? ధర్మాత్ముడైనందున మెచ్చెనన్న ధర్మాత్ములింక నెందఱో కావచ్చును. ధర్మాత్ముడు కాకున్నను మెచ్చుకొనెనేని యన్యాయ మయ్యెను. ధర్మాత్ముడే యీశ్వరునకు బ్రియుడగు ననుట మాత్ర ముచితమే కాని ధర్మహీను డగుననుట యుచితము గాదు. (౩౦)

౩౧. నిశ్చయముగ మేము నీ ముఖము నాకసమున దిరుగుచున్నట్లు చూచుచున్నాము. అవశ్యముగ మేము నిన్నా కిబలా దిక్కునకు ద్రిప్పుదుము. దానిని మెచ్చుకొందువుగాక. కావున నీముఖమును మస్జిదు హ్రారాం దిక్కునకు ద్రిప్పుము. మీరెక్కడనున్నను మీముఖము నావైపునకు ద్రిప్పుకొనుడు.
(మం-౧-సి-౨-సూ-౨-ఆ-౧౪౪)

స :- ఏమి? ఇది చిన్న విగ్రహారాధనమా? కాదు పెద్దదే. (పూర్వపక్షి) ముసల్మానుల మను మేము (బుత్పురస్త్) విగ్రహారాధకులము కాము కాని (బుశ్శికన్) విగ్రహ భంజకులము. ఏలయన మేము కిబలాను ఖుదా యనుకొనము. (ఉత్తరపక్షి) మీరెవరిని విగ్రహారాధకు లనుచున్నారో వారు కూడ నావిగ్రహముల నీశ్వ

రుడని యనుకొనరు. కాని వానియెదుట నాపరమేశ్వరుని భజించుచున్నారు. మఱి మీరు విగ్రహభంజకు లేని ఆ మస్జిదుకిబలా అను పెద్ద విగ్రహము నెందుకు బడద్రోయలేదు? (పూర్వపక్షి) ఏమండీ! కిబలా దిక్కునకు ముఖముంచ వలయునను నాజ్ఞ మాకు ఖురానున గలదు గాని వీరల కట్లు వేదమందు నాజ్ఞ లేదు. కావున వీరు విగ్రహారాధకులేలగారు? మేమెట్లగుదుము? ఏలయన ఖుదా యాజ్ఞను బాలించుట యావశ్యకమే కద. (ఉత్తరపక్షి) మీకు ఖురానునం దాజ్ఞ యున్నట్లు వీరికి బురాణములం దాజ్ఞ కలదు. మీరు కురానును (ఖుదా) దేవవాక్యమని భావించుచున్నట్టు లీపౌరాణికులు ఖుదా యవతారమును వ్యాసులవారు రచించిన పురాణములను దేవవాక్యములని భావించుచున్నారు. మీయందు వీరియందును (బుత్పురస్తీ) విగ్రహారాధనమందు భేద మేమియు లేదు. కాని మీరు పెద్దవిగ్రహారాధకులు వీరు చిన్నవిగ్రహారాధకు లగు దురు. ఏమన నొకానొక మనుష్యుడు తనయింట బ్రవేశించిన పిల్లిని దొలగింపగా నింతలో లొట్టపిట్ట బ్రవే శించె నన్నట్లు మహమ్మదుసాహెబుచిన్న విగ్రహా రాధనమును ముసల్మానులలో నుండి తొలగించెను. కాని పర్వతము వంటి మక్కామసీదను పెద్ద విగ్రహ మును నతడు ముసల్మానుల మతమందు బ్రవేశింపజేసెనే! ఏమి? ఇది చిన్న విగ్రహారాధనమా? కాబట్టి మేము వైదికులమై యున్నట్లు మీరుకూడ వైదికులగుదురేని యావిగ్రహారాధనము మొదలగు దోష ములనుండి తొలగి యుండగలుగుదురు. లేనిచో దొలగియుండ నేరరు. మీరు మీ యీ పెద్ద విగ్రహారాధన మును దూరము చేసికొన నంతవఱకు నితరములగు చిన్న విగ్రహారాధకుల ఖండనమునకు సిగ్గుపడి దాని నుండి దూరమై పవిత్రులు కాదగును. (౩౦)

౩౨. ఎవరు అల్లా మార్గమున జంపబడుచున్నారో వారు మృతి నొందిరని తలపకుడు. వారు జీవితులే. (మం-౧-సి-౨-సూ-౨-ఆ-౧౫౪)

స :- సరి! ఈశ్వర మార్గమందు జచ్చుటకు గాని చంపుటకు గాని యావశ్యక మేమికలదు? ఈ మాట తమ ప్రయోజనమును సిద్ధింప జేసికొనుటకే యని యెందుకు జెప్పరు? అనగా నిట్టి లోభమును గనబఱచితిమేని లోకులు బాగుగా బోట్లాడగలుగుదురు. తమకు విజయము కలుగును. చంపుటకును వెఱవకుందురు. దోపిడి చేయించుటవలన నైశ్వర్యము లభించును. అటుపిమ్మట విషయానందము బడయవచ్చును. అను నిట్టి తమ ప్రయోజనములు సిద్ధించుననియే కద యీ విపరీతములు కల్పించి యున్నారు. (౩౨)

౩౩. అల్లా కఠినదుఃఖము గలుగజేయువాడయి యున్నాడు. సైతాను ననుసరించి చనకుడు. నిశ్చ యముగ నతడు మీకు ప్రత్యక్ష శత్రువు. చెఱుపును సిగ్గుమాలిన పనులను చేయుటకు దప్ప మఱేమియు నాజ్ఞాపింపడు.ఇక మీరు అల్లాపైన వేసియే యెఱుగుమని చెప్పుడు. (మం-౧-సి-౨-సూ-౨-ఆ-౧౬౫, ౧౬౭, ౧౬౮)

స :- ఏమి? దయాళువయిన ఖుదా పాపాత్ములకును బుణ్యాత్ములకును గూడ గఠిన దుఃఖమును గలుగ జేయునా? లేక ముసల్మానుల మీద దయగలిగి యన్యులమీద దయలేనివాడయి యున్నాడా? అటులయినచో నత డీశ్వరుడే కాజాలడు. ఇంక బక్షపాతము చేయడేని యెవ డెక్కడ మున్నవేమి? ధర్మము చేయువాని మీద నా యీశ్వరుడు దయకలవాడు, నధర్మము చేయువానిని శిక్షించువాడు నగును. అటులయిన నడుమ మహమ్మదుసాహెబును గాని ఖురానునుగాని, నమ్మవలసిన యావశ్యకమే యుండదు. మఱి మనుష్యమాత్రులకు శత్రువు (సైతాను) అందఱకు గీడు గలుగజేయు చున్నాడన్న నాసైతానును ఖుదా పుట్టించుట యెందులకు? అతడు భవిష్యద్వార్తల దెలియకుండెనా? తెలియుచునే యుండెను. కాని పరీక్షించుటకు బుట్టించెనన్నను సరిగాదు. ఏమన బరీక్షించుట యల్పజ్ఞుని పని. సర్వజ్ఞుడగువాడు యథార్థముగ జీవులందఱి మంచిచెడు కర్మములు సర్వదా తెలిసికొనుచునే యున్నాడు. సైతా నందఱను

భ్రమింప జేయునన్న నా సైతాను నెవడు భ్రమింపజేసెను? సైతాను స్వయముగ మార్గభ్రష్టు డయ్యె నందురేని యితరులు కూడ దమంతట దామే మార్గభ్రష్టు లగుదు రనవచ్చునుగదా! నడుమ సైతా నావశ్య కమేమి? ఖుదాయే సైతానును భ్రమింపజేసెనేని యాఖుదా సైతానును మించిన సైతానగును. కాన నిది యీశ్వరవాక్యము కాజాలదు. ఇంక నెవ్వడేకాని దుస్సంగతి, యజ్ఞానము ననువీనిచే దప్పక భ్రాంతిలో బడుచున్నాడనుట స్పష్టము.(౩౩)

౩౪. (ముర్దారు) శవము. పందిమాంసము, రక్తము మీకు అభక్ష్యములు (హరాము). అల్లా మీద గాక మఱొకనిమీద బిలువబడునదియును హరామే. (మం-౧.సి-౨.పూ-౨ ఆ. ౧౭౩)

స :- ఇట విచారింపవలసియున్న దేమన దేహి తనంతట దా జచ్చిననేమి, యొకనిచే జంప బడిననేమి? ఈ రెండు విధముల నది (ముర్దారే) పీనుగే యగునుగద! ఇంక వీనియందు గొంత భేదము న్నను, మృతకత్వమందు మాత్రము భేద మేమియు లేదు. ఒక పంది మాంసమే నిషేధింపబడెనేని మనుష్యుని మాంసము దినవచ్చునా? పరమేశ్వరుని పేరుమీద శత్రువులు మొదలగువారి కత్యంత దుఃఖము గలుగజేయుచు బ్రాణహత్య చేయుట మంచిదేనా? దీనివలన నీశ్వరనామమునకు గళంకము కలుగు చున్నది. మంచిది. "పూర్వజన్మ" మందలి యపరాధములే లేనపుడు దారుణముగ దుఃఖము నీశ్వరుడు ముసల్మానుల కెందులకు గలుగజేసెను. వారిమీద దయగలవాడు కాడా? వారిని బుత్రులవలె నెంచడా? మహోపకార మొనర్చు నావు మున్నగు పశువుల వధింపగూడదని నిషేధింపక పోవుటవలన నాఖుదా హత్యలు చేయించుచు జగత్తునకు హాని కలుగజేయువాడై యున్నాడనుట స్పష్టము. ఇక హింసారూప పాపముచే గలంకితుడు నగుచున్నాడు. ఇట్టి మాటలు ఖుదావి కాని ఖుదా పుస్తకమందలివిగాని యెన్నటికిని గాజాలవు. (౩౪)

౩౫. (రోజాలు) ఉపవాస దినములు మీకు హలాలు. మీ స్త్రీలతో మదనోత్సవము జరుపుడు. వారు మీకు పర్దా (తెర) గాను మీరు వారికి పర్దా (తెర)గాను నున్నారు. మీరు దొంగతనము చేయుచున్నారు. అనగా వ్యభిచరించుచున్నారని యల్లాకు దెలిసెను. కాని అల్లా మిమ్ముల క్షమించెను. వారితో గలియుడు. నల్లదారము తెల్లగా నగపడు వఱకుగాని రాత్రి గడచి దినము ప్రకటమగువఱకు గాని అల్లా మీకొఱకు వ్రాసినదానిని (సంతానమును) వెదకుడు, తినుడు, త్రాగుడు. (మం-౧-సి-౨-సూ-౨-ఆ-౧౮౭)

స :- ముసల్మానుల మతము కొనసాగినపుడో లేక యంతకు బూర్వమో యొకానొక డొక పౌరాణి కునితో నొకనెలవఱకు జరుపబడు చాంద్రాయణవ్రతవిధి యెట్లని యడిగి యుండవచ్చును. అతడు చంద్రునికళ హెచ్చుతగ్గులు చెందునట్లు కబళముల నెక్కువగను దక్కువగను, జేయుచు మధ్యాహ్న సమయమందే తినదగునని వ్రాయబడియున్న శాస్త్ర విధిని దెలిసికొనలేక, చంద్రుని దర్శనము చేసికొని తినవలెనని చెప్పి యుండవచ్చును. దానిని ముసల్మాను లీప్రకారముగ నర్థము జేసికొనిరి. ఇక వ్రతదిన మందు స్త్రీ సమాగమము కూడదని యుండగా మీరు నిరాటంకముగా స్త్రీలతో సమాగమము చేయుడ నియు రాత్రులం దిష్టమైనన్ని సార్లు తినుడనియు, ఖుదా యీ మాట నొకదానిని విశేషముగా జెప్పి యున్నాడుగా! సరి యిది యొకవ్రతమా? దినమందు దినుట లేదుగాని రాత్రియందు దినుచున్నారు. ఇట్లు దినమందు దినక రాత్రియందు దినుట సృష్టిక్రమమునకు విరుద్ధము. (౩౫)

౩౬. అల్లా మార్గమున మీతో బోట్లాడువారితో బోట్లాడుడు. మీరు వారిని దొరికినచోట చంపి వేయుడు. "కతల్" నఱికి వేయుటకంటె "కుఫ్ర్" పాపము చెడ్డది. కుఫ్ర్ దూరమయి అల్లామతము (దీన్) స్థిరపడువఱకు పోట్లాడుడు. మీయెడ వారు చేసినన్ని యత్యాచారములు మీరు వారియెడ జేయుడు. (మం-౧-సి-౨-సూ-౨-ఆ-౧౯౦, ౧౯౧, ౧౯౩, ౧౯౪)

స :- ఖురానునం దిట్టి మాటలు వ్రాయబడకున్న ముసల్మాను లన్యమతస్థులయెడ నంతటి గొప్ప యత్యాచారములు చేసియుండరుగద! అపరాధము లేనివారిని జంపుట వారికి గొప్పపాపమే. ముసల్మానుల మతమును స్వీకరింపక పోవుటయే కుఫ్ర్ అగుచున్నది. అనగా, నీ ముసల్మానులు కుఫ్ర్ (పాపము) కంటె "కతల్" (చంపుట) మంచిదని తలచుచున్నారు. మా దీన్ మతమును నమ్మని వారిని మేము చంపుదుమని దానిని జేయుచునే వచ్చిరి. వీరు మతమును గుఱించి పోట్లాడుచు బోట్లాడుచు దామే రాజ్యాదుల బోగొట్టు కొని నశించిరి. ఇంక వీరి మత మన్యమతస్థులయెడ నతికఠోరముగ వర్తించుచున్నది. దొంగతనమునకు బదులు దొంగతనమేనా? దొంగలు, మున్నగు వారు మాకెంతటి యపకారము చేయుచున్నారో మేము కూడ నట్లే దొంగతనమునే చేయవలయునా? ఇది నితాంతముగ నన్యాయమే కద! ఒక యజ్ఞాని మమ్ము దిట్టినవేళ మేముకూడ దిట్టవలయునా? ఈ మాట యీశ్వరునిది కాని యీశ్వర భక్తుడగు నొక విద్వాంసు నిది కాని యీశ్వరోక్త పుస్తకమందలిది కాని కాజాలదు. ఇది కేవల మొకస్వార్థి జ్ఞానవిహీనుడు నగు మనుష్యుని మాటయే. (౩౬)

౩౭. అల్లా కలహముతో మైత్రిచేయడు. విశ్వాసులారా! ఇసలామునందు ప్రవేశింపుడు.

(మం-౧-సి-౨-సూ-౨-ఆ-౨౦౫, ౨౦౮)

స :- కలహమును ఖుదా మిత్రముగా నెంచడేని కలహించుటకు స్వయముగా ముసల్మానుల నేల ప్రేరేపించుచున్నాడు? పోట్లాడు స్వభావము గల ముసల్మానులతో మిత్రత్వము నెందులకు చేయుచు న్నాడు? ముసల్మానుల మతములో జేరుటచేతనే ఖుదా సమ్మతించునన్న నతడు ముసల్మానులకు బక్ష పాతియా యేమి? సమస్త ప్రపంచమున కతడీశ్వరుడు కాడా? దీనివలన 'ఖురాను' ఈశ్వరకృతము కాదు. అందు జెప్పబడినవా డీశ్వరుడును గానేరడు. (౩౭)

౩౮. ఖుదా ఇయ్యగోరినవాని కనంతాహారపదార్థము లిచ్చును.

(మం-౧-సి-౨-సూ-౨-ఆ-౨౧౨)

స :- పాపపుణ్యములు లేకున్నను ఖుదా యిటులే యాహారపదార్థముల నొసంగునా? అటులేని మేలుకీడుల నొనరించుట సమాన మయ్యెను. ఏలయన సుఖదుఃఖము లతని యిష్టప్రకారమే లభించు నుగా! దీనినుండియే కద ముసల్మానులు ధర్మవిముఖులయి యిష్టానుసారముగ వర్తించుచున్నారు. కాని యొకానొక రీఖురానును విశ్వసింపక ధర్మాత్ములు నగుచున్నారు. (౩౮)

౩౯. నిన్ను ప్రశ్నింతురు. రజస్వలయైన స్త్రీతో "నీవు మాలిన్యముతో గూడియున్నావు" అని చెప్పుము. ఋతుసమయమందు తొలగియుండుడు. వారు మాలిన్యమునుండి దూరము కానంతవఱకు వారికడకు పోకుడు. జలక మాడినపుడు వారికడకు ఆ స్థానమునకు జనుడు. ఖుదా ఆజ్ఞ ఇచ్చి యున్నాడు. మీ స్త్రీలు మీకు పొలములవంటివారు. కాన నిష్టమైనట్లు తమ పొలములకు జనుడు. మిమ్ములను అల్లా (లగబు) వ్యర్థశపథమందు పట్టుకొనడు. (మం-౧-సి-౨-సూ-౨-ఆ-౨౨౨, ౨౨౩, ౨౨౫)

స :- రజస్వలను దాకుటయు గూడుటయు దగదని వ్రాయుట మంచిదే. కాని స్త్రీలను బొలము వంటివారనియు వారితో నిష్టమైనట్లు వర్తింపుడనియు వ్రాయుట మనుష్యులను విషయలంపటులుగా జేయుటకు గారణమై యున్నది. ఖుదా వ్యర్థశపథములు చేసిన బట్టుకొనడేని యందఱు నబద్ధము బలుక గలుగుదురు. శపథమును భంగపఱుపగలరు. దీనివలన ఖుదా యబద్ధమును బ్రవర్తింపజేసినవాడగును. (౩౯)

౪౦. అల్లాకు ఋణమిచ్చు మనుష్యుడెవడు? మంచిది. కానిండు. అల్లా వానికి తన్నిమిత్తము రెండింతలు కలుగజేయును. (మం-౧-సి-౨-సూ-౨-ఆ-౨౪౫)

స :- భళీ! ఖుదాకు నప్పు (ఉద్దెర) *పుచ్చుకొనవలసిన యావశ్యకమేమి? సమస్త ప్రపంచమును రచించినవాడు మనుష్యునినుండి యప్పుతీసికొనుచున్నాడా? ఇది యెన్నటికిని సంభవింపదు. ఎఱుగని వారు చెప్పవలసినదే. ఏమన నతని కోశము రిక్తమై యుండెనా? ఋణము పుచ్చుకొన నుద్యుక్తుడయ్యె ననుటకు నతడు హుండీలు చెల్లించుచు వ్యాపారాది వ్యవహారములందు దగులుకొని యున్నందున నష్టపడి యుండెనా యేమి? ఒకటికి రెండింత లీయ స్వీకరించుచున్నాడు. ఇది సాహుకారులవంటి పనియా?

ఐనను నిట్టిపని దివాలాదీయువారును నధికముగ వ్యయపఱచువారును న్యూనాదాయము కలవారును జేయవలసినదే కాని యీశ్వరుడు గాదు. (౫౦)

౫౧. వారిలో నొకానొకనికి "ఈమాన్" విశ్వాసము కుదిరెను. మఱొకడు 'కాఫిరు' అయ్యెను. అల్లా కిష్టమైయున్న కొట్లాడక యుందురు. అల్లా తన కిష్టమైనదానిని జేయుచున్నాడు.

(మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౫౩)

స :- ఏమి? జరిగెడు యుద్ధ మీశ్వరేచ్ఛవలననే జరుగుచుండునా? అతడధర్మ మొనరింప గోరిన నొనరింపగలడా? అటులయిన నతడీశ్వరుడే కాడు. ఏలయన నిట్లు శాంతిభంగము కలుగజేసి యుద్ధము జేయించుట సజ్జనుల పనికాదు. దీనివలన నీ 'ఖురాన్' ఈశ్వరనిర్మితము కాదు. ఒక ధార్మిక విద్వాంసునిచే రచింపబడినదియు గాదని స్పష్టమగుచున్నది. (౫౧)

౫౨. ఆకాశమందు భూమియందు నున్నదంతయు నతనికొఱకే యున్నది. అతని (కురిబీ) భూమ్యాకాశముల నాక్రమించుకొన్నది. (మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౫౫)

స :- భూమ్యాకాశములయందుగల పదార్థములనన్నిటిని బరమాత్ముడు జీవులకొఱకు బుట్టించి యున్నాడేకాని తనకొఱకు గాదు. ఏమన నతడు పూర్ణకాముడు గావున నతనికొక పదార్థాపేక్ష లేదు. అతనికి కురిబీ కలదేని యత డేకదేశీయు డగును. ఏకదేశీయు డయినవా డీశ్వరు డనబడనేరడు. ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. (౫౨)

౫౩. అల్లా సూర్యుని దూర్పుదిక్కునుండి తెచ్చుచున్నాడు. కావున నీవు పడమర దిక్కునుండి తీసికొనిరమ్ము. అప్పుడు కాఫిరు చిక్కులబడెను. అల్లా పాపులకు నిశ్చయముగ మార్గము జూపడు.

(మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౫౮)

స :- ఈ యజ్ఞానయుక్తమగు విషయమును గమనింపుడు. సూర్యుడొకప్పుడైనను దూర్పునుండి పడమరకుగాని పడమరనుండి తూర్పునకు గాని వచ్చుట పోవుట లేదు. కాని యతడు తన పరిధియందు మాత్రము దిరుగుచుండును. దీనివలన ఖురానును రచియించిన వానికి ఖగోళవిద్యగాని, భూగోళవిద్యగాని యెంతమాత్రము తెలియక యుండెననియే నిశ్చయమగుచున్నది. పాపులకు మార్గము జూపడేని యీ మునల్మానుల ఖుదా యావశ్యకత పుణ్యాత్ములకును లేదు. ఏమన ధర్మాత్ములు ధర్మ మార్గమందే నడతురు. కావున మార్గము జూపవలసిన యావశ్యకము ధర్మము దప్పినవారికే కలదు. కాబట్టి తన కర్తవ్యమును బాలింపనందున ఖురాను చేసినవానిది గొప్ప పొరపాటనియే విదిత మగుచున్నది. (౫౩)

---

* ఈ ఆయతు భాష్యమందు 'తఫసీర్ హుసేనీ' లో నిట్లు వ్రాయబడెను. ఒక మనుష్యుడు మహమ్మదు సాహెబు దగ్గఱకు వచ్చి ఓ రసూలల్లాహ! ఖుదా అప్పుగానిమ్మని యెందులకు నడుగుచున్నాడని యనెను. మిమ్ము స్వర్గమునకు దీసికొని పోవుటకని వారుత్తర మిచ్చిరి. అతడు మీరు జామీనున్న నిత్తు ననెను. మహమ్మదుసాహెబు జామీ నుండెను. దేవుని ('ఖుదా') యందు విశ్వాసము కలుగలేదు. కాని యతని దూతయందు గలిగినది.

౪౪. పశువులలో నుండి నాలుగింటిని తీసికొనుము. వాని ముఖములు జ్ఞప్తిలో నుంచుకొనుము. ప్రతిపర్వతముమీద వానియొక్కొక్క ముక్కను పెట్టియుంచుము. తిరిగి వాని బిలువుము. నీయొద్దకు బరుగెత్తుచు వచ్చునవి. (మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౬౦)

స :- మేల్మేలుః ముసల్మానుల ఖుదా భానుమతివింతలు చేయుచున్నాడు. ఖుదా ఖుదాతన మిటువంటి కార్యములవలననే బోధపడునా ఏమి? బుద్ధిమంతు లిట్టి ఖుదాకు తిలాంజలి యిచ్చి దూర ముగా నుందురు. కాని మూర్ఖులు మాత్రము చిక్కిపోదురు. ఇంక దీనివలన ఖుదా గౌరవమునకు హాని కలిగి యతడు చెఱుపునకు బాత్రుడగును. (౪౪)

౪౫. ఇష్టమయిన వానికి నీతి నొసంగుచున్నాడు. (మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౬౯)

స :- ఇష్టమయినవానికి నీతి నొసంగుచున్నాడేని ఇష్టము కాని వానికి ననీతి నొసంగుచుండవచ్చును గద. ఇది యీశ్వరత్వపు మాటకాదు. కావున బక్షపాతము వదలి యందఱకు నీతితోఁగూడిన యుపదేశము జేయు వాఁడీశ్వరుడు. అతడే యెప్పుడును గాగలడు కాని యన్యుడు కానేరడు. (౪౫)

౪౬. కపటులైనవారు గోరీలలోనే యుందురు. (మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౭౫)

స :- వారు గోరీలలోనే పడియుందురా? వారట్లు ఎంతకాలముందురు? ఇట్టి యసంభవమగు వ్రాతలు ఈశ్వరుని పుస్తకములో నుండజాలవు. బాలబుద్ధులకు తగును. (౪౬)

౪౭. అత డిష్టమయిన వానిని క్షమించును. ఇష్టమయిన వానిని దండించును. ఏమన నతడన్ని వస్తువులను లోబఱచుకొని యున్నాడు. (మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౮౪)

స :- ఏమి? క్షమింపబడుటకు యోగ్యుడగువానిని క్షమింపక క్షమింపబడుటకు యోగ్యుడు కాని వానిని క్షమించుట యన్యాయకారియగు రాజు పని వంటిది కాదా? ఈశ్వరు డిష్టమయినవానిని బాపాత్ముడుగనో, పుణ్యాత్ముడుగనో చేయునన్న జీవులకు బాపపుణ్యముల నారోపింపగూడదు. ఈశ్వరుడే వారి నట్లు చేసినప్పుడు జీవులకు సుఖదుఃఖములు గలుగగూడదు. సేనాపతి యాజ్ఞచే నొకభృత్యు డొకని జంపినను, రక్షించినను దత్ఫలము ననుభవించువా డతడు కానటులే వారును కారాదు. (౪౭)

౪౮. అల్లా ప్రవాహరూప నదులతో గూడిన స్వర్గముల నేర్పఱచి యున్నాడు. అల్లా యనుగ్రహము వలన నందెల్లప్పుడు పవిత్రమయిన (బీబీలు) స్త్రీ లుందురు. మానవులతో గలిసి అల్లా వారిని జూచుచుండును. పరహేజగారుల కింతకంటె మంచివార్త నేమి సూచింతు ననిచెప్పుము.

(మం-౧-సి-౩-సూ-౩-ఆ-౧౪)

స :- మేలు. ఇది స్వర్గమా? లేక వేశ్యాలయమా? ఇతనిని నీశ్వరు డనవలయునా? లేక స్త్రైణు డనవలయునా? ఏబుద్ధిమంతుడైన నిట్టి మాటలతో గూడిన పుస్తకమును బరమేశ్వర రచితమని నమ్మగలడా? ఇతడు పక్షపాతము నేలచేయుచున్నాడో! స్వర్గమున సదా బీబీలుందురన్న వారిక్కడ బుట్టి యక్కడకి బోయియున్నారా! లేక యక్కడనే పుట్టిరా? ఇక్కడనే పుట్టి యక్కడకు బోయిరన్న (కయామత్) అను ప్రళయ రాత్రిగాకుండుటకు బూర్వమే యాబీబీల నచ్చటకు రప్పించుకొని వారి భర్త్రాదుల రప్పించుకొనలే దెందులకు? కయామత్ రాత్రియందే యందఱి న్యాయవిమర్శన మగునను నియమము నేల తప్పెను? ఇక వారక్కడనే పుట్టిరన్న కయామతు వఱకు వారెట్లు నిర్వాహము జేసికొన గలుగుదురు? వారికి బురుషులు కూడ గలరందురేని యిక్కడనుండి స్వర్గమునకు బోవు ముసల్మానులకు మఱి యా ఖుదా బీబీల నెక్కడనుండి యియ్యగలుగును? స్వర్గమున నెల్లప్పుడుండు బీబీలను జేసినట్లు, పురుషుల నక్కడ సర్వదా యుండున ట్లేలచేయలేదు? కావున ముసల్మానుల ఖుదా యన్యాయకారియు, నవివేకియు నైయున్నాడు. (౪౮)

౪౯. దీన్ యిస్లాం అనునది నిశ్చయముగ నల్లాపరముగ నున్నయది. (మం-౧-సి-౩-సూ-౩-ఆ-౧౮)

స :- ఏమి అల్లా ముసల్మానులకేనా? అన్యులకు గాడా? పదుమూడు వందల వత్సరములకు బూర్వ మీశ్వరీయమతమే లేకయుండెనా? కాబట్టి యీ ఖురాను ఈశ్వరునిచే రచియింపబడినది కాదు. కాని యొకపక్షపాతముగల పురుషునిచే రచియింపబడిన దనుట నిక్కము. (౪౯)

౫౦. ప్రతి జీవున కత డార్జించినంత పూర్తిగ నీబడును. వారి కన్యాయము చేయబడదు. ఓఅల్లా! జగత్తున కధిపతివి నీవే. ఇష్టమయిన దాని నొసంగుచున్నాడవు. ఇష్టమైన వాని దోచుకొనుచున్నాడవు. ఇష్టమయిన వానికి బ్రతిష్ఠను కలుగజేయుచున్నాడవు. ఇష్టమైన వాని కప్రతిష్ఠ కలుగజేయు చున్నాడవు. అంతయు నీచేతనే యున్నది. ప్రతివస్తువుపై నీయధికారమే కలదు అని చెప్పుము. రాత్రిని దినమందును దినమును రాత్రియందును జొప్పించుచున్నాడవు. మృతకుని జీవితునిగాను జీవితుని మృతునిగాను జేయు చున్నాడవు. ఇష్టమైనవాని కపారముగ నన్నము నొసంగుచున్నాడవు. ముసల్మానులతో దప్ప కాఫిరులతో ముసల్మానులు స్నేహము చేయగూడదు. అట్లు చేసినవాడు అల్లాపక్షపువాడు గాకుండును. మీ రల్లాను గోరువారేని నాపక్షముండుడు. అల్లా మిమ్ముల మెచ్చుకొనును. మీ పాపముల క్షమించును. నిశ్చయముగ నతడు దయగలవా డనిచెప్పుము. (మం-౧-సి-౩-సూ-౩-ఆ-౨౪-౨౭,౩౦)

స :- ప్రతి జీవునకు గర్మఫలము పూర్తిగ నీబడునపుడు క్షమింపబడనేరరు. క్షమింపబడుదురన్న ఫలము పూర్తిగ నీబడకపోవును. అన్యాయమే యగుననుట స్పష్టము. ఉత్తమ కర్మముల జేయకున్న నొక నికి రాజ్యమొసంగినచో నన్యాయకారియే యగును. సరి! జీవితుని మృతునిగాను మృతుని జీవితునిగాను జేయుట యెన్నడయిన సంభవమగునా? ఏమన నీశ్వరుని వ్యవస్థ యచ్ఛేద్యము నభేద్యమై యున్నయది. కావున నదెప్పుడును నస్తవ్యస్తము కానేరదు. ఇక బక్షపాతముగల మాటలు చూడుడు. ముసల్మానుల మత మందు లేనివారలు కాఫిరులనుటయు వారిలో నున్న దుష్టులతో గూడ స్నేహము చేయవలయుననియు నుపదేశము చేయుట యీశ్వరుని యీశ్వరత్వమును రద్దుపఱచుచున్నది. దీనివలన 'ఖురాను' ఈఖురాను చెప్పిన ఖుదా ముసల్మానుల కేవలపక్షపాతముతో గూడిన యవిద్యలో మునిగియున్న వారలు. కాబట్టి ముసల్మాను లంధకారములో బడియున్నారు. ఇక మీరు నా పక్షముననుండిన ఖుదా మీపక్ష మగుననియు పక్షపాతముతో మీరు పాపమొనరించినను దానిని క్షమించుననియు బోధించిన మహమ్మదుసాహెబు లీలలను గనుగొనుడు. దీనివలన మహమ్మదుసాహెబు యొక్క యంతఃకరణము పవిత్రముగ లేకుండెననియే సిద్ధ మగుచున్నది. కావున దనయభిమతము దీర్చుకొనుటకే మహమ్మదుసాహెబు ఖురానును రచించెననియో లేదా రచింపజేసెననియో విదిత మగుచున్నది. (౫౦)

౫౧. ఓ మరియమా! అల్లా నిన్ను మెచ్చుకొనెను. జగత్తులోని స్త్రీలకంటె నిన్ను పవిత్రురాలుగా జేసెను. అని ఫరిశ్తాలన్న సమయమున (మం-౧-సి-౩-సూ-౩-ఆ-౪౧)

స :- ఔరా! ఇక్కాలమందు ఖుదా కాని ఖుదాఫరిశ్తాలుగాని యొకరితో మాటలాడ రానపుడు పూర్వ మెట్లు రాగలిగిరో గదా! అక్కాలపు మనుష్యులు పుణ్యాత్ములయి యుండిరి. ఇప్పటివారు పుణ్యాత్ములు గారని యందురేని యీమాట మిథ్యయే. ఏమన గ్రైస్తవమతముగాని మహమ్మదీయ మతముగాని ప్రచలిత మయినపు డాదేశములందు విద్యావిహీనులు ననాగరికులు నధికముగ నున్నందున నిట్టి విద్యావిరుద్ధములగు మతములు స్థిరపడగలిగినవి. ఇప్పుడో విద్యావంతు లెక్కువయినందున సాగనేరవు. ఇప్పుడు, విద్వాంసు లధికముగ నున్నందున నిట్టివట్టి మతములు స్థిరపడి వృద్ధి బొందనేరవు. మఱియు నస్తమించుచున్న వనుటమాత్రము నిక్కము. (౫౧)

౫౨. దానిని ‘కమ్ము’ అని యనగా నది యగుచున్నది. కాఫిరులు మోసము చేసిరి. ఈశ్వరుడు మోసము చేసెను. ఈశ్వరుడు గొప్ప మోసగాడయి యున్నాడు. (మం-౧-సి-౩-సూ-౩-ఆ-౪౬,౫౩)

స :- ముసల్మానులు ఖుదావినా మఱొక వస్తువే లేకుండెనని నమ్ముచున్నప్పు డాఖుదా యెవరితో ననియుండెను? అత డనుటవలన నేమి కాగలిగెను? దీనికి ముసల్మాను లేడు జన్మములందు నుత్తర మీజా లరు. ఏలయన నుపాదానకారణ ముండకున్న గార్య మెన్నటికిని గలుగనేరదు. కారణముండక కార్యము కలిగెనన్న దనకు దల్లిదండ్రులే యుండక తన శరీర మేర్పడెనన్న ట్లగును. ఈశ్వరు డెన్నడును మోసపోవు వాడు కాడు. మోసమును జేయడు. ఈశ్వరుడు మోసము చేయుననుట సంభవమగునా? ఒక సత్పురుషు డయిన నట్టిపని చేయబూనడు గదా! (౫౨)

౫౩. అల్లా మీకు మూడువేల ఫరిశ్తాలతో సాహాయ్యము చేయును. ఏమి మీకిది చాలదా?
(మం-౧-సి-౪-సూ-౩-ఆ-౧౨౩)

స :- మూడువేల ఫరిశ్తాలతో ముసల్మానులకు సాహాయ్యము చేయునట. ఇప్పుడు ముసల్మానుల రాజ్యము చాలనష్టమై పోయినది. ఉన్నదికూడ నష్టమే యగుచున్నది. మఱి సాహాయ్యము చేయుట లేదెందులకు? కావున నిది కేవలము ప్రలోభనము కలుగజేసి మూర్ఖులను దమవలలో జిక్కించుకొనుటకు బన్నిన గొప్ప యన్యాయముతో గూడిన తంత్రమే. (౫౩)

౫౪. మఱి కాఫిరుల విషయమున మాకు సాహాయ్య మొసంగుము. మీరు అల్లా మార్గమున జంప బడినను లేక చచ్చినను అల్లా మీకు మంచిసహాయకుడును ప్రయోజనకారియు నయియున్నాడు. అల్లా దయ మిక్కిలి మంచిది. (మం-౧-సి-౪-సూ-౩-ఆ-౧౪౬, ౧౪౯, ౧౫౬)

స :- ఇప్పు డీముసల్మానుల పొరపాటును గమనింపుడు. తమ మతస్థులు కానివారిని జంపుట కీశ్వరుని బ్రార్థించుచున్నారే. వీరి మాట నొప్పుటకు బరమేశ్వరుడు వెఱ్ఱివాడా యేమి? కేవల మల్లాయే ముసల్మానులకు బ్రయోజనకర్తగా నున్నచో నీముసల్మానుల కార్యము లేల నష్టమగుచున్నవి? ఖుదా కూడా ముసల్మానులకు మోహమున జిక్కియున్నట్లు గోచరమగుచున్నాడు. ఆఖుదా యిట్లు పక్షపాతము చేయువాడేని ధర్మాత్ముల కెంత మాత్ర ముపాసనీయుడు గానేరడు. (౫౪)

౫౫. అల్లా మిమ్ములను బరోక్షజ్ఞానము గలవారినిగా చేయడు. కాని తన పైగంబరులలో నష్టపడిన వానిని మాత్రము చేయును. కావున అల్లా యందును నతని రసూలునందును విశ్వాసముంచుడు.
(మం-౧-సి-౪-సూ-౩-ఆ-౧౭౯)

స :- ముసల్మాను లీశ్వరునిదప్ప మఱొకని విశ్వసింపనప్పుడును మఱియొకని నీశ్వరునితో జేరికగల వానినిగా నమ్మనపుడును ‘ఈమాన్’ విశ్వాసమునందు బైగంబరును దన నేల చేర్చుకొనెను? అల్లా పైగంబరును విశ్వసింపుడని వ్రాసియున్నందున పైగంబరుగూడ నతనితో సమ్మిళితు డయ్యెను. ఇక “లాశరీక్” అసమ్మిళితు డనిచెప్పుట వ్యర్థము. మహమ్మదు సాహెబ్ పైగంబరుగా విశ్వసింపబడవలయు ననియే దీనిభావ మందు రేని యట్లు మహమ్మదు సాహెబు కావలసిన యావశ్యకమేమి యనుప్రశ్న కలుగును. ఖుదా యతనిని బైగంబరుగా జేయకున్న దా జేయదలచిన కార్యమును జేయనేర డందురేని యత డవశ్యముగ నసమర్థుడే యనుట స్పష్టము. (౫౫)

౫౬. ఓ విశ్వాసవంతులారా! సంతసింపుడు. ఒకరి నొక రాదుకొనుడు. యుద్ధమున బ్రవర్తమాను లయి యుండుడు. మీరు విడుదలయి యుండుడు. మీరు విడుదల పొందుటకు అల్లానుజూచి భయ పడుడు. (మం-౧-సి-౪-సూ-౩-ఆ-౨౦౦)

స :- ఈ ఖురానునందలి ఖుదాయు నతని పైగంబరు నను నిర్దఱును గలహకారులై యుండిరి.

యుద్ధమున కాజ్ఞాపించువాడు శాంతిభంగము చేయువాడే కద. నామమాత్ర మీశ్వరునకు భయపడుటవలన విడుదల పొందనగునా! లేక యధర్మముతో గూడిన యుద్ధాదులకు భయపడుట వలననా? ప్రథమపక్ష మయ్యేనేని భయపడుటయు, భయపడకుండుటయు నొక్కటియే. రెండవపక్ష మయ్యేనేని బాగుగ నున్నది. (౫౬)

౫౭. ఇవి అల్లా హద్దులు, అల్లా యాజ్ఞను అతని రసూలు నాజ్ఞను నొప్పుకొనువా డానదులు ప్రవహించుచున్న స్వర్గమునకు బోవును. ఇదియే దాని ముఖ్యప్రయోజనము. అల్లారసూలుల యాజ్ఞను భంగముచేసి యతని హద్దుల నతిక్రమించువా డెల్లప్పుడు రగులుచుండు నగ్నియందు గాల్చబడును. వానికి జెఱుపును గలుగజేయు దుఃఖమును గలదు. (మం-౧-సి-౪-సూ-౪-ఆ-౧౩, ౧౪)

స :- ఖుదా పైగంబరను మహమ్మదుసాహెబును దనతో జేర్చుకొని యున్నాడు. ఇట్లా ఖుదా ఖురానునందే వ్రాసియున్నాడు. ఇంకను ఖుదా పైగంబరున కెట్లు లోబడియున్నాడో చూడుడు! అతడు స్వర్గమందును రసూలును భాగస్థుని జేసికొని యున్నాడుగద! ఒకమాట యందైనను ముసల్మానుల ఖుదా స్వతంత్రుడు కాడేని (లాశరీక్) యసమ్మిళితు డనుట వ్యర్థము. ఇట్టివార్త లీశ్వరోక్త పుస్తకమునం దుండనేరవు. (౫౭)

౫౮. అల్లా ఒక త్రసరేణువంతయినను అన్యాయము చేయడు. మేలునకు బదులుగా రెండింతలు వానికి గలుగ చేయును. (మం-౧-సి-౫-సూ-౪-ఆ-౪౦)

స :- ఒక త్రసరేణువంతయినను ఖుదా యన్యాయము చేయడేని పుణ్యమునకు రెండింత లెందుకిచ్చును? ముసల్మానులకు బక్షపాత మెందులకు జేయుచున్నాడు? నిజమేమన గర్మములకు రెండింతలుగాని తక్కువగాని ఫలమిచ్చునేని యాఖుదా యన్యాయకారియే యగును. (౫౮)

౫౯. నీదగ్గఱనుండి వెడలుచున్నప్పుడు నీమాటను విపరీతముగ నాలోచించుచున్నారు. అల్లా వారి సలహాలను వ్రాయుచున్నాడు. వారి యార్జితమును బట్టి అల్లా వారిని విముఖుల జేసెను. ఏమి! ఎవని నల్లా (గుమరాహ) పథవిముఖుడుగా చేసియున్నాడో వానిని మీరు మార్గమునకు దేగోరుచున్నారా? ఎవని నల్లా గుమరాహ చేయునోవాని కెన్నడును మార్గ మబ్బదు. (మం-౧-సి-౫-సూ-౪-ఆ-౭౧, ౭౭)

స :- వార్తల నన్నిటిని వ్రాయుచు "బహీ ఖాతా" దస్త్రముల నేర్పఱచుచు బోవుచున్నాడేని యల్లా సర్వజ్ఞుడు కాడు. సర్వజ్ఞుడేని వ్రాయవలసిన యావశ్యకమేమి! ఇక నందఱను భ్రమింపజేయు చున్నందున సైతానే దుష్టుడని ముసల్మాను లనుచున్నారు గద! ఖుదా కూడ జీవులను గుమరాహ చేయుచున్నప్పుడు ఖుదాయందును సైతానునందును భేద మేముండెను? ఔను. భ్రమింపజేయువాడే సైతానని ముసల్మానులు వక్కాణించుచున్నారు. కాబట్టి ఖుదా పెద్ద సైతాననియు, నతడు చిన్నసైతాననియు మాత్రమే భేద మననొప్పును. కావున నీ ప్రతిజ్ఞ ఖుదానుగూడ సైతానుగా జేసినది. (౫౯)

౬౦. ఇంకను తమ చేతుల నాపుకొనలేని పక్షమున వారిని పట్టుకొని యెటజిక్కినను చంపివే యుడు. ముసల్మానుని ముసల్మానుడు మాత్రము చంపుట యోగ్యముకాదు. తెలియక ఒకడొకని జంపి నచో ఆచంపినవాడు మహమ్మదీయుడైనప్పుడును, విరోధజాతివారు మిమ్ము క్షమించినప్పుడును ముసల్మా నుని మాత్రము తల నఱకక విడిచిపెట్టుటయే యుక్తము. ఒకడు తెలిసి ముసల్మానుని చంపినచో వాడు సదా నరకమందే యుండును. వాని మీద అల్లా క్రోధమును (లానత్) ధిక్కారమును కలదు.

(మం-౧-సి-౫-సూ-౪-ఆ-౮౧, ౮౨, ౮౩)

స :- ఇప్పుడు చూచితిరా! ముసల్మానుడు కానివాని నెటజిక్కినను జంపివేయుడనియు ముసల్మా నుని మాత్రము జంపకుడనియు ననుట గొప్ప పక్షపాతమే కద. తెలియక ముసల్మాను డొకముసల్మానుని

జంపిన ప్రాయశ్చిత్తమును బొందవలయుననియు నన్యుని జంపిన స్వర్గమును బొందుననియు జేయ బడిన యీ యుపదేశములను బావిలో ద్రోయవలసినదే. ఇటువంటి పుస్తకములు, పైగంబరులు, ఖుదాలు, మతములు నసువీనివలన హాని కలుగుటదప్ప లాభమేమియు గలుగదు. కావున నివి యుండకుండుటయే మేలు. ఇట్లు ప్రమాదముతో గూడిన మతములను త్యజించి వేదోక్త విషయముల నన్నిటి నంగీకరించు టయే బుద్ధిమంతులకు యోగ్యము. అందసత్యము కించిత్తయినను లేదు. ఇంక నిట ముసల్మానుని జంపినవాడు నరకమునకు బోవునన్నట్లే ముసల్మానుని జంపినవాడు స్వర్గమునకు బోవునని యన్యమతస్థు లనుచున్నారు. ఈ రెంటిలో దేనిని నమ్మవలెనో దేనిని త్యజింపవలయునో చెప్పుడు. కావున నీ మూఢ ప్రకల్పిత మతములు త్యజించి, వేదోక్తమతమును స్వీకరించుటయే మనుష్యులందఱకును యోగ్యము. అందునార్యుల-శ్రేష్ఠపురుషుల మార్గమున బ్రవర్తింపుడనియు, దస్యుల-దుష్టుల మార్గము నుండి దూర మున నుండుడనియు వ్రాయబడియున్నది. కావున నదియే సర్వోత్తమము. (౬౦)

౬౧. ఇంక శిక్ష ప్రకటమయిన పిమ్మట రసూలుతో విరోధము చేసిన వానిని, ముసల్మానులతో విరుద్ధపక్షము బూనిన వానిని మేమవశ్యముగ నరకమునకు బంపుదుము.

(మం-౧-సి-౫-సూ-౪-ఆ-౧౧౫)

స :- ఇప్పుడు ఖుదా, రసూలుల పక్షపాతపు మాటల గమనింపుడు. ఖుదాపేర తామిట్లు వ్రాయ కున్న దమమతము వృద్ధిపొందదనియు, బదార్థములు లభింపవనియు నానందమనుభవింపకుందుమ నియు, మహమ్మదు సాహెబు మున్నగువారు దలంచుచుండిరి. వారన్యుల కార్యముల జెఱచుటయందును, దమ యభీష్టములను సిద్ధింపచేసికొనుట యందును బూర్ణులయి యుండిరి. కాబట్టి వీరాప్తులు కాకుండిరి. కావున వీరిమాట యాప్తులగు విద్వాంసులయెదుట బ్రమాణార్హ మెన్నటికి గానేరదు. (౬౧)

౬౨. ఎవడల్లాను, ఫరిశ్తాలను పుస్తకములను రసూలును (కయామతు) ప్రళయమును అంగీకరింపడో యతడు నిశ్చయముగ మార్గము దప్పినవాడు. ఎవరు నిశ్చయముగ విశ్వసించిన పిమ్మట కాఫిరులయి మరల నట్లే విశ్వసించుచు మాఱుచు విశ్వాసఘాతకు లగుదురో అల్లా వారి నెంత మాత్రము క్షమింపడు. ఇంక వారికి మార్గమును జూపడు. (మం-౧-సి-౫-సూ-౪-ఆ-౧౩౬, ౧౩౭)

స :- ఏమి? ఇప్పుడుకూడ ఖుదా (లాశరీక్) అసమ్మిళితుడని చెప్పబడ గలడా? లాశరీకని చెప్పుచు నతనితో జేరికగలవారి ననేకులను నమ్ముచు బోవుట పరస్పరవిరుద్ధము కాదా? ఏమి? మూడుసార్లు క్షమించినపిమ్మట నిక ఖుదా క్షమింపనే క్షమింపడా? మఱి మూడుసారులు విశ్వాసఘాతము చేసినను మార్గము జూపునా? లేదా? నాల్గవ పర్యాయమునకు బిమ్మట జూపకపోవునా? నాలుగేసి పర్యాయము లయిన నందఱును (కుఫ్ర్) ద్రోహము చేసినచో మిక్కిలి యెక్కువయే యగును. (౬౨)

౬౩. అల్లా దుష్టులను, కాఫిరులను నిశ్చయముగ నరకమున జేర్చుచున్నాడు. నిశ్చయముగ దుష్టులు అల్లాను మోసపుచ్చుచున్నారు. అట్లే వారినల్లా మోసపుచ్చుచున్నాడు. ఓ విశ్వాసవంతులారా! ముసల్మానుల దప్ప కాఫిరులను మిత్రులుగా చేసికొనకుడు. (మం-౧-సి-౫-సూ-౪-ఆ-౧౪౦, ౧౪౨-౧౪౪)

స :- ముసల్మానులు స్వర్గమునకు బోవుదురు. అన్యులు నరకమునకు బోవుదురు. అనుటకు బ్రమాణమేమి? బళిరే! దుష్టులకు మోసపోవువాడును, నితరుల మోసపుచ్చువాడు నగు ఖుదా మాకు దూరమయి యుండుగాక. కాని మోసగాండ్రతో నతడును నతనితో మోసగాండ్రును గూడియుందురు గాక! ఏలయన – (యాదృశీ శీతలా దేవీ తాదృశః ఖరవాహనః) ఎటువంటి వాని కటువంటివాడు కూడి నప్పుడే నిర్వాహమగును. ఎవరి ఖుద మోసగాడో యతని యుపాసకు లట్లేందులకు గాకుందురు? ఏమి?

ఒక ముసల్మాను దుష్టుడు గానున్నను వానితో మిత్రత్వమును, ముసల్మానుడు కానియన్యు డొకడు శ్రేష్ఠుడుగా నున్నను వానితో శత్రుత్వమును జేయుమనుట యెవరికైన నంగీకారమగునా? (౬౩)

౬౪. జనులారా! నిశ్చయముగ మీవద్దకు దేవుని వైపునుండి సత్యముగల పైగంబరు వచ్చియున్నాడు. కావున మీరు ఆయనను నమ్ముకొనుడు. (మాబూదు) ఉపాస్యు డొకఅల్లాయే.

(మం-౧-సి-౬-సూ-౪-ఆ-౧౭౦, ౧౭౧)

స :- పైగంబరును నమ్ముకొనుడని వ్రాసినపుడు విశ్వాసమందు పైగంబరు ఖుదాతో జేరికగలవాడు-భాగస్థుడు అయ్యెనా. లేదా? అల్లా యేక దేశీయుడయి వ్యాపకుడు కానపుడే కద యతని వద్దనుండి పైగంబరులు వచ్చుచు బోవుచునున్నారు. అటులయిన నత డీశ్వరుడుకూడ గాజాలడు. కొన్నిచోట్ల, సర్వదేశీయుడని కొన్నిచోట్ల నేకదేశీయుడని వ్రాయబడియున్నందున నీ ఖురాను ఒకనిచే వ్రాయబడలేదు. అందువలన ననేకులచే వ్రాయబడినదనియే విదిత మగుచున్నది. (౬౪)

౬౫. హరాముగ జెప్పబడిన (ముర్దార్)* రక్తము, పందిమాంసము అల్లాకాక వేరేమో చదివి కోయబడిన పశుమాంసము, గొంతునులిమియో, కఱ్ఱదెబ్బకొట్టియో, కొమ్ముతో పొడిచియో చంపిన, మీది నుండి పడిచచ్చిన దాని మాంసము మృగములచే దినబడినదాని మాంసము మీకు (హరాం) నిషిద్ధములు.

(మం-౨-సి-౬-సూ-౫-ఆ-౩)

స :- ఏమీ? ఇవి మాత్రమే నిషిద్ధములా? ఇక నెన్నియో పశువులు, తిర్యక్ జీవములు, కీటకములు మున్నగునవియు గలవు. అవి యన్నియు ముసల్మానులకు (హలాల్) భక్ష్యము అగునా? ఇందువలన నిది మనుష్యుల కల్పితమేకాని యీశ్వరునిది కాదు. కావున నిది ప్రమాణార్హమును గాదు. (౬౫)

౬౬. అల్లాకు మంచిబదులు ఒసంగుడు. నేనవశ్యముగ మీకీడును దూరపఱతును. మిమ్ము స్వర్గమున కంపుదును. (మం-౨-సి-౬-సూ-౫-ఆ-౧౨)

స :- మంచిది! ముసల్మానుల ఖుదా యింట గించిన్మాత్రమైన ధనము లేకుండవచ్చును గద. విశేషముగ నున్నపుడు బదులెందుల కడుగును? అట్లే మీకీడును దూరముచేసి మిమ్ము స్వర్గమున కంపుదునని వారినేల భ్రమింపజేసి యుండును? ఇచ్చట మహమ్మదుసాహెబు ఖుదా పేరు చెప్పి తనయభిమతమును దీర్చుకొని నాడనియే యర్థమగుచున్నది. (౬౬)

౬౭. ఇష్టమైనవానిని క్షమించుచున్నాడు. ఇష్టమైనవానిని దుఃఖపెట్టుచున్నాడు. ఎవనికి నీయని దానిని మీకిచ్చెను. (మం-౨-సి-౬-సూ-౫-ఆ-౧౮, ౨౦)

స :- ఏమి? సైతాను తనకిష్టమైన వానిని బాపాత్మునిగా జేయుచున్నటులే ముసల్మానుల ఖుదా కూడ నాసైతానువంటిపని చేయుచున్నాడా? అటులయిన నిక నా స్వర్గనరకములకు ఖుదా పోవలసినదే కద. ఎందుల కనగా నతడే పాపపుణ్యముల జేయువాడయ్యెను. జీవుడు పరాధీనుడు. సైన్యము సేనాధిపతి యధీనమందుండి కాపాడుచు నొకని జంపుచుండును. తత్పుణ్యాపాపము లాసేనాధిపతికి గలుగునే కాని సైన్యమునకు గలుగవు గదా! (౬౭)

౬౮. అల్లా యాజ్ఞను పాలింపుడు, రసూలు ఆజ్ఞను పాలింపుడు. (మం-౨-సి-౭-సూ-౫-ఆ-౯౨)

---

* ముర్దార్ అనగా ప్రాణము లేనిదని యర్థము. కాని యిట కలమా చదివి ముసల్మానులు కోసిన పశువుల మాంసము హలాల్, ముసల్మానులు కానివారు కోసిన పశువుల మాంసము ముర్దార్ అని దీని భావము. నిజమేమన ముసల్మానులచేగాని యన్యులచేగాని కోయబడిన నేమి? ఎట్లు చచ్చిన నేమి? అది 'ముర్దార్' జీవములేని దనియే తెలియనగును. (అనువాదకుడు)

స :- చూడుడు! ఖుదా పొత్తుగలవాడనియే యిట విదితమగుచున్నది. ఇక నతని (లాశరీక్) అని నమ్ముట వ్యర్థము. (౬౮)

౬౯. జరిగిపోయినవాని నల్లా క్షమించెను. ఎవడు మరల చేయునో వాని నల్లా దండించును.

(మం-౨-సి-౭-సూ-౫-ఆ-౯౫)

స :-చేయబడిన పాపములు క్షమింపబడు ననుమాట పాపముల జేయుట కాజ్ఞాపించి వానిని బెంచుట యనియే యర్థము. ఏ పుస్తకమునందు బాపములు క్షమింపబడు ననుమాట యుండునో యది యీశ్వర రచితముగాని యొక విద్వాంసునిచే రచియింపబడినదికాని కాజాలదు. అది పాపముల బెంచున దనుట మాత్రము సత్యము. ఇక జరుగబోవు పాపముల దొలగించుట కొకని బ్రార్థించుటయు దాను వానిని విడుచుటకు బురుషార్థము చేయుచు బశ్చాత్తాపపడుటయు నుచితమే! కాని కేవలము పశ్చాత్తాపపడుచు వాని విడువడేని ఫలమేమియు లేదు. (౬౯)

౭౦. వహీ (అల్లాచేవ్రాలు) అతని కందుటలేదు. కాని అల్లా పేర బొంకులు బొంకుచు నదే నాకందు చున్నదనియు నట్లే అల్లా పంపుచున్నట్లు నేనుగూడ బంపగల ననియు చెప్పునట్టి మనుష్యుని కంటె నధిక పాపాత్ముడు మఱొక డుండునా? (మం-౨-సి-౭-సూ-౬-ఆ-౯౪)

స :- నాకు అల్లా దగ్గఱనుండి యాయతు అందుచున్నవని మహమ్మదు సాహెబే చెప్పుకొనుచుండి నట్లే యన్యుడెవడో నాకును నాయతు అందుచున్న వనియు, నన్నుగూడ పైగంబరుగా నమ్ముడనియు మహమ్మదుసాహెబు వంటి లీలలను గల్పించి యుండవచ్చును. అప్పుడు వానిమాటను రద్దుపఱచుట కును దన ప్రతిష్ఠను గొప్పచేయుటకును మహమ్మదుసాహె బీయుపాయమును బన్నియుండవచ్చు ననియే దీనివలన విదితమగుచున్నది. (౭౦)

౭౧. మేమవశ్యముగ మిమ్ము బుట్టించితిమి. మరల మీయాకృతుల జేసితిమి. పిదప మేము ఫరిశ్తా లతో ఆదామునకు సిజ్దా (నమస్కారము) చేయుడనగా వారు సిజ్దా చేసిరి. కాని సైతాను సిజ్దా చేయువారి యందు లేకుండెను. నేను నిన్నాజ్ఞాపించినపుడు నీవు సిజ్దా చేయకపోతివి. మఱి నిన్నెవ రడ్డగించి రనగా నే నతనికంటె మంచివాడను. నీవు నన్నగ్నితోను నతనిని మట్టితోను బుట్టించితివనెను. నీవంత యభిమానిం చుట కది నీకు యోగ్యముకాదు. దానిలో నుండి దిగుమనెను. కాటిలో నుండి లేపబడు దినమువఱకు పడియుండుమనెను. నీవు నిశ్చయముగ పడియున్న వారిలోని వాడ వనెను. నీవు నన్ను విముఖుని (గుంరాహ) చేసితివి. నేనవశ్యముగ వారి విషయమై నీచక్కని మార్గమున కూర్చుందును. 'ఒట్టు' అనెను. ధన్యవాద మొనర్చుచున్నట్లు వారిని నీవు తఱచుగా జూడకుందువు. దుర్దశతో వెళ్ళిపొమ్ము. దారిలోనుండి నిన్ననుసరించిన వానితోగూడ మీయందఱతో నరకమును నింపుదుననెను.

(మం-౨-సి-౮-సూ-౭-ఆ.౧౧-౧౮)

స :- ఖుదాకును సైతానుకును జరిగిన జగడము నిప్పుడు నిదానముగ నాలకింపుడు. పరిచారకు డుగా నున్న యొక ఫరిశ్తాకూడ ఖుదాకు లొంగలేదు. ఖుదా యయిన నతని యాత్మను బవిత్రపఱప లేక పోయెను. అట్లే పాపకారుల జేసి యుపద్రవములు గలుగజేయు నాద్రోహిని ఖుదా విడిచిపెట్టెను. ఇది ఖుదా గొప్పపొరపాటే యననొప్పును. సైతానందఱను భ్రమింపజేయువాడు. ఖుదా సైతానును భ్రమింప జేయువాడు నగుటబట్టి ఖుదా సైతానునకు మించిన సైతానని సిద్ధమగుచున్నది. ఏలయన-నీవు నన్ను గుంరాహ చేసితివని సైతాను ప్రత్యక్షముగ జెప్పుకొనుచున్నాడు. కాబట్టి ఖుదాయందు బవిత్రతయు గన పడుట లేదు. కీడుల నన్నిటిని గల్పింపజేసెడి మూలకారణము ఖుదా యయ్యెను. ఇట్టి ఖుదా కేవలము ముసల్మానుల కిష్టమగునేకాని శ్రేష్ఠులగు నితర విద్వాంసులకు గాదు. ఇక ఫరిశ్తాలతో మనుష్యుని మాదిరిగ

వార్తాలాపము చేసియుండిన ముసల్మానుల ఖుదా దేహధారియు నల్పజ్ఞుడు, న్యాయరహితుడయ్యెను. కావుననే విద్వాంసు లిస్లామీమతమున కిష్టపడరు. (౨౧)

౨౨. నిశ్చయముగ అల్లా మీకు ప్రభువు. అత డాఱుదినములలో ఆకాశములను, పృథివిని ఉత్పన్నము చేసెను. అనంతరము అర్శమీద శయనించెను. నమ్రతతో తమ ప్రభువును పిలువుడు.

(మం-౨-సి-౮-సూ-౭-ఆ-౫౪, ౫౫)

స :- బాగు! ఎవ డాఱుదినములలో జగత్తును జేయునో యర్శ (మీదియాకాశమున) సింహాసనము మీద శయనించునో యట్టి యీశ్వరు డెన్నడయిన సర్వశక్తి మంతుడును వ్యాపకుడును గాగలడా? అట్లు కానిచో నతడు ఖుదా యనిగూడ జెప్పబడ జాలడు. ఏమి? పిలువగా వినునేని మీ ఖుదా బధిరుడా? ఈ మాటలన్నియు నీశ్వరకృతములే? కావున ఖురా నీశ్వరకృతము కానేరదు. ఆఱుదినములలో జగత్తును జేసి, యేడవదిన మర్శమీద శయనించెనన్న నలసియు బోవచ్చును. ఇప్పటికి నిద్రించుచున్నాడా? మేలుకొని యున్నాడా? మేలుకొని యున్నాడేని యిప్పు డేమయిన బని చేయుచున్నాడా? లేక నిరర్థకముగ నిక్కడక్కడ దిరుగుచు నానందించుచున్నాడా? (౨౨)

౨౩. పృథివిమీద జగడము జేయుచు దిరుగకుడు. (మం-౨-సి-౮-సూ-౭-ఆ-౭౪)

స :- ఈ మాట మంచిదేకాని, దీనికి విపరీతముగ గొన్నిచోట్ల జిహాదు చేయుడనియు, కాఫిరులను జంపుడనియుగూడ వ్రాయబడి యున్నదే. ఇది పూర్వాపరవిరుద్ధముకాదా! చెప్పుడు. మహమ్మదు సాహెబు, నిర్బలుడయి యుండినపు డిట్లు చెప్పియుండవచ్చుననియు, బలవంతుడయి యుండినపుడు జగడము చేయించి యుండవచ్చుననియు గూడ దీనివలన విదిత మగుచున్నది. కావున నీవార్తలు పరస్పర విరుద్ధము లగుటవలన సత్యములు గావు. (౨౩)

౨౪. ఒకసారి తన అసా (చేతికఱ్ఱ)ను పాఱవేయగా నది నిజముగా కొండచిలువయయ్యెను.

(మం-౨-సి-౯-సూ-౭-ఆ-౧౦౭)

స :- ఇట్లు వ్రాయుటవలన నిట్టి యబద్ధపు వార్తలను ఖుదా సాహెబును మహమ్మదు సాహెబును నమ్ముచుండిరనియు, వీరిద్దఱును విద్వాంసులు కారనియు విదితమగుచున్నది. కంటితో జూచుటను, చెవితో వినుటను నెవ్వడును నిరాకరింపనేరడు. కాన నివి యైంద్రజాలపు మాటలే యనుట స్పష్టము. (౨౪)

౨౫. మేము వారి మీదికి గాలివాన (తుఫాను)ను, మిడుతలను, పిడుగులను, కప్పలను, రక్తమును పంపితిమి. మేము వారి యెడల పగతీర్చుకొని వారిని సముద్రములో ముంచివేసితిమి. మేము బనియిస రాయీలను సముద్రమునుండి తరింపజేసితిమి. వారున్న మతము నిశ్చయముగ నబద్ధము. వారి కార్యము నబద్ధమయినదే. (మం-౨-సి-౯-సూ-౭-ఆ-౧౩౩, ౧౩౬, ౧౩౮, ౧౩౯)

స :- ఇప్పుడు చూడుడు! ఒక మోసగాడొకనిని- "మేము నీ మీదికి జంపుటకు సర్పముల బంపుదుమని" భయపెట్టినట్లే కద! యీమాటకూడ నయ్యెను. మంచిది. పక్షపాతముతో నిట్లొక జాతివారిని ముంచివేసి మఱొక జాతివారిని దరింపజేసినట్టి ఖుదా ధర్మము దప్పినవా డేలగాకుండును? వేలకొలదియు కోట్లకొలదియు మనుష్యులతో గూడియున్న యితరమతము లన్నియు నబద్ధములనియు దనమతమే సత్యమనియు నెవడనుచున్నాడో, దానికంటె నబద్ధమైనది మఱొకమత ముండునా? ఏలయన నేమత మందైనను మనుష్యులందఱును జెడ్డవారుగనో, మంచివారుగనో యుండజాలరు. ఇట్లేక పక్షపు పరిష్కారము జేయునది మహామూర్ఖుల మతమే యగును. ఏమి? ఎవరి మతము తౌరేతు జబూరుల ననుసరించి యుండెనో యది యబద్ధమేనా! లేక దాని నబద్ధమని చెప్పుటకు వారిమతము మఱియొకటి యుండెనా?

మఱొక మత ముండెనన్న నేమతముండెను? ఖురానునందు దాని పేరున్నట్లు చూపుడు. (౭౫)

౭౬. నిన్ను చూడవచ్చును కాబోలు, అనగా అతని ప్రభువు పర్వతపు దిక్కునకు తనతేజమును ప్రకాశింపజేసి దానిని దునాతునుకలు చేయగా మోషే మూర్ఛితుడై పడిపోయెను.

(మం-౨-సి-౯-సూ-౭-ఆ-౧౪౩)

స :- ఇట్టు లగపడువాడు వ్యాపకుడు కాజాలడు. ఇవ్విధముగ జమత్కారములు చూపుచుండెనన్న నిప్పు డొకరికైన నట్టి చమత్కారము నాఖుదా చూపుటలే దెందులకు? ఈ మాట నితాంత మసత్యము కావున నంగీకారార్హము కాదు. (౭౬)

౭౭. నీ ప్రభువును భయభక్తులు కలవాడవై హీనస్వరముతో ప్రాతఃకాలముననుసాయంకాలముననుమనస్సునందు స్మరింపుము. (మం-౨-సి-౯-సూ-౭-ఆ-౨౦౪)

స :- ఖురానునందు గొన్నిచోట్ల దనప్రభువును నెలుగెత్తి పిలువు మనియు, మఱికొన్నిచోట్ల హీనస్వరముతో నీశ్వరుని స్మరింపుమనియు వ్రాయబడి యున్నదిగదా! వీనిలో నేమాట నిజమో యేమాట యబద్ధమో చెప్పుడు. ఇట్లొకమాట మఱొకమాటను రద్దుపఱచుచున్న నది ప్రమత్తాలాపము వంటిదే యనబడును. భ్రమచే నొకమాట విరుద్ధముగా జెప్పబడెనన్న నొప్పుకొనవచ్చును. చింత యేమియు లేదు. (౭౭)

౭౮. దోచుకోబడిన సొత్తును గూర్చి నిన్ను అడుగుదురు. నీవు దోచుకోబడిన సొత్తు అల్లాదనియు, రసూలుదనియు నల్లాకు భయపడుడనియు జెప్పుము. (మం-౨-సి-౯-సూ-౮-ఆ-౧)

స :- దోపిడీ వ్యవహారము-దోపిడిగాండ్రపనులు చేయుచు జేయించువారే 'ఖుదాపైగంబరులు. ఈమాన్‌దారులు నగుదురన్న నిదిగొప్ప యాశ్చర్యకరమగు వార్తయే యననొప్పును. అల్లా భయము జూపుచు దోపిడీ మున్నగు దుష్కార్యములను జేయువారుగూడ మాది యుత్తమ మతమని చెప్పుకొనుట లజ్జాస్పదము కాదా? కావున హఠమును వదలి వేదమతమును గ్రహింపక పోవుటకంటె మించిన చెఱుపు మఱియేదియు నుండదనుట స్పష్టము. (౭౮)

౭౯. కాఫిరులను నిర్మూలము చేయవలయును. నేను వేయిమంది ఫరిశ్తాలను వెంటబెట్టుకొని వచ్చి మీకు సాయము చేయుదును. నే నవశ్యముగా కాఫిరుల హృదయములయందు భయము గలుగ జేయుదును. కావున వారి మెడల మీదను వారి యొక్కొక్క కీలుమీదను గొట్టుడు.

(మం-౨-సి-౯-సూ-౮-ఆ-౭, ౯, ౧౨)

స :- మేలయ్యా! మేలు. ఈ ఖుదాను పైగంబరులను యెంతటి దయాహీను లనవలయును? ముసల్మానుల మతమును నంగీకరింపనివారిని కాఫిరు లనియేకద వారిని నిర్మూలము చేయుట కాఖుదా యాజ్ఞాపించుచున్నాడు. అంతియగాదు, వారి మెడల నఱకుడు. వారి కాళ్ళుచేతులు కీళ్ళు తెగకోయుట కును దోడ్పడుదునని సమ్మతిగూడ నిచ్చుచున్నాడే! ఇటువంటి ఖుదా లంకేశునికంటె నేమైన దక్కువవా డనబడునా? ఈ గందరగోళమంతయు ఖురాను కర్తదే కాని ఖుదాది కాదు. ఖుదాదేని యిటువంటి ఖుదా మాకు దూరమై యుండుగాక! మేముకూడ నతనికి దూరమై యుందుము గాక( ౭౯)

౮౦. అల్లా ముసల్మానులకు సహాయకుడు. ఓ విశ్వసించిన వారలారా! అల్లా యని రసూలని పిలు చుటకు స్వీకరింపుడు. ఓ విశ్వసించిన లోకులారా! అల్లాకును రసూలుకును దొంగలు గాకయుండుడు. అట్లే తమ (అమానతును) నిలువయుంచిన దానిని దొంగిలింపకుడు. అల్లా తంత్రము జేయుచుండెను. తంత్రము జేయువాండ్రకు మంచివాడు.

(మం-౨-సి-౯-సూ-౮-ఆ-౧౯, ౨౪, ౨౭, 30)

స :- ఏమి! అల్లా ముసల్మానుల పక్షపాతియా? అటులేని యధర్మము జేయువాడగును. ఏమన నీశ్వరుడు ప్రపంచమున నంతటను గలవాడు వినజాలడా? బధిరుడా? ఇంక నతనితో రసూలును నేకముచేయుట గడునింద నీయమైన యంశము కాదా? దొంగిలింతు రనుటకు అల్లాఖజానా (కోశము) ఏది నిండియున్నది? రసూలు దొంగతనమును దన యమానతునందలి దొంగతనమును మాత్రమే మాని తక్కిన దొంగతనములన్నియు జేయవచ్చునా? ఇట్లు విద్యావిముఖులును, ధర్మవిహీనులు నగువారే యుపదేశింపగలుగుదురు. మంచిది! తంత్రము జేయువాడును తంత్రము జేయువాండ్రకు సహాయకుడు నయియున్నాడేని యాఖుదా మోసగాడు, గపటియు, నధార్మికుడు నేలగాకుండును? ఇందువలన నీఖురాన్ ఖుదాచే రచియింపబడినది కాదు. ఒకానొక మోసగాడు, గపటియు నగువానిచే రచింపబడ వచ్చును. లేనిచో నిట్టి విపరీతము లెందులకు వ్రాయబడి యుండును. (౮౦)

౮౧. వారి ఉద్రేక ముడుగనంతవఱకు కాఫిరుల బలము తగ్గనంతవఱకు (దీన్) అల్లా మత మంతట స్థిరపడువఱకు వారితో బోట్లాడుడు. మీరు దోచుకొన్న ప్రతి వస్తువులో నైదవభాగము నిశ్చయముగ అల్లాదనియు రసూలుదనియు నెఱుగుడు. (మం-౨-సి-౯-సూ-౮-ఆ-౩౯, ౪౧)

స :- ఇట్టు లన్యాయముగ బోట్లాడుచు, బోట్లాడజేయునట్టి ముసల్మానుల ఖుదాకంటె నన్యుడు శాంతిభంగము జేయువా డితరు డెవడుండును? ఇంక మతమును చూడుడు! అల్లా కొఱకును, రసూలు కొఱకును, జగత్తును దోచుట, దోపించుట యనునది దోపిడిగాండ్ర పనిగాదా? అపహరింపబడిన సొత్తులో ఖుదా భాగస్థుడై యున్నపుడు దోపిడిగా డనియే యర్థము. మఱి ఖుదా దోపిడిగాండ్రకు బక్షపాతియై తన ఖుదాతనమునకు గొఱతను గలుగ జేసికొనుచున్నాడు గదా! ఇట్టి పుస్తక మీ ఖుదా పైగంబరు నను నుపాధి ధారులు ప్రపంచమున శాంతిభంగముచేసి, మనుష్యులకు దుఃఖము కలుగజేయుట కెక్కడినుండి వచ్చిరో గొప్పవింతగా నున్నది! జగత్తున నిట్టి మతములే ప్రచలితములు కాకుండిన జగత్తంతయు నానందముతో గూడియుండెడిది. (౮౧)

౮౨. కాఫిరుల ప్రాణముల దీయగా జూతురేని ఫరిశ్తాలు వారి ముఖముల మీదను వీపులమీదను, కొట్టుచు, దగ్ధమనెడు పాపరుచిని గ్రహించుటకు నడువుడని యందురు. మేము వారిని వారి పాపములబట్టి చంపితిమి. మఱి ఫిరవూన్ జాతివారిని ముంచివేసితిమి. మీరు వారికొఱకు చేయగలుగునంతటి ప్రయత్నము చేయుడు. (మం-౨-సి-౯-సూ-౮-ఆ-౫౦, ౫౪, ౬౦)

స :- ఏమండీ! వర్తమాన సమయమందు రూసువారు రోమునున్నగు దేశవాసులకును, నింగ్లండు వారు మిత్రదేశవాసులకు దుర్దశవాటిల్ల జేసిరే. ఫరిశ్తా లెక్కడ నిద్రపోయిరోగదా! పూర్వకాలమున ఖుదా తన సేవకుల శత్రువులను జంపుచు ముంచివేయుచు నుండెనను వార్తలు నిజమైన నిప్పుడు కూడ నటులే చేయవలసి యుండెను. వారిదశ యిట్లు గాకయుండెడిది. ఇందువలన నీమాట యొప్పదగినది కాదు. ఇక నితర మతస్థులతో మీరు చేయగలుగునంతటి దౌర్జన్యము చేయుడను నీ దురాజ్ఞను గమనింపుడు. ఒక విద్వాంసుడో, ధర్మాత్ముడో, దయాళువో యయిన నిట్లాజ్ఞాపింప నేరడుగద. మరల ఖుదా దయాళుడ నియు, న్యాయకారి యని గూడ వ్రాయుచున్నారు. ఇటువంటి మాటలవలన ముసల్మానుల ఖుదాయందు న్యాయము, దయ మున్నగు సద్గుణము లెంతమాత్రము స్థిరపడవు. (౮౨)

౮౩. ఓనబీ! నీకును అల్లాకును ముసల్మానుల పక్షము బూనిన వారికిని లాభము కలదు. ఓనబీ! యుద్ధము చేయుట కుత్సాహమును కోరికను ముసల్మానులందు జనింపజేయుము. మీలో సంతోషభరితు లిరువదిమంది యయినను రెండువందలజనము నోడింపవచ్చును. మీరు దోచినవస్తువుల ననుభవింపుడు.

అవి భక్ష్యములు, పవిత్రములు. అల్లాకు మాత్రము భయపడుడు. అతడు దయాళువు, క్షమించును.
(మం-౨-సి-౧౦-సూ-౮-ఆ-౬౪, ౬౫, ౬౯)

స :- తనపక్షపువా డన్యాయము చేసినను వానికి దోడయి వానికే లాభము కలుగజేయు డనున దెట్టిన్యాయమో? ఎట్టి విద్వత్తో? ఏమి ధర్మమో? తెలియుట లేదు. ప్రజలందు శాంతిభంగము గలుగ జేయుటకు యుద్ధము జేయుడనియు, జేయింపుడనియు దోచిన పదార్థములు సేవనీయముల నియు అల్లా దయాళువు కావున క్షమించుననియు ననుమాటలు ఖుదాలిఖితము లెట్లు కాగలవు? ఒక సరసు నిచే వ్రాయబడినవియు గానేరవు. ఇట్టి మాటలుగల ఖురా నీశ్వరోక్త మెన్నటికిని గాజాలదు. (౮౩)

౮౪. సదా దానియం దుందురు. అల్లా దాని సమీపమున నుండును. పుణ్యము గొప్పది. ఓ విశ్వసించిన లోకులారా! మీ తండ్రులను, మీయన్నలను (ఈమాన్) విశ్వాసము దెచ్చుకొనక దోషమును ప్రేమించు మిత్రులను చేపట్టకుడు. ఇంకను తనరసూలుమీదను, ముసల్మానుల మీదను అల్లా తన విశ్వాసము స్థిరపఱచెను. మఱి సేనల బంపెను. ఏమి! మీరు వానిని, పాపము చేసినవానిని చూడలేదా! కాఫిరుల కిదియే శిక్ష. పిమ్మట నిష్టమైనవానిమీద అల్లా మరల దయజూపును. విశ్వసింపనివారితో బోట్లాడుడు.
(మం-౨-సి-౧౦-సూ-౯-ఆ-౨౧, ౨౩, ౨౬, ౨౭, ౨౯)

స :- సరి! అల్లా స్వర్గవాసుల సమీపమున నుండునన్న సర్వవ్యాపకు డెట్లు కాగలడు? సర్వవ్యాపకుడు కాడేని, సృష్టికర్తయు, న్యాయాధీశుడును గాజాలడు. ఇక దమ తల్లి దండ్రులను, బంధుమిత్రులను విడిపించుట కేవల మన్యాయమే కద. ఒకవేళ వారు చెడ్డయుపదేశము చేయుదురేని, యంగీకరింపవలదు. కాని వారి సేవ మాత్రము సర్వదా చేయవలసినదే. పూర్వకాలమున ఖుదా ముసల్మానుల మీద సంతోషభరితుడై యుండెను. వారి సాహాయ్యమునకై సేనల బంపుచుండెను. అనుమాటలు నిజమైయున్న నిప్పుడట్లేల చేయకుండును? మొదట కాఫిరుల దండించుచు, మరల వారిమీద దయజూపుచు నుండెనన్న నిప్పు డెక్కడికి బోయెను? ఖుదా యుద్ధము చేయింపక విశ్వాసము కలుగజేయ నేరడా? ఇటువంటి ఖుదాకు మేము సర్వదా తిలాంజలి చెప్పుచున్నాము. ఖుదాయన నొకయాటకాడే యనవొప్పును. (౮౪)

౮౫. అల్లా తన దిక్కునుండి కాని మాచేతులతోగాని యెప్పుడు మీకు పీడను గలుగజేయునో యని మేము మీవిషయమై ఎదురుచూచుచున్నాము. (మం-౨-సి-౧౦-సూ-౯-ఆ-౫౨)

స :- ఏమి తనచేతనో, ముసల్మానులచేతనో యన్యమతస్థులకు బీడ కలుగజేయునన్న ముసల్మానులే యీశ్వరునికి (పోలీసువారు) బంటులయి నిలిచిరా? ఇతర కోట్లకొలది మనుష్యు లీశ్వరునకు ప్రియులుకారా? ముసల్మానులందు బాపకారులున్నను వారు ప్రియులేనా? అటులేని (అంధేర్నగరీ గవరగండరాజు) 'అధర్మపురముల నన్యాయపురాజు' అనుసామెతను బోలిన వ్యవస్థయే యని తేటపడుచున్నది. బుద్ధిమంతులయిన ముసల్మానులు కూడ నట్టి నిరాధారమును, నయుక్తము నగుమతము నంగీకరించుట యాశ్చర్యకరము. (౮౫)

౮౬. స్వర్గము లనువానిలో నెల్లప్పుడు ప్రవహించెడు నదులు గలవనియు, అదనులోని స్వర్గము లందు పవిత్రములైన గృహములు గలవనియు విశ్వసించిన స్త్రీపురుషులతో నల్లా ప్రతిజ్ఞచేసియున్నాడు. అల్లా ప్రసన్నత మెండుగా గలదు. కాన గొప్ప మ్రొక్కులు పడయవచ్చును. ఇకవారితో బరిహాసము జేయుదురు. అల్లా వారితో బరిహాసముజేసెను. (మం-౨-సి-౧౦-సూ-౯-ఆ-౭౨, ౭౯)

స :- తన ప్రయోజనము నెఱవేఱుటకు నిట్లు ఖుదా పేరిట, స్త్రీ పురుషులకు బ్రలోభము గలుగ చేయుటకే కల్పింపబడిన దననొప్పును. ఏలయన నిట్టి ప్రలోభనమును గలుగజేయకున్న మహమ్మదు సాహెబు వలలో నెవ్వడు జిక్కకుండును. ఇటులే యన్యమతస్థులును జేయుచున్నారు. మనుష్యులు

మాత్ర మొకరితోను పరిహాసము చేయుట సహజమే కాని ఖుదా కూడ నొకరితో బరిహాసము చేయుననుట యుక్తముకాదు. ఈ ఖురానన్న నొక గొప్ప యాటగా నున్నది. (౩౬)

౩౭. రసూలు అతనిని విశ్వసించిన వారలు అనువీరు తమ ధనములతోను, ప్రాణములతోను జిహా దొనరించిరి. ఈజనులకే మేలు కలదు. అల్లా వారి హృదయములమీద ముద్రలు వేసియున్నాడు గాన వేరెఱుగనేరరు. (మం-౨-సి-౧౦-సూ-౯-ఆ-౮౮, ౯౩)

స :- చూడుడు. మహమ్మదు సాహెబును విశ్వసించినవారు మంచి వారనియు నతనిని విశ్వసింపని వారు చెడ్డవారనియు ననుట స్వార్థముతో గూడిన మాటయేకద. ఈ మాట పక్షపాతముతోను, నవిద్య తోను గూడినది కాదా! ఖుదా ముద్రలు వేసియున్నందుననే కద వారు పాప మొనరించుచున్నారు. అందు వారియపరాధ మేమియు లేదు. కాని యాయపరాధము ఖుదాదే యననొప్పును. ఏలయన వారి హృదయ ముల మీద ముద్రలువేసి యా యమాయకులను సన్మార్గమునుండి తొలగజేసి యున్నాడే. ఇది యెంత గొప్ప యన్యాయము. (౩౭)

౩౮. వారిని వెలుపల శుద్ధిచేయుటకుగాను నీవు వారిసొత్తులో నుండి దానము పుచ్చుకొనుము. అట్లే దానితో నీవు వారిలోపల శుద్ధిజేయుము. నిశ్చయముగ అల్లా ముసల్మానులనుండి వారి ప్రాణము లను, వారి సొత్తును "వీనికి మాఱుగ వారికి స్వర్గము చిక్కగలద"ను భావమును కొనియున్నాడు. కావున నల్లా మార్గమందు పోట్లాడుచు చంపుదము, చంపబడుదము. (మం-౨-సి-౧౧-సూ-౯-ఆ-౧౦౩-౧౧౧)

స :- మేలయ్యా మహమ్మదుసాహెబు! మేలు! తాము గోకులపు గోసాయిలతో సమానులయి తిరే! ఏమన వారిసొత్తుగైకొని వారిని బవిత్ర పఱతు రనునది గోసాయీలవంటి సమాచారమే! మేలయ్యా ఖుదా! తాము మంచిబేరము కనిపెట్టితిరే? ముసల్మానులచేత దక్కిన బీదజనుల ప్రాణమును దీయించుటయే లాభమనుకొంటిరా! ఇట్లాయనాథుల జంపించి, యీ దయావిహీనులగు మనుష్యులకు స్వర్గ మబ్బునని చెప్పుట ముసల్మానుల ఖుదా దయాన్యాయములకు దూరమై తనఖుదాతనమున కొఱతను గలుగచేసికొని, బుద్ధిమంతులగు ధర్మాత్ములలో నిందితుడై నిలిచెనుగదా! (౩౮)

౩౯. ఓ విశ్వసించిన లోకులారా! మీ యందు దృఢత్వము కలిగినప్పుడు మీరు మీదగ్గఱనున్న కాఫిరులగువారితో బోట్లాడుడు. ప్రతి సంవత్సరమందు నొకపర్యాయమో రెండు పర్యాయములో వారు సంకటములలో బడుచుండుట మీరు చూచుటలేదా? అట్లైనను వారు చెంపలు వేసికొనరు శిక్షను గ్రహిం పరు. (మం-౨-సి-౧౧-సూ-౯-ఆ-౧౨౩, ౧౨౬)

స :- ఈ విశ్వాసఘాతపు మాటలను గూడ గమనింపుడు. మీ పొరుగు వారే కాని పరిచారకులే కాని యవసరము చిక్కినప్పు డెల్లవారితో బోట్లాడుడనియు, వారి కపాయము గలుగజేయు డనియు ఖుదా ముసల్మానులకు నేర్పుచున్నాడు. ఇటువంటి మాటలెన్నియో ముసల్మానులచే గల్పింపబడినవి. ఈ ఖురాను లేఖనుబట్టియే యిప్పుడైనను ముసల్మాను లూహించి తెలిసికొని ఖురాను నందలి దురాచారముల ద్యజింతురేని కడుమే లొనగూడును. (౩౯)

౯౦. నిశ్చయముగ మీపోషకుడు (అల్లా) దేవుడే! ఆయన ఆఱుదినములలో నాకాశములను, బృథివిని సృజించెను. పిమ్మట నాల్గవ ఆకాశము (అర్శ)మీద శయనించెను. అతడు కార్యముల యేర్పాటు చేయుచుండును. (మం-౩-సి-౧౧-సూ-౧౦-ఆ-౩)

స :- ఆకాశ మొక్కటియే. అది చేయబడక యనాదియై యున్నది. దానిని నిర్మించెనని వ్రాయుటవలన నీఖురానును రచించినవారికి బదార్థ విద్య యెంత మాత్రము తెలియకుండె ననుట

స్పష్టము. ఏమి? పరమేశ్వరునకు నాఱుదినములవఱకు చేయవలసివచ్చెనా? మఱి "నా ఆజ్ఞ వలన కమ్ము అనగా నయ్యెను" అని ఖురానునందు వ్రాయబడి యున్నప్పు డాఱుదినములు పట్టవలసిన యావశ్యకమే లేదుగదా! కాబట్టి యాఱుదినములు పట్టెననుట యన్నృతమే. ఆయన వ్యాపకుడేయై యున్న నాకాశముమీద నెందులకు శయనించియుండును? ఇక గార్యముల నేర్పాటు చేయుచుండు నన్న నిజముగ మీఖుదా మనుష్యునితో సమానుడే యనబడును. ఏమన సర్వజ్ఞుడైనవాడు కూర్చుండియుండి యేమి యేర్పాటు చేయుచుండును? కావున నీశ్వరు నెఱుగని యవివేకు లీపుస్తకమును రచియింపవచ్చు నని దీనివల్ల విదితమగుచున్నది. (౯౦)

౯౧. దయాశిక్షలు ముసల్మానులకొఱకే. (మం-౩-సి-౧౧-సూ-౧౦-ఆ-౫౭)

స :- ఏమి! ఈ (ఖుదా) దేవుడు ముసల్మానులకు మాత్రమేనా? ఇతరులకు గాడా? ఇంత ముసల్మానులమీద దయజూపుచు, నన్యులమీద జూపడేని పక్షపాతము గలవాడే యగును. విశ్వాసపాత్రులను (ఈమాన్‌దారులనే) ముసల్మాను లందురన్న వారికి శిక్ష యావశ్యకమే లేదు. ఇంక ముసల్మానులు గాని వారికి నుపదేశము జేయడేని ఖుదా విద్యయే వ్యర్థము. (౯౧)

౯౨. కర్మములందు మీలో నెవడు మంచివాడో పరీక్షించుననని నీవు చెప్పుము (ఏలయన) అవశ్యముగ మీరు చచ్చినపిమ్మట లేపబడుదురు. (మం-౩-సి-౧౨-సూ-౧౧-ఆ-౭)

స :- ఇట్లు కర్మముల బరీక్షించువాడు సర్వజ్ఞుడే కాదు. చచ్చిన పిదప లేపునన్న వారిని నిర్బంధములో బెట్టువాడే యగును. మఱి చచ్చినవారు జీవితులు కాకుండెడి తననియమమును దానే భంగపఱచువా డగునుగదా! కావున నిది ఖుదాత్వమున గొఱతను గలుగజేయుచున్నది. (౯౨)

౯౩. ఓపృథివీ! నీ జలమును బీల్చుకొనుము. ఓఆకసమా! చాలించుము. అని చెప్పబడగా నీరెండిపోయెను. ఓకులమా! యీఅల్లా యొడుబంటె మీకు గుఱుతుగ నున్నది. కావున దానిని వదలిపెట్టుడు. అల్లా భూమిమీద దినుచు సంచరించుగాక. (మం-౩-సి-౧౨-సూ-౧౧-ఆ-౪౪-౬౪)

స :- ఇది యెంత పసితనపుమాట! పృథివ్యాకాశము లెప్పుడైన మాటలు వినగలవా! మేలయా! మేలు! ఖుదాకు నొక యొడుది యగునొంటెయు గలదేని మగది గూడ నుండవచ్చును. అట్లే యేనుగులు, గుఱ్ఱములు, గాడిదలు మున్నగునవియు నుండవచ్చును. ఖుదా తన యొంటెచే బొలమును మేపుట మంచిదేనా? ఆ యొంటెమీద నెక్కుచునున్నాడా యేమి? ఇటులేని నవాబునింటి వంటి గందరగోళమే ఖుదాయింట నయ్యెను. (౯౩)

౯౪. పృథివ్యాకాశము లుండువఱకు వానిమధ్య నెల్లప్పు డుండువారును గలరు. ఇంక భాగ్యవంతులైనవారు పృథివ్యాకాశము లుండువఱకు సదా స్వర్గమున నుండువారై యున్నారు.

(మం-౩-సి-౧౨-సూ-౧౧-ఆ-౧౦౮-౧౦౯)

స :- ప్రళయమునకు బిమ్మట నరక స్వర్గములకు నందఱు పోవుదురన్న నిక నాకసమును బృథివియు నెందుకొఱకుండును? మఱి నరక స్వర్గములు భూమ్యాకాశము లుండువఱకే యుండునన్న స్వర్గనరకములందు నెల్లప్పు డుందురనుమాట యసత్య మయ్యెను. ఇది విద్యావిహీనుల మాటయేకాని యీశ్వరునిది కాని యొకవిద్వాంసునిదికాని కానేరదు. (౯౪)

౯౫. యూసపు తన తండ్రితో "ఓనాతండ్రీ నేనొక స్వప్నములో జూచితి" ననెను.

(మం-౩-సి-౧౨-సూ-౧౨-ఆ.౪-౫౭)

స :- ఈ ప్రకరణమంతయు దండ్రికొడుకుల సంవాదమను కథతో నిండియున్నది. కావున ఖురాను ఈశ్వరకృతము గాదు. కాని యొకానొక మానవుడే మనుష్యుల యితిహాసమును వ్రాసియున్నాడు. (౯౫)

౯౬. ఆకసమును స్తంభములు లేకుండ నిలువబెట్టినవాడే (అల్లా) దేవుడు. దానిని మీరు చూచుచున్నారు గదా! మరల నతడు దర్శమీద నిలిచెను. సూర్య చంద్రుల నాజ్ఞానువర్తుల జేసెను? పృథివిని పఱచినవాడు నతడే. ఆకాశమునుండి నీటిని గురియింపగా నది స్వచ్ఛందముగ కాలువలై పాఱెను. అల్లా ఇష్టమైనట్లు సమృద్ధిగ భోజనము నిచ్చుచున్నాడు. సంకుచితముగను నిచ్చుచున్నాడు. (మం-౩-సి-౧౩-సూ-౧౩-ఆ-౨, ౩, ౧౭, ౨౬)

స :- ముసల్మానుల ఖుదా పదార్థవిద్య నెంతమాత్ర మెఱుగకుండెను. ఎఱిగియే యుండిన గురుత్వము కలిగియుండని యాకాశమును స్తంభములు లేక నిలువబెట్టితి ననుగాథల నెంతమాత్రము వ్రాయక యుండును. ఇక ఖుదా (అర్శ) నాల్గవ యాకాశ మనునొక స్థానమునందు వసించుచున్నాడేని యతడు సర్వశక్తిమంతుడును, సర్వవ్యాపకుడును గానేరడు. అట్లే ఖుదా మేఘ విద్య నెఱిగియుండిన నాకాశమునుండి నీటిని గురియించితినని వ్రాసెనే కాని పృథివినుండి నీటిని పైకెక్కించితినని వ్రాయలే దెందులకు? దీనివలన ఖురానును రచియించినవాడు మేఘవిద్యనుగూడ నెఱుగకుండె ననుటయే నిశ్చయము. సుకృతదుష్కృతములు లేక సుఖదుఃఖములు గలుగజేయుచున్నాడేని పక్షపాతియు నన్యాయకారియు నిరక్షరకుక్షియై నిలచును. (౯౬)

౯౭. అల్లా నిశ్చయముగా నిష్టమైనవాని ద్రోవదప్పించుచున్నాడనియు నిష్టమైనవానిని తన దిక్కునకు లాగుచు మార్గము జూపుచున్నాడనియు జెప్పుము. (మం-౩-సి-౧౩-సూ-౧౩-ఆ-౨౭)

స :- అల్లా త్రోవ దప్పించుచున్నాడేని ఖుదాకు సైతానునకు నిక భేద మేముండెను? సైతా నితరుల ద్రోవదప్పించుట, భ్రమింపజేయుటవలననే కదా దుష్ట డనబడుచున్నాడు. ఖుదాసైత మట్టిపనియే చేసినచో సైతానుకంటె జెడ్డవా డెందులకు గాకుండును? మఱి భ్రమింపజేసెడి పాపమునుబట్టి నరకవాసి యెందులకు గాకూడదు. (౯౭)

౯౮. ఈ ప్రకారముగ మేమీ ఖురానును నరబీ భాషయందు దించితిమి. నీకు కలిగిన పిమ్మటనే నీవు వానియభిప్రాయముల ననుసరించి వర్తింపగలవు. ఇంక నింతకంటె నెక్కువ సమాచార మందజేయు నావశ్యకము లేదు. మామీద లెక్క తీసికోలేదు. (మం-౩-సి-౧౩-సూ-౧౩-ఆ-౩౭,౪౦)

స :- ఖురాను నేవైపునుండి దించెను? ఖుదా మీద నివసించుచున్నాడా యేమి? ఈవార్త నిజమేని యత డేక దేశీయుడైనందున నీశ్వరుడే కానేరడు. ఏమనగా నీశ్వరుడు సర్వత్ర నిరంతరముగ వ్యాపకుడయి యున్నాడు. ఇంక సమాచారము నందజేయుట రాయబారిపనియే యననొప్పును. మనుష్యునివలె నేక దేశీయు డగువానికే గద రాయబారి యావశ్యకత కలదు. అట్లే లెక్క చూచుట, యొప్పజెప్పుకొనుట నయితము మనుష్యునిపనియే కాని యీశ్వరునిది కాదు. ఏలయన నతడు సర్వజ్ఞుడు కాక యొకానొక యల్పజ్ఞుడయిన మనుజుడే యీఖురానును రచియించె ననుట నిశ్చయము. (౯౮)

౯౯. సూర్యచంద్రుల నెల్లప్పుడు సంచరించువారల జేసెను. మనుజు డవశ్యముగ నన్యాయమును, బాపమును జేయుననుట నిశ్చయము. (మం-౩-సి-౧౩-సూ-౧౪-ఆ-౩౩,౩౪)

స :- ఏమి! సూర్యచంద్రులే సదా తిరుగుచున్నారా? భూమి తిరుగుట లేదా? భూమి తిరుగకున్న నెన్నియో సంవత్సరముల కొకదినమును రాత్రియు నేర్పడుచుండెడిది. మనుష్యుడు నిశ్చయముగ నన్యాయమును, బాపమును జేయువాడేని ఖురానుద్వారా యుపదేశము చేయుట వ్యర్థమే. ఏమనగా వారిస్వభావమే పాప మొనరించునదై యున్నప్పుడు వారిలో బుణ్యాత్మత యెన్నటికి లేకుండును. కాని జగత్తున బుణ్యాత్ములు, పాపాత్ములు సర్వదా కనబడుచున్నారు. కాబట్టి యిది యీశ్వరకృత పుస్తక మందలి వాక్యము కానేరదు. (౯౯)

౧౦౦. నేను వానిని జక్కగా జేసి నాలోనుండి వానిలోపలకు బ్రాణము నూదినపు డతనికి మీరు (సిజ్దా) సాగిలపడి దండము పెట్టుడు. ఓ నారక్షకా! నీవు నన్నిట్లు త్రోవ దప్పించితివి. నే నవశ్యముగ వారికి జగమున వృద్ధి కలుగజేయుదును. మఱి త్రోవదప్పింతు ననెను. (మం-౩-సి-౧౪-సూ-౧౫-ఆ.౨౯-౩౯)

స :- ఖుదా తన ప్రాణము నాదామునందు నింపెనన్న నతడుకూడ ఖుదా యయ్యెను. ఖుదా కాకుండినచో (సిజ్దా) నమస్కారాది భక్తి సలుపుటకు గాను దనతో జేరియున్న వానినిగ నెందులకు జేసెను! సైతానును ద్రోవ దప్పునట్లు చేయువాడు ఖుదాయే యయిన, నాయనే సైతానును, బెద్దన్నయు, గురువు నేలగాడు? ఏలయన భ్రమింపజేయువానిని మీరు సైతానని యంగీకరించుచున్నచో ఖుదా సయితము సైతానును భ్రమింపజేసెనుగదా! తాను ముఖాముఖిగ నేను భ్రమింపజేయుదునని యన్నను బైవానిని దండించి చెఱలో నెందుల కుంచలేదు? మఱి చంపివేయలే దెందులకు? (౧౦౦)

౧౦౧. నిశ్చయముగ మేము ప్రతితెగయందు బైగంబరును బంపియున్నాము. మేమెప్పు డేది కోరుచున్నామో మేము దానిని 'కమ్ము' అని యనగా నది యగుచున్నది. (మం-౩-సి-౧౪-సూ-౧౬-ఆ-౩౬, ౪౦)

స :- అన్ని తెగలందు బైగంబరుల బంపినపుడు నందఱును బైగంబరుల యనుమతి ప్రకారముగనే ప్రవర్తించుచున్నారు. ఇంక వారు కాఫిరు లెట్లయిరి? మీ పైగంబరుకు దప్ప మిగిలిన పైగంబరులకు మాన్యత లేదా యేమి? అట్లయిన నిది కేవలము పక్షపాతముతో గూడిన విషయమే. సరి! అన్ని దేశములందు బైగంబరుల బంపియున్నచో నార్యావర్తమం దెవరిని బంపెను? కాన నీమాట యొప్పతగినది కాదు. ఖుదా కోరినప్పుడు "పృథివీ! 'కమ్ము' అని యనునుగద!"-- సరి ఎన్నడును వినలేని యాజడము ఖుదా యాజ్ఞ నెట్లు వినగలుగును? ఖుదా తప్ప మఱొక వస్తువే లేనపుడు వినిన దెవరు? కలిగిన దేమిటి? ఇవన్నియు జ్ఞానశూన్యములగు వార్తలే. కాబట్టి యిట్టి వార్తల నవివేకులు మాత్రమే యొప్పుకొను చున్నారు. (౧౦౧)

౧౦౨. అల్లా కొఱకు గుమార్తెలను నియమించుచున్నాము. అతని యందు బవిత్రత కలదు. కోరినదెల్ల వారికి జిక్కును. అల్లా సాక్షిగ మేమవశ్యముగ బైగంబరులను బంపియున్నాము.

(మం-౩-సి-౧౪-సూ-౧౬-ఆ-౫౭, ౬౩)

స :- అల్లా కొమార్తెలతో నేమి చేయును? ఒకానొక మనుష్యునకు కొమార్తెలు కావలసియుండును. కుమారులు నియమింపబడక కొమార్తెలే నియమింపబడుచున్నారా యేమి? దీనికి గారణమేమో చెపుడు! ఒట్టుపెట్టుకొనుట యసత్యవాదులపనియే కాని ఖుదాది కాదు. ప్రపంచమున దఱచుగా నబద్ధములాడు వాడే యొట్టు పెట్టుకొనుచుండుట కనబడుచున్నది. సత్యవంతుడయినవా డెందుల కొట్టు పెట్టుకొనును. (౧౦౨)

౧౦౩. ఈ లోకు లెవరనగా - అల్లా యెవరి హృదయముల మీదను, జెవుల మీదను, గన్నుల మీదను ముద్రలు వేసినాడో వారే, యీ మతిమఱచిన వారలు. ప్రతి ప్రాణికి జేసినంత ఫలము పూర్తిగ నీయబడును. అన్యాయ మెంత మాత్రము చేయబడదు. (మం-౩-సి-౧౪-సూ-౧౬-ఆ-౧౦౮, ౧౧౧)

స :- (ఖుదా) దేవుడే ముద్రలను వేసినపు డాయమాయకులపరాధము చేయనిదే పీడింపబడిరి గదా! వారిని బరాధీనుల జేసిన నదెంత గొప్పయపరాధ మనవలయును? ఇక నెవడెంత చేసియున్నాడో వానికి న్యూనాధిక భేదము లేక యంతటి ఫలమే యీయబడు ననియు ననుచున్నారు. మఱి వారు

స్వతంత్రముగ బాపము చేసినవారు గారు. కాని ఖుదా చేయించుటవలన జేసియున్నారు. కాబట్టి వారియప రాధ మేమియు లేదు. ఇక వారి కాఫలము కూడ లభింపగూడదు. తత్ఫల మాఖుదాకు లభించుటయే యుచితము. చేసినంత ఫలమే యీయబడునన్న క్షమింపబడున దేమి? మఱి క్షమింపబడుదురేని న్యాయము లేచిపోవును. కాన నిట్టి పోలుపొందులేని ప్రసంగ మీశ్వరుని దెన్నటికిని గానేరదు. కాని బుద్ధిలేని పిల్లలది కాగలదు. (౧౦౩)

౧౦౪. మేము నరకమును కాఫిరుల కొఱకు జెఱసాలను బోలిన స్థానముగా జేసియున్నాము. అట్లే ప్రతి మనుష్యుని మెడలో వానికర్మపత్రమును గట్టియుంచినాము. వాని కొఱకు ప్రళయదినమున నొక పొత్తమును దీయగలము. అది తెఱచియున్నట్లు వాని కగపడును. సూహకు బిమ్మట మేము మానవ సముదాయములలో ననేకుల జంపియున్నాము. (మం-౪-సి-౧౫-సూ-౧౭-ఆ-౮-౧౩, ౧౭)

స :- ఖురానును, పైగంబరులను, ఖురానునందలి ఖుదాను నేడవ యాకాశమును, నమాజు మున్నగువాని నొప్పుకొననివారే కాఫిరులు. వారికే నరకము కలదు అనుమాటలు కేవలము పక్షపాతముతో గూడినవే యన నొప్పును. ఏమనగా ఖురానును మాత్ర మొప్పుకొనువా రందఱును మంచివారు గాని, యితరముల నొప్పుకొను వారందఱును జెడ్డవారుగాని యెన్నడేని కాగలరా? ఒక్కొక్కని మెడలో గర్మ పత్రమును గట్టియుంచినా మనునదియు గడు పసితనపు మాటయే కద. మే మొకని మెడలో నయినను జూచుటలేదు. కర్మఫల మిచ్చుననుటయే దానియభిప్రాయ మన్న మఱి మనుష్యుల హృదయముల మీదను నేత్రాదుల మీదను ముద్రలు వేసినాడు, పాపములను క్షమించును, ననున వన్నియు వట్టిమాటలేనా యేమి? ప్రళయరాత్రినాడే ఖుదా యాపుస్తకమును దీయునేని యిప్పు డాపుస్తకమెక్కడ నున్నది? ఒక సాహుకారివద్ద నుండు లెక్కపుస్తకమువలె వ్రాయుచుండునా యేమి? పూర్వజన్మమే లేదేని జీవుల కర్మములు నుండజాలవు గదా! మఱి కర్మరేఖ నేమి వ్రాయగలుగును. కర్మములు లేనిదే వ్రాసెనన్న వారిపై నన్యాయ మొనరించెననుట స్పష్టము. ఏలయన శుభాశుభకర్మములే లేకున్న వారికి సుఖదుఃఖముల నెట్లు కలుగజేసెను? ఖుదా యిష్టమన్నచో నతడన్యాయమే చేసెను. శుభాశుభకర్మములు లేనిదే సుఖ దుఃఖము లనుఫలముల నెక్కువతక్కువలుగ నిచ్చుట యన్యాయమే యనబడును. ఇంక నాసమయము నందు (ఖుదా) దేవుడే పుస్తకమును జదువునా? లేక యొక సిరస్తాదారుడను నధికారి వినిపించునా? మఱి ఖుదా దీర్ఘకాలసంబంధముగల జీవుల నపరాధము లేనిదే చంపెనన్న నతడన్యాయకారియే యయ్యెను గద.అన్యాయకారి యయినవా డీశ్వరుడే కాజాలడు. (౧౦౪)

౧౦౫. మేము సమూదునకు నాడులొట్టిపిట్టను నిదర్శనముగా నిచ్చినాము. భ్రమింపజేయగలిగిన వానిని భ్రమింపజేయుము. మేమందఱను వారి మార్గదర్శకులతో బిలిచిననా డీబడిన యాయా కర్మపత్రము ప్రతి వాని కుడిచేతియం దుండును. (మం-౪-సి-౧౫-సూ-౧౭-ఆ-౫౯-౬౪-౭౧)

స :- మేలండి మేలు! ఖుదాను దెలియజేయు నాశ్చర్యకరములగు నెన్నిగుఱుతులుకలవో వానిలో నొక యాడులొట్టిపిట్టయు, ఖుదా యున్నాడనుటకు ప్రమాణముగనో లేక ఖుదాను గుర్తించుటకు సాధనముగనో యున్నది గదా! భ్రమింపజేయుమని ఖుదా యాజ్ఞ నొసంగినచో, ఖుదాయే సైతానును ప్రేరేపించువాడును సమస్తపాపముల నొనరింపజేయువాడునయ్యెను. ఇటువంటివానిని ఖుదాయనుట కేవల మవివేకమే. (కయామత్) ప్రళయమునాడే న్యాయవిమర్శనము కొఱకు పైగంబరులను, వారి యుపదేశముల నంగీకరించువారలను పిలుచునన్న ప్రళయము కానంతవఱకు నందఱును నిర్బంధమను నిబ్బందిలో నుండవలసివచ్చును. న్యాయము చేయబడనంతవఱకు నిర్బంధమున నుండుట యెల్లరకు దుఃఖదాయకమే యగును. కావున శీఘ్రముగ న్యాయ మొనరించుటయే న్యాయాధీశున కుచితము. ఇది

పోహింబాయి న్యాయమయ్యెను. ఎట్లనగా నొక న్యాయాధీశు డేబదేండ్లకాలము దొంగలును, సాహుకార్లును ద్రోగు గానంతవఱకు నెవరికిని శిక్షకాని, ప్రతిష్ఠకాని కలుగగూడదని యుత్తరువు చేసినట్లే యిదియు నయ్యెను. గమనింపుడు! ఒక డేబది సంవత్సరముల వఱకు నిర్బంధములో నుండెను. ఒకడు నేడే పట్టు బడెను. కాబట్టి న్యాయమన్న నిట్లు కాదు. వేదముననో, మనుస్మృతియందో చూడుడు! క్షణమాత్రమైన నట నాలస్యము కాదు. తమతమ కర్మానుసారముగ జీవులు దండనమునో, ప్రతిష్ఠనో సదా పొందుచునే యుందురు. ఇక రెండవది పైగంబరులను సాక్షులవలె నుంచుటవలన నీశ్వరుని సర్వజ్ఞత్వమునకును హాని కలుగుచున్నది. సరి! ఇటువంటి పుస్తక మీశ్వరకృతము కాగలదా? కానేరదు. అట్లే యిటువంటి పుస్తకము నుపదేశించువాడెన్నడేని యీశ్వరుడు కాగలడా? ఎన్నిటికిని గానేరదు (౧౦౫)

౧౦౬. ఈ లోకుల కొఱకు నెల్లప్పు డుండుటకు –దోటలు కలవు. వాని క్రిందగా నదులు ప్రవహించుచుండును. ఇక నట బంగారుతో జేయబడిన కంకణములు, నగలు తొడిగింపబడును. ఆకుపచ్చవన్నెగల సన్నని వస్త్రములు దొడుగుదురు. అచ్చట మంచిపట్టు మెత్తలపై నొరగి మంచముల మీద గూర్చుందురు. పుణ్యముచే మంచిలాభము – స్వర్గము పొందవచ్చును.

(మం–౪–సి–౧౫–సూ–౧౮–ఆ–౩౧)

స :– మేలయా మేలు! ఖురానునందలి స్వర్గము నేమిచెప్పవలెను. అందు దోటలు, నగలు, వస్త్రములు, మెత్తలు, దూదిపరుపులు నానందించుటకు గలవుగా! ఒకానొక బుద్ధిమంతు డూహించునేని, యీ మునల్మానుల స్వర్గమునందు నన్యాయముదప్ప నిక్కడికంటె నెక్కువ యక్కడ నేమియు లేద నియే తేటపడును. ఏమియనగా నంతముగల కర్మములకు ననంత ఫలము లభించునని వ్రాయబడి యున్నది. ఇదిగాక యక్కడ బ్రతినిత్యము తియ్యని పదార్థమే తిందురన్న గొలది దినములలోనే యది విషమువలె దోచును. ఇంక వారెల్లప్పుడు సుఖము ననుభవింతురేని యా సుఖమే వారికి దుఃఖరూపమగును. కావున మహాకల్పపర్యంతము ముక్తి సుఖము ననుభవించి పునర్జన్మ మెత్తుదురనుటయే సత్యమయిన సిద్ధాంతము. (౧౦౬)

౧౦౭. అన్యాయము చేసినందులకు మేమీగృహస్థులను బట్టణములకు బట్టణములు నాశనము చేసితిమి. మఱి మేము వారిని జంపవలయునని ప్రతిజ్ఞ చేసియుంటిమి.

(మం–౪–సి–౧౫–సూ–౧౮–ఆ–౫౯)

స :– ఏమి? జనులందఱు బాపాత్ములుకాగలరా! తదుపరి ప్రతిజ్ఞ చేసియున్నందున నీశ్వరుడు సర్వశక్తి మంతుడును గాకపోయెను గద. ఏలయన వారి యన్యాయవర్తనమును జూచినపుడు ప్రతిజ్ఞ చేసియుండెనేకాని తత్పూర్వము వీ రన్యాయము చేయగలరని యెఱుగకుండెనా! దీనివలన దయావిహీ నుడు నయ్యెను గదా! (౧౦౭)

౧౦౮. ఎవడు పిల్లవాడుగా నుండెనో వాని తల్లిదండ్రులు విశ్వాసపాత్రులై యుండిరి. ఇక నీపిల్లవాడు హతమునందును (కుఫ్ర్) మతవిరుద్ధాచరణమునందును వారిని జయించునని మేమతనికి భయ పడుదుము గాక. సూర్యుడు మునుగు చోటునకు వెళ్ళి యా సూర్యుడు బురదగల చెలమలో మునుగు చుండుట నతడు చూచెను. ఓ (జుల్కర్నైన్) సర్వరక్షకా! నిశ్చయముగ యాజూజా మాజూజాలు ప్రపంచ మున గలహము కలుగజేయువారైయున్నారు.

(మం–౪–సి–౧౬–సూ–౧౮–ఆ–౮౦, ౮౬, ౯౪)

స :– సరి! ఖుదాది తెలివిమాలినతన మని చెప్పవలయును. పిల్లల తల్లితండ్రులు తనమార్గము నుండి తొలగింపబడి తనకు ద్రోహము చేయువారు గాకుందురనియే గద యతని కీసందేహము కలిగినది.

కావున నిది యీశ్వర వాక్య మెన్నటికిని గానేరదు. ఇక సూర్యుడు రాత్రియం దొకచెలమలో మునిగి, తిరిగి ప్రాతఃకాలమున నుదయించునని భావించిన యీగ్రంథకర్త యజ్ఞానముతో గూడిన యీవచనమును గూఢ గమనింపుడు. సూర్యుడన బృథివికంటె జాలగొప్పవాడు. అత డొకనదిలోగాని చెలమలోగాని, సముద్ర ములోగాని యెట్లు మునుగగలుగును? ఈ ఖురానును రచించినవాడు భూగోళఖగోళ విద్యల నెఱుగకుండె ననియే దీనివలన విదితమయ్యెను. ఎఱిగియేయున్న నిట్టి విద్యావిరుద్ధమైనమాట నెందులకు వ్రాసియుం డును? ఇక నాపుస్తకముపై విశ్వాసముగల వారియందును విద్యలేదు. విద్యయే యున్న నిట్టి దబ్బఱ పలుకులతో గూడియున్న పుస్తకము నెందుల కొప్పుకొని యుందురు? ఇదిగాక ఖుదా యన్యాయమును జూడుడు? తానే పృథివిని సృజించువాడు రాజు న్యాయాధీశుడుగా నుండి మఱి తానే యాజూజ మా జూజులను బ్రపంచమున గలహము లాడనిచ్చుచున్నాడు. ఇది యీశ్వరత్వమునకు గడువిరుద్ధము. కావున నీపుస్తకము నడవిమనుష్యులు నమ్ముదురే కాని విద్వాంసు లెంతమాత్ర మంగీకరింపరు. (౧౦౮)

౧౦౯. మరియమ తూరుపింట దనవారినుండి వేఱయి కూర్చుండి నప్పటి ప్రసంగమును బుస్తక మున నుదాహరింపుము. ఆమె వారికి దెరచాటై యుండగా మేము మాజీవమును నామెదగ్గఱకు బంపితిమి కావున నాజీవ మామెకొఱకు నారోగ్యమైన మనుష్యరూపము దాల్చెను. ఆమె నీవు సదాచారివయినచో నిశ్చయముగనే దయాసాగరుని శరణుచొచ్చుచున్నానని పలుక మొదలిడెను. అప్పుడాయన నేను నీకు బవిత్రమైన కొడుకును గలుగ జేయుటకు సర్వరక్షకుడగు నీప్రభువుచే బంపబడినవాడనే కాని వేఱుగా భావింపగూడ దనెను. నేను నిందితకార్యము చేయుదానను గాను. నన్నేమనుష్యుడును దాకలేదు. కొడుకు నాకెట్లు కలుగు ననెను? కాని యతనిచే గర్భిణి యయ్యెను. ఆమె యతనితోగూడ దనయింటికి దూరముగ నడవిలోనికి బోయిపడెను. (మం-౪-సి-౧౬-సూ-౧౯-ఆ.౧౬-౨౦, ౨౨)

స :- ఫరిశ్తాలందఱును దేవుని జీవములైన, నవి యా (ఖుదా) దేవుని కంటె వేఱయినవి కాజాలవనియేకద. బుద్ధిమంతులిట విచారింపవలసియున్నది. (రెండవది) మరియమయను కన్యకకు గొడుకు గలుగుటయు దౌర్జన్యమే. ఏమియనగా నామె యొకనితో సంభోగము జేయగోరకుండెను. కాని ఖుదా యాజ్ఞబడసి యాఫరిస్తా ఆమెకు గర్భము కలుగజేసెను. ఇది యన్యాయమే యనుట స్పష్టము. ఇంక నిట ననభ్యతతో గూడిన యనేక వార్తలును వ్రాయబడియున్నవి. వాని నిట వ్రాయుట యుచితము కాదనుకొంటిని. (౧౦౯)

౧౧౦. ఏమి? మేము కాఫిరుల మీదకు సైతానుల బంపినది నీవు చూడలేదా? వారిని మోసపుచ్చి భ్రమింపజేయుచున్నారు. (మం-౪-సి-౧౬-సూ-౧౯-ఆ-౮౩)

స :- (ఖుదా) దేవుడే సైతానులను మోసపుచ్చుటకు నంపుచున్నాడేని మోసపోవువారు నేరస్థులు కానేరరు. ఇక వారికిగాని యాసైతానులకుగాని దండనము కలుగగూడదు. ఏమనగా నిదంతయు ఖుదా యాజ్ఞవలననే జరుగుచున్నది. కావున దీనిఫలము నా (ఖుదా) దేవుడే పొందదగును. ఆయన నిజమైన న్యాయకారియయియున్న దానిఫలమగు నరకమును దానే యనుభవింపదగును. న్యాయమును వదలి యన్యాయ మొనరించునేని యన్యాయకారియే యగును. మఱి యన్యాయ మొనర్చువాడే పాపాత్ము డనబడుచున్నాడు. (౧౧౦)

౧౧౧. పశ్చాత్తాపపడుచు విశ్వసించినవానిని, మంచి కర్మముల నొనరించుచు మరల సుశిక్షితుడై మంచి మార్గము గ్రహించినవానిని నేను నిశ్చయముగ క్షమింపగలను.

(మం-౪-సి-౧౬-సూ-౨౦-ఆ-౮౨)

స :- పశ్చాత్తాపపడుటవలన బాపములు క్షమింపబడునని ఖురాను నందుగల యీవార్త యందఱను

బాపకారుల జేయునదే యనవొప్పును. ఏలయనగా దీనివలననే పాపాత్ములకు బాపమొనరించుటకు సాహసమధికముగ నుప్పొంగుచున్నది. ఇందువలన నీగ్రంథము, గ్రంథకర్తయు బాపకారులకు బాపమొన ర్పుట కధికసాహసమును గలుగజేయును. కావున నీపుస్తక మీశ్వరకృతము కానేరదు. ఇందు జెప్పబడినవా డీశ్వరుడును గాజాలడు. (౧౧౧)

౧౧౨. కదలకుండుటకు మేము భూమిమీద బర్వతముల నిలిపియున్నాము.

(మం-౪-సి-౧౭-సూ-౨౧-ఆ-౩౧)

స :- ఖురాన్‌కర్త భూమి తిరుగుచున్నది మొదలగు విషయముల నెఱిగియున్న బర్వతములు నిలుపుటవలన భూమి కదలకుండునని యెప్పుడును వ్రాయకుండెడివాడు. పర్వతముల నుంచకున్న భూమి కదలగలదని యతనికి శంక గలిగినది. మఱి యట్లుంచియున్నను భూకంపము కలుగునపుడెల్ల నీభూమి యెందులకు గదలుచున్నది? (౧౧౨)

౧౧౩. మేమాస్త్రీ కుపదేశము చేసితిమి. ఆమె తనగోప్యాంగములు గాపాడుకొనెను. కావున మేమామె లోనికి దమజీవము నూదితిమి. (మం-౪-సి-౧౭-సూ-౨౧-ఆ-౮౧)

స :- ఇట్టి యశ్లీల వాక్యములు ఖుదా యనుటెట్లు? సభ్యపురుషులవిగూడ గానేరవు. మానవులే యిటువంటి మాటలను వ్రాయుట యనుచితమని తలచునపు డవి యీశ్వరునకెట్లు మంచివగును? ఖురానిట్టి వార్తలతో గూడియున్నందుకే దూషితమగుచున్నది. వేదములవంటి మంచిమాటలతో గూడి యున్న నిది మిగులప్రశంసనీయమై యుండెడిది. (౧౧౩)

౧౧౪. పృథివ్యాకాశముల మధ్యనున్న జనులును, సూర్యచంద్ర నక్షత్రములున్ను, పర్వతములును, పశువులు నల్లాకు (సిజ్దా) నమస్కారము చేయుచుండుట నీవుచూడలేదా? ఇక నక్కడివారికి బంగారు కంకణములు, ముత్యములు, తొడిగింపబడును. అట్లే వారు పట్టు దుస్తులు కట్టుకొని యుందురు. చుట్టు దిరుగు వారికొఱకును నిలుచుండు వారి కొఱకు నా యింటిని పవిత్రముగ నుంచుము. ఇక తన మాలిన్య మును దూరము చేయవలెను. తమ కానుకలు చెల్లింపవలెను. పురాతనమైన యింటిచుట్టు దిరుగవలెను. అట్లే యల్లా నామమును స్మరించవలెను. (మం-౪-సి-౧౭-సూ-౨౨-ఆ-౧౭, ౨౩, ౨౬, ౨౮, ౩౪)

స :- ఔరా! జడపదార్థములన్న నవి పరమేశ్వరు నెఱుగజాలవు కద! మఱి యతని భక్తి నెట్లు సలుపగలుగును? కావున నీపుస్తక మీశ్వరకృత మెన్నటికిని గానేరదు. కాని యొకానొక భ్రాంతి జెందిన వాడు వ్రాసియున్నాడని మాత్రము గోచరమగుచున్నది. భళిరే! కడుమంచి స్వర్గము! బంగారుతోను ముత్యములతోను జేయబడిన నగలును పట్టు దుస్తులును ధరించుటకు నట జిక్కునుగా! వీరి స్వర్గమున్న నిచ్చటి రాజగృహములకంటె మంచిది కాదని తేటపడుచున్నది. అది పరమేశ్వరుని గృహమన్నప్పు డతడందు నివసించుచు నుండవచ్చును. అటులేని విగ్రహారాధన మేలకాదయ్యెను? మఱి యితర విగ్రహా రాధనజేయువారల నేల ఖండించుచున్నారు? ఖుదా కానుకలు పుచ్చుకొనుచు దనయింటి ప్రదక్షిణము జేయునాజ్ఞ యొసంగుచు నట్లే పశువుల జంపించి తినిపించుచు నున్నాడేని యీఖుదా దేవాలయముల లోని దుర్గాభైరవులను బోలిన వాడే యయ్యెను. ఇక నితడే గొప్పవిగ్రహారాధనను జేయించువాడు నయ్యెను. విగ్రహములన్నిటికంటె మసీదు గొప్పవిగ్రహముగా నున్నది. కాన ఖుదాయు ముసల్మానులును గొప్పవిగ్రహారాధకులుగాను, పౌరాణికులును, జైనులును జిన్నవిగ్రహారాధకులుగాను నున్నారు. (౧౧౪)

౧౧౫. నిశ్చయముగ మీరు మరల కయామతునాడు (ప్రళయదినము) లేపబడుదురు.

(మం-౪-సి-౧౮-సూ-౨౩-ఆ-౧౬)

స :- ఏమి? (కయామత్) ప్రళయము కాబోవునంతవఱకు బీనుగులు సమాధులలోనే పడి

యుండునా? లేక యేదోయొక స్థానమందా? వానిలోనే పడియుండునన్న మురిగి దుర్గంధముతో గూడిన యాశరీరములందుండగల పుణ్యాత్ములుకూడ దుఃఖమే యనుభవింతురు. ఇది న్యాయము కాదు, అన్యాయమే. ఇక దుర్గంధమధికమై రోగములు నుత్పన్నము లగుటవలన ఖుదాయు ముసల్మానులును బాపభాగులే యగుదురు. (౧౧౫)

౧౧౬. వారు వధింపజేసినవారి నాలుకలు, వారిచేతులు, వారికాళ్ళు నాదినము వారిగూర్చి సాక్ష్యము బలుకును. "ముసల్మానుల హృదయములందు" నాప్రకాశమనున దొకగూటిలోనుండు లాంతరునందలి దీపమువలె నుండి (జైతూను) నూనెతో బ్రజ్వలింపబడుచున్నది. ఇక నది పూర్వదిక్కునకు లేదు. పశ్చిమమునకును లేదు. నూనె దానికి సమీపమున నున్నది. అగ్ని రగిలింపకున్నను నది ప్రజ్వలించును. ప్రకాశముపై బ్రకాశము కలదు. అల్లా యిష్టమైనవానికి దనప్రకాశపుదిక్కున మార్గము జూపుచున్నాడు.
(మం-౪-సి-౧౮-సూ-౨౪-ఆ-౨౪, ౩౫)

స :- కాళ్ళు, చేతులు మున్నగునవి జడములగుటవలన నవి సాక్ష్యమెన్నటికిని బలుకలేవు. ఇక నీమాట సృష్టిక్రమమునకును విరుద్ధమై యున్నందున మిథ్యయే యననొప్పును. దృష్టాంతమిచ్చి యున్నట్లు ఖుదా అగ్నియా? విద్యుత్తా? ఇట్టి దృష్టాంత మీశ్వరునియందు ఘటిల్లనేరదు. కాని సాకార పదార్థమందు ఘటిల్లగలదు. (౧౧౬)

౧౧౭. అల్లా ప్రతిపశువును నీళ్ళతో సృజించెను. వానిలో గొన్ని తమ కడుపుతో నడచును. ప్రతివాడు అల్లాయొక్కయు నతనిరసూలులయాజ్ఞను బాలించుగాక! ఖుదా యతని రసూలుల యాజ్ఞను బాలింపుమని దయజూపబడుటకుగాను మీరు రసూలునాజ్ఞను బాలింపుడు.
(మం-౪-సి-౧౮-సూ-౨౪-ఆ-౪౫, ౫౨, ౫౪, ౫౬)

స :- పశువుల శరీరములం దన్నితత్త్వములు గోచరమగుచుండగా గేవలము జలముతో సృజించె ననుటదెట్టి తత్త్వ విచారమో గదా! ఇది కేవల మవిద్యతో గూడిన ప్రసంగమే. అల్లాతో సమానముగ పైగంబరు నాజ్ఞను బాలింపవలసినపు డతడు ఖుదాకు భాగస్థుడయ్యెనా? లేదా? అటులేని ఖురాను నందు (ఖుదాలాషరీక్) అద్వితీయుడని యేల వ్రాయబడెను? మీరు నట్లెందులకనుచున్నారు. (౧౧౭)

౧౧౮. ఏదిన మాకాశము మేఘములతో గూడ బద్ధలగునో (ఆదినము) పరిశ్తాలు దింపబడుదురు. కావున కాఫిరులమాట వినకుము. వారితో గొప్ప (జిహాదు) యుద్ధము జేయుము. అల్లా వారిచెడుపులను మేలులుగా మార్చును. ఎవడు పశ్చాత్తాపపడి మంచికర్మముల నొనరించునో వాడు నిశ్చయముగ అల్లా దిక్కునకు రాగలుగును. (మం-౪-సి-౧౯-సూ-౨౫-ఆ౨౫, ౫౨, ౭౦, ౭౧)

స :- ఆకాశము మేఘములతో గూడ బద్ధలయిపోవు ననుమాట యెన్నటికి నిజము కాజాలదు. ఆకాశము ఘనపదార్థమై యున్న నది బద్ధలగును. ఈ ముసల్మానుల ఖురాను, శాంతిభంగముచేసి యుద్ధాది కలహములు కలిగించునదై యున్నది. కావున ధర్మాత్ములైన విద్వాంసులు దీనినెంతమాత్ర మంగీకరింపరు. సరి! పాపపుణ్యములు మార్చబడుననుటయు నొక మంచిన్యాయమే. ఆపాపపుణ్యములనునవి నువ్వులు మినుములవలె నొకటి కొకటి మార్చ వీలగునాయేమి? పశ్చాత్తాపమువలన బాపవిమోచనమై యీశ్వరుడు లభించునన్న బాపమొనరించుట కెవడును వెఱవకుండును. కావున నీమాటలన్నియు విద్యావిరుద్ధములే యనుట స్పష్టము. (౧౧౮)

౧౧౯. మేము (వహీ) పుస్తకమును మూసాపరముగ బంపితిమి. దీనిని దీసికొని నాజనులకొఱకు వెళ్ళుము. నిశ్చయముగ నీవెంట బడుదురు. కావున ఫిరూనునగరమునను నకేబుల (ప్రోగుచేయువారి) నంపెను. ఏపురుషుడు నన్ను సృజించినాడో యతడే మార్గము జూపుచున్నాడు. అతడే నాకు దినిపిం

చుచు, ద్రాగించుచున్నాడు. ఆయన మహాప్రళయదినమున నాయపరాధములు క్షమించునని యాశపెట్టు కొని యున్నాను. (మం-౫-సి-౧౯-సూ-౨౬-ఆ-౫౨-౫౩-౮౭-౮౯-౭౨)

స :- ఖుదా మూసాపరముగ వహి (పుస్తకము) పంపినపుడు మరల దావూదు పరముగను, ఏసు పరముగను, మహమ్మదుసాహెబు పరముగను, పుస్తకముల నెందుకంపెను? ఈశ్వర వాక్యము సర్వదా యొకేరీతిగను, మఱపుచెందనిదిగ నుండును. దానికి బిమ్మట ఖురాను వఱకు పుస్తకముల బంపుటవలన మొదటి పుస్తకము లపూర్ణములనియు, మఱపుతో గూడిన వనియు నమ్మబడును. ఈ మూడు పుస్తకము లను సత్యములేని ఖురాననునది మిథ్యయగును. ఇట్లే నాలుగును నొకదానికొకటి విరుద్ధములై యున్నం దున సర్వదా సత్యమైనవి కాజాలవు. ఖుదా (రూహాలును) జీవములను సృజించెనన్న నవి చావనే చచ్చును. అట్లయిన వానికొకప్పు డభావము కలుగకపోదుగదా! పరమేశ్వరుడే మనుష్యాది ప్రాణులకు దినిపించుచు ద్రాగించుచునున్న నెవరికిని రోగము సంభవింపగూడదు. అట్లే యత డందఱకు సమానముగ భోజన మొసంగవలయును. రాజానకును, దరిద్రునకును శ్రేష్ఠనికృష్ట భోజనము లభింపకూడదు. పరమే శ్వరుడే తినుపించువాడును, ద్రాగించువాడును, బథ్యము చేయించువాడు నయియున్న, రోగములే సంభ వింపకుం డెడివి. కాని ముసల్మానాదులకు గూడ రోగములు సంభవించుచునే యున్నవి. ఖుదాయే రోగ ముల మాన్పి శమనము కలుగజేయువాడయిన, ముసల్మానుల శరీరములందు రోగములే యుండదగవు. రోగములుండు నేని యీఖుదా పూర్ణవైద్యుడు కాడు. పూర్ణ వైద్యుడేయైన ముసల్మానుల శరీరములందు రోగము లెందు కున్నవి? అతడే పుట్టించుచు గిట్టించుచునున్న నాఖుదాకే పాపపుణ్యము లంటవచ్చును. జన్మజన్మాంతరములుల కర్మానుసారముగ వ్యవస్థ చేయుచున్నాడేని యతని యపరాధమేమియు లేదు. ఖుదా పాపముల క్షమించువాడును, మహాప్రళయరాత్రిని, న్యాయము చేయువాడును నయియున్న నతడు పాపముల బెంచువాడును బాపములతో గూడినవాడును నగును. క్షమింపడన్న నీఖురానులో వ్రాయబడిన మాట మిథ్య యనకతప్పదు. (౧౧౯)

౧౨౦. మావంటి మనుష్యుడవు నీవు కావుగాని సత్యవంతుడవయిన నిదర్శనము జూపుము. దాని కీయాడు లొట్టిపిట్ట గలదు. ఒకసారి నీళ్ళు త్రాగవలసియున్న దనెను.

(మం-౫-సి-౧౯-సూ-౨౬-ఆ-౧౫౪, ౧౫౫)

స :- మేలు! ఱాతిలోనుండి యాడులొట్టిపిట్ట వెళ్ళెనను మాట నెవడయిన నమ్మగలడా? ఈమాట నంగీకరించినవా రడవి మనుష్యులై యుండిరి. ఆడులొట్టిపిట్టను నిదర్శనముగా జూపుట పామర త్వమే. కావున నీశ్వరకృతము కాదు. ఈ పుస్తక మీశ్వరకృతమైయున్న నిట్టి వ్యర్థమైన విషయము లిందుండకుండెడివి. (౧౨౦)

౧౨౧. ఓమూసా! నేను నిశ్చయముగ బ్రముఖుడనయిన యల్లాను నీచేతికఱ్ఱను బారవేయు మనెను. పారవేయగా నది పామువలె గదలుచున్నట్లగపడెను. ఓమూసా! వెఱవకుము. నిశ్చయముగ బైగం బరులు నాసమీపమున వెఱవరు. అల్లాయొక్క యారాధ్యుడు కాడు. కాని యతడు గొప్ప (అర్శ) యేడవ యాకాశమున కధిపతి. నామీద హఠము చేయకుడు. ముసల్మానులయి నాదగ్గఱకు రండు.

(మం-౫-సి-౧౯-సూ-౨౮-ఆ-౯, ౧౦-౨౬-౩౧)

స :- ఇంకను జూడుడు! అల్లా తననోటితో దానే గొప్పయని చెప్పుకొనుచున్నాడు. తన నోటితో తనప్రశంస జేసికొనుట శ్రేష్ఠపురుషుల పనియైనను గానపుడు ఖుదా దెట్లు కాగలదు? అందులకేగద యింద్రజాలపు తంత్రముల జూపించి యడవిమనుష్యులను వశపఱచుకొని దానరణ్యమున ఖుదాయయి నిలిచినది. ఇటువంటి మాట యీశ్వరకృతపుస్తకమం దెన్నడు నుండజాలదు. గొప్ప (అర్శ) యేడవ

యాకాశమున కధిపతియై యున్నవా డేకదేశీయుడగుటజేసి యీశ్వరుడే కానేరడు. హతమొనరించుట మంచిది కాదేని ఖుదాయు, మహమ్మదుసాహెబును దమ స్తుతులచే నాపుస్తకము నెందులకు నింపిరి? మహమ్మదుసాహె బనేకులను జంపెనుగదా! అది హతమయ్యెనా కాదా? ఈ ఖురాను పునరుక్తులతోను బూర్వాపరవిరుద్ధ విషయములతోను నిండియున్నది. (౧౨౧)

౧౨౨. ఇక నీవు పర్వతముల జూతువు. అవి స్థిరముగ నిలిచి యున్నందుల కనుమానపడుదువు. అవి చలించుమేఘములవలె బోవుచున్నవి. ఇది అల్లా పనితనము. ఆయన ప్రతి వస్తువును దృఢపఱచి యున్నాడు. నిశ్చయముగ నతడు మీరు చేయుచుండు కార్యముల నెఱుగువాడయి యున్నాడు.

(మం-౫-సి-౨౦-సూ-౨౭-ఆ-౮౮)

స :- పర్వతములు మేఘములవలె జలించుననుట ఖురాను వ్రాసిన వారి దేశమున గానవచ్చునేమో కాని యన్యత్ర కాదు. ఇక ఖుదా యెఱుగు వాడనుట ద్రోహియైన సైతానును బట్టి దండింపకపోవుట వలన విదితమే కద. అతడింతవఱ కొకద్రోహినైనను బట్టి దండింపలేకపోయెను గదా! ఇంతకు మించిన ప్రమాదము మఱేమి యుండగలదు? (౧౨౨)

౧౨౩. మూసా వానిని గ్రుద్దగా వాని యాయువు సమాప్తమయ్యెను. ఓరక్షకా! నిశ్చయముగ నేను దమ ప్రాణి కన్యాయము చేసితిని గావున నన్ను క్షమింపుమనెను. అంత నతని క్షమించెను. నిశ్చయముగ నతడు క్షమించువాడును, దయాళువు నయియున్నాడు. నీ ప్రభువు దేని గోరుచున్నాడో యట్లే దేని నిష్టపడుచున్నాడో దాని సృజించుచున్నాడు. (మం-౫-సి-౨౦-సూ-౨౮-ఆ-౧౫,౧౬, ౬౮)

స :- ముసల్మానులయు, గ్రైస్తవులయు, పైగంబరులయు, ఖుదా యొక్కయు దయను జూడుడు! పైగంబరగు మూసా మనుష్యుని జంపగా ఖుదా క్షమించెను! వీరిరువురును నన్యాయకారులై నిలిచిరా లేదా? తన యిష్టము వలననే కోరుచున్నట్లు పుట్టించుచున్నాడా? ఆయన తన యిష్టము వలననే యొకని రాజుగను, మఱొకని దరిద్రుడుగను, నొకనిని విద్వాంసుడుగను, మఱొకని మూర్ఖుడుగను జేసియున్నాడా యేమి? అటులేని యీ ఖురాను సత్యము కాదు. ఇక నన్యాయకారి యయినందున నతడు ఖుదాయే కాజాలడు. (౧౨౩)

౧౨౪. తల్లి దండ్రులకు మేలు గలుగజేయవలయునని మనుష్యులను మేమాజ్ఞాపించియున్నాము. ఒకవేళ దల్లిదండ్రులిరువురు నీతో జగడమాడి నాతో వారిని జేర్చుకోమన్న నీవావిషయము నెఱుగవు. కావున వారిరువురి మాట యంగీకరింపకుము. నీవు నాదిక్కునకు రావలసియే యున్నది. మేమవశ్యముగ నూహను సంఘము దిక్కునకు బంపియున్నాము. కావున వారియందు దొమ్మిదివందల యేబది సంవత్స రములుండెను. (మం-౫-సి-౨౦-సూ-౨౯-ఆ-౮. ౧౪)

స :- తల్లిదండ్రుల సేవచేయుట మంచిదే. ఖుదాతో జేర్చుకొను మన్నప్పుడు వారి యామాట వినకపోవుటయు మంచిదే. కాని తల్లి దండ్రులు మిథ్యా భాషణాదులు చేయుట కాజ్ఞాపించిన నంగీకరింప వలయునా యేమి? కాన నీ మాట సగము మంచిదిగను, సగము చెడ్డదిగనున్నది. ఇక నూహు మొదలగు పైగంబరులనే ఖుదా ప్రపంచములోని కంపుచున్న నన్యజీవముల నెవడంపుచున్నాడు? అందఱ నతడే యంపుచున్నాడేని యందఱును బైగంబరు లెందులకు గారు? మొదట మనుష్యులకు వేయిసంవత్స రముల యాయువుండిన నిప్పుడెందుకు లేదు? కావున నీ మాట నిజము కాదు. (౧౨౪)

౧౨౫. మొదటితూరి యల్లా యుత్పన్నము చేయుచున్నాడు. మరల దానిని రెండవసారియు నుత్పన్నము చేయగలడు. అతనివైపునకే తిరిగి పోదురు. ఏదినము వర్షము మహాప్రళయము తటస్థించునో యాదినము పాపాత్ములు నిరాశులగుదురు. విశ్వసించినవారు, మంచికార్యములు చేసినవారు తోటయందు

శృంగారింపబడుదురు. మేమొక వాయువును బంపినపు డాపాలము పసుపువన్నె దాల్చుటను జూతురు. ఈ ప్రకారమే యాలోకుల హృదయముల మీద అల్లా ముద్రలు వేయుట వారెఱుగరు.

(మం-౫-సి-౨౧-సూ-౩౦-ఆ-౧౧, ౧౨, ౧౫, ౫౧, ౫౯)

స :- అల్లా రెండు పర్యాయములే యుత్పన్నము చేయువాడై మూడవ పర్యాయము చేయడేని యుత్పన్నము చేసిన పిమ్మట నప్రయోజకుడయి కూర్చుండవలసి వచ్చును! ఒక పర్యాయముగాని, రెండు పర్యాయములుగాని యుత్పన్నము చేసిన పిమ్మట నతని సామర్థ్యము ప్రయోజనము లేనిది వ్యర్థమై నది యయిపోవును. న్యాయమొనరించు దినమున బాపాత్ములు నిరాశులయి యున్న నుండవచ్చు. కాని ముసల్మానులు దప్ప తక్కినవారందఱును బాపాత్ములుగా నెన్నబడి నిరాశులై యుందురని మాత్రము దీనిభావము కాదుగదా? ఏమనగా నీ ఖురానునందు బలుచోట్ల వ్రాయబడినట్లు పాపాత్ములన్న నితరు లనియే యభిప్రాయము. తోటలో నుంచబడుట శృంగారింపబడుట మాత్రమే ముసల్మానుల స్వర్గ మయిన నది యీప్రపంచము వంటిదే యయ్యెను. అచ్చట దోటకాపులును, గంసాలులు నుండవచ్చును. లేదా ఖుదాయే తోటకాపు, కంసాలి మున్నగువారి పనులు చేయుచుండవచ్చును. ఇక నొకని కాభూషణ ములు తక్కువగ నున్న నట దొంగతనము కూడ జరుగుచుండవచ్చును. స్వర్గమున దొంగిలించువారలను నరకమునందు గూడ వేయుచుండవచ్చును. అట్లయిన సదా స్వర్గమున నుందురను మాట మిథ్య యగును. కృషికుల పాలము మీద కూడ ఖుదా దృష్టి కలదు గద. ఆ విద్య పాలముజేసెడి యనుభవమును బట్టియే కలుగును. ఇక ఖుదా తన విద్యచే నన్ని సంగతుల నెఱుంగుచున్నాడని యంగీకరించినను నిట్లు భయము చూపుట మాత్రము తన యభిమానమును బ్రసిద్ధపఱచుటకే యనవచ్చును. మఱి అల్లా జీవుల హృయములపై ముద్రలువేసి పాపము జేయించినప్పు డా పాపము నతడే పొందవలెను. జీవులు పొంద రాదు. జయాపజయములు సేనాధీశునకు గలుగునట్టు లీపాపము లన్నియు ఖుదాకే తగులును. (౧౨౫)

౧౨౬. ఈ ఆయతులు యుక్తిమంతుని పుస్తకమందలివి. ఆకాశములను స్తంభములు లేకుండ నుత్పన్నముచేసి యుండుట మీరు చూచుచున్నారు. కదలకుండ బృథివి మీద బర్వతముల నుంచి యున్నాడు. రాత్రిని దినమందును, దినమును రాత్రియందును అల్లా ప్రవేశింపచేయుచుండుట నీవు చూడలేదా?సముద్ర మధ్యమున నోడలు అల్లా అద్భుతశక్తితో మీకు దన నిదర్శనముల జూపుటకు నడచుచుండుట చూచుటలేదా? (మం-౫-సి-౨౧-సూ-౩౧-ఆ-౨, ౧౦, ౨౯, ౩౧)

స :- మేల్మేలు! సర్వథా జ్ఞానవిరుద్ధములగు నాకాశాదుల బుట్టించి యున్నాడనుటయు, వానిని స్తంభములచే నిలువబెట్టి నాడనుటయు, భూమి కదలకుండునటుల బర్వతముల నేర్పఱచి యుంచినాడ నుటయు బహుచమత్కారములు గలవాని పుస్తకమందలి మాటలే! కొంచెము చదివినవాడయిన నిట్టి వ్రాత నెన్నడు వ్రాయడు, నమ్మడు. ఇంకను జమత్కారము చూడుడు. దినమున్నప్పుడు రాత్రి లేదు. రాత్రి యున్నప్పుడు దినము లేదు. కాని యిట నొకదాని యందొక దానిని బ్రవేశింప జేయుచున్నాడని వ్రాయబడి యున్నది. ఇది గొప్ప పామరుల మాటయే కావున నీఖురాను జ్ఞానపుస్తకము కానేరదు. ఇది జ్ఞానవిరుద్ధమైన మాట కాదా? ఓడలు మనుష్యులనుండియు గ్రియాకౌశలాదులవలన నడచుచున్నవా? లేక ఖుదా శక్తివలననా? ఇనుముతోగాని రాతితోగాని యోడల జేసి సముద్రమున నడిపించితిమేని ఖుదా నిదర్శనము మునిగిపోవునా లేదా? కాన నీ పుస్తక మొకవిద్వాంసునిచేగాని యీశ్వరునిచేగాని రచియింప బడినది కాజాలదు. (౧౨౬)

౧౨౭. ఆకాశమునుండి పృథివి మీద గార్యముల నేర్పఱచుచున్నాడు. మరల నొకదినమందే యక్కడ కెక్కిపోవుచున్నాడు. ఆదినపరిమాణము మీరు లెక్కపెట్టు సంవత్సరములనుబట్టి వేయి

సంవత్సరములు. అతడు పరోక్షమును ప్రత్యక్షము లెఱుగువాడు, దయాళువు, ప్రముఖుడునై యున్నాడు. మఱి వాని జక్కగజేసి వానియందు దనలోనుండి జీవము నూదెను. మీకొఱకు నియమింపబడియున్న మృత్యుదేవత మీ ప్రాణములను హరించునని చెప్పుము. మేము కోరిన యెడల నవశ్యము ప్రతిప్రాణికి శిక్ష నొసంగుదుము. కాని నేను నరకమును (జిన్నులతోను) భూతపిశాచములతోను మనుష్యులతోను నింపుదు నను నాప్రతిజ్ఞ మాత్రము నిశ్చయమే. (మం-౫-సి-౨౧-సూ-౩౨-ఆ-౬, ౯, ౧౧,౧౩)

స :- ముసల్మానుల ఖుదా మనుష్యునివలె నేకదేశీయుడని స్పష్టముగ సిద్ధమయ్యెను. వ్యాపకుడయిన నొకస్థానమున నుండి యేర్పాట్లు చేయుటయు నెక్కుట దిగుటయు లేకుండెడిది. ఖుదా ఫరిశ్తాను బంపుచున్నాడన్నను దానేక దేశీయుడే యయ్యెను. తానాకసముపై ప్రతీక్షించుచు గూర్చుండి ఫరిశ్తాలను బరుగెత్తించుచున్నాడు. ఫరిశ్తాలు లంచము దీసికొని యొకవ్యవహారము జెడగొట్టినను లేదా యొకపీనుగును విడిచిపెట్టి పోయినను ఖుదాకేమి తెలియగలదు? సర్వజ్ఞుడు సర్వవ్యాపకుడు నగునతనికే తెలియగలదు. అతడట్టు లేడుగదా? అటులయియున్న ఫరిశ్తాలను నంపవలసిన యనేకవిధముల ననేకుల బరీక్షింపవలసిన పనియే లేకుండెడిది. ఇక బోవుటకు నొకవేయి సంవత్సరములు పట్టుటయు వచ్చుటకు బోవుటకు నేర్పాట్లు చేయుటవలన నతడు సర్వశక్తిమంతుడును గాడు. ప్రాణముల గొనిపోవువాడు ఫరిశ్తాయన్న నాఫరిశ్తాను జంపువాడెవడు? అతడు నిత్యుడన్న నమరుడయి ఖుదాతో సమానుడయ్యెను. ఒక ఫరిశ్తా యొకేసమయమందు నరకమును నింపుటకు జీవులకు శిక్ష యొసంగజాలడు. పాపములులేక వారిని దనయిష్టము వచ్చినట్లు నరకమున బడద్రోసి వారిని దుఃఖపెట్టుచు సంతోషించుచున్నచో నాఖుదా పాపకారియు, నన్యాయకారియు, దయాహీనుడు నగును. ఏ పుస్తకమున నిట్టిమాటలు కలవో అది యొక విద్వాంసునిచేగాని, యీశ్వరునిచేగాని రచింపబడినది కాదు. అట్లే దయాన్యాయములు లేనివా డీశ్వరు డెన్నడును గాజాలడు. (౧౨౭)

౧౨౮. మీరు మృత్యువునకు జంకియో లేదా నఱకులాటకు వెఱచియో పరుగెత్తుటవలన మీకెంత మాత్రము లాభము లేదని చెప్పుము. ఓ నబీ స్త్రీలారా! మీలో నెవరయిన లజ్జవిడిచి వత్తురేని మీకు రెండింతలు పాపము తగులును. ఇది అల్లాకు సులభము. (మం-౫-సి-౨౧-సూ-౩౩-ఆ-౧౬, ౩౦)

స :- యుద్ధమున నెవడును బరుగెత్తకుండుటకు దమకు విజయము కలుగుటకు, జచ్చుటకైనను భయపడకుండుటకు, నైశ్వర్యమభివృద్ధి జెందుటకు, దమమతము వృద్ధిబొందుటకుగాను మహమ్మదు సాహెబిట్లు వ్రాసియు, వ్రాయించియు నుండవచ్చును. సరి! స్త్రీలు లజ్జ విడిచి రాగూడదన్న పైగంబరు సాహెబు లజ్జవిడిచి రావచ్చునా? స్త్రీలకు బాపము తగులుట, పైగంబరునకు బాపము తగులకపోవుట యనున దెట్టి న్యాయమో. (౧౨౮)

౧౨౯. మీ యిండ్లలోనే యుండుడు. అల్లారసూలుల యాజ్ఞను బాలింపుడు. అన్యమును గాదు. జైదనువా డామెతో దనప్రయోజనమును నెఱవేర్చుకొనినప్పుడు స్వమతమందు విశ్వాసము గలవారిని దమపోషణమున నున్నవారి స్త్రీలతో ప్రయోజనము నెఱవేర్చుకొనునప్పు డాటంకము కలుగ కుండుటకును, బెండ్లి (నికాహ) చేసికొనుట పాపమని తలపకుండుటకును నామెను నతనికి బెండ్లి చేసితిమి. ఖుదా ఆజ్ఞ యావిషయమందు నబీకి నేమియు నిబ్బంది లేదు. మహమ్మ దెవరికిని దండ్రికాడు. తన నబీకొఱకు మెహరు చెల్లింపకయే ప్రాణమిచ్చునట్టి, విశ్వాసార్హురాలయినట్టి స్త్రీని బొందవచ్చును. వారిలో నీవు నొకానొకతె నపేక్షింపవచ్చును. లేదా యిష్టమయినదానితో సంబంధము జేసికోవచ్చును. నీకిందు బాపము కలుగదు. ఓలోకులారా! విశ్వాసవంతులగు మీరు పైగంబరుని యిండ్లలో ప్రవేశింపకుడు.

(మం-౫-సి-౨౨-సూ-౩౩, ఆ.౩౩, ౩౭, ౩౮, ౪౦, ౫౦, ౫౧, ౫౩)

స :- స్త్రీలు చెఱసాలలో నుండునేరస్థులవలె గృహములందుండవలెననియు, బురుషు లటులుగాక స్వతంత్రులయి యుండవలెననియు వ్రాయుట యెంత యన్యాయము? ఏమి? స్త్రీల చిత్తము శుద్ధ వాయు సేవనమును శుద్ధదేశ సంచారమును, సృష్టియందలి యనేక పదార్థముల జూచుటను గోరదా? ఇందులకే గాబోలు ముసల్మానుల పిల్లలు విశేషముగ దిరుగువారు, విషయాసక్తులు నగుచున్నారు? అల్లారసూలుల దొక్కటే యాజ్ఞయా? లేక పరస్పరవిరుద్ధమైనవా? ఒక్కటందురేని నిద్దఱియాజ్ఞల బాలింపుడనుట వ్యర్థము. పరస్పర విరుద్ధమై వేర్వేఱన్న నొకటిసత్యమై రెండవది యసత్యమైనదా? అట్లయిన నొకడు ఖుదా, మఱొకడు సైతానగును. సహభోగియునై నిలుచును. మేల్మేలు! ఖురాను నందలి ఖుదాను, పైగంబరులను ఖురానును, నేమని చెప్పవలయును? ఇతరులకు హాని కలుగజేసి తన ప్రయోజన మును సిద్ధింపజేసికొనగోరువా డవశ్యముగ నిట్టిటక్కులే పన్నుచున్నాడు. కావున మహమ్మదుసాహెబు గొప్ప విషయాసక్తుడయి యుండెననికూడ దీనివలన సిద్ధమైనది. లేనిచో (లేపాలకను) పుత్రుని భార్యను, దనభార్యగ నెందులకు జేసికొనును? ఇక నిట్టి పనుల జేసిన వానికి ఖుదా కూడ సహాయకుడై యన్యాయ మును న్యాయమని నిలిపెనుగదా! మనుష్యులలో నెంత తెలివిమాలినవా డయినను గొడుకు పెండ్ల మును గోరుటలేదు! ఇట్టి విషయాసక్తమగు లీలలు చేయుటకు నబీకి నేయాటంకములు కలుగకపోవుట కడువిపరీతమే. నబీ యొకనికి దండ్రిగాకుండిన లేపాలకుడను జైదెవనికి గొడుకయి యుండెను? ఇట్లు పైగంబరుసాహెబు కొడుకు భార్యనుగూడ వదలకున్న నితరుల వదలియుండునా? ఎంత చమత్కా రము చేసినను దుష్కార్యము చేయువా డెక్కప్పుడయిన నిందితుడు గాకపోడు. ఒకానొక పురుషుని భార్య నబీను మెచ్చి (నికాహ) పెండ్లి చేసికొనగోరినను నది హలాలే యగునా? నబీ యిష్టమయిన స్త్రీని ద్యజింప వచ్చునట కాని మహమ్మదుసాహెబు స్త్రీలు మాత్రము పైగంబరు నేరస్థుడయినను నతని నెంతమాత్రము విడువగూడ దనుట గొప్ప యధర్మము. పైగంబరు గృహములం దన్యులెవ్వరయినను వ్యభిచారదృష్టితో బ్రవేశింపగూడదుగదా! నబీ యెవనియింట బ్రవేశింపగోరినను నిరాటంకముగ బ్రవేశింపవచ్చునాయేమి? మఱి గౌరవార్హుడును గాగలుగునా? మేల్మేలు! ఈ ఖురానీశ్వరోక్తమనియు, మహమ్మదుసాహెబును బైగంబరనియు, ఖురాను చెప్పిన యీశ్వరుని బరమేశ్వరుడనియు నమ్మగలుగునంతటి మూర్ఖుడెవడైన నుండునా? ఇట్లు యుక్తిశూన్యమును ధర్మవిరుద్ధమునగు విషయములతోగూడిన యీమతమును 'అరేబియా' దేశవాసు లంగీకరించి యుండుట కడునాశ్చర్యమే. (౧౨౯)

౧౩౦. రసూలునకు దుఃఖము కలిగించుటగాని, యతనికి బిమ్మట నతని స్త్రీలను బెండ్లి (నికాహ) చేసికొనుటగాని మీకెంతమాత్రము నుచితము కాదు. నిశ్చయముగ నది యల్లాకు గొప్పపాపమని తోచక పోదు. అల్లాకును నతని రసూలునకును దుఃఖము కలిగించువారల నల్లా ధిక్కరించుననుట నిశ్చయము! దోషులుగాని ముసల్మానులకును, వారి స్త్రీలకును దుఃఖము కలుగజేయువారు నిశ్చయముగ నిందమోపు వారును, వృథాపాపమును బ్రచురింప జేయువారు నగుదురు. ధిక్కారార్హు లెటజిక్కినను బట్టుకొనబడవల యును, జంపబడవలయును. ఓ నారక్షకా! వారికి రెండింతలపాపము కలుగజేయుము. వారిని విశేషముగ ధిక్కరించుము. (మం-౫--సి-౨౨-సూ-౩౩-ఆ-౫౩, ౫౭, ౫౮, ౬౧, ౬౮)

స :- భళిరేభళి! ఏమి యిట్లు ఖుదా తన ఖుదాతనమున గసబిఱచుచున్నది ధర్మపూర్వకమేనా? ఏలయన రసూలునకు దుఃఖము కలిగింపరాదని చెప్పుట మంచిదేకాని యితరులకు దుఃఖము కలిగింప రాదని రసూలునుగూడ నాజ్ఞాపింపవలసియుండెను. అట్లాజ్ఞాపింపలే దెందులకు? ఒకనికి దుఃఖము కలిగిం చుటవలన నల్లాకూడ దుఃఖితుడగుచున్నాడా, యేమి? అటులయిన నతడీశ్వరుడు కాజాలడు. అల్లా యును, రసూలును, నిష్టమయినవానికి దుఃఖము కలిగింపవచ్చుననుట సిద్ధము కాదా? వీరికిగాక మఱి

యెవ్వరికైనను దుఃఖము కలిగింపవచ్చునా! ముసల్మానులకును, ముసల్మానుల స్త్రీలకును దుఃఖము కలిగించుట మంచిది కానట్లు యన్యమతస్థులకు దుఃఖము కలుగజేయుటయు గడుదౌర్జన్యమేకద. ఇక దీని నంగీకరింపరేని వారు పక్షపాతము కలవారని గ్రహింపుడు. మేల్మేలు! సంసారమున ద్రోహము కలుగజేయు నో ఖుదా! ఓ నబీ మీబోటి దయాళువులు ప్రపంచమున జాలతక్కువే యుందురు! అన్యజనులెట జిక్కినను వారిని బట్టుకొని చంపుడని వ్రాయబడియున్నది! ఆ ప్రకారమే యన్యమతస్థులు ముసల్మానులయెడ వర్తింపవలెనన్న ముసల్మానులకది చెడ్డగ దోచునా లేదా? పైగంబరు లెంతటినిర్దయు లనవల యును. అన్య మతస్థులకు రెండింతలు దుఃఖము కలిగింపవలయునని పరమేశ్వరుని బ్రార్థించుచున్నా రుగా! ఇదియు బక్షపాతముతో గూడినట్టియు, స్వప్రయోజనమును సిద్ధింపజేసికొనునట్టియు గొప్ప యధర్మము కద. ఇందువలననే యిప్పటి వఱకును, ముసల్మానులం దనేకశఠులిట్టిపనులు చేయుట కెంతమాత్రము వెనుదీయరు. శిక్షితుడుకాని మనుష్యుడు పశుసమానుడయి యుండుననుట స్పష్టమేకద. (౧౩౦)

౧౩౧. అల్లా యనునతడే వాయువుల నంపెను. అవి మేఘములను లేపుచున్నవి. మరల మేము పీనుగులుగల నగరము దిక్కునకు వానిని దఱిమి వానితో మృతినొందియున్న యాపృథివిని జీవింపజేసితిమి. ఈప్రకారమే సమాధులలోనుండి పీనుగులు లేపబడును. అతడెల్లప్పుడుండు నింటియందు దయతో మమ్ముల దించెను. మాకు దానియందు శ్రమము కలుగదు. దానియందు రోగములును సంభవింపవు. (మం-౫-సి-౨౨-సూ-౩౫-ఆ-౯, ౩౫)

స :- ఔరా! ఖుదా వాయువుల నంపగా నవి మేఘముల లేపుచున్నవనియు, నట్లే వానితో బీనుగుల బ్రతికించుచున్నాడనియు ననెడి ఖుదా (ఫిలాసఫీ) తత్త్వవిద్య నేమని చెప్పవలయును! ఇవి యీశ్వర వాక్యము లెంత మాత్రము కానేరవు. ఏలయన నీశ్వరునిపని నిరంతర మొకేవిధముగ జరుగుచుండును. గృహములుండునన్న జేయబడక యుండనేరవుకద. మఱి చేయబడినవి సర్వదా యుండనేరవు. శరీరముగలవాడు పరిశ్రమము చేయనిచో దుఃఖితుడగును. శరీరధారియైనవాడొకప్పుడైనను రోగగ్రస్తుడు గాకబోడు. ఒకస్త్రీతో సమాగమ మొనరించువాడే రోగముల దప్పించుకొనకయున్న ననేకస్త్రీలతో విషయానంద మనుభవించువాని దుర్దశ యేమికావచ్చును! కాన ముసల్మానుల నిరంతర స్వర్గవాసముకూడ సుఖకర మెన్నటికి గాజాలదు. (౧౩౧)

౧౩౨. ఖురాన్ సాక్షిగ బంపబడినవారలలో నిన్ను జక్కనిమార్గము చూపువానిగా నాదయాళువయిన ఖుదా దించియున్నాడనుట నిశ్చయము. (మం-౫-సి-౨౩-సూ-౩౬-ఆ-౨-౫)

స :- ఇప్పుడు వీక్షింపుడు! ఈ ఖురాన్ ఖుదాచే రచియింపబడిన నతడేల యొట్టుపెట్టుకొని యుండును? నబీ ఖుదాచే నంపబడినవాడేని (లేపాలకుడను) కొడుకుభార్య నెందులకు మోహించియుండును? ఖురాను నంగీకరించువారు చక్కనిమార్గమున గలరనుట వట్టిమాటయే. ఏమనగా సత్యము నొప్పుట, సత్యము బలుకుట, సత్యము నాచరించుట, పక్షపాతరహితమగు న్యాయధర్మములు సేవించుట మున్నగున వెందుకలవో యదియే చక్కనిమార్గము. ఇక వీనికి విపరీతమైనదాని ద్యజింపదగునని ఖురానునందుగాని, ముసల్మానులందుగాని, వీరి ఖుదాయందుగాని లేనేలేదు. అందఱికంటె మించిన పైగంబరు, మహమ్మదుసాహెబేని యతడందఱికంటె నధికవిద్వాంసుడు, శుభగుణయుక్తుడు నెందులకు గాకయుండును? కాన బండ్ల నమ్ముస్త్రీ తనరేగుబండ్లు పుల్లని వననట్లే యీమాటయు నయ్యెను. (౧౩౨)

౧౩౩. కొమ్మూదగా నకస్మాత్తుగ వారు సమాధులలోనుండి లేచి తన ప్రభువు దిక్కునకు బరుగెత్తుదురు. వారేమేమి సంపాదించియుండిరో వారి పాదములు సాక్ష్యము పలుకును. ఒక వస్తువును బుట్టింప గోరినపు డతని యాజ్ఞ తప్ప వేఱేమియు లేకుండును. కాన దానిని 'కమ్ము' అనియనగా నదియై నిలు

చును. (మం-౫-సి-౨౩-సూ-౩౬-ఆ-౫౧, ౬౫, ౮౨)

స :- ఇప్పుడీపోలు పొందు లేనిమాటల నాలకింపుడు! పాదము లెన్నడైన సాక్ష్యము పలుకగలు గునా? ఖుదా తప్ప నాసమయమం దాజ్ఞాపింపబడుట కెవ్వడుండెను? ఏమయ్యెను? ఏవస్తువును లేకుండె నన్న నిది యబద్ధమగును. ఉండెనన్న 'ఖుదా తప్ప వేఱువస్తువు లేదు; ఖుదా యన్నిటిని జేసెను' అను మాట యబద్ధమై పోవును. (౧౩౩)

౧౩౪. త్రాగువారి కట తెల్లనిరంగుగల మంచిసారాయి గిన్నెలో బోసి యీయబడును. సుందర మైన నేత్రములుగల చక్కనిస్త్రీలు క్రిందికి జూచుచు వారిదగ్గఱ కూర్చుండి యుందురు. వారు దాచి పెట్టిన గ్రుడ్లవంటివారని గ్రహింపదగును. ఏమి? ఇక మేము చావమా? నిశ్చయముగ లూతు పైగంబరు లలోనివాడే కాన మేము వానికిని వాని జనులందఱకు ముక్తిని గలుగ జేసితిమి. కాని యొకవృద్ధురాలు వారిలో దప్పిపోయెను. మరల మేమితరులను జంపితిమి. (మం-౬-సి-౨౩-సూ-౩౭-ఆ-౪౫, ౪౬, ౪౮, ౪౯, ౫౮, ౧౩౩-౧౩౬)

స :- ఏమండి! ఇట ముసల్మానులు సారాయి చెడ్డదనుచున్నారు. కాని వీరిస్వర్గమందో సారాయినదులే ప్రవహించుచున్నవి! ఇక్కడ సురాపానమును నిషేధించుట మంచిదేకాని దీనికి బదులుగ నక్కడ వీరిస్వర్గమందు మాత్రము కడుచెఱుపు కలదు. స్త్రీలు మిక్కిలిగ నున్నందున నాకనిచిత్తమైన స్థిరముగ నుండకపోవచ్చును. గొప్ప రోగములుకూడ సంభవించుచుండవచ్చును! అక్కడి మనుష్యులు శరీరధారులయి యుందురేని చావనే చత్తురు. శరీరధారులు గారేని భోగవిలాసముల ననుభవింపలేకపోదురు. ఇక వారిని స్వర్గమునకు గొనిపోవుటయు వ్యర్థమే. లూతును బైగంబరని యంగీకరింతురేని యతనితో నతని కుమార్తెలు సమాగమ మొనరించి యిరువురు కొడుకుల గనిరని బైబిలు నందు వ్రాయబడి యున్నదే. దానినిగూడ నంగీకరింతురా లేదా? అంగీకరింతురేని యతని బైగంబరని భావించుట వ్యర్థము. ఇటువంటివాని సహచరులకును ఖుదా ముక్తి గలుగజేయునన్న నాఖుదా సయితము నట్టివాడే యగును. ఏలయన వృద్ధురాలి వృత్తాంతము జెప్పువాడును బక్షపాతముతో నితరుల జంపువాడు నెన్నటికి ఖుదా కానేరడు. ఇట్టి ఖుదా ముసల్మానులయింట నుండదగునే కాని యన్యత్ర కాదు. (౧౩౪)

౧౩౫. ఎల్లప్పుడుండుటకు స్వర్గములు కలవు. వాని తలుపులు వారికొఱకు దెఱవబడియుం డును. అందు మెత్తలు వేయబడి యుండును. అట ఫలములను బానీయపదార్థములను దెప్పింపగలుగు దురు. క్రిందికి దృష్టినుంచెడు సమాన వయస్సుగల స్త్రీలు వారిదగ్గఱ నుందురు. ఫరిశ్తాలందఱును (సిజ్దా) సాష్టాంగ నమస్కారము చేసిరి. కాని సైతాను గర్వపడి సిజ్దా చేయలేదు. అతడు కాఫిరులలోనివాడయి యుండెను. ఓసైతానూ! నేను నారెండు చేతులతో జేసిన యావస్తువును సిజ్దా చేయకపోవుటకు నిన్నడ్డగించినదేది? నీవు గర్వపడితివా? లేక గొప్పయధికారము గలవారిలోనివాడ ననుకొంటివా? అని యడుగగా, నేనతనికంటె శ్రేష్ఠుడను. నీవు నన్నగ్నితోను నతనిని మంటితోను జేసియున్నావనెను. నీకవశ్య ముగ మతిచలించినది. కాన నీవాకాశమునుండి వెళ్ళిపొమ్ము. (జజా) న్యాయము పొందెడి, దినమువఱకు నాదిక్కునుండి నీకు ధిక్కారమనెను. ఓప్రభువా! పీనుగులు లేచుదినమువఱకు నిదానించుమనెను. నిశ్చయముగ నీవు నిదానింపబడినవారలలోనివాడవే యనెను. ఆ (తెలిసియున్న) దినము వఱకు నీగౌరవ సాక్షిగ నేనవశ్యముగ వారినందఱను ద్రోవతప్పింతునని యొట్టుపెట్టుకొనెను.

(మం-౬-సి-౨౩-సూ-౩౮-ఆ-౫౦, ౫౨, ౫౫, ౭౩-౮౨)

స :- ఖురానునందట నుద్యానవనములు, నదులు, గృహములు మున్నగునవి యున్నట్లు వ్రాయ బడియున్నదే, అవి సనాతనమునుండి యుండినవి కావు. సర్వదా యుండబోవు. ఏలయన సంయోగముచే

గలుగుపదార్థము సంయోగమునకు బూర్వము లేకుండెను. భావిపదార్థము వియోగాంతమున నుండదు. ఆ స్వర్గమే యుండదన్న నందుండగలవను పదార్థము లెల్లప్పుడు నెట్లుండగలుగును? ఏలయన పఱపులు, మెత్తలు, ఫలములు, పానీయములను పదార్థము లక్కడ జిక్కునని వ్రాయబడి యున్నది. కాన ముసల్మానుల మతము వ్యాపించినకాలమున నరేబియా దేశము విశేషధనముగలది గాదనియు, నందువల ననే మహమ్మదుసాహెబు పఱపులు మున్నగువాని కథలు వినిపించి బీదలను దనమతమందు జిక్కించు కొనెననియు దీనివలన సిద్ధమగుచున్నది. స్త్రీలుగలచోట నిరంతరసుఖ మెక్కడిది? ఆ స్త్రీ లక్కడ కెక్కడ నుండి వచ్చిరి? లేక వారు స్వర్గముననే యుండువారా? వచ్చినవారేని వెళ్ళిపోదురు. అక్కడనే యుండు వారన్న ప్రళయమునకు బూర్వ మేమిచేయుచుండిరి? నిరర్థకముగ గాలము గడపుచుండిరా? ఇక ఖుదా ప్రతాపము చూడుడు! అత డాజ్ఞాపింపగా ఫరిశ్తాలందఱు నంగీకరించి యాదామునకు నమస్కారము చేసిరి. కాని సైతానంగీకరింపలేదట. ఖుదా సైతానుతో నేను నారెండు చేతులతో వాని జేసితిని. నీవభిమానపడకు మని యనెనట. దీని నుండి ఖురాను నందలి ఖుదా రెండుచేతులుగల మనుష్యుడయి యుండెనని సిద్ధమగు చున్నది. కాన నతడు వ్యాపకుడు గాని, సర్వశక్తిమంతుడుగాని కానేరడు. నే నాదామునకంటె నుత్తముడనని సైతాను పలికినది నిజమే. ఖుదా యతని మీద గోపపడినదెందులకు? చెప్పరేమి? ఖుదా గృహ మాకాశము నందే కలదా? పృథివిమీద లేదా? అటులేని మొదట కాబాను ఖుదా గృహమని యెందులకు వ్రాసెను? మఱి పరమేశ్వరుడు తన సృష్టిలోనుండి సైతాను నెట్లు వేఱుపఱపగలడు? సృష్టియంతయు బరమేశ్వరు నిదే కదా. దీనివలన ఖురానునందలి ఖుదా స్వర్గమునకు మాత్రమే ప్రభువని విదితమయ్యెను. ఖుదా యత నిని ధిక్కరించి చెఱలోనుండగా ఓ ప్రభువా! నన్ను ప్రళయదినమువఱకు విడిచిపెట్టుమని సైతానన్న ప్పుడు ముఖస్తుతిచే నుప్పొంగి వానిని ఖుదా ప్రళయదినమువఱకు విడిచిపెట్టెను. సైతాను విడుదలబొంది యిక నేను జనులను విశేషముగ భ్రమింపజేయుదుననియు వారిలో ద్రోహము కలిగింతుననియు ననెను. అప్పు డాఖుదా నీవెవరిని భ్రమింపజేయుదువో వారిని, నిన్నును నరకమున బడవేయుదుననెను. సజ్జను లారా! ఇట్టి సైతానును ఖుదా భ్రమింపజేసెనా? లేక తనంతట తానే భ్రమించెనా? గమనింపుడు! ఖుదా భ్రమింపజేసినచో నతడు సైతానుల మించిన సైతానయ్యెను. సైతాను స్వయముగనే భ్రమించెనన్న నన్య జీవులును దమంతటదామే భ్రమింతురు. సైతాను నావశ్యకమే యుండదు. ఇక ద్రోహియైన యాసైతా నును ఖుదా విడిచిపెట్టినందున నతడుకూడ నధర్మమొనరింపజేయుచు నాసైతానునకు భాగస్థు డయ్యెన నుట స్పష్టము. తానే దొంగిలింపజేసి దండించునేని యతని యన్యాయమున కొకమేర యుండునా? (౧౩౫)

౧౩౬. అల్లా నిశ్చయముగ సకలపాపములు క్షమించుచున్నాడు. అతడు క్షమించునట్టి దయాళువు. ప్రళయదినమున భూమియంతయు నతని పిడికిలిలోను, నాకాశము లతని కుడిచేతిలోను జొట్టబడి యుండును. ఇక ప్రభువు ప్రకాశముచే బృథివి ప్రజ్వలితమగును. కర్మపత్రములు వ్రాయబడును. పైగంబరులును, సాక్షులును రప్పింపబడి న్యాయపూర్వకముగ దీర్పుచేయబడును. (మం-౬-సి-౨౪-సూ-౩౯-ఆ-౫౩, ౬౭-౬౯)

స :- ఖుదా సకలపాపములను క్షమించునన్న సంసారమున నంతట బాపమొనరింప జేయుచున్నా డనియు, దయావిహీనుడనియు నెఱుగదగును. ఏమియన దుష్టునియెడ దయజూపి యతనిని క్షమించిన నతడధికముగ దుష్టకార్యములనే చేయును.అట్లే ధర్మాత్ములైనవారి కెందఱికో దుఃఖము కలిగించును. కించిదపరాధమైనను క్షమింపబడునేని జగత్తునందంతట నపరాధములే వర్ధిల్లసాగును. ఏమి? పరమేశ్వరు డగ్నివంటి ప్రకాశము కలవాడా? మఱి కర్మపత్రములు ప్రోగుచేసి యెక్కడ నుంచబడును? వానిని

్రాయువాడెవడు? ఖుదా పైగంబరులమాటలను, సాక్షులమాటలను విశ్వసించి న్యాయమొనరించునేని యతడు సర్వజ్ఞుడు గాడు. సమర్థుడును గాడు. అతడ న్యాయము చేయడు. న్యాయమే చేయునన్న గర్మములకు దగినట్లే చేయుచుండవచ్చునుగదా! ఇక నాకర్మము లనునవికూడ బూర్వపరవర్తమాన జన్మముల ననుసరించియే యుండును. మఱి క్షమించుట, హృదయములమీద ముద్రలువేయుట, శిక్షింపకపోవుట, సైతానుద్వారా భ్రమింపజేయుట, ప్రతిబంధమందుంచుట మున్నగు మాటలన్నియు న్యాయవిరుద్ధము లనుట స్పష్టము. (౧౩౮)

౧౩౯. జ్ఞానియు బ్రముఖుడునగు అల్లాచే నీపుస్తకము దింపబడినది. అతడు పాపములు క్షమించువాడును, పశ్చాత్తాపముల స్వీకరించువాడునై యున్నాడు. (మం-౬-సి-౨౪-సూ-౪౦-ఆ-౨, ౩)

స :- అల్లాపేర నమాయకు లీపుస్తకము నొప్పుకొందురనియే యిట్లు కల్పింపబడినది. కాని యిందలి కొన్ని మాటలుదప్ప తక్కిన పుస్తకమంతయు మిథ్యోక్తులతో నిండియున్నది. సత్యమైనమాటలను మిథ్యోక్తులతోగూడి కలుషితమై యున్నవి. కావున నీఖురాను, ఖురాను చెప్పిన ఖుదా, వీని నొప్పుకొను వారందఱును బాపమును వృద్ధిపఱచువారు, పాపములు చేయుచు జేయించువారు నయియున్నారు. ఏలయన బాపమును క్షమించుటయే గొప్పయధర్మము. ఇందువలననే కద ముసల్మానులు పాపోపద్రవముల నొనర్చుట కంతగా భయపడకుండునది. (౧౩౯)

౧౪౦. రెండు దినములలో నాకాశముల నేడింటిని జేసెను. ఒక్కొక్క యాకాశమున వానివాని పనినుంచెను. ఇంక నతనిదగ్గఱకు బోయినపుడు వారి వారిచెవులును, గన్నులు, జర్మములును బనులు చేసినట్లు వారిమీద సాక్ష్యము బలుకును. వారు 'మీ చర్మాంగములతో మీరెందులకు మామీద సాక్ష్యము బలికితి' రందురు. అందుల కవి 'ప్రతివస్తువును బిలిచినట్టి యల్లా మమ్మును బిలిచియున్నా'డని బదులు చెప్పును. అతడవశ్యముగ బీనుగులను బ్రతికించుచున్నాడు.

(మం-౬-సి-౨౪-సూ-౪౧-ఆ-౧౨, ౨౦, ౨౧, ౩౯)

స :- మేల్మేలు ముసల్మానులారా! మీరు సర్వశక్తిమంతుడని నమ్ముచున్న మీఖుదా సప్తాకాశములను రెండు దినములందా చేయగలిగినది! వస్తుతః సర్వశక్తిమంతుడైనవాడు క్షణములో సమస్తమును జేయగలుగును గదా! పోనిండు. చెవులను, గన్నులను, జర్మములను నీశ్వరుడు జడములుగ జేసియున్నాడు. అవి సాక్ష్యమెట్లు పలుకగలుగును? సాక్ష్యమిప్పించునన్న మొదట నతడు వానిని జడములుగ నెందులకు జేసెను? అప్పుడు వానికి శక్తి నిచ్చునన్నచో తననియమమును దానే రద్దుచేసికొనునా? ఇక జీవులమీద సాక్ష్యము బలికినప్పు డాజీవులు తమతమ చర్మాంగములతో మీరు మామీద సాక్ష్యమెందులకు బలికితిరని యడుగగా నవి 'మేమేమి చేయగలము? మేమును రప్పింపబడితిమి' అనునిట్టి మాట లెన్నడేని సంభవములగునా? ఒకానొకడు నేనొక గొడ్రాలి పుత్రుని ముఖముజూచితి నన్నట్లయ్యెనుగదా! పుత్రుడు గలిగినప్పు డామె గొడ్రాలెట్లు? గొడ్రాలన్న నామెకు బుత్రుడే కలుగనేరడు గద! ఇదియు నటువంటి మిథ్యాలాపమే. కాన నిది యంతకంటె నబద్ధము. అట్లే యతడు పీనుగుల బ్రతికించునన్న, మొదట జంపుట యెందులకు? తానుకూడ జావగలడా లేదా? చావడన్న జచ్చుట చెడ్డదని యెందులకు భావించుచున్నాడు? మఱి ప్రళయరాత్రివఱకు జచ్చిన జీవము లేముసల్మానునింట నుండును? అపరాధము లేనిదే వానినట్లు ఖుదా ప్రతిబంధములో నెందులకుంచును? శీఘ్రముగ న్యాయము చేయడెందులకు? ఈశ్వరుని యీశ్వరత్వమునకు గళంకము కలుగజేయునవి యిటువంటి మాటలే కద. (౧౪౦)

౧౪౧. పృథివ్యాకాశముల తాళపుచెవు లతనివద్ద గలవు. భోజనసామగ్రి నొకనికెక్కువగ నొకనికి దక్కువగ దనయిష్టానుసారము కలుగజేయుచున్నాడు. కోరినదానిని సృజించుచున్నాడు. ఇష్టపడినవానికి

బిడ్డల నిచ్చుచున్నాడు. కొందఱకు బిడ్డలను గలుగజేయుచున్నాడు. తన యిష్టానుసార మొకతెను గొడ్రాలుగ జేయుచున్నాడు. అల్లాతో మాటలాడగల శక్తిమంతు డెవడును లేడు. *తెరచాటుననుండి సందేశము దెలుపుటకు ఫరిశ్తాయను రాయబారి నంపుచున్నాడు. (మం-౬.సి-౨౫.సూ-౪౨.ఆ.౧౨-౪౯-౫౧)

స :- ఖుదాయొద్ద దాళపుచెవుల దొకనిలయమే యుండవచ్చును. ఏమనగా నతనిచే నన్నిచోట్ల యందలి తాళములు విప్పబడుచుండవచ్చును. ఇదియు బసితనపు మాటయే. పుణ్యకర్మముల నొనర్చని వానికిగూడ దనయిష్టానుసార మైశ్వర్య మొసంగుచున్నాడా? అట్లే యిష్టమైనవాని గష్టపెట్టుచున్నాడా! అటులేని యతడు గొప్పయన్యాయకారియే యగును. స్త్రీలు సయితము మోహితలయి చిక్కుటకు నాఖురానుకర్త చతురత్వ మింకను జూడుడు. ఇష్టమైన దానిని బుట్టింపగలుగునట. అట్లయిన రెండవ ఖుదానుగూడ బుట్టింపగలుగునా లేదా? పుట్టింపజాలడన్న నతని సర్వశక్తిమత్త్వమున కాటంకము గలుగును. భళా! మనుష్యులలో నిష్టమైనవానికి బిడ్డల నిచ్చుచున్నాడేని కోళ్ళు, చేపలు, పందులు మున్నగు వానికి బెక్కుబిడ్డలు పుట్టుచున్నవే. వాని కెవడిచ్చుచున్నాడు? స్త్రీపురుషులకు సంపర్కము లేకుండ నెందులకియ్యడు? తన యిచ్ఛానుసార మొకతెను గొడ్రాలుగాజేసి యేల దుఃఖింపజేయుచున్నాడు? ఆహా! అతని సమ్ముఖమున నెవడును మాటలాడనేరడన్న నాఖుదా యెంతటి తేజముగల వాడని చెప్పవలయును? ఆయన మొదట జెప్పియున్నట్లు తెరవేసి మాటలాడుననియు, ఫరిశ్తాలుగాని పైగంబరులుగాని ఖుదాతో మాట్లాడగలరనియు వ్రాయబడిన యీవార్తలే నిజమయిన ఫరిశ్తాలును, బైగంబరులును, దమ ప్రయోజనములు బాగుగ నెఱవేర్చుకోవచ్చును.

ఒకానొకడు ఖుదా సర్వజ్ఞుడనియు, సర్వవ్యాపకుడనియు నన్న "తెఱచాటున మాటాడును" "తపాలవార్తవలె సమాచారములు దెలిసికొనును" అని వ్రాయబడిన మాటలన్నియు వ్యర్థములే. అటువంటివాడేని యతడు ఖుదా కాడు. కాని యొకయుక్తిపరుడయిన మనుష్యుడు గావచ్చును. కాన నీఖురా నీశ్వరకృత మెన్నటికి గానేరదు. (౧౩౯)

౧౪౦. ఏసు ప్రత్యక్షప్రమాణముతోడ వచ్చినప్పుడు, (మం-౬-సి-౨౫-సూ-౪౩-ఆ-౬౩)

స :- ఏసుకూడ ఖుదాచే బంపబడిన వాడేని యతని యుపదేశమునకు విరుద్ధముగ నాఖుదా ఖురాను రచించిన దెందులకు? మఱి అంజీలను నది ఖురానునకు విరుద్ధముగా నున్నది. కావున నీ పుస్తకము లీశ్వర కృతములు కానేరవు. (౧౪౦)

౧౪౧. వానిబట్టి నరకమధ్యమున కీడ్చుకొనిరండు. అట్లే యగును. ఇక మేము మంచినేత్రములు గల చక్కని స్త్రీలను వారికి బెండ్లి జేసియిత్తుము. (మం-౬-సి-౨౫-సూ-౪౪-ఆ-౪౭-౫౪)

స :- ఔరా! ఖుదా న్యాయకారియు, జీవుల బట్టించి యీడ్పించునా? ముసల్మానులఖుదాయే యిటులున్న నతని యుపాసకులగు ముసల్మాను లనాథులయిన నిర్బలులబట్టి యీడ్చిన నందాశ్చర్య

---

* ఈ ఆయతునకు భాష్యము 'తఫసీర్ హుసేనీ' యను గ్రంథమున ముహమ్మదు సాహెబు రెండుతెరల మధ్యనుండి ఖుదా ధ్వనిని వినెనని వ్రాయబడి యున్నది. ఒకతెర జరీపోగులదట. రెండవది తెల్లముత్యములు గలదట. డెబ్బది సంవత్సరములు నడువగలిగినంతటి దూర మారెండు తెరల మధ్య నుండెనట. ఇతడు ఖుదా యేనా? లేక తెరచాటు నుండి మాటలాడు స్త్రీయై యుండెనా? బుద్ధిమంతులు విచారింతురు గాక. వీరీశ్వరుని దుర్దశపాలు చేసిరి! వేదోపనిషదాదిసద్గ్రంథములందు బ్రతిపాదింపబడిన నిష్కళంకుడైన పరమాత్ముడెక్కడ? ఖురానులో జెప్పబడినట్టి తెరచాటున నుండి మాటలాడు ఖుదా యెక్కడ? అరే బియావాసులు మూర్ఖులయి యున్నందున వారికి నుత్తమవిషయ మెట్లు తెలియును.

మేమి? ప్రపంచమందలి మనుష్యులవలె నతడు పెండ్లిగూడ జేయించుచున్నాడే. ఆతడు ముసల్మానులకు బురోహితుడే యననొప్పును. (౧౪౧)

౧౪౨. కాఫిరులయినవారు మీకెదురైనపుడు వారిమెడల నఱికివేయుడు. అయినంతవఱకు వారిని మెత్తగ మొత్తి తదుపరి చెఱవేయించుటకు బ్రయత్నింపుడు. అనేక గ్రామములుండెను. శక్తి యందవి నిన్ను మించియున్నవి. నీవు వారిచే దొలగింపబడగా మేము వారిని వధించితిమి. వారికి సాహాయ్యము చేయువాడెవడును లేకుండెను. అట (స్వర్గమున) నిర్మలోదకముగల నదులును, రుచిచెడని పాలనదులును గలవనియు ద్రాగగోరువారి కొఱకు సారానదులును, జక్కని తేనెనదులును గలవనియు, నన్ని విధముల ఫలములుగూడ గలవనియు వారి కవి ప్రభువుచే నుచితముగ నియ్యబడుననియు మేమీవఱకే స్వర్గాతిశయమును గూర్చి సదాచారులకు (పరహేజాగారులకు) బ్రతిజ్ఞాపూర్వకముగ జెప్పియున్నాము. (మం-౬-సి-౨౬-సూ-౪౭-ఆ-౪, ౧౩, ౧౫)

స :- దీనివలన నీఖురాను, ఖురాను చెప్పిన ఖుదా, ముసల్మానులు ద్రోహమొనర్చుచు నందఱకు దుఃఖము కలుగజేయువారు, స్వార్థమును సిద్ధింపజేసికొనువారు, దయావిహీనులునయి యున్నారనుట స్పష్టము. ఆహా! అన్య మతస్థుడొకడు ముసల్మానులతో నిట వ్రాయబడినట్లే వర్తించిన నితరులకు దుఃఖము కలుగునట్లు ముసల్మానులకును దుఃఖము కలుగునా, లేదా! మహమ్మదుసాహెబును దొలగగొట్టిన వారిని ఖుదా చంపినాడన్న నాఖుదా గొప్ప పక్షపాతియే యనవచ్చును. మంచిది యెందునిర్మలోదకము, పాలు, సారా, తేనెనదులు కలవో యది యీ ప్రపంచమునకంటె మించినదగునా? పాల నదులెన్నడయిన నుండగలుగునా? ఏమనగా నవి కొద్దికాలములోనే చెడిపోవును. బుద్ధిమంతు లీఖురానుమతము నంగీకరింపరు. (౧౪౨)

౧౪౩. భూమి విశేషముగ గదలింపబడునప్పుడు పర్వతములు విఱిగి ముక్కలు ముక్కలుగానయి పైకెగురును. ఇంక గుడివైపువారు కుడివైపునను, నెడమవైపువా రెడమవైపునను జలతారుతో నల్లబడిన మంచముల మీద నెదురెదురుగ తివాచీల నంటి కూర్చుండి యుందురు. వాని యందుండెడు బాలకు లుదకపాత్రలను, నర్ఘ్యపాత్రలను, శుద్ధమైన సారాపాత్రలను బట్టుకొని తిరుగుచుందురు. దానివలన దల నొప్పి కలుగదు. వారు మైమఱచి వదరక యుందురు. ఇంపైన ఫలములును, నిష్టమైన పశుపక్షుల మాంసమును వారికి జిక్కును. ఇక వారికి దాచిన ముత్యములవంటి మంచి నేత్రములుగల స్త్రీలును, బెద్దపఱపులును జిక్కును. మేమాస్త్రీలను బ్రత్యేకవిధముగ సృజించి యున్నాము. కావున వారు సర్వదా పడుచులుగా ముత్తైదువలుగా సమానవయస్సు గలవారుగా నుందురు. దానివలన నుదరపోషణము చేసికొనగలుగుదురు. కావున రాలిపడు చుక్కలు క్రిందబడినట్టులని యొట్టు పెట్టుకొనుచున్నాను.

(మం-౭-సి-౨౭-సూ-౫౬-ఆ-౪-౫౬,౮, ౯, ౧౫-౨౩, ౩౪-౩౭, ౫౩, ౭౫)

స :- ఇప్పుడు ఖురాను రచించినవాని లీలలు గమనింపుడు! భూమి కదలుచునే యున్నది. అప్పుడును గదలుచుండును. కాన ఖురాను వ్రాసినవాడు భూమి స్థిరముగ నున్నదనుకొనుచుండెనని దీనివలన సిద్ధమైనది. ఔరా! పర్వతములను బక్షులవలె నెగురగొట్టునా? తుత్తునియలై పోవునన్నను, నవి సూక్ష్మశరీరములు ధరించునేని వానికది రెండవ జన్మ యెందులకు గాకుండు? ఏమండీ! ఖుదా శరీరధారి కాకున్న నతని దక్షిణోత్తర పార్శ్వములం దెట్లు నిలువగలుగుదురు? జలతారుతో నల్లబడిన మంచము లటనున్నపుడు వడ్రంగులు స్వర్ణకారులు గూడ నట నివసించుచుండవచ్చును. మఱి నల్లులు కుట్టుచు రాత్రులందు వారిని నిద్రపోనియ్యకుండవచ్చును. వారు తివాచీ నంటి పెట్టుకొని స్వర్గమున నిరర్థకముగ గూర్చుండియే యుందురా? లేక యేదైన పని చేయుచుందురా? గూర్చుండియే యుందురన్న వారి కన్నము బాగుగా

జీర్ణముగాక రోగములపాలై వారు శీఘ్రకాలములోనే చచ్చుచు నుండవచ్చు. పనులు చేయుచుందురేని యిక్కడగూలి కష్టములు చేయుచున్నటులే యక్కడను గష్టపడుచు నిర్వాహము చేసికొనుచుండ వచ్చును. ఇక స్వర్గమునం దిచ్చటికంటె నచ్చట విశేషమేమి కలదు? ఏమియు లేదనుటయే. పిల్లలక్కడ సర్వదా యుందురన్న వారలకు దల్లిదండ్రులు కూడ నుండవచ్చును. అత్తమామలు కూడ నుండియుం దురు కాబోలు. అనగా నది యొక గొప్ప నగరమేయై వెలయుచుండ వచ్చును. ఇంక మలమూత్రాదు లధికములగుటవలన ననేక రోగములు కూడ బుట్టుచుండవచ్చును. ఏమన ఫలములు దినుచు బాత్రలతో నీళ్ళు ద్రాగుచు దలనొప్పి కలిగింపనట్టి మైమఱచి వదరనీయనట్టి సారానుగూడ ద్రాగుచు, నిష్టమైన ఫలములను, బశువుల, పక్షుల మాంసము సయితము దినుచుందురేని యట దప్పక నానావిధ దుఃఖము లును, బక్షులబశువుల నుండియే యుండును. హత్యలు జరుగుచు నక్కడక్కడ నెముకలును బడియుండ వచ్చును. కటిక దుకాణములు కూడ నుండవచ్చును గదా! అబ్బా! వీరి స్వర్గాతిశయము నేమని వర్ణింపవల యును. అరేబియా దేశమునకంటె మించి యున్నటులే గోచరమగుచున్నది!!! మద్య మాంసములు ద్రాగుచు దినుచు నున్మత్తులగుచుందురేని వారికొఱకట జక్కని స్త్రీలును, యువకులు దప్పక యుండ వలసినదే కదా. లేనిచో, దలపుట్టెలం దుష్టమధికమై యాత్రాగుబోతులు ప్రమత్తులయి పోదురు. ఇక ననేక స్త్రీపురుషులకు గూర్చుండుటకు, బరుండుటకు, నవశ్యముగ నట గొప్ప గొప్ప పఱపులును గావలసి యుండును. స్వర్గమున ఖుదా పడుచుస్త్రీల నుత్పన్నము చేయుటవలననే యువకులను గూడ నుత్ప న్నము చేయుచున్నాడు. సరి! ఇక్కడనుండి, యాశపెట్టుకొని పోయినవా రాపడుచు స్త్రీలను వివాహమా డుదురని ఖుదా వ్రాసియున్నాడే. అట నిరంతరముండెడు యువకులు ఫలానాపడుచులను వివాహమాడ గల రనుమాట వ్రాయలేదు. కాబట్టి పడుచు స్త్రీలతోబాటు పడుచువాండ్రుకూడ నాయాశా బద్ధులకే యియ్యబడుదురా యేమి? దీనివ్యవస్థ ఏమియు వ్రాయలేదు. ఖుదా కింతటి గొప్ప మఱ పేల గలిగెను? సమానావస్థగల ముత్తయిదువలు పతులబొంది, స్వర్గమున నుందురన్న నది మంచిది కాదు. ఏలయన స్త్రీలకంటె, బురుషుల వయస్సు రెండింతలో రెండింతలన్నఱయో యుండదగును. ఇది కేవలము ముస ల్మానుల స్వర్గమున గూర్చిన కథయే. ఇక నరకవాసులు (సింహూడ) పలకజమ్మడి వృక్షముల దిని కడుపు నింపుకొనెదరేని, నరకమున గంటకవృక్షము లుండుటవలన ముండ్లుగూడ గ్రుచ్చుకొనుచుండ వచ్చును. ఉడుకు నీళ్ళు త్రాగుట యిత్యాది దుఃఖములను నరకమం దనుభవింతురు. ప్రాయికముగా నొట్టుపెట్టు కొనుట యసత్యవాదులపనియే కాని సత్యవంతులది కాదు. ఖుదా సయిత మొట్టుపెట్టుకొను చున్నాడేని యతడుకూడ నసత్యవంతుడనియే గ్రహింపనగును (౧౪౩)

౧౪౪. అతని మార్గమున బోట్లాడువారితో నిశ్చయముగ నల్లా మిత్రత్వము కలిగియుండును.

(మం-౭-సి-౨౮-సూ-౬౧-ఆ-౪)

స :- సరి బాగుగా నున్నది! ఇటువంటి మాటలు బోధించి యమాయకులయిన యరేబియా దేశస్థుల కందఱతో బోట్లాటలు పెట్టి వైరము గలిగించి యెల్లరను దుఃఖములపాలు చేసియున్నాడుగా? ఇట్లు మతధ్వజమును నిలువబెట్టి కలహము గావించువాని నీశ్వరుడని బుద్ధిమంతుడెవ్వడు నంగీకరింప నేరడు. జాతిలో విరోధము బెంచువాడే యందఱకు దుఃఖము గలుగజేయు వాడగును. (౧౪౪)

౧౪౫. ఓనబీ! అల్లా నీకొఱకు బవిత్రము (హలాల్) నొసంగిన వస్తువును నీవు నింద్యము (హరాం) అని నిషేధించుచున్నా వెందులకు? నీవు నీ భార్యల సమ్మతి గోరుచున్నావేని క్షమించునట్టి ప్రభువు (అల్లా) దగ్గఱనే యున్నాడు. వారే మిమ్ము విడిచిపెట్టినను దొందరలేదు. వారికి మీకంటె మేలయిన విశ్వసింప దగిన ముసల్మాన్ స్త్రీలు బదులుగా నొసంగబడుదురు. ఆ స్త్రీలు సేవచేయువారు, పశ్చాత్తాపపడువారు, భక్తి

సలుపువారు, నుపవాసవ్రతము సలుపువారు, పురుషముఖము జూచినవారు, చూడనివారు నగుదురు. (మం-౭-సి-౨౮-సూ-౬౬-ఆ-౧, ౫)

స :- ధ్యానపూర్వకముగ గమనించితిమేని, యతడు ఖుదా కాడుగాని, మహమ్మదుసాహెబు గృహములోపల వెలుపల పనులు చేయు భృత్యుడేయని తేటపడును. మొదటి ఆయతును గూర్చి రెండు కథలు కలవు. (ఒకటి) మహమ్మదుసాహెబునకు తేనెద్రావకము ప్రియమనియు, నతని కనేక స్త్రీలుండిరనియు, వారిలో నొకదానియింట ద్రాగుటయం దాలస్యమైనందున నితరుల కది యసహ్యముగ దోచెననియు వారిజాడింపులు వినిన పిమ్మట మహమ్మదు సాహెబిక త్రాగనని శపథము చేసెననియు వ్రాయబడి యున్నది. (రెండవది) అతని కనేక భార్య లుండిరనియు, వంతుగా నెవతెదగ్గఱకు బోవలసియుండెనో యామెవద్దకు రాత్రియందు వెళ్ళగా నామె యింటలేక తన తండ్రియొద్దకు బోయియుండెననియు, మహమ్మదు సాహెబ్ ఒకదాసిని బిలిచి పవిత్రము చేసెననియు, భార్యకీసంగతి తెలియగా నామె యప్రసన్ను రాలయ్యెననియు, నప్పుడు మహమ్మదుసాహెబిక నేనట్లు చేయనని ప్రమాణముజేసి నీవీసంగతి నెవరికి దెలియజేయకుమని భార్యతో జెప్పగా నామె చెప్పనని యొప్పుకొనెననియు, మరల నతడు రెండవ భార్య యొద్దకు బోయి చెప్పననియు వ్రాయబడి యున్నది. దీనిగూర్చియే మేము నీకొఱకు హలాల్ చేసియున్న వస్తువును, నీవు హరామని యెందులకు దలచుచున్నావను నీఆయతును ఖుదా దించెనా? ఔరా! ఎక్కడయిన ఖుదా యొకనియింటిని జక్కబెట్టుచు దిరుగుచుండునా? బుద్ధిమంతులు విచారింతురు గాక. ఇక నీమాటలవలన మహమ్మదుసాహెబు నడవడి తేటపడినది కద. ఏమనగా ననేక స్త్రీల నుంచుకొనువా డీశ్వర భక్తుడు గాని, పైగంబరుకాని యెట్లు కాగలడు? ఒక స్త్రీ నవమానపఱచి మఱొక స్త్రీని గౌరవించువాడు పక్షపాతియు, ధర్మహీనుడు నేలగాడు? అనేక స్త్రీ లున్నను సంతుష్టుడుగాక దాసీలకు లోబడువానికి లజ్జ, భయము, ధర్మము ననున వెక్కడ నుండును? (కామాతురాణాం న భయం న లజ్జా) కాముకులగు మనుష్యు లధర్మమునకు భయపడరు. లజ్జితులును గారని యొకయనుభవజ్ఞుడు వచించినది నిజమే. వీరి ఖుదా సయితము మహమ్మదుసాహెబుగారి భార్యలయు బైగంబరులయు జగడములు దీర్పు చేయు పరిష్కారకర్తయై నిలిచెనుగా! ఈ ఖురాను ఒక విద్వాంసునిచే రచింపబడినదా? అనుమాట బుద్ధి మంతు లాలోచించిన దేటతెల్లమగును. ఇక మహమ్మదుసాహెబుతో నతని యొకానొక భార్య యప్రసన్ను రాలయి యుండవచ్చుననియు, ఖుదా యీఆయతును దించి 'నీవల్లరి చేసితివేని మహమ్మదుసాహెబు నిన్ను విడిచిపెట్టును. ఖుదా నీకంటె నతనికి జక్కని పురుష ముఖము జూడని స్త్రీల నిచ్చును' అని భయ పెట్టియున్నట్లును, రెండవ ఆయతువలన దేటపడుచున్నది. ఇతడు ఖుదాయా? ఇవి ఖుదా చేయు పనులా? లేక తన ప్రయోజనమును సిద్ధింపజేసికొనుమాటలా? అను విషయమును గొంచెము బుద్ధికల వాడైన నూహించి తెలిసికొనగలుగును. ఖుదా యనువా డెవడును జెప్పుచుండలేదు గాని దేశకాలమునుబట్టి తన ప్రయోజనమును సిద్ధింపజేసికొనుటకు ఖుదా చెప్పినట్లు మహమ్మదుసాహెబే చెప్పుచుండెనని పై మాటలవలన స్పష్టమగుచున్నది. ఖుదాయే చెప్పుచుండెననువారలతో, మేము చెప్ప వలసిన దేమున్నది? బుద్ధిమంతులందఱును 'అతడు ఖుదా కాక మహమ్మదుసాహెబు కొఱకు స్త్రీలను దెచ్చియిచ్చు (మంగలి) సంబంధములు కూర్చువాడై యుండెననియే' యందురు. (౧౪౫)

౧౪౬. ఓనబీ! కాఫిరులతోడను, దాగియున్న శత్రువులతోడను బోట్లాడుము. వారియెడ గఠినముగా వర్తింపుము. (మం-౭-సి-౨౮-సూ-౬౬-ఆ-౯)

స :- ముసల్మానుల ఖుదా లీలలను జూడుడు. ముసల్మానులను బైగంబరులను నన్యమతస్థులతో బోట్లాడుటకు బ్రేరేపించుచున్నాడు. ఇందువలననే కద ముసల్మానులు పోట్లాడుటకు సంసిద్ధులగ

నుందురు. ముసల్మానులు పోట్లాటలు మాని యందఱితో మిత్రత్వముగ వర్తించునట్లు పరమాత్ముడు వీరిపై గృపజేయుగాక. (౧౪౬)

౧౪౭. ఆకాశము ప్రద్దలయిపోవును గాన నతడాదినము జబ్బుగా నుండును. ఫరిశ్తా లతని ప్రక్క్రల నుందురు. ఇక నీప్రభువు పీఠము నాదిన మెనమండుగురు తమమీద నెత్తుకొని యుందురు. మీరాదినము సమ్ముఖమునకు రప్పింపబడుదురు. గుప్తమైన యొకవార్తయయినను దాగియుండకుండును. ఎవని కుడి చేతికి నతని కర్మపత్ర మీబడునో వాడు 'ఇదిగో నాకర్మపత్రము జదువు' మనును. ఇక నెవని యెడమ చేతికి నతని కర్మపత్ర మీబడునో వాడు 'అయ్యో! ఈ కర్మపత్రము నాచేతి కీకున్న మేలయి యుండెడిదిగా' అని యనుకొనును. (మం-౭-సి-౨౯-సూ-౬౯-ఆ-౧౬-౧౮, ౨౫)

స :- ఓహో! ఏమితత్త్వ విజ్ఞానము! ఎంత న్యాయమైన ప్రసంగముని పొగడవలయును? ఔరా! ఆకాశమెన్నడయిన బ్రద్దలయిపోవునా? ఏమి? బ్రద్దలగుటకది వస్త్రమువంటిదా యేమి? మీది లోకము నాకాశమందురేని యది జ్ఞానవిరుద్ధమగుమాటయే యగును. ఇప్పుడు ఖురాను నందలి ఖుదా శరీర ధారియే యని స్పష్టముగ విదితమగుచున్నది గదా! ఏలయన బీఠము మీద గూర్చుండి యెనమండుగురు బోయీలచే మోయబడువాడు మూర్తిమంతుడు గాక మఱి యేమగును? ఇదిగాక ముందునకు వెనుకకు వచ్చుట పోవుట గూడ మూర్తిమంతునియందే ఘటిల్లగలదు. అతడు మూర్తిమంతుడే యైనచో నేక దేశీయు డగుటవలన సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు గానేరడు. అట్లే సకల జీవుల కర్మ ముల నన్నిటి నెన్నడు నెఱుగజాలడు. పుణ్యాత్ములకుడి చేతులలో గర్మపత్రములిచ్చి చదివించుట, స్వర్గ మునకు బంపుట, యట్లే పాపాత్ముల యెడమ చేతులలో గర్మపత్రము లిచ్చి నరకమున బడవేయుట, కర్మపత్రముల జదివి న్యాయమొనరించుట యనునీమాటలు గడువింతగా నున్నవి. ఏమి? యిదియొక సర్వజ్ఞుని పనియగునా? ఎన్నటికి గానేరదు. ఇవన్నియు బిల్లల యాటలవంటి మాటలే యననొప్పును. (౧౪౭)

౧౪౮. ఫరిశ్తాల జీవములు నతని వైపునకు బోవును. ఆ పాపమేపదివేల సంవత్సరముల పరిమా ణముగల దినమంతటిదై యుండును. ఒకానొక గమ్యస్థానమునకు బరుగిడు నట్లాదినము సమాధులలో నుండి లేచి పరుగిడుదురు. (మ-౭-సి-౨౯-సూ-౭౦-ఆ-౪-౪౩)

స :- దినపరిమాణమే పదివేల సంవత్సరములన్న రాత్రిపరిమాణము నేబదివేల సంవత్సరములు గాదా? ఇంత గొప్పరాత్రి యుండదందురేని యంతగొప్పదినము నెప్పటికి నుండదు. ఏబది వేల సంవత్స రముల వఱకా ఖుదా, ఫరిశ్తాలు, కర్మపత్రధారులు నందఱును నిలువబడియుందురా లేక కూర్చుండి యుందురా? మఱి వారందఱును మేలుకొనియే యుందురాయేమి? అటులయిన నిక నందఱును రోగ గ్రస్తులయి చావనే చత్తురు. వారు సమాధులలోనుండి లేచి ఖుదాకచ్చేరీ వైపునకు బరువెత్తుదురా? ఏమి? ఆబొందలలోని వారికి సూచనాపత్రము (సమనులు) లెట్లందును? పాపమాపుణ్యాత్ములను బాపాత్ముల నందఱినింతకాలము వఱకు ప్రతిబంధరూపకముగా బొందలలో నెందులకు జేఱవేసి యుంచెను? ఇప్పుడు ఖుదా కచ్చేరీ మూయబడి యుండవచ్చునా యేమి? ఆఖుదా ఫరిశ్తాలు నిరర్థకముగ గూర్చుండి యుందురా? లేక యేమయినపని చేయుచుందురా? తమ స్థానములందు గూర్చుండి, యటునిటు దిరు గుచు, బరుండుచు, నాట్యములను వేడుకలను జూచుచు, నానంద మనుభవించుచు నుండవచ్చును గద. ఇంత యన్యాయ మేరాజ్యమున నుండదు. కాన నీవార్తల నడవి మనుష్యులు తప్ప నన్యులెవ్వరు నంగీక రింపజాలరు. (౧౪౮)

౧౪౯. నిశ్చయముగ మిమ్ము నానావిధముల బుట్టించియున్నాడు. పై భాగమున నల్లా యేడాకా

ముల నెట్లుత్పన్నము చేసియున్నాడో మీరు చూచుటలేదా? వానిమధ్య జంద్రుడు ప్రకాశకుడుగను సూర్యుడు దీపముగ నున్నాడు. (మం-౭-సి-౨౯-సూ-౭౧-ఆ-౧౪, ౧౫, ౧౬)

స :- ఖుదా జీవుల నుత్పన్నము చేసియున్నాడన్న వారు నిత్యులు నమరులు నెప్పటికిని గానేరరు. ఇక స్వర్గమున సర్వదా యెట్లుండగలుగుదురు? ఉత్పన్నమగు పదార్థ మవశ్యముగ నశించుచున్నది. పైభాగమందాకాశము నెట్లు చేయగలుగును? ఏమనగా నిది నిరాకారమై విభువైన పదార్థము. వేఱొక వస్తువున కాకాశమను పేరిడుచున్నారేని, దాని కాకాశమను పేరిడుటయు నిరర్థకమే. పైభాగమున నాకాశముల జేసియున్నాడేని వానియన్నిటి మధ్య సూర్యచంద్రు లెన్నడు నుండజాలరు. మధ్య నుంచబడిరన్న, మీది దొకటి క్రిందిదొకటి మాత్రము ప్రకాశితమగును. రెండవది మొదలుకొని యన్నిటి యం దంధకారమే యుండును. ఇట్లు గోచరమగుట లేదు. కావున నీవార్త సర్వథా మిథ్యయే (౧౪౯)

౧౫౦. మసీదు అల్లాకొఱకే కలవు గాన నల్లాతో గూడ మఱొకని బిలువకుడు.

(మం-౭-సి-౨౯-సూ-౭౨-ఆ-౧౮)

స :- ఈ మాట నిజమేని ముసల్మానులు 'లాయిలాహ ఇల్లల్లాః మహమ్మదర్రసులల్లాః' అను 'కలమ' వాక్యమున ఖుదాతో గూడ మహమ్మదు సాహెబు నెందులకు బిలుచుచున్నారు? ఇట్లు పిలుచుటకు ఖురానునకును విరుద్ధమేకదా! విరుద్ధము కాదందురేని, యీ ఖురాను వాక్యము నబద్ధము చేయుచున్నారు. మసీదులు ఖుదాగృహములయిన ముసల్మానులును విగ్రహారాధకులైరి. చిన్నచిన్న విగ్రహములను నీశ్వర మందిరములని నమ్మ జైనులును, పౌరాణికులును విగ్రహారాధకు లనబడునటులే వీరేల యనబడ కుందురు. (౧౫౦)

౧౫౧. సూర్యచంద్రులొకచోట గూర్పబడుదురు. (మం-౭-సి-౨౯-సూ-౭౫-ఆ-౯)

స :- సరి! సూర్యచంద్రు లెన్నడయిన నొకచోట గూర్పబడగలరా? ఇదెట్టి యవివేకమయిన వార్తయో గమనింపుడు! సూర్యచంద్రులనే యొకచోట జేర్చుట కేమిప్రయోజన ముండెను? అన్య లోకము లన్నింటి నొకచోట జేర్పకపోవుట కేమియుక్తి కలదు? ఇట్టి యసంభవ విషయము లెన్నడైన నీశ్వరకృతములు కాగలవా? పామరులవి దప్ప విద్వాంసుల వెప్పటికిని గానేరవు. (౧౫౧)

౧౫౨. వారిసమీపమున నెల్లప్పుడు పిల్లకాయలు తిరుగుచుందురు. నీవు వారిని జూచినప్పుడు చెదరిపడియున్న ముత్యములని యనుమానింతువు. వారికి వెండి కంకణములు తొడిగింపబడును. ప్రభువు వారికి బవిత్రమయిన సారా ద్రాగించును. (మం-౭-సి-౨౯-సూ-౭౬-ఆ-౧౯, ౨౧)

స :- ఏమండీ! ముత్యములవంటి కాంతిగల పిల్లకాయ లచట నెందుల కుంచబడుచున్నారు? ఏమి, యువకులు వారిసేవ జేయలేరా? స్త్రీ జనము వారికి దృప్తి గలుగజేయజాలదా? దుష్టులు పిల్లకాయలతో నేయేగొప్ప దుష్కర్మల నొనరించుచున్నారో, దానికి మూల మీఖురాను వచనమే కావచ్చు ననుట కాశ్చర్యమేమి! ఇక స్వర్గమున స్వామి సేవకభావము బట్టి స్వామి కానందమును, సేవకునికి బరిశ్రమ చేయుటవలన దుఃఖమును గలుగును గద. ఈ పక్షపాత మట నెందులకు గలదు? ఖుదాయే సారా ద్రాగించునన్న నతడుకూడ వారికి సేవకుని వంటివాడేయై నిలుచును. ఇక ఖుదా గొప్పతనమెట్లు స్థిరపడ గలుగును? స్వర్గమందు స్త్రీపురుషులకు సంపర్కమును నట్లు గర్భస్థితియు గలిగి వారు సంతాన వంతులు గూడ నగుట కలదా? లేదా? లేదన్న వారి విషయ భోగములు వ్యర్థమయ్యెను. కలదన్న నాజీవము లెక్కడినుండి వచ్చును? ఖుదా సేవచేయనిదే వారు స్వర్గమున నెందులకు జన్మించిరి? జన్మించిరిపో! (ఈమాన్) మతవిశ్వాసము కలుగకున్నను, ఖుదాభక్తి సలుపకున్నను, వారి కనాయాసముగనే స్వర్గము లభించెనుగదా! కొందఱకు (ఈమాన్) మతవిశ్వాసము కలుగుటవలనను, మఱికొందఱకు ధర్మము

నాచరింపకున్నను సుఖము లభించుచున్న నింతకంటె గొప్పయన్యాయ మేమికాగలదు? (౧౫౨)

౧౫౩. కర్మానుసారముగ ప్రతిఫలము తీయబడును. గిన్నెలు నిండి యుండును. రూహు లనుజీవమును, ఫరిశ్తాలును వరుసగా నిలువబడు దినమున (మం-౭-సి-౩౦-సూ-౭౮-ఆ-౨౬, ౩౪, ౩౮)

స :- కర్మానుసారముగా ఫలమొసంగబడునన్న, స్వర్గమున నుండెడు చక్కని స్త్రీలకు, ఫరిశ్తాలకు, ముత్యమువంటి పిల్లకాయలకు నే కర్మములను బట్టి యెల్లప్పుడుండుట యను స్వర్గము లభించెను? గిన్నెలు నింపుకొనుచు సారాయి త్రాగుదురేని మత్తెక్కి యేల పోట్లాడకుందురు? ఇట (రూహు) ఫరిశ్తాలలో నొకగొప్ప ఫరిశ్తా యనిభావమేమి? ఖుదా రూహును నన్యఫరిశ్తాలను వరుసగా నిలువబట్టి సైన్యమును బ్రోగుచేయునా! సైన్యము ద్వారా జీవులందఱకు శిక్ష గలుగజేయునా? మఱి ఖుదా యాసమయమున నిలువబడి యుండునా? లేక కూర్చుండి యుండునా? ఖుదా ప్రళయకాలము వఱకైనను దనసైన్యము నంతయు బ్రోగుచేసి యాసైతానును బట్టుకొనునేని యతనిరాజ్యము నిష్కంటకముగ సాగగలుగును. దీనినే ఖుదాతన మందురు గాబోలు. (౧౫౩)

౧౫౪. సూర్యుడు చుట్టబడుచున్నప్పుడు చుక్కలు మాగువాఱినప్పుడు, పర్వతములు చలించినపు డాకాశచర్మ మూడదీయబడునపుడు (మం-౭-సి-౩౦-సూ-౮౧-ఆ-౧, ౨, ౩, ౧౧)

స :- గుండ్రముగా నున్న సూర్యలోకము చుట్టబడుననుట గడుతెలివి మాలిన మాటయేకద. చుక్కలు మాగువాఱుట యెట్లు? జడములైన పర్వతము లెట్లు చలించును? చర్మమూడదీయబడుననుట కాయాకాశము నొక పశు వనుకొనెనా యేమి? ఇవి యజ్ఞానముతో గూడిన గొప్ప పామరత్వపు మాటలే యనబడును. (౧౫౪)

౧౫౫. ఆకాశము బ్రద్దలయిపోవునప్పుడు, చుక్కలు రాలిపడునప్పుడు, సముద్రములు చీల్చబడునప్పుడు సమాధులు బ్రతికింప లేపబడునపుడు (మం-౭-సి-౩౦-సూ-౮౨-ఆ.౧-౪)

స :- ఖురానును రచించు తత్త్వవేత్త! సెబాస్ సెబాస్!! ఆకాశమును బ్రద్దలుగ నెట్లు చేయగలుగును? చుక్కల నెట్లు రాల్చగలుగును? ఏమి? సముద్రములు చీల్చబడుట కవికఱ్ఱలా? బ్రతికింప గలుగుననుట కాసమాధులే పీనుగులా? ఇవన్నియు బసిపిల్లల మాటవంటివే యగును. (౧౫౫)

౧౫౬. బురుజులుగల యాకాశము సాక్షిగ జెప్పుచున్నాను. కాని యామహాఖురా ననునది లూహువునందు సురక్షితముగా నున్నది. (మం-౭-సి-౩౦-సూ-౮౫-ఆ-౧, ౨౧, ౨౨)

స :- ఈ ఖురానును రచించినవాడు ఖగోళభూగోళముల నెంతమాత్ర మెఱుగకుండెను. లేనిచో నాకాశమును గోటవంటి బురుజులందురేని తక్కినవేల బురుజులు గాకుండును? కాన నవి బురుజులు కావు. కావున నాచుక్కలన్నియు లోకములే. మఱి యాఖురాను ఖుదావద్దనున్నదా యేమి? ఆఖురాను నతనిచే రచింపబడిన దేయైన, నదియు నింతకంటె నధిక జ్ఞానశూన్యము యుక్తి శూన్యము, నగునవిద్యతో గూడి యుండవచ్చును. (౧౫౬)

౧౫౭. నిశ్చయముగ వారొక టక్కును బన్నుచున్నారు. నేనుగూడ నొకటక్కును బన్నుచున్నాను. (మం-౮-సి-౩౦-సూ-౮౬-ఆ-౧౫, ౧౬)

స :- మోసపుచ్చుటయే టక్కనబడును గద. ఖుదాకూడ టక్కరియేనా యేమి? దొంగతనము దొంగతనమే. అబద్ధమున కబద్ధమే యుత్తరమా! ఒక దొంగ యొకసజ్జనపురుషునింట దొంగతనము చేసిన నాసజ్జనపురుషుడు సయిత మాతని యింటికిబోయి దొంగతనము జేయవలయునా? ఖురానును రచియించిన వాడా! సెబాస్!! సెబాస్!! (౧౫౭)

౧౫౮. నీ ప్రభువును బక్తిపూర్వకముగ ఫరిశ్తాలును వచ్చినపు డిక నాదినము నరకము తెప్పింప

బడును. (మం-౭-సి-౩౦-సూ-౭౯-ఆ-౨౨, ౨౩)

స :- చెప్పరు! కోటపాలకుడు గాని సేనాధ్యక్షుడుగాని తన సైన్యమును బంక్తిపూర్వకముగ వెంట గొని తిరుగునట్లే వీరిఖుదా కూడ దిరుగునాయేమి? నరకము నెక్కడకు గావలసిన నక్కడ కెత్తుకొని పోవుటకు దానిని గడవయనుకొనెనా? ఇంత చిన్నదేని యందసంఖ్యాకులగు ఖైదీలెట్లు పట్టగలరు? (౧౫౮)

౧౫౯. దేవదూతయగు పైగంబరు వారితో "మీరు దేవుని యాడు లొట్టిపిట్టను రక్షింపుడు. దానికి నీళ్ళు త్రాగింపుడు" అని చెప్పియుండెను. అంత నతనిమాట నబద్ధముచేసి దానికాళ్ళు తెగనఱకగా వారిరక్షకుడు వారి మీదికి మారిని బంపెను (మం-౭-సి-౩౦-సూ-౯౧-ఆ-౧౩, ౧౪)

స :- ఏమి ఖుదా సైతము లొట్టిపిట్టమీద నెక్కి తిరుగుచుండునా? లేనిచో నుంచిన దెందులకు? ప్రళయముగాకుండుటకు బూర్వమే తననియమమును రద్దుపఱచి మారియను రోగమును వారికేల గలుగ జేసెను? అట్లు గలుగజేసినపుడు వారిని దండించినవాడే యయ్యెను. ఇక బ్రళయము నాటి రాత్రి న్యాయము చేయుననుటయు నా రాత్రి కాబోవుననుటయు నబద్ధమేనా? ఈ యొంటె విషయమై వ్రాయబడిన లేఖను జూచి యరేబియా దేశమునందు లొట్టిపిట్టలు తప్ప, యితర వాహనములు చిక్కుట యరుదుగాన నీఖురాను నొక యరేబియా దేశవాసుడు రచించినాడని యనుమానింపబడుచున్నది. (౧౫౯)

౧౬౦. వినకపోయిన పక్షమున మేమవశ్యముగ వాని ముందువెంట్రుకలబట్టి యీడ్తుము. వాని నొసలబద్ధము పలుకును. అపరాధ మొనరించును. నరకము ఫరిశ్తాను మేము పిలుతుము.

(మం-౭-సి-౩౦-సూ-౯౬-ఆ-౧౫, ౧౬, ౧౮)

స :- ఈడ్చుటయను నీచమైన పరిచారకవృత్తిని జేయుటకు గూడ ఖుదా బాధ్యుడయ్యెనే ఔరా! జీవుడు దప్ప నొసలెన్నడయిన నబద్ధము బలుకునా? అట్లే యపరాధ మొనరించునా? సెబాస్! చెఱసాల సంరక్షకుని బిలిపించునటువంటి వాడెన్నడయిన ఖుదా కాగలడా? (౧౬౦)

౧౬౧. నిశ్చయముగ మేము రాత్రియందు ఖురాను దించితిమి. కదరయనురాత్రి యేమయినది? నీకేమి తెలియును? ప్రతికార్యమునకై తన ప్రభువు నాజ్ఞగొని ఫరిశ్తాలును, బవిత్రాత్మలును దానియందు దిగుచున్నారు. (మం-౭-సి-౩౦-సూ-౯౭-ఆ-౧, ౨, ౪)

స :- ఒకరాత్రిని ఖురానును దించెనన్న 'ఫలానా యాయతును ఫలానా సమయమందు నిట్లు క్రమక్రమముగా దించెనను టెట్లు సత్యమగును? రాత్రి చీకటితో గూడినదేగా! ఇక నందడుగవలసిన దేమున్నది? క్రిందు మీదు లెంతమాత్రము కానేరవని మేము వ్రాసియున్నారము. ఇక నిక్కడ ఫరిశ్తాలును, బవిత్రాత్మలును, ఖుదాయాజ్ఞగొని, సంసారమున నేర్పాటులు చేయుటకు వచ్చుచున్నారని వ్రాయుచున్నారు. దీనివలన ఖుదా యేకదేశీయుడనియే స్పష్టమయ్యెను. ఖుదా, ఫరిశ్తాలు, పైగంబరులను నీముగ్గురి కథయే కలదని యింతవఱకు దెలిసికొని యుంటిమి. కాని పవిత్రాత్మయను నాల్గవవాడొకడు బయలుదేఱినాడు. ఈ నాల్గవ పవిత్రాత్మ యనునదేమో తెలియకున్నది. ఇది క్రైస్తవ మతస్థులు నమ్మ పితా, పుత్ర, పవిత్రాత్మలను మూటికంటె నాల్గవ దొకటి యెక్కువయే యయ్యెను గద. మేమీమూటిని ఖుదాయని యంగీకరింప మందురేని యట్లే కానిండు. కాని పవిత్రాత్మ వేఱయి యున్నప్పుడు ఖుదా, ఫరిశ్తా, పైగంబరులను బవిత్రాత్మలనవలయునా లేదా? పవిత్రాత్మ కలదేని యొకరికే పవిత్రాత్మయను పేరెందులకు? మఱి ఖుదా గుఱ్ఱములు మున్నగు పశువుల మీదను, దినరాత్రుల మీదను, ఖురాను మున్నగు వాని మీదను బ్రతిజ్ఞ చేయుచున్నాడు. శపథము సజ్జనుల పని కానేరదు. (౧౬౧)

౧౬౨. ఇట నీ ఖురాను విషయమును వ్రాసి "ఈపుస్తకమెటులున్నదో కనుగొనుటకు గాను"

బుద్ధిమంతుల యెదుట బెట్టుచున్నాడను. నన్నడుగుదురేని యీపుస్తక మీశ్వర రచితముకాని, యొక విద్వాంసునిచే రచియింపబడినది కాని కాదు. ఇది యొక జ్ఞానమునిచ్చు పుస్తకమును గాజాలదు. మనుష్యులు భ్రమలోబడి తమ జన్మములు వ్యర్థము చేసికొనకుండుటకు నిట గొన్ని దోషములను మాత్రమే ప్రకటించి యున్నాడను. ఇక నిందుగల కించిన్మాత్ర సత్యము నటులే యన్యమతము లందలి హితములు కూడ బక్షపాత రహితులయిన విద్వాంసులకును, బుద్ధిమంతులకును గ్రాహ్యములే. ఇదియుగాక నిందుగల దంతయు నవిద్యా భ్రమజాలములతో గూడినట్టియు, మనుష్యుని యాత్మను బశువుతో సమానముగా జేసి శాంతి భంగము గలుగ జేయునట్టియు, నుపద్రవముల నుప్పతిల్లజేసి మనుష్యులందు ద్రోహమును గలుగ జేసి పరస్పర దుఃఖముల బెంచునట్టియు నంశమే యని యెఱుగదగును. అట్లే పునరుక్త దోషములకు నీఖురాను నిలయమేయై యున్నది. అందఱతో నందఱకు బ్రీతి గలుగునట్లును బరస్పర సంఘీభావము స్థిరపడి యొండొరుల సుఖాభివృద్ధి కొఱకు నందఱు బాటుపడునట్లును నాపరమేశ్వరుడు మనుష్యులందఱమీద గృపజేయునుగాత! నేను నా దోషములగాని యితర మతమతాంతరములందలి దోషములను గాని పక్షపాత రహితుడనయి యెట్లు ప్రకాశపఱచుచున్నానో యట్లే విద్వాంసులందఱు నొనర్తురేని పరస్పర విరోధము తొలగి మిత్రత్వము కుదిరి యానందపూర్వకముగ నొక్కమతమే స్థిరపడి సత్యము చేకూర వచ్చును. ఇట్లు సంక్షిప్తముగ ఖురాను విషయమును వ్రాసియున్నాడను. బుద్ధిమంతులైన ధర్మాత్ములు, గ్రంథకర్త యొక్క యభిప్రాయమును గుర్తెఱిగి దీనినుండి లాభము పొందుదురుగాక. అట్లే యెక్కడనయిన భ్రమతో నన్యథా వ్రాయబడినదానిని సవరించుకొందురుగాక! ఇంకనొక విషయము శేషించి యున్నది. అదేమన ననేక ముసల్మానులు 'మా మతసమాచార మథర్వణ వేదమున వ్రాయబడి యున్న'దని చెప్పుచు వ్రాయుచు బ్రచురింప జేయుచు నున్నారు. కాని యథర్వణ వేదమందు దాని నామచిహ్నముగూడ లేదనుటయే దీనికుత్తరము.

ప్రశ్న :- మీ రథర్వణ వేదమంతయు జూచియున్నారా? చూచియున్న నల్లోపనిషత్తును జూడుడు. సాక్షాత్తుగ నందు వ్రాయబడియే యున్నది! మరల అథర్వణ వేదమందు ముసల్మానుల నామచిహ్నము గూడ లేదని యెందుల కనుచున్నారు?

అల్లోపనిషదం వ్యాఖ్యాస్యామః

అస్మాల్లాం ఇల్లే మిత్రావరుణా దివ్యాని ధత్తే॥ ఇల్లల్లే వరుణో రాజా పునర్దదుః॥ హయా మిత్రో ఇల్లాం ఇల్లల్లే ఇల్లాం వరుణోమిత్రస్తే జస్కామః॥౧॥ హొతారమింద్రో హొతారమింద్ర మహాసురింద్రాః॥ అల్లో జ్యేష్ఠం శ్రేష్ఠం పరమం పూర్ణం బ్రహ్మాణం అల్లామ్॥౨॥ అల్లో రసూలమహామదరక బరస్య అల్లో అల్లామ్॥౩॥ ఆదల్లా బూక మేకకమ్। అల్లా బూక విఖాతకమ్॥౪॥ అల్లో యజ్ఞేన హుత హుత్వా అల్లా సూర్యచంద్ర సర్వనక్షత్రాః॥౫॥ అల్లా ఋషీణాం సర్వ దివ్యాం ఇంద్రాయ పూర్వం మా యా పరమ మంతరిక్షాః॥౬॥ అల్లః పృథివ్యా అంతరిక్షం విశ్వరూపమ్॥౭॥ ఇల్లాంకబర ఇల్లాంకబర ఇల్లా ఇల్లల్లేతి ఇల్లల్లాః॥౮॥ ఓం అల్లా ఇల్లల్లా అనాదిస్వరూపాయ అథర్వణాశ్యామా హుం హ్రీం జనానపశునసిద్ధాన్ జలచరాన్ అదృష్టం కురుకురుఫట్॥౯॥ అసుర సంహారిణీ హుం హ్రీం అల్లో రసూల మహామదరకబరస్య అల్లోఅల్లామ ఇల్లల్లేతి ఇల్లల్లాః॥౧౦॥

ఇత్యల్లోపనిషత్ సమాప్తా

ఇందు బ్రత్యక్షముగ మహమ్మదుసాహెబును రసూలని వ్రాయబడినది. కాన ముసల్మానుల మతము వేదమూలకమనియే దీనివలన సిద్ధమగుచున్నది.

ఉత్తరము :- మీరథర్వణ వేదమును జూడకున్న మాదగ్గఱకు రండు. ఆదినుండి యంతము వఱకు జూడుడు. లేదా యిరువది కాండములతో గూడియున్న 'మంత్రసంహిత' అథర్వణ వేదమును నేయథ

ర్వణ వేదీయుని యొద్ద నున్నను బోయి చూచుకొనుడు. మీ పైగంబరుసాహెబు నామముగాని మత చిహ్నముగాని యందు గాంచకుందురు. ఈయల్లోపనిషత్తునది యథర్వణ వేదమందుగాని, దానిగోపథ బ్రాహ్మణమందుగాని శాఖయందుగాని లేదు. అకబరబాదశాహకాలమున నొకడు దీనిని రచియించినాడని మాత్ర మనుమానింపబడుచున్నది. దీనిని రచియించినవాడు గొంత యరబ్బీ కొంత సంస్కృతముగూడ జదివియున్నట్లు గోచరమగుచున్నది. ఏమనగా నిందు నరబ్బీ పదములును, సంస్కృతపదములును బ్రయోగింపబడియున్నవి. చూడుడు! 'అస్మాల్లాం ఇల్లే మిత్రావరుణా దివ్యాని ధత్తే" ఇత్యాదులు పది యంకములలో వ్రాయబడి యున్నవి. ఎట్లనగా "అస్మాల్లాం తథా ఇల్లే" అనునవి అరబ్బీ పదములు "మిత్రా వరుణా దివ్యాని ధత్తే" ఇవి సంస్కృతపదములు. ఇటులే యంతట వాడబడియున్నందున దీనిని సంస్కృత అరబ్బీ భాషలు చదివిన వాడొకడు రచించెననుట స్పష్టము. దీనియర్థము చేసితిమేని యది కృత్రిమమును, నయుక్తమును వేదశైలికిని వ్యాకరణమునకును విరుద్ధమునై యున్నది. ఈయుపనిషత్తు రచించినటులే పక్షపాతముగల వివిధమత సంప్రదాయులు ననేకోపనిషత్తులు వ్రాసియున్నారు. అనగా స్వరూపోపనిషత్తు, నృసింహతాపని, రామతాపని, గోపాలతాపని మొదలగునవెన్నియో వ్రాయబడినవి.

ప్రశ్న :- నేటి పర్యంత మొక్కడయిన నిట్లు చెప్పలేదే. ఇప్పుడు మీరే యనుచున్నారు. మీమాటను మేమొప్పుకొనుట యెట్లు?

ఉత్త:- మీరొప్పుకొన్నను నొప్పుకొనకపోయినను, మామాట యబద్ధము కాజాలదు. ఇది యయుక్తముగా నున్నదని నేనెట్లు కనబఱచి యున్నానో యాప్రకారమే, మీరును నథర్వణవేదమునగాని, గోపథమందుగాని దానిశాఖలుగా వ్రాయబడిన ప్రాచీన పుస్తకములందుగాని, దీనినిజూపి యర్థము (సంగతమగునట్లు కూడ) నిరూపింతురేని యది సప్రమాణము కాగలదు.

ప్రశ్న :- మామత మెంతమంచిదో చూడుడు. అందన్నివిధముల సుఖమలవడుటయే గాక యంతమందు ముక్తికూడ లభించును.

ఉత్త :- "మామతమే మంచిది. తక్కినవన్నియు జెడ్డవి. మామత మందు దప్ప మఱేమతమందును ముక్తి లభింపదు" అని యిట్లు వివిధ మతస్థులందఱును జెప్పుకొనుచున్నారు. మీమాటను సత్యమని నమ్మవలయునా? లేక వారి మాటనా? మేము మాత్రము సత్యభాషణము, నహింస, దయ మొదలగు శుభగుణము లన్నిమతములందును మంచివనియు, దక్కినవాదవివాదముల యీర్ష్యాద్వేషములు మిథ్యాభాషణాది కర్మము లన్నిమతములందును జెడ్డవనియు నమ్ముచున్నాము. మీరు సత్యమతమును స్వీకరింపగోరుదురేని వేదమతమునే స్వీకరింపుడు.

స్వమన్తవ్యామన్తవ్యములు సంక్షేపముగ వ్రాయబడును.

శ్రీ మద్దయానంద సరస్వతీస్వామి కృతము
సుభాషావిభూషితమగు సత్యార్థప్రకాశమున
యవనమత విషయమునందు
చతుర్దశ సముల్లాసము సంపూర్ణము.

ఓ౩మ్

# స్వమంతవ్యామంతవ్య ప్రకాశము

సనాతనకాలము నుండి దేని నందఱు నంగీకరించుచు వచ్చిరో యంగీకరించుచున్నారో యిక ముందు నంగీకరింతురో యదియే సర్వతంత్ర సిద్ధాంతము. అనగా సామ్రాజ్యసార్వజనిక ధర్మము. దాని నిందువలననే సనాతన నిత్యధర్మమనియు ననుచున్నారు. సనాతన ధర్మము నెవ్వరు విరోధింపరు. కావున నదినిత్య ధర్మము. ఎవరేని యవిద్యతో గూడిన జనులుకానిచ యన్యమతముల వారిచే భ్రమింపజేయబడిన వారు కాని యామతమును విపరీతముగ నెంచినను, నంగీకరించినను బుద్ధిమంతు డెవడు నట్లంగీకరింపడు. ఆప్తుడు–అనగా సత్యము నంగీకరించి, సత్యమును జెప్పుచు సత్యము నాచరించువాడు, పరోపకారి, పక్షపాత రహితుడు నగువిద్వాంసుడు దేని నంగీకరించునో యదియే యెల్లరకు నంగీకరింపదగినది. అట్టివారు దేని నంగీకరింపరో దాని నితరులు నంగీకరింపరాదు. అది ప్రమాణమునకు యోగ్యమును గాదు. ఇప్పుడు వేదాదిసత్యశాస్త్రములను, బ్రహ్మ మొదలు జైమినిముని వఱకుగల మహర్షులు నంగీకరించిన యీశ్వరాది పదార్థములను వేనిని నేనుగూడ నంగీకరించుచున్నానో (వానిని) సర్వసజ్జన మహాశయుల యెదుట బ్రకాశితములు చేయుచున్నాడ.

ఏది త్రికాలములం దెల్లరకు సమానముగా నంగీకరింప దగినదో దానినే నేను నామంతవ్యముగా నెఱుగుచున్నాను. నవీనమతమును గల్పించుటకుగాని, మతాంతరము నొకదానిని నడుపుటకుగాని లేశ మాత్రము కూడ నాకెట్టి యభిప్రాయము లేదు. కాని, సత్యమైనదాని నంగీకరించుట, యితరులచే నంగీకరింపజేయుటయు, నసత్యమును వదలి యితరులచే విడిపింపజేయుటయు నాకభీష్టము. నేను బక్షపాతము చేయదలచిన నార్యావర్తమున బ్రచారములోనున్న మతములలో నొకదానిని గ్రహించి దాని యందు నాపట్టుదలను జూపి యుండెడివాడ. కాని, యార్యావర్తమునందుగాని, యితర దేశములందు గాని యున్న ప్రవర్తనమును స్వీకరించుటగాని ధర్మయుక్త విషయములను ద్యజించుటకాని నేను జేయను. చేయగోరను. ఏలయన నట్లుచేయుట మనుష్య ధర్మము కాదు.

మననశీలుడై, తనకువలెనే యితరులకు సుఖదుఃఖములు, హాని, లాభములు కలుగునని యెంచు వానినే మనుష్యు డనవలయును. మనుష్యుడెన్నడు నన్యాయ మొనర్చు బలవంతునకుగూడ భయపడ రాదు. ధర్మాత్ముడైన నిర్బలునినుండియు భయపడవలయును. ఇంతేగాక, మిక్కిలి యనాథులు, నిర్బ లులు, గుణరహితులునైన, ధర్మాత్ములను రక్షించి వారియున్నతికొఱకు పాటుపడవలయును. వారియెడ బ్రేమతో వర్తింపవలయును. అధార్మికుడు చక్రవర్తియైనను, సనాథుడు, బలవంతుడు, గుణవంతుడునైనను వానినాశము కొఱకు నవనతికొఱకు బ్రయత్నింపవలెను. అతనియెడ బ్రియాచరణ మెన్నడు జేయ రాదు. అనగా జేతనైనంతవఱకు నన్యాయకారులను బలహీనులను జేయుటకును, న్యాయాచరణపరుల బలమును బెంచుటకును సర్వదా యత్నింపవలయును. ఈ కార్యమున నతని కెంతటి దారుణదుఃఖము సహింపవలసి వచ్చినను మృత్యువు నెదుర్కొన వలసివచ్చినను నీమానవత రూపధర్మము నెన్నడు విడువ రాదు. ఈ విషయమున శ్రీమంతుడైన భర్తృహరి వ్రాసిన శ్లోకము నుపయుక్తముగా నెంచి యిట వ్రాయు చున్నాడను.

నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్

అద్యైవ వా మరణమస్తు యుగాంతరేఽవా
న్యాయ్యాత్ పథః ప్రవిచలన్తి పదం న ధీరాః (౧)
భర్తృహరి నీతి శతకము. (౮౫)

న జాతు కామా న్నభయా న్నలోభాత్
ధర్మం త్యజేజ్ జీవితస్యాపి హేతోః
ధర్మో నిత్యః సుఖదుఃఖేత్వనిత్యే
జీవో నిత్యో హేతురస్యత్వనిత్యః. (౨)
(మ-భా. ఉద్యోగ, ప్రజాగరపర్వ - అ.४०, శ్లో. ౧౧.౧౨)

ఏక ఏవ సుహృద్ ధర్మో నిధనేఽప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి. (౩)
(మను. ౮-౧౭)

సత్యమేవ జయతే నానృతమ్
సత్యేన పంథా వితతో దేవయానః,
యేనాక్రమంత్యృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్. (४)
(ముండక-ఉ. ౧-౬)

న హి సత్యాత్ పరో ధర్మో నానృతాత్ పాతకాత్ పరమ్
న హి సత్యాత్ పరం జ్ఞానమ్ తస్మాత్సత్యం సమాచరేత్. (౫)

ఈ మహాశయుల శ్లోకముల యభిప్రాయముల కనుకూలముగ నెల్లరు నిశ్చయింపవలయును. ఇప్పుడు నేనేయే పదార్థముల నెట్లంగీకరించుచున్నానో వానివాని వర్ణనము సంక్షేపముగా జేయుచున్నాను. వీని విశేష వర్ణన మీగ్రంథమున వాని ప్రకరణములందు జేసియున్నాను.

(౧) "ఈశ్వరుడు" బ్రహ్మము, పరమాత్మ మున్నగు నామము లన్నియు నీశ్వరునివే. అతడు సచ్చిదానందాది లక్షణయుక్తుడు. అతని గుణకర్మ స్వభావములు పవిత్రములు. ఈశ్వరుడు, సర్వజ్ఞుడు, నిరాకారుడు, సర్వవ్యాపకుడు, అజన్ముడు, అనంతుడు, సర్వశక్తిమంతుడు, దయాళువు, న్యాయకారి, సర్వ సృష్టికర్త, ధర్త, హర్తయునై యున్నాడు. సర్వజీవులకు వారికర్మల ననుసరించి సత్యన్యాయములతో ఫలాదుల నొసంగు లక్షణ యుక్తుడు. అతనినే పరమేశ్వరుడని నేనంగీకరించుచున్నాను.

(౨) నాలుగువేదములను (సర్వవిద్యాధర్మయుక్తములు, నీశ్వర ప్రణీతములు, సంహితలు, మంత్ర భాగములు) నిర్భ్రాంతములు స్వతః ప్రమాణములుగా నంగీకరించుచున్నాను. అవి స్వయంప్రమాణములు. వాని ప్రామాణ్య విషయమున నేయన్యగ్రంథము నపేక్షింపబడదు. సూర్యుడు, ప్రదీపము తమ స్వరూపమును ప్రకాశింపజేయుచు బృథివ్యాదులను బ్రకాశింపజేయును. అట్లే నాలుగు వేదములును స్వప్రకాశకములగుచు నితర విద్యలను బదార్థములను బ్రకాశింపజేయును. మఱియు నాలుగు వేదములకు సంబంధించిన బ్రాహ్మణములు, నాఱంగములు, నాఱుపాంగములు, నాలుగు వేదములు (౧౧౨౭) పదు

నొకండు వందల యిరువదియేడు వేదశాఖలు నను వీని నన్నింటిని వేదములకు వ్యాఖ్యానములుగాను, బ్రహ్మాదిమహర్షులచే వ్రాయబడినవిగాను, పరతః ప్రమాణములుగాను అనగా వీనిలో వేదములకను కూలముగానున్న విషయములు ప్రమాణములుగాను, వేదవిరుద్ధ విషయముల నప్రమాణములుగాను నేనంగీకరించుచున్నాడను.

(౩) పక్షపాతరహితము, న్యాయాచరణము, సత్యభాషణాది యుక్తము, నీశ్వరాజ్ఞకు వేదములకు నవిరుద్ధమునైనది 'ధర్మము', పక్షపాతసహితము, నన్యాయాచరణము, మిథ్యాభాషణాదులు, నీశ్వరాజ్ఞా భంగము వేదవిరుద్ధమునైనది 'యధర్మము' నని నేనంగీకరించుచున్నాడను.

(౪) ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, జ్ఞానాదిగుణములు కలిగి యల్పజ్ఞుడు, నిత్యుడునైన వానిని జీవుడని యంగీకరించుచున్నాను.

(౫) జీవుడు, నీశ్వరుడు నను నీయిరువురును స్వరూపముచేతను, వైధర్మ్యముచేతను భిన్నులు జీవుడు వ్యాప్యుడు. ఈశ్వరుడు వ్యాపకుడు. సాధర్మ్యముచే నభిన్నులు. ఎట్లన మూర్తిమంతమగు వస్తు వేదియు నాకాశము కంటె వేఱుగా నెన్నడు బూర్వము లేదు. ఇప్పుడును లేదు. ముందును నుండబోదు. అట్లే పరమేశ్వరుడు వ్యాపకుడు. జీవుడు వ్యాప్యుడు. పరమేశ్వరుడుపాస్యుడు, జీవు డుపాసకుడు, పరమేశ్వ రుడు పిత. జీవుడు పుత్రుడుగా – అనగా నీయిరువురలో వ్యాప్యవ్యాపక, యుపాస్యోపాసక, పితాపుత్ర సంబంధ మున్నదని యంగీకరించుచున్నాడను.

(౬) అనాది పదార్థములు మూడు. ఒకటి యీశ్వరుడు, రెండు జీవులు, మూడు ప్రకృతి. అనగా నీమూడును జగత్కారణములు. వీనినే నిత్యము లందుము. నిత్యపదార్థముల గుణకర్మస్వభావములును నిత్యములే.

(౭) 'ప్రవాహముతో ననాదులు'. ద్రవ్యగుణకర్మలు మూడును సంయోగముచే నుత్పన్నములగును. వియోగానంతర ముండవు. వీనిలో బ్రథమమున సంయోగము కలుగుటకు దగిన సామర్థ్య ముండును. అది యనాది. దానివలన మరల సంయోగము, వియోగమును గలుగును. కావున వీనిని మూటిని ప్రవాహముతో ననాదులుగా నంగీకరింతును.

(౮) 'సృష్టి' వేఱువేఱుగానున్న పదార్థములను జ్ఞానముతో యుక్తితో గలిపి నానారూపములుగా నేర్పఱచుట సృష్టియనబడును.

(౯) సృష్టి ప్రయోజనము :– ఈశ్వరుని సృష్టి నిమిత్తములైన గుణకర్మస్వభావములు సఫలమగుట. 'నేత్రము లెందుకని' యొకడడిగిన మఱి యొకడు 'చూచుటకు' ననును. అట్లే సృష్టి చేయుటకు దగిన సామర్థ్య మీశ్వరునిలో నున్నది. అది సృష్టిచేసినపుడే సఫలమగును. మఱియు జీవులకు గర్మఫలముల ననుభవింపజేయుటయు సృష్టిప్రయోజనమే.

(౧౦) 'సృష్టి సకర్తృకము'. సృష్టికొకకర్త యున్నాడు. అత డీశ్వరుడే. సృష్టిలో రచన చూడబడుచు న్నది. జడపదార్థమునందు దనకు దాను దగిన విధమున బీజాది స్వరూపమున మాఱుటకు సామర్థ్యము లేదు. కావున సృష్టిని జేయుకర్త యొకడుండక తప్పదు.

(౧౧) 'బంధము.' సనిమిత్తకము. అనగా నవిద్య కారణముగా గలుగునది. పాపకర్మలు, నీశ్వరుని విడిచి యితర పదార్థముల నుపాసించుట, యజ్ఞానాదులు నన్నియు దుఃఖఫలముల నొసంగునవి. కావున బంధము కోరకున్నను ననుభవింపక తప్పనిది.

(౧౨) 'ముక్తి.' సర్వదుఃఖములనుండి విడివడి బంధనరహితుడై సర్వవ్యాపకుడైన యీశ్వరునందు నతనిసృష్టియందును స్వేచ్ఛతో విహరించుట, నియత సమయము వఱకు మోక్షానందము ననుభవించి

మరల సంసారమునకు వచ్చుట ముక్తి యనబడును.

(౧౩) 'ముక్తి సాధనములు.' : ఈశ్వరోపాసన, యోగాభ్యాసము, ధర్మానుష్ఠానము, బ్రహ్మచర్యముతో విద్యాప్రాప్తి, యాప్తవిద్వాంసుల సాంగత్యము, సత్యవిద్య, సువిచారము, పురుషార్థము మున్నగునవి.

(౧౪) 'అర్థము' ధర్మము వలననే ప్రాప్తించునది యర్థము. అధర్మముచే సిద్ధించునది యనర్థము.

(౧౫) 'కామము' ధర్మము, నర్థము నను రెంటితో బొందదగినది.

(౧౬) 'వర్ణాశ్రమము' గుణకర్మల యోగ్యతననుసరించి యంగీకరింతును.

(౧౭) 'రాజు' శుభగుణకర్మస్వభావములతో శోభించుచు, బక్షపాత రహితుడై న్యాయధర్మములను సేవించువాడు, ప్రజలయెడ దండ్రివలె వర్తించువాడు, ప్రజలను సంతానమువలె నంగీకరించి వారి యున్నతికి, సుఖవృద్ధికి నెల్లపుడు బ్రయత్నించువాడు రాజనబడును.

(౧౮) 'ప్రజ' శుభగుణకర్మ స్వభావములను ధరించి పక్షపాత రహితముగ న్యాయధర్మములను సేవించుటవలన రాజు యొక్కయు బ్రజల యొక్కయు నున్నతిని గోరుచు రాజవిద్రోహమును వదలి రాజుతో బుత్రులవలె వ్యవహరించు జనులు ప్రజ యనబడును.

(౧౯) న్యాయకారి యెల్లపుడు నాలోచించి యసత్యమును విడిచి సత్యమును గ్రహించువాడు, నన్యాయ మొనర్చువారిని దొలగించువాడు, న్యాయాచరణము గలవారిని వృద్ధిపఱచుచు, దనకువలెనే యితరుల సుఖము గోరువాడు "న్యాయకారి" యనబడును. అతనిని నేనుగూడ సరియని యంగీకరింతును.

(౨౦) 'దేవాసురులు' విద్వాంసులు దేవులనియు, నవిద్వాంసు లసురులనియు, బాపులను రాక్షసులనియు, ననాచారులను బిశాచులనియు నేనంగీకరింతును.

(౨౧) 'దేవపూజ' విద్వాంసులను, దల్లిని, దండ్రిని, నాచార్యుని, నతిథిని, న్యాయకారియగు రాజును, ధర్మాత్ముడగు జనుని, పతివ్రతయగు స్త్రీని, పత్నీ వ్రతుడగు పతిని సత్కరించుట దేవపూజ యన బడును. దీనికి విపరీతమైనది యదేవపూజ. వీరి మూర్తులను బూజ్యములనియు, బాషాణాది మూర్తులు సర్వదా యపూజ్యములనియు నేను దలంచుచున్నాను.

(౨౨) 'శిక్ష' దేనివలన విద్య, సభ్యత, ధర్మాత్మత, జితేంద్రియత్వాదులు వృద్ధిపొందునో, యవిద్యాది దోషములు విడిపోవునో దానిని 'శిక్షా' శిక్షణమందురు.

(౨౩) 'పురాణములు' బ్రహ్మ మున్నగు మహర్షులచే వ్రాయబడిన ఐతరేయాది బ్రాహ్మణ గ్రంథములు పురాణము లనబడును. ఇతిహాసములు, కల్పములు, గాథలు, నారాశంసు లను నామములుగల వానినే పురాణములని యంగీకరింతును. ఇతర భాగవతాది గ్రంథములను గాదు.

(౨౪) 'తీర్థములు' దుఃఖసాగరమునుండి తరింపజేయునవి తీర్థములు. సత్యభాషణము, విద్య. సత్సంగము, యమాదులు, యోగాభ్యాసము, పురుషార్థము, విద్యాదానాది శుభకర్మలు వీనినే తీర్థములని నేనంగీకరింతును. ఇతర జల స్థలాదులను గాదు.

(౨౫) 'పురుషార్థము' ప్రారబ్ధముకంటె శ్రేష్ఠము. పురుషార్థమువలననే సంచితములు ప్రారబ్ధము నేర్పడును. పురుషార్థము మంచిదైన నంతయు మంచిదగును. అది చెడిన నంతయు జెడును. కావున బ్రారబ్ధముకంటె బురుషార్థమే మిన్న.

(౨౬) 'ప్రవర్తన' మనుష్యు డెల్లరితోను యథాయోగ్యముగ, దనకువలెనే యెల్లర సుఖమున దుఃఖమునందును, హాని లాభములందు వర్తించుట శ్రేష్ఠము. ఇతర విధముల వర్తించుట చెడుగుగ నేనెంచుచున్నాడను.

(౨౭) 'సంస్కారము' దేనివలన శరీరము, మనస్సు, నాత్మయు నుత్తమములగునో యది సంస్కారము. అది నిషేకాది స్మశానాంతము పదునాఱు విధములు. సంస్కారము కర్తవ్యముగా నెంచుచున్నాను. అంత్యేష్టి తదుపరి చనిపోయిన వ్యక్తినిగూర్చి యేమియు జేయరాదు.

(౨౮) 'యజ్ఞము' విద్వాంసుల సత్కారము యథా యోగ్యముగా జరుపుట, శిల్పము, అనగా రసాయనమను పదార్థ విద్య, దానియుపయోగము, విద్యాది శుభగుణములు, సర్వజీవులకును సుఖమును జేకూర్చుట దేనివలన జరుగునో యది యుత్తమయజ్ఞమని యెంచుచున్నాడను.

(౨౯) 'ఆర్యదస్యులు' శ్రేష్ఠులను నార్యులనియు, దుష్టులను దస్యులనియు నందఱు నంగీకరించునట్లే నేను నంగీకరింతును.

(౩౦) 'ఆర్యావర్తము' ఈ దేశమునకు బేరు. ఇందు సృష్ట్యాది నుండియు నార్యులు నివసించుచున్నారు. దీని యవధులు ఉత్తరమున హిమాలయము, దక్షిణమున వింధ్యాచలము, పశ్చిమమున అటక్, పూర్వదిశలో బ్రహ్మపుత్రనదీ. ఈ నాలుగింటికి మధ్యలోనుండునది యార్యావర్త మనబడును. దీనిలో నుండువా రార్యులనబడుదురు.

(౩౧) 'ఆచార్యుడు' సాంగోపాంగ వేదముల నధ్యయనము చేయించుచు, సత్యాచరణమును గ్రహింపజేయువాడు, నసత్యాచరణమును విడిపించువాడు 'ఆచార్యు' డనబడును

(౩౨) 'శిష్యుడు' సత్య విద్యను శిక్షణమును గ్రహించుటకు యోగ్యుడు, ధర్మాత్ముడు విద్యాగ్రహణేచ్ఛువు, నాచార్యునకు బ్రియుడైనవాడు శిష్యుడనబడును.

(౩౩) 'గురువులు' తల్లిదండ్రులు, సత్యమును గ్రహింపజేయువారు, నసత్యమును విడిపింపజేయువారు గురువు లగుదురు.

(౩౪) 'పురోహితుడు' యజమానునకు హితము జేయువాడు సత్యోపదేష్టయు బురోహితుడు.

(౩౫) 'ఉపాధ్యాయుడు' వేదైకదేశమునుగాని, యంగములనుగాని జదివించువా డుపాధ్యాయుడు.

(౩౬) 'శిష్టాచారము' ధర్మాచరణ పూర్వకముగ బ్రహ్మచర్యముతో విద్యను గ్రహించి ప్రత్యక్షాది ప్రమాణములతో సత్యాసత్యములను నిర్ణయించి సత్యమును గ్రహించుట యసత్యమును వదలుట శిష్టాచారము. దీని నాచరించువాడు శిష్టుడనబడును.

(౩౭) 'ప్రమాణములు' ప్రత్యక్షాదుల నెనిమిది ప్రమాణముల నంగీకరింతును.

(౩౮) 'ఆప్తుడు' యథార్థవక్త, ధర్మాత్ముడు, నెల్లరి సుఖము కొఱకు బ్రయత్నించువాడు 'ఆప్తు' డనబడును.

(౩౯) 'పరీక్ష' ఐదు విధములు. వీనిలో మొదటిది – ఈశ్వరుడు, నతని గుణకర్మస్వభావములు, వేదవిద్య, రెండవది – ప్రత్యక్షాదులయిన యెనిమిది ప్రమాణములు, మూడవది – సృష్టిక్రమము, నాల్గవది – ఆప్తవ్యవహారము, ఐదవది – తనయాత్మ పవిత్రత, విద్య, యను నీయైదింటితో బరీక్షించి సత్యాసత్యములను నిర్ణయించి సత్యమును గ్రహించి యసత్యమును విడువవలయును.

(౪౦) 'పరోపకారము' దేనివలన సర్వమనుష్యుల దురాచారము దూరమై దుఃఖములు పోవునో, శ్రేష్ఠాచారము సుఖము వర్ధిల్లునో యది పరోపకారమనబడును.

(౪౧) 'స్వతంత్రుడు, పరతంత్రుడు' – జీవుడు తన కార్యములందు స్వతంత్రుడు, కర్మముల ననుభవించుటలో నీశ్వరుని వ్యవస్థకు బరతంత్రుడు నగును. అట్లే యీశ్వరుడు తన సత్యాచరణాది కార్యము లొనర్చుటలో సర్వదా స్వతంత్రుడు.

(౪౨) 'స్వర్గము' – సుఖవిశేషము ననుభవించుట, దాని సామగ్రి ప్రాప్తి స్వర్గమనబడును.

(౪౩) 'నరకము' – దుఃఖవిశేషము ననుభవించుట, దాని సామగ్రిని బొందుట.

(౪౪) 'జన్మములు' – శరీరధారణముచేసి ప్రకటమగుట. పూర్వ, పర, మధ్య భేదములుగల ముప్విధ జన్మముల నంగీకరింతును.

(౪౫) 'జన్మమరణములు' – శరీరముతో సంయోగము జన్మము, అట్లే వియోగము మృత్యువు ననబడును.

(౪౬) 'వివాహము' – నియమపూర్వక ప్రసిద్ధితో దాను గోరి పాణిగ్రహణము చేయుట వివాహ మనబడును.

(౪౭) 'నియోగము' – వివాహమునకు దరువాత భార్యాభర్తల మరణాదులవలన గాని, నపుంసకాది రోగముల వలనగాని, స్త్రీగాని, పురుషుడుకాని యాపత్కాలమున స్వవర్ణము వారితోగాని, తనకంటె నుత్తమ వర్ణము వారితోగాని, సంతానోత్పత్తిని జేయుట.

(౪౮) 'స్తుతి' – గుణకీర్తనము, శ్రవణము, జ్ఞానము గలుగుట దేనివలన గలుగునో యది స్తుతి. వీని ఫలము ప్రీత్యాదులు.

(౪౯) 'ప్రార్థన' – తన సామర్థ్యమునకు మించి యీశ్వరుని సంబంధమువలన జ్ఞానవిజ్ఞానాదుల ప్రాప్తికొఱకు నీశ్వరుని బ్రార్థించుట. దీని ఫలము నిరభిమానత మున్నగునవి.

(౫౦) 'ఉపాసన' – పవిత్రములైన యీశ్వరగుణకర్మ స్వభావముల వలె దనగుణకర్మ స్వభావము లను జేసికొనుట, యీశ్వరుని సర్వవ్యాపకుడుగా నెఱిగి, యీశ్వరుని సమీపమున దాను, దన సమీపమున నీశ్వరుడు నున్నట్లు నిశ్చయముగ యోగాభ్యాసమువలన సాక్షాత్కారము చేసికొనుట యుపాసన యన బడును. దీనిఫలము జ్ఞానము వర్ధిల్లుట మున్నగునవి.

(౫౧) 'సగుణ నిర్గుణ స్తుతి ప్రార్థనోపాసనలు' – ఏయే గుణములు పరమేశ్వరునందున్నవో వానితో బరమేశ్వరుడు యుక్తుడై యున్నట్లును, ఏ యే గుణములు లేవో వానినుండి వేఱుగా నున్నట్లును దెలిసికొని ప్రశంసించుట సగుణ నిర్గుణ స్తుతి యనబడును. ఈశ్వరునినుండి శుభగుణ ప్రాప్తిని గోరుట దుర్గుణము నుండి విడుదలను గోరుట సగుణ నిర్గుణ ప్రార్థన యనబడును. ఈశ్వరుడు సర్వగుణ సంపన్నుడనియు, సర్వదోషరహితుడనియు నెంచి తనయాత్మ నతనియందును, నతని యాజ్ఞయందును నర్పించుట సగుణ నిర్గుణోపాసన యనబడును.

ఇవి నాసిద్ధాంతములు. సంక్షేపముగా నిట జూపబడినవి. వీని విశేష వ్యాఖ్య సత్యార్థ ప్రకాశపు ప్రకర ణములందు జూడనగును. అట్లే ఋగ్వేదాది భాష్యభూమికయందు గలదు. అనగా నేయే విషయము లెల్ల రికి మాననీయములో వాని నంగీకరించుచున్నాడను. అనగా సత్యము జెప్పుట యందఱకు నెట్లు మంచిదో, యసత్యమాడుట యెట్లు చెడుగో యట్టి సిద్ధాంతములను స్వీకరింతును. మఱియు మత మతాంతరములలోగల పరస్పర విరుద్ధ విషయములను నంగీకరింపను. ఏలయన నీమతములవారు తమ మతములను బ్రచారముచేసి మనుష్యులను దమవలలలో జిక్కించుకొని పరస్పర విరోధులను జేసియు న్నారు. దీనిని ఖండించి సర్వసత్యమును బ్రచారముచేసి యెల్లర నేకమతావలంబులను జేసి ద్వేషము విడిపింపజేసి ప్రీతియుక్తులను జేసి యెల్లరి వలన నెల్లరకు సుఖలాభము కలుగునట్లు చేయుటయే నాయ త్నము, నభిప్రాయమునై యున్నది. సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని కృప, సాహాయ్యము వలనను, నాప్త జనుల సహానుభూతివలనను నీ సిద్ధాంతము భూగోళమునందంతట వ్యాపింపవలయును. అందువలన నెల్లరు సులభముగా ధర్మార్థ కామమోక్షములను సిద్ధము చేసికొని యెల్లపుడు నున్నతిని బొందుచు నానందమున నుందురుగాక! ఇదియే నా ప్రయత్నమునకు ముఖ్యప్రయోజనము.

"అలమతివిస్తరేణ బుద్ధిమద్వరేషు"
బుద్ధి మద్వర్యులకు విస్తరింపబనిలేదు.

ఓమ్ శన్నో మిత్రః శం వరుణః శన్నో భవత్వర్యమా,
శన్న ఇంద్రో బృహస్పతిః శన్నో విష్ణురురుక్రమః,
నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి,
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్ ఋతమవాదిషం సత్యమవాదిషమ్,
తన్మా మావీత్ తద్వక్తారమావీద్ ఆవీన్మామ్ ఆవీద్వక్తారమ్.
ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

**శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యులు పరమవిద్వాంసులు శ్రీ విరజానంద సరస్వతీ స్వాముల శిష్యులునగు శ్రీ మద్దయానంద సరస్వతీ స్వామి విరచిత స్వమంతవ్యామంతవ్యములు సంపూర్ణము.**

***




# అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు